

# నేడు మీరు మెక్లీన్స్‌తో పళ్లు తోముకున్నారా?

నిశ్చయంగా! ఆమె నిత్యం—రెండుసార్లు మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టుతో పళ్లు తోముతుంటుంది. ఆమె పళ్లు ఎంత తెల్లగా, స్వచ్ఛంగా ఉన్నాయో చూడండి! మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు మీకు కూడా అట్టి తళతళలాడే చిరునవ్వును ముత్యాలవలె మెరిసే దంతశోభను, పరిమళభరితమైనశ్వాసను సమకూర్చగలదు. మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టులో సరియైన పాళ్లలో జాగ్రత్తగా సమ్మిళిత మొనర్చబడిన అనేక పదార్థాలు నోటిలో బయలు దేరే హానికరమైన ఆమ్లాలను విరిచివేసి, దంతక్షయాన్ని నివారించి, పళ్లను నిగనిగలాడునట్లు ఉంచుతాయి. అవి వీటినన్నిటినీ ఏకకాలంలో సమకూర్చుతాయి. మీ పళ్లకు సర్వోత్తమమైన టూత్ పేస్టునే వాడాలి కనుక నేటినుండే మెక్లీన్స్‌తో పళ్లు తోముకోవడం ప్రారంభించండి.

"... మీ మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు అన్నివిధాలా సంతృప్తికరమైనది."

## నేడే మెక్లీన్స్‌ను కొనండి!




MTY-2 TEL.

వ్యాపార విషయాలకు వీరికి వ్రాయండి :— జె. యల్. మోరిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) లిమిటెడ్., మహాలక్ష్మి ఆలయమునకు ఎదురుగా, వార్డెన్ రోడ్, బొంబాయి 26.

# భారతి

[సచిత్ర మాసపత్రిక]

సంపాదకుడు:

శ్రీ శివలెంక శంభుప్రసాద్



ఆంధ్రపత్రికా ముద్రాలయము

మదరాసు.

సంపుటము 29 జనవరి, 1952 సంచిక 1

విడిప్రతి వెల ఒకరూపాయి



# విషయానుక్రమణిక

## జనవరి-1952



ఖర
పుష్యము

# భారతి

సంపుటము 29
సంచిక 1

# స్వవిషయము

భారతి పత్రిక తన సాహిత్యజీవితమున ఇరువది తొమ్మిదవ ఏట ప్రవేశించినది. ఉత్తమ పత్రికలు, ఏ జాతికి, ఏ భాషకు చెందినవైనగాని, ఆ జాతికి, ఆ భాషకు గల సంస్కృతి వయః పాకముతోనే జన్మించును. ఆపత్రిక జీవితము గడుపుకొన్నన్ని నాళ్ళు, ఆ భాష, ఆ జాతి, సంతరించుకొనుచున్న నవ్యాలంకారముల నెల్ల ప్రతిఫలించుకొనుచు, వాటి పురోభివృద్ధికి నిత్య చిహ్నములుగ నిలుచును. ప్రపంచ ఉత్తమ సాహిత్యపత్రికలెల్ల ఆయా సంస్కృతుల కాయాకాలములకు కాలమానములుగ నట్లే చిరస్థాయి నందుకొన్నవి. శ్రీ నాగేశ్వరరావుగారు భారతిని ప్రారంభించుటలో ఈ ఆదర్శమునే మనమునం దుంచుకొని ఉత్తమ సాహిత్య పత్రికల శ్రేణిలో భారతిని నడుపుచూ తమ కృషిని ఫలవంతము చేసికొనిరి. ఆ అడుగు జాడలలో ఈ ఇరువది ఎన్మిది ఏడులుగా నడచుచూ వచ్చి భారతి తెలుగు రసజ్ఞలోక ఆదరాభిమానముల నిరంతరము చూరగొనగలుగుచూ వచ్చినది.

భారతి జన్మించిననాటి సాహిత్య ప్రపంచమునకు, ఈ నాటి సాహిత్య ప్రపంచమునకు కాలగతమూ, ప్రగతియుతము నైన భేద మెంతయో అంతయూ గలదు. ఆ రోజుల భారతి నలంకరించిన యువక రచయితలు నేడు పరిణతులై తెలుగు సాహిత్యమున వివిధశాఖలలో గురుతుల్యులుగ నున్నారు. ఆ నాటి యుత్సాహా, దీక్షా, శక్తులు ఈ నాటి యువక రచయితలలో నున్నవా యని దేశము ప్రశ్నించుచున్నది.

సాహిత్య మేయొక్క తరము వారి సొత్తు గానిమాట నిజమే. కాని నిన్నటి పల్కునకు ఈడైన పలుకుమాత్రమే నేడునూ పలికిన రసికలోకము హర్షించదు.

ఒకనాడొక యుత్తమ కవి యందుకొన్న స్థాయి ఆనాటి తర్వాతి సాహితీ లోకమున కంతటికీ సామాన్య స్థాయియైపోవును. ఆ కవి కన్న ఎక్కువ శ్రద్ధ, దీక్షా, ఉత్సాహములతో కృషి చేసిన కాని తర్వాత కవి తననాటి ప్రజల సంస్కృతికి మేలుబంతియైన పలుకు పలుకలేడు. అనగా నీ సాహిత్య కృషిలో కాలూని నిలుచుటకైన కష్టనష్టములు దినదినాభివృద్ధములు. ఈ శ్రద్ధా పటుత్వములు నూతన రచయితలలో నిత్య నియమములైన తప్ప, ఒక స్థాయినందు కొన్న సాహిత్యములో, పురోగమన చిహ్నములు నిత్యమూ స్ఫుటముగా కొట్టవచ్చినటుల కన్పడుట కష్టము.

కాని సూక్ష్మముగ పరికించుకొనుచూ వచ్చిన, తెలుగుసాహిత్యమున పురోభివృద్ధి కన్పించుచున్నమాట నిజమే. ఆనాటి కన్న ఈనాడు కథానికాశిల్పము చాల పురోగమించినది. కథానికకు వస్తుసంపద కూడా ఆనాటి కన్న ఈనాడు రచయితలకు విరివిగా కన్పడుచున్నది. కథకులలో వాస్తవిక దృష్టి నాటికన్న నేడు గాఢతమమైనది. మనస్తత్వముల నాకళించుకోవలెనను జిజ్ఞాస, అనుభవైక వేద్య మొనరించుకొని వెలువర్చవలెనన్న తృష్ణ, నేటి రచయితలలో పెక్కురలో గన్పించుచున్నది. కాని జీపతము యథాతథముగ పరిశీలించినంత మాత్రమున సాహిత్య సృష్టి జరుగదు. వాక్యము రసాత్మకమై కావ్య గౌరవమందుకొనుటకు మన భాషా సంస్కృతితో ఎడతెగని పరిచయమున్నగాని ప్రతిభావ్యుత్పత్తులతో రచన బైటపడుట కాస్కారము గల్గదు. నేటి యువ సాహితీ పరులు ఈ పరిచయము నభివృద్ధి చేసికొనుటపై దృష్టి సారించుట శుభసూచకము.

ఇతరత్రా గూడ- నాటి రచయితల కున్న సౌకర్యములు కొన్ని, ఈ నాటి రచయితలకు లేవు. ఆనాడు స్వాతంత్ర్యదాహము, స్వదేశ గౌరవము, ఇత్యాది భావములు ప్రజలలో నూత్న చైతన్యమందు కొన్నవి. ఆ తరంగములపై తేలిపోయి, ప్రజాదరణము చూరగొనుట రచయితలకు కూడ తేలికయైనది. పాశ్చాత్య ప్రభావము వలని రాగల నూతన చైతన్యములు తెలుగు భాషలో అప్పుడప్పుడే కొత్తగా రా మొదలిడినవి. నేడు స్వాతంత్ర్యమును మించిన జీవితావసరములు సంఘము నలయించుచున్నవి.

వెల్లువవలె ముంచెత్తుచున్న పాశ్చాత్య ప్రభావములలో మన సంస్కృతికి, సాహిత్యమునకు, నైసర్గికమైన అభ్యుదయ మెటున్నదో తెలుసుకొనుటకై సంఘము నెమకులాడుచున్నది. సంఘ కర్తవ్యమును ప్రబోధించ గల్గినవారు సాహితీ పరులే! ఈ తీవ్రతరమైన కృషి తెలుగు రచయితలలో నూత్న వికాస మందుకొనవలెననియు, నిత్య నూతన వికాసముతో, తెనుగు ప్రజానీకమునకీ కృషి ఫలముల నందించవలయుననియు, శుభాశయములతో భారతి తన నూత్న వత్సర జీవితమును ప్రారంభించుకొనుచున్నది. సాహితీపరులందరును భారతి నభిమానించి మా ఆశయములకు చేదోడు వాదోడుగా నిలిచి భారతిని తమ నవ్యోత్సాహముల ప్రతిబింబముగా నొనర్చి ఆదరించ నాహ్వానించుచున్నాము. నూత్నవత్సరారంభ వేళ ఉత్తమ సాహిత్య పత్రికగా భారతి నభిమానించి ఆదరించు తెలుగువారి కెల్లరకు ఇదే మా స్వాగతము.

# కాశ్మీరుసమస్య ప్రాధాన్యం



శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు

“రష్యా ఎవరి అధీనంలో వుంటే యావత్ప్రపంచము వారికి పాదాక్రాంతం కావలసిందే.” ఇది నెపోలియన్ అభిప్రాయం. ప్రపంచాధిపత్యం కోసరం యుద్ధాలు చేసిన ప్రతి ఒక్కరు ఇలాగే అభిప్రాయపడ్డారు. నెపోలియన్ రష్యా ఆక్రమణకు చేసిన ప్రయత్నాలు విఫలమై, ఫ్రెంచి సామ్రాజ్యం విచ్ఛిన్నమైపోయింది. హిట్లర్ రష్యాను జయించడానికి జరిపిన యుద్ధంలో పరాజితుడై జర్మనీనే కోల్పోయినాడు. క్రిందటి శతాబ్దంలో నెపోలియన్ కృతకృత్యుడైవున్నా, ఈ శతాబ్దంలో హిట్లర్ మనోరథం ఈడేరినా ప్రపంచచరిత్ర గతే పూర్తిగా మారిపోయి వుండేది. ఈ సత్యాన్ని ఈనాడు క్రెమ్లిన్ అధికారులు నిస్సందేహంగా నిరూపించుతున్నారు. రష్యాలో కమ్యూనిజం ఏర్పడి, స్థిరపడింది కాబట్టి ప్రపంచ కమ్యూనిస్టు సామ్రాజ్యాన్ని స్థాపించగలమని వారు భావిస్తున్నారు. మిగతా ప్రపంచం భయపడుతున్నదీ అదే. రష్యాకు ఇంత ప్రాముఖ్యం ఆ దేశ భౌగోళిక స్థానాన్నిబట్టే వచ్చింది. మాస్కోలో కూర్చుంటే మిగతా ప్రపంచం అంతా అందిపుచ్చుకున్నట్లు వుంటుంది.

మధ్య ఆసియాలో కాశ్మీరు కూడా ఇంచుమించు అదే స్థానంలో వుంది. 85 వేల చతురపుమైళ్లు విస్తీర్ణంగల ఈ సంస్థానం అయిదు ప్రధాన రాజ్యాలను ఆనుకొనివుంది. ఉత్తరాన రెండు కమ్యూనిస్టు రాజ్యాలు రష్యా, చైనా, తూర్పున 'పెకింగ్ ప్రభుత్వ అధీనమై కమ్యూనిస్టు చైనా వలసగా మారిపోయిన టిబెట్, దక్షిణాన భారతదేశం, పాకిస్తాన్, పశ్చిమాన పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్‌లు వున్నవి. కాశ్మీరుకు ఈ అయిదు రాజ్యాలూ అందుబాటులో వున్నట్లే ఈ అయిదు రాజ్యాలకూ కాశ్మీరు అందుబాటులో వుంది. వీటన్నింటి ప్రభావమూ కాశ్మీర్‌పై అంతో, ఇంతో కనిపిస్తూనే వుంటున్నది.

షేక్ అబ్దుల్లా సంస్థాన ముఖ్యమంత్రిపదవిని స్వీకరించిన తరువాత 'నవ్యకాశ్మీర్' నిర్మాణానికి తయారుచేసిన పథకాన్ని పరిశీలించితే కాశ్మీర్‌పై సోవియెట్ ప్రభావం ఎంత వుందో స్పష్టమౌతుంది. దాదాపు ఒక శతాబ్దంగా కాశ్మీరుకు భారతదేశంతో అత్యంత సన్నిహిత సంబంధం వుంటూవున్నందువల్ల కాశ్మీరీల జీవితంపై భారతీయ సంస్కృతి ప్రభావం కూడా కొంతవరకు కన్పిస్తూ వుంటుంది. కాశ్మీరు సమస్య అంతిమంగా పరిష్కారమై కాశ్మీరీలు తమ వ్యవహారాలను సరిదిద్దుకోగలిగినప్పుడు కాశ్మీరు ఈ సరిహద్దురాజ్యాల సంస్కృతి, నాగరికతలను సమన్వయంచేసి ఒక నూత్న సంస్కృతిని ప్రసాదిస్తుంది. కాశ్మీరులో ఏం జరిగినా వాటి ఫలితాలను ఇటు భారతదేశం, అటు పాకిస్తాన్ సమంగా అనుభవించవలసివస్తుంది.

కనుకనే కాశ్మీరుభవిష్యత్తును తమ ఆశయాలకూ, లక్ష్యాలకూ అనుగుణంగా నిర్ధారించాలని పాకిస్తాన్, భారతదేశ పాలకులు ప్రయత్నిస్తున్నారు ఈ ప్రయత్నాల్లో ఎవరు సఫలులైనా రెండోవర్గం అధఃపతనం చెందక తప్పదు. పాకిస్తాన్ బ్రతికి బట్టకట్టాలంటే కాశ్మీరు కరాచీఅదుపులో ఉండక తప్పదని పాకిస్తాన్ మంత్రులు, లోకం ఏమనుకుంటుందో అని కాకపోయినా, కాశ్మీరీలకు కరాచీ ఉద్దేశ్యాలను గురించి ఎలాంటి అనుమానాలు కలుగుతవో అనే ఆలోచనైనా లేకుండా, ప్రకటించారు. పాకిస్తాన్ ఆర్థిక వ్యవస్థ స్వయం సమృద్ధంగా వుండాలంటే కాశ్మీరు పాకిస్తాన్ అధీనంలో వుండక తప్పదని సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ భద్రతామండలిలోనే ప్రకటించి వున్నాడు. ఆవిధంగా పశ్చిమ రాజ్యాల సానుభూతిని పాకిస్తాన్ సంపాదించకలిగింది. పాకిస్తాన్ కాశ్మీరు, ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్‌లు ఒకే సమాఖ్యగా వుంటే—యూరప్‌లోని బెనిలక్స

దేశాల మాదిరి—సోవియట్ రష్యా తూర్పున, దక్షిణాన, పశ్చిమ రాజ్యాలకు చిక్కని సైనిక స్థావరాలు లభిస్తవి. అమెరికా బ్రిటన్-పర్షియా లగాదానూ, పాకిస్తాన్—అఫ్ఘనిస్తాన్ తగాదానూ పరిష్కరించడానికి చేస్తున్న బ్రహ్మాండమైన ప్రయత్నాలను గమనిస్తే ఈ విషయం స్పష్టమైపోతుంది.

కాశ్మీరు సమస్యాపరిష్కారంలో బ్రిటన్ అమెరికాలు ప్రత్యేక శ్రద్ధ వహించడానికి కారణం కాశ్మీరుప్రజలమీదవున్న అభిమానమూ గాదు, పాకిస్తాన్—భారతదేశాల సఖ్యత ఆసియాలో సుస్థిరశాంతికి అత్యంతావశ్యకం అని నమ్మడం వల్లా కాదు. కాశ్మీరును పాకిస్తాన్‌కు కట్టబెడితే ఒక ప్రముఖముస్లింరాజ్యం చిరకాలం తమకు లోబడివుంటుందన్న ఆశే బ్రిటన్, అమెరికాలను ఆ దేశాలు ఇప్పుడనుసరిస్తున్న వైఖరికి ప్రోత్సహించినవి

ట్రియెస్ట్ ఇటు యుగస్లావియాకు చెందాలా అటు ఇటలీకి చెందాలా అన్న సమస్యపై సమయానుకూలంగా బ్రిటన్ అమెరికాలు, రష్యా అనుసరించిన విధానాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటే కాశ్మీరు విషయంలో వీరి విధానం సులభంగా గ్రహింపుకు వస్తుంది.

కాశ్మీరు ఈ నాడు భారత పాకిస్తాన్ దేశాలకు జీవన్మరణ సమస్యగా తయారు కావడానికి బ్రిటన్, అమెరికాలు 1948 జనవరి నుంచీ అనుసరిస్తూ వచ్చిన విధానమే కారణం. సమితి ఈ రెండు రాజ్యాల ప్రాబల్యానికి లోబడి వున్నంత కాలం కాశ్మీరు సమస్య పరిష్కారం కానే కాదు. మరి కొంత కాలం ఈ సంస్థానం ఇదేవిధంగా షేక్ అబ్దుల్లా, అజాద్ కాశ్మీర్ ప్రభుత్వాల అధీనంలో వుండిపోతే కాశ్మీరు విభజన ఎవరి తీర్పూ అవసరం లేకుండా, ఏ జనవాక్యంతోనూ నిమిత్తం లేకుండా స్థిరపడిపోతుంది.

ఈ విభజన వల్ల పాకిస్తాన్‌కు ఎక్కువగా లాభించదు. కాని అమెరికా బ్రిటన్‌లకు కావలసిన కీలక ప్రాంతాలు మాత్రం పాకిస్తాన్ పరమై రష్యాపై దెబ్బ తీయడానికి అవసరమైన సైనికస్థావరాలు మాత్రం లభిస్తవి. ఉత్తర కాశ్మీరులోని గిల్గిట్ ప్రాంతం ఐక్యరాజ్యసమితి కాశ్మీరుకమిషన్ భారత దేశానికిచ్చిన వాగ్దానానికి విరుద్ధంగా పాకిస్తాన్‌లో కలిసిపోతుంది. బ్రిటన్, అమెరికాలు ఆ పరిస్థితితో తృప్తిపడగలవు. సర్ ఓయిన్ డిక్సన్ సంస్థాన విభజనే సమస్యా పరిష్కారానికి గల ఏకైక మార్గం అని ఖచ్చితంగా చెప్పినప్పుడు ఎవరూ మనస్ఫూర్తిగా ఆధిక్షేపించలేదు. బేషరతుగా ఎవ్వరూ నిరాకరించలేదు.

మొట్టమొదటి కాశ్మీరు మధ్యవర్తి సంఘం యుద్ధ విరమణనాడు ఏ ప్రాంతం ఎవరి అధీనంలో ఉంటే ఆ ప్రాంతం వారి అధీనంలోనే వుండిపోవాలని, సంస్థాన భవిష్యత్తు జనవాక్య నిర్ధారణద్వారా నిర్ణయమయ్యేవరకూ ఆ ప్రాంతాలపై అబ్దుల్లా, అజాద్ కాశ్మీరు ప్రభుత్వాలే అధికారం చలాయిస్తూ వుండాలని తీర్మానించినప్పుడే డిక్సన్ పథకానికి ప్రాతిపదిక ఏర్పడింది. 1948 ఆగస్టు 13, 1949 జనవరి తీర్మానాలను పాకిస్తాన్, భారత దేశాలు అంగీకరించడంద్వారా సంస్థాన విభజననుకూడా అంగీకరించినట్లే అయింది.

1947 ఆగస్టు 15కు పూర్వం కాశ్మీరుభవిష్యత్తు విషయంలో అట్టే అంత ఆసక్తిని చూపని భారత ప్రభుత్వం ఆ సంవత్సరం అక్టోబరులో సైన్యాలను పంపి రోజుకు నాలుగులక్షల రూపాయల ఖర్చును భరించి దాదాపు సంవత్సరంపాటు పాకిస్తాన్ సేనలతో యుద్ధం సాగించడానికి గల కారణం ఏమిటి ? భారతదేశ విభజనకు అంగీకరించి ఊహకు కూడా అందనటువంటి నష్టాన్ని, కష్టాన్ని భరించిన భారత ప్రభుత్వం ఈనాడు సర్ ఓయిన్ డిక్సన్ ప్రతిపాదనలను ఎందుకు అంగీకరించింది ? పంజాబ్, బెంగాల్ రాష్ట్రాల్లోని దాదాపు సగ భాగాన్ని పాకిస్తాన్‌కు వదులుకున్న భారతప్రభుత్వం ఈ 85 వేల చతురపు మైళ్ళ సంస్థానంకోసరం నాలుగేళ్లుగా ఇంత తాపత్రయం పడ్డానికి కారణం ఏమిటి ?

కాశ్మీరు భవిష్యత్తు మీదనే భారత దేశ భవిష్యత్తు ఆధారపడివుంది. భారతప్రభుత్వ దేశాంగ విధానం, విదేశాంగ విధానం కాశ్మీరు సంస్థానాన్ని మనస్సులో పెట్టుకునే నిర్ణయం కావలసివుంటుంది. క్రిందటి సంవత్సరం పండిట్ నెహ్రూ అధ్యక్షతను ఢిల్లీలో జరిగిన కాంగ్రెస్ మహాసభ ప్రత్యేక సమావేశంలో పండిట్ నెహ్రూ, కాశ్మీరు ప్రధాని షేక్

అబ్దుల్లాకూడా ఈ విషయాన్ని స్పష్టంచేశారు. కాశ్మీరు భారతదేశంతో చేరివుండాలంటే భారతదేశం సెక్యులర్ రాజ్యంగా ప్రవర్తిల్లాలని భారత ప్రధానమంత్రీ, కాశ్మీరు ముఖ్యమంత్రికూడా స్పష్టం చేశారు. కాంగ్రెస్ సంస్థలో వచ్చిన మార్పులకు, భారతప్రభుత్వ విధానానికి కాశ్మీరు సమస్యకు ఎంత సంబంధం వుందో గ్రహించడానికి ఇంతకంటే ఎక్కువ ఆధారాలు అవసరంలేదు. భారతదేశంలో "హిందూరాజ్యాన్ని" ఏర్పరిస్తే కాశ్మీరు ముస్లింలు పాకిస్తాన్‌లో చేరిపోతామని ప్రకటించడం తథ్యం. అంతే గాదు, అందువల్ల కాంగ్రెస్, గాంధి మహాత్ముడు ప్రతిఘటించిన ద్విజాతి సిద్ధాంతం భారతదేశంలో ఎక్కువ ప్రాబల్యాన్ని సంపాదిస్తుంది. పాకిస్తాన్ స్థాపన అన్ని విధాలా సమర్థనీయమని అందుకు బాధ్యులైనవారు చెప్పుకోడానికి మంచి ఉదాహరణ లభిస్తుంది.

కాశ్మీరు ద్విజాతిసిద్ధాంతం బూటకం అని ఋజువు చేసిందని ఆ సంస్థానానికి వెళ్లివచ్చిన విదేశస్థులందరూ, ప్రత్యేకంగా పాకిస్తాన్ అభిమానం లేనప్పుడు ప్రకటించారు. ఈ మధ్యనే కాశ్మీరులో రెండు ప్రాంతాల్లోనూ పరిస్థితులను గమనించివచ్చిన "మాంఛెస్టర్ గార్డియన్" పత్రికవిలేకరి కాశ్మీరు ప్రజల మనస్తత్వాన్ని వివరిస్తూ వారికి మతం ప్రధానం కాదనీ, ఏ దేశంతో చేరితే లాభంగా వుంటే ఆ దేశంతోనే చేరగలనని ప్రకటించింది. ఆజాద్ కాశ్మీర్లో కంటే అబ్దుల్లా అధీనంలో వున్న కాశ్మీరులో ప్రజాసామాన్యం స్థితి తృప్తికరంగా వున్నందువల్ల కాశ్మీరుజనాభాలో హెచ్చుమంది అబ్దుల్లా చెప్పినట్లు చేస్తారని కూడా ఈ విలేఖరి నివేదిక తెలుపుతున్నది. అబ్దుల్లా ప్రభుత్వం ప్రవేశపెట్టిన భూమి సంస్కరణలవల్ల కాశ్మీరు రైతాంగం ఎక్కువ ప్రయోజనాలను పొందింది. కుంట పొలం లేని రైతులకు అబ్దుల్లా ఆర్థికవిధానం వల్ల ఇంత జీవనోపాధి ఏర్పడింది. భారత ప్రజానీకానికి పండిత నెహ్రూ ఎలాగో కాశ్మీరీలకు, షేక్ అబ్దుల్లా అలాగని అంతా అంగీకరించిన విషయం. షేక్ అబ్దుల్లా శక్తి, సామర్థ్యాలను, దృక్పథాన్ని గ్రహించిన జిన్నా, కాశ్మీరు ప్రజలతో గాక కాశ్మీరు మహారాజుతో వ్యవహారం చేయ నిశ్చయించుకున్నాడు. కాశ్మీరు మహారాజు కాంగ్రెస్ విధానాలను తెలుసుకున్న వాడవడంవల్ల కాంగ్రెస్ పాలించే భారతదేశంతో చేరడంవల్ల తన స్థితి, స్థాయిలో రాగల మార్పులను గ్రహించినవాడవడంవల్ల ఇటు భారత దేశంతో గాక, అటు పాకిస్తాన్‌తో సన్నిహిత సంబంధాలను ఏర్పాటుచేసుకోవడానికి ప్రయత్నించాడు. కాని పాకిస్తాన్‌లో చేరిపోవడానికి భయపడ్డాడు. 1947 ఆగస్టు 15 లోపున ఒక నిర్ణయానికి రాలేక బ్రిటిష్‌ప్రభుత్వం సలహాకోసరం ఠామర్ కల్యాణ్ సింగ్‌ను లండన్ పంపించారు. కాశ్మీరు పాకిస్తాన్‌తోనే చేరాలని బ్రిటిష్ రాజకీయవేత్తలు సలహా ఇచ్చారు. అప్పుడు గవర్నర్ జనరల్‌గా వున్న లార్డ్ మౌంట్‌బాటన్ కూడా కాశ్మీరు భారతదేశంలో చేరాలని ఖచ్చితంగా సలహా ఇవ్వలేకపోయినాడు. పైగా కాశ్మీరు మహారాజా నిర్ణయాన్ని కాశ్మీరు ప్రజలు స్థిరపరచవలసి వుంటుందనే షరతు పెట్టి సర్ హరిసింగ్ అభ్యర్థనను మన్నించవలసిందని పండిట్ నెహ్రూకు సలహాఇచ్చారు.

సర్ హరిసింగ్, ఆయన ఆశ్రితవర్గం కాశ్మీరును ఎటూ చేర్చక, పాకిస్తాన్, భారతదేశాలతో యథాతథస్థితి ఒడంబడిక ద్వారా తమ హక్కులను, హోదాలను సంరక్షించుకోగలమని ఆశపడ్డారు. 1947 లో కాశ్మీరు మహారాజు తరఫున పాకిస్తాన్‌తో చేరికను గురించి రామచంద్రకాక్ సంప్రతింపులుకూడా జరిపారు. జిన్నా లాహోరులో కూర్చుని కాశ్మీరుపై దండయాత్రను ప్రారంభించకపోతే సంస్థానం ఏమై వుండేది? సర్ హరిసింగ్ జిన్నా అభిమతానికి విరుద్ధంగా తనకు ఆత్మహత్యగా పరిణమించగల చర్యను తీసుకొనివుండేవారా? పండిట్ నెహ్రూ ప్రధానమంత్రిగా వున్న భారతదేశంతో తాను కాశ్మీరు మహారాజాగా వ్యవహరింపలేమని సర్ హరిసింగ్‌కు తెలియకపోలేదు. భారతదేశంతో చేరితే షేక్ అబ్దుల్లా ప్రధానమంత్రిగా సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయక తప్పదని సర్ హరిసింగ్ కంటే బాగా గ్రహించినవారు మరొకరు వుండరు. కాశ్మీరు జాతీయ మహాసభను కాదని పాకిస్తాన్‌తో చేరితే సంస్థానంలో అంతర్యుద్ధం తప్పదని కూడా కాశ్మీరు మహారాజుకు తెలుసును. కాని 1846 లో తమ పూర్వీకులు 50 లక్షల రూపాయలకు సంపాదించినంత సులభంగా తాను ఈ కాశ్మీరును

సంరక్షించుకోలేనని కూడా ఆయన గ్రహించాడు. 'హామ్లెట్' పడిన అవస్థలో పడి, తుదకు అట్టి ఫలితాలను అనుభవించాడు.

అయితే జిన్నా పాకిస్తాన్ అవతరించిన ఆరు వారాలకే తన దృష్టిని కాశ్మీరుపై కేంద్రీకరించడానికి గల కారణం ఏమిటి? పాకిస్తాన్ సంపాదనకు 1940 నుంచీ 1946 వరకూ ఓపిగ్గా, అతి జాగ్రత్తగా, అత్యంత ప్రతిభతో వ్యవహారం చేసుకు వచ్చిన క్వాయిదే అజాం కాశ్మీర్‌ను సంపాదించడానికి అంత త్వరపడడానికి కారణం ఏమిటి? పాకిస్తాన్ పరిష్కరించుకోవలసిన ఆర్థిక, కాందిశీక, సాంఘిక సమస్యలు అసంఖ్యాకంగా ఉండగా పాకిస్తాన్ గవర్నరు జనరలు ఈ సంస్థాన ఆక్రమణకు ఇంత ప్రాధాన్యం ఇచ్చి స్వయంగా యుద్ధాన్ని నడపడానికి గల కారణం ఏమిటి?

కాశ్మీరుసమస్య శీఘ్రంగా పరిష్కారం కావాలని పాకిస్తాన్ గవర్నరు జనరలు అభిప్రాయపడ్డాడు. సర్ హరిసింగ్ యథాతథపు ఒడంబడిక స్థానే పాకిస్తాన్‌లో చేరికపత్రాన్ని సమర్పించాలని జిన్నా పట్టుబట్టాడు. ఎటూ తేల్చుకోలేని కాశ్మీర్ మహారాజా ఒక నిర్ణయానికి వచ్చేటట్లు చేయాలని ఆర్థిక దిగ్బంధనం ప్రయోగించాడు. మూడువారాలు నిదానించి చూచాడు. ప్రయోజనం లేకపోయింది. కాశ్మీర్‌పై దండెత్తమని కొండజాతుల వారికీ, పాకిస్తాన్ సైనికులకు ఉత్తరువు చేశాడు. వారికి కాశ్మీర్‌ను జయించేందుకు అవసరమైన సహాయం చేయవలసిందని పాకిస్తాన్ సర్వసేనాని ఆజ్ఞాపించాడు. సరిహద్దు దాడులుగా ప్రారంభమైన సైనిక చర్యలు కాశ్మీరు యుద్ధంగా పరిణమించినది. యుద్ధం ప్రారంభమైన ఇరవై రోజుల్లో పాకిస్తాన్ సేనలు కాశ్మీరు రాజధాని శ్రీనగర్‌కు 7000 గజాల సమీపంలోకి చేరినవి. అక్టోబరు 26 న భారత ప్రభుత్వం కాశ్మీరు మహారాజా ఆర్తనాదాన్ని వినిపించుకొని సైన్యాలను పంపడంలో రెండు రోజులు కాలహరణం జరిగితే పాకిస్తాన్ కాశ్మీరును ఆక్రమించుకొని తూర్పు పంజాబును కలుపుకోడానికి సన్నద్ధమై వుండేది. తూర్పు బెంగాల్ పాకిస్తాన్‌కు రాకపోయినా సింధు, తూర్పు పశ్చిమ పంజాబు, కాశ్మీరులు లభించివుంటే పాకిస్తాన్ నాయకులు తృప్తి చెందివుండే వారే.

అటు కాశ్మీరు సంస్థానం ఇటు తూర్పు పంజాబు పాకిస్తాన్ వశమై వుంటే పాకిస్తాన్ వ్యావసాయికంగా ఎంతో అభివృద్ధి చెందివుండేది. కాశ్మీరు పాకిస్తాన్‌లో చేరాలని కరాచీ ప్రముఖులు వాదించడానికి పాకిస్తాన్‌కు కావలసిన నదీ జలం అంతా కాశ్మీరునుంచే రావాల్సి వుండడమే. కాశ్మీరు భారతదేశంలో చేరితే భారత ప్రభుత్వం పాకిస్తాన్‌లోకి ప్రవహిస్తున్న నదుల నన్నిటి గతిని మార్చి పాకిస్తాన్‌కు నీరు లేకుండా చేస్తుందని కూడా పాకిస్తాన్ రాజకీయజ్ఞులు ప్రచారం చేశారు. అలా చేయాలనే వుద్దేశ్యం భారత దేశానికి వున్నప్పటికీ అది సాధ్యం గాదని భారత ప్రభుత్వం స్పష్టం చేసింది. పాకిస్తాన్ — భారతదేశాలకున్న కాలవ నీటి తగాయిదా పరిష్కారమైతే మిగతా సమస్యలు సులభంగా పరిష్కారం కాగలవని రెండుదేశాల్లోనూ పర్యటించి, అక్కడి పరిస్థితులను పరిశీలించి, స్థానిక నాయకులతో చర్చలు జరిపిన డేవిడ్ లిలియన్థాల్ సూచించారు.

పాకిస్తాన్ కాశ్మీరు విషయంలో అనుసరిస్తున్న విధానానికీ సూడాన్ విషయంలో ఈజిప్టు అనుసరిస్తున్న విధానానికీ ఏమీ తేడా లేదు. ఈజిప్టు బ్రతుకుకు అత్యంతావశ్యకమైన నైల్ నది సూడాన్‌నుంచే రావలసివుంది. ఈజిప్టు ఆర్థికంగా స్వయంసమృద్ధం కావాలంటే సూడాన్ ఈజిప్టు అధీనంలో వుండక తప్పదు. ఈ విషయాన్ని ఈజిప్షియన్లు, పాకిస్తానీల మాదిరే ఎంతమాత్రం కప్పిపుచ్చలేదు. కాని ఈజిప్టుకు సుడాన్‌ను సాధనం చేయడానికి నిరాకరించి, సుడాన్ స్వతంత్ర్యరాజ్యంగా ఏర్పాటు చేయడానికి యావచ్ఛక్తినీ వినియోగిస్తున్న బ్రిటన్ కాశ్మీరును మాత్రం పాకిస్తాన్‌కు కట్టబెట్టడానికి సంకోచించడం లేదు. కాశ్మీరు ప్రజల అభిమతాన్ని తెలుసుకొనడం అవసరం అని అయినా భావించడంలేదు.

వీటన్నింటివల్లా కాశ్మీరు సమస్యకు ఎంతో ప్రాధాన్యం వుందనీ అది కేవలం భారత పాకిస్తాన్‌లకు మాత్రమే సంబంధించింది గాదనీ, అగ్రరాజ్యాలన్నీ కాశ్మీరు భవిష్యత్తులో ఆసక్తి కలిగివున్నవని స్పష్టమౌతున్నది.

ఈ సమస్యాపరిష్కారానికి భద్రతామండలి ఇప్పటికి నాలుగు సంవత్సరాలుగా మార్గాన్వేషణ చేస్తున్నది. భారతప్రభుత్వం పాకిస్తాన్ కాశ్మీరు సంస్థానంపై దురాక్రమణ జరిపిందని భద్రతామండలికి ఫిర్యాదు చేసి నాలుగు సంవత్సరాలైంది. యుద్ధచర్యల విరమణ జరిగి మూడు సంవత్సరాలైంది. ఈ నాలుగేళ్లలోనూ ఎందరో ఎన్నో పరిష్కారమార్గాలను సూచించారు. మొట్టమొదట భద్రతామండలికి అధ్యక్షుడుగా వున్న చైనా ప్రతినిధి డాక్టర్ ట్సియాంగ్ భారతప్రభుత్వ ఫిర్యాదును శ్రద్ధగా పరిశీలించి కొన్ని ప్రతిపాదనలను చేశారు. భారతప్రభుత్వం ఈ ప్రతిపాదనలను అంగీకరించింది. పాకిస్తాన్ నిరాకరించింది. ఆ తరువాత ఈ కాశ్మీరు తగాయిదాలను భారత-పాకిస్తాన్ తగాదా విస్తరింపచేయడానికి తద్వారా పాకిస్తాన్ దురాక్రమణను కప్పిపుచ్చడానికి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ చేసిన ప్రయత్నాలు ఫలించి ఐక్యరాజ్యసమితి కాశ్మీరు కమీషను ఏర్పడింది. ఆ కమీషన్ జరిపిన విచారణ ఫలితంగా కాశ్మీరుపై పాకిస్తాన్ దురాక్రమణ జరిపిందని ఋజువైంది. భద్రతామండలి గ్రీసు విషయంలో ఆల్బేనియా, యుగస్లావియా, బల్గేరియా, రుమేనియా దేశాలను హెచ్చరించినట్లు కాశ్మీరువిషయంలో పాకిస్తాన్‌ను హెచ్చరించడానికి బదులు, కాశ్మీర్‌పై దురాక్రమణ జరుపుతున్నవారికి ఏ విధంగానూ సహాయపడరాదని పాకిస్తాన్‌ను ఆదేశించడానికి బదులు కాశ్మీరును భారత-పాకిస్తాన్ దేశాలకు ఏ విధంగా పంపకం చేద్దామనే ఆలోచించడం ప్రారంభించింది. కాశ్మీరు కమీషన్ ప్రతిపాదనలను భద్రతా మండలి అమలుజరుపగల్గివుంటే, లేదూ తరువాత కాశ్మీరుమధ్యవర్తిగా వచ్చిన సర్ ఓయిన్ డిక్సన్ ప్రతిపాదనలను అమలుజరుపకల్గివుంటే, కాశ్మీరు సమస్య ఈనాడింత క్లిష్టమైవుండేది గాదు. మొదట కాశ్మీరు కమీషను పాకిస్తాన్‌సేనలు కాశ్మీరు సంస్థానం భూభాగంపై వున్నట్లు వెల్లడించింది. సర్ ఓవెన్ డిక్సన్ కాశ్మీరులో పాకిస్తాన్ సేనల ఉనికి అంతర్జాతీయ ధర్మసూత్రాలకు విరుద్ధం అని ప్రకటించారు. ఈవిధంగా తీర్పులివ్వడంతోనే వీరు తృప్తిపడ్డారు గాని ఆ తీర్పులను అమలుచేయడానికి అసలు ప్రయత్నించనే లేదు.

ఇప్పుడు డాక్టర్ ఫ్రాంక్ గ్రాహం కాశ్మీరు సమస్యా పరిష్కారానికి ఆఖరు ప్రయత్నం చేస్తున్నారు. అనేక చిల్లర విషయాలపై కూడ భారత-పాకిస్తాన్ సమాధానాన్ని సాధించగలిగారు; కాని అసలు సంస్థానభవిష్యత్తు నిర్ధారణకు సంబంధించిన రెండు ప్రధాన విషయాలమీదా 1948 లో ఎంతటి భేదాభిప్రాయం వుండేదో 1952లోనూ అంతటి భేదాభిప్రాయము వుంది.

కాశ్మీరు నుంచి భారత, పాకిస్తాన్ సేనల ఉపసంహరణ విషయంలో మెక్నాటన్ ప్రతిపాదనలతో ప్రారంభమైన అన్యాయం ఇప్పటివరకూ అలా వస్తూనే వుంది. కాశ్మీరు కమీషన్ సంస్థాన శాంతిభద్రతలరక్షణకు అవసరమైన సేనను భారతప్రభుత్వం స్థావరంగా వుంచవచ్చునని, పాకిస్తాన్ సేనల ఉపసంహారం మాత్రం జరగాలనీ సూచించింది. అంతేగాక గిల్గిట్ ప్రాంతంపై పరిపాలనాధికారం షేక్ అబ్దుల్లా ప్రభుత్వపరం కావాలన్న సూచనను కూడా కాశ్మీరు కమీషన్ హర్షించింది. ఇప్పుడు డాక్టర్ ఫ్రాంక్ గ్రాహం ఇరుపక్షాల సేనలబలం ఒక్కటిగానే వుండాలని సూచిస్తున్నారు. భారతప్రభుత్వం ఈ సూచనను ఎప్పటికీ అంగీకరింపదు. ఇక రెండవది-జనవాక్యనిర్ధారణ కార్యక్రమాన్ని ప్రారంభించడానికి అనుకూలమైన పరిస్థితులు ఏర్పడేందుకుముందుగానే జనవాక్య నిర్ధారణాధికారిని నియమించాలని గ్రాహం ప్రతిపాదించాడు. ఈ రెండూ పాకిస్తాన్‌కు అనుకూలమైనవే. భారతదేశం ఈ ప్రతిపాదననూ అంగీకరింపదు.

హైద్రాబాదు సమస్య సమితి చర్చనీయాంశాల జాబితాలో వుంటూవుండగానే శాశ్వతంగా పరిష్కారమైపోయినట్లుగానే ఈ కాశ్మీరుసమస్యా పరిష్కారం కావాలి. అందుకు ప్రస్తుతం సంస్థానంలో ఏర్పడిన రాజ్యాంగపరిషత్తు దోహదం చేస్తుంది. కాబట్టే ఈ పరిషత్తుకు ఎన్నికలు జరక్కుండా చేయాలని, పరిషత్తుసమావేశం కాకుండా చేయాలని పాకిస్తాన్ ప్రభుత్వం స్వయంగానూ, భద్రతామండలి ద్వారానూ శాయశక్తులా ప్రయత్నించింది. సరిహద్దులలో తిరిగి సైనికచర్యలు జరపడానికి సమాయత్తమైంది. భారతప్రభుత్వం ముందుగానే గ్రహించి అవసరమైన చర్యలు తీసుకున్నది. పాకిస్తాన్ కొత్త

పథకం ఈవిధంగా నిరుపయోగమైంది. షేక్ అబ్దుల్లాను అపహరించడానికి కుట్రలుపన్నింది. అదీ లాభంలేకపోయింది. కాశ్మీరు అభ్యుదయమార్గాన పురోగమిస్తున్నది. ప్రక్కనవున్న ఆజాద్ కాశ్మీర్లో అరాచకం ప్రారంభమైంది. తిండి, బట్టకోసరం ప్రజలు, అధికారంకోసరం ఆజాద్ కాశ్మీర్ నాయకులు తిరుగుబాటుచేశారు. సర్దార్ ఇబ్రహింఖాన్ తిరిగి ఆజాద్ కాశ్మీరు అధిపతికావడానికి కుట్రలు పన్నాడు. తత్ఫలితంగా కలనల్ అహమ్మద్ షా పదభ్రష్టుడైనాడు. అంతటితో మహమ్మద్ అబ్బాస్ ప్రాబల్యం అంతరించింది. ఆజాద్ కాశ్మీర్ వ్యవహారాల్లో స్థానిక నాయకులకు ప్రమేయం లేకుండా చేసి ఆజాద్ కాశ్మీరు కొంతభాగాన్ని అటు పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రానికీ, కొంతభాగాన్ని పశ్చిమ పంజాబుకు కలిపివేయడానికి అనుకూలమైన పరిస్థితులు ఏర్పడ్డవి. ఇవాళ అజాద్ కాశ్మీరు అధిపతిగా నాజీముద్దీన్‌చే ప్రతిష్ఠింపబడిన సైజ్ మహమ్మద్ యూసఫ్ అవకాశవాది. షేక్ అబ్దుల్లాను దూషించడానికి కాశ్మీరు మహారాజా ఒకప్పుడు ఇతన్ని తన ప్రక్కన వుంచుకున్నాడు. పాకిస్తాన్ కాశ్మీరుపై దురాక్రమణ జరపగానే ఈయన పాకిస్తాన్‌కు పారిపోయి పాకిస్తాన్ నాయకుల అడుగులకు మడుగులొత్తుతూ కాలక్షేపం చేస్తున్నాడు.

వీలైనంత శీఘ్రంగా పాకిస్తాన్‌లో ఆజాద్ కాశ్మీరుప్రాంతాన్ని కేంద్రపరిపాలిత రాష్ట్రంగా గాని లేక ఉత్తరప్రాంతాన్ని సరిహద్దు రాష్ట్రంలోనూ దక్షిణప్రాంతాన్ని పశ్చిమ పంజాబులోనూ కలిపివేయడంగాని చేయకపోతే డాక్టర్ గ్రాహంతో పాకిస్తాన్‌తో జరుపుతున్న సంప్రదింపులలో తనకూ స్థానంకావాలని ఆందోళనచేసిన సర్దార్ ఇబ్రహిం చివరికి పాకిస్తాన్‌కే 'ఎసరు' పెట్టి అబ్దుల్లాతో చేతులు కలిపినా కలపవచ్చు. ఆ ప్రమాదాన్ని నివారించడానికే పాకిస్తాన్ ప్రయత్నిస్తున్నది. ఆ వుద్దేశ్యంతోనే ఆజాద్ కాశ్మీరుప్రభుత్వాన్ని పునర్నిర్మించింది. ఆ వుద్దేశ్యంతోనే అటు సరిహద్దురాష్ట్రంలోనూ, ఇటు పశ్చిమ పంజాబులోనూ ప్రతీపవర్గాలను అధికారంలో ప్రతిష్ఠించడం జరిగింది.

కాశ్మీరు సమస్య ఇంతలో పరిష్కారంగాదు. కాని కాశ్మీరు భారతదేశాంతర్భాగమనే విషయాన్ని గమనించే భారత రాజకీయపక్షాలు, అధికారంలో వున్నా రాకపోయినా తమ విధానాలను, ప్రణాళికలను నిర్ణయించుకోవలసివుంటుంది. కాబట్టే పండిట్ నెహ్రూ మతకుల తత్వాలను పనిగట్టుకొని ఖండిస్తున్నారు. మతసంఘాలను విమర్శిస్తున్నారు.

“కాశ్మీరు భారతదేశానికి చెందినదే”.అని షేక్ అబ్దుల్లా. అనేక పర్యాయములు ప్రకటించారు. ఆ ప్రకారంగానే కాశ్మీరు రాజ్యాంగపరిషత్తు తీర్మానిస్తుంది. అంతమాత్రంచేత కాశ్మీరు భారతదేశంతో కలిసిపోవడం జరగదు. హైద్రాబాద్ సమస్యను పరిష్కరించినట్లుగా కాశ్మీరుసమస్యను పరిష్కరించడం సాధ్యంకాదు.

భారతదేశ ఉత్తర సరిహద్దుల రక్షణకు కాశ్మీరు మనకు అవసరం. సరిహద్దుల్లోవున్న కాశ్మీరీలు సంతుష్టులై భారతదేశం అంటే ప్రాణాలర్పించేటట్లు ఉండాలి. అది మతాధారరాజ్యాన్ని స్థాపించడం ద్వారా సాధ్యంగాదు. పండిట్ నెహ్రూ విధానాలను అవగతం చేసుకోవడానికి ఈ కాశ్మీరుసమస్య ప్రాధాన్యాన్ని తెలుసుకోవడం అవసరం.



# బసవని పూజ



శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి

సంక్రాంతి పండుగకు బసవడు తెనుగునాట నింటింట నిలిచి తన కడగంటిచూపుల దయారసము ప్రసరింప జేయును. నాటి ముచ్చట తలపోతకు రాగా పైకుబికిన యూహలోని పలుకరింపులు.

రావోసీ! సుకుమారి యీ మనగృహారామమ్మునన్ నంది తా
నై వేంచేసె, పదార్ఘ్యణం బిడుమె నూహాగమ్య తేజస్సులా
శావాల్లభ్యములంద, రాచనడకల్ సౌందర్యముల్ జింద, జే
తోవాటీగత భావసూనములు గ్రుత్తున్ మాలగా స్వామికిన్.

బసవని శీతల దృక్సుధా ప్రసరణములె యిప్పటి మనపాలిటి పంటల్
వెసఁ దేవే ప్రభునకు పసుపును గుంకుమము పూజఁ బచరింపవలెన్.

అదె! యిందీవరమాలికా వితతిఁ దారాధ్వమ్మునందల్లె, స్వా
మి, దయాపాంగముల్ విదిర్చి, యవులే! మేల్మేలు! మీ రొండొరుల్
గదియన్ జేసిన మందహాసమ్మృదు లీలాలోకముల్, యామునా
భ్యుదితోత్తుంగ తరంగపంక్తికిని సొంపుల్ వచ్చులే నెచ్చెలీ!.

ఆనందము వెల్లువమై యీ నందీశ్వరుని సేవ కెద త్వరపడెదున్
గాసీ! నీ వింక జాగును పోనీ ప్రభు విటు నిలుచుట ముదమా నీకున్-

స్వామి కనుదోయిచిగురుల శాంతరసము నొలుకఁ బోసెడు నీవేళ నోడుగనేల
ఎఱుగవే యీతఁడిపుడు కన్నెఱ్ఱఁ జేసి కొమ్ముల నదల్ప సర్వలోకమ్ములగలు.

హుమ్మని మూర్చినంతటనె యొత్తిగిలన్ వలె వైరి, లేనిచో
కొమ్ము పెకిల్లునన్ బగులు రోసములేని యెడన్, మరింత శాం
తమ్మువహించు సాదువె గనంబడ డింకొకఁ డెందు క్రోధ శాం
తమ్ముల కీతఁ డొక్కఁడెగదా! పరమావధి యై నిలంబడున్.

హారతి బట్టు మీతని కనారతసౌఖ్యము, గ్రుమ్మరించు వా
చారమణీయతల్ నిగుడి చక్కని గీతిక నాలపింపు మే
దీ! రదనాంచలచ్ఛవి నొకింత వెలార్చుము, సామి నీ దెసన్
దోరగ కర్ణముల్ నిగిడె దోసము వచ్చును బాడకుండినన్.

ఏదీ నీ వొక పరి మర్యాదను బాటించి స్వీయహస్తాంగుళులన్
సాదవలె గంగడోలును సాధుత్వము బసవని స్పృశసన్నత, చెలియన్.

(పూజానంతరంబు)

సేవా స్వీకృతి చేసిన యోవృషభస్వామి కరుణ యోజించి మమున్
గావుము మాకై పనిగా శ్రీ విశ్వేశ్వరుని చెంత సెలవిత్తుగదే!.

ఘల ఘల ఘల్లు, ఘలఘల్ ఘలం ఘల రవముల కాలిగంటలు మ్రోసెన్
ఘల ఘల ఘల్లల ఘలఘల్ ఘలం ఘలం ఘలల నెడంద గంతులువైచెన్.

తన శిరమిటు నటు గదలించెనో లేదో వృషభరాజు చెలి వింటి వలె
ఘణ ఘణ ఘణ ఘణ ఘణ! ఘణ ఘణం ఘణం ఘణముల మెడ గంటలు మ్రోగెన్.

(క్రీడోక్తులు)

తన విషాణాగ్రముల్ తరుణేందు శృంగభాగములకు శృంగభంగమ్ములుగను
తన మూపురమ్ము సౌందర్యనిలయమై, సకల దేవతల కలకాపురముగ
తనపాదనూపుర ధణఖణ ధ్వానముల్ గంగానదీ తరంగ ధ్వానులుగ
తనయూర్పు బుస్సల తహ తహల్, శివగళ స్థానేక భుజగ ఫూత్కారములుగ
బసవం డపుడిలు వెడలె సంబరముతోడ శాంత మధుర స్వభావవశంవదాఖి
లాంతర ప్రకృతి, శివపదధ్యానసుకృతి, కదలి నడచెను హిమపన్నగమ్మువోలె.



దక్షిణాంధ్ర వాఙ్మయము—

# రెడ్డిరాజుల ఆంధ్రవాఙ్మయ పోషణ



శ్రీ నిడదవోలు వెంకటరావు

## తుఱైయూరు:—

దక్షిణదేశమున నేఁడు తిరుచనాపల్లికి (త్రిశిరఃపురము) నిరువదేఁడుమైళ్ళ దూరమున 'తుఱైయూరు' అను సంస్థానము గలదు. దీని పూర్వనామము 'తీర్థపురి.' ఈ సంస్థానికులైన రెడ్డిరాజులు శ్రీకృష్ణరాయల కాలమున నా ప్రాంతములకు పాలకులై వెలసిరి. వారిలో వేంకటాచలరెడ్డి అను నాయకుని ప్రోత్సాహమువలన కుందుర్తి వేంకటాచల కవి "కార్తికమాహాత్మ్యము" అను నాలాశ్వాసముల పద్యప్రబంధము రచియించెను. వేంకటాచలకవి యీవరకే యాంధ్రకవుల చరిత్రములలో సుపరిచితుఁడు. ఈతని వేఱొక కృతి "మిత్రవిందాపరిణయము" క్రీ. శ, 1888 సంవత్సరమున 'అముద్రిత గ్రంథ చింతామణి' అను పత్రికయందు ప్రకటితమైనది. ఈతఁడు. క్రీ. శ. 1704–1732 వఱకును మధురను పరిపాలించిన ప్రసిద్ధభాషాపోషకుఁడు విజయరంగ చొక్కనాథ నాయకుని యాస్థాని.

ఈతఁడు కార్తికమాహాత్మ్యమున తీర్థపురిని తత్పరిపాలకుని నిట్లు వర్ణించియున్నాఁడు.

"ఏ రాజధానికి నిరుచక్కి గోపాల
వేంకటాచలపతుల్ వెలయుచుందు
రే పురిమధ్య సందీపితుం డగుచు నం
దీశ్వరుండు వసించు గృపను మనుప
నే పట్టణం బయోధ్యాపురంబునకు జో
డై పరాభేద్యమై యలరుచుండు
నే పుటభేదనం బాపూర్ణరుచిరాష్ట
లక్ష్మీనివాసమై లలి జెలంగు
నట్టి తీర్థపురీపాలనాతివేల
ధర్మపథవర్తి చంద్రికానవలకీర్తి
తార్క్ష్యవాతాత్మజధ్వజాద్యఖిల బిరుద
విదిత చక్రాయుధార్జున విభవుఁ డతఁడు."

వ. పాండ్యశ్రోత్రు గజకేసరి బిరుదాంకుండు రాయవేశ్యాభుజంగుండు పంటకుల కలశపాథోధి రాహతమాన బలిగోలులింగ నృపపుంగవ కులపాలికా పేర్యంబికా నిర్భరగర్భశుక్తిముక్తాయమానుండును నగు...... వేంకటాచల మహీమహేంద్రుండు నన్ను బిలిపించి యిట్లనుచు బలికె."

మెకంజీ దొరవారి సంగ్రహములందును స్థానిక చరిత్రలయందును నీ తుఱైయూరు సంస్థానచరిత్ర చక్కఁగా తెలియవచ్చుచున్నది. ఆ చరిత్ర ననుసరించి తురయూరు రెడ్డిరాజుల వంశవృక్షమును, వారు పాలించిన కాలపరిమితిని యీ క్రింద చూపుచున్నాను.

ఈ రెడ్డిరాజులు పంటరెడ్లు—నెల్లూరి మండలమున పల్లవోలిసీమ వీరి కాపురము. శ్రీ కృష్ణరాయల కాలమున, అన్నారెడ్డి, సూరారెడ్డి అను నిరువురు సోదరు లాతనికడ నాయకులైయుండిరి. కృష్ణదేవరాయలు దక్షిణదేశము జయించిన పిమ్మట కొల్లడమున కుత్తరముగ నుండు ముత్తైనాడుతీర్థగిరి ప్రదేశములలో దోపిడిగాండ్ర యొత్తిడి యధికముగ నుండుటచే నీ యన్నదమ్ము లిరువురిని వారి నణచుటకు పంపెను. వీరా ప్రదేశమున నిశ్శేషముగ దొంగలభయము లేకుండ చేసినందున యీ తీర్థగిరి ప్రదేశమును వీరికి సర్వమాన్యముగా రాయలవా రొసగిరి. సోదరు లిరువురు నా ప్రదేశము నభివృద్ధిపరచి సంస్థానముగా నేర్పఱచిరి. సోదరు లిరువురిలో సూరారెడ్డి పిమ్మట యీ క్రింది వా రా సంస్థానమును పాలించిరి.

(1) కసూర యెఱ్ఱమరెడ్డి — క్రీ. శ. 1547–1582

(2) పాపిరెడ్డి — క్రీ. శ. 1582–1597

(3) ఎఱ్ఱమరెడ్డి — క్రీ. శ. 1597–1632

(4) లింగారెడ్డి క్రీ. శ. 1632-1667
(5) నల్లపరెడ్డి క్రీ. శ. 1667-1696
(6) లింగారెడ్డి (భార్య పేరమ) క్రీ. శ. 1696-1708
(7) వెంకటాచలరెడ్డి క్రీ. శ. 1708-1740

పైవంశవృక్షమున నాలవవాడగు లింగారెడ్డియే వేంకటాచల కవిని ప్రోత్సహించిన వేంకటాచలరెడ్డి తండ్రి. వేంకటాచలరెడ్డి కుమారుడు—కుమార వేంకటాచలరెడ్డి క్రీ. శ. 1740 లో రాజ్యపాలన ప్రారంభించినాడు. ఈతడు క్రీ. శ. 1772 వఱకు రాజ్యము చేసిన వెనుక నీతని కుమారుడు విజయ వేంకటాచలరెడ్డి క్రీ. శ. 1820 లో మెకంజీ దొరవారికి తమ సంస్థాన చరిత్రను[1] రచియించి పంపినాడు. అది తమిళ భాషలో నున్నది. దానినుండియే పై విషయములను గ్రహించితిని.

వేంకటాచలరెడ్డియు విజయరంగ చొక్కనాథుడును సమకాలికులని స్పష్టపడుచు నేయున్నది. కార్తిక మాహాత్మ్యము ముద్రితమైన యింకను విశేషములు తెలియగలవు. ఇందు నీతిదాయకములును భక్తిప్రదములు నగు నుపాఖ్యానములు కార్తిక మాహాత్మ్యములోగూడ ధారాళశైలితో వర్ణితములైనవి.

వెంగనూరు :—

పై వంశీయులలో క్రీ. శ. 1632—1667 వఱకు తురయూరు పాలించిన లింగారెడ్డి తిరుచనాపల్లి మండలమున పెరంబలూరు తాలూకాయందలి వెంగనూరు గ్రామమున నొక ప్రత్యేక సంస్థానము నెలకొల్పెను. లింగారెడ్డి భార్య యెఱ్ఱాంబిక. ఈమె వృద్ధాచలేశ్వరాలయము కట్టించెను.[2] 'గాధేయోపాఖ్యానము' అను శృంగార రసవత్ప్రబంధమును రచించిన బాలకవి బిరుదాంకితుడు ప్రసిద్ధ విద్వత్కవి శేషపూరి అనంతయజ్వ 'వృద్ధాచల మాహాత్మ్యము' అను నైదాశ్వాసముల ప్రబంధము రచించి యీ లింగారెడ్డికి కృతి నొసగెను. అందు కృతినాయకుడు బల్లవోలు శాసనుడు, జగదగోవాళ, రాయవేశ్యాభుజంగుడు, పాండ్యగజకేసరి, విశుద్ధపంట వంశపావనుడు" అని వర్ణితుడైనాడు. కావున నీతడు తురయూరి పాలకవంశీయుడగుట స్పష్టము.

లింగారెడ్డి కొమరుడు వరదరాజరెడ్డి—ఈతని కుమారుడు కృష్ణారెడ్డి. ఈ కృష్ణారెడ్డికి, పై శేషపూరి అనంతయజ్వ పౌత్రుడు, బాలకవి అనంతయజ్వ 'శ్రీకృష్ణమాహాత్మ్యము' అను నైదాశ్వాసముల ప్రబంధము కృతి నిచ్చియున్నాడు. అందు వెంగనూరును గూర్చి కృతిపతిగూర్చి గ్రంథావతారికలో నిట్లు గలదు.

"ఏ పీట నిరవొందు నే ప్రొద్దు ధారాపు
రీశ్వరనాథుడై విశ్వవిభుడు
ఏ పురంబున నుండు కాపురంబుగ గౌరి
సౌందరనాయికా సముచితాఖ్య
ఏప్రోలు పాలించు నెలమి బెట్టని కోట
యనుచు గూర్తుండారు జగ మెఱుంగ
నే నగరంబున నింపు ననంత
విద్వత్కవిస్తోమ విశదఫణితి
అట్టి వెంగనూరి మాత్రీయమైన రాజ
ధానిగా మీఱు నా చంద్రతారకముగ
ధరిలె జగనొబ్బగండాది బిరుదశాలి
వరదరాజేంద్రు కృష్ణభూపాలమౌళి."

"శ్రీకృష్ణమహత్త్వం బఖి
లాముం బది తెనుగు చేసి రహి కెక్క జగ
త్క్షేమంకర కృతిమమ్మభి
నామాంకితముగ నొనర్చి నైపుణి గనుమా."

శ్రీకృష్ణమాహాత్మ్యము వాగ్నేయమున గల ప్రశస్తక్షేత్ర మాహాత్మ్యములలో నొకటి.

ఈ వరదరాజరెడ్డి విజయరంగ చొక్కనాథుని సమకాలికుడు. కావున అనంతకవియు నాకాలపువాడే. అనంతయజ్వ వేఱొకకృతి శివరహస్యఖండము.

తలమల :—

తిరుచనాపల్లి మండలమున నామక్కల్లు తాలూకాయందలి తలమలయను కొండక్రింద ప్రదేశమును పై లింగారెడ్డికి తాతయగు పాపిరెడ్డి వశపఱుచుకొని కొండపై శ్రీ వెంకటేశ్వరస్వామి యాలయము గట్టిం

1. *Mackenzie Collectars 17-6-10 Section 5. Account of Turayur Samastanam.*

2. *Trichinopoly District Gazetter. Chapter XV. Page 308*

చను. ఈ వంశీయులకు తలమలవారని యింటిపేరు వచ్చినది. వీరిలో క్రీ. శ. 1690-1700 ప్రాంతముల విలసిల్లిన తలమల రామచంద్రారెడ్డికి, విశ్వేశ్వర పండితుడను విద్వత్కవి 'కృష్ణవిలాసము' అను నైదాశ్వాసముల శృంగార రసోత్తరప్రబంధము నంకితము గావించెను. ఇం దవతారికలో కృతిపతి విషయము విపులముగా గలదు.

కృష్ణవిలాస కృతికర్త విశ్వేశ్వరకవి. కవితార్కిక శిరోమణి బిరుదాంకితుడు. గీర్వాణసాహితీవేత్త. కాని తెనుగునమాత్రము భాషానుగుణ్యముగ మృదుపదరచన గావించియున్నాడు. మచ్చునకు రెండు పద్యములు.

"తలపున నన్ను నిల్పు నెల
తా నెలతాపము హెచ్చివచ్చె నే
యలరుల తేనె చిల్కు నవ
లా నవలాలిత సూక్తివల్క వే
వలపులు సందడింప జెలువా
చెలువానగ గౌగలింపవే
తలిరుల తావి గుల్కు వనితా
వనితావుల నన్ను గూడవే."

"సుదతి రదాళి పేర నును
జక్కుల బల్కుల పేర నాసుగన్
జడుపున నవ్వు వేర నవ
చంద్రికలన్ నిటలంబు వేర డా
ల్వ్రాదలగ నుండు మండలము
లోనగ మక్కువలవేర గల్వలన్
సుగుణగ నుండె మోహనకు
గోము సుధాకరు డెప్పుడీయగన్."

పై గ్రంథము లన్నియు సాంధ్రసాహిత్య పరిషత్తున గలవు. దక్షిణాంధ్రవాఙ్మయమునకు సంబంధించిన కృతు లెన్నో యపరిశీలితములుగానం దున్నవి. సప్తద్రవిడదేశమున సాహిత్యకళాపోషకులగు రెడ్డిరాజు లెట్లు తెనుగుభాషను కవులను నాదరించిరో దిఙ్మాత్రముగ తెలుపుటయే యీ వ్యాసమునొక్క యుద్దేశము.

నేడు ప్రభుత్వసాహాయ్యమున ప్రాచీనాంధ్ర కృతు లనేకములు ప్రకటితము లగుచున్నవి. అట్టి యెడ మనకు ప్రాప్తిగ నెఱుగరాని దక్షిణాంధ్ర వాఙ్మయమునకు సంబంధించిన యిట్టి గ్రంథములు ముద్రితములగుచో పరిశోధకుల పరిశ్రమ ఫలవంత మగును. తెనుగువాఙ్మయవైశాల్యము తెనుగువారి గోచరమగును.



# కొత్తకోడలు



శ్రీ వేలూరి సహజానందం

"అమ్మా..."

"ఏమిటే..."

"..........."

"ఏమిటే...'అమ్మా' అని మళ్లీ మాట్లాడటం మానేశావు?"

"ఆ!"

"ఏమిటో చెప్పు."

"ఏం లేదులే"

"అదేమిటే...నాతో చెప్పటానికి సంకోచిస్తావు?"

"ఎబ్బె...ఏం లేదు..."

"సరేలే...మీ ఆయన దగ్గఱనుంచి ఉత్తరం రాలేదనా...వస్తుందిలే. ఇవ్వాళ రాకపోతే, రేపు రాదేమిటి?"

"..........."

"మొన్ననేగా వ్రాశాడు...అయినా మా కాలంలో ఈ ఉత్తరాలు...ప్రాణాలన్నీ పోస్టు బంట్రోతు మీద పెట్టుకోటం...ఇవి మా కాలంలో ఎరగం..."

"అది కాదే...ఇప్పుడు ఉత్తరం సంగతి నే ఎత్తానటే?" అని నిట్టూర్చింది కొత్తగా కాపురానికి వెళ్లి వచ్చిన కమల.

కూతురి ముఖంకేసి చూసింది తల్లి. అంత నిర్జీవంగా ఉన్న ముఖాన్ని ఇది వఱకు తాను చూడలేదు.

"ఏమిటే అమ్మాయి...రాత్రి ఏమైనా కల వచ్చిందా?"

.........

"ఛా. పిచ్చికలలు...పీడకలలు...కలలు నిజాలేమిటి? ఛా...వాటికి భయపడ కూడదు."

పిచ్చికలలు, పీడకలలు...వీటి సంగతి కాదు కమల మనస్సుకు పట్టింది.

"కలలేమిటే?...కల వచ్చిందని నే చెప్పానా?" అంది కమల.

రాత్రి తెల్లవార్లు క్షణం కూడా కునుకు పట్టకపోతే, ఇంకా కలఏమిటి? కలల భయం ఏమైనా ఇప్పుడు నిజమే భయంకరంగా ఉంది.

"మరేమిటే...కల ఏమన్నా నేమో అనుకున్నా..."

"సరే...కాని ..మరి...అల్లుడు చదువుకున్నవాడని చెప్పావేమే?"

తల్లి నిర్ఘాంత పోయింది. ఈ అనుకోని ప్రశ్న బాణంలా హృదయంలోకి దూసుకుపోయింది. చెవులు చిల్లులు పడేట్టు ప్రతిధ్వనించిన మంగళ వాద్యాల మధ్య ఆ రాత్రి ఒంటరిగా గదిలో కూర్చొని, ఏడ్చిన కమల దుఃఖావేశం శరీరమంతా మళ్లీ ఒక్క మాటు మారు మోగింది.

తమాయించుకొని, జవాబు చెప్పింది.

"అతనికేం? కాలేజీలో చదువుకుంటేనే నా చదువు... తెలివి గలవాడు. తల్లి అంటె ఎంతో భక్తి శ్రద్ధలు...పొలం పుట్ర చూసుకొని, కాలు మీద కాలు వేసుకుంటె హాయిగా గడచి పోతుంది కాలం..."

"హాయిగా గడచిపోతుంది కాలం."

"అదేమిటే అమ్మాయి...ఇవ్వాళ అలా మాట్లాడుతున్నావు..." తెల్లపోయి చూసింది తల్లి.

కూతురు ఎక్కువగా మాట్లాడే పిల్ల కాదు. మొదటి నుంచీ మౌనం ఎక్కువ.

పెళ్లినాటి రాత్రి ఏడుపు విని తాను ముందు భయపడ్డది. ఏడుపు ఎవరికి వినబడి పోతుందో అని, ఏడుపుతో కూతురు ఆగుతుందో, ఆగదో అని, ముళ్లు మూడూ పడ్డాక...అనుకోకూడదుగాని...ఏ అఘాయిత్యమైనా చేస్తుందేమోనని తాను చాలా భయపడింది.

కాని భూషణ అలాంటిపనేమీ చేయ లేదు. సుగుణవంతురాలు. తన బిడ్డ కాదూ?

"మేమందరమూ మా కాలంలో ఇలా ఏడ్చా మంటే" అనితను రెండు కళ్లనిండా అశ్రువర్షం కురిపించగానే, మళ్లీ కమల నోరు తెరచి ఏమీ వ లేదు పాపం.

ఇన్నాళ్లకి వ్వాళ మళ్లీ కమల కంఠ వీణలో ఈ అపశ్రుతి వినబడింది.

"కమలా?"

............

"ఏమిటే అమ్మా...చెప్పు నాతో...మళ్లీ మానేశావేం..."

"ఏం లేదు...నువ్వు ఉత్తరాలు... ఉత్తరాలు అంటున్నావే...ఆ ఉత్తరాలు చూస్తే నవ్వాలో, ఏడవాలో తెలియట్లేదు...ఎవరుచెప్పారమ్మానీకు... ఆయనకు ఒక్క వాక్యం వ్రాయటం కూడా చాత కాదు."

"ఆ! ఏదో తోచింది వ్రాశాడు...నువ్వంటే అతనికి బాగా ప్రేమ...మోజు అదే...ఆ అనురాగమే కావాలి."

అని అంది స్వరంలో ముఖంలో ఉత్సాహాన్ని, సంతృప్తిని ప్రదర్శిస్తూ.

కమలముఖం చిన్న బుచ్చుకొంది. ప్రేమ.. మోజు అన్న మాటలకు సిగ్గుపడ్డది.

కళ్లు మరీ కాంతి హీనంగా ఉన్నయ్.

తల్లి ఏదో పని ఉన్నట్టు అక్కడనుంచి వెళ్లి పోయింది. ఆమె ముఖంలోని వ్యాకులత కమల గ్రహించింది. ఈ వృధా చర్చలవల్ల తను మనస్సును వ్యథపడుచుకోటమే అని కమలకు తెలుసు కాని కిందటి ఉత్తరం చదివినప్పటినుంచీ, ఆమెలో నిగ్రహశక్తి సన్నగిలిపోతోంది. వాక్యానికి నాలుగు తప్పులు.. అర్థంలేని, తెలివి తక్కువ వ్రాత... అబ్బా! గుర్తు తెచ్చుకోకుండా ఉందామన్నా కూడా ఆ ఉత్తరం, ఆ వాక్యాలు, ఆ మాటలు పదేపదే మనస్సులో స్ఫురించి, తన గుండెపై రాయి పెట్టినట్టుంది. ఉత్తరమే కాదు...కాపురం చేసివచ్చిన నెల్లాళ్లు...ఎలా మరచిపోతుంది?

ఆ మూర్ఖత్వం...ఆ సావాసాలు...ఆ రాక్షస ఆవేశం! తుపానులు వచ్చి చెట్టుచేమ నాశనమై పోతుందంటారు. కాని ఒక్కొక్క రాక్షస ఆవేశం హృదయంలో, శరీరంలో చేసే నాశనంముందు ఈ తుపాను నాశనం ఎంత? తుపాను మృత్యు స్పర్శ సోకినచోటకూడా పక్షచెట్లు మళ్ళీ చిగురిస్తయ్. కాని ఇక్కడ...కేవలం ప్రకృతియొక్క ఛాయా ధూమమే సర్వాన్నీ దహించి వేస్తుంది. పురుష సాంగత్యం స్త్రీకి గర్వమనీ, అవసరమనీ అంటారు. కాని...తను మళ్ళీ ఆ అభిప్రాయాన్ని నమ్ము తుందా? భయం అంటే ఏమిటో ఇదివరకు ఎక్కువ తెలియదు. కాని ఇప్పుడు భయం తన అణువు అణువున మెదులుతోంది. చిన్న పిల్లలకు బూంగ, బూచాడు వస్తున్నాడని చెప్పి, బెదిరిస్తారు. తన లాంటి వాళ్ళకు, అదిగో...మీ ఆయన వస్తున్నా డంటే చాలు...అంతే...అంతే...

అబ్బా! ఎలా గడచిపోయినయ్ ఆ నెల్లాళ్లు... సూర్యుడు కాళ్ళకు సంకెళ్లు అడ్డపడ్డట్టు కదిలే వాడు...కన్నీ రెండిన కన్నులా ఉన్న ఆకాశంలో.. పది హేనురోజులు ప్రవాసంఉండి, చంద్రుడు శూన్యగృహానికి వచ్చేవాడు. చిన్నప్పుడు వెన్నెల చూసి తాను గంతులు వేసేది. పాడేది. అల్లరిచేసేది. గోలచేసేది. నిజం చెప్పాలంటే మూగవానికి నోరు వచ్చినట్టుండేది—వెన్నెల చూడంగానే! పిచ్చే... ఏమిటో అంత ఉల్లాసంగా ఉండేది.

కాని ఇప్పుడు...ఇప్పుడు...ఈ తొలిరాత్రు ల్లోనే...తనకు వెన్నెల...చీకటి ఒక మాదిరిగానే ఉన్నయ్. చెవిటివానికి కోకిలపాటలా, తనకి వెన్నెల!

ఆయన నిద్రపోయేవారు...గుర్రుకూడా బాగా కొట్టేవారు...తాను మూసినకళ్ళలోనే అనేక ఆకా శాల శూన్యాన్ని, చీకటిని చూస్తూ, నిశీథంయొక్క నిష్క్రమణంకోసం వేచేది. రాత్రి వస్తోందంటే పరవశులయే యువతులు లేకపోలేదు. కాని తను... తనూ పరవశమౌతుంది...పర—వశమౌతుంది. అంతే!

ఛీ! లోకంయొక్క అశ్రు ప్రవాహం కేసి ఎంతేని చూడు! నీ హృదయం పునీతమౌతుంది. కాని నీకంటి బిందువులోకి నువ్వు చూడు! అగ్ని కణంలా విస్ఫులింగాలను వెదజల్లుతుంది. ఆ పాద

మస్తకం దెబ్బతిన్న పాములా చుట్టలు చుట్టుకుని, తీవ్రబాధలో తన్ను తానే కాటువేసు కుంటుంది.

* * * *

## 2

"అమ్మాయి..."

.........

"అమ్మాయి..."

"ఆ!"

"ఇదుగో నే...మీ ఆయన గావును ఉత్తరం వ్రాశాడు..."

తల్లి ఎంతో సంతోషంతో ఆ ఉత్తరాన్ని లోపలకు తీసుకెళ్లింది. కమల అందుకుంది...

పతిని చూస్తే పత్నికి సిగ్గు! తొలినాళ్ళు, మలినాడే కాదు...తుదినాటిదాకా... అంతే కాదు... పతి లేఖ ముందు కూడా సిగ్గు గావటం సహజం. అని తల్లికి తెలుసు. ఆమె వెంటనే వసారాలోకి వెళ్లి పోయింది.

అక్కడనుంచి దొడ్లోకి వెళ్లి ఆవుకు మేత వేసింది. పాదులకేసి చూసింది. తీగెలను పందిరికి పాకించాలనుకుంది. కాని ఊహు...తోచ లేదు... కిందటి ఉత్తరం కూతురికి తృప్తిగా లేదు. ఈ ఉత్తరం తృప్తిగా వ్రాశాడేమో...

తీగెలను అలాగే గాలిలో వదిలేసి, గబగబా లోపలకు వచ్చింది. కమల సావిట్లోనే కూచుంది. ఉత్తరం చదవలేదు. వేళ్ల మధ్య ఉంది.

"అల్లుడు, వాళ్లు...కులాసా?" అని అడిగింది తల్లి.

"ఆ!" అంది కమల.

కూతురి ముఖంలో తానూహించిన తృప్తి లక్షణాలు గోచరించలేదు.

"మరింకేమి వ్రాశాడే?"

............

"ఏం...కోపంగా వ్రాశాడా?"

"ఎబ్బే"

"మరి..."

"ఆయన వ్రాయలేదే ఉత్తరం"

"మావయ్య వ్రాశాడా?"

"ఎబ్బే"

"మరెవరే"

తమకు ఉత్తరం వ్రాసేవారెవరింకా అని ఆలోచిస్తోంది తల్లి.

"దస్తూరి ఆయనదే...సంతకమూ ఆయనదే"

"మరి"

"మరి...మరి ఏముంది అమ్మా...ఆ సావాస గాళ్లలో ఎవడిచేతో..."

కమల గొంతుక బిగుసుకుపోయింది. ముఖంలోకి ఒక్కసారి గుప్పున రక్తం చిమ్మి, మళ్లీ వెంటనే పాలిపోయింది. పెదవులను దూసుకుంటూ వెలువడింది నిట్టూర్పు. తల్లి ఇంకేమీ అడగలేదు. లోపలనుంచి సముద్రంలా పొంగి వస్తున్న అయోమయ దుఃఖాన్ని అణుచుకోలేక, లోపలింట్లోకి వెళ్లిపోయింది.

ఒక్కగా నొక్క కూతురు. కొడుకూ, కూతురూ కూడా కమలే. పొట్టలో పెట్టుకొని పెంచుకుంది. తన దౌర్భాగ్య శూన్య జీవితానికి పిల్ల పెరిగి, ఒక ఇంటిదై సుఖపడటమే నోముగా తలచింది. కాని... కాని...

.............

భోజనాలముందు కమల ముక్త సరిగా చెప్పింది.

"ఎల్లుండి...వస్తారుట...అల్లుడు."

"మరి ఇంకా చెప్పవేమే!" అంది తల్లి, ఉత్సుకతతో.

లోతవుతున్న నైరాశ్య విచారాల్లోంచి తల్లికి దారి చిక్కినట్టుంది. అల్లుడు వస్తున్నాడు! ఇల్లు వాకిట్లు దులిపించాలి...అలికించాలి...ముగ్గులు వేయాలి...పక్క ఇల్లాలినడిగి మినప్పప్పు...అల్లుడికి గారెలంటె మహా ఇష్టం...పెరుగు తెప్పించాలి...

చేతినిండా పని...మనసు నిండా ఆలోచనలు...ఇంతకు మునుపే ఆమెకంతా అగమ్య గోచరంగా, విచారంగా ఉంది. కూతురిగతి ఏంకాను? ఎక్కువ మాట్లాడకపోయినా, మనస్సు గల పిల్ల కూతురు అని తెలుసు. ఇలా ప్రశ్నించి. తర్కించుకొనే కొత్తకోడలు కాపురం ఏలా చేసుకుంటుంది? ఏమవుతుంది? ఈ యథార్థ, నిష్ప్రయోజక ప్రశ్నలతో ఆమె సతమతమౌతోంది.

అల్లుడు వస్తున్నాడనే విషయంలో ఈ చీకట్లు అన్నీ తొలగిపోయాయి. ఈ దైనందిన, జీవిత వ్యవహా

రాలు జీవికి ప్రాణం. ఈ వ్యవహారాలు వలలు పన్నక, జీవిని జీవికే వదలివేస్తే, ఉరిస్తంభాలమధ్య ఊగిసలాడుతూ ఉన్నట్టుంటుంది.

భయంకరమైన జీవిత రంగస్థలంపై ఈ తెఱ లేకపోతే, ఎప్పుడో నాటకం ఆఖరి అంకానికి వచ్చేది. వీటి చాటునే జీవి జీవితానికి, కంటపడ కుండా తప్పుకుంటాడు. జీవితం మరొకక్షణం దుర్భరం, అనర్థం అనిపిస్తుంది. కాని...ఏదో...ఒక పని. ఒక విషయం...తలెత్తి చేతులుచాచునిన్ను ఆ అగాధ పుటంచునుండి, ఆ భయంకర హానంనుండి మళ్లీ సముద్రంలోకి, కోలాహలంలోకి లాక్కుపోతయ్. నిర్విచారంగా మళ్ళీ కొత్త ఉద్రేకంలో, కొత్త సంరంభంలో లీనమైపోతాం...అవి క్షుద్రంగా కన్పించవచ్చు. లెక్కలేనివి కావచ్చు. కాని మృత్యు పాశాలనుంచి విడదీసి జీవితానికి పాశబద్ధం చేసే పటుత్వం వాటికుంది. అందుకనే జీవి ఎప్పుడూ కొత్తకొత్త వ్యాపకంకోసం చేతులు చాస్తూ ఉంటాడు.

ఇప్పుడు కమల తల్లికి అల్లునిరాకతో మళ్ళీ ప్రాణం వచ్చింది. అగాధమనుకున్న చోట మళ్ళీ దారి దొరికింది.

కాని కమల సరిగా భోజనం చెయ్యలేదు. అసలు కొన్నాళ్ళనుండి, ఏదో అలవాటుగా తప్ప, కావాలని తినటం లేదు.

* * * *

## 3

అల్లుడు వచ్చాడు. కమల తల్లి అందల మెక్కింది. ఇల్లంతా అలికించి, సింగారించింది. బడి పంతులుగారిని బతిమాలి, బామాలి కూసాలూడు తున్న పాత కుర్చీ ఒకటి తెచ్చింది.

ఇంట్లో పని అంతా తాను నిర్వహించుకుంటా నని కూతురికి భావార్థంగా చెప్పింది.

అతను వచ్చేటప్పటికి పొద్దు వాలబోతోంది.

కమల అతని వెనక బండిలోంచి ఇంకో వ్యక్తి ఎవరైనా కూడా దిగుతున్నారేమో ననుకుంది. కాని భర్త ఒక్కడే వచ్చాడు. నాడెం...ఏ స్నేహితు డినో వెంటబెట్టుకొని తీసుకురాలేదు.

ఒక సంచీలోంచి కూరలు తీశాడు ఇంటల్లుడు. కొట్టు అపది తూకంలో, బేరంలో దగా చేయాలని ఎంతో ప్రయత్నిస్తే, ఆ పద్మ వ్యూహాన్ని తను విచ్ఛిన్నం చేసి, ఆ మనిషికి కనుబడకుండా నాలుగు వెంకాయలు కొసరు తీసుకొన్నట్టు సగర్వంగా చెప్పాడు.

కమల కూరలతో వెళ్లబోగా ఆమె చేతులు పట్టుకొని "ఇదిగో...చూశావా... మల్లెపూలు... బొడ్డు మల్లెపూలు" అన్నాడు, చేటంత ముఖం చేసు కొని. అతని కళ్లలో కాంక్షా సర్పం వేయి పడగలు విప్పుకొని తనకేసి చూస్తోంది...బుసకొట్టుతోంది.

కమల తల్లి అన్నం వడ్డించి అల్లుడి నెన్నో సంగతులు అడిగింది. పంటలు ఎలా ఉంది, ధరాలెలా ఉందీ...అన్నీ వివరంగా అడిగింది.

ఇటీవలనే ఒక గేదె ఈనినట్టు, ఇంకో నెల్లాళ్లలో ఇంక రెండు గేదెలు ఈనేట్టున్నవని చెప్పి అత్తగారిని కూడా రమ్మని ఆహ్వానించాడు.

అల్లుని ఆదరంతో అత్తగారు కొండెక్కింది. "అమ్మాయి...ఎక్కడే... నెయ్యి వడ్డించు"

అని పిలిచింది తల్లి.

కమల సావిట్లో గోడకానుకునే కూర్చున్నా, జవాబు చెప్పలేదు. భోజనం ముందు జరుగుతున్న చర్చ ఆమెకు వినబడ్డంలేదు. హఠాత్తుగా జ్వరం వచ్చి నట్టుంది.

అల్లుడు భోజనం ముగించి గదిలోకి వెళ్లాడు.

"ఏమే... అమ్మాయి... అతను భోంచేస్తున్నంతసేపూ ఇటు రానేలేదేమే..." అంది తల్లి.

"పక్క వేస్తున్నానే" అంది కూతురు.

ఈ జవాబుకి తల్లి సంతోషించింది. పగటి వెత లన్నీ రాత్రిశయ్యపై మటుమాయమవుతయ్. చీకట్లోని ఈ మహత్తులో ఆమెకు ఎక్కువ నమ్మకం. తన భర్త పగలల్లా ధూం ధాం చేసి, తాను రాత్రి వంటింటి తలుపులు వేసిన నడవలోకి వచ్చేటప్పటికి ఎంతో ప్రసన్నంగా ఉండేవాడు.

కమల భోంచేసి నడవలో కూర్చుంది.

"అల్లుడి కేమన్నా కావాలేమో గదిలోకి వెళ్లు" అంది తల్లి. కమల ఏమీ మాట్లాడ లేదు.

# శ్రీ అవనీంద్రనాథటాగూరుతో నా పరిచయం

శ్రీ తేజోమూర్తుల
కేశవరావు

★



కలకత్తా ఆర్టుస్కూలు ముఖ్యోపాధ్యాయులుగా ఉన్నప్పుడు.

రతీయ చిత్రకళాపితా మహుడు అవనీంద్రనాథ టాగూరు అస్తమించాడు. అతనితోనే భారతీయ చిత్రకళా ప్రపంచంలో ఒక నూతన శకం ఆరంభమైంది. మనదేశంలో ఆధునిక చిత్రకళకు అతడే పునాది వేశాడు.

బ్రిటిషు ప్రభుత్వం వచ్చిన తరువాత మన జాతీయకళలన్నీ నశించగా మన దేశీయులు పాశ్చాత్యచిత్రాలనే అనుసరించే సమయంలో అవనీంద్రుడు మన ప్రాచీనకళా సౌందర్యాన్ని అవగాహన చేసికొని నాటిద్వారా చిత్రకళలో మార్పును ప్రవేశపెట్టినాడు.

ఇతని ఉద్యమానికి చేయూతనిచ్చి విదేశాలలో మన కళల ఔన్నత్యాన్నిగురించి చాటించినవాళ్లు ఆనంద కుమారస్వామి, ఇ. బి. హావెలు.

ఒకసారి శ్రీ రవీంద్రుడు అవనీంద్రునిగురించి ఇట్లన్నాడు. *'This one man has changed the world of art. He has revolutionized the taste of the country. His countrymen were strictly against him but he bravely faced all the difficulties and changed the atmosphere.'*

అవనీంద్రుడు పాశ్చాత్యశైలిలోనే చిత్రకళను ఒక ఇటాలియన్ శిల్పియొద్ద అభ్యసించాడు. విద్యాకాలంలోనే తన ప్రతిభకు తార్కాణంగా మనిషి సైజు రూపచిత్రం (*Life size portrait*) ఒకటి నూనెరంగులలో ఒక గంటలోనే పూర్తిగావించాడు. అది నేటికి అతడు చిత్రించిన రూపచిత్రాలలో గొప్పదిగా ఎంచబడుతూంది. తరువాత చాలా కాలం ఆతడు కలకత్తా చిత్రకళా విద్యాలయానికి వైసుప్రిన్సిపాల్ పదవి వహించాడు. ఆ కాలంలోనే ఆతనికి ఒకరు కొన్ని ప్రాచీన రాజపుత్రచిత్రాలు బహూకరించారు. అవి చూచిన తరువాత, అతనిలో చైతన్యం కలిగి రాజపుత్ర మొగలాయి చిత్రాలు, అజంతా, బాగ్ చిత్రాలు, భారత్, సాంచీ, అమరా

వతీశిల్పాల సాంప్రదాయాన్ని అనుసరించి చిత్రాలు చిత్రిస్తూవచ్చాడు.

సుప్రసిద్ధ జపానీ కళావిమర్శకుడు ఒకాకురా (*Okakura*) మనదేశం వచ్చినప్పుడు అవనీంద్రుని అతనిశిష్యుల చిత్రరచనాశైలిని మెచ్చుకొంటూ తాను విదేశాలలో ప్రచారానికై తెచ్చిన సైనా జపాను చిత్రాలు చూపించి అతనిని ప్రోత్సహించాడు. అతడు అవనీంద్రునితో మాట్లాడుతూ '*We in Japan have mastered the brush, but We look to India for ideas*' అన్నాడు.

ప్రాచ్య చిత్రకళయొక్క అభివృద్ధిని చూచిన తరువాత అవనీంద్రుడు ఆతని శిష్యులు అనేక నూతన మార్గాలలో చిత్రించడం మొదలు పెట్టారు. అవనీంద్రునికి శిష్యులనేకు లున్నారు. వారిలో ముఖ్యులు శ్రీ నందలాల్ బోసు, అసిత్ కుమార హల్దారు, వెంకటప్ప మొదలైనవారు. శ్రీ నందలాల్ బోసు వారికి అత్యంత ప్రియులు. వారిద్దరిది శ్రీ రామకృష్ణ పరమహంస, వివేకానందుల సంబంధం వంటిది.

చిత్రకళావ్యాపనకై ఇండియన్ సొసయిటీ ఆఫ్ ఓరియంటల్ ఆర్టు అను సంస్థను నెలకొల్పి దాని ద్వారా చిత్రకళా ప్రదర్శనాలు జరుపుతూ వచ్చారు. ఆ సంస్థద్వారా ప్రసిద్ధ కళా విమర్శకుడు శ్రీ బి. సి. గంగూలీ "రూపం" అను లలిత కళావిషయక పత్రికను కొన్ని సంవత్సరాలు ప్రచురించినాడు.

**1918** లో శ్రీ రవీంద్రుడు విశ్వభారతిలో కళాభవనం స్థాపించినప్పుడు అవనీంద్రులు నందలాల్ బోసును దానికి ప్రిన్సిపాల్ గా పంపారి. **1922** లో మచిలీపట్టణంలో ఆంధ్రజాతీయ కళాశాలలో భారతీయ చిత్రకళాశాఖను నెలకొల్పినప్పుడు శ్రీ ప్రమోదకుమార చటర్జీని పంపారి. శ్రీ చటర్జీగారు జాతీయకళాశాలలోని వున్న నాలుగు సంవత్సరాలలో అవనీంద్రులు కళాశాలలోని చిత్రకళావిద్యార్థుల కృషిని ప్రోత్సహిస్తూ వచ్చారు. తరువాత ఆయన కళాశాల అధికారుల అనాదరణవల్ల కళాశాలలోని చిత్రకళాశాఖ ఎత్తివేయబడిందని విని చాలా విచారించారు.

**1941** లో రవీంద్రుని తుదికోరిక ననుసరించి శాంతినికేతనంలో అవనీంద్రుని డెబ్బదవ జన్మదినోత్సవం అతి వైభవంగా జరిగింది. అతని చిత్రాలు కథా రచనలు ప్రదర్శించారు.

శ్రీ రవీంద్రుని అనంతరం అతనిని విశ్వభారతికి అధ్యక్షునిగా నియమించిరి. క్రమేణ అనారోగ్య కారణాలవల్ల ఆ పదవివదిలి ఆతడు కలకత్తా సమీప గ్రామంలో విశ్రాంతి తీసికొంటూ వచ్చెను.

ఆ వార్ధక్యంలో ఆతడు దృష్టి లోపించినా కూడా కొయ్యలు, మేకులు, అగ్గిపుల్లలు మొదలైన వాటితో అద్భుతమైన బొమ్మలు (*toys*) తయారు చేస్తూ వచ్చెను. ఆ బొమ్మలను ఏదైనా అంతర్జాతీయ ప్రదర్శనంలో ప్రదర్శించినట్లయితే నవీనతకు హాస్యానికి, ఉన్నత భావాలకు అగ్రస్థానం లభిస్తుందంటారు. అవనీంద్రుడు పురాణగాథలే కాక జీవిత సమస్యలు, ప్రకృతి దృశ్యాలు యింకా మేఘదూత, ఉమరుఖయ్యాం రవీంద్రునికథలకు చాలా చిత్రాలు, చిత్రించారు. ఆతడు గొప్ప కథకుడుకూడాను. కథలు చిన్నవి, పెద్దవి, బాలసాహిత్యం, *prose-poetry* మొదలైనవి చాలా రచించారు. ఇటీవల కొన్ని ఇంగ్లీషులోనికి అనువాదింపబడినవి.

"హనుమంతుని డైరీ" అనే పేరుతో హాస్యయుతంగా రామాయణగాథను, "జోరాశంకేర్ ధారే", "ఘరోగల్ప" అనేవాటిలో స్వీయచరిత్రను వ్రాసుకొన్నారు.

వాటిలో తాను చిన్నప్పుడు శ్రీ రవీంద్రునితో కలిసి ఆడిన నాటకాలు, ప్రారంభించిన ఉద్యమాలు గురించి పేర్కొన్నారు. భారతీయ చిత్రకళను గురించికూడా కొన్ని పుస్తకాలు రచించారు. విద్యార్థులు చిత్రకళను ఎట్లు ప్రారంభించవలెనో తెలుపుతూ "సహజోచిత్రశిక్ష" అనే ఒక చిన్న పుస్తకం 5, 6 సంవత్సరాలక్రితం అచ్చువేసిరి. నేను శాంతినికేతనంలో వున్నప్పుడు ఒకసారి ఆయన అక్కడికి వచ్చి మూడురోజు లున్నారు. అంతకుపూర్వం ఆయన అక్కడకువచ్చి ఏడెనిమిది సంవత్సరాలయినదట. గొప్పగా సన్మానం జరిగింది. మనదేశంలోనే గాక ప్రపంచంలో ఏయేదేశాలలో చిత్రకళలు ఎట్లు వృద్ధిఅయిందీ వాటి మార్పుగురించీ చాలా విషయాలు మాట్లాడారు.

మొదటిదినం ఉదయం కళాభవనంలో విద్యార్థులు చిత్రాలువేసే గదులు ఒక్కొక్కటే చూస్తూ

నా గదికి వచ్చారు. అప్పుడు నేను ఒక సంతాల్ కుటుంబం బొమ్మఒకటి పూర్తి చేస్తున్నాను. అది చూచి వెంటనే కూర్చొని 'ఇన్ని రంగులు కలిపావ్, బొమ్మలో ఒకటే కనబడదే, చూడు నీవు కలిపిన రంగులన్నీ ఇప్పుడే ఖాళీచేస్తా'నంటూ కుంచె తీసికొని బొమ్మమీద కొన్నిరంగులు వేసినారు. వేస్తూ నా వంకతిరిగి "*What do you think of Colouring? It is like cooking.*" అని అంటూ వంటలో ఒక కమ్మనిపదార్థం చెయ్యాలంటే అన్ని దినుసులు దానిలో సరిగా వేస్తేనే అది రుచిగా వుంటుంది. అట్లే బొమ్మకు రంగులువేయడమున్నూ అన్నారు.

గదులన్నీ చూచి బయటికి వస్తూండగా కలకత్తా చిత్రకళా విద్యాలయంనుంచి ఇద్దరు విద్యార్థులు ఎదురుగా వచ్చి నమస్కరించారు.

ఆయన మీ రెవరని అడుగగా *Still life class students* మని అన్నారు. వెంటనే ఆయన *What do you mean by still life? Life is not still. Life is moving. Are you studying dead life?* అని అంటూ ప్రకృతినుంచి ప్రత్యక్షంగా నేర్చుకోనేదానికీ క్లాసు గదులలో కోసిన పువ్వులు కాయలు వ్రాసినదానికి తేడా తెలుపుతూ చాలా సేపు మాట్లాడారు.

ఆ సాయంత్రం చిన్నపిల్లలకు కథ చెప్పారు. అది వినుటకు శాంతినికేతనంలోని ఉపాధ్యాయులు చాలామంది వచ్చారు. ఆ కథ ఆదినం పూర్తికాలేదు. మరునాడు సాయంత్రం కూడా చెప్పిరి.

అప్పటికప్పుడు కథ సృష్టించి పిల్లలకు ఎంతో ఉత్సాహకరంగాను హాస్యకరంగానూ చెప్పడంలో ఆయన చాలా సమర్థుడు. ఆ కథను శ్రీ రవీంద్రుడు కూడా రెండవదినం వచ్చి విని 'అబనీ'వలె ఇంత చక్కగా కథ చెప్పగల సమర్థత నాకు లేదనిరి.

ఒకసారి నేను కలకత్తాలో శ్రీ అవనీంద్రుని దర్శించుటకు వెళ్లితిని. సామాన్యంగా అవనీంద్రుని వద్దకు పోయినప్పుడు ఎవ్వరుకాని చిత్రకళా విద్యార్థులు తాము వేసినబొమ్మలు కొన్ని తీసికొని వెళ్ళకుండా వుండరు. ఆ బొమ్మలు చూపించినప్పుడే చిత్రకళావిషయమై ఆయన ఎన్నో విషయాలు తెల్పుతారు.

నేను వెళ్లినప్పుడు ఆయన తన పూర్వభవనంలో (రవీంద్రుని జోరాశంకోభవనానికి ఎదురుగా) వుండే వాడు. పైన మేడమీద హాలు అతడు సేకరించిన ప్రాచీన రాజపుత్ర మొగలాయిచిత్రాలు, చీనా, జపానుదేశపు ప్రఖ్యాత చిత్రకారుల చిత్రాలు. కొన్ని ఆధునిక చిత్రాలు యింకా కొంత ప్రాచీన వస్తుసామగ్రితో అలంకరింపబడివుంది.

హాలు వెనుక వరండాలో వరుసగా అవనీంద్రుడు అతని ఇద్దరి సోదరులు సమరేంద్ర, గగనేంద్రనాథ టాగూరుగార్లు కూర్చొనే సోఫాలు, వాటిప్రక్క హుక్కా అమర్చబడివున్నాయి. అవనీంద్రుడు, అతని అన్న గగనేంద్రుడు మాత్రమే చిత్రకారులు. వారిద్దరి సోఫాలప్రక్క సంతపు పెట్టెలతో రంగులు, కుంచెలు వగైరా వున్నాయి.

ఆ దినం అవనీంద్రులు ఒక్కరుమాత్రం కూర్చొని కొన్ని ఎండుటాకులు పోగుచేసుకొని ఒక్కొక్కటే చూచి వ్రాస్తూవున్నారు. ఆయన నన్ను చూచి "ఎండిపోయిన ఆకులలో ఏమి అందం వుందని అలక్ష్యం చేస్తాం. వాటిలో ఎన్ని కొత్త స్వరూపాలు గోచరిస్తున్నాయో చూడు' అన్నారు.

ఒక పుస్తకంనిండా వారు వ్రాసినవి కొన్ని జంతువులు పక్షులమాదిరివి చూపారి. తరువాత ఆయన నేను వేసిన బొమ్మలు చూస్తూ ఒక నలుపురంగులో (*black and white*) వేసిన ప్రకృతిదృశ్యాన్ని తీసి ఇట్లన్నారు. "రంగులలో బొమ్మలువేయడంకన్న ఒకే రంగులో బొమ్మవేయడం చాలా కష్టం. మన దేశంలో మా అన్న గగనేంద్రనాథ టాగూరు తప్ప యింకెవ్వరు ఈ పద్ధతిలో ఇప్పటివరకు కృతార్థులు కాలేదు."

మరొకసారి వారిని దర్శించుటకు పోయినప్పుడు ఒక ప్రకృతిదృశ్యం (*Landscape*) వేస్తున్నారు. నేను అది పూర్తిఅయ్యేవరకు వుండి చూడాలనివుందన్నాను. ఆయన సరేనని మధ్య మధ్య రంగులు అరగ తీస్తు వుండమన్నారు.

రంగుల సమ్మేళనం చెయ్యడంలోను *texture* తీసికొని రావడంలోను అవనీంద్రుని మించినవారు లేరు. వారితో సమానులు ప్రపంచంలోనే ఏ ఇద్దరో ముగ్గురో వుంటారు. ఎటువంటి *effect* నయినా రంగులలో అతి సులువుగా తేగలడు. బొమ్మ పూర్తి అయింది.

నేను ఏదైనా బొమ్మ ప్రారంభిస్తే అది అను కొన్నట్లు రాదని నన్ను గురించి చెప్పుకొన్నాను.

ఆయన పాశ్చాత్యులు రంగులలో ప్రకృతిని ఎట్లా చూచేది మన పూర్వులు ఎట్లా చూచిందీ తెలుపుతూ ఇట్లన్నారు. "చాలకాలం క్రితం నేను ఒక సారి ఇక్కడి జంతుప్రదర్శనశాలకు (Zoo) వెళ్లాను. అక్కడ గర్జిస్తూవుండే ఒక సింహాన్ని చూస్తూ చాల సేపు నిలబడ్డాను. ఆ తరువాత ఎర్రగా భయంకరమైన సూర్యాస్తమయంలో బంధింపబడి గర్జిస్తూవుండే సింహాన్ని చిత్రించాలని నాకు బుద్ధి పుట్టింది. ఆ రాత్రంతా నాకు సరిగా నిద్ర పట్టలేదు. సింహగర్జనలు నాలో ప్రతిధ్వనిస్తూ వున్నాయి. ఉదయం బొమ్మ రంగులలో ప్రారంభించాను. చివరకు ఆ బొమ్మ నా చెడిపోయిన బొమ్మలలో జమకట్టి పార వేశాను. అది ఎప్పటికైనా సరిగా వేయాలనే కోరిక మాత్రం నిలిచిపోయింది." అన్నారు.

తరువాత మాట్లాడుతూ ప్రస్తావనలో మైకెలాంజిలో జీవితం చదివినావా అని నన్ను అడిగినారు. లేదన్నాను. "అతడు ఒక మహా కళాతపస్వి. పాశ్చాత్యదేశాలలో అంతటివాడు తిరిగి జన్మించనే లేదు" అని అతని గురించి చెప్పుతూ ఆయన ఆవేశంతో "*you must be like hungry wolves and tigers for Art. Devour what ever you see* అంటూ ప్రారంభించారు.

ఎంతసేపు మాట్లాడారో ఎప్పుడు చీకటి పడిందో తెలియదు. ఆయన తమ్ముడు సమరేంద్రనాథ టాగూరు వచ్చి "అబనీదా, టైం ఎంతయిందో తెలుసా? ఈ అబ్బాయి చాలా దూరం పోవాలి కాబోలు" నన్నారు.

ఆ గంభీరమైన ఉపదేశంనుంచి ఉన్మత్తునివలె లేచి వారికి నమస్కరించి శెలవు తీసికొన్నాను.

అవనీంద్రులు స్మరణకు వచ్చినప్పుడంతా ఆనాడు అతను ఇచ్చిన ఉత్తేజకరమైన బోధ నాలో ప్రతిధ్వనిస్తూ వుంటుంది



అవనీంద్రులు గీచిన ఒక స్కెచ్.

# శిథిలాశ్రమము



శ్రీ దిగుమర్తి సీతారామస్వామి

అది మిథిలా మార్గమున గౌతముని శిథిలాశ్రమము—పూర్వగాథ నెఱుగకయు రామచంద్రుని హృదయము ఆ స్థలమునందు సంపగ నేతావి తలపుల నాందోళించినది. అప్పటి రాఘవ విశ్వామిత్రుల సంవాదము ఈ ఘట్టమునందలి విషయము.

## రాఘవుఁడు

ఈ శిథిలాశ్రమమ్మున ననేక వసంతము లేచి పూచియా
పైశపియింపఁ బడ్డవో—విపన్నము లీద్రుమముల్ హిమాగమ
శ్రీశయనించియున్ మధువశీకృతముల్ బలె నామతించు-ది
వ్యాశల నెవ్వరీ యెడల నార్ద్రసుఖంబులు కొల్లవెట్టిరో!

సుభగమ్ములైన యేత్రిదివసుందరు పాద పయోజ ముద్రలో
విభవము కోలుపోయిన పవిత్ర ధరిత్రికి రక్తరేఖలై
యభయమొసంగ నేటి కిసుమంతయుఁ గగ్గవు నిట్టివాని రా
క భరిత మోదముల్ జడిమగాంచిన వేతను భావమంజిమల్.

ఇటనేదో యొకప్రేమగాథ తొలినాడే భగ్నతంత్రీ గుణా
స్ఫుట నాదమ్ముల మూగవోయినది కాఁ బోలున్-శిలావేదికల్
రటదంతఃకరణమ్ములట్లు పథికవ్రాతమ్ము నాందోళన
త్రుటితశ్వాసులఁ జేయుఁ - బాడ్వడిన దేదో స్వర్గమే యీ యెడన్॥

ఎవఁడో భగ్నమనస్వి క్రోధవశుఁడై యిచ్చోఁ దపఃస్వాపతే
య వినాశమ్మునకోర్చి ధాతృసృజనా హ్లాదప్రదైకైక వా
స్తవతాఘస్మర వాక్ప్రవక్తృత నె ద్రష్టంగా దనున్ మెచ్చఁ బో
లు-వణంకున్ లతలిప్డు తద్ధ్వనికళల్ పోషించు వాత్యార్భటిన్॥

## విశ్వామిత్రుడు

తగునోయీ రఘువంశవర్ధన! యథార్థం బూహలందందుకొం
టి గత స్పందనముల్ ధ్వనించుకొను నీ డెందంబు నిన్నెంతయుం
బగటున్ గారణజన్ముగా-శిథిల రమ్యంబైన యిచ్చోఁ బురా
ణగతాబ్దంబులు గౌతమాశ్రమముగా నవ్యోన్నతిన్ సొంపిలున్॥

ఆతఁడు జ్ఞాని - చూపరుల కాతని దర్శన మాత్మశాంతిదం
బైతనరున్-దదీయమగు ఖ్యాతికి మాత్రము ధర్మదారయే
హేతువు-రూపరేఖగల యింతిని దానిని గాంచు కోర్కెఁగా
మాతురుఁ డెవ్వఁడో యొకఁ డహర్నిశ మొందెడు నాతిధేయమున్.

అది దుర్మేధ-గృహాక్రతూత్సవము లందాహూతుఁడౌ దేవరా
జుఁదతప్రౌఢరతక్రతుప్రియునిగాఁ జొక్కింపఁగా నెంచు-న
త్రిదివేంద్రుండును లెస్సవాఁడగుట మారింబోయెఁ దత్సంగమ
ప్రదకాలజ్ఞత-కొమ్మలూడలుగనై వ్యాపించె నీ దుష్కఫల్

గౌతముం డుచితయోగ బలిష్ఠ దేహుండు బ్రహ్మవర్చస్వి భార్యా విధేయుఁ;
డమరేంద్రుఁ డప్సరః ప్రమదోపభుక్తనీరస దేహుఁడయ్యె నీ రమణి కతఁడె
ప్రియుఁడు-శచీదేవి పెండ్లాడి వీనిని హాయిగా సుగపడిపోయె నేమి!
అందుబాటుగ లేనియట్టి కామము మనోహరము నిత్యవసంత సురుచిరమ్ము—
కవుల కిది నాటినుండియు వివిధచిత్ర కల్పనాశక్తి దమ్మొక్క కవుల కనఁగ
నేల-ఆ బ్రహ్మదేవునకే లతాంగి కలల కళ్యాణి-వలపు రెక్కల పటాణి॥

ఒక్క యతిరాజుతపము దురూహ్యమైన యొక్క ఋషికాంతరూప మీయుర్వియందె
భ్రష్టతంగాంచ నాసురేశ్వరున కొదవె వేయికనులు పరాంగనావీక్షకొరకు॥

ఆయెడ నల్లచేసతి శిలాకృతి! ధూర్త నిలింప భర్తయున్
బాయక ధూపదీప కుసుమస్రగుపాస్తి భజించుదీని-భా
ర్యాయుతుఁ జేసి గౌతము గృహస్థత నిల్పుము రాజపుత్ర! ను
న్నాయతి శాపమోచన రహస్యము నిల్పెఁ ద్వదంష్ట్రి ధూళులన్॥

తారకములౌ భవత్పదతామరసపరాగముల్ మేల్కొలుపు క్రొత్తబ్రదుకునందు
పతనహేతువులగు స్వర్గపతి భుజాఢ్యమృగమదామోదముల్ విస్మరింపఁ బడుత!
స్వర్గసీమలు దిగి పారిజాతవీథులందు వాసించు మృదుహిమబిందువులయి
జాలువారెడు కలికి కపోలఫలక బాష్పముల్ మానితాపము బాపుఁగాత!



# విమలకోసం



శ్రీ వజ్ఝల రామనరసింహం

రఘు పిల్లని చూచుకోవడమూ అయింది; పిల్ల రఘుని చూడడమూ అయింది. పెళ్ళి చూపులు అయిపోయాయి.

అయిదేళ్ళవరకూ పెళ్ళి చేసుకోనని భీష్మించుకున్న రఘు ఆ పెళ్ళిచూపుల కెలా ఒప్పుకున్నాడో తనకే తెలియదు. కాని, తండ్రి అయిన శర్మగారు కొంత బలవంతం చేయకపోలేదని అతడెరుగును.

రఘు ఒక వింతవ్యక్తి. చిన్నతనంనుంచీ అతని మనస్సులో పెళ్ళి, పిల్లని చూచుకోవడం, కట్నాలు, మొదలైనవాటిగురించి ఒక విషమైన అసహ్యభావాలు అల్లుకొని వుండిపోయాయి. చాలాకాలంనుండి తన తలిదండ్రులు పెళ్ళి చేసుకోమని తనని బలవంతం చేస్తున్నారు. తన కెన్నో సంబంధాలు వచ్చాయి. ఎందరో కట్నాలు ఇస్తామన్నారు. తను మరి అయిదేళ్ళవరకూ పెళ్ళిచేసుకోనన్నాడు. తల్లి ప్రాధేయపడింది. పిల్లతండ్రి అయిన మూర్తిగారు వత్తిడిచేశారు. తను మౌనంగా వూరుకొని తన విముఖత తెలియచేశాడు. వివాహంగురించి తనకి విచిత్రమైన భావాలు సందేహాలు కల్గుతున్నవి. పెళ్ళి అంటే, ఒక పిల్లని ఒక పిల్లవాడి మెడకి కట్టడం, సంసారభారం వారిద్దరి నెత్తినీ పడేయడం! అయితే, ఈ కట్నాలు, పురోహితులు, లాంఛనాలు, ఇవన్నీ ఏమిటి? ఎందుకు? మిగతా దేశాలలో పెళ్ళిళ్లు ఎట్లా జరుగుతాయి? పెళ్ళి అయాక సంసారాన్ని ఎట్లా పోషించడం? తమ పిల్లలకి పెళ్ళిళ్లు చేయడానికి తలిదండ్రులకీ తొందర, ఆవేశము, పట్టుదల, బలవంతము, ఎందుకో......

రఘులో వున్న ఈ వింతవింత భావాలన్నీ తను పిల్లని చూసేటప్పటికి మటుమాయమైపోయి కూర్చున్నవి. తన మనస్సులో ఇన్నాళ్ళ యీ వివాహానికి వ్యతిరేకంగా పనిచేస్తున్న మహా శక్తులన్నీ ఒక్కమారు ఓడిపోయాయనిపించింది... పెళ్లికూతురు పేరు విమల...రఘుకి ఎదురుగా, చాపమీద విమలని కూచోపెట్టేరు. విమల 15 ఏళ్ళ పిల్ల. కాఫీ కలరు వైట పరికిణీ, సన్నని సిల్కు జాకెట్టు తొడుక్కుంది. తామర రేకుల్లా వున్న ఆమె కళ్లకి కాటుక పెట్టుకుంది. రఘు ఆమెవైపు చూశాడు. ఆమె కొద్దిగా తల వంచుకొని కూచుంది. ఆమె తండ్రి అయిన మూర్తిగారు కూతురుతో అన్నారు:

"అమ్మా! విమలా! కొంచెం తలఎత్తమ్మా" బెదురుతూవున్న లేళ్ళలా, ఆమె కళ్లు ఇటూ అటూ తిరిగినవి. సన్నని పెదిమలు రెండూ కొంచెం చలించాయి. ఆమె నునుచెక్కులు లేసలాదీ ఛాయలను దిద్దుకొన్నవి...ఆమె కళ్ళల్లో ఒక వింత కాంతి వెలిగింది...

రఘు ముగ్ధుడయాడు...కనీసం అట్లా అనుకున్నాడు. ఏదో మధురమైన వింతవస్తువని, తను ఎన్నడూ ఎరుగనిదానిని, అకస్మాత్తుగా కనుక్కొని ఆశ్చర్యపడుతూన్నట్లు విమల వేపు చూశాడు. గదిలో, తనచుట్టూ ఏవున్నదీ అతనికి కనిపించలేదు. ఆ గది వెల్తురులో, కోలని, కోమలమైన ముఖాన్ని కొద్దిగా ఎత్తి తనకు చూపిస్తూ, సిగ్గుతో ముడుచుకుపోయిన కలవపూవులా వున్న విమలని మాత్రమే చూశాడు. ఆకాశంలో మెరుపు మెరిసి, మాయమవకుండా వుండిపోతే, దిగ్భ్రమచెందే మానవుడివలె, రఘు ఆమె వేపు చూస్తున్నాడు. విమలది సామాన్యమైన అందము. ముఖంలో ఒక కాంతివుంది. ఆమె పెద్దకళ్ళలో చంటిపిల్లల అమాయకత్వం, లోకులు తెలియని భావసంపద వున్నవి. ఆమె సన్నటి, పొడుగాటి విగ్రహం గాలిలో పూసలాడే తామరతూడులా వుంది.

ఆమె వూర్వశి కాదు, అనుకున్నాడు రఘు. తెలుగు సినితారలెవరూ అతనికి జ్ఞాపకం రాలేదు. ప్రపంచంలో చాలామంది స్త్రీలు వున్నారని రఘుకి తెలుసు—అందమైనవారు, కురూపులు, ఫాషన్లతో ఠీవిగా నడిచేవారు, సీతాకోక చిలుకల్లా

జడలు సింగారించుకొని వీణంటపోయే కాలేజీ పడుచులు—ఇంకా ఎందరో! కాని, వా రందరిలోను లేని ఒక ప్రత్యేకత విమలలో వుందనుకున్నాడు. వారందరికీ దూరంగా, ఓ ప్రత్యేకస్థానంలో విమల అతనికి గోచరించింది. విమలలోవున్న ఏదో తెలియని ఒక గొప్ప ఆకర్షణశక్తివచ్చి తనను, తన భావాలను ఓడించి వశపరుచుకొంటున్నా దనుకొన్నాడు రఘు.

విమలకు పాటవచ్చును. ఆమెను వీణమీద పాడమన్నారు. విమల వీణవాయిస్తూ, సన్నని మధురమైన గొంతుతో "రాము నీ సమాన మెవరురా" పాడింది. వీణా తంత్రులమీద ఆమె లేతవేళ్లు కదలుతూ సృష్టించిన నినాదాలు గది అంతటా ప్రతిధ్వనించాయి. ఆమె మధురమైన కంఠస్వరం అందరినీ మంత్రముగ్ధులను చేసింది—పాట వినడానికి వచ్చిన పొరుగింటి బామ్మగారినోరు అమాంతంగా తెరుచుక పోయింది. రఘు హృదయంలో వేయి బ్యాండు మేళాలు మ్రోగినవి. ఒక చక్కని పాటలో తనను వశపరచుకొనే శక్తి ఇంతలా వుంటుందని రఘు ఎన్నడూ అనుకోలేదు ... విమల రఘువైపు ఒక్కమారు చూసింది. వారిద్దరి కళ్లూ ఒక్క నిముషమాత్రం కలుసుకొని వుండిపోయినవి...పాట పూర్తయింది. విమల లేచి ఇంట్లోకి వెళ్లిపోతూ రఘువేపు మరోమారుచూసి, గిరుక్కున తిరిగిపోయింది. ఆమె పిరుదులమీద జడ నాట్యంచేసింది. ఏదో దివ్యమైన కాంతి ఒకటి ఆ గదిలోంచి కదలి వెళ్లిపోయిన ట్లయింది రఘుకి.

—రఘు, విమల, ఒకరినొకరు చూచుకోవడం అయింది; పెళ్లిచూపులు అయిపోయినవి—విమల, మూర్తిగారు, వెళ్లిపోయారు.

"ఏంరా నాయనా? ఏమంటావు" అని శర్మగారు కొడుకుని అడిగారు.

"నాకు...నాకు ఏమీ అభ్యంతరం లేదు నాన్నా" అన్నాడు రఘు, సిగ్గుపడుతూ.

శర్మగారు ఆశ్చర్యపోయారు. పెళ్లిచేసుకోనని ఇంకా ఏం తంటాలు పెడతాడో అనుకుంటూవుంటే రఘు నెమ్మదిగా, తనకే అభ్యంతరమూ లేదనడం, ఆయనకి అపరిమితాశ్చర్యాన్ని కలుగజేసింది. పూర్తిగా తన సంతోషం నివృత్తిచేసుకోడానికి శర్మగారు మళ్లీ కొడుకుని అడిగారు:

"అంటే...నీ వుద్దేశం అదేనా, నాయనా? నీకు పిల్ల నచ్చిందన్నమాటేకదూ? కట్నాలనుగురించి, ముహూర్తంగురించి, ఇంక వారికి రాయవచ్చునన్న మాటేనా?"

రఘుని ఒక్కమారు నునుసిగ్గు ఆవరించింది: "ఔను...అలాగే నాన్నా" అన్నాడు, రఘు, తడబడుతూన్న మాటలతో.

వారంరోజులు గడిచాయి.

కట్నాల విషయంలో శర్మగారికి, మూర్తిగారికి భేదాభిప్రాయాలు వచ్చాయి. శర్మగారు రెండువేలకట్నం అడిగారు. మూర్తిగారు అయిదు వందలుమాత్రమే ఇవ్వగలనని, తమ స్థితిని తెలియజేశారు. ఇంత తక్కువ మొత్తం ఇస్తారన్నందుకు శర్మగారు, భార్య, ఎగిరిపడ్డారు.

వెంటనే ఈ సంబంధం వదిలి, తమ కొడుక్కి మరొక సంబంధంకోసం వెతక నిశ్చయించుకున్నారు.

రఘు ఆశ్చర్యపోయాడు! ఇదంతా అతనికి మహా విచిత్రంగా కన్పట్టింది. ప్రపంచమంతే అసహ్యం వేసినట్లయింది. ఈ పెళ్లిచూపులకి తనెందుకు అంగీకరించాడు? "కట్నం పుచ్చుకోవటానికి అవసరం ఏమిటి నాన్నా?" అని తండ్రిని అడగాలనుకున్నాడు. కాని, ఎట్లా అడగడం? తన తండ్రి కెప్పుడూ ఎదురుప్రశ్న వేసి ఎరుగడు. చిన్నతనంనించీ తండ్రి అంటే అతనికి మహా భయభక్తులు వున్నవి... మొత్తానికి ఏమీ అడగలేక పోయాడు. ...ఒకరోజున తల్లితోమాత్రం ఈ విషయమై అన్నాడు:

"అమ్మా! వారు అంతకట్నం ఇవ్వలేనప్పుడు మనం పీడించడం ఎందుకమ్మా" అని.

"అయిదువందలకి మనం ఏమంత కనికిష్టం అయిపోయాంరా? పోతేపోనీ—చాలాదూరపు సంబంధంకూడాను. వాళ్ళ ముఖమూ మొగమూ మన మెరుగనే ఎరుగము" అంది తల్లి.

రోజులు గడిచిపోతున్నవి...

రఘు ఓనాడు పార్కులో కూచుని, చుట్టూ వున్న పూలమొక్కల్ని చూస్తున్నాడు. మల్లె,

గులాబీ, పారిజాతం, వాసనలు వెదజల్లుతున్నవి. రఘుకి ఎన్నడూ పార్కు ఇంత అందంగా కన్పించలేదు... అతని మనస్సులో, ఈనాడు, విచిత్రమైన భావాలు పొర్లుతున్నవి. పార్కు ఇవాళ ఎందుకింత, అందంగా కనిపిస్తున్నది? అనుకున్నాడు రఘు. సౌందర్యం అనేదేమిటి? సౌందర్యాన్ని రఘు అనేక రూపాల్లో —అనగా, ప్రకృతిలో, మానవులలో, గుణాలలో, ఇంకా అనేక వస్తువుల్లో—చూశాడు, అందరూ చూచినట్లే... ఆ విషయంగురించి అతడెప్పుడూ ఇంక తీవ్రంగా ఆలోచించలేదు... ఇవాళ అతని మనస్సు పరిపరివిధాల పోతూవున్నది. సౌందర్యంలో ఆకర్షణశక్తి ఎందుకుండాలి? సౌందర్యానికి విలువ ఏమిటి? ప్రపంచంలో, వస్తువుల మంచి చెడ్డలను కేవలం సౌందర్యంమీదనే ఆధారపడి నిర్ణయించ వచ్చునా... ఏమో... ఏమో...

పార్కు రేడియోలో ఎవరో "రామనీసమాన మెవరురా" పాడుతున్నారు. రఘుకి అప్రయత్నంగా విమల కంఠస్వరం జ్ఞాపకం వచ్చింది. అతని కళ్ళ ఎదుట ఆమె వీణమీద పాడుతున్నట్లయింది. ఆమె ముగ్ధత్వము, అమాయకత్వము, సిగ్గు, అతడిని ముగ్ధుని చేశాయి—పాట ఆగిపోయింది... విమల అతనివేపు క్రీగంటచూసి ఇంట్లోకి వెళ్ళిపోతూవుంది...ఆమె పిరుదులమీద జడ నాట్యంచేసింది... ఏదో గొప్ప కాంతి తన కళ్లెదుటనించి కదలి వెళ్ళిపోతూన్నట్ల యింది... రఘు ఉలిక్కిపడ్డాడు... చుట్టూ చూశాడు... పూలమొక్కలు, బెంచీలు, మనుష్యులూ, ప్రపంచం... రఘు గిరుక్కున తిరిగి ఇంటికి పోయాడు.

రాత్రి, రఘు భోజనంచేస్తూ వుండగా, తల్లి అంది: "గుంటూరులో ఎవరో పిల్లని యిస్తామన్నారురా నాయనా! పిల్లని చూపించడానికి రమ్మనమని రాయమన్నావా?"

"వాళ్లు 2 వేల రూపాయలు కట్నం యీయగలరో లేదో కనుక్కొని మరీ రమ్మంటే మంచిదేమో నమ్మా" అన్నాడు రఘు.

"ఆ వూసెందుకురా నాయనా? పిల్ల నచ్చితే, ఆ తర్వాత కట్నంవూసు అడగొచ్చు"

"పిల్ల నచ్చితే, తక్కువ కట్నానికి ఒప్పుకుంటావా అమ్మా?"

"కట్నంవూసు నీ కెందుకు? ఆ విషయం పెద్దలు, పెద్దలూ కలిసి ఆలోచించుకుంటారు"

"అమ్మా! నేను కట్నాలు పుచ్చుకోవద్దని చెప్పే సంఘ సంస్కర్తని కాను. నా విద్యాగల్గినంత కట్నం పుచ్చుకోవచ్చు. ఎక్కువ ఇమ్మని బలవంతం చేయడ మెందుకు? అదీకాక, నేనింత త్వరలో పెళ్లి చేసుకోనంటూవుంటే, నన్నెందుకు నిర్బంధిస్తారో నా కర్థంకాకుండా వుందమ్మా. ఇంత వేగిరం చేసుకోవాలని నాకు లేదు. ఏదో, ఈ వుద్యోగప్రయత్నం అయేవరకూ ఆగరాదూ?"

"వుద్యోగం కోసం పెళ్లి ఆపడం ఏమిట్రా నాయనా"

రఘు కొంచెంసేపాలోచించి అన్నాడు:

"అమ్మా! నీ యిష్టమయింది చెయ్యండి. అన్నట్లు, నేను రేపు విశాఖపట్నం వెళ్లాలనుకుంటున్నాను. హార్బరులో ఏదో కాళీలు వున్నాయట... కొద్దిరోజులుండి వచ్చేస్తాను."

"సరే నాయనా! ఈ పెళ్లివిషయం ఏమీ తేలకుండా వుంది......"

రఘు మర్నాడు విశాఖపట్నం వెళ్లేడు. ఒక చిన్నగది అద్దెకు తీసుకున్నాడు. హోటలులో భోజనం మొదలుపెట్టేడు.

మొదటి రెండురోజులు రఘు వుద్యోగ ప్రయత్నమేమీ చేయలేదు......ఏమీ తోచనివాడిలా, వూరల్లా తిరిగేడు. బీచి షికార్లు పోయాడు. ఒక్కొక్కమారు బీచిలో రాత్రి 10 గంటలవరకు, ఆ చల్లని తుసారవాయువుల మధ్య కూచుని, తన భావిజీవితాన్ని గురించి ఆలోచించుకొనేవాడు...భోజనం, నిద్ర, కంటె, ఈ ఆలోచనలే అతని కెక్కువ ముఖ్యంగా కనిపిస్తున్నవి మరి! తను కేవలం ఆలోచనల్లోనూ, భావనాలోకాల్లోను ఎక్కువగా విహరించే మనిషని రఘుకి తెలుసు...

ఓనాడు—సాయంత్రం 5-30 అయింది. రఘు బీచిలో పచార్లు చేస్తున్నాడు. బీచికి ఎందరో స్త్రీలు, పురుషులు, పిల్లలు, వచ్చారు...సాయంత్రమయేసరికి విశాఖపట్నమల్లా ఈ బీచివొడ్డునే వుంటుందా అనిపిస్తున్నది....రేడియో సంగీతం వినిపిస్తున్నది...రఘుకి ఏమీతోచక, సినీమాహాలువైపు

నడిచేను... మొదటి ఆట కింకా కొంచం టైమువుంది. రఘు టిక్కట్టు కొనుక్కొని, పైని పచార్లు చేస్తున్నాడు.

కొంచందూరంలో, ఆడవాళ్ళ గేటువద్ద ఒక 15 ఏళ్ళ అమ్మాయి నించునివుంది. ఆమెపక్కనే ఏడెనిమిదేళ్ళ పిల్లవుంది. పచారు చేస్తూన్న రఘు అప్రయత్నంగా ఆగిపోయాడు...రఘు పరిశుభ్రమైన అంతరాత్మకలవాడు; నీతిమంతుడు; అతడే స్త్రీనీ చెడుభావంతో ఇంతవరకూ చూడలేదు. స్త్రీలువుండే స్థలంవేపు అతడెప్పుడూ తిరిగిచూడడు...

కాని, రఘు ఈనాడు తను ఎన్నడూ చేయని పనిచేశాడు—నిలబడిపోయి, ఆడవాళ్ళ గేటువద్దనున్న ఆ అమ్మాయివైపు చూస్తున్నాడు! ఆమె వెనుతిరిగివుంది...ఆమె పొడుగాటి జడకు కట్టిన రిబ్బను ఆమె పిరుదలమీద మెల్లిగా వూగుతూ, నాట్యం చేస్తున్నది...ఆమె పక్కకి తిరిగింది. రఘు ఆమె ముఖాన్ని చూశాడు; ఒక్క నిమిషంపాటు ఆశ్చర్యపోయాడు—ఆమె సుమమూర్తులా విమలవలె వున్నది! ఆమె విమలేనా? ఆమె ఎవరు?? ఆమె విమలేనా???—రఘు తను ఎన్నడూ చేయని వింతపని చేస్తున్నాననుకున్నాడు. అట్లానించుని ఆమెవేపే—ఆమె విమల అయితే మట్టుకు?—ఎందుకు చూస్తున్నాడో, ఎందుకు చూడాలనిపించిందో, అలా ఒక స్త్రీవైపు చూడడం మంచిదో కాదో...ఏమీ అతనికి అర్థం కాలేదు. కాని, అట్లాగే చూస్తున్నాడింకా—సినీమా హాల్లో మొదటిగంట వినిపించింది. ఆమె టిక్కట్లు తీసి, హాలువేపు నడిచింది, తన పక్కనున్న పిల్లతోసహా ... రఘు కదలలేదు. అలాగే చూస్తున్నాడు ... ఆమె హంసగమనంతో వెనుతిరిగి నడిచిపోతున్నది. బుసలుకొడుతూన్న నల్లతాచువలె ఆమె జడ మహావేగంతో కదిలింది. ఆమె లోనికిపోయింది...మరి కనిపించలేదు...ఏదో గొప్ప కాంతి తన కళ్ళెదుటనించి మాయమైపోయినట్టయింది రఘుకి...ఒక్కమారుగా రఘుకి తెలివి వచ్చింది—ఇంతసేపూ తనేంపని చేశాడు! ఛీ! ఛీ! ఆమె విమల అయితేమాత్రం తనెందుకట్లా చూశాడు? అలా చూడ్డానికవసరం ఏమిటి? ఆమెవరు, తనెవరు?—అనుకున్నాడు రఘు. అందరూ హాల్లోకి యారు. ప్రదేశమంతా నిర్జనంగా వుంది...రఘు మాత్రం, ఒక్కడూ, అలా నిల్చుండిపోయాడు... కొంతసేపయాక, ఇటూ, అటూ, పచారుచేశాడు. ఆ తర్వాత, తన చేతిలోని టిక్కట్టును రెండు ముక్కలుగా చింపివేసి, ఇంటివైపు దారితీశాడు.

మర్నాడు వుదయం, రఘు హార్బరుకి వెళ్లేడు. పోర్టు సూపరింటెండెంటుగారి దర్శనం కాలేదు... "పోనీ! రేపు మళ్ళీ వచ్చిచూస్తాను!" అనుకున్నాడు. ఒంటిగంటవరకు ఎండలో వూరంతా తిరిగి, భోంచేసి, తనగది చేరుకున్నాడు. ఎండదెబ్బ బాగా కనిపించింది. తలనొప్పి ప్రారంభించింది... దానికితోడు, మధ్యాహ్నం శివశంకర విలాసులో బాగా టిఫిను తిన్నాడు. తత్ఫలితంగా, సాయంత్రానికి చిన్నజ్వరం తగిలింది. రఘు రాత్రి హోటలుకి వెళ్ళలేదు; నీరసంగా పడుకున్నాడు...మర్నాటి వుదయానికి జ్వరం బాగా హెచ్చిపోయింది. మంచంమీంచి కదలలేకపోయాడు. రోజల్లా కాఫీ అయినా తాగలేదు...సాయంకాలం చిన్ననిద్ర పడుతూవుండగా, గదిద్వారంవద్ద ఎవరో పిల్చినట్లయింది—రఘు కళ్లుతెరిచి చూశాడు...ద్వారంలో ఎవరో ముసలాయన నిల్చున్నారు.

"ఏం నాయనా! నిన్నటినుంచీ నువ్వు పడుక్కున్నట్లే వుండే? జ్వరంగా వుందా? పాపం! ఒక్కడివే వున్నావా ఏమిటి? అన్నారు.

"ఔనండీ తాతగారూ! కొంచం జ్వరం. వచ్చింది. రేపటికి తగ్గిపోతుందిలెండి"

"మేము ఈ పక్కవాటాలోకి మొన్ననే దిగేమునాయనా! అన్నట్లు—కొంచం కాఫీ తాగుతావా? ఇంట్లో చెప్పేనులే, నీకు కాఫీపంపమని... మొహమాటపడకు...పాపం, చాలా నీరసంగా కనిపిస్తున్నావు! సరే—నేను హాస్పిటలుకి వెళ్ళాలి... వస్తాను..."

"అయ్యో! మీకీ శ్రమ ఎందుకు తాతగారూ?"

"కాఫీ నీళ్ళకి శ్రమఏమిటి నాయనా! పాపం, చిన్నవాడివి; కష్టపడుతున్నావు" రఘు దీనికి జవాబు చెప్పకముందే తాతగారు వెళ్ళిపోయారు... రఘు సిగ్గుపడిపోయాడు... తను ఎందుకింత అసహాయస్థితిలో వున్నాడు? ఇప్పుడు తనను చూచేదిక్కెవరు? తల్లిదండ్రులకి వ్రాసి, వారినిక్కడకు రప్పించడం తనకిష్టంలేదు. వుత్తరం వ్రాసే తను

కష్టపడి పోతున్నాడు. తనకు తానే జాలిపడు
తున్నాడు—

ద్వారంవద్ద గాజులఘల్ఘలారవమూ, మల్లె
పూవుల పరిమళమూ, ఒకేమారు వచ్చాయి. చేతిలో
వెండిగిన్నె పట్టుకొని ఎవరో అమ్మాయి వచ్చింది...
రఘు ఒక్కనిముషంపాటు నివ్వెరపోయి ఆమెవైపు
చూశాడు. తను ఆనాటి సాయంత్రం సినీమాహాలు
వద్ద చూచిన అమ్మాయే! ఆమె ముమ్మూర్తులా విమల
వలె వుంది... ఆమె విమలేనా ?!—ఆమె విమలే
అని గ్రహించడానికి అతనికట్టేసేపు పట్టలేదు ...
కాని, విమల ఇక్కడికి ఎలా వచ్చింది... ఇది కలా,
నిజమా ? అనే విషయాన్ని రఘు నిర్ణయించలేక
పోయాడు. ఆమె వెండిగిన్నెను మంచంపక్కనే
వుంచి, గిరుక్కున తిరిగి, మహావేగంతో వెళ్లిపో
యింది...బ్రహ్మాండమైన పెనుగాలిలో ఎగిరిపోయే
పుష్పంలాగ ఆమె వెడలిపోయింది...మహాక్రోధంలో
వున్న త్రాచుపామువలె ఆమెజడ, మీదికి ఎగిరిపడి
ఆమె నితంబములను ముద్దుకొంది...ఆమె గాజులు
సంగీతాన్ని పాడేయి.

—రఘుని ఆవరించుకొనివున్న ఆశ్చర్యం
ఇంకా అతన్ని వదలలేదు...తను ఎక్కడ
వున్నాడు ?...ఎందుకు వున్నాడు ?...విమల
అక్కడికెలా వచ్చింది ? ఇది స్వప్నమా, యథా
ర్థమా ? ఆమె విమలేనా ? ఆమె విమలే అన్న
విషయంలో అతని కెటువంటి సందేహమూ
లేదు...తన కళ్ళని తాను నమ్మగలడు....ఔను!
ఆమె విమలే...ఆ కాటుకకళ్లు, ఆ లేతమోము,
సిగ్గు దొంతరలచే కెంపువారిన అనును చెక్కులు,
నాట్యంచేస్తూన్న ఆజడ...ఆమె విమలే, ఆమె
విమలే......

వెండిగిన్నెలోని కాఫీ ఆవిరులను వదులు
న్నది...రఘు గిన్నె అందుకొని, కాఫీ తాగేశాడు.

"ఏ—మండోయ్!..."

ద్వారంవద్ద చిన్న పిల్లనించునివుంది. సినీమా
హాలువద్ద ఆనాడు తను చూసిన అమ్మాయే అని రఘు
గ్రహించాడు.

"ఏమమ్మా!"

"కాఫీలో పంచదార వేయటం...మా
అక్కయ్య మరిచిపోయిందిటండీ...మరంటే...
వూ..."

"శర్వాణేను...బాగా చెప్తుంది...తాగేశానుగా"

పిల్ల పకపకా నవ్వింది...

పక్కగదిలోంచి "చిట్టీ" అని కేక వినిపిం
చింది—అది విమలకంఠం.

పిల్ల వెండిగిన్నె తీసుకొని, తుర్రుమని పారిపో
యింది.

—రఘు మెదడులో వేయివేల ఆలోచనలు
పరుగెత్తినాయి......ఆ ఆలోచనలకి అంతం లేదు.
ఏమేమో ఆలోచిస్తున్నాడు......ఏమీ ఆలోచించ
లేదు......ఏవేవో భావాలు అతని మెదడుకి అంద
కుండా పారిపోతున్నవి......తా నేమిటి ఆలోచిస్తు
న్నాడో తనకే తెలియదు...బ్రహ్మాండమైన కెరటాల
వలె, ఒక్కొక్క విషయమే అతని దృష్టిలో గోచ
రించి మాయమైపోతున్నది. తన జీవితం, తన
ఉద్యోగం, తన ఊరు, తలిదండ్రులు, విశాఖ
పట్నం, బీచిలు, సినీమాలు, విమల! అన్నీ తెరమీద
బొమ్మలవలె కొట్టి పోతూవున్నవి......త నెన్నడూ
ఇంతలా ఆలోచించలేదు; తన మెదడు ఎప్పుడూ
ఇంతలా అలిసిపోలేదు.

నాడు, పెళ్లి చూపులలో విమలని చూసినది
మొదలు తన మనస్సు పరిపరివిధాల పోతున్నది...
నాటినుంచి తన మనస్సులో అనేక జగద్ర హస్య
సిద్ధాంతాలను గురించి చర్చించుకుంటూన్నాడు...
పెళ్లి అంటే ఏమిటి? హిందూ ధర్మశాస్త్ర ప్రకారం
పెళ్లి ఒక మహాపవిత్రమైన కార్యం......దేవతల,
దేవుళ్ల, సాక్ష్యాలలో, అగ్నిమీద ప్రమాణాలతో,
పురోహితుల పవిత్ర మంత్రోచ్చారణాధ్వనులమధ్య,
హిందూ వివాహానికి ఒక దైవత్వం ఏర్పరిచారు...
ప్రపంచంలో మరే జాతి వివాహాలు ఇంత మహా తతిం
గంతో జరగవని తను విన్నాడు......అయితే, ఈ
కట్నాల విధానం ఎవరు, ఎందుకు కనిపెట్టేరు? దాని
భావం ఏమిటి?—ఇదేమిటి, తను మరి ౫ ఏళ్ల వరకూ
పెళ్లిచేసుకోనని నిర్ణయించుకున్నాడు ; తనకి అనవస
రపు ఆలోచనలన్నీ ఎందుకు?? అనుకున్నాడు రఘు.
తను ఎందు కిలా మనస్సు పాడుచేసుకుంటున్నాడు ?
విమలని చూసేసరికి, తన హృదయ తంత్రులన్నీ ఒక్క
మారు మీటినట్లయి, తన మనస్సులో వుప్పెన కెర
టాలవలె ఏవేవో భావాలు చెలరేగుతున్నవి. తన

మనస్సు అంత నీరసమైనదా? అయ్యో! ఆనాడు తను ఆ పెళ్ళిచూపులకి ఎందుకు వప్పుకున్నాడు!

మర్నాడు వుదయమే, విమల గ్లాసుతో జావ తెచ్చింది. రఘు గ్లాసు అందుకున్నాడు. విమల తల వంచుకుని నిల్చుంది......ఆమె స్నానం చేసి, పరిశుభ్రంగా కడిగిన ముత్యంవలె వున్నది. ఆమె జడ వేసుకో లేదు. జుత్తును కెరటాలవలె విరియబోసుకుంది.

రఘు తన భావాలను సరిచేసుకుని, మెల్లిగా అన్నాడు :

"నీ కెందుకమ్మా, ఈ శ్రమ అంతాను?"

విమల తలవంచుకునే, మెల్లిగా, "వు... వుహుఁ!" అంది.

"ఆ తాతగారు నీకే మవుతారు?"

"మా తాతగారికి అన్నగారు"

"మీరు మొన్ననే ఈవూరు వచ్చినట్లుంది?"

"వూఁ! మా బామ్మని హాస్పిటలులో చేర్చడానికి వచ్చేము."

"చిట్టి మీ చెల్లెలా?"

"వూ!...ఎక్కడికో వెళ్ళింది..."

"పాపం! నాసరించి తాతగారు ఎంతో జాలి పడ్డారు."

విమల మాట్లాడలేదు.

రఘు జావ తాగడం పూర్తిచేశాడు. "వుండమ్మా! గ్లాసు కడిగేసి యిస్తాను."

"వు...వుహు! అక్కర్లేదు...ఇచ్చేయండి" అంది విమల సిగ్గుతో.

"సరేలే, తీసుకో! వుత్తినే మొహమాటానికి అన్నాను. లేకపోతే, నే నిప్పుడు నిజంగా లేచి కడగగలనా ఏమిటి?"

విమలకి నవ్వువచ్చింది ... నవ్వింది కూడా. కాని, ఆమెనవ్వు పైకి వినిపించలేదు. ఆమె బుగ్గలలో చిన్నలొత్తలు పడ్డాయి...ఆమె కళ్లు నవ్వినాయి...

విమల వెళ్ళిపోయాక, రఘు సిగ్గుతో, అవమానంతో, కుంగిపోయాడు. ఇంతదయ చూపిస్తున్న వీరి నేనా, ఈ అమ్మాయి నేనా, తన తండ్రి కట్నం చాలలేదని నిరాకరించాడు?? తను ఏ మొహంతో వీరి సేవలను అంగీకరిస్తున్నాడు? పాపం, ఆ తాతగారి కింకా తనెవరో తెలియదు!......

మర్నాటికి రఘు తేరుకున్నాడు... రెండో నాటికి పూర్తిగా లేచి తిరగగలిగాడు. తన వుద్యోగ ప్రయత్నాలు సాగుతున్నవని తండ్రిగారికి వుత్తరం రాసేడు.

విమల యిప్పుడు తరుచుగా కనిపిస్తున్నది. తాతగారు అప్పటా అప్పటా, రఘుతో మాటా మంతీ ఆడుతున్నారు ... కాని, ఆయన సాధారణంగా హాస్పిటలులో బామ్మగారివద్దనే వుంటూవుంటారు.. ఇంట్లో వంటపని విమల చూసుకుంటుంది. అల్లరి పను లన్నిటినీ చిట్టి నిర్వహిస్తుంది.

రెండురోజులు గడిచాయి. రాత్రి 9 అయింది. రఘు చదువుంటున్నాడు. ఇంతలో తాతగారువచ్చి ద్వారంవద్ద నించుని "అబ్బాయీ! అని పిలిచారు.

"రండి తాతగారూ" అని రఘు లేచాడు.

"నాయనా! నువ్వు ఒక పని చెయ్యాలి. నా కోసం, శ్రమ అనుకోకుండావుంటే!"

"ఏమిటి చెప్పండి, శ్రమఏమీ ఉండదు"

"హాస్పిటలులో ముసిలి దానికి ఆపరేషను జరిగింది పొద్దుట. ఇప్పుడు కొంచెం చికాకుగా వుందని కబురువచ్చింది. నేను వెంటనే వెళ్లాలి... అయితే, ఇంతకీ, మా మనవరాళ్ళిద్దరూ మొదటి ఆట సినీమాకు వెళ్ళేరు. సినీమా అయిపోగానే నేనువచ్చి వాళ్ళని యింటికి తీసుకువస్తానని చెప్పేను. వాళ్లు నాకోసం చూస్తూవుంటారు. నువ్వు వెళ్ళి వాళ్ళిద్దరినీ ఇంటికి తీసురా నాయనా! వాళ్ళ నెరుగుదువు కమా?"

"అట్లాగేలెండి తాతగారూ!"

"నాయనా! నీ మేలు మరిచిపోను...అన్నట్లు లక్ష్మిటాకీసు సుమా" అంటూ తాతగారు రివ్వున వెళ్ళిపోయారు.

రఘు గదికి తాళంవేసి, సినీమాహాలువైపు నడచాడు. అప్పటికి మొదటిఆట అయిపోయింది. జనం అందరూ వెళ్ళిపోయారు. విమల, చిట్టి, రోడ్డు పక్కని ఓమూల నించుని నిరీక్షిస్తున్నారు. రఘు వారివద్దకువెళ్లి, చిట్టితో అన్నాడు.

"చిట్టీ! మీ తాతగారు హాస్పిటలుకి వెళ్ళేరు. మీ యిద్దరినీ ఇంటి తీసుకు రమ్మని నాతో చెప్పేరు. రామ్మా పోదాం."

విమల తలవంచుకొని మెల్లిగా అంది:

"బామ్మకి మరేం చికాకుచేయలేదుకదా ?"

"మరేం భయపడవలసినవసరంలేదు. కొంచం చికాగ్గానే వుందని తెలిసింది" అన్నాడు రఘు.

రివ్వుమని చల్లటిగాలి వీచింది. ఆకాశం మేఘావృతమైపోయింది. రెండు అడుగులు వేశారో లేదో, టపటపమని చినుకులు ప్రారంభించి, పెద్దవర్షంగా పడింది. పక్కనే వున్న జట్కాబండిని పిలిచి, రఘు "మీా రిద్దరూ వేగిరం బండిలో కూచోండి" అన్నాడు. విమల, చిట్టి, బండి ఎక్కారు. వర్షం ఇంకా హెచ్చయింది. రఘు బండి వెనకాలే తడుస్తూ, నడచివస్తున్నాడు.

"చిట్టీ ! ఆయన తడిసిపోతున్నారు. బండిలో కూచోమని చెప్పవే" అంది విమల.

"మరేం ఫరవాలేదులే అమ్మాయీ! ఇంటికి ఇంక రెండు నిముషాల్లో వెళ్ళిపోతాం" అన్నాడు రఘు, ఇంకా తడుస్తూ. ఈసారి విమల సూటిగా చెప్పవలసి వచ్చింది :

"అయ్యొయ్యో ! బండిలోకి వచ్చేయండి. తడిసి పోతున్నారు. లేకపోతే, మే మిద్దరమూ కూడా నడుస్తాము..."

విమల కంఠస్వరంలో అనునయంతో కూడిన ఆజ్ఞ వుంది. రఘు బండి ఎక్కి, కొసని కూచున్నాడు.

మర్నాడు వుదయం, బామ్మగారికి కులాసాగా వున్నట్లు తాతగారు చెప్పేరు. సాయంత్రం రఘు తాతగారితో కలిసి హాస్పిటలుకి వెళ్ళి బామ్మగారిని చూసివచ్చాడు.

రెండు రోజులు గడిచేయి. ఓనాటి వుదయం రఘు హోటలుకి వెళ్ళబోయే సమయంలో చిట్టి వచ్చి, "ఏమండీ! తెలుగు పుస్తకాలు ఏవేనా వుంటే ఇయ్యరూ? మా అక్క చదువుకుంటుందిట" అంది.

రఘు చిట్టి బుగ్గలు రెండూ మెల్లిగా గిల్లి, "నువ్వు చాలా అల్లరి పిల్లవని మీాతాతగారు చెప్పేరు" అన్నాడు నవ్వుతూ.

"ఛీ! నువ్వే అల్లరి పిల్లాడివి" అంది చిట్టి.

"చిట్టీ! ఏమిటా పెద్ద మాటలూ నువ్వూను ? దెబ్బలు కావాలా ఏమిటి ?" అని పక్క గదిలోంచి విమల కంఠం వినిపించింది.

రఘు తన సంచీలోంచి, "శరచ్చక్రం" తీసి చిట్టికిచ్చి, "ఇందమ్మా" అన్నాడు. చిట్టి బుంగ మూతి పెట్టి వెళ్ళిపోయింది. పుస్తకం తీసుకొని!

ఆనాడు సాయంత్రం. రఘు గదికి తాళం వేసి పార్కుకి వెళ్ళబోతూ వుండగా, చిట్టి పరుగెత్తుకొంటూ వచ్చింది :

"ఏమండీ! ఈ పదిరూపాయల నోటు మీరిచ్చిన పుస్తకంలో వుందని మా అక్క చెప్పింది. మీాకు ఇచ్చి మన్నది" అంటూ ఓ నోటు అందిస్తూ.

"అవును సుమా! పోయిందనుకున్నాను! ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. పుస్తకంలో వుంచాను!" అన్నాడు రఘు.

"నోట్లు పుస్తకాలలో దాచటం ఏమీ మంచి పని కాదు—అంటూ అజాగ్రత్తగా వుంటే డబ్బు నిలవదని చెప్పే చిట్టీ" అని విమల గొంతుక వినిపించింది. రఘు పక్కకి తిరిగిచూశాడు. పక్క గదిలో కిటికీవద్ద తలవంచుకొని విమల నించుని వుంది...

రఘు బీచిలో, ఇసుకమీద కూచుని, రేడియో సంగీతం వింటున్నాడు. సముద్రముమీాంచి చల్లని గాలి వీస్తున్నది. బీచంతా మనుషులతో కలకల లాడుతూ వుంది. "ఈ మహాసముద్రం ఎందుకు ఎప్పుడూ హోరుపెడుతూ వుంటుంది ?" అనుకున్నాడు రఘు. ఆతర్వాత, మళ్ళీ "ఈ ప్రపంచమంతా కేవలం ఆనందంకోసమే సృష్టింపబడ్డదా ?" అనుకున్నాడు ! అట్లా ఆలోచించుకుంటూనే, రాత్రి 9 వరకూ బీచిలో కూచుని, ఆ తర్వాతలేచి, హోటలుకి వెళ్ళేడు......

ఓనాడు రఘు పార్కునించి లావుగా గులాబీ పువ్వులు కోసుకొనివచ్చాడు. మేడీమెట్లు ఎక్కుతూ వుండగా, చిట్టి కనిపించింది :

"ఏమండోయ్ ! ఏమిటా పొట్లాం ?"

"ఏమిటో నువ్వే చెప్పుకోవాలి !"

"మిఠాయిలు—కాదు, పకోడీలు !"

"అంతకంటె మాంఛివి"

"వూఁ ! మరిగంటే...జిలాబీలు..."

"ఎప్పుడూ తిండిధ్యానమేనా!—ఇవిగులాబీ—".

పాట పూర్తిచేయకముందే, చిట్టి పువ్వుల పొట్లాన్ని లాక్కొని ఇంట్లోకి పరుగుతీసింది...

ఆవేళ చీకటి పడుతూవుండగా, విమల చీడీలోకి వచ్చింది. రఘు ఆమెను చూశాడు...గాఢాంధకారమయమైన వనంలో. తోవతప్పిపోయిన దేవకన్యకలా వుంది విమల...గాలికి ఆమెచీర కుచ్చెళ్లు మెల్లిగా కదులుతున్నవి.

ఆమె తలలో నవ్వేను గులాబీపూలు తురుముకొన్నది—రఘు హృదయం ఒక్కమారు గాఢంగా కొట్టుకుంది—విమల ఇంట్లోకి వెళ్ళిపోయింది... ఆమె తలలోంచి ఒక గులాబీపూవు రాలి, కిందని పడ్డది...రఘు చీడీలోకి నడిచాడు...మెల్లిగా, ఆ రాలిన గులాబీని తీశాడు...తన గదిలోకి వచ్చి, ఆ గులాబీపూవుని ఆఘ్రాణించాడు...పరిమళం గుప్పున వచ్చింది.—హృదయంలో, అప్రయత్నంగా, ఏదో మధురమైన భావం తళుక్కున మెరిసింది—తనకి విమలమీద అనురాగం వుదయించిందా? ... రఘు ఒక్కమారు వులికిపడ్డాడు... ఆభావం ఎందుకు కల్గిందో తనకే తెలియదు—కాని కల్గింది!......తన నేదో మత్తు ఆవరించి నట్లయింది. తను ఏదో మహత్తరమైన, మధురమైన దివ్యశక్తికి, తనకు తెలియకుండానే, లొంగిపోతున్నట్లయింది. ప్రతీ మానవుడు, వాడి ఆదర్శాలు, నీతి, సద్వర్తనం, అన్నీ ఇటువంటి ఒక్క క్షణంకోసం నిరీక్షించి, ఆ క్షణంలో దాన్ని వరించుకొనివున్న శక్తికి లొంగిపోతాడని పించింది రఘుకి. తనుకూడా ఆ శక్తికి లొంగిపోవడానికే నిశ్చయించుకున్నాడు—రఘు గబగబా డ్రెస్సు వేసుకుని హోటలువైపు నడిచాడు.

రఘు ఇప్పుడు విమలతో అవసరం అయినప్పుడల్లా మాట్లాడుతున్నాడు. చిట్టి సాధారణంగా రఘు గదిలోనే వుంటుంది...అల్లరి చేస్తుంది...అతని పుస్తకాలు, కలాలు దాచివేస్తుంది...వారిద్దరు ఒక్కొక్కమారు ఆడుకుంటారు...ఒక్కొక్కమారు తిట్టుకుంటారు. రఘు ఆమె బుగ్గలను గట్టిగా చిదిమివేస్తాడు. ఆమె ఏడుస్తూ వెళ్లిపోతుంది...మళ్లీ పది నిముషాలలో తాజాగా, అల్లరికి తయారై వస్తుంది......

ఓనాడు రాత్రి టౌను హాలులోని గానసభకి రఘు వెళ్లేడు. గానసభ పూర్తయేసరికి రాత్రి 12 అయింది. ఇంటికివచ్చి పడుక్కునేసరికి ఒంటిగంట దాటింది. మర్నాడు వుదయంలేచి టైముచూస్తే 9-30 అయింది. గబగబా ముఖం కడుక్కొని, బట్టలు వేసుకుని తలదువ్వుకుంటున్నాడు. విమల గ్లాసుతో కాఫీతెచ్చి చాపమీద వుంచింది: రఘు ఆశ్చర్యపోయి, అన్నాడు:

“ఎందుకమ్మా నీకీశ్రమ!—పోనీ, చిట్టిని పంపలేకపోయావా?”

“అది ఆడుకుందికి పోయింది. తాతగారూ లేరు...మీరు ఆలస్యంగా లేచారని...”

“బాగా నేవుంది!” అని రఘు తీక్షణంగా చూస్తూ, “కాని, ఈ సేవలన్నిటికీ నేను పాత్రుడిని కాను తెలుసా?” అన్నాడు.

విమల త్రుళ్లిపడింది. ఆమె మాట్లాడలేదు. తల వంచుకుని అట్లానే యింకా నిల్చునివుంది.

రఘు మళ్ళీ అన్నాడు:

“కారణం తెలుసా?”

విమల తలవూపింది మాట్లాడలేదు.

“ఆనాడు నువ్వు పెళ్ళిచూపులకి మా వూరు వచ్చావు...ఆ తర్వాతి సంగతి నీకు తెలుసును...” రఘు కంఠం గద్గదికమయింది. విమల నివ్వెరబోయింది.

“విమలా! ఒక్క నిముషం ఆగు” అన్నాడు రఘు. ఆమెను పేరుతో పిలవడం ఇదే మొదటిసారి. విమల ద్వారంవద్దకివచ్చి నించుంది. ఆమె ముఖంలో ఏదో అశాంతి కన్పిస్తున్నది.

రఘు ఇంతవరకూ విమలని పరిశీలనగా చూడలేదు. ఇప్పుడు తలఎత్తి ఆమెవేపు సూటిగా చూశాడు. ఆమె ఒక బంగరు బొమ్మ! లోకంలోని అమాయకత్వమంతా ఆమె ముఖంలోనే వున్నట్లుంది! చిరుగాలికి చలిస్తూవున్న లతవలె ఆమె నించుంది...

“విమలా!”

విమల కొద్దిగా తలెత్తి చూసింది.

“విమలా! నిన్ను నేను ప్రేమిస్తున్నాను!”

విమల టక్కున తలవంచేసుకుంది. ఆ తర్వాత రివ్వున యింట్లోకి పారిపోయింది. ఎప్పుడు వెళ్ళిందో

ఎలా వెళ్ళిందో రఘు గమనించలేదు. ఆమె జాడ కదలికను అతను చూడలేదు. కాని, ఆమె వెళ్ళిపోయాక, రఘు తను చేసిన పనిని తెలుసుకున్నాడు! ఆనాడల్లా చాపమీద అట్లాగే కూచుని తనను తాను నిందించుకున్నాడు.

రెండురోజులు గడిచాయి. ఈ రెండురోజులూ విమల కన్పించలేదు. రఘు మనస్సు సంక్షోభంతో కృంగిపోతున్నది. తను ఎటువంటి పనిచేశాడు! ఒక రౌడీకంటె ఎక్కువ అన్యాయంగా తను ప్రవర్తించానను కున్నాడు. ఆ నిముషంలో తనకట్లా అనాలని ఎందుకనిపించిందో?

ఓనాడు తాతగారు రఘుగదికి వచ్చారు.

"అబ్బాయీ! నీ ఫౌంటెన్ పెన్ ఒక్కమారు యియ్యి నాయనా! చిన్న ఎడ్రసు రాయాలి" అన్నారు చాపమీద కూచుంటూ.

రఘు పెన్ యిచ్చాడు.

"మరేంలేదు నాయనా! మా మనవరాలు విమలకి పెళ్ళి నిశ్చయమయిందని వాళ్ళ నాన్న రాశాడు. వాడికో జవాబురాసి పడేస్తే మన పూచీ తీరిపోతుందికదా!" అన్నారు తాతగారు ఎడ్రసు రాస్తూ.

"సంతోషం" అన్నాడు రఘు.

తాతగారు లేచి వెళ్ళిపోతూ, రఘువేపు ఓమారు చూసి, అదేమిటి నాయనా! అంత నీరసంగా కనిపిస్తున్నావూ?" అన్నారు.

"అబ్బే! ఏం లేదు! రాత్రి నిద్రలేదు"

"ఏమో నాయనా! వారం రోజుల్లో మేము వెళ్ళిపోతాం. ఆరోగ్యం మాత్రం జాగ్రత్త!"

తాతగారు వెళ్ళిపోయారు. రఘు ఒక్కమారు చాపమీద కూలబడి "ఫ్!" అని నిట్టూర్పు విడిచాడు.

ఆనాడు సాయంత్రం, పెరట్లో నూతి దగ్గర రఘు ముఖంకడుక్కుంటూ వుండగా, విమల బిందెతో నూతికి వచ్చింది. రఘు మనస్సులో ఏదో ఆలోచన మెరిసింది.

"విమలా!"

"ఏమిటి? చెప్పండి" అంది విమల మెల్లగా.

"విమలా! నన్ను క్షమించు"

"మీరేం తప్పుచేయలేదు"

"చేశాను! ఆనాడు నా ప్రవర్తన ఏమీ బాగ లేదని నా వుద్దేశం"

విమల ఒక్క నిముషం ఊరుకొని మెల్లగా అంది: "మీ ప్రవర్తన ఎప్పుడూ బాగానే వుంది. ఆ విషయంలో నాకే సందేహమూ లేదు... మీ మనస్సులోని విషయం నాకు తెలియదు... అందులో తప్పేమీ లేదు"

"విమలా! నేనో ప్రశ్న అడుగుతున్నాను. నీ యిష్టమైతేనే జవాబియ్యి! జవాబీయకపోయినా నేనేమీ అనుకోను.....ఎందుకంటే, నీకు పెళ్ళి నిశ్చయమైపోయిందని తెలిసింది"

"ఔను! ఏమిటి ప్రశ్న?"

"నువ్వు నన్ను ప్రేమించావా విమలా?"

"నాకు తెలియదు... నా కేమీ తెలియదు... నాకు ప్రేమ అంటే సరియైన అర్థం తెలియదేమో! కాని, స్త్రీలందరికీ సాధారణంగా, ఇటువంటి విషయాల్లో, ఒకే రకమైన హృదయం వుంటుంది. ఏమిటంటే—మిమ్మల్ని ఆనాడు పెళ్ళిచూపుల్లో చూసినప్పుడు మన వివాహం నిశ్చయమయితే బావుండుననిపించింది... కాని, అది కుదరలేదు. అందువల్ల నేను కొంచెం విచారించిన మాట నిజం...ఆతర్వాత. ఇక్కడికి వచ్చాక మనిద్దరికీ పరిచయమైంది. ఇదంతా ఒక స్వప్నంలా వుంది. నాలో ఎటువంటి భావముందో నాకు తెలియదు. తెలిసినా, అది చెప్పలేనేమో! నా మనస్సింకా పరిపక్వానికి రాలేదు. విధికి, తలిదండ్రులకి, లొంగిపోయే స్త్రీని నేను. నాలో అనేక కోరికలు వుండవచ్చు. ప్రపంచంలో ఎందరికి కోరికలు లేవు! అవన్నీ తీరుతాయా? ఇక్కడికి వచ్చాక, మీమీద నాకు జాలి, అభిమానం, కలిగాయి. అది ప్రేమో కాదో నాకు తెలియదు...ఇది ఒక అనుకోని సంఘటన! ఒక కల......మీతో ఓ విషయం చెప్పాలనుకున్నాను...మీరు రెండురోజులయి ఏదో మనోవేదనతో కృశించి బాధపడుతున్నట్లుంది—నిజమేనా?"

"నిజమే! కాని, నీకెట్లా తెలిసిందమ్మా?"

"మీ ముఖమే చెప్తున్నది! దానికి కారణం?"

"కారణం నీకు చెప్పానుగా?"

విమల చిన్నగా నవ్వి అంది "సరే! ఒక సైనా మనస్సు పాడుచేసుకోకుండా వుండండి... నాకు పెళ్ళి నిశ్చయమైంది...మీరుకూడా నేడో రేపో అవకతప్పదు...విధివశాన మనిద్దరం ఇక్కడ ఇలా కలుసుకొన్నాము. మీలోని ఏదో ఒక గొప్ప విశాలహృదయత్వం, సద్వర్తనం, నన్ను ఆకర్షించేయి—అంతే! మరికొన్ని ఏళ్ళకి బహుశః మనిద్దరం ఒకరికొకరం జ్ఞాపకం వుంటామో వుండమో? ఇది ప్రపంచధర్మం...ఈ మన కలయిక మధ్యలో ఎట్లావచ్చిందో, అలాగే మధ్యలోనే పోతుంది..." విమల ఆగి, ఒక నిట్టూర్పు విడిచింది. రఘు మాట్లాడలేదు. కొద్ది సేపటివరకూ, ఇద్దరూ మౌనంగా వున్నారు. ఆ తర్వాత రఘు వెళ్లిపోబోతూ వుండగా, విమల అంది:

"మేము నాల్గురోజుల్లోగానే మావూరు వెళ్లిపోతాం...వెళ్ళేముందర మీతో ఒకమాట చెప్పాలనుంది..."

"ఏమిటి?"

"ఈ విషయమై మీరు మీమనస్సు పాడుచేసుకోకుండా వుంటానని మాటయివ్వండి!"

"అట్లాగే" అన్నాడు రఘు.

విమల చిరునవ్వునవ్వి నడిచి వెళ్లిపోతున్నది. ఆమె పోతూవుంటే జడ ఆమె నితంబములమీద నాట్యం చేస్తూవుండగా, రఘు అట్లాగే నిలుచుని చూస్తున్నాడు...విమల ఎంత అందంగావుంది!

రఘు గదిలో పడకకుర్చీలో కూలిపడ్డాడు. అతని కళ్ళముందర ఏదో జ్ఞానజ్యోతి వెలుగుతున్నట్లయింది. ప్రపంచచరిత్ర అతని కళ్ళకికట్టినట్లయింది...

మర్నాటివుదయం రఘుకి తండ్రివద్దనుంచి వుత్తరం వచ్చింది. ఎవరో పెళ్ళి సంబంధంవారు వచ్చారని, వారు 2 వేల కట్నం ఇస్తారని, వెంటనే వచ్చి పిల్లను చూసుకోమనీ ఆయన రాశారు.

రఘు సామాను సర్దుకున్నాడు. విమలతో చెప్పి, రఘు బండిఎక్కుతూ వుండగా, ఆమె వీధి చీడీలోకివచ్చి నించుంది. బండి మెల్లిగా నడుస్తున్నది...రఘు తన భావిజీవితంగురించి ఆలోచించుకుంటున్నాడు...మళ్ళీ తనకి పెళ్ళిసంబంధం వచ్చింది...ఆ పిల్లకి తను నచ్చుతాడు. తన తల్లి దండ్రులు సంతోషిస్తారు....ఇంకా.... ఇంకా... ఏవో ఆలోచనలు వస్తున్నవి.

...బండి మెల్లిగా నడుస్తున్నది. చిన్నచుర గాలివచ్చి రఘు క్రాపింగును చెదర్చింది. చీడీలో ఇంకా విమలనుంచుని తనవేపే చూస్తున్నది...బండి మలుపు తిరుగుతున్నది...దూరంగా, చీడీలో విమల నించుని ఇంకా చూస్తున్నది...కారు మబ్బులు కమ్మిన ఆకాశంలో కనిపించీ కనపడని చిన్న నక్షత్రంలా అగుపించి అదృశ్యమైంది విమల!



# త్యాగరాజ!



శ్రీ దండిపలి వేంకటసుబ్బాశాస్త్రి

శ్రీసీతా వదనారవింద విలసత్ శృంగార మందస్మిత
వ్యాసంగమ్ముల తృప్తిజెందు సుజన ప్రార్థ్యాంఘ్రి శ్రీరాముడే
నీ సంగీత కళామహత్త్వమునకు మున్నే కారణంబయ్యె-రా
దీ సామర్థ్యము త్యాగరాజ! ఒరులం దేమాత్ర మూహింపగన్.

నాదబ్రహ్మకళల్ త్వదాస్యమున విన్నాణించె, నీలో రస
ప్రాదుర్భావము క్రొత్తపోకడల నాస్వాదించి లోకైక తే
జోదార్ఢ్యంబున వెల్గనున్నది ఉషస్సుల్ నిండునందాక నీ
కానివ్యక్త్వము ప్రాప్తమయ్యెడిని త్యాగయ్యా! నమోవాకముల్.

వెలలేని తెలుగువాక్కులకు నూత్నత్వము తీయదనము దిద్దితీర్చినావు,
ప్రాణుల నెల్లను రక్తి నాకర్షించు గానకళకు మెఱుగు గరపినావు,
దాక్షిణాత్యుల రసతత్పరతకు మున్ను కొఱవడ్డ యశము చేకూర్చినావు,
తమి ళాంధ్ర జాతులు తారసిల్లగ మైత్రి ఎంచి సేతువును నిర్మించినావు,
నీదు తంబుర శ్రుతులలో బాదుకొనియె
మార్దవము సర్వజన మనోమంజులముగ;-
అట్టి ఘను, నిన్ను స్మరియింప నాంధ్రజాతి
వార్షికోత్సవము లొనర్చి వరలుగాత!



# కవి - మానవుడు



శ్రీ చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాద్

మానవులందరు కవులు గా నేరరు, కాని కవులందరు మానవులె! ప్రయత్నించి కవియగుట దుర్లభము, అప్రయత్నముగ కవియగుట సులభము! కవిత్వము, చిత్రలేఖనము, సంగీతము లలితకళల వరుసలోనివని ప్రాజ్ఞులు నిర్ణయించి యున్నారు. వీనియం దభిరుచి, పుట్టుకతోనే కలుగవలయును—కలిగిన యభిరుచిని, సంస్కరించుకొని, ఎక్కువ ప్రజ్ఞను సంతరించుకొని, వన్నెగాంచుట సుజనుని లక్షణము. ఈ లలితకళలయం దభిరుచి కలుగుటకు, పూర్వపుణ్యము నుండవలయును. అందులకే, కవి, అప్రయత్నముగ లభియించు ననుటలోని యర్థము.

సహనము, కరుణ, నిరాడంబర జీవనము, సత్యసంధత, మాననీయుడగు మానవునకుండు లక్షణములు. ధనము, కామము, అసహనము, మానవునియందు పశుత్వమును పురికొల్పుచున్నవి. అందులకే మానవ చరిత్రమునందు విపరీతఘట్టములు, కానుపించుచున్నవి. అనపహార్యము, తేజోమయము, అమూల్యము, ఆనందదాయకము, అగు, సత్యమును, ధర్మమును, మానవుని మనసునకు మఱపురాకుండ చేయుటకు, ఎన్నియో విధముల కవి ప్రయత్నించినాడు, ప్రయత్నించుచున్నాడు; కాని కాలము గడచినకొలది, ఈ యంత్రయుగమున కవి యొసంగు సందేశము మానవాళికి మఱపునకు వచ్చుచున్నది; కవి మానవునకు దూరమై పోవుచున్నాడు.

సత్యము, సహనము, మొదలగు గుణములు, తృప్త మానవహృదయమునం దుద్భవించును. సంతృప్తి లేని మానవునియం దివి గోచరించుటయు కలదుగాని, సంఖ్యయందట్టి మానవు లతి స్వల్పముగ నున్నారు. కడుపునిండ నాహారము, కట్టుకొన వస్త్రము కలిగిననేగాని మానవునకు హృదయసంబంధముగ, దేహసంబంధముగ, శాంతి, సుఖము, కలుగవు. శాంతి, సుఖముగల మానవున కసత్యము, అసహనము దూరములగును. కావున, కవుల రచనములు కేవల మూహాగానము గాకుండ, మానవుని కష్టనిష్ఠురములను వ్యక్తపరచునవిగా నుండి, పొగడ్త పాలములను త్రొక్కక, నిత్యము, సత్యయుతమై యున్నచో, కవి, మానవున కీయంత్రయుగమున సహితము దూరము గా నేరడు. ఒకటిపాటతో మానవసంఘమును మురులుగొల్పగల కాల మిది; గులాబిపూవుల సౌరభములను, అగరువత్తుల సుగంధధూమములను, గుబాళించు కవిత్వరచనమున కిది యదను కాదు. తృప్తి, శాంతి, సహనము, సంఘమున నెలకొనినతరువాత మానవుని హృదయ మూహాగానము నాలించును. అంతదనుక, కవులు యుగధర్మము ననుసరించి, గాన మొనరింపవలసియున్నది. ప్రాతకథలనే ప్రస్తరింపజేయుచు, ఇంకను, 'రమణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పుర విడెము'నా, 'ఊయెల మంచమును,' స్మరించుచు, అభిలషించుచు, కవి కాలమును బుచ్చినచో, మానవసంఘమునకు దూరమగుటయేగాక, విస్మృతి వారాసిలో తన రచనములతో పాటు, తాను కలసిపోవలసి వచ్చును. ఇది యంత్రయుగమని, సత్యదయాశౌచములు రూపుమాసిపోయినవని, పలవించి ప్రయోజన ముండదు. తాను సంఘమునందు మేళవించి, పతనోన్ముఖమైన జాతి నుద్ధరించి, తన రచనములు శాశ్వతములై, తన పలుకులు కొంగ బంగారమై, సంఘమున కన్నివేళల సంబరమును గూర్చునవిగా నుండునట్లొనరించుట పాడి; తనయం దున్న మానవాతీతమైన ప్రతిభావ్యుత్పత్త్యాది లక్షణములను సంఘాభ్యుదయమునకే కవి వినియోగించుట యుచితము.

ఆలోచనమునందు, ఆశయమునందు, ప్రకృతి పరిశీలనమునందు, విషయ విమర్శనమునందు, మానవునకు, కవియైన మానవునకు తారతమ్యము, కరతలా

మలకము వలె మనకు గానవచ్చుచున్నది. సాధారణముగ కవితాత్మ గలవానియందు, కొన్ని పవిత్రాశయములను మనము కనుగొనగల్గుచున్నాము. కాలమున కనుకూలముగ నా యాశయములు మారుచుండుటను మనము కవుల రచనములయం దిప్పు డిప్పుడు గుర్తింప గల్గుచున్నాము. ఏ మార్పు వచ్చినను, ఆశయములు లోక కళ్యాణాత్మకములై, సర్వజనాదరణీయములై యున్నవి. అట్లుగానిచో, కవి కలమునుండి వెలువడవు. ఎచ్చటేని వెలువడినను, అవి, కాల మహా స్రవంతిలో కలసిపోవును. ఒక వస్తువును తిలకించునపుడు, ప్రక్కనున్న మానవులకన్న కవియగు మానవునకు కొన్ని క్రొత్త యాలోచనలు కలుగుట సహజము. ఆ యాలోచన లపురూపములై, ఒక నూతన వికాసమును హృదయపద్మమునకు కల్గించును. హృదయమున కా వికాసము, ఒక్క కవియగువానికే కాదు, ఆ యాలోచనమును వినిన ప్రతివానికిని కలిగిననేగాని, కవి సంఘమున కుపయుక్తముగు మానిసి కానేరడు.

పున్నమరేయి వెన్నెలను గాంచి, అవిజితమైన, అనల్పమైన, ఆనందము ననుభవించుచు, వివరింప సమర్థమైన భాష లేక, తమలో దాము నవ్వుకొనుచు, తీయనిఘడియలను గడపుచు, జొన్నచేలయందు రాత్రి కావలికై మంచెలపై పరుండియుండు నిరక్షరాస్యులను,—తుష్టిగ భుజియించి, పశుల పాకల నమలుచు, మేడపై వెన్నెలయందు పట్టు పాన్పులపై పవ్వళించి, మేల్కొనియున్నంత కాలము, వసూలు కావలసియున్న వడ్డీ లెక్కనే స్మరించుచు, జిలుజిల్లు మనిపించు చలువ వెన్నెలను వెలార్చుచు, పదునారు కళలతో పకపక లాడుచున్న జాబిల్లివంక తల త్రిప్పియైన జూడక, కొలదిలో పాముబుసలతో నిద్దురయందు మునుంగు నక్షరాస్యులను, మనము జూచుచున్నాము.— కావున కవికి భావము ప్రధానము. ఒరుల కా మధుర భావమును పంచిపెట్టుటకు భాష, అక్షరము, కావలసి వచ్చుచున్నవి. కవులందరక్షరాస్యులే కానక్కరలేదు, అక్షర మెరుంగనివారియం దెందరు కవులు లేరు! అక్షర మెరింగి, గ్రంథపరిచయమున్నచో, హృదయమునం దుద్భవించిన భావము, సంస్కరింపబడి, కులుకుందనమును, భాషాభాగ్యమునను, అలవరచుకొని, చక్కెర కవనముగ కారియై వెలుగొందును. ఛందోరూపమును పొందని, కొలది భాషా సంస్కారమును పొందవలసియున్న, రసవంతములగు పాటలను, మన పల్లెటూళ్ళలో వినుచున్నాము :

'నీవు పోయేటి దారిలోపల
ఉన్నదీ యొక చిన్నది;
నడుము సన్నము, నాగరీకము
నడకలో నొయ్యారము
నీవు పోయేటి దారిలోపల...!'

ఈపై పాటకు కర్త లెవరు? అక్షరము నెరుంగని రసార్ద్ర హృదయులగు కృషీవల కవికుమారులు! ఇందు, యతి యున్నదో లేదో, గణ విభజనము సరిపడునో లేదో, యెవరికి కావలయును? ఒక సుకుమారమగు భావము ఇందు ద్యోతకమగుచున్నది; మనసున కొకవింత 'చక్కలిగింత' శ్రోతల యనుభవములోనికి వచ్చినది.

భావము నొరులకు వ్యక్తపరచుటకు భాష కావలయును. ఆ భాషను దూర ప్రదేశమునందున్న వారి కెరుకబరచుట కక్షరము కావలయును. కావున ఎవరికి వారే యానందము ననుభవించుటకు, అక్షరముతోగాని, భాషతోగాని, పనిలేదు. వస్తుసందర్శనమువలన, శబ్దగ్రహణమువలన, భావ ముత్పన్నమగును. అక్షరము నెరిగినవానికే, భాష నెరిగినవానికే, భావ ముత్పన్నమగు ననుట సత్యదూరము. భాష యెరుగని పసిబాలునియందు, అక్షర మెరుంగని జనపదునియందు, భావ ముత్పన్నమగుటయు, ఉత్పన్నమైన భావమును, కనులతోను, హస్త విన్యాసముతోను, హాసమొనరించియు, దుఃఖించియు, వెలువరించుటను మనము చూచుచున్నాము. ఒరుల హృదయమునకు హత్తుకొనునట్లు, లేక కన్నులకు గట్టినట్లు భావమును వెలువరించుటకు, సమర్థమైన శబ్దములను, భాషనుండి సంతరించుకొని, కట్టుబాట్లయందు వాని నమర్చి, ప్రశంసల నందువాడే కవి. అనగా, తన యానందమును లోకమునకు పంచిపెట్టి, తనతోపాటు, లోకము నొకింత కాల మానందమునం దుయ్యాల లూగించుట కవికి ధర్మము.

భావములేని మానవు డున్నాడా? వస్తుసందర్శనమువలన ప్రతి మానవునకు భావ ముత్పన్నమగు

చుండఁగా, ప్రతి వ్యక్తియును కవుల వరుసలో జేర వలసిన వాడేకద! అటులైన కవులందరు మానవులె, మానవులందరు కవులుగారనుట సత్యసమ్మతమైన విషయము కాగలదా?—భావము, లేదా, ఊహ, లేని మానవుడు సాధారణముగ గానరాడు; కాని వాని భావము లెంతవరకు లలితములో, ఎంతవరకు లోక కల్యాణకారకములో, సర్వజనాదరణీయములో, శాశ్వతానంద సంధాయకములో నిర్ణయించి, శబ్ద సౌభాగ్యమునందు, కవితాశిల్పమునం దాతడు ప్రకటించిన నేర్పును, అతనియందు ప్రదర్శితములైన ప్రతిభావ్యుత్పత్తులను, గుర్తించి, యొక మానవుని, 'కవి' యనుట ధర్మము; భావమునం దొక విశిష్టత, భాషయం దొకవిన్యాసము, ప్రాజ్ఞులకు గన్పింప వలయును. ఇవి యందరకు సాధ్యమగు విషయములు కావు, అందులకే మానవులందరు కవులు గానేరరనుట లోని భావము.

వెలువరింపబడిన భావ మక్షరరూపమైయున్నచో, ఆ భావమెవనియందు దోచినదో యాత డక్షరాస్యుడు గాకున్నను, కవుల వరుసలోనివాడె! పండితులైన కవిభావములు శాశ్వతములై యొప్పును, పండితుడు గాక, భావయుతుడైనవాని కవిత, యొకింత సంస్కార యోగ్యమై, ఒరుల రసనాగ్రములపై బ్రతికి, తుదిని విస్మృతి వారాసిలో లీనమగును. మొత్తముమీద నిరువురు కవులె; ఇరువురి యత్నమొక్కటియె; ఇరువురు, సామాన్య మానవున కతీతులె!

కవి మానవాతీతుడనుట కొందరకు హాస్యాస్పదముగ దోపవచ్చును. ఒకింత యోపికతో కవి రచనములను పరిశీలించినచో నిందలి సత్యము గ్రహించుట కవకాశము లభించును. ధనమునందు, దేహబలమునందు, చక్కదనమునందు, వ్యవహారసరళియందు కాదు, కవి, మానవున కతీతుడు; బుద్ధిబలమునందు, ప్రకృతి పరిశీలనమునందు, విషయ విమర్శనమునందు, ఆదర్శమునందు, అవిదితానందానుభవమునందు, కవి, మానవుని కన్న మిన్న యనక తప్పదు!

పూర్వకవి యమోఘవచనుడని నిరూపించుటకు, అనుశ్రుతముగ వచ్చుచున్న కథలెన్నియో గలవు; బాటవెంట నెదురుగా పల్లకిపై వచ్చుచున్న రాజున కొకపద్యమైన, వ్రాసి కానుకగా సమర్పింప దలచిన కవికి, సమయమునకు తాటియాకు దొరుకనందున, సమీపమునం దున్న తాటిచెట్టుకడ కేగి, '...... తాళమ! తుత్తునియలగుచు ధరపై బడుమా.' అని కోరినంతనె తాటిచెట్టు విరిగి నేల గూలినదట! ఆ తాటియాకుపై పద్యము వ్రాసి కవి రాజునకు సమర్పించెనట!

మట్ట మధ్యాహ్నమునం దొక యెడారియందు ప్రయాణ మొనరించుచున్న యొక కవికి యాకస్మికముగ దాహము కాగా—

'సిరిగలవానికి జెల్లును
తరుణులు పదియారు వేలు తగ పెండ్లాడన్,
తిరిపెమున కిద్దఱాండ్రా!
పరమేశా! గంగ విడుము, పార్వతి చాలున్.'

అని శంకరునిగూర్చి ప్రార్థింప నాకాశము నుండి నీటిధార వచ్చి పడినదట.

తన సృష్టియును తిరస్కరించినవానిపై గినిసి, మరియొక కవి,

'హాయ మది సీత, ఖ్యాతవసు
దాధిపు డారయ రావణుండు, ని
శ్చయముగ నేను రాఘవుడ...
..................................
...తస్కరుని చావును, ఏడవనాడు చూడుడీ.'

అని, ఆరవ స్థానమునందు 'త' ను ప్రయోగించి, 'ఆరింటను తా వచ్చిన వానింటను పీనుగెగయు' అను పలుకులలోని సత్యమును నిరూపించెనట.

ఈ పైకథల నాధారముగా గొని, మానవుని కన్న కవి యతీతుడని నిర్ణయింప నీవ్యాస ముద్దిష్టము కాలేదు. కేవలము, మానవసంఘమునందు, పూర్వకాలమున కవినిగురించి గల తలంపుల నొకింత సూచించుటకివి యిచ్చట పొందుబరుపబడినవి.

కవి యనినచో కేవలము భగవంతుడనియే, పూర్వ యుగమున మానవులు నమ్మియున్నట్లు, పై కథలు సూచించుచున్నవి. కాలము గడచిన కొలది, సంఘమునం దొక గౌరవింపదగిన వ్యక్తిగా, కవిని, మానవులు గుర్తించియున్నారు. సామాన్యులే గాదు రారాజులు సహితము, కవి యొసంగు సందేశమునకు చెవి యొసంగి, తమ యభిప్రాయములను మార్చుకొని యున్నట్లు మనకు, చరిత్ర విశదము చేయుచున్నది:

'రాయరాహుత్తు గండ రాచయేనుగు వచ్చి
అరట్లకోట గోరాడునాడు,
సమ్మెట నరపాల సార్వభౌముడు కంచు
తలుపుల కరుల ఢీకొలుపునాడు,
............................
.......................
తౌరంగి నిలు ఉక్కు జొచ్చిన తెరగుగాను
కన్నడంబేల జొచ్చితో గజపతీంద్ర!'

మొదలగు పద్యముల మూలమున, కవులు చరిత్రయొక్క గమనమునే మార్చియున్నట్లు తెలిసికొనగల్గుచున్నాము. మానాభిమానములకు మాన్యత యొసంగి, జనులు భగవంతునే నమ్మియున్న ఆ దినములలో, కన్నడరాజ్యముపై కటారిదూసి దండెత్తి వచ్చిన గజపతి, తాటియాకుపై వ్రాయబడి, తన కడకు పంపబడిన పై పద్యమును చదువుకొని సిగ్గుపడి తిరిగి వెడలి పోయెనట! ఇట్టి విషయములను చరిత్రమునుండి మరికొన్నింటిని చూపి, నాటి సంఘము కవి కొసంగిన యపార గౌరవమును నిరూపింపవచ్చును.

సంఘమునందు కవికి గౌరవ మొసంగబడుటచే, కవి మానవాతీతుడనుట సరికాదు. కవియే గాదు నాల్గు రూకలున్న ప్రతివానిని సంఘము గౌరవించును. చలనచిత్రమునం దుజ్వలముగ ప్రజ్వలించు తారల కీనాడు సంఘము జోహారుచేయుచున్నది! సరియైన కావ్యమును గాని, పద్యమును గాని యోపికతో పఠియించి, శబ్దగతార్థము నాలించి, శబ్దప్రయోగము నందలి పనివానితనమును గుర్తించి, సామాన్యుని దృక్పథమునకును, కవియొక్క దృక్పథమునకును గల యంతర మరసి, ఆనందించు భాగ్యమునకు సంఘమీనాడు సిద్ధపడి యుండలేదు.

సంఘ మొసంగు గౌరవమువలన గాక, పూర్వకథలయందు ప్రస్తరింపబడిన విషయసందోహమువలన గాక, చారిత్రిక విషయములవలన గాక, కవి, మానవుడై, మానవునికన్న మిన్నయని గుర్తింపబడుట కాతని బుద్ధి వైశారద్యమును, ప్రకటించు రచనములే యాధారములు :

'కనీనికల్ వికసితోత్పల పంక్తుల—గ్రసమ్మరింపగా' అని యొకచో నొక కవి యొక లేజవరాలి చూపులను వర్ణించియున్నాడు. ఇదెట్లు పొసగును? ఉత్పల పంక్తులు, ఎందును? వికసితోత్పల పంక్తులను, కనీనికలు గ్రసించుచున్నవట! ఇది ప్రకృతివిరుద్ధము కాదా? కనీనిక లెంత లేసి, వికసించిన కలువ లెంత లేసి! వానినవి గ్రసింపజాలునెట్లు? సామాన్య మానవుని కవగతమగుటలేదు. ఇచ్చట కావలసినది, యంతరార్థమగు భావము. కలువల యాకారమునకును, కన్నుల యాకృతికిని, కొంత సన్నిహితత్వ మున్నది. సుందరముల కన్నులు వికసించిన కలువలవలె నున్నవనుట, ఒక యందమగు భావన; కనీనికలనుండి వికసించిన కలువలు గ్రసింపబడుచున్నవనుట, ఒక యందమగు భావన కొయ్యారము నాపాదించుట! ఉత్పల పంక్తులు, వాని సౌందర్య, సౌకుమార్య, సౌరభ్య, సంపద లీ లేజవరాలి, విలాస, విభ్రమ, వీక్షణ పంక్తులతో సమన్వయించుకొని సందేశింపవలసిన బాధ్యత, రసజ్ఞుడగు పాఠకునియం దున్నది. అక్షరాస్యుడైనంత మాత్రమున నిది యవగాహనము విషయము కానేరదు. అందులకే, కవి మానవునికన్న మిన్నయనుచున్నాడు. ప్రతి పదార్థమును తెలిసికొనినంతమాత్రమున నిట్టి స్థలములయందు కవి హృదయము మన కందుబాటులోనికి రానేరదు. ఒక యపురూపమైన భావన శ్రోతల యనుభూతిలోనికి వచ్చిననే గాని, యిందలి పదము లర్థవంతము లైనట్లు తెలిసికొనజాలము.

'ప్రోవులువడ్డ వెలందినవ్వులే పూచినపూవులై,
తరగ ముత్తెములన్ వెలిగించు వెన్నెలై.' అని యొక కవి, 'స్నానసుందరిని' వర్ణించుచున్నాడు.

నవ్వులు ప్రోవులు పడుటేమి? అవి పువ్వులై, తరంగముల కలంకారమును గూర్చు వెన్నెల వెలుగులై, యలరారుటేమి? కేవలము శబ్దగతార్థమును గాంచి కలవరపడవలసిన పనిలేదు. శబ్దములయందలి ధ్వనిని, భావశబలతను, గుర్తించుటకు ప్రయత్నించుట యుక్తము. ఆ సుందరి నదియందు ప్రవేశించి, వెలువరించిన చిఱునవ్వులే పూవులవలె కనువిందు గూర్చి, వెన్నెలవలె కాంతిని గలిగించి, ఒక వినూత్న శోభను పరిసర ప్రదేశముల కాపాదింపజేసినదను భావ మిందు ప్రస్ఫుటమగుచున్నది. నవ్వులే పూవులై, వెన్నెల వెలుగులైనచో, ఆ సుందరి తనూ లావణ్యము,

వర్ణనమున కతీతముగదా! సాధారణ పాఠకునియందు సహితము క్రొంగ్రొత్త భావములను రేకెత్తించు కవి, యసాధారణుడు కాడా?

'ఎందరో తాజమహాలును సందర్శించి యున్నారు; నిర్మాణకౌశలమును ప్రవర్శించి యున్నారు; అందరితోపాటు తానును ఆ సుందర మందిరమును చూచిపోయినకవి, యేమనుచున్నాడు?

'ఒక్కొక్క రాతిలో నిమిడియున్నవి నేటికి
షాజహాను భూ
భుక్కు నెడందలో నుడికిపోయిన నా
డులలోని రక్తపుంజుక్కలు,'

మరియు:

'మొగలాయిరాజు తెలిగన్నులరాల్చిన బాష్ప
ధారలే పొదలి ఘనీభవించినవి,
ముద్దుల తాజమహాలు పోలికన్.'

అని యుదాహోగాన మొనరించి యున్నాడు.

మానవుని దృష్టియందు గన్పించినది, శిల్ప సౌందర్యము; కవిదృష్టియందు గన్పించినది, శిల్ప సౌందర్యమే కాదు, అంతకు మిన్నయగు, ఈ సుందర భవన నిర్మాణాశయమగు ప్రేమసౌందర్యము. ఆభవనము నందు చెక్కబడియున్న లతను, అపురూప లావణ్యమును చిందు విగ్రహములను, గాంచి, మన మానందించుచున్నాము. అధిక సౌందర్యవతియైన ప్రాణేశ్వరీ పరీరంభసుఖమున కాలము గడపి, ఆకస్మికముగ నామెను గోల్పోయి, తొడిమ సడలిన పూవు వలె నిరాధారుడైన సులతానుని హృదయావేదనమును గుర్తించి, ఆ యావేదనమునందు తానును, ఒక భాగస్వామియై, కవి, బాధ ననుభవించుచున్నాడు. అందులకే, 'ఉడికిపోయిన నాడులలోని రక్తపుంజుక్కలు' నేటికిని తాజమహాలు కట్టడమునందలి చలువ రాతిలో గానుపించుచున్నవని, కవి, కంట నీర్వెట్టుచున్నాడు. కోట్లకొలది ధనమును వెచ్చించి, పర రాజ్యములనుండి పనివారల నాహ్వానించి, వందల కొలది వత్సరములవరకు చూచువారి కానందము నొసంగు సుందరభవనమును భార్యసమాధిపై నిర్మించిన సులతానుని ప్రవిమల ప్రేమప్రభావమునకు కవి, సమ్మోదితాంతరంగు డగుచున్నాడు. సులతానుని కంటి బాష్పములే తాజమహాలుపోలికతో పొదలి ఘనీభవించిన వనుటలో కవిహృదయమునం దెంత యావేదన మీ దృశ్యము కలిగించెనో విశదమగుచున్నది. కేవలము బాహ్యసౌందర్యమునే గాక, ఒక కట్టడమునందే కాదు, ఒక కావ్యమునందే కాదు, ఒక మానవునియందే కాదు, పరమేశ్వరుని సృష్టియం దంతటను నిండియున్న యనిర్వచనీయమగు ప్రేమ సౌందర్యమును గూడ కవి, తాను రసార్ద్ర హృదయు డగుటచే, సామాన్య మానవునికన్న మిన్నగా గుర్తించి మానవాతీతు డగుచున్నాడు.

ఎచ్చట ప్రేమ యవ్యాజమో, ఎచ్చట సత్యమకుంఠితమో, ఎచ్చట నీతి నిశ్చలమో, అచ్చట తన కావ్య వస్తువును, కవి, తిలకించును. తిలకించి, హృదయము పులకింప, మానవున కతీతమైన భావములతో తన రచనావైభవమును ప్రకటించును.

ఒక ధనవంతుని యలరింప, ఒక సంఘమును సంతోషపరుప, ఒక ప్రత్యేక విషయమునకు ప్రచారము గావింప, వ్రాసిన కావ్యమునందు, మానవుని కన్న యన్నివిషయముల తక్కువవారై, కవి తన హృదయమును గోల్పోయి విహరించును. హృదయము లేని పద్యరచన, రసవిహీనమైన ఫలము, సౌరభ రహితమైన కుసుమము, వ్యర్థములు. అట్టి రచనమును గావించు వారు కవులు గారు, స్తోత్రపాఠకు లనదురు!

అన్ని వేళల ప్రజాదరణను పొంది, జాతియొక్క నిండుగౌరవమును నిలిపి, విజ్ఞానమును ప్రకటించు రచనములు, భాషకేగాదు, మానవజాతికే యలంకారములు. తెనుగువాని భాగవత, భారతములు, వాని భాషను, వాని జాతివైభవమును, నాగరికతను, విజ్ఞానమును, నేటివరకు మఱచిపోనీక నిలిపియుంచినవి. కవి మానవాతీతు డగుటచేతనే ఈ రచనములను నిలయింప సమర్థుడైనాడు, అందులకే, చిరంజీవియై వెలుగొందుచున్నాడు.

అరిజనభయంకరులై శతాబ్దాల సామ్రాజ్యము నేలిన మహారాజులు మాయమైపోయినారు. సామ్రాజ్యములు సమసిపోయినవి. కోట్లకొలది ద్రవ్యమును వెచ్చించి, నిర్మించిన రమ్యహర్మ్యములు కాలమహాపురుషుని దండాభిఘాతములచె విరిగి, విస్మృతివారాశిలో, విలీనమైపోయినవి. కాని—

'ఒరు లేయవి యొనరించిన
నరవర! యప్రియము తన మనంబునకగు తా
నొరులకు నవి చేయకునికి,
పరాయణముపరమ ధర్మపథముల కెల్లన్.'

అను నీలమువంటి నీతిని ప్రకటించు, కవిరచనములు, కాలమును ధిక్కరించి, మానవజాతి నిలచి యుండువరకు వారి రసనాగ్రములపై బ్రతికి యుండి, మానవజీవితపథ నిర్గమమున కనుకూలమగు విజ్ఞానకాంతిని, వెలార్చుచునే యున్నవి!

కవి చిరంజీవి; వాని రచన లనపహార్యములు.

---

# రక్తమాల



శ్రీ కోట సుందరరామశర్మ

"ఈ నాటికి మా అమ్మాయి సంబంధం నిశ్చయమైనట్లే, వదినా నిజంగా రెండు సంవత్సరాలబట్టీ తిరిగి తిరిగి, వెతికి వెతికి ప్రాణం వేసారి పోయిందంటే నమ్మూ. ఏమో పక్క వీధులో వాళ్ళొచ్చాయి. అమ్మాయిని తీసుకురావాలన్నా చెయ్యాలన్నా వైళ్ళకు డబ్బు పొయ్యక్కర్లేదు. దొడ్డి వాకిట్లోంచి కేక వేస్తే వినపడేటంత దూరము—" అంటూ తన ఆనందాన్ని వెలిబుచ్చుతోంది పిచ్చమ్మగారు.

"నారాయణరావుగారి కొడుక్కేగా—పిల్లాడి కేమమ్మా నిక్షేపంలాంటి తునక. ఓ సిగరెట్లూ అవీ లేవు—దారే పోయి దారే వచ్చేవాడు. ఈ మధ్య కొస్త పెద్దవాడయినాడని పలకరించడం మానేశాను గాని మొన్న మొన్నటి దాకా మా యింట్లో ఆడుకొంటూ ఉండేవాడే కొడుకమ్మా—ఏమో, పాపారావును మాసినప్పుడల్లా మా గోపాలుడే జ్ఞాపకానికి వస్తాడు. బ్రతికుంటే వాడూ యీ పాటికి యీ పాపారావుతో బాటు డాక్టరీ మూడో సంవత్సరం చదువుతూ ఉండే వాడు. అయినా పెళ్ళి సంబంధపు మాటల్లో యీ ప్రస్తావన దేనికిలే—" అని కళ్ళు తుడుచుకొంటూ వెంకాయమ్మగారన్నది.

సరోజకు పదహారేళ్ళు నిండినాయి. చిన్నప్పుడేమో కళ్ళు కొంచెం చిన్నవని వాళ్ళ చుట్టాలంతా ఆక్షేపించే వాళ్ళట గానీ యీడు వచ్చిం తర్వాత తామరరేకుల్లాగా విచ్చాయన్నాడు వాళ్ళ మేనమామే ఓసారి ఊరినుంచివచ్చి-ఏదో కాలాన్ని బట్టి స్కూలు ఫైనలు దాకా సుబ్బారావుగారు కూతురికి చదువు చెప్పించాడు గాని, ఆపైన తన తల్లి రామాయమ్మగారు ఆడపిల్లలకు, పెద్ద చదువులు చదివించడం దేనికని అనడంచేత మాన్పించి యింట్లోనే తెలుగూ, సంస్కృతం, హిందీ బాగా చదివిస్తున్నాడు. నాయనమ్మ చచ్చిపోయి సంవత్సరంన్నరయింది—సంవత్సర సూతకం కొబట్టి పెళ్ళి చెయ్యడానికి [illegible] కాని సంబంధాల [illegible] చూస్తూనే ఉన్నారు. సుబ్బారావుగారేమీ [illegible] పరుడు కాడు. ఏదో బ్యాంకులో [illegible] రూపాయల జీతంతో [illegible] రాల పంటతోనూ, కుటుంబాన్ని గుట్టుగా సంసారం [illegible] న్నాడు. నిజంగా సరోజను [illegible] మాత్రం జీతం నాతం [illegible] పోయేవాడే.

[illegible] వందపై చిల్లర [illegible] సంబంధం [illegible] క్రింద [illegible] సుబ్బారావుగారు. రెండు సంబంధాలు [illegible] నాయి కాని తాంబూలాలు పుచ్చుకోవడానికి వస్తామని ఎందుకో ఎగగొట్టారు. ఎందుకో ఏమిటో, [illegible] కంటే కట్నం ఎవరో ఎక్కువిస్తామంటే, ఏదో సాకు చెప్పాలని [illegible] వంశంలో [illegible] పెళ్ళికి రానంటున్నవని ఒక [illegible] కొడుకు [illegible] న్నారు. అసలు కట్నమే [illegible] — అసలు కంటే వడ్డీ ప్రియమైనట్లుంది—[illegible]— పాప మేమిటి అంటే—ఆ అబ్బాయికింకా వివాహం కుదరలేదుట. [illegible] ఆశను అంటుతెగు, [illegible] కక్కడికి ఎక్కువ రాబట్టాలనే ప్రతి [illegible]— వరపక్షం వాళ్ళన్న మాట—సరే ఇంకో, సంబంధం వాళ్ళు సుబ్బారావుగారు ఐదెకరాల పొలం [illegible] పేర పెట్టాలనీ, రెండు వేలయినా సంబంధం పోతే లాభం లేదనీ ఎవరో ముగ్గ పుల్లలు పెట్టడం [illegible] వదులుకొన్నారు. వాళ్ళు వదులుకోవడమే మంచిదయింది లెండి—సంబంధం వదులుకొన్న నెలకల్లా మశూచికం తగిలి వాడు పోయినాడు.

సరోజ అడిగింది "నాన్నా, అమ్మపేర ఉంది. అర ఎకరం పొలమేగా" అని. అవునమ్మా, [illegible]

మీ అమ్మ పెళ్ళినాడే పసుపుకుంకం క్రింద అర ఎకరం రాసిచ్చాడు. మీ పెద్దమ్మకు అంతే, పిన్నికి కూడా అంతే—సరోజ అంది "ఐతే ఐదెకరాలున్నదని పుకారు ఎవరు పుట్టించారు" అని. అంతా వట్టి మాయ అనుకో అమ్మా, లోకులు పలుగాకులు న్నాడు సుబ్బారావు.

సరోజకు నిజంగా పెళ్ళి కొడుకులు ఈ కట్నాల కోసం చేసే బేరాలు, తిరిగి పోవడాలు చూస్తే ఆశ్చర్యం కలిగిస్తోంది—ఒకనాడు సావిత్ర్యుపాఖ్యానం చదువుతూ "అమ్మా, మాతావుటే, సత్యవంతుడి తండ్రేమో రాజ్యం పోగొట్టుకొన్నవాడు—సావిత్రి తల్లిదండ్రులు మహారాజులైనా సత్యవంతుడికిచ్చి పెళ్ళి చేశారు. సత్యవంతుడు ఏం కట్నం పుడిగాడు?" పిచ్చమ్మ అంది.

'తల్లీ, అవన్నీ సత్యకాలపు రోజులు. ఇది కలియుగం కనకనే, బుద్ధులిట్లా ఉన్నాయి గనుకనే కగువు లిట్లా మండిపోతున్నాయని'

ఉండడానికైతే పట్నవాసమే గాని సుబ్బారావుగారిది సామాన్యపు సంసారం కావడంవల్ల ఇంట్లో అందరిమాటలూ, నడవడీకూడా తెలుగుమీరిన ట్టుండవు. పాపారావుతండ్రి నారాయణరావుకీ సుబ్బారావుగారికీ ఎంతో స్నేహం. నారాయణరావుగారు రోజూ ఇంగ్లీషుపత్రికా, తెలుగుపత్రికా కూడా తెప్పిస్తాడు. సుబ్బారావుగారు రోజూ ఉదయం వెళ్లి వాళ్ల వరండాలో కూర్చొని ఒక అరగంట పత్రికలు చదివివస్తాడు.

నారాయణరావు: "ఏమండీ సుబ్బారావు గారూ, మీ అమ్మాయిని కాలేజిలో చేర్పించేటేమో, మంచి పని చేశారు. ఈ పెద్దచదువులు చదివిన అమ్మాయిలకు పెళ్లిళ్లు కావడం కష్టంగా ఉందండి. ఈమధ్య హిందీరాష్ట్ర పరీక్షో ఏదో ప్యాసయిందటగా.

ప్రక్క గదిలో ఉదయమే కాలేజీకి పోవలసిన "మెడికో" పాపారావు సూటువేసికొంటూ ఈ మాటలు విన్నాడు. పరధ్యాన్నంగా ఉండి ఫౌంటెన్ కలము మర్చిపోయి వీధులోకి వచ్చాడు. సుబ్బారావుగా రన్నారూ, "ఏమోయి, పాపారావు, చదువు హడావుడి ఎక్కువగా ఉన్నట్లుంది. బాగా చదువుతున్నావా! ఎక్కడా కనపడటంలేదు?" పాపారావు నమ్రతతో అన్నాడు. ఏమిటోనండీ, ఇంటర్ చదువుతున్నంతకాలం చాలా విశ్రాంతి ఉండేది కానివ్వండి, ఈ మెడికల్ కాలేజీకి వచ్చాక కోర్సులన్నీ ఒక్కమాటు పెరిగిపోవడంచేతా, దానిచేతా, బాగా చదవకపోతే లాభంలేదని సీనియర్లు చెప్పడంచేతా, ఎప్పుడూ కాలేజీ, ఆసుపత్రి, ఈగొడవే సరిపోతోందండి" అంటూ చేతిగడియారం వంక చూచాడు. "పాపం. లైటు మయినట్టుంది, వెళ్లిరా నాయనా" అని సుబ్బారావుగారన్నాడు. వస్తానండీ అని గబగబా బూట్లుచప్పుడవుతూ, పాపారావు వీధులోకి వచ్చాడు. అప్పుడే దొడ్డివాకిలి తీసి సరోజ వంకాయలు అమ్మేవాడెటుపోయాడో చూస్తోంది. పాపారావును చూసి కొంచెం సిగ్గుపడి తలుపు వెనక్కు వచ్చింది. పాపారావు కూడా సరోజను చూశాడు గాని జేబు తడవుకొని ఫౌంటెన్ కలము లేకపోవడం మూలాన వెనక్కు ఇంటివైపు తిరిగాడు. బూట్లు చప్పుడు ఆగిపోవడంచేత కుతూహలంతో సరోజ మళ్లా దొడ్డిగుమ్మంలోంచి వీధిలోకి తొంగిచూచింది. పాపారావును నిజంగా ఈమధ్య సరోజ చూడడం పడనేలేదు. నాయనమ్మ పోయిన నక్షత్రం మంచిది కాకపోవడంచేత దొడ్డి వాకిలి తీసుకువెళ్లడమూ, అందుచేత ఆ వాకిల్ని ఆగ్నేల్లు కట్టివెయ్యడమూ జరిగింది. ఇంతలోకే వానకాలంలో వచ్చిన ఉప్పెన గాలికి దొడ్డిగుమ్మం కూలిపోవడమూ, అది బాగు చేయించడానికి ఇదిగో అదిగో అంటూ జాప్యం చెయ్యడమూ జరిగింది. పాపం సుబ్బారావుగారు నిత్యమూ పత్రిక చదువుకోడానికి వీధి అంతా తిరిగి వెడుతున్నాడు. బాగుపడ్డదాకా దొడ్డిగుమ్మంలో వాసాలుపాతి మూసే పెట్టుకున్నారు. కొత్త పంటలో డబ్బు చూచుకొని ఏదో మళ్లా నిలబెట్టాడు గుమ్మము సుబ్బారావుగారు రోక పదిహేనురోజుల క్రితమే. పెళ్లి సంబంధాలవారెవరైనా వచ్చి చూస్తే దొడ్డి గుమ్మము పడిపోతే, ఇంకా పెట్టించడానికి కూడా గతిలేదనుకొని పోతారేమోనని పిచ్చమ్మ నాలుగు నెల్లబట్టి పాపం అంటూనే ఉంది. ఇప్పటికిగాని పడలేదు గుమ్మం బాగుచేయించడం.

"ఎంత పొడుగెదిగాడు, పాపారావూ, కొంచెం లావుకూడా ఎక్కినట్లున్నాడే" అను

కుంది అమాయికపు సరోజ. ఎందుకనో అభిమానం కూడా ఉదయించింది పాపారావంటే ఆమె మనస్సులో. నిజంగా పాపారావు ఆమె అనుకొన్నంత పొడుగూ ఎదగలేదూ, లావూ ఎక్కలేదూ. సూటూ, బూటూలో ఉన్నవాడట వెనకనించి చూస్తే అలా అనిపించింది సరోజకు, అంతే— పాక్ షేక్ షేక్ తీసుకొని రెండు నిమిషాల్లో పాపారావు మళ్ళా వీధిలోకి వచ్చాడు. సరోజ ఇంకా అక్కడే ఉండడం చూశాడు. చిరునవ్వు అతని పెదవులమీద తొంగిచూచింది. సరోజ పమిట సర్దుకొంటూ ఏం పాపారావూ అని నోటిదాకా వచ్చిన మాటలూ మింగుకొంది. ఇంకా కాస్సేపు పాపారావు తన వంకచూస్తే ఏమైనా అనేదో ఏమో మనకు తెలీదుగాని, పాపారావు గడియారంవంక చూచుకొంటూ, తలవంచుకుని చరచరా నడిచిపోయినాడు—

ఈడువచ్చిన పిల్లవు, అటూ ఇటూ తిరక్కూడదమ్మా అని తల్లి అంటూఉండడంచేత సరోజ ఎప్పుడూ సాధారణంగా ఇల్లుకదలి వెళ్ళదు. పాపారావు మ్యునిసిపల్ స్కూల్లో ఐదో క్లాసు చదువుకొనేటప్పుడు తానక్కడే రెండో క్లాసో మూడో క్లాసో చదువుకొంది. అప్పుడంతా కలిసి ఆడుకొన్నారేమో కాని అతడు మగపిల్లల బళ్ళోనూ, నాలుగో క్లాసునుంచీ తాను ఆడపిల్లల బళ్ళోనూ చేరి చెరొకప్రక్కకు బళ్ళోకి వెడుతూ ఉండేవారు. పైగా ఇంటర్ అతడు సొంతఊళ్ళో సీటుదొరకని కారణంచేత మేనమామల ఊళ్ళో చదివాడు—

పాపారావు ఒకనాటి సాయంత్రం ఇంటికి వచ్చాడు. నారాయణరావు భార్యతో అన్నాడు—సుబ్బారావుగారికి కూతురు సరోజను మన పాపారావుకి ఇద్దామని ఉందట. తాను అడగడానికి బిడియపడి బాగుండదు కూడాగా మరీ—వెంకట్రామయ్యచేత అడిగించాడు. ఏమంటావు? కట్నం ఏం పెట్టగలడూ, పాపం పైగా మన అబ్బాయి ఏమంటాడో" అన్నాడు—పాపారావు కాలేజీలో మీటింగుఉండి చీకటిపడి ఇంటికివచ్చి వరండాలో నిలబడ్డాడు. తలుపువేసుంది. పిలుద్దామనుకొంటూంటే లోపల్నుంచి యీ మాటలు వినిపించినాయి. కుతూహలంతో తల్లి ఏమంటుందోనని తలుపుదగ్గరే నిలబడి వింటున్నాడు. తల్లి అంటున్నది తండ్రితో, ఏమో, మనం ఇవ్వేళ ఏ నాలుగువేలో ఎవరిదగ్గర్నా పుచ్చుకోంగానే, సరా, రేపు మన లలితకు ఇచ్చుకోవద్దూ, ఇస్తారనుకోండి ఎవరు పడితే వాళ్ళే. అయినా అబ్బాయికి యీడేగీ వడిసారం పందొమ్మిదివెళ్ళాయో లేదోను" అంది. "అదేమిటే ఇరవైయొకటి వచ్చిందే" అన్నాడు తండ్రి. మరి కట్నం ఏం ఇవ్వగలరని అన్నాడు వెంకటరామయ్య. "పిల్లవాడికి పిల్లా, పిల్లకు పిల్లవాడు కట్నమూను. మన సుబ్బారావు ఏమివ్వగలడూ పాపం. ఏదో వెయ్యి వరకు వెనుక ఇస్తామన్నాడు ఒకరికి. మహా ఐతే ఇప్పుడు ఇంకో అయిదువంద లివ్వగలడేమో అన్నాడు వెంకట్రామయ్య" అని తండ్రి.

తల్లి: రెండైనా ఇవ్వమనటండీ?

తండ్రి: అసలు సంబంధం నీకు నచ్చిందా, ముందు?

తల్లి: సరోజ కేమో, చక్కని చుక్క మెట్రిక్కు ప్యాసయిందట—

రాష్ట్రహిందీ కూడా అయిందట.

ఇంతకూ అబ్బాయి ఏమంటాడో?

తండ్రి: అన్నట్టు వీడింకా రాలేదు?

తల్లి: కాలేజీలో ఏదో మీటింగుంది అన్నాడు. ఈపాటికి రావలసిందే నే చూడండి, వస్తూఉంటాడు.

తండ్రి తలుపుతియ్యబోతుండగనే పాపారావు వీధిలోంచి అప్పుడే వస్తున్నట్లు నటించి, ఏం నాన్నా ఎక్కడికీ అన్నాడు. ఎక్కడికీ లేదురా, నాయనా నీ వింకా రాలేదని మీ అమ్మ ఇదవుతూంటే, వస్తున్నావేమో అని తలుపుతీసి చూస్తున్నా నూరేళ్లు ఆయుస్సు అంటూ తల్లి కూడా వచ్చింది.

* * * * *

"వరే, అబ్బాయ్, సుబ్బారావుగా రమ్మాయి సరోజను ఎరుగుదువురా" అన్నాడు నారాయణరావు. ముందు పాపారావు సిగ్గువచ్చి తల వంచుకొని మాట్లాడకుండా కూర్చొన్నాడు గానీ, తండ్రి "ఏం రా, ఎరగవూ" అనేసరికి "ఎరక్కేం" అన్నాడు. పక్కలు వేస్తూఉన్న తల్లి వచ్చి "సరోజను పెళ్లిచేసుకొంటావుట్రా, అబ్బాయీ" అని అడి

గింది. "ఏమోా, మీ యిష్టం" అన్నాడు అమాయకుడు పాపారావు. కట్నం పెంచనలేదు. అంతకంటె చదువు కొన్నది కావాలనలేదు. తండ్రి అన్నాడు "ఏమో నాయనా, ఈ కాలేజీ చదువులు చదివిన పిల్లల్ని ఇస్తామని వస్తున్నారు గాని మీ అమ్మ అంత చదువు కొన్న పిల్లని వద్దంటోంది". తల్లి అందుకొంది "సరోజమాత్రం చక్కనిది కాదా, చదువుకో లేదా! ఇంగ్లీషూ, హిందీ, సంస్కృతమూ వచ్చుట. తల్లి చెప్పినట్లు అన్ని పనులూ నేర్పిందట. ఎప్పుడయినా చూసితే — అసలు వెళ్లటమే లేదు ఈమధ్య వాళ్ల దొడ్డి వాకిలి దాటిపోయినప్పుడల్లా నన్ను చూచి — చుట్టుతిరిగి వెళ్లలేక — "రా, అత్తా, రోజూగా రావటం మానేశావు" అని నాచుట్టూ కొని మెచ్చుకుంటుంది. కట్టిన అల్లిక దిమ్మలు నాకిచ్చింది. మల్లెపూలదండ తెచ్చింది, ఓనాడు. ఏం చక్కగా ఉంటుందని చెప్పనూ,"

"పాపం, సంక్రాంతయ్యతో ఏ సంగతీ రేపు నియం చెప్తానన్నాను. ఏం, రా అబ్బాయి. మరి నీ అభిప్రాయం చెప్పు" అన్నాడు తండ్రి. "వాడొప్పు కున్నట్టే, చిన్నవాడు వాడికేం తెలుసు" అంది తల్లి. తండ్రి అన్నాడు "అలా కాదు, వాడి నోటివెంట కూడా వినాలని. పోనీ సరోజను చూస్తావుట్రా మరొకసారి. ఆ పక్కకూడా అడుగుతున్నారు వెంకట్రామయ్య" అన్నాడు తండ్రి. తలవంచుకొనే "చూడక్కర్లేదు" అన్నాడు పాపారావు. నిజంగా పాపారావు పాత కాలం వాడు, మరి ఒప్పుకొన్నట్టేనా అన్నాడు తండ్రి. "మీకిష్టమైతే సరే" అని పుస్తకం వంక చూస్తూ, పేజీలు తిరగవేస్తూ అన్నాడు పాపారావు. "రంపే వాణ్ణి చదువుకోనివ్వండి, ఇంకో నెలకు పరీక్షలుట." అంది తల్లి.

*　　*　　*　　*

పైన చెప్పినట్లు పాపారావుకీ సరోజకూ సంబంధం నిశ్చయమైంది — పరీక్షలయిన తర్వాత వైశాఖ పద్ధంలో ముహూర్తం పెట్టారు. జాతకాలు చూపించాలని పిచ్చమ్మ అంటే సుబ్బారావుగారు సిద్ధాంతి గారింటి చుట్టూ నాలుగు మాట్లుతిరిగి, చాలా బాగుందన్నారు, సిద్ధాంతిగారన్నారు పిచ్చమ్మతో.

పెళ్ళి నాటికి మల్లెపూలదండ స్వయంగా గుచ్చి పాపారావు మెడలో వెయ్యాలని సరోజ నీళ్ళు పోస్తూ మొక్కలు పెంచుతోంది చక్కగా. సరోజ మంచి ఉత్సాహంతో సంస్కృతమూ, హిందీ చదువుతోంది.

సావిత్ర్యుపాఖ్యానం అంటే ఎందుకో సరోజకు మొదటినుంచీ ఇష్టం. సత్యవంతుడితో పాటు సావిత్రి కూడా అడవికి వెళ్ళింది. సత్యవంతుడికి శిరో వేదన వచ్చింది. కట్టెలు కొట్టడం ఆపి వేసి సావిత్రి తొడమీద తలపెట్టి పడుకున్నాడనే ఘట్టం చదివి ఎంతో సేపు మనస్సులో ఇదయింది పాపం.

*　　*　　*　　*

పాపారావుకు ఎందువల్లనో సన్నిపాత జ్వరం తగ్గు మొగమే లేదు. ఇంకా ముహూర్తం పది రోజులుంది. పోనీ శ్రావణంలో చెయ్యవచ్చుననుకొన్నారు వీళ్ళూ, వాళ్ళూ కూడాను. సరోజకు ఎంతో దిగులుగా ఉంది. మూడో వారంలో తగ్గుతుందని డాక్టర్లు ఆశలు పలుకుతున్నారు. సుబ్బారావుగారు రోజూ ఉదయమూ, సాయంత్రమూ ఎల్లా ఉందో అని కనుక్కొని వస్తూనే ఉన్నారు.

మూడవవారం దగ్గినట్లే తగ్గి రేపు ముహూర్తమన్న రోజుకు క్రితం రోజు సాయంత్రం సంధి పుట్టిందిట పాపారావుకు. ఏముందీ, తెల్లవారలేదు ఆ యింట్లో.

*　　*　　*　　*

పురోహితుడు మన ఆచారాలకు పనికిరావన్నా తోటి మెడికల్ విద్యార్థులు గులాబిదండలు తెచ్చి శవానికి వేశారు. సాయంత్రం మూడుగంటలకు గాని శవము ఎత్తడం జరగలేదు. "ఇంకా నయం పెళ్ళయింది కాదు — సరోజ గొంతుకోసినవాళ్ళ మయ్యే వాళ్ళం" అంది పిచ్చమ్మ వెంకాయమ్మ వీధివాకిట్లో. సుబ్బారావుమాత్రం శవం కదిలించాకా ఉండి, నూతిదగ్గర స్నానంచేసి గదిలోకివచ్చి బట్టల్లు కట్టుకొంటున్నాడు.

కొంచెంసేపటికి పక్కఇంటి రామారావు, పండ్రెండేళ్ళ కుట్టివాడు వచ్చి సుబ్బారావుగారూ, సుబ్బారావుగారూ మీ సరోజ గులాబిపువ్వులదండ పుచ్చుకొని వీధిలో పరుగెత్తుతోందండోయ్" అని కేక వేశాడు.

సుబ్బారావుగారింకా బనీను తొడుక్కుంటున్నాడు. అల్లాగే వీధిలోకి వచ్చాడు. కంగారు

పడి పిచ్చమ్మ సరోజ ఇంట్లో ఉంటేమో అని అనుకుం టోంది—"ఈ వీధిలో కాదండీ, విసెంటు రోడ్డు మీద. పాపారావును ఆ దారినే తీసుకువెళ్లారు." అన్నాడు రామారావు.

సుబ్బారావుగారు వెళ్ళేసరికి విసెంటురోడ్డు చివర మలుపులో జనమంతా సందడిగా ఉన్నారు పోలీసువాళ్ళిద్దరు జనాన్ని సర్దుతున్నారు. పాపారావు శవానికి తానూ ఒక దండ వేద్దామని సరోజ ఉద్దేశం. ఏ మెడికల్ విద్యార్థికైనా ఇచ్చి శవంమీద వేయిద్దామనుకొంది. మెడికల్ విద్యార్థులంతా పాపారావు శవంతోబాటు వెళ్లుతున్నారు. శవం ఒక వంద గజాల దూరంలో ఉంది.

మలుపులో పరుగెత్తుతున్న సరోజను ఒక లారీ ఢీకొంది. సరోజ దెబ్బకు మూర్ఛపడిపోయింది. చేయిమాత్రం ఆ గులాబిదండను విడవలేదు. ముఖం అంతా కొట్టుకుపోయింది. లారీచక్రం సగంమీంచి వెళ్ళిందన్నారు కొందరు. ఏమైనా ముఖం, వక్ష స్థలం, అంతా రక్తమయమైపోయింది. లారీచక్రం ఆమె మీదనుంచిపోలేదని పోలీసు అన్నారు. చల్లనినీరు తెచ్చి ముఖంమీద చల్లారు. కొంత కళ్లువిప్పి "పాపా...రావు...ఈ...దండ" అంది సరోజ. సుబ్బారావుగారి మాట వింటూనే అక్కడికి వచ్చి చేరుకొన్నారు. బండిలోవేసి ఆస్పత్రికి తీసుకొనిపోవాలని ఒక రిక్షా తీసుకువచ్చారు. ఇంతలోనే మెడికల్ విద్యార్థులు ఆ గలభా విని వెనుకకు వచ్చారు. ఒకరు సరోజ స్థితిచూచి పెదవి విరిచారు. ప్రక్కనున్న మరొక మెడికోవంక చూచారు. అప్పటికే సరోజ శ్వాస తగ్గింది—కాని చేయిమాత్రం గులాబి రక్తంలో తడిసిన పూలమాలను వదలలేదు.

శవం అక్కడే నిలిచిఉంది. రిక్షా ఆ దారినే ఆసుపత్రికి పోవాలి. అంబాకా వచ్చేసరికి సరోజ ఊపిరి అనంతాకాశంలో కలిసిపోయింది. ఒక మెడికో ఆమె చేతిని పాపారావు శవంమీదికి లాగి, చేతిని విదల్చగా, రక్తమాల పాపారావు శవాన్ని అలంకరించింది.



# సముద్ర ఘోష 

శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

ఈమా వేదన కంతులేద ఒకనాడేని! తమోధూమ మా
లాయంత్రంబున నామనస్సు కొసలెల్లన్ బట్టి బంధించి నా
రోయీ! ఓయి దయామయా! కృపణులేరో;—మాటలే పైకిరా
నాయాసంబగు! పాటలెక్కడిక! దృశ్యాదృశ్య భావాళటో!!

ఏవో అందని ప్రాని పండులకు అర్రెత్తన్ వృథాయాసముల్
గావా! ఎందుకు ప్రాకులాడెదరో! ఏకగ్రీవ రావస్రవ
ద్ద్వ్యావా భూములు కాహళంబు లిటు లూదన్ బాధిరోద్బోధమే
నా!? విద్యున్నయనాల శోణితపు సాయంసంధ్య లేనా!? నిశల్.

ప్రాతర్ముగ్ధనవారుణాగ్రకిరణ ప్రత్యగ్రమాంభోజరే
ఖాతిర్వాంతర వేదనా మధుశలాకల్ నన్ను కవ్వించునా!!
చేతస్స్యంది మృదుప్రకోపసుమమాస్నేహాంతదృక్కోణ వీ
ణా తంత్రీవిధురోజ్వలస్వరము లేనా! నన్ను నవ్వించునా!!

గుండెను విప్పి, గొంతుకను కొంచెము కొంచెముగా విదల్చి, నే
కండగలట్టి గీతములు గానముజేయగ వద్దటంచు కై
దండను బట్టి ఆపిరిగదా! మథనోగ్ర సముద్రతాండవో
చ్చండము నామనోంతరము సాగరగర్జలు సల్పదా ప్రభూ!

పీడితమానవావసుమిూ యిది! భూతదయార్ద్రభావమా
మ్రేడితమై స్వతంత్ర మధురీకృత రాజస ముర్విపండునో!
కూడిక లేని లెక్కలను కూడుడమన్న మహాశలో, నిరా
శాడమరంబు రెక్కలను చాచిన శాంతికి ప్రాంత మెప్పుడో!!

నాకంఠంబున ఈశివిపాదరుతులే నగ్నంబులై—భగ్నముల్
నై—కాంతాప్రియసమ్మితంబులయి, ఏలా పొంగునో! నాకు నా
కేకాదర్శము! అంతులేని అదయాకాశంబుపై కోపమే
నో! కారుణ్యమొ! తేలుదాక కృతులన్ దోసిళ్లబోతున్ విభూ!

నాకు తలంపు గల్గు; కవనప్రవణాశ్వగతిస్సపత్నని
ర్వ్యాకమునన్; విభాతశబలాతి దిగంత తరంగభావకృ
న్నాకములన్; పయోదరఘృణా సహసాపరిరంభగుంభనో
త్సేకమునన్; స్వతంత్ర పరిణాహ జనాభ్యుదయాశయంబులన్

# హిందుస్తాన్ కో-ఆపరేటివ్

## ఇన్స్యూరెన్సు సొసైటీ లిమిటెడ్.

(హెడ్డాఫీసు—కలకత్తా)

నమ్మకమునకు, స్నేహపూర్వకమైన లావాదేవీలకు పేరొందిన కంపెనీ. గత 44 సం॥ ల ప్రజాసేవలో సొసైటీ సంపాదించిన గొప్ప ప్రజాదరణకు యీ అంకెలే ప్రబల తార్కాణము.

1950 లో పూర్తిచేసిన వ్యాపారం— రు. **13,75,00,000**

1949 లో అమలులో వున్న మొత్తం భీమా రు. **69,73,23,218**

ఆంధ్ర జిల్లాలలో సొసైటీ యేజంట్లుగా పనిచేయదలచి సమర్థత గౌరవముగలవారు విజయవాడలోని సొసైటీ బ్రాంచి ఆఫీసుకు వ్రాయగోరెదము.

**హిందుస్తాన్ బిల్డింగ్సు,**

పో. బా. నెం. 12, బకింగ్‌హాంపేట పోస్టు,

**ఐ. కె. రాయ్,** బ్రాంచి మేనేజరు,

**విజయవాడ**

---

బాధపడు సహోదరీ మణులకు బుద్ధిమతి



స్త్రీల ఆనందానికి

# స్త్రీసుధ

ఒక నెలకు

1 తులం రు. 4 లు.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి & సన్సు
రాజమండ్రి

---

**చంటిపిల్లలు**- లివర్ అండ్ స్ప్లీను వ్యాధులను 'ఉపశాంతకి' అతిశీఘ్రముగా నివారణ జేయును. మరియు సమస్త అనాసలు అనగా విరేచనము బాధతోను, బద్ధకముగాను అగుట, అజీర్ణము, ఆసనమునందు పుండ్లు నివారించును.

**గర్భిణిస్త్రీలు**- సునాయాసముగా ప్రసవించుటకు, ఆరోగ్యసంతానము కలుగుటకు 'అమృతసంజీవినీ మాత్రలు' ప్రఖ్యాతిగాంచినవి. వేవిళ్లు, వికారములు, సోమరితనము, నిస్సత్తువ తగ్గించి ఉత్సాహము కలుగజేయును.

స్త్రీల ఋతుశూలలను మా శతమూలికాది లేహ్యము కాంపౌండు ఘంటాపదముగా నివారించి సంతానమును కలిగించును.

శ్రీ భుజంగరాయ వైద్యశాల, 18

ప్రొప్రయిటర్సు: పి. వేరయ్య & సన్సు

తాళ్ళరేవు, తూర్పుగోదావరి జిల్లా.

# ఆంధ్రకవులు - ఏకకథావృత్తగ్రహీతలు



శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి

ప్రతి భాషయందు వివిధకాలములందు నాయా దేశ జనుల యాదరాభిరుచులనుబట్టి వివిధరూపముల వాఙ్మయము వెలయును. సంఘమున శ్రవణాభిలాషయున్నపుడు పురాణ ప్రబంధాది శ్రవ్యకావ్యములను కవులు రచింతురు. మఱియొకకాలమున నా జాతియే గానముపై నభిమానము చూపుచో నా కథావస్తువునే గేయ ద్విపదరూపముల రచించి కవులు గానాభిరుచినిగూడ వృద్ధిచేయుదురు. ఇంకొక కాలమున నా సంఘమే దృశ్యనాభిలాష గలిగియున్నచో నా కథావృత్తమునే కవులు నాటకములు, యక్షగానములుగా రచించి ప్రజల నెక్కువ యాకర్షింతురు. ఒకొక్కప్పుడు ఆ కథనే దండకరూపమునగూడ కవులు రచించుట గలదు. ప్రస్తుత కాలమున పఠనోత్సాహము పెరిగినపుడా కథావిషయమే నవల, కథానకరూపములుతాల్చును. ఈ విధముగ కవిగూడ నా సంఘమున నొకవ్యక్తి యగుటచే, నా సంఘమందలి సారస్వతాభిరుచులు తనయందుగూడ సమానముగా నుండును గాన, నా యభిరుచులకు ప్రతినిధియై యా యభిరుచులనే ప్రతిపాదించును. ఇట్లు సాంఘిక పరిసరములకు, వాతావరణమునకు వశ్యుడై కవి తదనుగుణముగ నొకొక్కప్పుడు పురాణ రచయితగను, ప్రబంధ కవిగను, నాటక కర్తగను, కథకుడుగను మాఱిపోవుచుండును. ఈ రీతి కవి సంఘమునకు వశ్యుడై, సంఘమునకు ప్రతినిధియు, మార్గదర్శకుడు, నుపదేష్టయు గూడ నగుచున్నాడు. ఇందుచే కవికి దేశకాలాభిరుచులను బహు జాగ్రత్తతో పరిశీలింపవలసిన యావశ్యకత యుండును.

సామాన్యముగ నొకదేశమున నొక్క కాలమున ప్రాముఖ్యమునొందిన వాఙ్మయశాఖ మఱియొకకాలమున గౌరవము నొందదు. ఎందుకన నా కాలమందలి సారస్వతాభిరుచులు సంఘమున నీకాలమున మారిపోవుటయే. ఇదియొక గొప్ప విచిత్రము. సంఘముతోఁబాటు, సంఘమందలి యితరాభిరుచులవలె, సారస్వతాభిరుచులకు జననము, నభివృద్ధి, పతనము గూడ నుండును. ఒక యభిరుచి మహోత్సాహముతో విజృంభించుచున్న కాలమున సామాన్యముగ మఱియొకవిధమైన యభిరుచికి గౌరవముండదు. ఒక రుచిని సంపూర్ణముగ, సంతృప్తికరముగ ననుభవించిన తర్వాత సంఘమునకు దానిపై నిరాదరణయును విరక్తియు క్రమముగా నసహ్యతయు దోఁచును. ఇదియే యభిరుచికి పతనము. ఇట్టితఱి నూతనాభిరుచులపై నాశలు ప్రాకును. క్రొత్త యొక వింత, ప్రాత యొక రోఁతకదా. నూతనాభిరుచులు విదేశసంఘముల తోడి సంపర్క ప్రభావముననైన బయలు దేరవచ్చును. లేదా కవి ప్రతిభవలననైన గావచ్చును. ప్రతిభావంతుడైన కవి నితరు లనుసరింతురు. ఈ సందర్భములో నొకరి నొకరనుకరింతురు. మఱికొందఱు స్పర్ధచే నొకరు సృష్టించినదానినే మఱియొకరు మరల రచింతురు. ఆంధ్రవాఙ్మయమున కావ్యరచన చంపూమార్గమున సాగగా, సర్వజన సామాన్యముగా నుండుటకై యపూర్వపద్ధతిని ద్విపదలో కావ్యరచనము ప్రారంభించిన పాల్కురికి సోమనాథుని నైజకవి ప్రతిభావంతమైనదే. ఈతని ననుకరించియే రంగనాథ రామాయణాదులు ద్విపదలో వ్రాయఁబడినవి. భాస్కర యెఱ్ఱాప్రెగ్గడలు రామాయణమును రచించుటయు, నాచన యెఱ్ఱాప్రెగ్గడలు హరివంశమును వ్రాయుటయు, సమీపకాలవర్తులగుటచే, సారస్వత స్పర్థవలన నని భావింపవచ్చును. అద్యతనకాలమున సంస్కృత నాటకములను పలువు రాంధ్రీకరించుట లేదా! అప్పుడేక కథావస్తు పరిగృహీతలైన కవుల రచనలలోఁ దమ ప్రతిభావ్యక్తిత్వ భేదమునుబట్టి కొంతకొంత భేదము గనఁబడును. అందుచే వివిధ రూపములతోడను, భిన్నకవులచేతను రచింపఁబడిన యేక కథావృత్తమునే సంఘము చదివి యందందుగల సుగుణముల నభినందించును. ఇది వాఙ్మయాభివృద్ధికి కారణమగుచున్నది.

ఉత్కృష్టకథలు ... విశేష జనాదరపాత్రమై సర్వజన హృదయాహ్లాదకములైన కథావస్తువు నాశ్రయించి పలువురు కృతికర్తలేక కవులచే కావ్యములను వ్రాయించుటయు, వివిధ సంప్రదాయములలో వివిధ కర్తలు, వివిధ రూపములలో ననేక ప్రసిద్ధమైన యేక కథావస్తువు నాశ్రయించి కావ్యములు రచించుటయు కలదు. ఏక కథావృత్తములగు బహు కావ్యములవలన సంస్కృతమున కా కథ సంబంధిత రామవరాభిమానములు గలవో స్పష్టమగుచున్నదే కాక, ఆ కాల సంఘమందలి నైతికదృష్టియు, సంస్కృతియు విశదమగును. సంస్కృతమున వాల్మీకిమహర్షి రామాయణమును రచింపగ సంస్కృతకవు లనేకులు చంపువులుగ, మహాకావ్యములుగ, నాటకములుగ వ్రాసిరి. రామకథావృత్తమును గ్రహించి భాస మహాకవి ప్రతిమాభిషేకములను, భవభూతి ఉత్తరరామచరిత్రను, మురారి అనర్ఘ రాఘవమును, జయదేవుడు ప్రసన్నరాఘవమును, రాజశేఖరుడు బాలరామాయణమును, శక్తిభద్రుడు ఆశ్చర్యచూడామణి నాటకరూపములుగనే రచించి సాధించిన ఘనకార్యము తమ వ్యక్తిగత విశేష లక్షణముల ప్రదర్శించి రసికుల నానందపెట్టుటయే కదా! ఇట్లే ప్రతి దేశభాషయందును నితర కథావృత్తములకు పట్టినది. మఱియు నన్యదేశములలో దమ భాషావాఙ్మయములను వ్యాపింపజేయ దలచినపుడు విదేశీయులకు సౌకర్యమై సులభగ్రాహ్యముగానుండి యాకర్షించుటకు వచనమునను, దృశ్య కావ్యరూపమునను, గేయములుగను కావ్యరచనను గావింపవలసియుండును. తంజావూరు, మధుర, పుదుకోట మొదలైన ప్రదేశములందు వెలువడిన యాంధ్రకావ్యములు కొంతవరకు నిట్టివే.

అట్లాంధ్ర ప్రబంధములన్నియు నొక యచ్చున పోసినవానివలె నున్నవనియు, నందలి పాత్రల నామముల భేదములుతప్ప, యందలి కథయు, వర్ణనలు మొదలైనవన్నియు సమానములేయనియు, నొకదానిని చదివిన నితర ప్రబంధముల చదువ నవసరములేదనియు నొక బలమైన యపప్రథగలదు. అట్టిచో నొకే యితివృత్తమును గ్రహించి పలువురు కవులు రచించిన కావ్యములలో నిక విశేషము చెప్పవలయునా! కాని కవుల శక్తిసామర్థ్యములు, ప్రతిభావిశేషములు, దృష్టిభేదములు, వ్యక్తిత్వముపట్టి, యట్టి కావ్యములలోగూడ విశిష్టలక్షణములుండుటచే వాని తారతమ్యమరయదగును. ఆంధ్రవాఙ్మయమునందున్న యట్టి గ్రంథముల నీక్రింద దెలుపుదును. ఈ సందర్భమున గ్రంథనామమును నీపదచ్ఛేదమున్నను కథావృత్త మేకముగ నున్నచో చేర్చితిని. కవుల కాలములను సుమారుగా నుంచుటకట్టిచ్చితిని. నిశ్చయముగాని కొందరర్వాచీన కవుల కాలముల నివ్వలేదు. అన్యత్రం కాలమువారిని గూడ వదలితిని.

*I* భారత భాగవత రామాయణములు :—

(1) భారతము :—

(*a*) చంపువు : (౧) కవిత్రయము. (2) శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి (3) అథర్వణుడు—(నష్టం)

సంగ్రహములు : (౧) కాకమాని గంగాధరుడు—(నష్ట) (౨) ఆకుంఠి వ్యాసమూర్తి.

(*b*) ద్విపద : అత్మకూరి తిమ్మన — సోమన, బాలసరస్వతీశ్వరుడు—౧౬౫౦-౧౭౫౦.

(*c*) వచనము : (౧) ప్రోలుగంటి చెన్నకవి—౧౪౭౦ (౨) కళువె వీరరాజు:—౧౬౭౩-౧౭౦౪. (3) కుందుర్తి వెంకటాచలకవి—౧౮౦౦-౧౮౩౪ (౪) తుపాకుల అనంత భూపాలుడు—౧౮౪౦ (౫) శతఘంటం వెంకటరంగశాస్త్రి (౬) తంజనగరం తేవప్పెరుమాళ్లయ్య.

(*d*) యక్షగానము : విరాటపర్వము—కవిపేరు లేదు.

(*e*) నాటకము : తిరుపతి వెంకటకవులు.

(2) జైమిని భారతము : పిల్లలమఱ్ఱి పినవీరన—౧౪౫౦-౯౦.

వచనము : (౧) సముఖము వెంకట కృష్ణప్పనాయకుడు ౧౭౪౦ (౨) ధూళిపాళి యజ్ఞనారాయణ.

(3) భాగవతము :—

(*a*) చంపువు : (1) బమ్మెర పోతన—స్కం 1-4 అండ్ 7-10 (1460)

(2) బొప్పరాజు గంగన్న-స్కం-5.

(3) పర్చూరి సింగన్న-స్కం-6.

(4) నంది మల్లయ — ఘంట సింగన-స్కం-6 (1440-1490)

(5) మలయమారుతము సర్వన్న-స్కం-6 (నష్టం)

(6) వెలిగందల నారయ-స్కం-11, 12.

(7) చంద్రాభట్ల హరిభట్టు-స్కం. 7, 11, 12
(8) కోవూరి పట్టాభిరామశర్మ-స్కం-11 అం 12.
(9) కుకుంబ సింగరాచార్యులు-స్కం-1,2,5, 11, 12.
(10) సంజీవరాయకవి-స్కం-7. 8, 10.

సంగ్రహము : దోనూరు కోనేరుకవి—(1530-1550)
అచ్చ తెనుగు : అల్లమరాజు రామకృష్ణకవి—1845.

(*b*) ద్విపద : (1) మడికి సింగన-స్కం-10-(1420)
(2) రత్నాకరము గోపాలకవి-స్కం-10.
(3) దోనూరు కోనేరుకవి-(సంగ్రహము)
(4) తరిగొండ వెంకమాంబ-1840.
(5) శేకుమళ్ల రంగశాయి-స్కం-1-4 (ఛిద్రస్థితి)

(*c*) వచనము : (1) కుందుర్తి వెంకటాచల కవి—(నష్టము)
(2) పుష్పగిరి తిమ్మన-(సంగ్రహము)-1775-1800
(3) శతఘంటం వెంకటరంగశాస్త్రి.

(*d*) యక్షగానము : (1) వెంకటాచలదాసు, (2) చిలకమర్తి నారాయణాచార్యులు-స్కం. 10 పూ. బా. (3) ఎల్లయ.

(*e*) నాటకములు : భాగములు—పలువురు—ఆధునికులు—

(4) రామాయణము :

(*a*) చంపువు : (1) హుళక్కి భాస్కరాదులు—1295-1325.
(2) ఎఱ్ఱాప్రెగడ—1350 (నష్టము)
(3) కోఅవి సత్యనారాణ—1380—
(4) గోపినాథ వెంకటకవి—1820-95
(5) ఘనగిరి రామకవి—
(6) వావిలకొలను సుబ్బారావు.
(7) జనమంచి శేషాద్రిశర్మ.
(8) శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

సంగ్రహములు : (1) అయ్యలరాజు రామభద్రుడు-1520-1550, (2) ఆతుకూరి మొల్ల-1520-1550, (3) రఘునాథనాయకుడు-1614-1633, (4) అనంతరాజు జన్నయ, (5) కె. వెంకటరమణ కవి, (6) మిక్కిలి మల్లికార్జునుడు 1855.

చంపూ రామాయణము : (1) బులుసు సీతారామకవి, (2) ఋగ్వేదం వెంకటాచలపతి, (3) పూసపాటి రంగయనాయకుడు, (4) జయంతి రామయ్య

విచిత్ర రామాయణము : (1) సోమనాథ శిల్పాచారి, (2) వేల్పూరి వెంకటేశ్వరకవి-1800-1851, (3) నరసింహదేవర వెంకటశాస్త్రి-1850-1915.

శతిముఖ రామాయణము : (1) మర్దనకవి, (2) లింగకవి — రంగకవి. 1700, (3) కుసుమర్తి భాస్కరామాత్యుడు-1800, (4) కృష్ణమాచార్యుడు.

వాసిష్ఠ రామాయణము : (1) మడికి సింగన, (2) కృష్ణగిరి వెంకటరమణ కవి.

ఆధ్యాత్మ రామాయణము : (1) కొలనుపాటి పెద్దన సోమయాజి-1775-1800, (2) కోటంరాజు నాగయ-1860, (3) రామాయామాత్యుడు, (4) కంచర్ల శరభన.

పట్టాభి రామాయణము : (1) భట్టు వెంకటరామకవి, (2) శతగోపాచారి.

అచ్చ తెనుగు రామాయణము : కూచిమంచి తిమ్మన-1700-1736.

తత్త్వసంగ్రహ రామాయణము : ఆకుండి వెంకటకవి-1820.

ధర్మసార రామాయణము : జనమంచి శేషాద్రిశర్మ.

నిరోష్ఠ్య రామాయణము : మరింగంటి సింగరాచారి-1760.

సకలవర్ణనాపూర్ణ రామాయణము : చిత్రకవి రమణకవి-1630.

(*b*) ద్విపదలు : (1) గోన బుద్ధారెడ్డి-1295-1325, (2) కట్టా వరదరాజు-1600-1650, (3) తాళ్లపాక అన్నమాచార్యులు-1408-1503 (నష్టం), (4) భోసల ఏకోజీ-1735.

వాసిష్ఠ రామాయణము : తరిగొండ వెంకమాంబ.

ఆధ్యాత్మ రామాయణము : మామిడల్లం సుభద్రమ్మ.

(*c*) వచనము : (1) ప్రోలుగంటి చెన్నకవి, (2) కుందుర్తి వెంకటాచలకవి, (3) శ్యామరాయకవి-1740, (4) తుపాకుల అనంతభూపాలుడు, (5) సింగరాజు దత్తాత్రేయులు, (6) డొంకా గోపినాథుడు-(విచిత్ర రామాయణము)

(*d*) యక్షగానములు : (1) శేషగిరిదాసు, (2) రాఘవదాసు-సత్యైనదీవి రామాయణము, (3) శతగోపాచార్యులు, (4) కృ. శేషాచలదాసు-ధర్మపురి రామాయణము, (5) వెంకటరాయకవి-లేపాక్షి రామాయణము, (6) రాపాక శ్రీరామకవి-ఆధ్యాత్మ రామాయణము.

(e) నాటకములు: ఆధునికులు కొందరు.

(f) గేయము: (1) సుబ్రహ్మణ్యకవి—అధ్యాత్మ రామాయణము, (2) కర్త పేరు తెలియనిది-లక్ష్మణ మూర్ఛ; ఇంద్రజిత్తు యుద్ధము; ఊర్మిళాదేవి నిద్ర మొదలైనవి.

(5) ఉత్తర రామాయణము:—

(1) తిక్కన-(1250), (2) జయంతి రామభట్టు, (3) కంకంటి పాపరాజు-1775-1800, (4) చిరుమూరి సింగాభరుడు-(నష్టము), (5) రామనాయకుడు, (6) కందుకూరి వీరేశలింగం (అచ్చ తెలుగు)

(b) ద్విపద: కోన కాచ విభుడు — విఠలరాజు-1340.

(c) యక్షగానము: (1) ఆనందదాసు, (2) ముష్టి-సూర్యలక్ష్మమ్మ-(హరికథ)

(d) నాటకము: ఆధునికులు కొందరు.

(6) హైందవ చరిత్ర:—

(a) సంక్షేప: మాదయకవి-1800.

(b) ద్విపద: (1) కొండ, (2) ...తూరి తిరుమల కవి, (3) బసవప్పకవి.

(c) యక్షగానము: (కవి పేరు తెలియదు)

*II* పురాణములు:—

(7) కూర్మ పురాణము: (1) రాజలింగకవి-1600, (2) మంపె కామేశ్వరకవి-1900, (3) తిమ్మరాజు లక్ష్మీనారాయణ-(వచనము)

(8) నరసింహ పురాణము: (1) ఎఱ్ఱాప్రెగడ-1350, (2) చంద్రాభట్ల హరిభట్టు-1600, (3) కొటికలపూడి కోదండరామకవి, (4) (ద్విపద) ప్రోలుగంటి చెన్నకవి.

(9) పద్మపురాణము: కమలనాభామాత్యుడు-(నష్టం) 1350, (2) మడికి సింగన-ఉ. భా-1420, (6) మల్లారెడ్డి-1580-1600.

(10) బ్రహ్మాండ పురాణము: (1) కొవ్వూరి మల్లయ్య -(17 శతాబ్దం), (2) సోమనాథ సోమయాజి, (3) ప్రాతకోట పుల్లయ్య, (4) వెంకటరామకవి, (5) జనమంచి శేషాద్రిశర్మ.

(11) మార్కండేయ పురాణము: (1) మారన-1325, (2) మండపాక కామేశ్వరకవి-19 శ. (3) ఎల్లకర నరసింహకవి-ద్విపద, (4) తిమ్మరాజు లక్ష్మీ నారాయణ-(వచనం)

(12) వరాహ పురాణము: (1) నందిమల్లయ్య-ఘంట సింగన్న-1440-90, (2) చంద్రాభట్ల హరిభట్టు-17. శ.

(13) వామన పురాణము: (1) పొన్నతోట ఔబళకవి-15. శ, (2) ఎలకూచి బాలసరస్వతి-1600-1640, (3) లింగముగుంట రామకవి-17 శతా.

(14) విష్ణు పురాణము: (1) వెన్నెలకంటి సూరన-1500, (2) కలిదిండి భావనారాయణకవి, (3) పసుపతి నాగనాథుడు-(నష్టం), (4) తాడేపల్లి సీతారామస్వామి (నవ్య) (5) పొందూరి అచ్యుతామాత్యుడు, (6) వచనము-కుసాకుల అనంత భూపాలుడు-1740.

(15) హరివంశము: (1) ఎఱ్ఱాప్రెగడ-1350, (2) నాచన సోమన-1375.

(16) మత్స్యపురాణము: (1) చంద్రాభట్ల హరిభట్టు, (2) లింగముగుంట రామకవి-17 శ.

(17) బృహన్నారదీయము: (1) వాసిరాజు రామన్న-1650, (2) అల్లాడ నరసింహకవి-1660, (3) క్రొత్తలంక మృత్యుంజయుడు-1800, (4) పిల్లలమఱ్ఱి పినవీరన-(నష్టం)

(18) దేవీ భాగవతము: (1) ములుగు పాపయారాధ్యులు, (2) దాసు శ్రీరాములు, (3) తిరుపతి వేంకటకవులు, (4) త్రిపురాన తమ్మిదొర, (5) వచనము-పురాణం సూర్యనారాయణ తీర్థులు.

(19) స్కాంద ఖండము: పణుతురుపల్లి విశ్వనాథుడు-1600, (2) కొడిచర్ల శ్రీనివాసకవి-1650-1700, (3) ఈదురుపల్లి భవానీశంకరుడు-1700-1750, (4) కానాల నరసింహకవి-1750-1800, (5) తామరపల్లి తిమ్మయ్య, (6) గురురాజకవి-1870, (7) తురుమెళ్ళ రామన్న.

(20) నాగరఖండము: (1) అయ్యంకి బాలసరస్వతి దుర్గారాజకవి, (2) పుల్లంభట్ల నరసింహశాస్త్రి, (3) తురగా రామకవి.

(21) బ్రహ్మోత్తర ఖండము: (1) పాతకోట పుల్లయ్య, (2) ముత్తరాజు వెంకటకృష్ణకవి, (3) పట్టమెట్ట సరస్వతీ సోమయాజి-1800, (4) శ్రీధర

మల్ల వెంకటస్వామి-1815, (5) వెంకటరామార్యుడు, (6) పిడుపర్తి బసవన్న-(ద్విపద)-1415-75.

(22) శివరహస్య ఖండము: (1) కోడూరు వెంకటాచలకవి-1700, (2) శేషూరి అనంతయజ్వ-1800, (3) వంకాయల వీరభద్రకవి, (4) ముదిగొండ బ్రహ్మయ లింగారాధ్యుడు-(వచనము) (5) వింటి జోబళకవి-(ద్విపద)

(23) సేతుఖండము: (1) పాపయామాత్యుడు, (2) దామెర వెంకటరాయకవి.

(24) బసవ పురాణము: (1) పాల్కురికి సోమనాథుడు-(ద్విపద)-1295-1325, (2) పిడుపర్తి సోమనాథుడు-1509-1530, (3) మహాదేవకవి.

(25) పండితారాధ్య చరిత్రము: పాల్కురికి సోమనాథుడు-(ద్విపద), (2) శ్రీనాథుడు-(నష్టం)

(26) ప్రభులింగ లీలలు: పిడుపర్తి సోమనాథుడు (ద్విపద), (2) పిడుపర్తి బసవప్ప-1550, (3) కొచ్చెర్లకోట రామకవి, (4) నడకుదిటి రామకవి-1821-87, (5) తెలగాన నీలకంఠకవి, (6) యక్షగానము: బాల పాపాంబ (అక్కమహాదేవి చరిత్ర)

(27) దేవాంగ పురాణము: (1) రొబ్బి వీరభద్రకవి, (2) భద్రకవి లింగకవి-(ద్విపద)

(28) కన్యకా పురాణము: (1) భాస్కర పంతులు, (2) ఇటికల తిమ్మయ్య-యక్షగానము.

III మాహాత్మ్యములు :—

(29) కాంచీపుర మాహాత్మ్యము: (1) కుడిచెర్ల తిప్పరాజు-(నష్టం), (2) దగ్గుపల్లి దుగ్గన-(నష్టం), (3) ఆంధ్రకవి రామయ్య-(నష్టం), (4) మండపాక పార్వతీశకవి-1833-97, (5) వచనము: కావలి వెంకట బొర్రయ్య.

(30) కాళహస్తి మాహాత్మ్యము: (1) ధూర్జటి-1505-30, (2) ధూర్జటి లింగకవి-1675.

(31) జగన్నాథ మాహాత్మ్యము: (1) వెంకటాచార్యుడు-1700, (2) చెరుకువాడ సూరయ్య, (3) కొంతి భద్రాద్రి రామశాస్త్రి-1856-1915.

(32) తారకబ్రహ్మ మాహాత్మ్యము: (1) అనుమంచి జగన్నాథకవి, (2) కొటికలపూడి కోదండరామకవి.

(33) మాఘ మాహాత్మ్యము: పిల్లలమఱ్ఱి పినవీరన-(నష్టం). (2) బద్దెపూడి వెన్నయ్య-1600, (3) వచనము: విజయరంగ చొక్కనాథుడు-1700-1704.

(34) గౌతమీ మాహాత్మ్యము: (1) ఉల్లమరాజు బాపకవి. (2) తాడూరి కృష్ణశాస్త్రి.

(35) రుద్రాక్ష మాహాత్మ్యము: (1) అమలాపురపు సన్యాసకవి-1700-60, (2) మాదిరాజు వీరన-(ద్విపద)-1790, (3) పర్వతమంత్రి లింగన.

(36) వెంకటాచల మాహాత్మ్యము: (1) కాకిపల్లి నరసకవి-1750, (2) ములపాక బుచ్చన్నశాస్త్రి-1800, (3) తరిగొండ వెంకమాంబ-1840, (4) శిష్టు కృష్ణమూర్తి-1800-1870, (5) యక్షగానము: సూర్యకవి, (6) వచనము: యు. యతిరాజదాసు.

(37) వృద్ధాచల మాహాత్మ్యము: (1) శేషూరి అనంతయజ్వ-1800, (2) లింగాద్రి.

(38) శివరాత్రి మాహాత్మ్యము: (1) శ్రీనాథుడు-1430, (2) అక్కనామాత్యుడు.

(39) శ్రీరంగ మాహాత్మ్యము: (1) పోతరాజు భైరవకవి-1425-75, (2) కట్టా వరదరాజు-1600-1650, (3) చెన్నమల్లు గిరిరన్న-(నష్టం), (4) భాగవతుల రామకవి, (5) ముకుందయోగి-(ద్విపద) (6) వచనము: విజయరంగ చొక్కనాథుడు, (7) గుంటుపల్లి జగన్నాథకవి-(వచనము)

(40) శ్రీశైల మాహాత్మ్యము: (1) నాగలూరి శేషనాథుడు-1750, (2) అత్తలూరి పాపకవి-1800, (3) చాగంటి వీరమల్లికార్జునలింగం అయ్యవార్లు, (4) వచనము: యస్. వి. రాఘవయ్య.

(41) సోమవార మాహాత్మ్యము: (1) తుమ్మలపల్లి నాగభూషణకవి, (2) మల్లికార్జునకవి-(ద్విపద), (3) ఈవని వీరభద్రకవి-(ద్విపద), (4) యక్షగానము: వీరభద్రకవి-(చిత్రాంగద చరిత్ర)

(42) హాలాస్య మాహాత్మ్యము: (1) శ్రీపతి రామభద్రకవి-1700-1734, (2) మల్లంపల్లి బుచ్చకవి, (3) కానుకొల్లు వెంకటనారాయణ, (4) జనమంచి శేషాద్రిశర్మ, (5) వచనము: నంజరాజు-1724.

(43) కార్తిక మాహాత్మ్యము: (1) అనిపిద్ది జగన్నాథశాస్త్రి, (2) అప్పల నరసింహకవి, (3)

కుంమ_ర్తి వెంకటాచలకవి.

V ప్రబంధములు :—

(44) అష్టమహిషీ కల్యాణము : (1) తాళ్లపాక తిరు వెంగళనాథుడు-(ద్విపద)-1490-1520, (2) రెడ్డి పల్లి సుబ్బరాజు-(నష్టము)

(45) కాళిందీ కల్యాణము : (1) అహోబలపతి-1700, (2) చాముర్తి సుందరశేషయ్య-1795, (3) రఘురామ పాపకవి, (4) వొంతరామ అచ్చయ్య, (5) కోంకి భద్రాద్రి రామశాస్త్రి-1856-1915.

(46) గౌరీకల్యాణము : (1) చెంగల్వ కాళయ-1633-73, (2) వక్కలంక వీరభద్రకవి-1700-1750, (3) ఏనుగు అనంతకవి.

(b) యక్షగానము : (1) కూరపాటి అమరలింగామాత్యుడు, (2) గురుసిద్ధలింగము, (3) పెద్దామాత్యుడు, (4) నాగసూరుడుకవి, (5) మంగలపల్లి సూర్యనారాయణకవి, (6) షహాజీ, (7) సుదురపాటి వెంకనకవి.

(c) నాటకము : చిలకమర్తి లక్ష్మీనరసింహం.

(d) గేయము : కొచ్చి వీరభద్రయ్య.

(47) సీతాకల్యాణము : (1) కూచిమంచి జగ్గకవి-1700-1750, (2) చెన్నవరమంత్రి, (3) రామకవి, (4) పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు, (5) పాలరొంకరి మల్లభూపాలుడు, (6) అగస్త్యరాజు వామన-(యక్షగానము)

నాటకము : (1) ధర్మవరం కృష్ణమాచార్యులు, (2) కోలాచలం శ్రీనివాసరావు.

(48) ఇందుమతీ పరిణయము : (1) తెనాలి రామభద్రకవి-1590, (2) చిత్రకవి అనంతకవి-1620, (3) కుమారధూర్జటి-1650, (4) కాముసూరి కృష్ణావధాని-1750, (5) తిమ్మకవి, (6) ఆలూరి కుప్పనకవి-1650-80, (7) పంతుల బ్రహ్మదేవకవి, (8) అంగరసు బసువయ్య-(నష్టము)

(49) ఉషా పరిణయము : (1) దామెర అంకభూపాలుడు-1600-30, (2) కైపా మాయనకవి-1800, (3) తాళ్లపాక తిరువెంగళనాథుడు-(ద్విపద)

(b) యక్షగానము : (1) విరిపాటి నృసింహరాజు, (2) శ్రీనివాసుడు, (3) అనంతకవి, (4) పసుపులేటి రంగాజమ్మ-1633-73, (5) విజయరాఘవనాయకుడు-1633-73, (6) వేములపల్లి వెంకటసుబ్బకవి, (7) ఆనందదాసు, (8) మూళగిరి, (9) పోతుల వెంకటరామకవి.

(c) నాటకములు : (1) వేదం వేంకటరాయశాస్త్రి, (2) ధర్మవరం కృష్ణమాచారి.

(d) గేయము : నడిమింట రామయోగి.

(50) చంద్రికా పరిణయము : (1) ఎలకూచి బాలసరస్వతి-1600-1640, (2) రేచెర్ల మాధవరాయకవి-1630-1660.

(51) జాంబవతీ పరిణయము : (1) సేతుపతి, (2) పులకంకం వెంకటకృష్ణకవి.

(52) ద్రౌపదీ పరిణయము : (1) ఏనుగు పెదలక్ష్మణకవి, (2) సూరపరాజు తిరుమలరాజు.

(53) భానుమతీ పరిణయము : (1) రెట్టూరి రంగరాజు, (2) వెలగపూడి కృష్ణయ్య.

(54) మిత్రవిందా పరిణయము : (1) కుంమర్తి వెంకటాచలకవి-1700-34, (2) రాజారావు వెంకటజనార్దనరావు, (3) రంగనాథుడు-(నష్టము)

(55) రుక్మవతీ పరిణయము : (1) రేకపల్లి సోమనాథకవి, (2) కోదండరామకవి.

(56) రుక్మిణీ పరిణయము : (1) లింగన ముఖి కామేశ్వరకవి-1650-75, (2) కూచిమంచి తిమ్మకవి-1700-56, (3) సత్యవోలు భగవత్కవి-1750, (4) గురురాజకవి-1850, (5) కొప్పర్తి నరసన్న, (6) రావూరి సంజీవకవి.

(b) ద్విపద : (1) చొదరి రామదాసు, (2) పాటూరి చిన్నయ్య.

(c) యక్షగానము : (1) రాజా లక్ష్మోజీ, (2) పోలుగంటి వెంకటకృష్ణయ్య. (3) రఘునాథనాయకుడు.

(57) లక్షణా పరిణయము : (1) సింహాద్రి వెంకటాచార్యులు-1630, (2) వానపాల నరసింహరాజు, (3) మద్దికాయల మల్లయ్య-(నష్టము), (4) తిరుపతి వెంకటకవులు, (5) యక్షగానము: సోమన్న.

(58) వాసవదత్తా పరిణయము : (1) వక్కలంక వీరభద్రకవి-1775, (2) నారన సూరన-(15 వ శతాబ్దము), (3) మద్దికాయల మల్లయ్య-(నష్టము)

(59) శశిరేఖా పరిణయము : (1) పీసా లక్ష్మీపతి-

1800, (2) కొకరప్ప స్త్రీ కృష్ణకవి-1820, (6) కోన పల్లి వెంకటరంగకవి, (4) అప్పప్ప.

(*b*) ద్విపద : శేషము చెన్నుభట్టారకుడు.

(*c*) యక్షగానము : రంగాచార్యులు.

(*d*) ...యము : బి. కుప్పుస్వామి మొదలియారు.

(*e*) నాటకము : పంత్రిప్రగడ భుజంగరావు.

(60) సుకుమారీ పరిణయము : (1) నరసింహకవి. (2) పోడూరి వెంకటదాసకవి.

(61) సుదంతా పరిణయము : (1) అలిఘురికవి, (2) వెలివంప్లి సుద్దులగిరి.

(62) సుభద్రా పరిణయము : (1) చేమకు రి వెంకట కవి-1650, (2) కూచిమంచి జగ్గకవి-1750.

(*b*) ద్విపద : తాళ్లపాక తిమ్మక్క-1500.

(*c*) యక్షగానము : వెంకటాద్రి.

(*d*) వచనము : పాటూరి రంగశాస్త్రి.

(*e*) నాటకము : వావిలకొలను సుబ్బారావు

(63) అనిరుద్ధ చరిత్ర : (1) కనుపర్తి అబ్బనామా త్యుడు-1750-80, (2) భావన పెమ్మన-(నష్టం), యక్షగానము : సురరాజకవి.

(64) అంబరీష చరిత్ర : (1) హర్యపరాజు రంగ రాయి, (2) తిరుమలార్యుడు, (3) ఎ. రామారావు కె. రామకృష్ణయ్య, (4) వచనము : శృంగార కవి సర్వారాయుడు.

(65) ఒహయనంబి చరిత్ర : అజ్జరపు పేరయలింగము-1775, యక్షగానము: (కవి పేరు తెలియదు)

(66) ఐరావత చరిత్ర : చిరుమూరి గంగాధరుడు, యక్షగానము : దరుపూరి అప్పలాచార్యులు.

(67) కువలయాశ్వ చరిత్ర : (1) సవరము చిననారా యణ నాయకుడు-1640-50, (2) బుక్కపట్టణం రాఘవాచార్యులు, (3) ఏర్చూరి సింగన-(నష్టం) (5) కేతన-(నష్టం)

(68) పురూరవశ్చరిత్ర : (1) కనుపర్తి అబ్బన, (2) అఖండ సచ్చిదానందావధూత.

(69) ధర్మాంగద చరిత్ర : (1) బొమ్మకంటి నర సింహకవి-(ద్విపద), (2) వెంకటదాసు: యక్ష గానము, (3) నరసింహకవి.

(70) బలరామ చరిత్ర : (1) గుడారు వెంకటదాస కవి-1750, (2) లోకేరావు సోమన-(ద్విపద)

(71) ... చరిత్ర : (1) దా... నాయకుడు-1600-25, (2) కాకమాని మూర్తికవి-1670.

(72) ... చరిత్ర : (1) పుల్లవప్పు వాతేశ్వరుడు-1700, (2) కూచిమంచి తిమ్మకవి-1700-56, (3) కొలకలూరి వీరన-1790, (4) ... కవి.

(*b*) ద్విపద : (1) చిత్తూరు ...గనాయకుడు, (2) ... వన్న, (3) సింహాద్రి దాసు.

(*c*) యక్షగానము : (1) బుక్కము సాంబయ్య, (2) అలపాక వెన్ది.

(*d*) దండకము : (కవి పేరు తెలియదు)

(73) మార్కండేయ చరిత్ర : (1) పోతరాజు (కొలకలూరి) వీరన, (2) మారెళ్ళ సుబ్బరాయ దాసు, (3) కాశీదాసు: యక్షగానము.

(74) నలచరిత్ర : (1) శ్రీనాథుడు-1375-1450, (2) సిరిప్రెగడ ధర్మనామాత్యుడు, (3) బెహరా రాను కృష్ణకవి, (4) రుద్రరాజు తిరుమలరాజు, (5) కొత్తలంక మృత్యుంజయుడు-(నిరోష్ఠ్యము)-1800, (6) రామరాజభూషణుడు-(ద్వ్యర్థి) 1560, (7) పెద్దపాటి ఎఱ్ఱన-(నష్టం), (8) కందు కూరి వీరేశలింగము, (9) అకుండి వ్యాసమూర్తి శాస్త్రి, (10) కృష్ణాధ్వరి-1614-36-(ద్వ్యర్థి)

(*b*) ద్విపద : చక్రపురి వీరరాఘవాచారి-1750, (2) రఘునాథ నాయకుడు.

(*c*) యక్షగానము : కోదండరామకవి.

(*d*) నాటకము : ధర్మవరం కృష్ణమాచార్యులు.

(75) యయాతి చరిత్ర : (1) పొన్నిగంటి తెలగన్న -1550-81 (అచ్చ తెలుగు) (2) అకుండి వ్యాస మూర్తిశాస్త్రి.

యక్షగానము : (1) యాదవరాజు, (2) వెంకట దాసు.

(76) చంద్రహాస చరిత్ర : (1) యాదవామాత్యుడు, (2) వెంకట సూర్యప్రకాశ ప్రధాని, (3) ధర్మ వరం కృష్ణమాచారి (నాటకము)

(77) యాజ్ఞవల్క్య చరిత్ర : (1) గట్టు ప్రభువు, (2) చల్లా గురవయ్య-(ద్విపద)

(78) యామునాచార్య చరిత్ర : (1) ముకుంబ సింగ

నాసరావు, (4) బలిజేపల్లి లక్ష్మీకాంతం, (5) ధర్మవరం కృష్ణమాచార్యులు.

(95) ఉత్తర హరిశ్చంద్ర కథ : (1) తక్కెళ్లపాటి లింగన-1775, (2) చంద్రశేఖరకవి-ద్విపద.

(96) పరమయోగి విలాసము : (1) తిమ్మరాజు-1550, (2) సిద్ధయోగీంద్రుడు.

(b) ద్విపద : తాళ్లపాక తిరువేంగళనాథుడు-1490-1520.

(97) రాజగోపాల విలాసము : (1) చెంగల్వరాయ కవి-1633-1673, (2) విజయరాఘవ నాయకుడు-(యక్షగానము), (3) దండకము: రాఘవాఖ్యుడు.

(98) రామకృష్ణ విలాసము : (1) శేషభట్టు అప్పలాచార్యులు, (2) తిరువెంగళదాసు.

(99) శివలీలా విలాసము-గంగా వివాహము : (1) నిశ్శంక కొమ్మన-1330-70, (2) కూచిమంచి తిమ్మన.

(b) ద్విపద : చితారు గంగాధరుడు.

(c) యక్షగానము : (1) పెద కెంపరాయడు, (2) పాలంకి పినకపోది, (3) వెంకటకృష్ణయ్య, (4) లింగమూర్తి, (5) శాహమహారాజు-1680-1710.

(100) బసవ విజయము : (1) తుమ్మలపల్లి నాగభూషణకవి, (2) నల్లనగండ్ల నారరాధ్యుడు-(ద్విపద)

(b) యక్షగానము : (1) అనుమోవ సన్యాసి, (2) కానూరి వీరభద్రుడు.

(101) లక్ష్మీవిజయము : (1) బెహరా రామకృష్ణ కవి, (2) రాయసం వెంకటపతి, (3) అక్కెనపల్లి నృసింహకవి-1820.

(102) వీరభద్ర విజయము : (1) పోతన, (2) శివలెంక మల్లన-(యక్షగానము)

(103) శంకర విజయము : (1) అలూరి కుప్పన-1770-80, (2) రాపాక లక్ష్మీపతి, (3) బొడ్డపాటి పేరయ.

(104) సుగ్రీవ విజయము : (1) పెదలింగనార్యుడు, (2) రుద్రకవి-1560-(యక్షగానము)

(104 ఎ) సమీరకుమార విజయము : (1) పుష్పగిరి తిమ్మన, (2) పాతూరి తిరుమలకవి.

(105) అహల్యా సంక్రందనము: (1) సముఖం వెంకట కృష్ణప్పనాయకుడు-1700-34, (2) వేమనారాధ్యుల వెంకటేశ్వరారాధ్యులు-1800, (3) [illegible] పాపరాజారాధ్యులు, (4) యక్షగానము: [illegible]

(106) కపోతకథ : (1) [illegible] (2) వేటూరి ప్రభాకరశాస్త్రి, (3) [illegible] చిదంబరశాస్త్రి.

(b) ద్విపద : వెంకటగిరి ఓబలయ్య.

(c) యక్షగానము : బలభద్రదాసి.

(107) కృష్ణాభ్యుదయము : (1) సుబ్బరాయ కవి, (2) నోరేటి సూరన-1800, (3) [illegible] పాక పార్వతీశ్వరశాస్త్రి.

(108) కృష్ణార్జున సంవాదము : (1) ఓబళామాత్యుడు, (2) పోచిరాజు వీరన, (3) కస్తూరి రంగకవి-1750-70, (4) కలచేరు వెంకటదాసు ప్రధాని.

ద్విపద : నాదెండ్ల గోపన-1550.

(109) తారాశశాంకము : (1) శేషం వెంకటపతి-1706-34, (2) యక్షగానము : కర్తవేరులేదు, నాటకము : ఓలేటి పార్వతీశ్వరకవి.

(110) పారిజాతాపహరణము : నంది తిమ్మన-1518-30, (2) కృపాధ్వరి-(వ్యర్థి)-1617-33, (3) రఘునాథ నాయకుడు-(ఆశు)

(b) యక్షగానము : (1) మాత్రుభూతకవి, (2) నందవరం సింగన, (3) పురిజాల లక్ష్మీనారాయణ, (4) చెంగల్వరాయడు, (5) చల్లా నారాయణకవి.

(c) నాటకం : చిలకమర్తి లక్ష్మీనరసింహం.

(111) ప్రభావతీ ప్రద్యుమ్నము : (1) పింగళి సూరన-1550-80, (2) పొన్నాడ పెద్దిరాజు-(నష్టం) (3) ఫణిభవు మాధవుడు-(నష్టం), (4) సుబ్బరాల సుబ్బారాయకవి-1800.

యక్షగానము : గోపాలుని సింగయ.

(112) ప్రబోధ చంద్రోదయము : (1) నంది మల్లయ్య-ఘంట సింగన్న-1450. (2) కొటికలపూడి వెంకటకృష్ణ సోమయాజి-1800-1830.

(b) ద్విపద : రామూరి వెంకటలింగకవి.

(c) యక్షగానము : కోసూరి గంగాధరకవి.

(d) నాటకము : (1) వడ్డాది సుబ్బారాయుడు, (2) కందుకూరి వీరేశలింగం, (3) అకుండి వ్యాసమూర్తిశాస్త్రి, (4) శిష్టా నరసింహశాస్త్రి.

(113) బిల్హణీయము: (1) చిత్రకవి సింగరాచార్యులు-1750, (2) జొన్నాది శేషనాద్రి-1800, (3) చెళ్లపిళ్ల నరసకవి-1750, (4) సాంబశివకవి-1780-1810.

నాటకము : బులుసు వెంకటకవి.

(114) భగవద్గీత: (1) వేములగంటి దత్తోజి పండితుడు-1775, (2) మాధవమంత్రి-1800, (3) మిక్కిలి మల్లికార్జునుడు-1855, (4) గోపీనాథకవి-1850.

వచనము: ఉపాకుల అనంతభూపాలుడు-1740.

(115) భర్తృహరి సుభాషితములు :—(1) ఎలకూచి బాలసరస్వతి : 1600-1650. (2) ఏనుగు లక్ష్మణకవి : 1760-'90 (3) పుష్పగిరి తిమ్మన-1775-1800 (4) కొలకలూరి వీరన-1780 (5) గురురాజకవి-1890.

(116) మదనసాయక విలాసము :—(1) చదువుల సోమలింగయ్య-1800. (2) ఫక్కి వెంకట నరసయ్య. 1836

(117) (యాదవ) రాఘవ పాండవీయము :— (1) భీమన కవి-(నష్టం) (2) పింగళి సూరన-1560. (3) ఎలకూచి బాలసరస్వతి-1600-1650. (4) నెల్లూరి వీరరాఘవకవి-1715. (5) అయ్యగారి వీరభద్రకవి-1750, (6) చిత్రకవి సింగరాచార్యులు 1750, (7) గునుపూటూరి వెంకటకృష్ణకవి-1750.

(118) రాధికా సాంత్వనము :—(1) ముద్దు పళని-1739-'60, (2) సముఖం వెంకటకృష్ణప్ప నాయకుడు-1700-1734, (3) వెలిదండ్ల వెంకటపతి-1750, (4) చింతలపూడి ఎల్లన-1530- (5) కృష్ణదాసు :-(యక్షగానం)

(119) విజ్ఞానేశ్వరీయము :—(1) కేతన-1270, (2) కోటికలపూడి వెంకటకృష్ణ సోమయాజి-1800-1830, (3) రాముకవి.

(120) విష్ణుమాయా నాటకము :— (1) చింతలపూడి ఎల్లన-1520, (2) ఎఱుసుడిపాటి వెంకటకవి, (3) రోసనూరి వెంకటపతి-1690, (4) కంకంటి పాపరాజు-1775-1800-(యక్షగా), (5) కంకంటి నారసింహరాజు. (ద్విపద).

(121) విష్ణుభక్త చరిత్రము :—ద్విపదలు :— (1) చక్రపురి రాఘవాచారి, (2) ఆసూరి శేషాచార్య.

(122) విశ్వగుణాదర్శము :— (1) తిరుమల బుక్కపట్టణం తాతాచారి, (2) రామకృష్ణ కవులు.

(123) శృంగార శాకుంతలము :—(1) పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు-1420, (2) శేషనూరి వెంకటకృష్ణాచార్యులు-1750, (3) కృష్ణకవి-1800, (4) ఫక్కి వెంకటనరసయ్య-1836, (5) పెద్దాడ నాగరాజు, (6) సిద్ధనమంత్రి-(నష్టము) (7) శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

(B) యక్షగానము :—నరసింహ కవి.

(C) నాటకములు :—(1) కందుకూరి వీరేశలింగము, (2) దాసు శ్రీరాములు, (3) వేదం వెంకటరాయ శాస్త్రి, (4) నిడమర్తి జలదుర్గప్రసాదరాయుడు, (5) వడ్డాది సుబ్బారాయుడు, (6) రాయసదర్గం నరసయ్య, (7) వత్సవాయి వెంకట నీలాద్రిరాజు, (8) మంత్రిప్రగడ భుజంగరావు, (9) కాంచనపల్లి కనకమ్మ; (10) త్రిపురాన సూర్యప్రకాశరావు, (11) కోరాడ రామచంద్రశాస్త్రి, (12) పరవస్తు వెంకటరంగాచార్యులు.

(124) సురాభాండేశ్వరీయము :—(1) గట్టు ప్రభువు. 1800, (2) పులిగడ్డ నారనమంత్రి-(ద్విపద) ,(3) రావులపురం గురవయ్య-(ద్విపద), (4] మేడూరి అప్పనకవి.

గేయము :—యస్. బంగారురాజు.

(125) సౌగంధికాపహరణము :— రాయసం గణపయ్య-(నష్టం), (2) రత్నాకరం గోపాలకవి (ద్విపద).

(126) కపిలగోసంవాదము :—(1) రానావమ్మల కొండుభొట్టు, (2) కామరాజు.

(127) త్రిపుర విజయము :—(1) పెదపాటి సోమయ్య-నష్టం, (2) పోతరాజు వీరయ్య-నష్టం. యక్షగానం :—కవి పేరు తెలియదు.

**VI** కథలు :—

(128) దశకుమార చరిత్రము :—కేతన-1260, (2) వచనము :— ఎనమంచింతల సంజీవరాయుడు.

(129) కాదంబరి :— (1) భాస్కరుని కేతన-నష్టం (2) చిలకలపూడి నరసింహశాస్త్రి, (3) పళ్లె

పూర్ణ ప్రజ్ఞాచార్యులు, (4) జానపాటి కామేశ్వరరావు.

వచనము :—(1) శేరి సత్యనారాయణశాస్త్రి, (2) ముదిగొండ నాగలింగశాస్త్రి.

(130) పంచతంత్రము :—దూబగుంట నారాయణకవి -1500, (2) బైచరాజు వెంకటనాథకవి-1520. (3) భానుకవి-1525, (4) హరిభట్టు-1600–1650 (నష్టము), (5) శిష్టు కృష్ణమూర్తి-1800-1870, (6) వచనము :—రావిపాటి గురుమూర్తి శాస్త్రి.

(131) శుకసప్తతి :—(1) పాలవేకరి కదరీపతి-1650 (2) సింగయ్య, (3) వచనము :— పాటూరి రామస్వామిశాస్త్రి.

(132) విక్రమార్క చరిత్ర :—(1) పేరంరాజు జక్కన-1380-1440, (2) కొఱవి గోపరాజు-1430–90, (3) గూళికల్లు వెంకటరమణకవి-1800

(4) యాదవార్యుడు, (5) మిక్కిలి మల్లికార్జునుడు-1885, (6) వచనము :—రావిపాటి గురుమూర్తి శాస్త్రి.

(133) షట్చక్రవర్తి చరిత్ర :—(1) మల్లారెడ్డి-1580 -1600, (2) రామచంద్రకవి,

(134) షోడశకుమార చరిత్ర :—(1) వెన్నెలకంటి అన్నయ-1420–60, (2) అమడూరి నరసింహభట్టు-(నష్టము), (3) ఎల్లన,

(135) సకలనీతిసమ్మతము : (1) మడికి సింగన-1420 (2) అయ్యలరాజు రామభద్రుడు-1540, (3) కూచిరాజు ఎఱ్ఱన-1550.

(136) హంస వింశతి : (1) అవుదూరి పిచ్చయ్య-1775, (2) అయ్యలరాజు నారాయణకవి-1800.

(B) వచనము : ధూర్జటి లక్ష్మీపతి.

(137) భేతాళపంచవింశతి : కవిభల్లటుడు-(నష్టము) (2) మిక్కిలి మల్లికార్జునుడు-1855.

(138) కథాసరిత్సాగరము : (1) వెంకటరామకృష్ణ కవులు, (2) వచనం : వేదం వెంకటరాయశాస్త్రి,

**VII** సంస్కృత కావ్యములు : ఆంధ్రీకరణము :

(139) రఘువంశము ; (1) కాదూరి పిచ్చయ్య-1775 (2) ఆదిపూడి సోమనాథరావు, (3) వావిలాల వాసుదేవశాస్త్రి, (4) వచనము : (1) దీపాల పిచ్చయ్యశాస్త్రి, (2) బంకాపు తిమ్మయ్య.

(140) కుమార సంభవము : పక్కిలంక వీరభద్రకవి. (2) నిరుదరాజ శేషాద్రిరాజు, (3) కూచిమంచి సాంబశివరావు.

(141) మేఘసందేశము : (1) కోటికలపూడి వెంకటకృష్ణకవి; (2) మతుకుపల్లి నరసింహశాస్త్రి-1816-187?, (3) వడ్డాది సుబ్బారాయుడు, (4) కల్లూరి వెంకటరామశాస్త్రి, (5) తాడూరి లక్ష్మీనరసింహారావు, (6) పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు, (7) శిష్టా నరసింహశాస్త్రి, (8) గుఱ్ఱం వెంకటసుబ్బరామయ్య, (9) మాడభూషి వెంకటాచారి.

(142) కిరాతార్జునీయము: (1) కోటిచింతల కృష్ణమామాత్యుడు, (2) గోపాలుని సింగయ.

యక్షగానము : (1) బొమ్మలాట సాంబయ్య,(2) సిద్ధ విభునందనుడు.

(143) నైషధము : శ్రీనాథుడు-1430, (2) ఆకుంటి వ్యాసమూర్తి శాస్త్రి, (3) పెదపాటి ఎఱ్ఱన, (4) కందుకూరి వీరేశలింగము.

(144) భామినీ విలాసము : (1) వడ్డాది సుబ్బారాయుడు, (2) బులుసు పాపయ్యశాస్త్రి, (3) దంటు సుబ్బావధాని, (4) ఆకుంటి వ్యాసమూర్తి శాస్త్రి.

(145) అమరుకము : (1) తాళపాక తిరువెంగళప్ప, (2) శిష్టు సర్వశాస్త్రి, (3) జయంతి రామయ్య,

(146) హర్షచరిత్ర : (1) కోమాండూరు కృష్ణమాచార్యులు, (2) వచనము : మేడేపల్లి వెంకటరమణాచార్యులు, (2) తిరుపతి వెంకటకవులు.

**VIII** సంస్కృత నాటకములు : ఆంధ్రీకరణము :

(147) ఉత్తరరామచరిత్ర : (1) వేదం వెంకటరాయశాస్త్రి, (2) దాసు శ్రీరాములు, (3) ఆచంట సాంఖ్యాయన శర్మ. (4) కోరాడ రామచంద్రశాస్త్రి, (5) వెంకటరామకృష్ణ కవులు, (6) మల్లాది సూర్యనారాయణశాస్త్రి, (7) వావిలాల వాసుదేవశాస్త్రి, (8) మంత్రిప్రగడ భుజంగరావు, (9) జయంతి రామయ్య, (10) బలిజేపల్లి లక్ష్మీకాంతం.

(148) మాలతీ మాధవము: (1) ప్రబంధము- [illegible] పూాడి కృష్ణయ్య.
నాటకములు: (1) దాసు శ్రీరాములు, (2) జనమంచి వెంకటరామయ్య.

(149) ముద్రారాక్షసము: (1) తిరుపతి వెంకట కవులు, (2) [illegible] గోపాలం, (3) దాసు శ్రీరాములు, (4) [illegible] అనంతరావు, (5) కోరాడ రామచంద్రశాస్త్రి.

(150) విద్ధసాలభంజిక: (1) మంచన-ప్రబంధము. (2) నాటకము-జనమంచి వెంకటరామయ్య.

(151) అనర్ఘరాఘవము: (1) తిమ్మ[illegible]పతి-ప్రబంధము, (2) నాటకము-(1) అకుండి వ్యాసమూర్తి శాస్త్రి, (3) సత్యవోలు కామేశ్వరరావు.

(152) సంకల్ప సూర్యోదయము: (1) ప్రబంధము-[illegible]-రంగరాయకవి. (2) నాటకము-తిరుక్కోవలూరు [illegible] మహాస్వామి, శ్రీ కస్తూరి రంగ వరాహాచారి.

(153) మృచ్ఛకటికము: (1) తిరుపతి వెంకటేశ్వరులు (2) వావిలాల వాసుదేవశాస్త్రి.

(154) వేణీసంహారము: (1) వడ్డాది సుబ్బారాయుడు (2) కోరాడ రామచంద్రశాస్త్రి, (3) శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి, (4) బులుసు వెంకటేశ్వర్లు.

(155) విక్రమోర్వశీయము: (1) వేదం వెంకట్రాయ శాస్త్రి. (2) అదంటు సాంఖ్యాయన శర్మ, (2) వడ్డాది సుబ్బారాయుడు.

(156) మాలవికాగ్నిమిత్రము: (1) వేదం వెంకట్రాయ శాస్త్రి, (2) దాసు శ్రీరాములు. (3) కందుకూరి వీరేశలింగము.

(157) రత్నావళి: (1) వేదం వెంకట్రాయ శాస్త్రి, (2) దాసు శ్రీరాములు, (3) కందుకూరి వీరేశలింగం.

(158) ప్రియదర్శిక: (1) వేదం వెంకట్రాయశాస్త్రి (2) చెన్నాప్రగడ భానుమూర్తి.

(159) నాగానందము: (1) వేదం వెంకట్రాయ శాస్త్రి. (2) పాశెం గోపాలం, (3) నరసింహాచారి.

(160) స్వప్నవాసవదత్తము: (1) చిలకమర్తి లక్ష్మీనరసింహం, (2) దివాకర్ల వెంకటావధాని, (3) కాటూరి వెంకటేశ్వరరావు.

(161) ప్రతిమ: (1) చిలకమర్తి లక్ష్మీనరసింహం, (2) వేటూరి ప్రభాకరశాస్త్రి.

(162) అభిషేకము: (1) చిలకమర్తి లక్ష్మీనరసింహం (2) బులుసు వెంకటరమణయ్య, (3) బులుసు వెంకటేశ్వరులు.

(164) అవిమారకము: (1) చిలకమర్తి లక్ష్మీనరసింహం, (2) మానవల్లి రామకృష్ణకవి.

(165) బాలచరితము: (1) చిలకమర్తి లక్ష్మీనరసింహము, (2) మానవల్లి రామకృష్ణకవి.

(166) కర్ణభారము: చిలకమర్తి లక్ష్మీనరసింహం, (2) వేటూరి ప్రభాకరశాస్త్రి.

(167) కుందమాల: (1) వడ్డాది సుబ్బారాయుడు, (2) బులుసు వెంకటేశ్వర్లు.

(168) ప్రసన్నరాఘవము: (1) కొక్కొండ వెంకటరత్నం, (2) మంత్రిప్రగడ భుజంగరావు.

IX ఆంధ్ర నాటకములు: చరిత్ర.

(169) రంగరాయ చరిత్ర: (బొబ్బిలి యుద్ధము) (1) ప్రబంధము—దిట్టకవి నారాయణ కవి.

(*B*) నాటకములు: వేదం వెంకట్రాయశాస్త్రి, (2) శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి, (3) కాళ్ళకూరి సాంబశివరావు, (4) చెలికాని వెంకటసూర్యారావు.

(170) పల్నాటి వీరచరిత్ర: (1) ద్విపద-శ్రీనాథులు.

(*B*) నాటకములు: ప్రభులింగాచార్యులు, (2) వంగనామాల రామచంద్రరావు, (3) ఉన్నవ లక్ష్మీనారాయణ, (4) వావిలాల సోమయాజి.

X శైవము.

(171) వీరశైవాచార సంగ్రహము: (1) శివరామలింగకవి, (2) కుంటుముక్కల తిరుమలనాథుడు, (3) పర్వతమంత్రి లింగన-(ద్విపద) (4) నిశ్శంక కొమ్మన (నష్టము)

(172) శైవాగమ శిఖామణి: (1) నెప్పెల్ల అప్పనార్యుడు, (2) చెన్నాప్రెగ్గడ నాగేశ్వరకవి-ద్విప

(173) షట్స్థలదర్పణము: (1) సిద్ధనాథుడు, (2) షట్స్థలనిర్ణయము-కవి పేరు తెలియదు. (3) షట్స్థలజ్ఞానము-కవి పేరు తెలియదు.

XI యక్షగానములు :

(174) ప్రహ్లాద : (1) మేళత్తూరు వెంకట్రామశాస్త్రి (2) కౌకర్ల త్యాగరాజు, (3) విజయరాఘవనాయకుడు, (4) లక్ష్మణదాసకవి, (5) రామానుజాచార్య, (6) బొడ్డుచర్ల సుబ్బకవి, (7) తిరునారాయణాచారి.

(B) నాటకములు : (1) ధర్మవరం కృష్ణమాచార్యులు (2) కోలాచలం శ్రీనివాసరావు.

(C) దండకము : ముంగర అప్పన్న-(నృసింహ దండకం-ప్రహ్లాద కథ).

(175) గొల్లవేషము కథ : (1) భారతి రామరాజు, (2) ఆత్రేయపు తిమ్మయ్య, (3) చెంగల్వరాయుడు

(176) కాళీయమర్దనము : (1) విజయరాఘవ నాయకుడు, (2) వెంకటపతి

(177) సముద్రమథనము : (1) శేషాచలదాసు, (2) ఆత్రేయపు తిమ్మయ్య.

(178) కృష్ణవిలాసము : (1) తిమ్మయ్య. (2) కన్నెబొద్ద గణపతి పెద్దకవి.

(179) జలక్రీడ : (1) అకలంక కృష్ణకవి, (2) శోభనాద్రి, (3) రామరాజు, (4) శాహాజీరాజు.

XII శతకములు : ఇందలి విషయమొక్కటే కాక పోయినను శీర్షికను, మకుటమును బట్టి ఒక్కటిగా చేర్చితిని.)

(180) నారాయణశతకము : (1) బమ్మెరపోతన, (2) ఫక్కి వెంకటనరసయ్య, (3) ఆదూరి కృష్ణయ్య.

(181) కాళహస్తి శతకము : (1) ధూర్జటి కవి, (2) [illegible]పాటి కొండయ్య. (3) [illegible]

(182) వేంకటేశ్వర శతకము : [illegible] (2) [illegible]

(183) ఆంజనేయ శతకము : [illegible] కవి, (2) గంగిపుట్టం నరసింహాచార్య.

(184) కుక్కుటేశ్వర శతకము : కూచిమంచి [illegible] కవి. (2) [illegible] వెంకట[illegible]కవి.

(185) సూర్యశతకము : [illegible] (2) [illegible]పాటి వేంకయ.

(186) కృష్ణ శతకము : [illegible], (2) నృసింహకవి, (3) విజయరాఘవాచారి.

(187) దాశరథి శతకము: కంచర్ల గోపన్న, (2) తిరుక్కోవలూరు కృష్ణదాసు.

(188) నృసింహ శతకము : (1) గోగులపాటి కూర్మనాథకవి, (2) శేషప్ప కవి, (3) కల్లెపాలెం నృసింహ కవి, (4) మన్నారి నరుస్వామి, (5) కొల్లానపురం బుచ్చిరామయ.

(189) మానసబోధ శతకము : (1) కొసుల పురుషోత్తం, (2) తిరుకవేలూరి కృష్ణదాసు, (3) తాడేపల్లి పానకాలరాయుడు.

(190) మదనగోపాల శతకము : (1) వంకాయలపాటి వెంకటకవి, (2) విజయనగరపు చెంగల్వరాయకవి.

పై గ్రంథములను బట్టి ఆంధ్రవాఙ్మయమున నెంత చర్వితచర్వణము గలదో గ్రహింపనగును.



# సనాతనగాయని 

మొక్కపాటి కృష్ణమూర్తి

గుత్తపు కంచుక మ్మొడిసి - కుల్కెడు తోరపు జిల్గువల్వతో,
బిత్తరి పిల్లవెండ్రుకల పెంచిన - వేసవి సొంపు పెంపుతో
క్రొత్తగ పూయు కెందొవ ల- క్రొన్నెల వెన్నెలగా మలంగి నా
చిత్తము చెంగటన్ మెలచి - చెల్వయి చొక్కపు పాట విన్చెనో!

పల్లవపాణి సోయగము పాయన - మిచ్చిన కైవడిన్ కరం
బల్లగదల్చి తాళగతి హల్లక - శోణదళాయితాంగుళీ
వల్లరి యంటి యంట నటు వాసిగ - నూరు తలాన తాకు మం
పుల్లము రాగరంజిత విమోహన - డోలల నాచి యూచెడున్

ఆమని మావికొమ్మతుద - నందమునొ చివురాకు పాటకున్
గోముగ నూహసేయు లల - నోత్కట యౌవన భాగ్యశాఖికా
శ్యామమనోహరాధర విచాలిత - రాగవినూతనాకృతుల్
యామునదీతరంగ రుచి - యాదవసూను కిశోరగీతులా!

కమ్మని పూలబాటల పికాంగన - కోరిన కంఠమాధురీ
సమ్మద భాగ్యవైభవ విసారిత - రాగమధూళి వొల్చ గా
సమ్ము మొండంద నింపిన - సనాతనగాయని దివ్యసైల్యకై
శ్యమ్ము కొనల్ చలించిన వ - యారె! మెఱుంగుల మంపు క్రొమ్ముడిన్

కలకలరావముల్ పసిడి - గంటల వేకువ సందె మావికా
వుల హావణిల్లుకైవడి న - పూర్వ మనోహర గానమాధురుల్
చిలికెడు వేళ కావిరుచి - చిప్పిలు చిక్కని మోవి చిందుతో,
తొలిమలి సందెమంపు పస - తో జవరా లెద రాగవల్లియా!

మెఱుఁగులు దేరు క్రొందళుకు - మీనులు దూసిన యేటిపాటలో
పరుగులువారు వేపసిడి - పాయల క్రొత్తరగల్ మలంగు ముం
గురులు వెలుంగు చెల్వ జిలు - గుం దెలినుర్వ వెలుంగు గొంతుతో
గరగరికల్ దొరంగు నుడి - కారపు సొంపుల కైత నించుతన్

పాటల దేలు నా పలుకు - బాగరికన్ తుదలందు కోర్కెలు
ఆర్రాటలు దేర చేదుకొన - నో, కదలాడెడి మోవితేనియల్
తేఁటులవోలె నాననో, వి - తీర్ణ విమోహ మహార్ణవంబులై
తేటతెనుంగు పల్కుసడి - దేరనొ లో నురియాడు భావనల్

---

[illegible] కొంటేసేపు [illegible] చూశాడు. ఈమాత్రం విష యానికి [illegible] నొచ్చుకోని దాన్ని [illegible] నాటకాలులా అంటూరా [illegible]. [illegible] పోయినా అనుమానం హెచ్చయింది. [illegible] రెండోది బహుమతి వచ్చినట్టు ప్రకటించబడితే దాని గురించి రాజుకు చెప్పవలసిన సమాధానం ఏమిటి? ఇది [illegible]లేదు. కొద్ది వారాల్లో తను పంపినదానికి బహుమతి వస్తే [illegible] [illegible]క్కిచ్చేయాలని నిశ్చయించుకున్నాడు. కాని ప్రథమ బహుమతి వచ్చిన సొల్యూషను దాను పంపిన సొల్యూషను ఒకటేనని రాజు ప్రశ్నిస్తే తను చెప్పవలసిన జవాబు తెలీనే లేదు. [illegible] ఏమైనా ఫలితాలు ప్రకటింపబడేంతవరకూ [illegible] చెయ్య వల్సిందేమీ లేదు.

[illegible] సుందరాలు కల్సుకొంటూనే ఉన్నారు. రాజు ఫలితాలకోసం నిరీక్షించడం లేదు. సుందరం మాత్రం నిశ్చింతగా ఉండటం లేదు, రోజులు దగ్గరకు వస్తుంటే కల్లోలం ఎక్కువై పోతోంది-చెప్ప వలసిన సమాధానం దొరకటంలేదు. పరిస్థితులు విష మిస్తాయేమో, స్నేహం శాశ్వతమే పోతుందేమోనని నిరీక్షణ నిర్ణీత దినాలు చేస్తోంది. సుందరం మనోవైకల్యాన్ని [illegible]కు అగోచరంగానే ఉంచగల్గుతున్నాడు.

అనుకోకుండానే "ప్రయిజులిస్టు" నింపుకొని కవరు వచ్చింది. సుందరం తనకిందే సంపద సంక్ర మిస్తుందని ఆశించనైనా ఆశించలేదు. అతని ఆనందం మహదానందమైంది. అనుకోకుండా ధనిక వర్గంలో చేర్చబడి పోయాడు. సుందరం సుందర భవంతుల్లో, శిల్పకళ వస్తువుల్లో, రంగు రంగుల కార్లల్లో, బూజు పట్టని బట్టల్లో, ప్రవ్యాపంచర జీవితాల్లో, మిశ్రిత జీవితాన్ని కోర్తించాలి. రూ 20,000 తన అధీనమై పోలాయి. ఇంటినిండా వెండి బంగారు సామగ్రులు, సోఫాలు, రేడియో, చిత్ర విచిత్ర చిత్రాలు, వింత వింత విగ్రహాలు, టిఫిన్లు, ఏపిల్సు, బిస్కట్లు, ప్లెయర్సు, కనుపాపల్లో దొర్లిపోతున్నాయి.

కొంత సేపటికి గాని సంతోషంలోంచి తేరుకో లేక పోయాడు. జాపితాచదివే అవకాశాన్ని ఇప్ప టికి వినియోగించుకుంటున్నాడు. తప్పులేని సొల్యూ షను పంపినందున ఒకతప్పుతో వచ్చిన యీతని సొల్యూషనుకు రెండవ బహుమతి ప్రకటింప బడింది. దీనిమూలం అంతా రాజేననే ఎప్పుడు సుందరం తెలుస్తూనే ఉంటాడు. రాజు సొల్యూషనుకి సొల్యూ షను'లో సరిచూడాలనే కుతూహలంతో దాన్ని పుస్తకం నుంచి తీసిచూచాడు.

పదం పదం పరవశం కల్గించింది; సీల్డు సెల్యూ షనుతో సరిపోయింది. ఇది చేరిఉంటే రాజు అంత దురదృష్ట వంతుడే కాకపోయేవాడు. సుందరం సంతోష ప్రవాహం అంతటితో ఆగిపోయింది.

[illegible] తనకు మున్ముందు భవిష్యాన్ని ఆలోచిస్తూ రాజు పనిని ఎప్పటిచోటే చేర్చాడు.

రాజు వస్తూనే "సాధించావోయ్ సుందరం. కష్టం ఫలించిం" దంటూ ఆనందం వెలిబుచ్చాడు. ఉత్సాహంగా ఉండవల్సిన సమయంలో దిగాలు పడుతున్న సుందరాన్నర్థం చేసుకోవటం కోసం ప్రయత్నిస్తున్నాడు రాజు. తన స్నేహితుడికి రెండో బహుమతి వచ్చిందని చూడ్డంతోనే తను సంతో షాన్ని పట్టలేక పోయాడే అతనిలో విప్లవం ఏమాత్రం కనిపించదేమా ననే ఆతడు ఆలోచిస్తున్నాడు.

రాజు జట్టు గాలిలో లేస్తోంది. సుందరం గదిలో గోడల్ల కేలండర్లు ఊగులాడుతున్నాయి. మంచంమీద దుప్పటి లేచిపోయింది, బల్లమీద పుస్త కాల కాగితాలు ఓపక్కనుంచి మరో ప్రక్కకి విసు రుగా లేచిపోయాయి. పుస్తకంలో పొందుపరచిన కూపన్లు ఎగిరి కిందపడ్డాయి. రాజు దృష్టిలోనూ పడ్డాయి సుందరం సమస్య విచ్చిపోయింది. స్నేహితం తుదిఘడియల్లో పడింది. రాజు సందర్శనాలూ, మధుర సంభాషణలూ ముగుస్తాయి. సుందరం సంజెల్లో రక్తపు పొంగుల్ని కూడా గాలి తెచ్చుకొంటోంది. పరిస్థితుల్ని పట్టే శక్యం కావటంలేదు.

"ఇవి యిక్కడే ఉండిపోయాయా?" అంటూ సహజంగా లేచాడు.

అనుకున్నంత కల్లోలం. కోప ప్రవాహాలు సుందరానికేం కనుపించలేదు. ఇంత తేలిగ్గా తనతప్పు తుడుచుకు పోతుందనుకోలేదు. రాజునోట వచ్చిన మొదటి ఉచ్చారణతోనే భావి నూహించాడు సుంద రం.

సామాన్య పరిస్థితుల్లోకి వస్తూనే - "దీన్ని గురించి నేను ఎంతో దిగాలు పడుతున్నా".

"ఎందుకింత వ్యాకులపడ్డం. అందుకే యింతవరకూ పూర్వపు సుందరంలా కనుపించడం లేదు. కారణం కోసం వెదుకుతే దొరకలేదు."

అందులో ఒక 'కూపను' 'ఆల్ కరక్టు'తో సరిపో యింది' దీన్ని చెపుతూ కొంత అనుమానించాడు. ఇప్పుడైనా కొంతకోపం వస్తుందేమోనని. మార్పులూ లేవు-రంగులూ మారడంలేదు.

"పోనీ! సరిపోతే. నీకు బహుమతి వచ్చిందిగా చాలు" "ఇరవై వేలల్లో సగం నీకు" అన్నాడు నవ్వు తెచ్చుకుంటూ.

"ఊహూ_"

సుందరం రాజు ముఖంలోకే చూస్తున్నాడు.

"నాకెందుకు? అది నీది. అంటూ చందా బ్రతుకునే కోరుకున్నాడు రాజు.

కల్ల కల్లోలాల్ని కళ్లల్లోకి తెచ్చుకుంటూ శూన్యంలోకి చూస్తున్నాడు సుందరం.

# సంచారి భావములు



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము, శ్రమ, ఆలస్యము, దైన్యము, చింత, మోహము, స్మృతి, ధృతి, వ్రీడ, చపలత, హర్షము, ఆవేగము, జడత, గర్వము, విషాదము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుప్తి, విబోధము, అమర్ష, అవహిత్థ, ఉగ్రత, మతి, వ్యాధి, ఉన్మాదము, మరణము, త్రాసము, వితర్కము అను ముప్పదిమూడును వ్యభిచారిభావములని సాహిత్యమీమాంసకులచే చెప్పబడుచున్నవి. వ్యభిచారిభావములనే సంచారిభావము లందురు.

సంచారిభావమనగా నేమి? భయము, కోపము అసూయ అనువానిని సంచారిభావములుగా గ్రహింపుము. వీటిని ఆంగ్లమున 'ఇమోషన్స్' (*Emotions*) అందురు. ప్రాణు లందరచేతను ఇవి దాదాపు ఒకే ఒకవిధమున అనుభవింపబడుచున్నవి. ఒకే ఒక సంచారిభావము అనేక విషయముల ద్వారా పైకి ఉబుకగలదు. సన్నివేశము నాశ్రయించుకొని సంచారిభావ ముద్దీపితమగును. భావమువలన గాని, ప్రత్యక్షదర్శనవలనగాని, శారీరక పరిణామముల వలనగాని ఇది వచ్చుటగలదు. ప్రతి సంచారిభావము విశిష్టవస్తువు నాశ్రయించుకొని బయలుదేరునేగాని ఇది అవస్తుకముగా నుండలేదు.

సంచారిభావములను స్థాయిభావములతోబాటు భావము లనుచున్నారు. భావమనగా చిత్తవృత్తి విశేషము, ప్రత్యక్షప్రతీతితో అవగతములగు మార్పుల నుండి బయలుదేరు సంచారిభావము ప్రవృత్తికి దోహద మొసగుచున్నది. అనగా అనుభూయమానమగు సంచారిభావము ద్వారా తత్కారణమును తెలిసికొన వీలగును. సంచారిభావమునకు గూడ కారణములు కలవని భావము. ఇతఃపూర్వమున్న ప్రవృత్తి నాశ్రయించుకొనినదగుటచే సంచారిభావము విశిష్ట చిత్తవృత్తులవలన జన్మించున దనవచ్చును. పిల్లికూన మనము తీసికొని వెళ్లునపుడు పిల్లికి కలుగు కోపము మాతృప్రేమవలన కలుగుచున్నది; కాని మనము తీసికొనివెళ్లుటచేత కలుగునదికాదు. స్థాయిభావము దీనిని ప్రవృత్తము చేయుచున్నదని భావము. ఇంతేగాక స్థాయిభావములోవలె సంచారిభావములో గూడ ఇచ్ఛా, జ్ఞాన, ఆనందములు సంకలితములై యుండును. ఈ మూటిలో నేదిలేకున్నను సంచారి భావము సమగ్రము కాదు. ఈ మూటిలోను ఇచ్ఛారూపమగు ప్రవృత్తి అతి ప్రధానమైనది. మిగిలిన రెండును దీని కంగములుగా వర్తించునవి.

విషయసంబంధము లేకుండా కలుగు సంచారిభావ మర్థరహితమైనది. ఒక వస్తువు భయంకరమైనదని మన మనస్సుకు భయమును గొలుపు స్వభావము వస్తువులో నంతర్గతమై యున్నదని మరువరాదు. అనగా భయము మన మనుభవించునదైనను, వస్తువుయొక్క స్వభావనిష్ఠమని తాత్పర్యము. మంచుగడ్డ చల్లగా కన్పించుట మన వేదనయేయైనను మంచుగడ్డలో చల్లదనము లేదనలేము. మంచుగడ్డలో చల్లదనము లేనిచో నితరులకు గూడ మనకు కల్గు అనుభవమే కలుగజాలదు. వస్తువుయొక్క ప్రధాన స్వభావమును నిరూపించజాలని సంచారిస్వభావము నిరర్థకము. కావుననే వ్యభిచార్యాది భావములు పద్ధతిత్త్వరూపజ్ఞానస్వభావములని అభినవు డనినాడు.

విశిష్ట భావాన్వితముగా సంచారిభావము ననుభవించుచున్నాము. ఈ వైశిష్ట్యమును జ్ఞానాకారమనదగును. సందర్భానుసారముగా జ్ఞానముపొందు అనుభూతిరూపములే సంచారి భావములని సిద్ధమగుచున్నది. సంచారిభావ ముద్దీపితమైన దనగానే జ్ఞానము స్తబ్ధమై యుండునని మనము సామాన్యముగా నెంచుటగలదు. ఇది పొరపాటు. సంచారి భావోద్దీపనముననే బుద్ధి ప్రచోదితమై, వికసితమై, త్వరత్వరగా ప్రసరించుచున్నది. సంచారిభావములో జ్ఞానముతోబాటు స్థాయిభావముగూడ ప్రబోధితమగుచున్నది. జ్ఞానజన్యమై, ప్రవృత్తిచోదకమై, ఉద్దిష్టార్థప్రాప్తి నందించునది సంచారిభావము. కాని మార్పులేక, మానసికముగానుండు స్థాయిభావమును శాశ్వతముగా నుండుదానినిగాను, తత్కాలానుభవ

యోగ్యమై క్షణికమై యుండుదానిని సంచారిభావము గాను మనము స్వీకరించుచున్నాము.

సమీక్షకులలో కొందరీ వైలక్షణ్యమును త్రోసివేసినారు. శక్తి, తీవ్రత, త్వరితగతిగల స్థాయిభావములు సుఖదుఃఖ ప్రబోధితములై మానవుని వీడక యుండునవి. ఈ స్థాయిభావములు పొందు ప్రవృత్తి ననుసరించి వ్యక్తియొక్క స్వభావాదికమును గ్రహించవచ్చును. స్థాయిభావముల తీవ్రత, చిరస్థాయిత్వము, ఇతరభావములను ప్రబోధింప జేయుట అనులక్షణముల ననుసరించి మానవుల స్వభావములలో భేదము లేర్పడుచున్నవి. ఈ మూటి సంకలనముద్వారా క్రోధము, దయ, నిరాశ, ఉత్సాహము, సోమరితనము, స్థైర్యము, మొదలగు స్వభావములు సిద్ధములగును. రసములుగా పరిణమించు స్థాయిభావముల అధీనములోని వీ స్వభావములు.

స్థాయిభావములు పరిపుష్టములై ఆస్వాద్యత్వ లక్షితములు కాగా రసములగుచున్నవని భరతు డని నాడు. పరిపోషణద్వారా కలుగు ఆస్వాద్యత్వము నిర్వేదాది సంచారిభావములకుగూడ గలదని లోల్లట, రుద్రటుల అభిప్రాయము. పరిపోషమును పొందిన ప్రతి చిత్తవృత్తియు రసము కాగలదని నమిసాధు వ్యాఖ్య. స్థాయి, సంచారిభావము లన్నియు రసములు కాగలవనియు, ప్రసిద్ధముగా నెనిమిది రసములే కన్పించుటచే భరతు డెనిమిదిరసములనే పేర్కొనినా డనియు లోల్లటుడు నిరూపించెను. అనగా ప్రతి సంచారిభావము స్థాయిభావము కాగలదు. కావుననే భరతుడు స్థాయిభావము లెనిమిదేనని స్పష్టముగా వీటి సంఖ్యను చెప్పలేదని భావము.

రసశబ్దమునకు రెండర్థములు కలవని ప్రతీహారేందురాజు చెప్పినాడు. సమగ్రమైన అనుభూతియే రసమని అర్థమును చెప్పిన ఆస్వాద్యత్వముగల సంచారి భావములన్నియు స్థాయిభావములు కాగలవు. కేవలము సాహిత్యప్రపంచమునగల అనుభూతియే రసమని అర్థము చెప్పిన రసశబ్దము తాంత్రికమగును. ఉద్భటు డైదువిధముల రసములను గ్రహించినాడు—(1) శమముతో కలసి తొమ్మిది స్థాయిభావములు; (2) ముప్పది మూడు సంచారిభావములు; (3) రసహేతువులు; (4) రసముల అనుభావములు; (5) రసములు. ఇవన్నియు రసములు కాగలవట! రసభావశబ్దముల వైలక్షణ్యము గ్రహింపబడకపోవుటచే నీ రసములు వచ్చినవని ప్రతీహారేందు రా జనినాడు. కాని స్థాయిని దీపింపజేయుచు, రసమున పర్యవసితమగు సంచారిభావములకుగూడ స్థాయిత్వము వచ్చునని భరతు డనినాడు. కాగా రస పరిపోషణమున నొకే భావము సందర్భవశమున స్థాయిగాను, సంచారి భావముగాను కూడా ప్రవర్తింప వీలున్నది.

శృంగారరసమున త్రాసము, ఆలస్యము, ఉగ్రత, జుగుప్స అను సంచారిభావములు పనికిరావని భరతుడు నిషేధించినాడు. ఇచట సంచారి భావముగా చెప్పబడిన జుగుప్స స్థాయిభావమైనచో బీభత్సరసము నర్పించగలదు. ఒకేఒక భావము తత్తద్యోగ్యతా వశమున స్థాయిగను, సంచారిగను, సాత్త్వికముగను, అనుభావముగను ప్రవర్తింపవచ్చునని "వ్యభిచారిణ స్త్రాసాలస్యౌగ్ర్యజుగుప్సా వర్జం" అను భరతవాక్యమువలన అభినవుడు చెప్పగలిగినాడు. ఇదేవాక్యము నాధారము జేసికొని వత్సల, మతి, గర్వములు స్థాయిభావములై వరుసగా ప్రేయస్, ఉదాత్త ఉద్ధత రసముల నీయగలవని భోజుడు వచించెను. రత్యాదికమగు నలుబదితొమ్మిది భావములు విభావానుభావ వ్యభిచారి సంయోగవశమున నలుబది తొమ్మిది రసములు కాగలవని శృంగార ప్రకాశమున భోజు డనినాడు.

సంచారిభావము క్షణికము, తత్కాలానుభవ యోగ్యము నగుటచే నిది స్థాయిభావమున కంగము. భయ, హాస, శోక, క్రోధములు స్థాయిభావములని యనుమన్నాము. కాని ఈ నాలుగు మనచే శాశ్వతముగా స్థాయిత్వముగా ననుభవించబడునవి గావు. ఇవి కొంచెము కాలమువరకే యనుభవించబడుచున్నవి. అందుచే నివి సంచారిభావములు కావచ్చునని తోచకమానదు. సంచారిణుల స్థాయులైనచో భయ, హాస, శోక, క్రోధములుమాత్ర మెంతకాల ముండుచున్నవని శృంగారప్రకాశమున భోజుడు ప్రశ్నించినాడు. ఈ నాల్గు స్థాయిభావములు సంచారిణులు కాదగినచో, మిగిలినవిమాత్ర మేల కారాదు?

స్థాయిభావములలోను, సంచారిభావములలోను కూడ విశిష్టమగు నర్థముగలదు. ఇవి రెండును మానవులచే ననుభవింపబడుచున్నవి. వాసనా సందీపన

వశమున నంతర్గతములగు నీ రెండును ఉద్దీపితములగుచున్నవి. సమగ్రపరిపోషము, విషయము నుద్దేశించిన ప్రవృత్తి యనునవిగూడ వీటికి తుల్యములే యగుచున్నవి. కాగా ఆలస్య, శ్రమ, జడతాది సంచారిభావములతో సంయోగమందిన గ్లాని సహితము రసము కాగలదని భోజుని అభిప్రాయము. ఉద్ధత, స్వాతంత్ర్య, ఆనంద, ప్రశమ, పారవశ్య, సాధ్వస, విలాస, అనురాగ, సంగమ, అమర్ష, విషాదాది రసములీ విధముగా సిద్ధించగలవు. శృంగారతిలకమున రుద్రభట్టుగూడ ఈ వాదము నంగీకరించుచున్నాడు.

సంచారిభావము స్థాయి కావచ్చునని భరతుడు చెప్పిన వాక్యములను ప్రస్తావించితిమి. ఈ వాక్యములను లెక్కజేయక, తన మాటలనే తాను విశ్వసించక, "స్థాయిభావము సంచారిభావము కావచ్చును గాని, సంచారిభావము స్థాయిభావము కాజాలదు" అని అభినవు డనినాడు. రుయ్యకుడు మొదలుగాగల ఆలంకారికు లీ యభిప్రాయమునే స్వీకరించిరి. "సంచారిభావములు శాశ్వతముగా సంచారిభావములుగానే ఉండును; ఇవి యెప్పుడును స్థాయిభావములు కాజాలవు." అని మహిమభట్టు నొక్కి చెప్పుచున్నాడు. కాని భూయిష్ఠవి భావజములగు రత్యాదులు స్థాయిభావములని, ఇవే స్వల్పభావములద్వారా ఉత్పన్నములైన సంచారభావము లగునని శార్ఙ్గదేవుడు పల్కుచున్నాడు.

ఒక భావము స్థాయియగునా? సంచారియగునా? అను సంశయ నివృత్తికి ప్రవృత్తియొక్క స్వభావమును తెలిసికొనవలెను. ప్రవృత్తినిష్ఠమైన భేదముతప్ప ఇతరభేద మిచట కన్పించదు. కావున ప్రతి సంచారిభావమును స్వతంత్రమని, పరతంత్రమని స్వీకరింపవలెను. స్వతంత్రమైనపుడిది స్థాయియగును. పరతంత్రమైనపుడిది సంచారియగును. వేంకటనారాయణ దీక్షితుడీ యభిప్రాయము నంగీకరించుచున్నాడు. మనుష్యులకు రాజు, శిష్యులకు గురువుఉన్నట్లు భావములకు స్థాయిభావములు కలవని భరతు డనినపుడీ యభిప్రాయమునే గ్రహించినట్లు చూపట్టుచున్నది. యోగ్యతావశమున నొకే భావము స్థాయిగాని సంచారిగాని కావచ్చును.

సంచారిభావ మనుభవింపబడునపు డాంతరంగికానుభూతి బాహ్యముగా వ్యక్తమగును. ఈ వ్యక్తీకరణాలో బయలుపడునవి సాత్త్వికభావములు, అనుభావములు. సాత్త్వికభావములను వేరొకచో విమర్శింతము. ఇక్కడ అనుభావములను గూర్చి తెలిసికొనవలెను.

వాగంగసత్త్వకృతములు అభినయములు అనుభావ్యమానముగా జేయునవి అనుభావములని భరతుని నిర్వచనము. వాచిక, ఆంగిక, సాత్త్వికాభినయములు తత్తద్హేతుభూతములగు భావముల నభివ్యక్తము చేయునవి. శరీరజములగు కటాక్షాదికమువలె కార్యభూతమైన యనుభావమభినయమునకు చెందినది. ఆంతరంగిక ప్రవృత్తికి అనుగుణముగా శరీరము మెలగునపుడు శరీరమున కన్పించు ఈమార్పుల ననుభావము లందురు. అనగా ప్రతి ప్రవృత్తిలోను ఆత్మానాత్మలన్యోన్య సంకలితములై మెలగునని భావము. కావున ననుభావములను సంచారిభావములుగా స్వీకరించరాదు. ఇవి సంచారిభావమువలన నుత్పన్నములగునవి. సాత్త్వికాభినయాంతర్గతమగు యోషిదలంకారములు కొన్ని గలవు. ఆంతరంగిక సంచారిభావము నభివ్యక్తము చేయు వీటిని విశ్వనాథు డనుభావము లనినాడు. వీటిలో కొన్ని దేహమునకు, మనస్సునకు గూడ చెందినవి. భావ, హావ, హేలాదు లిట్టివి. యత్నజములగు శోభ, కాంతి, దీప్తి, మాధుర్యము, ప్రగల్భత, ఔదార్యము, ధైర్యము అను నేడలంకరణములు మానసికవృత్తుల నభివ్యక్తము చేయుటకు యోగ్యమైన ఉపాధియగు దేహమును సంబంధించినవి. మనసుచే నియమింపబడుటచే వీటిని యత్నజములు, లేక స్వాభావికము లనినారు. ఇవన్నియు సంచారిభావాభివ్యక్తిని తెలియజేయునవి.

సంచారిభావము విభావముకంటె గూడ విలక్షణమైనది. సంచారిభావమును పరిపోషకత్వమునకు తీసికొనిపోవునది విభావము. వాచిక, ఆంగిక, సాత్త్వికాభినయములవేటి ద్వారా విభావ్యమానమగుచున్నవో అవి విభావములు. స్థాయిభావమును రసముగా పరిణమింపజేయుటకు సహకారికారణములగు విభావములు బాహ్యజగత్తులోని విషయములు లేక సన్నివేశములని భావము. ఇవి చిత్తవృత్తులు గాకపోవుటచే వీటిని సంచారిభావములుగా గ్రహించరాదు. విభావానుభావ సాత్త్వికభావములన్నియు రసములు కాగలవను వాదమిందుచే నున్మూలితమగుచున్నది.

ఈ సంచారి భావములను పరిశీలించినచో వీటి స్వభావము కొంత తెలియగలదు. భరతు డిచ్చిన

ముప్పది మూడు సంచారి భావములలో కొన్నిటిని పరిత్యజించవచ్చును. గ్లాని, శ్రమయనునవి రెండును పర్యాయపదము లగుటచే వీటిని రెంటిని స్వీకరింప నక్కరలేదు. గ్లానియనగా శ్రమయొక్క రూపాంతరమే ఆలస్యము. ఈ రెంటిని ఒకేఒక భావముగా గ్రహించవలెను.

నిద్ర, సుప్తి యనునవి మనస్సు విశ్రమించి నప్పుడు గల దేహావస్థను తెలుపుపదములు. ఇవి శారీరక స్థితులే గాని చిత్తవృత్తులు కావు. కావుననే సుప్తివిబోధములు రెండును సాగరనంది పఠించెను. బోధమును చిత్తవృత్తియని చెప్ప నెవరును సాహసించలేదు. మరణాపస్మారములు కూడ నిట్లే చిత్తవృత్తులు గావు. కావున వీటికి బదులు ఈర్ష్యాశమములను భోజుడు చేర్చినాడు. కాని భరతుని అసూయలో ఈర్ష్య గలదు. ఏకదేశమగు నిర్వేదమున శమమున్నది. మతి, స్మృతి, వ్యాధి, జడత యనునవి మానసికస్థితులు లేక శారీరకస్థితులు కాగలవు. అంతే గాని ఇవి ప్రవృత్తిపరములైన చిత్తవృత్తులు సంచారి భావములు కాజాలవు.

అంతరంగికమగు అనుభూతిని చాటుట అవహిత్థ యనబడును. భానుమిశ్రుడు ఛలమును పఠించినాడు గాని ఛలమనగా అవహిత్థయే. అందుచేత గోపనము సంచారి భావముచే జనించునదే గాని సంచారిభావము మాత్రము కాదు. మదము, ఉన్మాదము, మోహము, విబోధము, చపలత, హర్షము అనునవి సందర్భవశమున సంచారిభావము కల్పించు గుణములే కాని వేరుగాదు. వితర్కము, శంక యనునవి పర్యాయపదము లగుటచే వీటిలో నొక దానిని తీసివేయవచ్చును. ఆవేగమున ఔత్సుక్యమున తుల్యానుభూతి కలదు.

ఈవిధముగా భరతుడు చెప్పిన ముప్పదిమూడు సంచారిభావములలో పందొమ్మిది పోగలవు. ఇక మిగిలిన సంచారిభావములు పదునాలుగు గ్లాని, ఔత్సుక్యము, శంక, అమర్షము, అసూయ, ఉగ్రత, గర్వము, త్రాసము, దైన్యము, ధృతి, నిర్వేదము, వ్రీడ, చింత, విషాదము, అని వీటిని పిలుతురు వీటిలో రతి, హాసము, శోకము, క్రోధము, భయము, ఉత్సాహము, విస్మయము, జుగుప్స అను స్థాయి భావము లున్నవి. అమర్ష, ఉగ్రత అను సంచారి భావములు క్రోధమను స్థాయిభావముయొక్క రూపములు. దైన్యవిషాదములు శోకముయొక్క రూపములు. ఉత్సాహముయొక్క రూపములు ధృతి, హర్షములు. భయానకరసమునకు త్రాసమును స్థాయిభావముగా సాగరనంది గ్రహించును. భయత్రాసముల భిన్నము ఇని చూపినాడు. కాగా పదునాలుగు సంచారిభావములలో నాలుగు తగ్గగలవు. ఏరీతిగానైనను మనము పరిత్యజించలేని సంచారిభావము లెనిమిదగలవు.

శారీరకస్థితులను, మానసికస్థితులను, సంచారి భావములలో కన్పించు గుణములను భరతుడు సంచారి భావములుగా లెక్కించినాడు. కొన్ని స్థాయిభావములను సంచారిణులనుగా పరిగణించినాడు. అపస్మారము, నిద్ర, మరణము, సుప్తి, వ్యాధి అనునవి శారీరక స్థితులు. జడత, మతి, స్మృతి యనునవి మానసిక స్థితులు. అవహిత్థ, ఉన్మాదము, మదము, మోహము, విబోధము, హర్షము, చపలత యనునవి సంచారి భావగుణములు. ఉగ్రతామర్షలు, దైన్యవిషాదములు, స్మృతి, త్రాసము అనునవి స్థాయిభావములు. శ్రమ, గ్లాని, ఆలస్యములలో నొక్కటే గ్రహించబడ వలెను. ఇట్లే ఆవేగౌత్సుక్యములలో నొకటి, శంకా వితర్కములలో నొకటి సంచారిభావము లగును. ఇట్లు చేయగా నెనిమిది సంచారిభావములే సిద్ధించ గలవు. ప్రధాన సంచారిభావము లెనిమిది. రూపాంతర క్లిష్టములై, స్థాయిభావతుల్యములైన సంచారిణులు అమర్ష, విషాద, స్మృతి, త్రాసములు.

ఒక సంచారిభావ మొకేయొక స్థాయిభావముతో సంబంధించియుండునని చెప్పుట కష్టము. స్థాయిభావమును, తత్ప్రవృత్తిని ఆధారముగా జేసి కొని వచ్చునవి సంచారిభావములు. ధృతి, ఔత్సుక్యము, దైన్యము అనునవి కోరికవలన వచ్చునవి. ఈ భావము లుద్దిష్టార్థమునకు చెందియుండునవి. కోరిక తీవ్రముగా నున్నకొలది సంచారిభావము కూడ తీవ్ర రూపమునందును. ప్రాథమిక స్థాయిభావమునుండి ఉత్పాద్యములగు నివి మిగిలిన సంచారిణులకంటె విలక్షణములుగా కన్పించగలవు. ఇట్లే కరుణ స్థాయియగు శోకము సంశ్లిష్ట సంచారిభావముగా (*Blended Emotion*) ప్రతీయమాన మగుచున్నది.

భావ్యార్థ ప్రాప్తికిగాక గతార్థవిషయమును గూర్చి కోరిక బయలుదేరినచో చింత, విషాదము రాగలవు. వీటిద్వారా నిరాశ, వ్రీడ కల్గినచో పశ్చా

గత్వముకూడా రాగలవు. ఇట్లు వివిధ భావసంశ్లిష్ట మగు నిర్వేదము గాని, ధృతిగాని ఉత్పన్నములు కాగలవు. ఉభయత్ర కృతజ్ఞతా పూర్వకమగు ఆత్మజ్ఞాన ముండును. వినయ మార్ద్రభావముతో సంకలితమైన కృతజ్ఞత వచ్చును విషయముపైగల భక్తిశ్రద్ధలు తీవ్ర రూపమునుదాల్చి ఆత్మ ప్రహీ్వభావ రూపమగు నిస్సంగత్వమును తీసికొని రాగలవు. కాని, ఈ ఆర్ద్ర భావములు క్రోధముతో గలసిన అసూయ, అవమానము ప్రతీకార బుద్ధి వచ్చుచున్నవి.

ఈదృష్ట్యా క్రింది శ్లోకమును గమనించిన విషయము విశదము కాగలదు.

"క్వాకార్యం శశలక్ష్మణః క్వచకులం
భూయోఽపిదృశ్యేతసా
దోషాణాం ప్రశమాయనః శ్రుతమహో
కోపేఽపికాంతంముఖమ్
కింవక్ష్యంత్యపకల్మషాః కృతధియః
స్వప్నేఽపిసా దుర్లభా
చేతఃస్వాస్థ్య ముపైహి కఃఖలుయువా
ధన్యోఽధరం ధాస్యతి"

ఈశ్లోకములో నాలుగుజతల సంచారిభావములు కన్పించగలవని వ్యాఖ్యాత లనినారు. వితర్కౌత్సుక్యములు, మతి స్మరణములు, శంకా దైన్యములు, ధృతి చింతనములు పరస్పరము బాధ్య బాధక భావముతో నున్నవి. ఇచట చింతయే ప్రధానమగు సంచారి భావమని అభినవగుప్తుని అభిప్రాయము. అట్టిచో మిగిలిన భావములు దీనితో సంకలితములై భిన్నభావ సంశ్లిష్టమగు విశిష్ట సంచారిభావము నీయగలుగు చున్నవి. వీటిని శ్లిష్టసంచారి భావములు *Blended Emotions* అని వ్యవహరించవలెను.

ఉద్దిష్టార్థ ప్రాప్తిని గురించిన కోరికతో గాని, తద్విషయము నుండి మరలి పోవలెనను భావముతో గాని, సంబంధించి యుండునవి శ్లిష్ట సంచారి భావములు. అనగా వీటికి విశిష్టస్థాయి భావములతో నవినాభావ సంబంధము లేదని భావము. ఇవి స్థాయి భావములవలె శక్తి వంతములై ప్రవృత్తికి చోదకములు కాగలవు. కాని ఈశక్తి తీవ్రమైన ఇచ్ఛ నాశ్రయించుకొని వచ్చునది. ఒక సంచారి భావముతర సంచారిణులను తన విభావానుభావములుగా గ్రహించగా వచ్చునవి శ్లిష్ట సంచారిణులనుట జగన్నాథునకుగూడ సమ్మతమే. నిర్వేదమునకు విభావముగాను, అసూయ కనుభావముగాను ఈర్ష్యగలదని నిద్రకు విభావముగాను, ఔత్సుక్యమున కనుభావము గాను చింతకలదని రసగంగా ధరకారు డనినాడు.

ఈవిచారణవలన ఎనిమిది ప్రాథమిక సంచారి భావములు, నాలుగు శ్లిష్ట సంచారిణులు కలవని శ్లిష్ట సంచారిణులు తుల్యములు స్థాయి తుల్యములని సిద్ధమగు చున్నది. ప్రతి స్థాయి భావమునకు తత్తద్విశిష్ట సంచారి భావములుగలవు. ఔత్సుక్య, చింతా హర్షాదులు రతిలోగలవు. హర్ష, నిర్వేదాదులు హాసమున గలవు. చింతా, దైన్య, గ్లాని, నిర్వేదాదులు శోకములోనివి. గర్వామర్షాసూయాలు క్రోధమున నున్నవి. అమర్ష, ధృతి, గర్వము లుత్సాహమున గలవు. త్రాస దైన్యాదులు భయమున నున్నవి. నిర్వేదాదులు జుగుప్సలో కనిపించును. వ్రీడా, శంకా, హర్ష, ధృత్యాదులు విస్మయమున నున్నవి.

సంచారిభావము లన్యోన్య సంబంధము కలిగి యున్నవి. హర్ష క్రోధములు ప్రవృత్తికి తీవ్రరూపము దాల్చునట్లు చేయునవి. త్రాస శోకములు ప్రవృత్తిని అరికట్టునవి భయక్రోధము లాటంకముల వలన బయలు దేరునవి. రతిహాస సంకలితమగు హర్షము చిత్తవికాసమును, ఉత్సాహవిస్మయ సంకలితమగు విస్మయము చిత్త విస్తృతిని, భయజుగుప్సా మేళనమగు భయము చిత్తక్షోభమును, క్రోధ శోకాన్వితమగు విషాదము చిత్త విక్షేపమును తీసికొని రాగలుగు చున్నవి.

ఈవిధముగ పరస్పర సంశ్లేష రూపమున సంచారీ భావములున్నచో రసమునకు స్థితి వచ్చు చున్నది. ఇదియొక భావస్థితి. ఈ భావస్థితి స్థాయి రూపమున ప్రవర్తించుటకు, విశిష్ట, విషయ దర్శన కలుగగానే విశిష్ట రూపమున నుద్దీపితమగును. సంచారి భావము ధ్యాయమానముగా కున్నను ఈ భావస్థితి రాగలదు. కొన్ని వస్తువులను గాని, కొందరు వ్యక్తులను గాని చూచిన వెంటనే సహజముగా మనము ప్రేమించుటగాని, • ద్వేషించుటగాని ఈ ప్రక్రియ ననుసరించియే జరుగుచున్నది. వీటినే రాగద్వేషము లనుచున్నాము. ఈ రాగద్వేషములు సుఖదుఃఖానుగతములై యుండును. అనగా ఒక్క స్థాయి భావమునకు ఒకే ఒక సంచారి భావముండునని చెప్పరాదు. ప్రధానముగా నుద్దీప్తమైన సంచారి భావ ముద్దిష్టార్థ ప్రాప్తికై వివిధస్థాయి భావముల సహాకారమును గ్రహింగవచ్చును. ఒకే ఒక స్థాయి భావము భిన్న సంచారిణులతో సహకరించవచ్చు గూడ. ప్రతి ప్రవృత్తిలోను గల స్థితిని, సందర్భమును అనుసరించి ఒక భావము స్థాయియగునో, సంచారియగునో నిర్ణయించవలెను. ఇతర భావములను తన కంగములుగా చేసికొనునది మాత్రమే స్థాయి భావము.

# వెన్నెల విన్నపాలు



శ్రీ బొడ్డు బాపిరాజు

[శ్రావణ బెల్గోలాలోని మహావీర జినమూర్తి అభ్రంకష మహోన్నతమైనది. నయనామృతములగు తద్రూపరేఖలు శరద్యామినుల మరింత మోహనములు. మనసులో నిలిచిన ఆ కొండా, కొండకొనపై స్వామి మధురాకృతీ, దానిని వెలిగించే ఒక తియ్యని వెన్నెలరేయీ ఈకృతి కాకృతి నిచ్చినవి.]

చదలేటి మొగిలి పొదలం
జెదరినపుప్పొడులా! కడలి చెంగుల తరగల్
విదిలిచిన పాల నురగలా!
పొదవెన జాండమును పొరలు పొరలై వెలుగుల్!

వికసించినవి మహావీరశిరోవీథి, మౌక్తికమకుట సామ్యమున కొన్ని;
పరిఢవించినవి తత్ప్రభు భుజాంతరసీమ, వైజయంతీ వైభవమున కొన్ని;
ప్రవహించినవి స్వామి పటుదీర్ఘ తనుయష్టి, క్షీరాభిషేక ప్రసిద్ధికొన్ని;
ప్రసరించినవి దివ్య పాదాగ్రవేదిక, పూజాప్రసూన విస్ఫురణ కొన్ని;

వెన్నెలలు చింది చిలుపలై వెల్లివిరిసి
తళుకులొరసిన వా శారద త్రియామ
భావనా రమ్యరూపకల్పనల మెరసి
గోమతేశ్వర సేవా నిగూఢభక్తి.

మిన్నుల రాయుస్వామి తలమీద శరచ్చరదభ్రమాలికల్
పన్నను వెల్లువూల చలిపందిరి. నిష్ఠుర తప్తపన్నము
త్పన్న మహాగ్ని గ్రాగు గిరివల్లభు నౌదల గందపు తగా
సన్నగసాగె వెన్నెల తుషారము, కప్పురపుం దుమారమున్

హిమచేలాంచల చంచలాభ్రసరణిన్ హేలాపదన్యాస నృ
త్యములన్ స్వామి పదాబ్జసేవకు శరద్రాజేంద్ర కన్యాసహ
స్రము విచ్చేసెననంగ వెల్గినవి జ్యోత్స్నాధార లంతంత మొ
త్తములై తద్గిరి సానుభాగముల ముక్తాశ్రేణి పండించుచున్

సకల దిగంతరాళములు చల్లని తెల్లనికాంతి శాంతిలో
నొక మధురానుభూతి తళుకొత్త, సుదీర్ఘ వినీలరేఖ వా
లిక నిలుచున్న స్వామి కనుగ్రేవల చిందు దయారసామృతో
ర్మికలు జగమ్ములెల్ల ప్రసరించునటే మధుచంద్రికామిషన్.

అవును వెన్నెల కాదు. సత్యమ్ము! స్వామి
తరుణ కరుణాస్మితమ్ము! కాదన్న నెట్లు

వ్యథిత దుఃఖితజనమనోవ్యాధు లెల్ల
తుడిచివేయును నమృతహాసోపచరణ?

వినుడో వెన్నెలలార! స్వామి శ్రవణోర్విన్ మీరు క్రీడించు నే
ళను విన్నింపుడు శ్రద్ధ నిట్లని-తృణప్రాయమ్ముగా రాజ్యముం
దన యిల్లాలిని, కన్నబిడ్డని సమస్తం బుజ్జగించెన్, తపిం
చెను, సాధించె నతండు మున్ను భువనశ్రేయమ్మునుం దానుగా.

"ఓయి ప్రభూ! తపింతు విటు లుర్విధరాగ్రము నెక్కి, ఎన్ని య
ధ్యాయము లేగె లోకకథ! నంతయునుం దిలకించినావె? అ
ధ్యేయములయ్యె నేఁడు భవదీయ జగద్ధిత మార్గముల్! దయా
త్తోయధి వాచు కొండ దిగదో! ఒకగట్టుకు జేర్తువో భువిన్!

"మానవజాతియంధ, మపమార్గమునం బడె, లోభమగ్నమ
జ్ఞానవిదగ్ధమై యడుగు జారె; పరస్పరదుష్టచింతలో
దానవమయ్యె, హింసపశుధర్మము ద్రొక్కె, తదీయ బోధనా
ధ్వానములయ్యె నింతటి యధర్మము చూచి భరింతువే ప్రభూ?

"సత్యమహింస శాంతియను శబ్దపదార్థ మెరుంగరాదు పో!
నిత్యము పీటవెట్టుకొని నిల్చెను హింసను తద్భయంకరా
పత్యములో దురాశయును స్వార్థము నేఁడు జగమ్ము నేలు సం
యత్యయ మోర్తువో తెలిసి యయ్య, తథాగత! మౌనముద్రలో

"లేదు పరార్థదృష్టి లవలేశము, పీడన దక్కినన్; మతో
న్మాదముగాక తన్మహిత మార్గసమాదృతి లేదు; స్వార్థసం
పాదన తప్పినన్ మతికి పట్టదశేష నిజభాగ్య బీజ మా
సోదర మానవస్థితియు, చూడు ప్రభూ! జగమెట్లు పోవునో

"కదలి రావయ్య తండ్రి! నేఁడైన వచ్చి
దివ్య నవధర్మరథము ప్రతిష్ఠనలిపి
శాంతి చంద్రాతపమ్మున జగతి నడుప
సత్యము నహింస తద్రథాశ్వములు సేసి"

అని యల్లన వినిపింపుడు
జిననాథుని; లోకహితము సేయుడు;—మీ ప
ల్లని తన మది యెవరికి వ
చ్చునయా! నవచంద్రికాకిశోరములారా!

# పుట్టుమచ్చ



శ్రీ వెంపటి సచ్చిదానందశర్మ

మనిషికి మరుపెందుకు వస్తుందో!—
ఎప్పుడు వస్తుందో!—

ఈ విషయాలు సరిగా ఊహించగలిగితే తను మరిచిపోయిన విషయమేదో ఇట్టే జ్ఞప్తికి తెచ్చుకోగలననుకున్నాడు రామ్మూర్తి చిట్టచివరికి.

మరిచిపోయిన విషయాన్ని వదిలి, తనకున్న సైకాలజీ పరిజ్ఞానాన్ని తిరగదోడుకోవటం మొదలుపెట్టాడు తనకు తెలీకుండానే!—అత్యంతాసక్తితో ఒకటి తరవాత ఒకటి సైకాలజీ పుస్తకాలు రాత్రింబవళ్లూ అదేపనిగా చదవటం; ఒకనాడు అర్ధరాత్రి దాకా చదివి పుస్తకంలో విషయాలు తనకు అన్వయించుకుంటుంటే తనకుతనే పరమ కిరాతకుడిలాగా తోచటం; లైటు ఆర్పివేయబోతూంటే అద్దంలో కనిపించిన తన బొమ్మను చూచుకుని కెవ్వుమని కేకవెయ్యబోవటం—ఇత్యాది ఘట్టాలన్నీ మనఃఫలకం మీద బొమ్మలు కడుతున్నై.

సిగరెట్టు ముట్టించి దమ్ములాగి ఫక్కుమని నవ్వాడు రామ్మూర్తి.

ఒంటరిగా నిలబడి అంత నవ్వు నవ్వినందుకు పక్కనున్న వ్యక్తి భయపడుతూ రామ్మూర్తివైపు చూశాడు.

రామ్మూర్తి స్పృహలోకి వచ్చాడు. పేవుమెంటుమీద నిలబడ్డ మరెవ్వరూ తన నవ్వు పట్టించుకోనందుకు తృప్తిపడ్డాడు. తనకు తెలీకుండా సైకాలజీ ఊబిలోపడి నవ్వుపాలయ్యానని నాలిక కరుచుకున్నాడు.

తను మరిచిపోయిన విషయమేదో జ్ఞాపకం రాలేదు. అదేదో తన బావమరిదికి చెప్పాలనుకున్న పరమరహస్యం!

మస్తిష్కంలో మరుగుపడిఉన్న భావాలన్నిటినీ కుళ్ళగించటానికి శాయశక్తులా పూనుకున్నాడు. కాని, అంతుదొరికే సూచనలేమీ లేవు. విసిగి 'లాభంలేదు.....వాడితో కబుర్లాడటంలో అదే జ్ఞాపకం వస్తుందిలె' ననుకునే లోపల సుందర్రావు రామ్మూర్తి ముందునుంచి వెళ్ళటం, అది తను గమనించకపోవటమూ రెండూ జరిగిపోయినై.

ఆ విషయం సుందర్రావు బాగాదూరం వెళ్ళిన తరవాత కాని రామ్మూర్తి గ్రహించలేదు.

ఇవాళింత పరాకుగా ఉన్నానేమనుకున్నాడు. అంతేగాని, అప్పుడైనా గ్రహించలేకపోయాడు మరుపెందుకు వస్తుందో, ఎప్పుడు వస్తుందో!

'సుందరం! సుందరం!!' రామ్మూర్తి బొబ్బలెట్టుకుంటూ పేవుమెంటుమీద నడక, పరుగుకాని విధంగా అటువైపు బయలుదేరాడు.

ఈ పిలుపులేమీ విననట్టు ఎదురుగుండా ఆగి ఉన్న బస్సులో పడ్డాడు సుందర్రావు ఒక్క గంతులో. అంతేకాదు, రామ్మూర్తి వచ్చేలోపల బస్సు కదిలిపోతే బాగుండునని కూడా అనుకున్నాడు!

'ఒరే! బావా! నిన్నేరా!' రామ్మూర్తి నడకమాని పూర్తిగా పరుగు ప్రారంభించాడు నవనాగరికతల కాలవాలమైన త్యాగరాయనగరు పేవుమెంటుమీద!

బస్సు కదులుతున్న చప్పుడు.

సుందర్రావు 'అమ్మయ్య!' అనుకున్నాడు.

ఇంతలో, వెనకనుంచి 'హోల్డాన్!' అన్న కంఠస్వరం గదమాయింపు బాకుతో వెన్నులో పొడిచినట్టు వినిపించింది సుందర్రావుకి.

బస్సులో ఎవరో ఎక్కారు. వెనక్కు తిరిగి చూడటానికి మెడతిప్పే ఓపిక నశించింది సుందర్రావులో. అనుమానమేమీ లేదు—ఆ ఎక్కింది రామ్మూర్తే!

రొప్పుతుంటూ వచ్చి పక్కన కూర్చున్నాడు రామ్మూర్తి!

సుందర్రావు మెడ కేసో ఉచ్చు బిగిసినట్లనిపించింది. బాధపడుతున్నట్టు మెడ అటూ ఇటూ తిప్పి 'ఏరోయ్, బావా!' అంటూ పరామర్శించాడు.

'చాల్లేరా! మరీ వేషాలు పోతున్నావు! అల్లంతదూరాన్నుంచి గావుకేక పెట్టినా పలక్కుండాను...'

'అబ్బే, నిజంగా......నన్నుకోలేదురా!' నమ్మించటానికి చెయ్యతగ్గ అభినయమంతా చేశాడు సుందర్రావు.

'ముక్కు మొగ మెరగని కండక్టరు నేను పిలుస్తున్నది విన్నానని బస్సు ఆపాడుగాని, నీకు తెలీనే లేదుట! సరిగ్గా అబద్ధాలాడటమైనా నేర్చుకోరా!'

సుందర్రావు రామ్మూర్తి మాటలు పట్టించుకోనట్టు పెదమొగం పెట్టి కూర్చున్నాడు. బావమరిది మాట కట్టించటానికి సుందర్రావు తరుచు ఆచరించే ప్రక్రియలో ఇది ఒకటి. తను సమాధానం చెప్పకుండా ఊరుకున్నాడంటే మరొక నాలుగు సరవళ్ళ తరవాతనైనా రామ్మూర్తి నోరుకట్టెయ్యకపోడని సుందర్రావు నమ్మకం.

రామ్మూర్తిది అదోక తరహా—మెడ్రాస్ అయేది, ఆపైన లండన్ అయేది మన అలవాట్లు, మన ప్రవర్తన మారవలసిన అవసరం లేదు—అంటాడు. ఈ విషయంలో వాడితో ఇతరులు ఏకీభవించక పోయినా వాడికి చింత లేదు.

రామ్మూర్తి ప్రవర్తనలో ఉన్న ఈ మొరటుదనంవల్ల ఎక్కువ బాధకు గురిఅయింది సుందర్రావు. మన ప్రాంతపు అలవాట్లన్నీ మన ప్రాంతాల్లోనే వదిలి మరీ కలకత్తా మెయిల్లో అడుగుపెట్టేవాడు. కాని, రామ్మూర్తి మాత్రం ఆ మర్యాద దక్కనిచ్చేవాడు కాదు.

అంతేకాదు—ఎదురైన మరుక్షణంలో తనకి తానుగా పెద్దరికం వహించి 'చిరంజీవ!' అని దీవిస్తున్నట్టు మాట్లాడేవాడు సుందర్రావుతో.

మనః ప్రవృత్తుల్లో ఉన్న ఏ విశేషంవల్ల రామ్మూర్తికి ఆ అధికారం వస్తోందో, ఏ లోపంవల్ల తనకి చిన్నరికం వస్తోందో బోధపడక పోయింది సుందర్రావుకి. అనేకసార్లు అనుకొనేవాడు—అతని కంటే ముందు ఆ పెద్దరికం అంది పుచ్చుకుందామని. కాని, సుందర్రావుకది సాధ్యం కాకపోయేది.

బస్సు కండక్టరు టిక్కెట్లు ఇచ్చుకుంటూ వస్తున్నాడు వెనకనుంచి.

'చంద్రపాలిని చూచిరావటానికి వస్తానని... ఈ వేళకు నన్నిక్కడుండమని...ఇలా మొహం తప్పిస్తున్నా వెక్కడికిరా?' రామ్మూర్తి మళ్ళీ అందుకున్నాడు.

ఈ ప్రశ్న తనమీద విరుచుకుపడక పోదని, ఇందాకటినుంచీ సమాధానంకోసం సతమతమవుతున్నాడు సుందర్రావు. కాని, సమాధానం తోచేలోపలే రామ్మూర్తి ఈ ప్రశ్న వెయ్యటంతో—ఏదో ఆ సరా అందుకునే లోపల కాళ్ళకింద ఆధారం లాగివేసినట్లయింది సుందర్రావుకి.

'క్షమించరా బావా! చంద్రపాలి ఇంటికి వద్దామనే బయలుదేరాను కాని, అర్జెంటు పనొచ్చింది...మరోకచోటికి వెళ్ళాలి''...అన్నాడు తడబడుతూ.

“ఎక్కడికిరా?”

సుందర్రావుకి వళ్లు మండింది. 'పారిస్‌కి!' అన్నాడు సడలిదుతున్నంత అసహ్యం గొంతులోకి తెచ్చుకుని.

రామ్మూర్తి పకిలిగా నవ్వుతూ, ''మిడతం భొట్టూ! నువ్వు పన్నెండో నెంబరు బస్సులో ఎక్కి పారిస్‌కి వెడుతున్నావట్రా?'' రామ్మూర్తి ఇంకా నవ్వుతున్నాడు.

అవతలివాళ్ళ ప్రాణాలు తోడి, అర్థమైన అవాకులు, చెవాకులు వాగించి తను సంతోషించే వెధవ స్వభావం తన బావమరిదిది అనుకున్నాడు సుందర్రావు.

నిజానికి, తను బస్సులో ఎక్కేటప్పుడు అది ఎక్కడినుంచి ఎక్కడికి పోయేదో చూడలేదు. రామ్మూర్తి కంటపడకుండా ఉంటే చాలునని ఆగి ఉన్న బస్సులో దూరాడు. మరి డిటెక్టివ్‌ని మించి ఇలా ప్రాణాలు తీస్తే తనేమి చెయ్యగలడు?

'తెలివి తక్కువగా ఆడిన అబద్ధాన్ని ఇప్పుడైనా కప్పిపుచ్చుకోరా—వెళ్ళవలసింది పారిస్‌కే... కాని, మైలాపూరుపోయి, సుబ్రహ్మణ్యంతో కలిసి అటునుంచి అటు పారిస్ పోదామనుకున్నాను—అని!'

ప్రాణం నిలువునా తీశా డనిపించింది సుందర్రావుకి—తనుపడ్డ ఈ ప్రమాదంనుంచి తప్పుకోవటానికి తను చెప్పాలనుకుంటున్న సాకుకూడా అదే! అది కాస్తా రామ్మూర్తిముందే చెప్పేశాడాయె. ఇప్పుడు తను మళ్ళీ వాటినే పునశ్చరణచేస్తే ఏం అతికిచస్తయ్యి!

మరి వేరే ఆలోచనకూడా తోచటంలేదు.

'నిజంగారా! నమ్మితే నమ్ము; లేకపోతే లేదు—సుబ్రహ్మణ్యం దగ్గిరికే నేను వెళుతున్నది. ఆపైన పారిస్‌లో అర్జంటుపనుంది ... తలపోయే విషయం...' ఎంత నొక్కిచెప్పినా ఎబ్బెట్టుగానే అనిపిస్తోంది సుందర్రావుకి. కాళ్లు, చేతులు కట్టివేసి తన బావమరిదిని పరుగెత్తే బస్సునుంచి విసిరి అవతల పారేస్తే బాగుండు ననిపించింది!

సుందర్రావు పడుతున్న ఈ ఇరకాటమంతా గ్రహించి సంతోషిస్తున్నవాడిలాగా "అబద్ధాల ఊబిలో ఏం దిగబడిపోతున్నావురా! అబ్బే! నాకు తెలుసురా—ఈ సుబ్రహ్మణ్యాలు, ఈ తలపోయే పనులూ—అన్నీను! క్షణంక్రితమే సుబ్రహ్మణ్యం కనిపించాడు. నీతో మాట్లాడి వస్తున్నానన్నాడు! నిన కెప్పుడో అనుకున్నారుట—మీ రిద్దరూ మిడ్లాండుకి మాటినీకి పోదామని! కానీ, అనుకున్న సినిమా కాకపోవటంవల్ల వెళ్ళటం సంక్షేపించుకున్నారుట!—ఇదేనా సుబ్రహ్మణ్యాన్ని కలుసుకోవటమూ, తలపోయే పనీను?" అన్నాడు రామ్మూర్తి.

సుందర్రావు తెల్లబోయిచూస్తూ ఉండిపోయాడు. చెప్పిన అబద్ధాన్నల్లా రామ్మూర్తి ఎగరేసి తెగనరుకుతూంటే తనేమి మాట్లాడగలడు?

'ఎంగె పోణుంసార్?' అన్నాడు కండక్టరు, కబుర్లుమాని టిక్కెట్టు ప్రసక్తి ఎంతసేపటికి ఎత్తుతారో చూదామని తనూ అంతసేపు కాచుకు కూర్చున్నట్టు.

'రెండు ట్రిప్లికేన్' రామ్మూర్తి జేబులోనుంచి డబ్బు తీస్తున్నాడు.

సుందర్రావు బిక్కగా కండక్టరువైపు చూస్తున్నాడు. 'ఇది ట్రిప్లికేన్ పోవాదుసార్! ఇది '12. A' మైలాపూర్ చిత్రకోళందానే పోను' కండక్టరు ఈ మాటలనేసరికి—సుందర్రావు తెరిపిని పడ్డాననుకున్నాడు.

'ఐతే, రెండుల్జ్!'

టిక్కెట్టును గురించిన సంభాషణలో, పరుగెత్తుతున్న బస్సు రొదలో...సుందర్రావు తను ట్రిప్లికేన్ రానుగాక రానన్న మాటలు తుడిచిపెట్టుకుపోయినై.

'నాకు తెలుసులేరా. నువ్వు ఎత్తిన ఎత్తే మిటో—నన్నిక్కడ పడిగాపులు పడమని నువ్వు ఒక్కడివీ చంద్రమౌళి ఆతిథ్యం అందుకునేందుకు బయల్దేరావు!' రామ్మూర్తి ఆడిపోసుకుంటున్నాడు.

అలా కవ్విస్తూంటే నిజమే నన్నట్టు నోరు మూసుకు కూర్చోటం ఎలా?

పైగా, చంద్రమౌళి తనకు ముఖ్య స్నేహితుడు. తన్ని వాళ్లింటికి ఆహ్వానిస్తూ, బావమరది కదా అని మర్యాదకోసం పక్కనున్న రామ్మూర్తిని కూడా రమ్మన్నాడు. అంతమాత్రానికే చంద్రమౌళి ఇంటికివెళ్ళటానికి తనకంటెకూడా ఇంత ఆసక్తి చూపుతాడేమిటి? విపరీతం! ఇలాటి వెకిలితనం రామ్మూర్తికి కొత్తకాదని సుందర్రావుకి తెలుసు.

'ఒక్కణ్ణే వెడదామనుకుంటే వెడదామనుకున్నానులేరా...' అన్నాడు సుందర్రావు—బస్సు దిగిన తరవాత మాట్లాడుకుందాం ఆ గొడవలన్నీ—అనే మాటలు స్ఫురించేటంత విసుగ్గా.

"ఇద్దర్నీ కాఫీకి రమ్మని పిల్చాడా లేదా చంద్రమౌళి?"

సుందర్రావు సమాధానం చెప్పకూడదని గట్టిగా నిర్ణయించుకున్నాడు.

'మరయితే అంతస్వార్థమెందుకు? అంతా నువ్వే బావుకోవాలేం...'

సుందర్రావు ఇంకా మౌనంగానే ఉన్నాడు. మాటవరసకి రమ్మంటే ఎందుకు వీడికింత ఉబలాటం? తను అక్కడికి వెళ్ళటానికి ఇష్టంలేదని తెలియబట్టే పీడింప రెచ్చిపోతున్నాడేమోనని వెనకటి తన

ప్రవర్తనకి లోలోపల విచారపడటం మొదలుపెట్టాడు సుందర్రావు.

రామ్మూర్తికూడా వాగ్ధోరణి కట్టిపెట్టాడు.

రామ్మూర్తి మనసులో ఏదో లీలగా మెదలటం మొదలుపెట్టింది. ఆలోచనలో పడ్డాడు. ఆలోచించినకొద్దీ ఏదో చీకట్లో తడుముకుంటున్నట్లుంది తప్పితే విషయమేదో తెలుసులోకి రావటం లేదు.

అంతసేపూ రామ్మూర్తి ఊహల్లో చంద్రమౌళి మెదులుతున్నాడు. ఏమిటి చంద్రమౌళిని గురించినది? ఏమో! చటుక్కున, అతడి ఆతిథ్యం జ్ఞాపకం వచ్చింది. ఇలా ఆలోచిస్తూంటే విషయాన్నుంచి దూరమౌతున్నట్లు కూడా అనిపించింది, మళ్లీ—

చంద్రమౌళి చాలా కలుపుగోలుతనంగల మనిషి. ఒకనాడు మౌంటురోడ్డులో సుందర్రావుకి ఎదురై పట్టరాని ఆవేశంతో పరామర్శించాడు. ముజ్రా హోటల్లో కూర్చుని పూర్వస్నేహాన్ని అదేపనిగా నెమరువేశాడు.

'చాలా మారిపోయావ్' అన్నాడు సుందర్రావు మాట్లాడుతున్నంతసేపూ చంద్రమౌళిని అదేపనిగా చూస్తూ.

చంద్రమౌళి వస్తుతః స్ఫురద్రూపి. మిగతా ఆకారం తేలిగ్గా ఊహించుకోవచ్చు—కవి; అందులోనూ భావకవి కూడాను! పూర్వంనుంచీ చంద్రమౌళికి కవిత్వధోరణి ఉండేది. వాడు రాసినవేవీ సుందర్రావు చదవటమైతే చదవలేదుగాని, చాలా పత్రికల్లో అచ్చవటం ఎరుగున్నాడు! ఉచ్చుపట్టలేక వాడి గొడవలేవో వాడు పత్రికలనిండా చెత్తరాసుకుంటుంటే అవన్నీ చదవవలసిన శిక్ష మనకేమిటనిపించేది సుందర్రావు ఇత్యాదులకి!

మొత్తానికి వీడికేదో ప్రేమగొడవ లుండి ఉంటై. లేకపోతే ఇంతచేటు గోలెత్తడు పత్రికల్లో—అనుకునేవాళ్లు చంద్రమౌళినిగురించి సుందర్రావు వగైరా మిత్రులు. కాకపోతే, పొరుగూరినుంచి వచ్చి కాలేజీలో చదువు వెలిగిస్తూన్న చంద్రమౌళి గుట్టూమట్టూ తెలిసేదికాదు వాళ్ళకి. ఇంతలో, బియ్యేలో చేరినవాడు కాస్తా, హఠాత్తుగా చదువుకి స్వస్తిచెప్పి యుద్ధంలోచేరి అటుశత్రువులమీద బాంబులు విసరటంతోపాటు ఆంధ్రదేశంమీద విరహగేయాలుకూడా వదలటం ప్రారంభించాడు.

మళ్ళీ ఈనాడు మద్రాసులో ప్రత్యక్షమయాడు చంద్రమౌళి! 'ఎప్పుడొచ్చావ్?' అన్నాడు సుందర్రావు, 'ఎన్నాళ్ళకు కనిపించాం!' అన్నంత పరామర్శగా.

చంద్రమౌళి చాలా కులాసాగా ఉన్నాడు. 'రావటమేమిటి? ఇక్కడే ఉంటున్నాను!' అన్నాడు.

'ఏం చేస్తున్నావ్?' అన్నాడు రామ్మూర్తి కేవలం పరామర్శిస్తున్నట్టు.

'పత్రికా సంపాదకుడుగా కాలం గడుపుతున్నాను' అని ఒక చిరునవ్వు నవ్వాడు. ఇంతవరకు తన జీవితం ఎన్ని విపరీతమైన దారులు తొక్కిందీ జ్ఞాపకం వచ్చి తనకి తనే నవ్వుకుంటున్నాడేమోనని పించింది సుందర్రావుకి.

'వివాహమయిందా?' అని అడుగుదామని నోటిదాకా వచ్చింది సుందర్రావుకి. కాని, అన్ని విరహగేయాలు వ్రాసిన వాణ్ణి అంత సూటిగా ఆ విషయం అడిగితే ఏం పోయి ఏం వస్తుందోనని విరమించుకున్నాడు.

కాని, చంద్రమౌళి ఇప్పుడు నిగ్గుతేలి ఉన్నాడు!

మిత్రులిద్దరూ ఇంత చనువుగా పరామర్శించుకుంటుంటే రామ్మూర్తి మెదలకుండా కూర్చున్నాడు, వాళ్ళతో పాటు ఒకటి తరవాత ఒకటిగా సిగరెట్లు మాత్రం తగలేస్తున్నాడు. నిజానికి, తనకూడా మాట కలపతగ్గ విషయం ఒక్కటి కూడా లేదు వాళ్ళ సంభాషణలో.

చంద్రమౌళి బిల్లు చెల్లించి బైటికివస్తూ 'రేపు ఆదివారం మా ఇంటికి రారా... కాఫీవేళ కల్లారా... భోజనాలు కూడా మా ఇంట్లోనే... మరిచిపోకు' అని రామ్మూర్తితో 'మాస్టారూ! మీరు కూడా రావాలి.' అని వెంటపెట్టుకువచ్చే బాధ్యత సుందర్రావుకి పురమాయించాడు. తన ఎడ్రెస్ చెప్పి ట్రిప్లికేన్ బస్ స్టాప్‌కి పరుగెత్తాడు చంద్రమౌళి.

చంద్రమౌళికి పెళ్లి అయివుంటుందనుకున్నాడు సుందర్రావు. అతగాడు చేసిన బహువచన ప్రయోగం చెవుల్లో రింగురింగుమంటోంది.

'ఎవట్టా ఈ కవిగారట్టు?' అన్నాడు రామ్మూర్తి చంద్రమౌళి బారెడుదూరం సాగగానే. సుందర్రావు తనకు తెలిసిన వివరాలన్నీ చెప్పాడు.

'ఐతే, ఈ మహాకవి కావ్యవస్తువు మనం చూడ తగ్గదే! మన ప్రయాణం మరిచిపోకు!' చంద్రమౌళి భార్యను చూడాలని తనుకూడా నిజానికి కుతూహల పడుతున్నాడు. ఆ విషయాన్ని రామ్మూర్తి బైటికి అనేసినందుకు పట్టరానికోపం వచ్చింది వాడిమీద.

తరవాత, సుందర్రావు కనిపించినప్పుడల్లా రామ్మూర్తి జ్ఞాపకంచేశాడు ఆదివారంనాటి తమ కార్యక్రమం. మాటవరసకి రామ్మూర్తిని పిలవగా వాడింత ఆసక్తి చూపించటం సుందర్రావుకి చాలా చికాకనిపించింది.

రామ్మూర్తి నిజంగానే అనుకున్నాడు—తను బాధపడి, చంద్రమౌళిని బాధపెట్టి, నాసి గేయాలవల్ల ముక్కోటి ఆంధ్రుల్లో అక్షరజ్ఞానమున్న చాలా మందినికూడా బాధపెట్టిన ఆ యువతీలలామ నిజ సౌందర్యాలు తను తెలుసుకోవాలని! ఇలా భావించటం తప్పేమోనని అప్పుడప్పుడు ఆత్మపరీక్ష చేసుకోకనూ పోలేదు! ఆ మాటకొస్తే—చంద్రమౌళికి ఆ అమ్మాయిమీద మోజుఉంటే ఉండిఉండవచ్చును. గాని, ఆ మోజులో తన గేయాలద్వారా అశేష జనాన్ని ఉవ్విళ్లూరించగా లేనిది తను కేవలం జిజ్ఞాసువుగా ఆవిడ్ని చూడాలనుకోవటంలో తప్పేమీ లేదనుకొని ఊరటపొందాడు!

కాని, రామ్మూర్తికున్న ఇంత ఉత్సాహం మరునాటికల్లా చల్లారిపోయింది—ఆ వ్యక్తి ఎవరో తెలిసేసరికి. ఐనా, తన బావమరిదితో హాస్యమాడటానికైనా ఈ ప్రయాణం పనికివస్తుందిలెమ్మని తృప్తిపడ్డాడు!

—రామ్మూర్తి పంచకుగా, సుందర్రావుతో మైలాపూరుకి బస్సులో ప్రయాణంచేస్తున్నా నన్న విషయం మరిచి, చంద్రమౌళిని కలుసుకుని ఇంటికి తిరిగి వస్తున్నామన్న భ్రాంతిలో పడ్డాడు! లేవమని సుందర్రావు మోచేతితో పొడిచేదాకా బస్ వచ్చిందన్న తలంపే లేదు. రామ్మూర్తి మాట, పలుకు లేకుండా అంతసేపు బుద్ధిమంతుడివలె ప్రయాణం చెయ్యటం సుందర్రావుకికూడా ఆశ్చర్యంగానే వుంది.

బస్సు దిగంగానే సుందర్రావు రోడ్డు దాటి కాఫీహోటలువైపు దారితీశాడు. 'ఇటెక్కడికిరా?' అన్నాడు రామ్మూర్తి వెనకనుంచి.

'కనిపించటంలా? హోటలుకి!'

'ఒరే...అబ్బీ! మధ్యలో మళ్ళీ హోటలు తతంగం పెట్టక నా మాట విను. వాళ్లు ఈ పాటికే కనిపెట్టుకుని ఉంటారు' ముఖ్యంగా తనకోసమే వాళ్లు కాచుకుని ఉంటా రన్నట్టు అన్నాడు రామ్మూర్తి ఈ మాటలు! దాదాపు ఈ పిలవని పేరంటానికి రామ్మూర్తి ఇలా ఎగబడటం సుందర్రావుకి విపరీతమైన చికాకు కల్గిస్తోంది.

ఎలాగో హోటలుచేరి సాధ్యమైనంత టైము అక్కడే గడవటానికి వీలుగా రెండు స్పెషల్ మసాలా దోసెలు బాగా కాల్చి తీసుకురమ్మని పురమాయించాడు!

"నాకు తెలీక అడుగుతాను...ఏమిట్రా ఇదంతా?" అన్నాడు రామ్మూర్తి కుర్చీలో కూలబడుతూ, చంద్రమౌళి ఇంటికి సుందర్రావు రావటానికున్న అభ్యంతర మేమో తనకు తెలియనట్టు!

"నేను అక్కడికి రాను!" అన్నాడు సుందర్రావు మొండిగా.

'ఎందుకని?'

'అదంతా అనవసరం'

'ఏమిట్రా ఆ పరమ రహస్యం నాకు చెప్పటానికేం?' అన్నాడు రామ్మూర్తి తెలియనివాడివలె.

'నా రహస్యా లెవో నాకు లక్ష ఉంటై. అవన్నీ బైటికి ఎందుకు చెప్పాలేమిటి?'

'పోనీ చెప్పవద్దులే, దాచి ఉంచుకో...నాకు తెలిసిన రహస్యాలెవో నేనే చెప్తాను బైటికి— మీనాక్షితో నువ్వు ప్రణయం అఘోరించబోతే జరిగిన రసాభాసమంతా చంద్రమౌళి ముందు కడిగి వేస్తాను...'

సుందర్రావు గుండె గుభేలుమంది. ఇప్పుడు ఆ మీనాక్షే చంద్రమౌళి భార్య అని రామ్మూర్తికి తెలిసి అంటున్నాడో తెలీక అంటున్నాడో సుందర్రావుకి బోధపడకపోయింది. అందులో రామ్మూర్తి కేదైనా దుర్బుద్ధి పుట్టాలే గాని అనుకున్నంత చేసి తీరగల సమర్థుడు!

అడకత్తెర సందుపోకలాగున్న దనిపించింది తన పరిస్థితి సుందర్రావుకి. ఎదురుగా కూర్చున్న బావమరిది తన కళ్ళకి యమదూతవలె కనిపిస్తున్నాడు.

ఒకవిధంగా ఆలోచిస్తే చంద్రమౌళి ఇంటికి వెళ్ళకపోవటంకూడా తప్పే. రమ్మని మరీమరీ ఆహ్వానించాడు. తన గొడవలేవీ అతనికి తెలిసినట్లు లేవు. వెళ్ళకపోవటమే అనుమానాలకు దారి తీయవచ్చునసలు! అంతకంటె బలీయమైన విషయం—మీనాక్షిని చూడాలని అతని హృదయం ఆరాటపడుతోంది—ఇంకా! ద్వేషం అనురాగానికి ప్రతిరూపమే అన్న సత్యం తెలుసుకోలేని అమాయకుడైన సుందర్రావుకి ఇలాటి కోర్కె ఎందుకు కలుగుతోందో అర్థం గాకపోయింది!

ఆర్డరిచ్చిన మసాలదోసెల మాట, కూర్చున్న హోటలు మాటా మరిచి చాలరోజుల వెనక్కి పొర్లుకు పోయినై వాళ్ళి ఊహలు.

'నీ జీవితమంతా ఒక పెద్ద తెల్ల మతాబాల దీపావళిరా, బావా!' అన్నాడు రామ్మూర్తి విరగబడి నవ్వుతూ.

నిజంగా అంతేనేమో అనిపించింది సుందర్రావుకి!

పూర్వంనుంచీ కూడా అంతే!—

క్షణంసేపు ఎదురుగా కూర్చుని పుస్తకం తెరిచిన పాపాన పోకుండానే బియ్యే మొదటి సంవత్సరమంతా గడిచిపోయిందని విచారించిననాటి సుందర్రావంత బుద్ధిమంతుడు మరొకడుండి ఉండడు. బడి, ఇల్లు—తప్పితే వేరే వ్యావృత్తి పెట్టుకుంటే మాట దక్కదు సుమా—అని ఒకటికి పదిసార్లు బుద్ధికి బుద్ధి చెప్పాడు. కాలేజీనుంచి ఇంటికి రావటమే తడవుగా రెండు మెతుకులు గొంతులో వేసుకుని మేడమీది తన గదిలో చేరి తలుపులు బిడాయించేవాడు. తరవాత చదివేవాడో లేదో కాని, పుస్తకం మాత్రం చేతి కంటుకుపోయేది!

తన చదువు సవ్యంగా సాగటానికి సుందర్రావు ఇంకా ఆలోచించిన ముఖ్యమైన మార్పులో ఒకటి—తన భార్య సరస్వతిని పుట్టింటికి పంపటం! ఈమాట చూచాయగా అందించేసరికే 'ఇది మరీ బాగుంది! మీ చదువుకి నేనడ్డమా ఏమిటి? ఉరుము ఉరిమి మంగలంమీద పడిందట...అట్లా ఉంది మీ వరస! ఇంతకీ అబ్బాయిగారికి చదువు వంటపట్టక...'

వెధవ ఎద్దేవాలు ఇదీను!—అనుకున్నాడు సుందర్రావు. అర్థాంగి అయ్యుండి తను పడుతున్న బాధ గుర్తించదేం? 'ఆ! నువ్విక్కడ ఉండటం నా చదువుకి అడ్డమే' అన్నాడు సుందర్రావు చేతనైనంత కోపంగా.

''సరే ఐతే, ఇంకనుంచీ ఈ మేడపైకి తొంగి చూస్తే ఒట్టు! ఏం చదివి వెళ్ళబెడతారో అదీ చూస్తాను!'' అంటూ రోషంగా చూచింది భర్తవైపు.

తరతరాలుగా పురుషుల్ని పాశవశుల్ని చేసుకుంటూవచ్చిన స్త్రీజాతి బలమేదో ఆ చూపుల్లో ఉన్నట్లనిపించింది సుందర్రావుకి.

'ఏమైనా నువ్విక్కడ ఉండటానికి వీల్లేదు!' అన్నాడు మొండిగా.

''ఏమైనా నేనిక్కడినుంచి వెళ్ళటానికి అంతకంటె వీల్లేదు!'' అంది మరింత మొండిగా.

భార్యకు తనంటే భయభక్తులు లేనందుకు విచారించాడు సుందర్రావు!

ఇంతలో చెల్లెలు సుశీలకూడా తయారైంది అక్కడ! వదిన—మరదళ్లిద్దరూ కూడారంటే ఇకను వాళ్ళను పట్టశక్యమే కాదు. ఎంత వద్దనుకుంటున్నా తను హాస్యగాడై తీరేవాడు!

ఆ వాళ్ళకు సహజమైన వన్నె, చిన్నెలన్నీ చేర్చి విషయమంతా సరస్వతి చెప్పగా విని, ''...మరి కాదా ఏమిటి? వదినే! నువ్విక్కడికి రాకపూర్వం అన్నయ్య చదువు ఎంత గొప్పగా ఉండేదనీ? నీ మూలాన అన్నయ్యప్పుడిలా అయిపోయాడు కాని, పూర్వం వాడు చదువులో నిధే!...''

వదినె—మరదళ్లిద్దరూ విరగబడి నవ్వటం మొదలు పెట్టారు.

''బాగా చెప్పావు! అసలు మన బంగారం మంచిదైతే...'' నవ్వుతో సరస్వతి వాక్యం పూర్తిచేయలేకపోయింది.

సుందర్రావుకి పట్టరాని కోప మొచ్చింది. తను చెయ్యగలిగింది చేశాడు—అక్కడినుంచి వెళ్ళిపోయాడు! అక్కడ దుండగులమల్లా మరింత నగుబాటు పాలు గావటమే. తను ఏ క్లాసులో ఎప్పుడూ [illegible];

ఎప్పుడు గట్టెక్కిందీ తిథి వార, నక్షత్రాలతోసహా బైటికి తోడకపోరు!

సుశీలకు చాలా గర్వం బలిసింది అనుకున్నాడు సుందర్రావు. అది స్కూల్ ఫైనల్ సవ్యంగా పరీక్ష అవటంవల్ల వచ్చిన ప్రమాదమిది అనికూడా అనుకున్నాడు! నిన్నగాక మొన్న ఇంటర్మీడియెట్‌లో చేరిందో లేదో ఎమ్మేడిగ్రీ పుచ్చుకోబోతున్నట్లుంది దాని ఊబలాటం!

సుందర్రావు ఇంటికి వచ్చేసరికి ఇల్లంతా చాలా నిశ్శబ్దంగా వుంది. సరస్వతి, సుశీల...ఇద్దరిలోనూ పూర్వపు నవ్వులాట ధోరణేమీ లేదు. తన కోపాన్ని వాళ్లు కొంతవరకైనా పాటించారని సంతృప్తిపొందాడు సుందర్రావు.

తదేకదీక్షగా విద్యాభ్యాసంగం రెండురోజుల పాటు జరిగింది.

మళ్ళీ మూడోనాడు పూర్వపు కేరింతాలతో ఇల్లంతా దద్దరిల్లిపోతోంది. గది తలుపులు ఎంత బిగించినా సుందర్రావుకి చిత్తైకాగ్రం కుదరటం లేదు. పుస్తకాలతో పోరాటంగా పోరాడుతోంది అతని మనస్సు.

''అన్నయ్యా! అన్నయ్యా!!'' సుశీల దెబ్బలకి తలుపు పగిలిపోతుందేమో ననుకున్నాడు.

దఢాల్న తలుపుతీసి, 'ఏమిటే? అంత కొంప మునిగిపోయినట్టు తలుపు బాదుతున్నావ్?' కొట్టినంత కోపంలో అన్నాడు సుందర్రావు.

'డిక్షనరీ కావాలి. అస్తమానం నీ దగ్గిర పెట్టుకూచుంటే ఎలా? మాకుమాత్రం అవసరముండదా?'

'అయ్యో! నిఘంటువుల అవసరం మీకు కాక పోతే మాకా? మావేముంది వానాకాలం చదువులు!' అని, ఈ ఎక్స్ట్రావాచాలనట్టు, 'ఇంతోటి తట్టు బళ్ళ ఇంటర్మీడియెట్‌కే ఇంత హడావిడి చేస్తోంది.. ముందుస్నైమాపాట్లు! అసలు దీన్ని స్కూల్ ఫైనల్ పరీక్ష చేసినవాడెవడో కాని ఆ దుర్మార్గుడు మా ప్రాణాలు నిలువునా తీశాడు!...'

ఇంతలో ఒక అపరిచిత స్త్రీ కంఠం అవతలి నుంచి 'సుశీలా! రావోయ్! ఒకమాటకి అర్థం తెలీక పోతే మునిగిపోయింది లేదు...' అంటూ వినవచ్చింది.

సుందర్రావు గొంతు తడి ఆరిపోయింది! ఒక్క క్షణానికి తెప్పరిల్లి డిక్షనరీకోసం వెతకటం ప్రారంభించాడు. గదిలో ఎక్కడా లేదు.

వసారాలోకి వచ్చాడు.

మీనాక్షి కూర్చుని ఉంది.

ఇద్దరూ ఒక లిప్తసేపు తొట్రుపాటు పడ్డారు, తమకు తెలియకుండానే.

సుందర్రావు వెంటనే మొహం మరల్చుకున్నాడు. మళ్లీ ఒకసారి మీనాక్షిని చూదామనుకున్నాడు. కాని మాటలేకపోయాడు. తడబడుతూ వెర్రిగా ఏవేవో గాలించటం మొదలుపెట్టాడు, డిక్షనరీకోసం! తన్ని తాను సంబాళించుకుని, ఈ అర్థంలేని తన వెతుకును చూచి ఆ అమ్మాయి లోలోపల నవ్వుకుంటూ ఉండివుంటుం దనుకున్నాడు. ఎలాగో అక్కడి నుంచి బైటపడ్డాడు.

తన గదిలోకి వచ్చి కూర్చున్న తరవాతకూడా ఒళ్లు చిన్నగా వణుకుతున్నది. తన కెందుకిలా ఉందో అర్థంగాకపోయింది సుందర్రావుకి, స్త్రీతో పరిచయంలేనివాడుగాదే తను!

ఆరోజుల్లో చదువుమీద ధ్యాసపోలేదు సుందర్రావుకినరాలు పట్లు తప్పి పనిచేస్తున్నై. మీనాక్షి బొమ్మనే చిత్రించుకుంటోంది అతని మనస్సు—ఆ బొమ్మ చాలా అలుక్కుపోయినట్టుంది. మీనాక్షిని మరోకమారు బాగా చూచివుంటే బాగుండే దనుకున్నాడు సుందర్రావు.

మరునాడు మీనాక్షి కాలేజీలో కనిపించింది. తను, సుశీల క్లాసు వదిలిపెట్టగానే వాళ్ల వెయిటింగ్ రూముకేసి వెళుతున్నారు.

సుందర్రావు మనసుదీర తేరిపార జూచాడు. మీనాక్షేమీ కన్ను చెదరేటంత అందగత్తె కాదనుకున్నాడు. చాలా నిరాడంబరంగా వుంది. కాని, వయసుని మించిన వ్యథ లేదో ఆ అమ్మాయిలో దాగి ఉన్నయ్యనుకున్నాడు సుందర్రావు.

ఆరోజుల్లా సుందర్రావు పరాకుగానే వున్నాడు పరిసరాలని మరిచి అతని మనసు మీనాక్షినే చిత్రించుకుంటోంది. ఆనాడు తను సుశీలని చేసిన ఎద్దేవాలన్నీ తనకు అన్వయించుకుంటుందేమోనని బాధపడ్డాడు.

సరస్వతి గదిలో ప్రవేశించటంతో అతని ఊహలన్నీ చెల్లాచెదరైపోయినై. భార్యమీద పట్టరాని కోపమొచ్చింది.

రెండురోజుల తరవాత సుశీలతో పాటు మీనాక్షి ఇంటికి వచ్చింది. [illegible] లిద్దరూ చేరి $S=UT+\frac{1}{2}(AT)^2$ అనే ప్రాబ్లం సాల్వ్ చెయ్యటానికి పూనుకున్నారు. అవాళ్ళ మాస్టరు చెప్పిన పాఠమూ, అచ్చుపుస్తకమూ... రెండూ కూడా వాళ్ళ చేతికి సహాయకారులు కాకపోయినై.

మీనాక్షి వస్తుంటున్నా సుశీల అన్నయ్యని పిల్చింది. తనకు జ్ఞాపకమున్న ప్రాబ్లం అడిగినందుకు తన అదృష్టానికి తనే సంతోషిస్తూ తన తెలివితేటలు సాధ్యమైనంతవరకు వెల్లడయ్యేట్టు ఆ ప్రాబ్లం సాల్వ్ చేశాడు.

తరవాత వీలు కల్పించుకుని కాలేజీ విషయాలు మాట్లాడాడు కొంతసేపు. మధ్య మధ్య మీనాక్షిని గమనిస్తూనే ఉన్నాడు. కాని, మీనాక్షి ముఖం ఏ భావాలనీ వ్యక్తం చెయ్యటం లేదు! తను ఇవతలకు వచ్చిన తరువాత పూర్వపు హడావిడిలో వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్నారు. మీనాక్షి తనముందు సిగ్గుపడి ఉంటుందనుకున్నాడు సుందర్రావు.

ఈ సంఘటన జరుగుతున్నంతసేపు సరస్వతి ఏదో పని కల్పించుకుని వచ్చిపోతూ తనవైపు కోర చూపులు చూస్తూ లేనిపోని హైరానా పడటం సుందర్రావు గమనిస్తూనే ఉన్నాడు.

సరస్వతి గదిలో ప్రవేశించి 'అమ్మాయిల చొరవ తప్పితే అక్కర చొరవ లేదు అబ్బాయిగారికి! నిజమే, నేను పుట్టింటికి వెళ్ళక ఇక్కడెందుకు? పానకంలో పుడకలాగ!' అంది అటు తిరిగి.

సుందర్రావుకి పట్టరాని కోపమొచ్చింది. స్త్రీ హృదయం ఎంత పరిమితం అనుకున్నాడు! దానితోపాటు తన భావాలు హద్దులు లేకుండా విస్తరించటం మొదలుపెట్టినై. ఇలాంటప్పుడు తను తప్పు చేస్తే ఏమిటి?—అనుకున్నాడు తప్పెరగని సుందర్రావు!

మీనాక్షి పాటి విద్యాగంధం తన భార్యకు లేకపోవటమే దీనికంతకూ కారణం. వీళ్ళందరినీ మించిన అందం ఉండొచ్చుగాక! దానికితోడు నవనాగరిక లక్షణాలన్నీ అలవర్చుకుంది సరస్వతి—శరీరపు వంపులసొంపులన్నీ ఊరివాళ్ళ కళ్ళబడేట్టు బిగుతైన బ్లౌజు తొడుగుతుంది. చీర లోపలి పరికిణీ ఎదుటివాడికి కన్ను చెదిరేవిధంగా కనబడేలాగ అలంకరించుకుంటుంది. కాని, సరస్వతి సౌందర్యార్చన అంతవరకే—హైహీల్సు జోళ్లు వేసుకునేవాళ్ళనీ లిప్‌స్టిక్ రాసుకునే వాళ్ళనీ చూచి పల్లెదనపు మనుష్యులని వెక్కిరిస్తుంది కూడాను. ఈ నమ్రత, ఈ పోకలు మినహాయిస్తే పట్టుకోసి కంచుకాగడాలు పెట్టి [illegible] ముక్క కనిపించదే!

మీనాక్షిని చూస్తున్నకొద్దీ సరస్వతిలో అన్నీ లోపాలుగానే కనిపిస్తున్నవి! కేవలం తనలో ఉన్న పశుత్వం వల్ల ఇన్నాళ్ళైనా ఆమెతో ఎలా కాపరం చెయ్యగలిగానని ఆశ్చర్యపోవటం మొదలుపెట్టాడు!

ప్రేమ—మామయ్య ఇచ్చిన కట్నం, సరస్వతి బాహ్యసౌందర్యం, తనలో కలిగే తాత్కాలిక ఉద్రేకం కాని సరస్వతివల్ల తను పొందే ఉపశమనం—వీటి మాయలోపడి ఈనాటివరకు అర్థం గ్రహించలేకపోయా ననుకున్నాడు. ఈ ప్రేమవాదంతో. మీనాక్షివైపు తన ఊహలు వెళ్ళటంలో తప్పేమీ లేదని అంతరాత్మ సుప్రీంకోర్టులో వాదించుకుని సుందర్రావు తానూ గెల్చాననుకున్నాడు కూడా!

మీనాక్షి ఎదురైనప్పుడల్లా తనలో వచ్చిన ఈ మార్పు వ్యక్తం చెయ్యటానికి ప్రయత్నించాడు.

ఒకనాడు సుందర్రావు మేడమీద తన గదికిటికీముందు నిలబడి రోడ్డుకేసి చూస్తున్నాడు. అప్పటిదాకా జనరహితంగా ఎదురుగుండా ఉన్న ఇంట్లో ఎవరో కాపురానికి ప్రవేశిస్తున్నారు. మీనాక్షీవాళ్లు ఆ ఇంట్లో ఉండావాలనుకుంటున్నారని సుశీల చెప్పటం జ్ఞాపకం వచ్చింది సుందర్రావుకి. ఇంతలో సుశీల, మీనాక్షి ఆ ఇంట్లోనుంచి బైటి గుమ్మంలోకి వచ్చారు. సుందర్రావు చాలాసేపు చూస్తూ నిలబడ్డాడు.

అప్పటినుంచి—ఆ ఇంటికీ, ఈ ఇంటికీ రాకపోకలు మరింత ఎక్కువైనై. మీనాక్షితో తన పరిచయం స్నేహంగా మారింది—సరస్వతి అసూయ ద్వేషంగా మారింది. ఈ మార్పుక్రమం ఎటునుంచి ఎటో సుందర్రావు గ్రహించలేదు ఆ తొందరలో.

ఉన్నట్టుండి, మీనాక్షి ఈ ఇంటికి రావటం మానేసింది. కాలేజీలో కనిపించటం తప్పితే మీనాక్షి బైట కనిపించటమే లేదు.

ఈ మార్పుకి కారణం తన ప్రవర్తనపై ఆమెకు కలిగిన వైముఖ్యమేనని బాధపడ్డాడు సుందర్రావు! కాని, నిజం తెలిస్తే బాగుంటుందని ఆరాటపడ్డాడు కూడా.

మీనాక్షికి, సుశీలకి కూడా జోస్తీ తగ్గిపోయినట్లుంది. అంత ప్రాణస్నేహం, ఇంత బద్ధవైరంగా ఎందుకు మారిందో వాళ్ళిద్దరికేతప్ప బ్రహ్మకుకూడా తెలీదు—సుశీలని అడిగినా చెప్పదనిపించింది సుందర్రావుకి!

ఐనా, ఒకనాడు ధైర్యంచేసి 'మీనాక్షితో పచ్చి కొట్లాటేమిటి?' అన్నాడు పరిహాసం నటిస్తూ ఔత్సుక్యం కప్పిపుచ్చుకుంటూ.

"అంత శ్రద్ధగా అడిగావేరోయ్!' అని తర్వాత నెమ్మదిగా 'ఆ అమ్మాయికో పిల్లాడు పుట్టి పోయాట్ట... పెళ్ళికాకుండానే' అంది సుశీల మీనాక్షిమీద తన కసి తీర్చుకుంటున్నట్టు.

సుందర్రావు తలమీద పిడుగుపడ్డట్టయింది. ఒక క్షణానికిగాని తెప్పరిల్లలేకపోయాడు. ఒకవేళ ఈ విషయం నిజమే ఐనా, ఇలా చెప్పినందుకు చెల్లెలి మీద పట్టరాని అసహ్యం వేసింది. సుశీల మీనాక్షితో మాట్లాడకపోవటానికి ఇదిమాత్రం కారణం గాదనిపించింది: మరేదో కారణంగావచ్చిన ఆ వైరంలో తన పగ సాధించటానికి మీనాక్షి ఈ రహస్యాన్ని సుశీల బట్టబయలు చేస్తోం దనుకున్నాడు సుందర్రావు.

'ఇది నీ కెలా తెలుసు?' అన్నాడు.

'వదినెకి రామ్మూర్తిబావ చెప్పాట్ట! ఈ అమ్మాయిది వాళ్ళ ఊరేట!' అంది సుశీల.

సుందర్రావు మరేమీ మాట్లాడలేకపోయాడు. ఈ పూట్లో నిజానిజాలు ఇప్పట్లో తేలటానికి వీలు లేనివి. చెల్లెల్ని చూచివెళ్ళటానికి వచ్చిన ఆ పెద్ద మనిషి దాచివుంచమని ఆవిడ చెవిలో ఊదివెళ్లాడు కాబోలు!

కాలేజీలో కొంచెం వాకబుచెయ్యగా ఈ రహస్యం ఇంతవరకు తెలియకండా ఉన్నది తన దొక్కడికేనని గ్రహించాడు సుందర్రావు. ఇంటి దగ్గరి అమ్మలక్కలకు ఈ శుభవార్త తన భార్య ఈ పాటికి ఎప్పుడో అందించివుంటుందనికూడా అనుకున్నాడు.

తనవాళ్లవల్ల మీనాక్షికి జరిగిన ఈ అన్యాయానికి తన సానుభూతి తెలియజెయ్యా లనుకున్నాడు! ఎలాగైనా మీనాక్షిని ఒకసారి కలుసుకోవా లనుకున్నాడు.

ఒకనాటి సాయంత్రం వాళ్ల ఇంట్లోవాళ్లు ఎక్కడికో వెడుతున్నారు మీనాక్షి బండిలో ఎక్కలేదు. ఇంట్లోనే ఉండి ఉంటుందనుకున్నాడు. క్షణ మాత్రంలో, ఒక్క అడుగులో... ఆ ఇంట్లో ప్రవేశించాడు. అంత ధైర్యం ఎలా వచ్చిందో తనకే తెలీదు.

సుందర్రావు వచ్చిన అలికిడికి మీనాక్షి ముందు హాలులోకివచ్చి క్షణంమాత్రం తొట్రుపడి తేరుకుని 'కూర్చోండి' అంది తనుకూడా కూర్చుంటూ. సుందర్రావు చాల ప్రమాదభరితమైన సంభాషణ సాగించటానికి వచ్చాడని పసికట్టినట్టు చాలా నిబ్బరంగా కూర్చుంది మీనాక్షి. కాని, ఎంత దాచినా మనసులో పడుతున్న చికాకును ముఖం వ్యక్తం చేస్తూనేఉంది!

ఇక్కడకు బయలుదేరినప్పుడున్న చిత్తస్థైర్యం దిగజారిపోయింది సుందర్రావులో. తను చెప్పాలనుకున్న మాటలు చాలవరకు మరిచిపోవటం మొదలు పెట్టాడు.

'నీకు చాలా అన్యాయం జరిగింది మీనాక్షీ!' అన్నాడు తడబడుతూ.

కడప్రాణంతో ఉన్న తనని పూర్తిగా హత్య చేసిపోవటానికి వచ్చాడు సుందర్రావు అనుకుంది మీనాక్షి! సరస్వతి, సుశీల ద్వేషభావాలతో తన హృదయాన్ని గాయపరుస్తే, సుందర్రావు సాంత్వన వచనాల పేరుతో తన వెన్నులో పొడవవచ్చాడు ఎవరికి కావా లీ సానుభూతి—అనికూడా అనుకుంది మీనాక్షి!

'ఫరవాలేదు లెండి' అంది తను అట్టే బాధపడనట్టు.

వితరణ కోల్పోయి ఉద్రేకంలో తను గడిపిన ఒక క్షణాన్ని పురస్కరించుకుని తెలిసినవాళ్లంతా ఇంత శ్రద్ధగా ఇంత అక్కసు వెళ్ళబొయ్యాలా, ఇంత సానుభూతి చూపించాలా—అని మీనాక్షిలో ఒక పెద్ద తుఫాను చెలరేగింది!

సుందర్రావు పడుతున్న తొట్రుపాటు గమనించి, ఆతనికి మనస్థిమితం చిక్కేందుకు వీలుగా

'ఇందులో అబద్ధమేమీ లేదు; అంతా నిజమే! అందువల్ల ముందు తప్పు చేసింది నేను...' అంది తను చేసిన తప్పు ఇప్పుడు సుందర్రావు చెయ్యబోయే తప్పంత ఘోరమైనది కాదన్న ఆత్మవిశ్వాసాన్ని మరుగుపరుచుకుంటూ.

నువ్వంత పతితురాలవు కావు, మాలాటి దానివే—అని అభయ మివ్వగల ఆధిక్యత మీనాక్షి తన కిచ్చిన ట్లనిపించింది సుందర్రావుకి. 'ఏనా, ఫరవాలేదు మీనాక్షీ' అని కొంచెం తటపటాయించి 'అభ్యంతరం లేకపోతే నీ కొక విషయం చెప్పాలనుకుంటున్నాను' అన్నాడు.

'అనుమాన మెందుకు చెప్పండి'

'మన మెక్కడికైనా వెళ్ళిపోదాం. వివాహం చేసుకుందాం. నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తాను...' అనర్హమైన మీనాక్షికి కావలసినంత గౌరవం కట్టబెడతానన్నట్టు కవిత్వధోరణిలో చాలాసేపు మాట్లాడాడు సుందర్రావు.

మీనాక్షి హృదయంలో ఒక అగ్నిపర్వతం పగిలినట్లయింది. సరస్వతి, సుశీల మొదలైనవాళ్ళ నందరినీ మించిన తుచ్ఛుడు సుందర్రావు అనుకుంది. కపటసానుభూతిమాటున తాను మర్యాదస్థులమన్న గర్వం సుందర్రావులో ఎంత దాగుందో!—అనుకుంది.

కట్టుకున్న భార్యతో కాపరం చేస్తూ, నిన్నటిదాకా అదే స్వర్గమని మురిసిపోయినవాడు ఇవ్వాళ్ళ తనని లేవదీసుకుపోయి ఉద్ధరిస్తాడట!—తను తప్పు చేసి ఉండవచ్చును గాని, ఇలాటి ఉద్ధరింపులు తనేమీ ఎరగదే! ఈ నీతిపరుడికి నీతి గరపటమెలా?

'ఎందుకొచ్చిందిలెండి...ఇదొక గొడవ అవుతుంది మళ్ళీ' అంది మీనాక్షి చాలా లాలనగా.

తన కోర్కెను అంత సౌమ్యంగా తీసుకునేసరికి సుందర్రావుకి చాలా ధైర్యం వచ్చింది. 'భయంలేదు మీనాక్షీ! నువ్వు దగ్గిరుంటే నేను నరకంలో కూడా సుఖంగా ఉండగలను; నే నెవళ్ళనీ లెక్కచెయ్యను...'

ఈ కవిత్వ ధోరణికి మీనాక్షి చిరునవ్వు నవ్వింది. సుందర్రావు మురిసిపోయాడు!

'కన్నతల్లిని, తండ్రిని కాదనవలసి వస్తుంది ఎందుకులెండి...' అంది గోముగా.

'నా కేమీ విచారంలేదు మీనాక్షీ!' అన్నాడు సుందర్రావు!

''మీ భార్యను వదిలివేయవలసి వస్తుంది!'' అలా చేయించటం తన కిష్టంలేనట్టు!

''సరస్వతంటే అసలు నాకు మొదటినుంచీ ఇష్టంలేదు, మీనాక్షీ!'' అన్నాడు—అబద్ధమాడుతున్నావని అంతరాత్మ గుచ్చిగుచ్చి చెపుతూనే వున్నా!

'ఈ మీ ప్రవర్తనవల్ల మీ చెల్లెలికి వివాహం కాకపోవచ్చు!'

'అది నా కనవసరం' అన్నాడు సుందర్రావు నిస్సంకోచంగా.

'నేనేనా మీ కవసరం?' అంది నవ్వుతూ.

'ఔను! నన్ను నమ్ము మీనాక్షీ! ఏటికి ఎదురీదుతాను!'

మీనాక్షి పక్కుమన్నది!

సుందర్రావు ఏటి కెదురీదాడు—చేతి కందినన్ని నగలూ, నాణ్యాలూ సేకరించి మీనాక్షితో ఢిల్లీకిపోయే గ్రాండ్ ట్రంక్‌లో పడ్డాడు. రైలు ముందుకి సాగుతున్నకొద్దీ తను స్వర్గానికి ఎగబాకుతున్నట్టుంది.

ఎంత ఆపుకుందామన్నా తెల్లవారుఝామున కునుకుపట్టింది తెల్లవారి నిద్రలేచి చూచేసరికి మీనాక్షి ఏపులేదు. తన కోటుజేబులో ఉత్తరం ఉంది—మీరు కట్టబెడదామనుకున్న గౌరవానికి నేను తగనిదానిని. కాని, మీకు, మీవాళ్ళకి ఇంత గౌరవం ఉంచటంకూడా నాకు ఇష్టంలేదు. ఈపాటి మచ్చ మీ వంశానికి అవసరమనే మిమ్మల్ని ఈ పనికి ప్రోత్సహించాను—అని!

పెట్టె వెతికితే డబ్బుమూట లేదు!

సుందర్రావు ఇల్లుచేరుకున్నాడు చివరికి—అప్రతిష్ఠమాత్రం మిగిలింది!

ఆనాటి మీనాక్షి ఈనాడు మళ్ళీ చంద్రమౌళి భార్యగా మద్రాసులో ఎదురైంది! ఇంత గ్రంథం నడిచినమీదట సుందర్రావుకి చంద్రమౌళి

ఇంటికి వెళ్ళటానికి తెరువుగా ఉందంటే ఆశ్చర్య పడవలసిన పనిలేదు!

'చంద్రమౌళి భార్య మరెవరో కాదు. మీనాక్షిరా!' అన్నాడు సుందరత్తావు, రామ్మూర్తితో, పనకటి గొడవలన్నీ చంద్రమౌళి ముందు ఎత్తవద్దని ప్రాధేయపడుతున్నట్లు.

ఇద్దరూ ట్రిప్లికేన్ బస్సుదిగి రోడ్డుదాటి సందుమలుపు తిరిగారు. 'అయినా, చంద్రమౌళి భార్య మీనాక్షేనని నీకెలా తెలుసురాబావా!' అన్నాడు రామ్మూర్తి.

'నేను చూశానురా!' అన్నాడు సుందరత్తావు.

'ఎప్పుడు?'

'ఇప్పుడే!'

'మన మింకా అక్కడికి చేరనేలేదాయె— అప్పుడే ఎట్లా పసిగట్టావురా' అని ఒక క్షణం సుందరత్తావు పైపుచూసి 'ఐతే...నాకంటె ముందువచ్చి ఈవిషయం తెలిసి భయపడి పారిపోయివస్తూ నాకెదురయ్యావా, ఏరాబావా!' అని రామ్మూర్తి విరగబడి నవ్వటం ప్రారంభించాడు.

సుందరత్తావు చెప్పిన సమాధానాన్ని రామ్మూర్తి నవ్వు మింగేసింది.

రామ్మూర్తి ఇంకా నవ్వుతున్నాడు.

ఇతరులు కష్టాల్లో ఉంటే తను చూచి సంతోషించే వెధవ స్వభావం రామ్మూర్తిది అని మళ్ళీ ఒకసారి అనుకున్నాడు సుందరత్తావు.

'బ్రేవో! నువ్వురాబావా, గుండెలు తీసిన బంటువి!' అన్నాడు మెచ్చుమెచ్చుకుంటూ రామ్మూర్తి.

సుందరత్తావు అధైర్యాన్ని తల్చుకుంటూ, చంద్రమౌళిని అల్లంత దూరాన చూడగానే—నవ్వుల మాటున ఇంతవరకు మనసులో మరుగుపడిపోయిన ఆ రహస్యం...చంద్రమౌళి సాహసం...నీటిబుడగలాగ పైకివస్తున్నట్లనిపించింది రామ్మూర్తికి. ఒక పెద్ద బరువు దించినట్లయింది వాడి మనస్సుకి!—బావమరిది చెవి కొరికాడు, 'చంద్రమౌళి మీనాక్షి వివాహం చేసుకోకముందే భార్యాభర్తలుగా వ్యవహరించారు!' అని.

ఇంత రహస్యం వాళ్ళిద్దరిముందు విరవలసివచ్చేసరికి కళవిళపడ్డాడు సుందరత్తావు. 'ఇది నీకెలా తెలుసురా?' అందా మనుకున్నాడు. కాని, ఇంతలో రహస్యంగానైనా ఈ ప్రశ్న వెయ్యటానికి వీలులేనంత దగ్గరకు వచ్చేశారు చంద్రమౌళి, మీనాక్షి.

విశేషమేమంటే—అన్ని విషయాలు తెలిసి కూడా అందరిని నవుబాటుపాలు చేసింది రామ్మూర్తేనని మీనాక్షి తనపై పసిపట్టిఉన్నదన్న విషయం విందుకు పడుతున్న గుండెలు తీసిన బంటు, రామ్మూర్తికి తెలీదు!

అతన్నెలా సత్కరించిందో వాళ్లు బైటికొస్తేనేకాని బైటపడదు కూడాను!



# విజ్ఞాన శాస్త్రపరిశోధన సమీక్ష



శ్రీ వసంతరావు వెంకటరావు

రెండవ ప్రపంచ మహాసంగ్రామంలో విజ్ఞాన ప్రగతికి క్రొత్త ఒత్తిడి కలిగింది. ప్రతి దేశము విధ్వంసక సామర్థ్యాన్ని ఎక్కువ చేసికోడానికి, ప్రయాణసాధనాల వేగం హెచ్చించడానికి శత్రుమారణాస్త్రాల వాతపడ్డ స్వదేశీయులకు మంచి చికిత్స చేయడానికి అహమహమికతో ప్రయత్నాలు చేయ ప్రారంభించేయి. వస్తుతత్త్వ పరిశీలనాదక్షులగు విజ్ఞానులు కేవల జ్ఞానార్జనకోసం ఒకవంక శ్రమిస్తునే ఉన్నారు. కుల్యోపకుల్యలై సాగుతున్న విజ్ఞాన స్రవంతిలో కొన్ని ఘట్టాలను సమీక్షిద్దాము.

విజ్ఞాన పురోగమనంలో విచిత్రమైన ఘట్టాలు అనేకం తారసిల్లుతాయి. ఉచితజ్ఞానాన్ని ఆధారంగా చేసికొని విజ్ఞానమార్గాన్ని, కొంతవరకు, విజ్ఞాని ఊహిస్తాడు. సామాన్యంగా ఆ మార్గాన్నే విజ్ఞానం సాగిపోతుంది. కాని, విజ్ఞాని ఊహించని మార్గాలను సైతం, అప్పుడప్పుడు, విజ్ఞానం అనుగమించడం అరుదు కాదు. దానికి తార్కాణంగా అత్యల్పతాపక్రమాలలో ద్రవ్యం యొక్క ప్రవర్తనను పేర్కొనవచ్చును.

ఏ పదార్థమైనా ఘనంగానో, ద్రవంగానో, వాయువుగానో ఉండగలదు. సామాన్యంగా ఈ మూడింట ఏ స్థితిలో నుంటుందో నిర్ణయించేవి తాపక్రమము, ఒత్తిడి. సామాన్యతాపక్రమంవద్ద ద్రవంగా నున్న నీరు సెంటిగ్రేడ్ మానంపై సున్నడిగ్రీల వద్ద ఘనీభవించి గట్టిగాను, నూరు డిగ్రీలవద్ద భాష్పమై ఆవిరిరూపంలోను ఉంటుంది. గాలికూడా చల్లారినకొద్దీ ద్రవంగాను ఘనంగాను మారుతుంది. ఘనద్రవాల సందర్భంలో ఒత్తిడికట్టే ప్రశక్తి లేదు. అయితే, పదార్థాన్ని వేడిచేసినంత సులభంగా చల్లార్చడానికి అవకాశం లేకపోవడంచేత, అల్పతాపక్రమాల వద్ద పదార్థం ఎట్టి లక్షణాలను ప్రదర్శిస్తుందో తెలిసికొనడానికి చాలకాలం పట్టింది.

వస్తువులనెంతైనా వేడి చేయవచ్చును కాని, వాటిని చల్లార్చడానికి మితిఉందని సులభంగా గ్రహింపగలం. ఏమంటే, వస్తువందలి అణువులు ఎల్లప్పుడూ స్పందిస్తూ చలనంలోనుంటాయి. చలనంవల్ల వాటికి ప్రాప్తించిన గతిజశక్తియే తాపక్రమంగా వ్యక్తమవుతుంది. వస్తువును చల్లార్చినప్పుడు అణువుల స్పందనం మందగించి, వాటి గతిజశక్తి తగ్గుతుంది. అణువులన్నీ నిశ్చలంగానుండే అవస్థకంటె వాటిగతిజశక్తిని తగ్గించలేముకదా! అనగా, అణుచలనం శూన్యమైనంతవరకే పదార్థాన్ని చల్లార్చవచ్చును. ఆ స్థితిలో దాని తాపక్రమం శూన్యమవుతుంది. దానికే "పరమశూన్య తాపక్రమం" అన్నారు. అది సున్నడిగ్రీల సెంటిగ్రేడ్ కంటె 273 డిగ్రీలు తక్కువ. అంతకంటె తక్కువ తాపక్రమం జగత్తులో నుండదు. పరమశూన్యం వద్ద వస్తువులో నున్న అణువులన్నీ స్తంభించిపోతాయి.

ఒక వస్తువును చల్లార్చినకొద్దీ దాని తాపక్రమం తగ్గుతుంది. దానితోపాటు అందలి అణువులు దగ్గర దగ్గరగా కుదించబడి వాటి మధ్యనున్న దూరం తగ్గుతూ ఉంటుంది. సున్నడిగ్రీలకంటె 193 డిగ్రీలు తక్కువగా గాలిని చల్లారిస్తే అది ద్రవరూపం ధరిస్తుంది. ద్రవించిన వాయువు నీలంగా నీటివలె ఉంటుంది. ద్రవవాయుబిందువులు నేలమీద పడినప్పుడు టప్పుటప్పున ప్రుళ్ళుతూ, చూస్తుండగానే అవి హరించిపోతాయి.

పచ్చిమిరపకాయలు, పచ్చిద్రాక్షపళ్లు, కమలాపండు తొనలు మొదలైన మెత్తటి వస్తువులను ద్రవవాయువులో పడవేసి పైకి తీస్తే అవి ఎంతో గట్టిపడతాయి. అట్టి పచ్చిమిరపకాయను సుత్తితో కొట్టినప్పుడు, లోహాన్ని కొట్టినట్లు ఖాంగ్ ఖాంగ్ మని శబ్దమౌతుంది. ద్రవవాయువులో నుంచి తీసిన దూది

పింజను అగ్గిపుల్లతో ముట్టిస్తే ఒక్కసారి భగ్గునమండి ఊరుకొంటుంది: రవ్వంతైనా నుసి ఏర్పడదు.

వాహకాలలో విద్యుత్తు ప్రవహించినప్పుడు దానికి కొంత నిరోధం కలుగుతుంది. ఆ నిరోధం [resistance] వాహకాల తాపక్రమంతో తగ్గుతుందని, పరమశూన్య తాపక్రమంవద్ద నిరోధం కూడా శూన్యమౌతుందని అనుకొనేవారు. కాని, అత్యల్ప తాపక్రమాలను కలిగించగల విధానాలు తెలిసిన తరువాత పరమ శూన్యానికి పూర్వమే విద్యున్నిరోధం పూర్తిగా నశిస్తుందని కనుగొన్నారు. అత్యల్ప తాపక్రమం వద్దనున్న ఒక వలయంలో విద్యుత్ ప్రవాహాన్ని పంపినప్పుడు అది అనవరతంగా ప్రవహిస్తునే ఉంటుంది.

అత్యల్ప తాపక్రమాలవద్ద ద్రవాల ద్రవత్వం కూడా ఊహాతీతంగానే ఉంటుంది. హీలియం అను వాయువు ద్రవీభవింపచేయడమే కష్టం. పరమశూన్యతాపక్రమానికి నాలుగు డిగ్రీలపైన అది ద్రవీభవిస్తుంది; ఒక్క డిగ్రీపైన ఘనీభవిస్తుంది. అయినప్పటికి పరమశూన్యానికి 2.19 డిగ్రీలవద్ద ద్రవంగానున్న హీలియం యొక్క లక్షణాలలో మార్పు కలుగుతుంది. అంత ఎక్కువ తాపక్రమంవద్దనున్న ద్రవానికి అంతకంటె తక్కువ తాపక్రమం వద్దనున్న ద్రవానికి వ్యత్యాసముంది. అందుచేతనే రెండవ ద్రవాన్ని "హీలియం రెండు" అన్నారు. ఈ హీలియం రెండు చాలా తమాషాగా ప్రవర్తిస్తుంది. దానినొక పాత్రలో పోసి, ఖాళీ గాజుగళాసు నొకటి దానిలో సగానికి ముంచి ఉంచగా, కొంతసేపటికి గాజు గళాసులో సగం భాగం హీలియంద్రవంతో నిండి ఉంటుంది. అప్పుడా గళాసును ద్రవంలోనుండి పైకెత్తి పట్టుకొంటే, గళాసులో నున్న హీలియంద్రవం చుక్క చుక్కలుగా కారి, గళాసు ఖాళీ అవుతుంది. ఈ సంఘటనలో మొదట గళాసు గోడలపై కెగబ్రాకి పాత్రలో నుండి గళాసులో హీలియం ప్రవేశించింది; తరువాత గళాసు లోపలిభాగం నుండి పైకెగబ్రాకి పైకి వచ్చింది. గళాసులోనున్న చీమలు గోడలపై కెగబ్రాకి పైకివచ్చినట్లే, ఈ హీలియం రెండు కూడా ప్రవర్తిస్తుంది. దీనిని ప్రయోగం రుజువు చేసింది. అంటే ఆ ద్రవప్రవాహానికి ఎట్టి నిరోధం లేదు. అందుచేత ఆ స్థితిని 'నాల్గవస్థితి' అన్నారు. సామాన్యమైన ఘనద్రవవాయు స్థితులకు భిన్నమైనదీ నాల్గవస్థితి.

వైద్యవిజ్ఞానం చేస్తూన్న మానవసేవ దినదినాభివృద్ధి చెందుతూంది. ఏడెనిమిదేండ్ల క్రిందట తొలిసారి రోగుల కమృతప్రాయంగా "పెనిసిల్లిన్" అను మందు వెలువడింది. అది సర్వరోగనివారిణి అన్నారు. సూక్ష్మక్రిములచే కలుగు వ్యాధులకేమి, సెప్టిక్ అవస్థలకేమి, అంటుజాడ్యాలకేమి, నులికడుపుకేమి, ఇట్టి అనేక వ్యాధులకు దానిని దివ్యౌషధంగా భావించేరు. ఈ పెనిసిల్లిన్ బూజుపదార్థం వంటిది. పెనిసిల్లిన్ విషయమై ప్రచారమైన తరువాత అట్టి మందు లింకేమైనా లభ్యమౌతాయేమో అని విజ్ఞానులు తీవ్రంగా అన్వేషణ ప్రారంభించేరు. తత్ఫలితంగా "స్ట్రెప్టోమైసీన్" సిద్ధించింది. కొన్ని రకాల క్షయ రోగాలలో అది అమోఘంగా పని చేస్తుంది.

డాక్టర్ బర్కుహోల్డర్ అను విజ్ఞాని చేసిన కృషి వల్ల 1947వ సంవత్సరంలో "క్లోరోమైసిటిన్" లభ్యమైంది. అది అనేక విధాలైన సూక్ష్మక్రిములను నాశనము చేయడమే కాక, టైఫాయిడ్ జ్వరంతో బాధపడుతూన్న ఎలుకలను రక్షించినట్లు ప్రయోగాలవల్ల విశదమయింది. అంతేకాక, అనేక వికారాల చే బాధపడు జీవులకు కూడా రక్షణ మిచ్చినట్లు రుజువయింది. దానితో వైద్యలోకంలో సంచలనం బయలుదేరింది. అయితే, వికారాలను నాశనం చేసే ఈ మందుయొక్క ప్రాముఖ్యాన్ని గుర్తించడానికై, అంటువ్యాధుల గురించి కొన్ని ముఖ్య విషయాలను తెలిసికోవాలి.

అంటువ్యాధులలో స్థూలంగా రెండు జాతులున్నాయి. అంటువ్యాధిని కలిగించే సూక్ష్మక్రిమికీటాలు జీవుల శరీరంలో ప్రవేశించి అందలి రసాలలో పెరిగి, వృద్ధిచెంది, విషద్రవాలను తయారుచేసి విడుస్తాయి. ముక్కులోను గొంతుకలోనుగల శ్లేష్మంలోనో, ప్రేగులందలి ద్రవాలలోనో, రక్తప్రవాహంలోనే అవి నివాస మేర్పరచుకొంటాయి. కాని, జీవకణాలలోనికి మాత్రం జొరపడవు. జీవకణాలకు వెలుపలనే ఉండి, అవి తయారుచేసే రసాయనిక ద్రవాలతోనే జీవకణాలకు అపాయం కలిగిస్తాయి. టైఫాయిడ్, నిమోనియా, డిఫ్తీరియా మొదలైనవి ఈ జాతికి చెందిన అంటువ్యాధులు.

రెండవజాతికి చెందిన అంటువ్యాధి కారకులు వికారాలు(*Viruses*). అవి జీవకణాలలోనే నివసించి వాటి నిత్యజీవితానికి అంతరాయం కలిగిస్తాయి. అవి కలిగించే వ్యాధులు జలుబు, శిశుపక్షవాతం, మసూచి మొదలైనవి. అందుచేత, వికారాలను నాశనం చేయడానికై ఔషధప్రయోగం చేస్తే, వికారాల కాశ్రయమిచ్చిన జీవకణాలకే భంగం కలుగవచ్చును. కాబట్టి సూక్ష్మజీవులను నాశనం చేయకలిగినంత సులభంగా వికారాలను మట్టిపెట్టే అవకాశం లేకపోయింది. ఇంతవరకు మహోపయోగంగానున్న సల్ఫామందులు పెనిసిల్లిన్, స్ట్రెప్టోమైసిన్ మొదలైన మందులు జీవకణాలకు వెలుపలనుండి శరీరంలో సంచరిస్తున్న సూక్ష్మక్రిములపై పనిచేయ కలిగినవే కాని, వికారాల నెదుర్కొనేవి కావు. అందుచేత, వికారాలను నాశనం చేయగల "క్లోరోమైసిటిన్"అను మందును కనుగొన్నారను తొలివార్త కొంత సంచలనాన్ని కలిగించిందంటే ఆశ్చర్యం లేదు.

పార్కి డేవిస్ కంపెనీలో పనిచేస్తూన్న రసాయనశాస్త్రజ్ఞు లీమందును శుద్ధిచేసి, రసాయనిక రచనను కనుగొనడానికై ప్రయత్నించేరు. అదృష్టవశాత్తు ఆ మోల్డు సులభంగా పెరుగుతుందని, దానిలోనున్న క్లోరోమైసిటిన్‌ని సులభంగానే ఇచ్చివేస్తుందని కూడా వారు కనుగొన్నారు. అంతేకాక, అది సాపేక్షంగా సులభమైన సేంద్రియ రసాయనిక పదార్థమని, కృత్రిమ పద్ధతులలో బాహుళ్యంగా దానిని తయారుచేయవచ్చునని తెలిసింది.

దాని సమర్థతను శోధించే అవకాశాలు కూడా వెంటనే లభించేయి. మలయాదేశంలో "స్క్రిబ్ టైఫస్"అనే జాడ్యం తీవ్రంగా వ్యాపించింది. దాని వల్ల నూటికి సుమారు పదహారుమంది మరణించేవారు. ఒక రబ్బరుఎస్టేటులో ఈ వ్యాధి విలయతాండవం చేస్తున్నప్పుడు ఒక పౌను క్లోరోమైసిటిన్ వైద్యులు మలయా చేరుకొని రోగులపై దానిని ప్రయోగించేరు. ఈ మందు పుచ్చుకున్న ఒక్కరోజులోనే చాలా మంది కోలుకొన్నారు. ఈ మందు పుచ్చుకొన్న నలభై రోగులు ప్రమాదస్థితిని దాటిపోయేరు.

సూక్ష్మక్రిములవల్ల కలిగే టైఫాయడ్ జ్వరంలో కూడా క్లోరోమైసిటిన్ అద్భుతంగా పనిచేస్తున్నట్లు కొందరు వైద్యులు కనుగొన్నారు. దీనిని నోటితోనే సేవింపవచ్చును. ఇంజక్షన్ మూలంగా పుచ్చుకో నక్కరలేదు. అయినప్పటికి, శరీరంలో ప్రవేశించిన వెంటనే పనిచేయ ప్రారంభిస్తుంది. దీనివల్ల దుర్గుణాలు అంతగా లేవు.

సల్ఫా, సల్ఫోన్ మందులలో కొన్ని రకాలు ఈ మధ్య వాడుకలోనికి వచ్చేయి. వాటిలో కొన్ని: యురోలుకోసిన్, లోడిలోన్, ఎసిటేట్, ప్రోమిన్. వీటిలో ప్రోమిన్ ముఖ్యంగా కుష్ఠరోగానికి క్షయకు బాగా పనిచేస్తుంది.

జ్వరాలలో మలేరియా జ్వరం చాలా మొండిది. క్వైనైన్‌కి పూర్తిగా లొంగదు. దానికి 'పాలుడ్రిన్' అనే మందు క్రొత్తగా కనిపెట్టబడింది. మలేరియా క్రిమిని నిర్మూలించేశక్తి దీనికున్నట్లు ప్రయోగాలు నిర్ణయించేయి. క్వైనైన్ వాడడానికవకాశంలేని గర్భిణీస్త్రీలవంటివారి విషయంలో పాలుడ్రిన్ నిరపాయంగా వాడవచ్చును. 'క్వినో-మెపుక్విన్' అనేది కూడా ఇటువంటి మందే.

పరమాణువుని భిన్నంచేయడానికై చేసిన ప్రయత్నాలు కొన్ని కృత్రిమమైన రేడియో ధార్మిక పదార్థాలను ఉత్పత్తిచేసేయి. అవి స్వల్పకాలంలో విదళనం చెంది సామాన్యపదార్థాలుగా మారుతాయి. ఆ సంఘటన వైద్యంలో మిక్కిలి ఉపయోగకరంగా నుంది. కొన్నికొన్ని పదార్థాలు శరీరంలో ప్రవేశించినతరువాత ఏ మార్గాన్న ప్రయాణం చేస్తాయో తెలిసికొనడంవల్ల వైద్యంలో ఎంతో లాభముంది. కాని, పదార్థగమనాన్ని తెలిసికొనే అవకాశం లేకపోయింది. రేడియో ధార్మిక పదార్థములు లభించిన తరువాత ఈ మార్గాన్వేషణం సులభసాధ్యమయింది. ఉదాహరణకు: శరీరంలో అయొడీన్ ఏవిధంగా శోషింపబడుతుందో కనుగొందామనుకున్న వైద్యుడు, ప్రత్యేకంగా తయారుచేసిన రేడియో ధార్మికపు అయొడీన్‌ను మొట్టమొదట ఆహారంలో కలిపి ఇస్తాడు. ఆ అయొడీన్ పరమాణువులు క్రమంగా విచ్ఛిన్నమై గామా కిరణాలను ప్రసరిస్తాయి. గైగర్-ముల్లర్ కౌంటర్ వంటి సున్నితమైన ఉపకరణంతో గామా కిరణాలను గుర్తిస్తూ, శరీరంలో అయొడీన్ ఏ మార్గాన్న పయనిస్తుందో సులభంగా కనిపెట్టగలరు.

కృత్రిమంగా తయారుచేసిన ఇట్టి రేడియో

ధార్మికపదార్థాలను ట్రేసర్ పదార్థాలంటారు. వైద్యంలో మునుముందివి ముఖ్యమైనపాత్రను వహిస్తాయనడానికి సందేహం లేదు.

వాయువేగాన్నే కాక శబ్దవేగాన్ని మించిన వేగంతో ప్రయాణం చేయడానికి విజ్ఞానులు చేస్తూన్న ప్రయత్నాలు విజయవంతంగా సాగుతున్నాయి. ఈ మధ్యనే ఇంగ్లండునుండి మన దేశానికి సుమారు 470 మైళ్ళ వేగంతో ప్రయాణంచేసిన 'కామెట్' విమానం 14 గంటలలో సురక్షితంగా గమ్యస్థానం చేరుకొంది. శబ్దంయొక్క వేగం గంటకు సుమారు 720 మైళ్లు. సుమారు వెయ్యిమైళ్ళ వేగంతో వైమానికులు ఆకాశయానం చేసినట్లు విశ్వసనీయమైన వార్తలు ప్రకటింపబడ్డాయి. అంటే, శబ్దవేగాన్ని మించిన వేగంతో ప్రయాణం సాధ్యమైనట్లు స్పష్టమే.

గంటకు వెయ్యిమైళ్ళవేగం సాధ్యమైనప్పుడు రెండువేలమైళ్ళ వేగం సాధ్యంకాకపోదు. కొన్ని రాకెట్లు విపరీతవేగాలతో ఆకాశంలో దూసికొనిపోయినట్లు తెలియవచ్చింది. అయితే, గంటకు రెండు వేలమైళ్ళ వేగమే సాధ్యమైననాడు మన భావాలలో కొన్ని విచిత్రంగా మారుతాయో విచారించవలసి ఉంటుంది.

కాలవాహినిలో ముందుకు సాగిపోవడమే కాని వెనుకకు ప్రయాణంచెయ్యడం దుస్సాధ్యమని, దురూహ్యమని విజ్ఞానులు భావిస్తున్నారు. కాని, దానిని కూడా మానవుడు సాధిస్తాడా అనిపిస్తూంది. ఏమంటే, విమానయానంవల్ల కాలంలో తిరోగమించే అవకాశమున్నట్లు స్ఫురిస్తుంది.

ఈ సమయంలో ఇక్కడ శుక్రవారంరాత్రి సుమారు ఎనిమిదిగంటలయింది. ఇదే సమయమందు లండన్‌లో మధ్యాహ్నం రెండున్నరగంటలౌతుంది. ఏమంటే, మనకు పశ్చిమంగానున్న దేశాలలో ప్రతి డిగ్రీ రేఖాంశ దూరంలోనున్నవి నాలుగు నిమిషాలు కాలంలో వెనుకపడతాయి. ఇది భూభ్రమణంవల్ల సంభవిస్తుంది. మనదేశానికి, మనకు పశ్చిమంగానున్న లండన్‌కు రేఖాంశలలోగల భేదం 81 డిగ్రీలు. అందుచేత లండన్‌లో కాలం మన కాలంకంటె 5½ గంటలు వెనుకనుంటుంది. అందుచేత, అచ్చటి స్థానికకాలం ప్రకారం ఇప్పుడు మధ్యాహ్నం రెండున్నర గంటలౌతుంది. ఈ క్షణమందే బయలుదేరి, గంటకు రెండు వేలమైళ్ళ వేగంతో గమించగల విమానంమీద ప్రయాణంచేసి మూడుగంటలకాలంలో లండన్ చేరుకొన్నామనుకొంటే, లండన్ చేరుకొనేసరికి అచ్చటి స్థానిక కాలప్రమాణానుసరణ్యంగా 5½ గంటలవుతుంది. దీని పర్యవసానమేమంటే, 1951 వ సంవత్సరం అక్టోబరు ఇరవైఆరవతేదీ శుక్రవారం రాత్రి ఎనిమిదిగంటలకు ఇండియాలో బయలుదేరి విమానంపై ప్రయాణంచేసినవారు, అనాడే సాయంకాలం అయిదున్నరగంటలకు లండన్ చేరుకొంటారు. సూర్యాస్తమయమైన తరువాత రెండుగంటలకు బయలుదేరి, అస్తమించిన సూర్యుని వెన్నాడి, దాటి, సూర్యునికంటె ముందుగా లండన్ చేరుకొనడమంటే కాలంలో తిరోగమించినట్లే కదా? ఈ విధంగా, అత్యధికవేగాలతో ప్రయాణంచేయగల అవకాశాలను కల్పిస్తూన్న విజ్ఞానం కాలవాహినిలో వెనుకకు ప్రయాణం చేయిస్తుందేమో!

విజ్ఞానానికి బహువిధ ప్రయోజనముందని గ్రహించాలి. ఏ దృష్టితో పరిశోధనను ప్రారంభించినప్పటికి, విజ్ఞాని సంపాదించిన జ్ఞానాన్ని జనోపయోగానికై వినియోగించడానికే ఎక్కువగా ప్రయత్నిస్తున్నాడు. బట్లర్ శాస్త్రజ్ఞుడు చెప్పినట్లు: "ప్రకృతిని ఎక్కువగా అర్థంచేసికొంటూన్నకొద్దీ దానిని శాసించగల అవకాశాలుకూడా సహజంగా ఎక్కువౌతున్నాయన్నది సత్యమే. కాని, ఈ విశేషజ్ఞానార్జనకు మానవుని పురికొల్పుతున్నది జ్ఞానాన్ని వృద్ధిచేసికొందామన్న సదాశయమే కాని వినియుక్త విజ్ఞానంవల్ల లాభంపొందుదామన్న ఆశమాత్రము కాదు. అజ్ఞానాంధకారాన్ని జ్ఞానరశ్మిచే ఛేదించాలని, అభివ్యక్తంగానున్న అభావోదధిలో క్రమాన్ని అర్థాన్ని కనిపెట్టాలని ఆదిమ మానవునికే కాంక్ష జనించింది. ఆ కాంక్షయే, నాగరికతయొక్క వివిధ ఆవిర్భావాలైన భాషకు, తత్త్వానికి, వేదాంతానికి, కళకు, వాఙ్మయానికి దారితీసింది." అందుకే, క్రమబద్ధమై నిర్మాణాత్మకమైన విజ్ఞాన పురోగమనమే సర్వదా వాంఛనీయము.

(విజయవాడ ఆలిండియా రేడియో సౌజన్యంతో)

# కలగూరగంప

## భారతీయ సంస్కృతి

"సమ్" ఉపసర్గగా "డు కృఞ్ కరణే" అను ధాతువునుండి ఉత్పన్నమైన కృదంత రూపము సంస్కృతి. "సంస్క్రియతే అనయా ఇతి సంస్కృతిః" దీనిచే సంస్కరింపబడును అని దీనికి అర్థం...

నేడు ప్రధాని మొదలు పామరునివఱకూ అందఱూ సంస్కృతి, సంస్కృతి అని చాల తేలికగా యీ పదమును వాడుతున్నారు. కాని దీని యర్థం గ్రహించికానీ, దీని పుట్టుపూర్వోత్తరాలు గానీ గుర్తించి వాడుతున్నవా రెందఱో?

భారతీయ సంస్కృతిని సర్వతోముఖంగా అభివృద్ధిని పొందించి జాతికి చైతన్యంగూర్చిన కాలం అతి పురాతనం. ఆర్షయుగంనుంచీ భారతీయ సంస్కృతి స్వయంసంపూర్ణమై, జాతికి నైతిక నూతనతా, తేజస్సూ, శాంతీ, సామరస్యం కలిగించి సాంఘిక జీవితానికి మార్గంచూపే ఉంది. వాల్మీకి చేతిలో భారతీయసంస్కృతి చైతన్యవంతమైన సుందరమూర్తినిదాల్చి, అయోధ్యలో అంతఃపుర కాంతలతో, దశరథుని నిండుకొలువులో, మంథర కారుకూతలలో, రాజ్యంకోసం లక్ష్మణుడు చనివిన వారసత్వపు పద్యాల్లో స్వేచ్ఛావిహారంచేసి, అరణ్యకుల జీవితంతో చెలిమి సంపాదించి హనుమంతుని చేత పంపాసర స్తీరంలో, ఋశ్యమూక సుందర కందరాల్లో తపస్సు చేయించింది. దాని ఫలం రాముని ధనుర్విద్యా ప్రదర్శనంలో ప్రతిబింబించి సుగ్రీవునికి కిష్కింధారాజ్య పట్టాభిషేకం చేసింది. వాలి నేలకూలినపుడు, అతనికి శ్రీరామునకును, తారకును జరిగిన వాదోపవాదాలలో పరసీమనంది అదే ఆధారముగా హనుమంతునకు మంత్రిపదవి నిచ్చింది. అప్పటికి భారతీయ సంస్కృతికి సంపూర్ణ యౌవనంతోపాటు సహజమైన సౌందర్యసిద్ధి కలిగింది. దాని పారమ్యమే రావణుని అంతఃపురం, పానశాల, అశోకవనం—

నైతికదృష్టిలో రాముని ఆదర్శపురుషునిగా చిత్రించిన ప్రధాన సూత్రసంస్కృతి రాజనీతిజ్ఞత తోడుగా విభీషణ పట్టాభిషేకంలో స్వచ్ఛందంగా ప్రవహించి రావణునకు శరణంటే అయోధ్య ఇస్తా ననిపిస్తుంది రామునిచేత. దానినే వివరించాడు వేమన "చంపదగినయట్టి శత్రువు తనచేతచిక్కినేని కీడు చేయరాదు, పొసగ మేలుచేసి పొమ్మనుటే చాలు" అని. గురువాక్యం వేదవాక్యం, పితృశాసనం దైవశాసనం, సవతులేని సోదరప్రేమ, రాజ్య పరాఙ్ముఖత, శరణాగతసంరక్షణ, భూతదయ, శత్రు సంహారదీక్ష, పనిలోపట్టుదల, లోకకళ్యాణం కోసం తన కష్టసుఖాలు గణింపకపోవడం రామ పాత్ర ద్వారా వాల్మీకి చేతిలో పరకోటి నధిరోహించింది. కాకపోతే అది సలక్షణమైన కావ్యమే కాదు. అందు భారతీయ సంస్కృతికి స్థానమే లేదు. వాల్మీకి లోకదృష్టి కలవాడే కాడు. రాముడు విధి తాత్ముడే కాడు.

సారస్వతసృష్టిని బట్టే భారతీయ కవులు పెట్టినదే సంస్కృతి భిక్ష. సంస్కృతి అంటే దేమిటో గ్రహించాలంటే భారతీయ వాఙ్మయాన్ని తత్వదృష్టితో పఠించాలి. అంతే గాని ఉపన్యాసాల్లో రామనామం లాగ సంస్కృతిసంస్కృతి అని జపిస్తే ఫలం లేదు.

మన కవులు సామాన్య కవితా రచనలో ప్రపంచాన్ని యే ఖండంవారూ చేయలేని మహత్తు చేసి విడిచిపెట్టేరు. వాల్మీకి చూపిన సంస్కృతి నాధారంగా ఉపాసించి కాళిదాసు మహాకర్తలా గురు

వుణ్ణో సమానుడనిపించుకొన్నాడు. ప్రార్థనా రూపంగా రఘువంశం ఆరంభించి జగజ్జననీ జనకులను వాగర్థములతో పోల్చి చెప్పేడు.

“వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ” అని.

ప్రయోజనం లేని పనిని యెంత సోమరియైనా ఆరంభించడు. సూర్యవంశపు రాజులచరిత్ర తాను రచించ నారంభించి అందుకు కావలసిన పరికరం వాక్కూ, అర్థమూ అంటాడు. పరిశుద్ధమైన వాక్కు రచయిత ప్రయోజనమును సాధిస్తూ లక్ష్యమును ప్రజాసమూహానికి సులభంగా అందిస్తుంది. దానినే మనస్సులో ఉంచుకొని తెలుగులో ఆదికవి నన్నయ కావ్యము విశ్వశ్రేయమునకే అనీ, దోషరహితములూ, సంస్కృతియుక్తములూ అయిన వాగర్థాలే కావ్యమనీ “విశ్వ శ్రేయః కావ్యం। తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ” అంటాడు. పాత్రల ననుసరించి అవస్థాభేదముతో రసమును పోషించడమే వాక్కుయొక్క పరమార్థం. దీనినే “సా వాగ్ యా రసవ్యక్తిః” అన్నాడు ప్రథమాచార్యుడు.

ఈ విధంగా పవిత్రమైన వాక్కును ఉపాసించి వశము చేసుకొంటే దానితో అర్థం దానంతట అదే వశమవుతుందని ఆ రెంటికీ యెడబాటు లేదనీ “వాగర్థావివ సంపృక్తౌ” అన్నాడు కవిసమ్రాట్టు.

ఈ వాగర్థములు సాంఘికంగా ప్రపంచానికి తల్లిదండ్రులని కవికులపతి ఉద్దేశం. వాక్కు ఎంత నిర్మలమైతే ఆ వ్యక్తి ప్రవృత్తి అంత నిర్మల మన్నమాట. వాక్కునుబట్టే వ్యక్తికిగల గౌరవాగౌరవాలు. దీనికే తెలుగులో ఒక చిన్న సామెత ఉంది. “తెల విలువనోరు చెప్తుంది” అని వ్యక్తియందున్న గొప్పతనం, తుంటరితనం, సభ్యత, అసభ్యత తెలియజేసేది వాక్కు. “రాయుడూ మంచిదేనా ?” అని ఒక బాటసారి పొలిమేరలో కసవుతీసే అమ్మని అడిగితే “నాయనా ! నీ నోరు మంచిదేనా?” అని ఆమె జవాబుగా ప్రశ్నించింది. దీని తత్త్వం పాఠకులు గ్రహిస్తారు.

వాక్కునుగూర్చి తిక్కయజ్వ “పలుకు ప్రల్లదనము” అని చల్లగా వేదంబాను ఉద్ఘాటించాడు. ఈ మహాకవు లతొం వాగర్థావివ సంపృక్తౌ అనకుండా భారతీయసంస్కృతిని తెలిసికొన్నవారూ కారు, తెలిసినవారూ కారు. ప్రతి భారతీయుడూ వాగర్థావివ అనే రఘువంశ ప్రారంభ శ్లోకంలో కాళిదాసు వ్యక్తిస్వాతంత్ర్యంలో ఎంత మహోత్కృష్ట ధర్మాన్ని బోధించి యెంత ఉత్తమసంస్కృతిని ప్రపంచానికి ప్రకటించేశాడో తెలిసికోవలసి ఉంది.

స్వాతంత్ర్యంలో వ్యక్తిగతంగా వాక్స్వాతంత్ర్యం ఎంతో ప్రధానం. దానిని స్వేచ్ఛావాహిగా కాక సాంఘికంగా, సామరస్యంకోసం వినియోగించాలని కవిసార్వభౌముని శాసనం. వాక్కు శీలమును కాపాడే మహాశక్తి. బుద్ధిని వికసింపజేసే గురువు. సాంఘికంగా గౌరవం కలిగించేది వాక్కు. జీవితానికి పవిత్రతనిచ్చేది వాక్కు. వాక్కు దైవశక్తి. పరోక్షంగా ఉండి మానవజీవితాన్ని బహుముఖాల పరిశీలిస్తూ, మానావమానాలనూ, గౌరవాగౌరవాలనూ కలిగించడంలో ప్రధానాచార్య పాత్రను ధరించేది వాక్కే. కనుకనే వాక్కునొక దేవతగా భారతీయులు “బ్రాహ్మి” అన్నారు. పరతత్త్వానికి జోలపాటలు పాడాలన్నా, మేలుకొలుపులు పాడాలన్నా వాక్స్వాతంత్ర్యం కలిగి ఉండాలి. పవిత్రమైన, నిస్సందిగ్ధమైన, పరిష్కృతమైన వాక్సిద్ధి సర్వకార్యాలూ ఫలించే విధానం చూపించి మానవుణ్ణి మానవుణ్ణిగా చేస్తుంది. వాగ్రూపమైన సంస్కృతి సారంతో కాళిదాసమహాకవి ఖండాంతరాల్లో కూడా తన ప్రతిభకు నీరాజనా లందుకొన్నాడు. ఆతని పరమోపాసనాఫలితమే వాగర్థావివ సంపృక్తౌ”

మన దృష్టిలో ఎంతో తేలికగా కనిపిస్తున్న సుమతిశతకం వాక్కున కెంత ప్రాధాన్య మిచ్చిందో విద్యావంతులకు తెల్లమే. “ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కా మాటలాడి అన్యుల మనముల్ నొప్పింపక తా నొవ్వక తప్పించుక తిరుగువాడు ధన్యుడు సుమతీ!”

భారతజాతికి ఆస్తికదృష్టి పరమావధి. దానికి ఆస్తికత్వం అంగరక్ష. అందుకనే వాక్కును “శబ్ద బ్రహ్మమయి” అన్నారు తాత్త్వికులు. అన్ని మంత్రాలకూ వాక్కు సూత్రస్వరూపం. నిరవధికమైన ఆనంద బ్రహ్మతత్త్వమును ప్రతిపాదించే ఓంకారమే ప్రణవము. అదే శబ్దబ్రహ్మమయి అన్నమాట.

ఈ విధంగా వాక్కును విశ్వజనీనమైన సంస్కృతితో ఉపాసించి అందున్న విలువను సాధించవలె నంటాడు కవిచక్రవర్తి.

పవిత్రమైన వాక్కును ఆధారంగా తీసికొని ఆరంభించాడు రఘువంశరచన. అందులో కాళిదాసు చూపిన సంస్కృతి ఐహికంగా ఆముష్మికంగాకూడా ప్రకృతిని ప్రబోధించింది. తా నెంత సమర్థుడైనా మానవుడు వచోవిధేయుడై ఉండడం అవసరం. వాక్కునకు విధేయుడైయున్నపుడే ప్రపంచానికి తాను బోధ కాగలడు. ఈ వినయ విధేయతల కెంత ప్రాధాన్య మిచ్చాడో మన కవికులపతి పరిశీలించండి.

కాళిదాసుభారతి యెన్నిశక్తులుకలదో వివ రించాలంటే అల్పజ్ఞుడనైన నా తరంకాదు. పుంభావ సరస్వతియైన కాళిదాసు తన రచనగురించి అందరి పండితులు అర్జుచాచినట్లు తన ప్రయత్నం ఉందం టాడు. "ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహురివ వామనః" ఎంత ప్రయత్నించినా మానవునకు లోభం విచారమునూ, హాస్యమునే సాధించి పెట్టుతుంది గాని కార్యమును కొనసాగించదు. కారణం ? తన తలకు తగనిపని చేయడానికి పూనుకోవడమే. విమ ర్శిస్తే కాళిదాసు చేతికాని బభ్రాజమానం పండితా యత్తే కాదు. తన సమగ్రశక్తికి ప్రతిబింబమైన రఘు వంశానికి పునర్జన్మలేనట్లు రచించిన కవిసామ్రాట్టు. కాని ఆవిశంగా సంఘానికి బోధించడమే. అదీ పర మార్థం : ఇది యే సంస్కృతి అవుతుందో సాంఘిక సోదరులే నిర్ణయిస్తారు.

లోకానికి కావ్యం చమత్కృతితో కాంత వలె యుక్తాయుక్త బోధ కావించాలంటాగు ఆలం కారికులు. "కావ్యం—కాంతా సమ్మితతయా ఉప దేశయుజే" అని వారి ఉద్ఘాటన. ఈ విషయాలన్నీ కాళిదాసరచనలో మూర్తీభవించి సాంఘికంగా రాజకీయంగా భారతజాతికి ఉత్తమసంస్కృతిని సాధించి యిచ్చేయి.

శ్రీ యామిజాల పద్మనాభస్వామి

---

# గన్నేరు—పేరంటం

డిసెంబర్ '51 భారతిలో శ్రీకోట సుందర రామ శర్మగారు వ్రాసిన వ్యాస శీర్షిక ఇది—ఆ వ్యాసమే దీనికికూడా మాతృక కావడంవలన ఆపేరే దీనికి పెట్టి దానితో దీన్ని కలిపి వేస్తున్నాను—రచ యిత అందులో పేరంటము, గన్నేరు, చెత్త, ఎంత అనే నాలుగు పదాలను గ్రహించి, అవి ప్రాకృత భవాలుగా నిరూపించారు. ఈ సంస్కృత ప్రాకృత సమస్య తెలుగుకు పీడరాని విషయంగా అమరిపో యింది. తెలుగు తజ్జన్యమనే వాదన దారిన అది ఉంటే, ద్రావిడ భాషా జన్యమనే వాదన పుట్టి, పెరిగి, వేళ్లూని, సర్వత్రా వ్యాపించి, రాణించింది. అయినా ఈనాడూ సంస్కృత ప్రాకృత సంబంధి **తెలుగు** అనేవా రున్నారు. అంటే అది ఆశ్చర్యకర వృత్తాంతంకాదు. ఎవరి ఉద్దేశ్యాలు వారివి. మార్చు కోవలసిన అగత్యమూ, అవసరమూ ఈ విజ్ఞాన ప్రసం గాలలో ఎందుకు ?—కాగా..విషయ విమర్శనా జిజ్ఞాస, వాదనా..కౌతుకమూ, చిన్నవాళ్ళకు ఉండడం నేరం కాదేమో ! ఈ వాదనలూ విమర్శ నలూ, సత్యాలుగా గ్రహించాలని నా ఊహకాదు- నేనోదో నా ఊహ చెప్తూఉంటే అది పూర్తిగా ఒప్పు అని మీరందరూ అంగీకరించవలెనా ? అందరూ ఏక ముఖంగా ప్రవర్తించేరోజు ఈ ప్రపం చంలో రాదు. అట్లా వచ్చినా అది సుఖదమూ కాదు—కాగా ఈనాడు ఏ వాదనలూ, విమర్శనావ మర్శలూ కొంత కాలక్షేపం కొరకూ, మరికొంత విషయ ప్రదర్శనకూ ! సహృదయత కలవాళ్ళకు అంతా మంచిగానే కనపడుతుంది—ఏదో ఉత్సుక తతో, సాకూతంగా గంతులు వేస్తున్న నా కలంలో మెఱుగు లేమైనా ఉంటే అవగాహన చేసుకుని ఆశీర్వదించండి ! లేకపోతే, ఈ ఉత్సాహాన్ని అపార్థంమాత్రం చేసుకోరని ఆశిస్తున్నాను.

నాకుమాత్రం ఈ నాలుగు శబ్దాలనూ దేశ్యా లంటే బాగుంటుందని పిస్తున్నది—ప్రతిపదానికీ మూలాన్వేషణ చెయ్యడం మంచిదే ! అది దొరికే వరకూ వెతికి, దొరకకపోతే సారూప్యంకల ఏదో విషయానికి ముడిపెట్టి తృప్తిపడడమూ సహజమే ! —కాని నలుగురిలో ఉన్న ప్రసిద్ధ సిద్ధాంతానికీ, సత్యానికీ, దూరంగా పోయి అతికష్టంమైన కొత్త సిద్ధాంతాలు స్థాపిస్తే అందరూ ఆమోదించ లేరేమో! అదయినా సహజ మార్గానికి సాన్నిహిత్యం కనిపిస్తూ ఉంటే, దానిని చూడక, చూచీ నిరాకరించీ దూరంగాపోయి శ్రమపడడం అనవసరమని పించటం అసహజం కాదు.

పేరంట మనే శబ్దాన్ని మొదట విమర్శిం చారు వ్యాసకర్త. ఆయన దృక్పథంలో, ఇది "పర్యంత" శబ్దభవమైన 'పజ్జంతో' నుండి జన్మను పొందినది—'పేరంటము' అనే దాని అర్థాన్ని "వివాహాది శుభ కార్యములు నడుపుటకు ముత్తైదు వులు ఇరుగు పొరుగు ముత్తయిదువులను రమ్మని పిలు చుట !" అనీ, ముత్తైదువులు వచ్చి చేయు ఉత్సం బంధమైన కార్య" మనిన్నీ, నిర్వచించారు— చుట్టుపక్కలనుండి ముత్తైదువులు వస్తున్నారు కాబట్టి ఆ 'చుట్టుపక్క' లే ప్రముఖత గడించి, 'పర్యంతము' నుండి 'పేరంటము' వచ్చినది అనడం ఆయన ఉద్దేశ్యం. ఇట్లా ఇది ప్రాకృతభవం.—ఇక దీన్ని నిఘంటువులు పేర్కొన్న దేశ్యమనే సత్యాన్ని దృష్టిలో పెట్టుకుని విమర్శిద్దాము.

పేరంటమునకు. 'పేరటము,' అనే రూపం ఉన్నది. దీనిమీదనుండే వచ్చి పుణ్యస్త్రీకి స్థిరపడి పోయిన "పేరటాలు, పేరంటాలు" అనే రూపాలూ ఉన్నవి !—పేరంటమనగానే, ఒకస్త్రీ, ఆవిడ చేతులో తళతళ మెరిసేపళ్ళెంలో కుంకుమ భరిణా మన కన్నులకు కట్టినట్లు ఎదురుగా ప్రత్యక్ష మవుతుంది.

కేవలం "ఇరుగు పొరుగువారు మన యింటికిరావలె," అని ఇచ్చింది, బొట్టుపెట్టకుండా చెప్తే, అది 'పేరంటము కాదేమో!—లేదా మగవారిని మగవారు పిలిచే పిలుపుకూడా పేరంటమనిపించుకోనదు—కాబట్టి ఈ పదంలో ప్రముఖంగా నిలచి గర్వపడే వస్తువు 'కుంకుమ'—దానిని కలిగిన భాగ్యవతి పేరంటాలయిపోవడంకూడా దీని ప్రాబల్యాన్నిబట్టే అనిపిస్తుంది—కాగా శర్మగారు చెప్పిన 'పర్యంత' శబ్దాన్నే మూలంగా అంగీకరించి నట్లయితే, "నిలయ పర్యంతమా, గ్రామ పర్యంతమా?" అనే ప్రశ్న రాక తప్పదు—అదీకాక ఈ పర్యంతంనుండి రావలసి వచ్చిన 'పేరంటాలు' పదానికి చుట్టుపక్కల నుండి వచ్చే ఏస్త్రీ అయినా అర్హురాలు కాక తప్పదు!—మరి దీనిని ఒప్పుకోవడం ఎట్లా?—

కాగా దీనికి ద్రావిడ భాషలలో మూలం లేదా ఉన్నదా, అనేది ప్రశ్న!—"పేరంటము" అనే పదంకాని, దానికి పోలే మరొక పదంకాని, సరిగ్గా అదే అర్థాన్నిస్తూ తమిళాది ద్రావిడ భాషలలో లేకపోవడం సత్యమే!—అంతమాత్రాన ఒక భాషయొక్క పుట్టుకను సంశయించ ననుసరించి, ఒకేపదం, అదే అర్థంలో సోదర భాషలన్నిటిలోనూ ఉండాలి అన్న నియమమెక్కడా లేదు!—కొన్ని పదాలు ఒకభాషలో క్రియలుగా వ్యవహృతాలు అవుతూవచ్చి, మరొకభాషలో అసలే కనిపించవు. లేదా ఏ అస్పష్ట నామరూపాలుగానో మాటునపడి అస్తినాస్తి భావాన్ని చాటుతూ ఉంటవి—దీనికి తార్కాణంగా ద్రావిడధాతువు 'ఉణ్' అనేదాన్ని చూద్దాం. దీనికి 'తిను' అని అర్థం. అయితే ఈరూపంతో పోలగలరూపం. అదే అర్థంతో తెలుగులో లేదు. కాని తమిళ కన్నడ, తుళుభాషలలో ఉన్నది—దీనినిబట్టి 'ఉణ్' అనే రూపం తెలుగుకు అసహజము అనే తీర్మానానికి మనం వచ్చేలోపల, చటుక్కున కొన్ని నామరూపాలు మెఱుపు కొట్టినట్టుగా ప్రత్యక్షంకాక తప్పవు. వాటిని పైపైన పరిశీలిస్తే ఈ ధాతువునుండి వచ్చినవనే విషయం చెప్పనవసరం లేదు. దానికి శాస్త్రసూక్ష్మత అవసరం పరిశీలనలో!—ఆ ధాతువునుండి పుట్టిన రూపాలే "ఉండ్రాళ్లు; ఉగ్గు" మొదలైనవి—ఉణ్—రాళ్ళు—అని విభజించి "తినేవి, గుండ్రనివి" అని అర్థం చెప్పుకోవచ్చును. అట్లాగే చిన్న పిల్లల తిండి 'ఉగ్గు' ఇదంతా చెప్పడంలో నా ఉద్దేశ్యం, కేవలం అదేరూపం ఇతర భాషలలో లేకపోయినంత మాత్రాన త్వరపడి దాని జన్మను అన్యథాస్థిరం చెయ్యరాదని! పేరంటమనే పదంలేక పోయినా, ఇతర భాషలలో, ఆపదంలో ఉన్న మూలాలు మాత్రం ఉన్నవని మనం గమనించవచ్చు.

చూడండి, 'పేర్' అనేది తమిళంలో ఉన్న ఉన్న ధాతువు. తమిళం ద్రావిడభాష లన్నిటిలో మొదట సాహిత్య స్థితికి వచ్చిన కారణంవల్లా, దానికి సంస్కృతాది ఇతర భాషల సంపర్కం చాలా స్వల్పం అవడంవల్లా మూలద్రావిడ ధాతువులకూ, తమిళంలో ఉన్న ధాతువులకూ మార్పులు చాలా కొద్ది అని మనం గ్రహించవచ్చు—అదీకాక మూల ద్రావిడ స్వరూపం కేవలం ఊహామీద ఆధారపడి ఉన్నది. కాబట్టి తమిళధాతువులనే తీసుకుని మన చర్చను సాగించడం సమంజసమని పిస్తున్నది నాకు.

ఇంతకూ ఈ 'పేర్' కు సంబంధించి చాలా రూపాలున్నవి.

పేర్—నామము.

పెరియ—పెద్ద.

పెరిదు—పెద్దది.

పెరుమై—పెద్దతనము—దీనినిబట్టి పెద్దతనమనీ, 'పేర'నీ పేరునుబట్టి మనుష్యుడనీ అర్థాలున్నవి. "రెండుపేర్"—అంటే ఇద్దరు మనుష్యులని అర్థం వస్తూఉంటుంది ఈ 'పేర్' అనేది సమాసాల్లో కలిపి వాడడంకూడా కద్దు—ఉదా—పేర్ ఓలక్కమ్—పేరోలగము—అనగా పెద్దసభ అని అర్థం—ఇటువంటి సమాసాలలో వచ్చిన 'పేరు'కు పెద్ద లేక గొప్ప అనే అర్థము రూఢమైపోయింది—దీనివిషయం ఇట్లా ఉంచుదాం.

'ఆటు' అనే మరొక ధాతువును చూస్తే దానికి "కదులు, ఊగు" అనే అర్థాలున్నవి. ఆ ధాతువుతో సమానంగా తెలుగులోనికి వచ్చిన రూపం 'ఆడు,' దాని నామం తమిళంలో 'ఆట్టం' అనీ తెలుగులో 'ఆట' అనీ! 'ఆట్టం'లో సరిపోయే 'ఆటము' అనే రూపం తెలుగులో విడిగా ప్రయోగంలో లేకపోయినా సంయుక్త పదాల్లో కనపడుతూ ఉంటుంది. ఉదాహరణకు

త— తె—

కోలాట్టమ్—కోలాటము

పోరాట్టమ్—పోరాటము—అనే రూపాలను చూపించవచ్చు—వీటితో సమానంగా రాదగిన 'పేరాట్టమ్' అనేరూపం తమిళంలో ఏకారణం వల్లనో కనిపించక పోయినా, అటువంటి రూపం ఏర్పడడంలో అసమంజసత ఏమీ లేదు—కొన్ని భాషలలోనే ఉండి సామ్యరూపాలు మిగిలిన వాటిలో జారిపోవడంకూడా కద్దని చెప్పుకున్నాం—దీన్నిబట్టి, తెలుగులో పై నిర్మాణం ప్రకారం పేరటము, పేరంటము అనే రూపాలు ఏర్పడినవంటే విప్రతిపత్తి ఏమీ లేదు. దీని అర్థం ఏమిటి అని చర్చిస్తే "ఒక గుంపు మనుష్యులు ఒక స్థలం

నుండి మరొక స్థలానికి కదిలే కదలిక" అని తేలుతుంది. అటువంటి కదలికకు కారణమైన 'పిలుపు' చివరకు 'పేరంటము'గా స్థిరపడి, ఆ పిలుపునకు చిహ్నమైన కుంకుమకు ప్రాముఖ్యం కలిగింది!—దానినుండే పేరంటాలు అనే పదనిర్మితికూడా కలిగిందనటంలో అసంభవం లేదు అదీకాక, "పేరంటము" అనే పదం వినిన వెంటనే, పచ్చపచ్చగా ఒంటినిండా నగలు పెట్టుకుని, నొసటకు గంధపుబొట్టుతో, కాలికి పసుపుపూతా మెరుస్తూ, పట్టుచీరెల పరపర శబ్దాలతో వీధుల్లో అటూ ఇటూ గుసగుస తిరిగే ముత్తైదువులను చూస్తే, ఆ 'అట్టం' కున్న అర్థం సరిగ్గా అతుకుతున్నదని పిస్తుంటుంది నా మనస్సుకు—

పోతే, రెండవపదం 'గన్నేరు'—ఇది 'కర్ణికారః' శబ్దభవంగా నిరూపించారు వ్యాసకర్త—ఇట్లా నిరూపించేటప్పుడు "గోగుపూవు" అనే అర్థాన్ని ఇచ్చే 'కర్ణికార' నుండి పుష్పభేదమైన 'గన్నేరు' ఎట్లా వస్తుందా అనే అనుమానం ఆయనకూ కలిగింది. అది దృష్టిలో పెట్టుకుని ఆయన చాలాసేపు సమర్థించినా, ఆ సమర్థనయొక్క ఉద్దేశ్యం చివరవరకూ సరిగా స్పష్టంకాలేదు.—కొండగోగుపూవు పసుపు పచ్చగా ఉంటుంది. 'గన్నేరు'లో రచయిత గ్రహించిన ఒక రకపు గన్నేరూ పసుపు పచ్చగా ఉంటుంది. రంగుకున్న సామ్యంవలన కొండగోగును వ్యవహరించే కర్ణికార పదాన్నుండి గన్నేరు వచ్చిందని ఆయన ఊహ!—కాని ఇక్కడ నాకు చిన్న అనుమానం—'గన్నేరు' అనే పేరు ఒక్క రంగైన పుష్పానికే కాదు. ఎఱుపురంగు పూవుకూ, తెల్లరంగుపూవుకూ కూడా అదే పేరు—మరి వర్ణసామ్యంవలన గన్నేరు అనేపదం 'కర్ణికార' నుండి ఏర్పడితే వర్ణవిభిన్నత కలిగిన, మిగిలిన పూవులకెట్లా అన్వయిస్తుంది?—

కాగా ఆపదం దేశ్యమన్న విషయాన్ని మనస్సులో ఉంచుకుని పరిశీలిస్తాం—'గన్నేరు' అనేదానికి 'అరళి' అని తమిళంలోని పేరు. పచ్చగన్నేరుకు "తంగరళి" అనే ప్రత్యేకనామంకూడా ఉన్నది. అయితే ఈ గన్నేరుకూ అరళికీ ఎట్లా పొసగుతుందా అన్న ఆలోచన వెంటనే తట్టక తప్పదు—ఇక, శ్రీ శర్మగారు రంగును వివరించినట్లుగా నేను పుష్పముయొక్క ఆకారాన్ని చూస్తాను—ఈ జాతి పూవు అంతా, రంగులో భేదాన్ని పాటించకుండా, ఆకారంలో ఒక 'గిన్నె' వలె ఉంటుంది—ఈ గిన్నెకు ద్రావిడ ధాతురూపం, కిణ్ణి—తెలుగులో అదే గిన్నె—. కన్నడంలో 'గిణ్ణల్' అనీ, మళయాళంలో కిణ్ణం, అనీ గోచరిస్తుంది. పూవు యొక్క ఆకారాన్ని మనస్సులో ఉంచుకుని, వర్ణనాత్మకంగా నామవాచకాలను ఏర్పరచుకునే పద్ధతి భాషలలో ఉన్నది. గనుక, 'కిణ్ణరళి' లేదా 'గిన్నరళి' అనే రూపాల ఏర్పాటు జరిగి ఉండవచ్చు—ఇట్లా ఆకారాన్ని పేరులో తెలియజేసే పూవులు మనకు చాలా ఉన్నవి. ముద్దబంతి; ఒంటిరెక్కబంతి—కారబ్బంతి—ఊకబంతి మొదలైన 'బంతి' జాతిలోని భేదాలు—గ్రామఫోను పూవులు—కాగితపు పూవులు—ఇత్యాది వేర్వేరు జాతి పూవుల పేర్లూ ఇటువంటివే! ఇదే విధంగా నిర్ణీతమైన "కిణ్ణరళి" లో నుండి 'గన్నేరు' అనే పదం ఉద్భూతమైనదంటే అందులో విప్రతిపత్తి లేదు.—గిన్నెవంటి ఆకారం ఈ జాతికి చెందిన అన్ని రంగుల పూవులకూ ఉన్నది. ఆ జాతి పూవు పేరు అరళి. కాగా గన్నేరు అనే పేరు సాధారణ నామమై రంగు భేదాలను బట్టి, పచ్చగన్నేరనీ, తెల్లగన్నేరనీ, ఎఱ్ఱగన్నేరనీ, రంగును బట్టిన విభాగాలను ఏర్పరించుకున్నది!—ఇట్లా వచ్చిన జనన వృత్తాంతం ఈ పదానిది!—

ఇక, మూడవ పదం, ఎండ—'ఆతపము' అనే సూర్యకాంతికి తెలుగు పదమిది. శ్రీ శర్మగారి అంచనా ప్రకారం దీనికి మూలం 'ప్రచండ' అనే సంస్కృత పదంలోని ఉపసర్గ విరహితమైన 'చండ' అని విదితం—'ప్రచండ' ప్రాకృతంలో 'పయండ'గా మారి ఉపసర్గ జారి ఆ 'యండ' 'ఎండ'గా మారిందంటారు ఆయన.

ఇంత డొంక తిరుగుడుగా చెప్పటం కంటే సంస్కృతపు 'చండ' 'ఎండ'గా మారింది అనకూడదా అని ప్రశ్నిస్తే, "కూడదు" అనే సమాధానం మనకే స్ఫురిస్తుంది. పదంలో తొలి అక్షరం మీద ఊనిక ఉంటుంది. అట్టి ఊనిక గల అక్షరం లోని హల్లుకుగాని, అచ్చుకుగాని సాధారణంగా మార్పు అంటూ కలుగదు. కాబట్టి 'చ' లోని చకారం జారి పోవడం గాని, మిగిలిన 'అ' 'య'గా మారడం గాని అసంభవమని రచయితకు కూడా తెలుసు. అందుకనే తన ఊహకు అనుకూలంగా ఆయన వెంటట 'ప్ర' అనే ఉపసర్గను చేర్చుకోవలసి, తరువాత అవసరంతీర్చి దాన్ని జార్చుకోవలసివచ్చింది—అట్లా 'ప్రచండ', 'పయండ'గా మారుతుంది. మారిన తదుపరి అక్కడ 'ప' ఉపసర్గ అనే దృష్టి ఉండడం అసంభవం.—అదొక ఏకపదంగా ఆ భాషలో అమరిపోతుంది. అటువంటప్పుడు, 'ప' అనే వర్ణాన్ని కేవలం సంస్కృత పదంలోని ఉపసర్గను దృష్టిలో పెట్టుకుని విడదీయడం ఎట్లా అనే ప్రశ్నకు అవకాశమున్నది. కాగా, 'పయండ' అనేది మరీ పరిభ్రష్టమై తెలుగులోనికి ప్రాకృత భవంగా రావలసివస్తే

'వెంప' అనో 'పంప' అనో రావలెనేగాని, పై విధంగా రాదేమో అని నా అనుమానం!—

ఇక ద్రావిడ జన్యమేనని తీర్మానించ బూనుకుంటే, తద్ధాతువులు, వెళ్, వెణ్ అనే రెంటిని గ్రహించవలసి ఉంటుంది! మొదట ఈ ధాతువుల మీద వచ్చిన రూపాలను చూద్దాం.

వెణ్ణిరమ్ (వెణ్ + నిరమ్)— తెల్లరంగు.

వెళ్ళై — తెలుపు.

వెణ్ణిల (వెణ్ + నిల)— వెన్నెల.

వెళ్ళి — వెండి.

వెలి — వెలుపల.

వెణ్మై — తెల్లదనము— ఈ పదాలు నిరూపించే ప్రతి వస్తువుకూ తెల్లదనమో, ప్రకాశమో ఉండనే ఉన్నది. అసలు వెళ్, వెణ్ అనేవి రెండూ ప్రకాశించు అనే అర్థాన్నిచ్చే ధాతువులు— ఈ 'ఎండ'కు తమిళంలో 'వెయిల్' అనేపదం ఉన్నది— మరి యీ ధాతువులకూ 'ఎండ'కూ ఉన్న సంబంధమేమిటి అనేది చర్చ— ధాతువులు ఉన్నవి ఉన్నట్లుగానే నామ వాచకాలుగా మారడం కద్దు— ఉదాహరణకు, "పలుకు",—"ఉలుకు", ఇత్యాదులు— ఇటువంటి ఉదాహరణాలను కేవలం ద్రావిడ ధాతువులను తీసుకుని కూడా చూపించవచ్చును— కాని చాలా వరకు ధాతువులు నామరూపాలుగా మారాలంటే కొన్ని ప్రత్యయాలు కలవడం అవసరం. ఇవే కృత్ప్రత్యయాలని వ్యాకరణంలో వ్యవహృతాలు— క, గ, చ, త, [illegible], [illegible], [illegible] మొదలైనవి కొన్ని యీ ప్రాపితాలు చేసినవి— 'ఎండ'లో ప్రకాశత,— సరిగా చెప్పాలనంటే,—తీక్ష్ణత (Bright·css) ఉన్నది. 'వెళ్' అనే ధాతువుకున్న అర్థమదే. వెళ్ళి అనే తమిళ రూపాన్ని తీసుకుందాం— అది తెల్లనిదైనఒక లోహాన్ని చెప్తుంది- అదే తెలుగులో 'వెండి'గా మారింది— అట్లాగే త. వెళ్ళై, మ. వెళ్ళ అనే 'ప్రకాశా'ర్థాన్నిచ్చే ధాతువులు— 'వెంప'గా మారి ఉండడంలో విప్రతిపత్తిలేదు— లేదా 'వెమ్' అనే ధాతువు కూడా ఒకటి ఉన్నది— దానికి 'వేడి' అనే అర్థం ఉన్నది. దీనికే కృత్ప్రత్యయం 'ప' చేరి వెంప అయినదన్నా అనవచ్చును— అదీ కాక, పైన చెప్పిన ప్రకాశతను వెలువరించే వస్తువులన్నీ ఆ వెళ్ ధాతువుకు సంబంధిగా ఎట్లా ఉన్నవో, అట్లాగే, వేడి, వెలుపల, వెచ్చన, వెట్ట మొదలైనవన్నీ ఒకే ధాతువునుండి వచ్చినవి అనడం సమంజసంగా కనిపిస్తుంది— ఇట్లా ఏర్పడిన 'వెంప' ఎండగా మారవచ్చు. తెలుగు మాటల మొదట యకారమూ, వువూ వోవోలూ వినపడడం క్వచిత్తు. ఆ అలవాటు చొప్పున నే, ఈ హల్లులను అచ్చులుగా మార్చుకుని వ్యవహరించడం సహజమై పోయింది. ఈ మార్పుకున్న ప్రాబల్యం జానపదుల వ్యవహారంలో బాగా కనపడుతుంది— 'వెలుగు'కు 'ఎలుగు' అనీ, 'వెన్న'కు 'ఎన్న' అనీ, 'వెచ్చగా'కు 'ఎచ్చగా' అనీ ఇత్యాది రూపాలు మనం వింటూనే ఉంటాము. నాగరకత తెలిసిన జనులకే మార్పులు నవ్వు పుట్టించవచ్చు. కాని వాళ్ళకూ తెలియని 'ఎండ' వంటి పదాలు అంతగా మారి దాగుడు మూతలాడుతూ ఉన్నవని నా ఊహ— ఇది దీని వృత్తాంతము.

ఇక మిగిలినది 'చెత్త'— ఇది 'త్యక్త' శబ్దభవమని రచయిత అభిప్రాయం, 'చెత్త' అనేది తెలుగులో ఎట్లా ఉన్నదో, 'చెత్తై' అని తమిళంలో కూడా అట్లాగే ఉన్నది. చెత్త మళయాళంలోనూ, 'సెత్తె' అని కన్నడంలోనూ దీనికి సమాన రూపాలున్నవి. నిజానికి ఇది త్యక్త శబ్దభవమే అయితే సంస్కృత ప్రాబల్యం లేని తమిళంలో కూడా ఉండడం విచిత్రం— ఎట్లాగో వచ్చినది అని చెప్పుకుంటే అన్నిటిలోనూ 'చొత్త' అనే తద్భవరూపమే కనపడి ఉండవలె!— ద్రావిడ భాషలకు సహజమైన సూక్ష్మ విభేదాలతో ఈ రూపం అన్నిటా కనపడుతూ ఉన్నదంటే దీన్ని తద్భవమనడానికి నా మనస్సు సంకోచిస్తున్నది— ఒక పదం తత్సమం కానీ, తద్భవం కానీ, ఒక భాషలో జొరబడిన తరువాత, ఆ భాషా సాంప్రదాయములనే అలవరచుకుంటుంది గదా, అటువంటప్పుడు 'త్యక్త' 'చెత్తై'గా 'చెత్త'గా, 'సెత్తె'గా మారిందంటే అసందర్భమేమిటి అని ప్రశ్న రావచ్చును— ఇదీ ఆలోచించవలసిన విషయమే!— అయితే ఈ పదానికి దగ్గరగా ఉన్న ధాతురూపమేమీ ద్రావిడములో కన్పించదా అని పరిశీలించవలె!

'కెడు' 'కేడు' అనే ధాతువులకు చెడిన, పనికి మాలిన అనే అర్థాలున్నవి. వీని మూలకంగా వచ్చిన తెలుగు రూపాలు, చెడు, చెడ్డ ఇత్యాదులు. తమిళంలోని 'కెట్ట' అనే నామ రూపానికి తెలుగులోని సరియైన రూపం "చెట్ట" అని— భాషా నియామకాల ననుసరించి "క, చ"లు రెండూ పరస్పర వినిమయం చెందే వర్ణాలు. ఒక భాషలో 'క' వర్ణయుత రూపం మరొక భాషలో 'చ'కార యుతంగా మారుతుంది.

చెయ్ — కెయ్

చిలుక — కిళి

చెట్టు — గిడ

కెట్ట — చెట్ట ఇత్యాదులు.

ఈ 'చెట్టు'కు 'చెడును' అనే అర్థం ఉన్నది. కాగా దీనికి మూలమైన 'కెట్టు'కు, పనికి మాలినది, చెడినది, అనే అర్థాలు రెండూ ఉన్నవి—"ఏది చెడ్డదో అది పనికి మాలినది" అనే వ్యాఖ్యానాన్ని చెప్పుకుంటే, చెట్టకు, 'పనికిమాలిన' అనే అర్థాన్ని కూడా సరిపెట్టవచ్చు—చెట్ట, చెత్తగా మారుతుంది. అనుకున్నా, లేదా 'కెట్ట' నుండే 'చెత్త' ఏర్పడిన దన్నా ఇందులో అసమంజసత ఏమీ ఉన్నదనిపించదు!—ఈ విధంగా ఇదీ ద్రావిడ భాషాజన్యమే అని నా ఊహ.

ఇట్లా నాలుగు పదాలను చర్చించాం. ఇక ఆ చర్చలోని యుక్తాయుక్తాలను పరిశీలించి నిలబెట్టే శ్రమ విజ్ఞులకే వదలి వేస్తున్నాను. ఇదంతా కేవలం నా ఊహ మాత్రం!—ఇట్లా వ్రాయడం పెద్దల ఉద్దేశ్యాలను ఖండించాలనే ఊహతో కాక, మనస్సులో ఉన్న సందేహాలను అందరికీ చెప్పవలెననే జిజ్ఞాసతో—దీనిని సహృదయతతో మన్నిస్తారనీ, అన్యథా భావించరనీ ఆశిస్తున్నాను.

శ్రీమతి నాయని కృష్ణకుమారి



# గ్రంథవిమర్శనము

## మహిష శతకము

[పద్యకావ్యము]

కావ్యతీర్థ, కవితావతంస, శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి. సాహితీసమితి. తెనాలి, వెల : ఒక రూపాయి.

సంస్కృత వాఙ్మయంలో అవహేళన (*satire*) కావ్యాలు చాలా తక్కువ. ఒక్క శతకవాఙ్మయంలో కొన్ని అవహేళన శతకాలు కనిపిస్తున్నాయి. జగన్నాథ పండితరాయలు రచించిన అన్యాపదేశశతకము మొదలైన వీ జాతిలో జేరతాయి. ఇవన్నీ వేళ్ళమీద లెక్కపెట్టవచ్చును. అటు ఆంగ్ల వాఙ్మయంతో పోల్చిచూచినా, ఇటు తెలుగు వాఙ్మయంతో పోల్చిచూచినా సంస్కృత సారస్వతావహేళనలో అంత తీవ్రతగాని, బాహుళ్యం గాని కనిపించదు. కుట్టికవి రచించిన ఒక్క మహిష శతకమే ఈ లోటు చాలావరకు భర్తీ చేస్తుంది.

ఇతడు తంజాపూరు ప్రభువు ప్రతాపసింహునికి (1732—1769) సమకాలికుడు. బహుశః ప్రభువు అజ్ఞతవల్లనో, ఆ స్థానంలో జేరుకున్న అల్పజ్ఞుల గూడుపుఠాణీలవల్లనో ఈ కవి కవితా గోష్ఠికీ, శాస్త్రవ్యాసంగానికీ నీళ్లు వదులుకొని కేవలం హాలం చేపట్టవలసినవాడైనాడు. అయితే సహజకవిఅయిన ఇతని ఉక్రోషానికి ఊరడింపు కలగలేదు—దాని ఫలితమే ఈ మహిషశతకము. ఈ శతకం కర్ణాకర్ణిగా విన్న ప్రతాపసింహునికి చిట్టచివరికి పశ్చాత్తాపం కలిగిందని మహిషశతక వ్యాఖ్యాత ఒకడు వ్రాస్తున్నాడు. కాని ఇది చరిత్ర పరిశోధకుల దగ్గరకు వదిలి పెట్టవలిసిన విషయం.

చివరికి కవి నూరునిష్కాలు ఖర్చుపెట్టి కొన్ని దున్నలనుకొని వ్యవసాయం చేస్తూ 'మహిష ప్రభువు' నుద్దేశించి వ్యాజస్తుతి పూర్వకంగా సుమారు నూరు శార్దూల విక్రీతాలు వ్రాశాడు. వీటితో కవి తన ధాన్యం అపహరించుకుపోయిన ప్రతాపుని సుబేదారులు మొదలుకొని రాజాస్థానంలో తిష్ఠవేసుకుని కూర్చున్న ప్రభువుదాకా—అందరినీ గట్టిదెబ్బలు కొట్టాడు. ఈ సందర్భంలో కవి తన ప్రభువును నిశితంగా అధిక్షేపించిన అనువాద పద్యం ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

"నేలం దున్నియు దున్ని,
రేబవలు క్లాంతిం గుదంగా నేల? యే
కాలం బిప్పటి సభ్యకోటి
గొలువంగా నెస్స గొల్వొంతుమా!
పాలిం జెల్వియు జేటలేదని
వగర్వంబోకు నీకంటెనుం
గూళల్ వీరు లులాయ!
గీప్సతిస్సృతిం గొందీ వె యివ్వారిలోన్!"

అయితే మూల శ్లోకంలోని "త్వత్తో మూఢతమా ఇమే; భవసి హి త్వం తేషు వాచస్పతిః" అన్న పాదం అనువాదం తిన్నగా రాలేదు. మూలంలో "నీకంటె వీరు మూఢతములు" అనే అర్థం వస్తుంది. దీనికి అనువాదకులు "నీకంటెం గూళలు వీరు" అని వ్రాశారు. కూళ అనే పదానికి మూఢుడు అనే అర్థం లేదు. పైగా ఈ పదంవల్ల కుత్సితులు, దుర్మార్గులు అనే అర్థం స్ఫురిస్తున్నది. ఇందుచేత, ఈ పాదంలో మూలార్థం బాగా కుంటుపడిపోయింది.

ఈ క్రింది శ్లోకంలో మూలంలో ప్రశ్నార్థకంగా ఉన్న వాక్యం అనువాదంలో కేవలం ఒక విషయం చెప్పే వాక్యంగా మార్చివేశారు. దీనివల్ల మూలంలో వచ్చిన తీవ్రత బాగా తగ్గిపోయింది. ఈ మూలము, అనువాదము ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

"భూపో భూపఇతీవ కిం న్వనుగతా
జాతిర్ఘటత్వాదివత్
భూమావస్తి య ఏవ రక్షతి జనాన్
రాజా స ఏవ స్వయమ్
కిం నూమీపతయః శరారవ ఇమే
క్రూరాః కిరాతా ఇవ;
ప్రాయః సార్వజనీన కాసరపతే!
రాజా త్వమేవాసినః"

ఈ శ్లోకానికి వీరి అనువాదం ఇది.

"భువిలో రాజపదంబు జాతిపరమై
పొల్చున్ ఘటత్వాది జా
తివలెన్; జెల్లు జనావనక్షముడె ప్రీగా
రాజనంగా; శరా
రువులుం గ్రూరులునై కిరాతులవలెన్
రూపొందిరీ రాజు; లో
మవె; నన్ సార్వజనీన! కాసరవరా!
మారాజవీవే సుమా!"

ఘటత్వాదిజాతివలె భూపపదానికి జాతి అనుగతమై వస్తుందా?" అని ప్రశ్నార్థకంగా రచించిన

మొదటి పాదానికి "భువిలో రాజపదంబు జాతిపరమై పొల్చుం ఘటత్వాది జాతివలెన్" అనే అనువాదం సరికాదు.

అయితే ఇల్లాంటి దోషసులీ అనువాదంలో ఎక్కడో సకృత్తుగా గాని కనబడవు. తెలుగు యతిప్రాసలవంటివి సంస్కృతంలో లేనే లేవు. మూలశ్లోకాలు తెలుగులోకి దింపేటప్పుడే యతి ప్రాసలు బిగింపులు జాగ్రత్తగా చూసుకోవాలి. నరసింహశాస్త్రిగారి అనువాదం ఇవ్వన్నీ గడిచి, గట్టిపాకంలోపడింది. ఈ క్రింది పద్యాలు వీరి ధారాళరచన కుదాహరణగా తీసుకోవచ్చును.

"తనువున్ దుత్తునియల్ పొనర్చుకొని,
త్వత్సంపాదితంబైన యా
ధనమున్ ధాన్యము దోచివేయగ
సుబేదారుల్ కతంబేమొ; నా
మన మూహించినదానినిన్ వినుము;
ప్రేమన్ బల్మినిం దాల్మినిం
దనయుల్ తండ్రిధనంబు గొందురుగదా!
ధాత్రిన్ లులాయాధిపా!
"చెవిసోకించినసూక్తి సేగ దెప్పుడుం
జీమంత మోసంబు సే
యవు; నీ వెల్ల యవస్థలం చెలిమి నే
కాకారమున్ బూని యుం
దువు; దుర్వంచకు లవ్యవస్థవిషయుల్
దుష్టుల్ నృపుల్ చా; లిసీ!
భువి ద్వన్ద్వాధులమై గడింతుము
సుఖంబుం గాసరాధీశ్వరా!"

మహిష శతకము ఆంధ్రకవితాభిమాను లందరు తప్పక పఠింపవలసిన అనువాదకావ్యము.

---

## కావడికుండలు

[కథల సంపుటి]

బలివాడ కాంతరావు. ప్రచురణ— తెలుగు నాడు ప్రచురణలు. 11, 97, మెయిన్ రోడ్డు. విశాఖపట్నం. వెల: ఒకరూపాయి. ఈ సంపుటిలో 'కావడికుండలు' 'అర్థభాగాలలో భిన్నహృదయాలు' అనే రెండు పెద్దకథ లున్నాయి.

సుందరం అనే యువకుడు ఒక డాక్టరు ఇంట్లో ఉంటూ ఆయన ఆసరావల్ల చదువుసంధ్యలు సాగిస్తూ ఉంటాడు. ఈ డాక్టరు చిన్నప్పటినించీ బాగా కష్టపడి పైకి వచ్చినవ్యక్తి; ఈయన కుమార్తెల్లో శాంత అనే అమ్మాయి ఇతన్ని ప్రేమిస్తుంది. శాంత తల్లికి అంతగా ఇష్టంలేకపోయినా చివరికి సుందరానికీ, శాంతకు వివాహం జరుగుతుంది. సంగ్రహంగా ఇదే 'కావడికుండల'లో కథ.

ఈ కథకులు సామాన్యంగా విశాఖపట్టణ ప్రాంతంలో ఉన్న కొన్ని మధ్యతరగతి కుటుంబాలను తీసుకుని వాటిచుట్టూ కథ లల్లుతూంటారు. కావడానికి 'కావడికుండల'లో ప్రేమే కథావస్తువు. ఈ రోజుల్లో ఈ 'ప్రేమకథలు' వందలకొద్దీ వచ్చి పడుతున్నాయి. వీటిలో ప్రేమస్వభావ వివేచనగల మంచి కథలు వేళ్ళతో లెక్కపెట్టవచ్చును. బలివాడ కాంతారావుగారిలాంటి ఉత్తమకథలు వ్రాసే యువక కథకుల్లో ముఖ్యులు.

ఈ పెద్దకథలో అల్లిక జిగిని గురించి అంతగా చెప్పవలసిందేమీ లేదు గాని, వ్యక్తుల స్వభావపరిశీలనం మాత్రం చాలా సూక్ష్మంగా నడిచింది. సామాన్యంగా ఈయన కథలలో ఈ సృష్టి ఎక్కువ. ఇందులో శాంత మొట్టమొదట సుందరం అంటే అంతగా ఇష్టంలేనిదానిలా కనబడుతుంది. కాని కథ చివరికి వచ్చేసరికి మాత్రం అది ఆమెలో లోపలి ఊహ కాదని తేలిపోతుంది. ఇలాంటి వ్యంగ్యస్వభావోన్మీలనలో ఈయన బాగా జాగ్రత్త పడతారు.

అయితే ఇంచుమించుగా ఇల్లాంటి కథే తీసుకుని వీరు ఇదివరలో 'బూచీ' అనే పెద్దకథ భారతిలో ప్రచురించారు. ఈ రెండింటిలోనూ ముఖ్యసమస్య ఒక్కటే. 'బూచీ'తో పోల్చినప్పుడిది రంగుమాసిన బొమ్మలా కనబడుతుంది. ఇలా ఒకే ఇతివృత్తం రెండు కథలలో నడుపుతుంటూ రావడంవల్ల ప్రస్తుత కథ బాగా దెబ్బ తిన్నది.

ఈ సంపుటిలోని రెండో కథ పరిమాణంలో చిన్నదయినా మొదటిదానికంటె బాగా పాకంలో పడింది. ఇందులో కిష్టయ్య లేమికష్టాలు నానా ఇబ్బందులు పడుతూ సంసారం ఈదలేక చివరికి సన్యాసం పుచ్చుకుంటాడు. కాని అతని భార్య సుందరి నిబ్బరంతో కష్టాలన్నీ భరిస్తుంటూ సంసారయాత్ర సాగిస్తూంటుంది. సన్యాసంమీద విరక్తిపుట్టిన కిష్టయ్య చివరికి మళ్ళీ సంసారంలో ప్రవేశిస్తాడు. ఇదే ఇందులో కథ. అల్లిక మొదటిదానికంటె బాగా నడిచింది. కథావ్యక్తులను కళ్ళకు కట్టినట్లు చూపించడం కోసం ఈయన బాగా జాగ్రత్త తీసుకుంటారు. ఈ కథలో వీరి పాత్రలు మరింత సజీవంగా కదులు తూంటాయి. వారి సంభాషణలు, లోకోక్తులు చదువుతూంటే మనం తెలుగుదేశంలో తిరుగుతూ ఆయా వ్యక్తులతో మాట్లాడుతున్నట్లె ఉంటుంది.

ఈయన చిన్నతరంవారిలో బాగా ముందుకు వస్తున్న కథకులు. కథకుని కుండవలసిన ఉత్తమగుణాలెన్నో ఈయన దగ్గిర కనబడతాయి.

అయితే వ్యావహారిక రచనలో ఈయన అంతగా జాగ్రత్త తీసుకుంటున్నట్లు కనబడదు. ఉదాహరణకు కావడికుండలలో 45 వ పేజీలో "ఏమైంజేంటి" అనే మాట తీసుకుందాము. మిగిలిన వ్యావహారిక సంభాషణలకీ ఈ మాటకీ పొత్తుకుదరక బాగా ఎబ్బెట్టుగా వినిపిస్తూంది. ఇల్లాంటి చిన్న చిన్న దోషాలు జారనీయకుండా ఇకనింపైనా వీరు జాగ్రత్తపడగలరని ఆశిస్తున్నాను.

---

## పాలతరగలు

[కథాసంపుటి]

కోట శ్రీరాములు. ప్రకాశకులు. ప్రకృతి కార్యాలయం ట్రస్టు; విజయవాడ. వెల: రెండు రూపాయలు.

ఇందులో పదమూడు కథ లున్నాయి. వీటి అన్నింటిలోను వరకట్నాలు, భార్యాభర్తల కలహాలు, కోడంటికాలు, అల్లుళ్ళ అలకలు మొదలైన సాంప్రదాయిక సంఘవ్యవహారాలన్నీ కథావస్తువులుగా వస్తాయి. అనగనగా ఒక రాజు. ఆరాజుకేడుగురు కొడుకులు అన్నట్టుగా ఈ కథలన్నీ సాఫీగా నడిచిపోతూంటాయి. అయితే అనగనగా అని మొదలుపెట్టిన కథ చివరికి వచ్చేసరికి చాలా చమత్కారంగా ఆఖరవుతుంది. అయితే ఈ కథల్లో చివర ఇల్లాంటి చమత్కారా లేవీ కనబడవు. కథలన్నీ ఒక పత్రికా విలేకరి జరిగిన సంగతులు వరసగా వ్రాసుకుపోతూన్నట్లుగా హుషారుగా నడుస్తాయి. ఇందులో కొన్ని కథలు మరీ ప్రకృతి వైద్యం పథ్యంలాగ పాఠకులకు ఆరోగ్యకరంగా ఉంటే ఉండవచ్చును గాని అంత రుచిగామాత్రం ఉండవు.

ఈ కథ లన్నిటిలోను 'కమ్మని వలపు' అనే చివరి కథే కొంత సంతృప్తికరంగా ఉంది.

మొత్తంమీద ఈ కథ లన్నిటిలోను కథ చెప్పడంలో పెద్దలోపాలు కనిపిస్తున్నాయి. కథకు లీ విషయంలో ఇంకా బాగా జాగ్రత్తపడాలి.

---

## జీవనగమన ప్రసూనము

[కవిత]

చదలవాడ పిచ్చయ్య. సవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు. కాపీలకు: సెంట్రల్ బుక్ షాపు, మెయిన్ రోడ్, విజయవాడ 1. వెల: ఒక రూపాయి.

ఈ రచయిత మొదట కొంతకాలం సాంప్రదాయికమైన హైందవ ధర్మసూత్రాల నమ్మకం పుచ్చుకొని తదాచరణకోసం పాటుపడ్డారు. తదనంతరం అవి విడిచిపెట్టి పూర్తిగా మార్క్సిస్టుగా మారిపోయారు. కొంతకాలం ఆ మార్క్సిస్టు పంథా గందరగోళంలో కిందామీదా పడి, ఉక్కిరిబిక్కిరై, దానిమీద తిరుగుబాటుచేసి మళ్ళీ మొదటికివచ్చి ఈ "జీవనగమన ప్రసూన" రచన కుపక్రమించారు. హైందవ ధార్మికదృక్పథానికీ, మార్క్సిస్టు దృక్పథానికీ ఉత్తరదక్షిణ ధ్రువాలకున్నంత తేడా ఉంది. చాలావరకు సాంఘిక విషయాలలో ఈ దృక్పథాల లక్ష్యాలు ఒకటే కావచ్చును. కాని ఈ లక్ష్యసాధన కోసం చేసే ఆచరణలోనే పెద్ద తగాదా వస్తుంది. ఈ దృక్పథాల యోగ్యతా యోగ్యతల విషయంలో ఇంకా—ఈవేళదాకా—తీవ్రంగా వాదోపవాదాలు సాగుతూనే ఉన్నాయి. చదలవాడ పిచ్చయ్యగారీ గ్రంథానికి వ్రాసిన నాంది చదివితే ఆయనలో జరిగిన పరివర్తన—సూచనలు కనిపిస్తాయి. కొందరికి కొన్ని విషయాలలో కొన్ని ఇష్టానిష్టా లేర్పడతాయి. ఆ ఇష్టానిష్టాలు సర్వథా ఆచరింపదగినవే అని నిరూపించడానికి తరహా మనుష్యులు తమతమ మేధాసంపత్తి ననుసరించి కొన్నికొన్ని సిద్ధాంత గోపురాలు కట్టుకుంటారు. చాలామంది జీవితాంతం వరకు అలాంటి గోపురాలలోనే హాయిగా కాలక్షేపం చేస్తుంటారు. ఆ గోపురాలు కూలినపుడు కొందరు మళ్లీ కొత్తకట్టడాలు ప్రారంభిస్తారు. పిచ్చయ్యగారీ రెండోవర్గానికి చెందిన వ్యక్తిలా కనిపిస్తారు.

ఇక వీరి కవితవిషయం. దీనిలో గీతపద్యాల్లాంటి రచనలు మొదలుకొని అనేకమైన మాత్రాచ్ఛందస్సులు కొల్లుకొంటాయి. అలాగే "రాగ అనురాగ" లాంటి వ్యాకరణ విరుద్ధసంధులు, ప్రయోగాలు అక్కడక్కడ దొర్లుతుంటాయి.

ఈయన రచనలో తపన, నిజాయితీ కనిపిస్తాయిగాని, ఈ రెండు కవిత్వంగా మారిన ఘట్టాలు చాలాస్వల్పం. అసలు పిచ్చయ్యగారిలో ఉన్న కవితాశక్తి చాలా స్వల్పం. మొత్తం 22 పుటల రచనలోను కవిత్వస్థాయికివచ్చిన పంక్తుల సంఖ్య ఇరవైముప్పైకన్న ఎక్కువ ఉండదు. 'జ్ఞాన జిజ్ఞాస'తో తను 'అదృశ్యమయిని' అన్వేషించడంలో రచయిత పడిన తపనే ఈ కావ్యవస్తువని పాఠకులకు స్ఫురిస్తుంది. కాని ఈ వ్యంగ్యం మొట్టమొదట కొంచెం క్లిష్టంగా కనబడి, తరవాత తరవాత స్పష్టపడుతుంది.

ఈ క్రింద ఉదాహరించిన ఒకటి రెండు ఘట్టాలనుబట్టి వీరి రచనాస్వభావం గ్రహింపవచ్చును.

"ఈ నిశీథి తెలియరాని విధాన ఎవరికొరకు ?
ఎవరికొరకు ? గాలించి తిరిగినాను
ఆమెకొరకు ఆనందాబ్ధి నామెకొరకు
వెదకి వెదకి వేసారి విసిగినాను

ఆగ్రహావేశపరుడనై అలసినాను
పొంగినాను కంపితమతినయి పోయినాను
విడిచినాను వేడి నిట్టూర్పులు విడిచినాను
కంట దడియారగా ఏడ్చి కౌగినాను
గొంతు విడరాని వేగాన గోడు పెట్టి
ఎన్ని నోములు నోచిన దీక్షల మొక్కి
ఆగిఆగి నిదానించి నిరీక్షించి అర్థమవక
ఆరయగా నేను జ్ఞాన జిజ్ఞాసినయితి."

ఈ రచన చివరిభాగంలో ఈ చివరి పంక్తులు కూడా పరిశీలింపదగినవే.

"కన్నవన్నీ కలసి
విన్నవన్నీ తెలసి
జ్ఞాన జిజ్ఞాసలో
కలసి వడపోయగా
కరుణమా మనసాయెనూ
కరగి కడలైపోయెనూ."

రచయిత తాను చెప్పదలచుకున్నదంతా పై నాలుగు పంక్తులలోను స్పష్టంగా స్ఫురిస్తున్నది.

ఈ కావ్యానికి తెలికిచర్ల వెంకటరత్నం, శ్రీ నాళ్ల వెంకటేశ్వరరావు, పా. వే. రాజమన్నారు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, విశ్వనాథ సత్యనారాయణ మొదలైన ప్రముఖులంతా పీఠికలు వ్రాశారు. వీరిలో చాలామంది ప్రశంసించినంత గొప్పదనం దీనిలో కనబడదు. అయితే కొంత మొహమాట పడి వీరీవిధంగా వ్రాసిఉంటారని తోస్తుంది. ఇలా మొహమాటపడడం ఈనాటి పీఠికాకర్తలలో చాలామందిలో కనిపిస్తూంది. నేటి తెలుగు వాఙ్మయంలో ఇది ఎంత తొందరగా పోతే అంత మంచిది.

---

## ఎచ్చటికోయ్

[కవిత]

చదలవాడ పిచ్చయ్య. సంస్కృతి ప్రచురణలు, విజయవాడ. వెల: నాలుగు అణాలు. ఇందులో పిచ్చయ్యగారు ప్రత్యేకంగా చెప్పదలుచుకున్నదేమీ లేదు. శ్రీశ్రీ "మరో ప్రపంచం"లో జనాన్ని 'పదండి ముందుకు' అని ప్రబోధిస్తే ఇందులో వీరు అంత కంగారుగా ముందుకు పరుగెత్తడం చాలా తప్పనీ, తొందర పడకూడదనీ, కాస్త తమాయించాలనీ ప్రబోధిస్తారు. శ్రీశ్రీ రచన ప్రచారమార్గం దాటి కవిత్వపాకంలో పడిందిగాని పిచ్చయ్యగారి రచనమాత్రం చివర దాకా ప్రచారంగానే సాగిపోతుంది. ఇందులో వీరు తికమక లేవీ లేకుండా స్పష్టంగా తమ అభిప్రాయాలన్నీ చెప్పివేస్తారు—కవితాభినివేశం ఉన్నవారిది చదవక్కరలేదుగాని చదలవాడవారి అభిప్రాయాలు తెలుసుకోవాలనుకుంటే ఇది చదవవచ్చును—తమభావం పాఠకులకు స్పష్టంగా తెలియాలనిగాబోలు—వీరి పుస్తకంమీద "ఒరులకు దా నెరవక తిన, కొరులు వెఱవకుండునట్టి యొప్పెడు సమతం, దిరమైన నడువడింగల, పరిణతచిత్తుండు సూవె బ్రాహ్మణు డనఘా!" అనే భారతపద్యం ఉదాహరించారు. ఇంకా కుతూహలం ఉన్నవారీ రచనలోని ఈ చిన్నఘట్టం చదివితే చాలుననుకుంటాను.

"పోటీపడడం యెందుకురా?
గొప్పలు గొప్పలు పలుకకురా!
ఉన్న యథార్థం చూడుమురా!
కన్నది భావన చేయుమురా
జీవనగమనము తెలియుమురా
ఎచ్చటినుండీ యెచ్చటికో
వెళ్ళే దెళ్ళే దెచ్చటికో

అంచలంచలుగ మార్గమురా
అందరందరికి తెలుపుమురా
ఎచ్చటికోయ్! మన మెచ్చటికోయ్
ఇల్లెల్లే దెచ్చటికోయ్.

---

## మేడ మెట్లు

[కథల సంపుటి]

బుచ్చిబాబు. దేశి కవితామండలి, గవర్నర్ పేట, విజయవాడ. వెల లేదు.

దీనిలో 'మేడ మెట్లు' 'నన్ను గురించి కథ వ్రాయవూ' 'దేశం నాకిచ్చిన సందేశం' అనే మూడు కథలున్నాయి.

'మేడమెట్లలో' 'కొండయ్య' అనే వ్యక్తికీ, ఘనం అనే యువతికీ మధ్య నడిచిన ప్రేమగాథ కథావస్తువు. అయితే ఈ ప్రేమ 'అరుణ' అనే ఆ పిల్లతల్లి అసూయవల్ల భగ్నమైపోతుంది. 'ఘన'మే చివరికి కళ్యాణి అవుతుంది. కొండయ్య ఆమెను సమీపించబోతూ మేడమెట్లుజారి కింద పడిపోతాడు. కథ దుఃఖాంతంగా ముగిసిపోతుంది.

అయితే ఈ కథలో చివర జరిగిన దుఃఖాంత సంఘటనకు తగినంత పూర్వరంగం కనిపించడం లేదు. కథ మలిచి చెప్పడంలోను, చివరిదాకా పాఠకునికి ఉత్కంఠ కలిగించటంలోను రచయిత కనబరచిన నైపుణి చివరికి ఘట్టంలోకి వచ్చేసరికి నిష్ఫలమై కథ అస్పష్టంగా ముగిసిపోతుంది.

ఈ సంపుటిలోని మిగిలిన రెండుకథలు నేటి కాలపు కథలలో పరిగణింపదగిన ఉత్తమ కథలు.

'నన్ను గురించి కథ వ్రాయవూ' అనే శీర్షిక దగ్గరనించీ పాఠకునికి ఈ కథలో ఔత్సుక్యం రేకెత్తుతూ ఉంటుంది. ఇది సామాన్య సంసారంలో కష్టసుఖాలు అనుభవిస్తూ మౌనంగా తన మనోభావం ప్రకటించకుండానే ఆత్మార్పణ చేసిన 'కుముదం' జీవిత కథ. కథ ఏమీ చెప్పవలసింది లేదంటూనే కథకుడీ కథ చెప్పుకుంటూ వెళ్లిపోతాడు. కథా కథనంలోను, సున్నితమైన స్వభావ చిత్రణంలోను, కథకుడు చూపించిన కౌశలం ప్రశంసనీయమైనది.

ఇక 'దేశం నాకిచ్చిన సందేశం'లోని వ్యంగ్య పూరితమైన అవహేళనం చాలా నిశితంగా నడిచింది. ధన సంపాదనమే కేవల పరమార్థంగా కొలిచే సాంఘిక దృక్పథం కథావస్తువుగా తీసుకుని దానిని అవహేళన చెయ్యడంలోను, ఆ విషయం పాఠకుల హృదయాలకు హత్తించడంలోను, రచయిత చక్కని నైపుణి చూపించారు.

కథా రచనలో ఎన్నదగిన సామర్థ్యం కల ఈ రచయిత కథలలో అక్కడక్కడ తెనుగు నుడికారం కుంటుపడిపోవడం ఒక లోపం. దీనికి 'నన్ను గురించి కథ వ్రాయవూ'లోని కొన్ని వాక్యాలిక్కడ ఉదాహరిస్తున్నాను. "తన వ్యక్తిత్వాన్ని గుర్తించుకుని, దాని ప్రభావాన్ని ఇతరులకి తెలియజెయ్యాలన్న హిందూ స్త్రీని మొట్టమొదటగా కుముదంలో చూడగలిగాను. ఆమె వొక జీవి; ప్రత్యేకమైన వునికి గలది. ఆమెను తొలిగిస్తే ప్రపంచంలో కొంత పవిత్రమైన ఖాళీ ఏర్పడుతుంది. నేను చూసిన స్త్రీలు వివాహం జరిగినరోజునే జనించినవాళ్లు. భర్తను పొడిగిస్తే స్త్రీ ఔతుంది. ఇంకా పొడిగిస్తే భర్త సంతానంగా మారతాడు; అతను గతించగానే ఆమె స్థూలజీవితం సమాప్తమౌతుంది. సృష్టిని ఆహ్వానిస్తూ తెరుచుకున్న తలుపులు భారత స్త్రీలు. తెరుచుకోని తలుపులు లేవు. ఏదైనా వొక తలుపు పాడై తెరుచుకోనినాడు దాన్ని గురించి చెప్పుకుని మరమ్మత్తు సంకల్పించాలి"—అని ఇలా ఈ రచన సాగిపోతుంది. ఈ వాక్యాలలో చాలాభాగం రచయిత ఆంగ్లంలో భావించి తెలుగులో వ్రాసినవి.

ఈ రోజుల్లో ఆంగ్ల విద్యార్థులు ఆంగ్లభాషా కారకాలతోను, సంస్కృత విద్యార్థులు సంస్కృత

వాక్యవిన్యాసాలతోను వ్యావహారిక భాషారచన చెయ్యడం ఒక పరిపాటిగా కనిపిస్తున్నది.

వ్యావహారిక భాషా రచయితలు తెలుగు నుడికారం విషయంలో జాగ్రత్తపడడం చాలా అవసరం. ఈ రచయిత భాషావిషయంలో ఇంకా కొంత శ్రద్ధ పట్టగలరని ఆశిస్తున్నాను.

౧ భార్యలోనే వుంది.

౨ దేశం ఏమయ్యేటట్టు?

3 గీతా పారాయణం.

ఈ మూడు పుస్తకాలు రచించినవారు గోపీచంద్. చిరునామా దేశికవితా మండలి, విజయవాడ.౨. ఈ మూడింటికీ కూడా ఈ పుస్తకాల్లో పీఠికలు కనబడడం లేదు.

ఇవి కథల సంపుటాలని పుస్తకాలమీద ఉన్నది గాని ఈ మూడింటిలోను ఉన్నవి చాలావరకు చిత్రణాలే.

'భార్యల్లోనే ఉంది' అనే కథాసంపుటిలోని కథలన్నిటికీ కొద్దోగొప్పో స్త్రీ సమస్యలతో సంబంధం ఉండడంమూలాన్నే రచయిత దీనికీ పేరు పెట్టారు.

ఈ కథా సంపుటిలోని 'భార్యాభర్తలు' 'ఆన మళయాళం' అనేవి రెండుమాత్రమే కథలనడానికి తగినవిగా ఉన్నాయి.

'దేశం ఏమయ్యేటట్టు?' అనే సంపుటిలో ఈ పేరుగల కథ ఒకటే ఉన్నవాటిల్లోకల్లా బాగుంది. దీనిలో ఆయా రాజకీయపక్షాలు తమతమ పక్షస్వార్థాలు మాత్రమే లక్ష్యంగా పెట్టుకుని మొత్తం దేశం సంగతి మరిచిపోయిన విషయం రచయిత చక్కగా స్ఫురింపజేశారు. ఇక ఈ సంపుటిలోని మిగిలిన రచనలలో 'కార్యశూరుడు' ఒకటే ఆకారాన్నిబట్టి కథగా కనిపిస్తుంది.

ఇక మిగిలిన 'గీతా పారాయణం'లో 'సంపంగ పువ్వు' ఒక్కటే ఎన్నదగిన మంచికథ.

మొత్తం మూడు పుస్తకాలలోను రచయిత చాలా ఆశావాది దృక్పథంతో జీవిత సమస్యలపై తన అభిప్రాయాలు వెల్లడిస్తున్నట్టు కనిపిస్తుంది. ఈయన అములలో ఉన్న రాజకీయ దృక్పథాలన్నీ అవహేళన చేస్తున్నట్టే కనిపిస్తారు. ముఖ్యంగా ఈకథలన్నిటిలోను రచయిత తన అభిప్రాయ వ్యక్తీకరణకే పాత్రలను ఉపయోగించుకుంటారు. కాని ఇలాగ చూసినా ఈ రచనకొక నిర్దిష్టమైన జీవితదృక్పథం ఏదీ ఉన్నట్టు తోచదు. ఇలాంటి దృక్పథం ఏదీ లేకపోవడంవల్లనే ఈ రచనలో నిజాయితీ బాగా లోపించిపోయింది. ఈ రచయిత ప్రస్తుత సాంఘికార్థిక పరిస్థితులమీద కొంత తిరుగుబాటుదనం చూపించినా — ఈ తిరుగుబాటుదనం బలంగా పాఠకుల హృదయాలకు హత్తుకోవడంలేదు. మొత్తంమీద ఈ రచనలన్నీ ఊరికే కులాసాకోసం చదువుకోదగ్గవే. వీటిలో ఉత్తమ కథలనిపించుకోదగ్గవి చాలా తక్కువ.

మంచి చురుకైన జాతీయ వ్యావహారిక భాష ఒక్కటే ఈ కథా సంపుటాలలో ప్రత్యేకంగా ఎన్నదగిన గుణం.



Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No 7, Thambu Chetty Street, Madras. Edir to: S. Samdbhu Prasad.



 "యమునా తీరే—" చిత్రకారుడు: శ్రీ యం. ఎ. రహీం.



ఖర మాఘము

భారతి

సంపుటము 29 సంచిక 2

# అవనీంద్రస్మృతి



శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

కునికిన దాస్యజీవన విఘూర్ణిత జాతికళా ప్రదీపికన్
దన యతిలోక భావపరిణాహసముజ్జ్వల కాంతిధారచే
పునరుపలబ్ధ భవ్య సుషమోచ్ఛ్వసనమ్ముగ జేసి వెల్గులన్
నినిచిన దివ్యశిల్పి యవనీంద్రుడు నేడు జగాన లేడకే!

ఒక పదిమంది భావుక మహోదయశాలురలో యెడందలన్
జికిలి యొనర్చి భారత విశిష్టనవీనకళా మహస్సు చం
పక మృదుసార భాకలిత భావనగా మొనయించె; వారునున్
బ్రకటిత విశ్వమోహన కళాప్రతిభావిజయ ప్రభాసితుల్!

ఉత్తమ శిల్పలక్ష్యములు, నూర్జిత సర్వ కళారహస్యముల్
గుత్తగొనంగ, నాతని యొకొక్క వినూత్న కళాప్రయత్నమున్
గ్రొత్తగ సంతరించె దళుకొత్త, కళాఢ్యుల వారి పోకలన్;
మొత్తమునన్ని ఫక్కికలు బుట్టెను బో యవనీంద్రు తూలికన్!

చిక్కని భావనాపటిమ, చేవలుదేరు కళాప్రభుత్వ స
మ్యక్కమనీయ విన్యసనమాధురి, మార్మిక రేఖ తెల్లమై
చొక్కపు చిత్రజాలముల చోద్యముగా మెరుగొందు; నైననున్
నిక్కపుటింద్రజాలమెదొ నిండిన దాజిలుగొందు కుంచియన్!

మొగలుల చిత్రలేఖన విమోహనచాతురి, సూక్ష్మరేఖలన్
సొగసగు రాజపుత్ర సరసోజ్వల రాగ కళానుభావమున్
జగదభిరామ హేతువు నజాంత కళామహనీయ భావమున్
బగటుకొనంగ నందముల మర్త్యులకున్ దయసేయ బోయెనో!

మనకిక దూరమయ్యె ననమాన కళా మహనీయ కేళికుం
డని మదిలో నదోయొక మహాంధ్యము గ్రమ్మెడు; నైననంతలో
నన యవనీంద్ర చంద్రమునునంత సుధామధుదీప్తిదోచి, యా
యన చలువల్ దొలంకు తరళాశిషమున్ మది నూహసేసెదన్



# భౌతికశాస్త్రము-తత్త్వజ్ఞానము



శ్రీ విస్సా అప్పారావు

బాహ్యప్రపంచముయొక్క స్వరూపస్వభావములను తెలిసికొనుటకై శాస్త్రజ్ఞానము తోడ్పడుచుండును. నిత్యజీవితమునకు సంబంధించిన విషయముల గురించియే కాకుండా, అనాదినుండి జిజ్ఞాసువులకు గల మానసికములగు గొప్ప సమస్యలగురించికూడా, శాస్త్రజ్ఞానము తోడ్పడుచుండును. జీవితపరమార్థమేమి, ఈవిశాల ప్రపంచమందు మనకుగల స్థానమెట్టిది, మృత్యువును జయించి శాశ్వతత్వమును పొందగలమా, కడపటి సత్యమననేమి, అను ప్రశ్నలకు సమాధానములకై శాస్త్రవిచారమును చేయుచుందుము.

శాస్త్రపరిశోధనకై చేయు ప్రయత్నములు హిమాచల పర్వతారోహణ ప్రయత్నములవంటివి. పైకిపోయినకొలది వాతావరణము నిర్మలమై, దృష్టి విశాలమగుచుండును. ఒక్కొక్క శిఖరము పైకెక్కుచు, దానిపైనుండి పూర్వపు సంకుచితాభిప్రాయములను విశాలముజేసికొనుచు, విజ్ఞానవికాసమును, ఉత్సాహశక్తిని, క్రమముగా పెంపొందించుకొనుచు పైపైశిఖరముల కెగబ్రాక ప్రయత్నించుచుందుము. ఇది అంతులేని ప్రయత్నము. తీరని అన్వేషణ—సత్యాన్వేషణ.

గడచిన 25–30 ఏండ్లలో నుక్రమాభివృద్ధిపొందుచున్న నవీన భౌతికశాస్త్ర (*Modern Physics*) పరిశోధనాఫలితము లీతీరని యన్వేషణలో ఎంతవరకు పరికరించుచున్నదో తెలిసికొందాము.

## 1. సాంప్రదాయక భౌతికశాస్త్రము

## (Classical physics)

న్యూటన్ శాస్త్రజ్ఞుడు గతిశాస్త్రము (*Dynamics*) నకాధారములగు (*Laws*) ను ప్రతిపాదించినాడు. గతిశాస్త్రముతో, సూర్యకుటుంబమండలి గ్రహగతులను, గ్రహణాదులను లెక్కింపగలుగుచున్నాము. బండ్లు, ఓడలు, విమానములు, మోటారులు మొదలగు సర్వయంత్రములకు గతిశాస్త్రము అమోఘముగా తోడ్పడుచున్నది. గతి శాస్త్రబద్ధమగు బ్రహ్మాండమైనయంత్రమువలె, ఒక నిశ్చితమగు మార్గానుసారముగా, సర్వప్రపంచము సాగిపోవుచున్నదని, అట్టి ప్రపంచమందు మానవసంకల్పమునకు—ప్రపంచమార్గమును సవరించుటలో—తావులేదని, ఆ మహాయంత్రబంధమునుండి విడిపించుకొనగల స్వేచ్ఛ, దానిని ధిక్కరించగల అధ్యాత్మశక్తి, మానవునికిలేవని, అభిప్రాయములు భౌతికశాస్త్రవేత్తలలో కరడుగట్టిపోయినవి.

మరియు, ఇంద్రియగోచరమగు ప్రపంచమునకు భిన్నమైన ప్రపంచములేదని, సర్వజ్ఞానమునకు యింద్రియములే ద్వారములని, అతీంద్రియజ్ఞానమునది యుండుట యసంభవమని, అసత్యమని, (*World is Subjective and not objective*) అను వాదము ప్రబలమైనది. ఇట్టి వాదమును చేయువారిని (*Positivists - realists*) వ్యక్తివాదులనవచ్చును. వీరికి వ్యక్తిజ్ఞానమే ప్రమాణము—వీరిని వాస్తవికులని కూడ అనవచ్చును వీరికి జగత్తు వ్యక్తిభావనాత్మకము. వ్యక్తులభావనల కితరమై వారు భావించినా భావించకపోయినా సత్యమై, నిత్యమై, స్వతిస్సిద్ధమై, జగత్తున్నదను ప్రతివాదమునకు సత్తావాదమని పేరు—(సత్=ఉన్నది, సత్తు). ఇట్టివాదమునకు చెందినవారిని (*idealists*) సత్తావాదులనవచ్చును. వీరికి వ్యక్తీతర భావనే ప్రమాణము. భౌతికశాస్త్ర పురోగమనమంతయు ఈ వాద, ప్రతివాదముల ఫలమని చెప్పవచ్చును. వీరి సిద్ధాంత పూర్వపక్షముల మూలముగా శాస్త్రము వృద్ధి పొందినది.

ప్రయోగములచేత ప్రత్యక్షముగా తెలిసికోలేని విషయమంతా సత్యేతరమనే వాస్తవికుల వాదమునకు ప్రతివాదము లేకపోలేదు. సుమారు 150 ఏండ్లక్రిందట జాన్‌డాల్టన్, పరమాణువాదము

(*Atomic hypothesis*) ను, ప్రతిపాదించినాడు. పరమాణువులు ప్రత్యక్షముగా తెలిసికొనగలిగినట్టివి కావు, కాని అట్టి అప్రత్యక్ష. పరమాణువాదములో అమూల్యమైన రసాయనిక శాస్త్రవిషయములు గ్రహింపబడినవి. పరమాణు భారములు (*Atomic weights*) లెక్కింపబడినవి. అవి శాస్త్రమందు నిత్యముపయోగములో కలవు. కావున ఇవి సత్యములు కాక మరేమిటి.

## 2. నవీన భౌతికశాస్త్రము Modern physics

### (1) బోర్ సిద్ధాంతం (*Bohr's Atomic Theory*)

పరమాణువులు భేదింపవీలులేని ద్రవ్యకణములని (*Atoms-ultimate particles*) డాల్టను అభిప్రాయపడినాడు. 1900 సంవత్సర ప్రాంతమువరకు అదే సిద్ధాంతమని భౌతిక శాస్త్రవేత్త లభిప్రాయపడినారు. కాని పరమాణువులను భేదించవచ్చునని, అందు భాగములున్నవని—కేంద్రకము (*Nucleus*) దాని చుట్టు తిరుగు ఎలక్ట్రానులు (*Planetary electrons*), ఎలక్ట్రానులు తిరిగే కక్ష్యలు (*Orbits*) కలవని, పరమాణువు ఒక చిత్రమైన కట్టడము (*Structure*) వంటిదని, రూథర్ ఫర్డు, బోర్, అను ప్రముఖ శాస్త్రవేత్తలు ప్రతిపాదించిరి. ఈ నూతన వివరములతో పరమాణువాదమును పెంచి, క్రొత్త సిద్ధాంతము నొకదానిని బోర్ కల్పించినాడు. దానియాధారమున 1910—25 సంవత్సరముల మధ్యను అనేక భౌతికశాస్త్ర, రసాయనిక శాస్త్ర రహస్యములు వెల్లడైనవి. బోర్ కల్పించిన పరమాణు కట్టడములయందలి వివిధ వివరణలు ఊహామాత్రములే. ప్రత్యక్షముగా నిరూపింపగలిగినవి కావు. ఇంద్రియగోచరములు కావు. కాని, అంతమాత్రమున డాల్టన్, రూథర్ ఫర్డు, బోర్—ప్రతిపాదించిన పరమాణు వాదము సత్యేతరమని త్రోసివేయ వీలగునా అని ప్రతివాదము బలముగా సాగినది.

ఐనను బోర్ వాదము ఎంతవరకు సమర్థనీయము అను విషయమును పరిశీలించవలసియున్నది.

పరమాణు కట్టడములు ఒక్కొక్క పరమాణువున కొక్కొక్క రీతిని కల్పింపబడిన నమూనాలు—(*Atomic models*) అన్నింటికంటె బరువు తక్కువ గల ఉదజని, హీలియము, పరమాణు నమూనాలలో ఒకటి, రెండు, ఎలక్ట్రానులు మాత్రమే ఉండి, అవి ఒకటి, రెండు, కక్ష్యలలో (*Orbits*) తిరుగుచుండును. పరమాణువుల బరువు పెరిగినకొలది కక్ష్యలసంఖ్య పెరుగును. అందుచేత నమూనా కట్టడముల నిర్మాణము చిత్రవిచిత్రాకారములు కలిగి చిక్కుగా ఉండును.

ఉదజని కట్టడమందలి ఎలక్ట్రాను ఒక విధముగా ప్రవర్తించుననని యూహించి దానినిబట్టి ఉదజని వర్ణమాల (*Spectrum*) లోని వివిధరంగులయొక్క తరంగపు కొలతలను (*Wave-lengths*) బోర్, లెక్కగట్టి చూపెను. ఈ లెక్కించిన కొలతలు ప్రత్యక్షముగా ప్రయోగముల మూలమున కనిపెట్టిన కొలతలకు సరిపోయినవి. ఇట్లే హీలియము వర్ణమాలకుకూడ ఉపపత్తి (*Explanation*) బోర్ చే కల్పించబడెనది. కాని పరమాణువులు బరువైనకొలది వాటి వర్ణమాలల కుపపత్తి సంపూర్ణముగా సాధ్యపడలేదు. అందుచేత బోర్ విధానములో ఏదో ఒక లోటున్నదని స్పష్టపడినది.

మరియు, కేంద్రకము చుట్టు తిరుగు ఎలక్ట్రానుల వేగము (*Velocity*) గాని, కక్ష్యలలో ఎలక్ట్రాను ఆక్రమించియున్న స్థానము (*Position*) గాని బోరువిధానము వలన లెక్కించి తెలిసికో వీలు కలుగలేదు. హైడ్రోజను వర్ణమాలకు కావలసిన ఉపపత్తి గణితములో ఎక్కడను ఈ ఎలక్ట్రానుల స్థితి, గతి, ఉపయోగించవలసిన అవశ్యము కలుగలేదు. ఇది చాలా వింత విషయము. కక్ష్యలలో ఎలక్ట్రానులు నిజముగానే తిరుగుచూఉంటే, వాటి స్థితి, గతి, తెలియకుండుట అవి గణితమునందు లేకుండుట వింత గాదా. అందుచేత ఎలక్ట్రానులు కక్ష్యలలో తిరుగుచున్నవను ఊహ బూటకమా అను సందేహము ఏర్పడినది. పరమాణుకేంద్రకము చుట్టు ఎలక్ట్రానులు తిరుగుచుండును అను సందేహాస్పదమగు విషయమును ప్రవేశపెట్టుట చేత బోర్ సిద్ధాంతములో లోటు కల్గినదని, అందుచేతనే బరువైన పరమాణువులయొక్క వర్ణమాలలకు సరియైన ఉపపత్తి దొరకలేదని వ్యక్తివాదులు (*Positivists*) ఆక్షేపించిరి. వీరిలో ప్రముఖుడు హైజన్‌బర్గ అను జర్మను శాస్త్రజ్ఞుడు.

## II. (2) హైజన్‌బర్గు క్వాంటమ్ మెకానిక్సు

### *Heisenberg's Quantum Mechanics*

ఉహాకల్పితమగు పరమాణు నమూనాలను విసర్జించి, ప్రయోగములచేత ప్రత్యక్షముగా తెలిసికొనగలిగిన సామగ్రితో, ఒక సిద్ధాంతమును ప్రతిపాదించినచో అన్ని పరమాణు వర్ణమాలలకు పూర్ణముగ ఉపపత్తి పుట్టునని హైజన్‌బర్గు అభిప్రాయపడినాడు. వర్ణమాలలోని రంగులయొక్క తరంగపు కొలతలు (*Wave - lengths*) రంగులయొక్క ధాతు తీవ్రతలు (*intensity of Colours*) ప్రయోగములచే తెలిసికొనగల ప్రత్యక్ష విషయములు గనుక, వీటి నుపయోగించి క్వాంటమ్ మెకానిక్సు అను నూతన సిద్ధాంతమును 1926 లో, కల్పించినాడు. మేట్రిక్సు మెకానిక్సు (*Matrix mechanics*) అను నూతన గణిత విధానమును ఈ సిద్ధాంతమం దుపయోగించినాడు. పరమాణువుల వర్ణమాలలకు సమగ్రమగు ఉపపత్తిని ఏర్పరిచి చూపినాడు. ఇంకను నూతన విషయములను, గణితముచే, నిరూపించినాడు. అవి ప్రయోగములచే ప్రత్యక్షము చేయబడినవి. బోర్ సిద్ధాంతము కంటె హైజన్‌బర్గు సిద్ధాంతము సర్వాత్మనా మేలైనదని, స్పష్టమైనది. దీనినిబట్టి సత్తావాదము కంటె వ్యక్తివాదమే బలీయమని చెప్పవలసివచ్చినది.

### అనిశ్చయత్వ సూత్రము

### (*Principle of Uncertainity*)

హైజన్‌బర్గు సిద్ధాంతాంతర్గతమై, మూలాధార మనదగు అనిశ్చయత్వ సూత్రమునుగురించి కొంత తెలిసికొనవలసియున్నది.

వ్యవహారములో, నిత్య జీవితములో, అనేకముగా బండ్లు, యంత్రములు మొదలగువాని చలనమును గతిశాస్త్రముతో సాధించుచున్నాము. ఈ యంత్రముల బరువు ఎన్నో పౌనులు, మణుగులు ఉండును. అట్టి వానికి గతిశాస్త్రమెట్లుపయోగపడుచున్నదో ఒక చిన్న ఉదాహరణము వలన తెలిసికొనవచ్చును. నేలమట్టము నుండి సెకనుకు 100 అడుగుల వేగముతో పైకి నిటారుగా ఒక రాతిని విసిరినచో $3\frac{1}{8}$ సెకనుల తరువాత అది 156 అడుగుల ఎత్తున కెగిరి ఆగునని, అక్కడనుండి తిరిగి $3\frac{1}{8}$ సెకనులలో నేల మీదకు, సెకనుకు 100 అడుగుల వేగముతో, పడునని, లెక్క గతిశాస్త్రముచేత కట్టుచున్నాము. అనగా ఒక కాలమందు గల స్థితి—(*position*)—నేల మట్టము, గతి (*velocity*) సెకనుకు 100 అడుగులు, తెలిసినచో మరియొక కాలమందు—$3\frac{1}{8}$ సెకనుల తరువాత, దానియొక్క స్థితి—156 అడుగుల ఎత్తు, గతి—శూన్యము (ఏమంటే అంతవరకే వెళ్లి ఆగిపోయినది కనుక) లెక్కించ గలుగుచున్నాము. ఈ విధానానుసారమే గతి శాస్త్రము నుపయోగించుచున్నాము. ఇట్లే, పరమాణువులలో గల ఎలక్ట్రానుల యొక్క చలనమును గతి శాస్త్రముతో సాధించవచ్చునని బోర్ భావించినాడు. లెక్కలు కట్టినాడు. బోర్ విధానము సంపూర్ణఫలితముల నీయలేదు. ఇది ఎందు చేత, అని విచారణలు జరిగినవి. కాని ఫలితముగా 1927 లో సూక్ష్మద్రవ్య ఖండములగు పరమాణువుల యందు న్యూటను గతిశాస్త్రము సరిగా వర్తించ నేరదు అని హైజన్‌బర్గు తన సిద్ధాంతరీత్యా లెక్కించి చూపించినాడు. మరియు పరమాణువులయొక్క స్థితి గతి, రెండూ కూడా ఏకకాలమందు నిశ్చితముగా తెలిసికొనుటకు వీలులేదని, ఈ రెంటిలో ఒకదానిని నిశితముగా కొలిచినచో, ఈ కొలుచుట యను క్రియ వలన పరమాణువు గతి మారునని, కదలిపోవునని, అందుచేత రెండవదాని కొలత నిశితముగా ఉండదని స్పష్టపరచినాడు. రెండవ కొలతలో సంభవించు తేడాను—అనగా అనిశ్చయత్వమును, నిరూపించినాడు. ఈ నిరూపణకు అనిశ్చయత్వసూత్రమని (*Principle of Uncertainity or Principle of Indeterminacy*) పేరు. ఈఅనిశ్చయత్వముయొక్క పరిమాణము అతి సూక్ష్మమైనది. పరమాణువులయొక్క ద్రవ్యపరిమాణములతో పోల్చతగినంత తక్కువైనది. అందుచేత, పరమాణువుల గణితమందు దీనికి విలువ ఏర్పడుచున్నది. వ్యవహారమందు తటస్థించు పెద్ద ద్రవ్యఖండములయందీ అనిశ్చయత్వ పరిమాణమునకు విలువలేదు. అందుచేత స్థూలప్రపంచమందు (*macrocosm*) నిశితముగా ఉపయోగపడే గతి శాస్త్రము సూక్ష్మప్రపంచమందు, (*microcosm*) నిశితముగా ఉపయోగపడదు.

ఐతే ఎలక్ట్రానుని బరువింత, దాని విద్యుదావేశము (*Electric charge*) ఇంత, అని చెప్పుచున్నామే, అవి ఎలా లెక్కించినారు; గతి శాస్త్రముచేత నేగదా; అవి కూడ అనిశ్చితములేనా, యని సందేహము కలుగవచ్చును. ఎలక్ట్రాను బరువు ఇంత అను కొలత ఒక్కొక్క పరమాణువుమీద ప్రయోగములుచేసి గ్రహించినది కాదు. అసంఖ్యాకములగు పరమాణు సమూహముతో ప్రయోగములను చేసి నిశ్చయించినది. ఈ నిశ్చయము నిశితమైనదే. ఎప్పుడైనను, ఎవరైనను ఈ ప్రయోగములను తిరిగి చేసిచూచినచో వాటి ఫలితముగా ఈ కొలత ఏర్పడగలదు. ఇది దామాషాయీగా కట్టిన పరిమాణము. (*Statistical average value*) మన దేశమందు జీవితప్రమాణము 27 సంవత్సరములని చెప్పుచున్నాము. ఇది కోట్లాది ప్రజలలో ప్రతీవారి ఆయుర్దాయమని చెప్పవచ్చునా—చెప్పరాదు. వారందరి ఆయుఃప్రమాణముల యొక్క దామాషాయీయే, ఈ 27. ఇట్లే ఎలక్ట్రానుయొక్క బరువింత విద్యుదావేశమింత అనుపరిమాణములను గ్రహించవలసి యున్నది. ఒక్కొక్క పరమాణువుతో లెక్కించే కొలత లనిశ్చితములు. అసంఖ్యాకములగు పరమాణు గుంపుతో లెక్కించే కొలతలు సునిశ్చితములు— అను విషయము పర్యవసానము. ప్రతి పరమాణువుయొక్క నిజస్థితి ఈ దామాషా యీ కొలతలవలన తెలియదు. పరమాణువుల నిజస్థితి తెలుసుకునే మార్గము ఇంకను లభ్యము కాలేదు. ఒక విధముచే ఆలోచించగా ఈ దామాషా యీ లెక్కలు మిథ్యలని చెప్పవలసియున్నది. సత్యమును యింకొక రీతిని తెలుసుకొనుటకు వీలులేక, దామాషాయీ లెక్కలనే వాడుచున్నాము. స్థూల ప్రపంచ మంతయు పరమాణుగుంపుల మయము గనుక ఈ దామాషా ఈ లెక్కలు స్థూల ప్రపంచమందు సరి పోవుచున్నవి. మన జ్ఞానమంతయును దామాషాయీ జ్ఞానమే—బహుశః, ప్రాయశః (*Probable*) అని చెప్పేదే గాని ఇదమిత్థము (*True*) అని చెప్ప వీలు లేనిది.

## *11.* (3) ష్రాడింగరు వేవ్ మెకానిక్సు
## (*Shrodinger's Wave Mechanics*)

బోర్ కల్పించిన పరమాణు నమూనా(*Atomic Model*) తో, సంబంధము లేకుండా అట్టి నమూనాను పూర్తిగా విసర్జించి, ప్రత్యక్ష హాంశములను మాత్ర ముపయోగించి పరమాణువుల గురించిన సర్వ విషయములను సునిశితముగా హైసన్‌బర్గు నిరూపించినాడు. పరమాణు నమూనాలోని లోట్లు హైజన్‌బర్గును బాధించినంతగా ఇతర భౌతికశాస్త్రవేత్తలను బాధించలేదు. అట్టి వారిలో ప్రముఖులు లూయీ డి బ్రాగ్లీ (*Louis de Brogli*), ష్రాడింగరు అనువారు. పరమాణు నమూనాను పూర్తిగా విసర్జించక, అందలి లోట్లను సవరించి, ఒక నవీన సిద్ధాంతమును కల్పించి, పునరుద్ధరించ వలెనని వారు పూనుకొనిరి.

ఎలక్ట్రానులు, ప్రోటానులు, సూక్ష్మములగు ద్రవ్యకణములు (*Particles*) అని, కొన్ని సందర్భములలో అవి కాంతి (*Light*) ని వెదజల్లునని (*Radiate*), అట్టి కాంతి (*Radiation*) తరంగ రూపమున ప్రసరించునని శాస్త్రజ్ఞులు భావించుచుండిరి. కణములకు, తరంగములకు గుణములలో భేదమున్నది, రెండింటికిని ఎట్టి సంబంధముండ వీలులేదు కణములు ద్రవ్యమయములు, తరంగములు శక్తిమయములు; ద్రవ్యమునకు, శక్తికి, ఏమియును సంబంధము లేదు; అని శాస్త్రజ్ఞులు భావించుచుండిరి. పరమాణు కేంద్రకమును చుట్టితిరుగు ఎలక్ట్రానులు కణములని బోర్ భావించెను. వాటి స్థలనిర్దేశము చేయబూనెను గాని సాధ్యముకాలేదు. కక్ష్యలలో తిరుగు ఎలక్ట్రానులు కణములవలెగాక తరంగములవలె ప్రవర్తించినచో, తరంగములు వ్యాపించు స్వభావము కలవి గనుక, అవి కక్ష్య నంతటను వ్యాపించినచో ఒక స్థలనిర్దేశముచేయుట అను విషయమునకు చోటుండదు. కనుక ఈ కారణములచేతనే ఎలక్ట్రానుల స్థలనిర్దేశము చేయ వీలుపడలేదేమోయని డిబ్రాగ్లీ తర్కించుచున్నాడు. తరంగములు (*Radiation*) కణముల (*Photons*) వలె ప్రవర్తింమునని 1923 లో కాంప్టన్ (*Compton*) శాస్త్రజ్ఞుడు ప్రయోగములనుచేసి చూపించినాడు. అట్లే కణములుమాత్రము తరంగములవలె ఏల ప్రవర్తించకూడదని డిబ్రాగ్లే తర్కించుచున్నాడు. ఎలక్ట్రాను,తరంగమువలె వర్తించినప్పుడు, కలిగే ఎలక్ట్రాను తరంగము (*Electron wave*) నకు ఒక నిర్ణీతమగు కొలత (*wave - length*) ఉండునని ఆకొలతను ఎలక్ట్రాను బరువుతో చేర్చి లెక్కించవచ్చునని డిబ్రాగ్లీ సూచించినాడు. ఎల

ట్రాను—తరంగము ఎక్సురేతరంగములతో సమానమగు కొలతగలదని లెక్కగట్టి చూపినాడు. ఐతే ఎలక్ట్రానులు తరంగములవలె ప్రవర్తించునని ప్రత్యక్షముగా ప్రయోగములచేత నిరూపించినగాని డిబ్రాగ్లీ ఊహ నిజమని స్థిరపడదు. 1927 లో డావిజన్, గర్మర్ అనువారిద్దరు ఎలక్ట్రానులు కాంతి వలెనే ప్రవర్తించుచున్నవని ప్రయోగమూలకముగా నిరూపించినారు. డిబ్రాగ్లీ యభిప్రాయమును రుజువు చేసినారు.

డిబ్రాగ్లీ అత్యద్భుతమైన నూతనాభిప్రాయమును శాస్త్రమునందు జొప్పించి భౌతికశాస్త్రమునకు అతినవీనమగు మెరుగును పెట్టినాడు. కణము (*particle*) తరంగము (*wave*) రెండూ అవినాభావములని, ఏదో ఒకవస్తువు ఒకసారి కణమువలెను మరియొకసారి తరంగమువలెను ప్రవర్తించుచున్నదని, డిబ్రాగ్లీ నిరూపించినాడు. ఈనూతన వస్తువును కణమనీ, తరంగమనీకూడా చెప్పవలసి వచ్చినది. అందుచేత దీనికి కణ—తరంగమని (*wave Particle or wavicle*) పేరుపెట్టిరి. కణమును, తరంగమును వేరువేరుగా ఊహించగలుగుచున్నాము. కాని, కణ—తరంగమను సమ్మేళన వస్తువును ఊహించనీలులేకున్నది. కాని అట్టిదొకటి ఉన్నది అని, అది వాస్తవమైనదని, చెప్పకతప్పదు. అది అనిర్వచనీయమైన వింతవస్తువు.

హైడ్రజనుపరమాణువు కణమేగనుక అట్టి వస్తువని, కణతరంగమని, భావించవలసియున్నది. ఆవస్తువు స్పందించుస్వభావముకలది. అట్లు స్పందించునప్పుడు తరంగముపుట్టుచుండును. స్పందించు రీతిఏదో, ఆవస్తు వేదో తెలియదు. ఇది ఒక నిగూఢమగు మర్మము.

ఈ విషయముల నన్నిటిని నాధారము చేసికొని పరమాణు నమూనా నొకదానిని ష్రాడింగరు భావించినాడు. హైడ్రజను పరమాణువును నీటిబిందువు వంటిదని భావించి, సంప్రదాయ గణితముప్రకారము నీటిబిందువు స్పందించుటచే కలిగే తరంగముయొక్క సమీకరణము (*Wave-equation*) ను పోలిన ఒక సమీకరణమును సృష్టించినాడు. అట్టి సమీకరణముతో ప్రారంభించి, గణితమును చేసి పరమాణువులయొక్క వర్ణమాలలోని వివిధ విషయములకు సరియైన నిష్పత్తిని కనిపెట్టినాడు. ఈ గణిత మార్గమునకు వేవ్ మెకానిక్స్ (*Wave-Machanics*) అని పేరు. మరియు భౌతికశాస్త్రమందు ఇదివరలో కనిపెట్టబడి ఉపపత్తి లేని విషయముల కన్నింటికిని వేవ్ మెకానిక్సు ఉపపత్తిని కల్పించగలిగినది. అనిశ్చయత్వ సూత్రమునుకూడ వేవ్ మెకానిక్సుతో నిర్వచింపవచ్చును. అందుచేత ష్రాడింగరు సిద్ధాంతము సర్వసమగ్రమని నిశ్చయింపబడినది. అదిగాక, దీని గణిత విధానము హైజన్‌బర్గ గణితపద్ధతికంటె చాల సులువైనది కూడా.

కనుక ప్రత్యక్షమే ప్రమాణమను హైజన్‌బర్గు సిద్ధాంతము, అప్రత్యక్షము ప్రమాణముగాగల ష్రాడింగరు సిద్ధాంతము — రెండూకూడా—ఒకే సత్యమును నిరూపించుచున్నవి. ఈ రెండువాదములకు పర్యవసానమున భేదములేదని స్పష్టపడినది. విరుద్ధ ప్రమాణములతోకూడిన సిద్ధాంతములకు పర్యవసానమున భేదములేకుండుట సిద్ధించినది. ఇది ఒక గొప్పవిషయము.

మరియు, ఈ ష్రాడింగరు సిద్ధాంత మందింకొక నిగూఢమగు, వింతవిషయ మున్నది. కాంతి తరంగములు (*light waves*) ఆకాశము (*space*) నందు, శబ్దతరంగములు (*Sound waves*) గాలియందు ఆధారపడి యున్నట్లు కణ-తరంగ స్పందనముచే పుట్టు తరంగములు ఒక వింత ఆకాశమందు ఆధారపడి యున్నవని ష్రాడింగరు గణితమువలన తెలియుచున్నది. మన మెరిగిన ఆకాశమును (*oridnary space*) పొడుగు, వెడల్పు, ఎత్తు అను మూడు నిరూపకముల (*Co-ordinate*) మూలమున తెలిసికొనుచున్నాము. కణతరంగములయందు గర్భీభూతమైన వింత ఆకాశమునకు నిరూపకములు మూడింటి కంటె ఎక్కువగా ఉండును. హైడ్రజను కణ-తరంగమందు మాత్రము మూడే ఉండును, హీలియముయందు ఆరు ఉండును. ఇట్లే బరువుపెరిగిన కొలది పరమాణువుల లోని ఆకాశముయొక్క నిరూపకముల సంఖ్య పెరుగుచుండును. మూడింటికి దాటిన నిరూపకములుగల ఆకాశమెట్టిదో ఊహించవీలులేదు.

ఈ వింత ఆకాశమందుండు తరంగములు మనకు తెలిసిన తరంగములవంటివని చెప్పవీలులేదు. ఈ వింత తరంగములను, సంభావ్యతరంగములు (*Probability*

*waves*) అని చెప్పవచ్చును. ఈ విషయము లన్నియు అప్రాకృతములు, గణితనుయములు. అట్టి తరంగములను భావింప వీలులేకున్నను వాటితో చేసిన గణితము వలన ప్రత్యక్షవిషయములకు వ్యుత్పత్తి తేలుచున్నది గనుక అగోచర తెలియని వాస్తవికత (*reality*) నిగూఢముగా ఉన్నదని చెప్పక తప్పదు.

కణ-తరంగ మెట్టివస్తువో, అందలి వింత ఆకార మెట్టిదో ఊహాతీతము - అనిర్వచనీయము—అవ్యక్తము—నిగూఢము-అవాఙ్మానసగోచరము! ఇంద్రియములకు, అగోచరమైనట్టి సత్యము నిత్యముమైనదేదో యున్నదని నవీన భౌతికశాస్త్రమువలన గ్రహించవలసియున్నది ప్రత్యక్షముగా తెలిసికొనే సత్యము కాక, దానికివెనుక పరోక్షమగు సత్యముకూడ యున్నదని చెప్పవలసియున్నది. ప్రత్యక్ష సత్యమును భౌతిక శాస్త్రముచేత విచారణచేసి తెలుసుకుంటున్నాము. మనస్సును మించినట్టి ఆత్మను సాధనముగా, ప్రత్యక్షమునకు మించిన పరోక్షమును, సాధించవచ్చునా యను తత్వజిజ్ఞాసకు తావు ఏర్పడుచున్నదేమో! ఈ సందర్భములో బోర్ శాస్త్రవేత్త, తత్వవేత్తవలె చెప్పిన మాటలు గణనార్హములు.

భౌతికశాస్త్ర విషయము లన్నియు ప్రాణము లేని పదార్థములతో చేసిన పరిశోధనలవలన గ్రహించినవే. అట్టి శాస్త్రజ్ఞానముతో ప్రాణాల చర్యలను గ్రహించలేము. ప్రాణాల చైతన్యక్రియ లన్నియు ఆత్మకు సంబంధించి యుండును. అందుచేత ప్రాణాల క్రియావిమర్శనము ఆత్మతత్వశాస్త్రము (*psychology*) నకు సంబంధించియుండును. కాంతి చేత ప్రకాశమానముచేసి పరమాణువుయొక్క స్థితిని పరిశీలించునప్పుడు కాంతికిరణమును (ఫోటాను) కణముయొక్క తాకుడుచేత పరమాణువుయొక్క పూర్వపు స్థితి మార్పుచెందునని అనిశ్చయతత్వ సూత్ర వివరణయందు తెలిసికొంటిమి అట్లే ప్రజ్ఞను బాహ్యము నుండి లోనికి మళ్ళించి, చింతన చేయుటచేత, లోపలితత్వము మార్పుచెందునని బోర్ అభిప్రాయపడినాడు. ప్రత్యక్షసత్యమును దాటి, పూర్ణసత్యమును ఈ ఆధ్యాత్మచింతనచేత అందుకోవచ్చునేమో!

ప్రత్యక్ష ప్రత్యానుభవములతో నిండి భౌతిక విషయములయందు మాత్రమే కార్యకారణభావము (*Causality*) వర్తించునని, ఆత్మవిషయములయందు కార్యకారణభావము నతిక్రమించిన స్వేచ్ఛ—స్వతంత్రము—(*free-will*) ఉండగలదని బోర్ అభిప్రాయము. ఆత్మవిచారణచేత ఆత్మకు—దేహమునకు (*soul and body*) గల సంబంధమును తెలిసికొనవచ్చునని యతడన్నాడు. కొందరు భౌతిక శాస్త్ర నిపుణులు ఆధ్యాత్మవేత్తలవలె జిజ్ఞాసలు చేయ మొదలిడుచున్నారు. దీనికి కారణము—సాధారణుల కందని విషయ జిజ్ఞాసలోనికి నవీన భౌతికశాస్త్రము పురోగమించుటయే యని చెప్పవలెను. ఇట్లు పోగా పోగా పూర్ణసత్యదర్శనమగునను నమ్మకముతో పరిశోధలను అనంతముగా జరుపుటయే కార్యము.

## మా సంక్రాంతి



శ్రీ వోలేటి పార్వతీశం

శర్వరీవియన్నైల్య నిశ్వాసధామ్య
శకల సకల జలధరాల శతసహస్ర
కోటి తార కాంకిత కాంతి వాటి దాటి
క్రాంతి సంక్రాంతి వీటి కేతెంచెనే? ఉదయి

శాంతి వైదేహ జీవి కాశ్వాస నిలయ
గేహాళి బ్రతుకుమంట వెల్గించి, నిద్రి
తాంత శారీరి కాలసత్వమ్ము శీత
సాంద్రతలు సురాళింపు వైశ్వానరాన.

ఈయుషస్వినీకాంత సాంస్కృతిక సీల
గలసరాగ కాంతికల సంక్రాంతిరేఖ
విరిసినది కల్వరేకు కావిరులలోన
బరువుగా నిశ్వసించు మాపాడు గుడిసె!

మాకు సంక్రాంతిలేదు! చీకాకు చింత
సంతరించి, మాయెడద సంజ్వాల సమాణ
సీతిహోత్ర హోమమ్ము త్రవ్వించు మాకు
త్రోపుడుల యాట నిత్య మృత్యుజ్వరమ్ము.

సాహిత్యము:

# మహౌకపదకవి - వంగలసీనయ్య



శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

ఆంధ్రసాహిత్యచరిత్రమున దక్షిణదేశాంధ్ర సాహిత్యము ఒక మధురాధ్యాయము. 'గీతి సాహితీ మోహనబాణాలు చెవులువట్టి యాడించిన' యార్ద్రవశీలుడు రఘునాథనాయక రసికశేఖరుని యాదరమున బ్రోదిగొని యాంధ్రకవితాకల్పలత తంజావూరున క్రొంగ్రొత్త ప్రబంధకుసుమముల బ్రసవించినది. ఆ కుసుమములు క్రొత్తలు, సౌరభము మాత్రమే కాదు. వానికి వర్ణాడంబరము హెచ్చు. 'ప్రతి పద్యమునందు జమత్కృతి గలుగం జెప్పనేర్చిన' చేమకూర కలకంఠము దక్షిణదేశాంధ్ర సాహిత్యకేదారమున గవితా కల్పశాఖికమీదనుండి క్రోల్చిన మధురస్వరము తెలుగు వారికి నాడు సమ్మోహనాస్త్రమయినది.

గీతిసాహితీ రసజ్ఞులచే తంజనగరము రసప్లావితమగుచుండగా తంజాపురాంధ్రనాయక రాజ్యమునకు దోడబుట్టువు మధుర మైసూరు రాజులతోడను, విజయనగర చక్రవర్తులతోడను నిరంతర యుద్ధములందు మునిగి తేలుచుండినది. దేశమున శాంతి లేదు. అందుచే తంజాపురమునందువలె మధురలో సంగీత సాహిత్యములు వెంటనే యభివృద్ధి గాంచలేదు.

తిరుమలనాయకుని కాలమున మధుర బలవంతమై సుభిక్షమై విజయనగర చక్రవర్తుల యధికారమును గూడ ధిక్కరించి వర్ధిల్లినది. అప్పటినుండి మధుర సంగీత సాహిత్యకళలకు నిలయమయినది. తంజనగర ప్రభువులవలెనే తిరుమలనాయకుడు తన రాజసభలో సంస్కృతాంధ్ర తమిళ కవులను, విద్వాంసులను జేర్చి యాదరించినాడు. రుక్మిణీపరిణయము, సత్యభామా సాంత్వనము అను తెలుగు ప్రబంధములను రచించి తిరుమలనాయకుని కుమారుడయిన ముద్దుఅళగిరికి కృతి యిచ్చిన కామేశ్వరకవి తిరుమలనాయకునివలన రాజసమ్మానము పడసినాడు. నాటినుండి మధురనాయక రాజులకు సాహిత్యపోషణము, కవితావినోదము ఒక మధురక్రీడ యయినది.

తిరుమలనాయకుని మనుమడయిన విజయరంగ చొక్కనాథుని కాలము మధురాంధ్ర సాహిత్యమునకు ఒక మేలి పూలకారు! అతని కాలమున సంగీత సాహిత్యకళలు చాలగా నభివృద్ధిగాంచినవి. విజయరంగ చొక్కనాథుని బాల్యములో మధురరాజ్యమునకు జాల చిక్కులు కలిగినవి. యుద్ధములవలన దేశశాంతి లేకపోయినది. దేశములో కరవు, అంటు వ్యాధులు చెలరేగినవి. కాని విజయరంగ చొక్కనాథుని పితామహియయిన మంగమ్మగారును, నామె క్రింద దళవాయిగను, ప్రధానామాత్యుడుగను నుండిన నరసప్పయ్యగారి చాకచక్యమువలనను నా చిక్కులు తొలగిపోయి దేశములో శాంతి యేర్పడి సుభిక్షమయినది. విజయరంగ చొక్కనాథుడు రాజ్యమునకు వచ్చునప్పటికి దేశము ప్రశాంతమై యతడు విద్యాగోష్ఠిలో బ్రొద్దుపుచ్చుటకవకాశము కలిగినది. అతడు స్వయముగా శ్రీరంగమాహాత్మ్యము, మాఘమాహాత్మ్యము నను గ్రంథములను తెలుగువచనములో రచించినాడు. ఆయన రాజసభలో గవులు, గాయకులు ననేకు లుండిరి. ఆయన సామంతులలో గొందఱు తెలుగులో గ్రంథములు విరచించినారు. వారిలో సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు ప్రముఖుడు. అతడు జైమినిభారతము, సారంగధర చరిత్రము నను వచనకావ్యములను, అహల్యాసంక్రందనము, రాధికాసాంత్వనమునను ప్రబంధములను విరచించినాడు. అతని స్నేహితుడు శేషము వెంకటపతి తారాశశాంకవిజయమును రచించి విజయరంగ చొక్కనాథుని మంత్రులలో నొకడైన వంగల సీనయామాత్యున కంకిత మిచ్చినాడు. వెలగపూడి కృష్ణయ్య మాలతీమాధవీయము, భానుమద్విజయము అను తెలుగు ప్రబంధములను, వేదాంతసారసంగ్రహమను తెలుగు వచనగ్రంథమును రచించినాడు. ఇతడు విజయరంగ చొక్కనాథుని దళవాయులలో నొకడగు సాంబయామాత్యునికి దగ్గఱ బంధువు. శృంగార రాధామాధవము, రాధికాసాంత్వనము నను ప్రబంధములను

రచించి చొక్కనాథుని కాలములో మధుర రాజాస్థానములోనుండిన మేదంష్ట్ర వెంకటపతికి మేనల్లుడు. వెలివంష్ట్ర ముద్దళగిరికవి విజయరంగ చొక్కనాథుని కోరికపై సుదంతాపరిణయమను ప్రబంధమును రచించి శ్రీరంగనాథస్వామి కంకిత మిచ్చినాడు. మిత్రవిందా పరిణయము, కార్తికేయమాహాత్మ్యము ననురెండు తెలుగు ప్రబంధములను, భాగవత రామాయణవచనములను రచించిన కుందుర్తి వెంకటాచలకవి విజయరంగ చొక్కనాథుని యాస్థానములో రాజసమ్మానము పొందినాడు. పెద్దప్రూడి యెఱ్ఱయకవి యువజనహృదయరంజన మను గ్రంథమును రచించినాడు. ఆ కాలముననే తిరుమలకవి చిత్రకూట మాహాత్మ్యమను తెలుగు నాటకమును రచించి క్రొత్తదారి త్రొక్కినాడు. శ్యామరాయకవి రామాయణ వచనమును, శ్రీపతిరామభద్రకవి హాలాస్యమాహాత్మ్యమును విరచించిరి.

విజయరంగ చొక్కనాథుని కాలమున తెలుగు సాహిత్యమట్లు బహుముఖముల నభివృద్ధి గాంచినది. అతని కాలమున ప్రబంధము లనేకములు రచింపబడినప్పటికిని ప్రధానముగా తెలుగున వచన వాఙ్మయ మతని కాలముననే ప్రారంభమయినదని మనము తలపదగియున్నది. అతని రాజాస్థానములో తెలుగువచనమునకే యెక్కువ రాజాదరణము కలిగినట్లు తెలియుచున్నది.

వచన వాఙ్మయమునకే కాక 'మధుర' పద సాహిత్యమునకు గూడ బట్టుగొమ్మ యయ్యెననుట క్రొత్తగా తెలియవచ్చిన విషయము. పదసాహిత్య చక్రవర్తి క్షేత్రయ్య మధుర తిరుమలేంద్రునిదర్శించి

*మధుర తిరుమలేంద్రుడు
మంచిబహుమాన మొసగి
యెదుట గూర్చుండు మని
యెన్నిక లిమ్మనె నే
యిదుగో రెండు వేలపదము
లెంచు కొమ్మనగ
చదురుమీద నున్న సామికి-
సంతోషమింతింత గాదె ॥ వేడుక ॥

అతనిపై రెండువేల పదముల విరచించినాడు. క్షేత్రయ్యరాకతో మధురలో పదసాహిత్యమునకు ప్రచార మెక్కువయినది. మధుర పదరచనములకు మధురానగర ప్రజ చెవి గోసికొనసాగినది. సంగీత సాహిత్య రసజ్ఞుడయిన విజయరంగ చొక్కనాథుడు పదసాహిత్యములోని మాధుర్యమును జవి చూచినాడు. అతని రాజాస్థానము పద కవితకు రంగస్థలమయినది. పదకవితా పట్టభద్రు లెందరో యతని రాజాస్థానము నలంకరించిరి. వారి పదరచనముచే రాజాస్థానము రసతన్మయ మగుచుండినది.

## కురంజి - ఆది

పల్లవి

శివదీక్షా పరురాలనురా — నే
శిల మింతైన విడువ జాలనురా

అనుపల్లవి

శివ శివ గురునాజ్ఞ మీఱనురా — నే
శ్రీ వైష్ణవు డంటే చేరనురా ॥శివ॥

చరణములు

వడిగ వచ్చి మతము జేరవకురా — శి
వార్చన వేళ తలుపు దెరవకురా
మడుగు కావి చెఱగు దియ్యకురా — నన్ను
మాటిమాటికి నోరు ముయ్యకురా ॥శివ॥

అజ్జ జూచి చను లదుమకురా — నా
సెజ్జ గొలుసు బట్టి గదమకురా
బుజ్జగించకు పసి గోలనురా — నా కె
మ్మోవి నొక్కకు భక్తురాలనురా ॥శివ॥

పంచాక్షరీ జపశీలనురా — కూకి
పలుకులు నే వినజాలనురా
కొంటపు వగల గుండించకురా — మ్రొ
క్కుదు రుద్రాక్షసరులు - త్రెంచకురా ॥శివ॥

మోము మోము నను జేర్చకురా — నీ
నామము తోడ భూతి గూర్చకురా
వేములు తోడభిక్షు వేసకురా — పోపో
రా మన్నారు రంగ మల్లాడకురా ॥శివ॥

నుదుట విభూతి రేఖ, మెడను రుద్రాక్షసరులు దాల్చి కావిమడుగు కట్టిన నట్టువకత్తె యీ పదము పాడి యభినయించుచుండగా రసపారవశ్యము నందని

* చూడుడు. విజయరాఘవపదములుభారతి - వికృతి భాద్రపదము.

రసికు లుండెదరనుట యతిశయోక్తి కాదు. కాని యంతటి రసపారవశ్యము గలిగించిన యా పదమును రచియించిన పదరచయిత యెవడో తెలిసికొనుట కది వారికి సమయము కాదు. సముచితమును కాదు. పయి పదమును పాడి యభినయించుచుండగా జూచినవారు పలువు రుందురు! వారిలో నొక్కరును నా పదరచయిత యెవడో తెలిసికొనుటకు బ్రయత్నించి యుండరు. అది వారి పని కాదు. పరిశోధకుల పని యది.

'మన్నారు రంగ'ని మకుటముతో నున్న పయి పదము 'మధుర'లో వెలసిన దనుట మధురాంధ్ర సాహిత్యమున కొక ప్రశస్తి! విజయరంగ చొక్కనాథుని మంత్రులలో నొకడును, శేషము వెంకటపతి రచించిన తారాశశాంక విజయమునకు గృతిపతియు నగు 'వంగల సీనయ్య' యీ పదమునకు రచయిత యనుట క్రొత్తగా దెలియవచ్చిన విషయము! ఈ పద మొక్కటే కాదు. 'మన్నారు రంగ' మకుటముతో నత డనేక పదముల విరచించినాడు. అవి 'మన్నారు రంగని పదములు.' అతడు శ్రీరంగములోని శ్రీరంగనాథస్వామి భక్తుడు. రంగనాథస్వామికే 'మన్నారు రంగ' డని పేరు. ఈ పద్యము జూడుడు.

"శ్రీరంగపతి పదాంబుజ
సారంగచ్ఛిత్త! చిత్తజాత జయంతా
కారా! కవి మందారా!
క్షీరాంభోనిధి గభీర! సీనయధీరా!"

శశాంక విజయము. తృతీయ - 1 ప.

ఇతడు మన్నారురంగని పదములను రచించినట్లు శేషము వెంకటపతి రచించిన తారాశశాంకములోని యీ క్రింది పద్యములవలన దెలియవచ్చుచున్నది.

"శ్రీ మన్నరు రంగాధిప
నామాంకిత గేయకల్పనా స్తుతమతికిన్
రామానుజ విజయాంక క
వీమధుర సమోదమాన వేంకటపతికిన్."

షష్ఠ్యంతములు.

"శ్రీ మన్నరు రంగాధిప
రామానుజ గుణగణాంక రచనాముదితా
హేమాచల మలయాచల
సీమాచర సుకవిచంద్ర! సీన సుధీంద్రా."

పంచమాశ్వాసము. 1 ప.

వంగల సీనయామాత్యుడు 'ఘన నయదేశీయ కమనీయ గ్రామ మూర్ఛనా బహువిధ విన్యాస ఘన్యా సమాన తాళమాన నానా నూన తాన వితాన భంగీ తరంగిత సంగీత విద్యావిశారదుండు', 'వీణా నినాద వినోద భూలోక నారదుండు'. 'సరస పద పద్య గద్య రచనాభోజుడు'.

ఇతడు గొప్ప గాయకుడు. ఈ పద్యములు చూడుడు.

"హాహా హూహూలు గానగర్వమున
హాహా హూహూ వంచుకన్ స్వరా
రోహ ప్రక్రియగా దురంగతనులై
రూప్యంబు నానన్ వృథా
సాహంకారులు మర్త్య గాయకులు
జోడా నీకు చాండేశ్వర
స్నేహాలంకృత! వంగలాన్వయమణీ!
సీనా! కవిగ్రామణీ!"

పీఠిక 57.

"వంగలకుల కుంభవారాశి జనియించి
కన్నుల కౌమోదగరిమ నించి
యందంద సకలకలాభ్యాసియై మించి
జైవాతృకత్వప్రశస్తి గాంచి
కౌముదీ ప్రజ్ఞానగౌరవంబు వహించి
సతతంబు కవిసమాచరణ మించి
యిమ్మైన గానామృతమ్ములు గురియించి
యరికులంబుల గర్వ మపహరించి
యతిశయిత లక్షణాఢ్యత నతిశయించి
ధాత్రి రామానుజ మహాచరిత్ర ఘటన
కలన కువలయ వికసనకళ ధరించి
సీన ఘనుకుండు సర్వజ్ఞశేఖరుండు.

శశాంక విజయము. పీఠిక 22.

"కల్పక సమదాన కళా
కల్పక నిజపాణిపద్మ! కాంచనపద్మా!
కల్పక సత్కవి వినుతా
కల్పక! సత్కీర్తినూత్న! గాయకరత్నా!"

ద్వితీ. 145.

ఇతని తమ్ముడు వేంకట పెరుమాళ్లు: అతడును గొప్పగాయకుడు. సంగీతకళానిధి. ఈ పద్యములు చూడుడు—

"స్ఫుట పటిమార్భటీ నినటి ఘు స్వర
జినక్రకుటీ పుటీ సుఫల్
ఘటముల గుమ్మరించి రన
ఘుమ్మన రాట్సభ జంత్ర గాత్రముల్
పటుమతి విన్కి జేయుచు
శిలాపటలిన్ సలిలంబు జేసి వేం
కట పెరుమాళ్ళ ధీరుడు జగన్నుతు డా
నరసత్వ మేర్పడన్.

పీఠిక. 59.

ఇళయ పెరుమాళ్లు రాముని
వెలయన్ భజియించురీతి వేంకటపెరుమాళ్
సలలిత గీతకళానిధి
విలసితమతి గొలువ సీనవిభుడు చెలంగున్."

పీఠిక 60.

పయి యుద్ధరణములవల విజయరంగ చొక్క నాథుని మంత్రులలో నొకడును, తారాశశాంక విజయకృతి పతియునగు వంగలసీనయ్య గొప్ప గాయకుడనియు, నతడు మన్నారు రంగని పదములను విరచించెననియు, దెలియుచున్నది. 'సంగీతదర్పణము'లో 'శివదీక్షాపరురాలనురా' యన్న పదము ఘనం సీనయ్య యనువానిచే రచియింపబడినట్లు పేర్కొనబడియున్నది. అది యెట్లో తెలియదు. బహుశః వంగల సీనయ్య యనుటకు బొరపాటుగా ఘనం సీనయ్య యని పేర్కొనబడి యుండును. పయిపద్యములలో నొకదానియందు 'సీన ఘనకుండు సర్వజ్ఞశేఖరుండు' అని యున్నదికదా! 'సీనఘనకుండు' అన్నపదమే ఘనం సీనయ్య యని పేర్కొనబడియుండును.

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో శృంగారపదరచనము లనేకములు కలవు. కాని యవియెల్ల చెదరులు చెదరులుగా పలుప్రతులయందు గానవచ్చుచున్నవి. ఒక ప్రతియందు గానవచ్చినవే మఱొకప్రతియందును గానవచ్చుచుండును. కొన్ని ప్రతులయందు క్రొత్తపదములును లభించుచుండును. వానినెల్ల నొకక్రమములో సమకూర్చుకొనుట పరిశోధకుల కర్తవ్యము. ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారములో వివిధప్రతులయందు చెదరులు చెదరులుగా నుండిన మన్నారు రంగని పదములనెల్ల నొకచోట సేకరించి యిందు బ్రకటించుచున్నాను. వంగలసీనయార్యుని పదములనెల్ల నొక్కచోట సమకూర్చుటయే యీనా ప్రయత్నములోని యుద్దేశము.

పున్నాగవరాళి - ఆది

పల్లవి

తా వచ్చునో లేకనే - రావలెనో యందాక

అనుపల్లవి

నా వేడుక చెల్లించేమ-న్నారు రంగసామి ॥ తా॥

చరణములు

నన్నంటి యిటురాక - యెన్నాళ్ళైన పరాక
కన్నెరో వినవె సుకొక్కగా నున్నది మఱుకాక
కన్న కన్నవారిని వేడుకొంటిని
వన్నెకాని నెనరెల్లను గంటిని
అన్నిటికన్న నీ-కన్న వేరె చెలి
యున్నదా నావెత-లన్ని దీర్చుటకు ॥ తా॥
తెలిసె లేనీ నిజాలు-నిచ్చలు నొంటిగా జాలు
నెలతయెంతైన పలుమాలు-నేనంటె నే మాలు
నిలుపరాని వలుపున గడుసొక్కితి
చెలువెందఱనో బతిమాలితి
చెలువునిముంగల-నిలిచి మదిని గల
కలక దీర్చునో-వలె నీవేళ"
దైవము పగదాయ - నాపైన - దయలేదాయ
యేవేళ లేనిమటుమాయ - తా నేసతమాయ
ప్రావుబోణి యూరకె నెఱ నమ్మితి
పొందినప్పుడె తెలియక మే నమ్మితి
యీవల నావల-పెటుల దాతునె
పోనె దెలుసుక-రాదె గ్రక్కున ॥ తా॥

మఱొక ప్రతిలో నీ క్రింది పదములు కాన వచ్చుచున్నవి.

నాటకురంజి రాగం - ఆది తాళం

పల్లవి

భారుణి దొరలింట్లను బుట్టుట పగ
వారికైన కొలు గాదమ్మ

అనుపల్లవి

పేరు బాడి మ-న్నారు రంగనికి
పెండ్లైనేయము టెన్నటికో తెలియదు ॥ భారు॥

చరణములు

తలిదండ్రుల మమతలు కొన్నాళ్లు
తట్టి జూచుచు కొన్నాళ్లు

కులగర్వంబులు విచారించు
కోవలె నంచని యని కొన్నాళ్లు
అలరు ప్రాయమళికి గాని విరివిత
మాయగా విధిమాయగా ॥ధారు॥
మగగాలేని సోకక కొన్నాళ్లు
మరియాద దక్కను కొన్నాళ్లు
నగరివారమని లేని
బిగువు విన్నాణములచే కొన్నాళ్లు
పొగరు తమక మడవి గాయువెన్నెల
పోలికై తుద జాలినైతిని ॥ధారు॥
హావుసుతోంచి తోచక కొన్నాళ్లు
అనుభవ మెఱుగక కొన్నాళ్లు
సవసవగా రతికేళి ముచ్చటలు
సఖియలచే విని కొన్నాళ్లు
అవురవురా ఆడతన మె - పగటిది వ్వ
అలసితి మతి సొలసితి ॥ ॥ధారు॥

## మెరికల కాంబోది పదం

పల్లవి
నిన్నన ఫలమేమీ - ఒకరినైనా తా
నిందించ చలమేమీ

అనుపల్లవి
నన్నన వలయునె
యెన్నైనా గాని
మన్నరు రంగ నీ వన్నిట
మంచివాడవు పొమ్ము సుమ్మీ

చరణములు
తొలుతనె యిటువంటివాడవని
తెలియకనె వలచి యుంటి
చెలువుడా యిది యేటి చిన్నెలు
అలనాటివలపులు మిగులసొలపులు
చెలులమది చపలంబు గాదె
అలిగి విడనాడ విడనియ్యను
కలుగునా నీకు నావల్ల సు
ఖంబు మించిన కలియుగంబున॥ నిన్నన॥
నల్లని మొగవాని కలనైనను గాని
నమ్మరాదనుమాట
చెల్లబో నిజమాయ కల్ల గాదు నేటి
కల్లను జనుల వల్లను

యెల్లకాలము మరులు న
న్నింత వింతల కెనుమ్మజేసెను
వల్లగా వలచివచ్చిన జ
వ్వనులు చులుకనగానె విటులకు ॥నిన్నన॥
కలకాలము వట్టి ఆడికెల లోను
గా భువిని బుట్టి
పలుమారు విధిదూరి పలువరించి వేసారి
అలసితి మిగుల సొలసితి
యిలను మగువలు మరులు తెసలై
మెలగియుండుట పలుకువిని మా
త్రలను వ్రాసి ధాత యిటు దం
ఘనల పొందలరింప జేసెను ॥నిన్నన॥

సంగీత సర్వార్థసార సంగ్రహము అను గ్రంథములో మన్నారు రంగనిపదములు కొన్ని ముద్రింపబడినవి. ఆ గ్రంథము క్రీ. శ. 1908 లో చెన్నపట్టణమున ముద్రింపబడినది. అందు ముఖపత్రమున నిట్లున్నది.

'సంగీత విద్య నభ్యసించువారల కత్యావశ్యకంబగునట్లు సర్వగీత వర్ణపదాద్య నేక ముఖ్యవిషయములం గూర్పబడిన సంగీత సర్వార్థసార సంగ్రహమను గానశాస్త్రము. ఇయ్యది సంగీత విద్యాకుశలులగు పెక్కండ్రు విద్వాంసులచే బరిష్కరింపబడిటి. చెంగల్వరాయనాయడు అండ్ సన్సువారిచే స్వకీయ మురహరి ముద్రణాలయంబున సర్వజనుల మనోహరార్థముగా ముద్రించి ప్రచురింపబడియె. చెన్నపట్టణము 1908. ఈ గ్రంథము ధర 12 అణాలు'—

పయిగ్రంథమునందు సారంగపాణి పదములు, కస్తూరిరంగని పదములు మొదలగు నితరపదముల తోబాటు మన్నారు రంగని పదములును ముద్రింపబడినవి. పయిగ్రంథములో ముద్రితములై ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునందలి వ్రాతప్రతులలో గానరాని మన్నారు రంగని పదము లీక్రింద నొసగ బడుచున్నవి.

## నీలాంబరి రాగము - త్రిపుట తాళము

పల్లవి
మగవాడు తలచితే సుఖము

అనుపల్లవి

మగువలే మగవారి మాయల
మరిగి తిరిగిన నేమి ఫలమమ్మా-యతి చులకనమ్మా

చరణములు

సకలవిద్యలు నేర్చిన - నెంత
సౌందర్యవతియైన
నొకనివలలో జిక్కితేను - యీ
పూరట చెల్లు పెట్లానో
అకట! నీవెంత జంతవు - నా
యకుని నడవడికెలు
దెలియు వేళ నది యొక్కమేలా ॥ ॥మగ॥

చెల్ల! ప్రాయపు చెలులు లేరా-వా
రెల్ల నీవలె తిరిగేరా
చెల్లునా యిది నీకు మానమే ॥మగ॥

సౌమ్మ నామాట నమ్మ
నేనెంత వేడిన నీవల్ల
వానిపై తమి నిలుపలేవు
నీనెనరు మదిదాచుకోవు-పసి
దానివలెనే భ్రమల జెందేవు
చాన! విను మన్నారు రంగ
శౌరితో కలసినది
యెవ్వతైన తెలుసుకొన్నదైన ॥ ॥మగ॥

## శంకరాభరణము - త్రిపుట తాళము

పల్లవి

వాడెవరో మన మెవరో
వనితరో యీవట్టి - వాడేల పోపోవే

అనుపల్లవి

నాడునాడే మన్నారురంగని చెలిమి
కూడదని మల్లాడ లేదటవే-యిపుడేటి దిటవే

చరణములు ॥వాడె॥

నెనరువా డనుకొంటివా - వాని పొలకువ
నేటివరలో గంటివా - యేటిమాట
యనుకూలు డవునంటివా - దానిపై వాని
యాసకు మితి గంటివా - పదివేలైన
వినవె యింతట తెలివి వలదా
తను నెఱుంగని శివము గలదా ॥వాడె॥

తెలిసె వాని యిక్కువ - వానికి మనకు
తిరిగి గలదా మక్కువ - యిపు డింతగ
వలచినదే తక్కువ - పోపొమ్మనవే
వాడైతే నే యెక్కువా - రాగ రాగ
పలుకులే సందేహ మాయెను
పసిడికై దువు లేమి సేయును ॥వాడె॥

తిరిగి తిరిగి యేటికే - యాడి పాడి
తీరినదా నాటికే - వేవేగముతో
తిరిగెదపై పోటికే - వా డీపగల
తేలించినది నూటికే - మన్నారు రంగని
యెఱిగి తిరుగా చెలిమి జేతుర
యిసుక పాతర త్రవ్వ జూతుర ॥వాడె॥

## దర్బారు రాగము - ఆది తాళము

పల్లవి

మగవా డని యాడదని ఒంటిబడి
మనసు నిలుప వశమా - యెవరికైనను

అనుపల్లవి

పగలు జేయు మన్నారు రంగడే
వరాహసామిని నన్నన నేల
బిగువులు తగవులు వావి వర్తనలు
వీరాలాపములు సభలో గాని

చరణములు

మంచి వయసు దొరక దనుచు బలికే -
మాటల కేమి మోసమా
కంచుపదను వంటి దింతె తమకము
కలిగిన దంటే రోసమా
యించువిలు బారి కోర్వరా దను -
కెల్ల నొకరి కోసమా
పొంచి పొంచి దొరకరాని సంగతి
పొసగితేను మరి దోసమా. ॥మగ॥

ఆడికలకు వెరచినటుల బూటక -
మమరికలకు తా వచ్చునా
యీడుగాని వానిచేత దొరకిన -
నెవతైన మనసిచ్చునా
చూడలేక యొరులు దూరుకొనగా వ -
చ్చునా నోరేమి నొచ్చునా
యాడకాడ దెలియవలెను సురునిల్లా
లాపనులకును జొచ్చునా ॥మగ॥

మాన మందియున్న నెన్నడైనను -
మది కళంకము దీరునా

నైన మెఱుఁగనట్టి వలపు దాఁచిన -
వఙ్డివాసులకు బోరునా
నేను నా వరాహసామి నెనసిన -
నెనరింతింతన వచ్చునా
తాను తానే తెలియవలె సుఖ మెం -
దరికైన పనికొచ్చునా ||మఱ||

వంగల సీనయార్యుఁడు రామానుజమతావలంబ కుఁడు. అతఁడు రామానుజచరిత్ర మను ప్రబంధమును గూడ రచించినాఁడు. 'రామానుజ దివ్యచరిత్ర ప్రబంధసాహితీ మోహితానల్ప సంతోష విశంకట వేంకట నగాధీశ్వరు' ఁడనియు, 'రామానుజ విజయాంక గవీ మధుర సమోదమాన వేంకటపతి' యనియు, 'రామానుజ గుణగణాంక రచనా మదితు' డనియు నతఁడు తారాశశాంక విజయమున జెప్పు కొనినాఁడు. వైష్ణవ భాగవతాగ్రేసరుఁ డయిన యితఁడు మన్నారు రంగనిపై శృంగారపదములను మాత్రమే కాక భక్తిమయ పదరచనమును గూడ గావించి యున్నాఁడు. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము లోని ప్రతులలో నట్టి పదము కొనవచ్చుచున్నది. చూడుఁడు.

## నీలాంబరి - ఆది

పల్లవి

నిను సేవించిన - కనుల నెవ్వరిని
గననొల్లను శ్రీరంగా రంగ

అనుపల్లవి

నను నీ సన్నిధికి విరచ్పించుక
మనువయ్య శ్రీరంగా

చరణములు

శరణాగతుఁడను - గరుణజూడుమీ
దఱి మఱవకు శ్రీరంగా రంగ
అరనిముసము మిము-దరిసింపక మన
మిరవొందదు శ్రీరంగా రంగ
జపమని వేఱొక-తపమని యెఱుగను
అపరాధిని శ్రీరంగా రంగ
చపలచిత్తుఁడను - కుపితుఁడ పాపిని
కృపసేయవె శ్రీరంగా రంగ
మన్నారు రంగ ప్ర-పన్న వత్సల ప్ర
సన్న వరద శ్రీరంగా రంగ
యెన్నటికిని నను-మన్నించెద వా
పన్న వరద శ్రీరంగా

మఱొక శృంగారపదము—

## భైరవిపదం - చాపుతాళం

పల్లవి

పలుక వేమిరా - సామి నే నిజముగా
వలపు నిలుపలేనురా

అనుపల్లవి

నిలుపరాని ప్రేమ - నేనెంతో వేడిన
నీకింత దయలేదుగా - రంగేశా || పలుక||

చరణములు

చెలువుమీఱ నీకు - సిగనిండా విరజాజు
లెలమిచుట్టుచు నే-నెంతో చెంతజేరినా
నిలునిలుమనేవు - అది యేమనిన
తొలగ జూచేవు - యెన్నఁడులేని
అలుకసేయ మేరగాదురా - నేటి
కళ్లా యింకా నిదుర రాదురా-వలదుగ
చలమికను మరు డిదిగో విరి-
శరములను గొని నను మనము చెదరగ
బలిమి వదలగ నేయ దొడగెనురారంగేశా|| పలుక||

పరిమళించుమంచి - పన్నీరు గంధము
నెఱతనమున మేన - నెమ్మి బూయవచ్చితే
కరములు దోసేవు - మరి నీ వెంతో
కరకరిని జూచేవు - నీ యెదపైని
కరుణమీర నన్ను జేర్చరా-సామిగ
కౌగిలించి మోవి గ్రోలరా - నీపై
మరులు మఱిమఱి చాల ప్రబలను
మదిని కినుకలు వల దనుచు పలు-
మరును నిను నే వేడవేడగను రంగేశా|| పలుక||

తీరుగా కొనగోట నే క-స్తూరి తిలకము నీ నుదుట
దిద్దబోతే మోము నోర జేసేవు-నీలో నీవ
దూరుకొనేవు - నాపై లేని
నేర మేమైనాను యెంచితో లేక నే
నెందైనాను పోగా - మన్నించితో - వే
మారు నిను సమరతి నెనయు స
మయమునను నిను గాని యొరులను
చేర ననినది యపుడె మఱచితివా - రంగేశా
||పలుక||

ఇప్పటివఱకు నుపలబ్ధము లయిన మన్నారు రంగని పదములు తొమ్మిది యిందు బ్రకటింపబడినవి. ఈ పదములను విరచించిన వంగల సీనయ్య క్రీ. శ. 1706 మొదలు 1732 వఱకు మధురను రాజధానిగా బాండ్యమండల మేలిన విజయరంగ చొక్కనాథుని మంత్రులలో నొకడు. అనుట నీ పదములు క్రీ. శ. 1706–1732 సంవత్సరముల నడిమికాలమున రచియింపబడిన ట్లూహించుట యసమంజసము కాదు. ఈ పదముల యుపలబ్ధి వలన క్షేత్రయ్యకు దరువాత సారంగపాణికి బూర్వము మధురలో వెలసిన పద సాహిత్యోపలబ్ధి జరిగిన ట్లయినది.

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో మన్నారు రంగని పదములతో బాటు ఆ కాలముననే వెలసిన విజయరంగ చొక్కనాథుని మీది పదములు కొన్ని యుపలబ్ధము లగుచున్నవి. విజయరంగ చొక్కనాథుని యాస్థానమున నానావిధ సంగీత విద్యా విశారదులయిన పదకవితా పట్టభద్రు లనేకు లుండి రనుట నిర్వివాదము. రసజ్ఞ శేఖరుడయిన యా మహారాజు మీద నెవడో యతని యాస్థానములోని కవీశ్వరుడా పదములను విరచించి యుండును. మన్నారు రంగని పదములను విరచించిన వంగల సీనయామాత్యు డెతని యాస్థానిలోని వాడే కనుక విజయరంగ చొక్కనాథుని మీది పదములను గూడ మహారాజు మీది యాదరముచే నతని కోరికపై నాతడే రచించి యుండునని తలచుట సమంజసమే యని నమ్మెదను. అవి యన్య రచితములుగా నిరూపింపబడుదాక నీ నిర్ణయము సముచిత మని యంగీకరింప దగును. విజయరంగ చొక్కనాథుని మీది పదము లీ దిగువ బ్రకటింపబడుచున్నవి—

### సావేరి - ఆది

పల్లవి

ఏరా నీ కింగితీయ - వేరం సిరోరి

అనుపల్లవి

వేలుసేయ మేరగాదు - యిప్పుడు
విజయరంగ చొక్కనాథ భూపాల

చరణములు

సారె కోవిలలు రొదసేయ
చలువ తెమ్మెరలు పై డాయ
మారుకు విరితూపుల నేయ - నీ
మనసు దాతురా విటరాయ ||ఏరా||
నిన్న రేయి వెన్నెల బైట
నెనరు మీఱ నాడినమాట
వన్నెకాడ! మఱచితి విచ్చోట - నీవు
వగలు సేతురా యిచ్చోట ||ఏరా||
విరులశయ్యపై దమి మీఱ
విజయరంగ చొక్క వజీర!
హారువు మీఱ నేలితి నోర! నీ
హావుసు చెల్లెరా హంకీర! ||ఏరా||

### కేదారగౌళ

పల్లవి

అతివచేత బిలువ నంపిన పనియేమి
ఆనతీయర సామి

అనుపల్లవి

చతురు డారంగ - కృష్ణ సుగుణ వీరేంద్రా
వితరణ గుణసాంద్ర – విజయరంగ చొక్కేంద్ర!

చరణములు

అలనాడు చెప్పిన మాటలు యేమి
అతివతో గూడి యుండువురా నాసామి
లలన యింటికి పోకరాద యేమి
రట్టేల చేసేవు రారా నాసామి ||అతివ||
అదిగో! మోము నీ మోవిపై గాటు
అదిగాక పీపున చాని గోటివేటు
పదరక యురమున గుబ్బల పోటు
బాగాయె యిది నీకు యేమో నెరనీటు ||అతివ||
ఎవ్వతె పెట్టిన మందురా నీకు
యింత చేసితి వే మందు - నిందుకు
రాజశేఖర విజయ - రంగ చొక్కేంద్ర
గుణజని పంపిన పనియేమి నాసామి ||అతివ||

### రాగం? తాళం?

పల్లవి

నీ మీద వలువని నెలత యెవ్వతెరా

అనుపల్లవి

రాజమనోహర! విజయ-రంగచొక్క నాథనరేంద్ర!

చరణములు

సదయుడ! నీవు నన్ను సరసకు రమ్మనిన
హృదయేశ! పోకముడి వదలీరా

మదనావతార! నన్నదిమి మోవి నొక్కిన
మదనమందిరము – పదనయ్యారా॥ ॥నీమీద॥

అనువున నీవు నన్నలమి కౌగిలించిన
తనువెల్ల పులకరించె తలమరీరా
మొనసి నీదు మోము – ముద్దు బెట్టి నంతలో
నెనలేని కోరిక – లినుమడించీరా ॥నీమీద॥

వింతరతులనన్ను – విజయరంగ చొక్కేంద్ర!
కంతుకేళినిగూడి – కలయ వేళ
చింతలెల్ల దీరి – చెలువుడా నామనసు
సంతత సుఖానంద – జలధి తేలీరా ॥నీమీద॥

## యెరికలకాంబోధి పదం

పల్లవి

ఎటువలె వలపించేరె – ఓ భామ నీ
వెటువలె వలపించేవె

అనుపల్లవి

విటరాయడైన మా-విజయరంగ చొక్కేంద్రుని
చరణములు ॥ఎటు॥

పదచాళి నటియించి – భావము కనుపించి
పదము లభినయింతువా – వాని నె
మ్మదిదెలిసి మెప్పింతువా – నాముందర
పదిరియొమ్మెలు పలికే – విది యేటి యోచనే
హృదయేశు డన్నిట-నెనలేని నెఱజాణ ॥యెటు॥

కవితాలు రచియించి – కల్పన పొసగించి
హావుసుగా వినిపింతువా – వానిచేత
అవురౌరా! యనిపింతువా – మాచెంగట
సవురు మెఱయించేది – చాలున యీ చిన్నె
లువిడా! చెల్లునా వాడు-నవరస రసికుడె ॥ఎటు॥

నిక్కుగుబ్బలగుమ్మ – నింపుకవుగిట గమ్మ
పక్కమచ్చిక సేతువా – వానిరతుల
సొక్కించి తమిదేతువా – యీలాగున
మిక్కిలి నినునీవె – మెచ్చుకొనే వేమె
చక్కని పతి యువతీ-జనపాంచాలుడే ॥యెటు॥

## యెరుకల కాంభోజి – ఝంపె తాళం

పల్లవి

తరుణిరో మరుకేళికి యీ పదివేల
బిరుదులూ నీకె చెల్లునే

అనుపల్లవి

అరుదుగా – ముద్దు చొక్క—
అదెరా యిట్లా సమరతుల
దురుసు అణకువ లంటెవే – చెలియా ॥తరు॥

చరణములు

అదిమి భుజముల శిరము –
గుదియించి యణచుకొని
సదమదపు సమరతుల –
పొదవి యెంతో నిలిచితే
అదెరా విడు విడువకు మని –
గుది వెన్ను తాకులచే
నదిమి నాచెక్కు చఱచి –
యెదురు గమకించి నపుడె ॥తరుణి॥

తొడరవళి రికసద్దు (?) –
తోర మీ గళరవము
పడతిరో దాని జాతి –
పలుకుబడి గాదా
అడరి యమృతపు చెలమ –
హంస వాల లాడినటుల
కడు వేడుకతో చెలియ –
పడక యొసగిన యపుడె ॥తరుణి॥

మోము మోము యెద యెదయును –
మోవి మోవి నను జేర్చి
అముకొని మిగుల తియ్యక –
సాముగత్తెవు గనుక
కోమలి లయ తప్పనియ్యక –
కులుచ నిడుపులతో
ఓ ముద్దు చొక్క యనుచు –
నుపరతి నను కలసి నపుడె ॥తరు॥

## యెరికలకాంబోది పదం

పల్లవి

ఉపమగా నే సేయు – నుపచారము లన్ని యీ
అపచారములై తోచెనా

అనుపల్లవి

విపుల సద్గుణసాంద్ర!– విజయరంగ చొక్కేంద్ర!
వింతలాయ మనవి – వినరా చక్కని సామి!

చరణములు

నిలువుటద్దము దెచ్చి – నిలువరించితి గాని
నెలవంక లేమని – పలుకరించితినా
కలపము మైనిండ – నలువరించితి గాని
పలుకెంపు లేమని – పలికితినా బాగాయ ॥ఉప॥

పసిడి శాలువ దెచ్చి – పయిని గప్పితి గాని
పసపు దుప్పటేమని – పలుకరించితినా
కుసుమంపు సురటి చే – కొని విసరితి గాని
పసిచెమట లేమని – పలికితినా బాగాయ ॥ఉప॥

చెలువుగా శృంగార – శేఖరుడ వంటి గాని
తెలవారు దాక రతి – కలసితి నంటినా
లలితు డైనట్టి శ్రీ – రంగేశు డంటి గాని
యలకృష్ణమూర్తి వని – పలికితినా బాగాయ ॥ఉప॥

విజయరంగ చొక్కనాథుని మకుటముతో
నున్న పయి పదములో తుదిచరణమున శ్రీరంగేశుడు

పేర్కొనబడుట మన్నారు రంగని పదములను రచించిన వంగల సీనయ్యయే యీ పదములను గూడ రచించెననుటకు సమర్థమైన యాధారమగుచున్నది.

నరసప్పయ్య విజయరంగ చొక్కనాథుని పితామహియయిన మంగమ్మగారి కాలమున పేరెన్నిక గన్న దళవాయి! ఇతడు విజయరంగ చొక్కనాథుని కాలమున గూడ నుండినాడు. ఇతడు అఖండ మేధాశాలి. దళవాయిగా మాత్రమే కాక ప్రధానామాత్యుడుగా గూడ నుండి దేశపరిపాలనము నతి సమర్థతతో జరిపిన యితడు తెలుగు నియోగిబ్రాహ్మణుడు. గొప్ప శూరుడు. అనేక యుద్ధములు చేసి జయించినాడు. దేశారిష్టములు కలిగినప్పుడు వానికి ప్రతిక్రియలు చేసి దేశమును కాపాడినాడు. ఈయనను గూర్చిన కథ లనేకములు కలవు. ఇతని మీది పద మొకటి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని ప్రతులలో గానవచ్చుచున్నది—

## పూరిరాగం – ఆదితాళం

ఒళునెల్ల దెలిసె లే ఛేరా - వోరోరి జాణ

అనుపల్లవి

దళవాయి నరసవజీరా - దాతలరాయ నీ ||ఒళు||

చరణములు

నిన్న దాని నేలు - కొన్న వగలెల్ల నేను
విన్న చిలుక తాళి - మొన్న యిచ్చి సుప్ర
సన్న సరసాన నున్న ||ఒళు||
రాక యేతురా ప - రాక దానికె సరిగా
కోక లిచ్చితే.........
లేక నే నందాక ||ఒళు||
వరుస దప్పక నన్ను - వరుస మాన యేలి యొక
వరుస సొమ్ము లొసగ నీ – సరిపాటి యెవ్వారు
సరస దళవాయి నరస ||ఒళు||

విజయరంగ చొక్కనాథుని తండ్రి రంగకృష్ణ ముద్దు వీరప్పనాయకుడు. అతడు క్రీ. శ. 1682 మొదలు 1689 వరకును రాజ్యపాలనము గావించినాడు. అతని మీది పదములు రెండుపలబ్ధము లగుచున్నవి. కర్త యెవ్వరో తెలియరాదు.

## ఘంటారవం - త్రిపుట

పల్లవి

తలచుకొన్న నామనసు - ఝల్లుఝల్లనీ నే
తల్లడమంది నే మందెనె

అనుపల్లవి

చెలువరంగ రమ్మని - చేరదీసిన నేస్తము

చరణములు

నెలత ! నిన్నటిరేయి - నీవంటి సరసులతోను
చెలిమి మిక్కిలి యింత - సేయరాదనుచు ఆ
పలికిన మోము నే - పలుమారు మూచి చూచి
తలవంచుకొని హా-దైవమా యనిన మాట ||తల||
రతికేళి నెనసిన
రమణి నిదుర లెమ్మని
అతివ యూరికి పోయివచ్చె
నని నందుకు ఆ
పతితో దిగ్గన లేచి
వేగమె నన్ను కౌగిలించి
అతివయ చే కా నిమ్మని నో
రాడక నే నూరకున్నది ||తల||
పవరక పోవే ముద్దురంగ
ప్రాణేశయని యుపరతుల
మదనకేళిని గూడిన
మగువ గనుక ఆ
ముదిత నీవు పాడిన
పదములు తలచుకొంటె
కదిసిన రూప మెల్ల
కన్నుల గట్టినట్టున్నది ||తల||

## బిలహరి - చాపు

చాలుచాలు నన్నంటకు - జాణరాయ నీ
మేలు దానితో జగ-డాల కోప మేమయ్యా
యిచ్చకములాడరాకు - యిక నేల నే నీకు
పచ్చితేనె మోవి గంటికి - పదివేలదండములు
మొక్కలీ తనము బూని - మోహంపు దొరసాని
చెక్కిటనుంచి నీ గోరుజూచి-చిత్తము చల్లనాయె
యెలమితో నన్ను గూడి - యిప్పుడామాయలాడి
కలసి మెలసి వచ్చేదాక - తెలియదా ముద్దురంగ

ప్రబంధవచన సాహిత్యశాఖలు మాత్రమే కాక పదసాహిత్యశాఖ కూడ మధురలో చాలగా నభివృద్ధి చెందిన దనుట కీ పదరచనములు ప్రబలప్రమాణములు! ఆంధ్రసాహిత్యచరిత్రములో దక్షిణ దేశాంధ్రసాహిత్యమును గూర్చి విస్తార పరిశ్రమము జరుగలేదు. తంజాపురాంధ్రసాహిత్యమును గూర్చి మాత్ర మిటీవల కొంత విస్తారముగానే పరిశ్రమము జరుగుట సంభవించినది. కాని మధుర, పుదుకోట మున్నగు రాజస్థానముల వెలసిన సాహిత్యమును గూర్చిన వివరములు లేనిది దక్షిణదేశాంధ్ర సాహిత్యచరిత్రము సమగ్రము కాజాలదు. *మధురాంధ్ర సాహిత్యములో జేరదగిన పదసాహిత్య స్వరూపమును దెలుపుటయే యీ వ్యాసోద్దేశము.

*ఈ వ్యాసమునందలి చారిత్రకవిషయములు 1945 వ సంవత్సరమున భారతిలో శ్రీ దిగవల్లి వేంకటశివరావుగారు రచించిన 'మధుర నేలిన తెలుగు నాయకరాజులు' అనువ్యాసమునుండి గ్రహింపబడినవి.

# సంకల్ప సిద్ధుడు



శ్రీపంతుల శ్రీరామశాస్త్రి

శంకర శాస్త్రుల్లుగారిని తెలిసిన వాళ్ళంతా ఆయనను గురించి చిత్రంగా మాట్లాడుతారు. 'ఆయనకేమిటయ్యా, లక్షాధికారి, పైటికి అలావుండగా నేసరా?' అని కొందరూ, 'లక్షాధికారే, అయితే ఎక్కణ్ణించి వచ్చిందిదంతా? వడ్డీలకు వడ్డీలు పెంచి తాకట్లు వాకట్లు చేసేసుకొని సంపాదించినదేకదూ?' అని కొందరూ, "సంకల్ప సిద్ధుడంటే ఆయనేనండీ, చిన్నతనంలో ఒక మారు తనలో తాను నిశ్చయం చేసుకొన్నాడు. తనచేతిమీదుగా ఒక లక్షారం పైగా సంపాదించాలని, అంతే అంతవరకూ మనిషి పట్టిన పట్టు విడవలేదు——" "నిజమే, సంపాదించాడయ్యా, కాని ఏం ఫలితం? దమ్మిడీ దానం ధర్మం అని లేదు కదా, ఎంగిలి చేత్తో కాకినయినా కొట్టడే, వట్టి నిర్గంధ కుసుమం" అని కొందరూ ఇలా బైటికి స్పష్టంగా అనకపోయినా, లోపల్లోపల శంకరశాస్త్రుల్లంటే ఏదో ఈర్ష్య ఉన్నట్టే మాట్లాడుతారు.

ఇందుకు కారణమేమిటూ అని ఆలోచిస్తే ప్రధానంగా ఒక్కటే కనిపిస్తుంది. శంకర శాస్త్రుల్లు ఒంటరి మనిషి. కొడుకులూ కూతుళ్ళే కాదు, తదితర సమీప బంధువులు కూడా లేని మనిషి. అతనికి కాస్త డబ్బు చేకూరిన తరవాత, దూరపు బంధువులు కొందరు అతనితోడి తమ బాంధవ్యాన్ని పునరుద్ధరింప తలచుకొని హతాశులయేరు. ఇక, ఇటువంటి ఇరస్తా పరస్తాకాని, శంకరశాస్త్రుల్లు దగ్గర లక్ష రూపాయలుండడమా? అదీ, ఏదో పిత్రీయ మయిన ఆస్తిగాని, ఏలాటరీలోనో హఠాత్తుగా అప్రయత్నంగా వచ్చినటువంటిది కాక, కేవలం స్వార్జితమని ఒక్కొక్క రూపాయ చొప్పున పెంచిన ఆస్తా? ఇక ఈర్ష్యకేంలోటు? తానేం బాగా చదువుకొన్నవాడా? మొదట కొన్నాళ్ళు సంస్కృతం చదివి, తరవాత ఇంగ్లీషు ఆరంభించి, నాలుగున్నర అంటే ఇప్పటి మూడవ ఫారములో చదువు చాలించినవాడు. పోనీ అలాగని చదువుకోకపోయినా సహజమయిన మేధా సంపద విపరీతంగా కలవాడేమో అంటే అదీ లేదు. ఇన్ని సంవత్సరాలుగా కడుతున్న వడ్డీ లెక్కలు ఈ సరికి మరొకరికయితే కంఠతః రావలసింది, అయిదు వందలకీ వెయ్యికీ ఆర్నెల్లకి వడ్డీ కట్టడానికి కూడా అరగంటసేపు పలక మీద లెక్క చేస్తాడు. ఒకమారు వచ్చిన మొత్తాన్ని కాగితంమీద వేసుకొని దాన్ని చూడకుండా మళ్ళీ పలక మీద చేసి రెండు మొత్తాలూ సరిపోతే అప్పుడు తృప్తిపడేవాడు. రెండు మార్లూ ఒకే రకం తప్పు చేసి ఉండవచ్చుననే అనుమానం ఆయనకు కలగదు.

అవలీలగా ఎంతెంతలేసి లెక్కలూ నోటినే చేయగలిగిన వాళ్ళు, అనర్గళంగా గంటల తరబడిని ఉపన్యసించ గలిగిన వాళ్ళూ, అమూల్యమయిన పథకాలు వేయగలిగినవాళ్ళు, అతిలోక రమణీయమయిన కవిత్వం వ్రాయ గలిగిన వాళ్ళు——ఎందరో మంది తమకు శంకరశాస్త్రుల్లు యెడల కలిగిన ఈర్ష్య చాలా ధర్మ్యమయినదనే నమ్మకొనేవారు.

నిజం చెప్పవద్దూ, నామటుకు నాకూ ఒకప్పుడలాగే ఉండేది. నాకే లక్ష రూపాయిలుంటేనా, ఎన్నో గొప్ప పనులు చేసే వాణ్ణి. ఏమిటో అనినాకే నిశ్చయం లేదనుకోండి. శంకరశాస్త్రుల్లుకి అంత డబ్బును ధర్మంగా సంపాదించదగిన తెలివి తేటలు లేవు; ఇక ఉన్న డబ్బును లోకోపకారం నిమిత్తం కాకపోతే మానె అసమం తన ఆనందం కోసం అయినా ఖర్చుపెట్టే చొరవలేదు. గనక, అది కలిగి ఉండడానికి అతనికి అర్హత లేదు. అంతే కాదు, ఈ మాత్రం డబ్బుందికదా, నాకేం ఉచితంగా అక్కర లేదు. ప్రస్తుతం కొంత పెట్టుబడి కింద ఇయ్యకూడదా? ప్రస్తుతం ఏమీ హోమీ లేక పోయినందువల్ల అపనమ్మకం పెట్టుకోవాలా? తరవాత అణా పైసలుతో సహా అసలు వృద్ధులు తీర్చివేయనూ? వ్యక్తి గౌరవం మీద శంకరశాస్త్రుల్లుకి అంతపాటి నమ్మకం ఉంటే మరింక కావలసిం దేమిటి?—— నాకు పెళ్ళి అయి, పెళ్ళాం పిల్లలూ ఉంటేమాత్రం

నించి పోయిందేమిటి? తాను నన్ను పెంచుకోరాదూ? ఎవణ్ణో కళ్ళు తెరవని పసి కూనను పెంచుకొని వాడికి చదువు చెప్పించితే, ఒకప్పుడు ఆ దత్త పుత్రుడుకి చదువబ్బక పోవచ్చును. నేను ఇప్పుడే గ్రాడ్యుయేటుని — ఆ తరవాత వాడికి పెళ్ళి చేసి, తీరాచేస్తే దంపతుల మధ్య ప్రేమానురాగాలు లోపించవచ్చును. పోనీ, దంపతులు సానురాగంగానే ఉన్నా వాళ్ళకు పిల్లలు కలగక పోవచ్చును. ఇంత పెంచుకొన్న ప్రయోజనమూ నశిస్తుంది. వంశం నిలబడకపోతే వాళ్లూ మళ్ళీ దత్తతచేసుకొని, ఇన్ని పాట్లూ పడాలి. అటువంటి చిక్కులేవీ కలక్కుండా నన్నే దత్తతచేసుకొంటే — గిరీశం చెప్పాడే, పెళ్లిమీద పెళ్లి, పెళ్లిమీద పెళ్లి చొప్పున బాల్యవివాహాలూ చేసి చివరికి నావంటి ప్రయోజకుడికిచ్చి పెళ్లిచేస్తే, అని, అవిధంగా ఉండదూ? ఉండకేం, మహారాజులా ఉంటుంది. కాని, ఈ బుద్ధి నాకూ మీకూ కలిగి ఏం లాభం? అశంకర శాస్త్రుల్లుకి కలగాలి గాని,...అలాఅలా విభజించుకొని పోతే నా ఈర్ష్య ఇన్ని చిలవలూ పలవలూ వేసింది.

ఇదంతా జనక ఎప్పుడో శాస్త్రుల్లుగారిని గూర్చి సరిగా తెలియనప్పటి సంగతి. ఇప్పుడుమాత్రం నాకు ఆయనను తలచుకొంటే ఈర్ష్య కలగదు గాని, అదొకమాదిరి జాలితో కూడిన ఉపేక్షాభావం కలుగుతుంది. లేదు నీలో ఇంకా అంతర్వాహినిగా అప్పటి ఈర్ష్యాభావమే ఉంది; దానికి కొత్తరంగు పూస్తున్నావు అంటే మరిచెప్పలేను గాని, నా దృష్టిలో కలిగిన మార్పుకు కారణాలు తెలియజేసుకొంటున్నాను.

ఆయన అటూఇటూ పూర్తికాని, చదువుతో, ఎలాగో అతికష్టంమీద గవర్నమెంటులో పాతిక రూపాయిల జీతంమీద గుమాస్తాగిరీ సంపాదించాడు. లంచాలు పుచ్చుకోకపోవడమూ, యధార్థంగా ముక్కుకు సూటిగా పోవడమూ కారణంగా మాత్రమే ఉద్యోగం పోయిందట. తాను స్వయంగా లంచాలు పుచ్చుకోలేనివాడు తనపై అధికారులకు సదుపాయాలూ మామూళ్లు ఏం చూడగలడు? కొత్త సంసారం, అందులో ఇంటియజమానికి ఉద్యోగం లేని సంసారం, అందులో ఒక చిన్నపిల్ల — ఆ పిల్ల ఉద్యోగం ఉన్న కొద్ది సంవత్సరాలు అతిగా ముజరిపేడు... అటువంటి రోజుల్లో ఉద్యోగం పోవడంతో, మనిషికి ఒక పెద్ద పట్టుదల వచ్చింది. ఎంత దూరమయినా సంభావనలకూ సంతర్పణలకూ హాజరయేడు. కోమట్లకు లెక్కలు సరిచూసి పెట్టేవాడు. దస్తావేజులు రాసేవాడు; జాతకాలు చూసేవాడు స్వయంగా తనకు విశేషం నమ్మకం లేకపోయినాను. ఇలా, ఒకటేమిటి, రాత్రిం దివములు అలా ఏదో పని చేస్తూనే ఉండేవాడు.

ఆయన భార్యకూడా అన్నివిధాలా కలిసి వచ్చిన మనిషే. ఆవిడ పొందిక జగత్ప్రసిద్ధి చెందినది. ఆ పొందికని వేరే మాటల్లో చెప్పాలంటే, కేవలం ప్రాణం నిలబడి ఉండడానికి తగిన కనీసపు ఆహారాన్ని మాత్రమే తీసుకొంటూ, చిరుగులు కుట్టిన కుట్లే తప్ప బట్ట కనబడనంత వరకూ ఉపయోగిస్తూ, ఏ యితరఖర్చూ పెట్టకుండా నిద్రపోయినకొద్ది గంటలు మినహా ఏదో తృణమో కణమో కలిసివచ్చే పని చేస్తూ ఉండడం...ఆయన కేవలం చెంబు పట్టుకొని, యాయవారానికి వెళ్లలేదు: ఆవిడ ఇంత జీతానికి అని వంట లక్కగా నిర్ణయంగా ఎక్కడా కుదురుకో లేదు. అంతేగాని, ఇద్దరూ అంత పనీ చేసేవారు.

ఏటేటూ ఫలసాయం సరిగా రాని భూమిని అమ్మగా వచ్చిన కొద్దిపాటి మూలధనంతో వడ్డీవ్యాపారం ఆరంభించాడు. వందా యేభైయేకాదు. ఒకటీ రెండూ అయినా పదీ వడ్డీకిచ్చేవాడు. ఇవ్వడమయితే, ఎంత తక్కువని ఇచ్చేవాడో, వసూలు చెయ్యడంలోనూ అంత కట్టుదిట్టంగా ఉండేవాడు. అందరూ అతన్ని శాపనార్థాలు పెట్టేవాళ్లే. 'అప్పుడేదో తెలియక బుద్ధి గడ్డితిని పుచ్చుకొన్నాం, ఇక మరెప్పుడూ ప్రాణంపోయినా అతనిదగ్గర అప్పు తీసుకొని రాకూడదనుకొనేవాళ్ళే. కాని మళ్లీ అవసరం కలిగి అతని దగ్గరకి వెళ్లినప్పుడు అతను పాత సంగతులన్నీ మరిచిపోయి ఉంటాడనే తమను తాము నమ్మించుకొనే వారు; అతనూ నిజంగానే మరిచిపోయినట్లే ఉండేవాడు. వాళ్లిష్టం ఏమాట అనుకోనీ, మాటలేం మనమీదపడి కొట్టేయా? మనడబ్బు మనకి ప్రధానం! ఇదీ అతని తత్వం.

భార్యకి జబ్బుచేసినప్పుడు ఆయన డబ్బిచ్చి వైద్యం చేయిస్తాననే అన్నాడు. ఆమెమాత్రం ఉచితంగా వచ్చే మందుతప్ప, తనకు వంటిమీద స్పృహ

ఉన్నంతవరకూ ఒకదమ్మిడీ అయినా ఖర్చుపెట్టనియ్యలేదు. ఆమె పోయిన తరవాత, అప్పటికే పన్నెండేళ్ల పిల్ల కూతురికి పెళ్లి చేసేడు. తరవాత నాలుగయిదేళ్ళలో దురదృష్ట వశాత్తు, ఆమెకు వైధవ్యం ప్రాప్తిస్తే అదంతా శంకరశాస్త్రులు ముసలివాడికిచ్చి పెళ్లిచేసిన కర్మ ఫలితమే అంటారు కొందరు. అయినా వాళ్లకి అసలు విషయమేమిటో కావలిస్తే కదూ, తనంటే కిట్టక ఏవో అలా అంటారంతే.

కూతురు తిరిగి వచ్చిన తరవాత ఒక ఏడాది పాటు బాగానే ఉంది తన స్థితికి తగినట్టుగా. తరవాత కాశీయాత్రకి వెళ్తానంది. ఒక వారంరోజులు పాటు ఆలోచించి, ఇక దానికి ఐహిక జీవితంలో మరేమీ అవలంబనం లేదు; ఎప్పటి కయినా ఆముష్మికం చూసుకోవలసినదే కదా అని, డబ్బిచ్చి తగిన పెద్దవాళ్లతో కలిపి పంపాడు. ఆ వెళ్లడం కూతురు ఎవడితోనో లేచిపోయిందనీ, యాత్ర అన్నది కేవలం ఒక మిష అనీ, తెలిసింది. 'సరే, దాని మొగుడితోపాటు అదీ పోయిందనేసు కొంటా' నన్నాడు శంకరశాస్త్రులు.

ఇప్పుడు బాగా పెద్దవాడయి పోవడంచేత, ఎక్కడికీ కదలలేడు. ఎప్పుడూ ఇంట్లోనే ఉంటాడు, ఉంటాడంటే ఊరికే గోళ్లు గిల్లుకొంటూ కూర్చుంటాడా? పెరట్లో అన్నిరకాల కాయగూరలూ పండిస్తాడు. తనకు ఎక్కువయినది అమ్మేస్తాడు, ఓపికగా బియ్యపుగింజలు ఒక్కొక్కటే ఏరుకొని, వండుకొని, భోంచేస్తాడు, ఒక్కపూటే. రెండవ పూట ఏదో ఒక పండుతిని కొద్దిగా మజ్జిగ తాగుతాడంతే.

ఇప్పుడు మునపటి ఆ వసూలు చేసుకొనే ఓపికా, జ్ఞాపకశక్తీ తగ్గిపోవడంవల్ల, కేవలం బంగారం వెండి వస్తువులమీద తప్ప డబ్బు ఇవ్వడం మానుకొన్నాడు. అతని దగ్గర డబ్బు తీసుకొని వెళ్ళిన ప్రతివాళ్ళూ అంటూ ఉంటారు. "ఇంత ముసలివాడయేడు. నా అన్నవాళ్లెవరూ లేరుకదా ఎందుకంత డబ్బు కక్కుర్తి చెప్మా?" అని. కాని, ఆ కక్కుర్తివల్లనే, తమకు ఆమాత్రం అప్పు ఇయ్యగలపాటి డబ్బు చేరిందనీ, అతడు అందరిలాగే సామాన్యమయిన జీవితం గడిపి ఉంటే, అందరికంటే దరిద్రుడుగానే ఉండునని గ్రహించరు.

అతని జీవిత వివరాలు తెలుసుకొన్న తరవాత అతన్నిచూసి ఎలా ఈర్ష్యపడడం? మళ్లీ నా జీవితమంతా మొదటనుండీ బ్రతకడానికి సావకాశం ఉన్నా, అతని జీవితం వంటిది ముమ్మాటికీ నాకక్కరలేదు. నాకే కాదు, చాలామందికి అలాగే ఉంటుందను కొంటాను.

అడవిలో పట్టిన తేనెపట్టు ఎవరికీ లభ్యం కాకుండా పోతున్నదే అనుకొంటే ఎంత ఫలితమో, అతని డబ్బు ఎవరికీ కాకుండా పోతున్నదే అనుకొన్నా అంతే ఫలితం. అయితే తేనె పట్టులోని తేనెను సమకూర్చడానికి తేనెటీగలన్నీ కలిసి పడ్డ కంటే ఎక్కువే కష్టపడ్డాడుగాని తక్కువ పడలేదు దానిని సంపాదించడానికి. అటువంటి శంకరశాస్త్రుల్లును చూసి ఈర్ష్యపడడం దేనికి? ఇంతకీ అతని ఆస్తంతా మహాఉంటే ఒకటిన్నర లక్షలు. ఆ మాత్రం మొత్తాన్ని అవలీలగా ఏమీ లక్ష్యంలేకుండా ఖర్చుపెట్టే శ్రీమంతులున్న మన వ్యావహారిక జగత్తులో అతన్నిగురించి అంతగా అనుకోడం ధర్మం కాదు కాని, భూగర్భంలో నిక్షిప్తమయి ఉన్న అమూల్యమయిన ఖనిజాల గురించి కలగని ఆలోచన తేనెపట్టును చూసే సరికల్లా కలుగుతుంది ఎలా దీన్ని సంపాదించడమా? దీనిలో ఏ మాత్రం తేనె ఉంటుందా? అని.

లోకులు, నాతోపాటు ఎవరేమనుకొన్నా సరే శంకరశాస్త్రులుగారు మాత్రం సంకల్ప సిద్ధుడు. ఆ తృప్తే లేకపోతే ఆయన ఇన్నాళ్ళు బ్రతకనే లేకపోయేవాడు.

---

# యజ్ఞఫలము

భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

[భాసమహాకవి సంస్కృతములో నిరువదిమూఁడు నాటకములు వ్రాసినాడని యందు "కిరణావళి" "మకుటతాడితకము" "ఉదాత్తరాఘవము" మున్నగునవి కలవని శ్రీ ఆర్. వి. కృష్ణమాచారిగారు వ్రాసిరి. ఇటీవలనే రాజవైద్య జీవరామకాళిదాసశాస్త్రి గారు "యజ్ఞఫల"మను ఈనాటకమును సంపాదించి ప్రకటించి యిది భాసమహాకవికృతమే యని నిరూపించియున్నారు. ఈ యభిప్రాయమును విమర్శకాగ్రేసరులగు డాక్టరు. పుస లేకర్, ప్రొఫెసరు సిన్హా మున్నగువారు విపుల విమర్శతో దీనిని బలపఱిచియున్నారు. ఈ విషయములెల్ల ప్రత్యేకవ్యాసమున నిరూపితమగును. ఇంతవఱకీ నాటకమే భాషలోనికి ననువదింపబడలేదు. ఈ తెలుఁగుసేతయే ప్రప్రథమ భాషాంతరీకరణము.]

### ఇందలి పాత్రలు

సూత్రధారుఁడు
సుమంత్రుఁడు
కాంచుకీయుఁడు
విదూషకుఁడు
చిత్రకేతుఁడు, చిత్రరథుఁడు } గంధర్వులు
రావణుఁడు
మాళవకుఁడు, భద్రకుఁడు, దంతిలుఁడు, గోపలుఁడు } వైతాళికులు
దేవతలు
గంధర్వులు
రాక్షసులు

దశరథుఁడు [రాజు]
విశ్వామిత్రుఁడు
వసిష్ఠుఁడు
రాముఁడు, భరతుఁడు, లక్ష్మణుఁడు, శత్రుఘ్నుఁడు } కుమారులు
జనకుఁడు
పరశురాముఁడు

నటి
విజయ
చేటి
మంథర
కౌసల్య, సుమిత్ర, కైకేయి } రాణులు
మధురిక, చతురిక, ప్రమృతిక, చంద్రకళ } సీత చెలికత్తెలు
సీత, మాండవి, ఊర్మిళ, శ్రుతకీర్తి } వధువులు

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్ర :

"శ్రీరాముండు కృపాళుతా భరత
సుశ్రీమంజులా కారుడున్
చారుశ్రీ శుభలక్ష్మణ ప్రథితుడున్
శత్రుఘ్న వీరుండు వి
స్తార ప్రాభవ మాని చంద్ర కృత
యజ్ఞ త్రాత, కోదండ హ
స్తా రాఘుండు ప్రసన్నమూర్తి
నిరతోత్సాహుండు మి మ్మోముతన్."

(తెరవంక జూచి) ఆర్యా! ఒకసారి యిటు రమ్ము.

నటి : (ప్రవేశించి) ఆర్యపుత్రా! వచ్చితిని. ఏమి పని?

సూత్ర : ఆర్యా! ఈ సభాసదులు మనము ప్రయోగించు నాటకము చూడఁ గోరుచున్నారు. వీరి సంతోషము కొఱకై వసంతఋతువునుఁగూర్చి నీ వొక పాట పాడుము.

నటి : సరే. (పాడును)

పాట :

"క్రొంజివుళ్ళ చేత మిసుల గోమలంబు లౌ లతల్
మంజులంబు లైన తియ్య మామిడిక్ సుగంధముల్
రంజకంబు లిట్టి తోట రక్తి చెందుచుండగన్
సంజవేళ మల్లెపూలు సరసమాడు నవ్వులన్."

సూత్ర : బాగు. బాగు. నీ పాటవలన నందఱు సంతోషించుచున్నారు.

(తెరలో) "ఏమి ! అందఱు సంతోషించుచున్నారు గదా!"

సూత్ర : (విని) ఓహో !

"పుత్రజన నోత్సవంబున భూవిభుండు
తనర, నుత్సవదాన సత్కారములను
వారు లెల్లర సంతోషపఱిచి యిచటి
కిదె సుమంత్రుఁడు విచ్చేసె, పద లతాంగి!"

(నిష్క్రమింతురు)

ఇది స్థాపన.

## ప్రథమాంకము

(ప్రవేశము : సుమంత్రుండు)

సుమం : ఏమీ ! అందఱు సంతోషించుచున్నారుగదా !

"పౌరులు తుష్టులైరి మఱి
బ్రాహ్మణు లెల్ల రభీప్సితార్థవి
స్తార సుఖాబ్ధి దేలిరి ; ముదంబున
శ్రోత్రియపుంగవుల్ సదా
చారులు సత్తమవ్రతులు సంయము
లందరి తృప్తి సర్వస
త్కారపరంపరన్ ; దలప
గామ్యము తీరనివారె లేరికన్.

కంచుకి : (ప్రవేశించి) అమాత్యా ! పురజనులను జానపదులను సంయములను సర్వజనములను సర్వవాంఛాపరితృప్తుల నొనరింపు మని నీకు మహారాజాజ్ఞయైనది. ఏయొక్కఁడైనను నెట్టికోరిక కోరినను దీరనివాఁడుండరాదని మఱి మఱి నొక్కి చెప్పిరి.

సుమం : మహారాజుమనసు తెలిసి నేనే సర్వము నొనరించితిని.

కంచు : మంచిది. సుమంత్రా ! మంచిది.

"జనపతియాంతరహృదయం
బు నెఱింగి యమాత్యపుంగవుండు శుభంబుల్
పొనరింప ధర్మసంగతి
గను నపవర్గంబు బరమకల్యాణంబున్."

మఱియు, నెవ్వరెవ్వ రెచటెచట నేయే కారణములచే బద్ధులైయున్నను వారివారి నెల్లర విడిపింపుమని రాజాజ్ఞ.

సుమం : బద్ధు లెవ రున్నారు ?

"దొంగలు లేరు రాజ్యమున
దుష్టులు వేదను లమ్మ్రవారల
న్యాంగన గోరువారు మఱి
వానెఱువారును ద్యూతకారు లె
న్నం గనరాదు ముందున కనంగ ;
బిత్యాణసుబద్ధుడౌ నృపుం
డంగనలం గుమారకుల నంది
గడించెను దద్విముక్తతన్."

విదూ : (ప్రవేశించి) మహారాజుగారి పుత్రకామేష్టిఫల మిప్పుడేసఫలమైనది. ఇన్నాళ్లు నేను మోదకములు మెక్కుటలో నాజఠరముపై నేమాత్రము దయ చూపలేదు. ఇటువంటి యజ్ఞములు నాలుగైనవా నే నప్రతిరథుఁడ నను మోదకవైరి నగుదును. నావంటివిప్రులు భోజనముచేసి తుష్టులగుబోనే యజ్ఞకర్మ సఫలము కాదు.

సుమం : ఓయీ ! సుందరకా ! నీకు సువర్ణము చాలినంత లభించినదా ?

విదూ : ఏమి ? నేను సువర్ణమును దినను. త్రాగను. ముట్టను. బంగారము ప్రియమనుటకు నేను రాజు ననుకుంటివా కోమటి ననుకొంటివా?

కంచు : ఓ మహాబ్రాహ్మణా ! మఱి నీకేది ప్రియము ?

విదూ : మోదక భోజనము.

కంచు : నీ వెన్ని మోదకములు తినగలవు ?

విదూ : మహారథుఁడను మహారా కొంతమంది శత్రువులను జంపగలడో యన్ని.

కంచు : పదివేలమంది శత్రువులను జయింపగలవాఁడే మహారథుఁడు.

విదూ : నేను పదివేల మోదకములను దినగల మహారథుఁడను.

కంచు : ఏమి ? ఒక్కదినమున నీవు పదివేల మోదకములు తినగలవా ?

విదూ : ఏమి ? ఒక్కదినములో మహారథుఁడు పదివేలమంది శత్రువులను జంపగలడా ?

కంచు : పదివేలమందిలో గొంతమంది చనిపోవుదురు. కొంతమంది పాఱిపోదురు. కొంతమంది చెల్లాచెదరగుదురు. కొంతమంది శరణుచొత్తురు. వీరిని మహారథుఁడు రక్షించును.

విదూ : నేనును గొన్ని మోదకములను మ్రింగుదును. కొన్నిటిని జెదరగొట్టుదును. కొన్నిటిని జితుకగొట్టుదును. కొన్నిటిని దయతో రక్షింతును.

సుమం : బాభ్రవ్యా ! వైతండికుడు హేతువాదమున కొప్పుకొనడు. వీనితో నేమి ? నేను నా పని చేసికొని మహారాజు నభినందింప నేగుదును. (ముందు చూచి) ఓహో ! సపరిజనుడై మహారాజిటకే వచ్చుచున్నాఁడు.

కంచు : నేను నాపనికై పోవుదును. (నిష్క్రమించును.)

విదూ : నేను తినగా మిగిలిన మోదకములను దాచుకొనుటకై పోదును. (నిష్క్రమించును.)

సుమం : ఆహా! మహారాజు వార్ధకదశయందైన నెంత రమణీయాకృతితో నొప్పుచున్నాడు! నిత్యము రాజకార్యముల నిర్వహించుచున్నను నాతడు నిత్య ప్రసన్నుడుగనే యుండును.

"పవనశతంబు లొక్కయెడ జల్పుచు;
జూచుకొనున్ స్వకార్యముల్
వివిధము లొక్కవంక; నరి
వీరుల నుక్కడగించు నొక్కట౯
విపులగ దన్పునొక్కటను మిత్రుల;
నొక్కెడ వేటలేను; ని
ట్లవిరళ కార్యభారమున నందడు
దుఃఖ మొకింతయేనియు౯.
"తరుణ వయస్కునట్లు సతతంబు
నొనర్చును స్వీయధర్మముల్
పరిణతి నందినన్ వయసు పాయదు
తేజము రాజచంద్రునిన్
నరవరచంద్రు పేరు వినినన్ గనినన్
జనముల్ రవంతయేన్
దురితమువంక బోరు; విడతుర్స
కలాపము లొక్క ప్రేమ్మెడిన్."

(సపరివారముగా రాజు ప్రవేశించును)

రాజు :

"రిపుభయ మింతయేనియు
ధరిత్రిని లేదు; సమస్త మానవుల్
విపుల నయార్థ సంపదల
విశ్రుతి గాంచిరి; అన్యవస్తుదు
శ్చపలత గాంచువారును
దుజాభరతన్ విలపించు వారలున్
గపటము జూపువారును
నకాలమృతి౯ గనువారు లేరిటన్."

"కాలవర్షంబు గురియు మేఘంబు లెపుడు
ఈతిబాధలు లేక సస్యేందిర కృషి
ఫల మనంత మొసంగును అలఘుపుణ్య
కలిత దైవానుకూల్యంబు కలుగబట్టి."

"వేద మధీతమయ్యె; రిపువీరులు
మ్రగ్గిరి; భూప్రజల్ సుఖా
పాదితులైరి స్వీయపరిపాలన
మందున బోలె; నెవ్వ రె
య్యేది మనంబులన్ దలచి రెల్లర
కయ్యది చేకు రెన్; మఱిం
కేది యొనర్పగా వలయు నిప్పుడు
నేను మహీజనార్థమై."

"దేవతలున్ బితరులు భూ
దేవతలున్ శరణుగోరు దీనులు నార్తుల్
వేవిధముల బూజితు లగు
చే విధి వంశవ్రతంబు నిష్టము నాకున్."

"పుత్ర జననంబుచేత సంపూర్ణమయ్యె
మన్మనోరథ మహిత సమ్మాన్య ఫలము;
ఇంతకంటెను మన్మనోభీప్సితంబు
లేదు వేఱొండు; సంతుష్టి లేదు వేఱె."

సుమం : (సమీపించి) మహారాజా! జయము.

"ప్రజల బాలింప యోగ్యు లాత్మజుల గాంచి
యాత్మభారంబు వారిపై ననువు పఱుప
హృదయభారంబు తొలగిపోయెనుగదా! నృ
పాలచంద్రము! సంతృప్తి పైకొనె గద!"

రాజు : సుమంత్రా! నిజమే. నీవు వెంటనే సర్వార్థిజనమును సఫలాశాచిత్తుల గావింపుము.

సుమం : మహారాజా! కావించితిని.

రాజు : శ్రోత్రియులను గోహిరణ్య దానములచే సంతోష పెట్టుము.

సుమం : మహారాజా! సంతోష పెట్టితిని.

రాజు : కారాగృహబద్ధు లగువారి నెల్లర విడిపింపుము.

సుమం : మహారాజా!

"ధర్మపరిపాలనంబున ధరణిజనుల
రాజవై నీవు పాలించి రాజిలంగ
స్వర్గసౌఖ్యము లంది యొప్పార జనులు
బద్ధు లెవ్వరు? దుఃఖసంబద్ధు లెవరు?"

రాజు :

"పూర్వపుణ్యంబున౯ రాజ్యభూమి పరమ
విస్తృతంబయ్యె; నింతటి విపులభూమి
ధర్మహీనుండు బంధనదండనమున
కర్హుడైనట్టి వా డొకండైన లేడె?"

సుమం :

"రాజసింహుడవై నీవు రాజ్య మేల
దుష్కృతం బొనరింపగా దొడగు నెవడు?
సూర్యుడు నిరభ్ర గగనాన శోభిలంగ
దారి కడ్డమువచ్చునే తమము తలప."

"ఇంతకు బద్ధులైన నరు లెవ్వరు
లే రిక నుండ బోరు భూ
కాంతుడ! బద్ధమోక్షణము కల్గు
ప్రశంసయె లేదు చూడ నా
వంతయు; ద్వత్పితృణపరిబద్ధుడ
వొక్కడ వీవె; కాని నీ
వంతయు జేసికొంటి వదె యార్య!
సుపుత్రమహోదయంబునన్."

రాజు : ఔను: నిజమే. పితరులఋణము తీర్పగంటిని కాని, మఱియొక దృఢతరబంధమే నాకు

కలిగినది. దానిని గడద్రోచి ముక్తిగను మార్గము మాత్రము కానరాకున్నది.

సుమం : ఏమది ?

రాజు : ఏమందువా ? నా నెత్తిమీద నెంత బాధ్యత పడినదో !

"చదివింపగవలె వేదశాస్త్రములు ;
వంశప్రాభవాచారముల్
మొదలన్ నేర్పవలెన్ ; వసిష్ఠ
పరమామోఘంబు నౌ ధర్మసం
పద చేకూర్పవలెన్ ;—రణస్థలిని
దివ్యాస్త్రాన్వితున్ గాంచి యా
పద పైబడ్డటు భీతిచెందురిపు
శ్రేణిన్—నేను భీతిల్లెదన్."

"రాగద్వేష వివర్జితాత్ములై
మహారాజ్యంబు లేలన్ ప్రజా
యోగక్షేమము జూడ ప్రోవ గనగా
యోగ్యుల్ కదా ! కాని నే
నీరంజాలను ధర్మబంధనము ;
నే డీపుత్త్రిరాగంబు తో
డై నిగ్గించె ద్విబద్ధతన్, గలదె
ముక్త్యైశ్వర్యంబు నాకేనిపన్ ?"

"దృఢతరంబుగ బంధింపబడితి బుత్త్ర
రాగపాశంబునన్ ద్రెంప రాదు దీని ;
మోక్ష మెట్లొక్కొ బుత్త్ర సమ్మోహపాశ
బద్ధునకు ? నిట్లు నాస్థితి భయదముగను."

ప్రతీహారి : (ప్రవేశించి) మహారాజా ! జయము. పుత్రోత్సవమైన పిదప కౌసల్యాదేవి మహారాజును జూడ వేడుకపడుచున్నది. తాను పెద్దభార్య గాన తొలుత నే తన్ను సంభావింప మహారాజును గోరుకొన్నది.

రాజు : విజయా !

"ఉత్తమవంశ ప్రభవయు
నుత్తమ పత్నియును నౌ మనుపాలిత య
త్యుత్తమ సుందరి దేవిని
నెత్తెరని నుపేక్షసేయ నిదె రమ్మందున్."

చేటి : (ప్రవేశించి) మహారాజా ! జయము. సుమిత్రాదేవి మహారాజ కృపచే సుశీలమునియు దా నిద్దఱుకుమారుల గన్నతల్లియగుటచే ముందుగా సంభావింప గోరుకొన్న దనియు చెప్పమన్నది.

"సర్వంసహా క్షమలోన ని
గర్వాణి మన్మిత్రతపూ సకలసంగతులన్
సర్వవశంవద యామెయు
నోర్వ నుపేక్షింప దన్ని యోగం బెంకన్."

(అంత మంథర, విదూషకుడు ప్రవేశింతురు)

మంథ : మహారాజా ! అభిజనానురూపాచారయు, రాణులలో గనిష్ఠయయ్యు గుణములలో జ్యేష్ఠయు, తన్వియయ్యు సగౌరవయు, మహారాజబహుమతయు, అప్రతిరథుడను కేకయరాజు కూతురును నగుదేవి తానే ముందు సంభావింపదగిన దని నివేదింపు మన్నది.

విదూ : (తనలో) అమ్మో ! ఈరంత వచనోపన్యాసము ! ఎంత తర్జన సహితము ! (ప్రకాశముగా) వయస్యా ! ఉపేక్షించినచో గనిష్ఠ యగుదేవి యేమి చేయునో వినదలచితి నని ప్రతివచన మిమ్ము.

రాజు : (తనలో)

"తనసుతునకు నభిషేకము
గొనగ బ్రతినగొన్న యీమె కోపించినచో
గననగు సింహికవలె నీ
మెను రాణులతోడగూడ మెప్పింపవలెన్."

(ప్రకాశముగా) మంథరా !

"పరమధర్మార్థకామ సత్త్వాలనమున
సేవనీయులపై భేదభావ మున్న
మువ్వురనుగూడ సమముగా ముదముతోడ
నాదరింతు సపుత్రుల నచిరమునను."

అందుచే నందఱును మధ్యమమందిరమున నారాక నిరీక్షింపుడంటి నని చెప్పుము.

మంథ : (తనలో) ఏమి ? మా రాణిని ముందు గౌరవింపడా ? (ప్రకాశముగా) మహారాజు సెలవు ప్రకారమే.

(ప్రతీహారి, చేటి, మంథర నిష్క్రమింతురు.)

రాజు : అమాత్యా ! నీవును వెళ్ళిరమ్ము. నేను రాణుల నభినందింతును.

సుమం : చిత్తము. (నిష్క్రమించును.)

విదూ : వయస్యా ! నీవు మువ్వురు దేవులను సమానముగా మన్నింపరాదు. సుమిత్ర కిద్దరు కొడుకులు—కైకేయి కొక్క కొడుకు. కావున, సుమిత్రపై జూపిన మన్ననలో సగమే కైకేయిపై జూపవలయును.

రాజు : వయస్యా !

"కనగ ధర్మార్థకామమోక్షములలోన
భేద మెటులేనో పుత్త్రులన్ లేదు నాకు ;
ఒక్క వేదంబునైనను దక్కవన్న
యాతడు విప్రుండె ? వైదికుం డనునె యతడు ?"

విదూ : (తనలో) ముగ్గురు రాణులు త్రివర్గతుల్యలు. నలుగురు కొడుకులు చతుర్వర్గతుల్యులు. ఐదుగురు సమకూడినచో నేమనవలయునో ? (ప్రకాశముగా) నేను నీకు గనిష్ఠవయస్యుడను. నీ పుత్రులతోపాటు సమానముగా బోషణీయుడను కానిచో నీతో స్నేహముచేయను. అపుడు పురుషార్థములు నాలుగు. వేదము లైదు లేవు కదా !

రాజు : (నవ్వి)
పంచమహా యజ్ఞంబుల
నెంచన్ విప్రుండు సమము నీ యైదిటితో
మించెదరు మీరు నల్గే
కించపడగనేల నీకొకింత వయస్యా!

విదూ : ఆఱుగురు లేరు. ఉన్న నీ మాటకొరి తనము తెలిసిపోయెడిదే. (ప్రకాశముగా) కొడుకులు పుట్టినదినమన్న యుత్సాహముతో నీ వాకలి సైతము మఱచితివి. సూర్యు డస్తమించుచున్నాడు. చూడుము.

రాజు: ఓహో! సంధ్యాకాలము సమీపించినది.

శరణమొసంగు వృక్షముల జ
యన బక్షులు చేరి కూసెడుఁ
గిరణములన్ సభిస్థలిని నిం
పెడు నర్ధశశాంకు డిప్పుడే;
చరమ నగంబునన్ దినవిశాంపతి
గ్రక్కును గాంతిపుంజముల్;
పరగు బ్రకాశమున్ రజని
భవ్య ముఖామల భూషణం బనన్.
మఱియు.
హిమకరు డేగుదెంచి గగనేం
దిరకున్ గనుపండు వట్లుగా
విమల సరోలసత్కుముద విశ్రుత
మిత్ర పరీవృతుండు ను
త్తమ బహురాజ సంయుత యధార్థ
సుశాసియు నొట ను
త్తము డగురాజునా బరగు దత్త
దనూన విధాన కర్మలన్.
(నిష్క్రమింతురు.)
ఇది ప్రథమాంకము.

## విష్కంభము

(ప్రవేశము : కొంచుకీయుడు)

కొంచు : మహారాజు నా కిట్లాజ్ఞాపించెను. "ఓ బాభ్రవ్యా! ధారాగృహముకడ నున్న గ్రీష్మోద్యానమున కేగి యచట బరిజను లెవ్వరు నుండరాదని యాజ్ఞాపింపుము." మహారా జటకు విహారమునకు వచ్చును. రాణులు నుందురు. పరిజను లుండరాదని యేల యనెనో? ఏదైన రహస్యాలోచనము గలదా? రాణులతో గూడి రహస్యవిహారము మహా జెప్పుడును జేసియుండలేదే! నా కీగొడవ యేల? నన్నేమి చేయుమన్న నదియే చేయుదును.

"రాజుల చేష్ట లన్నియు గరంబు
దలంప నిగూఢ భావ వి
భ్రాజితముల్; సుమంత్రులకు గ్రాహ్యము
లస్యుల కట్లుగా వవే
యోజను శంక చేసినను నెవ్విధి
నెల్లడిచేయ దోషమూ;
పూజితబుద్ధి కన్నులను మూసికొనఁ
దలపోయ గృత్యమూ."

(అంత, చేటికలు ప్రవేశింతురు)

ఒక చేటిక : ఆర్యా! నలుగురు కుమారులకు నాలుగు కుసుమ జవనికలను మేము సూత్ర మక్కఱ లేకయే తయారుచేయుచున్నాము.

కొంచు: మంచిదే. కొని, మఱియొక యుద్యానమున కేగి మీ కోరిక తీర్చుకొనుడు.

మఱియొక చేటిక : ఆర్యా! ఇంకొక యుద్యానమున నిన్నిరంగులు నింత పరిమళము కలిగిన పువ్వు లధికముగా లభింపవు.

కొంచు : ఐన నే నేమి చేయగలను? ఇపు డెవరు నిట నుండరాదని మహారాజాజ్ఞ.

చేటికలు : ఓహో! ఐనచో బోవుదము.
(నిష్క్రమింతురు)
ఇది విష్కంభము.

## ద్వితీయాంకము

(మహారాజు పరిజనులతో బ్రవేశించురు)

రాజు : (స్వేచ్ఛగా నడచి)
"చేసితి జన్నముల్ ఋషివిశిష్ట
విధిఁ బహుళప్రకారముల్;
దోసిళులన్ బ్రదానముల దుష్టిగ
నిచ్చితి బ్రోచితిన్ బ్రజన్;
వీసమునూడె శత్రుభయవిహ్వలతల్
గనరావు; నే నిరా
యాసముగా జరాభరత
స్వాంతమునందున శాంతి నందెదన్."

మఱియు :

"కంటిని నాత్మసౌఖ్యమునకంటె
బ్రజాసుఖ ముత్తమంబుగన్;
మంటి గులానురూప మను
మాన్యయశోధనవృత్తిచేత; నే
నుంటి స్వకర్మ వీడక మ
హోన్నతభోగములెల్ల నంది; జే
కొంటి జనానురాగ మిక
గోరిక నేది యొనర్తు నర్మిలిన్"

(ఆలోచించి)

"రాణులను ముప్పురను గూడ రంజిలంగ
జేసి రాజగుణాన్వితశ్రీ జెలంగు
రామచంద్రుని రఘువంశరత్న సదృశు
యౌవరాజ్యాభిషిక్తు జేయం దలంతు"

ఎవరక్కడ?

ప్రతీహారి: (ప్రవేశించి) మహారాజా! జయము ఏమాజ్ఞ?

రాజు: విజయా! అమాత్యుడగు సుమంత్రుని బిలువుము.

ప్రతీహారి: చిత్తము. (నిష్క్రమించి సుమంత్రునితో మరల ప్రవేశించును.)

ఆర్యా! ఇటు. ఇటు. ఇదిగో మహారాజు. సమీపింపుడు.

సుమం: (చేరి) మహారాజా! జయము.

రాజు: అమాత్యా! స్వాగతము. రమ్ము కూర్చుండుము.

ఇరువురు: (కూర్చుందురు)

రాజు: విజయా! నీవు బొమ్ము. (పరిజనులను జూచి) మీరును బోయి విశ్రాంతి నందుడు.

పరిజనులు: చిత్తము. (నిష్క్రమింతురు)

రాజు: అమాత్యా! నామనస్సు చింతాజాగరణపరవశమై యున్నది.

సుమం: (తనలో)

"భూరియశంబునుగన్నమ
హారాజిత కౌను; రిపుభయప్రదుడయ్యున్
దారప్రియుడై చింతా
భారజ్వరుడౌట కేమివచ్చెనొ కట్టా!

(ప్రకాశముగా) మహారాజా!

స్థిరధర్మవ్రతమున్ బ్రజా
ప్రియ మహావృష్టమ్ము నిశ్చత్రుతా
గురుతన్ గాంచిన నీకు
నెక్కడి వయా ఘోరవ్యధల్ దేవ! న
ల్వురు పుత్రుల్ వినయాన్వితుల్
బ్రజల కెప్డున్ క్షేమ పాత్రంబులై
పరగన్ మానసిక వ్యధాభరము
దేవా! యెట్లు కల్గెంగటా!

మఱియు:

"కృతసంస్కారులు వినయా
న్వితులున్ జనరంజకులును బితృభక్తులునౌ
సుతులన్ నల్వుర గనుగొని
ఇత లెల్లన్ బాయగవలె వేవేగ ప్రభూ!

లేక:

"అవిభక్తకుటుంబికి నె
ట్లవిరళదుఃఖంబు కలుగు నటులే నీకున్
సువిశాలరాజ్య మనియెడు
నవిభక్త కుటుంబమందు నది కల్గెనొకో?"

పోనిమ్ము. మహారాజా! చింతాప్రతీకార మూహింపరాదా!

రాజు: అందులకే నిన్ను బిలిచినది.

సుమం: సెలవిమ్ము.

రాజు:

"కైకేయీ తనయుండే
యేకైకప్రభువు గాగ నీమహి కెల్లన్
గైకకు వరమిచ్చితి నవి
వేకంబున దొల్లి దాన వెతగందు గటా!"

సుమం: ఐన?

రాజు:

"రాజ్యపాలన యోగ్యుండను రాముడె యగు
క్షత్రియగుణాకరుం డైన కారణమున
యౌవరాజ్యాభిషేకంబు నతని కేను
జేయదలచితి సుకరంబె? ఈయది కట!"

సుమం: మహారాజా! అది దుష్కరము కాదు.

రాజు: ఎట్లు?

సుమం:

"వినయ నయ ప్రవర్తన వివేక
గుణాదికపూర్ణుడైన రా
ముని మునురమ్మలున్ దనుదు
ముద్దులబిడ్డని గాగ ప్రేమ పెం
పున గనుగొంద్రు; జ్యేష్ఠుడగు
భూరిగుణంబుల దేజమందు; నా
తని కభిషేకమన్న ముదంబును
గాంతురు రాణు లెల్లరున్."

అందుచే నీవు చింతింపవలసిన పని లేదు. ఇంతకు కుమారు లుపనీతులైరి. శస్త్రి శాస్త్రాన్వయన పూర్ణులైన పిదపగదా యభిషేకము. ఇప్పటినుండియు నీ కీ చింత యేల?

రాజు: పుత్ర రాజ్యాభిషేక వివాదహేతువు నిప్పటినుండి యాలోచించిన నప్పటి కేయుపాయముచేనైన దానిని దొలగించుకొనవచ్చునుగదా! ఏలన ఒక్కొక్కప్పుడు:

"పరగ బ్రాప్తించితిం బౌనుపాయమునను
భావికష్టంబు తొలచుకోవచ్చును గద!
వచ్చి పైబడ్డ కష్టమ్ము బాపుకొనగ
త్రోవ వెదకుట యను ద్విధా దుఃఖకరము."

సుమం: నా కేమి యాజ్ఞ?

రాజు:

"పరిజన భృత్యమంత్రిజన పౌరజనంబులు
రాణులన్ నిరం
తరమును రామమానసు లనారత
రామవిధేయ చిత్తులౌ
కరణి నొనర్పు; మా భరతు
గాఢత రాగ్రజభక్తియుక్తి సం
భరితు నొనర్పు; మియ్యది సుమంత్ర!
తొలంచు మదాత్మ శల్యమున్.

సుమం: (తనలో) ఆహా! మహారాజు దూర

వృష్టి! (ప్రకాశముగా) మహారాజా! అట్లే యొనరించెదను. నీకు సర్వము సుముఖమగును. కావున నీ వావంతయు విచారింప బనిలేదు! (ముందు చూచి) మహారాజా! ముగ్వురు రాణులును బరిజనసహితముగా నిటకు వచ్చియున్నారు.

రాజు: మంచిది. నీవు వెళ్లిరమ్ము. నే నన్నజే మాత్ర మేమఱకుము.

సుమం: చిత్తము. (నిష్క్రమించును)

రాజు: రాణులు ముగ్వురు సపరివారముగా వచ్చియున్నారు. నే నీగ్రీష్మోద్యానమున గూర్చుండి వారి నందఱను రప్పించెదను. (నిరూపించి) ముందు కౌసల్య:

"మానినము త్రియంబు, ముసంముంచట
వచ్చిన లక్ష్మి, దివ్యశో
భాసము పేత కోటిసుమభవ్య లతా
లలితాంగి, నా యొడందలో (?)
భాసిలు మాననీయ పతిభక్త
తనూధరమున్ గమున్ శ్రమా
భ్యాసమునన్ దరించునది యామె
నుపేక్ష యొనర్ప ధర్మమే?"

తరువాతి సుమిత్ర:

"వ్రత నియమావళీ పరమవంద్య
కృశాంగి, ముఖాంబుజ ప్రభా
వితత శుభాంగి, యుత్తమ వివేక
వతీమణి, నోట గట్టిగా
సతివ యొకింగియున్ బలుక,
దర్శనిమీలిత నేత్రి, శాంతచే
వత, బహు సౌఖ్యదాయక, శుభప్రద
యామె నుతింప జెల్లదే?"

ఇక కైకేయి. ఆమె:

"కమల వనంబు మధ్యమున
గన్పడు భానుబింబ మట్లు నె
య్యమున మెలంగుచున్ నను
సముంచిత భంగి నిజాదు బూర్వవిా
యము, కపి నున్న లక్ష్యమున
నాదృతి జూపదు తా సపత్నులన్;
సమదమృగేంద్ర మట్టులనిశం
బౌక చీరికనోదు లోకమున్."

వీరిలో:

"తొలిమహిషి రామజననియు
విలసచ్ఛుభ లక్షణాంగి విశ్రుతవినయ సం
కలిత సగర్వయు నగు కో
సలరాజాత్మజయె నిత్యసమ్మాన్య యగున్."

కాని:

"దురభిమాన రోషములు ముందునకు గొనదు
సర్వమిత్రె సుమిత్ర యౌసత్యముగను
ఆత్మకామానుసారిణి యహరహంబు
నా యొడంద జయించిన నాతి యామె."

కైకేయి:

"ఏ కార్యంబు నెఱుంగని
యీ కాంతకు ముక్కునందె యొసగును గోపం
బే కాని విక్రమాన్వితి
నా కష్టము బాపె యుసురు నాకున్ గాచెన్."

ఐనను:

"ఈమె రోషము పరిగణియింపరాని
దగును శౌర్యప్రణయశీల యగుటచేత;
తలప ఛందోనుబద్ధవృత్తంబురీతి
శీఘ్రమున నే ప్రసాదసంసిద్ధి గూర్చు."

(అంత ముగ్వురు రాణులు పరిజనులతో ప్రవేశింతురు.)

అందఱు: మహారాజా! జయము.

రాజు: రాణులకు స్వాగతము. రండు. ఈ మణిఖచిత శిలాఫలకమున గూర్చుండుము.

అందఱు: (కూర్చుందురు)

రాజు: పరిజనులారా! మీరు పోయి విశ్రమింపుడు.

పరి: (నవ్వి) చిత్తము. మహారాజా! (నిష్క్రమింతురు.)

రాజు: ఆహా! గ్రీష్మకాల మధ్యాహ్న సమయమునైన నీశీతలోద్యాన మెటు లున్నదో చూడుము.

"భవనమృగంబులెల్ల దరుపంక్తుల నీడల
గూర్కునె దట్టమున్;
ప్రమిమిలవాపికాజలచరంబులు హంసలు
కృత్రిమంబులై
పవిదిని వాచు; గోత్రు లిట
బాడపత్రాళుల బంక్రమించు; దే
వుల గలట్టిపక్షు లిట
దారసిలున్ సుఖశైత్య మందగన్."

కౌస: ఈ యుద్యానవనము చూచినవారి కెల్లరికి సుఖావహమే కాని, నా కిదివఱ కిచ్చు సుఖ మిచ్చుట లేదు.

రాజు: ఏదైనను గాలము ననుసరించియే సుఖముకాని దుఃఖముకాని కలుగును.

"చన్నీటన్ స్నానము సం
పన్నము వేసవిని, కాని ముఱి శీతమున నా
పన్నము కావున గాలమె
యెన్నగ సుఖదుఃఖవితతి నిచ్చు నరులకున్."

కైకే: ఆర్యపుత్రా! ఈ కాలమున మే మేమి చేయవలయు నని నీకోరిక?

కైక: (లోనలో) ఈమె మాటలు శిలాక్షరముల వలె నుండును.

రాజు: ఈ యుద్యానరమణీయతం దిలకింప

చేయుటకే నేను మిమ్మిటకు బిలువనంపితిని. ఈచెట్టు నీడను జల్లగా గూర్చుండి సరసముగా మాటాడు కొందము.

రాణులు : సంతోషము.

రాజు : బిడ్డల కుపనయనములు చేసితిమి. పదునైదు సంవత్సరములు వచ్చినవి.

కైకే : ఔను.

రాజు : అందఱును గుణాశ్రయు లగువీరులే.

కౌస : (తనలో) రాముడే సర్వగుణాకరుడు ; రాజ్యయోగ్యుడు.

కైకే : పితృకులముకంటె ఎక్కువని కాదు గాదా!

రాజు : నిజమే. కాని :

"స్వగుణముచే గ్రియన్
బితరువంశము దీపితముం బొనర్చుట
త్యాగణీతిగౌరవంబగును నారయ
బుత్రున కట్టిచో నికన్
సుగుణము సత్తమాన్వయము
శోభిలజేయునుగాదె మిక్కిలిన్
వినుమున కీర్తి భారము వివేకముతో
బరికించి చూచినన్."

ఇంతకు వీరిలో నిన్నియు గలవు. దేనికిని లోపము లేదు.

అందుచే నందఱియందును నాకు సమానప్రేమ గలదు.

కౌస : (తనలో) నాకు మాత్రము రామునిపైన్నే యెక్కువప్రేమ.

సుమి : జన్మక్రమము ననుసరించియే నాప్రేమ భేదము.

కైకే : నాకు గుణాధికునిపై నెక్కువప్రేమ.

రాజు : గుణాధికు డెవడు?

కౌస : (తనలో) రాముడే.

కైకే : అవసరమైనప్పుడు చెప్పెదను.

రాజు : అందఱు నాదాయభాగమున కర్హులే.

సుమి : దాయవస్తువులలో శ్రేష్ఠ మేదో యది జ్యేష్ఠునికే రావలయు నని మనువు చెప్పినాడు.

కౌస : (సంతోషమున దనలో) మహారాజు దాయవస్తువులలో రాజ్యమే శ్రేష్ఠము.

రాజు : ఆచారవిషయమున మనువు ప్రమాణము. రాజధర్మవిషయమున వాసిష్ఠము ప్రమాణతమము.

కైకే : వాసిష్ఠ మేమనును?

కౌస : (తనలో) రామునికే రాజ్య మిమ్మని.

రాజు : వాసిష్ఠమున నిట్లు గలదు :

"ధనకనకాదికం బయినదాయము
పుత్త్రులు పంచుకోదగున్ ;
గుణముల శ్రేష్ఠు డెన్న నయిశోభను
బెద్దఱికంబు సర్వదా ;
యనుపమ సైన్యనాయకత యా
గురుశౌర్యునకే, వయోగుణం
బున నది కాదు ; రాజ్యమును బొందగ
నర్హుడు యోగ్యవర్తియే."

కైకే : యోగ్యత ప్రతి పురుషుని దృష్టిని భిన్నముగా నుండును. ఒకని మనసునకు యోగ్యముగా దోచునదే మఱియొకని కయోగ్యముగా దోచును.

రాజు : (తనలో) ఏదో వ్యాజమున నా కోరికకు విరుద్ధభావమును జైకి జూపి కార్యసిద్ధి నందుదును. (ప్రకాశముగా) కుమారులు నలుగురు యోగ్యులే. రాజ్యమును నాలుగు భాగములు చేసి యొక్కొక్కని కొక్కొక్క భాగ మిచ్చెదను.

కౌస : (తనలో) రాజ్యమంతయు రామునికే యీదగును.

కైకే : ఇదియు వాసిష్ఠమతమే యగునా యేమి? ఇట్టి యనాప్తవచనమునకు ప్రమాణ మేమి? ఏక రాజ్యమే కాని సామ్రాజ్యవిభాగము పనికిరాదు.

రాజు : మఱి రాజ్య మెవరి కీయదగును?

కౌస : (తనలో) రామునికే.

కైకే : యోగ్యతమునకు.

రాజు : (తనలో) ఇప్పుడే సర్వము మాటాడుదును. (ప్రకాశముగా కైకేయితో) మన వివాహకాలమున నేను నీకిచ్చిన వాగ్దానముమాట జ్ఞప్తి యున్నదా?

కైకే : అంతయు జ్ఞప్తి యున్నది.

రాజు : కావున భరతుడే రాజ్య దాయార్హుడు.

కైకే : ఏ స్త్రీ పుత్త్రునకు రాజ్యలాభము కలిగిన సంతోషింపదు?

కౌస : (తనలో) ఈ మాట వజ్రపాత సదృశము. (మూర్ఛిల్లును)

సుమి : మహారాజా! రక్షింపుము. కౌసల్య మూర్ఛిల్లినది.

(రాజు పైబట్టతో విసురును. కైకేయి పుష్కరిణి నుండి జలము తెచ్చి ముఖముపై జల్లును. సుమిత్ర కాలుసేతులు రాయుచుండును.)

సుమి : దేవి తేరుకొన్నది. (కౌసల్యకు స్పృహ వచ్చును.)

రాజు : దేవీ! ఏల మూర్ఛిల్లితివి?

కౌస : మధ్యాహ్నవేళ యిటకు వచ్చితిని. ఎండదెబ్బ తగిలినది.

రాజు : (తనలో) రాణి దుఃఖకారణము కౌశలము కూడ బోధపడినది.

సుమిత్ర : మహారాజా! వివాహకాలమున జేసినప్రతిజ్ఞ ననుసరించి భరతుడు రాజగును. జ్యేష్ఠు

డగుటవలన రాముడు రాజగును. వారిరువురకు జేరి సగము రాజ్యమీయ దగును.

రాజు : నీకొడుకుల కేమిమ్మందువు ?

సుమిత్ర : నాకు నా కొడుకులకు నేమియు నక్కఱలేదు.

"శ్రీరామచంద్రు డాశ్రిత రక్షకుండయి
    రాజ్యమేలుచునుండ రమణ మీఱ
నేను లక్ష్మణునితో నిత్యంబు ప్రియమార
    సేవజేయుచునుందు జిత్తశుద్ధి
భరతశత్రుఘ్నులు పరిపూర్ణసుఖములు
    పొందుచుందురు సదానందు లగుచు
రాజ్యమన్నను బరరాజభయంబును
    స్వజనపాలన మహాభార మొసగు ;
నది యొసంగు నిరంతర మకట ! క్లేశ
సమితి ; జెడగొట్టు మానసశమము నదియు
నఖిలమును నెంచిచూడ మహాసుఖంబు
పరమశాంతియె ; యదియె సేవాఫలమ్ము."

రాజు : కైకే : ఆహా ! సుమిత్రాదేవి త్యాగము శమము. లౌల్యరాహిత్యము నతిసంభావనీయములు గదా !

కౌస : (తనలో) ఇంతమాత్రమున నాకు సంతోషము లేదు. (ప్రకాశముగా) నా సపత్ని యెంత మహానుభావురాలు !

రాజు : తల్లిగుణములు కొడుకులకు వచ్చునట. ఇట్టియామె పుత్త్రులే భ్రాతృసేవాచర్యభూతు లగు పుత్త్రులు: వారే ధన్యులు.

సుమి : నాకు గావలసిన దిదే :

"మానిని గాదు చూడ నభి
    మానిని గాదు ప్రపంచరంగస
మ్మానిని గాదు నిత్యమృదు
    మంజులవాక్చతురాస్య కాదు శో
భానన గాదు ధన్య యగు
    నామె సపత్నులచేత భర్తచే
మానిత కీర్తనీయ యగు
    మానిని దక్కగ భూతధాత్రిలో."

రాజు : ఇంతకు రాజ్యయోగ్యు డెవడు?

కైకే : నామాట పాటించుచో రాముడె రాజ్యార్హుడు.

కౌస : సంతోషము. సంతోషము.

సుమి : నామనసున నెట్లున్నదో కైకేయియట్లే పలికినది.

రాజు : వివాహకాలమున నే జేసిన ప్రతిజ్ఞ గతి యేమి ?

కైకే : శుభగతియే.

రాజు : ప్రతిజ్ఞాహాని పాతక మనియే సంప్రదాయము.

కైకే : భవాదృశులగు రాజర్షులకు ప్రతిజ్ఞాహాని యనర్థకము కాజాలదు.

ఏలన :

"ప్రతిన యుపేక్షితం బయిన
    పద్ధతిలో నది తప్పు ; లేక యా
ప్రతిన స్వసౌఖ్యలబ్ధికయి
    పాడొనరించుట తప్పు ; చూడ నీ
గతులను రెండిటిన్ బ్రతిన
    గాంచని యట్టులు చూడ ధర్మసం
గతి యగు నిక ; దీని కధి
    కారివి నీవె ; తలంపు ధర్మమున్."

కౌస : (తనలో) అయ్యో ! పిడుగుపాటు సంభవింపదుగదా !

రాజు : యుక్తమే.

కైకే :

"ప్రజల సౌఖ్యంబుకోసమే ప్రతిన నీవు
దాట జూతువుకాని స్వార్థమున గాదు ;
ప్రతిన తప్పుటవలన లవంబుకూడ
బాప మంటదుగద ! మహాభాగ ! నీకు."

మఱియు :

"గుణులలోపల రాముడే గుణివరుండు
పాలనార్హుండు శతమన్యుపగిది నతడె
భువనసంరక్షణార్థమై యవతరించె
విష్ణుపగిదిని విఖ్యాతవీరు డతడు."

ఒక కార్యము విచారించునపుడు కారణప్రాధాన్యము నుపేక్షింపరాదు. నన్ను సంతోషపెట్టుటకే నాకుమారునికి రాజ్యదాయ మిత్తునని నీవానాడు పలికితివి. రామునికి రాజ్యదానము చేయుటవలన నేను ప్రసన్ననగుదును. భరతునికి రాజ్యమిచ్చిన నెంతయో రాముని కిచ్చినను నాకంతియే.

రాజు : భరతుడును గుణవంతుడు ; రాజ్యార్హుడుగదా !

కైకే : ఔను కాని :

"అగుణవంతునికంటె మేలగును సుగుణి
గుణుల గుణవత్తరుడు మేలు కోటిరెట్లు
భాస్వరము రాత్రి వెలుగు దీపంబుపగిది
కాని యది యెంత మధ్యాహ్నభానుముందు ?"

వేయేల ?

"భరతుడు గుణి యగు గుణవ
త్తరు డగు రాముండు కాన దగు నతడే రా
జ్యరమం గైకొన సుగుణా
భరణుం డతి డతని కన్న బరముడు కలడే ?"

కౌస : సంతోషము. సంతోషము.

సుమి : ఆహా ! సపత్ని కైకేయి మహానుభావయు నీతిజ్ఞయు.

రాజు : మేఘములు గర్జించిననే కాని యమృత వృష్టి గురియదు.

కైకే : ఆర్యపుత్రా! ప్రణయ సమయమున నైన నిర్వ్యాజముగా నేను సత్యమే చెప్పుదును. అదియే మేఘ గర్జనము. అయుక్తమమాత్ర మెన్నడును బలుకను. అదియే యమృతవృష్టి. ఏలన

"అమృతవర్షము కురిసెడు నట్టిమేఘ
మెపుడు వర్తించు సహజమౌ వృత్తితోడ;
దానిమార్గ నిరోధంబు తనరె నేని
అశనిగూడను వర్షించు నది నిజమ్ము."

రాజు : (తనలో) అధిక ప్రసంగమువలన మతి యొక భీతి కలుగుచున్నది. ఈదేవి క్షణములో గోపించును. క్షణములో శాంతించును. కావున నిక నాకు శంక వలదు. (ప్రకాశముగా)

"ప్రాప్త కాలంబునన్ రాజ్యపాలకు డగు
సుగుణవంతుడు నైన మత్సూనుడు; డపుడు
నియతి నాతం డొనర్చును నిశ్చయముగ
సర్వసౌఖ్యాన్వితుల గాగ సర్వజనుల."

కైకే : ఆర్యపుత్రా! ఇపుడు మన మనుకొన్నట్లే జరుగగలదు. మన మట్లే తప్పక యొనరింతము.

కౌస : మహారాజా! సాయంతన క్రీడల కేగిన కుమారులు నలువురు జ్యేష్ఠ నను నాకు నమస్కరింప వచ్చియుందురు. వారిని సంభావింప నే నేగి వచ్చెదను.

సుమి : కుమారు లందఱు నువ్వురు తల్లులకు సాయంకాలము వచ్చి నమస్కరింతురు. వారికి జ్యేష్ఠ, కనిష్ఠ భేదము లేదు.

కైకే : ఔను. నేనును బోయివచ్చెదను.

రాజు : మంచిది.

రాణులు : (రాజునకు నమస్కరించి నిష్క్రమింతురు)

రాజు :

"ముదిమి గలంగు మానసము
మోదమునందెను వీరి వర్తనన్
బదుగుర కుండ దొక్క రుచి;
వర్తిలు భిన్నరుచుల్ జనాళిలో;
నొదవును జ్యేష్ఠ కాత్మసుతు
నున్నతి రక్తి; కనిష్ఠ కీర్ష్యయౌ;
మచులు విభిన్నముల్; కలుగు
మాటికి దుఃఖము నాకు నింటిలో."

"బహు భార్యాత్వము నరునకు
బహు సౌఖ్యావహము గాదు పరికింపంగా
బహు మానసరోగంబులు
బహురాగము కూడ నతని బట్టి పలార్చున్."

ఎవరక్కడ?

ప్రతీహారి : (ప్రవేశించి) మహారాజా! జయము ఏమి. సెలవు?

రాజు : విజయా! సుమంత్రుని బిలువుము.

ప్రతీ : (నిష్క్రమించి సుమంత్రునితో ప్రవేశించి) ఆర్యా! ఇటు. ఇటు.

సుమం : మహారాజా! జయము.

రాజు : అమాత్యా! స్వాగతము. రమ్ము. కూర్చుండుము. విజయా! నీవు బయట కేగి కూర్చుండుము.

ప్రతీ : చిత్తము. (నిష్క్రమించును)

సుమం : ఏమి సెలవు?

రాజు : నే నిపుడు కైకేయి మహానుభావత సుమిత్ర యలోలుపత తెలిసికొంటిని.

సుమం : ఎట్లు?

రాజు : కైకేయి తనయునికే రాజ్య మిచ్చెదనని నా ప్రతిజ్ఞ యన్న నామె గుణవత్తరునకు రాజ్యమీయ దగునన్న న్యాయముచే రామునికే దానిని విడిచిపెట్టినది. ఇక, సుమిత్ర తనయులతో రామసేవామిగ్నత గోరుకొన్నది. వీరి మహానుభావత పరమాశ్చర్యభరితము కదా!

సుమం : ఔను. కాని,

"భావిన్ సౌఖ్యము గోరి సూరిజనముల్
భావించి బాగోగులన్
సేవింపన్ వోరంకొంద్రు న్యాయపథమున్
జెందర్మహా కష్టమున్;
దైవాయత్తము లోకమంతియు; క్షేమున్
జంపుక్ సదా దైవమే;
జీవుం డెట్టులొనర్చు దొంటి జనిలో
సిద్ధించు నట్లే జనిన్."

అందుచే :

"పుత్త్రులు నల్వురున్ సుగుణపుంజము
లద్భుత సూరిశేఖరుల్
గాత్రము లెన్న వేఱయిన గాని
మనస్సులు చూడ నొక్కటే
మాత్రము ప్రేమ భంగమును మాత్రము
కల్గగ నీదు రాజ్య మీ
పుత్త్రుల; కెంతవాడి యగు ముల్లును
నీళుల జిల్లుపుచ్చునే?"

కనుక, నీవు రాజ్యప్రదాన చింతను విడువుము. రాముడే రాజగును. నీవు సంతోషముగా నుండవచ్చును. జను లెల్లరు సంతోషింతురు. ఇక నీ కేమి కావలయును?

రాజు : నే నిపు డదే యాలోంచుచున్నాను.

సుమం : వసిష్ఠ భగవాను లిట్లు విన్నవించిరి.

రాజు : గురుభగవాను లేమని సెలవిచ్చిరి?

సుమం : ఇట్లని; "కుమారులు :

"వేదములెల్ల నేర్చిరి వి
వేకమునన్ శుభవిద్య లెల్ల న
త్యాదరణంబునన్ వినిరి
యోగావనమంది కుశాగ్రబుద్ధిసం
వేదిత శస్త్రశాస్త్రబహు
విద్యల గాంచిరి వీరి రాజనీ
త్యాదుల శాసనాదిక వి
ధాతల జేసి యనుగ్రహించెదన్."

విదూ : (నవ్వుచు ప్రవేశించి) ఓయీ! వయస్యా! ప్రతీహారులు నన్ను రానీక పోగా వారితో బోరాడి నీకొక ప్రియవిశేషము చెప్పుటకై యిట వచ్చిపడితిని.

రాజు : ఏమి ప్రియము?

విదూ : రామునకు రాజ్యాభిషేక మగునని కౌసల్య నాకెన్నో మోదకములు పెట్టినది. ఈసంగతి యంతయు నీకు నివేదించుటకై వచ్చుటవలన నా హృదయభారము మోదకభారము కూడ దిగ్గిపోయినవి.

రాజు : ప్రతిదినము నీవు మోదకములే తిందువుకే. రాముడు రాజైనను భరతుడు రాజైనను నీకు మోదకములకు మాత్రము లోటు లేదు. చింతింపకుము.

విదూ : ఏల చింతింపకుము? రాముడు రాజైనచో కౌసల్యాదేవి బహుమోదకములచే నన్ను ప్రీతిని జేయును. భరతుడు రాజైనచో కైకేయి బహుతర మోదకములచే నన్ను సంతుష్టిని జేయును.

సుమం : వసిష్ఠభగవానులతో నేమని నివేదింతును?

విదూ : (జనాంతికముగా) అమాత్యా! నేనేమైన జెప్పిన నావయస్యుడు కోపించును. నీ కా సంగతి తెలియదు. (రాజుతో) నేను మోదకములతో సంతోషింపనంతవరకు అభిషేకవిధి ప్రారంభింపరాదని వసిష్ఠునితో జెప్పెదను.

రాజు : భగవానులు గురుపాదులు నగు వసిష్ఠులతో శీఘ్రమే తాము సెలవిచ్చినప్రకారము చేయుదుమంటి మని నివేదించిరమ్ము.

విదూ : (అపవారించి) వయస్యునకు క్షోభ కలిగింతును. అంతకుమించి నాకేమియు తెలియదు కదా! (ప్రకాశముగా) నాకు దెలియని విషయము నీవు చెప్పవు. నే నడుగను. ఇపుడు నాకే తెలిసినది. భరతునకు వలసినరాజ్యము నా చెలికాడు రామున కిచ్చునట. నే నంతఃపురమున రాణులకు బయట భృత్యులకు పోరాటము కల్పింతును. లేనిచో బ్రాహ్మణోపవేశము జేయుదు నని యందఱను భయపెట్టెదను.

రాజు : అమాత్యా! నే జెప్పినది భగవానులతో జెప్పిరమ్ము.

సుమం : చిత్తము. (నిష్క్రమించును)

విదూ : ఈ కపట పండితుడు పోయినాడు.

రాజు : (మనలో) చపలు డగునీవటువు కలహప్రియుడు. ఆ కలహాంశల మేలెఱుంగడు. ఈ మూర్ఖుడు క్షోభ కలిగించునేమో యని శంక కలుగుచున్నది. కానిమ్ము. (ప్రకాశముగా) సఖా! సుందరకా! నీకో కథాప్రసంగవశమున రాజ్యదాయ విచారము కలిగినది. ఈ మాట యేమాత్రము నిజము?

అధిక విప్లవకరమైన యా నృపత్వ
మేల? సుకుమారచేతస్క లీవుడీయ
వృత్తి లేదె? పరిహాసపూర్వక మిది
ఇందు సత్యంబు కలదని యెంచకయ్య!"

విదూ : నిత్య మా కథాప్రసంగమే వచ్చుగాక!

(తెరలో)

"శక్రపురిన్ జయించి, సురసంఘము
గ్రోలి, నలంచి కీరరాట్
చక్రము రావణాసురుడు తాంతి
గడించియు భంగమొందె ని
ర్వక్ర పరాక్రమ ప్రకృతి రాము
చరిత్రము విన్న; నా కిటన్
వక్రగతిన్ నిగూఢమై యి వచ్చె
జరింపుడు జాగరూకులై."

రాజు : (విని) ఓహో! ప్రధానచారు డగు సబుద్ధి స్వనమువలె నున్నది. సుందరకా! నీవుపోయి నా వచనముగా నాతనితో "నీ మాట వింటిమి. సంగతి తెలిసిన"దని చెప్పుము.

విదూ : బాబో! నేను వెళ్ళను. దారిలో నే నే రాముడనుకొని యా రావణుడు నన్ను భ్రమింగి వేయగలడు.

రాజు : సరే. నేనే పోయెదను. (మనసులో)

"ఒక శంక నివృత్తం బైన
నొక సందేహాతంబు నయ్యె; ఒక దుఃఖమో నా
కకటా కొడుకులు లేమిన్;
వికలత హృదయకమ్మిపుడు వేయి విధములన్."
ఆహా!

"సుతులు జనించినారు వర
సూరు లటంచు వ్యాప్తి కెంచె ది
క్తతి నప్పుడే విరోధులును
దప్పులయందును లేవ జొచ్చి నీ
సుతు లతిబాలకుల్ పలస
హాయుడ నయ్యెను వృద్ధుడైతి నే;
నతి బలవంతు లుద్ధతు ల
హా! యరు లింక శరణ్య మీశుడే."

(నిష్క్రమించును) ఇది ద్వితీయాంకము.

# కవిసన్మానము



శ్రీ జనమంచి రామకృష్ణ

తారాసింగ్ : (వ్రాసుకునే బల్ల ముందు పెట్టుకుని వీధిలో వచ్చే పోయే జనాన్ని చూస్తూ) మిత్రులారా, నేడు సుదినం. ఈ వేళ ఎందుకో ఈ జీవితం అతి మధురంగా తోస్తూంది. స్వప్నాల్లో నే చూశా నా వనితని. ఎంత పవిత్రమైన నామం. ఎంత తీయనిది. చంద్రకళ, చంద్రకళ. నా స్వప్నసుందర్ని గురించి సున్నితంగా సుకుమారంగా గీతమల్లాను. (తలుపు చప్పుడు)

తాతబ్బాయి : తారాసింగ్, తారాసింగ్, విన్నావా...

తారా : అదేమిటట్లా రెండు చేతులు గాలిలోకి ఎగరేస్తూ తన్మయంతో వస్తున్నావు? తాతబ్బాయి... ఈ వేళ ఇంత త్వరగా గాడిపొయి ఆర్పేశావే? మరి రొట్టెలు చేయవూ?

తాత : నువ్వేదో కవిత్వపు కట్టలు రాసేసి పోగేస్తున్నట్టున్నావే... ఇంతాకా రొట్టెలు తినేందుకెవరో వచ్చారు. రొట్టెలో నంజుకుందుకు పచ్చడిబద్ద లేస్తూంటే ఒకడు 'ఒరేయి, ఆఖరికి కుబేరుడుగారు పిల్లకి పెళ్లి తలపెట్టాడురా?' అంటూంటే విన్నాను. ఇది నిజమేనంటావా?

తారా : నిజమేననుకో.

తాత : ఆదె. అందచందాలని వర్ణిస్తూ ఎవరైతే చక్కని ఇంపైన సొంపైన కవిత్వం చెప్తాడో అతని కామెనిచ్చి పెళ్లి చేస్తాడటకదూ?

తారా : కాని, ఇంకో షరతుంది తాతబ్బాయి.

తాత : ఇంకో షరతా.

తారా : ఔను, సూర్యాస్తమయం అయ్యే లోపుగా గీతాన్ని పూర్తి చెయ్యాలి.

తాత : ఓస్, ఇంతేనా, తప్పకండాను. ఇంకో ఓ ఘంటసేపు నాకు తీరుబడే. నాలుగు పంక్తుల్లో అద్భుతంగా ఓ గీతాన్ని వ్రాసేస్తాను. తారాసింగ్, ఓ మాటు మార్వాడికి ఓ ఘంటలో, రకరకాలైన రొట్టెలు తయారు చేసి ఇచ్చాను. అటువంటప్పుడు ఈ గీతం వ్రాయడం ఎంత సేపు చెప్పు? సరే కాని ఒక్క గేయం వ్రాస్తే సరిపోతుందా, లేకపోతే ఇంకా గీతానికి సంబంధించిన షరతులేమన్నా ఉన్నాయా?

తారా : కంసాలి వజ్రవైడూర్యాలని పొదిగి ఎంత బాగా నాజూకైన ఆభరణాన్ని చేస్తాడో ఆమోస్తరుగా నే, గేయంలో ఆమె పవిత్రనామాన్ని ఇమిడ్చి పొందికగా వ్రాయాలి.

తాత : ఓహో, రొట్టెలపిండితో రొట్టె చుట్టూరా ఆకులూ పువ్వులూ అమర్చినట్లు. అంతేనా ...అరే. తారాసింగ్, లోపల్నించి...అప్పుడే... ఏమిటి, కవిత్వం ఉబికుబికి పైకొస్తూన్నట్టుగా ఉంది.

తారా : సరేకాని, తాతబ్బాయి, ఆ గేయాన్ని మట్టుకు చక్కని దస్తూరిలో వ్రాయాలి.

తాత : పెద్ద ఇబ్బంది తెచ్చిపెట్టావే. మరి నాకు కలం పట్టటం రాదు. రొట్టెలపిండి రుబ్బుమంటావా, నీ ఇష్టం వచ్చినంత సులువుగా వయ్యారంగా శాస్త్రాన్ని...

తారా : తాతబ్బాయి, ఎందుకంత బెంగపోతావు. నేనున్నానుగా.

తాత : వట్టిపుణ్యానికి వ్రాయక్కర్లేదుకే!

తారా : ఒక్క దీనారం. వ్రాయడం అంతా నాకొదిలెయ్యవోయి. నీ గేయాన్ని చూసి, ప్రజంతా, అబ్బా, చంద్రకళ, తప్పకండా తాతబ్బాయినే ప్రేమిస్తుంది అని ఈర్ష్యపడాలి.

తాత : సరే, ఇదిగో...ఇంత నా గేయంగురించి ఆలోచించాలి...ఉండు ఆలోచిస్తాను...ఇదిగో, ఆమె దీపం, నేను మిడత అని ఆమెతో చెప్తాను... తారాసింగ్, నాకు మతిపోతూంది. భావాలు ఊరికే పరుగెత్తుకుంటూ వచ్చేస్తున్నాయి. నేను దీపాన్ని ఆమె నాచుట్టూ తిరిగే మిడతా...కాదు. కాదు...

మొదట ఎట్లా చెప్పాను తారాసింగ్? (తలుపు చప్పుడు)

తారా: ఎవరు వారు?

ఫరీద్: (అడుగులు చప్పుడుతో దూరాన్నుంచే) నేను, ఫరీదుని...

తారా: ఓహో హో...ఫరీదుగారా రండి, రండి, దయచేయండి, ఏమిటి వేళ ఇలా దయచేశారు.

ఫరీద్: ఏముందండి? ఇంతదూరం వచ్చాను కదా అని ఓమాటు చూసిపోదామని...(లోపలనుండి మూల్గువిని) అరే, ఎవరండీ అలా మూల్గుతున్నారు? ఏం పాపం, వంట్లో బాగులేదా? ఏమిటి ఆయన బాధ?

తారా: ఎరగరూ అతణ్ణి. తాతబ్బాయి. ఈ పక్క కొట్టులో రొట్టెలు చేసి అమ్ముతాడు.

ఫరీద్: నే నెరగనులెండి. ఔను కాని ఎందుకండి ఆయన ఘడీకోమాటు తలకాయ వేలితో కొట్టుకుంటాడు? ఘడీకోమాటు రెండు చేతులూ పైకెత్తి రాగం తీస్తున్నాడు...కొద్దిగా మతి...చెడిందా? పాపం, చిన్నవాడేనండీ...

తారా: (నవ్వుతూ) అబ్బే అతను కవితా వాహినిలో ఈత నేర్చుకుంటున్నాడు.

ఫరీద్: ఏమిటేమిటి? రొట్టెలమ్ముకు నేవానికి, కవితాహృదయమా? తారాసింగ్! చంద్రకళని వశంచేసుకునే నేర్పుతో, నిజంగా కవిత్వం అల్లగలడంటావా? (దూరాన్నుంచి) అబ్బబ్బా, ఏమిటీ గోల. నేను కవిత్వం ఆలోచిస్తూన్నట్లు తెలియదూ. ఎవరు? ఓహో. మీరా? ఫరీదుగారూ! ఎంతకాలానికి మళ్ళా కనిపించారు. సాయిబుగారూ, ఎప్పుడో తిన్న చిమ్మిలిరొట్టికి డబ్బు లిచ్చారు కారే. (పాడును) "లోన మధుకీలలేపిన దీప మీవు."

ఫరీద్: తారాసింగ్, తను తయారుచేసే రొట్టెల్లాగే వుంటుంది సుమా వీడి కవిత్వం. (నవ్వు) ఔనుకాని, నీతో ఓ విషయం మాట్లాడుదామని వచ్చాను...ఏమిటి, అది నిజమేనా...ఆఖరికి కుబేరుడుగారు చంద్రకళని......

తారా: ఔనయ్యా, ఏం నీకు, ఆ పిల్లమీద కన్నుపడిందా? ఊ...కానియ్యి...సుఫ్వా మొదలెట్టు కవిత్వం...

ఫరీద్: కుబేరుడుగారికి చదవడం రాదు గదా...మరతెందుకోయి. కూతురికి చదవటం వచ్చునని, తండ్రి కెంత గర్వం అనుకున్నావ్.

తారా: ఔనౌను. ఆమె చంద్రకళ కాదు... విద్యాసుందరి...చదువుల సరస్వతి.

ఫరీద్: ఔను తారాసింగ్, చంద్రకళ సామాన్యురాలు కాదు...నాపాట వ్రాసిపెట్టేందుకు ఎంత పుచ్చుకుంటావు?

తారా: ఎంతోనా, రెండు దీనారాలు.

ఫరీద్: రెండా? ఒకటందూ, నేనుగాని చంద్రకళని సంపాదించావా, నా డబ్బంతా నీదే.

తారా: సరేలే.

తాత: (దూరాన్నుంచి) తారాసింగ్, తారాసింగ్, నాకు కవిత్వం రావడం లేదు. ఒక పాదం వచ్చింది ..రెండోది ఎలాగ?

ఫరీద్: తేలికైందా? మరుగ్గా మబాగా ఉండాలా? లేకపోతే, హుందాగా ఉండాలా?

తాత: తారాసింగ్...రెండో చరణం ఎలాగ?

ఫరీద్: తారాసింగ్, వీణ్ణి ఇక్కణ్ణించి లేవ కొడితేనే కాని, నాకు భావాలు రావు. ఆ మొహం చూడు. పైగా గద్యంలో పద్యం వ్రాయడానికి సాహసిస్తున్నాడు.

తారా: ఫరీదుగారూ! పోనీ మీకు ఎక్కడ కూర్చోవాలని ఉందో చెప్పండి.

ఫరీద్: ఎక్కడో అక్కడ, కాస్త మెత్తగా ఉండాలి...ఇక్కడ మఖ్మల్ పరుపులూ బాలీసులూ లేవే. ఎలాగ కవిత్వం వ్రాయడం?

తారా: పోనీ అక్కడ కూర్చోండి!

ఫరీద్: (దూరాన్నుంచి) ఆఁ. అమ్మయ్యా. కాస్త బాగుంది. తారాసింగ్, ఇదిగో ఇప్పుడే చెప్తున్నాను. ఎవరొచ్చినా సరే, నా దగ్గరకిమాత్రం రానీయొద్దు. నా బుర్ర ఉండే, కాస్తే నా గొడవ ఓర్చుకోలేదు. అంత సుకుమారమైంది. కాస్త కరుకుమాట విన్నానంటే, మనస్సు చివుక్కుమంటుంది. పాడు మొహం కనిపిస్తే చాలు ఓ వారంవరకూ మతి చెడినట్లైపోతాను.

తారా: సరేనయ్యా బాబూ...

ఫరీన్ : ఐతే మరి నేను కవిత్వంలోకి దిగిపోతాను.

(తలుపు చప్పుడు తర్వాత అడుగుల చప్పుడు)

అప్పలస్వామి : (కత్తిరి చప్పుడు చేసుకుంటూ దూరాన్నుంచే) తారాసింగ్. మనవాడు మొత్తానికి కూతురికి పెళ్ళి తలపెట్టాడే. చంద్రకళ, చంద్రకళ, రారాజులు పెళ్లి చేసుకోతగ్గ సౌందర్యవతి.

తారా : అరే, అప్పలసామి, ఆ కత్తిర్ని ఇటూ అటూ తిప్పకు. నా కంట్లో గుచ్చుకోగలదు.

అప్పల : నా కంతా స్వప్నంలా ఉంది. చిన్నప్పుడు నేను పెళ్లిళ్లలో గనిసెట్టు మేళం ముందు గెంతేవాణ్ణి. ఇప్పుడూ అలాగా గెంతాలని ఉంది తారాసింగ్. ఇదిగో నేను ముంజే బజానా ఇచ్చేస్తున్నాను. ఆమెనే నేను పెళ్లాడానంటే ఈ మంగలి వృత్తి మానేశానన్నమాటే. ఆగు, (కత్తిరి చప్పుడు) నా పద్యం నేను వ్రాసేస్తాను. అప్పుడు నేను చెపుతూంటే, నువ్వు కలం పట్టుకు గబగబా వ్రాసేయాలి.

భావకవి : (దూరాన్నుంచి) గాడిదా, బుద్ధి లేదూ, ఈ లోపలరా, దాక్కున్నావు? తారాసింగ్ తారాసింగ్, మంగలి అప్పలసామి లోపలున్నాడా?

అప్పల : తారాసింగ్, ఎవరా కేక వేసేది? ఓహో, అరెరే, ఆయన గడ్డం చేస్తూ చేస్తూ వచ్చేశాననుకుంటాను.

భావకవి : (కోపంగా) తారాసింగ్, వాడు లోపల ఉన్నాడా? చూడు, గడ్డం నిండా ఎట్లా నాట్లు పెట్టాడో. పైగా ఓ చంప అట్లానే ఉంచేసి చంద్రకళ మాట వినగానే పరుగెత్తాడు......ఏడీ వాడు? కనిపించడే...ఏం చేస్తానో చూడు.

తారా : కొంచెం శాంతించాలి యువకవిగారూ? అత నెప్పుడేనా ఆ విధంగా మిమ్మల్ని సగం సగం గడ్డంచేస్తూ, వదిలేశాడా?......అప్పలస్వామి పద్యంవ్రాసే ధోరణిలో ఉన్నాడు...అంతే.

భావ : పద్యమా, ఏమిటి? నా కన్పిపిస్తే బుర్ర రామకీర్తన పాడిస్తాను.

ఫరీన్ : (దూరాన్నుంచి) తారాసింగ్ ఆ యువకవిగారిని అవతలికి దయ చెయ్యమను. కవిత్వం ఆలోచిస్తున్నానని తెలియదూ? పాడు గొడవ.

తార : అబ్బబ్బా, ఇందాకటినుంచీ ఓ మాట కోసం గింజుకుంటూంటే ఆఖరికి మనస్సుకి తట్టింది. కాని, ఆ మాట కాస్తా ఈ పాడు గొడవలో మళ్లీ మాయమైపోయింది.

అప్పల (గట్టిగా) అయ్యా యువకకవి గారూ, మరోమాటు, ఆ రెండో చెంప గీసేస్తాను లెండి. ఇప్పుడు కాదు. చాలా కవిత్వం తొందరలో ఉన్నాను. దయచేయండి.

తారా : యువకవిగారూ, కుబేరుడిగారి సంగతి విన్నారా? ఒక పద్యం చంద్రకళమీద వ్రాశారా, చంద్రకళ మీ జీవితాన్ని కాంతిమంతం చేస్తుంది.

భావ : ఏమిటి, ఒక్కపద్యం వ్రాస్తే చాలా? చెప్పావుకాదు? అడెంతసేపు.

తారా : మీ పద్యం చక్కని దస్తూరీలో అచ్చులా ఉండాలి.

భావ : నా వ్రాత అంత బాగా ఉండదే?

తారా : నే నున్నానుగా? ఏమిటి సెలవు?

భావ : వ్రాసేందుకు ఎంత పుచ్చుకుంటావు?

తారా : ఎంతోనా, ఒక దీనారం.

భావ : అబ్బే, అంత ఇచ్చుకోలేనయ్యా.

తారా : మీరే అలాగంటే ఎట్లా? ఉత్తమమైన పద్యానికి అంత మొత్తమైనా వెచ్చించకపోతే బావుండదు.

భావ : సరే, ఇదిగో.

ఫరీన్ : అమ్మయ్య, కాస్త గొడవ తగ్గింది... కాని ప్రాస కుదరడంలేదు. కళకితగిన పదాలు... ఆఁ...వస్తోంది...పెళ, తళ, గళ, బళా,...యతి ప్రాసలుంటే చాలుగా, అర్థం లేకపోతే పోయే. ధ్వనికి, ప్రాధాన్యం ఇచ్చారు కాని అర్థానికాదుగా...బాగుంది.

భావ : (దూరాన్నుంచి) – ఏయ్, అత్తరు సాయిబూ, వాగకు. మంచిభావంకోసం నేలంవేస్తున్న సమయానికి ఎందుకా గార్దభస్వరంతో అరుస్తావు? లోపల ఆలోచించుకోలేవూ?

ఫరీన్ : మనస్సులో ఆలోచించుకోడం నాకు చేతకాదు.

అప్పల : (ఓమూలనుంచి) స్, స్, నిశ్శబ్దంగా ఉండలేరూ, భావకవిగారూ...మనస్సులో అప్పుడే నా పద్యం పూర్తిచేసేశాను. కంఠతా పడుతూంటే కాస్త మాట్లాడకండా ఉండలేరూ?

తార: (ఓమూలనుంచి) మీ కంత మాట్లాడుకోవాలని ఉంటే, దూరంగాపోయి మాట్లాడుకోండి బాబూ.

ఫరీద్: (మేరే మాలా బులాలా వదసని) బాలాలా. (అని కూనిరాగం తీసి) కోయిలలా గొంతులోన కోర్కెలు రేగనటే,...

భేష్ ఇలా మొదలెడితే ఎలావుంటుందో...

తార: ఆఁ. వచ్చింది, వచ్చింద, అమ్మయ్య.

(రాగంతో) కౌముదీ కాంతి లోగొన్న కోకి
లమ్మ, గళము సరిచేసి ఫెళ ఫెళా పాడుమమ్మ.

ఫరీద్: (కోపంతో) ఏమిటంటున్నావు తారబ్బాయి? ఉహు, నేనుమాత్రం ఒప్పుకోను. మొదట వాళ్ళొచ్చిందా భావం, కోకిల నా మనస్సుకి మొదట తట్టింది.

భావ: అమ్మయ్య, ఇందాకటినుండీ అంత బాగా పాడే పక్షి పేరు జ్ఞాపకంరాక గిలగిల కొట్టుకున్నాను.

(రాగంతో) కోకిలా, కోకిలా, కూయవే, కూయవే.

ఫరీద్: (చికాకుతో కోపంగా) అంతా దొంగలు. నా ఎంగిలి తింటారే. మీకు బుర్రల్లేవూ?

తార: ఏమిటిది ఫరీద్? కవులూ, ప్రియులూ, మీరే, అలా దెబ్బలాడుకుంటే ఎలా? ఈ గొంతెండిపోయిన ప్రపంచానికి మీరు, భూర్భువస్లోకాల అమృతాన్ని చిలుకుతున్నారు. వద్దు. దెబ్బలాడుకోకండి.

అప్పల: అంతా వినండి. వినండి నా గేయం. పూర్తైపోయింది వినండి.

ఫరీద్: వినం, వినం, వినం. ఈ కోకిలగురించి మొట్టమొదట ఇటో అటో తేలాలి.

అప్ప: తారాసింగ్, నేను మర్చిపోకముందే నాగేయం చెప్పేస్తాను. త్వరగా వ్రాసెయి బాబు?

(పాడును) రోజారేకుల చుబుకముదానా,
శ్యామలనీరద ఆకాశంలో
కోకిలగానము చేయవదేమె.

ఫరీద్: (అడ్డంగా వచ్చి) అప్పలసామీ, ఏతే, నీ మనస్సుకీ కోకిలే పట్టిందన్నమాట. ఇన్నాళ్ళూ ఈ ప్రపంచంలో డబ్బుకోసమే దోపిళ్లు జరుగుతున్నాయనుకున్నాను. ఆఖరికి భావాలనికూడా దొంగిలిస్తున్నారు...ఇంకెక్కడి దాచుకోడం.

అప్పల: ఏమిటంటున్నావు? కోకిలా? కాను నాకే మొట్టమొదట మనస్సుకి తట్టింది. ఎంతచక్కని మాట. కోకిల! కోకిల!

ఫరీద్: నేనూ, మొట్టమొదట అటువంటి పక్షి ఉందంటూ కనిపెట్టినవాణ్ణి.

తార: (నవ్వుతూ) పక్షి ఏమిటోయ్, ఫరీదు?

ఫరీద్: కాను పక్షి, పిట్ట కలిస్తే పక్షౌతుంది. నేనే కనిపెట్టాను.

భావ: మా రెవరిదీ కాదు నాది.

తార: కవులారా, మీరందరూ ఒక పక్షి గురించి ఈ విధంగా తగూలాడి కాలయాపన చేస్తున్నారు...చంద్రకళ ఒక్కటే ఐనా, ప్రతి వనం, పన్నెల కౌగిలింతలో పులకరించడం లేదూ? అందరూ ప్రేమారాధకులై ప్రేమ జపమాలలి తిప్పడం లేదూ?

అప్పల: బాగా చెప్పాడు తారాసింగ్. కోకిల అన్నమాట నా స్వంతం కాదు కాబట్టి, మిగతావారు వాడుకోడానికి ఎటువంటి అభ్యంతరం పెట్టను.

ఫరీద్: నేనుమాత్రం ఒప్పుకోను. ఇదిగో, ఇప్పుడే చెప్పేస్తున్నాను. కోకిలని ఎవ్వరూ కవిత్వంలో వాడ్డానికి వీలులేదు. మీ కందరికీ తెలుసున్నదే. పునరుక్తి దోషంబు పొంత పోకండి.

అప్ప: తారాసింగ్, ఇప్పట్లో మా తగువు తీరేట్లా కనిపించడం లేదు. ఈ విషయంలో నీకు ప్రమేయం లేదు కాబట్టి, నువ్వు ఎలాగో, అలాగ, ఇదమిద్ధం అని పరిష్కారం చెయ్యి.

తార: ఔను, అప్పలసామి చెప్పింది బాగుంది. తారాసింగ్, నువ్వు చెప్పవయ్యా.

భావ: నాకు ఇష్టమే.

ఫరీద్: సరే, అందరికే ఇష్టమైతే నాకూ ఇష్టమే.

తార: కవులారా, ఇందులో నేను పరిష్కారం చేయతగినం తేముంది? మీరంతా మీ మీ గేయాలు ఎట్లా వ్రాసినా సరే, అవిమాత్రం అమరత్వాన్ని పొందాలి. పరిమళ భరితంగా ఉండాలి... మీ ఇష్టమొచ్చినన్ని పక్షుల్ని వాడండి, నెమళ్ళ

గిలుకలు, పావురాలు, ఆ కోకిలను మాత్రం వదిలేయండి. ఏం? తీరిందా తగవు?

ఫరీద్ : ఏమిటి? ఆ కోకిలని ఎవ్వరం వాడుకోకూడదూ? ఐతే చాలా కష్టమే?

## దృశ్యం 2

(తారాసింగ్ గదిలోనే కవులంతా కూని రాగాలు తీస్తూ గేయాలల్లడంలో మునిగి తేలుతూంటారు)

అప్ప : (ఉద్వేగంగా) ఏపోయింది, ఏబ్బుని, తారాసింగ్ కాగితం కలం తెచ్చావో... అబ్బబ్బా, భావాలు జలపాతాల్లో పడిపోతున్నాయి. ఒక్క నిమిషం కాలయాపన అయిందా భావాలు జారి పాతాళంలో ఇరుక్కుపోతాయి.

తారా : అప్పలస్వామి, నేను సిద్ధమేనయ్యా, కానీ చెప్పు.

అప్ప : (పాడుతూ)

ప్రణయ తూలిక విసురులో విరిసినట్టి
విరులహారమ్ము చెలియా, నీ వందుకొమ్ము.

అబ్బె కాదు, కాదు.

"కళ కాకరమా, చంద్రకళవు"... చ్, చ్ మర్చిపోయాను.

తాత : (అతి తొందరగా) అద్భుతము భళా, భళీ, చప్పున, గవేళాలం నూని కాగిపోతూన్నట్లు నా మెదడు ఈ ఆలోచనలతో మరిగిపోతూంది. తారాసింగ్, కలం తెచ్చుకున్నావా?... ఏమిటీ, ప్రాస? కళ... బళ...

అప్ప : తారాసింగ్, వచ్చేసింది, బాబ్బాబు, ఒక్కసారి రావూ?

తారా : అప్పలస్వామి, నాకేం నాలుగు చేతులు లేవు? ఇక్కడి తాతబ్బాయికే వ్రాయనా, అక్కడికొచ్చి నీకు వ్రాయనా, కాస్సేపుండు.

భావ (దూరంగా పాడుతూ)

చిరుత ప్రాయమునాడె
చిరుకేలు సూపుచూ...

ఫరీద్ : తారాసింగ్, వాళ్లంతా దొంగలు, ఆ, బాబు, వ్రాసేయి.

అప్పల : (పాడుతూ) "పత్రముల సందులందు పొంచియున్న"—వ్రాసుకో తారాసింగ్.

ఫరీద్ : (మేరే సూలాబులాలో: తరసని లాలా అంటూ పాడుతూ)

తంశిచేతా లేక
వనితా పాడూ నేలా.

భావ : (పాడుతూ) చిరుత ప్రాయమునాడె,
చిరుకేలు సూపుతూ,
చీమ చిటుకనగానె
చేజారిపోతివా?,

తాత : (పాడుతూ)

కాంతిలోకముకనగానె
గళము నెత్తి, కళకళాయని
లేబవళ్లేడ్చినాను.

తాతా : (నవ్వుతూ) నామీద పడకండి. కవిత్వజ్వాలలు తగిలి నాకు ముచ్చెమటలూ పోస్తున్నాయి... ఒకళ్ల తర్వాత ఒకళ్లు... అప్పలస్వామి! ఏదీ నీగేయం చెప్పు.

అప్ప : (పాడుతూ)

కళల కాకరమైన కౌముదీకళికవు.
ప్రణయ తూలిక చివర
ప్రసవించె పూమాల
ప్రణయినీ, ప్రణయినీ గళమెజే, ప్రణయినీ.

తాతా : భేష్, ఎంత బావుందయ్యా, ఈ పద్యం నాదైతేనా?

ఫరీద్ : బావుందా, హా, నాకంతా పులుసుగా ఉంది.

అప్పల : ఏమిటంటున్నావు? జాగ్రత్త సాయిబూ?

తారా : తాతబ్బాయి, ఏదీ ఓమాటు మూళ ఎత్తు, ఎటువంటి సువాసనద్రవ్యాలువేసి పద్యాల రొట్టిని తయారుచేశావో చూస్తాను?

తాత : (పాడుతూ)

పవలు రేయనుమాటల మరచిపోయి,
నేతిలో నానిసాగిన పిండి భాతి
గుండెపై దబదబా బాదు కొంటి సకియ!

తాతా : భేష్, తాతబ్బాయి, భేష్... యువకవీ, ఏదీ నీ జెంతవరకూ వచ్చింది. చెప్పు మరి వ్రాసేస్తాను.

భావ : అనవరతము, అనుదినమును
ప్రణుతింతును నీ ప్రేమలను,
ప్రేమకళారాధనలో
చంద్రకళాధీనములో
జీవింతును, జీవింతును.

తారా : ఇదేం కవిత్వం, తమాషాగా ఉందే.

భావ : అతివాస్తవిక కవిత్వం కాదే ?

తారా : అత్తరుసాయిబు, నీపాట పూర్తైందా? లేక ఇంకా మెరుగులు పెడుతున్నావా ? పేరుకు తగ్గట్టు అత్తరువాసనలతో నిండిఉంటుం దనుకుం టాను.

అత్తరు : (వరసకోసం మేరే మౌలా బులాలో లాలా లా అని పాడి తర్వాత తన గేయం పాడడం మొదలెడతాడు.)

నాలో కోర్కెలు రేగె నదేలనో హో
నాలో కోర్కెలు రేగె నదేలనో హో
చంద్రకళ కరగ్రహణమునకై
సేకరించితి సౌరభాలను
నాలో కోర్కెలు రేగెన దేలనో హో
నాలో కోర్కెలు రేగెన దేలనో హో.

తారాసింగ్, చూస్తున్నాలే నువ్వు పెదిం విరవడం ? అప్పటికప్పు డొచ్చిందంతే. మన కవు లంతా ఒక్కొక్క పాదం వ్రాయడానికి ఒక్కొక్క వారం తీసుకుంటారు.

అప్ప : ఓహోహో, ఎంతబాగా వ్రాశారండీ, అత్తరు సాయిబుగారూ ? నా మంగలికత్తి పీపులా ఉంది మీ పద్యంలోని పదును.

తారా : మీరందరూ కవులు. కవికులానికి చెందినవాళ్లు? ఒకళ్ళ నొకళ్లు ఎత్తిపొడుచుకుంటే ప్రపంచానికి లోకువైపోరూ ? మీమీ పద్యాలు వ్రాయించుకోడం ఐపోయింది కాబట్టి, నా కివ్వ వలసిన పారితోషికం వెంటనే వెళ్ళి తెచ్చిఇవ్వండి.

## మూడవ దృశ్యం

(కవు లందరూ తిరిగి తారాసింగ్ గదికి వస్తారు.)

తాత : తారాసింగ్,

తారా : ఎవరు? ఓహో ఎందుకు మళ్లా వచ్చావు తాతబ్బాయి?

తాత : స్, స్, నెమ్మదిగా మాట్లాడు. నీ పక్కని ఇంకెవరూ లేరుకదా?

తారా : ఎవ్వరూ లేరు...

తాత : (రహస్యంగా) చూడు, సింగ్, చంద్ర కళని నేను గెలిచేట్లా ఉన్నాను. నిజానికి చెప్పొద్దూ ఆ యువకవి గేయంముందు నా గేయం డివిటీలా ఉంది. నువ్వు కొంచెం మెరుగు పెడితివా... చంద్ర కళ... మరేమంటావు?

తారా : ఏదీ, ఆ యువకవి వ్రాసింది ఏదీ... ఊc... సరే, ఇంకో దీనారం ఇస్తావా?

తాత : (ఆనందంతో) ఒకటి కాకపోతే రెండు తీసుకో. చూడు, ఆ భావకవి దానికంటె మంచి చమక్కుగా ఉండాలిసుమా? మరి నేను వెళ్ళిపోతు న్నాను?

అప్ప : (దూరంగా నే) తారా సింగ్......

తారా : ఎవరు వారు, అప్పలసామా?

అప్ప : ఆc, నేనే, ఈ సమయంలో నీ సహాయం లేకపోతే, ఆమెను పోగొట్టుకుని భగ్న హృదయంతో పరలోకవాసినైపోతాను.

తారా : అర్థం గ్రహించాలే.

అప్ప : కుబేరుడు పెద్ద భావాల గురించి అంతగా కాతరు చేయట్ట. ఐనా ఎందుకో నాకు ఆ అత్తరు సాయిబు గేయమే, కుబేరుడుగారు మెచ్చు కుంటాడేమో అని అనుమానంగా ఉంది. పైగా వరస బాగుంది కూడాను. ఇదిగో, ఈ దీనారం తీసుకో... కొంచెం... సరేనా?

తారా : అదెంతసేపు, నేనున్నానుగా మెరుగు పెట్టేందుకు? నువ్వు నిశ్చింతగా వెళ్లిపోవచ్చు.

ఫరీద్ : తారాసింగ్,

భావకవి : తారాసింగ్,

తారా : సాయిబూ, భావకవిగారూ, ఇదే మిటి ఇద్దరూ ఓమాటే వచ్చారు?

ఫరీద్ : ఏయ్, యువకవీ, ఎందు కొచ్చావు నువ్వు?

భావ : నువ్వెందుకు వచ్చావో నేనూ అందుకే వచ్చాను.

ఫరీద్ : నీ పనికంటె నాది ఎక్కువ ముఖ్యమైనది? ఓమాటు నువ్వు బైటికెడతావా? సింహతోటి కొంచెం రహస్యం మాట్లాడాలి?

భావ : అంతకన్నా తొందరైన పనుంది నాకు. నేను మాత్రం కదలను. నువ్వే ఓమాటు బైటికెళ్లు.

తారా : ఇదిగో, మీ రిద్దరూ అలా దెబ్బలాడుకోవడం బాగులేదు. ఇద్దరూ కూర్చోండి. మీ పనేమిటో నాకు తెలుసు...ఒక్కొక్క దీనారం ఇస్తే చాలు మీమీ శ్రేయాలకి అద్భుతమైన మెరుగుపెడతాను.

భావ : ఎలాఐనా తారాసింగ్ ఘటికుడు.

ఫరీద్ : మన మనస్సులోనిది బాగా కనిపెట్టాడు. ఇదిగోనయ్యా, నువు కోరిన దీనారాలు. మరి మేము వెడతాము. సిద్ధంగా ఉంచుసుమా.

తారా : యువకవిగారూ, పేరుకి తగిన న్యాయంచెయ్యండి, మీరు కవులాయె. మీ ఇష్టం మీకంచేసినాసరే. ఓసారి కూర్చుని మళ్ళీ వ్రాయడానికి ప్రయత్నించరాదూ?

భావ : ఐతే, అత్తరుసాయిబే బాగా వ్రాశాడంటావా?

తారా : ఔను, ఎన్నిమార్లైనా అంటాను... ఉండండి, వెళ్లిపోకండి. చంద్రకళగారింటికి అందరం కలిసి వెడదాము. అప్పుడు తేలిపోతుంది మీ అందరి కవిత్వంలోని పస. ఫలితం దైవాధీనం.

తారా : ముసురుకొన్న మునిమాపునుండి శశిప్రియుడు అదుగో బైటపడుతున్నాడు. ఆహా, చంద్రకళా, చంద్రకళవే నువ్వు. ఈ జీవితాన్నే ఒక రాగంలో సరిచేసి నీ కరస్పర్శకై తహతహ లాడుతున్నాను.

యువ : తారాసింగ్, అప్పుడే నువ్వే ఆమెని గెలిచినట్లుగా మాట్లాడుతున్నావే.

తారా : ఔను. నేను కళోపాసకుణ్ణి స్వాప్నికుణ్ణి. వలచి గెలవలేనప్పుడు గెలుపొందినట్లు కలగని ఆనందించడం చాలా గొప్ప. స్; స్ పాలకీ బోయీలమోత కేకలేనా అవి. ఆహా, చంద్రకళా! ఎవరా వచ్చేది? కవితాప్రియులా, ఓహో, హో రండి, రండి. అప్పలసామి. తాతబ్బాయి, అత్తరుసాయిబు, అంతా రండి...

తాత : (ఆవేశంతో) ఆహా, నేడు నా జీవితం తరించింది, తారాసింగ్.

అప్ప : పారిజాతపుష్పంలా ఉంది ఆమె దేహం ఆమె పెదాలు...

ఫరీద్ : (కంగారుతో) ఈ గొడవలో మరిచిపోయొచ్చాను. తారాసింగ్, నీ దగ్గిర కళ్లజోడు లేదూ? మాయదత్యాగం.

## నాల్గవ దృశ్యం

(కుబేరుడుగారింటో కుబేరుడుగారి కొమార్తె, చంద్రకళా, స్వయంవరానికి వచ్చిన కవిప్రియులు)

కుబే : చంద్రకళ వివాహాన్నిగురించి చేసిన ప్రకటన మీరంతా వినే ఉంటారు. నాకు ఆస్తిపాస్తులతో నిమిత్తంలేదు. కవితాహృదయం కావాలి. నా చంద్రకళ అప్పుడే సుఖపడుతుంది. కాలయాపనెందుకు? ఏదీ మీమీ గేయాలు చూపండి.

తారా : ఓ నవనీతసుందరి, సుందరోజ్జ్వలరూపిణీ, చంద్రకళా, ఇదె నీ చరణదాసులు, నీగళాలంకరణకై ఏర్చికూర్చి పేర్చిన ప్రేమ ప్రసూన పద్యమాలలు.

చంద్ర : (అతన్ని ప్రేమించినట్లు లాలనతో) అశేష శేముషీమషీపంకమునందే స్నాతములైయున్న అంగుళులు కలవాడవు. ఓహో, నీవా రచయితృలోకపు రాకుమారుడివి?

తారా : రాకుమారుడనా, నవ్యకళా...చంద్రకళా...ధన్యుణ్ణి.

చంద్ర : ఈ గేయం రచించిందెవరు?

తాత : రాణీ, నేను తాతబ్బాయిని...గేయం కొంచం పాకంలోకి, రాకపోయిఉండొచ్చును. కాని గొప్పగొప్ప కవులు...

కుబే : చాలు చాలయ్యా...అమ్మా, చంద్రకళా ఏమి టనబోతున్నావు?

చంద్ర : చూశారా, ఈ గేయంలోని మొదటి పాదం? 'పవలురేయను మాటల మరిచిపోయి'

తాత : (ఆశ్చర్యంగా)

పవలురేయను మాటల మరిచిపోయి
నేతిలో నాని సాగిన పిండి భాతి
గుండెపై దబదబా...........

కుబే : స్, ఊరుకో...

చంద్ర: (నవ్వుతూ) నాన్నగారూ, ఈ గేయంలో రొట్టెలూ, నెయ్యి, పిండి, అన్నీ తెచ్చి పెట్టావండీ (నవ్వుతుంది) ఇదిగో, తాతబ్బాయి, నువ్వెంత బాగా రొట్టెలపిండి రుబ్బినా, కవివిమాత్రం కాలేవు ?

తాత : (తడబడుతూ) అయ్యా కుబేరుడుగారు ...చంద్రకళా, ఆ పద్యం నేను అద్భుతంగా వ్రాశాను.

కుబే : తర్వాత కాగితంచూడు చంద్రకళా.

చంద్ర : ఈ సంతకం ఎవరిదీ ? అప్పలసామి ?

అప్ప : ఆఁ. నేనే.

చంద్ర : చదువుతూ—నా కరగ్రహణము.

అప్ప: కాదు కాదు. (కళలకాకరమైన కౌముదీ కళికవె...

కుబే: వాళ్ళమాటలు చెవినిపెట్టకమ్మా...ఊఁ ...తర్వాత.

చంద్ర : ఫరీన్ !

ఫరీన్ :

ముసుగోసరిల చేయుమో ముకుళితవదనా
చంద్రకళా, నీ ముంగురులతో
ఆడుకునే పిల్లతెమ్మెర లెంత పరిమళ
భరితాలు, ఏమిటి సెలవు?

చంద్ర : (నవ్వుతూ) అత్తరు సాయిబూ, ఈ కాగితంనిండా ఈ నూనెమరక లేమిటి?

ఫరీన్ : చంద్రకళా, ఒక్కసారి వాసన చూడు. నా గీతికా పూలమాల పరిమళింపు సుబాళింపుతో నిండి ఉంది.

చంద్ర : (నవ్వుతూ) కాగితప్పువ్వుల్లో అత్తరు వేసినట్లుంది.

ఫరీన్ : చంద్రకళా, ఒక మనవి. దయచేసి, నా గేయాన్ని పూర్తిగా చదవమని ప్రార్థన. అప్పుడే ఆ గేయంలోని గూఢార్థం, గ్రాహ్యం ఔతుంది. కళాపరీక్షకి గీటురాయి అదే...పూర్ణాకృతిలోనే సంపూర్ణత కనిపిస్తుంది.

చంద్ర : (చదువును) నాలో కోర్కెలు రేగెన
వేల నోహో...

ఫరీన్ : నాలో కోర్కెలు రేగెనవేలనోహో
చంద్రకళ కరగ్రహణమునకై
సేకరించితి సౌరభాలను...

కుబే : ఛీ, నోరుముయ్యి. ఏమిటీ వరస, ఏమిటీ కూతలు?

చంద్ర : (నవ్వుతూ) నాన్నగారూ, ఈ మరుగుజ్జువానితోమాత్రం నాకు వివాహం వద్దు బాబూ ఈ ఆఖరి పద్యం ఎవరిది.

భావ : నాది.

కుబే : ఓహో, యువకవిగారా? మీ కవిత్వం అప్పుడప్పుడు మా అమ్మాయి చదివి నాకు వినిపిస్తూంటుంది. బాగా వ్రాస్తారండి. బహుశా యీ కవితా స్వయంవరంలో మీదేనేమో గెలుపు.

చంద్ర : ఉండండి నాన్నగారు......మాట్లకుండా తొందరపడకండి.

భావ : (ఆవేశంతో) జీవననందినీ, హృదయ కుహూరాన్ని జ్యోతిర్మయంచేసిన ఓ చంద్రకళా, ఈ పరాధీనుడు నీ అధీనుడు. తనియింపుము. తరియింపుము.

చంద్ర : నాన్నగారు, కవిగారి పద్యం చూశారా. తమాషాగా ఉంది. కొత్త పంథాలో వ్రాశారు.

కుబే : సరే మంచిది. అతన్నే వరించు తల్లీ.

చంద్ర : నాన్నగారూ...కాని......

కుబే : సందేహం ?

చంద్ర : ఔను...చూడండి? ఆకన్ను...మెల్ల ఉంది నాన్నగారూ ?

భావ : చంద్రకళా, అది అదృష్టం మెల్ల... నా గేయాన్ని అంత చులకనగా త్రోసిపారేయకుమీ. ఓగంటసేపు కష్టపడి ఆ అద్భుతమైన గేయాన్ని పొందికగా కూర్చకలిగాను. నీవు నిరాకరిస్తే యావజ్జీవం ప్రేమజపమాల తిప్పుకుంటూ ప్రవాసజీవనం సాగిస్తాను. కరుణించు చంద్రకళా.

తారా : చెలీ...నాగేయం పరీక్షించవూ...

చంద్ర : ఎవరిది.

తారా : ప్రేమగాయకుడు, ప్రేమారాధకుడు తారాసింగ్ ది.

చంద్రకళా, నీ గళాలంకరణకై పుణికిన దీప తారల మాలనందుకోచెలీ...నా కవిత్వం, నా బలం

నా యవ్వనం, నా చిరునవ్వులు ఒకటేమిటి? నా సర్వస్వం నీకై త్యాగం చేస్తున్నాను?

కుబే: అమ్మాయి ఏది అతను వ్రాసింది చదువమ్మా.

చంద్ర: (లాలనతో) ఇంకోరు చదివినా కూడా వినను... తారాసింగే చదవాలి.

అప్పల: తారాసింగే చదవాలన్నమాట...... ఇంక నే తేలిపోయింది.

చంద్ర: (గారాబంగా) తారాసింగ్, నువ్వు చదవవూ?

తారా: ధన్యుణ్ణిదేవీ.

ప్రణయ మధురిమాస్మిత
పూర్ణిమా నిశినేడె
పరతెంచె ప్రేయసీ
సరుగు లిడిరావె.
కొంకెటన మొలికేటి
క్రీగంటి చూపులతో
నిశితోడ శశిప్రియుడు
దోబూచులాడె.
తెరచాటు కళకె రై
సరణి నెచటనొ దాగ
నీ కొరకె నాకేక
నీలి మొయిలుల నెనుక
మమజీవనందినీ
మంజులభాషిణీ
అకలంకరూపిణీ,
అమృత స్వరూపిణీ.

చంద్ర: (తన్మయతలో) అబ్బా, ఎంత బావుంది. తారాసింగ్ ఆపవోయి యీ పులకరింతలు.

అప్ప: తారాసింగ్, అద్భుతంగా వ్రాశావోయి. ఏమంటావు అత్తరుసాయిబు.

కుబే: తారాసింగ్, చంద్రకళ నేటినుండి నీది. ఇద్దరూ, ఒకే మేళవింపులో మీ హృదయ తంత్రుల్ని మ్రోయించుకుని ప్రేమగానంలో జీవించండి.

తారా: మిత్రులారా, నాదో మనవి...ఇదిగో ఈ డబ్బంతా యెవరిది వారు తీసుకోండి. మిత్రులారా, ఇంకేం కావాలో కోరుకోండి.

అప్ప: మీ ప్రేమఉంటే చాలు.

తారా: వానికేమి కొదవ.

(ఆల్ ఇండియా రేడియోవారి సౌజన్యంతో).

# భారతీయుడు - అశరీరవాణి

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

భారతీయుడు:

నేను మరుగుజ్జునే యైన నేమి-నా పి
తామహుని యంత పొడుగరి ధరను లేడు
ఒక్కనరమటు లిపుడు నే నున్న నేమి
ఉర్విగెల్చె మా ముత్తాత ఒక్కచేత!
నా 'మనోవర్తి' మనికి అంత మయినంత
నేనె నాఇంటి పెత్తన మ్మూనినంత

నన్నుగని నవ్వుచున్నారు—నవ్వకండి!
నేను రారాజ వంశంపు నిసువునండి!!

నిజమె! ఇంటను బయటను నిమిష నిమిష
మాత్రతాయుల సంఖ్య మిన్నంటుచుండె
ధర్మపరుడను గనుక, ఈ ధరణి తరణి
నౌదును గనుక ఊరుకొన్నాను నేను

ఎన్నటికేనీ నేనే
ఇన్నర జాతులకు నెల్ల ఏడుగడనుకా
నున్నానా అవకాశము
మన్నయి పోదా-ఇపుడు ప్రమాదపడినచో!

అశరీరవాణి:

ఓయి కుమార! భ్రాంతి విడుమోయి- పురాతన వైభవస్మృతిన్
నీయిపుడున్న దుస్స్థితి గణింపక కన్నులు మూసికొ నిదే
లోయి! నిజమ్ము చెప్పెద మరొక్క. డెవండును నీవలెన్ విప
త్తోయధి మగ్నుడౌ నతడు తోచదు నేటి జగత్పటమ్ముపై.-

నిన్నటిదాక పెత్తనము నీపయి చేసిన అయ్య వత్తి పె
ద్దన్నను గా నినున్ మలచె నన్న యథార్థ మెరింగి, ఇంతనై
న న్నిను నీవు దిద్దుకొనవా తెరగారసికొమ్ము! ఎవ్వరే
మన్నను ధాత్రిపై తనకు మాలిన ధర్మము లేదు నాయనా!
లేలే ఇంతటనైన నిద్రవిడి-ఉర్వీరాజ్యమం దెంత నీ
పాలో అంతయున్ గెల్చుదన్క- విరమింపన్ రాదు పోరాటమున్
ఏలా నీ కుడిచేతితో ఎడమ చేయీలాగు పోరాడగా?
నీలో చక్కని సామరస్య మనుసంధింపన్ వలెన్ నాయనా!

తాతలను తగ్గ మనుమ డీత డను కీర్తి
స్వప్రతిభచే గడించుకోవలెను తండ్రి!
నీపితాళ్లు స్వపౌత్రుని నిన్నుజూచి
ప్రమద వారాశి తేలిపోవలెను తండ్రి!!

---

# కవి సార్వభౌముడు భానుకరుడు - శ్రీకృష్ణదేవరాయులు



శ్రీ ఈయుణ్ణి వెంకట వీరరాఘవాచార్యులు

## భూమిక

మిథిలాదేశము (బీహార్) గీర్వాణకవిశేఖరులకు, శాస్త్రావతారములే యనదగు నుద్దండ పండితాఖండు లకు జన్మస్థానమై కీర్తి నందినది. విద్వత్కవివంశ ముక్తామణియై, ప్రౌఢవైదుషీభూషితుడై, కవిశేఖరుడై క్రీ. శ. 16 వ శతాబ్దమున విలసిల్లిన గీర్వాణ కవి తల్లజుడు భానుకరుడు. భానుదత్తు డని యీతని ప్రఖ్యాత నామము. నాటి బిల్హణ మహాకవివలె, నేటి తిరుపతి వేంకటకవులవలెను నానారాజ సందర్శనము చేసి, తత్తద్రాజాస్థానముల దన కవితాసౌరభమును వెదజల్లుచు, రాజ సమ్మానముల నందిన మహామహుడు భానుకరుడు. కవితార్కిక చూడామణి యగు గణపతి మిశ్రుడీతని జనకుడు; మహాదేవ మిశ్రుడుపితామహుడు; ఈ మహాదేవున కగ్రజుడే మహామహోపాధ్యాయ బిరుదాలంకృతుడగు శంకరమిశ్రుడు. కర్ణభూషణము, భృఙ్గదూతము, శృఙ్గారవనమాల మొదలగు కృతిరత్న ములను రచించిన గంగానంద కవీంద్రుడు భానుకరునికి పౌత్రీపుత్త్రుడు. శంకరమిశ్రునివలెనే భానుదత్తుడును మహామహోపాధ్యాయ బిరుదభూషితుడు. ఈతని కృతులలో మనకు దెలియవచ్చిన తొమ్మిదింటిలో మూడుమాత్రె ముద్రణమునులు; తక్కిన యాఱును సూర్యాలోకము నందినవి.

## భానుకరుని కృతులు

1. అలంకార తిలకము (కొన్ని నెలల క్రిందటనే ముద్రితము) 1949.

2. కావ్యదీపిక (ముద్రితము. 1885. అలభ్యము)

3. కుమారభార్గవీయము (అముద్రితము)

4. గీతగౌరీపతి (గీతగౌరీశము)—గీతగోవిందమును బోలె గీతములతో, శ్లోకములతో గూడిన గేయ కావ్యము, ముద్రితము 1887.

5. చిత్రచంద్రిక (అలభ్యము; చిత్రగూఢ ప్రహేళికా ప్రశ్నాది విచారకము. అలంకార తిలకమున నుద్ధృతము)

6. రసతరంగిణి (గంగారామజడికృతనౌకా వ్యాఖ్యతో ముద్రితము, 1885. కాశీ; 1887—88 బొంబాయి) ప్యారిస్ నగర ప్రచురణము, 1884.

7. రసపారిజాతము (ముద్రితము. లాహోరు, 1939; పితృపాదు లగు గణపతిమిశ్రుల కావ్యముల నుండి, తన వివిధ కృతులనుండి వివిధ శీర్షికల క్రింద నేర్చికూర్చిన సంధాన గ్రంథము. (*Anthology*)

8. రసమంజరి (ముద్రితము; ఆంధ్రీకృతము. వేదం వేంకటరాయశాస్త్రిపాదుల తెనుగు టీకతో. 1909. మద్రాసు.)

9. శృంగారదీపిక (దుర్లభము)

ఇదికాక 'పారిజాత' మను ధర్మశాస్త్ర గ్రంథమును, 'ముహూర్తసార' మను జ్యోతిష గ్రంథము నీ కవి రచించినట్లు తెలియును గాని, యీ యంశము లింకను బరిశీలింపవలసియున్నది.

## వాఙ్మయరంగమున దత్కవితా దరము

ఉదాత్తకవితా సురభిళము లగు నీతని కృతులు కవిలోకమాన్యములై విలసిల్లినవి. ఈతని కవిత మనోహర మనుటకు దత్పద్యముల నెన్నిటినో యుల్లేఖించు కొనిన యీక్రింది ప్రాచీన సుభాషితకోశములే ప్రమాణము :

| | | |
|---|---|---|
| 1. | పద్యరచన (ఉదాహృతదపద్యములు: 185) | |
| 2. | పద్యవేణి | (46) |
| 3. | పద్యామృత తరంగిణి | (11) |

4. రసిక జీవనము (116)
5. విద్యాకర సహస్రకము (9)
6. సఖ్యాలంకరణము (57)
7. సారసంగ్రహము (2)
8. సుభాషిత సారసముచ్చయము (88)
9. సుభాషిత హారావళి (11)
10. సూక్తిసుందరము (10)

జగన్నాథపండితరాయలు 'రసగంగాధరము'న చిరంజీవి భట్టాచార్యులు 'కావ్యవిలాసము'న, విశ్వేశ్వర పాండేయకవి 'అలంకార కౌస్తుభము'న, అచ్యుతరాయ పండితుడు 'సాహిత్యసారము'నను భానుకరుని యభిప్రాయమును విమర్శించియు, ప్రమాణీకరించుకొనియు నున్నారు. పండితరాయలవంటి దిగ్దంతి, కవిచక్ర చూడామణి యాతని శ్లోకమును విమర్శించుటయే చాలు నీతని విఖ్యాతికి నిదర్శనము.

## నానా రాజ సందర్శనము

భానుకరుడు చేసిన ప్రభుప్రశంసలను బట్టి యాత డిరువురు మహమ్మదీయ ప్రభువులను, ఇరువురు హైందవరాజుల నాశ్రయించి, తత్తత్సంస్థానముల యందు మన్నన లందిన ట్లూహింపదగును.

క్రీ. శ. 1540—45 నడుమ రాజ్యపాలన మొనరించిన షెర్షా (*Shershah*) ప్రభు వొక శ్లోకమున స్తుతింపబడుటచే భానుకరు డీతని నాశ్రయించిన ట్లును, క్రీ. 16 వ శతాబ్ద పూర్వార్ధమున నుండినట్లును తెలియుచున్నది.

భానుకరుడు నైజాం షా ప్రభువును 17 శ్లోకములలో ప్రశంసించియున్నాడు. ఈ ప్రభువు అహమద్ నగరమున రాజ్యముచేసిన నైజాం షాహీ రాజవంశమునకు జెందినవాడు. క్రీ. 1509—53 నడుమ రాజ్యము నేలెను. (*Boorhan Nizam Shah* I) భానుకరు డీతని దర్బారునందే విశేష కాలము గడపిన ట్లూహింపదగును. శ్లోకపంచకమున భానుకరస్తుత్యు డగు హిందూప్రభువు వీరభాను నృపతి. ఈతడు రీవాలో రాజ్యము చేసిన 'వఘేల' రాజవంశమునకు జెందినవాడు. ఈతని పట్టమహిషి సుకుమారదేవి. అక్బరు చక్రవర్తికి సమకాలవర్తి యగు నీతడు క్రీ. 1540—55 లో రాజ్యము చేసెను. ఈతనికి బిమ్మట నీతని తనయుడు, అక్బరీయ కాళిదాసస్తుత్యుడు నగు రామచంద్రప్రభువు 1555—92 వఱకు రాజ్యపాలన మొనరించెను.

భానుకర ప్రశంసాస్పదు డగు రెండవ హిందూ ప్రభువు మహా పరాక్రమశాలియు సమర-సతృష్ణుడు నగు కృష్ణ నృపతి. రసమంజరిలోని రెండు శ్లోకములలో నీ కృష్ణభూపతి వ్యంగ్యముగా ప్రశంసింపబడి నట్లు కన్పట్టును. క్రీ. శ. 16 వ శతకమున పూర్వార్ధమున రాజ్యముచేసిన యీ కృష్ణనృపతి విజయనగర చక్రవర్తి యగు మన కృష్ణదేవరాయలే. (క్రీ. 1509—30 పాలనము.) నేటివఱకు వెలువడిన సంస్కృతవాఙ్మయచరిత్రనిర్మాతలెవరును ఈ విశేషమును గుర్తించినట్లే కన్పట్టదు.

### కృష్ణనృపతి ప్రశంసాశ్లోకములు

1. ఆర్యా. 'కృష్ణం సమర-సతృష్ణం,
దృష్టవతో (భ్రాన్తి) విస్ఫురచ్ఛ్రవసః,
రాజన్య జన్మమూలే,
భుజమూలే పులకముకులాని.
—రసపారిజాతము. *III*. ౩. ౧౮ పు.

2. శార్దూల విక్రీడితము.
'ప్రస్థానం రతిమన్దిరాత్
కమలినీజన్తోరపి ప్రేక్షణం,
కాకుః కేలివిధిం వినాఽపి
చరణన్యాసః పృథివ్యాముః,
కిఞ్చ క్లాన్త మతాల వృన్త
పవనః ప్రత్యఙ్గ మాలిఙ్గతి,
ద్రష్టవ్యం కి మతోఽపి కృష్ణ
నృపతే! ప్రత్యర్థి వామభ్రువామ్'
—ర. పా. *III* 48. 20 పు. (ఉపద్యరచనా. 27 పు. ౬3 ప)

ఈ క్రింది రెండు పద్యములయందును వ్యంగ్య మర్యాదచే కృష్ణనృపతి పేర్కొనబడినట్లు కన్పట్టును:

3. 'చక్రే చక్షుర్ముఖీ ప్రదీపకలికా
ధాత్రా గృహాముణ్డలే,
తస్యా దైవవశా ద్దశాఽపి చరమా
ప్రాయః సమున్మీలతి,
తద్ బ్రూమః శిరసా నతేన సహసా
శ్రీకృష్ణ నిక్షిప్యతాం,

స్నిహ ప్రత్ర తథా యథా న భవతి
త్రైలోక్య మన్థం తమః.'
—రసమంజరి, నా పద్య. 72 పు. (ర.పా.V
48 ప. 40 పు. 'శ్రీకృష్ణ'కు 'ప్రాణేశ'— పారా.)

4. 'ఖేదో వాచి దృశో ర్జలం, కుచతటే
స్వేదః, ప్రకమ్పోఽధరే,
పాణ్డు ర్గణ్డతటే, తనౌ చ పులక
వ్రాతో, లయ శ్చేతసి,
ఆలస్యం నయనద్వయే, చరణయోః
స్తమ్భః సముజ్జృమ్భతే;
తత్కిం రాజపథే (వజేన్ద్ర)తనయః
కృష్ణ స్త్వయాఽఽలోకితః?'
—(ర. మం. ౧౩౦ ప. 89 పు.)

పై పాఠము 'మకరంద' వ్యాఖ్య ననుసరించినది. అనంతపండితుని 'వ్యంగ్యార్థకౌముది' నిబట్టి యీ పాఠము కన్పట్టుచున్నది :—

రెండవ పాదము :

పాణ్డు ర్గణ్డతటే, వపుః పులకితం,
లీనం మన స్తిష్ఠతి,
ఆలస్యం నయనశ్రియ, శ్చరణయోః
స్తమ్భః, సముజ్జృమ్భతే;
తత్కిం రాజపథే నిజాముసరణీ—
పాలోఽయ మాలోకితః?'

పై పద్య తురీయచరణమున కనంత పండితుని వ్యాఖ్య :

'తత్కిం = తర్హి కిం; రాజపథే = రాజమార్గే; అనయా, నిజాముసరణీపాలః = దేవగిరిరాజః; ఆలోకితః=దృష్టః.

యద్వా —నిజాం = ఆత్మీయాం ; అమతి = ప్రాప్నోతీతి నిజామః; స చాసౌ సరణీపాలః, దుష్టహ దానవాది విదారకత్వాదతి భావః. ఏతాదృశః శ్రీకృష్ణః—ఇత్యర్థః'—(233 పు.)

పై రెండు శ్లోకములయందును కృష్ణభూపతి వ్యంగ్యముగా సూచింపబడినట్లు కన్పట్టును.

కృష్ణదేవరాయలు స్వనిర్మితసంస్కృతకృతుల పేళ్ళ నాంధ్రవల్లభునిచే నొక సీసమున బల్కించినాడు. అందు మదాలసచరిత్ర, సత్యావధూప్రీణనము, సకలకథాసార సంగ్రహము, జ్ఞానచింతామణి యను గీర్వాణకృతులనే కాక, "మఱియు రసమంజరీ ముఖ్య మధురకావ్యరచన మెప్పించుకొంటి గీర్వాణ భాష" నని ఆముక్తమాల్యదయందు (I. 13) నుడివించియున్నాడు. పై కావ్యము లన్నియు లభింప లేదు కాని, పైని జేర్కొనబడని 'జాంబవతీ పరిణయ'మను సంస్కృతరూపక మొకటి లేఖకదోష జుష్టము, త్రుటితముగా నాతని రచనము లభించినది. తా నాంధ్రగీర్వాణముల నుద్దండపండితుడై కవిరాజై, ఆంధ్రగీర్వాణ కవికోవిదబాంధవుడైన యీ రాజకవి యాస్థానమున సంస్కృతాంధ్ర కవిచూడామణు లెందఱో యుండెడివారు. అందు మైథిలుడను భానుకరుడొకడని నా విశ్వాసము. వీరిరువురును సమకాలికులగుట, భానుకరుడు కృష్ణనృపతి పరాక్రమ కృత్యముల వర్ణించుట, ఇరువురును రసమంజరి యను నామముతో గ్రంథమును రచించుటయు దీనికి సాధకము.

ఒకవేళ భానుకరుడు కృష్ణరాయల ప్రోత్సాహముననే రసమంజరీనామముతో సాహిత్యకృతిని రచింప దానినిమించు నుద్దేశముతో కృష్ణరాయలు కూడ నా నామముతోడనే మఱియొక సాహిత్యగ్రంథమును రచించియుండనోపు. లేక తన్నామగంధలోభమున నా పేరుతో నొక 'మధురకావ్యము'ను కృష్ణదేవరాయలు రచించి యుండవచ్చును. భానుకరుని కృతులను, రాయల కృతులను లభించినంతవఱకు దుల నాత్మకముగ గవేషణ మొనరించినచో గొన్ని కొన్ని కవితాసామ్యములు లభించునని తోచును. కృష్ణరాయల సంస్కృతకృతులు చాలవఱకు నుత్సన్నములగుట శోచనీయము. రాయల గీర్వాణకవితారీతిని దెల్పుటకై యసమగ్రమగు 'జాంబవతీ పరిణయ' రూపకమునుండి రసికవినోదముకొఱకు గొన్ని శ్లోకము లుదాహరింపబడును :

కృష్ణదేవరాయల గీర్వాణ కవిత :

ఆకూతస్మిత గర్భమర్థవచసా
నీ వేతి శంసన్మిథో,
రుక్మిణ్యా వదనే రుషా సకుటిల—
భ్రూవల్లయం(?) వేల్లయన్,
సైషా తన్వి త వేతి రోమలతికాం
హస్తాగ్చ్రలేన స్పృశన్,

ఆవిస్స్వాధ్వసయాఽనయా సతభసా—
శ్లిష్టో హరిః పాతు వః'
—(జాంబ. I. 3)

2. 'వరాహవ్యూహోఽయం, గవయతతి
రేషా, మృగపతి
వ్రజోఽయం, సంఘాతస్తరుణశర
భాణా మయమయమ్,
గణో భల్లూకానా మయమిహ
నికాయః కరటినాం,
సమూహో వ్యాఘ్రాణా మయ
మిహ మృగాణాం సముదయః.'
—I. 30

3. ఉల్లోలేక్షణ మున్నమయ్య
వదనం నిస్పన్దకర్ణద్వయం,
దేహస్యార్ధ ముదస్య పూర్వ
మపరం చానమ్య గాఢాన్తరః,
వేగోద్రేకవశా దలక్ష్యచరణ
న్యాసః క్షితౌ భూయసా,
వల్గన్ వ్యోమ్ని చ ధావతి
ప్రతిపదవ్యావృత్త కర్ణో మృగః.'
—I. 33.

## ఉపజీవ్య గ్రంథసూచిక

(*Bibliography*)


1. హరిభాస్కరుని 'పద్యామృత తరంగిణి' (కలకత్తా. 1941)

2. జి. వి. దేవస్థలి 'భానుకరుడు'—ఆంగ్ల వ్యాసము. (*New Indian Antiquary Oct—Nov* 1944)

3. భానుకరుని 'రసమంజరి'—వేదం వేంకటరాయశాస్త్రి చరణుల యాంధ్రవ్యాఖ్యతో (1909. మద్రాసు)

4. రసమంజరి (అనంతపండితుని 'వ్యంగ్యార్థకౌముది'తో. *Benares Sanskrit Series Nos.* 83, 84, & 87. *Benares* 1904)

5. కృష్ణదేవరాయలు: 'జాంబవతీ పరిణయము'—ప్రథమాంకభాగము — ఈ. వే. వీ. రాఘవాచార్యునిచే బర్యవేక్షితము. (సంస్కృత సాహిత్య పరిషత్పత్రికా, *October*, 1934. *PP*. 159-68. *Calcutta*.)

6. భానుకరుని 'రసపారిజాతము' (—లాహోరు 1939)

7. కృష్ణదేవరాయలు; 'ఆముక్తమాల్యద'—(వావిళ్ల. 1914 4 వ ముద్రణము. మద్రాసు)




# అఖండయాత్ర



శ్రీ వేముల వేంకట అప్పారావు

బ్రదుకు బాటుమీఁదఁ బరమావధిని జేర
బయట వెడలినాఁడ భయమువీడి—
ఎదను బ్రీలఁజేయు సొదలైన, నా ప్రళ
యాగ్నులైన నన్ను నాపలేవు!

దినముల్, రేలు నిరంతరాయముగఁ—బ్రీతిన్, దుఃఖమున్, సంశయ
మ్మును, గష్టమ్మును, నష్టమున్ వదలి, 'మున్ముందేమిరా నున్నదో'
యనుభీతిన్ దిగఁద్రొక్కి—, విఘ్న సముదాయంబున్ బ్రతారించి-పో
దును నిమ్నోన్నతభూ నభస్స్థలులయందున్ గాలిలోఁ దేలుచున్

మోదము ఖేదమున్ గడచి ముక్కు—కు సూటిగనేక ధాటిగాఁ
బోదును, లోకమే మఱచిపోదును; జీవనదీనదాల్ సము
ద్రాదులు, నింగిముట్టు శిఖరావళి కల్గిన పర్వతాలు, వ
న్యాదులు నా ప్రయాణమున కడ్డమునిల్చిన రూపుమాపెదన్.

అనుదిన మస్మదీయ సదనాంతర శాంత రసాధి దేవియై,
ననుఁదన బాహుడోలిక ననారతమున్ సుఖనిద్ర పుచ్చు భా
ర్యను, దన గర్భ సంజనితులైన సుతాసుతులన్ ద్యజింతు—నా
చనెడు సుదీర్ఘ యాత్రకు విషాదముచూపెదరా ని షాదకుల్!

"ఎచ్చటి కేఁగుచుంటి?" వని, యెవ్వఁడొనన్ గని ప్రశ్నవైచినాఁ
డెచ్చటినుండి వచ్చితినో, యెందుకొ, తాను గ్రహించినన్ గదా—
యెచ్చటికేగఁ గావలెనో యీనరుఁడన్నది యర్థమాట! ఈ
పిచ్చిజగానఁ బూర్తిగ వివేకము చచ్చినదేమి చెప్పమా!

ఆకటి చిచ్చు నాయుదరమందునఁ బుట్టదు, పుట్టెనేని-యు
ద్రేకముతో నభస్స్థలికిఁ దిన్నగఁబోయి, సుధాంశుఁబిండి, త
ల్లోక గతామృతాంబు పరిలోభుఁడనై తనివారఁద్రావి, స్వ
ర్లోక చరత్ సురాంగనలలో నటరాణ్ణవమూర్తి నయ్యెదన్!

కాంతి విధాన సౌఖ్యమునకున్ దెగనుబ్బుచు, దుఃఖమన్నచో
భీతిని జెందుచున్ జటుల భీకరనాట్యము సల్పునేని నా
చేతము నేనెచీల్చి మసిచేతును, లోంతుగం ద్రవ్వినట్టి పెన్
గోతులలోనం బూడ్చెదను-ఘోర కఠోర కుఠార ధారినై

శీతల కాలమందు నఱచేతులుం గాళ్లుం దుషారఘోర బా
ధాతరళమ్ములైన తఱి, ధారుణి బ్రద్దలువాఱు గ్రైష్మ్య భీ
ష్మాతప వేళలందు, వియదంబుదముల్ భువిపై నటించు వ
ర్షాతరుణమ్ములందు ననిశమ్ము గమింతుం బురోఽభిగామినై.

నేనెన్నాళ్లుగ నీ ప్రయాణగత పాండిత్యమ్ములన్ నేర్చినా
నో నాకే తెలియంగరాదు-బుధవంద్యుల్ నేను నాతల్లి గ
ర్భానన్ జేరినదాది యీ పృథుల యాత్రన్ జేయుచున్నానటం,
డ్రీనాయాత్ర అఖండయాత్ర యటం! యిస్సీ! యెంత దౌర్భాగ్యము !!



చిత్రకారుడు : శ్రీ సోరెన్సన్, శాంతినికేతనం

# అంతస్థులు



శ్రీ పన్యాల రంగనాథరావు

## 1

విశ్వం తన చిన్ననాటి స్నేహితుడైన సుందరానికి ఉత్తరం రాసినప్పుడు, దానికొక సమాధాన మంటూ వస్తుందనిగానీ, ఆ సమాధానం తన కింత అనుకూలంగానూ, ప్రోత్సాహకరంగానూ ఉంటుం దనిగానీ ఎన్నడూ నమ్మలేదు.

సుందరం, తనకన్న రెండేళ్లు చిన్నవాడు కూడాను. అయితేనేం? ముప్ఫయి ఏళ్ళకే దాదాపు వెయ్యిరూపాయల జీతగాడైనాడు. భారతదేశానికి కేంద్ర మనిపించుకుంటున్న ఢిల్లీ పట్నంలో మకాం వేశాడు. తలిమ కావలసినంత అధికారం ఉంటుం దని వేరే చెప్పనక్కరలేదు. ఈ ఉత్తరమే తార్కాణం.

అదృష్టం అందరికీ ఎన్నడూ కలిసిరాదు. సుందరంవంటివారిని, లక్ష్మీ చేపడుతుంది. తనవంటి వారికి ఉన్న దరిద్రంతోసాటు మరికొంత కలిసి వస్తూ ఉంటుంది.

దీనంతటికీ కారణం అంతస్థులు కాకుంటే మరేమిటి? సుందరం ఉంటున్న అంతస్థులో, ప్రవే శించటానికికూడా తనకు అర్హత లేదు, ఆర్థికంగా.

అసలీ దరిద్రంవల్లనే మూడేళ్ళపాటు తను ఇంటరులో చేరటానికి వీలులేకపోయింది. తనకు కూతు రుని ఇచ్చుకున్న మేనమామే, తన చదువు సాగటా నికి దిక్కనక తప్పలేదు. ఇటువంటి సమయంలో తను చదువు సాగించటం, విశ్వానికి బొత్తిగా ఇష్టం లేకపోయినప్పటికీ, మామయ్య బలవంతంవల్లా, ప్రాణే యంగా లీల చూసిన చూపువల్లా విశ్వం, మూడేళ్ల విరామం తర్వాత, మళ్లీ చదువుకు పడ్డాడు.

ఇది దాదాపు ఒక పుష్కరం వెనకటిమాట. అప్పుడే తనకీ సుందరంతో స్నేహమయింది. తనూ సుందరం దాదాపు అయిదేళ్లపాటు, పట్నంలో సాహ చర్యం వెలగించారు. విద్యే పూర్తిచేసి విశ్వం తిరిగి ఇల్లు చేరుకున్నాడు. వెనకటి స్థితికీ అప్పటి స్థితికీ, తనమట్టుకు తనకేమీ మార్పు కనిపించలేదు. సుందరం మట్టుకు రెండేళ్లపాటు విదేశయాత్రకూడా చేసి సరా సరి ఢిల్లీకేపోయి, మంచి ఉద్యోగంలో ప్రవేశిం చాడు.

సుందరంవంటి వాళ్లకి, మంచిమంచి ఉద్యో గాలు, లడ్డుండల్లాగా దొరుకుతై. అయితే ఏ మాట కామాటే చెప్పుకోవాలి. అటువంటి ఉద్యోగాలు దొరకాలంటే, అందుకు కావలసిన అర్హతలు కూడా ఉండాలి మరి. సుందరం విదేశయాత్రచేసి వచ్చాడు. సుందరం నాన్నగారికి, వెనక కాంగ్రెసులో పనిచేసి ఉండటం మూలాన, మంత్రులతో చక్కని పలుకు బడి ఉంది. సుందరం ఉద్యోగానికి అన్ని హంగులూ సమకూర్చుకోగానే, పక్కన లడ్డుండ కాస్తా నోట్లో పడింది.

సుందరం గురించి, విశ్వానికి ఎప్పటికప్పుడు అనోటా అనోటా, సమాచారం యావత్తూ తెలు స్తున్నప్పటికీ, తను ఏమయిందీ సుందరానికి ఏ సంగతీ తెలీలేదనటానికి ఈ ఉత్తరమే సాక్ష్యం. అంతస్థులమీదఉన్న సుందరాన్ని ఇందుకు తప్పుపట్ట వలసిన పనిలేదు.

విశ్వం చదువుకి స్వస్తిచెప్పాక ఇంతవరకూ అనేక అవతారాలు ఎత్తాడు. వీటన్నింటిలోనూ, తనకు అభిమానపాత్రమైనది కథకుడి అవతారం. ఈ అవతారమే తన సహజమైన అవతార మనిపిం చింది విశ్వానికి. ఉత్తమకథకుల జాబితాలోకి కూడా అతను ఎక్కకపోలేదు. అయితే, తన కథలను ఆద రించినట్టుగా, దేశం తన్ను ఆదరించలేదు. ఇందుకు, కథకుడిగా తనకు అలవడిన సంస్కారంవల్ల, విశ్వా నికి దేశంమీద జాలికలిగిందేకాని, కోపంరాలేదు.

అయితే, ఈ సంస్కారం విషయంలో తను అనేక అంతస్థుల పైకెక్కిన విషయం, తెలిసిరావ టానికి, సుందరమే కారకుడైనాడు.

సుందరం ఎంత సంస్కారం పొందిఉండక పోతే, తన ఉత్తరానికి సమాధానమంటూ రాస్తాడు, అని కూడా విశ్వం పొరపాటు పడ్డాడు. ఇట్లా పొరపాటు పడటానికి కారణం లేకపోలేదు.

“నువ్వు పెద్ద ఉద్యోగంలో ఉంటున్నావని విని చాలా ఆనందించాను. ఎప్పటికప్పుడు నీ గురించి భోగట్టాలు తెలుసుకుంటూనే ఉన్నాను. నాటి నుంచి, నేటివరకూ, నాకు స్థిమితంగా, ఎటువంటి ఆర్జనకూ అవకాశం చిక్కలేదు. తెనుగు దేశం, నాకు ఒక కథకుడిగా బోలెడంత పేరు మూట గట్టి ఇచ్చింది. ఆ మూట విప్పితే, నన్ను కట్టుకున్న కళా, నా నాలుగేళ్ల పిల్లవాడూ, ఏడుపు ముఖం పెట్టి కనిపించారు. నన్నేం చేయమంటావు? నీ పలుకుబడితో, నాకింత ఆసరా కలిగించక పోవనే ధైర్యంతోనే, ఈ ఉత్తరం-అసలిది నీకు సరిగా అందుతుందో అందదో కూడాను-రాశాను. దీన్ని కేవలం నా అక్షయ పాత్రగా పరిగణించవనీ, మన కాలేజీ రోజులు నీకు జ్ఞాపకం ఉండక పోవనీ నా విశ్వాసం.”

విశ్వం, తను రాసిన ఈ ఉత్తరంలో ఆఖరు వాక్యం, ఉద్దేశ పూర్వకంగా రాసినదే! ఆ వాక్యం ఒక కొల బద్దగా పెట్టుకునే, సమాధానం రాక పోవచ్చుననుకొన్న విశ్వం సమాధానం రావటంతో, పప్పులో కాలు వేశాడు.

“విశ్వం! నీ ఉత్తరం నాకు చాలా ఆశ్చర్యం కలిగించింది. నీకింత కాలం ఉద్యోగం లేదంటే నమ్మలేక పోయినాను. కథకుడుగా నీకు లభించిన కీర్తిని అక్కడే విడిచిపెట్టి నువ్వు తక్షణం బయల్దేరి రా. నీకు ఉద్యోగం కావాలంటే, దొరక్క పోదు...”

ఈ ఉత్తరం అందాక. అంత దూరం వెళ్లటమా మానడమా అని క్షణం పాటు విశ్వం సందేహంలో పడక పోలేదు. కాని, తను ప్రయాణం కట్టటానికి, తనకు కావలసినంత ఉత్సాహమూ లీల ఇచ్చింది. మర్నాడే విశ్వం, వంద రూపాయలు అప్పు చేసి, ఢిల్లీకి ప్రయాణం అయినాడు.

## 2

విశ్వం ప్రయాణం చేస్తున్నంతకాలమూ, తను తలపెట్టిన ఈపని ఎంతవరకూ సమంజసమని ఆలోచించసాగాడు. ఎందువల్లనంటే, ఈపని చేయటం కోసం, తన జీవితంలో అతి ముఖ్యమైన ఒక నియమం భంగపరుచుకోవలసి వచ్చింది. ఇంతవరకూ ఎవరినీ ఏదీకూడా అర్థించి ఎరగడు విశ్వం. ఇప్పుడు— ఇంతదూరం ఎందుకు వెళ్ళవలసివచ్చిందో ఊహించటం అంత కష్టంకాదు.

తండ్రికి ఎటువంటి ఆర్జనా లేదు. రెండేళ్ళ బట్టి, ఈ కుటుంబభారమంతా బలవంతాన తన నెత్తిమీద వేసుకోక తప్పలేదు. ఒక విధంగా తన కన్నా తన తమ్ముడు నయం. వాడు ఒక వేపు తన చదువు సాగించుకుంటూ, మరో వేపు, ఇక్కడా అక్కడా ఏవో ట్యూషన్లు చెప్పుకొని, ఆ వచ్చిన డబ్బులతో చదువు సాగించుకొంటున్నాడు. కానీ పరకా మిగులుతే కూరా నారా తెచ్చిపడేస్తాడు. పుటుకతోనే, వాడికి కష్టాలు నాటినై. దరిద్రంలోనే పుట్టాడు. తన కట్లా కాదు. తల్లీతండ్రీ గారాబం కొద్దీ తన్ను చిన్నప్పుడు పువ్వుల్లో పెట్టి పెంచుకొచ్చారు. ఫలానా లోపం అనే విషయం వొంటికి నాటకుండా తన్ను పెద్దవాణ్ణి చేశారు. తన యథార్థాన్ని తనే హఠాత్తుగా గుర్తించుకోవలసి రావటంతో విశ్వం, మొదట్లో ఉక్కిరిబిక్కిరైనాడు. ఇక తన చెల్లెలుంది. దానికి పెళ్ళీడు వచ్చేసింది. ఈ కాలం చదువులేని ఆడపిల్ల ఎందుకూ పనికిరాదు. తన చదువుకే మూడు చెరువులు ఎండకొట్టాడు తన తండ్రి! తన తల్లి పేదవాళ్ళ ఇంట్లోనే పుట్టింది. పేదవారి చేతిలోనే పడింది. ఈ పేదకుటుంబాన్ని ఈడ్చుకురావటం ఆమెకే చేతవును. ఈ పరిస్థితుల్లో పుట్టిమునిగినట్టు తనకు పెళ్ళి జరిగిపోయింది. దీనంతటికీ కారకుడు తన మేనమామ. తన కూతురికి ఈడు మించిపోతున్నదని తొందరపెట్టి అమ్మనీ నాన్ననీ వొప్పించాడు. లీలనే చేసుకోవాలని చిన్నతనం నుంచీ తనకు కోరిక ఉండేది. మామయ్య తన కూతురికి చదువు చెప్పించలేదు. తను ఉద్యోగం చేసుకొంటూ లీలకు చదువు చెప్పించుకోవాలని విశ్వం ఆశయాలలో ఒకటి. ఏ ఆశయమూ ఫలించనట్టుగానే అదికూడా ఈనాటికీ ఫలించలేదు. ఇప్పుడు, నాలుగేళ్ళ పిల్లవాడిని పెట్టుకొని, చదువుకొమ్మంటే చదువుతుందా!

“నా చదువు ఇప్పుడంత ముఖ్యం కాదు. ముందు పిల్లవాడి సంగతి ఆలోచించండి” అన్నది కూడాను ఒక సందర్భంలో!

విశ్వం, తను చదువుకొంటున్న రోజులలోనే సాహిత్యంతో పరిచయం చేసుకొన్నాడు ఏముహూర్తాన మొదటి సారి కాగితం మీద కలం పెట్టాడో గాని అతిత్వరలోనే విశ్వానికి ఒక కథకుడుగా పేరొచ్చింది. ఆర్థికంగా ఇది అంత లాభించక పోయినా, తన చేతికొచ్చిన ఈ విద్య, ఎప్పటికేనా తనకు ఒక ఆసరా చూపించక పోదనే విశ్వం గట్టిగా నమ్మాడు. ఇది కేవలం మూఢ నమ్మకం కాదనికూడా నమ్మాడు.

కొన్నాళ్ళ కిందట, తనకు తెలిసినవా డొకడు ఒకపత్రిక పెట్టాడు. దానికి సంపాదకుడుగా ఆ పత్రిక పెట్టిన వాడి పేరే చెలామణీ అయినప్పటికీ, పత్రిక నడిపించే భారం తన మీద వేశాడు. ఈ భారాన్ని విశ్వం అమితఉత్సాహంతో నిర్వహించినమాట నిజం. ఇదే తన్ను పోషిస్తుందని, మొదటి రెండు మూడు సంచికలకు నిద్రాహారాలు లేకుండా కష్టపడి పేరు తెచ్చిన వాడు తనే. పత్రిక పెట్టిన నాడు, మొదట్లో తనకు నెలకు యాభై రూపాయల చొప్పున ముట్ట చెప్పేవాడు. అదే పది వేలుగా విశ్వం స్వీకరించాడు. ఆ తర్వాతనే గట్టి చిక్కు వచ్చింది పత్రిక యజమాని ఆమోదించేవాటినీ, యజమానే స్వయంగా ఇచ్చేవాటినీ వేయవలసి వచ్చింది. ఆ విధంగా వేసే కథల్లోనూ వ్యాసాలలోనూ, సాహిత్యం ప్రయోజనం, కళా నశించి బూతు మిగిలేది. తన ఆశలన్నీ పటాపంచలు చేసుకొని విశ్వం బయట పడ్డాడు. ఇప్పుడా పత్రిక అందమైన ఫోటోలతో, ప్రణయ కథల పత్రికగా వెలువడుతూ, ఆ యజమానికి ఒక పెద్ద మేడా, ఒక కారూ తెచ్చి పెట్టింది. తన అంతస్థులో ఉన్న సాహిత్యానికి, ఈ దేశంలో, డబ్బు చేసుకొనే యోగ్యత ఇంకా పట్టలేదు.

ఆ తర్వాత విశ్వం ఒక రేషను దుకాణంలో పని చేయటం, వేరే కథగా రాయవలసి వుంటుంది. ఆ రేషను దుకాణంలో చాటుగా పువ్వుల్లాంటి బియ్యం ఎంతపడితే అంతా దొరకటం, రేషనుమీద చూస్తే పశుగ్రాసంగా కూడా పనికిరాని బియ్యం లభ్యం కావటం ఇట్లా జరుగుతూ ఉండటానికి, పాలకులే చేతనైనంతగా దోహదం చేయటం, విశ్వానికి అసహ్యం వేసి బయటపడ్డాడు. తన మూడో అవతారంలో విశ్వం, రెండుమూడు పెద్దషాపులలో ఉత్తరాలు రాసిపెట్టడం. ఇదికూడా ఆట్టే నచ్చలేదు. అయినప్పటికీ తను సుందరానికి తెగించి ఉత్తరం రాసేవరకూ ఈ పనే చేస్తూవచ్చాడు. రేడియోకి నాటకాలు రాయడంవల్లా, పత్రికలు పంపే పదిపదిహేనులవల్లా, అంతా కలిపి నెలకో యాభై అరవై అయినా తన సంసారం ఈదటానికి పదిరోజులకు కూడా సరిపడేదికాదు. బాధ్యతలు ఎక్కువవుతున్నకొద్దీ, విశ్వానికి, తనమీద తనకే నమ్మకం క్షీణించసాగింది. ఇక ఉద్యోగంకోసం, గట్టిగా అర్థించకపోతే లాభంలేదు. తనమీద ఆధారపడ్డ వారికి తిండిపెట్టగలగడంలో తన నియమం భంగం అవుతే వొచ్చిన నష్టమేమీ లేదు. అడుగనేగాని అమ్మయినా పెట్టదుకదా?

సుందరం, చదువుకొనే రోజులలోనే ఎంత పైఅంతస్థులలో విహరిస్తూ ఉండినప్పటికీ, తన విషయంలో అభిమానంతో మెలగటం విశ్వం బాగా ఎరుగును. సుందరంతో తన కుండిన మైత్రి, స్నేహంగా పరిగణించాడు విశ్వం. ఇప్పుడు సుందరం తన్ను ఆహ్వానించటంలో, విశ్వం స్నేహాన్ని మాత్రమే చూపగలిగాడు. ఆ స్నేహాన్ని స్తనశల్యపరీక్ష చెయటానికి మాత్రం విశ్వం అంతరాత్మ సమ్మతించలేదు.

## 3

విశ్వం ప్రయాణం చేస్తున్నప్పుడు తెచ్చిపెట్టుకున్న ఉత్సాహమంతా, ఢిల్లీస్టేషనులో కాలుపెట్టడంతో పటాపంచలయినట్టు తోచసాగింది. తను ఏ నాటికి ఢిల్లీ చేరుకోబోతున్నదీ సుందరానికి ముందే ఉత్తరం రాశాడు. సుందరం స్టేషనుకు వస్తాడనీ పూర్వపు స్నేహంతో తన్ను ఆహ్వానిస్తాడనీ ఊహించాడు విశ్వం. కాని స్టేషనంతా కలయచూసినా సుందరంజాడ కనపడలేదు. తనకు హిందీ కూడా రాదు. బహుశా సుందరానికి ఏదో అర్జంటుపని తగిలి ఉండవచ్చునేమో! అంతపెద్ద ఉద్యోగస్తుడు, స్టేషనుకి వస్తాడని అనుకోవడం తనదే బుద్ధిపొరపాటు.

సుందరం ఎడ్రసు తెలుసుగనక, టాంగా ఒకటి మాట్లాడుకొని, సుందరం ఉంటున్న ఇల్లు చేరుకొనేసరికి పదకొండు గంటలయింది.

ఇంటిముందు ఒకపక్కగా అందమైన కారొకటి ఆగిఉంది. పక్కనే, మేడకు మెట్లు

న్నాయి. దానిమీదఉన్న బోర్డుమాస్తే, సుందరం మేడమీద కాపరముంటున్నాడని స్పష్టమయింది!

ఇంతలో పైనుంచి ఎవడో కిందకు దిగి, తన వెర్రిగంతుచూసి, తన్ను ఎగాదిగా పరీక్షించి, "కోన్ హై!" అన్నాడు. వాడు హిందీలో ప్రశ్నించినా అరవకట్టులో కనిపించాడు.

"మిస్టర్ సుందరం!" అన్నాడు విశ్వం.

"మీరు తెనుగువారుదానా? సామి వెళిల పోయివుండారు. అరమణిక్లా వస్తురు. మీరు వచ్చి కూర్చోండిమి" అన్నాడు.

పీడు నిస్సందేహంగా సుందరం పనివాడు.

"ఇంట్లో ఇంకెవరూ లేరా?" అన్నాడు విశ్వం సందేహంగా.

"అమ్మ పట్నం పోయి ఉండారు. సామిదా ఉండారు. నేను వారి కుక్." అన్నాడు 'కుక్.'

కింది భాగంలో ఎవరో పంజాబీవాళ్లను న్నాడు విశ్వం. అంతస్థుమీద అంతా దివ్యంగా ఉంది. ఇటువంటి 'పెద్ద వాళ్లు' యింట్లలో ముందు కాపరం ఉంవటం నేర్చుకోవాలి. ముందు హాలూ, హాలులో సోఫాలూ, గోడలకు పెద్ద పెద్ద చిత్ర పటాలూ, ఒక నైపు పెద్ద రేడియో, కింద తివాసీ, ద్వారాలకు రంగు రంగులు తెరలూ. ఇవన్నీ తనకు అలుక్కు పోయినట్టుగా కనిపించ సాగాయి. 'కుక్' తన వెర్రిగంగ ఎక్కడికి తీసుకు పోయాడో, తన్ను ఈ అగాథంలో వొదిలి! అనుకుంటూండగానే 'కుక్' చేతిలో కాఫీతో వచ్చాడు.

"మీరిది పుచ్చుకోండి సార్. సామి ఫోను చేస్తిని. మరో పది నిమిషాలలో వస్తుండారు."

పది నిమిషాలకు సుందరం రానే వచ్చాడు. అతని వెనక మరో ఇద్దరు పెద్ద ఉద్యోగులే అయి ఉండొచ్చు—సుందరం వస్తూనే,

"హలో! విశ్వం! నీకోసమే ఎదురు చూస్తున్నా! జస్ట్ వన్‌మినిట్. వీళ్లను పంపేసి వస్తాను!" అంటూ ఏదో కాగితాలు తీసుకుని వారికిచ్చి, బయటకు వెళ్లి వాళ్లను పంపేసి తిరిగి వచ్చాడు సుందరం.

విశ్వానికి శ్వాస నిలిచినట్టయింది.

సుందరం ఆప్యాయంగా సమీపించి, సోఫాలో తన పక్కనే కూర్చోని,

"ఎన్నాళ్లకు కనిపించావోయ్ విశ్వం! అయాం సోసారీ. నీకోసం స్టేషనుకి బయల్దేరుతూండగా, అర్జంటు పని తగిలింది. నీకోసం కారు పంపించానే. కారులో వొచ్చావా?" అన్నాడు.

"లేదు." అన్నాడు విశ్వం కాస్త ఊపిరి బిగపట్టి.

"అదేం? కారు రాలేదా యేమిటి? డ్రైవర్!" అంటూ కేక వేశాడు సుందరం.

"పోనీలెద్దూ వాడు నన్నెలా పోల్చుకుంటా డనీ! మనం మళ్లా చాలా కాలానికి కలిశాం చాలదూ?" అన్నాడు విశ్వం.

సుందరం వేసిన కేకకి, డ్రైవరు పత్తా లేడు కాని, 'కుక్' వచ్చాడు.

"చూడూ, అయ్యగారికి స్నానానికి నీళ్ళూ-ఆయన కా గదిలో అన్నీ అమర్చు," అన్నాడు సుందరం.

సుందరం ఇచ్చిన ఆతిథ్యం విశ్వానికి తాత్కాలికంగా ఎంతో సంతృప్తి కలిగించి ఉండొచ్చు, కాని, ఈ వాతావరణం విశ్వానికి గొంతులో వెలక్కాయ లాగ ఉంది. తన మామూలు జీవితంలో ఉండవలసిన స్వేచ్ఛ ఇక్కడ తనకు లభ్యం కావడం లేదు. ఏపని చేసినా, చేయాలనుకున్నా, స్నానమూ, భోజనమూ, కాలకృత్యాలు తీర్చుకోవటమూ—ప్రతీ చిన్న విషయానికికూడా, ఏదో ఒక నియమం ఉన్నట్టుగానూ, ఆ నియమం ప్రకారం ఆ పనులు చేయకపోతే, వాచీముల్లు వెనక్కు తిరిగిపోతుందేమో అన్నంత అనుమానం కలగడమూ జరుగుతోంది.

"నా భార్య పుట్టింటికి వెళ్లిందిలే. ఇది ఇంకా ఆరో నెల. ప్రస్తుతం నేనొక్కణ్ణే ఉంటున్నాను. నాన్నగారూ, అంతా పట్నంలోనే ఉన్నారు. ఆయన ఇక్కడికి కెలా వస్తాడూ! ఏదన్నా మిని స్టర్లతో పనివుంటే వస్తూపోతూ ఉంటాడు. అంతే." అంటూ సుందరం విశ్వానికున్న కొన్ని సందేహాలు, లను కోరకుండానే తీర్చాడు.

తనకోసం వేరేగదిలో ఒకపక్క వేయించాడు. పడుకోబోయేముందు, రాత్రి ఇద్దరూ ఒక గంట

పిచ్చా పాటీ మాట్లాడుకున్నారు. వెనకటి కాలేజీ రోజులూ, అప్పటి మిత్రులూ, అన్నీ ఒకసారి జ్ఞాపకం చేసుకున్నారు. ఎన్ని మాట్లాడినప్పటికీ, సుందరం, విశ్వంఉద్యోగప్రసక్తి తీసుకురాక పోవడం, విశ్వానికి కొంచెం ఆశాభంగం కలిగించింది. అసలు ఆ ప్రసక్తి తనే ముందుగు తీసుకు రావాలో ఏమో—ఈ వాతావరణంలో అనుకున్నాడు కూడాను.

తనకూ తను కొంతకాలంనుంచి ఎరిగిఉన్న ఒక స్నేహితుడికీ—మధ్య ఏదో ఒక గోడవంటిది ఉండటం బాధగా ఉంది. ఈ గోడ పెట్టింది ఎవరు? తనా, సుందరమా? లేక, ఈ వ్యవస్థా? ఇదిమాత్రం తేల్చుకోవాలని విశ్వం తనలోతనే పరిశోధన ప్రారంభించాడు.

తను వచ్చిన పనేదో త్వరలో తేలిపోతే, భవిష్యత్తు నిర్ణయించుకోవచ్చునన్న ఆదుర్దా విశ్వానికి ఉండటం సహజమే. ఇటువంటి ఆదుర్దాలకు సుందరం ఆర్థికవ్యవస్థ అతన్ని అతీతుణ్ణిచేసిన విషయం విశ్వం గుర్తించాడు.

"ఇక్కడ ఏమన్నా ఛాన్సు..." అనబోయినాడు విశ్వం.

సుందరం మాటలోనే అడ్డువచ్చి,

"ఆలోచిద్దాం లెద్దూ. కొన్నాళ్లు ఉండాలి కదా మరి? అన్నట్టు, నువు ఏం పని చేస్తావో చెప్పు ముందు!" అన్నాడు సుందరం సిగరెట్టు ముట్టిస్తూ.

తన వ్యవహారం సుందరానికి కొంత వేళాకోళంగా ఉన్నట్టు తోచసాగింది విశ్వానికి. తను ఏవిధంగా మథనపడ్తున్నదీ గుర్తించే యోగ్యత సుందరానికి లేకపోవచ్చునని విశ్వం మొదట్లో భావించలేదు.

"నీ ఉత్తరం చూడగానే, నాకోసం ఏదో ఉద్యోగం సిద్ధంగా ఉందనిపించింది సుమా! చెప్పొద్దూ!" అన్నాడు విశ్వం కసికొద్దీ. తనవంటి వాడికి కాస్త ఓర్పు హెచ్చుస్థాయిలోనే ఉండాలన్న మాట విస్మరించి.

"నేనావిధంగా రాసినట్టు నాకు జ్ఞాపకం లేదే! ఉద్యోగాలు మనకోసం అంటూ సిద్ధంగా ఉంటాయనుకోటం బుద్ధి పొరపాటు! మనమే సృష్టించుకోవాలి ఈ కాలంలో."

సుందరం అన్న ఈ మాటలలో సత్యం ఎంతేనా ఉంది. ఇది సత్యంతో కూడుకున్న మాటే అని బాధపడి విశ్వం ఒక నవ్వు నవ్వేశాడు. కాని, ఈ ఉద్యోగాలలో లొసుగులు ఈవిధంగానే ఉంటవి కాబోలు అని స్ఫురించటంతో విశ్వంలో ఒక చిన్న మంట బయల్దేరింది.

విశ్వం, హాలు నాలుగుపైపులా కలయచూడటం గమనించి, సుందరం—"ఇది గవర్నమెంటు ఇచ్చిన ఇల్లేను. అసలు నా కివ్వవలసిన బంగళా ఇంకా ఖాళీ కాలేదు. అందాకా ఈ కొంపలో ఉండమన్నారు. చాలా ఇరకాటంగానూ—ఎందుకూ పొందకుండానూ ఉంది." అంటూ తన అసంతృప్తి వెల్లడిచేశాడు.

ఇది 'కొంపా'! ఇరకాటంగా ఉందా! తనవంటివాడు కాలుమోపటానికి ఇందులో, తాహతు లేదే! అంతస్థుల భేదం!

ఆ రాత్రి అంతటితో వారి చర్య ముగిసింది.

## 4

నాలుగురోజులు దాటినా కూడా సుందరం, ఇదమిద్ధంగా ఏ విషయమూ తేల్చడం లేదు. విశ్వానికి ముళ్లమీద నడకగా ఉంటున్నది. ఈలోపున విశ్వం తన భార్యకు ఉత్తరం రాశాడు, సుందరం చాలా ఆదరించాడనీ ఉద్యోగం దొరికే సూచనలు ఎక్కువగానే కనిపిస్తున్నాయనీ. ఈ నాలుగు రోజులలోనూ సుందరం తనకు వీలయినప్పుడల్లా, విశ్వాన్ని పట్నమంతా తిప్పాడు. జంతర్ మంతర్ చూపించాడు. బిర్లామందిర్ చూపించాడు. చాందినీచౌక్ అంతా తిప్పాడు. కన్నాట్ పేలస్‌లో అనేక పెద్ద పెద్ద దుకాణాలకు తీసుకువెళ్తే, అక్కడివారు సుందరానికి చాలామంది సలాములు చేయటం, 'కోకాకోలా'లు ఇప్పించటం విశ్వానికి ఆశ్చర్యం వేసింది.

ఒకనాటి సాయంకాలం, 'రాజ్ ఘాట్'కి వెళ్లారు. సుందరం అక్కడ ఎవరితోనో తన సాటివారితో మాట్లాడుతుంటే, విశ్వం, కొద్దిదూరంలో 'వినోభావే' ప్రార్థనోపన్యాసం వింటూ, గాంధీ ఆత్మకు శ్రద్ధాంజలిస్తున్నడు.

"నీతో నాకు అనేక విషయాలలో అభిప్రాయభేదాలు ఉంటే ఉండొచ్చుగాక. నీ విశ్వాసాలు నీవి. నా విశ్వాసాలు నావి. అయితేనేం? నువు మహాత్ముడివి. నువు జీవించిన కాలంలోనే నేను పుట్టిఉండటం—నువు మావూరికి కొన్నేళ్ళకిందట వచ్చినప్పుడు నిన్ను చూడగలగటం నా అదృష్టంలో ఒక భాగం. కొన్ని కోట్లమంది జనంమీద నీ ప్రభావం ఒక వెలుగు వెలిగిందంటే—అది నీకే సాధ్యమయింది. నీకివే నా జోహారులు." అనుకున్నాడు విశ్వం.

ఇంకోరోజు, సుందరం మరికొంతమంది పెద్దవాళ్ళతోకలిసి, 'కుతుబ్‌మీనార్'కి పిక్‌నిక్‌కి పోతూ, విశ్వాన్నికూడా తీసుకువెళ్ళాడు. చరిత్రాత్మకమైన ఇటువంటిస్థలాలు చూస్తున్నప్పుడల్లా విశ్వానికి, తన లీలా, పిల్లవాడూ పదేపదే జ్ఞాపకం వస్తూ బాధించసాగారు.

వారంరోజులు గడిచినై. ఒకనాటి రాత్రి సుందరం ఇంటికి వస్తూనే,

"ఇదిగోనోయ్, నీ 'ఎపాయింట్‌మెంట్' ఆర్డరు. రేపు నాతోకూడా నిన్ను తీసుకువెళ్తాను. జాయిన్ అయిపో," అన్నాడు.

"ఎక్కడ—ఏ ఆఫీసులో! ఏం కథ!" అంటూనే విశ్వం కాగితం చూసుకున్నాడు.

విశ్వం చదివేలోపునే—సుందరం అందుకొని,

"మా ఆఫీసులోనే ఖాళీ వచ్చిందిలే. ఒకసారి అడుగు పెట్టేశావంటే, మెల్లిగా తన్నుకురావచ్చు." అన్నాడు.

తను ఆశించినటువంటి ఉద్యోగానికి కనీసం మూడువందలైనా జీతముంటుందనుకున్న విశ్వం, ఈ ఉద్యోగానికి కేవలం నూటయాభై మాత్రమే జీతమనీ, అమాంబాపతులతో కలిసి రెండొందలు కిట్టాయనీ తెలిసేసరికి ఆశాభంగమయింది. ఈ నోట్ల ముమ్మరపు రోజులలో రెండువందలు రెండురూపాయలకు సమానం! అయితే ఈమాత్రం తన దేశంలో దొరికే ఆస్కారం కనిపించలేదేమరి! అయినా, సుందరం అన్నట్టు, ఇందులో పాతుకుంటే పైకి రాలేకపోమని ఎక్కడుందీ?

మర్నాడు ఆఫీసుకి బయల్దేరే ముందు తనకిట్లా మంచి ఉద్యోగం దొరికినట్టూ త్వరలోనే పెద ఉద్యోగం కాబోయేటట్టూ, తన లీలకు ఉత్తరం రాశాడు విశ్వం. అయితే ఈ ఉత్తరం కాస్త తొందరపడి రాసిన విషయం, ఆఫీసులో చేరినాకగాని విశ్వానికి తట్టలేదు.

సుందరం గడుసువాడే! విశ్వంమీద ఏదో కసి ఉన్నట్టు అతన్ని సరాసరి తనకింద, తన అజమాయిషీలోఉండే ఉద్యోగంలోనే వేసుకోవటం విశ్వానికి నోటమాట లేకుండా చేసింది. విశ్వం, సుందరం చేస్తున్నంత పెద్ద ఉద్యోగం, నెలకు దాదాపు వెయ్యిరూపాయలూ, ఎన్నడూ కోరలేదు. అయితే, సుందరం, తన్ను కేవలం తనకిందే వేసుకుంటాడని మాత్రం విశ్వం ఎన్నడూ ఊహించలేదు. ఏ మొండి ధైర్యంతో విశ్వం ఈ ఉద్యోగంలో ప్రవేశించాడో ఆనాటినుంచే విశ్వానికి నిజమైన దుర్దినాలు ప్రారంభమైనై.

## 5

"నువు నాకు ఒక ఉద్యోగమంటూ ఇప్పించినందుకు నేను నీకు కృతజ్ఞత చూపించవలసి వుంటుంది. అయితే నీకు నామీద ఎన్నడూ లేని ఈ కసి ఎందుకు? మనం చాలాకాలంనాటి స్నేహితులం. సమానమైన హోదాలో చదువుకున్నాం. అయితే నీకున్నంత పెద్ద ఉద్యోగం కోసం నేను రాలేదు. మన ఇద్దరికీ అంతస్థులభేదం చాలా ఉందన్నమాట నేను గుర్తించకపోలేదు. నా సుఖానికి ఇంతకన్నా ఎక్కువ ఆదాయం తెచ్చుకోగల తాహతు లేదను. నమ్ముతాను, కాని ఆ ఉద్యోగం కాస్తా నీకిందే ఉన్నట్టు చూసి, నన్ను నీ బానిస చేసుకోవటంలో నీ చాతుర్యమేమిటి? ఏ ఉద్దేశంతో నువ్విట్లా అన్యాయంచేశావు? లేక, నీకసలు ఇటువంటి అభిప్రాయమే కలగలేదా?" అంటూ విశ్వం, సుందరాన్ని నిలవేసి అడగాలనుకున్నాడు. కాని, ఎన్నడూ లేనిది తన కీనాడు పిరికితనం ఆవేశించింది. తనకున్న సంస్కారంతో తను ఈ పరిస్థితిని సులభంగానే ఎదుర్కోవచ్చు. "నీ కిందా ఉద్యోగం ఉంది! మహాభాగా! మన స్నేహం ఇలా ఉండనియ్యి. నాకు శెలవిప్పించు" అంటూ ఇంకొకడైతే అనగలిగేవాడేమో! కాని, అటువంటి 'పెడసరపు మాట' అనటంవల్ల, ఉన్న అవకాశం కాస్తా పోవటంతప్ప, లాభమేమీ లేదు, పెడసరంగా

మాట్లాడి, పొట్ట పోషించుకునేపాటి ధైర్యం తనకు లేదు అని రూఢి చేసుకున్నాడు విశ్వం.

"మాడూ! నువ్వు కాపరం పెడితే బాగుంటుం దనుకుంటాను. ఏం?" అన్నాడు సుందరం ఒక రోజున.

"కాపరం! బాగా చెప్పావు! ఈ జీతంతో నేనేం చేయగలను! ఏదన్నా హోటలుకి పోదా మను కుంటున్నాన్లే." అనేశాడు విశ్వం.

"మంచివాడివే! నిన్నిక్కడినుంచి వెళ్ళి పొమ్మంటున్నా ననుకొంటున్నా వేమిటి? కొంప తీశావు! నాకా అభిప్రాయం ఎన్నడూ లేదు," అంటూ సుందరం తన పొరపాటుకి నొచ్చుకున్నాడు.

"నువ్వలా అనుకోనవసరం లేదు సుందరం? నేను మాత్రం ఎంతకాలం ఇట్లా నీ యింట్లో తిష్ఠ వేయగలను! రేపు నీ పెళ్ళాంపిల్లా వస్తారు. అసలే ఇలు చాల దంటున్నావు కూడాను!" అంటూ విశ్వం ఊరుకోకుండా కాస్త ఎత్తిపొడిచాడు.

"ఆ మాటకేంలే. నే నంటున్నది మరేంలేదు. ఇక్కడ ఇళ్ళకు చాలా ఇబ్బంది. అందువల్ల చేతు లారా వచ్చింది జారవిడుచుకోవట మెందుకూ? కింది భాగంలో ఉంటున్న పంజాబీవాళ్ళ యింట్లో, ఒక గదీ, వరండా మీదకట్టిన 'జాఫ్రీ' గదీ అద్దెకిస్తా మంటున్నారు నీకోసం 'ఫిక్సప్' చేద్దామనుకుంటు న్నాను. ఈ త్వరలో త్వరగా నాకో బంగాళావస్తే అందులో ఎలాగూ 'అవుట్ హౌస్' ఉంటుంది." అన్నాడు సుందరం.

సుందరాన్ని మనం నిందించవలసిన పనిలేదు. ఎందువల్లనంటే, తన స్నేహితుడికి, తన శక్తిలో ఉన్నంతవరకూ సహాయపడాలనే సానుభూతితోనే సుందరం. ఈ విధమైన ఏర్పా ట్లన్నీ చేస్తూ ఉండవచ్చు. కాని, సుందరంచేస్తున్న ప్రతి పనిలోనూ, విశ్వానికి అంతస్థులే కనిపిస్తు న్నాయి. ఇప్పుడు ఇంటివిషయంలో ఈ అంతస్థుల భేదం స్పష్టంగా ఉండనే ఉంది.

సుందరం, తనకూ, తన భార్యకూ, తన పుట్ట బోయే పిల్లకీ ఇంత ఇంద్రభవన మల్లేఉన్నటువంటి ది చాలదనుకుంటున్నప్పుడు, విశ్వానికీ, విశ్వంభార్యకూ, నాలుగేళ్ళ పిల్లవాడికీ—ఇంకా బహుశా విశ్వం కుటుంబానికంతకీ కూడా, కిందిభాగంలో ఒక గదీ ఒక తాత్కాలికమైన పంచా ఎట్లా సరిపోవచ్చునని సుందరం ఊహించాడో విశ్వానికి అంతుపట్టలేదు.

ఉద్యోగం విషయంలో విశ్వం, సుందరంతో అనదలచిన మాటలు ఎట్లా అనలేకపోయినాడో ఇంటి విషయంలోనూ కూడా అట్లాగే నోరెత్తలేకపోయి నాడు.

సుందరం, తన పలుకుబడి బాగానే వినియో గించి, ఆ గదికి అద్దె ముప్ఫయిరూపాయలకు మించ కుండా నిర్ణయించాడు.

కాని, విశ్వం, వెంటనే తన కుటుంబాన్ని రప్పించదలచుకోలేదు. ఒక నెల్లాళ్ళపాటు, ఈ కొట కపు జీవితం రుచిమూశాకనే ఏ నిర్ణయమైనా చేసు కోవాలని నిశ్చయించుకున్నాడు. తన 'సొంతఇంటి'కి మార్చిన నాటిరాత్రి కూర్చుని, విశ్వం, ఇన్నాళ్ళకి మళ్ళీ ఒక కథ రాశాడు. ఆ కథలో ఇటీవల తను పొందిన అనుభవాల ఛాయలు కొన్ని పడకపోలేదు. ఆ రాత్రి అతనికి గుండె కాస్త తేలికై బాగా నిద్ర కూడా పట్టింది.

పంజాబీల చంటిపిల్ల యేడుపుతో ఒకరా త్రిప్పుడు విశ్వానికి మెలకువయింది. మళ్లీ ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. రాత్రి బహుశా రెండుగంటలు దాటివుంటుంది. అంతవరకూ తనకు పట్టిన నిద్రకు మనసు ప్రశాంతంగానే ఉన్నట్టు తోచింది కాని, ఈ సరికొత్త వాతావరణంలో నిద్ర పట్టం కష్టంగా తోచింది. రాత్రి కథ రాయటం వల్లా, మనసులో ఉంటున్న బాధ కొస్తా ఆ కథలో కొంతవరకు వ్యక్తం కావటంవల్లా, చప్పున పట్టిన నిద్ర కేవలం తాత్కాలికమయిపోయింది విశ్వానికి.

విశ్వం అట్లా పడుకునే ఆలోచనలో పడ్డాడు. అతనికి, తన కుటుంబం యావత్తూ జ్ఞాపక మొచ్చి కల వరమవుతోంది. తమ్ముడేం చేస్తూన్నాడో! పిల్ల వాడి ఆరోగ్యంగురించి లీల ఉత్తరమే రాసింది కాదు. ఇల్లు ఎలా గడుస్తున్నదో! దినం ఎట్లా గడ వటమనే మహాసమస్య ఎదురైనప్పుడు, ఇంకేసమస్య గురించీ ఆచే ఆలోచన పోదు. ఇందులో కేవలం తన సుఖం మాత్రమే చూసుకొంటున్న ట్టవుతున్నదా? తను ఏ సుఖం పొంది, తనవారిని సుఖపెట్టాలని

విశ్వం, ఇంతదూరం వచ్చాడో, ఆ సుఖం కాస్తా మాయమయినట్టు తోచసాగింది.

పాపం సుందరం ఒక విధంగా మంచివాడే. తను చేయగలిగిందేదో చేస్తూ ఉండగలగటం సుందరం వంటి వ్యక్తిలో గొప్పగుణం కాక మరేమిటి? ఆ చేయవలసిన పద్ధతిలో లోపముంటే ఉండవచ్చు. లోపాలు అనేవి మనిషికి ఎన్ని లేవు? అయితే సుందరం స్నేహాన్ని ప్రదర్శించటంలో, తన మనసు కష్టపడ్తున్న సంగతి సుందరం గ్రహించలేదనుకోవచ్చు. సుందరం చేస్తున్నది సహాయంగా పరిగణించటంతో 'ఇదిగో! నువ్వీ పని ఇట్లా చేస్తున్నందువల్ల, నా మనసు కష్టపడుతోంది. నా అభిమానం దెబ్బతింటోంది' అని అనగలిగే శక్తి తనకు లేకుండా పోయింది. ఎంత ఆలోచించినాసరే, ఈ విషయంలో సుందరంలో మంచితనమే తనకు కనిపిస్తున్నదిగాని, అతనిలో లోపం కనపడటం లేదు. సుందరానికి తను ఉంటున్న అంతస్థులోంచి అతనికి కనుపించేది, విశ్వానికి తన అంతస్థులోంచి వేరేవిధంగా కనిపించటం సహజం. మానసికంగా తన్ను హింసించాలని సుందరం అభిప్రాయం ఎన్నటికీ కాకపోవచ్చు. కాని, యథార్థం ఆలోచిస్తే, తను పడుతున్నది మానసిక వ్యథే!

తను మధ్యతరగతిలో కింది వర్గానికి చెందినవాడనీ, ఈ వర్గానికి చెందినవారు, సాంఘిక వ్యవస్థలో నిలపడటానికి చేసే ప్రయత్నంలో, పైకి ఎగబాకనూ లేరనీ, కిందకు దిగజారనూ లేరనీ, ధనిక వ్యవస్థలో తనవంటివారిది గబ్బిలాల జీవితంగా ఉంటుందనీ కథకుడైన విశ్వం గుర్తించకపోలేదు. అయితే, తనకే సంభవించిన ఈ పరిస్థితిలో తనపై ప్రత్యేకత చూపించుకోగలిగాడు గనక?

ఈ సంఘంలో తనవంటివారు పడ్తున్న మామూలు కష్టాలే తనూ పడుతున్నాడు. ఈ కష్టాలేమీ లేకుండా, సమాజంలో ప్రతీవ్యక్తీ కూడా, సరిసమాన బాధ్యతలుగల వ్యక్తి అనీ, పరస్పర గౌరవమర్యాదలూ హక్కులూ కలవాడనీ, సమాజం యావత్తూ కూడా గుర్తించగలిగే సామ్యవాదంలో తప్ప, ఈ అంతస్థులు తొలగిపోవన్న సత్యం గ్రహించాడు విశ్వం. సుందరం ఉన్నటువంటి అంతస్థులు నిర్మించటానికి ఈ సమాజం బోలెడంత అవకాశం ఇచ్చింది. ఇక సుందరంలో ఉన్న లోపమల్లా ఎక్కడంటే—ఈ అంతస్థుల భేదాన్ని, అంత చదువుకున్నవాడైనా, ప్రపంచాన్ని చూసినవాడైనా, గుర్తించకపోవటం. అతను ప్రపంచాన్ని భౌతికంగా మాత్రమే చూడగలిగాడుగాని, తనలాగా నైతిక దృష్టిలో చూడలేదు. సుందరం ఏనాడైతే తన బుద్ధి అనుభవమూ సక్రమంగా వినియోగించి, ఈ అంతస్థుల్ని గుర్తిస్తాడో అప్పుడే, దిగివస్తాడు. కనీసం ఈ యథార్థం సుందరం ఇదివరకు గుర్తించి ఉన్నట్టయితే, తన్ను—అంటే విశ్వాన్ని—సరాసరి తన కింద 'బానిస'గా చేసుకొని ఉండడు. ఈ అంతస్థుల భేదంవల్లనే, సుందరం, స్నేహాన్ని ప్రదర్శించగలిగినప్పటికీ, స్నేహానికి ఉండవలసిన—చూపవలసిన—గౌరవం ఉంచనూలేదు—చూపనూలేదు.

ఈ ఆలోచనలతోనే విశ్వం ఎప్పుడు నిద్రపోయినాడో గాని, మళ్ళీ మెలకువ వచ్చేసరికి, ఉదయం ఎనిమిది దాటింది.

## 6

లీల ఉత్తరం రాసింది. పిల్లవాడికి నాలుగైదు రోజులై జ్వరం వస్తున్నదనీ, నాన్నగారికి మక్కపట్టుకుపోయి లేవ లేకుండా ఉన్నారనీ, పూటగడవటం అతికష్టమయిపోతున్నదనీ, పాపం మరిదే, తికమకలుపడుతూ, బండీ లాగుతున్నాడనీ, తన చెల్లెలి సహాయమే లేకుంటే ఏమయ్యేదానో అనీ, అమ్మకి ఎప్పుడూ పెనుసరించే విచారంగా ఉంటున్నదనీ...

ఇంతకన్న ఆశాజనకమైన ఉత్తరం వస్తుందని విశ్వం ఎన్నడూ ఆశించలేదుగాని, కనీసం, అంతా క్షేమంగా ఉన్నారనివస్తే చాలుననుకున్నాడు. ఈ పరిస్థితిలో తను చేయగలిగేదేమిటో స్పష్టంగా కనిపించటం లేదు. ఒకసారి పోయివస్తే? శెలవూ డబ్బూ రెండూ కావాలి. శెలవు సుందరాన్ని అడిగితే ఇవ్వకపోడు. కాని మొదటినెలఅంటే జీతంలో సగం ఇంటికి పంపాలా, తన ప్రయాణానికి ఖర్చు చెయ్యాలా? ఇదివరకు చేసుకొచ్చిన అప్పు వంద రూపాయలూ తీర్చేదెవరు?

మనిషికి కొంతవరకైనా తెగింపంటూ ఉంటేనేగాని బతకటం కష్టం. తెగించి ఊరికి వెళ్ళ

కుండా ఉంటేనే మంచిది. ఆ ప్రయాణానికి అయ్యే ఖర్చుతో మరికొంత కలిపి, జీతంలో సగం, ఇంటికే పంపేస్తే వాళ్ళే ఏదో తంటాలు పడతారు. అంతే గాని, ఈవిషయం సుందరంతో చర్చించి లాభం లేదు.

మొదటితారీఖు రాగానే, జీతం కూడా ముట్టింది. విశ్వం, ముప్ఫయిరూపాయలు ఇంటికి అద్దె ఇచ్చి, మరో నలభై, హోటలుకి ఇచ్చాడు. తన చెయికాపుకి ఇంకో ముప్ఫయిఉంచుకొని, మిగతా నూటపదిరూపాయలు ఇంటికి మనియార్డరుచేస్తూ, లీలకీ, తమ్ముడికీ ఉత్తరాలు రాశాడు. అనాడే, తను రాసిన కథకూడా పత్రిక్కి పంపించాడు.

అఫీసులో పని అంత మెదడుతో కూడుకున్నది కాదు. బండచాకిరీ బోలెడుంది.

అయితే ఇందులో పేచీ ఎక్కడ వస్తున్న దంటే, సుందరం చేసే ప్రతీ పనిలోనూ, ఆడే ప్రతీ మాటలోనూ ఏదో అధికారం చెలాయిస్తున్నట్టుగా తోచసాగింది విశ్వానికి. ఇది రాను రాను భరించడం కూడా కష్టమవుతోంది. అదీకాక, సుందరం కాస్త 'చేయతడి' చేసుకుంటూ ఉండటం విశ్వానికి చాలా అసహ్యంవేసింది. లంచాలు పుచ్చుకోవటం, ఇవ్వటం తమాషాగా ఒక చక్రం తిరిగినట్టు తిరుగుతుంది. దీనికి సుందరం ఎట్లా అలవాటు పడ్డాడో పరమాత్ముడికే తెలియాలి. ఈ విషయం సుందరంతోనే, తన స్నేహాన్ని పురస్కరించుకొని ప్రస్తావించినా, అతనికి కోపమూ రావచ్చు. మొదటికే మోసం కలగ వచ్చు. ఎవరి ఖర్మం వారిది.

ఒకనాడు సుందరం, తనతో–'చూడు విశ్వం–నువు మొన్నటి ఫైలుమీద రాయకూడని విషయాలు చాలా రాశావు. ప్రభుత్వోద్యోగంలో అటువంటప్పుడు జాగ్రత్తగా ఉండాలి. నీకు తెలీకపోతే నన్ను అడగాలి. అంతేగాని, నీకు తోచిందే న్యాయం అనుకుని రాసిపారెయ్య రాదు. దానివల్ల ఎంత నష్టం వచ్చిందో చూడు. ఖస్ ఖస్ తడకలు, కొంత కాలానికి వేయించడంలో, మనకు పాతిక వేల రూపాయలు ఛాన్సును ఉంది. అంటే ఆ డబ్బంతా ఖర్చు చేయాలని కాదు. కొంత ఆదా చూపటానికే మనం ఇక్కడుంటున్నది!" అంటూ వెళ్లిపోయినాడు.

ఈ మాటలతో విశ్వానికి యధార్థం బోధపడ్డది. తన బుద్ధి ప్రయోగించి, ఆ ఫైలులో తనకు తోచిన దేదో రాయటంవల్ల, సుందరం ఈ వ్యవహారంలో చేసుకుందా మనుకున్న అయిదువేల రూపాయలూ కంట్రాక్టరుకే దక్కాలి. అయితే, ఇప్పుడు సుందరం వ్యవహారం బయటపడకుండా, ఆ అయిదువేల రూపాయలూ ప్రభుత్వానికి ఆదాగా ఉన్నట్టు చూపించి ఊరుకున్నాడు.

తెల్లవారి లేస్తే ఇటువంటివి లక్ష జరుగుతున్నాయి. ఇటువంటివి చూస్తూ బయటకు రావటం ఎన్నాళ్లు? తనవంటివాడికి దొరక్క దొరక్క ఈ దిక్కుమాలిన ఉద్యోగం దొరికిందేమిటి? లంచాలు బాగా పట్టగలిగే వారికీ, పై వాడు ఏమన్నా పడి ఉంటూ ఉండేవారికీ ఈ ఉద్యోగాలు.

"పిల్లవాడికి జ్వరం తగ్గినా, రోజూ కొద్దిగా వస్తూనే ఉంది. వాడు మీకోసం బెంగపెట్టుకున్నట్టు కనిపిస్తోంది. రాత్రులు పలవరిస్తాడు. మీ నాన్న గారికి ఇప్పుడు కొంచెం నయంగానే ఉంది. మీరు పంపిన డబ్బుతో ఈ నెల గడుస్తుంది. మీరు ఊరికి వెళ్ళటానికి చేసిన అప్పు మీ తమ్ముడు తీర్చాడు. ఎట్లా తీర్చాడో ఎవరికీ చెప్పడు."

ఈ ఉత్తరంలో తను బెంగపెట్టుకోటానికీ ఉంది. సంతోషించటానికీ ఉంది. అవమానం పొందటానికీ ఉంది. తనకన్న తన తమ్ముడే అనేక రెట్లు నయం!

ఈసారి తమ్ముడి ఉత్తరంకూడా లీల ఉత్తరంతోపాటు వచ్చింది.

..."నువు ఇక్కడి పరిస్థితులగురించి బెంగ పెట్టుకోకు. అంతా క్షేమమే—నీ ఉద్యోగం మట్టుకు స్థిరంగా ఉండేటట్టు చూచుకో. ఏ పరిస్థితులలోనూ కూడా, అది వొదిలిపెట్టెయ్యకు. నువు కోరితే, వొదినెనూ, పిల్లవాడినీ తెచ్చి దిగపెట్టటానికి నేను సిద్ధంగా లేననుకోకు... అన్నట్టు ఈ నెల పత్రికలో నీకథ చదివాను..."

తమ్ముడికి ఇప్పుడున్నటువంటి ప్రపంచ జ్ఞానం, తమ్ముడి ఈడులో తనుఉండినప్పుడు తనకు లేకపోయినందుకు విశ్వం చింతించలేదు. రోజు రోజుకీ ప్రపంచమే కూలిపోతోంది. పరిమాణాలు ఎక్కువవుతున్నాయి. ఏనాటి పరిమాణాలకు

తగ్గట్టుగా ఆనాటి బుద్ధికూడా వికసింపచేసుకోవటం లోనే ఉంది మనిషి అభ్యుదయం అంటాను.

తనకథ పడిన పత్రిక తనకు ఎందుకు రాలేదా అని ఆలోచిస్తూ ఉండగానే సుందరం వచ్చి నిజం బయటపెట్టాడు.

"నీపేర ఒక పత్రిక వచ్చిందోయ్, ఇదు. నీ అనుమతిలేకుండా, పత్రికేకదా అని చూడటం తటస్థించింది. అయితే అదీ మంచికే అయింది. చూడూ! నువు కథలు రాయటం బాగానే ఉంది. రాయగలిగే వాడు రాస్తూ ఉండాలికూడాను. నువు కూడా ప్రభుత్వోద్యోగివి గనక చెప్తున్నాననుకో. నిబంధనలప్రకారం మనం అసలు ఏదీ ఇట్లా రాసి అచ్చువేయించరాదు. ఒక కథ రాస్తే, దాన్ని పత్రికకు పంపేముందు పర్మిషన్ తీసుకో వలసివుంటుంది లేకుంటే ఎంతేనా పేచీ వస్తుంది. అది నాచేతిలో ఉన్నపనే అనుకో. నువొక దరఖాస్తు పెట్టు పర్మిషన్ ఇచ్చినట్టు నేను చేసేస్తాను లే."

ఇది విశ్వం ఇదివరకు ఎరిగి ఉన్నదే. అయితే, ఈ బాధ, రాజకీయాలకు సంబంధించినవాటికే కాకుండా, మామూలుగా ఒక కథరాసినా, ఉంటుందనిమాత్రం విశ్వం ఊహించుకోలేకపోయినాడు. మనకు స్వతంత్రం అంటే వచ్చిందనుకుంటున్నాంగాని, ప్రభుత్వం మారలేదనీ, స్వాతంత్ర్య వ్యవస్థకి తగ్గట్టుగా ప్రభుత్వోద్యోగాల నిబంధనలు పరిణామం చెందలేదనీ విశ్వం గుర్తించాడు.

ఇప్పుడు తను కథలు రాయటానికి ముందు 'పర్మిషను' పుచ్చుకోవాలి. ఇదైనా మళ్లా, తన స్నేహితుడు—సుందరం—ఇవ్వాలి! సుందరం అనుమతిస్తేనే తను కథ లంటూ రాయగలమన్నమాట! ఈస్థితిలో తను సాహిత్యసేవకు తిలోదకాలన్నా ఇవ్వాలి. లేదా ఉద్యోగానికైనా పాట పాడెయ్యాలి అంతేగాని, ఈపర్మిషనూ వ్యవహారం విశ్వానికి నచ్చలేదు.

# 7

విశ్వానికి ఈ చాకిరీ నచ్చటం లేదన్న విషయం మొదట్నుంచీ తెలుస్తూనే ఉంది. దీనికి కాలపరిమితి కూడా, మరో నెల్లాళ్ళలో పూర్తి కాబోతుందని, విశ్వం ఉద్యోగంలో ప్రవేశించిననాడే తెలుసుకున్నాడు. సుందరం ఆ విషయం ఎందుకు దాచాడో, ఇప్పుడు సుందరం, దీని కాలపరిమితి మరో మూడు నెలలకు పెంచటానికి చేస్తున్న ప్రయత్నంవల్ల బోధపడుతున్నది విశ్వానికి. ఇప్పటికి రెండు నెలలకు పైగా ఈ బండచాకిరీ చేయటమే కాక, సుందరానికి అయిదువేల రూపాయలు నష్టం తీసుకురావటంతో సుందరానికి బాగా దూరమైనాడుకూడాను. ఇప్పుడు సుందరం—తనతో పూర్వపుస్నేహంతో గానీ, ఆధోరణిలో గానీ, ఆ ఆప్యాయంతో గానీ మాట్లాడటం లేదు. పైగా ఒకవేళ ఏదన్నా అవసరమొచ్చి, సుందరం మాట్లాడినా, అది తన మనసుని, నిశ్చితంగా కష్టపెడ్తున్నది. సుందరం అంతకన్నా ఎక్కువసంస్కారయుక్తంగా ఎందుకు మాట్లాడడో విశ్వం తరిచిచూస్తే మళ్లా అతనికి అంతుపట్టలే కనిపించసాగాయి.

ఈ ఉద్యోగంలో తను, ఇంతవరకూ సాధించిందేమిటి? ఏంసాధించాలనుకున్నా ఇంత త్వరలో తేలేవిషయం కాకపోవచ్చు. కాని, దాని సూచన అన్నా కనిపించకపోవటంలో అర్థం లేదు పైగా, తను చేసే ప్రతీ పనికీ అడ్డుపుల్లలు అధికమవుతున్నాయి. ఇది భరించటం చాలా కష్టం. ఇదిలా ఉండగా, ఈ ఉద్యోగంవల్ల, విశ్వం, తన వాళ్ళకు దూరమైనాడే గాని, దగ్గర పడే సూచన లేమీ కనపడటం లేదు.

ఈమధ్యనే తన కొక రోజు తల భారమై, జ్వరం లక్షణాలు తగిలి లంఖణంతో ఉంటే — శెలవు చీటీ పంపించటం—"ఈ మాత్రానికి శెలవేమిటోయ్! రెండు 'ఆస్ప్రిన్' మాత్రలు తిను" అంటూ సుందరం తిన్నని ఆఫీసుకి రమ్మని ప్రత్యేకంగా కబురుచేయటం జరిగిందికూడాను! అంటే, తనకు కనీసం శెలవు, కావలసినపుడు దొరకటం—సుందరం అజమాయిషీలో కష్టమని కూడాబుజువైంది.

ఇటువంటి చాకిరీ చేయటానికి సిద్ధపడేవాడు ముందుగా తన ఆత్మాభిమానం చంపుకోవాలి. ఇట్లా ఆత్మాభిమానం చంపుకోవటం కనీసం తనవంటివానికి చేతకాని పని. తన ఆత్మాభిమానాన్ని అప్పుడప్పుడు గాయపరిచేటంతవరకూ ముందుకు సాగాడు విశ్వం. కాని, ఇప్పుడు పూర్తిగా దాన్ని చంపుకుంటేనే

గాని, ఇందులో మోక్షం సాధించటం సాధ్యపడదని విశ్వసించాడు. తనకు చేతకాని పని చేయటానికి— అందులో, ఆత్మాభిమానం చంపుకొనటానికి, తెగించేటంత ద్రోహం మరొకటి లేదు.

ఆనాటిరాత్రి, విశ్వం, ఇవే ఆలోచనలతో ఒక కథ రాయాలని మళ్లీ సంకల్పించాడు. కాని, అది కథగా రావటం మానేసి, ఒక ఉత్తరంగా పరిణమించింది. ఇది అనుకోకుండా జరిగినటువంటిది. ఆ ఉత్తరం సుందరానికి ఉద్దేశించింది.

## 8

"మైడియర్ సుందరం ! ఈ ఉత్తరాన్ని నాపై అధికారిగాఉన్న సుందరానికి కాకుండా, నా స్నేహితుడైన సుందరానికి రాస్తున్నాననుకొంటావనే నా విశ్వాసం. ఈ ఉత్తరాన్ని నీకు ఎందుకు రాస్తున్నానో నన్నడక్కు. నిజానికి నేను ఈరాత్రి, ఒక కథ రాయాలని కూర్చున్నాను. తీరా చూస్తే ఇది ఇలా ప్రారంభమైంది. అయితే ఇదీ ఒక కథలాగే తోచవచ్చు. కనక దాన్ని ఇంతటితో ఆపేయకుండా పూర్తి చేస్తున్నాను.

నాకు స్నేహితులంటే పరమ గౌరవం. నా స్నేహితులలో నిన్నే అందరికన్నా ఎక్కువగా భావించుకొంటూ ఉంటాను. నువు నాకు చేసిన సేవకీ, చూపిన సానుభూతికీ అంతకన్నా ఉత్తమమైన పద్ధతిలో నా కృతజ్ఞత తెలియచేసుకోవడం నాకు చాతకాదు.

నేను సహజంగా కథకుణ్ణి. ఈరాత్రి కథ రాద్దామంటే, ఇది ఈ ఉత్తరంగా పరిణమించటానికి కారణం. కథ రాస్తే అది ప్రకటించుకోటానికి, నా సాటివాడివైన నీ అనుమతి, అధికారపూర్వకంగా పొందాలి. ఆ మాటకూడా నువ్వే పాపం— నామంచికే ఆలోచించి అన్నావు. కాని, నాకిది సరిపడదు. నాస్వేచ్ఛని ఈవిధంగా నేను ఇంకొకరి చేతిలో బంధించివేయలేను. అందువల్ల, ఈ ఉద్యోగంలో ఉండిన ఆఖరు క్షణంవరకూ నాలో ఉన్న కథకుడు నిద్రపోతూ ఉండాలి.

మనం సరిసమానమైన హోదాలో ఉండే స్నేహితులం. ఈ స్నేహానికి భంగం రావడం నేను భరించలేను. నేను చాలా సెన్సిటివ్‌గా ఉంటున్నానని అనుకొంటున్నావా ? నిజమే అందుకే నావంటివాళ్లకి ఇటువంటి ఉద్యోగాలలో స్థానంలేదని గుర్తించాను. నీలోనాకుండిన స్నేహాన్ని పురస్కరించుకొని, నాకొక ఉద్యోగం చూసిపెట్టమంటూ నీకు ఉత్తరం రాశాను. నా ఊహకు అతీతంగా పాపం నువు నన్ను ఆదరించి, నీ అభిమానంతో నన్ను ఉక్కిరి బిక్కిరి చేశావు. నిన్ను నేను తప్పుపట్టున్నా ననుకోకు. స్నేహితుడనేవాడు నీ అంతస్థులో ఉంటే, నువ్వు చేసినదానికన్నా ఎక్కువ ఎవడూ చేయలేడనుకో. అయితే ఒక యథార్థం చెపుతాను. నువ్వు కేవలం నీకిందే నన్ను వేసుకుంటావని మాత్రం నేనెన్నడూ కలలోకూడా ఊహించలేదు. నన్ను స్నేహితుడిగా ఆదరించిన వాడివి, స్నేహాన్ని గౌరవిస్తావనే విశ్వసించాను. అయితే, నువు చేసిన ఈపనిలో, మన స్నేహానికి అగౌరవం కలిగిందని నువు గుర్తించకపోవచ్చు, అంతస్థుల భేదంవల్ల, అది, కిందనుంచి నేను గమనించాను. పైనున్నవాడివి, నీ కాస్టే కనపడదది.

నాకు ఆత్మాభిమానం చాలా ఎక్కువ. నీ అధికారాన్ని నేను గౌరవంగా చూసి, దానికి అణిగిపోయినప్పుడు నా ఆత్మాభిమానాన్ని చాలా మట్టుకు గాయపరుచుకున్నాను.

చూస్తూ చూస్తూ నేను అన్యాయానికి తల వొంచలేను. న్యాయంగా నేను రాయవలసిన దేదో రాస్తే, దానిమూలంగా అయిదువేలరూపాయలు ప్రభుత్వానికి ఆదా కనిపించింది. ఆ ఆదా నువు చేసినట్టే రికార్డులో విక్కించుకొన్నావంటే, నువు అధికారికి గనక నేను కాదనను. అయితే ఆదా జరుగుతున్నప్పుడే, 'ఆదా చేయటానికే మనం ఉన్నాం' అని నువ్వప్పుడు నాతో అనటంలో, నాకు కించిత్తు నైచ్యం కనిపించింది. బహుశా ఆ సొమ్ము నేదో కార్యార్థం ఉపయోగించాలని నువు ఉద్దేశించి ఉండవచ్చును. ఈ పద్ధతి నాకు నచ్చదు. నేను ఉద్యోగరీత్యా ఇక్కడ అతి అల్పుణ్ణి. నామాట ఎవరు పాటిస్తారు ?

నాకు ఒకరోజు శలవు కావాలంటే నువు అభ్యంతరం చెప్పావు. బహుశా అభ్యంతరం చెప్పవలసిన అవసరం ఉందని నీకు తోచిందేమో. కాని,

ఈ చర్య, మనిషిశక్తిని దుర్వినియోగపరుచుకుంటున్నట్టుగా నా కర్థమయింది.

ఇదీకాక, ప్రతీ చిన్నవిషయంలోనూ నేను నీకు తలవొంచిఉండవలసిన పరిస్థితి ఏర్పడింది. నిన్ను నేను, స్నేహితుడిగా ఎంచుకోవడం మూలాన, నా ఆత్మాభిమానం బాగా దెబ్బ తిన్నదేగాని, నీ స్థానంలో నాకు తెలియనివాడు ఇంకొకడున్నా, నేను బాధపడవలసినవాణ్ణే. నా స్వభావమే అంత. ఈ బాధకు నేను తట్టుకోలేను.

'ఉద్యోగమంటే, తీరికూర్చొని సుష్టుగా భోంచేయటమా?' అని నువ్వు ప్రశ్నిస్తావు. కాని, తీరికూర్చొని సుష్టుగా భోంచేయటంమాట ఎలా ఉన్నా, ఉద్యోగమంటే, ఇప్పుడున్నంత హీనంగా లంచగొండివ్యవహారంగా, అధికారమదాంధతగా, మానవత్వరహితంగా హృదయశూన్యంగా ఉంటుందని మాత్రం నేను అనుకోలేదు.

ఇంతెందుకూ? నా అంతస్థు వేరు. అది చాలా పైనుంది. నేను, నీ దృష్టిలో చాలా దిగువ ఉన్నా నన్నమాట నిజం. మానసికంగా, సంస్కారంగా నే నెంతో పైమెట్టులో ఉన్నా యథార్థం నువు గుర్తించ నవసరంలేదు కూడాను. దానివల్ల నీకూ నాకూ కూడా ప్రయోజనమంటూ ఏదీ ఉండదు.

పోతే, నేను ఇక్కడికి నీ ధర్మమా అని వచ్చి, నా వాళ్లకు చాలా దూరమైపోయినాను. నా తమ్ముడు నన్ని ఉద్యోగం వొదులుకోవద్దన్నాడు. పాపం! వాడికేం తెలుసు నావంటి వాడి మానసిక బాధ! ఈ పరిస్థితిలో నేను నా కుటుంబాన్ని ఇక్కడికి రప్పించనూ లేను. నేను వెళ్లనూ లేను. నావంటివాళ్లు ఇక్కడ అనేక వందలమంది ఎలా బతుకుతున్నారంటే అది వేరే మాట. అందరూ నావంటివాళ్లలా అవుతారు! అందరికీ ఆత్మాభిమానాలు లేవని కూడా నే ననలేను. వాళ్ళ పరిస్థితులు భిన్నమై ఉండవచ్చును. వాటికి తట్టుకోగలిగేవారు నిలబడుతున్నారు. తట్టుకోలేని నావంటివాళ్లు, ఈ వ్యవస్థలో ఇరుక్కోలేక పాతాళంలో పడిపోతున్నారు. కాని, నే నింత హీనంగా పాతాళంలో పడిపోనని ధైర్యం నాకుంది. నన్ను లక్ష్మి కటాక్షించకపోయినా సరస్వతి కాస్త వోరకంటితో చూస్తోంది. ఇదివర కెలా జీవితం గడిపానో అలాగే గడపక పోను. బహుశా, పరిస్థితులు అనుకూలంగా ఉంటే, ఇంకా గౌరవంగానే బతగ్గలనని నా ధైర్యం.

ఇక్కడితో నా చాకిరీ కాలపరిమితి కూడా పూర్తికాబోతున్నది. రేపు జీతంపుచ్చేసుకొని, నా మానాన నేను పోతున్నాను. నన్నేదో ఉద్ధరించాలని మాత్రం ఈ ఉద్యోగం అనవసరంగా పొడిగించి, ప్రభుత్వానికి కలగబోయే ఆదాయం కలగకుండా చేయకు. అవసరమే ఉంటే, మరో 'స్నేహితుణ్ణి' వేసుకో. మన స్నేహంమాత్రం ఈ విధంగా కాపాడుకుంటే ఇదే చాలును.

అసలు, ఈ నాలుగు ముక్కలూ నీముఖం ముందు చెప్పే అధికారం నాకుంది. అయితే, నా అధికారం మన స్నేహంనుంచి వచ్చినది. ఇంత మట్టుకూ ఈవిధంగా తెచ్చిఉన్న ఈ స్నేహానికి ఇంక అధికార మేముంటుంది? అదీకాక, గాయపడ్డ నా మానాభిమానాలతో, నీముఖం ముందు, నామనసులో ఉన్న ముక్కలు చెప్పలేకపోయినాను. అందువల్లనే ఈ ఉత్తరం ఇలా పరిణమించింది.

నే నింత పొడుగాటిఉత్తరం రాసినందుకు నన్ను క్షమించు. ఉన్నవిషయం కాస్తా రానేస్తే, నేను, ఇటీవల నామీద పట్టిన బూజుదులుపుకొన్నట్టవుతుంది. నీ ఎప్పటి సానుభూతితోనే దీన్ని చదువుకొని, నన్ను అర్థంచేసుకోటానికి ప్రయత్నించు. ఇదే నిన్ను నేను కోరబోతున్న చిన్ని కోరిక.

నీ విశ్వం.

పరా—ఈ ఉత్తరంతోపాటు, నా రాజీనామా ఉత్తరంకూడా జతపరిచాను. ఉద్యోగ కాలపరిమితి అయిపోయింది గనక, దాని అవసరం లేదు. అయినా అవసరం ఉంటుందేమో అని, పంపిస్తున్నాను. స్వీకరించు—

అంతస్థుల భేదంవల్ల, ఈ ఉత్తరానికి సమాధాన మేమిటని నువు అనుకోవచ్చు. నీ సమాధానం కోసం నేను ఎదురు చూడనులే. అయితే, ఎటువంటి సమాధాన మివ్వాలి? అని మాత్రం నువ్వు కాస్త ఆలోచించినపక్షంలోమాత్రం ఈ వ్యవస్థలో ఒక పెద్ద విప్లవం రావటానికి సిద్ధంగా ఉందనుకో—నీ విశ్వం,"

---

# హేమంతము



శ్రీ సామవేదం జానకిరామశర్మ

చేలగట్టులఁ బచ్చపూల సింగారాల
  నొలికించె జనపమొక్కలు తమంత,
కాలిబందము పచ్చికానికి; దట్టమై
  కొనలుసాగెను గట్టు మినపతీగె,
పురుగుపట్టిన దొండ పెరటిలోనఁ జిగిర్చి
  పూలపిందెలఁ గ్రొత్త పొలుపుఁ దాల్చె.
చచ్చినకాకర చచ్చినట్లేయుండి
  తుదిమొదళ్లుగ నాకుఁ దొడిగికొనెను.
  'కడచిపోయినదే మేలు కాలమన్న'
నానుడికిఁ గూర్చి స్పృహ; యధునాతనముగఁ
  జేలఁ బెరడుల హేమంతసిరులు చాలఁ
గూర్చుకొనెఁ దెల్గుపల్లెలు కొసరి కొసరి.

## 1

పరికిణీజీరాడ శిరమెత్తి యాటకై
  మునికాళ్లఁ గన్నియ చనినయట్లు,
పల్యంకికను బాల పరిణయమ్మున సిగ్గు
  బరువుచే శిరమను వంచినట్లు,
పదిమందిలోఁ బ్రౌఢ భర్తను శీర్షమ్ము
  చాచిచాచక తొంగి చూచినట్లు,
బంగరు మైతీగె భాసింప సౌధాంత
  రమున జవ్వని కురు లార్చినట్లు,
తెల్లెడల స్త్రీత్వమే మది నల్లుకొనఁగ
విఱుగఁబండిన కేదారవీధిశాలి
దండములతుది కంకెలు నిండఁ దాల్చె
రమ్యహేమంతమే ఋతురాజ మనఁగ!

## 2

ముద్దుగ దిద్దిన పెద్ద ముత్తైదువు
  నుదుటి కుంకుమబొట్టు కుదురనంగ,
నవయౌవనమ్ము సందడిసేయు యువతీల
  లామమ్ము బింబాధరమ్మనంగ,
పచ్చరా వేదిక భాసిల్లు నరుణారు
  ణమ్ము భాస్వత్ప్రవాళమ్మనంగ,
పొడుపుకొండ ఇనుండు భూమిపై దీయించు
  కొనిన ఛాయాచిత్రమనఁగ మెఱసి
కర్ణికారఫలమ్ము లోకమునఁ గల్గు
రాగమును బూనె హేమంత రాత్రులందు
కాముకీ కాముకుల నేత్రకమలములను
మానసమ్ములఁ గల రాగమహిమ మించి!

## 3

చిఱుచలికే సంచె చీకటి పడకుండ
  ముదుసలి దుప్పటి ముసుఁగు వెట్టె,
అసురసంధియ నాడియాడి వచ్చినబిడ్డ
  యడుగులు కడుగగా వడఁకిపోయె,
పాత్రమ్ముతో దీపమునకు ముందుగ నున్న
  బాలుఁడు గురువుపైఁ జాలఁగినిసె.
రాత్రి వంటకము నీరాడి యారంభించు
  వనితకుఁ బతి తలపునను మెదలె
సందెపొద్దుల నిశలను జనులనెల్ల
స్వీయశక్తి ప్రభావ విశీర్ణమాన
మానసులఁ జేసియును సౌఖ్యమూను నిద్ర
సంతరించెను హేమంతచక్రవర్తి!

## 4

పెనువాన జల్లువచ్చినయట్టు లొకసారి
  భూనభోంతరమును మూసివేయు,
సన్నని చినుకులు జాఱి నట్లొకమారు
  మేనెల్లఁ జిఱుతడిఁ బూనఁజేయు

చినుకులు చిదురలై చెదరి నట్లొకపరి
మోమెల్లఁ దడితోడ ముంచియెత్తు
ముత్తెపు బిందువుల్ మొనసినట్లొకతేప
దేహమ్ముపైనఁ గదించుకొనును,
సర్వవిధముల వర్షమ్మె సాగెననుచు
జనము భ్రమియింప గారడీ సలిపి, మింట
హిమముగుడికట్టి, చినుకులై, హెచ్చుచిదుర
లగుచు, బిందువులై పరిహాసమాడె!

## 5

కడుపులోనికిఁ గాళ్లు ముడుచుకు ముద్దమై
వీధి పంచ శయించు బిచ్చగాడు
చినిగిన గొంగళి చిన్న పిల్లకుఁ గప్పి
పేరుచుఁ జలిఁ దూఁగు పేదతల్లి
ఆకటి దయ్యమ్ము సోఁకగా నదవద
మైయుండి, గజగజలాడు శిశువు
చలికప్పు సుతునకు సంతరింపఁగ లేక
యపియు గుండియఁ జూచునట్టి తండ్రి
యగుచు హేమంత మెంతో దయాదరిద్ర
మయ్యె; నెల్లెడ బీదల యార్తరవమె
తోఁచు నన్న విధమ్ముగా నాఁచియాఁచి
సన్న రొదతోడి శీతువు సంచరించె!
అభ్యంజనం బాడి యాఱినతల చిక్కు-
నవరింపఁగాఁ బోని చానయట్లు
పగతుఱఁ జెండాడఁ బదును బెట్టించిన
యాంధ్ర సైనికుని మహాసియనఁగ
అనుభవ జ్ఞానమ్ములను బండి బరువెక్కి-
చలియించు వృద్ధుని దలయుపోలె,
విద్యా నగరరాజవీధి రాసులు పోసి
వెలకిచ్చు మాణిక్యముల విధాన
తెలుఁగునేలను బండింపఁ గలిగె కంది
మొక్కలను, ధూమపత్రమ్ములుక్కుమిగులు
జొన్నకంకెల, మిరప పండ్లనో వేడ్క-
ననుభవజ్ఞుండు హేమంత హాలికుండు!



# కాళిదాస మహాకవి - జీవిత 'సమస్యలు'



శ్రీ పి. గణపతిశాస్త్రి

సమస్య అనే పదం ఈ రోజుల్లో (*Problem*) 'గట్టిచిక్కు' అనే అర్థంలో వాడుతున్నారు. పూర్వం ఇది 'పరీక్షార్థం ఇచ్చిన పద్యపాదము' అనే అర్థంలో వాడేవారు. నేటి తెలుగువార్తా పత్రికల పరిభాషలో దీని అర్థం బాగా మారిపోయింది. ఆర్థికసమస్య, సాంఘికసమస్య మొదలైన పదాలలో ఈ అర్థపరిణామం ఇంకా బాగా స్పష్టంగా కనిపిస్తుంది. వ్యావహారిక సంప్రదాయాన్ని అనుసరించి ఈ పదం ఈ అర్థంలోనే వాడుతున్నాను—కాళిదాస కవితలో ఇల్లాంటి 'సమస్య' లేమైనా ఉన్నాయేమో చూదాము.

రచయిత లెవరు తమ దేశ కాలపరిస్థితులు దాటిపోలేరనీ, ఈ పరిస్థితులకు వీరి రచనలకు ఏదో ఒక విధమైన సంబంధం ఉండితీరుతుందనీ కొందరు వాఙ్మయవిమర్శకు లంటారు. ఇది చాలావరకు నిజం. అయితే ఈ దేశ కాలపరిస్థితుల అవగాహనలోను, వీటివల్ల బయలుదేరే సమస్యల సమన్వయంలోను అనేకమైన అంతరువు లున్నాయి. ఒక రచయిత తన సమానకాలీన సమస్యలు ఒక తాత్కాలికమైన సంకుచిత దృక్పథంతో పరిష్కరించవచ్చును. మరి ఒక రచయిత ఆ సమస్యలన్నీ బాగా విశాలదృష్టితో పరిశీలించి మరి ఒకవిధంగా సమన్వయించి, పరిష్కార మార్గం సూక్ష్మంగా స్ఫురింపజెయ్యవచ్చును.

అంతేనే గాని కేవలం నేలవిడిచిన సామువంటిది సారస్వత మార్గంలో సాధ్యం కాదు. ఒకవేళ తెలిసిగాని, తెలియకగాని రచయిత లెవరయినా ఇలాంటి సాము ప్రారంభించినా—దీనికి సారస్వత గౌరవం దక్కదు. నిజానికి పలాయనవాదం (*Escapism*) గాని, 'కళకోసమే కళ' (*Art for art's sake*) అనే వాదంగాని మన సంస్కృత సారస్వత సంప్రదాయంలో లేనేలేవు. ఇలాంటి సరుకంతా ఇటీవలే పాశ్చాత్య వాఙ్మయాల్లోనుంచి మన దేశానికి దిగుమతీ అయింది. ఆ దేశాల్లో ఇలాంటి వాదాలు బయలుదేరడానికి అనేకమైన కారణా లున్నాయి—అయితే మన కిప్పు డిది అప్రస్తుతం—

'కాళిదాసకవి రసమయ కవితా ప్రతినిధి' అన్న అరవిందుని అభిప్రాయం ఈ వ్యాసాల్లో ఇంతకు పూర్వమే వ్రాశాను. వాల్మీకి కవిత ధర్మప్రధానమయినదనీ, వ్యాసకవిత మేధాప్రధానమయినదనీ, కాళిదాస కవిత రసప్రధానమయినదనీ అరవిందుని అభిప్రాయము. కాళిదాస కవిత్వాన్ని గురించి ఆయన '*Aesthetic*' అనే పదం వాడారు. 'రసమయం' అన్న పదం ఈ ఆంగ్లపదానికి చాలావరకు సరిపోతుంది. కాని ఈ ఆంగ్లపదానికి పాశ్చాత్య సౌందర్య సిద్ధాంతాలలో అనేకమైన అర్థచ్ఛాయలు ఏర్పడుతూ వచ్చాయి. రసపదానికి కావ్యానుభూతి జన్యమైన ఆనందమని అర్థం. మన ఆలంకారికుల ఆనందానుభూతి ప్రధాన కావ్యప్రయోజనం అని ఒత్తిచెప్పినా—వీరి నిర్వచనంలో సాంఘిక ప్రయోజన ధర్మసూత్రం అంతర్గర్భితంగానే ఉన్నది. ఆలంకార శాస్త్ర రచనాకాలంలో ధర్మాధర్మాలను గురించీ, విధినిషేధాలను గురించీ ఈ నాటి వారి కున్నన్ని అనుమానాలుగాని, అభిప్రాయభేదాలుగాని ఉండేవి గావు. ఒక సాధారణ ధర్మసూత్ర సరణి ననుసరించి ఆ రోజుల్లో అందరు ఆలోచించేవారు. అందుచేతనే ధర్మాధర్మదృష్ట్యా రసానుభూతిలో వచ్చే మార్పులను గూర్చిన చర్చ అలంకార శాస్త్రంలో అంత ప్రధానంగా కనబడదు—

అయితే ఒక్కొక్క సమయంలో ఈ ధర్మాచరణలో కొన్ని లోపాలు సంభవించడము, ఆయా కాలాల్లోని కావ్యాలలో ఆ ధార్మిక దృష్టి నిశితం కావడము సంస్కృత వాఙ్మయంలోకూడా అక్క

ఉక్కడ సకృత్తుగా కనిపిస్తుంది. కాళిదాసకవిత ప్రధానంగా రసమయమే, అయినా దీనిలోని ధర్మ సమస్య వ్యంగ్యంగా స్ఫురిస్తూనే ఉంటుంది.

కాళిదాసకృతు లన్నిటిలోను, తత్రాపి రఘువంశకుమార సంభవాల్లోను, విక్రమోర్వశీయాభిజ్ఞాన శాకుంతలాల్లోను మాత్రమే ఈ సమస్యా ధ్వని బాగా వినిపిస్తున్నది. కాళిదాస కృతులలో కనిపించే సమస్యలు రెండు విధాలుగా విభజించవచ్చును. ఒకటి జీవన భోగసమస్య. రెండవది ప్రేమభావసమస్య. ఈ రెండు కాళిదాస కృతులలో పరస్పర సమ్మిళితములై కనిపించవచ్చును గాని ఒక్కొక్క కావ్యంలో వీటిల్లో ఒక్కొక్కటి ప్రస్ఫుటంగా ధ్వనించి ఉండడంవల్ల ఇవి రెండు సమస్యలని వర్గీకరిస్తున్నాను.

మొత్తంమీద కాళిదాసకావ్యా లన్నిటిలోను-అందులోను రఘువంశ శాకుంతలాల్లో ఈ జీవితభోగ సమస్య మరింత స్పష్టంగా కనబడుతుంది. ఇంద్రియ గోచరమైన సౌందర్యం (*Sensuous Beauty*) కాళిదాస కవితలో ప్రతిఫలించినంత మహోజ్జ్వలంగా మరి ఇతర సంస్కృతకవులలో ఎక్కడా స్ఫురించదు. ఇది ఈ కవితలో గల ప్రత్యేక గుణం.

రఘువంశంలో ఇందు మతీ మరణానంతరం వసిష్ఠుడు అజుని ఓదార్చే సందర్భంలో శరీరధారులకు మరణమే ప్రకృతి అనీ జీవితమే వికృతి అనీ ప్రబోధించాడు. అటుపిమ్మట "క్షణమైనా ఊపిరి విడుస్తూ జీవించగలిగిన వ్యక్తి చాలా అదృష్టవంతుడుసుమా!" అని వసిష్ఠుడు అజునితో నొక్కి వక్కాణిస్తున్నాడు. ఇందుమతీ మృతివల్ల నిరాశోపహతుడైన అజునిగురించి అన్న ఈవసిష్ఠుని సూక్తి చాలా సందర్భోచితంగా సరిపోయింది. అయితే నిశితంగా కాళిదాస కవితపరిశీలించిన వారికి రెండో వాక్యం వసిష్ఠసూక్తిగానే కాక కవి హృదయాంతర్గత భావంగా స్ఫురించి తీరుతుంది. నిజానికీ వాక్యం కాళిదాసకవికి జీవితసౌందర్యానుభూతిపై గల మమకారానికంతటికీ తార్కాణంగా తీసుకోవచ్చును. అయితే—మరణమే జీవిత ప్రకృతి కనక ముందువెనుకలు చూచుకోకుండా భోగలాలసలో మైమరచిపోవడమే కాళిదాసాభిప్రాయమని అనుకోకూడదు. నిజానికిటువంటి ఉన్మత్తలాలసతో గల ఒడిదుడుకులన్నీ, ఈ మహాకవి సాకల్యంగా పరిశీలించినవాడే—కనకనే ధర్మపరులైన రఘువంశీయులలో చిట్టచివర ఉదయించిన అగ్నివర్ణునిలో ఈ ఉన్మత్త భోగలాలస వల్లకలిగిన దుష్ఫలితాలన్నీ వర్ణించనిదే కాళిదాసు తన కావ్య సమాప్తి చెయ్యనేలేదు. ఇలాగ అగ్నివర్ణునిలో కలిగిన దుష్ఫలితాలవల్లనే కవి భోగలాలసాదోషాలు పాఠకుల హృదయాలకు హత్తుకొనేటట్లు ధ్వనింపజేస్తున్నాడు. అంతేనే గాని కవి కంఠోక్తిగా ఈ విషయం ఖండించలేదు. ఒక్కచోటమాత్రం "స్వాదుభిస్తు విషయై ర్హృత స్తతో దుఃఖ మింద్రియగణో నివార్యతే" అని మాత్రం అంటాడు. "స్వాదువు లయిన విషయాలచే ఆకర్షించబడిన ఇంద్రియసమూహాన్ని తిరిగి మళ్ళించడం చాలా దుష్కరం" అని దీని అర్థము. ఇంత తటస్థంగా చెప్పిన కవి స్వీయోక్తినిబట్టి జీవిత సౌందర్యానుభూతిపై కవికి గల ఆసక్తి, అనాసక్తి అత్యంత మనోహరమైన సమ్మేళనంతో పాఠకులకు స్ఫురిస్తున్నాయి.

అభిజ్ఞాన శాకుంతలంలో ఈ సమస్య మరింత స్పష్టంగా కనబడుతుంది. ఈ నాటకంలో పాఠకులకు అనేక విధాలుగా వ్యంగ్యాలు ధ్వనిస్తాయి. ఒక విధంగా చూస్తే ఇది భోగపరుడైన దుష్యంతుని జీవితానికీ అనాసక్తులైన అరణ్యవాసుల జీవితానికీ గల తారతమ్యం చిత్రించే రూపకంలా కనబడుతుంది. శకుంతల తాపసకన్యక. తాపస ధర్మాచరణం ఈమె వేసే ప్రతిఅడుగులోను ప్రతిధ్వనిస్తూంటుంది. ఇక దుష్యంతుని పంథాయే వేరు. ఇతడు బహుభార్యాసక్తుడు. అంతఃపురంలో ఇతనిచేత ఒకప్పుడు అతిగా ఆదరింపబడి, ఆ తరవాత ఉపేక్షింపబడిన హంసపదిక వ్యంగ్యంగా ఇతన్నిగురించి పాడిన పాటవల్లనే ఇతని భోగపరాయణత పాఠకులకు చక్కగా తెలిసిపోతుంది.

వ్యాస భారతంలోని దుష్యంతునికీ, కాళిదాస శాకుంతలంలోని దుష్యంతునికీ ఎక్కడా పోలిక కనబడదు. భారత దుష్యంతుడు ఆశ్రమాన్నించి తిరిగి వచ్చిన తరవాత అసలు శకుంతల గోడే మరిచిపోతాడు. కాని అశరీరవాణి అతనికి ఆసరాగా నిలబడి 'శకుంతల నీభార్య సుమా!' అని హెచ్చరిస్తుంది. ప్రభువులు పక్కదారిపట్టి

అప్పుడు ఆ శరీరవాణి వారిని హెచ్చరించడము, మళ్లీ వారు సరియైన పంథాలో పడుతూండడము, ఆ కాలంలో ఒక పరిపాటిగా ఉండేది కాబోలు!

అయితే కాళిదాసు మాత్రం దుర్వాస శాప వృత్తాంతం ఒకటి కల్పించి, దుష్యంతుని స్వభావానికి, చాలావరకు మెరుగుపెట్టాడు. కాని అతని బహు భార్యాసక్తికి మాత్రం ఎక్కడా లోటు రానివ్వలేదు. పతి తిరస్కరించినా తపస్వినియై అతనినే అనుసరిస్తూ కాలం వెళ్ళబుచ్చిన శకుంతల దగ్గర నిలబడినప్పుడు—దుష్యంతుడు దివిటీ ముందర దివ్వెలా వెలవెలబోతాడు—ఈవిధమైన శకుంతలా దుష్యంతుల తారతమ్య ప్రదర్శనవ్యంగ్యంతో కవి భోగపరాయణతలో గల లోపాలు వేలెత్తి చూపిస్తున్నట్టే కనపడుతుంది.

అభిజ్ఞానశాకుంతలం మరి ఒక విధంగా కూడా పరిశీలించవచ్చును. కాళిదాసమహాకవి దేశకాల నిర్ణయం ఇంతవరకు స్పష్టంగా జరగలేదు గాని, ఇతడు తన నివాసభూమి సర్వ సంపత్సమృద్ధమైన కాలంలో జన్మించిన వాడై ఉండవచ్చుననైనా పాఠకులకు స్పష్టపడి తీరుతుంది. విమర్శకు లనేకులు గుప్తసామ్రాజ్యం సర్వోచ్చస్థితిలో ఉన్నప్పుడు కాళిదాసకవి ఉద్భవించి ఉండవచ్చునని అన్నారు—ఏది ఎలాగ ఉన్నా కాళిదాస కవితలో భారతదేశ చరిత్రలో సర్వసమృద్ధమైన ఒక స్వర్ణయుగం ప్రతిఫలించిన విషయంలో అభిప్రాయభేదం ఉండనక్కరలేదు.

అయితే కాళిదాస కవి ఆ కాలంలో మితిమీరిన భోగాసక్తిలో మైమరచిన తాత్కాలిక నాగరక జీవితాన్ని వ్యంగ్యంగా అధిక్షేపిస్తూ తన కావ్యనాటకరచన కుపక్రమించినట్టు కనబడుతుంది. అభిజ్ఞాన శాకుంతలంలో ఆశ్రమ నగరజీవితాల తారతమ్య పరిశీలన చాలా నిశితంగా వెల్లింది. దీనికి శకుంతల వెంటవచ్చిన కణ్వశిష్యుల సూక్తులు తార్కాణంగా ఇవ్వవచ్చును. వీ రిద్దరు కేవలం ఆశ్రమవాసులు. మొట్టమొదటగా కణ్వుని ఆజ్ఞానుసారమే వీరు దుష్యంత నగరానికివచ్చినట్టు కనిపిస్తారు. వీ రిద్దరి శ్లోకాలు నాగరక జీవనంలోగల భీభత్సం చక్కగా వివరిస్తాయి—

"మహాభాగః కామం నరపతి రభిన్నస్థితి రసౌ
న కశ్చి ద్వర్ణానా మపథ మపకృష్టోపి భజతే
తథాపీదం శశ్వ త్పరిచిత వివిక్తేన మనసా
జనాకీర్ణం మన్యే హుతవహపరీతం గృహ మివ"

ఇది కణ్వశిష్యులలో మొదటివాడన్న శ్లోకము. దీని అభిప్రాయం ఇది. "ఈనరపతి మహానుభావుడు. ఇతడు ఒక క్షణమైనా ఏమరకుండా తన రాజధర్మం నిర్వహిస్తున్నాడు. వర్ణాలలో అధమవర్ణస్థులు కూడా చెడుమార్గం జోలికి పోవడంలేదు—అయినా వివిక్త మనస్సుతో ఇదంతా పరిశీలిస్తున్న నాకీ జనాకీర్ణమయిన నగరం అగ్గిదగిలొన్న భవనంలా భాసిస్తున్నది." నగరం అగ్నిపరీతమైన గృహంలా ఉన్నదన్న ఈ ఉపమానంలో కాళిదాసెంత సూక్ష్మంగా నాగరికజీవన భీభత్సం మన కళ్ళకు కడుతున్నాడో ఊహించుకోవచ్చును.

రెండవ శిష్యుడన్న శ్లోకంకూడా ఆశ్రమ జీవితానికి, నాగరక జీవితానికి గల తారతమ్యం స్పష్టంగా ప్రతిఫలింపజేస్తుంది:

"అభ్యక్త మివ స్నాతః
శుచి రశుచి మివ ప్రబుద్ధ ఇవ సుప్తమ్
బద్ధ మివ స్వైరగతి
ర్జన మిహ సుఖసంగిన మవైమి."

"స్నానంచేసినవానికి ఒళ్ళంతా నూనె రాసుకున్న వ్యక్తీ, శుచిఅయిన వానికి అశుచిఅయిన మనిషీ, మేలుకొన్నవానికి నిద్రపోయేవాడు, స్వేచ్ఛావిహారికి ఖైదీ కనబడినట్టుగా నాకీ సుఖసక్తులయిన జనం కనబడుతున్నారని దీని భావము. ఇక్కడ కవి ఆశ్రమవాసులయి నిర్లిప్తులయిన జనానికీ, నాగరికులయి సుఖలిప్తులయిన జనానికీ తారతమ్యం చూపించడానికి నాలుగు ఉపమానాలు ఉపయోగించాడు. ఈ నాలుగు ఉపమానాలు వాడడంలో చాలా అంతరార్థం ఉన్నది. ఇవి సుఖనిర్లిప్తుల శారీరిక మానసికపరిస్థితులు చాలా సూక్ష్మంగా ప్రదర్శించే ఉపమానాలు. ఈ రెండు శ్లోకాలేకాక మొత్తం అభిజ్ఞానశాకుంతలం అంతా నాగరక జీవనంపై ఒక వ్యంగ్యావహేళనంగా తీసుకోవచ్చును.

ఇంతకుపూర్వం కాళిదాసవ్యాసాలలో కాళిదాసకవితలో కనబడే అనాసక్తి జీవితం ఎదుర్కొన లేని ఒట్టి బైరాగి ధోరణికాదనీ ఇతని జీవిత భోగా

సక్తిలోనే అంత లీనమైన నిర్లిప్తతకూడా ఉన్నదనీ సూచించాను. ఈ దృష్టితో చూచినప్పుడే కాళిదాస జీవన సౌందర్యభుక్తిలోగల పరిపూర్ణత బాగా అవగాహన అవుతుంది. అయితే కాళిదాసకవితలో ఒక వైచిత్రి కనిపిస్తుంది. ఈ కవి తన కాలంలో గల విశృంఖల భోగానుభూతిలో గల దోషాలు వ్యంగ్యంగా ధ్వనించి ఉంటాడని అనుకున్నాము. అయినా కేవలం వైరాగ్యసర్గం ఉపదేశించక తన కవితలో సర్వత్ర జీవిత భోగసౌందర్యం ప్రతిఫలిస్తూం టాడు. ఈవిశిష్టమైన రక్తివిరక్తుల సమదృష్టి సమన్వయం కాళిదాసకవిత కొక అతి సౌందర్యం ఆపాదించింది.

కాళిదాస కవితలో ప్రేమభావ పరిశీలన, దానికి సంబంధించిన 'సమస్యలు' కూడా ధ్వనిస్తున్నాయని అనుకున్నాము. నేటికాలంలో ఈ ప్రేమపదానికి చాలా చిత్రవిచిత్రమైన అర్థవిభేదాలు ఏర్పడుతున్నాయి. కేవల శారీరక కామన మొదలు కొని శారీరక మానసికమిశ్రమైన అనేక విధాలైన మానసిక ప్రవృత్తు లన్నిటికీ ఒకటే మంత్రంగా మన రచయితలీ పదం వాడు తున్నారు. కాళిదాస కవితలో ఈ సమస్యాపరిశీలనం చాలా సూక్ష్మంగా నడిచింది. ఇతని కావ్యాలన్నిటిలోను ఈ ప్రేమ భావ పరిశీలన ఒక విశిష్టమైన క్రమికపరిణతి పొందినట్లు కనబడుతుంది. ఆయా కావ్యాలలోను నాటకాలలో ఈపరిణామం ఎలాగ పెరిగిందో చూదాము.

ఋతుసంహారం ప్రధానంగా ప్రకృతివర్ణన పరమైన కావ్యం. కాళిదాసీ కావ్యం తన ప్రేయసిని సంబోధిస్తూ రచించాడు. ఇందులో ప్రకృతివర్ణనకు వచ్చిన ప్రాధాన్యం ప్రేమభావానికి రానేలేదు. దీనిలో కవి ప్రేమ అంకురాకారంలో ఉన్నది గాని అంతకంటె పరిణతి పొంద లేదు.

ఈ విషయంలో దీని తరవాత పరిగణింపదగిన కావ్యం మేఘదూతము. ఈ కావ్యరచనా కాలానికి కవి కేవలం వ్యక్తిగత భావాభివ్యక్తి విడిచిపెట్టి యక్షుని తెరమరుగులో స్వీయభావప్రకటన చేస్తున్నాడని పూర్వవ్యాసంలో వ్రాశాను. కాని కవి ఇక్కడ యక్షు ప్రేమ సామాన్యమానవ సాధారణమైన ప్రేమగానే వ్యక్తీకరించాడు గాని దీనితో ఆధ్యాత్మిక సమస్యలు గాని ధార్మిక సమస్యలు గాని జతపరచలేదు. మేఘ సందేశంలో మానవసహజమైన సరళ ప్రేమ భావం చక్కగా అభివ్యక్తమై సంపూర్ణ పరిణతి పొందింది.

మేఘసందేశంలోని కాళిదాస కవితను గురించి ఇక్కడ ఒక విషయం చెప్పవలసి ఉంది. కాళిదాస కవితా స్వరూపం ఎక్కువగా నేటికాలంలో (*Lyric*) 'భావకవిత'కు సమానమైనదని కొందరు విమర్శకులు అంటారు. కాని కాళిదాస మేఘదూత ప్రేమ కవితకు ఇది సరిగా అన్వయించదు. పాశ్చాత్య విమర్శన సాహిత్యంలోని (*Classic*) సంప్రదాయ కవిత (*Lyric*) భావకవిత మొదలైన విభాగాలు మన ప్రాచీన సాహిత్యానికి అన్వయించవు. నేటి కాలపు మన భావకవితపై ఆంగ్ల భావకవితా (*Lyrical Poetry*) ఛాయలు బాగా పడ్డాయి. ఆంగ్ల భావకవితలో ఆదర్శమయ ప్రేయసీగవేషణ అత్యధికంగా కనిపిస్తుంది. అనేకమైన సాంప్రదాయిక కారణాలవల్ల ఆంగ్ల సాహిత్యంలో ఈ విశిష్టమైన దృక్పథం ఏర్పడింది క్రైస్తవమత సంస్కృతిప్రభావంవల్ల ఆ రోజుల్లోని పాశ్చాత్య సాహిత్యంలో శారీరిక సంపర్కంమీద ఒక విశిష్టమైన ఏహ్యాభావం ఏర్పడింది. కేథలిక్ మతప్రాబల్యం ఉన్న దేశాల్లో ఈ ఏహ్యాభావం మరింత ఎక్కువగా విజృంభించినట్టు కనిపిస్తుంది. అసలు క్రైస్తవమత సంస్కృతిలోనే శారీరిక భోగాలపై ఒక విశిష్టమైన ఏహ్యాభావం ఏర్పడింది. జీసస్ సిలువ చిహ్నం ఎక్కువగా ఈ అభిప్రాయ స్ఫోరకమైన చిహ్నంగా ఏర్పడి ఉండవచ్చును. క్రమేపీ ఇటీవల వచ్చిన పాశ్చాత్య వాఙ్మయ రచయితలు కొందరు ఈ భావంమీద ఒక పెద్ద విప్లవం లేవదీసి తమ రచనల్లో శారీరిక భోగానికి, కామ ప్రవృత్తికీ అగ్రతాంబూలం ఇచ్చారు. డి. హెచ్. లారెన్స్ (*D. H. Lawrence*) ఈ వర్గానికి చెందిన ప్రముఖ రచయిత. అయితే ఇది బాగా ఇటీవల కాలంలో వచ్చిన తిరుగుబాటు. ఆంగ్ల భావకవితాయుగం ఉచ్చస్థితిలో ఉన్న రోజుల్లో ఈభావనాజగతీవిహారం బాగా విశృంఖలంగా సాగింది. ఆ కవితా ఛాయల్లో పడిన నేటి మన తెలుగు భావకవితలో కూడా ఆ ఆదర్శ ప్రియాన్వేషణ జరిగింది.

అయితే భారతీయ సంస్కృతిలో—తత్రాపి కాళిదాసకాలీన భారతీయ సంస్కృతిలో ఇట్లాంటి దృక్పథం ఎన్నడూ ఏర్పడలేదు. నిజానికి భార

తీయ సంస్కృతిలో చక్కని ఐహికాముష్మిక సమన్వయం కనిపిస్తుంది. మనవారీ ఐహికాముష్మికాలెప్పుడూ పరస్పర విరుద్ధాలని భావించలేదు. వారు పరస్పరసమన్వితమైన మానవజీవితంలో ఈ రెండింటికీ సముచితమైన సమాన స్థానగౌరవాలు ఇచ్చారు. అయితే భారతీయ చరిత్రలో ఒక్కొక్కప్పుడీ సమన్వయం మరచిపోవడము, దానివల్ల జాతికి అనేకాఘాతాలు తగలడం జరిగితే జరిగిఉండవచ్చును. అది వేరే విషయం.

మేఘసందేశంలో అంతటా మానవసహజమైన ప్రేమభావం సర్వాంగసుందరమై సహజపంథాలో నడిచింది.

కాళిదాస కవితలో వచ్చిన ప్రేమభావ పరిణతి దృష్ట్యా చూస్తే ఈ తరవాత విక్రమోర్వశీయ, మాళవికాగ్నిమిత్రాలు తీసుకోవాలి. రచనను బట్టి పరిశీలిస్తే రూపకాలన్నిటిలోను విక్రమోర్వశీయం అన్నింటికన్నా ముందు రచించిన రూపకంలా కనబడుతుంది. దీనిలో కాళిదాస కవిత యువకోద్రేకంతో ఉరకలు వేస్తూంటుంది. ఈ నాటకంలో నాయకుడు ఊర్వశిని వలచి ఆమె వియోగంలో లతలు, నదులు మొదలైనవన్నీ ఊర్వశీరూప పరిణామాలని భావిస్తూ ఉన్మత్తుడై పోతాడు. విక్రమోర్వశీయ మాళవికాగ్నిమిత్రాలు రెండింటిలోను ప్రేమ, మానవలోక పరిధుల్లోనే సంచరిస్తుంది. విక్రమోర్వశీయంలో యువకావేశంలో వెల్లివిరిసిన అనురక్తి మాళవికాగ్నిమిత్రంలో బాగా స్తిమితపడిపోయింది. ఈ నాటక కథావస్తువంతా కేవలం ఒక అంతఃపుర ప్రేమగాథ మాత్రమే. దీని రచనాకాలంలో మన కవి చీకు, చింతా లేకుండా కేవలం జీవన భోగపరాయణుడై హాయిగా కాలక్షేపం చేస్తున్నట్టు కనిపిస్తాడు.

ఈ తరవాతి క్రమంలో పరిగణింపదగినవి రఘువంశాభిజ్ఞాన శాకుంతలాలు. రఘువంశ రచనాకాలానికి మహాకవి జీవనదృక్పథంలో చాలా తీవ్రమైన పరివర్తన జరిగినట్టు కనబడుతుంది. రఘువంశ మహాకావ్యం ఉదాత్తమైన ధార్మికదృక్పథంతో రచించిన కావ్యమని వెనకటి కాళిదాస విమర్శన వ్యాసాలలో వ్రాశాను. రఘువంశ రాజులలో చివరివాడైన అగ్నివర్ణునిలోధర్మవిరుద్ధమైన యథేచ్ఛాభోగప్రవృత్తి వల్ల, తద్వారా అలవడిన రాజధర్మ పరిత్యాగంవల్ల కలిగిన ఫలితాలన్నీ కవి పాఠకులకు కళ్ళకు కట్టినట్టు ప్రదర్శించాడు. రఘువంశంలో మొదట వర్ణించిన రాజుల చరిత్రలన్నీ మహా ధర్మశిఖరాల్లాగ అత్యుచ్చ స్థితికి వెళ్ళిపోయాయి. కాని చివర బయలుదేరిన అగ్నివర్ణుడు తన రాజ్యధర్మాలన్నీ మంట గలిపివేసి నిత్యము అంతఃపుర భోగాల్లో మునిగితేలుతూ తన రాజధర్మాలను పూర్తిగా తిలోదకాలిచ్చాడు—చివరికి అత్యంతలాలసవల్ల ఇతని శరీరంలో రాజయక్ష్మ రోగం అంకురించింది. రఘువంశంలో అనూచానంగా వస్తూన్న యౌవరాజ్య పట్టాభిషేకం జరగకుండానే అగ్నివర్ణుడీ రోగంతోనే మరణించాడు. చివరికి ఇతని రాణులలో గర్భవతి అయిన ఒక రాజ్ఞి గర్భానికి జరిగిన పట్టాభిషేకంతో రఘువంశీయుల ఆదర్శ చరిత్ర అంతిమాధ్యాయం ముగిసిపోతుంది.

అయితే ఇక్కడ కవి రాజధర్మ నిర్వహణానికి భోగలోలుపత వల్ల కలిగిన దుష్ఫలితాలు మాత్రమే ధ్వనింపజేశాడు కాని అంతకంటె విస్తృతమైన మానవ జీవితంలో, ధర్మాచరణకు, విశృంఖల భోగాసక్తివల్ల కలిగే దుష్ఫలితాలు ప్రదర్శించలేదు. ఈ విధమైన సూక్ష్మ సూచన ద్వారానే సువిశాల మానవజీవిత భోగ సమస్యా పరిష్కారం కూడా కవి ధ్వనింపచేస్తున్నాడని మనం ఇక్కడ గ్రహింపవలసి ఉన్నది.

అభిజ్ఞాన శాకుంతలంలో కవి ప్రేమపరిణతి ఇంకొక విధంగా ఒక అంతస్తు పైకి వెళ్ళినట్టు కనిపిస్తుంది. మేఘసందేశంలో మిగిలిన కవి స్వీయవ్యక్తిచ్ఛాయలు మాళవికాగ్నిమిత్రంలోకి వచ్చేసరికి చాలా వరకు లోపించిపోయాయి. రఘువంశంలోను తత్రాపి శాకుంతలంలోను కవి మానవజీవనంతో పెనవేసుకున్న అనురాగ సమస్యలన్నీ బాగా తటస్థుడై పరిశీలిస్తున్నాడు.

శాకుంతలంలోని ప్రేమభావం మా నవలోక సరిహద్దులు దాటి దివ్యలోకోన్ముఖమైనది. శకుంతల జనని మేనక. ఈమె గంధర్వ స్త్రీ. విశ్వామిత్రుని తపస్సమాధి లోకభయంకరంగా పరిణమించింది. దీనితో భయభ్రాంతుడైపోయిన దేవేంద్రుడీతని తపోభంగం చెయ్యవలసిందని మేనకను పంపించాడు. మేనకా హావభావాలకు ముగ్ధుడై తపోభ్రష్టుడైన విశ్వామిత్రునికి శకుంతల జనించింది. తరవాత పశ్చాత్తప్తుడైన విశ్వామిత్రుడీ శకుంతలను పక్షుల రక్షణకు వదిలి తన

దారిని తాను వెళ్లిపోయి ముక్కుమూసుకుని బిగించుకుని కూర్చుని మళ్ళీ తపస్సులో పడ్డాడు. తరవాత ఈమె ధర్మనిరతుడై ఆశ్రమధర్మం అవలంబించిన కణ్వుని దగ్గిర పెరిగింది. ఈ విధంగా శకుంతల పూర్వచరిత్ర పరిశీలిస్తే ఈమె జీవనాళాల్లో ధర్మధ్వంసకమైన విప్లవోద్రేక చిహ్నాలున్నాయని అనవచ్చును. కనకనే ఈమె ఆశ్రమనియమాలతిక్రమించి తనంతట తానుగా గాంధర్వవివాహానికి అంగీకరించింది. ఇక దుష్యంతుని విషయం ప్రత్యేకంగా చెప్పనే అక్కరలేదు. ఇతని కింతకు పూర్వమే అంతఃపురంలో కొంతమంది రాణులున్నారు. ఇతగాడు మృగయావినోదసందర్భంలో మునికన్యా వ్యామోహంలో చిక్కుకున్నాడు. ఇతడుకూడా ఆశ్రమమర్యాద లతిక్రమించాడు. 'గౌతమి' వంటి వృద్ధస్త్రీ ఆశ్రమరక్షకురాలుగా ఉన్నా ఆమె ప్రేక్ష్యం లేకుండానే గాంధర్వవిధి ప్రకారం శకుంతలకు కంకణం కట్టాడు.

అభిజ్ఞాన శాకుంతలం పంచమాంకంలో శకుంతలను రాజు తిరస్కరించినప్పుడు గౌతమి రాజుతో అన్న చిన్నశ్లోకంలో కవి ఈ విషయాలన్నీ ధ్వనింప చేస్తున్నాడు:

"నాపేక్షితో గురుజన
స్త్వయానయా న పృష్టా బంధవః
ఏకైక మేవ చరితే
భణామి కి మేకైకస్య?"

"నీ వీమె వివాహవిషయంలో గురుజనుల అభిప్రాయం అపేక్షింపలేదు; ఈమె అయినా తన బంధువులను అడగలేదు. ఈ విషయంలో ఒక్కరుగానే వ్యవహరించిన మీ కిద్దరికీ ప్రత్యేకంగా నే నేమి చెప్పగలను?" అని దీని భావము. ఈ శ్లోకం ప్రస్తుత పరిస్థితి మాత్రమే గాక శకుంతలా దుష్యంతుల స్వైర గాంధర్వవిధి నే తీవ్రంగా అధిక్షేపిస్తున్నట్లు ధ్వనిస్తున్నది.

ఇటుపిమ్మట శకుంతలా దుష్యంతు లిద్దరు గాఢ వేదనాపరితప్తులై పునీతులయినారు. వీరిద్దరు తిరిగి మారీచాశ్రమంలో కలుసుకున్నారు. ఇది భూ స్వర్గలోకాలకు మధ్యేమార్గంలో ఉన్న దివ్యాశ్రమ ప్రదేశము. ఇక్కడ వీరి కలయిక భూ స్వర్గలోకాల మంగళోద్వాహంలా మనకన్నులకు స్ఫురిస్తున్నది. ఇక్కడ శకుంతలా దుష్యంతుల ప్రేమ కళ కళ పెళా కాగి చల్లారిన క్షీరతరంగంలాగ స్వర్ణమయమై ప్రశాంతంగా స్తిమితపడింది. వీరిద్దరికీ కలిగిన సర్వదమన భరతుడు భారత చక్రవర్తిఅయి తన నామధేయం సార్థకపరుచుకున్నాడు.

శాకుంతలం చదివి ముగ్ధుడైన గెటే మహాకవి తన శాకుంతల ప్రశస్తి కవితలో శాకుంతలంలో స్వర్గ మర్త్యలోకాద్వాహం జరిగిందని ప్రశంసించాడు. ఈ ప్రశంసకు ఈ ప్రేమపరిణామమే ప్రధానాభిప్రాయము. అనేక విధాలుగా ప్రపంచ ప్రశంసలందుకొన్న అభిజ్ఞాన శాకుంతల గౌరవానికీ, కాళిదాస కవితా మహత్త్వానికీ ఈ పరిణామప్రదర్శనం ఒక ముఖ్యకారణమని అనాలి.

ఇక కుమారసంభవ కావ్యం తీసుకుందాము. దీనిలో కాళిదాసీయ ప్రేమపరిణతికి పరమావధి కనిపిస్తుంది. దీనిలో నాయికా నాయకు లిద్దరు జగత్సృష్టికారకులయిన పార్వతీ పరమేశ్వరులు. సతీదేవి దక్షాధ్వరధ్వంసానంతరం హిమవంతుని ఇంట పార్వతిగా జన్మించింది. కుమారసంభవంలోని కాళిదాసీయప్రేమ పరిశీలన గాంభీర్యం అనితరసాధారణమైనది. పార్వతీ పరమేశ్వరు లిద్దరు మానవత్వస్పర్శ లేని కేవల దివ్యస్వరూపులు. కాని కావ్యంలో మాత్రం వీరిద్దరు సామాన్య మానవమాత్రులవలె కష్టసుఖాలన్నీ అనుభవిస్తున్నట్లే కనిపిస్తారు. దేవతలు మన్మథుణ్ణి ప్రార్థించి, పరమేశ్వరుని తపోభంగం చెయ్యవలసిందని ప్రార్థించారు. కాని చివరికి దేవతల ప్రయత్నం విఫలమైపోయింది. శివుని మూడవకంటి చిచ్చులోపడి మన్మథుడు భస్మమైపోయాడు. అయినా పార్వతి పట్టువీడక పంచాగ్నిమధ్యంలో నిలబడి ఘోరతపస్సు చేసింది. కామదహనంవల్ల వీరి అనురాగంలో సామాన్యమానవకామప్రవృత్తిభస్మీభూతమై పోయిందని కవియిక్కడ సూచిస్తున్నాడు. కాని చివరికి ఈశ్వరుడు బ్రహ్మచారి వేషంతో పార్వతిభావపరిశీలనం చేసి ఆమె వివాహోన్ముఖుడైనాడు. పార్వతీ పరిణయానంతరం బ్రహ్మాదులు మన్మథుని సేవ స్వీకరించవలసిందని పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తారు. మన్మథుడు మళ్ళీ నవమన్మథుడైనాడు. అయితే ఈశ్వరు డిక్కడ స్వేచ్ఛా కటాక్షంతో మాత్రమే మన్మథునికి

సేవాభాగ్యం కలిగిస్తున్నాడని కవి పాఠకులకు స్ఫురింపజేస్తున్నాడు.

అయితే ఈశ్వరుని స్వేచ్ఛాప్రవృత్తి కూడా కేవలం విశృంఖలమైనది కాదు. ఈ ప్రవృత్తికి మూల హేతువు లోక సంరక్షణమే గాని కేవలం భోగం కాదు. అయినా ఈ భోగవర్ణనకోసం కాళిదాసు కుమారసంభవం కావ్యం చివరిసర్గ అంతా ప్రత్యేకించాడు.

ఈ విధంగా కుమారసంభవంలోని భోగ వైరాగ్యాలు, మానవతత్త్వదివ్యత్వాలు పరస్పర సమ్మేళనంలో తమ ప్రత్యేకత్వాలు విడిచి అర్ధనారీశ్వర మూర్తులై అద్వైతతాదాత్మ్యంలో లీనమైపోయాయి! బహుశః ఈ అభిప్రాయం ప్రధానంగా స్ఫురింపజేయడానికే కాళిదాసు కావ్యం పరమేశ్వరభోగవర్ణనంతోనే ముగించిఉంటాడని తోస్తుంది. అయితే కథ ఇంత అసంపూర్ణంగా ముగించడంవల్ల కావ్యనిర్మాణానికి లోటు వచ్చిందని భావించనవసరం లేదు. పార్వతీ పరమేశ్వరుల వివాహంతోనే తదనంతరం జరిగే కుమారజననము, తారకాసురవధ అవశ్యం జరగబోయే సంఘటనలుగా కవి ధ్వనించిఉండవచ్చును. కాని ఈ ధ్వని మరీ సూక్ష్మమై సద్యఃస్ఫూర్తి కలిగించడం లేదనిమాత్రం అంగీకరించాలి.

కనకనే సుప్రసిద్ధ చరిత్ర విమర్శకులు కొందరీ కావ్యరచన పూర్తికాలేదని విమర్శించడం జరిగింది. కాళిదాస కవితను లోతుగా తరిచిచూచినవారికి చారిత్రిక విమర్శ యుక్తియుక్తంగా కనబడదు.

ఒక సమస్యాదృక్పథంతో పరిశీలించినప్పుడు కాళిదాసకవితలో స్ఫురించే సమస్యలు వాటి విషయంలో కవి ధ్వనింపచేసిన దృక్పథము ఈ వ్యాసంలో దిఙ్మాత్రంగా సూచించాను. కాని ఈ మహాకవి కవితలో ఇది సమస్య, ఇది కథ, ఇది రచనాసౌందర్యము అని ప్రత్యేకంగా వేరుపరిచి పరిశీలించడం చాలా కష్టము. ఇతని కవితలో ఈ విషయాలన్నీ ఒకే ఆకృతిలో నిలిచి అవిభాజ్యమైన అర్ధనారీశ్వరసౌందర్యంతో కన్నులకు మిరుమిట్లు గొలుపుతూంటాయి!



# విపరిణామము



శ్రీ బూదరాజు రాధాకృష్ణ

నాడు ప్రాతస్సమీరగానమ్ము నిత్య
నూతనమ్మగు మంగళగీతి నాకు;
మధు మధూళీ రసప్రాయమగు నుషస్తు
షారబిందువు లమృతభాజనము లపుడు.

తామ్రపల్లవ తరుణ పత్రముల క్రింది
కర్ణికా భద్రపీఠభాగమ్మునుండి
నవ్య వాసంతవనశోభనమ్ము కూర్చు
పూర్ణసౌందర్యవతి యగు పూవునపుడు.

మధుర మధుబిందు సంపర్క మందియుంట
నవ్యలావణ్య భారావనతను నాడు;
ఈడువచ్చినదని పుట్టినింటివారు;
పాఱద్రోలి రటంచు జ్ఞాపకము నాకు!

నాడు హిందోళనమ్ముల పాడుచున్న
కామినుల గానశక్తికి కఱగి, ఏక
ధారగా జాలువాఱె కుందమ్ము; లట్టి
సంఘమరణము పెండ్లికి సదృశ మగుట!...

ప్రత్యుషఃకాల పవమాన భాషణములు
కాలు నాజ్ఞలు తెల్పు బాకాలు మాకు;
జీర్ణమై నేలపైరాలు పర్ణకోటి
యముడు పంచిన శవవాహనములు మాకు.

రక్తబంధము విడని మారందపాన
మత్త షట్పదగణము సంబంధి మాకు;
వెనుక వెనుకల మమ్ముల అనుసరించి
తిరిగిపోయెడు వేఱొక దిక్కు లేదు!

పాలుగారెడు మా దేహభాగ మెల్ల
తెల్లనెత్తురు టేఱుల తెరలె నపుడు:
కాయమును త్రుంపగల్గెదు గాని, సతుల
కలిమి కాలేదు మా పరిమళము చంప!

రాలిపోవుచు రత్నగర్భకు శిరోఽభి
షేక మొనరించు మమ్ము గ్రసించి శయ్య
లందు పీడింతురే-మా పరార్థబుద్ధి
సైపరాదయ్యెనా నరజాతి కెల్ల?

కంటకమ్ములు పాదము లంటి నవ్య
నాగరికుల నెత్తురు లాగు ననుచు,
స్వీయదేహాల నే తివాచీలు చేసి
కొలుచు మాజాతినే నరుల్ కూల్తురేమి?

తనకు రత్నాల తొడుగులు తార్చుజాతి
నాశమగ్గు వేళ కిఁకిల నవ్వు నేమి
పరభృతరుతాలలో నని--ప్రకృతి యేని
కరుణసూపదు దీనసంఘములమీద!

# భారతనారి



శ్రీమతి వట్టికొండ విశాలాక్షి

ఇప్పుడు ఇంతకాలానికి భార్య చనిపోవటం, తల్లి మంచానపడటం, మళ్ళీ పెళ్ళిచేసుకుందామన్నా కానిపరిస్థితులు రావటం వీటన్నిటి మూలానా నన్ను రమ్మని చెప్పంపుతున్నారేకాని ఇంతకు ముందెప్పుడైనా రమ్మన్నారా? ఎక్కడ గతిలేనప్పుడు నేను కావలసివచ్చా నన్నమాట. నేనుమాత్రం మనిషిని కాదు? నాకుమాత్రం మానాభిమానాలు లేవా? నాకైనా జ్ఞాపకశక్తి అనేది పూర్తిగా నశించలేదే! వారు చేసినవన్నీ ఎలా మరచిపోగలను? కష్టాలవల్ల మనస్సెంత పాడైపోయినా బాధలుమాత్రం తప్పకుండా జ్ఞాపకం ఉంటవి. ఒకసారి నెళ్ళగొట్టిన తరువాత మళ్ళీ ఆ భర్తతో కలసి ఉండటం మాటలా? ఒకవేళ మనం తలవంచుకున్నా లోకం తలవంచగలమా? ఇప్పుడు కూడా లోకానికి హేళనగానే ఉన్నప్పటికీ కనీసం కష్టపడుతున్నాననే సంతృప్తిఅయినా ఉంటుంది. మళ్ళీ మేము కలిసిఉంటే ఎంత అసూయతో ఎంత వేధించాలని చూస్తుందీ లోకం? లోకంమాట అలా ఉంచి ఎవరైనా ఒకరకమైన జీవితానికి అలవాటుపడిన తరువాత మళ్ళీ ఇంకొక రకమైన జీవితాన్ని గడపాలంటే ఎంత కష్టమో ఆలోచించండి. దుస్తులు మార్చుకున్నంత తేలికగా పూటకొకరకమైన జీవితానికి అలవాటుపడలేము. ఏదోవిధంగా గతాన్ని విస్మరించి అక్కడకు వెళ్తానే అనుకోండి. అప్పుడు మాత్రం వారు నన్ను అక్కడే ఉంచుకుని సుఖపెడతారని ఏమిటి నమ్మకం? అంటే! అవసరమయితే తిరిగిరావటానికి కూడా సిద్ధపడే పోవాలన్నమాట. తెలిసీ కూడా నే నీపని చేయలేనబ్బ. పోనీ మరల ఆ దాస్యకూపంలోపోయి పడేకంటే అంత తిండిలేకపోతే పదిమంది చిన్నపిల్లలకు చదువు చెప్పకోనైనా బ్రతుకుదాం లెమ్మనిపిస్తుంది, ఒకొకసారి. కాని ఇదివరకు బ్రతికిన బ్రతుక్కు చిన్నపిల్లలకు చదువుచెప్పుకోని బ్రతకటమా? అది మాత్రం తోటి నలుగురిలో తేలికకాదు? పాతబాధలను భరించలేను. కొత్తబాధల కంతకంటే అలవాటు పడలేను. అయినా మరల అక్కడకు వెళ్ళి ఆ బాధలనుభవించేకంటే ఈ బాధలకే ఒప్పుకొని ఇక్కడే ఉండటానికి నిశ్చయించుకుందామంటే ముందు మా అన్నయ్య ఊరుకుంటాడా? తను నన్ను బాగా పోషించినా లేకపోయినా తన భార్యకు పిల్లలకు చాకిరీచేస్తూ మెదలకుండా ఇంట్లో పడుండమంటాడు. లేకపోతే మాట్లాడకుండా అక్కడికే వెళ్ళమంటాడు. అంతేగాని నేను వేరేవుండి నా అంతట నేను స్వతంత్రజీవనం గడుపుకోవటానికి ఆయన అంగీకరించలేడు. అదంతా ఆయనకు తలవంపులుగా వుంటుంది.

ఏమిటోనబ్బ! మన భారతనారీమణులను గురించి మనదేశ నాయకులంతా పెద్దపెద్ద ఉపన్యాసా లిస్తుంటారుగాని అదంతా ఎంతవరకు నిజమంటారు? 'మా భారత నారీమణులు ప్రపంచనారీలోకాన్ని తలదన్నగల సౌశీల్యాన్ని పొందిఉన్నారని పూర్వంనుంచీ కూడా అలాంటి సాంప్రదాయాన్నే పాటిస్తూవచ్చారనీ........' అంటారు. అదొక్కటేనా? మా భారతదేశపుస్త్రీలు విదేశాంగ రాయబారులుగా ఉన్నారనీ, మంత్రు లయారనీ, ఇంకా ఏమేమో చెస్తారు. కాని ఈ చెప్పేదంతా మన భారతదేశపు స్త్రీలకు ఎంతిమందికి వర్తిస్తుందనేదే కొంత హృదయంలో బాధిస్తుంటుంది. పైన మన దేశనాయకులు చెపుతున్నదంతా వర్తించే స్త్రీలు మనదేశంలో వేళ్ళమీద లెక్కపెట్టతగినంతమందికన్నా ఎక్కువ ఉండరు. ఏ ఒక రిద్దరినిబట్టో దేశం మొత్తం ఆ విధంగా ఉన్నదనుకోవటం ఎంత అన్యాయం? సామాన్యస్త్రీ సమాజమంతా ఏవిధంగా ఉన్నదో ఎవరివరకు వారు తమ జీవితాన్ని పర్యాలోకించుకుంటే చాలదూ?

ఎక్కడిదాకానో ఎందుకు? నావరకు నన్ను చూడండి. నేను పుట్టటమే అంతమంది ఆడపిల్లల మధ్య పుడితిని. పైగా మా నాన్నగారిది అంత స్థితి గల సంసారంకూడా కాదు. నేను పుట్టి భూమిమీద పడినప్పటినుండీ ఇంతే ననుకోండి నా కష్టాలు. అలాంటి పరిస్థితుల్లో నన్ను బాగా చదివించి విజ్ఞానవంతురాలను చేయాలనిగాని, మంచి సంబంధం తెచ్చి వివాహం చేద్దామనిగాని అనుకోటానికి అవకాశం లేదుగదా? నిజంగా నేను చిన్నప్పుడు ఎంత చురుగ్గా ఎంత ఉత్సాహంగా ఉండేదాన్ననీ. మా అన్నయ్య ఉండేవాడా ఆయన్ను నాకంటే రెండు సంవత్సరాలుముందు బడిలోకి పంపెంచినా ఆయన కంటే తరువాత పోయినదాన్ని నేనే చదువులో ఎంతో ముందుకు పోతుండేదాన్ని. అయినప్పటికీ మగపిల్లవాడు ఒక్కడేకదా ఆయన్నే కొస్త అభివృద్ధిలోకి తీసుకువస్తే బాగుంటుందని వచ్చినా రాక పోయినా అవి అమ్మి ఇవి అమ్మి ఆయన చదువు కోసమైనా ఖర్చుపెట్టారుగాని నాకుమాత్రం చదువు చెప్పించలేదు. పెద్దదాన్నయిన తరువాత లోకంలో నలుగురితోపాటు ఎలాగు మంచి సంబంధం రావటం కష్టమని తలిదండ్రులేమీ చూచుకోకుండా మాకంటే కొస్త ఆస్తివిషయంలో పరవాలేదు లెమ్మని ఇచ్చి వేశారీ సంబంధానికి. మాకంటే తాము పెద్ద భాగ్యవంతులమనీ, తమకు తగినట్లుగా మేము చూడలేక పోతున్నామనీ పెళ్లయిన మరుసటిరోజునుంచి మా అత్తగారు ఎప్పుడు సాధిస్తూనే ఉండేది. కొడుకు కూడా ఆ అమ్మమాటలకు తల ఊపటమే కాని మా పరిస్థితులు సరీగా అర్థం చేసుకోగలిగేవారు కారు. అక్కడికీ మావాళ్లు వాళ్ళకున్నంతలో మా అక్కచెల్లెండ్రెందరినీ సమానంగానే చూస్తూఉంటూ రీ రోజువరకు. నిజం చెప్పవలసివస్తే వీళ్ళ ఒత్తిడికి తట్టుకోలేక నాకే కొంచెం ఎక్కువగా పెట్టుచెపుతూ ఉంటారు. అయినా వారికి సంతృప్తిలేదు. ఆ పని చేతగాదని ఈపని చేతగాదని నన్నూ, దానిమీదగా అది పెట్టలేదని ఇది పెట్టలేదని మా వాళ్ళనూ ప్రొద్దస్తమానము తిట్టిపోస్తుండటమే పని నిజంగా అదేమిటో గాని నన్ను నిలువునా నిలబెట్టి పెయ్యి తిట్టినా ఏదో ఒకవిధంగా సరిపెట్టుకుపోయేదాన్ని కాని మావాళ్లను మాత్రం ఒక్కమాటన్నా, తరవాత నాకెంత కష్టమైనా రానీ, ఆ క్షణానమాత్రం సహించగలిగేదాన్ని కాదు. దాని మీదట తగాదా ఇంకా పెద్దదవుతుండేది.

నాకు సాధారణంగా ఇక్కడ జరిగే తగాదాలు పుట్టినింట్లో చెప్పే అలవాటుండేది కాదు. కాని కొత్తగా కాపురానికివెళ్ళి పుట్టింటికివచ్చిన రోజుల్లో మావాళ్లు నన్ను మరీ గుచ్చిగుచ్చి అడుగుతూఉంటే ఎప్పుడోఒకసారి మాటల సందర్భంలో కొంచమైనా చెప్పక తప్పేదికాదు. అప్పుడు మా అమ్మ అనేది 'మమ్మల్ని అంటే నీకెందుకు రోషం? నీవు మాట్లాడకుండా ఊరుకో. మా ఎదుటమాత్రం అనరుగదా? ఒకవేళ అంటే మేమే చెపుతాం జవాబు. నీ ఎదుట ఏదన్నా అన్నా గానీ నీకు పట్టనట్లుగా ఊరుకో, అంతగా అయితే, నా ఎదుట అంటే ఏం ప్రయోజనం మా వాళ్ల ఎదటనే అనరాదా? అను. నీకు రోషం అని తెలిస్తే వాళ్లు ఇంకా ఎక్కువ చేస్తారు. నీకు పట్టనట్లుగా ఊరుకుంటే అనీ అనీ వాళ్లే ఊరుకుంటారు.' మా అమ్మ నాకీ విధంగా చెప్పటం నాకెంతో బాధగా ఉండేది. నేను తమకోసం అని నాకు ఎక్కువవుతున్న కష్టాలను కూడా సహిస్తూ తమమీద మాటపడకుండా కాపాడుతుంటే చివరకు ఇదేమిటూ ఇలా అయిందనిపించేది. ఆమె అలా చెప్పటంలో అభిప్రాయం మంచిదే కావచ్చు. తమ మూలాన నేనేవిధమైన కష్టాలు పడకుండా ఉండటానికే కావచ్చు. కాని నేను సహించేదెట్లా? నేను మా తల్లిదండ్రుల మెప్పు పొందటంకోసమని ఆవిధంగా రోషానికి పోతే అనుకోవచ్చు, అలాకాదుగదా? నిజంగా ఎంతో బాధపడే ఆ విధంగా వాళ్లను ఎదుర్కొనటం, మనం అత్తగారింటికి పోయి అక్కడ మన జీవితాన్ని వాళ్లమీద ఆధారపడి గడుపుతూ ఉంటాం కాబట్టి సమంజసమైనా కాకపోయినా మనల్ని ఒక మాట అనే అధికారం వారికి గాని పడవలసిన బాధ్యత మనకుగాని ఉంటుంది. ఏదో వాళ్ళకున్నంతలో కలో గంజో తాగి వాళ్లంతట వాళ్లు బ్రతుకుతున్నప్పుడు అనవసరంగా మాటిమాటికీ వాళ్లను తూలనాడుతూ ఉంటే ఏస్త్రీఅయితే మాత్రం ఎలా సహిస్తుంది? ఎంత ఈరోజు ఒకళ్ల చేతుల్లో పెట్టినా మనలను పుట్టినప్పటినుండీ పెంచి పెద్దవాళ్లను చేసింది తల్లిదండ్రులేకదా. మన ఉనికి ప్రారంభంనుంచీ కూడా వాళ్లను చూచి సంతోషిం...

చటం కానీ, వాళ్లవల్ల సుఖపడటం కాని, ఒకటేమిటి జీవితానికి కావలసిన సమస్తము వాళ్లవల్లనే కదా సమకూరింది. మనకు ఇంకొక రకమైన మనుష్యులతో పరిచయం కలగగానే ఇంకొక ఇంట్లో అడుగుపెట్టగానే పూర్వ సంస్కృతులన్నీ ఒక్కసారిగా మరచిపోవాలంటే సాధ్యమా? 'నీకెందుకు నీకు పట్టనట్లుగా ఊరుకో' అని మా అమ్మ చెపుతుంటే కాని నా క్షేమం కోరి అదెలా చెయ్యగలం? ఆమె నాకు చెపుతుంటే కాని మేమంతా ఇంత మందిమి పెరిగి పెద్ద వాళ్లమైనా ఈ రోజుక్కీ కూడా మా నాన్న ఏదైనా తమాషాకు మా అమ్మ—పుట్టినింటివారి నేదైనా అంటే ఆమెకే ఎంతో కోపం వస్తుంది. నిన్న గాక మొన్న కాపురానికి వెళ్లిన నాసంగతి చెప్పే దేమున్నదింకా?

మా వూరికీ వారి వూరికీ చాలా దూరం కావటానో ఏమో వారి పనులు, ఆచార వ్యవహారాలు, అభిప్రాయాలు అన్నీ మార్పుగానే వుండేవి. మేము సాధారణంగా అంట్లు తోమినా, అన్నాలువడ్డించినా కూర్చోనే చేస్తాం. మా అత్తగారు అలాకాదు. ఆమె అలాంటిపనులన్నీ వంగోని చేస్తూ వుంటుంది. నన్ను ప్రతిసారీ హెచ్చరిస్తూనే ఉండేది. 'ముసలమ్మవా ఏం కూర్చోనిచేయటానికి'? అని ఒకొకసారి చాలా గట్టిగా కోపంగా కూడా చెప్పేది. కాని నా కెందుకో అలా వంగోని అంట్లు తోమబోయినా అన్నాలు వడ్డించబోయినా వీలుగా ఉండేది కాదు. చూడటానికి కూడా అదోక తరహాగావుండేది. నేను మార్పులేకపోయేదాన్ని, తనకు పని కావటం ప్రధానం గాని ఇవన్నీ ఎందుకా అని చాలా విసుగ్గావుండి 'మా వూళ్లో అందరం ఇలాగే చేస్తాం' అని చెప్పేదాన్ని ఒకొకసారి. 'మీ ఇంట్లో ఏ అలవాటైతే ఆ అలవాటేనా ఏం, మార్పులో నక్కర్లేదా?' అని కొడుకుకూడా నన్నే కసిరేవారు. దాదాపు ఇంట్లో ప్రతి చిన్న విషయం వారికి పట్టనిదంటూ వుండేదికాదు. ప్రతిదీ పట్టించుకోవలసిందే. తీర్పేమో తల్లివైపు. అక్కడ నా అన్నవాళ్లు ఎవరు లేకపోవటాన నా విషయం ఎవ్వరికీ తెలిసేది కాదు. పిల్లలైనంతవరకు ఇంట్లో తగాదాలు బయటకు పొక్కనిచ్చేవాళ్లం కాదు. ఆ విషయంలో మాత్రం అందరం ఒకటిగానే నడుచుకునేవాళ్లం. మేము పైకి అంతగా పోట్లాడుకోకుండా వుండటం ఇరుగుపొరుగువాళ్లకు ఏమంత బాగా వుండేదికాదు. మా తగాదాలను రెచ్చగొట్టటానికి వాళ్ల సర్వ శక్తులను ధారపోస్తుండేవాళ్లు. నన్ను ఒకటి రెండుసార్లు కదలించి చూచారు కాని లాభంలేకపోయింది. మా అత్తగారి దగ్గిర మాత్రం కొన్ని కొన్ని పనిచేస్తూ వుండేవి. అదంతా గ్రహించి ఎక్కువగా నేనే సరిపెట్టుకు పోతుండేదాన్ని.

ఒక పండుగకు ఇళ్ళలుక్కుంటున్నాము. పొరుగింటామె ముగ్గు గొట్టంకోసమని వచ్చి 'కోడలు వచ్చినా ఇంకా మా వదినకు అలకటం తప్పలేదే' అన్నది.

'ఆఁ తప్పద్ది, ఆడకు పోయిన్నాడే తప్పేది' అన్నది మా అత్తగారు. పోనీ నేను వూరికే కూర్చుంటే ఆ పొరుగింటామె అలా అమాట అన్నా, ఈమె విసుక్కున్నా కొంత అర్థం ఉన్నది. నేను అడ్డాలు సర్దను, ముగ్గు వెయ్యను, కందిమువెల మంట పెడుతూ ఒకదాన్నే వంట చెయ్యటం, ఈలోగా ఎవరైనా వస్తే అన్నాలు వడ్డించటం ఆమెకంటే నాలుగువంతులు నాకూ పని ఎక్కువగానే ఉన్నది. అంతకంటే ఇంకా నేను మాత్రం ఏమి చేయగలను. నేనూ మనిషినే కదా. ఎంత పనిచేస్తున్నా మాకోడలికి అన్నం వండటం కూడా చేతగాదు. అని ప్రచారం చేస్తుండేది మా అత్తగారు. ఎప్పుడైనా అలా కొంచెం బయటకు పోతే సరి 'అన్నం కూడా వండవటకదా? ఏం జేస్తావు?' అని అడిగేవాళ్లు నన్ను ముఖానపట్టుకుని. కోపంవచ్చి ఆమె నన్ను ఏపనీ చెయ్యనివ్వదు. ఆమే చేసుకుంటుంది అని చెప్పేదాన్ని, మొదట. తరువాత నిజమే చెప్పేదాన్ని లెండి. తిన్నదానికి సరిపోను పిల్లలైనంతవరకు బండచాకిరిచేయించుకుందామనే దృష్టి తప్ప ఈ మనిషి ఎంతవరకు చేయగలుగుతుందా, ఏయే పనులు చేయగలుగుతుందా, అనే ఆలోచనే వుండేది కాదామెకు. మాపుట్టినింటివాళ్లు ఎక్కువ భాగ్యవంతులు కాకపోయినా బస్తీకి పక్క వూరు కావటానో ఏమో వళ్లు దంచుకునే అలవాటే లేదు. మాకు మాకే కాదు మా వూళ్లో మాకంటే తక్కువ పరిస్థితుల్లో వున్నవాళ్ళకుకూడా ఆ అలవాటే లేదు. అందువల్ల నాకు రోకలి ఎలా పట్టుకోవాలో కూడా

తెలిసేదికాదు. ఎప్పుడైనా పండుగలకు పిండి కావలసివస్తే మరవ వేయించుకొస్తుంటేవాళ్లు మావాళ్లు. ఎప్పుడైనా ఒకొకసారిమాత్రం ఇంటి దగ్గరనే పిండికొడుతుంటే వాళ్లు. పూర్వం పోటు వేసిన అలవాటువల్ల మా అమ్మ, అక్కయ్యలు కొట్టేవాళ్లు. సరదాకు నేను కూడా పోయి రోకలి తీసుకుంటే నాలుగుపోట్లు వేయగానే ఎంతో సాలి వచ్చేది. వెంటనే నీకు చేతగాదులే ఎవరిచేతిమీద నన్నా వేసేవు రోకలిఅంటూ, నా చేతులో రోకలి తీసుకునేవాళ్లు. అలాంటిదాన్ని అత్తవారింటికి వెళ్లగానే వడ్లుదంచమంటే ఏమి దంచగలుగుతాను ?

నేను అత్తవారింటికి వెళ్లిన రెండవసారే యిరవైరోజులకు పదిపద్దెనిమిది మానికలు వడ్లు గుంటలోపోసి రోకలి తీసుకోమన్నది నన్ను, మా అత్తగారు తనొక రోకలితీసుకుని దంచుతూ. నా గుండెల్లో గుభేలు మన్నది. నేను వడ్లు దంచాలి. నిర్ఘాంతపోయి స్తంభాని కానుకుని అలాగే నిలబడ్డాను. అట్టానుంచుంటావేమే? నీకు కాదూ చెప్పేది రోకలి తీసుకోమని ? అన్నదామె. ఇక నీ విషయంలో నోరుమూసుకొనివుంటే లాభంలేదనిపించింది. అలాగే ధైర్యం తెచ్చుకుని గోళ్లు గిల్లుకుంటూ ఆమె ముఖంవైపు చూడటానికి కూడా భయమేసి తలవంచుకునే నాకు చేతగాదు అన్నాను. 'అదే చేతనొద్దులే. తీసుకో. తీసుకో.' అన్నదామె మళ్ళీ. ఆచేతులోకీ ఈ చేతిలోకీ రోకలి గబగబా మార్చుకుంటూ, కాలితో వడ్లు గుంటలోకి ఎగదోసుకుంటూ. అంతటితో నాలో అదివరకుఉన్న ఓపిక కూడా పోయినట్లయింది. రోకలి తీసుకోబోతే చేతులకు నరాలుగాని ఎముకలుగాని వున్నట్లు తోచలేదు. తప్పేదిలేదని ఉన్నవాటిల్లోకి చిన్నరోకలి ఏరి తీసుకున్నాను. ఒక వరసకూడా పూర్తిగా వెయ్యకముందే విపరీతంగా సాలివచ్చి రోకలి దింపాను. కొంచెం ఆగి కొంచెంసేపు, మళ్ళీ కొంచెం ఆగి కొంచెంసేపు వేస్తూవుంటే మొదటి సారి వేసినంతసేపు కూడా ఒక్క బిగువున వెయ్యలేకపోతున్నాను. నోరు ఎండిపోయి మంచినీళ్లు త్రాగటం జాస్తిఅయినకొద్దీ అసలు రోకలే నా స్వాధీనంలో లేకుండాపోయింది. ఇక ఏమైనాసరే లెమ్మని చేతిలో రోకలి గోడకు ఆనించిపెట్టి అరుగు కానుకుని కూర్చున్నాను.

'ఇట్లా కూర్చుంటే ఇక నాడే నలిగినట్టే ఒడ్లు' అన్నదామె.

'అయితే ఏంజేయమంటారు ? నా కసలే అలవాటులేదు' అన్నాను. అరిచేతులు ఊదుకుంటూ.

'ఇన్నాళ్లనుంచీ జీతగాడూ నేనూ దంచిపోసిన బియ్యంవుంటే తిని కూర్చుంటిరి మరి. ఎల్లకాలం అట్టెట్టా అమురుద్ది కూర్చోని తినటానికి. అలవాటు లేకుంటే అలవాటుచేసుకోవాల. మా అందరికిమాత్రం పుట్టంగానే అలవాటైందా ? ఇట్టాగే ఎయ్యంగా ఎయ్యంగా అలవాటైంది. నీకూ అంతే—' అని ఆమె అంటూండగానే జీతగాడు వచ్చాడు. ఇయ్యాళ చిన్నదొరసానిగారి చేత ఒడ్లు దంపిత్తన్నట్టుందాకే— అన్నాడు వాడు నా వాలకం చూచి.

'ఆఁ దంపిచ్చం ఆమెనీ నిన్నూ కూర్చోబెట్టి పెడ్తాం. మిమ్మల్నందర్నీ కూర్చోబెట్టి మేము తెచ్చిపెట్టలేమయ్యా, ముందు నువ్వుకూడా రోకలి తీసుకో గబగబ ఒక వరసవేసి తరవాత కూడు తిందువుగాని—' అంటూ ఆమెకూడా రోకలి గోడకు ఆనించి పెట్టి వడ్లగుంట చుట్టూ ఊడుస్తూ లేవమ్మా లే లే అన్నది. నేనుకూడా ఒకసారి చేతులు చూచుకుని రోకలి తీసుకున్నాను.

'అబ్బ' దొరసానిగారి చేతులు ఎఱ్ఱగా ఎట్టా కందిపొయ్యినయ్యో చూడు పెద్ద దొరసానీ. పాపం బొబ్బలుకూడా పొక్కినియ్యి. అమ్మో అయ్యిగనక చితికితేనా ? ఇకా బాద బగవంతుడికి దెలియాల్సిందే. అయ్యి చితికితే ఇక రోకలి పట్టుకోటానికే యీలు గాదుగా ?—అన్నాడు వాడు. నేను అలాగే పోటు వేస్తూనే ఉన్నాను.

'ఊఁ యీలుగాదు కొట్టుద్ది మా కందరికీ పొక్క లేదంటావా? ఆరోగ్యం జాస్తయ్యేం ? రెండు మూడు రోజుల్లో కాయలు గాసిపోతై, తరవాత ఇక బాధే తెలవదు.' అన్నదామెకూడా రోకలి తీసుకుంటూ.

'అయినా ఇసుమంటి పన్లు మాబోటి మోటోళ్ళం చెయ్యాల్సిందే కాని మీబోటి దొరసాంన్లు చెయ్యలేరులేండి. నాకెందుకు చెప్తారు...అన్నాడు వాడు ఉసిగా ఒక చేతులోనుంచి ఇంకొక చేతిలోకి రోకలి మార్చుకుంటూ.

'ఏం ? మీబోటి దొరసాన్లంటే. మేము మాత్రం తినట్లేదా ? మీరేనా తింటుంది? పొట్ట

లున్నంతవరకి ఎటువంటి దొరసానులకైనా తప్పదు ఎటువంటి దొరగార్లకైనా తప్పదు.' అన్నదామె.

'అయినా ఎనకటి కాలపొళ్ళు మీ బోటోళ్ళు; ఏరు. ఈకాలప దొరసాన్లు ఏరులెండి. మామట్టికి మాలోనే ఎంతో తేడా వుంటది—ఎనకటోళ్ళకీ ఇప్పటోళ్ళకీ మా సెల్లెల్నొకదాన్ని పరమటిచ్చాం. ఏదో పొలము బుట్రావుంది ఒకళ్ళకి కూలికిబోకండా వాళ్ళ పొలాల్లో వాళ్ళేసేసుకు బతుకుతారు గదా అని. వాళ్ళ పొలం వాళ్ళు ఊడ్సుకుపోను. తైజ్జావ గోంగోర తప్ప రొంటోగి నోట్లో బెట్టుకోటానికి దొరకదు. ఆరుగాలం అజే. ఆ తైదలు అయినా ఆరుగాలం ఎంత శాకిరీజేస్తే వస్తై. ఇప్పుడు బుట్టిన పిల్లనైనా సరే ఇట్టా దోలానికి దుప్పటికట్టి ఆ దుప్పట్లో పడేసి పొలాని కురికితే మళ్ళీ యింటికొచ్చే ఆ ఒడ్డని జూసుకునేది. లేకపోతే ఒడిగట్టుకోనైనా బయలేరాల. పొలం తీసకపోయి అక్కడ ఏ చెట్టు కొమ్మకో ఒక సైపంచ కట్టేడీను ఆ పంచలో పారేసి అంతకంటే ఇంకా కొత్తె వుహ తెల్చిన పిల్లల్ని కాపలా పెట్టేడీ, మనం పొలం పన్లో పడేది. అడోళ్లు మొగోళ్ళు ఆ మాదిరిగా కట్టపడితేగాని ఆ తైద జావకూడా దొరకదు. మా సెల్లెలు మా అన్నదమ్ముల్లముద్దెస ఒక్కతే కొటాన కొత్తె పొలము బుట్రా పంపకుండా గారాబంగానే పెంచాం శెప్పొద్దు. ఎట్టొచ్చి ఇక్కడ కొత్తె సుకపడిపోయిందాయ. అక్కడ రెయ్యింబవళ్లు పొలానికి లెరిమి ఎట్టిశాకిరీ అంతా శేయించేటప్పటికీ సన్నాశిది కాకైపోయిందిగా. అంతకిముందు మాలో కందల్లోకి అదే కొత్తె సాయంగా వుండేది. ఇప్పుడేముంది? మామాత్రం అన్నా లేదుగా? ఈ దొరసాన్ని జూపినప్పుడల్లా నాకదే మనసులో కొత్తుంటది—అంటూ వాడుకూడా పోటుచాలించి చమట తుడుచుకుంటున్నాడు. నేను కొంచెంసేపు వేసి మధ్యలో ఎప్పుడో చాలించి వాడిమాటలు వింటూ అలాగే రోకలిపట్టుకొని నిలబడిఉన్నాను.

'ఏమమ్మ అట్టాగే నుంచుంటివేం ఇందాకట్నుంచీ' అన్నది మా అత్తగారు. 'వా రూళ్లో ఇసుమంటి పనులన్నీ ఎరగర్లెండి, ఆ దొరసానే—మేత్తది పాపం. గబగబ నేనే రెండుమూడు వరస లేసి పోతా'—అన్నాడు.

నువ్వు జేసేపని నువ్వు జేసేయుద్దూ. నువ్వు కూడా ఇంట్లోపను లెక్కడ సవిరిస్తా కూసుంటావు. ఇక పదయిపోయి అన్నంతిని ఇంకొకలట్ట పచ్చిగడ్డి తీసుకురా—అన్నదామె. నేను అన్నం తిని పచ్చిగడ్డికి వెళ్లాను. బొబ్బలు చితికి చేతులుమంటలు పుడుతున్నా అట్లాగే ఆ ఒడ్లు వియ్యంచేశాం. ఆ రోజు మొదటిరోజు నే కాదు నా చేతులకు బొబ్బలు పొక్కటం. ఎప్పుడు దంచినబియ్యం అయిపోయి మళ్లీ వడ్లుపోసి దంచబోయేటప్పటికి ఎప్పటికప్పుడు కొత్తగా బొబ్బలు పొక్కవలసిందే. ఆ బొబ్బలు చితికిన చేతులతోనే వడ్లు దంచవలసిందే. ఆమె చెప్పినట్లు కాయలుకాచినా బాగానే ఉండేది. ఎన్నిసార్లు దంచినా, నా చేతులు కాయలుకాచేవి కావు, ఎందువల్లనో మరి. మరీ ఆ వడ్లదంపుడు తట్టుకోలేక ఎప్పుడు మా యింటికి వెళ్దామా అనిపించేది అక్కడ వుండగా. మా యింటికివస్తే అక్కడికి వెళ్ళటం అంటేసరి భయంగా వుండేది.

చేయించుకున్నప్పుడు అలా చాకిరీ చేయించుకున్నా తీరిక సమయంలోనైనా ఎక్కడికైనా పోనిచ్చేవాళ్లా అంటే అదీ లేదు. వూళ్లోనే సభలనీ, అవనీ ఇవనీ ఏమైనా జరుగుతుండేవా? ఎక్కడికీ పోనిచ్చేది కాదు. ఎక్కడికి వెళ్తే ఎవరు ఏమి నేర్పి పుంపుతారో, ఎక్కడమాట వినకపోతుందోనని భయపడుతుండేవాళ్లు. ఏమైనా ఊరేగింపులవీ వచ్చేవా కొంచెం వాకిట్లోకివెళ్లి చూద్దాం అంటే వీలుపడనిచ్చేది కాదు. సరీగ్గా ఆ బజార్లోకి వచ్చేటప్పటికీ 'పాలు పొంగిపోతవి పాలు చూస్తుండు' అనో, ఏదో ఒకటి అలాంటి పనులే నాకు అప్పజెప్పి తనింకే పని మీదనన్నా అక్కడ లేకుండా వెళ్లిపోయేది. అబ్బ చెప్పుకుంటే ఒకటా రెండా ఇలాంటివెన్నైనా వుంటవి.

ఆ వూళ్ళో మహిళాసంఘం వున్నది. బయటకువచ్చి పనిచేయగలిగినవాళ్లు ఆ వూళ్లో అన్నివేల మందిలో ఇద్దరుమాత్రమే ఉన్నారు. వాళ్లు మమ్మల్ని కూడా మహిళాసంఘంలో చేర్పించాలని వచ్చారొకరోజు. ముందు మా అత్తగారి నడిగారు. మనకు ఆ కష్టాలున్నై ఈ కష్టాలున్నై. ఇవన్నీ పోవాలంటే మనం అంతా ఒక సంఘంగా ఉంటే మంచిదని చెప్పి ఆమెను సంఘంలో చేరమన్నారు.

'మాకు సంగాలు వద్దు, ఏమీ వద్దు మమ్మల్నిట్టా వుండ నియ్యండమ్మా చాలు—అన్నదామె.

'మీ కిష్టం లేకపోతే మీరు చేరవద్దులెండి, మీ కోడల్ని అయినా చేర్పించుకుంటాం' అన్నారు వాళ్లు.

'మా కోడలొకటే నే నొకటేనా ఏం? నేనే చేరకపోతే మా కోడలెట్టా చేరుద్ది? బలేవాళ్ళే మీరు, ఇవాళ సంగంలో చేరమంటారు, రేపు మీ మాదిరిగా ఇల్లిల్లు పట్టుకుని తిరగమంటారు. మా కయిన్నీ ఏం తెలవవులే పోండి. పోండమ్మ' అన్నది; ఆమె విసురుగా. పాపం వాళ్ళేమనుకున్నారో ఏమో వెళ్లిపోయి.

అలా కోపపడితే ఎలాగండీ. మాకుమాత్రం ఏం పనిపాట్లేక ఇలా తిరుగుతున్నామంటారా? ఇప్పుడు ఇంటికివెళ్లి మీలాగానే మీ కోడలిలాగానే అన్నిపనులు మేమే చూచుకోవాలి. ఇంకా కొంత కాలం పోతే ఇలా అనేవాళ్ళే ముందుముందుగా చేరుతారు లెండి' అని నావైపు ఒకసారిచూచి వాళ్లు వెళ్ళిపోయారు. ఎప్పుడైనా మహిళా సంఘానికి చందాలు అవీ కావలసివస్తే మా యింటిదగరనుంచీ దేనికైనా వాడు కోవటానికని తీసుకువెళ్లిన డబ్బులోదే అప్పుడప్పుడు ఒక రూపాయి అర్థరూపాయి ఇస్తూ ఉండేదాన్ని. అది నా డబ్బేఅయినప్పటికీ మళ్ళీ మా అత్తగారింట్లో ఎవ్వరికీ తెలియకుండా చాలా రహస్యంగా ఇస్తుండేదాన్ని. మనకు అభిమానం ఉన్న సంఘానికి మనడబ్బు మనం ఇచ్చుకునే అధికారంకూడా లేదన్నమాట. ఒక సంఘానికే కాదు. నా కవసరమైన ఖర్చులకు వాడుకుంటున్నా కూడా వా రందరికీ కష్టంగానే ఉండేది అదేమిట్లో మరి. ఎప్పుడైనా పూలవాళ్ళీ వస్తే పిలిచి తీసుకుంటుంటే 'ఇవాళ ఏం పేరంటం వచ్చిందనో, ఏదన్నా పండగా పబ్బమా? అవి నాలుగు అయిపోయినదాకా అంతేలే' అని తనలో తనే గొణుగుకుంటుండేది. పెండ్లై ఇన్ని సంవత్సరాలైనా వారి డబ్బు దేనికి ఇవ్వకపోగా నా డబ్బు నన్నుకూడా సంతోషంగా స్వేచ్ఛగా ఖర్చుపెట్టుకోనిచ్చేవాళ్లు కాదు.

ఒక డబ్బేమిటిలే. కొాస్త శుభ్రంగా వుంటే కూడా చూడలేకపోయేవాళ్లు. సాధారణంగా వారానికొకసారి తలంటుకోవటం అలవాటు నాకు. ఇంత తొందరగా ఎందుకు అంటుకోవాలా? అని కోపం చూపిస్తూ ఉండేదామె. కుంకుడుకాయలు కొట్టుకుంటుండేదాన్నా? 'తెచ్చిపోస్తావుంటే కొట్టిపోస్తా వుండండి. మీ డబ్బు పోయిందిలే. అన్నిటికీ నేనుండగా?' అనేది. అలా ఒకసారా రెండుసార్లా? ప్రతి తలంటుకీ ఏదో ఒకమాట మార్పుతో మొత్తంమీద తలెందుకు అంటుకోవాలా? అనే భావాన్నే సూచిస్తూవుండేది. అక్కడికీ వారానికొకసారి అంటుకునే అలవాటును పది పదకొండు రోజులవరకు కూడా మార్చుకున్నాను. అంతకన్నా ఇంకా నేను చేయగలిగే దేమున్నది? ఆమె కసలు నన్ను చూస్తూవుంటేనే ఎప్పుడు ఏదో ఒకటే అన బుద్ధి అవుతూనే ఉండేది.

ఒకసారి ఇంట్లో బియ్యము పప్పు అన్నీ అయిపోయేవి. అయిపోయిన సంగతి మా యిద్దరికీ తెలుసు. అయిపోయినవని చెప్పబోతే 'అయిపోతే నన్నేం చేయమంటావు?' అనేది. అందుకని ఒకసారి పైపనంతా చేసి పొయ్యి రాజెయ్యకుండా కూర్చునేదాన్ని. 'చేతులు ముడుచుకొని కూర్చున్నారేం? తినరా? అనేది. 'పొయ్యిమీద ఏం పెట్టేది మరి?' అనేదాన్ని. ఏమో ఏమి పెడతావో. కాజేసుకు కూచున్నవాళ్లు ఎరగరా?' అంటూ చేట తీసుకుని పొరుగింటికి పోయేది. ఎక్కడన్నా బదులు తీసుకొస్తాను పొయ్యి రాజసి ఉంచమని చెప్పటానికి కాబోలు ఈ ఉపోద్ఘాతమంతా అనుకుని పొయ్యి రాజేసేదాన్ని. ఇలాంటివి ఒకటా రెండా ప్రతి దినము ఎన్నో సంఘటనలు జరుగుతుండేవి.

మన బంగారం మంచిదైతే కంసాలి ఏం చేయగలడని ఒక సామెత. అలాగ అసలు చేసుకున్నవాళ్లు మంచివాళ్లైతే అత్తలు ఆడపడ్డలు ఏం చేయగలుగుతారు? వాళ్ళ అలవాట్లప్రకారం కొన్ని కొన్ని మాటలు అంటున్నా చేసుకున్నవాళ్లైనా ఆదరంగా చూస్తూవుంటే వాట్లను మాపైనా కొంతవరకు మరచిపోవటానికి వీలుంటుంది. ఇప్పుడు వచ్చిన బాధలన్నీ చేసుకున్నవాళ్ళ దగ్గరనుంచే ప్రారంభమైనవి. అసలే అంతంత మాత్రపు సంసార మనుకోండి. దానికి తగ్గట్టూ పొలము బుట్రా కూడా చూచుకోకుండా;




టాయిలెట్ సబ్బు
నా చర్మ సౌందర్యమునకై సంరక్షణ తీసుకొంటుంది”

అని లలిత చెప్పుచున్నది

మనోహరమైన సువాసనతోగూడిన ఈ తెల్లటి శుద్ధ
సబ్బుతో మీ చర్మమును మనోహరముగా
నుంచుకొనండి!

సినీమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

LTS. 322-X30 TL

ఏవో మక్తాలకు ఇచ్చుకుంటే వచ్చే ఆదాయాన్ని కూడా ఇంట్లోకి సరిగ్గా ఇవ్వకుండా చీట్లాటలకనీ, వాటికనీ, వీటికనీ అన్ని దురభ్యాసాలకు ఖర్చుపెట్టుకుంటూ పైగా తమలోవున్న బలహీనతలను ఇతరులలో కూడా వెదకమూడటం, ఎవరు ఏది చెపితే అదంతా కూడా నిజమేననుకోవటం, ఇంట్లోఉన్న కాసేపు నాతో పోట్లాడుతూ కూర్చోవటం. ఇదంతా అత్త, ఆడబిడ్డలకు మాత్రం అలుసు కాదూ? లోకానికి మాత్రం అలుసు కాదా?

కాపురానికి వెళ్లిన కొత్తలో ఎక్కువ పనులు తగులుతుండేవి కాదుగాని తరువాత తరువాత ఆమె ఏమీ పట్టించుకోనకపోవటం, పనులన్నీ నేనే చేసుకోవలసిరావటం జరుగుతూ వచ్చింది. వారు నాతో సరిగా వుండకపోవటంవల్లనైతే నేమి, ఒకవైపున అత్తగారితో పోట్లాటలవల్లనైతే నేమి జీవితమే చాలా చీకాకుగా ఉండేది. సాధారణంగా ఎప్పుడు ఏవో పనులతోనే ప్రొద్దుపోతూ వుండేది. ఎప్పుడైనా తీరిక చిక్కినప్పుడు వీటన్నిటిని గురించి ఆలోచించి ఆలోచించి మనస్సు మరీ పాడైపోతుండేది. ఆ ఆలోచనలేవీ జ్ఞాపకం రాకుండావుంటానికే ఉపయోగపడుతుందేమోనని తీరిక ఉన్నప్పుడు ఏదైనా పుస్తకం చదవటం మామూలుగా పెట్టుకున్నాను. అప్పుడు దీపావళి దగ్గరకొస్తూ వున్నది. ఆ రోజు పండగ పనులతో పగలంతా ఒళ్లు విరగ్గొట్టుకుని పని చేశాను. రాత్రిపూట భోజనాలైన తరువాత గదిలో చదువుకుంటూ పండుకున్నాను. ఎప్పుడైనా మా అత్తగారు చావడిలో పడుకుంటూ వుండేది. ఈ ఇంట్లో ఏమి జరుగుతున్నా ఆమెకు తెలియటానికి అవకాశం వుండేది కాదు. వారు గది తలుపులు పెట్టుకుని లోపలకువచ్చి పండుకున్నారు. నేను చదువుకుంటూనే వున్నాను.

'మా అమ్మ అంటుందంటే అనదుమరి? ఇంత ప్రొద్దుపోయినా లాంతరువత్తి అంత పెద్దదిగా వుంచితే?' అని కసిరారు.

మీ అమ్మ మీరు అనందిదేనికి? నన్ను చూస్తే సరి ఏవో ఒకటి మీకు అనబుద్ధి అవుతూనే వుంటుంది— అన్నాను.

లాంతరు తగ్గించి ముందు నీవిట్రా. అన్నారు. ఎందుకన్నాను.

'ఎందుకో నోరుమూసుకుని ముందురా లేచి.' అన్నారు విసుగ్గా. నేను పుస్తకం చేత్తోపట్టుకునే వెళ్లాను. నా చేతిలో పుస్తకం లాక్కుని ముందు కాళ్లు పట్టమన్నారు. అలాగే చేస్తూవున్నాను. పుస్తకం తెరచిచూచి ముఖం చిట్లించుకుని ప్రతి పుస్తకంమీద సత్యంపేరు వ్రాస్తావెందుకు? అంటూ అదోక మోస్తరుగా చూచారు నావైపు. ఆ చూపు నా మీద అసహ్యభావాన్ని స్ఫురింపజేస్తూ వున్నది. ఎందుకో నామీద నాకే జాలివేసిందా క్షణాన. నేనేమైనా తప్పు చేసివుంటానేమోనని ఆత్మవిమర్శ చేసుకోవటానికి కూడా నా మనస్సు అంగీకరించలా. ఏమి? అన్నాను వెంటనే అమాయికంగా. 'ఏమా? ఎందుకు వ్రాస్తావని అడుగుతున్నాను. ప్రశ్నకు ప్రతిప్రశ్న కాదు నేను కోరుతున్నది జవాబు' అంటూ పళ్లునూరుతూ చూపులు బీభత్సంచేశారు.

నేను వ్రాయలేదే. అది ఆయనగారే వ్రాసుకున్నారు—అన్నాను.

నీ పుస్తకంమీద అతని పేరెందుకు వ్రాశాడు? అన్నారు ఇంకా ఏమో దీర్ఘంగా ఆలోచించుకుంటూ.

ఇది నా పుస్తకం కాదు. ఆయన పుస్తకమే.

అతని పుస్తకాలు నీ దగ్గర కెందుకు వస్తవి?

ఆయన భార్య నాకు బాగా తెలిసినామె. ఆమెను ఏవైనా పుస్తకాలు ఇవ్వమంటే ఇవి ఇచ్చింది.

ఇకనుంచీ ఆ పుస్తకాలేవైనాసరే ఇక్కడకు తీసుకువచ్చావంటే నేను వూరుకునేదిలేదు. ఇదే చెప్పటం. ఎప్పుడైనా మీ వూరు వెళ్లినప్పుడు వాళ్ల ఇంటికి వెళ్లినట్లు తెలిసినా ఎక్కడైనా అతనితో మాట్లాడినట్లు తెలిసినాసరే అంతటితో పోవలసిందే.

ఇదంతా ఏమిటో నాకు బోధపడటంలేదే. ఆయన చేసిన తప్పేమిటి? నేను చేసిన తప్పేమిటి?

అదేమిటో మీకే తెలియాలి. 'ఇంతకూ నీవు నేను చెప్పినట్లుగా నడుచుకో తలంచుకొన్నావా లేదా?'

'ఇలాంటి విషయాల్లో మీకు నేను వాగ్దాన

మివ్వవలసిన అవసరం నాకేమీ కనపడటంలేదు. పైగా ఇలాంటి వాటివల్ల లోకంలో లేనిపోని నిందలకు తావివ్వటమే అవుతుందని నా అభిప్రాయం.'

'చేసిన తప్పును దిద్దుకోవటానికి బదులు ఇంకా ఎదురు చెపుతున్నావా? సిగ్గులేక? అతనితో మాట్లాడకుండా ఉంటావా ఉండవా? ఏదో ఒకటే చెప్పు నాకు ఉంటాననో, ఉండననో—'అని వేలు చూపించారు.

'నేను తప్పేమీ చేయలేదు సరిగదా. దీని మూలాన తప్పుచేసినదాన నవుతానేమోనని భయపడుతున్నాను. మీరు నన్ను ఏమిచేసినాసరే, ఈ విషయంలో మాత్రం నేనే బాగా ఆలోచించుకుని ఏదైనా నా యిష్టంవచ్చినట్లుగా నడుచుకోవలసిందే కాని ఇప్పుడు మీకు నేను చెప్పేదేమీ లేదు—అని అనీ అనటంతోనే ఏమీ ఆధారంలేకుండా నిలపెట్టిన పుస్తకంలాగా పోయి వెనక్కుపడ్డాను. కొంచెంసేపటికి ఎడమకాలితో ఒక్క తన్ను తన్నినట్లుగా జ్ఞాపకం వచ్చింది. అది నా జీవితంలో మొదటితన్ను. నా కింక భూమ్యాకాశాలు తెలియలేదు. నా బాధల్లో మిగిలున్నభాగం కాస్తా అయిపోయిందా రోజుతో. నా శరీరమంతా భగ్గునమండి బూడిద కాలేదు. సమయం వచ్చినప్పుడు ప్రతీకారం చేయటానికా? అన్నట్లు ఎఱ్ఱగా కాలిన ఇనపముద్దలాగా అయిపోయింది. నా హృదయమంతా కాలిన ఇనపముద్ద కుండవలసినంత వేడిగా మారిపోయింది. నా కన్నులలో ప్రళయరుద్రమూర్తి తాండవమాడుతున్నట్లుగా ఆశ్చర్యంగా నిశ్చేష్టితురాలనై వారివైపు చూస్తూ అలాగే నిలబడ్డాను. కళ్లెంబడి బాష్పకణాలు నిప్పుకణాలలాగా రాలుతూ ఉన్నవి. నాకు అసలు పెండ్లికాకముందు అయిన తరువాత కూడా భర్తలు భార్యలను కొట్టటాన్ని గురించి తీవ్రంగా ఆలోచించేదాన్ని. చిన్న పిల్లలుగా వున్నప్పుడే ఎవరైనా కొడుతూవుంటే అంత అవమానంగానూ, అసహ్యంగానూ వుంటుందే పెద్దవాళ్ళయిన తరువాతకూడా అంతంత పెద్దవాళ్లు అంతంత పెద్దవాళ్లను పట్టుకుని కొడుతూవుండటం తలుచుకుంటే అదొక రాక్షసకృత్యంలాగా అనిపించేది. ఎంతో సహించరానిదిగా ఉండేది. ఒక్కసారి కొట్టినతరువాత ఇంకా ఆ భర్తముఖం ఎలా చూస్తారా, అనిపించేది. ఇంకా అతనితో కలిసి వుండేదానికన్నా ఎందుకు చావరా అనుకునేదాన్ని. అవన్నీ తలుచుకుంటే అసలు పెండ్లే వద్దనిపించేది; పెండ్లి కాకముందొకసారి. అయినా వాళ్లు కొట్టటానికి కూడా వీళ్ళ లోపాలుకూడా వుండవచ్చును గదా. అలాంటి పొరపాట్లేమీ రాకుండా చూచుకుంటే ఎందుకు కొడతారు? తప్పు చెయ్యకుండానే వుందాం; అనుకున్నప్పుడు పెండ్లి కావాలనే అనిపించేది. నావరకు నేను పెండ్లికాకముందు అయిన తరువాత కూడా ఆలోచించి ఆలోచించీ, తప్పు చేయకపోతే కొట్టరుకదా. ఒకవేళ చెయ్యకుండా వున్నా కొడతారా, ఆ కొట్టిన మొదటిసారితోనే ఆఖరుకు ఎక్కడా వుండటానికికూడా వీలు లేకపోతే చచ్చైనా పోదామనే నిర్ణయానికి వచ్చాను. అంతకుముందు కొట్టకపోయినా కొడ్తాను కొడ్తాను అని చెప్పనైనా చెప్పేవారు. అప్పుడు చెప్పనైనా చెప్పకుండానే అంత పనీ చేశారు. అంతకుముందు కొడతా నన్నప్పుడల్లా 'కొడతారు, ఎందుకు కొట్టరు? కొట్టినా ఎన్నిసార్లు కొట్టొచ్చారేం?అనేదాన్ని.' ఎన్నిసార్లైనా కొడతాననేవారు. అలా ఎప్పుడూ జరగదని ఖచ్చితంగానే చెప్పేదాన్ని.

వారి మాట కొంతవరకు చెల్లించుకున్నారు. ఇక నా మాటే మిగిలున్నది. ఏం చెయ్యటమా? అని ఆలోచించాను. ఏమి చేయవలసినదీ ఇదివరకే అనేక సార్లు ఒక నిర్ణయానికి వచ్చికూడా సమయం వచ్చేసరికి మళ్లీ ప్రశ్న వేసుకోవటంలో కర్తవ్యానికి దూరమౌతున్న నా బలహీనత కళ్ళకు కట్టినట్లు కనపడింది. నాకు తెలియకుండానే నా చిన్నప్పటి ఆలోచనలకు ఏదో ఒక సుడిబండలాంటి బాధ్యత అడ్డు తగిలింది. వారాపని చేయటానికి ఒక నిమిషంకూడా నాకు నేను చిన్నదానను గానే వున్నాను. మరు నిమిషానికే ఒక ముసలమ్మనైపోయానేమో ననిపించింది. అలాగే చూస్తూ నిలబడినానే కాని ఏమీ తోచలేదు. నా చూపులు వారి కళ్లల్లో గుచ్చినవో ఏమో 'ఏమిటా చూపు ఇంకా అనుమానం తీరలేదా? మళ్లీ తగలాలా' అన్నారు చెయ్యెత్తుతూ.

'అనుమానం నా కెప్పుడూ లేదు. మీకే అనుమానంగా వున్నది. మీరు కానిచ్చే దేమిటో ముందు

కానివ్వండి. అందర సమానాలు తరువాత తీరుస్తై.' అన్నాను.

'ఇంకా పొగరుబోతుతనం పోనేలేదా?' అంటూ మళ్లీ చెంపమీద ఈడ్చికొట్టారు. ఒక మెరుపు మెరిసి నా కళ్లు బయర్లు కమ్మినవి. అంతటితో నాతో పాటు నా ఆలోచనలు కూడా స్తంభించి పోయినవి. నాకు తెలియకుండా నేనా మంచం మీదకుపోయి ఒత్తిగిలాను.

'జాగ్రత్త! ఒళ్లు దగ్గర పెట్టుకొని బతుకు' అంటూ ముసుకు పెట్టుకున్నారు వారు. మళ్లీ నాకు కొంచెం స్పృహ వస్తుండేటప్పటికీ 'జాగ్రత్త ఒళ్లు దగ్గర పెట్టుకు బతుకు' అన్న మాట నా చెవుల్లో గింగురు మంటూంది. ఈ మాట వారు పెడుతున్న గురకకు తాళం వేస్తున్నట్లుగా ఉన్నది. ప్రకృతి మాత్రం ఊఁ ఊఁ. ఊఁ. అంటూ విరామం లేకుండా మూలుగుతూనే ఉన్నది. ఆ మూలుగులోనే నా జీవితాన్ని గూడా ఐక్యం చేయా లనిపించింది. వెంటనే ఆ భావన పిరికి తనంగా తోచింది. నేను సాధించా లనుకున్న విషయం సాధించలేననుకున్నా. తొందరపడి పుట్టి నింటికి వెళ్ళినా వాళ్లు తేలికగానే చూస్తారుకదా? ఈ ఒక్కసారికీ సహించుదా మనుకున్నా. ఇంకా ఏమో ఆలోచిస్తూనే వున్నాను.

ఇంతలోకే కాకులు కాకా మంటూ గోల పెట్టటం ప్రారంభించినవి. రయ్యి రయ్యిన ఇంట్లోకి తెల్లని కాంతులు ప్రవేశించుతున్నవి. అబ్బ! తెల్ల వార్లు నిద్రలేకపోయినా లేవక తప్పదుకదా? అను కుంటున్నాను.

'పొద్దు పొడిసినా ఇంకా లేవలేదమ్మా, ఎవ రన్నా మాస్తే నవ్వి పోదురే' అని అంటూ వున్న దప్పుడే మా అత్తగారు; ఏవో చప్పుడు చేస్తూ. సరే ఎలాగు తప్పేది లేదుగదా అని వెంటనే లేచి బయ టకు వెళ్లాను. ఆ రోజు కూడా మామూలు పనిపాట లన్నీ అలవాటుగా చేసుకు పోతున్నానే కాని కొంచెం మెదడుతో అవసరమయ్యే పనులు పాడై పోతూనే వున్నవి. పొయ్యిమీద పప్పుగిన్నె పెట్టి పొయ్యి కెదురుగా కూర్చుని కాయగూరలు తరు గుతూ వున్నాను.

'అయ్యయ్యో, ఇంకా ఆ దూడ బతక నేనా? అది చస్తే మాత్రం మీకేం లే? నాకేగా తిప్పలు' అంటూ ఆమె నీళ్లు తాగుతున్న పసిదూడను చెవ్వు పట్టుకుని అవతలకు లాగుతూ వున్నది నేను తలెత్తి చూచేటప్పటికి.

'నేను చూడలేదండీ' అన్నాను. అయితే మాత్రం ఆమె అంతమాత్రానికి వూరుకుంటుందా?

'ఎదురుగానే వుంటే ఎట్టా చూళ్ళేదమ్మా, అంతా ఉబ్బరం, ఎవరన్నా ఇంటే నవ్విపోదురే, ఆయనేమో అట్టా జాస్తున్నాడు. నువ్వే మన్నా ఇట్టా జెయ్యి సరిపోతది. రెంకు రెండే సమకూరి నైలే. దేవుడే అట్టా సమకూరుస్తాడు కావాల, నేనెంత ఏకేలు బోకేలు యిరుసుకుంటే మాత్రం ఏం లాబం? ఎవళ్లజేసేది వాళ్లు జాస్తానే వుంటిరి?' అని ఆమె అంటూ వుండగానే ఈ విషయం అప్పుడే పొరుగింటామె చెవిన ఎప్పుడు పడిందో ఏమో నిప్పుకోసం వచ్చినట్లుగా గంటె ఒకటి చేత్తో పట్టు కుని 'ఏందీ?' అంటూ వచ్చింది ఉత్సాహంగా, ఇక మళ్ళీ మొదలు పెట్టిందామె పాట.

'మా పనెట్టా వుందనుకున్నావేం? వాడే మాన్నా వున్నదకాస్తా అట్టా నాశనం జాస్తా కది లిస్తే మేదకి దోకొస్తాడు. ఈ జెణ్ణేమన్నా పలక రించే యీలే లేదు.' అని ఆమె ఏమేమో సాధిస్తూ వుంటే అవి వింటూ పొయ్యిమీద పప్పుగిన్నె మాట మరిచేపోయాను.

'పొయ్యిమీద ఏం లిఃలేశావేం? కాటు కంపు కొడతావుంది' అన్నదామె అప్పుడే ఆ వాసన ఎలా పట్టిందో ఏమో.

'పప్పులో ఎసరు తగ్గిపోయినట్లున్నది' అంటూ పప్పుగిన్నె మీద మూత తీసేటప్పటికి మాడిపోయిన వాసన ఇంకా గప్పుమని వచ్చింది.

'ఇంకేం జేసుకో నా పప్పు! మాడిపమ్మా చూడు. ప్రతి పని యింతే నేను కాసేపు ఎక్కడ లేకపోతే అక్కడల్లా నాశనంగా వాల్చిందే ననుకో. రామరామ ఒక్క పనిగూడ చేతగాదు గదా? ఆ అమ్మ ఎట్టా పెంచిందో ఏమో మరి. కని మందికొంపలమీదికి పెడ్తే సరనుకుంటారమ్మ ఒకొకళ్లు. ఇంత సారంతిలేకుండా పనులు చేసే కోడ ళ్లని ఏ యింట్లోనన్నా చూశావటమ్మా!. నువ్వు?'

అని ఒకచెయ్యి నడుమున పెట్టుకుని ఒక చెయ్యి మూతిమీద పెట్టుకున్నది ఆశ్చర్యంగా.

'ఇప్పుడు నేనేం చేశానని నన్నింతగా సాధించటం? ఎవరికైనా పొరపాటు రాకుండా ఉంటుందా? చేసేవాళ్లెంత పొదుచేస్తున్నా బాగానే వుంటుంది. నావల్లమాత్రం ఏ కొంచెం పొరపాటువచ్చినా గొంతు పట్టుకుంటారు. అసలైనా గాని ఎక్కడో వున్న వాళ్ళ జోలి ఏమి వస్తుంది మీకు మాట మాట్లాడితే?' అన్నాను కూరగాయలు తరుగుతూనే. 'ఇట్టా ఎదురుకూతలు కూసే వాళ్లింకేం కాపరం జాస్తరమ్మ. ఇన్నిటికీ వాడు మంచాడు గాదులే. వాడే సరైనావాడైతే అంతా చచ్చినట్టే పడుండేవాళ్లు' అన్నదామె. కొడుకు ఇంకా నన్ను రాచి రంపానపెడితే బాగుండు నన్నట్లుగా. 'పెద్దాళ్ళు ఏదయినా విసుక్కున్నా నువ్వు వూరుకుంటే పోద్దిలే అమ్మాయి' అన్నది పొరుగింటామె నాదే తప్పన్నట్లుగా.

'ఒకరి కష్టాలు ఒకరికేం తెలుస్తవిలేండి. ఎదటి వాళ్ళకు ఎన్నైనా చెప్పవచ్చు. తమదాకా వస్తే గదా తెలిసేది' అన్నాను.

'అంత ఆపె నలుసటువంటిదన్నా కనబడితే ఆ అబ్బాయైనా కాస్త తిన్నంగా వుండేవాడేమో. అదీ లేదాయె. అంతేలేవదినా. ఒకొకళ్ళ కెన్నాళ్లున్నా తీరవు కష్టాలు' అన్నది పొరిగింటామె మా అత్త గారితో.

'అయ్యో అంతమాత్రపురాత. ఇటువంటి మొకాలకే అటువంటి గీతలబ్బేది. ఆ గీతుంటే మాకీ సంబంధమే అయ్యేది కాదనుకో ఎందుకక్కడ' అన్నది మాఅత్తగారు నొసలుమీద చేతితో కొట్టుకుని.

'ఎం జెక్కెంది పొయ్యి రాజెయ్యాల' అంటూ పొరుగింటామె వెళ్లిపోయింది.

మా అత్తగారి కోర్కెకు తగ్గట్టుగానే క్రిందటి రాత్రి జరిగిన సంఘటనవల్ల మేము ఎడముఖం పెడ ముఖంగా వుండటం ఆమెకు మరీ సంతోషమైంది. ఆ రోజునుంచీ కూడా మాటమాట్లాడితే నా మీదకు ఒంటి కాలిమీద తగాదాకు రావటం సాగించింది. ఆ సంఘటన జరగకముందు అంత ఇష్టంలేకపోయినప్పటికీ మనిషన్న తరువాత ఎవరో ఒకరితో ప్రొద్దు పుచ్చుకోవాలి కాబట్టి నాకు తోచనప్పుడల్లా నేనే వారి దగ్గరకువెళ్లి కూర్చోవటం ఏవో పిచ్చాపాటి నాలుగు ఖబుర్లు చెప్పుకోవటం జరుగుతుండేది. ఆ సంఘటన జరిగిప్పటినుండి మాత్రం వారిని చూడ బోతేనే చాలా సిగ్గుగా వుండేది. అవమానంగాను, అసహ్యంగాను కూడా వుండేది. ఎక్కువ తెలివి తేటలు, చదువు, చక్కదనము, లేకపోయినప్పటికీ అంతకుముందు అనాకరకమైనజాలివుండేది వారిమీద. తరువాత అది కాస్తాపోయింది. ఇంకా నేనే వుద్దేశంతో వారి దగ్గరకుపోయి మామూలుగా ఖబుర్లు చెప్పగలను? నామీద అపనమ్మకం ఏర్పడిన తరువాత నేను ఖబుర్లు చెప్తేమాత్రం వారు సంతోషిస్తారని ఎలా అనుకుంటాను? ఈ విసంగానే మాట్లాడకుండావుంటే ఇలాగే అలవాటైపోయి ఇంకా ఎక్కువ ప్రమాదానికి గురికావలసివస్తుందని భయపడి ఎప్పుడైనా మాచాయగా మాటలు అందించబోయే దాన్ని. కాని వారుమాత్రం ఆ అవకాశం ఇచ్చే వారు కాదు. ఏమకు ఏవి కావలసివచ్చినా తమ తల్లినే అడిగి కావలసినపనులు చేయించుకుంటుండే వారు. ఆమెకూడా నన్నడగకుండా తననే అడుగు తున్నందువల్ల ఎప్పటికంటే ఇంకా ఎదురెదురుగా వుండి కొడుకు నోట్లోమాటనోట్లో ఉండగానే ఎప్పటికప్పుడు అమర్చిపెడుతూ వుండేది. ఆమె కొడుకుతో కబుర్లు చెప్పుకుంటూ కొడుక్కు కావలసినవన్నీ అందిస్తూ అక్కడే ప్రొద్దుపుచ్చుకుంటుండేది. ఆమె చేయవలసిన పనులుకూడా నేనే చేయవలసి రావటంవల్ల ఎప్పుడైనా వారికి అలా కనుపించుదామన్నా వీలులేకపోయేది. ఈవిధంగా వాళ్ల తల్లీ కుమారుల మధ్య వాత్సల్యం అభివృద్ధికావటం మా దాంపత్య ప్రేమ సన్నగిల్లిపోవటం జరుగుతూ వచ్చింది.

ఒకొకసారి ఎవరైనావచ్చిఒక్కగానొక్క కొడుకుంటే అంత ఆపెనలుసంటిదన్నా కనపడకపోయెనే పాపం! అనేవాళ్లు. వా ళ్లామాట అనటంతోనే ఆమెలోఉన్న అసంతృప్తి జ్వాలలన్నీ ఒక్కసారిగా ప్రజ్వరిల్లేవి. ఆ రాతుంటే మాకీ సంబంధ మయ్యేదే కాదు. అనేది ఆమె ఉక్రోషంగా. ఆమె మాట అన్నప్పుడల్లా నేనేమీ తప్పు చెయ్యకుండానే నా మీదకు తప్పులన్నీ ఇలా ఎందుకు వచ్చిపడుతున్నవో

అని చాలా విచారపడేదాన్ని. ఆమెమాత్రం మాకు సంతానం లేదని ఎంత బాధపడేదో చెప్పటానికి వీలు లేదు. నిజంగా ఆమెకు బాధ అనేది ఏదైనావుంటే ఇదేనని చెప్పాలి. ఏ విధంగానైనా సరే తన కొడుక్కు కొడుకు పుట్టాలి, తాను ఎత్తుకోవాలి. ఆమె జీవితంలో అదేకనక లేకపోతే చేసిన శ్రమలైతేనేమి, అనుభవించిన బాధలైతేనేమి అన్నీ వ్యర్థమేనని ఆమె నమ్మకం. అందుకోసం ఆమె ఏది చేయటానికైనా జంకదు గొంకదు. ఈ మా ఎడబాటును ఆధారం చేసుకుని ఆమె కొడుక్కు నూరిపోయవలసినవన్నీ నూరిపోసింది. ఇక నతో నీకు కాపరం చేయదనే కాదు, ఇక దానిని పిల్లలు పుట్టరనేకాదు, భార్య మీద భర్తకు విరక్తి కలగటానికి ఏవేవైతే అవసరమో అవన్నీ రంగరించిపోసింది. కొడుకు ఆ తల్లి మాయ మాటల్లోపడి నాతో వున్న సంబంధం ఇంకా ఎడమై పోసాగింది. నేనా ప్రమాదాన్ని గుర్తించకపోలేను. నేనీ ఇల్లు దాటిపోతే సమాజంలో నాకుండే స్థానాన్ని తెలుసుకోకపోలేను. అయినా · చేయగలిగినంతవరకేకదా నేను చేసేది. ఏ మానవుడైనా ఏలాంటి పరిస్థితుల్లోనైనా తనకున్న సర్వశక్తులను వినియోగించుకోనగలడే కాని అంతకన్నా ఏం చేయగలడు? ఆ రాత్రిమాత్రం ఏదో ఒక అభాండమైన నేరాన్ని నా నెత్తిమీద మోపవస్తే అప్పటికింకా నిజంతో కూడుకున్న నా నిర్మల హృదయాన్ని బూటకపు లౌకికచ్ఛాయలు ఆవరించకపోవటాన ఉన్నదున్నట్లుగా నా హృదయంలోని విషయాన్ని విప్పి చూపెంచి సత్యంతో నా కేలాంటి సంబంధము లేదనీ, మాట్లాడకుండా వుండవలసిన అవసరం నాకేమీ కనిపించటం లేదని, అంత గట్టిగా చెప్పానే కాని ఇంతదాకా వస్తుందనుకున్నానా? పోనీ అప్పుడేదో ఆ క్షణాన అలా అన్నానే అనుకోండి. తరువాత ఎంత ప్రయత్నం చేశాను. వారి మనస్సును మామూలు పరిస్థితుల్లోకి తీసుకురావటంకోసం? తను పలుకరించక పోయినప్పటికే ఏదో ఒకవంక పెట్టుకుని నేనే పలకరించినప్పటికే పలికేవారు కాదు. ఒకొకసారి నేను మంచినీళ్లు తాగుతూవుంటే వారికే జాలయ్యేదో ఏమో నాకుకూడా ఇవ్వు అనేవారు. ఏముంది సిగ్గు లేకపోతే సరి. అంత పెళ్లాంతో మాట్లాడకుండా వుండలేని వాళ్లు మూడురోజులకొకసారి గూపులు చేసుకోవటం ఎందుకు మరి—అని ఆమెలో ఆమె గొణుక్కుంటూ వుండేది. అలా అనగానే వారు అడిగితేమాత్రం నేనెందుకిచ్చానా అనిపించేది. వారికెలా వుండేదో ఏమో మళ్ళీ కొన్ని రోజులవరకు ఆ మంచినీళ్లు కూడా అడిగేవారే కాదు. ఆ రోజుల్లో రాత్రిళ్లు గడపటం మరీ కష్టంగా వుండేది. ప్రొద్దు క్రుంకుతూవుంటే సరి భయంగా వుండేది. ఎప్పటిలాగే ఇద్దరం ఒక గదిలోనే పండుకుంటుండేవాళ్లం. ఎరగనివాళ్ళకు మేము బాగానే వున్నట్లు కనపడేది. మేము మాత్రం మాట్లాడుకోనైనా మాట్లాడుకునే వాళ్ళం కాదు. సాధారణంగా ఎప్పుడూ వూళ్లోనే వుండేవారు కాదు. ఉన్నప్పుడైనా అలాగే జరిగేది. నేనే ఒకొకసారి బ్రతిమలాడేదాన్ని. ఒకొక రాత్రి మరీ పట్టుపట్టి అడిగేదాన్ని నామీద మీకంత కోపం ఎందుకని. వారినుండి ఏమీ జవాబే వచ్చేది కాదు. అయినప్పటికీ ఏదో ఒకటి చెపుతూనే వుండేదాన్ని.

'నేను సత్యంతో మాట్లాడకుండా వుంటానని మీకు వాగ్దానం చెయ్యలేదనా? సరే అలాగే చేస్తానులెండి. మనం ఇలా చెయ్యటంవల్ల మనం ఇతరులకు లేని అనుమానాలకు తావిచ్చినవాళ్ళ మౌతామని ఆరోజు మీకు వాగ్దానం చేయలేకపోయాను గాని ఏమీ లేదు. ఆయనతో మాట్లాడకుండా వుండటమే కాదు మా వూరే వెళ్ళటం మానెయ్యమన్నా మానేస్తాను. మనస్ఫూర్తిగా చెపుతున్నాను. నేనింకెప్పటికీ సత్యంతో మాట్లాడను.'

అని అంటూంటే ఎందుకో నా గొంతు వణకసాగింది. నేను సద్దిగా ఏపని పడితే ఆపని చేయటానికి తయారవుతున్నానేమో ననిపించి శరీరమంతా చెమటలు పట్టిపోయింది. నేనలా వాగ్దానం చేయటానికి లోపల బాధపడుతున్నాననుకున్నట్లున్నారు.

ఇకముందు నీవు నా ఎదుట ఎలాంటి వాగ్దానాలు చేయవద్దు. నాకు నిజంగా నీతో జీవితం గడపాలని లేనేలేదు. నీవు ఉన్నా ఒకటే పోయినా ఒకటే నాకు. ఇంకా పోతేనే శ్రేయస్సును చేకూర్చినదాన వౌతావు. —అన్నారు. నేను తప్పు చేశానో లేదో తెలుసుకునే సమర్థతైనా వుండాలి మనిషిలో. లేకపోతే ఒకవేళ చెసే వుంటాననే అనుమానమే వుంటే నా తప్పును దిద్దటానికైనా ప్రయత్నం చేయాలి. అదీ ఇదీ కాకుండా

ఏదో ఒక నేరాన్ని పైన వేసి బయటకు నెట్టాలని చూచేవాళ్లతో ఇంకా నేనెందాకా కలసివుండ గలను. ఇవతలకు వచ్చినా తిప్పలే నని ఉద్దేశంతో అక్కడే వుందామని ప్రయత్నం చేయటమే కాని నాకసలు ఆమనుష్యులన్నా, ఆ ఇల్లన్నా విరక్తికలి గింది. ఏమైనా సరేనని అలాగే జీవితాన్ని గడు పుతూ వున్నాను.

ఒక రోజు ఉదయం భోజనాలైన తరువాత మా అత్తగారు ఎక్కడికో బయటకు వెళ్లింది. వారు నా మెళ్ళో గొలుసు ఇవ్వమన్నారు. ఎందు కన్నాను.

ఎందుకేమిటి తీసి ఇవ్వక—అన్నారు.

అంత చెప్పకూడదా ఏమిటి?—అన్నాను.

అప్పులున్నవి కావాలి.

అయితే మీ అమ్మను రానివ్వండి ఆమెకూడా ఇవ్వమంటే ఇస్తాను. లేకపోతే మొగుడి మెప్పు కోసం ఇచ్చిందంటుంది. నా కెందుకు వచ్చిన గొడవ ఇదంతా ?

మా అమ్మ ఏదన్నా అంటే నేనే తీసుకు వెళ్లానని చెప్తా. దీనిలో మా అమ్మ పెత్తనం ఏమున్నది ? నీవే మర్యాదగా ఇస్తావా లేక నన్ను చెయ్యి చేసుకోమంటావా—అని గదిమారు.

మీకు అప్పులుంటే నా గొలుసు కాకపోతే ఇంకేదైనా అమ్ముకోకూడదా ? మీరు ఇంటిఖర్చుల కోసం ఏమి వాడారని మీకు ఇన్ని అప్పులైనవి ? అనవసరంగా ఇంత బంగారం తీసుకు వెళ్లి నాశనం చేస్తానంటారేం ? నాకు మాత్రం చేతులమీదుగా ఇవ్వటానికి ప్రాణం ఒప్పటంలేదు...—అన్నాను.

బాగా ఎదురు మాట్లాడటం నేర్చుకున్నావే—అంటూ తలమీద ఒకదెబ్బ కొట్టి గొలుసు లాక్కు న్నారు. నాకళ్ళంబడి నీళ్లు జొటజొట కారినవి.

ఇంకా ఏడుస్తున్నావా సిగ్గులేక. ఇదివరకు అనేదానవుగా—ఎన్నిసార్లు కొడ్తారో కొట్టమని, ఇప్పుడేం జేస్తున్నా ఏడుస్తూ కూర్చోలా ? అంటూ చెప్పులు తొడుక్కు వెళ్లిపోయారు.

అప్పుడు పూర్తిగా తెలిసిపోయింది భార్య తప్పు చెయకపోయినా భర్తకు ఈ సంఘంలో కొట్టే అవకాశం ఉన్నదని. అంతకుముందు నాకు నేను ప్రత్యేకంగా చూచుకున్నాను కాని తరువాత మాత్రం అదొక అలవాటుగా అప్పుడప్పుడు భర్తల చేత దెబ్బలు తినే స్త్రీలల్లో నేను ఒకదాననైపోయా నుగదా ; అనుకున్నాను. నా జీవితం ఈవిధంగా అవుతుందని ఎన్నడు అనుకోలేదు. అన్ని విధాల అనుకూల దాంపత్యంలో ఉన్నా సంతోషసౌఖ్యాలు లేకపోవచ్చుగాని, అన్ని విధాల నాకంటే వెనక పడిఉన్న భర్తచేత అవమానింప బడటం మాత్రం అసంభవమనిపించేది. నేననుకున్నదంతా వ్యతిరేక మైనదీనాడు. ఇలా జరిగిన పక్షంలో చేయాలను కున్న పని అంతకంటే చేయలేకపోతున్నానే. భర్త గిలవనివ్వకపోతే పుట్టింటికి వెళ్లితే అక్కడ గౌరవ మర్యాదల సంగతి తెలిసే వున్నా మరీ నీచమైన బాధల నుంచి తప్పించుకోటానికైనా పుట్టినింటికి వెళ్ళవచ్చు. కాని సంఘం? సంఘంలో ప్రతి మనిషి తను పడు తున్న బాధలే అందరు పడాలని కోరుతూ వుండటం సహజం. తమకు ఆత్మాభిమానాన్ని కాపాడుకోటా నికి సాహసం లేకపోగా ఎవరైనా అలాంటి పనికి పూనుకున్నా వాళ్ళను తిప్పి తమ స్థానంలోకి తీసుకు వచ్చేదాకా నిద్రపోరు. అబ్బ. ఏమి సంఘం? నిజంగా ఈ సంఘాన్ని తలచుకుంటె చిత్రవధచేసే ఫాసిస్టును చూచినంత భయంగా ఉంటుంది.

భర్త ఇష్టమైనవాడైనా సరే కాకపోయినా సరే జీవితాన్ని సమర్పించవలసిందేనని శాసిస్తుందీ సంఘం. ఇంతకంటే ఘోరం ఏమున్నది? భర్తంటే ఏమాత్రం ఇష్టంలేనట్లు తెలిసినా స్త్రీని సంఘం నీచు రాలుగా చూస్తుంది. భర్త భార్యకు గానీ,భార్య భర్తకు గాని దేనికోసమో అదంతా సంఘాని కవసరం. ప్రతి స్త్రీకి ఒక భర్త కావాలి. భర్త చెప్పినదల్లా భార్య చేసి తీరాలి. అలా చేస్తున్నప్పటికీ భర్తకు ఏ ఇతర కారణాలవల్లనైనా సరే కోపంవచ్చి తిట్టినా కొట్టినా కూడా కిక్కురుమనకుండా భర్త పాదాలక్రింద ప్రాణాలు వదలవలసిందే. ఇది సంఘాదర్శం. ఈలాంటి సంఘాదర్శాలలో దారి తెన్ను కానలేక జీవితాన్ని విరమించుకుందామన్నా దానికీ సంఘమే నిందిస్తుంది. 'కాడు కాలుతూవుంటే కన్య ఎదురు చూస్తూ వుంటుందనీ, అదిపోతే దానంటివాళ్లు లక్ష తొంభైమంది వస్తారు, చచ్చి ఎవర్ని సాధించాలను కుందో అనీ, లోకం ఇష్టంవచ్చినట్లుగా ఆడిపోసు కుంటుంది. ఏమి చేయటమా అని ఆలోచిస్తూ ఉన్నాను.

పొద్దుగూకినా ఇంకా పనిలోపిలన్నా పెట్టక పోతే ఎప్పుడవుద్దమ్మ. మరీ బూటకంగా ఉందే —అని అంటున్నది తూర్పింట్లో మా అత్తగారు. 'గొలుసు అడుగుతుంది కాబోలు ఏమి చెప్పినా భగ వంతుడా అనుకుంటూ బయటకు వచ్చాను.

వాళ్ళమ్మాయి పేరంటానికి పోతందట కాసేపు నీ గొలుసు ఎరువివ్వవే—అన్నదామె. నేనేమీ మాట్లాడకుండా గోడకానుకుని అలాగే నిలబడ్డాను.

పాపం నుంచోనుంటే మాట్లాడవేమే. ఇంత

లోకే అరిగిపోద్దా ఏం ? అన్నది మళ్ళీ. లేదన్నాను గొంతు పెకలించుకుని.

లేదు ఏమైందీ—అన్నది ఆదుర్దాగా.

అప్పు లున్నవట కావాలని నేనివ్వనన్నా కూడా బలవంతాన తీసుకెళ్లారు.

ఎవరు వాడేనా తీసుకెళ్లింది. అయ్యొయ్యొ, ఇంకా నేనేం జేద్దునే, నీ కట్టా చేతులొచ్చినియ్యే వాడి కియ్యటానికి ? నేనింకా చావలేదుగా ? బతికే వుంటినిగా, నాతో మాత్రం అనగూడదటే, కొంప నిలువునా ముంచితివిగదే. అన్నదామె గుండెలు బాదుకుంటూ, కాసేపుండి తెప్పరించుకుని—ఎంత సేపైందే—అన్నది మళ్ళీ.

చాలసేపైం దన్నాను. 'చాలా సేపైందీ? చాలా సేపైందంటే చాలాసేపైంది. ఎంత ఒయ్యారంగా చెపుతున్నదో చూడు చాలసేపైందని. అవున్లే ఒయ్యారంగాక మీకేనుమ్మా. నీదేం పోయిందిలే నీ అబ్బగాడి సొమ్మైతేగా. నాకేం నాది కాదుగదా పోతే పోయిందనుకున్నావు. ఇంతే సాలు అడగనే అడిగాడు నా మొగుడేగదా అని ఎగిరి గంతేసి చ్చావు. ఇట్టాగన్నా వాడి మంచి సంపాదించుకుం దామని మాశావు. అదే కనక మీ అయ్య చేయించి నదైనట్లైతే ఊరంతా ఒక్క కొలిక్కి తీసుకురాక పోయావు. ఇక తిండురుగాన్లే ఉండండి' అంటూ 'ఇక నువ్వు పోమ్మా. మా యింట్లో గొలుసులుండే రోజులు రాలేదులేవంద ఎందుకు? ఒకొక మహాతల్లి పాదం పెట్టిన నక్షత్రం అటువంటిగి. ఈ మహాతల్లి మా యింట్లో ఎప్పుడైతే అడుగుపెట్టిందో అప్పట్నుంచీ అన్నీ వరసన ఊడ్చుకుపోవటమే. అప్పుడే అయిందీ మా పని. ఇంకెంత ఊడ్చుకుపోవాలో. ఒకొక గొడ్డొచ్చిన యాళ బిడ్డొచ్చిన యాళ అంటారిదే కావాల. నా కూతుళ్లు ఎక్కడ పాదం పెడితే.అక్కడల్లా బంగారం అయిపూరుకుంటుందంతే. ఇంత దరిద్రప మొకందీ, గొడ్డుబోతుదీ మా కెక్కడ దాపరించిందో మరి' అంటూ యీ వరసన ఒకటే పాట పాడటం మొదలు పెట్టిందామె. ఎంతసేపు మాచినా పూరుకుంటుం దేమో అంటే పూరుకోదు. నాకు విసుకు వచ్చి, చీవాటులు, తాగుళ్లు, తిరుగుళ్లు అన్నీ కప్పిపెట్టి, నా గొంతు కోసిందికాక పైగా నాకు బడెందుకు ఎప్పుడు అట్లా ఏడుస్తారు? అంటూ లోపలకు పోయి పండుకున్నాను.

ఆ రోజునుంచీ మరీ కక్ష పట్టిందామె నా మీద. ఇక ఆ ఇంట్లో నాకొకనిమిషం ఒకయుగంగా గడుస్తూ ఉన్నది. ఎన్నాళ్లు చూచినా వారు ఇంటికే రాలేదు. వారసలు నామీద అలా అనుమాన పడటా నికి కారణం ఆ తిరుగుడే ననుకోండి. అక్కడ ఒకా విడ ఉన్నది. తాను వారిని పూర్తిగా తన స్వాధీ నంలో వుంచుకోటానికని కల్లిబొల్లి ఖబుర్లన్నీ కల్పించివిపూన్నిక్కుస్తూ వున్నది నామీద విరక్తి కలిగించటానికని. ఇంటికి వస్తే తల్లి కూడా అలాగే నాయె. అసలు మనిషిలో స్వయంగా ఆలోచించుకో గలిగిన శక్తి లేకపోవటం వల్లనే ఇలాంటి ప్రమాదా లకు గురి కావలసివస్తూ వున్నది. అక్కడకు వెళ్లి వచ్చారంటే సరి ఏదో ఒక తగాదా తీసుకురావల సిందే. అక్కడకు వెళ్లి వచ్చినప్పుడల్లా ఏదో ఒక తగాదా జరుగుతూ వుందని ఎక్కడికి వెళ్లి వస్తు న్నా సరే, ఆచెప్పుల మోత వినపడితే చాలా భయంగా ఉండేది. ఒకొకసారి ఆ చెప్పుల అడుగులు నా హృద యంలోనే పడుతున్నంత బాధగా ఉండేది. వీరు వస్తారంటే భయంగానే వున్నప్పటికీ ఇంట్లో పోరు మరీ ఎక్కువై పోవటాన వారు వస్తేనైనా కొంత పోరు తగ్గిపోతుందేమోనని ఎదురు చూస్తూ వుంటే ఎంత కాలానికీ రానేలేదు

ఏమీ తోచక మళ్ళీ పుస్తకం చదువు కుంటున్నాను. ప్రక్కనే ఇంకొక పుస్తకం వున్నది. కాసేపటికి పొరుగింటి అమ్మాయి వచ్చి నా ప్రక్కనే కూర్చున్నది. నేను చదువు కుంటున్న పుస్తకం మూసేసి ఏమిటమ్మాయి అన్నాను. ఏమీలేదు వూరికే వచ్చాను. మరే, ఇప్పుడే మేము కాఫీ రాస్తున్నాంగా? అన్నది. 'ఊఁ సరేలే' అన్నాను. మళ్ళీ నేను చదువుకుంటు న్నాను. ఆ అమ్మాయి కొంచెం సేపుండి లేచిపోయి నట్లుంది. నేను మరల రెండవ పుస్తకం తీసి చదువు కుంటున్నాను. అంతలో చెప్పులు కూడా చప్పుడు చెయ్యకుండానే ఒక్కసారి లోపలకు వచ్చారు వారు. నేను ఉలిక్కిపడి లేచి నిలబడ్డాను. నా చేతిలో పుస్తకం తీసుకున్నారు. 'నీ కెన్నిసార్లు చెప్పాల? బుద్ధిలేదు? చదివిన పుస్తకమే ఎన్నిసార్లు చదువుతావు? కనీసం వాడి పుస్తకమైనా మూడ కుండా ఉండలేవన్న మాట. నాతో నీవు ఎన్ని మాయమాటలు చెప్పావు? ఇక నతనితో మాట్లాడ ననీ, మా వూరికి కూడా పోననీ చెప్పలా? నన్నవత లకు పోనిచ్చి మళ్ళీ ఇదేంపనీ? అసలు నీ మనసులో లేకుండా వుండాల గాని నిర్బంధంవల్ల నీ అలవాట్లను

ఎందాకా మార్చుకో గలవులే—అన్నారు ఒక్కసక్కన.

చదువుకోడాని కింకేమీ పుస్తకాలు లేకపోవటాన, మాట్లాడటానికి కూడా ఎవ్వరు లేకపోటాన చదివిన పుస్తకమే చదువుకున్నాను కాని అంతకంటే ఏమీ లేదు. అంత మంచి ఆయనమీద కూడా ఎందుకు వేస్తారు నిందలు—అన్నాను సహించలేక.

అవును ఇష్టమైతే సరి అల్లాగే ఉంటుంది. వాడు అంత మంచివాడేం ఈ రోజునుంచీ నీ వసలు నా కళ్ళకు కనపడ్డావంటే ప్రాణం తీస్తా. నీ మనస్సంతా ఎవడిమీదనో పెట్టుకుని నాతో బాగుంటున్నట్లుగా నటించుదా మనుకుంటున్నావు కాబోలు. అవన్నీ నాదగ్గర సాగవు. పో ముందు—అంటూ బయటకు నెట్టారు. నే నింకోగదిలోకి పోయి వెక్కి వెక్కి ఏడుస్తున్నాను.

ఏయ్ ఇట్రా...అన్నారు మళ్ళీ గద్దిస్తూ. నేను వెళ్ళకపోయినా వారైనా వచ్చేటట్లున్నారని నేనే మళ్ళీ ఆ గదిలోకి వెళ్ళాను, పెద్దపులి బోనులోకి పోతున్న మేకపిల్లలాగా.

[సశేషం]



చిత్రకారుడు: శ్రీ బంకిం సర్కార్. శాంతినికేతనం

# కలగూరగంప

## నన్నెచోడ కవికాలము—ఒక మనవి

నన్నెచోడకవి నన్నయకంటె ప్రాచీనుడని శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారును, కీ. శే. నడకుదుటి వీరరాజు పంతులుగారును చాల కాలము క్రిందటనే చెప్పియుండిరి. తరువాతి పరిశోధకులు ఈ కవిరాజ శిఖామణి నన్నయకు తరువాతి వాడనియే నిశ్చయించుచు వచ్చిరి.

ఇటీవల శ్రీ దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు తాను పది సంవత్సరముల కాలములో జేసిన పరిశోధనకు ఫలముగా 'నన్నెచోడకవి చరిత్ర' అను పేర విపుల విమర్శ గ్రంథము వ్రాసి నన్నెచోడుడు నన్నయకు గొంచెము పూర్వుడును, సమకాలికుడును కావలయునని నిరూపించిరి. దానిలో వారు పెదచెరుకూరు శాసనమును, నన్నూరుపాడు శాసనమును, కుమార సంభవాంతర్గతములగు కొన్ని పద్యస్థ కాలములను ఆధారముగగొని కవిరాజ శిఖామణి నన్నెచోడుడు క్రీ. శ. 1028-58 ప్రాంతపువాడని సిద్ధాంతీకరించిరి.

అంతట శ్రీ నేలటూరు వెంకటరమణయ్యగారు 1951 సెప్టెంబరు భారతిలో 'నన్నెచోడకవి కాలము—ఒక సూచన' అను వ్యాసమున నన్నెచోడుడు నన్నయకంటె ప్రాచీనుడను తన నమ్మకమును దృఢపఱచు కొన్ని విషయములు చెప్పి నన్నెచోడుడు క్రీ. శ. 940—70 ప్రాంతపు వాడని చెప్పుచున్నారు. ఆ విషయములందు నాకు బొడమిన సందేహముల నిట తెలుపుకొనుచున్నాను.

### బద్దెన:

బద్దెన నీతిశాస్త్ర ముక్తావళిభాష, దత్తమండల భాషయనియు, కమ్మనాటి తెనుగుభాష కాదనియు శ్రీ వెంకటరమణయ్యగారు సూచించి యున్నారు. కమ్మనాటి బొప్పూడి శాసనమందలి 'జటాచోడ' వంశములో 'నన్నిచోడ [సు] ధీః' అను దాత యొకడున్నట్లు కనిపించుచున్నది. ఆ శాసనము భూదాన పాడు దానమును దెలుపుచున్నది. ఈ 'నన్నిచోడ సుధీ' పండిత కవి మాత్రమే గాక దాత, రాజుగా గూడ నున్నాడు. 'శాకే—నిధి దివి వ్యోమ శశినా సమ్మితే' అనగా. ఇది శా: శ. 1009 (క్రీ. శ. 1087) కాలము అనుచున్నది. కాని ఈ నన్నచోడ సుధీ తండ్రి పేరు శాసనములో స్పష్టముగా లేదు. బల్లరాజని చెప్పుట కవకాశము లేదు. పైగా ఈ 'సుధీ' కమ్మనాటి నివాసి. కనుక ఇతడు కుమార సంభవ కర్తయగు పాకనాటి నన్నెచోడకవి కాడు. ఇతడు నన్నెచోడనరేంద్రుడను బద్దెనకవియగునేమో తెలియదు. నీతి పద్యములు రచించిన బద్దెనకు 'నన్నెచోడ నరేంద్రు'డను నామాంతరమున్నట్లు బద్దెన నీతి పద్యమకుటము వలన దెలియుచున్నది. కాన శతక కర్త బద్దె భూపతియు, శాసన దాత నన్నెచోడ సుధియు ఒక్కరే యనుటకు వీలున్నదో లేదో పరిశీలింపవలసియున్నది.

### మల్ల ప్రభువు

నన్నెచోడుడు తన కుమార సంభవములో
'...జంగము మల్లయ పేర సప్త సం
తానము లొప్పనిల్పుదు ముదంబున
దత్ప్రభు నాజ్ఞ పెంపునన్.'

*　　*　　*

"గురువున కిష్ట దైవమునకున్ బతికిన్
    గృతి జెప్పి పుణ్యమున్
పరమును దేజమున్ బడయ
    వచ్చుజగంబుల నిశ్చయంబు మ
ద్గురువును నిష్టదైవమును
    గూర్చునిజేశుడు దానగాకుగా
కొరునకు నిట్లుసేయుదునె
    యొక్కట లాభము లెన్నియన్నియున్."

అనియు జెప్పియున్నాడు. ఇందలి గురువు, ఇష్టదైవము, నిజేశుడు అను పదముల మూలమున 'మల్లయ్య' అను గురునామ సామ్యమును గ్రహించి శబ్దశక్తి ధ్వని మూలమున గురువు జంగమ మల్లయ్య, ఇష్టదైవము శ్రీశైల మల్లయ్య, నిజేశుడు త్రైలోక్య మల్లయ్య అని శ్రీ రెడ్డిగారు నిరూపించిరి. పై పద్యములో 'నిజేశ' విషయమున కనుకూలముగ సాయ మిచ్చు 'సోమ మనుష్యరూప...మల్లికార్జునున్' అను సోమేశ్వర త్రైలోక్య మల్లయను శ్రీ రెడ్డిగారు చూపిరి. దీనివలన నన్నెచోడుని కాలములో నున్న వాడు సోమేశ్వర త్రైలోక్య మల్లయ్య అని యే తలంపవలయును. కవి తాను తొలుత జేసిన ప్రతిజ్ఞకు అనుకూలముగ గూఢ వస్తుమయ కావ్య నిర్మాణమందు కృతకృత్యు డైనట్లు శ్రీ రెడ్డిగారు నిరూపించిరి. గూఢ వస్తుధ్వని చూపుట ప్రాచీనాలంకారక సమ్మతము.

శ్రీ వెంకటరమణయ్యగారు తన వ్యాసములో 'త్రైలోక్యమల్ల' పదము బిరుద నామముగాని వ్యక్తి నామము కాదనియు, 'త్రైలోక్యమల్ల' బిరుదునుబట్టి 'సోమేశ్వర' వ్యక్తిని ఊహించుటకు వీలులేదనియు, కళ్యాణి చాళుక్యులకు పాకనాటి తెలుగు చోళులు సామంతులు కారనియు, వైదుంబ వంశజుడగు భువన త్రినేత్రుడనువాడు నన్నెచోడుని సంహరించి క్రీ. శ. 972 లో పాకనాటిని ఆక్రమించి యుండు ననియు, నన్నెచోడుడు ధ్వనింప జేసిన 'నిజేశుడు పూర్వ చాళుక్యరాజగు ఇమ్మడి యుద్ధమల్లుడనియు, అందువలన నన్నెచోడుడు క్రీ. శ. 940—70 ప్రాంతములోనుండి యుండవలెననియు జెప్పుచున్నారు.

అయితే వీరు 1951 జనవరి భారతిలో ప్రకటించిన 'రాజరాజ నరేంద్రు'డను వ్యాసములో "క్రీ. శ. 1044 నన్నో ఆ మరుసటి సంవత్సరముననో కళ్యాణ చాళుక్య చక్రవర్తి త్రైలోక్య మల్లాహవమల్ల బిరుదాంకితుడగు మొదటి సోమేశ్వరుడు వేంగీరాజ్యమును జయించెను. అది మొదలు క్రీ. శ. 1060 పర్యంతము వేంగీ మీద అతని అధికారము చెల్లినది. రాజ రాజ నరేంద్రుడు కళ్యాణి చాళుక్యుల కరిగా పాయెను' అని నిర్ణయించియున్నారు. అట్లనుచో పాకనాటిమీద కళ్యాణి చాళుక్యులకు ఎన్నడును అధిపత్యము లేదనుట శ్రీ వెంకట రమణయ్యగారు చెప్పినట్లు సత్యముగాదు. ఇందు స్వ వచన వ్యాఘాతము కలదు. ఇంతియేగాక ఆకాలమున (క్రీ. శ. 1048-57) పాకనాటికి చక్రవర్తి యెవరో అను విషయమును శ్రీ వెంకట రమణయ్యగారు శాసనాధారముతో నిరూపింపలేదు.

'ఉదయాద్రి ప్రభు శృంగం బెక్కినట్లు' అనగా ఉదయగిరి ప్రభువుయొక్క ప్రభుత్వము అనగా పాకనాటి ప్రభుత్వమును స్వీకరించినట్లు గ్రంథాధారముతో శ్రీ రెడ్డిగారు చెప్పుచున్నారు. '(ద్వాదశార్ధార్థనయను) ...... అయ్యుదయాఽగము' అను గీతపద్యమందలి 'పాకనాటి ఇరువదియొక్క వేయి' ఇత్యాది దేశకాలములను శ్రీ రెడ్డిగారు లెక్కతో నిరూపించి ఉదయగిరి పాకనాటి లోనిదని నిరూపించిరి. ఇంతేగాక 'వస్తు కవిత—ఉదయ పర్వత శిఖరాగ్రా రోహణ వర్ణన' అను కవి సూచనను గూడ చేర్కొనిరి. పెదచెరుకూరు శాసన దాతయగు 'కందుకూరి పురవరేశ్వర ......పాకనాంటి విషయ ఏక వింశతి సహస్ర గ్రామావనీ వల్లభ...మల్లిదేవ చోడ' అనునాతని కందుకూరు పాకనాటి రాజ్యమునకును, ఈ మల్లిదేవ చోడుని తాత ముత్తాతయగు నన్నెచోడ కవియొక్క ఉదయగిరి పాకనాటి రాజ్యమునకును దగ్గఱ సంబంధమున్నదిగాని, కడపజిల్లాలోని పడమటి పాకనాటికి, కందుకూరి తూర్పు పాకనాటి రాజ్యమునకు సంబంధముండియుండదని స్పష్టమగుచున్నది.

పాకనాటి నన్నెచోడుడు శ్రీ వెంకటరమణయ్యగారు చెప్పినట్లు కళ్యాణి చాళుక్యులకు సామంతుడు కాడని అంగీకరించినను ఈ క్రింది విషయము మరువరాదు. కంచి అరవ చోడులకు తూర్పు తెలుగు చాళుక్యులకు మధ్య నన్నెచోడుని పాకనాటి రాజ్య

మున్నది. పశ్చిమమున కళ్యాణి చాళుక్యుల కర్ణాటక రాజ్యమున్నది. అరవ చోడులకును కళ్యాణి చాళుక్యులకునుమధ్య కొన్ని యుద్ధములు జరిగినవి. ఆ యుద్ధములలో తూర్పు చాళుక్యులు తమబంధువులగు కంచి అరవ చోడులకు సాయము చేయకుండుటకై కళ్యాణి చాళుక్యులు తెలుగు చోడులకును, తూర్పు చాళుక్యులకును మధ్య యుద్ధములు కల్పించి తంత్రములు పన్నియుండ వచ్చును. అట్టి సందర్భములలో రాజ్యతంత్రముల ప్రకారము నన్నెచోడుడు ప్రధానముగ కళ్యాణి చాళుక్యులకు సామంతుడు కాక పోవచ్చును. కాని కళ్యాణి త్రైలోక్య మల్ల సోమేశ్వరుడు ప్రబలుడు కాబట్టి వాని మూలమున తనకు లాభము రావచ్చునని తలంచి అతనికి ప్రతికూలము కాకుండ అనుకూలముగ నుండుటకు యోచించి అతని శక్తి సామర్థ్యములు తనకు తోడ్పాటుగా నుండునని తలంచి అతనిని తనకు 'కూర్చుని జేసు'నిగ కవి చెప్పికొనెనని చెప్పుటకు అవకాశము లేకపోలేదు. అన్నిటికి శాసన ప్రమాణములు చూపినప్పుడే ఈ విషయమునకు శాసన ప్రమాణము లేదన వీలుండును.

ఒక గ్రంథములోని ఒక విషయమును ఆధారముగఁగొని ఒకనిర్ణయము చేయుట కుపక్రమించితి మేని, అందులకు ఉపోద్బలకములును, గ్రంథస్థములును, శాసనానుకూలములును అగు నితర విషయములను గూడ గమనింప వలయును గాని ఏకదేశ మంత్రము గ్రహించి ఇతర ప్రధాన ప్రమాణములను త్రోసి రాజనుట యుక్తము కాదు. ఏలయన కావ్యమందలి 'జంగమ మల్లయి పేర సప్త సంతానము లొప్ప సల్పుదుముదంబున దత్ప్రభు నాజ్ఞపెంపునన్' అను ప్రభువు నాధారముగాఁగొని గురువు ఇష్టదైవము, నిజేశుడు వీరి మువ్వురికి కాలనామ సామ్యము స్వీకరించి నిజేశుడుగనుండు త్రైలోక్య మల్ల సోమేశ్వరుడే తన ప్రభువని కవి చెప్పికొనుచుండగ అతడు కాడు. 'ఇమ్మడి యుద్ధమల్లు'డని గ్రంథేతర రాధారముతో వేఱొకనిని గ్రహించుటలో ఔచిత్యము లేదు. యుద్ధమల్లుండు అను నామముగూడ బిరుదముగ జెప్పుచు, ఇమ్మడి యుద్ధమల్లుని తాతకు 'మల్లపరాజు' అను పేరున్నట్లు బెజవాడ శాసనములో కలదని చెప్పుచు, అటులే మనుమడగు రెండవ (ఇమ్మడి) యుద్ధమల్లునికిగూడ 'మల్లణ్ణు' అను పేరుగలదని శ్రీ వెంకట రమణయ్యగా రూహించుచున్నారు. కాని బెజవాడ శాసనమునందీ విరోధము గలదు.

'స్వస్తి నృపాఙ్కుశాత్యన్తవత్సల సత్యత్రినేత్ర
విస్తర శ్రీ యుద్ధమల్లు ణ్డనవద్యవిఖ్యాత కీర్త్తిన్
ప్రస్తుత రాజాశ్రయుణ్డు త్రిభువనాభరణుణ్డు సకల
వస్తుసమేతుణ్డు రాజసల్కి భూవల్లభుణ్డర్థిన్.'

ఇందు ఇమ్మడి యుద్ధమల్లునికి 'రాజసల్కి' అను అసలు పేరున్నట్లు స్పష్టమగుచున్నది. ఇది 'భీమసల్కి' వంటి వ్యక్తి నామము. కాగా శ్రీ వెంకటరమణయ్యగారన్నట్లు రెండవ యుద్ధమల్లునికి 'మల్లణ్ణు' అను అసలు పేరు లేదని చెప్పక తప్పదు. కాబట్టి ఈ రాజసల్కి కుమార సంభవ కృతిపతి కాదు. ఇక్కడ కూడ రెడ్డిగారు చెప్పినట్లు ('యుద్ధ బిరుదు వదలిన) 'మల్ల' శబ్దమే శ్రీ వెంకటరమణయ్యగారికి తారకమగుచున్నది. ఎట్లయినను 'రాజసల్కి' అను అసలు పేరుండుటవల్ల 'మల్లణ్ణు' అను బిరుదు పేరు యుద్ధమల్లుండు అను బిరుదము నుండి జనించి దనుటకు వీలులేక పోలేదు. ఇట్టిదే త్రైలోక్య మల్ల బిరుదమునుండి పుట్టిన మల్లయ్య పేరు కూడ. శ్లేషలో 'మల్ల' శబ్దము సమయానుకూలముగ 'జెట్టి—మల్లయ్య' అను రెండర్థములను సాధించుననుట నిరాక్షేపము. కావున శ్రీ రెడ్డిగారి వాదమే గ్రంథాధార సమ్మతము. లేనిచో చారిత్రికుల వాదమునకు కూడ ఈ 'మల్ల' బిరుద నామ దోషము సంక్రమించుచున్నది.

మఱియు నన్నెచోడుడు తన గురువును కథానాయకునిగా ప్రవేశపెట్టి వర్ణించిన ఘట్టములో 'త్రైలోక్య పూజ్యున్' అని యొక చోటను, 'సోమమనుష్యరూప...—మల్లికార్జునున్' అని మఱియొక చోటను పేర్కొనియున్నాడు. ఇంతియేగాక నాగబంధమందలి 'సోమదేవ విస్తరితరమా దయా రస యుతా' అను సమాసములో తన గురువు సోమదేవుని దయా పాత్రుడుగా నున్నట్లు కవి చెప్పికొని యున్నాడు. ఇయ్యది శివస్తోత్ర పరమైనను శబ్దశక్తి ధ్వనిచేత త్రైలోక్య మల్ల సోమేశ్వర ప్రశంస కూడనగుచున్నది. శ్రీశైల మల్లయ్యను గ్రంథాధారముచే నిరూపించినట్లు తత్ప్రభువు త్రైలోక్య మల్లయ్యను గూడ గ్రంథస్థాధారముచే నిరూపింప వలసి యున్నది. శ్రీ వెంకటరమణయ్యగారట్లు చేయక గ్రంథేతర రాధారములతో కాలాంతర

మును వ్యక్త్యంతరమును సాధింపబూనుట సమంజసముగా గాని, యుక్తాయుక్తముగా గాని దోపదు. ఖాజీపేట శాసనములో 'త్రైలోక్య మల్లకుమారీశాల్ శాసనబద్ధం, అను బిరుదనామమే సోమేశ్వరవ్యక్తి నామముగా వాడబడి యున్నది.

## బల్లయ.

శ్రీ వెంకట రమణయ్యగారు పేర్కొన్నయంబావె గ్రామ శాసన దాతయగు 'పాకనాటి బల్లయచోళ మహారా' జే ఈ కమ్మనాటి బొప్పడి శాసనమందలి పాకనాటి బల్లె భూపతియైనచో వీనికి నన్నెచోడు డని కొడుకున్నట్లు ఊహించుటకు వీలులేదు. ఇచ్చట శాసన భాగము శిథిలమైయున్నది. ఈ బల్లయచోడ మహారాజునకు నన్నెచోడుడను కొడుకున్నట్లు శ్రీ వెంకటరమణయ్యగారు ప్రమాణము చూపలేదు. బల్లయనామము మాత్రము గ్రహించి అతనికి 'నన్నెచోడు' డని కొడుకుండునని—అతడే కుమారసంభవ కావ్యకర్త, అతడే పాకనాటి కధిపతి, అతడే వైదుంబ త్రిభువన నేత్రునిచే జంపబడినవాడు అని చెప్పుట ఊహాతీతముగా నున్నది.

ఈ జటా చోడ వంశము వారుకూడ ఒరయూరి పురాధీశ్వరులుగా నుండి దశ వర్ష కాలము నుండి పొత్తపి పాకనాటి కధీశ్వరులైనట్లు, కమ్మనాటి నివాసులైనట్లు కమ్మనాటి బొప్పడి శాసన వాక్యములు తెలుపుచున్నవి. ఇట్లే క్రీ. శ. 902 ప్రాంతమున కృష్ణా తీరమున బీచుపల్లి శాసనములో కూడ నాక చోడ బల్లి దేవుడున్నాడు. అతనికి గూడ నన్నెచోడుడని కుమారుడుండవలయునని శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారును, కీ. శే. నిడదవోలు వీరరాజు గారును ఊహించియున్నారు. అట్లే ఇది ఊహకు జెందినదే గాని సోపపత్తికము కాదు. గ్రంథాధార చరిత్రతో సమన్వయ పడు చోడబల్లి కొడుకు నన్నిచోడుడను పెద చెరుకూరు శాసన చరిత్రను నమ్మకపోవుట చిత్రముగా నున్నది.

## శైవ మతము

తెలంగాణా యందలి వేములవాడ శాసనములో 'త్రిభువన మల్ల సామన్త చూడామణి శ్రీ మదరి కేసరి' కాలమున (సాక్షి) మల్లికార్జున భట్టారకుడు ఒకడు కలడు గాని ఇతడు శ్రీ వెంకటరమణయ్యగారు చెప్పినట్లు కాలాముఖ శైవ మతమునకు జెందినవాడని చెప్పుటకు శాసనాధారము కనబడలేదు. ఇందలి 'మల్లికార్జున, సుక్తిలింగి, విద్యాధరాది భట్టార కాలసాక్షిణః' అను పాఠము గమనింపదగియున్నది. ఇందలి భట్టారకాః అను బహువచనముపై ముగ్గురి వ్యాఖ్యల కన్వయించు చున్నది. కావున ఈ భట్టారకులు కాలాముఖులన వీలులేదు. మల్లికార్జునుడు, సుక్తిలింగి, విద్యాధరుడు మొదలగునవి ప్రత్యేక నామములు.

## తెంకణము

'తెంకణధారిణి' పెన్న పరిసరము లోనిదని శ్రీ వెంకటరమణయ్యగారు చెప్పుచున్నారు. అనగా తెంకణ దేశమునది అనంతపుర మండలమందలి తాడిపత్రి సమీపమునుండి పూర్వ వాహినియై ప్రవహించు పెన్నానదీతట ప్రాంతమని చెప్పుట కవకాశమున్నను తెలంగాణా ప్రాంతమందలి అలంపుర శాసనములో "హల బాలియ తేంకణాదిసయ [స] ళలిమత్తురు" ... "మరాజను డొంక బెవినిం తెంకలు కొట్టుమత్తురు॥"

అను తేంకణభూమి వాడబడియున్నది. దీనిని బట్టి తెలంగాణా ప్రాంతములో గూడ తెంకణ దేశ భాగమున్నట్లు తెలియుచున్నది. ఇట్లే కళింగ దేశ ప్రాంతములో 'తేంకణలు' సంస్థానమున్నది. కావున ఇవి యన్నియు ఒకప్పుడు తెలుగు జాతికి జెందిన పూర్వదేశములై ఆ పూర్వ నామములతో వ్యవహరింపబడినట్లు తలంప వచ్చును. అదియును గాక 'తెంక (ణ) శబ్దమునుండియే క్రమముగా 'తెఙ్క'—'తెఙ్గు', 'తెనుగు—తెనుగు' దేశ భాషా పదము పుట్టినదా అను జిజ్ఞాస కలుగుచున్నది.

## ముగింపు

పరిశీలింపగా శ్రీ రెడ్డిగారు వ్రాసిన నన్నెచోడకవి చరిత్రలో అన్ని విధములైన ఉపపత్తులచే ఈ కవి క్రీ. శ. 1028—58 ప్రాంతములో నుండెనని నిరూపితమగుచున్నది. గర్భ కవిత్వము వ్రాయునలవాటు నన్నెచోడునికి గలదు.

'అసిధార బొల్పెస గెజ—యకాంత కాంతరవ,
దవదాత ఖడ్గలతజ—యచైత్ర సంపద.'

'కరిశిరమాడు' అను చంపక మంజరి నీ జంపె రగడ—ఖడ్గ బంధము.

ఇది 'జయచంద్ర చంద్రుల (విక్రమశక 1111 రేఖల) లో ధ్వనించుచున్న శుద్ధపక్షమును, తీగవంశ పత్తి (3-కృత్తిక) నక్షత్రమును, జయసంవత్సర మంజరి చైత్రమాస విస్తారమును (జయజయ ధ్వని) 3—జయతిథియు, 3—జయ (మంగళ) వారమును ఖడ్గధారాబంధమందు స్థిరముగా అతిశయించెను' అను విక్రమశక కాలమునకు సరియగు క్రీ. శ 15-3-1054 తేదియగుచున్నది. దీనిలో స్వల్ప కాలవ్యత్యాసము కూడ లేదు. ఇట్లు యుక్తి కవి 'దైవజ్ఞునట్లు' ప్రతిజ్ఞ నిర్వహణము తుల్యతారకముగా, తిరముగా జేసి చూపినప్పుడు ఈ విషయావళిని సంపూర్ణముగ విస్మరించి గ్రంథమందలి 'మల్ల—ప్రభు' కాలమును రెండవ యుద్ధమల్లుని కాలముతో నిర్ణయించుటకు వీలులేదు, ఈ గర్భకవిత్వ పద్యకాలముకూడ యుద్ధమల్లుని కాలముతో సమన్వయము చేయగలిగినప్పుడు శ్రీ వెంకటరమణయ్యగారివాదములోని సత్యము గోచరించును. అంతవఱకు తుల్యతిథి వార నక్షత్రాది విషయములన్నియు సమన్వయ పఱచు గర్భకవి నన్నెచోడుని యొక్క ఖడ్గబంధ రగడ కాలమును త్రోసివేయుటకు వీలులేదు.

ఇది గాక ఈ కవిరాజ శిఖామణి ప్రాచీన ప్రయోగ భాషా చరిత్ర కాలమును శ్రీ వెంకటరమణయ్యగారు సకారణముగ జూపనిదే ఈ గ్రంథ ప్రాచీనత క్రీ. శ. పదియవ శతాబ్ద ప్రాంతపుదనుటకు వీలులేదు. శ్రీ రెడ్డి గారు చెప్పినట్లు కవి గూఢ మార్గము నాశ్రయించి ధ్వనిగా, గూఢముగా, వక్రోక్తిగా, యుక్తిగా తన కాలమును ఆయా చోటుల నిరూపించెనని తలంపవలయును. ఆ విషయము లన్నియు నిట నుల్లేఖించుట ప్రసక్తము కాదు

శ్రీ పిన్నంరాజు వెంకట సుబ్రహ్మణ్యశర్మ.

---

# మన ప్రాచీన వాద్య యంత్రములు

వాద్య విద్యా వేత్తలగు మన ప్రాచీనులు వాద్య యంత్రములను నాల్గు భాగములుగా విభజించియున్నారు. 1, తతము అనగా తంత్రీ గతము 2, ఆనద్ధము అనగా చర్మ బద్ధము 3, సుషిరము అనగా రంధ్రము గలది 4, ఘనము అనగా లోహ నిర్మితము.

తంత్రులు గల వాద్య యంత్రమును సాధారణముగ వీణయందురు. సంగీత దామోదరమున దీనికి 29 రకముల భేదములు విస్తృత వివరణము గలదు. ఆ గ్రంథములో చెప్పిన భేదములు వాని పేరులు నివి. అలావణి, బ్రహ్మవీణ, కిన్నరి, లఘుకిన్నరి, విపంచి వల్లకి, జ్యేష్ఠ, చిత్ర, ఘోషవతి, జయ, హస్తిక, కునజిక, కూర్మి, సారంగి, పరివాదిని, త్రిశవి, శతచంద్రి, నకులోష్ఠి, ఢంసవి, ఔదంబరి, పినాకి, నిశ్శంక, శుష్కల, గదావారణహస్త, రుద్ర, స్వరమణ్మల, కపిలాస, మధుస్యంది, ఘోణ.

నారద కృత సంగీతమకరందమున 19 విధములైన వీణలుల్లేఖించబడి యుండెను. సారంగదేవుని అభిప్రాయములో వీణలు 11 విధములేయని తెలియుచున్నది.

వీణాదండము బోలు కఱ్ఱవలనను, తీగె, నరములతో అల్లిన త్రాడు, జనుము, లేక నూలు మొదలైన ఉపకరణములతో తయారు చేయబడును. వీణను నిర్మించుటకింకను ప్రధానోపకరణము "అలాబు" అనునది కలదు. అలావణి వీణ నిర్మాణ పద్ధతి సంగీత దామోదరమున నిట్లు వ్రాయబడియున్నది.

"కనిష్ఠికా పరిణద్ధి మధ్యచ్ఛిద్రేణ సంయుతః
దశయష్టిమితో దండః ఖాదరో వైణవోఽథవా॥

అధః కరభవా మూర్ధ్వే ఛత్రవల్యాభి శోభితః
నవాంగులాద ధశ్ఛిద్రోపరి చంద్రార్ధసన్నిభాం
నివేశ్య చుంబికాం భద్రాలాబు ఖండం నివేశయేత్
ద్వాదశాంగుల విస్తారం దృఢపక్వం మనోహరం.॥

తుంబికా వేధ మధ్యేన దండచ్ఛిద్రేతు నిర్మితాం
అలాబు మధ్యగాం డోరీం కృత్వా స్వల్పాంతు కాష్ఠికాం॥

తథా సంవేష్ట్య తన్మధ్యే కాష్ఠికాం భ్రామయేత్తతః
యయా స్యాన్నిశ్చలాలా బుర్బంధశ్చ కరభోపరి॥

పంచాంగులిషు సంత్యాజ్యాలాబుం స్వల్పాంచ బంధయేత్
కేశాంత నిర్మితా పట్టమయీ సూత్రకృతాథవా॥

సమా సూక్ష్మ దృఢా తత్ర తంత్రీ జేయా విచక్షణైః
ఏ తల్లక్షణ సంయోగా దలావణీ ప్రకీర్తితా॥

## 2. ఆనద్ధములు.

చర్మచ్ఛాదిత వాద్యమును బూర్వ కాలమున ఆనద్ధమని అవనద్ధమనియు జెప్పెడి వారు. విభిన్న సంగీత గ్రంథములలో దీనికెన్నియో భేదములు జెప్పబడెను. ఆనద్ధ వాద్య యంత్రములలో గొన్నింటి పేరులివి—మురజము, పటహము, ఢక్కా, విశ్వకము, దర్పవాద్యము, ఘనము, పణవము, సరుహా,

లావము, జాహవము, త్రివళి, కరటము, కమఠము, గుల్లి, ఢేరి, కుడుక్క, హుడుక్క, ఝనసమురళి, ఢుక్కళి, దౌండి, శానము, డమరు, ఢముకి, మడ్డు, కుండలి, స్తుంగము, దుందుభి, అంకము, మర్దళము, అణీకస్థము. ఇందు దుందుభి భేరి మొదలగునవి రణ వాద్యములు. సంగీత శాస్త్రకారుడైన భరతుని అభిప్రాయములో మర్దల మృదంగమే సర్వోత్కృష్ట వాద్యము. మర్దల నిర్మాణ విషయమున గూడ శాస్త్రములో వ్రాయబడెను. దీని మధ్య భాగము స్థూలమై ముఖములు రెండును చర్మాచ్ఛాదితములై యుండును. ఇది ఒకటిన్నర మూరల పొడుగు గలదై ఎడమ ముఖ వ్యాసము 12—13 అంగుళములలోను కుడివైపు ముఖమున ఒకటి లేక అర అంగుళము తక్కువగా ఉండును. రక్త చందన దారువుతో నిర్మితమైన మర్దళమునుండి గంభీర ధ్వని వెలువడును. భస్మము, ఎర్రమన్ను, మృత్తిక, అన్నము గుజ్జు జిగురు మొదలగునవి మిశ్రణచే తయారైన ప్రలేపమును దక్షిణ ముఖమున లేపనముచేసి ఎడమ ముఖమున పూరిక యొసగుదురు. అన్ని విధములైన వాద్య యంత్రములు మర్దలము, మృదంగముతో కూడి యున్నప్పుడే రక్తి కట్టును.

## 3. సుషిరములు.

పిల్లన గ్రోవి మొదలగు రంధ్ర యుక్త వాద్యములను సుషిరములని యందురు. సంగీత విద్వాంసులనేక విధ సుషిరములను వర్ణించియున్నారు. అందులో—

వంశి, ప్యారి, మురళి, మాగురి, తిత్తిరి, భృంగ కాహళము, కాహళము, కక్క, భృంగిక, స్వరనాభి, భృంగము, కృపాలిక అనునవి కొన్ని విధములు.

ఈ వాద్య యంత్రములు వేణువు. బోలు కలిగిన కఱ్ఱ, రక్త చందనము, శ్వేత చందనము, హస్తి దంతము, స్వర్ణ రౌప్య తామ్రలోహ స్ఫటికాదులచే తయారు చేయబడును. వంశి, వర్తులమై సరళమై పర్వ దోష శూన్యమై యుండవలెను. దీని గర్భ రంధ్రము కనిష్ఠికాంగుళితో తుల్యమై యుండును. దీని అగ్ర భాగమునుండి రెండంగుళముల దూరమున నున్న ఫూత్కార రంధ్రమునుండి 5 అంగుళముల దూరమున 7 ఛిద్రములు ప్రతి యొక రంధ్రము మధ్య రెండంగుళముల వ్యవధానముండుటయు నావశ్యకము. ఈ ఏడు రంధ్రములును చిన్న చిన్నవై యుండును.

మాతంగముని మహానంద, నంద, విజయ, జయాది వేణువులు నాల్గును శ్రేష్ఠమని చెప్పినాడు. వీనిని తయారు చేయు విధము పైన జెప్పిన దానికంటె కొంచెము భిన్నముగా నుండును.

వేణువును ఫూత్కార ఛిద్రముపై పెదవి యుంచి ఊదవలెను. నిబిడత్వము, ప్రౌఢత్వము, సుస్వరత్వము, శీఘ్రత్వము మాధుర్య మనునవియైదును ఫూత్కార గుణములు. శీత్కారము, బహుళత్వము, స్తబ్ధత్వము, విస్వరము స్ఫుటిత స్వరము, లఘుస్వరము. అమధురత్వము ననునవి ఆరును అవగుణములు.

వృథావాదన, ప్రయోగ బాహుళ్యము అల్పత్వము అనునవి వేణు వూదు వాని దోషములు. స్థాన, లయాభిజ్ఞత, గమక నిపుణత, స్ఫుటస్వరము శీఘ్రహస్తత్వమనునవి గుణములు. ప్రముక్తి, బద్ధముక్తి, యుక్తి, సుస్థానము, సుస్వరత్వము, అంగుళి సారణ మనునవి అంగుళీ ప్రసారణ క్రియా గుణములు.

## 4. ఘన వాద్యములు.

కర తాళము మున్నగు ధాతు నిర్మిత వాద్యములను ఘనవాద్యములందురు. ఇవియు అనేక విధములు. అందులో

కరతాళము, కాంస్యవనము, జయఘంట, శుక్తిక కంఠిక, పటవాద్యము, పట్టాఘోషము, ఘర్ఘరము, ఝంఝతాళము, మంజీరము, కర్తరి, ఉష్కాకము మున్నగునవి. కరతాళ విషయమున సంగీతశాస్త్రమున నిట్లు వ్రాయబడి యున్నది.

త్రయోదశాంగుళవ్యాసౌ శుద్ధకాంస్య వినిర్మితౌ
మధ్యముఖౌ స్తనాకారౌ తన్మధ్యే రజ్జుగుంఫితౌ॥
పద్మినీ పత్ర సదృశౌ కరాభ్యాం రజ్జు యంత్రితౌ
కరతాళావుభౌ వాద్యే నే వాద్య పాఠే ఝంకృతి॥

ఇరువది వాద్య విధ ప్రబంధములను యీ విద్యా ప్రవీణు లేర్పరచిరి వాటి పేర్లు. యతి, ఉభము, ఊంతవళి, అవచ్ఛేదము, జోడని. చండని పదము, సమహంసము, ఝంకారము, పైసారము, తుటుకు, ఊస్వరము, డేంకారము, మలపము, మలపాంకము, ప్రహరణము, అంతర, దురక్వరి, యవనిక పుష్పాంజలి. కాని సంగీత దామోదరములో 12 ప్రబంధములే చెప్పబడినవి. అందులో నెనిమిది పేరులు పైన వ్రాసిన వానికంటె భిన్నములై యున్నవి.

సంగీత దామోదరములో.

'యతి రోధవ్య వచ్ఛేదో గజరో రుపలం ధృవం
గనపః సారిగో నీచనాదశ్చ కథిత స్తథా.
ప్రహరణం వృందనంచ ప్రబంధా ద్వాదశస్మృతాః॥

ప్రబంధ భేదమువలననే వాద్యముల వివిధ స్వరము లుత్పన్నమైనవి. (కల్యాణ్)

శ్రీ తటవర్తి సూర్యనారాయణ

# గ్రంథవిమర్శనము

## ఆంధ్రవ్యాకరణసంహితా సర్వస్వము

[మొదటిసంపుటము]

కళాప్రపూర్ణ శ్రీవజ్ఝల చినసీతారామశాస్త్రి. ప్రతులకు: రిజిస్ట్రారు, ఆంధ్రయూనివర్సిటీ, వాల్తేరు. వెల 25 రూపాయలు.

ఇది, ఆంధ్రశబ్దచింతామణికీ, అథర్వణకారికలకు, బాలవ్యాకరణానికీ, ఇంకా ఇతరాంధ్ర వ్యాకరణాలకు, శ్రీ శాస్త్రిగారు వ్యాఖ్యానరూపంగా రచించిన వ్యాకరణగ్రంథము.

తెలుగులో వ్యావహారికవాదం బయలుదేరిన తరవాత, గ్రాంథికాంధ్రవ్యాకరణాభినివేశం చాలా వరకు సన్నగిల్లింది. కాని వ్యావహారికభాషకు ఇంతవరకు ఒక సమగ్రమైన వ్యాకరణం బయలుదేరనే లేదు. అందుచేత వ్యావహారిక రచయితలందరు తమకు తోచిన మార్గాలలో వ్యావహారికరచన సాగిస్తున్నారు.

అటు గ్రాంథికాంధ్రం చూస్తే అది విశ్వవిద్యాలయంలో విద్యార్థుల ప్రశ్నపత్రాలలోను, అక్కడక్కడ కొందరు గద్యపద్య రచయితల వ్రాతలలోను మాత్రమే మిగిలి ఉంది.

మనకింతవరకు వచ్చిన తెలుగు వ్యాకరణాలన్నీ చాలా సంక్షిప్తంగా ఉన్నాయి. ఇంతవరకు వచ్చినభారతాది గ్రంథాల పద్యభాషకుకూడా వీటిలో సమగ్ర సూత్రీకరణం కనబడదు. నిజానికి ఏ వ్యాకరణమైనా బయలుదేరినపుడు అది అంతకు పూర్వమే ప్రసిద్ధులయిన గ్రంథకర్తల భాషకైనా మార్గదర్శకం కావాలి. తెలుగు వ్యాకరణాలీవిషయంలో చాలా అసమగ్రంగా ఉన్నాయన్న విషయం గిడుగురామమూర్తిపంతులు గారు చాలా కాలంకిందటే సప్రమాణంగా నిరూపించారు. ఉదాహరణకు ఆంధ్రశబ్దచింతామణి ప్రకారం చూస్తే నన్నయ్య భారత ప్రయోగాలే అసాధువులని కొట్టివెయ్యవలసి ఉంటుంది. అయితే నన్నయ్య వ్యాకరణంప్రకారం అతని భారతప్రయోగాలు కుదరకపోయినంత మాత్రాన పెద్దదోష మేమీ లేదనీ, పాణినిసూత్రాలకు అతీతమయిన పాణినీయసూత్ర ప్రయోగాలే కనిపిస్తున్నాయనీ శ్రీసీతారామ శాస్త్రిగారు సమర్థిస్తున్నారు.

కాని సంస్కృతవ్యాకరణంలో ఇల్లాంటి ప్రయోగాల కన్నిటికీ ఒక నిర్ణీతమయిన వ్యవస్థ ఏర్పాటైఉంది. పాణినీయసూత్రాలప్రకారం కుదరని ఈపాణిని ప్రయోగాలు చాలా తక్కువ. ఆంధ్రశబ్దచింతామణి ప్రకారం కుదరని నన్నయ్య ప్రయోగాలు అసంఖ్యాకంగా కనిపిస్తున్నాయి. ఈదృష్టితో చూస్తే మనకున్న వ్యాకరణాలతో ఇంతవరకు వచ్చిన సుప్రసిద్ధాంధ్రకవుల ప్రయోగాల కన్నింటికీ లక్షణసమన్వయం కుదరడం లేదు.

శ్రీ శాస్త్రిగారే తమ వ్యాఖ్యానాల్లో అనేక స్థలాలలో ఆంధ్రశబ్దచింతామణికీ, అథర్వణకారికలకు, బాలప్రౌఢవ్యాకరణాలకు, ఇంకా ఇటీవల బయలుదేరిన వ్యాకరణాలకు మధ్యన బయలుదేరిన పరస్పర వైరుధ్యాలెన్నో ఎత్తి చూపించి, తమ వ్యాకరణ పాండిత్యబలంతో అవ్వన్నీ సమన్వయించడానికి ప్రయత్నించారు.

అయితే ఈ పూర్వాంధ్ర వ్యాకరణాల కన్నింటికీ కలిపి, పాణినీయాని కున్నంత విస్తృతిగాని, ప్రామాణికతగాని లేకపోవడంవల్ల కొన్ని కొన్ని సిద్ధాంతాల విషయంలో పాఠకులు ఇదమిత్థం అని నిర్ణయించుకోవడానికి వీలుపడడం లేదు.

ఉదాహరణకు 'సంహితైకపదే నిత్యా నిత్యా ధాతూపసర్గయోః, నిత్యా సమాసే వాక్యేతు సావివక్షామపేక్షతే' అనే సంస్కృత వ్యాకరణ సంహితా నియమం తీసుకుందాము. ఈ అనుశాసనం తెనుగు సంధిలో సర్వత్ర అనువర్తించదని శ్రీశాస్త్రిగారు నిరూపించారు. కాని శాస్త్రిగారు తమ గ్రంథపీఠికలో తద్ధితాది విషయాలలో సంస్కృత వ్యాకరణ సూత్రాలే తెనుగుకు అనువర్తిస్తాయనీ, సంస్కృత వ్యాకరణ పరిశిష్ట విషయాలకే తెలుగు వ్యాకరణ కర్తలు సూత్రాలు రచించారనీ వ్రాశారు,

ఇక్కడ సంస్కృత సంహితాను శాసనం తెనుగులో అనువర్తించే విషయం సమగ్ర ప్రయోగ పరిశీలన చేసి తేల్చుకోవలసిన విషయం. ఇంతవరకు వచ్చిన వ్యాకరణాలలో ఈ విషయంలో సమగ్రపరిశీలన జరగలేదు. శాస్త్రిగారు చేసిన సమన్వయాలు కూడా సంక్షిప్తంగా ఉన్నాయిగాని సమగ్రంగా లేవు. ఈ పరిస్థితిలో ఈ సమన్వయానికి సరిపోని ప్రాచీన కవిప్రయోగాలు అపప్రయోగాలేనా అని పాఠకులకు సందేహం కలగడం సహజమే. ఇంక ప్రసిద్ధ ప్రాచీన కవులలో వీరు ప్రామాణికులు—వీరు అప్రామాణికులు అని కొట్టివెయ్యడం కూడా అంత తేలికైన పని కాదు. ఇల్లాంటప్పుడు— శ్రీ శాస్త్రిగారు కొంతమంది ప్రాచీన కవుల ప్రయోగాలు ప్రత్యేకించి అపప్రయోగాల నిర్ణయించడం వ్యాకరణసంప్రదాయదృష్ట్యా యుక్తియుక్తం కాదు.

అయితే ఈ చెప్పినదంతా ఆంధ్ర వ్యాకరణ ప్రాథమిక సంప్రదాయాలను సరించి చేసిన విమర్శ. ఇదంతా గతానుగతికంగా వచ్చిందని విడిచిపెట్టి, కేవల సాంప్రదాయికాంధ్రవ్యాకరణదృష్టితో పరిశీలించినప్పుడు—శాస్త్రిగారి ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వమువంటి సమగ్ర వ్యాకరణగ్రంథం తెలుగు భాషలో ఇంతకుముందెన్నడు బయలుదేర లేదని చెప్పాలి.

శాస్త్రిగారు సంస్కృత ప్రాకృతాంధ్రవ్యాకరణాలు కూలంకషంగా మథించినవారు. ఈ వ్యాఖ్యానంలో దొర్లిపోయే అనేక సంస్కృతాంధ్ర శబ్దాల సాధుత్వాసాధుత్వ నిర్ణయాలలో, వీరి కూలంకష పాండిత్యము, చిరకాలానుభవము, ప్రయోగ విశేష పరిజ్ఞానము ప్రస్ఫుటంగా గోచరిస్తాయి.

గ్రాంథికాంధ్ర వ్యాకరణ సంప్రదాయాలు, ప్రయోగ విశేషాలు, సూత్రకర్తల లోపాలు మొదలయిన భాషావిషయాలు తెలుసుకోదలిచిన వారందరికీ ఇది అవశ్య పఠనీయమయిన ఉత్తమగ్రంథము.

ఇది ఇంతకుపూర్వం వెలువడిన గ్రాంథికాంధ్ర వ్యాకరణాల కన్నింటికీ మహాభాష్యంవంటిదని చెప్పవచ్చును.

అయితే శాస్త్రిగారీ భాష్య రచనతో తృప్తిపడక అపూర్వమయిన తమ పరిశ్రమను వినియోగించి భాష్యరూపంలో వెలువరించిన తమ అభిప్రాయాలు సూత్రీకరించి గ్రాంథికాంధ్రాని కొకసమగ్ర వ్యాకరణం రచించగలరనీ, ఆంధ్ర విశ్వవిద్యాలయానికా వ్యాకరణం ప్రచురించే గౌరవం దక్కగలదనీ ఆశిస్తున్నాను.

ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వం రాయల్ సైజులో సుమారు వెయ్యి పుటల గ్రంథం. చింతామణ్యాది వ్యాకరణసూత్ర సూచికలు, విస్తృత విషయసూచికలు మొదలయిన వాటితో గ్రంథ ముద్రణం ప్రశంసనీయంగా ఉన్నది.

ఇంతటి ఉత్తమ వ్యాకరణగ్రంథం ప్రచురించిన ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు ఆంధ్రభాష కొక అమూల్యాలంకారం చేకూర్చారు.

ఆంధ్రభాషాభిమానులందరికీ ఇది అవశ్యం పఠించదగిన అమూల్య వ్యాకరణ గ్రంథము.

---

## నాటకం

[అనువాద నాటకం]

డి. వి. నరసరాజు, ప్రకాశకులు: దేశి కవితా మండలి, విజయవాడ 2, వెల: రూపాయి పావలా.

అసలిది హంగరీ కవి ఫెరన్స్ మోల్నార్ వ్రాసిన నాటకం. ఈ నాటక రచనాచమత్కృతికి ముగ్ధుడై పి. జి. వుడ్‌హౌస్ అంతటివాడు దీనికి "*The play is the thing*" అని పేరుపెట్టి ఇంగ్లీషులోకి తర్జుమా చేశాడు. ఆ ఇంగ్లీషులోనుంచి జి. వి. నరసరాజుగారు చేసిన తెలుగుఅనువాదమే ఈ 'నాటిక'.

ఊర్వశి, మధు, అనే ఇద్దరు యువతీయువకులు పరస్పరము ప్రేమించుకుని వివాహం చేసుకుందామని నిశ్చయించుకుంటారు. అయితే ఇంతకు పూర్వమే ఊర్వశికి నాట్యం నేర్పిన కాలంలో బాగా జోస్తీగా తిరిగిన కామరాజనే ఆసామి ఆమె నొక హోటల్లో కలుసుకుని సరసాలాడడం మొదలుపెడతాడు. కాని ఊర్వశి తన పెళ్ళి నిశ్చయం అతనికి చెప్పి తిరస్కరిస్తుంది. ఈ హోటల్లో పక్కగదిలోనే మధు, అతని సన్నిహిత మిత్రులు రఘుపతి, రామానుజం మకాం చేసిఉంటారు. మధు ఈ సంభాషణ విని,

నిర్ఘాంతపడి ఊర్వశితో తెగతెంపులు చేసుకోడానికి సిద్ధపడతాడు. కాని రఘు, రామానుజము, మధుమీద జాలికొద్దీ ఆక్షేప రభస జరక్కుండా ఈ వ్యవహారం సానుకూలపరచి పెళ్ళి జరిగించాలని నిశ్చయించి, మధుతో ఆసంభాషణ అంతా ఒక నాటకం రిహార్సల్లో దని చెబుతారు. స్వయంగా అప్పటికప్పుడు ఒక చిన్న నాటకం వ్రాసి, ఊర్వశీ కామరాజు లిద్దరిచేతా ఆ నాటకం ఆడిస్తారు. పాపం మధు భావకవి. ఆ అమాయకుడిదంతా నమ్మి, చివరికి ఊర్వశీ పాణిగ్రహణోన్ముఖు డవుతాడు. ఇదే ఈ నాటకంలో కథ.

ఈ కథ సామాన్యంగానే కనిపిస్తుంది. కాని ఫెరన్స్ లారెన్స్ మాత్రం ఇదంతా మూడంకాల్లో ఇమిడ్చి, అత్యద్భుతంగా నడిపించుకుపోయాడు. ఈ రూపక రచనావిధానం అంతా సరికొత్తగా అతి సున్నితమైన హాస్యధోరణిలో సాగిపోతుంది.

దీనికి డి. వి. నరసరాజుగారు చేసిన అనువాదం కూడా చాలా చక్కగా నడిచింది. వీరి సంభాషణలు మంచి చురుగ్గా హుషారుగా సాగిపోతాయి. రచనకు, ప్రదర్శనానికీ, ఆంధ్ర నాటక కళాపరిషత్తు ప్రథమతాంబూలం అందుకున్న వీరి 'నాటకా'న్ని గురించి, ఇంతకంటె ఎక్కువగా వ్రాయడం అనవసరం.

అయితే—ఒక యువతికి ముందుగా ఒక ఆసామితో బాగా దగ్గిరసంబంధం ఏర్పడడం, తరవాత ఆమె ఇంకొకర్ని పెళ్లాడాలని అనుకోవడం—పాతగోల బయటపడడం—మధ్యవర్తులు కలుగజేసుకుని వ్యవహారం చెయ్యిదాటిపోకుండా చూడడం—లాంటివి పాశ్చాత్యసంఘానికి నప్పినంతగా మనకు నప్పవు. ఇందుచేత తెలుగుజనానికి ఈ నాటకం కొంత విడ్డూరంగా కనబడుతుంది.

ఆంధ్ర నాటక కళాపరిషత్తు మన సంఘ వ్యవస్థకు బాగా హత్తుకుపోయే స్వతంత్ర నాటకాలుగాని లేకపోతే—అథమపక్షం అలాంటి అనువాదాలుగాని ప్రోత్సహించడం మంచిది.

## సింహగడము

[నాటకము]

సురభి నరసింహము. బి. ఏ; బి. యి. డి. ప్రతులకు: అరుణాశ్రమము, నడకుదురు. కాకినాడ తాలూకా, తూర్పుగోదావరి జిల్లా.

ఈ నాటకంలో ప్రధానేతివృత్తం సింహగడ విజయము. ఈ విజయం సాధించిన వీరుడు తానాజీ మాలుసురే. ఇతడు శివాజీకి నమ్మినబంటు. తన చాకచక్యంవల్ల సింహగడదుర్గరక్షకుడైన రాయాజీభు రేసరుని తన పక్షానికి తిప్పుకుంటాడు. ఈ కథలో ఉదయభానునికీ, కమలకుమారికీ మధ్య నడిచిన వ్యవహారం కూడా కలుస్తుంది. రచయిత ఇదంతా ఆరుఅంకాలలో కుదించారు.

సాంప్రదాయిక పద్ధతి ననుసరించిన పద్యాలు, పాటలు, గ్రాంథిక భాషారచన మొదలైనవన్నీ ఈ నాటకంలో కనిపిస్తాయి.

చారిత్రకరూపకాలు వ్రాసేటప్పుడు ఆకాలపు ప్రజల మనోభావాలు స్ఫురింపజెయ్యడంలో చాలా జాగ్రత్త పడాలి. శివాజీకాలంలో హైందవ ధర్మోద్ధరణావేశం ఉంటే ఉండవచ్చునుగాని, ఈనాడు బయలుదేరిన అఖిలభారతజాతీయావేశంలాంటిది ఆరోజుల్లో కనబడదు. అందుచేత ఈ నాటకంలో చాలాచోట్ల మరాటీవీరులు 'భారత వీరత' మొదలైనవాటిని గురించి ప్రస్తావించడం సముచితం కాదు. రచయిత ఇక్కడ ఈనాటిభావాలు ఆనాటి వ్యక్తులకు హత్తించినట్లు కనిపిస్తుంది.

ఈరచయిత నాటకరచనకంటె పద్యరచన కొంత బాగుంది. ఈ క్రింది పద్యాలనుబట్టి వీరి రచనా పద్ధతి గమనించవచ్చును.

"ఓహో! ఆహవలక్ష్మియే మనకుఁ
ప్రత్యర్థాన మిచ్చెందమో
రాహిత్యమ్మొనరించి, శాత్రవ కర
గ్రస్తంబులౌ దివ్వెలన్
వ్యూహమ్ముల్ పచరింపుడీ రిపుల
కాయుర్దీపమార్పన్నవో
త్సాహావేశ పరాక్రమ ప్రళయ
రుద్రస్ఫూర్తి నర్తింపుడీ!
ప్రాణమ్ముల్ తృణభంగురమ్ములు
తటిద్రూపాయంబు లాశ్రీలు; కోం
డాణిన్ శాత్రవముక్త జేసి
శివరాట్ఛత్రానగీలించి, గీ
ర్వాణ ప్రస్తుతు లేపుమీర
శివజీపాదోపజీవుల్ పరి

క్రౌంచోద్యోగ లటంచు శాశ్వత
సువర్ణఖ్యాతి దీపింపరే!"

## TWELVE PEAS IN A POD

[కథల సంపుటి]

మాగ్నొల్లాహార్డీ. ఆథర్స్ అండ్ ఆర్టిస్ట్స అసోసియేషన్. 16. బాండ్ సన్స్ గార్డెన్ స్ట్రీట్. కిల్పాక్. మదరాసు. వెల: 2 రూపాయలు

ఇది భారతదేశ పరిసరాలపై ఆంగ్లభాషలో రచించిన 12 కథల సంపుటి.

వైదేశికులు అన్యదేశాలలో చాలాకాలం నివసించినా ఆ దేశీయుల ఆచారవ్యవహారాల అంతరాంతరాలు పరిశీలించి ఎన్నదగినసాహిత్యసృష్టి చెయ్యడం చాలాకష్టం. అసలాయాదేశీయుల జీవితాంతర్యం వారి దైనందిన వ్యావహారిక భాషలో అంతర్లీనమై ఉంటుంది. అందుచేత విదేశభాషల్లో అన్యదేశీయుల జీవితపరిసరాలు చిత్రించడంలో కొంత క్లిష్టత ఏర్పడుతుంది.

కాని ఈ రచయిత్రి రచనలలో అంతటా చక్కని భారతీయ జీవన పరిశీలన కనిపిస్తుంది. కథలు చదువుతూంటే ఇవి ఎవరో భారతీయులు వ్రాసినట్లే ఉంటాయి గాని వైదేశిక దృష్టిచ్ఛాయలు వీటిలో కనబడవు. ఇది ఈరచయిత్రి కథలలో ఎన్నదగిన ప్రత్యేక విశిష్టత.

ఈసంపుటికి పీఠిక రచించిన మంజేరీ. యస్. ఈశ్వరన్‌గారు వ్రాసినట్లు ఈమె కథల్లో సున్నితమైన స్వభావపరిశీలనము, చిత్రణము ప్రత్యేకంగా పేర్కొనదగిన సుగుణాలు. ఈ జాతి రచనలకు' *Twixt Here and there, Renunciation, The Goldsmith Finishes His work* అన్నవి ఉదాహరణలుగా తీసుకోవచ్చును.

ఈమె వ్రాసిన కథ లన్నిటిలోను, *One night in a Barn, A question of Authorship* అన్నవి రెండు ప్రత్యేకంగా పేర్కొనదగిన ఉత్తమ కథలు.

మిగిలిన వాటిలో చాలావరకు చిత్రణాల తరగతికి చెందుతాయి. వీటిలో *The call of the eights* ఎన్నదగిన చిత్రణం. కవితాత్మకమైన ఒక సన్నివేశం తీసుకొని రచయితలను ఉన్నత పథాలకు తీసుకొనిపోయిన మాగ్నొల్లాహార్డీ రచనాకౌశలం దీనిలో గమనించవచ్చును.

ఆకర్షకమైన ముఖచిత్రంతో ముద్రణాదికం ప్రశస్తంగా ఉన్నది.

ఈ ఉత్తమాంగ్ల కథాసంపుటి ప్రచురించిన ఆథర్స్ అండ్ ఆర్టిస్ట్స సంఘంవారు అభినందనీయులు.

## శబ్దసింధు

[హిందీ-తెలుగు నిఘంటువు]

సంకలనకర్త: సాగిసత్యనారాయణగారు. ప్రతులకు విజయ భారతీ పబ్లికేషన్స్, రాజమహేంద్రవరము. వెల: 12 రూపాయలు.

ఇది డెమ్మీ సైజులో 1278 పుటలుగల పెద్దనిఘంటువు. దీనిలో 75 వేల పదాలున్నాయి. సాగివారు సామాన్యంగా హిందీలో వాడ్లిపోయే సంస్కృత, పార్సీ, ఉర్దూ, అరబ్బీ మొదలైన భాషలపదాలన్నీ సేకరించి, అకారాదిక్రమంలో ఇందులో చేర్చారు. ఇవిగాక, ఇందులో ఇంకా 5 వేల హిందీ జాతీయాలుకూడా చేరి ఉన్నాయి.

హిందీ జాతీయ భాషగా మారిన ఈ రోజుల్లో అందరు ఈభాష తప్పకుండా చదవవలసిన అవసరం ఏర్పడింది. తెలుగులో ఇంతవరకు ఇంత పెద్ద హిందీ—తెలుగు నిఘంటువు బయలుదేరలేదు. ఇది హిందీభాష చదివేవారికి బాగా ఉపయోగిస్తుంది. ఇంత పెద్ద నిఘంటువు తెలుగులో ప్రకటించడానికి శ్రమపడిన ప్రకాశకులు, సంకలనకర్తలైన సాగి సత్యనారాయణగారు హిందీభాష చదివేవారికి చక్కని సౌకర్యం కలిగించారు.

## విక్రమప్రకృతి

[పద్య కావ్యము]

మామిడాల పద్మనాభస్వామి, శారదా విద్యాలయ బాలికోన్నత పాఠశాల, త్యాగరాజనగర్, మదరాసు. వెల లేదు.

ఇది జయపురమార్గంలో తగిలే కొండదారి ప్రకృతిసౌందర్యంవర్ణించే ఏకాశ్వాస పద్య కావ్యము.

# భారతి

[సచిత్ర మాసపత్రిక]

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రికా ముద్రాలయము
మదరాసు.

సంపుటము 29 మార్చి, 1952 సంచిక 3

విడిప్రతి వెల ఒకరూపాయి.



# విషయానుక్రమణిక

## మార్చి - 1952



త్రివర్ణ చిత్రము—'గాలం' చిత్రకారుడు: దేవీప్రసాద్ రాయచౌదరిగారు

# రాబోవు జెమినీ చిత్రము




అయితే, ముగ్గురి జీవితాలు, ప్రవర్తనాలు
మూడు విధాలు
మాతృప్రేమయొక్క మధుర తంతులను
స్పందింపజేస్తున్నవి

## త్వరలో వచ్చుచున్నది




ఖర
ఫాల్గునము

# భారతి

సంపుటము 29
సంచిక 3


# శృంగారకందము

★


శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి


[యౌవన ప్రారంభమున భావమేఘము కురిసిన సింగారపు చిటిపొటి చినుకులు]

ఇది వెన్నెల, యభ్రనదీ మధురాంభః పూరనిభము, మదనోత్సవదో
హదము, వియత్తల సురభిప తదుదారకవోష్ణ దుగ్ధధారాసమముఁ

ఓసి! త్రపావల్లరి! రావోసి సుమమగంధ హృదయ! జ్యోత్స్నాస్నిగ్ధాం
గీ! సితదరహాసరుచివిభాసిత మృదుహృదయ! భవ్యభావునిఁ జేయఁ

శారదవిమల జ్యోత్స్నా సారమ్ములు, ప్రావృషేణ్య సంధ్యావేళా
ధారాధర విద్యుద్రేఖా రమణీయములు దంతకాంతులు చెల్లుఁ

సునిశితములు, చంచలములు ఘనరాగ ధునీధురీణ క్రమములరుణా
రుణకాంతి స్ఫోరకములు మనోజ్ఞములు భవదుదారమంజుల దృక్కుల్

రసనిమ్నగా కృతిని సొం పెసలారెడు చిన్నదాన! యేదీ చెపుమా!
విసవిస లాడెడు నాహృది నిసుమంత ప్రమోదరసము నింపుదుగాదే!

ప్రణయము, కరుడేయగు త్వద్వినయగుణా ప్లావితమయి, విస్తృతధునినై
నను, తద్ధునీవిలోలా త్మునిగా నొనరించివైచి ముగ్ధుని ఁజేయుఁ

ఇది పౌలయలుకయె యగుఁగా హృదయాహ్లాదకము, పివృద్ధ స్పర్ధా
స్పదమన్యోన్య. ప్రణయ ప్రౌఢోపరిచరత్సు ఖమృదులానిల సమముఁ

నటమూర్తి శివుఁడు సంధ్యా నటన క్రమమునను డస్సినవసినవసి త్రో
క్కిటుఁ బడునట నేర్చికొనెఁడు నటనీ కౌనువలన నటనాచారములఁ

అని తెచ్చినవీ కబురుఁ త్రిణయనచూడా నిబద్ధ దివ్యా భ్రతరం
గిణి పవనాంకు రమ్ములు ఘనసార సుగంధవహన కార్యాత్మకముల్

సుందర మందిరములు గిరి కందరములు, చందన తరుగంధా ఘ్రాణం
బిందిందిర ఝుంకారము సుందరి మనయిరువురకును శోభన ప్రదముల్

గిరిమల్లీ సుమవాసన శరదిందురుచి ప్రసార సారమ్ము, సరో
వరనిర్మల జలకేళీ తరుణమ్మును మదనదోహద ప్రాయమ్ముల్

పలుకుం దే నెలఁ గురిపించు లతాలలితాంగి, మృదుల సుమనః కోదం
డలస జ్యావల్లీమణి కలస్వన సదృశములు శుభకార్య కరణముల్

తొలకరి మెరపుల సోఁగులు గల కలకంఠి! భవదమృత కంఠస్వనముల్,
జల జల రాల్చెడు పలుచని పలుకుంజినుకుల నెడంద పంటకు దిరుగుఁ

చందన చర్చలు, క్రీడా మందిర చర్యలు, సుగంధమాల్య ద్రవ్యా
నందము, మనకందమ్మట కందమ్మున కవిమయూర కమ్మాడి కొనుఁ



# శాస్త్రపరిశోధనా సమీక్ష*



శ్రీ విస్సా అప్పారావు

శాస్త్రపరిశోధన మనగా సత్యాన్వేషణ. అందు నిమగ్నులైన శాస్త్రజ్ఞులు ఇతరమును మరచి తపించుచుందురు. ఇందు రెండు మార్గములు గలవు. *I* నిష్కామము, *II* సకామము అని. ఏ ప్రయోజనమును వాంఛింపక సత్యగ్రహణ పారవశ్యమున గలుగు ఆనందమునకై చేయు పరిశోధన నిష్కామము. (*Pure Research*) ఇట్టి పరిశోధనలవలన కాలాంతరమున క్షేమలాభములు కలిగిన కలుగవచ్చును. రేడియో, టెలిఫోను, డైనమో, మోటారు మొదలైన విట్టి ఫలితములే. సద్యఃఫలితము నపేక్షించి, ఒక ప్రయోజనము నుద్దేశించి, సలుపు పరిశోధనలు సకామములు-(*Applied Research*) ఆటంబాంబు, హైడ్రజన్‌బాంబు, కృత్రిమ రబ్బరు, గురించిన పరిశోధన లిట్టివే.

ఈ రెండు మార్గములకు చెందిన నేటి పరిశోధనలు కొన్ని క్రింద వివరింపబడినవి.

## *I*. నిష్కామ పరిశోధన :

(1) మీజాను (*Meson*) పరమాణువుల (*atoms*) నాభిభాగమున ఒక కేంద్రకము (*nucleus*) దాని చుట్టూ వలయములలో (*orbits*) కొన్ని ఎలక్ట్రానులు ఉండును, ఈ ఎలక్ట్రానుల గురించి చాలా విషయములు తెలిసికొనడమైనది కాని, కేంద్రకముయొక్క నిర్మాణము గురించి అంతగా తెలియదు. కేంద్రకమే పరమాణువుయొక్క ఆయువుపట్టు. పరమాణువుయొక్క బరువంతయు అందు చేరియుండును. ధనవిద్యుదావేశము గల ప్రోటానులు, విద్యుదావేశము లేనిన్యూట్రానులు అను సూక్ష్మాణువులతో కేంద్రకము నిర్మింపబడినది. బంగారు పరమాణు కేంద్రకములో 79 ప్రోటానులు 118 న్యూట్రానులు చేరియుండును. ఒక సెంటిమీటరులో సుమారు లక్షకోటి భాగము ($10^{-12}$ Cm అడ్డకొలతగల వలయములో ఇవి కుదింపబడియుండును. ప్రోటానులకు, న్యూట్రానులకు మధ్య అంతరము సెంటిమీటరులో లక్షకోటిభాగముకంటె ఎంతో తక్కువగా ఉండవలెనుగదా. అంత సూక్ష్మాతిసూక్ష్మమగు స్థలములో 79 ప్రోటానులు చేరియుండుట అత్యాశ్చర్యమగు విషయము.

ఒకే విధమైన విద్యుదావేశముగల రెండుపదార్థములు దగ్గరకు వచ్చినచో ఒకదానినొకటి దూరముగా నెంటివేయుట—వికర్షణ (*repulsion*) స్వభావమని విద్యుచ్ఛాస్త్రము చెప్పుచున్నది. ఈ వికర్షణశక్తి రెండింటి మధ్య గల దూరము తగ్గినకొలది విపరీతముగా పెరిగిపోవు స్వభావము కలది. అట్టిచో 79 విద్యుత్కణములు అంత దగ్గరగా చేరినప్పుడు విపరీతమగు వికర్షణశక్తులు (*repelling forces*) పుట్టి కణములన్నియు చెల్లాచెదరై ఎగిరిపోవలసి యున్నది. కాని అట్లు జరుగుటలేదు సరిగదా, కేంద్రములోనికి వెళ్లినకొలది పెరిగేటటువంటి ఆకర్షణశక్తివలన (*attracting force*) ఈ కణములు గట్టిగా బంధింపబడియుంటున్నవని పరిశోధనలు తెలియజేయుచున్నవి. అందుచేత వికర్షణశక్తిని మించిన ఆకర్షణశక్తి కేంద్రమందలి కణములమధ్య ఉండి తీరవలెనని, నిశ్చయింపవలసివచ్చినది. ఈ ఆకర్షణ శక్తులయొక్క ప్రమాణము ఇంతయని ప్రయోగములవలన తెలియవచ్చినది. అంతప్రమాణముగల ఆకర్షణశక్తి ఎట్లు కలుగుచున్నది. దాని స్వభావ మెట్టిది. అని జపాను విజ్ఞానవేత్తయగు యుకావా (*yukawa*) తర్కించుకొని ఇట్లూహించినాడు.

ప్రోటానులమధ్య, న్యూట్రానులమధ్య ఒక విలక్షణమైన ఆకర్షణ శక్తి యుండవలెను. వాటినుండి సూక్ష్మతరములగు ఏవో కణములు బయలువెడలి, ప్రోటానునుండి న్యూట్రానుకు, న్యూట్రానునుండి ప్రోటానుకు, మారుచుండవలెను. ఈ సూక్ష్మతర కణములనే బంతులతో ప్రోటాను న్యూట్రానులు బంతులాటను జరుపుకొనుచుండవలెను. పూలబంతు

* విజయవాడ రేడియో కేంద్రములో చేసిన ప్రసంగమును పెంచి వ్రాసినది.

లాట లాడుటవలన పెండ్లికొడుకు, పెండ్లికూతురు, ఒకరినొకరు ఎట్లు ఆకర్షణ చేసికొందురో అట్లే యీ విలక్షణమగు చెండ్లాటవలన న్యూట్రానులు ప్రోటానుల మధ్య ఆకర్షణ శక్తులు చెలరేగునని భావించవచ్చును! దగ్గరగా వచ్చినకొలది యీ యాకర్షణ శక్తులు వృద్ధి పొందును.

ఈ సూక్ష్మతర కణములయొక్క భారము, విద్యుదావేశము, ఎంత యుండవలెనని యుకావా లెక్కించినాడు. ఎలక్ట్రానుకు బరువుకంటె 200 రెట్లు బరువు, ఎలక్ట్రానుకున్నంత విద్యుదావేశము, ఉండవలెనన్నాడు. ఈ కణములకు మీజాను లని1935 లో పేరుపెట్టినాడు.

ఇట్లూహించిన మూడేండ్ల తరువాత విశ్వకిరణముల (*Cosmic rays*) యందు, మీజాను లున్నవని గుర్తించబడినది. (విశ్వకిరణములు విశ్వాంతరాళమునుండి, భూమిపై నిరంతరము పడుచుండును. ఇవి మన -మెరిగిన అన్ని కిరణములకంటె—గామా కిరణములకంటె—మిక్కిలి శక్తివంతములు)

మీజాను కణమునుండి, ఒక్కొకసారి, (i) ఎలక్ట్రాను, (ii) విద్యుదావేశములేనట్టి ఎలక్ట్రానుతో సమానమగు బరువుకలిగినట్టి న్యూట్రాను అను కణమున్నూ, విడిపోవుచుండునని 1940 లో కనిపెట్టిరి. ధనవిద్యుదావేశము, ఋణ విద్యుదావేశము కలిగి, ఎలక్ట్రానుకంటె 200, 300 రెట్ల బరువుకల రెండురకముల మీజానులు కలవని పరిశోధనలవలన తెలియవచ్చినది. మరియు, విశ్వకిరణములు అతిశక్తివంతములగు, ప్రోటానులని, భూమి నావరించియున్న గాలిలో చొరబడి భూమిపై పడుటలో, గాలిలోని పరమాణు కేంద్రకములను ఢీకొని, భేదించుటవలన మీజానులు పుట్టుచున్నవని తెలియవచ్చినది. మీజానులయొక్క బరువు, విద్యుదావేశము, అవి చెందుమార్పులు. ఆ మార్పులకు పట్టుకాలములు, నిశితముగా తెలిసికోవలసిన విషయములు. విశ్వకిరణములయందు మీజానులు సకృత్తుగా గోచరించుటవలన ఈవిషయములను విశదముగా తెలిసికో వీలు కలుగలేదు.

మీజానులను పరిశోధనాశాలలలో సృష్టించినయెడల, వాటితో ఇష్టానుసారముగా, ప్రయోగములను సల్పి, విషయములన్నియు నిశితముగా తెలిసికొనవచ్చునని విజ్ఞానవేత్తలూహించి సాధించిరి. ఈసాధనలో ముఖ్యముగ తోడ్పడిన యంత్రమునకు సింక్రో సైక్లోట్రాను (*Syncro - cyclotron*) అని పేరు. వలయాకారమగు విద్యుదయస్కాంతమొకటి (*Electro - magnet*) ఇందుండును. ఆ వలయము యొక్క అడ్డకొలత 15 అడుగుల 4 అంగుళములు. దీనిశక్తి బ్రహ్మాండమైనది. దీని నిర్మాణము ఒక యజ్ఞమువంటిది.

సింక్రోసైక్లోట్రానులో ఆల్ఫాకణముల(*alpha partieles*) ను ప్రవేశ పెట్టుదురు. అవి ఆ యంత్రములో గిరగిర తిరుగును. తిరిగినకొలది వాటి గమనశక్తి పెరుగును. అనేకసార్లు ఇట్లు తిరిగి, మిక్కిలి శక్తివంతములై, ఆల్ఫాకణములు, యంత్రమునుండి వెలువడి గ్రాఫైటు అను మెత్తటి బొగ్గును ఢీకొనును. బొగ్గుపరమాణుకేంద్రకములు భేదింపబడి వాటినుండి మీజానులు సృష్టియగును. ఈ మీజానులయొక్క వివిధ గుణముల పరిశోధన తీవ్రముగ సాగుచున్నది. కొంతనిశ్చయజ్ఞానము సంపాదితమైనది.

ఎలక్ట్రానులకంటె 300 రెట్లు బరువుగల మీజానులు, రేడియో ఏక్టివిటీచేత, వాటంతటవే 200 రెట్లు బరువుగల మీజానులుగా మారునని, ఎలక్ట్రానుకంటె 700—1,000 రెట్లవరకు బరువుగల మీజానులు కూడ కలవేమోయని తెలియవచ్చినది. ఈ వివిధములగు మీజానుల గుణములన్నియు బాగా గుర్తించి, వాటిని సమన్వయపరచినచో పరమాణుకేంద్రక నిర్మాణ రహస్యము—సృష్టిరహస్యము—తెలియగలదని శాస్త్రజ్ఞులాశించుచున్నారు. ప్రస్తుత మిట్టి ప్రయోగములను భూమిపైన 60,000, 70,000 అడుగుల ఎత్తున జరుపుచున్నారు. అవసరమైన పనిముట్లు (*Instrument*) అమర్చిన పెద్దపెద్ద గాలిబుట్టలను (*Balloons*) పైకి వదులుచున్నారు. భారతదేశమందు (*Tata Insiitute of Fundamental Research*) వారి యాజమాన్యమునట్టిపరిశోధనలు జరుగుచున్నవి.

విశ్వకిరణములలోని కణములు కేవలము ప్రోటానులే కావని, ప్రోటానుకంటె బరువైన పరమాణు కేంద్రకములుకూడ విశ్వకిరణములలో ఉన్నవని, నక్షత్రగోళములయందుండు వివిధపరమాణుకేంద్రకములు, విశ్వకిరణములయందుండియుండునని, క్రిందికి రానురాను బరువైన కేంద్రకములు అంత

రించుచుండుననీ, ఊహ లీ గాలిబుట్టల ప్రయోగముల వలన గోచరించుచున్నవి.

మరియు పైకి వెళ్లినకొలది విశ్వకిరణజన్యమగు మీజానులు విరివిగాను, బరువైనవిగాను పుట్టుచుండు నని ఈ ప్రయోగములు తెలుపుచున్నవి. ఈ పరిశోధన ఒక మహత్తరమైన నిష్కామమైన, సత్యాన్వేషణ.

## I (2) సేంద్రియప్రాణులు, (*Living Organisms*)—పరమాణువులు

కుటుంబనిర్మాణమును పోలి, పరమాణు నిర్మాణముండును. పరమాణు సూర్యనాభియందుగల కేంద్రకమును చుట్టి, సూర్యునిచుట్టు తిరుగు గ్రహములవలె, ఎలక్ట్రానులు తమతమ కక్ష్యలలో తిరుగుచుండును. ఈపోలికయే జీవకణములయందు (*Cells*) కూడ గోచరించుచున్నది. జీవకణమునకు నాభి ప్రదేశమందు ఒక కేంద్రకముండును. దానిని చుట్టి సూక్ష్మకణములు తిరుగుచుండును. చూచుట, వినుట, ఆనందించుట, మొదలగు ఇంద్రియానుభవములు తీవ్రముగా ఉన్నకొద్దీ సూక్ష్మకణములు తీవ్రముగా సంభ్రమించుచుండును. జీవకణములు, జీవసుకల పరమాణువులవంటివని జీవశాస్త్రవేత్తలు పరిశోధన వలన గ్రహించుచున్నారు. లక్నోలోని కింగ్ జార్జి మెడికల్ కాలేజీ ప్రధానాచార్యుడు, వారి సహాయులు ఈ పరిశోధనలు చేయువారిలో ముఖ్యులు.

హైడ్రోజను మొదలు యురేనియము వరకుగల పరమాణువులయొక్క బరువు, నిర్మాణ వైచిత్ర్యము, క్రమముగా పెరిగినట్లే, జీవకణములలోకూడ క్రమాభివృద్ధి కలదని తెలిసికొనిరి. జీవకణములలో మెదడు జీవకణము (*Brain Cell*) పరమాణువులలో యురేనియము వంటిది.

రేడియమువంటి రేడియో ఏక్టివుపదార్థముల లోను, పరమాణుబాంబులోను ద్రవ్యలేశములు నశించి శక్తి పుట్టుచుండునట్లే, కండరములు (*Muscles*) పనిచేయునప్పుడు అంచెలి కణములు (*Muscular cells*) నశించి, పని చేయుటకు కావలసినశక్తి కలుగుచుండును.

ఇట్టి పరిశోధనలవలన, ప్రాణముయొక్క స్వరూప మెట్టిది, ఇంద్రియానుభవము తీవ్రమైనపుడూ, అనారోగ్యము కలిగినపుడూ, ప్రాణమున కేరీతిని సంచలనము, సంక్షోభము కలుగును, అను జీవశాస్త్ర మూలసమస్యలకు సమాధానము దొరకగలదని, శాస్త్రజ్ఞులు భావించుచున్నారు.

## I (3) రేడియో ఖగోళశాస్త్రము
*Radio Astronomy:*

ఖగోళశాస్త్ర పరిశోధనలు దూరదర్శిని (*Telescope*) వర్ణమాలదర్శిని (*Spectroscope*) యంత్రముల సహాయమున జరుగుచున్నవి. సూర్యుడు మొదలగు నక్షత్రములు ప్రసారము చేయు వెలుతురును దూరదర్శినిచే గ్రహించి, వర్ణమాల దర్శినిచే ఆ వెలుతురులోగల వివిధరంగులను, వాటి ధాతుతీవ్రత (*Colour-intensity*)లను కొలిచి, వాటినిబట్టి నక్షత్రములయొక్క స్వరూపము, బరువు, దూరము మొదలగునవి కనుగొనుచున్నారు. నక్షత్ర కాంతులయొక్క వర్ణమాలను (*Spectrum*) ఫోటోగ్రాపుతీసినచో కంటికి గోచరించు రంగులకంటె ఎక్కువ రంగులను, సూక్ష్మతరముగా గుర్తించవచ్చును. ఫోటోగ్రాపు ప్లేటువలనకూడ గుర్తింపవీలులేని కాంతితరంగములు ఉండవచ్చును. వాటిని తెలిసికొనుట యవసరము. అట్టి ప్రయత్నము లీ మధ్య కొన్ని సంవత్సరములనుండి రేడియోమూలకముగా సాగుచున్నవి.

వెలుతురుతరంగములు కొన్ని పొట్టిగాను, కొన్ని పొడుగుగాను ఉండును. వేడివస్తువులు కంటికి గోచరముకాని తరంగములను ప్రసారము చేయుచుండును. అవి కంటికి కనపడే తరంగముల కంటె చాల పెద్దవి. అంతకంటె చాల పెద్దవి రేడియోలో ఉపయోగపడు తరంగములు. (*Radio waves*) వీటిలో మిక్కిలి పొట్టివి పదిమీటర్ల పొడుగుండును.

మనల నావరించియున్న గాలియొక్క పై భాగములయందు (*Upper atmosphere*), విద్యుదావేశముగల నైట్రోజను, ప్రాణవాయువుల, పరమాణు దొంతరలు (*Layers of ions of nitrogen and oxygen of atmospheric ionized layers*)భూమికి చుట్టూ ఉండును. ఇవి రేడియో తరంగముల నడ్డగించి, ఆకాశములోనికి పోనీయక, వాటిని భూమి

పైపునకు త్రిప్పి పంపుచుండును. అందువల్లనే ఒక చోటనుండి చేయబడిన రేడియో ప్రసారము భూమి యందంతటను వినిపించుచున్నది. ఈ అయాను పొంతరలను ఛేదించుకొని పోగలిగిన, మిక్కిలి పొట్టివైన, రేడియోతరంగములు రేడారను యంత్రముచేత ఈమధ్యనే సృష్టింపబడినవి. అవి 1–10 సెంటిమీటర్ల మధ్యగల పొడుగుగలవి. ఈ రేడారు తరంగములు గాలి పైభాగమునకల అయాను పొంతరలను ఛేదించుకొని చంద్రగోళమువరకు పోయి పరావర్తమై తిరిగి వచ్చుచున్నవి. ఈ రాకపోకలకుపట్టే కాలమును బట్టి చంద్రగోళముయొక్క దూరము ఏ క్షణమున కా క్షణమే నిశితముగా లెక్కగట్టగలుగుచున్నాము.

ఉల్కాపాతములు సాధారణముగా నవంబరు మాసమున అధికముగా ఉండును. ఈ ఉల్కలు సూర్యునిచుట్టి తిరుగుచుండును. వీటి కక్ష్యలు భూమికి సమీపములు. ఇవి మరీ దగ్గరైనప్పుడు భూమిచే ఆకర్షింపబడి ఉల్కాపాతమగును. ఈ ఉల్కలగురించిన పరిశోధనలు దూరదర్శనిమూలమున మబ్బులేని రాత్రులయందు మాత్రము జరుగుచుండును. పగటియందు, మబ్బుగల రాత్రులందు ఉల్కలను రేడారు సహాయమున ఇప్పుడు గుర్తింప వీలుగా ఉన్నది వాటి గురించిన నూతనవిషయములు సేకరింపబడుచున్నవి. భూమికి దగ్గరగాఉన్న చంద్రగోళము, ఉల్కలు, గురించి మాత్రమే రేడారు యంత్రసహాయమున పరిశోధనలు సాధ్యము. కాని సూర్యుడు, ఇతర నక్షత్రములు పంపే రేడియోతరంగము లేమైన ఉన్నచో వాటిద్వారావచ్చు ఆయా నక్షత్రముల సందేశములను తెలిసికొనుటకు రేడారు అంతగా ఉపయోగపడదు.

ఇందులకై నూతనముగా రేడియో దూరదర్శని (*Radio-telescope*) అనుదానిని నిర్మాణము చేసిరి. ఆస్ట్రేలియాలోని సిడ్నీవద్దగల నక్షత్ర పరిశోధనాశాల (*Observatory*) మొదలగుచోట్ల ఈ యంత్రము లుపయోగింపబడుచున్నవి.

పదిహేను ఇరవై సంవత్సరములనుండి ఖగోళమందుండి వచ్చునట్టి హిస్సుమను వింతశబ్దములను (*Cosmic noise*) రేడియో పరిశోధకులు గుర్తించుచున్నారు. వాటి వివరములు, ఇదివరలో తెలియలేదు. కాని నేడు వీటిఉత్పత్తి స్థానమును రేడియోదూరదర్శనివలన కనుగొన్నారు. కొన్ని శబ్దములు సూర్యునివద్ద నుండి వచ్చుచున్నవని (*Solar noise*) అవి, ఒక సెంటిమీటరునుండి 150 సెంటిమీటర్లవరకు పొడుగుగల రేడియో తరంగములని తేలినది.

మనకు కనబడు సూర్యబింబమును ఫోటోస్ఫియర్ అందురు. దీని వేడి 6,000 సెంటిగ్రేడు డిగ్రీలు. దీనిపైన కంటికి కనపడని, వాతావరణముండును. సూర్యబింబముపైన 6,000 మైళ్ళ ఎత్తువరకు చుట్టూ ఉండును. దాని ఉష్ణోగ్రత (*Temperature*) 30,000 సెంటిగ్రేడు డిగ్రీలు. దీనికి క్రోమోస్ఫియర్ అని పేరు. దీనినుండి గాలి మంటలు నాలుకలవలె అప్పుడప్పుడు వెలువడుచుండును. వీటిని ప్రామినెన్సెస్ అందురు. ఇవి కొన్నిలక్షల మైళ్ళ ఎత్తువరకు ఎగిసిపోవుచుండును. మరీతీవ్రమైన మంటలు సూర్యబింబముపైన 10,00,000 మైళ్ళవరకు ఎగయుచుండును. ఈప్రాంతమునకు కరోనా కిరీటము— అని పేరు. సూర్యమండలముయొక్క ఆవరణకు పైభాగమై, కిరీటమువలె ఉండునట్టిదని భావము. దీని వేడి కూడ 30,000 °c అనే ఇదివరకు భావింపబడేది. కాని ఈరేడియోదూరదర్శనివలన దీని వేడి ఇంతకంటె చాల ఎక్కువ అని కొన్ని భాగములయందు పది లక్షలడిగ్రీలవరకు ఉండునని తెలిసినది. 150 సెంటిమీటర్ల పొడుగుగల రేడియోతరంగములు కరోనా నుండివచ్చుచున్నవని, పొట్టితరంగములు క్రోమోస్ఫియరునుండివచ్చుచున్నవని తెలిసినది. సూర్యుని చుట్టియున్న వాతావరణములో బింబమువద్దనుండి కరోనావరకుగల వివిధ అంతరములలో వాతావరణముయొక్క సాంద్రత (*Density*) ఉష్ణోగ్రత, ఈ నూతన పరిశోధనలవలన వెల్లడైనవి. సూర్యుని వాతావరణముయొక్క వేడి క్రమముగాతగ్గి, తిరిగి యథాస్థితికివచ్చుచు కొన్నేండ్లకొకసారి హెచ్చుచు తగ్గుచున్నదేమో యను సందేహములు కలుగుచున్నవి. మరియు సూర్యబింబమంతయు సమానకాంతివంతమైనది కాదేమో, అంచులనుండి మధ్యభాగమునకు వెళ్లినకొలది కాంతి తగ్గుచున్నదేమోయని కూడ పరిశోధనలు సూచించుచున్నవి.

సూర్య బింబమందు 11½ సంవత్సరములకొకసారి మచ్చలు పుట్టుచుండును. అవి పెరిగి, విశాలములై క్రమముగా క్షీణించుచుండును. పెరుగుదల సమయములలో పుట్టు సూర్యసంబంధమగు ధ్వని

తీవ్రముగా ఉండును. మచ్చలు తగ్గినకొలది తీవ్రత తగ్గును. మచ్చలు లేని సాధారణస్థితిలో కూడ కొద్ది పాటి శబ్దము ఎప్పుడునూ ఉంటూనే ఉండును. ఈ కొద్దిపాటిశబ్దము పొట్టిరేడియో తరంగములవలన (4-5 Cms)ను తీవ్రమగు శబ్దము 25 సెంటిమీటర్ల పొడుగుగల తరంగములవల్లను కలుగును. అని తెలియ వచ్చినది. ఈ తరంగములశక్తి అతి తీవ్రముగా ఉన్న ప్పుడు కొన్నిగంటలవరకు మన రేడియోలు పని చేయవు. ఏ ప్రసారమును గ్రహించజాలవు. దీనిని రేడియో ఫేడౌటు అందురు. ఇట్టి సమయముల యందు, సూర్యబింబమందలి మచ్చలప్రాంతమున— మేఘములయందు పుట్టు తీవ్రమైన మెఱుపుకంటె తీవ్రతమమైన ఒక మెఱుపువంటి కాంతి (*flare*) పుట్టుచుండునని దాని కారణముననే ఈ ఫేడౌటు కలుగునని, ఈ సమయములయందే భూమియొక్క ఉత్తర దక్షిణ ధ్రువముల ప్రాంతములయందు అరోరా (*aurora*) లను వింత వెలుగురు పుట్టుచుండునని, భూమియొక్క అయస్కాంత క్షేత్రములో తీవ్ర మగు మార్పులు (*magnetic storms*) కలుగుచుండును నని నిర్ధారణయైనది. సూర్యబింబమునందు కలిగిన ఈ విపరీత సంచలనము కారణముగా అమిత వేగము, విద్యుదావేశముగల గాలి అయానులు (*high speed ionized particles*) సూర్యవాతావరణమునుండి మన వాతావరణములో ప్రవేశించుటచేతనే ఇవన్నియును కలుగుచున్నట్లు ఈ రేడియో ఖగోళశాస్త్ర పరిశోధనలవలన నిశ్చయింపవలసి వచ్చినది.

సూర్యమండలమునుండి వచ్చు శబ్దములే కాకుండా, అంతకంటె శక్తివంతములగు శబ్దములు ఆకాశగంగ, నక్షత్రపథము (*Milky way*) అని మనము వాడుకునే గేలక్సీనుండి పుట్టుచున్నవి. వీటినే 20 ఏండ్లక్రిందట మొట్టమొదట రేడియో పరిశోధకులు కనిపెట్టినారు. ఈ విశ్వశబ్దము (*Cosmic noise*) వివిధ దిక్కులనుండి వచ్చునని, దాని తీవ్రత దిక్కునిపట్టి మారుచున్నదని రేడియో ఖగోళశాస్త్రజ్ఞులు తెలిసి కున్నారు. నక్షత్రపథమందు ఎచ్చట నక్షత్ర సంఖ్య హెచ్చుగానుండునో అచ్చటనుండి శబ్దము తీవ్రముగాను, సంఖ్య తక్కువగాఉన్న దిక్కునుండి శబ్దము బలహీనముగాను వచ్చుచున్నది. దీనినిబట్టి నక్షత్రపథముయొక్క ఆకారమును ఇదివరకుకంటె నిశితముగా నిర్ణయింపగలుగుచున్నారు. ఇతర బ్రహ్మాండ ద్వీపములను (*Island universes*). నెబ్యూలాలవలె (*Nebulae*) — మాదిరింజలవలె దూరదర్శినిలో అగపడే జ్యోతిర్మండలములవలె— గేలక్సీ (నక్షత్రపథము) కూడ సర్పిలాకారము. (*spiral*) కలదని చెప్పుటకు తగిన సాధారములు కన బడినవి.

మరియు నక్షత్రపథమునుండి వచ్చు శబ్దములకు సంబంధము లేనట్టి బలహీనమగు శబ్దము లున్నట్లు తెలియవచ్చినది. ఇవి రేడియో నక్షత్రములనుండి (*radio stars*) కలుగుచున్నట్లు ఈ పరిశోధనలవలన కనిపెట్టినారు. ఇదివర కెరిగిన ఏ నక్షత్రములకు సంబంధము లేనట్టి 40-50 రేడియోనక్షత్రములు గోచ రించినవి. వీటి జన్మ తీరెట్టిదో, ఇట్టి వింకా ఎన్ని యున్నవో అను అనేక విషయములగురించి రేడియో ఖగోళశాస్త్రవేత్తలు పరిశోధనలు చేయు చున్నారు.

చంద్రమండలమును కప్పియున్న ఒకధూళి తెర గురించి పూర్ణిమ అమావాస్యల మధ్య చంద్రమండ లముయొక్క వేడిలోని మార్పులగురించి పరిశోధనలు సాగుచున్నవి.

సూర్యకుటుంబమందలి గ్రహము లన్నియు వాతావరణ లేనట్టి చైతన్యము లేని, గోళములు. వాటి నుండి వచ్చే రేడియో తరంగములు అతి బలహీనములు గనుక రేడియో దూరదర్శినులను ఇంకను శక్తివంత ములుగా చేసి గ్రహముల గురించిన పరిశోధనలు జరుపప్రయత్నములు జరుగుచున్నవి. తక్కిన గ్రహ ములవలెకాక శుక్రగ్రహమును చుట్టి కొంత వాతా వరణమున్నదని తెలియుటచేత శుక్రగ్రహ పరిశీలనకై ప్రథమ ప్రయత్నములు సాగగలవు.

ఈ రేడియో ఖగోళశాస్త్ర మింకను బహు బాల్యదశలో యున్నది ఇది పెరిగిన కొలది మహ త్తరమగు ఖగోళరహస్యములు వెల్లడి కాగలవని ఆశించతగియున్నది.

## II. సకామ పరిశోధన :

(1) ట్రేసరు విధానము (*Tracer - method*) ప్రజాక్షేమము.

న్యూట్రానులు, ప్రోటానులు మొదలగు కణముల చేత పరమాణు కేంద్రకములను చుట్టడించి

కొట్టగా, కేంద్రకములు తారుమారై చీలిపోవుటచేత క్రొత్త పరమాణు కేంద్రకములు సృష్టియగుచున్నవి. ప్రోటానుచేత లితియము కేంద్రకమును కొట్టగా రెండు హీలియము కేంద్రకములు సృష్టియగుచున్నవి. ఇట్లే అనేక ప్రయోగములు జరుపబడినవి. సృష్టింపబడిన కేంద్రకములలో కొన్ని స్థిరకేంద్రకములుండును, అవి మార్పుచెందక అట్లే ఉండిపోవును. పై నుదహరించిన హీలియము కేంద్రకమట్టిదే. సృష్టియైన కేంద్రకములు కొన్ని అస్థిరములగుటచేత రేడియో ఏక్టివిటిని చూపి, ఎలక్ట్రానులను వదలి సుస్థిర కేంద్రకములుగా మారుచుండును. స్థిరమైన సోడియము కేంద్రకమును న్యూట్రానుతో కొట్టగా, అస్థిరమైన సోడియము కేంద్రకము సృష్టియగును. అది రేడియో ఏక్టివిటిని చూపి, ఎలక్ట్రానును విసర్జించి మెగ్నీషియము సుస్థిర కేంద్రకముగా మారుచుండును. ఈ రేడియో ఏక్టివు సోడియము కొన్ని గంటలవరకు సజీవమై ఎలక్ట్రానులను విసర్జించుచుండును. ఇట్లే రేడియో భాస్వరము, బొగ్గు మొదలగునవి కూడ. అవి సజీవములుగా ఉండు కాలములు ఒకదానికొక తీరు. మామూలు ఉప్పు (*Sodium Chloride*) తో కించిత్తు రేడియోసోడియము ఉప్పును (*Soduim Chloride*) కలిపి తినినచో రేడియోఉప్పు కూడ మామూలు ఉప్పువలెనే జీర్ణమగును. జీర్ణమగుచుండగా రేడియోఉప్పు దేహములో ఎక్కడ, ఎప్పుడు ఉండేది దేహము పై భాగమున అమర్చిన యంత్రసహాయమున గుర్తించవచ్చును. ఈ పద్ధతిని ట్రేసరు విధాన మందురు. ఉప్పు దేహములో ప్రవేశించినది మొదలు జీర్ణమైపోయేవరకు ఎట్టి మార్పులు, ఎలా చెందుచున్నది ట్రేసు చేయవచ్చును గాన—కనిపెట్టవచ్చును గాన—ఆ పేరు పెట్టబడినది. రేడియో సోడియమును సోడియముయొక్క రేడియో ఏకస్థానీయ మందురు (*Radio isotope of Soduim*). ఇట్లే రేడియో భాస్వరము, బొగ్గు మొదలగువాటిని వాటివాటి రేడియో ఏకస్థానీయము లందురు. ఈ భాస్వరమును, సోడియమును ఉపయోగించి జంతువులయందు, మొక్కలయందు జరుగు అనేక విషయములను గుర్తించుచున్నారు. మానవ కోటి కెంతో క్షేమమును కలుగజేయుటకై వైద్య శాస్త్రజ్ఞులు, జీవశాస్త్రజ్ఞులు, ఈ ట్రేసరు విధానము చేత పరిశోధనలు జరుపుచున్నారు.

కొవ్వు పదార్థములు (*Fats*), పిండి పదార్థములు (*Carbo-hydrates*), మాంసకృత్తులు (*Proteans*), దేహములో పొందే మార్పులను, ఈ విధానముచేత తెలిసికొని జీవశాస్త్ర రహస్యములను శోధించుచున్నారు. విటమిన్లు, హార్మోనులు, ఎన్జైములు, దేహక్రియలలో ఏ విధముగ ఉపయోగపడుచున్నవి, తెలిసికొనుచున్నారు. మధుమేహము కలవారికి ఇన్సులిన్ ఇచ్చినచో వారు తిన్న పిండిపదార్థములు చక్కెరగా మారకుండునట్లు ఇన్సులిన్ ఎట్లు చేయగలుగుచున్నది తెలిసికొనుచున్నారు. ఔషధములలోని ఇనుము, రక్తపుష్టి ఎట్లు చేయుచున్నదో, తిండిపదార్థములలోని భాస్వరము ఎముకలకు, పండ్లకు, ఎట్లు బలము నిచ్చుచున్నదో, ఈ భాస్వరము మొదలగునవి దేహములో ఎంత భాగ ముపయోగపడి, ఎంత విసర్జింపబడుచున్నవో మొదలగు అనేక విషయములు తెలియుచున్నవి. మరియు మందులవలన వ్యాధులెట్లు నివారణమగుచున్నది, మందులు, రోగక్రిములను ఎట్లు రూపుమాపుచున్నది తెలిసికొనుచున్నారు.

రసాయన ప్రయోగములలో కొన్ని వస్తువులను సంపుటి చేసి అవి ఏ పదార్థములుగా చివరకు మారుచున్నది కనుగొనుచుందుము. కాని ఆరంభమునకు—అంత్యమునకు మధ్య జరిగే మార్పు లేవో తెలిసికొలేక పోవుచున్నాము. ఈ ట్రేసరు విధానము వచ్చిన తరువాత మధ్య జరిగే మార్పులను కూడ గ్రహించగలుగుచున్నాము. దీనివలన రసాయనశాస్త్రజ్ఞాన మభివృద్ధి చెందుచున్నది. పరమాణుసంఖ్య 92 గలయురేనియముకంటె బరువైన పరమాణువు లిదివరలో సృష్టిలో అగపడుటలేదు. ఒక వేళ పూర్వమెప్పుడో ఉండినను రేడియో ఏక్టివిటీచేత అవి క్రమముగా అంతరించి పోయియుండును. అట్టివాటిని తిరిగి సృష్టించగలుగుచున్నారు. వాటిని ట్రేసరువిధానముచేత గుర్తించగలుగుచున్నారు. పరమాణుసంఖ్యలు 93 నుండి 98 వరకు గల నెప్ట్యూనియము, ప్లూటోనియము, అమెరిసినియము, క్యూరియము, బెర్కిలియము, కేలిఫోర్నియము అనునూతన రేడియో ఏక్టివుపరమాణువులనే కాక, ఇంకా పేరు పెట్టని 99,100 పరమాణు సంఖ్యలుగల రేడియో ఏక్టివు పదార్థములనుకూడ ఈమధ్యనే కనిపెట్టినారు. ఈ ట్రేసరు విధానముచేత

రసాయన, జీవ, వైద్యశాస్త్రములు ఎంతో అభివృద్ధి పొందుచున్నవి. ఎన్నో మందులకు నూతనోపయోగములు కనిపెట్టుచున్నారు. పరిశ్రమలయందు, యంత్ర నిర్మాణమందు కూడ ఈవిధాన మెంతో ఉపయోగపడుచున్నది.

అన్ని పరిశ్రమలకంటె వ్యవసాయపరిశ్రమ ప్రాచీనమైనది. ప్రజాసుఖజీవనమున కాధారమైనది. కొన్ని దేశములలో ఆహారపదార్థములు కొరతగా నుండుటచేత విపరీత సంక్షోభము కలుగుచున్నది. ఇండియావంటి దేశములలో నేటికూడ ప్రాతపద్ధతులతోనె వ్యవసాయము సాగుచున్నది. అమెరికా మొదలగు దేశములలో దున్నుట, విత్తనములు జల్లుట, ఎరువులు వేయుట మొదలగు కార్యములన్నీ, నూతన విధానములతో సాగుచున్నవి. ఎకరమునకు పండే పంట బాగా ఎక్కువగా పండుచున్నది. ఈ అభివృద్ధికి ముఖ్యసాధనము ఎరువులు. వీటి నుపయోగించిపంట నభివృద్ధిచేయుచున్నారు కాని, పంటకు ఎంత ఎరువుపయోగపడుచున్నదో, ఎంత వృథాగా నేలపాలగుచున్నదో తెలియుటలేదు. అందుచేత నాగరకతగల దేశములలోకూడ వ్యవసాయము కొంత గుడ్డితనముగానే సాగుచున్నది. ఇట్టి సందర్భములలో మార్గాన్వేషణ విధానము నుపయోగించి పరిశోధనలు జరిపి చాలా సంగతులు తెలిసికొన్నారు.

అమ్మోనియము ఫాస్ఫేటును ఎరువులో స్వయంప్రకాశమగు (*Radio-active*) భాస్వరమును స్వల్పముగా చేర్చి వాడినచో ఎరువులోని భాస్వరములో ఎంతపాలుపయోగపడుచున్నది తెలియుచున్నది. మరియు, కొన్ని పంటలకు ఆరంభమందే గాని, చివరవరకు ఎరువవసరము లేదని, బంగాళాదుంపవంటివానికి ఎరువులు చివరంటా కావాలని, ప్రత్తిపంట మొదలైనవాటికి, ఎరువు భూమిని పట్టి ఇంతయని, ఎరువు నుపయోగించేవిధానమునుబట్టి ఎరువుయొక్క మొత్తము కొన్నిపంటలకు మారుచుండునని, తెలియవచ్చినది. వ్యవసాయ పరిశోధనా కేంద్రములలో (*Experimental Agricultural Research Stations*) ఈమార్గాన్వేషణావిధాన సహాయముతో పరిశోధనలు చాలా దేశములలో జరుగుచున్నవి.

ఎరువులలో ఉపయోగించుటకై కావలసిన స్వయంప్రకాశమగు ఏకస్థానీయములు—బొగ్గగంధకము, భాస్వరము, కాల్సియము, పొటాసియము మొదలగునవి—వివిధ దేశములయందంతట నుపయోగించుటకు కావలసినంత విరివిగా, అమెరికా ఇంగ్లాండు దేశములలో తయారగుచున్నవి. భారతదేశమందు కూడ ప్రయత్నములు ప్రారంభమైనవి. రాగి, ఇనుము మొదలగు లోహములు పంటకెంతవరకుపయోగమను విషయము, పరిశోధన జరుగుచున్నది. పంటలకు కలిగే చీడలయొక్క, పట్టే పురుగులయొక్క, ఇతరవ్యాధులయొక్క స్వరూపమును తెలిసికొని వాటిని రూపుమాపుటకై ప్రయత్నములు జరుగుచున్నవి. రేడియో ఏకస్థానీయములను కొన్నిటిని పైరులపైని, పంటలపైని జల్లినయెడల, పొగాకు మొదలగు పంటలకు పట్టిన చీడలు గుళ్ళిపోగలవను విషయములెన్నో వెల్లడియగుచున్నవి.

ఈ వివిధోపయోగములను తెలిసికొనుటలో శ్రేష్ఠమగువిధానము—మార్గాన్వేషణా విధానము—అత్యంతోపయోగముగా ఉన్నది.

## *II.* (2) భూతకాల నిర్ణయము— రేడియో బొగ్గు

విశ్వకిరణములు మన వాతావరణమునందంతటా ప్రసరించుచున్నవి. వాటి తాకుడుచేత నైట్రోజను పరమాణు కేంద్రకము రేడియోబొగ్గు కేంద్రకముగా పరివర్తనమగుచుండును. అందుచేత వాతావరణములో 12 పరమాణు భారముగల సాధారణబొగ్గు, 14 భారముగల రేడియోబొగ్గు కలసియుండును. మొత్తము బొగ్గులోని లక్షకోటి ($10^{12}$) పరమాణువులయందు రేడియోబొగ్గు పరమాణువు ఒక్కటి మాత్రమే యుండును. అన్ని రేడియో ఏక్టివుపదార్థములవలెనే రేడియోబొగ్గు కూడ కిరణప్రసారము చేయుచు, హరించు స్వభావము కలది. ఎంత రేటుతో రేడియోబొగ్గు హరించునో అంతే రేటుతో వాతావరణమందు రేడియోబొగ్గు విశ్వకిరణముల కారణమున సృష్టియగుచుండును. అందుచేత మొత్తము బొగ్గులో రేడియోబొగ్గుయొక్క భాగము ఎల్లప్పుడు ఒకటిగానే ఉండుచుండును. వాతావరణమందుకల బొగ్గుపులుసుగాలి (*Carbon dioxide*) లో ఇమిడి ఈ బొగ్గంతయు ఉండును కాని వేరుగా ఉండదు. బొగ్గుపులుసుగాలి నుపయోగించుకుని చెట్లు, మొక్కలు పెరుగుచుండును. అందుచేత చెట్లలోని బొగ్గు పదార్థములో రేడియోబొగ్గు ఒక లక్షకోటి భాగమే ఉండును. చెట్టు బ్రతికియున్నంతవరకు రేడియో బొగ్గుయొక్క భాగము ఈ రీతినే ఉండును. చెట్టును కొట్టినచో అది గాలిలోని బొగ్గును గ్రహించలేదు. కొట్టిన చెట్టులో ఉన్న సాధారణబొగ్గు అట్లే ఉండిపోవును; రేడియోబొగ్గు క్రమముగా హరించి, దాని భాగము తగ్గిపోవును. రేడియోబొగ్గులో సగముభాగము ఇట్లు హరించుటకు 5,700 ఏండ్లు పట్టును. మిగిలిన సగభాగములో సగము హరించుటకు అనగా ఆరంభమందలి దానిలో నాల్గవవంతు మాత్రమే మిగిలియుండుటకు

ఇంకొక 5,700 ఏండ్లు పట్టును. మొత్తము 11,400 ఏండ్లు. రేడియోధార్మిక భాగము తగ్గినకొలది దాని కిరణప్రసారముయొక్క రేటు-తీవ్రత-కూడ తగ్గును. ఈ కిరణప్రసారపు రేటు కొలిచి సజీవముగానున్న చెట్టులోని పూర్ణప్రసారపు రేటుతో దానిని పోల్చి చూచినచో, ఎంతవరకు రేడియోధార్మిక తగ్గినదో తెలియును. దానినిబట్టి చెట్టు కొట్టి ఎన్నేండ్లయినది తెలిసికొన వీలగుచున్నది. ఈజిప్టులోని భూగర్భమందలి ప్రాతగోరీలలోని ముక్కలను, ఆదివాసులు (*Primitive Cave men*) నివసించు గుహలలోని కట్టెముక్కలను తీసి, వాటి కిరణప్రసారపు రేటును కొలిచి ఆ కట్టెలయొక్క కాలనిర్ణయము చేసిరి. చరిత్రవలన నిర్ణయమైన కాలములతో ఈ కాల నిర్ణయములు రమారమిగా సరిపోయినవి. దీనినిబట్టి భూతకాలనిర్ణయమును రేడియోధార్మిక సహాయముతో చేయవచ్చునని నిర్ణయమైనది. భూగర్భశాస్త్ర పరిశోధనలకు (*Geological researches*) పురాతన వస్తుశాస్త్ర పరిశోధనలకు (*Archaelogical researches*) ఈ విధాన ముపయోగపడుచున్నది. 1951 లో ఇరానీ దేశమందు ఒక అతి పురాతన పట్టణమును త్రవ్వి కనుగొన్నారు. అది సుమారు 7,000 ఏండ్ల నాటిదని ఈ రేడియోధార్మిక విధానము చేతనే నిర్ణయించినారు.

విజ్ఞానశాస్త్రపరిశోధనము మహావృక్షము వంటిది. శాఖోపశాఖలు కలిగి ఫలముల నొసగుచు నిరంతరము విస్తరించుచుండును. వివిధదేశముల యందలి పరిశోధకులు ఎడతెగని పూనికతో సత్యాన్వేషణము చేయుచున్నారు. నూతన విషయములను కనుగొనుచు, ప్రాతవిషయములను తరచి విస్తరింపజేయుచు, ఒక శాస్త్రమునకు, మరియొక శాస్త్రమునకును గల సంబంధములను గుర్తించి సమన్వయించు, సత్యముయొక్క వైశాల్యమును, ఏకత్వమును, నిరూపించుచున్నారు. తెలిసికోతగిన సత్యమగాధమైనది. దాని నన్వేషించు పరిశోధనా మార్గము అనంతమైనది.

---

## కవిత



శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

చివురుంజొంపము తేఁటి ఝూంకృతులతోఁ జెన్నార, క్రొంబూల వే
కువ గారాబుఁ బసిండి వెల్లువల దళ్కుందూఁగు టుయ్యాలలన్
నవవాసంత విలాసలాలస లసన్మందార, చాంపేయ, మా
ధవ సుశ్రీనవకంబు వెల్లివిరియన్ దావచ్చె; పూఁదావియై!

కొలఁకుల సాంధ్యరాగ విసి గూహనమోహన పాండురద్యుతుల్
దలకొని మేచకప్రభల, లాస్యదభంగుర భంగమాలికా
వళి విలసన్నవోదయ విభాసముదమ్ము కనుంగవన్ జగా
కలువలు బూయ నాయత వికాస సుపక్ష్మల నార్చివచ్చినన్

పలుకుం దొయ్యలి భృంగలాలిత విభా భాస్వత్కటాక్షాంచ లో
చ్చల మాధ్వీక మరంద మాధురులు నాస్వాంతంబు నిండార, దా
గల హంసాకృతి కాంతిపూర మదుమః కాసారసారంబులో
జలఖేలాయ తమత్త వృత్తయగుచున్ సంచారముల్ సేయుతన్

---

దృశ్య కావ్యము :

# బైసికిల్ దొంగ



ఇటలీలో...

ఇల్లిల్లూ తిరిగి ఉద్యోగా లడిగే రోజులు పోయాయి. ఎంప్లాయ్‌మెంటు ఏజన్సీలు వెలిసాయి. ఒకసారి అక్కడ పేరు రిజిష్టర్‌చేసుకోటం, ఇక అక్కడినుంచి ఆ చుట్టుపక్క లేపడిగాపులు గాసుకొంటూ కూర్చోటం. స్వయంకృషితో ఉద్యోగం చేసి న్యాయమార్గాన్న కుటుంబపోషణ చేసుకొందామనుకొన్న వ్యక్తులు వందలకు వందలు అక్కడే మూగుతూంటారు.

"అంథోనియో! అంథోనియో!"

ఎంప్లాయ్‌మెంటు ఏజంటు కోర్టు అమీనాలాగా ఆ పేరు కేక వేస్తున్నాడు. ఉద్యోగానికి మూగిన వాళ్ళు ఆ పేరందుకొని "అంథోనియో అంటోనియో" అంటూ అంచెలమీద ఆ పిలుపు ఆ చుట్టుపట్లంతా వెదజల్లుతున్నారు. ఏజన్సీదగ్గర క్యూలో ఆత్రంతో ముందు నుల్చొన్న వాళ్ళకు ఈ ఉద్యోగ లక్ష్యంలేని వ్యక్తికి రాకపోతే ఆ ఉద్యోగం తమ కెవరికన్నా రాకూడదాఅని ఈర్ష్య పుడుతూంది. ఒక మిత్రుడు అంథోనియోని వెదుకుతూ బయలుదేరాడు.

అంథోనియో క్యూదగ్గిర పడిగాపుల గాయటంతో విసుగెత్తి మందిరం పక్కనున్న మట్టికుప్పలలో వెన్నువాల్చి, మనసులోని నైరాశ్యంతో యుద్ధంచేయలేక నిస్పృహుడై గుడ్లు మిటకరిస్తున్నాడు. మిత్రుడిచ్చిన ఉత్సాహంతో ఒక్క పరుగున మూక చీల్చుకొని ఏజంటుదగ్గిర పడ్డాడు.

"సినిమా పోస్టర్లంటించే ఉద్యోగం. రేపు ప్రొద్దున్న ఏడుగంటలకు ఫలానా కంపెనీదగ్గర హాజరవు. ఈ ఉద్యోగానికి సైకిలుండాలి. నీకు సైకిలుందా?"

అంథోనియో గొంతుకలో ఉండి కిచలకగురక బైటికొస్తూంది. "లేదు. ఉంది" ననుగుతున్నాడు.

"ఏం చెప్పు. లేకపోతే ఉద్యోగం లేదు" ఏజెంటు వత్తిడిచేస్తున్నాడు.

"నాకు సైకిలుంది, నాకు సైకిలుంది, నాకు యిప్పించండి ఉద్యోగం, నాకిప్పించండి ఉద్యోగం" అంటూ వందకంఠాలు అరుస్తున్నాయి. ఏజెంటు వాళ్ళనందరిని నిశ్శబ్దపరచ చూస్తున్నాడు. అతిప్రయత్నంమీద అంథోనియో గొంతు పెగుల్చుకొని "ఉంది" అని నాలుకమడత పెట్టి అనేయగలిగాడు.

"రేపు పొద్దున్నే వెళ్ళి చేరు."

అక్కడ్నించి తప్పించుకొని బైటపడ్డాడు. దిక్కు తోచటం లేదు. ఈ ఉద్యోగం చెయిజార్చుకొంటే మళ్ళీ ఇంకో రెండేళ్ళదాకా మట్టిదిబ్బల మీద పడుకొని అంతరాత్మతో నిత్యయుద్ధంలో నిరసించవలసిందే. తనుపేట చేరుకొన్నాడు. వీధి కొళాయిదగ్గిర బాల్చీల సమ్మర్దంలో నిలబడి భార్య నీళ్ళు పట్టుకొంటూంది. ఎల్లాగో ఒక బాల్చీడు పట్టింది. త్రోపులాటలో రెండవ బాల్చీ పంపుదగ్గిరకు చేర్చింది. అంథోనియో పిలిచాడు. అసలే చిరాకులో ఉంది. ఏదీ కాని వేళ ఉద్యోగప్రయత్నాలు కూడా మానుకొని భర్త ఇల్లా ఎందుకొచ్చాడా అన్నట్టు చికాకుగా గొణుగుతూంది. ఇంటికి పోతున్నానన్నాడు. కేకవేసి ఆపింది. రెండు బాల్చీలతో బైటపడింది. "సంగతేమిటి?"

తన జీవితాన్ని తల్చుకొని సిగ్గుపడుతూనే చెప్పాడు. ఉద్యోగం ఉంది. కాని సైకిలు ఉండాలి. లేకపోతే ఉద్యోగం లేదు.

పెల్లబోయింది. గడచిన రెండేళ్ళ నిరుద్యోగంలో సైకిల్ తాకట్టుపెట్టుకొని వాడేశారు. 2000 ఫ్రాంకులుంటేగాని తాకట్టు ఫాకట్టుగాదు.

అతని మనస్సు పనిచేసే స్థితిలోనే లేదు. ఎంతయినా ఆడది జీవితాన్నెదుర్కొ గలిగి నిత్యకృత్యాలు జరుపుకొంటూ ముందు నడకకు సాగినట్టు మొగవాడు ఎదుర్కోలేడు. పదిఏళ్ళ కొడుకునీ పసిబిడ్డనూ భర్తనూ ఇందరినీ సాకుకొంటూ వచ్చింది. ఎల్లాగో ఆ నిస్పృహుని చేత నాలుగు మెతుకులు కతికించింది. పడకగదిలోకి, (ఒకే రూపంలో భాగాలుగా ఏర్పరుచుకొన్న సరంబీ) వెళ్ళింది. పక్కదుప్పట్లు, బొంతలు, శాలువలు అన్నీ తీసింది. ఆయింట నిద్రాదేవికి స్థానం లేదేమో, అవన్నీ దాదాపు కొత్తవిగానే ఉన్నాయి. పిల్లాడిని పసిబిడ్డకు కాపలా పెట్టింది. భర్తతో బైలుదేరింది.

"ఎక్కడికి"—తెల్లబోతున్నాడు.

"ఇన్ని దుప్పట్లెందుకు మనకు. తాకట్టో, అమ్మకమో - పెట్టి వచ్చిన డబ్బుతో సైకిలు విడిపించుకో వచ్చు—"

ఆమె దాని తెగింపుకూ, త్యాగానికి విభ్రమంతో మూగిపోయి వెంట నడిచాడు.

ఆమె బేరం చేసింది. అయిదు వేల ఫ్రాంకులకు మూట వదల్చుకొంది. ఆ షాపులో అల్లాంటి ఛిద్ర గృహచిహ్నాలైన తాకట్టు వస్తువుల వరుసల షెల్ఫులు, పైకప్పునంటుకొంటూ బరువుకు షెల్ఫులను కృంగదీస్తున్నాయి.

ఏ నిముషాని కానిముషంలోనే బ్రతకవలసిన పరిస్థితి. సంతోషంతో సైకిలు విడిపించుకొన్నారు. సైకిలు భుజాన తగిలించుకొని మహానిధానంగా చూసుకొంటూ నేల ఆననీయకుండా తెచ్చుకొంటున్నాడు. దారిలో ఎరుకలు చెప్పే ఎరుకసాని ఇల్లు ఉంది. ఈ కొత్త శుభసూచనతో భార్యకు భవిష్యత్తు తెలుసుకోవాలని ఆకాంక్ష జనించింది. ఇక్కడే ఉండమని లోపలికి పోయింది. ఎంతసేపటికీ రాదు. సైకిలు గుమ్మాన్కాన్చి కాపలా కాస్తున్నాడు. పనిలేనిపిల్లలూ యువకులూ గోలీకాయ లాడుతున్నారు. భార్య ఎంతసేపటికీ రాదు. "అబ్బాయి సైకిలు చూస్తుండే"మని పురమాయించి ఆ అబ్బాయి వినలేదనైనా గమనించకుండా లోపలికి పోయాడు. భార్య క్యూలో నిల్చొని ఉంది. ఏమిటే మూఢనమ్మకాలని మందలించ చూశాడు. చివరికి బైటపడ్డారు. పుణ్యవశాన సైకిలు పోలేదు. భార్యను ముందు కూర్చోబెట్టుకొని సైకిలు తొక్కుకుంటూ సంతోషంతో ఇల్లు చేరుకొన్నాడు.

తెల్లవారింది. పదిఏళ్ళకొడుకు బ్రూనో సైకిలు తుడిచి నీటుగా అట్టేబెట్టాడు. అంటోనియో పనిలోకి పోవటానికి ముస్తాబౌతున్నాడు. భార్యపట్ల కృతజ్ఞతతో కౌగిలించుకోబోయాడు. ప్రకృతి సహజమైన సరసంతో విడిపించుకొని, ఒక్కముద్దు దయచేసి ప్రయాణం చేసింది. పెట్రోలు బంకులో పని చేస్తూ ఇంటికి ఉద్యోగిగా ఉన్న పదిఏళ్ళ పసిబాలుడు బ్రూనో కూడా పనికి బయలుదేరాడు. బస్సుస్టాండుదగ్గర క్యూలో కొడుకుని దింపి అంటోనియో ఉద్యోగం చూసుకోటానికి వెళ్లాడు. బ్రూనో పెట్రోలు బంకుదగ్గర పనిలో లీనమైపోయాడు.

అంటోనియో పని సినిమాపోస్టర్లు, వీధి గోడల పైభాగాల్లో అంటించటం. ఒక నిచ్చెన, గోదుతొట్టి, పోస్టరు కాగితాలు ఇన్ని పుచ్చుకొని సైకిలుమీద తిరగాలి. సినిమా తారల మొగాలు ముడతలుపడకుండా పోస్టర్లు ఎల్లా అంటించాలో, వాళ్ళు కొత్త కుసిలిగా కనపడితే పోస్టర్లంటించే ఉద్యోగాని కెంత భంగకరమో, అన్నీ అంటోనియోకు నేర్పి, పెద్ద పనివాడు తన పనిలో తాను వెళ్ళిపోయాడు.

అంటోనియో ఒక గోడమీద బొమ్మ అంటిస్తున్నాడు. సైకిల్ పక్కన గోడకానించి నిచ్చెనమీద కూర్చుని పోస్టరులోని హెడీలామార్ యౌవనానికి భంగం రాకుండా తంటాలుపడుతూ మధ్య మధ్య సైకిలుకేసి చూస్తున్నాడు.

అకస్మాత్తుగా ఒక దొంగ సైకిల్ ఎక్కి ఉడాయించాడు. అంటోనియో ఆ మనిషిని గుర్తుగానే చూశాడు. క్రిందకొక్క ఉరుకురికి "దొంగ, దొంగ ఆపండి" అంటూ దొంగవెనక పడ్డాడు. జనం తెల్లపోయి చూస్తుండగానే దొంగ ఐపులేకుండా మాయమయ్యాడు.

అంటోనియో కాళ్ళీడ్చుకొంటూ పోస్టరుదగ్గరకు వచ్చాడు. ఏంచెయ్యటానికి తోచలేదు. పోలీసు స్టేషను కెళ్ళాడు. సైకిల్ నెంబరు, వివరాలు అన్నీ ఇచ్చాడు. "సైకిలూ దొంగా కలిసి కనబడితే దగ్గిరున్న పోలీసుని పిలు. ప్రయోజనం ఉండవచ్చు"నని ఇన్‌స్పెక్టరు తాపీగా సలహా ఇచ్చాడు. మరి పోలీసు రిపోర్టువల్ల ప్రయోజనమేమిటి? దొంగను వెంటనే పట్టుకోలేరా!

నీ సైకిలుకోసం పదకాలంటే ఇటలీలో ఉన్న పోలీసు బలంఅంతా చాలదు. సైకిలూ దొంగా దొరికితే, రిపోర్టు ప్రయోజనం అప్పుడుంటే ఉండవచ్చును అన్నాడు ఇన్స్పెక్టరు.

బస్సెక్కి ఇంటిదగ్గిర స్టాండులో బ్రూనోను కలుసుకున్నాడు.

"నాన్నా సైకిలు ఏదీ?"

మొగం తిప్పేసుకొన్నాడు. ఇంటికి కెళ్ళటానికి మొగం చెల్లటంలేదు. కొడుకు అడిగే అమాయక ప్రశ్నలకు జవాబు చెప్పలేకపోతున్నాడు. ఇంటి చాయలకు వచ్చాక ఇంట్లో కెళ్లటం మరీ కష్టమనిపించింది. "నువ్వింట్లో కెళ్లు. నేను ఇప్పుడే వస్తా" అని కొడుకుని పంపించి తన ఆప్తమిత్రుడిదగ్గిరకు వెళ్లాడు.

"అబ్బాయి బాధపడకు. సైకిల్ దొంగ ఈపాటికి ఎప్పుడో టైర్లకు టైర్లు చక్రాలకు చక్రాలు బెల్, సీటూ అన్నీ మార్చేసి ఉంటాడు. ఫ్రేముకు కొత్తరంగు వేసిఉంటాడు. వేటికవి సెకండుహాండ్ బజారుకు వెళ్లిపోయుంటాయి. అయినా రేపు ఆదివారం నల్గురం వెళ్లిచూద్దాం—"

మర్నాడు పిల్లాడు బ్రూనోను వెంటబెట్టుకొని స్నేహితులను ముగ్గురను కలుపుకొని సెకండుహాండు బజారుకు బయలుదేరారు.

"ఒరేయి నువ్వు టైరులు చూస్తూ ఉండు—ఫలానా టైర్ తెలిసిందా—అబ్బాయి నువ్వు చక్రాలు చూడు. అంథోనియో నీకు ఫ్రేము నంబరు తెలుసుగా. వాళ్లు చెరిపేసి ఉంటారు గాని అయినా ప్రతి ఫ్రేమూ చూడు. ఒరేయ్ బ్రూనో నీకు గంట తెలుసుగా గంటలన్నీ చూడు. నేను సీట్లు చూస్తాను. దొరకటం కష్టంగాని.—అయినా నీకోసం చూస్తాం పద—"

తండ్రికీ కొడుకుకూ ఉన్న ఆదుర్దా తక్కిన వాళ్ళకెల్లా ఉంటుంది! నిష్ఫలం అనుకొనే స్నేహిత ధర్మం పాటిస్తున్నారు. అక్కడ అన్నీ గంటలే, అన్నీ సీట్లే, అన్నీ చక్రాలే, అన్నీ టైర్లే, అన్నీ ఫ్రేమ్లే—నిండు సైకిళ్లు కూడా పరీక్ష చేసుకొంటూ చూస్తున్నారు. బ్రూనో గంటలన్నీ పరీక్షగా చూస్తున్నాడు.

అంథోనియో కొక ఫ్రేము, షాపులో బాగు చేసున్నది, తన దనిపించింది. నెంబరు చూడనిమ్మన్నాడు. ఆ షాపుఅతనికి మండుకొచ్చింది. చూపించను పొమ్మన్నాడు. అన్నకొద్దీ అనుమానం. స్నేహితులు నిదానించమంటున్నా వెళ్లి పోలీసును తీసుకొచ్చాడు. పోలీసు నెంబరు చూసేటట్లు చేశాడు. తనది కాదు. మొగం వాల్చుకున్నాడు. షాపువాడూ పెళ్లామూ కలిసి చెడామడా తిట్టారు. స్నేహితులీ ధోరణి బాగుండలేదని అంథోనియోను మరలించారు. ఇంతలో భోరున వర్షం. స్నేహితులు ఇళ్ళకు తప్పుకున్నారు. బజారువాళ్ళు కొట్లు మూసేసుకొని తరలిపోతున్నారు.

వాన జోరుగా కురుస్తోంది. అంథోనియో ఒక చూరుపంచకు చేరుకున్నాడు. బ్రూనో పరుగెత్తుతో పడి లేచి అక్కడకు చేరుకున్నాడు. తండ్రి గమనించటం లేదు. "నాన్నా! నేను పడ్డాను." చెప్పినా గ్రహించేస్థితిలో లేడు అంథోనియో. వాన కాస్త వెలువగానే మళ్ళీ బజారు చేరుకున్నారు. ఒక ముసలివాడు షాపుదగ్గిరకు ఒక వ్యక్తి సైకిలు తెచ్చి, బేరంపెడుతూ అంథోనియోని చూసి దౌడుతీశాడు. అంథోనియో అతనికోసం పరుగెత్తాడు. బ్రూనో కూడా పరుగెత్తాడు. ఆ మనిషి అందలేదు. ముసలివాడ్ని కలుసుకొందామని వెనక్కువచ్చారు. వృద్ధుడు షాపు మూసేస్తున్నాడు. ఆ మనిషి ఎరుగనన్నాడు. అక్కడ హడావిడిలో అంథోనియోను తప్పించుకొన్నాడు.

అంథోనియో బ్రూనోతో కలిసి ముసలివాడిని వెదకసాగాడు. వానలో తడుస్తూ తారుతూ ముసలివాడు ప్రభుత్వ ధర్మసత్రంలో దూరాడు. అంథోనియో వెంటబడ్డాడు. ముసలివాడు మంగలి షాపులో దూరాడు. అక్కడినుంచి ధర్మసత్రంలో నుంచి, వాళ్ళ ప్రార్థనచర్చిలో దూరాడు—అంథోనియో వెంటబడి చర్చిలో ముసలివాడి పక్కనే చేరాడు—"ఆ మనిషెక్కడున్నాడో చెప్పు", అని గొంతుక బిగబట్టి గదమాయిస్తున్నాడు. ముసలివాడొక దొంగఅడ్రసు చెప్పాడు. అంథోనియో వాడిని తన వెంట రమ్మన్నాడు. ముసలి మొండికేశాడు. ఈ అల్లరికి ఫాదరీ గదమాయిస్తున్నాడు. అంథోనియోకి ఉద్రేకం ఆగటంలేదు. అక్కడ గల్లంతులో ముసలివాడు చల్లగా జారాడు. చర్చిలో ఒక నల్ల తెరవెనుక నక్కాడు—అంథోనియోని బైటికి పంపిస్తున్నారు. బ్రూనో తెరదీసి ముసలాడిని చూశాడు. ముసలి

పిల్లడినెత్తిని ఒక్క దెబ్బవేశాడు — బ్రూనో చెప్పగా అటు పరుగెత్తాడు ఆంథోనియో. తెర వెనుక కాళీ. చర్చిలో అల్లరి చేస్తున్నందుకు అంథోనియోని చర్చివాళ్ళు వెపల నడిపారు.

దొరకినట్టే దొరకి దొంగజాడ చెయిజారి పోతోంది. బ్రూనోకు విసుగ్గా ఉంది. తండ్రిని చికాకు పెడ్తూ మొరాయిస్తున్నాడు. అంథోనియో ఆ చిరాకులో బిడ్డని ఒక్క లెంపకాయ కొట్టాడు. బ్రూనోకు కోపం ఏడుపూకూడా తలమున్కలుగా వచ్చాయి. తను వానలో తడిసి, ఉచ్ఛ్వాసుకోటానికన్నా తీరికలేకుండా సైకిల్‌కోసం ఇంతకష్టపడి వెతుకుతున్నా, నాన్నకు చీమతలకాయంత విశ్వాసమైనా లేదనుకున్నాడు. "అమ్మతో చెప్తానుండు" అంటూ కళ్లనీళ్లు పెట్టుకొని ఏడుస్తున్నాడు. అంథోనియో పశ్చాత్తాపపడి సముదాయించాడు, కాని బ్రూనో కోపంతో దూరంగానే నడుస్తున్నాడు.

ఆ చర్చి వెనకదోవ నదిఒడ్డుకు చేరుతుంది. నది ఒడ్డున వెదికితే ముసలాడు దొరుకుతాడేమో! "బ్రూనో ఆ బ్రిడ్జిమీద కూర్చునుండు ఇప్పుడే వస్తా ఎక్కడికీ కదలకు" అని చెప్పి నది ఒడ్డున మట్టిగుట్టలన్నీ చూపు సారించి వెదుకుతున్నాడు. బ్రిడ్జి దిగువను కల్లోలం వినిపించింది. "నీళ్లల్లో పడిపోయాడు" అని అరుస్తున్నారు. అంథోనియోగుండె, ఆగిపోయింది. అటు పరుగెత్తాడు. బ్రిడ్జిపైకి కనుచూపు అందలేదు. జనం మూగిన చోటికి పరుగెత్తాడు. బ్రూనో కాదు! ఎవరో యీతగాడు నీళ్లల్లో మునుగుతుంటే తీశారు. నిట్టూర్పు విడిచి వెనక్కివచ్చి బ్రిడ్జిదగ్గరకు వచ్చాడు —బ్రూనో బుంగమొహం పెట్టుకొని మెట్లు దిగుతున్నాడు.

ఇక బిడ్డని కష్టపెట్టలేడు. తను కష్టపడలేడు. ఒకటే వైరాగ్యం. జేబులో తాకట్టు బాపతు డబ్బు కొంత మిగిలిఉంది. జీవితం ఏక్షణాని కాక్షణం జీవించవలసిందే. రేపటి విషయం ఆలోచించటం—మృగతృష్ణలవెంటాడటమే—"నాయనా ఆకలేస్తోందా ?"—పిల్లడికి ఆకలేస్తూంది.

పెద్ద హోటలు ప్రవేశించాడు. అక్కడి నృత్య గీతాల ఆనందంలో మునిగిపోదలిచాడు. దూరంగా ధనికుల పిల్లడు ఖరీదైన తినుబండారాలన్నీ తింటున్నాడు. బ్రూనో అటు చూస్తున్నాడు. "అవి తెప్పించనా బాబూ"

అన్నీ తెప్పించాడు.

ఆ పిల్లలు చాలా సుతారంగా తింటున్నారు.

బ్రూనో కది చేతకావటంలేదు. అటు చూడకుండా, తన ప్లేటుతో యుద్ధం చేయసాగాడు బ్రూనో. అంథోనియో కొడుక్కి వేదాంతం బోధిస్తున్నాడు. ఉన్నప్పుడే, తినాలి ఆనందించాలి. రేపు సైకిల్ లేదని ఉద్యోగం ఉండదు. ఆవిషయం ఈనాటి ఆనందాన్ని పాడుచేయకూడదు. పిల్లడికి కాదు చెప్తూన్నది! ఈకాస్త సౌఖ్యానికి ఈసడిస్తూన్న తన అంతరాత్మకి జవాబు.

దోవలో మునుపటి "ఎరుకసాని" భవనం కనపడింది. ఆవేళ భార్యని నీకూ ఈ మూఢనమ్మకాలున్నాయా అని వేళాకోళం చేశాడు. ఏమో! సహేతుకంగా సాగిద్దామనుకొంటే సంఘటనలన్నీ ఇంత సక్రమంగా ఏడుస్తున్నాయి. లోపలికి వెళ్లి, ఎరుక నడిగి తెలుసుకొన్నాడు. "సైకిల్ ఇప్పుడు దొరికితే దొరుకుతుంది లేకుంటే అసలు దొరకదు"—అంతకు మించి దేవతలు చెప్పరు.

బైటపడి అన్వేషణ సాగిస్తున్నాడు. దొంగ కనబడ్డాడు ఎరుక నిజమే—తన్ను చూసి తచ్చాడుతూ పోతున్నాడు. ఎరుక నిజమే! వెంటబడ్డాడు. ఆ మనిషి ఓయింట్లో దూరాడు. తనూ వెంటనే దూరాడు.

"నా సైకిలు ఏదీ?"

"నాకు తెలియదు సో !"

పట్టు చిక్కించుకునేందుకు పిల్లి ఎలుకను విదిలిస్తూన్నట్టు ఆ దొంగ యింటిముందే దొంగను బుజాలుపట్టుకు విదిలిస్తున్నాడు—పేటలో ఆడా మొగా అంతా మూగారు—ఓహో! అక్కడెంత సంఘీభావం! ఆ పిల్లడిని వదలమంటే వదలమన్నారు—కావలిస్తే పోలీసును తెచ్చుకోమన్నారు. పోలీసుని పిలుచుకొచ్చాడు—దొంగ ఇంట్లో చేరి ఇల్లంతా వెదికారు—దొంగ తల్లి మహా నిరసనంతో తూస్కారించివేస్తూంది. పాతటైర్లున్నాయి. అవేవో వాడి మామయ్య తెచ్చాడు గాబోలు అంది తల్లి.—సైకిలుమాత్రం లేదు. పోలీసు నీకు సాక్ష్యముందా అని అడిగాడు. దొంగను చూసుకోనా సాక్ష్యాలు చూసుకోనా! మనిషి తనకు గుర్తే—తన ఇంద్రియాలు తన్ను మోసంచెయ్యవు. తను తన

ఆత్మను మోసం చెయ్యడు. కాని ఆ నిజాయితీ ప్రయోజనం పోలీసుకు కనబడలేదు—అబ్బాయి లాభంలేదు వెళ్ళమన్నాడు. పేటపేట అంతా, "పోలీసుల తొత్తు" అంటూ అంథోనియోను వెక్కిరిస్తూ పేటనుంచి వెడలనడిపారు.

బ్రూనో కాళ్లరిగిపోతున్నాయి. ఆదివారం సైకిల్ పందాలు ఆటలు జరిగేచోటుకి వెళ్లారు. ఏ సైకిలని సర్దుపట్టటం—లక్ష సైకిళ్లు వరుసతీర్చినట్లు కళ్లల్లో ఆడుతున్నాయి ఆ చోటు విడిచి కదిలారు.

ఒక భవనంముందు తలుపవతల సైకిలు ఆనించి ఉంది. కాపలా ఎవరూ కనబడటంలేదు—ఆ నిస్పృహలో కలిపురుషుడు మనస్సులో ప్రవేశించాడు. ఊపిరాడక అటూ ఇటూ అక్కడే పచారు చేస్తున్నాడు. బ్రూనో కాళ్లు పీక్కుపోయి పేవ్మెంటుమీద కూలబడి తండ్రి మొగంవంకే చూస్తున్నాడు.

అంతరాత్మకన్నా నిశితంగాఉంది ఆ పసి చూపు. తమ పేటకు వెళ్ళే ట్రాం వస్తూంది. "బాబూ, ట్రాం ఎక్కి నువ్వు ఇంటికిపద నేను ఇప్పుడే వస్తున్నాను." అని పంపించాడు. బ్రూనో వెళ్ళేటప్పటికి ట్రాం నిండిపోయి కదిలిపోయింది. బ్రూనో అక్కడే కూలపడ్డాడు.

"దొంగ, సైకిల్ దొంగ!" అంటూ కేకలూ జనం మూకగా పరుగూ చూశాడు బ్రూనో. అటు మూకకేసి కదిలాడు. తమ సైకిలేనేమో—జనం దొంగని పట్టుకొన్నారు. తంతున్నారు. బ్రూనో చూశాడు. దొంగ తండ్రి అంథోనియో! తండ్రి మోకాళ్లను కౌగలించుకొని "నాన్నా నాన్నా" అని ఏడుస్తున్నాడు.

అంథోనియో మొగంలో కపటిక లేదు—ఈ జనం కాదు తన్ను తంతూంది. విధి! విధి కాకపోతే కొడుకు నక్కడెకు తేదు—నిర్జీవంగా తిట్లు తన్నులూ భరిస్తున్నాడు.

"పిల్లాడికి మంచిపాఠం నేర్పుతున్నావే! భలే తండ్రివే! పిల్లడిని చూసి వదులుతున్నాం ఫో!" అంటూ నికృష్టంగా తమ నక్కడవదలి సైకిల్ తీసుకొని జనం తొలగిపోయారు.

తల వంచుకు ముందుకు సాగాడు—తండ్రి కోటుపట్టుకుని వేళ్లాడుతూ నల్ల నీరు కుక్కుకుంటూ, తండ్రి కాలు కౌగలించుకొని వస్తున్నాడు బ్రూనో—ఎంత పైకి చూసినా తండ్రి ఆకాశంలోకి చూస్తున్నాడు తప్ప తన మొగంలోకి చూడటం లేదు.

తండ్రి బాధ కొడుకూ, కొడుకుబాధ తండ్రీ అర్థంచేసికొంటూ బాధపడుతూ—ఆ సంజెచీకటి మూకలో కలిసిపోయారు.

[ప్రసిద్ధ ఇటాలియన్ చిత్రం "బైసికిల్ థీఫ్" అన్న చిత్రంలో చూచాయగా తెలిసేకథ ఇది. వాస్తవికతను జాదాపు నేటి ఉత్తమచిత్రాలన్నీ పాటిస్తున్నాయి. కాని నిత్య జీవిత సామాన్యత్వాన్ని అందులోని జీవిత విషాదాన్ని, ధ్వనివిశేషమాత్రంచేత గాఢంగా హృదయస్థం చేయగల ప్రతిభావంతమైన చిత్రాలు ప్రపంచచిత్రాల మొత్తంమీదే బహుకొద్ది కనిపిస్తాయి. ఆ ఉత్తమ శ్రేణికి చెందిన చిత్రం ఇది. భాష తెలియకుండా బొమ్మలు చూసి గ్రహించినంతమాత్రంగామాత్రమే ఇక్కడ కథగా చెప్పటానికి ప్రయత్నం జరిగింది. చిత్రం చూస్తేనేగాని, ఆ దృశ్యకావ్యంలోని ప్రతిభ గోచరం అవటం కష్టం.]

---

# శ్రీ. శే. కె. యస్. వెంకటరమణి



ప్రసిద్ధ తమిళ రచయిత శ్రీ కె. యస్. వెంకటరమణి తన 61 వ ఏట, దీర్ఘవ్యాధి పీడితుడయి యీ ఫిబ్రవరి నెల 23 న తనువు చాలించాడు. గాంధీయుగాన్ని గీతాలలో సుప్రసిద్ధ తమిళకవి "భారతి", ఇతిహాస వ్యాసాలలో కె. యస్. వెంకటరమణి, తమిళ సాహిత్యంలో ఉజ్జ్వలంగా ప్రతిధ్వనింపచేశారు. వెంకటరమణి ఆంగ్ల రచయితగా ముందు ప్రసిద్ధిలోకి వచ్చి, టాగూర్ వంటి ప్రపంచ ప్రఖ్యాత రచయితల ఆదరణను పొందగలిగి, పాశ్చాత్య దేశాలలోనూ తమిళనాట ప్రఖ్యాతికి వచ్చాడు. తరవాత మాతృభాషలోనే తన సాహిత్యవ్యాసంగం సాగించాలన్న జాతీయోత్సాహంతో తమిళంలో పత్రికలు నడిపి, మాతృభాషలో కూడా ప్రఖ్యాత రచయితగా పేరుపొందాడు.

భారత ఆర్షధర్మాదికం, భారతీయ సంస్కృతి, ఇనటి ఆధ్యాత్మిక దృక్పథం, ధర్మచోదితమైన అర్థకామ సాధనతో-మోక్షగమ్యాన్ని చేరుకోవటం ఈ భావనలన్నీ ఇతనిలో పురా పరంపరంగా జీర్ణితమై పోయి, మహాత్ముని బోధావిధానానికి ఇతన్ని కైవసం చేసుకొన్నాయి. భారతసంస్కృతి దృక్పథంతో గ్రామ పునర్నిర్మాణం, వికేంద్రీకృత ఆర్థిక, పంచాయితీపాలక పునర్నిర్మాణము, అహింసా విధానంతో సంఘ విజయము, వ్యక్తిస్వాతంత్ర్యము, వ్యక్తి గౌరవము, మానుష న్యాయాలను గౌరవించే సంఘ ఆదర్శము, ఇత్యాది గాంధేయ భావాలు "రైతు మురుగన్", "దేశభక్త కందన్" మొదలైన ఉజ్జ్వలమైన నవలల సృష్టికి ఇతన్ని ప్రోత్సహించాయి. బోధ మాత్రమే కాకుండా ఆచరణ కూడా అలవర్చుకొని కావేరీ తీరంలో ఆశ్రమం కట్టి పోషించిన కవి, యస్. వి. వెంకటరమణి.

1891 లో మాయవరంలో జన్మించాడు. బాల్యపు చదువంతా ఆ ఊళ్ళోనే గడిచింది. ఉన్నత విద్యకై మద్రాసు వచ్చి క్రిస్టియన్ కాలేజీలో చేరాడు. ఇంగ్లీషు లిటరేచర్‌లో ఆనర్సు పాసయాడు. 'లా' పరీక్ష ప్యాసయి సర్ సి. పి. రామస్వామి అయ్యర్ గారివద్ద జూనియర్ లాయర్‌గా చేరాడు.

కాలేజీ రోజులలోనే ఆంగ్లభాషా వ్యాసంగంలో ప్రఖ్యాతి గడించాడు. 1921 లో "పేపరు బోట్సు" (కాగితపు పడవలు) అన్న ఆంగ్లవ్యాస సంపుటి ప్రచురించాడు. మురుగన్ ది టిల్లర్ అనే నవలతో గ్రామపునర్నిర్మాణ సమస్యలను అద్భుతంగా ఆకళించుకొన్న నవలా రచయితగా మంచి పేరు తెచ్చుకొన్నాడు. కందన్ ది పేట్రియట్ (దేశభక్త కందన్) లో గాంధీ ఉద్యమాలను ప్రతిబింబించాడు. 1937 లో "జటాధర, తదితర కథలు" అన్న కథల సంపుటి ప్రచురించాడు.

1920, 30 ల మధ్య "తమిళ్ ఉళగు" అన్న తమిళ పత్రికను, 1930, 40 ల మధ్య భారతవాణి అన్న తమిళ వారపత్రికను (తర్వాత మాసపత్రిక అయింది) ప్రారంభించాడు. ఆయన భాష చక్కని పాకంలో ఉండి, మంచి ధార, శబ్ద చమత్కృతి, చక్కని హాస్యము, భావాలపిగి, అతి ఆస్వాదనీయమైన ప్రసాదగుణమూ కలిగిఉంటుందని తమిళ సారస్వతులు మెచ్చుకొంటారు. యువకవులను రచయితలను ప్రోత్సహించడంలోనూ చాలా ఉదారుడని, ఆయన సంభాషణ, సునిశితమైన హాస్యంతో అమృతతుల్యంగా ఉండేదని ఆయనెరిగిన సాహిత్యపరులంతా, గత ఆగస్టులో ఆయనషష్టిపూర్తి సందర్భంలో జరిగిన ఉత్సవంలో, తమతమ ఉపన్యాసాలలో వెల్లడించారు.

1945—47 దాకా అల్వార్ సంస్థానంలో, విద్యాశాఖ సలహాదారుగా ఉద్యోగం చేశాడు. విద్యావిషయంలో యునెస్కోలాంటి ప్రపంచ సమితులుకూడా ఈయన సలహాలను పాటించేవి. మద్రాసు యూనివర్సిటీ సెనేటులో మూడేళ్లు, అన్నామలై యూనివర్సిటీ సెనేటులో తొమ్మిదేళ్లు సభ్యుడుగా పనిచేశాడు. ప్రఖ్యాత భారతవిశ్వవిద్యాలయాలన్నీ ఈయనచే ఉపన్యాసాలిప్పించాయి. ఆయన తన షష్టిపూర్తి సందర్భంలో తననుగూర్చి చెప్పుకొన్నట్లు "ధృతి, నియమ, రక్షితమైన ధర్మం ప్రాతిపదికగా, భారతదేశం యావత్ప్రపంచమూ కూడా పురోగమించగల ఆశయంతో ఒక నూతనపథ నిర్మాణం కోసం జీవితంతో కృషిచేసిన" మహానీయుడు. తన భార్య, ఏకపుత్రులను విషాదంలో ముంచి ప్రపంచ పథం వీడిపోయాడు. ఆ కుటుంబానికి సానుభూతితో ఈయన ఆత్మకు శాంతి కలుగుగాతమని ప్రార్థిస్తున్నాము.

# నవయుగోదయము



శ్రీ దండిపల్లి వేంకటసుబ్బాశాస్త్రి

౧

నీవే రాజువు నేటినుండి;—మన పున్నెంబుల్ ఫలింపంగ, నే
సేవాసూత్రము లామహాత్ము డుపదేశించెన్, ప్రజాస్వామ్యరా
జ్యావిష్కారకునాడు, వాని స్మరణన్ సాగించి, దేశమ్ము ర
క్షావైయక్తిని నేలుమో భరతవత్సా! నీకు శ్రేయంబగున్.

౨

వదలెన్ భారత దాస్యబంధము, ప్రజాస్వామ్య ప్రభుత్వమ్ము న
భ్యుదయోత్కర్షముగా లభించినది లెమ్మోయీ! స్వతంత్రంపు న
వదలింపారిన జాతిజీవనము, నీ పాండిత్య, మీ సంస్కృతిన్
విదితం బయ్యెడు విశ్వమంతటికి నీ విజ్ఞానమూలమ్మునన్

౩

ఒకనా డుండిన చక్రవర్తులు, ప్రభుత్వోద్యన్మహా గర్వ రా
జకులాలంకృతు, లాత్మ వంచకులు సంస్థానాధిపుల్ లేరు; నే
టికి స్వాధీనము చేసికొన్న జయపెట్టెన్ మూఁడులోకంబు, లెం
తకు వెల్గింపుము భారతమ్మున స్వతంత్రజ్యోతి వీరవ్రతా!

౪

నీ తేజమ్మును జూచి-జాతు లిక మన్నింపన్ వలెన్; శాంతి సం
కేతమ్మైన పతాక విభ్రమమునకై కేల్మోడ్చు విశ్వంబు; సం
పూతమ్మయ్యెడి నీయమోఘ చరితమ్మున్, నూత్న రాజ్యాంగ వి
ఖ్యాతిన్ నిల్పుము భారతా! నవయుగాద్యాదర్శ రాజ్యమ్ముచేన్.

౫

కాశ్మీర సౌందర్య గహన సీమలు విదే
శపు యాత్రికుల నివాసములు కాగ,

జీవనదు లఖండ సేతువృత్తము తోట
  బంగారు పండు భూవసతికాగ,
వైజ్ఞానిక మహత్త్వ వర్ధిత విద్యలు
  అఖిల జాత్యభ్యుదయములు కాగ,
రాజ్యతంత్రమ్ము సర్వంసహా మానవ
  శాంతి సందేశ ప్రసారి కాగ,
సంస్కృతీ విభవమ్ము నసంఖ్యములగు
నాగరికతల దిద్ది మన్ననల బొంద—
పాలనము జేయు మింక నో భరతవీర!
ప్రజలకొరకు! ప్రజకొరకు!! ప్రజలకొరకు!!!

౬

ప్రజయే నీకు శరణ్యమంచు మదిలో భావించి, స్వర్గోరు సౌ
ఖ్యజయప్రోజ్జ్వల నైతికప్రవణ బుద్ధాశోక చక్రాంకిత
ధ్వజ సందేశ విరాజమానమగు తత్త్వమ్మ్మని, సాగింపుమా,
విజయ మ్మాగద నీకు భారత! శుభావిష్కార మైయుంట చేఁ.

౭

ఇది ప్రజాస్వామ్య నవయుగ మ్ముదయ మైన
పాడు నాందిగీతముఁను పరభృతములు
ప్రకృతి వర్షించె హిమకణప్రవణకుసుమ
విసరముల భారతా! నీకు విజయ మింక.



# మహాభినిష్క్రమణం





శ్రీ బొడ్డు బాపిరాజు

(అంతఃపురంలో హంసతూలికా తల్పంపైన గౌతముడు, ప్రక్కన సువర్ణపీఠంపై యశోధర. రాజ వంది కైవారం చేస్తుంటాడు)

వంది : "సకలాశా వనవీధి తారక
లుదంచ ద్యామినీ వల్లికా
ముకుళమ్ముల్ విరబూసె; నెల్ల జగముల్
ముంచెత్తె నిద్రామధూ
లిక; నిశ్శబ్ద పతంగి పక్షులు
సారించెన్; వధూహాస్య లా
స్యకళా న్యాస చలద్విలంఘులలు
విశ్రాంతించె నంతఃపురిన్."

గౌత : దేవీ యశోధరా!

యశో : ప్రభూ!

గౌత : (మౌనం)

యశో : పిల్చారా ప్రభూ!

గౌత : (పరధ్యానంలో) ఏమన్నావ్?

యశో : మీ మనస్సు కలతపడినట్లుంది. రాజ వంది కైవారం చేసి వెళ్లి చాలాసేపయింది. యిది మీ నిద్రవేళ. (అనునయంగా) యేవో సామాన్య విషయాల కెందు కింతారాటం ప్రభూ!

గౌత : (సాభిప్రాయంగా) యివి సామాన్య విషయాలే నంటావా దేవీ?

యశో : జీవికి జరా మరణాలు సహజ ధర్మాలే కదా.

గౌత : అయినప్పుడు వాటికంత భయపడ్డం దేనికి? యౌవనానికీ జన్మకు భయపడమేం మరి? వీటి పరిణామాలేగా అవి. యిక్కడ లేని భయం దుఃఖం అక్కడెందు కుండాలి?

యశో : అరుణోదయంలా మేల్కొలిపే జీవితాన్ని వెలిగించే ఆశాభ్యుదయరేఖ లివ్వి.—అవ్వి అస్తమయంలాగా నిశ్శబ్ద నీలాంధకారంలో కలిసిపోయే నిరాశా నిస్పృహచ్ఛాయలు—

గౌత : (చిరునవ్వుతో) అంతా నీ పలుకుల గారడీ! నిజాని కుభయసంధ్యలూ సమానరమణీయాలు జననమరణాలల్లా కాదు—అస్తమయానికీ వుదయానికీ మధ్యనున్న వ్యవధి మనకొక ప్రత్యాశా అభయం కలిగిస్తూ వుంది. కాని, మృత్యువుకూ జన్మకూ మధ్యవున్న అఖాతంమాత్రం భయపెడుతూ వుంది. అందుకే జరామరణాలంటే భీతీ, నిస్పృహా. వీటిని జయిస్తేకాని లోకం నిర్భయం కాదు.

యశో : (ఆశ్చర్యంగా) ఏమంటున్నారు ప్రభూ! జరామరణాల్ని జయించడమా? అది సాధ్యమే?

గౌత : ఎందుకు కాగూడదు? యేనాడు వాటికి భయపడమో ఆనాడు వాట్ని జయించినట్లే. మరా మార్గాన్నన్వేషించి జగత్తును నడిపించే బోద్ధా, తపశ్శాలీ, కావాలి.

యశో : (శంకిస్తూ) యీ చరణదాసిని అన్యాయం చేయకండి ప్రభూ! నా హృదయానికి దీప్తి మీరూ, నా కన్నులకు వెన్నెల రాహులుడూ.

గౌత: పిరికిదానా! ఎందుకలా భయపడతావ్!

యశో : నా మనస్సే నన్ను భయపెడుతూ వుంది. యిక మీరీ ఆలోచనలు మాని విశ్రమించాలి. రాత్రి తరిగిపోతూ వుంది.

గౌత : నే నూరుకున్నా ఆలోచనలవే నన్ను వెంటాడి వేటాడి వేధిస్తున్నాయ్.

యశో : యింక చాలు. యీ తియ్యని ద్రాక్షరసం త్రాగి ప్రశాంతంగా నిద్రపొండి.

గౌత : దేవీ—

యశో : (అర్ధోక్తిలో) వద్దు! మీరిక మాట్లాడవద్దు! నిద్రించేవరకూ మీ ప్రక్కనే వుంటా. మా కోసం అయినా మీరు విశ్రాంతి తీసుకోవాలి. కమ్మని నిద్రాసుఖంలో మీ కలవరాలన్నీ కరిగిపోతాయ్. సుమిత్రా! స్వామి పవళించేవరకూ వొక కమ్మని పాట పలికించవే.

సుమి : చిత్తం దేవీ! (వీణా శ్రుతితో పాడుతుంది)

ఆలించినావటే నీ పిలుపు - నాథుడు నేడు
పాలించ విచ్చేయునే చెలి ॥ఆలిం॥
కటికి చీకటి రేలు కరగిపోయిన వింక
ఉదయాద్రి శిఖరాల కదలె కన్నుని వెల్గు
అరుదెంచు చంద్రమ
స్తరళ ముక్తా రథము
అమృత కాంచనకేత
నాంచల చల చలత్ప్రభల ॥ ॥ఆలిం॥
అఖిలవాంఛా దుఃఖ శిశిరమ్ము గతియించె
మనుజీవనోద్యానమలమె చల్లనిగాలి
అరుగుదెంచు వసంత
పరిమళాందోళికలు
సరసకైబిక పిక
స్వరిత కూ కూ ధ్వనుల ॥ ఆలిం ॥
కలవరపు నీ బ్రదుకు కడలిలో నమృతంపు
సోనలెత్తి నెత్తావి ననబాటలమరించు
తెరచుకొన్నది ప్రేమ
దేవతా మందిరపు
టాశా కవాటముల్
అడుగుపెట్టవె చెలీ ॥ ఆలిం॥

యశో : స్వామి శయనించినా రిక పాట్ల చాలులే — (తనలో) నిస్తరంగ పయోరాశిలా వున్నారు. కరవీరపు మొగ్గల్లా పెదవులెలా కదులుతున్నాయో! కలల్లోని దేవకన్యలతో కబుర్లు చెబుతున్నట్టున్నాయి. ఏ సముద్రమథనం సాగుతూవుందో స్వామి హృదయాంతరాంతరాల్లో — తెలియని భయమేదో నన్నావేశిస్తూవుంది. లోకాల్ని వెలిగించబోయే దేవతామణి నా చిన్ని గుప్పెట్లో నిలుపుకోవాలనుకుంటున్నా. స్వామిని విడిచి వెళ్లడానికి కాళ్లాడడం లేదు. రాత్రికి రాత్రీ యీ సుప్తసౌందర్యాన్నవలోకిస్తూ గడపగలిగితే! నా ప్రభువును, నా స్వామిని నావద్దనుంచి వేరు చేసేవారు —

చెలికత్తె : (అర్థోక్తిలో — వెలుపల్నించీ) వస్తున్నారు వస్తున్నారు. దేవీ!

యశో : (కలవరంతో) ఎవరది?

చెలి : చిన్ని ప్రభువులు లేచి మీకోసం విలపిస్తూవుంటే వస్తున్నారంటున్నా దేవీ!

యశో : వస్తున్నా పద.

## 2

(ఆరోహణా వరోహణలతో వీణా స్వనం — గౌతముడు కలలు కంటూవుంటాడు. కలలో)

భూదేవి : ప్రభూ!

గౌత : ఎవర్నువ్వు? చెదరి జీరాడే కురులూ, కన్నీళ్లచారికలు కట్టిన చెక్కిళ్ళూ, దుమ్మున దొరగే కౌశేయం, కృశించిన తనువూ, దుఃఖదేవత వన్నెలైవర్నువ్వు?

భూ : మరచిపోయారా స్వామీ! (దీనంగా) యుగయుగాలుగా మీకోసం కాచుకునున్న యీ దీనురాల్ని పోల్చుకోనే లేదా ప్రభూ! నా ప్రభువులవతరిస్తారు. నన్ననుగ్రహిస్తారు. యీ మొయ్యలేని భారాన్నించి నాకు విముక్తి ప్రసాదిస్తారన్న ఆశాసూత్రమే ఆలంబనంగా యిన్నాళ్లూ యీ దుఃఖాలూ బాధలూ భరిస్తూవొచ్చా. నన్నింకా గుర్తించలేదా ప్రభూ? నిన్ను నీవే మరచిపోయావా ప్రభూ?

గౌత : (జ్ఞప్తి తెచ్చుకుంటూ) నన్ను నేనే మరచిపోయానా? — యేవో పూర్వస్మృతులు నాలో మేల్కొంటున్నాయ్! — ఆఁ. గుర్తించా నువు భూదేవతవు కావూ! అయ్యో పాపం! నీ రూపే మారిపోయింది! నిత్యకళ్యాణం పచ్చని తోరణంగా వుండే ఆ నువ్వా!!

భూ : (అర్థోక్తిలో) ఏం చెప్పను స్వామీ! ఆశా లోభాలూ కామక్రోధాలూ నామీద స్వారి చేస్తున్నాయ్ — బిడ్డల్లో అసహనం స్వార్థం వేళ్లు పాతుకపోయాయ్. హత్యలూ - యుద్ధాలూ - యెక్కడ చూచినా క్షామం. వ్యాధులూ వొకటేమిటి బ్రదుకే భయంకరమైపోయింది. మహోన్నతమైన ఆర్షమతాని కపార్థాలు కల్పిస్తున్నారు. యజ్ఞయాగాల పేరుతో నిర్దయగా జీవహింసలు సాగిస్తున్నారు. ప్రపంచంలో యే ప్రాణికీ సుఖం శాంతీ లేదు. యీ సమయంలో యిక నీ అభయహస్తాన్నందిస్తే కాని, యీ భారం తగ్గించుకోలేను ప్రభూ!

గౌత : మన్నించు దేవీ! ప్రాభవ వ్యామో

హంలో యిప్పటికే యెన్నేళ్ళో వృథా చేశా. యింకాలస్యం చెయ్యను—శోక ఘూర్ణితమైన యీ మహాసంసారసాగరాన్ని చిలికి నీకానంద నవనీతాన్నందిస్తాను. భయపడకు దేవీ!

భూ: (నిట్టూర్చి) అమ్మయ్యా! అమృతంకన్నా చల్లని నీ అభయవచనంతో నా దుఃఖం తీరినట్లయింది. యీ దీనురాల్ని విస్మరించకు ప్రభూ! చంద్రుని కోసం చకోరిలా మీ కోసం నిరీక్షిస్తూ వుంటాను. నిత్యాపన్నురా లోకతె మీరాక కెదురు చూస్తూ వుంటుందన్న కారుణ్యం యీ విశాల హృదయంలో ఏమూలనున్నా చాలును ప్రభూలు, చా.

(భూదేవి వెళ్లిపోతుంది)

గౌత: (జాలిగా) వెళ్లిపోయింది. ప్రావృట్కాలనీలాంబుధరం వలే కన్నులనిండైన దేవీ సస్యశ్యామలమూర్తి దీనంగా యెలా తేలిపోతూ వుందో! (నిట్టూర్చి) సుందీ రాజభవనాల్లోనించి బయట పడితేగాని గాలి పీల్చుకోలేను—సాలీడుగూళ్లలా నాచుట్టూ సంసారబంధనాలెలా అల్లుకున్నాయో! యివి తెంచరాకుండా యెంత గట్టిగా వున్నాయ్! అనురాగాలూ, యీ భోగాలూ; ఆనందాలూ, అనుభవాలూ అన్నీ సంకెళ్లై నన్ను కాలు కదల్నిచ్చేట్టు లేదే! ఎలా వెళ్లగలను?

రాజ్యలక్ష్మి: (ప్రవేశిస్తూ) ఎక్కడికి యువరాజా?

గౌత: ఎవరమ్మా నువ్వు? నిన్ను చూస్తూ వుంటే మాతల్లి గౌతమికివలె నీపాదాలకు ప్రణమిల్లాలనిపిస్తూవుంది. ఎవరు తల్లీ నువ్వు?

రాజ్య: నేను మీరాజ్యలక్ష్మిన్నాయనా! నేటివరకూ నీపూర్వులు శాక్యరాజులు వారి భుజస్కంధాలమీదగా చిక్కని యశస్సుల గొడుగు నీడల్లో నీ జనకుని దాకా నడిపించుకొచ్చారు. యిహ పరాలు రెండూ సాధించుకున్నారు. మీ తండ్రిగారు జరాభారానికి తోడు నిత్యప్రవృద్ధమైన రాజ్యభారాన్ని కూడా భరించ లేకుండా వున్నారు. వారిని వానప్రస్థం పిలుస్తూవుంది. యికను వ్వాయనకు విశ్రాంతి నివ్వాలి. బలయౌవన సంపన్నమైన నీ భుజపీఠాన నన్ను ప్రతిష్ఠించు!—

గౌత: లేదు తల్లీ లేదు! యీ బంగారు పంజరంలో నన్ను బంధించుకోలేను. రాచరికపు తొడుసునించీ తెరిపికోసం నా ఆర్తి ఉహాలహాలాకుతూ వుంది.

రాజ్య: (ఆశ్చర్యంగా) ఏమంటున్నావ్? (అనునయిస్తూ) నువ్వనేదేమిటో నీకే తెలియడం లేదు. ధర్మాన్ని త్యజిస్తానంటున్నావ్. పిచ్చి తండ్రీ! రాజ్యబంధం ఐచ్ఛికం కాదు నాయనా! ఆనుపూర్వికమైన మహత్తర విధినిర్వహణం! అమాయకుడా! యీపూలతోట నీకు ముళ్ళబాటయిందా? యిది కాదని నిరాకరించి యింతకన్నా నువు సాధించే దేమిటి?

గౌత: ప్రపంచ కళ్యాణం తల్లీ.

రాజ్య: (వెక్కిరింపుగా) ఏమిటయ్యా ఆ ప్రపంచ కళ్యాణం! భీరువులా అర్ధరాత్రి గృహత్యాగం చెయ్యడమేనా? వెర్రివాడా! మనువు మొదలు నీ వరకూ వచ్చిన రాజమార్గంలో ముళ్ల కంచెలు వేస్తున్నావా?—ధర్మాన్ని నిలిపి—దేశాన్ని సుభిక్షంగా—ప్రజల్ని కన్నతండ్రిలా పాలిస్తూ, శాంతిజ్ఞానదీపికలు వెలిగించినన్నాగాధిస్తూ నీ కోర్కెలు పండించుకోరాదటయ్యా! నీ ప్రపంచాన్ని నేనుకానూ? యింతకన్నా క్షత్రియ జీవితపరమావధే మున్నది?

గౌత: వున్నదమ్మా! వున్నది. ప్రపంచమంటే వొక్క యీ కపిలవస్తు నగరమేనా తల్లీ?—కాదు. వొక్కసారి నీ చూపు త్రిప్పిచూడమ్మా! ఆధ్యాత్మికంగా లోకం యెంత దిగజారిపోతూవుందో! ప్రజల్ని పాలించే రాజుకాదిప్పుడు కావలసింది. వారి ఆత్మల్ని పాలించే ఆచార్యుడు కావాలి. దుఃఖాంధకారాన్నించీ అవిద్యాగర్తాలు దాటిస్తూ అహింసాజ్యోతితో శాంతిమార్గాన్నడిపే మార్గదర్శి కావాలి! అందుకే నన్నీ బంధనాల్నించి విముక్తుణ్ణి చెయ్యితల్లీ! అంతఃపురాల్లో లభ్యంకాదా ఆత్మసాక్షాత్కారం. నా తపస్సు పండితే మొదట నీ సేవకే వస్తానమ్మా!

రాజ్య: నవనీతసుకుమారమైన యీ తనువూ తారుణ్యం, రాజసుఖాల కలవాటుపడ్డ యీ ప్రాణం నీకు వశమై నీ కఠోరనిష్ఠ కనుకూలిస్తాయా అని— అయ్యోపాపం! నీమీద ప్రాణాలుపెట్టుకున్న ఆ

వృద్ధభూపతి పాశ్లేం కొనుస్నాన్నాయో! నీ కౌగిళ్ళ కెదురుచూస్తున్న కీర్తీ, ప్రాభవం, జయశ్రీ—అన్నీ వృథా! వృథా!!

గౌత : తల్లీ! నీకు నమస్కారం. నన్ను ప్రలోభపెట్టకు. నాలో రేగిన యీ మహోతృష్ణ మందాకినీసందర్శనంతో కాక యింతా అంతా తీరేది కాదు. నన్ను పోనియ్. నా ఆత్మకు బలం విశ్వాసం ప్రసాదించు. అవిగో భూదేవిపిలుపులు వినిపిస్తున్నాయ్. మా కులపతులైన శాక్యరాజులవలే నిన్ను సేవించుకోలేని నా దుర్బలత్వాన్ని క్షమించి నన్ను దీవించిపంపు తల్లీ!

రాజ్య : శుభం తండ్రీ శుభం! నీ సాధనలో నీకు జయం కలుగుతుంది పోయిరా నాయనా! ప్రపంచాన్నంతా పునీతంచేసే దివ్యవాహినిని ప్రమదావనంలో క్రీడాసరస్సుకు మలపాలనుకున్నా—తెలుసుకున్నా—లోకసంగ్రహణార్థం అవతరించిన మహామూర్తివి నువ్వు! జరామరణచకితమై హింసా శోక వ్యాకులమైన ప్రపంచాన్ని త్వరగా వుద్ధరించు ప్రభూ! యిక నాకు సెలవు. (వెళ్లిపోతుంది)

గౌత : కన్నతల్లి దీవనల్లా రాజ్యలక్ష్మిపలుకులు నాలో వినూత్నశక్తి ఉద్దీపింప చేస్తున్నాయ్.

(దూరాన్నుంచి గజ్జెల ఘల్‌ఘలలూ మువ్వల మోతలూ వినిపిస్తాయి.)

గౌత : (ఆలోచిస్తూ) యెక్కడివీ కరకంకణ ప్రసుతులతో చరణమంజీర ఘలంఘలలు! సరి క్రొత్త మద్యంలాగా యెంత మధురంగా మత్తెక్కిస్తూ వున్నవీ! అంతఃపురానికి యశోధర విచ్చేసిన ఆ తియ్యని రోజుల్ని సుర్తుకు తెస్తున్నాయీ ధ్వనులు—ఎవ రక్కడ?

యవ్వనశ్రీ : నేనే. నీలోవున్న యవ్వనశ్రీని. మీ సంభాషణంత విన్నా. యెక్కడికీ అంతెరుగని ప్రయాణం—యెందు కింత నైరాశ్యం? యేమిటలా కృశించి తపించి సాధించేది? అందు క్కావలసిన వయసు ముందున్నది. యిప్పట్నించీ యీ తపన దేని కోయ్! వెన్నెట్లో నిల్చి చీకట్లని పిలిచే వెర్రివాడి వవుతున్నావే! యీ యవ్వనం కాస్తా జారితే—మధు వొలికిన పాత్రెవరి క్కావాలి? పూలు పూచే యీ వయస్సులో యేమిటీ ముళ్ళేరుకోడం? యీ జన్మ, యీ సౌందర్యం, యీ యవ్వనం, యే మహత్తర తపస్సు చేస్తే లభించాయో వూహించావా? యీ దైవప్రసాదాల్ని భగ్నం చెయ్యడానికి నీకేం అధికారం వుంది? వసంతాన్ని శిశిరంగా మారుస్తావా? యెవరు నీకీ దుర్మార్గాన్నుపదేశించింది? అనుభవహీనమైన జీవితం అడివిలో పువ్వులా రాలిపోతుంది. ఓయ్ విపరీతబుద్ధీ! ప్రత్యక్ష చంద్రికను పరిత్యజించి కనబడని కాంతులకోసం పరిగెత్తి పడతానంటున్నావ్! నా మాట విను. హాయిగా సుఖించు.

గౌత : (కఠినంగా) ఆగు! యిక నీ ఊహాగానం నిలుపు! క్షణికమైన యవ్వనానికిన్ని రంగులు పులిమి యింద్రధనుసు చేసి చూపిస్తున్నావ్, యెంతసేపు దీని వైభవం? చాల్ చాలు నీ ఆనందపు లోతు ల్నె రెరగనివి కావు. యెడారిలో యెండమావులు! పృథ్వీ వ్యోమచుంబనాలు—నన్నిక భ్రమపెట్టలేవు పో పో!

యవ్వ : ఓరి మూర్ఖుడా! విప్పి చెప్పినా తెలుసుకోలేకపోతున్నావ్. పోనీ కాని, యీ గడియ వరకూ నిన్నే నమ్మి నీలో తన విశ్వాసాన్ని భద్రపరుచుకున్న చరణదాసి హృదయరాజ్ఞి యశోధర కన్నా యీ జన్మలో నీకు లభ్యమయ్యే పరమార్థ మేముందిరా? నువ్వింత విశ్వాసఘాతుకుడ వను కున్నదా ఆ అమాయకురాలు? అప్పుడే మరిచిపోయావా వకజాము క్రితం యశోధర యేమన్నదీ—గుర్తు తెచ్చుకో—

(—లోపల్నించీ వినిపిస్తున్నట్లు—)

యశో : ప్రభూ! యీ చరణదాసిని అన్యాయం చేయకండి. యీ హృదయానికి దీప్తి మీరూ, యీ కన్నులకు వెన్నెల రాహులుడూ—

గౌత : (పుద్వేగంతో) అయ్యో దేవీ! నీ కన్యాయం చేస్తున్నానా?—అదిగో (వింటూ వున్నట్టు) మళ్లీ యెవరిదా ఆక్రందనం—

(మళ్లీ లోపల్నించీ వినిపిస్తున్నట్లు—)

భూదేవి : యీ దీనురాల్ని విస్మరించకండి ప్రభూ! చంద్రుని కోసం చకోరిలా నిరీక్షిస్తూ వుంటా—

గౌత : (దృఢస్వరంతో) వస్తున్నా భూదేవీ! వస్తున్నా (కోపంగా) ఓసి యవ్వనశ్రీ! నీ దుస్తంత్రా

లిక చాలించు. గౌతము డంత చంచలుడు కాడు పో పో !!

యవ్వ : పోరి అవివేకీ ! కడసారిగా చెబు తున్నా విను. యీ కాషాయంతో నువ్వు సాధించే దేముందోయ్ ? తల బోడైతే తలపులు బోడవు తాయా ? యాదు, వృథ యత్రభ్రష్టుడవు కాకు, కాదంటావా నీకర్మ. పోనీ యీనిశ్చయాన్నె యశో ధరతో చెప్పి పో అది మంచిమార్గం—చూడరా, అటు చూడు—

అదిగో నీ ప్రణయాధి దేవత సతి
స్వప్నానంద సందీప్తి ము
ఖ్వదనాంతమ్మృల హాసరేఖలనె
యాహ్వానించునో నిన్ను - ఓ
రి దయాశూన్యుడ ! చూడు మేదొక
రహః క్రీడాసమాలోచనా
భ్యుదిత హ్రీ కలనంబో కెంజవులు
పూయున్ చెక్కుటద్దాల పై
చూడు చూడు—
ముద్దుల మూటగట్టు నను మోమున
తల్లిపయంట ద్రోయుచున్
సద్దుదొరంగి రొమ్మునకు చల్లని
చేతులు సాచుచున్న మీ
నిద్దపుప్రేమ, శాక్యకుల నీల
నభశ్శశిరేఖ అచ్చునం
గ్రుద్దినయట్టి నీదు ప్రతిరూపము
బిడ్డనివంక చూడరా !

నీ వంటి విరసపాషాణ మూర్తులతో నాకు పని లేదులే—(గజ్జెల గలగలలతో వెళ్ళిపోతుంది)

గౌత : (నిట్టూర్చి) అబ్బ ! యిప్పటికి అవాంత రాలు తీరినట్లే. వారిధికి సేతువు కట్టినట్లయింది. నా భ్రమలే నన్నింతగా పుటంపెట్టి పరిశుద్ధుణ్ణి చేశాయ్. (తల్పంనించి లేస్తాడు. ఒక్కసారిగా బాకాలు మ్రోగి నిల్చిపోతాయి )

# 3

"ఓహో దేవతల్లారా !"

దేవ : అదిగో అశరీరవాణి యేమో చెబుతూ వున్నది వినండి వినండి.

అశరీరవాణి : (ఆనందంతో) ఓహో దేవత ల్లారా ! స్వామి లేచారు. విశ్వకళ్యాణంకోసం స్వామి బయల్దేరారు. ఓ నిద్రాధిదేవతా ! నీ వెచ్చని కౌగిళ్ళలో అంతఃపురాన్ని జోకొట్టి నిద్రపుచ్చాలి. స్వామి నిర్గమించేవరకూ రే ప్రాణీ మేలుకోరాదు. ఓమోయ్ నిశ్శబ్దదేవతల్లారా ! స్వామి మార్గాన్నంతా నాగులుతీరి నిలవండి. విఘ్నరాక్షసులు పొంచుండి మీ ప్రయత్నాలు భగ్నం చేస్తానికి చూస్తారు. జాగ్రత్త! మీ సన్నని నిఃశ్వాసపు గాలులతో నిశ్శ బ్దంగా అంతఃపురద్వారాలన్నీ తెరిచివుంచండి. అదిగో స్వామి బయలుదేరుతున్నారు. మొదట మీ వినీలకేశపాశాల్తో మార్గమంతా సమ్మార్జనంచేసి నిరా టంకం చెయ్యండి. వింటున్నారా ? స్వామి రత్న పాదుకల ధ్వనులు కూడా వినిపించకుండా పువ్వుల కన్నా మెత్తని మీ అరచేతుల్ని వారిపాదుకునా అరుణాంబుజ మాలికల్లాగా పరచండి. స్వామి మీ పాణిపల్లవాలమీదుగా నడిచిరావాలి. ఓ అదృశ్య దేవతల్లారా! జగత్కళ్యాణంకోసం స్వామి బయల్దేరి వస్తున్నారు. చెన్నుని మేల్కొలపండి! కంటకాశ్వాన్ని సుసజ్జితం చేసి సౌధద్వారంవద్ద నిలిపించండి. ఓ వాయుదేవతల్లారా ! స్వామి నిష్క్రమించేవరకూ మీలోవున్న శబ్దప్రసారగుణాన్ని స్తంభించుకోండి. యీ నగరసీమ లతిక్రమించేవరకూ యే ప్రాణికూడా అశ్వఖురన్యాసరవళి వినకూడదు! నక్షత్రాల్లారా ! స్వామిమార్గానుకూలంగా మీ వెలుగు లుపట్టండి (వుత్సాహంగా) వచ్చేశారు. స్వామి వచ్చేశారు. వచ్చేశారు—

వేయి యామిను లొక్కరేయి తోచినయట్లు
తియ్యని తావులు తెరలివచ్చి,
కోటిచందురు లొక్కచోట వెల్గినయట్లు
విరిసిన కాంతుల వెల్లివచ్చి,
క్షితిసుస్వనములొక్క శ్రుతిని మ్రోగినయట్లు
అడుగు సవ్వడులల్లనల్ల వచ్చి,
సకలభాగ్యములొక్కసారి కూడినయట్లు
చిరకాంక్షిత స్వప్నసిద్ధివచ్చి

వచ్చివచ్చి విపన్న జగచ్ఛయంబు
ఆదుకొను వరదాభయ హస్తముద్ర
స్వామిగా నెట్టయెదుట సాక్షాత్కరించె
శాక్యవంశ పయోరాశి చంద్రవంక.

అశరీర: ముక్కోటి దేవతల ఆనందాశ్రువులతో పాటు పరిమళ పారిజాత మందార మకరందబిందు

వులు జల్లుజల్లుగా పడుతూ వున్నాయ్. ఆ పూల వానలో స్వామి అశ్వాన్నధిరోహించి దాల స్యంగా గాలిలో లేచి మబ్బులలో తేలి పోతున్నారు. నగరప్రాకారాలపైనించి దూసికిపోయే సత్రానికి ముందుగా ఆకాశంలో ఛెన్నుడు కూడా ఎగిరిపోతు న్నాడు. నిష్క్రమించారు స్వామి నిష్క్రమించారు—

"ఆ మహనీయ మోహన ముఖాంబుజమున్
మడి చుట్టి నొల్లు ని
ష్క్రమ పవిత్ర తేజ మనికల్పక
శాంతిసమాధి నిష్ఠ హిం
సామలిన ప్రవిష్టు, లిహ సంగులు
ధమ్మ పదమ్ము వట్టి స్వ
శ్శ్రీపునురాత్ములై భువి
తరింపగ సత్వర ముద్ధరించుతన్!"

నమో తస్స భగవతో అరహతో సమ్మాసం బుద్ధస్స—

---

# నా ప్రభూ! ★

శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

నలదు మనోజ్ఞహర్మ్యసుఖ వాసనలెవ్వియు—జీవితంబులో
తలపునలేని సౌఖ్యములు—త్వత్కరుణామృత వాహినీసము
జ్జ్వల మధురాంబుపానములు నల్పదు చిన్నకుటీరసీమ, నీ
చెలిమికి నాదుప్రాణము లు సిద్ధముచేసితిరమ్ము నాప్రభూ!

ప్రేమయొకండె నిన్ను వలపించెడు వస్తువటంచు నాదు హృ
త్సీమకు దోచిపోయినది, తియ్యని నాయనుభూతి మెల్ల నీ
ప్రేమకు ధారవోసితిని రెక్కలువిచ్చిన పక్షిగాగ నా
ధామము చెంతవ్రాలుదు గదా క్షణ మాత్రములోన నాప్రభూ!

అల్లన కంఠమెత్తి ప్రియమారగబిల్చిన, నాస్వరంబులో
పల్లవితంబుగా మృదుల భావనలన్నియు గుస్తువట్టనా
యిల్లనివత్తు వియ్యేడకు నెయ్యేడకున్ జనవింక, నేను పూ
వల్లరి నీవు వృక్షమవు ప్రాకెద నీమదియెల్ల నాప్రభూ!

ఎన్నడునీవులేవో భువి నెందును నేనును లేనుగాన, నా
కున్న సమస్తమీవొకడవో యను వెత్తియె నాదిగాన, నీ
చిన్నెలులేని నాబదుకు చేదయి తోచునుగాన, నన్ను నీ
కన్నుల కౌగిలింతకడగా నొనరింపగరమ్ము నాప్రభూ!

నీ వొక బాటసారివయి నిల్తువు నా గృహసీమచెంత సం
ధ్యావిపులాంధకారముల నక్కట—ఆకలి దప్పి దీర్చి నీ
శ్రోవకు చల్లిగట్టి పరితోషమునన్ పయనింపజేతు మ
ద్భావపరీమళంబు దనుపన్ తొలివెల్గులలోన నాప్రభూ!

---

# స్థాయిభావములు



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

శృంగారము మొదలుగాగల రసము లెనిమిది గలవు. ఈ రసములకు రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము అను ఎనిమిది స్థాయిభావము లగుచున్నవి. కాని స్థాయిభావమును నిర్వచించ వలసియున్నది.

ఎక్కువ ఆలోచన లేకుండా, బుద్ధిని వినియోగించకుండా, మన మనేక పనులను చేయుచున్నాము ఇట్టి కృత్యముల నందగును దాదా షాకేవిధముగా చేయుట గలదు. పరిస్థితులు మారినను వీటిలో చెప్పదగినంత మార్పు కన్పించదు. అనుకరణగాని, అనుభవముద్వారా తెలిసికొని చేయుటగాని వీటిలో కన్పించదు. ఇట్టి కృత్యముల నాంగ్లమున "ఇన్‌స్టిన్‌క్టివ్ బిహేవియర్" (*Instinctive behaviour*) అందురు. ఈ విధముగు ప్రవృత్తి ప్రతివ్యక్తిలోగల స్థాయిభావముల నాశ్రయించుకొని వచ్చునది. పరిసరములతో సమన్వయపరచుకొనుచు పోవు ప్రాణుల ప్రవృత్తిని స్థాయిభావ ప్రవృత్తి యందురు. ప్రాణరక్షణకు, వంశవృద్ధికి దోహదమొసగు నీ స్థాయిభావములు ప్రతి వ్యక్తియొక్క మానసములోని అంగములని యొక వాదము గలదు. కాని భావోద్రేకముగాని, జ్ఞానముగాని లేని స్థాయిభావప్రవృత్తి కేవల మంధపరంపరలోనిదగును. ఒకే ఒక స్థాయిభావప్రవృత్తిలో వివిధావయవములేల వ్యాపృతము లగుచున్నవో, ఈ వాదము చెప్పలేకున్నది. ఈ స్థాయిభావప్రవృత్తి జ్ఞానహీనమై, గ్రుడ్డిదయైనచో ననుభవము దీనిని మార్చజాలదు. కాని అనుభవ మెక్కువైన కొలది ఈ ప్రవృత్తిలో మార్పులు కన్పించుచున్నవి.

స్థాయిభావవృత్తికి మనస్సునకుగల సంబంధము వివేచనీయము. అనుభవమున, ప్రవృత్తిలోను, మనస్సు కొన్ని సన్నివేశముల నభివ్యక్తపరచుచున్నది. ఈ సన్నివేశములు సామాన్యముగా నొకే తీరున కన్పించుటచే తద్ద్వారా ఆంతరంగికమగు మనస్సుయొక్క స్వరూపస్వభావములు మన కవగతము లగుచున్నవి. మనస్సు విశ్రమించియున్న వేళలో గూడ నీ స్వరూపస్వభావములు స్థావరముగా నిలచి అభివ్యక్తి నందుచున్నవి. కాగా మనస్సు వివిధభాగములతో సంవలితమై, ఆ అంగములతో ననన్యత్వము కలిగియున్న దనవచ్చును. ప్రతి భాగము తన కృత్యమును తాను నిర్వర్తించుటయేగాక, ఇతర భాగములతో సన్నిహిత సంబంధము కలిగియున్నది. తద్ద్వారా ఇతర భాగములలో దీనివలన మార్పులు రాగలవు. ఈ భాగములే స్థాయిభావములు స్థాయిభావములకంటె విలక్షణమైన మనస్సు లేదని చెప్పవచ్చును. ప్రవృత్తి నిర్దేశించు ఆంతరంగికములగు స్థాయిభావములు మనస్సుయొక్క వివిధపరిణామములు. మానవప్రవృత్తి కందుచే నివి హేతుభూతము లగుచున్నవి.

స్థాయిభావనిర్దిష్టమగు ప్రవృత్తి ప్రయోజన సహితమైనది. ఒక వస్తువు నుద్దేశించగల భావన ఉద్దిష్టవస్తువును తెలిసికొనగల జ్ఞానము అనునవి రెండును లేనిచే ప్రయోజనము నెరవేరజాలదు. ప్రవృత్తి స్వాభావికమై, అయత్నసిద్ధమై, ఉద్దిష్ట విషయప్రాప్తివరకు నుండును. విషయప్రాప్తికి అంతరాయములు వాటిల్లినచో ప్రవృత్తిలో భేదములు బహులు చేరును. అప్పుడు దృష్టవిషయము నెరవేరుచున్నది. అనగా ప్రవృత్తిలో నొక అవగాహనమాత్రమే కదలుటగాక, జ్ఞాతికొధ్యాత్మరూపమగు జీవియంతయు వ్యాపృతమగుటకలదు. శరీరసంవలితమైన మనస్సు ప్రవృత్తిలో ప్రవేశించుటచే స్థాయిభావ ప్రవృత్తిలో జ్ఞాన ముండదనుమాటను తృణీకరించవలెను.

మనస్సుయొక్క స్వరూప విశ్వాసమున స్థావరముగా నుండునవి స్థాయిభావములు. జీవికి ప్రాణమున్నంతవరకు నీస్థాయిభావము లుండగలవు. ప్రతి స్థాయిభావములోను జ్ఞానాంశ, ప్రవృత్త్యంశ అను రెండంశలుగలవు. వీటిద్వారా స్థాయిభావములోని శక్తి

స్వేచ్ఛను పొంది సక్రమమార్గమును పొందుచున్నది. అనగా స్థాయిభావముల కన్నిటికి మూలభూతమగు నొకానొక శక్తినుండి బలముచేకూరుచున్నది. ఈ మూలరాశినుండి కొన్ని స్థాయిభావము లెక్కువశక్తిని గ్రహించవచ్చును. మరికొన్ని తక్కువ గ్రహించవచ్చును. కాని ఈ శక్తి ప్రాణియొక్క చైతన్యము కంటె విలక్షణమైనది కాదు. చైతన్యము సాపేక్షకమై విషయసంవలిత మగునపుడు స్థాయిభావములను రూపములద్వారా ఆవిష్కృతమగునని భావము. ఉద్దిష్టవిషయము కనబడినపుడు అనుభవించు వ్యక్తికి ప్రమేయముతోనే అన్యత్వసంబంధముకలుగుచున్నది. అనగా ప్రవృత్తి ఉభయాభినివిష్టమై ఉత్పన్నమగుచున్నది. కేవలము విషయమునుండిగాని, కేవలము ప్రమాతనుండిగాని, ప్రవృత్తిరాజాలదు. ఈ ప్రవృత్తిలో క్రియానందము లవినాభావసంబంధము కలిగియున్నవి.

వ్యక్తులందరి స్థాయిభావ ప్రవృత్తులు ఒకేఒక రీతిగా నుండవు వంశక్రమానుగతమగు సన్నివేశములు, అనుభవములు మొదలగునవి స్థాయిభావ ప్రవృత్తులలో విపరీతమైన మార్పులను తీసికొని రాగలవు. ఈ మార్పులను గమనించిచో వీటిలో స్థాయిభావములే కల్పించుటలేదని గూడ చెప్ప సాహసింపవచ్చును. అభిరుచి, జాగ్రత్త, పరిశీలన, ప్రవృత్తిలో మార్పు, అభ్యాసజనితమగు జ్ఞానము మొదలగునవి ప్రవృత్తులలో కల్పించుటచే స్థాయిభావము జ్ఞానసంవలితమని చెప్పవలయును.

ప్రతివ్యక్తి ఉపయోగించగల మానసిక శక్తి స్థాయిభావ ప్రవృత్తిలో కన్పించును. పరిశీలన, జాగ్రత్త మొదలగువానితో కూడియున్న దీశక్తి. కాగా కొన్ని ఇంద్రియములు కొన్ని విశిష్టవిషయములయందే వ్యాపృతములు కాగలవు. నిరీక్షణ, పరిశీలన, అన్వేషణ మొదలగునవీ వ్యాపారములలో కన్పించును. వీటి అన్నిటియందును క్రియాశక్తి అనుస్యూతముగా గలదు. ఈ క్రియాశక్తిద్వారా ఉద్దిష్టార్థ ప్రాప్తి జరుగగాస్థాయి భావము సంతృప్తినందుచున్నది. దీనికి అంతరాయములు కల్గినచో ప్రవృత్తిలోగాని, సన్నివేశములలోగాని, మార్పులు తీసికొని రాబడుచున్నవి.. అనగా ప్రతిస్థాయిభావములోను జ్ఞానాంశ కలదని భావము. జ్ఞానసంవలితమగుటచే స్థాయిభావప్రవృత్తి వివేకముతో మెలగుచు వైశిష్ట్యము నందగల్గుచున్నది. ఈ జ్ఞానసంవలితత్వము ప్రథమప్రవృత్తిలో సహితము కన్పించుచున్నదని పరిశీలకులనుచున్నారు. ప్రయోజనము జ్ఞానాధీనమగుటచే, ప్రవృత్తిప్రయోజనాన్వితమని చెప్పినచో మొదటి ప్రవృత్తిలో సహితము జ్ఞానము కలదని చెప్పినట్లే యగుచున్నది.

క్రిమికీటకములయందు, పశుపక్షులయందుగల స్థాయిభావము లుద్దీపన విభావముచే జ్ఞాన రహితముగా ప్రవృత్తములగుచున్నట్లు కన్పించుచున్నవి. అట్టి ప్రవృత్తులు మానవదశయందు చాల కొద్దిగానున్నవి. కొరుకుట, చప్పట్లు చరచుట, నోటి వద్దకాహారమును తీసికొనిపోవుట, ప్రాకులాడుట, ధ్వనులను చేయుట, అరచుట, నవ్వుట, కోపగించుట మొదలగునవి మాత్రమే ఇట్టివి. వీటిలో ఆలోచనగాని, జ్ఞానముగాని గోచరించుటలేదు. కాని మానవస్థితియందు మానసిక ప్రవృత్తులే అతి ముఖ్యములైనవి. ఈ ప్రవృత్తులలో అభిరుచి, యత్నము, నిరీక్షణ, అన్వేషణ, కార్యసాధన మొదలుగాగల జ్ఞానాకారమే గోచరించును.

స్థాయిభావమున బాహ్యవిషయ సందర్శనచే యత్కించిచ్చలనము కలిగిన తర్వాతనే ప్రవృత్తి ఉత్పన్నమగును. ఈ కదలిక రాగానే స్థబ్ధముగానున్న స్థాయిభావము పైకి ఉబుకును. ప్రతి స్థాయిభావమున విశిష్టమగు సంచారిభావ మొకటి ఉండును. ఈ సంచారిభావము సంచలితమైననే స్థాయిభావము ప్రవృత్తిమార్గమునకు దిగును. కాగా ప్రవృత్తికి సద్యఃకారణము సంచారిభావమని తెలియవలెను. స్థాయిసంచారి భావములు రెండును సదా జ్ఞానసంవలితములై యుండును. భయము, ఉత్సాహము, జుగుప్స యనునవి స్థాయిభావములు కావచ్చును, లేదా సంచారిభావములు కావచ్చును. స్థాయి సంచారిభావములు విలక్షణములు కావని, సంచారి భావరహితమైన స్థాయిభావము లేదని వీటివలన సిద్ధమగుచున్నది. సంచారిభావము ద్వారా ప్రవృత్తియొక్క స్వరూపస్వభావములు మన కవగతము లగుచున్నవి. కావుననే ధర్మాది శబ్దములు సందర్భానుసారముగా స్థాయి వ్యభిచార్యాది సూచకము లగుచున్నవని అభినవగుప్తుఁడనినాఁడు. ఆంతరంగికము లగు సుఖదుఃఖ

స్థాయిభావము సంచారిభావమగుట, సంచారి భావము స్థాయిగా పరిణమించుట, కన్పించుటచే స్థాయిసంచారిభావములకు వైలక్షణ్యము నాపాదించుట దుర్ఘటమని కొందరు విమర్శకు లనినారు. సంచారిభావస్వరూపమును విమర్శించుచు ఈ విషయమును తేల్చితిమి. ఇచట విచారింపవలసిన విషయ మింకొకటి గలదు. రుద్రట, లొల్లట, నమిసాధు, భోజులు సంచారిభావములుగూడ రసములుగా పరిణమించగలవని సిద్ధాంతించినారు. ఈ విమర్శకుల ననుసరించినచో సాత్త్వికభావములు, విభావానుభావములు గూడ స్థాయిభావములు కాగలవని చెప్పవలసి యుండును.

విభావములు రెండు రకములుగా నున్నవి. మొదటిది ఆలంబన విభావము. రసమును ఆవిర్భవింప జేయు వ్యక్తిగాని, విషయముగాని ఆలంబనవిభావ మగును. ఈ విభావము చిత్తవృత్తి కాదు. రెండవది ఉద్దీపనవిభావము. పరిసరములలో భావము నుద్దీపింప జేయు సన్నివేశ ముద్దీపన విభావము. ఇది కూడ చిత్తవృత్తి కాదు చిత్తవృత్తి కానిది స్థాయిభావము కాజాలదు. అనగా విభావములు స్థాయిభావములు కాజాలవు.

సంచారిభావములను మన మనుభవించునపుడు బాహ్యముగా శరీరమున కన్పించు చలనములను సాత్త్విక భావములు సంచారిభావ జనితములు. చిత్తవృత్తి రసముగా పరిణమించుటకు సంచారిభావ సహాయము నపేక్షించును. కాని సాత్త్వికభావములు సంచారిభావములవలన జన్మించునవగుటచే వీటని స్థాయిభావములుగా స్వీకరింప వీలులేదు. సాత్త్వికభావ మన్వయానుయాయి యగుటచే అనుభావాదులతో సంబంధమును స్వతంత్రించి గ్రహించలేదు. కావున ఋతుమాల్యాది విభావములు, బాష్పాదిబాహ్యానుభావములు స్థాయిభావములు కావని నిశ్చయింపవలెను. స్థాయి సంచారిభావములకతి సన్నిహిత సంబంధ ముండుటచే నొకదాని ప్రవృత్తిని మరియొకటి గ్రహించితదభిన్నముగా కన్పించవచ్చును. బాహ్యానుభావములద్వారా సంచారి భావమభివ్యక్తమగుటచే, బాహ్యానుభావములు లేనపుడు సంచారిభావము లేనట్లే మనము భావించవలెను. ఈ బాహ్యానుభావములద్వారా అంతర్లీనముగానున్న సంచారిభావ స్వరూప మవగతమగును. కావున స్థాయిభావము, సంచారిభావము, బాహ్యానుభావమగు సాత్త్వికభావము అనుమూటికి సన్నిహితమైన అన్యోన్య సంబంధము కలదని సిద్ధాంతము.

విభావానుభావ వ్యభిచారి సంయోగమున రసము నిష్పన్నమగునని భరతసూత్రమున స్థాయిభావము కన్పించదు. పైగా రతిహాసాది స్థాయి భావములను చెప్పుసందర్భమున స్థాయిభావము లెన్నిగలవో వాటి సంఖ్యనుగూడ భరతుడు చెప్పలేదు. స్థాయిభావము లసంఖ్యాకములగుటచేతను, ప్రతి ప్రవృత్తిని ఏదో ఒక స్థాయిభావముతో సమన్వయపరుపవలెను గనుకను, సంఖ్యానిర్ణయ మిచట గావింపబడలేదని అభినవగుప్తకన్న ప్రాచీనులైన సాహిత్యసమీక్షకులు వ్యాఖ్యానించిరి. సహృదయావర్జకత్వ ప్రాచుర్యము వలన, పార్షద ప్రసిద్ధిననుసరించి, ఎనిమిది స్థాయిభావములే చెప్పబడినవి గాని ఇవి అసంఖ్యాకములని లొల్లటాదుల అభిప్రాయము. మనస్తత్త్వ శాస్త్రవేత్తలు గతించిన నూరేండ్లలో అనేక స్థాయిభావములను లెక్కించియున్నారు. వీరి లెక్కలో వేటాడుట, తినుట, జీర్ణించుకొనుట గూడ స్థాయిభావములైనవి. కాని ఇవి ఆహారాన్వేషణరూపము మృగయాభావములోనివేగాని వేరుగాదు. స్థాయిభావము చిత్తవృత్తియగుటచే శారీరకవృత్తులను, ఇంద్రియవ్యాపారములను స్థాయిభావము లనరాదు.

శాస్త్రజ్ఞులు, సాహిత్యసమీక్షకులు అనేక స్థాయిభావములను గూర్చి పలికినారు. వీటిలో నెన్ని సాహిత్యమున కుపకరించునవో విచారింపవలసియున్నది. ప్రధానాలంకారిక సంప్రదాయము ననుసరించి రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము అను ఎనిమిదిస్థాయిభావములే గలవు. ఈ ఎనిమిదింటితోబాటు వాత్సల్యము, స్నేహము, ఆసక్తి, సంతోషము, అరతి, గర్ధ, మృగయా, అక్షు, స్పృహా, ప్రీడనకము, మాయా, శ్రద్ధ, భక్తి అను స్థాయిభావములను కొందరు గ్రహించిరి. మరికొందరు శౌచము, ప్రవాసము, నిద్ర, నిర్మాణము మొదలగు వానిని గూడ చెప్పినారు. ఈ ఇరువదియైదింటిని పరిశీలించి, వీటిలో నెన్నిస్థాయిభావములు కాగలవో నిశ్చయింపవలసియున్నది. స్థాయిభావమున నంత

లీనముగా విశిష్టమగు సంచారిభావము స్పష్టముగా నుండవలెనని జ్ఞప్తియందుంచుకొని, తద్విలక్షణము లైనవి స్థాయిభావములు కాజాలవని తేల్పవలెను.

స్పృహయనబడు భావ మాహారవిషయక ప్రవృత్తిలోనిది. ఈరెండును, ఆత్మరక్షణ, వంశవృద్ధియను ప్రాథమిక ప్రవృత్తులలో నంతర్లీనములై యున్నవి పైగా భయక్రోధాదులద్వారా స్పృహ జన్మించును. స్పృహా, మృగయాభావములద్వారా ఆత్మజీవితకామన అభివ్యక్తమగుచున్నది. సంతానవిషయక ప్రవృత్తిలోను, పిల్లలను రక్షించు ప్రవృత్తిలోను ఇవి ముఖ్యాంగములు. ఈ ప్రవృత్తులద్వారా గృహాది నిర్మాణము జరుగుచున్నది. కాగా పైన చెప్పబడినభావము లన్నియు రతియను స్థాయిభావమున నంతర్లీనములైయున్నవని నిశ్చయించవచ్చును. వాత్సల్య, స్నేహాది సుకుమార భావములుగూడ రతి స్థాయిభావరూపములే యగుచున్నవి.

ఆక్రోశమున కన్పించు నిస్సహాయత శోకములోనిఅంగము ఇది క్రోధ, భయములద్వారా నిష్పన్నమగును. శోకముద్వారా జన్మించు ఆర్ద్రానుభూతి వలన నొకేతెగకు చెందిన వ్యక్తులకు సన్నిహిత సంబంధము కలుగుచున్నది. కాగా శోకజనితమగు చిత్తసంవాదమున స్నేహ మంతర్భూతమగును. తద్వారా సాంఘిక జీవనము పోషింపబడును. అనగా శోకవర్గమునకు చెందినభావములలో శోక మొక్కటే స్థాయిభావముగా కన్పించగలదు.

అరతి, సంతోషము అనునవి ప్రతి అనుభూతిలోను అనుస్యూతముగా వచ్చుచు వేదనారూపమున నున్నవి యగుటచే వీటిని స్థాయిభావము లనరాదు. ఆత్మ, అనుకరణ, నిర్మాణాది భావము లుత్సాహ స్థాయిభావము నాశ్రయించుకొని యుండునవి. భౌతిక పరిస్థితులవలన, వాతావరణము వలన ఉత్పన్నము లగు స్థితులగుటచే విశ్రాంతి, నిద్ర, ప్రవాసము అనునవి స్థాయిభావములు కావు. శౌచము, అసహ్యము అనునవి మనస్సు ఉద్వేగించు స్థితులే గాని చిత్తవృత్తి రూపములు కావు. ఇట్లే ఇచ్ఛాశక్తిలోని దోషము నాశ్రయించుకొని బయలుదేరునది సత్వభావము.

అన్యార్థమునకు సాధనగా గాక, నిరపేక్ష భావముతో ననుభవింపబడు నిర్మాణ వృత్తి స్థాయి భావమే యగునని అలెగ్జాండర్ నిర్వచించినాడు. కాని రసప్రపంచమున అనుభూయమానములగు భావములకన్నిటికి ఈ లక్షణము వర్తింపగలదు కనుక ఈ వాక్యమును స్థాయిశబ్ద నిర్వచనముగా గ్రహించ వీలులేదు. జ్ఞానము, భావన అనునవి స్వేచ్ఛగా విహరించగా వచ్చు స్థితులు నిర్మాణము, మృగయ, శ్రద్ధ, భక్తి యనునవి. అనగా ఇవి స్థాయిభావములు కావు.

భక్తి వలన గాని, వాత్సల్యము వలన గాని, జన్మించు ప్రియతరాఖ్యానమగు ప్రీతిస్థాయి భావము కాజాలదు. ప్రేయస్ అనునది భావముకావ్యమందలి గుణము మాత్రమే అని ఉద్భటు డనినాడు. సంచారి భావజనితములై, అత్యంతము విలువగల స్థితులగు స్నేహ, వాత్సల్యములు చిత్తవృత్తులవలన ఉద్భవించునవే గాని స్థాయిభావములు కావు. స్నేహస్థాయి ఆర్ద్రిత యని చెప్పు సమీక్షకులు రత్యుత్సాహములలో ఆర్ద్రిత అంతర్భూతమనిమరచుచున్నారు స్నేహము, భక్తి, వాత్సల్యము అనునవి రతియొక్క విశేషరూపములని హేమచంద్రుడు గూడ వచించినాడు.

ప్రాణుల జీవితములో రతిస్థాయిభావ మతి ముఖ్యమైనది. కర్మప్రవృత్తి, జ్ఞానవికాసము ఈ స్థాయిభావమునుండియే బయలుదేరుచున్నవని మెక్డూగల్ యొక్క సిద్ధాంతము. పాలు కుడుచుట, ఆహారమును తెచ్చుట, ఇంటిని కట్టుట, శిశువును రక్షించుట, శత్రువుల నెదుర్కొనుట మొదలగు క్రియలన్నియు రతిద్వారా వచ్చునవి. ప్రేయస్, వాత్సల్యములు గూడ రతినుండియే వచ్చుచున్నవి. శిశువుయొక్క ఆక్రందనము మాతృత్వమును, పితృత్వమును అభివ్యక్తము చేయగల్గుచున్నది. అనగా రతిస్థాయి భావ మనేక భావములకు ప్రధాన కారణముగా కన్పించుచున్నది.

రతిని సాంప్రయోగికీ ప్రీతి, మైత్రి, సౌహార్దము, భావము అని నాల్గు విధములుగా కవికర్ణపూర గోస్వామి విభజించినాడు. సాంప్రయోగికీ ప్రీతి యనునది సంభోగాత్మకమగు ప్రవృత్తి. దీనిని పశుపక్ష్యాదులలో భిన్నస్థాయిభావముగా గ్రహించినను, మానవస్థితియం దిది రతిలోని అంతర్భావముగనే కన్పించుచున్నది. భక్తిశ్రద్ధలలో జ్ఞానము, భావన, ఉత్సాహము కలవు. ఈ మూడును రసప్రతీతిలో విశిష్టముగా కన్పించుటచే వీటితో కూడిన భక్తిశ్రద్ధలను స్థాయిభావములుగా గ్రహింపవీలులేదు. సత్కృతి,

మతి, ధృతి, ఉత్సాహములతో సంకలితములైన భక్తి శ్రద్ధలు శాంతరసముయొక్క అంగము లగుటచే వీటికి స్థాయిత్వము లేదని అభినవుడు సిద్ధాంతించినాడు. ప్రీతి భక్త్యాదిభావములు, మృగయాక్షాది రసములు హర్షోత్సాహములలో నంతర్భూతము లగుచున్నవని దశరూపకకారుడు వచించినాడు. సమాన స్థితిగతు లలోనున్నవారల మధ్య పరస్పరముగాగల రతిని స్నేహమని, అనుత్తమున కుత్తమునియందు గల రతి ప్రసక్తిని భక్తియని, ఉత్తమున కనుత్తమునియందుగల రతిని వాత్సల్యమని హేమచంద్రుడు ప్రపంచించినాడు.

కోపమువలన సంభవించు బాహ్యానుభావము లలో క్రోధస్థాయి భావము కలదు. ఈ క్రోధము స్థాయిభావము, సంచారిభావము కూడ నగుటచే దీని స్వరూపమును నిర్ణయించుట కష్టము. స్థాయిభావము యొక్క స్వాభావికప్రవృత్తికి ఆటంకములు కలుగగా ఉద్దిష్టార్థ విషయప్రాప్తి దుర్లభమైనట్లు కన్పించినపుడు ఉత్పన్నమగు క్రోధమును స్థాయిభావముగా గ్రహించవలెను. ఆటంకము, అంతరాయములను పారద్రోలుటకు చేయబడు యత్నము, అనువాని ద్వారా నభివ్యక్తమగు ప్రవృత్తిలో క్రోధము ప్రధానమైనది. ఇచట విషయముకన్న ప్రవృత్తియే ముఖ్యమగుచున్నది. ఆటంకమున భయము, యత్నమున ఉత్సాహము వచ్చుచున్నవి. భయముద్వారా భయానకము, ఉత్సాహముద్వారా వీరము సిద్ధించగలవు. వీరభయానకములు క్రోధము నాశ్రయించుకొని వచ్చుటచే వీటికి రౌద్రము మూలభూతమగుచున్నది. అనగా ఉత్సాహ, భయ, క్రోధముల కతి సన్నిహితసంబంధము కలదని భావము. పరుగెత్తుట, పారిపోవుట, మీదకు దుముకుట, స్తబ్ధముగా నుండుట, వణకుచు కూలిపోవుట, మొదలగునవి భయ వర్గమునకు చెందినవి. వీటితో సంవలితమైనది క్రోధము. ఉద్దిష్టార్థమును సాధించుటకు క్రోధము వ్యాపృతమగుచుండగా, విషయమునుండి వెనుకకు మరలుట జుగుప్సలో గలదు. జాగరూకత, కంపము, తొట్రుపాటు మొదలగునవి ఉభయత్ర కలవు. వీటి నన్నిటిని ప్రత్యేక ప్రత్యేకముగా స్థాయిభావములన వీలులేదు.

క్రోధ, భయ, జుగుప్సలద్వారా శోకము రాగలదు. ఈ శోకము బీభత్సమునకు సంబంధించిన దగుటచే జుగుప్సావహమగును. కాని భయమునుగొల్పు వస్తువు మిక్కిలి ఆకర్షణీయమైన విస్మయమునే కల్గించును. విస్మయము సర్వసాధారణమై అన్నిప్రవృత్తులలోను కన్పించును. అన్ని ప్రవృత్తులకు కొంతవర కాధారభూతమైనది విస్మయము. అసమగ్రప్రతీతినిగాని, జ్ఞానమునుగాని ఆధారము చేసికొని బయలుదేరు విస్మయముద్వారా విషయముగాని, సన్నివేశముగాని అతి స్పష్టమగును. పరిశీలన, అన్వేషణ, జ్ఞానము మొదలగువానికి విస్మయము మాధారభూతము. దీనిని చేతోవిస్ఫార మందురు. ఈ విస్మయమున చిత్త వికాస విస్తృతులు కన్పించగలవు. అనగా అనేక స్థాయిభావములకు విస్మయమే పట్టుకొమ్మవంటిది. విస్మయముద్వారా ప్రధానముగా స్వీయవిషయకమగు జుగుప్స కలుగును. కావున క్రీడనకాది శబ్దములచే తెలియబడు విషయవిధేయతలు స్వతంత్రముగా స్థాయిభావములు కాజాలవు. విస్మయ మనేక ప్రవృత్తుల కాశ్రయమైనను, కొన్ని ప్రవృత్తులలో విస్మయమే ప్రధానముగా గోచరించును. లోకోత్తరవిషయములను దర్శించునపుడు విస్మయ మొక్కటే కన్పించగలదు.

కావున రతి, క్రోధము, భయము, ఉత్సాహము, విస్మయము అనునవి మానవజీవితములో నతి ముఖ్యమైన స్థాయిభావములు. కరుణాంతర్గతమగు శోకముతోను, హాసముతోను కలసి ఈ మొత్తము ఏడు స్థాయిభావములు పురుషార్థ (*Values*) సాధకము లగుచున్నవి. మానవజీవితమున కరుణాంతర్గతమగు శోకము స్థాయిభావముగాను, సంచారిభావముగాను కూడ అనుభూయమానమగుచున్నది. బాధలోగాని, దుఃఖములోగాని ఉన్నవారియెడల మన మనుభవించు కరుణ లాలిత్యముతో గూడి చిత్తమును ద్రవింపజేయునది. విపత్తులోగల విషయముపై ప్రేమ యున్ననే చిత్తము ద్రవించును. అనగా కరుణ రతి స్నేహవాత్సల్యాదులతో సంవలితమై యున్నది. చిత్తద్రవీకరణద్వారా ఇతరుల బాధను భావనారూపమున అనుభవించుటయే హాస్యమందలి ప్రధాన విషయము. కాగా రతి హాసశోకములకు పరస్పరము సన్నిహిత సంబంధము కలదని, మిగిలినవాటికి ఇట్టి అన్యోన్య సంబంధమే కలదని సిద్ధమగుచున్నది.

ఈవిధముగా నతి ముఖ్యమైన స్థాయిభావములు జుగుప్సతో కలసి ఎనిమిది యగుచున్నవి. ఇవి కేవ

లగు చిత్తవృత్తులు. మనస్సునకు అనుకూలవిషయముపై కలుగు ప్రవణాయితము రతి. వైక్లవ్యమగు చిత్తవృత్తివిశేషము శోకము. చేతోవికాసము హాసము. ప్రజ్వలన మనబడు చిత్తవృత్తియే క్రోధము. ఔన్నత్యాఖ్య చిత్తవృత్తిని ఉత్సాహ మందురు. భయమున చిత్తవైక్లవ్యము కలుగును గనుక భయశోకము లను రెండు భిన్నస్థాయిభావములుగా పరిగణింప నవసరములేదు. చిత్తవిస్ఫార రూపమగు విస్మయము జుగుప్సాదులకు హేతువు. కాగా అవే ప్రధాన స్థాయిభావము లగుచున్నవి.

ఈ స్థాయిభావముల కన్యోన్య సంబంధ మతి సన్నిహితము. ఒకేసమయమున ననేకచిత్తవృత్తులు పైకి ఉబుకవచ్చును. ఒకేవిషయము నుద్దేశించి అనేక మందికి ఒకే ఒక విధమైన చిత్తవృత్తి కలుగవచ్చును. ప్రతిస్థాయిభావము ప్రవృత్తి పరమగుటకు తద్విశిష్టములగు ఉద్దీపనములు గలవు. ఇతరుల చిత్తవృత్తుల వలన కలుగు బాహ్యానుభావములను చూచినపుడుగూడ ఈ స్థాయిభావములు పైకి రాగలవు. భయజనితమగు శోకమును వినగానే అదే వర్గమునకు చెందిన ఇతర వ్యక్తులకు తుల్యానుభూతి కల్గుట సహజము. అట్టిసమయములలో మనస్సు కంపించి, ఇతరులమనస్సులతో ననన్యత్వమును పొందుచున్నది. దీనినే చిత్తసంవాద రూపమగు ఆర్ద్రత యందురు. ఈ సంవాదరూపమగు ద్రవీకరణ మానసికము. దీనివలన ఒకేవర్గమునకు చెందిన వ్యక్తులకందరకు నొకేవిధమైన మనస్సు, మనః ప్రవృత్తులు గలవని చెప్పవీలగుచున్నది. ఈ తాదాత్మ్యము లేనిచో స్థాయిభావములకు ప్రవృత్తి ఉండ జాలదు అనగా స్థాయిభావములన్నియూ నొకేయొక మూలశక్తినుండి ఆవిర్భవించుచు, ఆ శక్తియొక్క రూపములుగా బహిర్గతములగు చిత్తవృత్తులని భావము. కావున నొకేయొక ప్రవృత్తిలో ననేక స్థాయిభావములు కల్పించ వీలున్నది. కాని వీటిలో నొక్క స్థాయిభావమే ప్రధానమగును. మిగిలినవి దీనికి అంగములు కాగలవు. ఒక స్థాయిభావమున కంగములగు మిగిలినస్థాయిభావములు సంచారి భావములవలె ప్రవర్తించగలవు. అనగా సందర్భవశమున నొకే యొక చిత్తవృత్తి స్థాయిభావముగాను, సంచారిభావముగాను కూడా కన్పడును. సజాతీయ విజాతీయ భావాంతరములచే తిరస్కృతము గాక ఉపనిబధ్యమానములగు రత్యాదులే స్థాయిభావములని అవలోక కారుడు నిర్వచించియున్నాడు.

క్రోధ, శోక, భయ, జుగుప్సలు తమంతట తామే పనిని ఉత్పన్నములు చేయజాలనివగుటచే నీశక్తి వీనికి సంక్రమించునదే గాని, వీటినుండి ఉత్పన్నమగునది కాదని స్పష్టము. రతి, ఉత్సాహ, విస్మయములతో సర్వదా మెలగునది హాసము. ఇవి ప్రతిప్రవృత్తిలోను కన్పించు భావములు. చిత్త ద్రవీకరణలేనిచో నీనాల్గుభావములు అర్థరహితములు, ప్రయోజనరహితములు కాగలవు. స్థాయిభావజనితములగు అనుభావము లవగతములైనపుడే చిత్తసంవాదము కలుగును. సాంఘికజీవనమున నీచిత్తసంవాద రూపమగు అవగతి లేక వ్యంజన ప్రముఖాధారము. తద్ద్వారా వ్యక్తులందరు అన్యోన్యసంబంధమును కలిగి మెలగుదురు. ప్రమాతృప్రమేయములకు సమగ్రముగ అనన్యత్వము సిద్ధించుటయే ఈ చిత్తసంవాదము. ఈ అనన్యత్వము రసప్రతీతిలో నతిప్రధానమైనది. కాగా చిత్తసంవాదమున కేయే భావము లుపకరించుచున్నవో వాటినే సాహిత్యమున మనము ప్రధానముగా స్వీకరించవలెను. అప్రధానమగు వస్తువు ఎవనిచిత్తమునకును విశ్రాంతి నీయజాలదు. అప్రధానమగు భావము ప్రధానభావమున పర్యవసితమగుచు, అన్యముఖప్రేక్షియగుచున్నది. ప్రధానమై, ఇతర భావముల కంగము గాక, స్వయం సిద్ధమై, సమగ్రమై, సంపూర్ణమైనది స్థాయిభావము. పరిసరములలో కలుగు మార్పులకు లోబడక, చిత్తవృత్త్యాత్మకములైనవి స్థాయిభావములు. ఈచిత్తవృత్తులు ప్రవృత్తికి ప్రోత్సాహము లొసగుచున్నవి. ముఖ్యముగా నివి జ్ఞానాకారములే యని చెప్పవలెను.

కాలవశమున స్థాయిభావములలో విశిష్టములగు మార్పులు వచ్చుచున్నవి. పశుపక్ష్యాదులలో కన్పించు స్థాయిభావములు క్లిష్టములు కావు. మానవులలో నివి యనేకభావములతో క్లిష్టములై కన్పించుటచే వీనిని వివిధ భావములలోనికి విశ్లేషించవచ్చును. ఈ భావము లన్నియు నుద్దిష్టార్థప్రాప్తికి గాని, విషయమునుండి పరాఙ్ముఖ మగుటకు గాని వ్యాపృతము లగుచున్నవి. అనగా ఇచ్ఛ నాశ్రయించుకొని ప్రవృత్తములగు నీ భావములు, ఉద్దిష్టార్థప్రాప్తితో ప్రయోజనవంతము లగును. ప్రవృత్తికి హేతుభూతములగు కోరికలద్వారా ప్రవృత్తి సుఖదుఃఖముల నొసగజాలుచున్నది. కాని ప్రతి ప్రవృత్తిలోను సుఖదుఃఖములు సంవలితములైయుండు నని మరువరాదు. స్థాయిభావముల నాధారముగా చేసికొనియున్న రసప్రతీతి మానసికానుభూతిని, ఆత్మానుభూతిని ఇచ్చునది. చిత్తవృత్త్యాత్మకమైనదగుటచే స్థాయిభావ ప్రవృత్తి ప్రయోజన సహితము. ఈ ప్రయోజన మితర భావములద్వారా, ప్రవృత్తుల ద్వారా, అవగత మగుచున్నది. ఈ అవగతి చైతన్య ప్రతీతి. పైగా అవగతి అర్థరహితము కాదు. అర్థము జ్ఞానాకారము. అనగా చైతన్యము, జ్ఞానము అనునవి పర్యాయపదములు. అనుభూతిలో విషయములన్నియు జ్ఞానమున లీనమగుచున్నవి. ఈ యనుభూతి చేతనుడగు వ్యక్తికి కలుగునది.

# తెప్ప తిరునాళ్లు



★

శ్రీ కంచుకూరి రామభద్రరావు

రండమ్మ రండి! రవలసొమ్ములతోడ,
తరలి రారండి! తెప్పతిరునాళ్లు,
శ్రీనృసింహస్వామి శ్రీదేవితోగూడి
కార్తీక జ్యోత్స్నలో కడలి కెరటములపైన
ఉయ్యాలలూగగా ఊరేగివచ్చేను  రం॥

వెన్నెలంతా నింగి వెలిగొడుగు విప్పింది.
హరితాంకురాలతో అవని పులకించింది
వేయిని వ్యాలతోడ వేంచేయుసామికై
హాయిగా సాగు సన్నాయిమేళము రండి.  రం॥

వెండితళుకుల చిర ప్రేలాడుకుచ్చెళ్లు-
గొప్పింటి ఒయ్యారి గోదావరీగంగ
ఆదరికి ఈదరికి ఒదుగుతూ తావచ్చి
నిజనాథుపజ్జనే నిలిచి మ్రొక్కింది.  రం॥

సాగరుడు చేపట్టి చదలంటగా లేచి
కెరవల్లు ద్రొక్కుతూ పాల్కడలి తానమై
గోదావరీదేవి కొంగు కొంగూ కలిపి
స్వామికెదురుగవచ్చి స్వాగతంబిచ్చేను.  రం॥

పల్లెపడుచుల బిగువు పగలబడి నవ్వగా.
తెల్లపూదెప్పపై తేలిపోవును సామి
జేజేలు నల్దిశలు చేరి మార్మ్రోగేను
క్షీరసాగరశయను సేవింప రారండి  రం॥

సాగరుడు శయనమై సంతరించెడు వేళ
మేళాలు తాళాలు మినుబాణసంచాలు
కోలాహలమ్ముగా కొలువుదీర్చెను సామి
అభయహస్తము నెత్తి ఆశీర్వదించెను  రం॥

---

# యజ్ఞఫలము

భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

(గత సంచిక తరువాయి)

### విష్కంభము.

(సరయూ తీరమున క్రీడించు నిరువురు గంధర్వులు ప్రవేశింతురు.)

చిత్రకేతువు: చిత్రపదా! నీ వీ జలముల స్నానము చేయు నుత్సాహమున నీ కర్తవ్యము నే మఱచితివి. మన మిట కేల వచ్చితిమో తెలియునా?

చిత్ర పదుడు: తెలియకేమి యంతయు దెలియును. రావణుడు రామునకేమైన నష్టము చేయుటకు నిగూఢరూప చ్ఛాయతో నయోధ్యా ప్రాసాద సమీపమున దిరుగుచున్నాడు. మహేంద్రుని యాజ్ఞను రాముని సంరక్షింప మనుష్య సర్మమున మనమిటకు వచ్చినారము. కాని:

హిమగిరి నీరసౌఖ్య మొక
　　యింతయు సాటికి రాదు, ఉత్త
మోత్తమము గంగ నీరు మఱి
　　తక్కిన దివ్యజలంబు లింతయున్
సమములు కావు చూడగ న
　　నంతము నౌ సరయూ జలంబుతో,
సుమహిత మిందు స్నాన, మగు
　　జోద్యము, వీడగ జాల దీనినిన్.

చిత్ర కే: హిమాధిక ప్రదేశమునుండియే మన మిపుడు వచ్చినను నిది నిదాఘకాల మగుటచే స్నానము సుఖావహమే కాని, స్వామి నియోగము మఱచిపో గూడదు గదా!

చిత్ర ప: ఔను. కాని,

నిఖిల ఋతువుల బహురమణీయ మగుచు
సకల దేవర్షి మనుజ ప్రశంసితంబు
నయిన సరయూజలంబు పాపౌఘ మడచు
గ్రీష్మ శిశిరర్తువుల సమక్షేమ మొసగు

ఏమైనను నేను స్వామి నియోగము మఱవ లేదు. అపరాహ్ణమునకు బూర్వమే రావణు డెట్లయోధ్యకు రాగలడు? పుష్పకమున వచ్చినను నంత త్వరగా రాలేడు. ఇంతకు నింద్రాదులే తమ భార్యలను రక్షించుకొనుటకైనను నాతని ప్రభుత్వ మంగీకరించిరి కదా! ఇక నెవరు రాముని రావణుని బారి నుండి రక్షింపగలరు? అట్లని ప్రభు నియోగ ముపేక్షింతుమని కాదు. కానిమ్ము, గూఢ దేహులమై యా ప్రాసాదోపవనమున. నిరీక్షింతము.

చిత్ర కే: అట్లనకుము. రావణుడు దశరథుని కంటె బలవత్తరుడేయైనచో నేల యాతడు గూఢముగా వచ్చును? తన కనిష్టము సంభవింపవచ్చునను భయము చేతనే యాతడు దశరథునకు దెలియకుండ వచ్చుట.

చిత్ర ప: కాదు. కాదు. రావణుడ ద్వితీయ బలవంతుడు.

చోరులు శతులును వ్యసనులు
భీరుత్వము గాంచ; రిపుడు భీతిప్రదుల
వ్వారలు, ప్రత్యక్షముగా
గ్రూరములగు పనులు చేయగోరరు మదులన్.

చిత్ర కే: ఏమైనను గలదు కదా! యీ యనిష్ట ప్రతీకారోపాయము.

చిత్ర ప: సరే, రమ్ము. పోదము (నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

### తృతీయాంకము.

రావ: (ఆకాశమార్గమున రావణుడు ప్రవేశించును)

పుట్టినాడ బులస్త్యర్షిపూతకులము
నందు నందితి శివు గొల్చి యమితబలము
సురలసేవల గొంటి; నసురులు భృత్యు
లపజయ మెఱుంగ నే రావణాసురుండ.

అద్వితీయుడ గులబలానంతశౌర్య
ములను జేగీయమానుడ నలఘుకీర్తి

సకలభువనంబులందు నస్మత్సమాన
వీర్యమహితుండు మఱొకండు వెలయఁగలఁడె?
దశరథావనిపాలు తనయుఁడంట ప్రసిద్ధ
రామాభిధానవిభ్రాజితుఁడట.
శస్త్రాస్త్రవిదుఁడంట సమరంబునందు
సురాసురగణములనైన లీల
గెలువ శక్తుండట తలఁపఁ బాలుండైన
నుత్తమయోధుఁడై యొప్పునంట
అని జనంబులు చెప్ప విని యాత డెట్టిడో
చూడంగ వచ్చితి జోద్యముగను.

అట్టిమత్తుఁడు బలవంతుఁడైనవాఁడు
నరులలోపలఁగలఁడె యున్నట్టియెడల
నతని జీవింపనిత్తునే యవనిపయిని,
అందుకొఱకైనదే మదీయాగమంబు.

మంత్ర ప్రభావమున నిగూఢరూపముతో నాకాశజల పర్వతతుల్య గతిని జరించు నారథము నెవ్వరును గనఁజాలరు దీని నిట నుంచి ప్రాసాదమున కేఁగి చూచెదను.

(నిష్క్రమించును.)

(అంత విశ్వామిత్రుఁడు ప్రవేశించును)

విశ్వా:
మును క్షాత్రోచితతేజమంద బరమా
మోఘాస్త్రసంఘాతముల్
నను నిర్జింపఁగఁజాలవయ్యె నిపుడున్
బ్రహ్మత్వముం గాంచవే
వనికాయాస్త్రము లెల్ల వమ్మయఁగ నా
పై నట్టిననొప్పెల్లి రీ
హుని దేజస్విని శక్తియుక్తు గననా
నొక్క జగంబందునన్
భువనంబెల్ల విహారముల్ సలుపనే
పొల్పొందెనే యొక్కఁడే
పవిదన్ మాదృశశక్తియుక్తులవి చూ
పంగల్గువాఁడేడి మా
నవసంఘంబున జృంభకాస్త్రతతియె
న్నన్ వశ్యమెవ్వాని క
య్యవి యేయన్ మఱి తీయ శక్తి తలపో
యన్ గల్గునే యేరికిన్?
అతిశయవీరుఁడున్ దశర
థాత్మజుఁడున్ రఘురామనాముఁడు
న్నతభలశాలి యయ్యును ఘ
నంబగుదాంతి గలాఁడటన్న సం
గతి విని వచ్చినాఁడ గన
గా నతనిన్ గని సత్యమేని స
న్నుతముగ శిష్యుగాఁ గొని య
నుగ్రహియించెద శస్త్రవిద్యలన్.
ధరణీపతి వృద్ధుండు ద
శరథుని యాచించి రామచంద్రునిఁ గొని సం
బరమున నాశ్రమపదమున
కరిగి మదీప్సితఫలంబు నందెద నిదపన్

(ముందు చూచి) ఏమి! రావణు డాకాశము నుండి భూమికి దిగుచున్నాఁడు! నాతిరస్కరిణీ విద్య వలన నిగూఢుఁడు స్వరథుఁడు నగు రావణుని గనఁగంటిని. కాని, యాతఁడు పైవారికి గనరాఁడు. కానిమ్ము. ఆతని తిరస్కరిణీవిద్యను నిగూఢ దేహమును గన గల్గుచున్నాను. ఆతఁడిట నేమి యకార్య మొనరించునో? నారాకవలన నిక నాతని యాటలు సాగవు.

రావణుఁడు: (ప్రవేశించి) ఏమి! విశ్వామిత్రుఁడిటకు వచ్చినాఁడే! ఈతఁడు బ్రహ్మక్షత్త్రి తేజోరాశి. నాకోరిక నీతఁడు సాగనీయఁడు—నేనును దుర్ధర్షుఁడ నగురావణుఁడ నగుటచే నీతఁడు నాకేయనిష్టము చేయలేఁడు. నానిగూఢరూప మాతఁడు చూడ శక్తుఁడు కావున నే నాతని కంటఁబడకుండ నిగూఢముగ నే చరించెదను.

విశ్వామిత్ర రావణులు:

(ఎవరికి వారే) నేను జూచుచున్నాను. కాని యాతఁడు నన్ను జూచుట లేదు. (ముందు చూచి) వసిష్ఠునితోఁ గూడ కుమారు లిటకే విచ్చేయుచున్నారు.

(అంత వసిష్ఠుఁడు నలువురు కుమారులు ప్రవేశింతురు.)

వసి: కుమారులారా! దీర్ఘాయుష్యమస్తు.
కఱపితి నెల్ల విద్యలను గంటిరి
మీరు యథాక్రమంబుగా
మఱపొక యింతలేక శ్రుత
మాత్రముచే గ్రహియించి యాత్మలన్
స్థిరపడునట్లు చేసికొని; చెందెను
ధన్యత మద్గురుత్వమున్;

పరమ సుఖప్రదంబు లగు ఛాత్రుల
కిచ్చెడు జ్ఞాన సంపదల్.
దీపం బెట్టులు వేఱగు
దీపంబుల వెలుగజేయ దేజము సమమౌ;
నా పగిదిని నస్మద్వి
ద్యా పరిణతి నా సమానులైతిరి మీరున్.
మావృశ పావనర్షి జన
మాన్యము శ్రేష్ఠము మీదు వంశ మ
త్యావృతి శాస్త్ర ధర్మముల
నంది జగజ్జన సౌఖ్యదాయియై
త్వావృశ సద్గుణ ప్రచుర
తన్ వెలుగొందు ననాది నుండి యే
తాదృద కీర్తి మీకు నగు
తన్; భువి వర్ధిల రాజ్యలక్ష్మియున్.

కుమారులు : భగవానులగు తమకడ జేరినది మొదలు మాకన్నియు శుభ పరంపరలే యగుచున్నవి. ఇందు సంశయము లేదు. ఇపుడు నగర బహిర్భాగమున కేగి మేము నేర్చిన రీతి ధనుర్వేద విద్యాభ్యాసము చేయ గుతూహల పడుచున్నాము. తామనుజ్ఞ నొసగుచో యథేచ్ఛము సాధన చేయుదుము.

వసి : నేను పాడ్యమి. కాన, అనధ్యాయము. మీ యిష్టము వచ్చిన చోటికి కేగుడు. నేననధ్యాయ కరణీయముల నిర్వర్తింతును. (నిష్క్రమించును.)

రాము : వత్సలారా! మనము పురమునకు దక్షిణముగా బోయి ధనుర్హస్తలాఘవము నేర్చిన రీతి జూపుకొందుము.

భర : పార్శ్వానుచరులను బిలువనంపనా?

రాము : వలదు.

నలువుర మున్నవారము; వనంబున
కేగగ భీతి జెంద బి
న్నలము గాము; దూరగమనంబును
జేయము; చేతులందు బె
క్కులు శరముల్ చెలంగుగద! గుప్తముగా
భుజవీర్య విక్రమం
బులు పరికించు కొంట తగు; పొమ్మను
పార్శ్వచరాళి నిప్పుడే.

శత్రు : (తెరవంక జూచి) మనము చెప్పక పోయినను మనగమన మెఱింగి పార్శ్వానుచరులు మన వెంట నంట వచ్చుచున్నారు.

లక్ష్మ : (తెరకెదురై) ఓ పార్శ్వానుచరులారా! మేము ధనుర్లాఘవ మభ్యసించుటకై వెళ్లుచున్నాము. మీరు శ్రమపడి రానక్కఱ లేదు. మీరు వచ్చిన దారినే వెనకకు బొండు.

(అందఱు నడెతురు.)

రాము : (వెను దిరిగి చూచి) వీరు వెనుక కేగుట లేదు.

లక్ష్మ : మీరు వెనుకకు బోనిచో నేను బాణములు వేసి మిమ్ము వెనుకకు బంపుదును. (విల్లు ఎక్కు పెట్టును.)

రాము : వత్సా! శాంతింపుము. వీరు స్నిగ్ధహృదయులగు నాత్మీయులే. దండనార్హులు కారు. (తెర కెదురై) అనుచరులార! మీరు వచ్చినచో నాపై నొట్టే. మరలి పొండు.

భర : అందఱు వెనుదిరిగి పోయినారు.

(అందఱు మరల నడెతురు.)

రాము : ఇంకను నడచి యేమి లాభము? ఇక్కడనే మనధానుష్కత నభ్యసింతము. (అందఱు కూర్చుందురు.)

శత్రు : (లేచి)

అదిగో పిప్పలవృక్ష మందు
గల పత్త్రాళిక్ సమస్తంబు నా
పాదిలో నున్న నిషంగ మొక్కటి
యిదే పొల్పారగా నేగి ఛి
ద్రదశన్ బొందగజేసి తత్క్షణమె
చేరన్ వచ్చు స్వస్థాన మ
య్యది మీ రండఱు కన్గొనుండు
పరమాహ్లాదంబు రేకెత్తగన్.

(బాణము విడచును.)

రామ భరతలక్ష్మణులు : సెబాస్. వత్సా. సెబాస్.

భర : దీర్ఘాయుష్కుడు శస్త్రవిదుడు నగు శత్రుఘ్నుడు చేసినట్లే నే నింకొక వృక్షము నాకుల నట్లే చేసెదను. (బాణము విడచును.)

రాము : సెబాస్. వత్సా! సెబాస్. నీ ధనుర్వేద కౌశలము చూచినారము.

లక్ష్మ : (విల్లెక్కిడి)

"ఆమూలంబుగ వృక్షమున్ బెకల
జేయంగాంచి యా మ్రాని నె
న్నో ముక్కల్ పొనరించి వైచి దిశలందున్
జిమ్మె నాయమ్మ మిా
రా మార్గంబున జూచుచుండు డిదె
నాయస్త్రమ్ము వెన్వెంట నే
భీమప్రౌఢి నొనర్చి యూపని
సమీపించుఙ్ నిజస్థానముఙ్."

మఱియు, నింకొక బాణంబున—

"చలియించుచున్న మోదుగ
నిలుపు దు స్తబ్ధంబు గాగ; నెఱి నున్నతమా
శిలచే నావృక్షంబును
జలియింప నొనర్తు దృణము సమమది కాగన్."

(బాణములు విడచును.) ఆహా! చూచితిరా?

"వనమున జరియించెడు పసు
గణములు పక్షులును భీతి గని దొవవులన్
ఘనలాఘవ శరపర్మన
మున బాఱెడు జూడు వేగముగ నవిగవిగో."

భరతశత్రుఘ్నులు : ఆహా! మహాభాగుని బాణ క్షేప కౌశల మద్వితీయము.

రాము: సెబాస్. వత్సా. సెబాస్.

"సార్థకమయ్యె నీ ధనువు
సర్వ సురాసురమానవాళి క
త్యర్థము భీతిగూర్చెడి
నహా! జయ మియ్యది యల్పమౌనె నే
వ్యర్థుడ నైన నన్నహరంబును
పీడనివాడ వౌట ర
ణార్థము, మృత్యువేళను
భయంబది లే దిక నాకు నెన్నడుఙ్."

లక్ష్మణ భరతశత్రుఘ్నులు : (బద్ధాంజలులై) గుణాకరత్వమునను నీవు జ్యేష్ఠుడవే.

"గుణములచేత విద్య నను
కూలత మాన్యత శ్రేష్ఠులైన స
త్తనయులలోన బెద్దవయి
ధన్యత గాంచితి వీవు చూడగా"

రాము :

"గుణము నుతింతు రెల్లరును
గొల్వరు వృద్ధయినంత మాత్రచే
మిణుగురు బుర్వు వృద్ధయిన
మెత్తురు కొంతిని బాలభానునిన్."

భరతలక్ష్మణ శత్రుఘ్నులు :

"నయమున నీతిని గుణమున
వయసున దలపోయ నీవె వరణీయుడవై
ప్రియ మొనరింతువు మాలో

రాము : –

ప్రియబంధువు లెపుడు గుణమె వెదకుదురుగదా!"

భరత లక్ష్మణ శత్రుఘ్నులు : ఆర్యా! మా ధనుర్వేద కౌశలమును జూచి మమ్ము స్తుతించితివి. నీ నిపుణతను మేము కనగోరుదుము.

రాము :

"జన్మసంస్కార విద్యల సములమైన
మనకు నెట్టుల గుణభేద మెనయు జూడ?

భర :

జన్మచేత దలంపగ సమమె యైన
ముత్తెముల నత్తగుల్లలు పోలునొక్కొ?"

రాము : సరే. మీరు నియోగింప నేను జూపననుటెట్లు? (తనలో) వత్సల ప్రయోగ నైపుణ్యము జూచియున్నాను. నేను వారికంటె నెక్కువ నైపుణ్యము చూపిన వారు చిన్నబుచ్చుకొనవచ్చును. (ప్రకాశముగా) వత్సా! శత్రుఘ్నా! నీవు చూపిన ధనుర్వేదకౌశలము నేను జూప యత్నింతును. (విల్లెక్కిడును)

విశ్వామిత్ర రావణులు : (దూరమున ప్రవేశించి ఎవరికివారే తమలో) ఇతడే రాముడు.

"పరమవిశాలమున్ దృఢము
వక్షము; నున్నత మంసభాగముల్;
సురుచిర మా ముఖాంబుజము
శోభిత మా నయనద్వయంబు; భీ
కర మరికోటి కెన్న విలు
కాని తనంబది; దేవదేవుడౌ
హరి యవతార మీత డని
యంటకు సంశయమున్నె చూడగన్."

నే నీ నిగూఢదేహముతోడనే నా బాణములతో రామబాణములు లక్ష్యమును జేరుటకు బూర్వమే నడుమ ఖండించెదను. అతడు కోపియై యేమిచేయునో చూతును. అతని పరాక్రమ మంతయు నపుడు పొడకట్టును.

"అతని యస్త్రము వారింప నగును గోపి.
యపుడు తెలియును నతని వీర్యప్రశస్తి
క్రీడయందున్న శయనించి నీడనున్న
సింహశౌర్యంబు తెలియునే శీఘ్రగతిని ?
(నిష్క్రమింతురు)

రాము : వత్సలారా ! చూడుడు. ఆ వృక్ష పత్రము లన్నిటి నొక్కమాఱుగా జిల్లులు పుచ్చెదను. (బాణము విడిచి యాశ్చర్యముతో) ఏమి ! గుఱితప్పి నాబాణము మార్గమధ్యమున రెండుముక్కలై పడిపోయినది !

శత్రు : అది ప్రాతబాణ మేమో ?

లక్ష్మ : అది విరిగిన బాణమేమో ?

భర : దారిలో సుడిగాలి కలదేమో ?

రాము : కానిండు. మరల బాణము విడతును. (శరము సంధించును.)

విశ్వా. రావ : (దూరమున ప్రవేశించి) ఏమి ! ఈ రాముడు :

"అమల శరాపరాధ జని
తామిత చండరుషానశాత్ముడై
కమల దళోపమంబు లగు
కన్నుల నగ్నికణాళి రాల్చుచున్
శమము వొరంగి భీకర ద
శన్ గనుపట్టెడు సింహమట్లు లో
కములకు భీతిగొల్పు నధి
కంబుగ; వీని కసాధ్య మున్న దే ?"

రాము : (మరల బాణము విడుచును.)

అందఱు : మరల నట్లే యైనదే.

రాము : అస్త్రరాజమగు వాయవ్యాస్త్రమును సమంత్రకముగా విడిచి యా వృక్షమును వేళ్ళతో పెకలించి దూరముగా బారవైతును.

విశ్వా: రావ : (దూరముగా ప్రవేశించి) దీనిని గూడ భగ్నముచేయుదును.

రాము : (బాణము విడుచును.)

అందఱు : ఏమి ? ఆ చెట్టు ఆకైనను గదలలేదే?

రాము :

"అరయ బాణప్రయోగ రహస్యములను
నికషమగును వాయవ్యాస్త్ర నిరుపమాన
నిపుణసంప్రయోగం బిది నీరసించె;
నస్మదీయ పరాక్రమ మరయు డింక."
(కోపముతో)
"అమితంబైన ప్రకాశముం గలుగు నీ
యాగ్నేయ దివ్యాస్త్ర ము
త్తమ భంగిన్ దరుసంతతిన్ క్షణములో
దగ్ధంబుగా జేయుతన్
విమలాస్త్రం బటు చేయలేనియెడలన్
వెన్వెంటనే నాదు దే
హము భస్మంబొనరించి వైచెద ! నమో
ఘాస్త్రంబు సార్థంబుగన్."

రావ : (దూరముగా ప్రవేశించి; తనలో) ఆహా !

"ఒంటి జరించు సింహ శిశు
వుగ్రమృగాళికి భీతిహేతువౌ;
నొంటి బినాక పాణియు మ
హోగ్రుడు సూర్యుడు తేజిమాడనీ
కుంట జగత్ప్రసిద్ధ; మటు
లొప్పగ నీతడు నాకె భీతియౌ;
దంట తనంబునన్ ధనువు
తా నిటు సజ్యముచేయుచుండగన్."

ఆగ్నేయాస్త్ర సంహారముసైతము నాకు దెలిసినదేయైనను నా యుత్సాహముపోయి యేలకో భీతి జనించుచున్నది. కావున, నే నిటనుండి వేగముగా బోవుదును. ఆహా ! రావణుడు భయపడుట కిదే మొదటిసారికదా ! (నిష్క్రమించును)

విశ్వా : (దూరముగా ప్రవేశించి తనలో) ఆహా !

"పరబలమెంతయైన నను
బాయదు సాహస మెన్నడున్ ; మహో
ద్ధురత సమంత్రపూత మగు
తూణము తీయగ భీతియౌను దా
శరథి ; కలంచె మన్మనము
సౌమ్యుడు [illegible]ర్జితమూర్తి యైన స
చ్చరితుడు రామచంద్రు డని
శం బగు నద్భుతమూర్తి చూడగన్."

"అతి విఘాతుకములు పరశ్శతము లగుచు
గలవు వనముల మృగములు ; కాని యందు

చతు : కురూపమునకు దగినట్లు కుటిల భావము కల మంథర పోయినది. ఆమె కురూపిణి యని యామె యనుకొనను. ఈమె నిజముగా నంపకత్తెయే యైన నేమి చేయదు! మధురికా! గౌరీ మంటపము కడ నున్న పిప్పల వృక్షముల యాకులను గోసి కొందము. రా!

పుష్పలతిక : (పైకి చూచి) దీని యాకు లన్నియు జిల్లులు పడినవే! ఎందుచేతనో (అందఱు నాశ్చర్యములో జూతురు.)

చతు : (భూమిపై జూచి) ఇక్కడ జాల గాలి గుర్తులు కలవు. గుఱ్ఱపుడెక్కల గుర్తులు రథచక్రముల గుర్తులు కలవు.

మధు : రథములో సుమారు లిటకు వచ్చి రని కొందును.

చతు : ఈ గుర్తులే కాని రథము వచ్చివెళ్లిన జాడ లేదే!

మధు : (భయముతో) ఏదో భూతము వచ్చిన ట్లున్నది. బాబో! పోదము రండు. (నిష్క్రమింతురు)

భర : భయపడి చేటికలు పరుగెత్తుచున్నా రేలనో ?

శత్రు : అక్కడనే సూర్యనియస్త్రము వెనుకకు పోయినది.

రాము: ఎవడో మఱుగుపడి యట నుండియుండ వచ్చు. యోగప్రభావముచే మాయాశక్తివలన నదృశ్యముగా నుండవచ్చునని వింటిని. యోగులు మోస కారులు కారు. మఱి నాయస్త్ర మిట నెట్లు అదృశ్యమైనది ? ఎవడో మాయచేసినాడు. సరే. నా యస్త్ర కౌశల మాతనికి దెలియగలదు. అదృశ్యుడై యున్నా వేల ? ఓ యదృశ్యుడా ?

"కనబడకుండగ బాణము
గొనియుంటివి క్షణములోన గొని తేవేనిన్
అనుమాన మేల ? గ్రక్కుం
తును రక్తము పాలు కాదు దుష్టాత్మకుడా !

(బాణము సంధించును.) (దూరమున వసిష్ఠుడు ప్రవేశించును.)

భర : (చూచి) అయ్యో! ప్రమాదము. భగ వానులు ఆర్యగురుపాదులే నీ బాణమునకు లక్ష్యముగా వచ్చినారు. బాణ ముపసంహరింపు.

రాము : (బాణ ముపసంహరించి) ఏరీ గురువులు? యోగప్రభావ తిరోహితదేహులై నా చికీర్ష జూచియుందురు. వీరివలననే నాయస్త్రము నెక్కడ పోయి యుండును. పూజార్హులగు వీరు నా బాణమునకు లక్ష్యమైరి. ఇది తెలియక నేను దోష మొనర్చితిని.

"శిరముల నిప్పుడె సద్గురు
చరణంబుల నిలిపి పరమ సంభావ్యముగా
శరణంచు క్షమాభిక్షను
త్వరగా గోరుదము పరమసన్యుల సురులన్."

అందఱు రండు. (వసిష్ఠుని పాదములపై బడి.)

"సగుణుడవో నిర్గుణుడవో
భగవానుడ రక్షచేయు బాలుర మమ్మున్
అగణితమగు నీ కృప కే
ముగదా భాజనుల మాదుము జగద్వంద్యా !"

"సుతులు శిష్యులు నపరాధ శతము చేయ
గురులు క్షమియింత్రు వాత్సల్య పరవశులయి
బాలకము మేము తెలియక పాలువడిన
దోషమును విస్మరింపు సంతోష మొదవ.

వసి : ఇదియేమి ? మీదోషము లేదు. నాకు గోప మేల ? దీర్ఘాయుష్కులారా ! లెండు.

రాము : మహాశిలనైన భింఛిధింఛి చేయగల నా బాణము తెలియక వృద్ధులగు తమపై వేయ జూచితిని. తప్పు క్షమింపుడు.

వసి : నీవు శస్త్రాస్త్రజ్ఞులలో బాలుడవే యైయుండవచ్చును గాని ;

"నేను నీయంత బాలుడ నైనయపుడు
నింతకంటెను దివ్యాస్త్రమేసె దొల్లి
కౌశికుండు మహాక్రోధ కారణమున
గాని యది నాకు నెట్టివికార మీదు."

"కవచం బాచు శమంబె బ్రాహ్మణునకున్
గాపాడు జక్రాశని
ప్రవి ఘాతంబులబారినుండి ; భయమా
వంతైన లేదందుచే
భవదీయాస్త్రమునన్ ; దలంప యముడున్
బ్రహ్మాత్మయోగీంద్రు జే
ర విషాదంబున బారిపోవు నన శ
స్త్రం బేమి చేయంగనున్ ?"

అందుచే నన్ను లక్షించి నీవు బాణము విడిచి యున్నను నాకు దగిలియుండదు. వలసిన నేసి చూడుము. నీ కేభయమును లేదు.

రాము: (నమస్కరించి)
"గురువులు భగవానులు ఋషి
వరులును ద్రష్టలును గరుణ బారంగతులున్
సచ్ఛరణార్హులు నిత్యము నే
శిరమున మిము నేయ నెపుడు సంభవమగునే?"

భర: భగవానులు నాకే మంగళ మొసంగగోరి యిటు లనుగ్రహించి విచ్చేసినారో గదా.

వసి: నేను వనసంచార కుతూహలమున నిటుకు వచ్చి యీ ప్రాంతమున నొకకమండలు వుండుట చూచి యట గూర్చుంటిని. పిదప నది విశ్వామిత్రుని దని తెలిసికొంటిని.

రాము: ఏమి! విశ్వామిత్రులు కూడ నట నున్నారా?

వసి: ఆయన రావణునితో వచ్చియుండెను.

రాము: విశ్వామిత్రులను జూచుటవలన మేము ధన్యుల మయ్యెదము. ఏలన, నింతవఱకు మేమాయన యాశీర్వచనముకాని యభినందనములను గాని యందవ లేదు. రావణుడు వచ్చె నని వింటిమి. ఆతడు మహాబలు డనియు సురాసుర జయవర్చస్వి, సర్వవిద్యా పారదృశ్వ డనియు వింటిమి. కాని, కేవల మధర్మ పోషకుడట.

వసి: రావణుడు వత్స లగుమీ కనిష్టము చేయుటకే వచ్చినాడు. ఆతని రథముతో నాతడు తిరస్కరణీవిద్యవలన నిగూఢముగా నుండెను. విశ్వామిత్రుడు కూడ మీ ప్రభావము విని చూడవచ్చెను. ఆతడును రావణునుదంత మెఱుంగుటకు యోగప్రభావముచే నిగూఢుడయియే వచ్చెను.

రాము: తరువాత? తరువాత?

వసి: రావణుడు మిమ్ము జూచి వచ్చినదారినే వెడలిపోయెను. ఆ పాపి దారిలో నేమైన పాపకృత్య మొనరించునేమోయని తపోవనాంతము దాక విశ్వామిత్రు డాతని ననుసరించెను. ఈ సంగతి మీకు జెప్పుటకే నేనిటు వచ్చితిని.

రాము: ఐన విశ్వామిత్రులను మేము చూచెద మన్న మాట.

వసి: ఆ. నేను మీకు జెప్పినట్లు వినయ నియమములతో నాతని మనస్సున కెక్కునట్లు ఋషి పాద స్పర్శ పురస్సరముగా నమస్కరింపుడు.

రాము: ఆయన క్షత్రియుడని వింటిమి.

వసి: ఐన నేమి?

రాము: బ్రాహ్మణ చరణములనువలె క్షత్రియ చరణములను మా శిరములకు దగుల నిత్తుమా?

వసి: ఆతడు తపోమహత్త్వపుడు.

రాము: తపమే బ్రాహ్మణత్వ హేతువా?
తపము శ్రుతమును గులము నీత్రయము గూడి
యునను బ్రాహ్మణ్య కారణ మందు రట్టి
త్రయమునను నాతడే పూజ్యతము డటంచు
బలికి యుండిరి కాదె పెద్దలు తలంచి.

వసి: ఆ మాట సామాన్య తపో విషయమున. మహాతపః ఫలములోక సామాన్య మన్నది విశేష విషయము.

రాము: ఐన.

వసి: తపః ప్రభావ మొక్కటే కాదు. విశ్వామిత్రుడు తండ్రి తాతలు ఋషిత్వము బ్రహ్మత్వము కూడ నందిన వారే.

భర: ఆతడు బ్రాహ్మణుడో యబ్రాహ్మణుడో మనకేల? గురువుల యాదేశమే మనకు శిరోధార్యము. ఆతడు క్షత్రియుడా? వయసుచే విద్యచే తపముచే మన కర్హుడా యనర్హుడా? యన్న విచారము మనకేల?

రాము: ఔను. గురువాక్యాను సరణమే మన కర్తవ్యము.

అందఱు: గురువులకేది యిష్టమో మనకునదియే. (నిష్క్రమింతురు.)

మంథర: (ప్రవేశించి) కపట పండితుడగు వసిష్ఠుని సంగతి కంటిని వింటిని. ఆత డెప్పుడు రామునితోడనే మాటాడును గాని భరతుని లక్ష్య పెట్టడు. పరిజనులు, దాసులు, నందఱు రామానురక్తులే. రావణుడు వచ్చినట్లు చెప్పుచున్నారు. వాని పనులు చాల ననార్య జాతివట. ఆతడప్రతి రథుడట. వృద్ధుడగు రాజు రామునికే రాజ్యమీయ దలచుటయు వింటిని. రావణుడు రామ విరోధియై యాతనిని జంపి వేయుచో నిక భరతుడే నిష్కంటకముగా రాజ్య మేల గలడు.

ఆహా! నా భర్తృదారిక యగు కైకేయికి కైతము రాముడన్ననే యిష్టము. భరతుని కా రాజ్యము రానిచో నా పేరు మంథర కాదు. అనార్యులు, అసురులు, పిశాచములు—వీరిని రామునికి శత్రువులుగా జేసి నేను భరతునే మహారాజును జేయుదును. వృద్ధవసిష్ఠుడు కాని కపట సుమంత్రుడు గాని యేమిచేయగలరో చూచెదను. అమ్మో! సుమంత్రుడు వచ్చుచున్నాడు. (నిష్క్రమించును.)

సుమం: (ప్రవేశించి) ఇపుడు విశ్వామిత్ర మహర్షి వచ్చెను. మరల వచ్చును, రావణుడు వచ్చి పోయినాడు. తన యాతిథ్యమును గైకొనకే యేల రావణుడు వెడలిపోయెనో యని మహారాజు ఖేదపడు చున్నాడు. క్షత్రియ వైరి యాతడు వచ్చుటేమి? ఆతిథ్య మిచ్చుటేమి?

"తరుమూలంబున వాకి గొడ్డలి జే
  తిన్ వైచి ఖండింపగా
నొరకొన్నట్టి విరోధికిన్ బరమ సం
  తోషంబులో నీడని
చ్చి గురున్ మించెడి పండ్లొసంగి మహీయున్
  జెల్వాగు పుష్పంబులన్
గనుణాసేయుత నిచ్చు వృక్షము గతిన్
  గన్పట్టు నీ తండ్రిటన్.

(తెర లో)

ఇపుడు రావణు డిచటికి నేగుదెంచె
నన్న సంగతి విని రాణు లడలు చుండ్రి
రాత్రులందు బురంబు సంరక్షణంబు
నప్రమత్తత రక్షకు లరయ వలయు.

సుమం: (విని) సరే. నేను రక్షకులకిది తెలుప నేగెదను. (నిష్క్రమించును.)

(గంధర్వులు ప్రవేశింతురు.)

గంధ:

రాముం డప్రతి వీరుడెంచు కలిసున్
  రామాస్త్ర జాలంబులన్
శ్రీమాన్యుం డగు కౌశికర్షికి, దప
  శ్శ్రీయుం డతం డన్న సు
త్రాముం డున్ భయమందు, నాతని శర
  వ్రాతంబుచే రాముడే
దో మార్గంబున రావణున్ దునుము నిం
  క్రుండిడక ఘోషింపగన్.

రాముడే బలుసేన వీరుడు
రాముడు సర్వాస్త్ర శస్త్ర రాజీవగరుం
డా మహనీయుడే చంపును
దాముదమున రావణాది దనుజుల నెల్లన్.

(నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

## ప్రవేశిక!

(ప్రవేశము: నలుగురు వైతాళికులు ప్రాసాదముపై)

మొదటివాడు: ఓరీ! సమకా! కట్టుకంఠా! నే నీగీతము నాగీతము చాలసార్లు విన్నాను నీవు వినుము. నీగీతము సమక్క వేణు శబ్దమురా.

రెండవవాడు: ఓరీ! మూళవకా! విను. నీ స్వరము గార్దభస్వరమురా.

మూడవవాడు: మీ యిరువురకు గీతమన్న నేమియో తెలియదు. వాద్యములతో గూడిన నాగీతము మీరు వినుండు.

నాలుగవవాడు: నేను సంస్కృత గీతము పాడుదును. మీకు సంస్కృతము రాదు. అది చాల బాగుగా నుండును. ఒక్కసారి నాగీతము విన్న రాజు మరల మీగీతము వినడు. అదే నా గీతజ్ఞత.

మూళవకుడు: భావ! గోపిలుడు సంస్కృతమున జడుపునట. అది యెవరికి గావలయు? మహారాజు నాగీతము వినెనా యిక మీగీతము వినడు.

భమకుడు: నే నిపుడు ప్రత్యూషకాల మగుటచే మహారాజును లేపుట కేగుదును. గోపిలుడు పాడుట కనుమతి లేదు.

మూళ: ఓరీ! నీగీతము విన్న మహారాజునకు నిద్ర పాఱిపోవునురా. అంతే కాదు. భృత్యు లందఱు కూడ భయపడి పరుగెత్తుదురు.

దంతిలుడు: భావ! గోపిలుని వాద్యము లేక, నీగీతము మహారా జెట్లు వినును? నేను నావాద్యమును వాయింతును.

గోపి: నా వాద్యము లేకయా? సమయము వచ్చినపుడు చెప్పెదనులే.

విదూషకుడు: (ప్రవేశించి) మీ రిక్క డేమి చేయుచున్నారు?

గోపి : సుందరకా! స్వాగతము. విశ్వామిత్ర మహర్షి వచ్చినాడు. మన మాలిని జూడవలయు.

విదూ : ఇప్పుడు.

గోపి : ప్రతిదినము మహారాజు ప్రాసాదమునకు ఋషులు వచ్చుచునే యుందురుకదా! మరి విశ్వామిత్రునిపై రాజున కింత పక్షపాత మేల?

విదూ : ఆయనకు రెండుముఖములు, నాలుగు చేతులు, వీపు లేదు. రెండుప్రక్కల ముఖమే కనబడును.

గోపి : ఐన నెందు కింత గౌరవము?

విదూ : ఓరీ! ఆయన బ్రాహ్మణుడు. క్షత్రియుడు. రాజఋషి. అక్షమాలాధారి. ధనుర్ధరుడు. ముందువెనుకలు చూడగలడు. ఉభయతోముఖు డనుటకన్న నేమికావలయునురా?

గోపి : ఆ. రెండుముఖములతో నాయన యేమి చేయును?

విదూ : ఒకదానితో వేదము పఠించును. రెండవదానితో శాపము లిచ్చును.

గోపి : నాలుగుచేతులతో నేమి చేయును?

విదూ : రెండిటితో బ్రహ్మకర్మ. రెండిటితో యుద్ధకర్మ.

గోపి : కేవల నారాయణునికే నాలుగుచేతు లుండు నని చెప్పుదురు.

విదూ : భగవంతు డగు నారాయణునకు నాలుగుచేతులు. ఒకముఖము. ఈయనకు రెండు ముఖములు రెండుప్రక్కల రెండురెండు చేతులు.

గోపి : ఆయనను నీవు చూచితివా?

విదూ : ఓరీ మూర్ఖా! నేనే చూడవలెనటరా? విన్నాను. ఎప్పుడు చూచినదానికంటె విన్నదే యెక్కువ ప్రమాణము.

గోపి : ప్రత్యక్షముగా జూచినవారే చూచి నట్లు లెక్క.

విదూ : ఓరీ! మూర్ఖా! కన్నులకు బాగ క్రమ్మిన జూడ శక్యము గాదు. చెవులకు బాగ క్రమ్మదు కదా?

గోపి : సరే. నీవు విశ్వామిత్రులగూర్చి విన్నావు. నే నిపుడే చూచెదను.

విదూ : నీవు జాగ్రత్తగా జూచి చూచినది చూచినట్లు నాతో జెప్పు.

గోపి : నీ విక్కడనే గూర్చుండుము. ఆయననే స్వయముగా నిన్ను జూచును. వేదా! రమ్ము. స్వయముగా జూతువుగాని.

విదూ : అబ్బో! నే నాయనను జూడలేను. ఆయనకు కోప మెక్కువట. ఏమో! ఆయన దంష్ట్రా కాష్ఠములతో నాబుఱ్ఱ పగులగొట్టగలడు. దూరమున నుండియే చూచెదను. (తెరలో)

"ముని శస్త్రంబులచే జగంబు గెలిచెన్;
బూర్ణుండు సత్త్వంబులో
నను; నిత్యంబు భయంబు జెందును నితం
డన్నన్ మహేంద్రుండు; చే
కొనె బ్రహ్మత్వము క్షత్త్రియత్వమును వా
కోరాని తేజంబు; ని
మ్మని మూర్ధన్యుడు, గౌరవింపు డితనిన్
బూజ్యుండు లోకాళికిన్."

అంపలు : విశ్వామిత్రులు వచ్చినారు. రండు పోదము.

(నిష్క్రమింతురు)

(ఇది ప్రవేశిక)

## చతుర్థాంకము

(ఆసనస్థుడై విశ్వామిత్రుడు ప్రవేశించును.)

విశ్వా :

క్రతురక్షణ మనియెడునొక
కృతకపుహేతువున రాము నిమ్మని రాజున్
బతిమాలెద నాయస్త్రము
లతిపాత్రున కితని కిచ్చి యానందింతున్.

సుమంత్రుడు : (ప్రవేశించి) భగవానులకు నమస్కారములు.

విశ్వా : యశోవంతుడ వౌదువుగాక!

సుమం : భగవానుడా! నీయాశీర్వచనమున కృతకృత్యుడైన మహారాజిదే యిటకు విచ్చేయుచున్నాడు.

విశ్వా : సరే. మహారాజాగమనము పాటింతును.

(మహారాజు, వశిష్ఠుడు, కుమారులు, విదూషకుడు, ఇతరులు ప్రవేశము.)

రాజు : సావిత్రీస్రష్టలు, తపోధనులు, మహామహులు నగు విశ్వామిత్రులకు దశరథుడు డిబే నమస్కరించుచున్నాడు. (నమస్కరించును.)

విశ్వా : (లేచి) అనామయ మగు యశస్సు లభించుగాక !

రాజు : భగవానుడా ! కూర్చుండియే యాశీర్వచనము కురిపింపుడు.

విశ్వా :
పరగుదైవత్వపాలకత్వములు నీకు
వఱలు నిత్యము రాజత్వవర్తనంబు;
ఏల నిలుచుండెరాదు నీపాల నేను
నీసభావిజయముగోర నెఱసఖుండ !

రాజు :
తాము నిలుచుంట మా కుచితంబు గాదు
ప్రభులు తాము శాసింపగా వలతులు మము,
తాము నిలుచున్న జగములు తథ్యముగను
నిలిచియే యుండును స్వకర్మనిష్ఠ లుడిగి.

కూర్చుండుడు.

విశ్వా : (వసిష్ఠులతో) మహర్షీ ! నమస్తే.

వసి :
తపమున బ్రహ్మత్వము గొ
న్న పరమఋషివి లభించె ననంతమహాత్త్వం
బపుడే నీ కిది చేయుదు
గృపగొను ప్రతివందనంబు గృతకృత్యుడనై.

కూర్చుండము. (కూర్చుందురు.)

కుమారులు : సావిత్రులు భగవానులు నగు తమ కిదే వందనము చేయుచున్నాము.

(పాదములు ముట్టి విశ్వామిత్రునకు నమస్కరింతురు.)

విశ్వా : అప్రతిరథులు,దీర్ఘాయుష్కులు, లోకప్రణయభాజులు నౌదురుగాక ! అందఱకు భద్రమగుగాక ! కూర్చుండుడు.

(అందఱు కూర్చుందురు.)

రాజు : తమ తపఃక్రియ లేయాతంకములు లేక జరుగుచున్నవికదా !

విశ్వా :
ధర్మపరు లౌచు జౌరులు తనరుచుండ
నెటులు సుఖవంతు లౌదురో నృపులు నటులె
విఘ్నములు మాకు బాడమనివిధము కలుగ
క్షేమ మగు మాకు మాతపఃక్రియలు సాగు.

వసి :
పరమనృపులు స్వధర్మంబు చాటిసేయ
సౌఖ్యమబ్బుట బుధులు, కాశ్చర్యమగునె ?
చమురు కలుగుట గాలి వీచకుండ లేమి
దీప మారక వెలుగదే దీప్తముగను ?

విశ్వా : (సగర్వముగా)
కరుణ వహించి రాజ్యము ల
కంటక మౌనటు మాచుచుందు మా
సురపతి మున్నుగా గలుగు
శూరులకైనను; రాజచంద్రులన్
బరమసహాయసంపదను
బాయముచేతను బ్రోచుచుందు; మీ
కరణి నొనర్చుచున్న ఫల
కారిగ జూడను సత్తపఃక్రియన్.

(ఆలోచించి తనలో) ఇది నాకోరికకు విరుద్ధమగుమాటకదా ! ఇట్లందును.

(ప్రకాశముగా)
అఖిలమగు తపోవిఘ్నమ్ము లవల ద్రోలు
నిన్ను నొక్కటి యాచింతు నేను నేడు.

రాజు :
ఆజ్ఞసేయుడు మీయాజ్ఞ లవధరింతు
బరమమాన్యుల పాదసేవకుడ గాన.

విశ్వా : (వశిష్ఠునితో) భగవానుడా ! అనంతబ్రహ్మకులా ! ఈ దాశరథులు నలువురు యథావిధి నీచే నుపనీతులైరా ?

వసి : ఆఁ

విశ్వా : వీ రేయే శాస్త్ర శస్త్రముల నభ్యసించిరి ?

వసి : శాస్త్రము లన్నియు.

విశ్వా : ఏయే శాస్త్రములు ?

వసి : మంత్రద్రష్టృత్వము తక్క నన్నివిద్యలలో వీరు నిష్ణాతులు.

విశ్వా: ఈవయసు వచ్చుసరికే వీ రిన్నివిద్యలు నేర్చుట లోక సామాన్యవిషయము. ఇది మీ మహిమయే కాని వేఱు కాదు.

వసి:
దీపశిఖవలె సుగుణముల నిధులు లయి
స్నిగ్ధహృదయులు పరమ విశిష్టమతులు
నయము ఘృణ, బుద్ధి, పవిత్రత ననవరతము
మెలగి కనినారు సర్వవిద్యలను వీరు.

విశ్వా: హాయిగా మేడలోనుండి యనుభవజ్ఞానము లేకనే క్రమముగా నన్నివిద్యలు నేర్వ కలిగిరి?

వసి:
విమలహృదితో గురుబోధనముల వినుట
శ్రద్ధతో మననంబును జరిపి మొదలుగ
టాదియైన క్రమంబున నఖిలశాస్త్ర
సముదయంబును నేర్చిరి చతురమతిని.

విశ్వా: ఎప్పుడైన నెవరైన వీరిని పరీక్షించిరా? ఏలన!
ఎన్నడు గురుండు సుస్నిగ్ధహృదయుడగుట
శిష్యు దలపోయు జ్ఞానవిశిష్టునిగను;
సర్వమున సంతతంబు విసర్గమైన
ప్రణయ మరయు గుణాధికత్వమ్మె నిజము.

వసి: వీరిని పరీక్షింపగల సమర్థులే యింత వఱకు గానరాలేదు. (కుమారులతో) దీర్ఘాయుష్మంతులారా! విశ్వామిత్రభగవానులు మిమ్ము ప్రశ్నించెదరు. మీరు సమాధాన మిండు.

కుమారులు: చిత్తము.

విశ్వా: కుమారులారా! అప్రతిమానశాస్త్రవిదులు, గురువులు, భగవంతులు నగు వసిష్ఠులవారు మీ కేమి నేర్పిరి?

రాము: (లేచి, నమస్కరించి) అన్నిటికంటె ముందు గురువులయెడ వినయము, స్నేహితులయెడ ప్రణయము, దీనులయెడ దయ, శత్రువులయెడ నిర్భయత్వము మాకు గురువులు నేర్పిరి. పిదప భగవానులు నాలుగువేదములు సమంత్రార్థసంగ్రహముగా వ్యాకరణము, ఆర్షపద నిర్వచనము, గ్రహచారము, పతంజలి యోగశాస్త్రము, మానవాచారశాస్త్రము, చతుర్వింశతివ్యవహారనిర్ణయము, వాస్తు రాజశాస్త్రము, మేధాతిథ న్యాయశాస్త్రము, కౌశకృత్స్ని మీమాంసాశాస్త్రము, నిత్యానిత్యోపయోగశాస్త్రములు, గజాశ్వరత్నపరీక్ష, శకునజ్ఞానము, కావ్యకళ మున్నగునవి నేర్పిరి. వత్సల కన్నియు బాగుగా వచ్చియును. నేను గొన్ని విస్మరించితిని. కొన్ని జ్ఞాపకమున్నవి.

భరతలక్ష్మణశత్రుఘ్నులు:
ఆహా! ఆర్యుని మహానుభావత్వము!
సద్గుణం బన్యగుణము లేశంబునైన
గాంచు నుత్కృష్టచరితంబు గాగ నటులె
స్వీయగుణము లత్యుత్తమశ్రేణి వయ్యు
స్వల్పములు గాగ నెపుడు చెప్పం గడంగు.

విశ్వా: సంతుష్టుడ నైతిని. ఇక శస్త్రాస్త్రముల నెట్లు నేర్చిరో చెప్పుడు?

లక్ష్మ: (రామునితో) ఆర్యా! నా బాల్యచాపలము క్షమింపుడు. దీనికి సమాధానము నేను చెప్పెదను.

రాము: సరే.

లక్ష్మ: (విశ్వామిత్రునితో) భగవానుడా!
అన్న యెఱుగును వేదంబు లన్నికూడ
జ్యేష్ఠుడును శ్రేష్ఠుడును నా విశిష్టశస్త్ర
శాస్త్రముల, మాకు నెదియును లేశంబు తెలియదు;
గాని యెట్టులు నతనికి గాము సాటి.

మఱియు:
జనక పాదారవింద ప్రసాదము నను
అస్త్రశస్త్రాదివిద్యల నాఱితేరి
నార; నయ్యవి విజయసేనాపతికిని
నిత్యమును సాధనము చేసి నెగడినాము.

విశ్వా:
శాస్త్రశస్త్రంబు లెఱుగంగ వాలినట్టి
సన్మనీషియె యగు బలశాలి మూర్తి.
కుంభజుడు వార్ధిజలమెల్ల గ్రోలగంట
మరల నింపుట యుత్కృష్టమహిమకలిమి.

వత్సా! నీకు గల రామభక్తికి నిన్నెంతయు నభినందింతును. ఎచ్చట స్నేహము, భక్తి ప్రకాశించునో యచట గుణము నుండును. మీ శస్త్రాస్త్రానుభవము నెట్లేవట ప్రదర్శించితిరి? ఏలన:

మథన మొనరించినన్ గాని పథని గాదు
శ్రేష్ఠమైనట్టి నవనీతసిద్ధి, యటులె
శ్రుతి మనుభవము లేనిచో విలయొ యగుచు
నదియు నృపులకు గాదు సహాయకారి

విదూ : నాకు సురల వధ కావలయును. ఏది తిన్న ఘృతము తిన్నట్లే కదా!

రాజు :
వస్తువున కెప్డు ద్రవ్యరూపములు గలుగు;
వాక్యపదముల కుత్తమ భావములగు;
గుణులతో మైత్రి వాదంబు నెరపదగును.
అటులనే శాస్త్రము ప్రకాశ మంద గాంచు.

మఱియు :
చెట్టునాకుల జలియింప జేయగలము
శిలల ముక్కల బొడిపొడి జేయగలము;
అస్త్రశస్త్రములన్ వృథకునాను దప్ప;
మది యొనర్పంగ ననుభవ మెసగు మాకు.

విశ్వా :
వినయ విస్పష్ట తాత్త్విక విలసితములు
మీరు పలికిన పలుకులు మిమ్ము జూపె
తెలియు మీకున్న శస్త్రాస్త్ర దివ్యశక్తి
సంశయము లేదు నాకయ్యె సంతసంబు

ఈ యభ్యాసపద్ధతి మెచ్చుటకు లేదు. అస్త్రముల కెట్టు గపల్పగల మీకున్నత నిజముగా ప్రశంసాతీతము.

విదూ : చెట్టుఆకులు కదలిన నేమి లాభము? ఎండిపోయిన చెట్టు కొమ్మలు విరిగినను పొయ్యిలోనికైన వచ్చును. వంటచెఱకునకు జాల బిక్షగా నున్నది కూడ.

రాజు : విశ్వామిత్ర భగవానుల కిది చెప్పలేదు. నేను వీరి నప్పుడప్పుడు వేటకు గూడ గొనిపోవుచుందును.

విశ్వా : వనములందలి కేసరి, గజ, మహిషాదులగు మృగములు రాజుల కేమి యపకారము చేయును?

రాజు : అవి యావులను సస్యములను హింసించును.

విశ్వా : అవి బలిష్ఠములై సర్వ ప్రజాపీడ కల్గించిన దండింపదగినవే. కాని, శస్త్రాస్త్రములతో జంపదగినవి కావు. ప్రకృతి జనులను బీడించుచు సృష్టిలో పయనము గల్గించు మహాబలవంతులగు రాక్షసులనే శస్త్రాస్త్రములతో జంపవలయును. నీతో గూడ వీరి నడవికి దీసికొనిపోవుటవలన వీరికి యుద్ధ క్రియ లెట్లు తెలియును?

రాజు : బలవంతములగు మృగములను ముందుగ రప్పించి వానిని వీరిచే జంపించి వీరి నిపుణత నరయుచుందును.

విశ్వా : సరే కాని, పాపాత్ములగు రాక్షసుల జూచి యెరుగకుంట లేదు.

రాజు : గ్రామవాసులు కృషీవలులు, గోపాలురు, వణిజులు, సార్థవాహులు నెవ్వరును రాక్షస పీడనుండి కాపాడుమని నన్ను గోరలేదు.

విశ్వా : అసురులు ధనలుబ్ధులు కారు. అందుచే కృషీవలులజోలికి వణిజులజోలికి రారు. తపోవనములందు యజ్ఞములు చేయు తాపసులకు విఘ్నములు కలిగింతురు.

రాజు : ఋషులు కాని తపస్వులు కాని నన్ను సాహాయ్యము జేయుమని కోరనే లేదు.

విశ్వా : ఋషులు తపస్వులు స్వరక్షణకై క్షత్రియ సాహాయ్యమును యాచింపరు.

రాజు : నన్నెవరును గోరకుండగనే నాకు దెలియని శత్రువుల నెట్లు రూపుమాపుదును?

విశ్వా :
"ఎవ్వరు కోరగా ఏమము
నెప్పుడు బాలగ్రోలు సూర్యుడె
డెవ్వరు కోర వాయు వది
యెల్లెడ వీచు జగంబులోన ? ఎ
వ్వెవ్వరు కోర శేషుడు మహీ
దలపై నిలుపున్ ? దలంపగా
నవ్విధి రాజు పాపుల నయాచిత
భంగి నణంపగా దగున్."

రాజు : పాపులను శాపముచే ఋషులేల నివారించుకొనరాదు?

విశ్వా : శపించుటవలన పుణ్యము క్షీణించును. అందుచే దాపసు లెల్లప్పుడును శపింపరు.

"శాప మసహ్యపాపజన సం
తత నాశక రోగదండపగా;

తాపసవృత్తిలో మెలఁగు
   కన్యల కయ్యెడి సర్వమున్, జనా
రోపితకోప మయ్యెడి; రో
   షుంగ; ఫలం బెది తావకీనసు
స్థాపితకీర్తి శౌర్యగుణసంపద
   కింక? నెఱుంగ జెప్పవా!

రాజు: సంతోషము. నా కర్తవ్యమేమో తామే తెలసియుదు.

విశ్వా: సరే! ఒకసారి రెండు చెప్పుచున్నాను.

రాజు: ఏవవి?

విశ్వా: గుణపౌరుషవయోజ్యేష్ఠుఁడగు నీ కుమారునకు రామునకు దివ్యాస్త్రముల నుపదేశించితివా?

రాజు: నా నేర్చిన దివ్యాస్త్రము లన్నియు కుమారుల కొసంగితిని. రాముఁడవి యన్నియు జక్కఁగా బ్రయోగింపగలఁడు. నాకు రెండస్త్రములే తెలియనివి.

విశ్వా: ఏవవి?

రాజు: జృంభకాస్త్రము, బ్రహ్మాస్త్రము.

విశ్వా: బ్రహ్మాస్త్రవిదుఁ డొక్కఁడు వసిష్ఠ భగవానుఁడే.

వసి: నేను సర్వాస్త్రసంహారము చేయగలను గాని సేయలేను.

విశ్వా: అవి రెండు నెఱిఁగియే నేను బ్రహ్మత్వమందినాను

రాజు: జృంభకాస్త్రములుకూడ దమకు దెలియునా?

విశ్వా: చక్కఁగా.

రాజు: అగుచో గొంతకాలము తా మిటనుండి కుమారుల కవి నేర్ప నర్థించుచున్నాను.

విశ్వా: అది యర్థములేని మాట.

రాజు: ఏల?

విశ్వా:

"అర్థి యరుదెంచు దాత గృహంబునకును
దాత యరుదేఁడు వెంట నాతనిని గోర;
దప్పిఁ జెందినవాఁడె వెదకును సరము
సరము వెదకదు తృషితుఁడౌ నరుని మరల."

రాజు: నా గృహమంతయు దమదే. తమకు నేను నమస్కరించినపుడే నా యీ సర్వస్వము తమ యధీన మయ్యెను. తా మిటనే యుండి మమ్మనుగ్రహింప గోరుదును.

విశ్వా: రాజగృహంబు నానా వ్యవహారాకులము. సౌనసౌఖ్యములను విడిచి వన్యఫలాశనులము, వ్రతసంపరాసితులము, బ్రహ్మవిచారనిహితమనస్కులము నగు మావంటివారికి మరల నిటునుండ నేల తలంపు కలుగును? గృహస్థుని యావాసము వివిధవ్యాపారనిలయము. బ్రహ్మపరులక్రియలకు నేకాంతవాసమునకు యోగ్యముకాదు. పర్ణశాలలయందే నిర్జనముగా వసించు తాపసులకడ గృహస్థులు వచ్చియుండఁగలరా? తాపసులు రాజసంపదలను ముట్టనొల్లరు.

రాజు: తమ చిత్తము. నేను పరిహాసమున కనలేదు.

"నేను సపుత్త్రి భృత్య పరి
   నిష్ఠిత మంత్రిబలంబుగా సుఖా
సూన సుసౌధవాహన మ
   హోత్తమ కోశధనాదికంబుతో
మానిత మామకీన మణి
   మండన కేళి వనాదికంబుతో
మీ నుత పాదపద్మములఁ
   మెప్పుగ చేసెద దావకాఙ్క్షలన్."

విశ్వా: రుద్రస్వేదము, మునిమనము, వీరపాణి, రామారుచి, బలవిత్తాది సంపదలు నన్ను బంధింపజాలవు.

వసి: యుక్తిపరుల కవి యేవియు బంధము నొసంగజాలవు. ఏలన; గంధాశ్మము, రుద్రస్వేదమునకు విలువడదు. భక్తిచే మునిమనస్సును రంజింపజేయవచ్చును. నమస్కారముచే వీరపాణి సంతసించును. దాక్షిణ్యము చూపినచో రమణీసౌందర్యము బాధింపజాలదు.

విశ్వా: ప్రాకృతులగు జనులు ప్రాసాదవాసులలో గుణము గణింపరు. ఇంతకు దేశకాలపాత్రములే వస్తుగుణవికాస హేతువులు. ఎట్లన;

"సరసున సరోజతతి వికాసంబు గాంచు
మలయపర్వతమందున పలయుఁ జంద

నంబు; వస్తువు లట్లు స్థానమును బట్టి
వన్నెలు గనుండు; నశియించి వ్యత్యయమున."

మఱియు :

"నెట్లు చిగిరించు మనుమానససిద్ధితోడ
నమిలి నర్తించు వర్షర్తునం గడంగి
హంస శరదాగమమున నూయందొడంగు
గాలమున సర్వ మున్ గుణకలితము లగు.

రాజు : కుమారుల కీరెండుశస్త్రములు తెలియవు కాన, వారు నాకంటె నధికులు కావలయును. అందుచే నవి తామిటనుండి వారికి నేర్పవలయును.

విశ్వా : నీ వట్లడుగకూడదు.

రాజు : ఏల ?

విశ్వా : నాయాచన మోఘమగు పక్షమున నిన్నేమియు నడుగను.

రాజు :

"సకలచరాచరంబును వ
శం బొనరింతును నీకు నందు నా
కిక వలదేమియుం మరల
నెన్నడు దమ్మడుగన్ యథేచ్ఛమై
సుకృతులు కైకొనందగును;
జాడ భవాదృశు లుత్తమోత్తముల్
సకరుణ నేది కోరినను
స్వామి! ఇడుసంగక యుండ గాంతునే!

విశ్వా : నేను నిన్నేమికోరుదునో యది తీసికొని వెంటనే వనమున కేగుదును.

రాము : ఆజ్ఞాపింపుడు.

విశ్వా : రాముని యాచింతును.

రాజు : ఎందు కొఱకు ?

విశ్వా : ఈయదలచినవారిచ్చెడుదానిఫలము పుచ్చుకొనువారి నడుగరాదు.

రాజు : చెప్పుడు, ధనాదులకా ?

విశ్వా : మాదృశు లగు ఋషులు ధనాదులు కోరరు.

రాజు : రాముడు నా ప్రాణముకదా ?

విశ్వా : ఐననేమి ? మహాత్ము లడిగినవారికి ప్రాణ మీయరా ?

రాజు : రామునితో నేనును వచ్చెదను.

విశ్వా : నీ విచ్చినమాట మరల నిట్లు నిషేధింప జూతువా ?

రాజు :

"కారణము లేకయే రాము గానమునకు
కంపి రిమతోడ నే నెట్లు లకట! గృహము
నందు నివసింతు ముసలినై యొక్కటికట!
జీవితము నెట్లు నిల్పుదు చెప్పుడు ప్రభు ?

విశ్వా : కారణములేకయే యని యనుట పాడి గాదు.

రాజు : కారణమేదో చెప్పుడు.

విశ్వా : పదిదినములలో బ్రాత్రియాగ యజ్ఞ మొకటి నేను జేయుచున్నాను.

వసి : ఈకాలమున యజ్ఞమేమి ?

విశ్వా :

"యజ్ఞదాన తపంబుల నవరతము
చేయుటయె సర్వ మెల్లరు శీఘ్రగతిని;
ఎపుడు చేయగ దలపను; నెపను శాంతి;
యపుడె తలపోయవలయు యజ్ఞావసరము.

ఆ నాయజ్ఞము శస్త్రజ్ఞసాహాయ్యము లేనిది విజయవంతము కాదు. సర్వశస్త్రవిదుడైన రాముడే యజ్ఞము నిర్విఘ్నము గావింపగలడు.

రాజు : విఘ్నము లెట్లు కలుగును ?

విశ్వా : మారీచ సుబాహు ప్రముఖులగు రాక్షసులనుండి.

రాజు : నేను సైన్యసహితుడనై వచ్చి వారిని సంహరింతును.

విశ్వా : రాముడు దక్క నొరు లందులకు సమర్థులు కారు.

రాజు :

"రాక్షసులు నిర్దయులు బలరాజితులును
రాముని పదంబు లెద మృదురమ్యము లగు
నెటులు రక్షించు యజ్ఞంబు నింకిలెందు
వనజము వనాగ్ని నార్పగా వలతియె ప్రభు ?"

విశ్వా :

"బాలార్కుండు త్రిలోక సంవృతతమో
భంగంబు గావింపగా
జాలుం గాదె; వనిన్ మృగావళికి దా
పంబీయదే సింహపుం

ఏమిట్రా ఏమిటే? అన్నదామె ఆదుర్దాగా.

ఏమీ లేదు. దీన్నసలు మనింట్లో ఒక్క నిముషంకూడా ఉండనివ్వకూడదు. అని అంటున్నారు వారు. నాకు ఇష్టంలేని పనే చేయవలసి వస్తున్నందుకు దుఃఖం పొర్లుకొచ్చి అవురుమన్నారు.

'ఒకే ఒక్క దాన్ని పంపిస్తే మనల్ని మాత్రం నవ్వరట్రా? ఏదన్నా తప్పుంటే వాళ్ళ నాన్నను పిలవనంపిస్తే వాళ్ళే చూసుకుంటారు. నేనుంటిని గాయ్య. పెద్దమనిషి అదన్నా చెప్పకూడదా అనుకుంటారు. ఇది చేసేదె లోకానికేం తెలుస్తుందంటా.' అని అంటూ వున్నదామె. పెట్టె సర్ది గదివాకిట్లో నిలబడ్డాను నేను. వారు పెట్టె బండివాడిచేతికిస్తున్నారు. నేనొకసారి మా అత్తగారి ముఖంవైపు చూచాను జాలిగా.

'నన్నేం చెయ్యమంటావమ్మా? చూస్తానే వుంటివిగా. నా మాట వాడువింటాడు గనకనా పెడ్తాడు గనకనా? మీలోమీరు ఏమనుకొంటున్నారో ఏంజేసుకొంటున్నారో నాకేం తెలుసమ్మా? వాడేనంటే వాడికంటే మూడాకులు నువ్వు ఎక్కువ ఐపోతివి. ఇవాళనుకుంటారు. రేపు బాగుంటారు. ఎటుతిరిగీ మీరుమీరు ఒకటేనమ్మ, నేనే తేడా అవుతాగాని.' అన్నదామె. ఎక్క వేంబండి - అని ఒక్క కేక వేశారు. ఇక నాకు ఎక్కడలేని ధైర్యం వచ్చింది. ఛీ అక్కరలేని వాళ్లతో ఎందాకా అతుకు పెట్టుకుంటాం? ఏదైతేమాత్రమేమి? ఏ సమయానికి ఏది చేయవలసివస్తే అదల్లా ధైర్యంతోనే చేసితీరాలనుకొంటూ బండి ఎక్కాను. పరిష్కారం చేయలేని కొన్ని కొన్ని సమస్యలనుగురించి తీవ్రంగా ఆలోచించుతామే కాని తెలియక, వాటంతటవే పరిష్కారమౌతవి కాబోలు ననుకొన్నానప్పుడు. అంతటితో నా విషాద జీవితంలోని ఒకభాగం సమాప్తమైంది.

నేను మా పుట్టింటికి వచ్చినతరువాత ఎన్నడు మాయింటికి రానివాళ్లుకూడా ఏదో ఒక వంక బెట్టుకుని మాయింటికి వస్తూండేవాళ్లు. అట్లా చిక్కిపోయావేం? ఏమన్నా జబ్బు చేసిందా? అనీ, మీఅన్నయ్య అత్తగారింటిదగ్గర ఉన్నాడు కావాల, ఎవరు తీసుకొచ్చారని, ఒక నెలవుంటావా, తొందరగానే వెళ్లాలా? అనీ ఇలా ప్రశ్నలమీద ప్రశ్నలు కురిపించేవాళ్లు. అసలు విషయం వాళ్ళకు తెలియక కాదు. మేమే విడిగా చెప్తామోనని. మా నోటి మీదగా చెప్పించి వినాలనీ, అలాంటి ప్రశ్నలతో మమ్మల్ని అస్తమానమూ బాధిస్తూండేవాళ్లు. ఇక్కడకు వచ్చిన కొత్తరోజుల్లో మొగుడుకొట్టి వెళ్ళగొట్టాడట, అనీ, దీని వ్యవహారం మొగుడుకి తెలిసే అట్లా చేశాడట అనీ చాటు చాటుగా ప్రచారం చేస్తూనే వుండేవాళ్లు—అలాంటి వ్యవహారాలలో ఆరితేరినవాళ్లు కొంతమంది. నన్ను బాగా ఎరిగున్న వాళ్లు ఇప్పుడే కాదు అప్పుడుకూడా నామీద మాట పడనిచ్చేవాళ్లు కాదు.

నేనసలు ఇల్లువదలి పడిపంచలు చేరవలసి రావటం సత్యం నెపంతోనేకదా. తన కారణంవల్ల నేనీ విధంగా కావటాన సత్యం ఎంత బాధపడుతుంటాడు. బాధపడకుండా? సత్యానికి నాకువున్న పరిచయం తెలిస్తే సత్యమే కాదు హృదయంవున్న వాళ్లెవళ్లైనా బాధపడి తీరవలసిందే.

సత్యము నేను చిన్నప్పటినుండి ఒకే స్కూల్లో చదువుకుంటుండేవాళ్లం. నాతోపాటు ఇంకా కొంత మంది ఆడపిల్లలుకూడా వుండేవాళ్లు ఆ స్కూల్లో. ఏ కారణాలవల్లనో కాని సత్యం మా అందరికంటే పెద్దవాడైనప్పటికీ చేరీచేరటమే మా క్లాసులోనే చేరాడు. మాఅందరిలో సత్యం ఇముడలేకపోయాడు. మాకు ఆలస్యంగాను సత్యానికిత్వరగాను పాఠాలు వస్తుండేవి. చివరకు ఆయనకు వేరే క్లాసుపెట్టి చదువు చెప్పవలసివచ్చేది. మిగిలిన మా అందరిలోకి మళ్లీ నాకు త్వరగా పాఠాలు వస్తుండేవి. ఎప్పుడైనా మేస్టరుగారు మాక్లాసుకి సత్యాన్ని పాఠాలు చెప్పమనేవారు. వాళ్లందరికీ చెప్పబోయి వాళ్లకు త్వరగా రాకపోవటాన విసుక్కుంటుండేవాడు. నాకు చెప్పటం అంటే సరి చాలా సరదాగా చెప్పేవాడు. చదువుకునేటప్పుడు ఎక్కువగా మేమిద్దరమే జంటగా తిరుగుతుండే వాళ్లం. మా యిల్లు వారియిల్లు దగ్గరగానే వుండేవి. పైగా ఎక్కడో ఏదో కొంచెం బంధుత్వంకూడా కలిసివున్నదని పెద్దవాళ్లు చెపుతుంటారు. ఈ కారణాలవల్ల సత్యానికి ఫలానా వారమ్మాయినియిచ్చి చేస్తారట. అని జనం అనవసరంగా వాడుకలు పుట్టించారు. అప్పటికి నాకంతగా ఏమీ తెలియదు. సత్యానికిమాత్రం బాగా ఏమో కాని కొంతవరకైనా తెలిసే వుండవచ్చు. నాకు తెలిసిం

వల్లా సత్యానికి బాగా పాఠాలు వస్తవనీ, నాకంటే సరదాగా పాఠాలుచెప్తాడనీ, ఏదైనా తెచ్చిపెట్టా నంటేసరి నాకోసం ఎంతకష్టపడైనాసరే తప్ప కుండా తెచ్చిపెడతాడనీ,అంతవరకుమాత్రం తెలుసు. స్కూల్లో తతిమ్మా పిల్లలంతా అబద్ధాలాడుతుంటే వాళ్లేకాని సత్యంమాత్రం అబద్ధం ఆడడనీ, సత్యం సత్యమేననీ ఇకొక వాడుకకూడా.

అప్పుడు సత్యంఅంటే నాకుచాలా ఇష్టంగానే వుండేది. తరువాత నేనుకొంచెం ఎదుగుతున్నకొలదీ సత్యం సహవాసానికి మావాళ్లు నన్ను పోనిచ్చేవాళ్లు కాదు. మా పెద్దవాళ్లు వాళ్ల పెద్దవాళ్లుకూడా బాగానే వుంటుండేవాళ్లు. ఫలానావారమ్మాయిని సత్యానికి ఇచ్చి పెళ్లిచేస్తారట అని జనం చెప్పుకుంటూనే వుండేవాళ్లు. జనం ఆవిధంగా చెప్పుకోగా చెప్పు కోగా-చివరకు మా పెద్దవాళ్ళకుకూడా ఆ ఉద్దేశాలే కలిగినవి. అంతలోనే నేను పెద్దదాన్నయాను.

అంతకుముందే సత్యం చెబుతుండేవాడు ఇంకా కొద్దికాలానికి నిన్ను మీవాళ్లు చదువు మాన్పించ టానికి ప్రయత్నించెయవచ్చు. నీవు మాత్రం చదువుకోవలసినదనని పట్టు పట్టుమని. ఆయన చెప్పినట్లే ఇకస్కూలుకు పోవద్దన్నారు మావాళ్లు. నేను పట్టు పట్టాను కాని లాభం లేకపోయింది. నేను పెద్దదాననైన తరువాతకూడా సత్యం ఏదైనా పనిమీద మా యింటికి వస్తూనేవుండేవాడు. మొదట మొదట సత్యానికి చాటుకు పోవాలో ఎదుట వుండాలో తెలిసేదికాదు. నాలో ఏదోఒక కొత్త దనం రావటాన ఎదుటవుండటానికి సిగ్గుగానే వుండేది. నిన్నమొన్నటివరకు కలసిమెలసి తిరుగుతూ ఒక్కసారి చాటుకు పోపోయినా ఏమనుకొంటాడో ననీ వుండేది. నాకు తెలియకుండానే రెండుపనులు చేస్తూనే వుండేదాన్ని. సత్యంవచ్చినా మా అమ్మ తోనో మా నాన్నతోనో మాట్లాడి పోయేవాడుకాని నాతో ఏమంత ఎక్కువగా మాట్లాడేవాడేకాదు.

ఒక్కనాడుమాత్రం చేతిరుమాలుమీద సన్నని మెలిక కుట్టుకుంటున్నాను. నా దగ్గర సరీగా ఇలాంటిదే ఒకటిఉన్నది కాని సాదాగావుంటుంది, అదినీవు తీసుకుని ఇదినాకు ఇస్తావా అన్నాడు. అలాగే ఇస్తానన్నాను, ఒకసారి తనేమో కథ వ్రాశానని, ఆకథ ఫెయిర్ చేసి పెట్టమని అడిగాడు. అలాగేచేసి పెట్టాను. అలాఆయన నాకేదైనా చిన్న చిన్న పనులు చెపుతుండటం నేను చేసిపెడు తుండటం అలవాటైపోయి ఎప్పుడుఏది చెప్పినా సరేలెమ్మంటుండేదాన్ని, ఒక్కసారి కాబోలు అన్నాడు. నేను ఇప్పుడు ఏది చెప్పినా ఒక్క సారైన చెయ్యనంటావేమో అంటే అనవేమి? అని. చెయ్యనని ఎందుకనాలి అన్నాను.

కాదు సాధారణంగా ఇతరులు ఎప్పుడు ఏదో ఒకపని చెపుతూవుంటే విసుగ్గాఉండదుమరి? అన్నే వాడు. నాకు అలావుండదని చెప్పేదాన్ని. నిజంగా నాకు ఇంట్లో పనులకంటే సత్యమేదైనా పని చెప్తే ఎంతో సరదాగా చేసిపెట్ట బుద్ధయ్యేది. నాకలా వుండటానికి ఆశక్తి ఆయనలోనే ఏదోవున్నది. నేను అలాగే ఆయన ఏబస్తీకన్నా వస్తున్నారని తెలిస్తే సరి గాజులనీ, రిబ్బన్లనీ, ఏవేవోపనులు పురమా యించేదాన్ని. ఆయన ఒక్కటికూడా మరచి పోకుండా తెచ్చిపెట్టేవాడు. అలా ఇద్దరం పూర్వం లాగానే స్నేహంగా వుంటుండేవాళ్లం. తరువాత సత్యానికి వున్నఆస్తి కాస్తా వాజ్యంలో చిక్కుకు పోయింది. అది అప్పట్లో తేలేటట్లుగాకూడా లేదు. అందువల్ల నన్ను ఎక్కడైనా వేరేఇచ్చి వివాహం చేస్తే బాగుండునని మావాళ్లు ఆలోచించటం మొదలు పెట్టారు. అప్పటినుండీ, ఎప్పుడో ఏమోకాని సత్యం మా యింటికిరావటం మానివేశాడు. నాకు వేరే సంబంధాలు రావటం ప్రారంభించాయి. నిజంగా నాకే సంబంధం ఎంతమాత్రం ఇష్టంలేదు. అయినా మా నాన్నముందు మూడేళ్ళ పసిపిల్లకూడా ఎదురుచెప్పే వీలులేదు. నాకువచ్చిన సంబంధాల్లో ఇంత నిక్షేపంలాంటి సంబంధాన్నే మావాళ్లు ఖాయం చేశారు.

తరువాత రెండుమూడు రోజులకే నన్ను పెళ్లి కూతుర్ని చేశారు. నాకు పెళ్లికళ రాలేదనీ, నాకీసం బంధంఇష్టంలేకపోవటానికి కారణం సత్యానికి నాకు ఏదో ఉండిఉంటుందనీ, అమ్మలక్కలంతా అప్పుడే చెప్పుకోవటం ప్రారంభించారట. అదే అలాఅల్లు కుని అలా అల్లుకుని మా అత్తగారు మా వారివరకు కూడా పాకింది. అదుగోపులి అంటే ఇదుగోతోక అనేవాళ్లేకాని అసలక్కడ పులివున్నదో లేదో కాస్త ఆలోచించి తేల్చుకోగల విజ్ఞానం మనలో

ఎంతమందికున్నది? వాళ్ళమీళ్ళ మాటలునమ్మి మావారు, ఎలాగైనా పిల్లా జల్లా కలిగేటట్లుగా లేరు, పైగా సొమ్ముకూడా రాలేదని దీన్ని వెళ్ళగొట్టి ఇంకొక దాన్ని తెచ్చుకుంటే బాగా కట్నంకొస్తుందని మా అత్తగారూ, ఇద్దరు ఏకమై నన్నీ విధంగా చేశారు. ఎవరైనా అడేమని అడిగితే ఒక్కపనన్నా ఒళ్లువంచి చేసేదికాదనీ, చెప్పినట్లుగా వినేదికాదనీ, ఎదురు తిరిగి ఏది పడితే అదిఅంటుందనీ, అలాంటి దానితో మేమెట్లా కాపురం చేయించుకుంటామని చెప్తుండేవాళ్లు. నేను ఇక్కడకు వచ్చినకొత్తలో. ఆ మాటలు పట్టుకొని మా అమ్మకూడా 'నీవు ఇక్కడ వున్నావింకదా అని పరుగెత్తుకొచ్చావా? రేపు వాళ్లింక వేన్నన్నా కట్టుకుంటే నిన్నుకూడా మానెత్తిన ఎక్కడ ఎక్కించుకుంటామనుకున్నా అయిన తరువాత వాళ్లుచెప్పినట్లుగా వినకపోతే ఎట్లాగనీ, వాళ్లు తిట్టినాపడాలి కొట్టినా పడాలి, తప్పుతుందామరి? ఈరోజుకే నేనుపడేవి నేను పడట్లా?' అనీ, చాటు చాటున కోప పడుతూ ఉండేది. నా బాధ్యత, తనమీద పడితేఎట్లాగా, అనే భయంవల్లను తనకూతురు కాపురం చేయటం లేదని లోకం నిందిస్తుందనీ జంకువల్లను ఆవేదనంతా భరింపలేకనో ఏమో, ఇలాంటి విషాదపరిస్థితుల్లో వున్న నన్ను ఆదరించటానికి బదులు ఒకొకసారి ఎంతో ఉక్రోషాన్నైనా వెళ్లబోసేది. అలాంటి పరిస్థితుల్లో నా స్థితిమరీ అధ్వాన్నమైపోయేది. నాకు శాంతి అనేది ఎక్కడ? ఎవరికైనా ఒకచోట దెబ్బతగిలితే ఇంకొకచోట విశ్రాంతిఉండాలి. ఆ మాత్రంకూడా స్థానంలేనప్పుడు మనమింకా ఈ బ్రతుకు బరువును మోయగలిగేదెట్లా? ఫుట్ బాల్ ను తన్నినట్లుగా ఇటువస్తే వీళ్లొకతన్ను అటుపోతే వాళ్లొకతన్ను తన్నుతూవుంటే మనగతేంకాను? ఈ కష్టాలన్నీ ఎవరికి చెపితే ఎవరి హృదయంలో దాచుకోగలుగుతారు? ఈ అంతులేని కష్టపరంపర ఎప్పటికైనా దానంతట అది విరమించవలసినదేకాని ఎవరికి చెపితేమాత్రం ఎవరు తీర్చగలుగుతారు?

సత్యం వ్యాజ్యం జయించి తనకుతగిన ఇంకొక అమ్మాయిని వివాహం చేసుకొని వ్యాజ్యంతోపాటు జీవితాన్నికూడా జయించాడు. ఎంత అదృష్టవంతుడు అని నేననుకుంటుంటానేకాని ఆయనకుమాత్రం ఆ విశ్వాసంలేదు. అంటే తను వ్యాజ్యం జయించలేదనీకాదు, తగిన అమ్మాయిని, వివాహం చేసుకోలేదనీకాదు, జీవితాన్నే జయించాననే విశ్వాసంమాత్రంలేదు. నా వివాహమైన తరువాత ఆయన నేను రెండుమూడు సంవత్సరాలు మాట్లాడటమే సంభవించలేదు. వారింట్లో నాకెవ్వరూ మా యింటికి వచ్చేవారుకారు. మేమెవ్వరమూ వారింటికి వెళ్లేవాళ్లంకాదు. అందువల్ల ఎప్పుడైనా బజార్లో అలా వెళుతూవుంటే దూరాన్నుంచీ చూడటమేకాని, దగ్గర్లో కలుసుకోవటంగానీ, మాట్లాడటంగాని జరిగేదికాదు. తరువాత వారిఅమ్మకు చాలా జబ్బుచేసింది. చావాబ్రతుకా అన్న పరిస్థితుల్లో మేము వారింటికి వెళ్లటం, తరువాత తరువాత వారుకూడా మా యింటికిరావటం జరుగుతూ ఉన్నది. సత్యము నేనుకూడా మామూలుగానే మాట్లాడు కుంటుండేవాళ్లం. మా పెళ్లిళ్లు కాకముందులాగా అంతచనువుగా మాట్లాడుకునేవాళ్లం కాదు. ఎక్కువగా నేను నా కష్టాలను గురించే చెప్తుండేదాన్ని. ఆయన చాలాబాధపడుతుండేవాడు. నాకష్టాలు అలా చెప్పి చెప్పి ఆయన మనస్సును పాడుచేయటం నాకంత ఇష్టం ఉండేదికాదు. అందుకని నేను మాఅత్తగారింటి దగ్గరనుండి వచ్చిన కొత్తరోజుల్లో ఏమిటి సంగతులు ? అని ఆయన అడిగినా ఏమీలేవు సంగతులు అనేదాన్ని ఒకొకసారి. నేను అలా అన్నప్పుడు నా పరిస్థితులు తనకు తెలియజేయటం లేదని ఆయనకుఎంతో కష్టంగావుండేది. నేనేమైనా ఆయన్ను అడిగితే ఆయనకూడా చెప్పేవారుకాదు. నేను నా కష్టాలనుగురించి చెప్పకపోతే ఆయన బాధ పడ్తారనిగానీ, నేనే చెప్పకుండా దాచుకోలేక పోవటం వల్లగాని ఎక్కువగా చెప్తూనేవుండే దాన్ని. నేను మావారి మనస్తత్వాన్ని గురించిచెప్తూ వుంటే ఒకొకసారి ఆయనముఖం కోపంతోఎఱ్ఱబారి, విచారంతో కమిలిపోయేది. మీరుమాత్రం తగిన ఆమెను వివాహం చేసుకొని వ్యాజ్యంతోపాటు జీవితాన్నికూడా జయించారు అన్నా నొకసారి ఆయన్ను విచారాన్నుంచి మరల్చటానికి. నీవీలాంటి బాధలనుభవిస్తున్నంతవరకు నేను నా జీవితాన్నే జయించాననుకోలేను అన్నారు. ఆయనకు నామీద వున్న ఇలాంటి కరుణవల్లను, నన్నుపూర్తిగా అర్థం

చేసుకున్నందువల్లను, నాకు ఆయనమీద ఎంతైనా అభిమానము, గౌరవము ఆదరము ఉంటవికాని అంతకన్నా ఇంకేమీ లేదు. ఇదంతా ఇతరులు అర్థంచేసుకోవాలంటే సామాన్యమా? ఆలోచనలతో నిమిత్తం లేకుండా ఎవరిష్టంవచ్చినట్లు వారు చెప్పుకుంటారు.

నేను మాయింటికి వచ్చినతరువాత అప్పటికింకా మంచిచీర కట్టుకోనిగానీ, తలలో పూలు పెట్టుకోనిగాని ఎరుగను. ఎందుకో ఒకసారి డ్రామాకు వెళ్లాలనిపించింది. అందరువెళ్తా నన్ను కూడ రమ్మంటే, సరేనని ఆరోజు ఇస్త్రీచీరకట్టుకొని ఇస్త్రీజాకెట్ తొడుక్కుని ఒకసారి అద్దంలో చూచుకునేటప్పటికీ తల్లోపూలుకూడా పెట్టుకుంటే బాగుండుననిపించింది నాకు తెలియకుండానే. నేను వెళ్లే దారిలోనే సుబ్బమ్మగారి ఇల్లుంది. ఏకాలంలోనైనాసరే వారింట్లో ఏవో ఒకపూలు పూస్తూవుంటవి. మా పొరుగింటామేకదా అని పూలు కోసుకోటానికి వారింటికి వెళ్లాను. అంతా వూరికివెళ్ళటాన ఆమె ఒక్కఆమే వున్నది ఆ ఇంట్లో. ఆమె నాకు ఎదురు వచ్చి ఎక్కడికి? ఏమిటి? అని అడిగిందాశ్చర్యంగా. డ్రామాకు వెళ్తున్నామన్నాను.

డ్రామాకువెళ్తే ఇస్త్రీ చీర కట్టుకోవాలా? అన్నది మళ్ళీ.

పదిమందిలోకి వెళ్లేటప్పుడు మామూలు చీరైతే ఏం బాగుంటుందని కట్టుకున్నాను. పూలున్నవిగా మీచెట్టున - అంటూనే చెట్టుదగ్గరకు పోతున్నాను.

ఎవరెవరు వెళ్తున్నారు డ్రామాకు? వెళ్తే పూలెందుకు? అని ప్రశ్నలమీద ప్రశ్నలుకురిపిస్తూనే వున్నదామె. నేనామె ప్రశ్నల్లో కౌటిల్యాన్ని గ్రహించక పోలేదు. నాఅంతటనాకు ఎన్నాళ్ళకో పూలుపెట్టుకోవాలనే కోరిక కలగటంవల్ల ఆమె మాటలను లక్ష్యపెట్టకుండా అలాగే పూలుకోశాను. కాని ఆమెమాత్రం ఏవిధంగానైనాసరే నా ఉత్సాహాన్ని చంపివేయాలనే ధోరణిలోనే వున్నది. గచ్చుమీదకూర్చుని పూలు ముందువేసుకొని తల్లో పెట్టుకోటానికి వీలుగా మడుస్తున్నాను.

భర్తదగ్గర లేకపోతే పతివ్రతలు పూలుపెట్టుకోరు అన్నదామె. పుటుక్కున ఆ మాట కొంచెం మందగించిన నా ఉత్సాహపు పుటలలో ఒకపిడుగు పడినట్లైంది. అయినప్పటికీ సమాధానం చెప్పకుండా వుండటం ఏమంత బాగుండక వెనకటిరోజుల్లో ఎవరో చేశారని ఇప్పుడలా ఎవరు చేస్తున్నారు? అన్నాను క్రుంగిపోతున్న ఉత్సాహంలోనుంచీ కొంచెం తెప్పరించుకుని.

'మనకేమిటి? ఇప్పుడైనా భర్తదగ్గరలేనివాళ్లు భర్తమీద ప్రేమగలవాళ్లైతే పూలుపెట్టుకోరే, ఎక్కడదాకానో ఎందుకు? మాచెల్లిలి భర్త జైల్లో వుండగా మా చెల్లెలు ఒక్కనాడైనా తల్లోపువ్వు పెట్టుకోనెరుగునా? భర్తమీద ప్రేమగలవాళ్లెవరైనా అంతే. అసలదిపతివ్రత లక్షణంకూడా.' అన్నదామె మళ్ళీకొంచెం ఉద్రేకంతో. వాళ్ళచెల్లెలు పూలు పెట్టుకొనేవో లేదో బాగాజ్ఞాపకం లేదుగాని వారానికి రెండుసార్లయినా సినిమాలకనీ వాటికనీ, వీటికనీ ఎక్కడికో ఒక చోటికి పోతూనేవుండేది. ఆమె భర్త జైల్లోవున్నాడని ఆమె మంచి మంచి చీరెలు కట్టుకోకపోవడంగానీ, సరదాగా వుండక పోవడంగాని ఏమీ వుండేదికాదు అంతామామూలుగానే వుండేది. అన్ని విషయాల్లోను మామూలుగానే వుంటూ పూలెందుకు పెట్టుకునేదికాదో మరి నాకర్థంకాలేదు. బహుశః ఏ శాస్త్రాన్నో పట్టుకుని అలావుంటేగాని పతివ్రతలము కామేమోననుకొని అలా చేసివుండవచ్చు.

నిజమే ఆమెఅన్నట్లు ఆమె చెల్లెలికి భర్తమీద ప్రేమ ఎక్కువగా వుండటానే పూలుపెట్టుకోలేకపోయేదేమో. వాళ్ళు భార్యాభర్తలు ఒకరికొకరు తగినవారు కావటాన బాగా మనస్సులు కలసిపోయే వుండవచ్చు. వాళ్ళకు అన్నీ కలసివచ్చినవి. వాళ్లు శుభసమయాల్లోనైనా కష్టసమయాల్లోనైనా మంచినే సంపాదించుకోటానికి అవకాశములున్నై. కాని నేనో, నాకు నిజంగా వారిమీద అంత ఎక్కువగా ప్రేమలేనిమాట వాస్తవమే. అది నాతప్పా? నాకు తగినంతలో నేను కాంక్షించినవేవీ వారిలో లేకపోవటం తప్పు. ఉన్నదేదో ఉన్నది లెమ్మని కొంత సానుభూతితో ఆలోచించుకుని ఆత్మసంతృప్తి అయినా పొందుతుండేదాన్ని ఇదివరకు. నన్నీవిధంగా చేసిన తరువాత అదికాస్తా పోయిందిమరి. దానికి నే నేం చేయగలను? ప్రేమవుండడం లేకపోవటం మాట అలావుంచి జీవితంలో సుఖపడేఆశలు ఎప్పుడైతే పోతవో సాధారణంగా అప్పుడే ప్రతివస్తువుమీద

తెల్లగా
ఉతుకబడినవి

ప్రకాశవంతముగా
ఉతుకబడినవి

ఇందుకు
సన్‌లైట్
సబ్బే
కారణము




బాదకుండగనే బట్టలను తెల్లగాను ప్రకాశవంతముగాను ఉతుకును!

S. 180-50 TL

విరక్తి కలగటం సహజం. నా వరకు నాకు ఇక్కడకు వచ్చిన తరువాత అలంకరణమీదనే అభిలాష నశించింది. అదేమిటోగాని ఆ అలంకారానికి సంబంధించిన ఏ వస్తువు కనపడినా అది నాకు సంబంధించనిదిగానే వుంటుంది. ఎవరైనా సహృదయులు ముత్తయిదువకూతురవు పూలు వద్దంటావేమని తల్లో పెడుతూవుంటే గట్టిగా వారించలేను. గట్టిగా వారించటానికి చూచేవాళ్ళు ఇదొక వేషం అనుకొంటారనికూడా భయమే. భర్త దగ్గర లేనంతమాత్రాన పూలుపెట్టుకుంటే పతివ్రతలంకాకుండాపోతామనే భయం నాకు లేకపోటాన అంతగట్టిగా వారించవలసిన అవసరంకూడా రాలేదు. ఆరోజు నా అంతట నాకే పూలు పెట్టుకోవాలనే కోర్కె అంత ఎక్కువగా ఎందుకు కలిగిందో నాకే ఆశ్చర్యమౌతుంది. ఆరోజు నా మనోవైరాగ్యభావాన్ని తెరలు తెరలుగా ఆవరిస్తున్న పూర్వ సంస్కృతులను ఆ సుబ్బమ్మగారి ప్రశ్నపరంపర ఎక్కడికక్కడ పటాపంచలు చేసేసింది. అంతే ఆ రోజుకీ ఈ రోజుకీకూడా నాకు మళ్ళీ తల్లో పువ్వులు పెట్టుకోవాలనే కోరికే కలగలేదు.

ఏమిటంటే, మొగుడు ముండా అంటే పుట్టికొచ్చినవాడూకూడా ముండా అన్నాడట. అట్లాగే ఇప్పుడు నేనందరికీ అలుసే. ఎప్పుడైనా సాయంత్రమప్పుడు ఏమీతోచక నేనలా వాళ్ళింట్లోకి వెళ్తే ఆ కృష్ణమ్మగారుకూడా అలానే నేనుఎప్పుడో ఒకసారి వస్తానెమ్మన్నా వినిపించుకోకుండా, అమాంతం పైటచెరగు మెలవేసుకొని వాళ్లఇంట్లోకి లాక్కెళ్లి కూర్చోబెట్టుకొని ఇక ప్రారంభిస్తుంది. పనంతా అయిందా? అంటుంది ముందు. ఇంకా వంటకాలేదు మా అమ్మచూస్తున్నది వంటపని అంటాను.

మీ అమ్మ చూడకపోతే మీ వదినేం చేస్తున్నది అంటుంది మళ్లీ. మాఅమ్మకు కావలసినవన్నీ అందిస్తున్నది అని నేననగానే ఇక తనకేమీ సందు దొరక్క, ఊఁ. లేక ఏమిటిలే నీ పనే బాగున్నది హాయిగా. నిజంగా నాకీ పిల్లలుండబట్టిగాని లేకపోతేనా? అంటుంది వ్యంగ్యంగా. అది నేను గ్రహించి - అంతహాయిగా ఉంటుందనుకుని వెళ్లిపోవాలంటే పిల్లలుమాత్రం అడ్డంవస్తారటలే; అనేదాన్ని. నేనెప్పుడు కనిపించినా సరే ఏదో రకంగా ఎత్తిపొడుస్తూనే ఉంటుందావిడ. బయట చూస్తే ఈ విధంగా వున్నా ఇక ఇంట్లో చూడండి ఏవిధంగా వుంటుందో.

నేను ఇక్కడకు వచ్చినతరవాత వారు మళ్లీ పెళ్లి చేసుకోనకముందు అయిదారు మాసాలవరకు మా అమ్మ ఎప్పుడూ నా మీద కోపంగానే వుండేది. తన కెవరివల్ల కష్టంకలిగినా ఆకోపమంతా కూడా నా మీదనే చూపిస్తూవుండేది. ఆమె అలాచేస్తూ వుంటే, నేనీవిధంగా కాబట్టికదా నన్నెవరేవిధంగా బాధించినా అని నాలో లోలోపల మరుగుతున్న దుఃఖం ఒక్కసారి పాలపొంగులాగా వచ్చేది. ఆ పొంగును ఆర్పటానికి నేను లేనిశక్తిని తెచ్చుకోవలసివచ్చేది.

నేనెంత మర్మంవిడిచి చెప్పినాకాని మా అమ్మకసలు నేనేవో ఎదురు మాట్లాడివుంటాననో, పనులవీ సరిగ్గా చేయలేదనో అనుమానంగానే ఉండేది. ఆమె ఆవిధంగా నన్ను అనుమానిస్తూవుంటే ఆమె హృదయంలో ఎక్కువభాగం చీకటితెరలు ఆక్రమించినవేమో నన్నంత బాధపడేదాన్ని. తల్లిని బిడ్డ అర్థంచేసుకోలేకపోవటం ఎక్కడైనా సంభవం, సహజంకూడా కావచ్చునేమో కాని బిడ్డను తల్లి అర్థంచేసుకోలేకపోవటమంత అన్యాయం ఎక్కడా లేదేమో. తనను తల్లే అర్థంచేసుకోకపోవటంకంటె పైగా ఆపదలో కూడా ఉన్నప్పుడు మనుష్యుల కంతకంటే వేరే బాధ అనేది ఎక్కడ వుంటుంది?

వారు పెళ్లిచేసుకున్నదాకా అంటే ఇక నన్ను అక్కడకు పంపించే ఆశారేఖలు అంతరించేవరకూ మా అమ్మ నన్ను ఆ విధంగానే ఒత్తిడిచేసింది. ఆ పరిస్థితుల్లో మా అమ్మతప్ప నన్ను ఆదరించటంలో మా వదినగానీ, ఇంకే ఇరుగుపొరుగువాళ్ళయినా కొంత నయమనిపించింది. వారు మళ్ళీ పెళ్ళిచేసుకున్నారు. మా అమ్మ మనస్సు విచిత్రంగా మారిపోయింది. ఆమె కెందుకో నా మీద జాలి ఆదరం కలిగినవి. ఆమె హృదయంలోని చీకటితెరలు చించుకుపోయినవి. ఆమె హృదయంలోని వెన్నెల కాంతులు నామీద ప్రసరించసాగినవి. కాని అప్పటి నుంచీ అంటే ఇక నేనా యింట్లోనే వుండటం ఖాయమని తేలినప్పటినుంచీ నా కష్టాలు ఇంకొకరకమైన తీవ్రస్వరూపం దాల్చినవి. మా అన్నయ్య

వదినలు మాకు పూర్తిగా వ్యతిరేకమైనారు. ఆఖరికి మా అక్కచెల్లెళ్ళదగ్గరనుంచి కూడా వ్యతిరేకతే ప్రారంభమైనది. అయినప్పటికీ ఈ భారాన్ని నాకంటే మా అమ్మే ఎక్కువగా మోస్తూ వుంటూన నాకు కొంత సులభమే అయింది. కాని నే నెంత పనిచేస్తున్నా ఇంకా పనిచెయ్యటంలేదని, నాకు అంత ఖరీదుగల చీరెలు జాకెట్లు ఎందుక్కావాలనీ ఏదోరకంగా మా వదిన, అక్కచెల్లెళ్లు అందరు పేచీలుపెడుతూనేవుండేవాళ్లు. అంటే దానికి కాపురమూ కాలిపోయిందా? ఏ సుఖలిస్తే మాత్రం ఏం కట్టుకు నింట్లో పడుండేదానికి? అనే ధోరణిలో మాట్లాడుతూవుండేవాళ్లు వాళ్ళంతా. అయినా వీటిని నే నేమంత లక్ష్యపెట్టలేదు. నేనింకా ఎక్కువ విచారంలో మునిగిపోటానికి వేరే కారణం వున్నది.

మా నాన్నగారు నా పెండ్లికాకముందు, అయిన తరువాతకూడా కొంతకాలంవరకూ,మనిషిని చూస్తేనే భయంగాను, ఎంతో హుందాగాను వుండేవారు. అలాంటివారల్లా ఒక్కగానొక్క కొడుకైతే మా అన్నయ్యకూడా తనమాట వినకపోవటం, కేవలం భార్యను వాళ్ళవైపు వాళ్ళను వెనకవేసుకుని ప్రతి దానికీ కయ్యానికి కాలుదువ్వటం, ఒక్కడుగదా ఏవిధంగానైనా చదువు చెప్పించి అభివృద్ధిలోకి తీసుకురావాలంటే చదువుకోకపోగా ఎక్కడ అప్పులు పుడితే అక్కడల్లా నోట్లువ్రాసి అప్పులు చేయటం, ఇవన్నీ మొదలుపెట్టేసరికి అదొక విచిత్రంగా మారిపోయారు. అంతకుపూర్వం వున్న గంభీరత, ఇంట్లోవాళ్ళను గడగడలాడించటం అదంతా మారిపోయింది. మరీ మా సంసారం అట్లా అయిన తరువాత ఆయన కసలు మతేపోయింది. ఆయన మనస్సుతోపాటు ఆరోగ్యం కూడా పూర్తిగా చెడిపోయింది. నే నిక్కడకు రావటాన్నిగురించి మేమంతా అనేకవిధాలుగా కిందా మీదా పడుతూ వుండేవాళ్లమా? ఆయన ఒక్కనాడైనా నాతో ఏమిటిది అనిగాని, నీవు వెళ్లు, వెళ్ళవద్దు అనిగాని ఒక్కసారికూడా నోటా పల్లాపట్టి అడిగిన పాపాన పోలేదు మానవుడు. కాని మా అమ్మ ఇలా మెదలకుండా వూరుకుంటే ఎట్లామరి? అసలు సంగతేమిటో కనుక్కునిరాక. అని అనగా అనగా ఒకసారి కాబోలు బయలుదేరి వెళ్లారు మా అత్తగారి వూరికి. వెళ్ళటం కూడా వారింటికే వెళ్లారు. ఎందుకలా పంపించాలిసొచ్చింది? ఎన్నడు మాజోటివాళ్ళకన్నా ఎదురు చెప్పే పిల్లకాదే. మా పిల్లలందర్లోకీ ఈ అమ్మాయి ఇంకా నిదానమైనది. ఏమిటిదంతా? అని అడిగారట వారిని.

మీ పిల్ల మీకు ఎదురు చెప్పకపోతే అందరికీ ఎదురు చెప్పదని నమ్మక మేమిటి? అది ఎన్నెన్ని చిత్రాలు చేసేదో మీకేం తెలుస్తుంది. మేం చెప్తే మాత్రం మీరు నమ్ముతారా? అని మా అత్తగారు అనుకున్నదట.

మీ రుండండి మిమ్మల్నికాదు నే నడిగింది. ఆయన్ని సమాధానం చెప్పనివ్వండి అన్నారట మా నాన్నగారు.

ఇంకా ఇంతమంది చెప్పటానికేమున్న దక్కడ? ఎవరుచెప్పినా అదే—అన్నారట వారు. సరే మీ అల్లుడిచేతనే చెప్పించుకోండి నేనొద్దన్నానా అని మా అత్తగారు అన్నదట.

ఒక రడిగే దేమిటి ఒకరు చెప్పేదేమిటి. నా జోలి ఒకరి కెందుకు? నా యిష్టం వచ్చినట్లు నేను చేసుకుంటాను. ఒక రెవరు నన్నడగటానికసలు— అని వారు కోపంగా మాట్లాడారట.

ఇట్లా తొందరపడి మాట్లాడినంత తేలికగా పోతుందా అబ్బాయి చేసుకున్న తరువాత అని మా నాన్నగారు అనేటప్పటికి.

పోకపోతే చేతనైందేమైనా వుంటే చేసుకో పోయి. ఇదిమొదలు చేసుకుని నా వాకిలిచాయలకు రాబోకండి ఎవరైనాసరే—అని లేచివెళ్లారట. అంతే. అప్పటినుంచీ ఇక నా విషయంలో ఆయనకు పెద్ద విచారం ఏర్పడిపోయింది మనస్సులో. ఆయన వ్యాధి కూడా ఇంకా ఎక్కువ కావటం మొదలు పెట్టింది. వారు మళ్ళీ పెళ్ళిచేసుకున్న తరువాత ఆయన వ్యాధి ఇంకా ప్రబలమై చివరకు ప్రాణాలు కూడా విడువవలసి వచ్చింది. మా నాన్న ప్రాణం పోయేటప్పుడు ఆ బాధ చూడలేక నేను చాటుకు పోయి కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నప్పటికీ ఆయన ప్రాణం పోయేటప్పుడు కూడా నన్నే తలుస్తూ వుండటం నాకు కూడా వినబడుతూనే వున్నది. తను పోతున్నానే అనీ, నేను కష్టంలో వున్నాననీ, నాకు బాగా జరుగుతుందో జరగదోననీ, ఆయన

భయం. అందువల్లనే ఆయన నన్నంతగా తలుస్తూ ప్రాణాలు వదిలారు.

అప్పటినుంచీ ఇక నా కష్టాలు అడుగుతారు. అంతకుముందు నే ననుకుంటుండేదాన్ని—జరిగిందేదో జరిగింది మా అమ్మా నాన్న బాగుండగానైనా నేను చనిపోతే బాగుండునని. కాని నేను జీవితంలో వేటికి భయపడ్డానో అవన్నీ నాకే జరుగుతూ వచ్చినవి. అక్కడినుండి ఇక్కడికి రావటం ఇంటికి దూరమై చెట్టునీడకు వచ్చినట్లయిందిప్పుడు నాపని. మా అమ్మ కిప్పుడు నామీద ఎంత ప్రేమవుంటే మాత్రం ఏంచేయగలుగుతుంది? మా నాన్న వున్నప్పుడే అంతంత మాత్రమాయె. మా నాన్న పోయిన తరువాత మా అమ్మ నోరెత్తటానికే వీలులేకుండా పోయిందా యింట్లో. ఆమే మా అన్నయ్యదగ్గర మనోవర్తి పుచ్చుకోవలసిన పరిస్థితుల్లో ఇంకా నన్నేం పోషించ గలుగుతుంది? ఈ పరిస్థితుల్లో నా పౌరుషం కోసమని నా భారాన్ని కూడా ఆమె మీద మోపి ఆమెను బాధించేకన్నా ఎన్నికష్టాలైనా రానీ, నా భారాన్ని నేనే మోయాలి. ఈ పని చేయాలంటే మళ్ళీ అక్కడికే వెళ్ళక తప్పదు. ముమ్మాటికీ తప్పదు. కాని నిజంగా అలా చేయగలనా? ఏమిటో నిరాశామూలాన కలిగే నిస్తబ్ధతవల్ల అలా అనుకోవటమే కాని చెయ్యక ఏంచేస్తాను? జీవితంలోని ఈ నిస్తబ్ధత సర్వనాశానికే దారితీసేదిగా కనబడుతూ వుంది. ఈ నిస్తబ్ధతినుంచీ బయటపడాలి అంటే తప్పకుండా మళ్ళీ అక్కడికి వెళ్ళాలి. ఇప్పుడు అక్కడి పరిస్థితులు వెనుకటి పరిస్థితులు కావు. ఆనాటి అత్తగారు లేదు. వారిలో కూడా వయస్సును బట్టి అయితేఏం, అనుభవాలనుబట్టి అయితేఏం, ఆనాటి దుందుడుకుతనమూ లేదు. నిజంగా అంత దుందుడుకుతనమే ఉంటే మళ్ళీ రమ్మంటారా? పరిస్థితులు మార్పు మానసికమైన మార్పుకుకూడా తోడ్పడవచ్చు. ఈ అవకాశాన్ని పురస్కరించుకుని వారిలో మార్పు తీసుకురావటానికి ప్రయత్నం చేయాలి. ఈమాత్రం నేను చేయలేకపోతే నా బాధలు నాకే కాకుండా ఇతరుల కష్టాలను ఇనుమడింపచేయటానికి కూడా తోడ్పడతవి. నా క్షేమంకోసం కాకపోయినా కనీసం నా సంబంధీకుల క్షేమంకోసమైనా మళ్ళీ అక్కడకు వెళ్లితీరాలి కాని అబ్బబ్బ. నా జీవితాన్ని నేనే ఒకసారి పునరాలోకనం చేసుకునేటప్పటికీ ఆ సంఘటనలన్నీ కళ్ళల్లో కదను త్రొక్కుతూ హృదయంలోకి దూసుకుపోతున్నై. ఈ ఆలోచనలతో నా మెదడు చుట్టలు తిరిగిపోతూ వున్నది. ఈ బాధలతో నా హృదయం రక్తాన్ని చిమ్ముతూ వున్నది. నా తెలివితేటలు ప్రతిభ, యవ్వనము అన్నీ మిళితమైమనై ఈ చుట్టలు తిరిగిన రక్తపు టేరులలో కలసిపోయినవి. ఇంకా నాకు స్వతంత్రతేమిటి? ఆలోచనేమిటి? నిర్ణయమేమిటి? ఈ సమాజంలో ఇదేనా నా స్థానం? ఇదేనా భారతనారీమణుల సౌశీల్యసంప్రదాయం? ఇదే కాబోలు భారత నారీమణులు గవర్నర్లుగా వుండటం, మంత్రులుగా వుండటం, విదేశాంగ రాయబారులుగా వుండటమూను!





సీతారామ లక్ష్మణులు.

# డెందుకూరి శిథిల శిల్పసంపద



శ్రీ కో. రాఘవాచారి

నైజాము మండలములోని మధిర తాలూకాకు చెందిన డెందుకూరు గ్రామములో ఆంజనేయ స్వామి దేవాలయము ఒకటి కలదు. ఈ ఆలయ ప్రాంగణములో ఒక సత్రమును నిర్మించు నుద్దేశ్యముతో శ్రీమతి కపిలవాయి సీతమ్మగారు ఆలయపు దక్షిణభాగములో పునాదులు త్రవ్వించుచుండగా రెండున్నర గజముల లోతున, ఒకదానిపై నొకటి పేర్చియున్న విగ్రహములు ఇరువదిఒక్కటి బైట పడినవి. ఇక్కడి బొమ్మలో వాటిని చూడవచ్చును.

క్రింది వరుసలో పద్మాసనస్థులైనవారు ఏడుగురున్ను, వెనుక నిలచియున్నవారైదుగురున్ను చేరి పన్నిద్దరాళ్వార్లు. ఇరుప్రక్కల త్రిభంగిని, నిలచియున్నవారు ద్వారపాలకులు. మధ్యభాగములో సీతారామలక్ష్మణులు. లక్ష్మణునికి కుడివైపున గరుడాళ్వారు. పై పటములో సీతారామలక్ష్మణాల మూర్తులు పెద్దవిగా చూడవచ్చును.

వారి పీఠములు ప్రత్యేకముగా పద్మములుగా మలచుటకు వీలు లేకపోవుటచేత కాబోలు, పాదముల దిగువ పద్మములను అర్ధశిల్పముగా మలచినారని యూహించవచ్చును. విగ్రహములకు దిగువునవున్న నాల్గుపలకల రాతిమేకులనుబట్టియు, విగ్రహముల చిన్న పొడవునుబట్టియు (మూడున్నర అడుగులు) ఈ విగ్రహములు ఏదేనొక పెద్దదేవాలయ ప్రాంగణములో నిర్మించిన చిన్న కోదండరామస్వామి ఆలయములో ప్రతిష్ఠ చేయబడియుండునని వూహించ వీలగుచున్నది.

ఈ ఆంజనేయ ఆలయప్రాంగణములోనే ఈ విగ్రహములు దొరుకుటకు రెండు నెలలు ముందుగా, నాల్గున్నర అడుగులు ఎత్తుగల ముఖమంటప శిల యొక్కటి లభించినది. దీనిపై, ప్రాచీనాంధ్ర లిపిలో ఎనిమిది పంక్తుల దానశాసనముఒకటి ఉన్నది. అది ఇది :

"స్వస్తి శ్రీ మన్మహా మండలేశ్వర మన్మ చా
గి గణపయ రాజులు కొకొలని కేశవ
దేవరకు రెండు మఱ్ఱురులు వేసవి వా
న కొలాలు ఆచంద్రార్క స్థాయిగా నిస్తిమి."

దీనినిబట్టి ఈ ఈప్రాంతములోనే కేశవస్వామి ఆలయము ఒకటి పెద్దది వుండియుండుననియు, పైన చూపిన కోదండరామస్వామి ఇత్యాది విగ్రహములు ఆకేశవస్వామి ఆలయములో నుండిన చిన్న దేవళము లోనివైయుండుని వూహించుచున్నాను.

పైన చెప్పిన (ఆంజనేయస్వామి) ఆలయములో ఇంతకు పూర్వము, ఈరీతిగనే ఆంజనేయ విగ్రహము, రెండు శివలింగములు, పూర్వపు దేవాలయమునకు సంబంధించిన పునాదులు, బైటపడినవట. గ్రామీణులలో పెద్దలైన శ్రీకపిలవాయి కృష్ణయ్య గారు ఆంజనేయ విగ్రహమును మాత్రము నేటి ఆలయములో ప్రతిష్ఠించి, శివలింగములు భిన్నమైనందున ఆలయప్రాకారములోనే పూడ్పించిరట. నేటికిని, ఆలయప్రాంగణములో రెండు పాత పానవట్టములు, వినాయకుని విగ్రహము, దేవీ విగ్రహములు విడిగా కనబడుచున్నవి.

ఈ దెందుకూరుగ్రామము నూరు, నూటయాభై సంవత్సరముల పూర్వము ఏర్పడినదని, అంతకుముందు ఈ ప్రదేశములో సారంగపట్టణమను పేర ఒక పట్టణము వుండెడిదని జనశ్రుతి. ఈ పట్టణము అనేక శైవ, వైష్ణవ దేవాలయములకు ఆటపట్టని ప్రసిద్ధి.

దొరికిన విగ్రహములు విరివిగా శైవ, వైష్ణవ సాంప్రదాయములకు చెందియుండుటనుబట్టి, ఈ జనశ్రుతి సత్యమే యైయుండునని మనవిచేయుచున్నాను. శాసనపు లిపి కాకతీయ యుగమునకు అనంతరపు లిపివలె గోచరించుచున్నది. కాకతీయులు పరమశైవులు. వీరి పతనానంతరము, తెనుగు దేశము నేలిన రెడ్డిరాజులు శైవులే అయినను,



పన్నిద్దరాళ్వార్లు

శ్రీరంగమునుండి, ఉత్తరాదికి వచ్చిన వైష్ణవస్వాముల బోధవల్ల వైష్ణవాలయములుకూడ కట్టించినట్లు కోరుకొండవంటి వైష్ణవ క్షేత్రములు సాక్ష్యమిచ్చుచున్నవి. సన్నిధ్ధరాళ్వార్లు, గరుత్మంతుడు, (బహుశా ఆంజనేయస్వామికూడ వుండియేయుండును) ద్వారపాలకులు చేరిన నింహాలగముతో సీతారామలక్ష్మణులుండిన పూర్ణవైష్ణవ సాంప్రదాయము కడపటి రెడ్డి



దానశాసనము.

రాజులకాలములో గాని కడతేరియుండదనియూహించుచు, ఈ విగ్రహములు పదునైదవ శతాబ్దము నాటివై యుండునని యూహించుచున్నాను. (పైశాసనమును, ఈవిగ్రహములును ఒకే కాలమునకు చెందియుండునను యూహ సత్యదూరము కాకపోయినను, నిర్ధారించి చెప్పుటకు వీలులేనిది) శిల్పమైనను నూత్న వైష్ణవమత సాంప్రదాయ విజృంభణకు నాందీ రూపమగు సాంకేతిక సాంప్రదాయము ననుసరించినట్లున్నది గాని, దేశమునందు స్థాయిగానుండి, పూర్ణవికాసము చెందిన శిల్పసంపదకు చెందినట్లు లేదు. విన్యాసములో కాకతీయ సాంప్రదాయమునకు చెందిన లాలిత్యము గోచరించుటలేదు. అట్లని విజయనగరకాలపు పూర్ణవికాసముకూడ కనబడదు. ఈకారణములచే, ఈ విగ్రహములు కాకతీయ, విజయనగర కాలములకు నడిమికాలమునకు చెందినవని వూహచేసినాను. విగ్రహములన్నియు ఒకదానిపై నొకటి పేర్చి, భూస్థాపితము చేయబడియుండుటను బట్టి ఏభామినీసుల్తాను కాలములోనో ఇవి నాశనముచేయబడునను భయమువలన, భక్తులు వీటిని భూగర్భమున దాచి, ప్రాణరక్షణకు దక్షిణాదికి తరలియుందురేమో యని వూహించవచ్చును. కనుక ఈప్రాంతమునందు విరివిగా భూగర్భపరిశోధన చేసినచో పైన చెప్పిన సంధికాలపు సంఘచరిత్ర నిర్మాణమునకు సాయపడగల శిలాశాసన విగ్రహసంపద విరివిగా లభించునని మనవి చేయుచున్నాను.

# పోయిన పుటలు



శ్రీ అంగర వెంకటకృష్ణారావు

నేను అదనపుజిల్లా మేజస్ట్రేటువద్ద క్యాంపు గుమాస్తాగా వున్న రోజులలో జరిగిన వొక సంఘటన, నన్నమాంతంగా వొక దశాబ్దానికి పైగా వెనక్కి నెట్టింది.

ఆ రోజులలో నాకు రోజు కొక అరగంట సంక్షిప్తలేఖనం, సుమారొక గంట టైపుపని వుండేవి. మా ఆఫీసరుగారు న్యాయమైన ప్రభుత్వాధికారి, నిజమైన ప్రజాసేవకుడు. ఇంటికి రావొద్దని చెప్పిన గజిటెడ్ ఉద్యోగి నా యెరికలో అత నొకడే.

కాని నే నక్కడ అట్టే కాలం మనలేక పోయేను. అక్కడ నా జీవితం నిర్మానుష్య ద్వీపంలో 'క్రూసో' బ్రతుకులా వుండేది. మోసం ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా జీవిస్తూన్న ఆ ఆఫీసు కుడ్యాల మధ్య నాకు వూపిరిసలిపింది కాదు. నిర్వ్యాపకంగా వున్న నిముషాల్లో, సంసారానికి, జీవితానికి, నాకు గల సామరస్య వైషమ్యాలు వూహాకందక, శూన్యంలో మనసు కరిగి కలిసిపోవడం పరిపాటిగా వుండేది.

అట్లాంటి సమాధిపరిస్థితిలో నే వున్న వొక నాటి మధ్యాహ్నం బంట్రోతు వచ్చి 'బాబూ—చిన్న పిటీసను టైపు సెయ్యండి' అని బ్రతిమాలేడు. సమాధిలో వుంటే, ఆ కాగితం అందుకుని, అప్రయత్నంగా చివరవరకూ చదివేను.

'ఎవరిదోయ్ యీ పిటిషను ?'

'ఒక బీద బ్రాహ్మడిదండి'

'అతనిని పిలు' బంట్రోతు వెళ్ళేడు.

పిటిషను వ్రాసిన ఆ సామి వచ్చేవరకూ నా మనసు పట్టమైన పొగమంచు క్రమ్మిన హేమంత చంద్రికారాత్రివలె వుంది. అతడు వచ్చి నాముందు నిలబడ్డాడు—లోతుకు పోయిన బుగ్గలు—చెడు కాలపు జలగ నెత్తురు యీవత్తూ పీల్చివేయగా మిగిలిన భూమికెలపోగు! జరిగిపోయిన రోజులను కబళించిన విస్మృతి అనే చీకటిని చీల్చ ప్రయత్నిస్తోంది నా జ్ఞాపకశక్తి...విస్మృతిరాహువు దవడలు పగులుతూంటే, క్రమేపీ జ్ఞాపకంలోకి వుదయిస్తున్నాడా వ్యక్తి—అదంతా వొక పెద్ద ఆపరేషనులా వుంది. అతని ఫాలభాగం విశాలమై, కాంతి కేరి, బాలారుణ బింబంవంటి కుంకుమరేఖతో విరాజిల్లింది. తరుణ రక్తం పూరించి బుగ్గలు మిసమిసలాడేయి. అద్భుతమైన ప్రభావం వల్ల తేజస్సు కలిగిన ఆ నేత్రాలు తిరిగి తళుకులు కులికేయి. కిరటంలా ఛాతీ లేచింది. పండ్లలో కండలు కవ్వించుచు తిరిగేయి. పనిచేసే శేష క్రిందటి విగ్రహం నామదిలో ప్రాదుర్భవించింది.

'పతంజలిశాస్త్రిగారూ ! నేను జ్ఞాపకం వున్నానా!' హఠాత్తుగా అతడి పచ్చని నేత్రాలలో గుప్పు మరీ లోతుకు కుంచుకపోయేయి.

'లేదండి!' చిరిగిపోయిన డప్పులా ఆ గొంతు భయపెట్టింది. అతను యింటికోసం వ్రాసిన అర్జీ కాగితం నా చేతులోంచి జారి క్రింద పడిపోయింది. ఒక ధర్మాత్ముడు తన యిళ్లలో వొకటి సద్బ్రాహ్మణ కుటుంబానికి నివాసంగా యిచ్చేనిమిత్తం కేటాయించి, ఆ అధికారం జిల్లా కలెక్టరుకిచ్చి చనిపోయేడు—ఆ యిల్లు తన కిమ్మని అర్జీ దాఖలు చెయ్యబోతున్నాడీ సద్బ్రాహ్మణుడు !

'శాస్త్రిగారూ, మీరు వీరనగరంలో కొన్నాళ్లున్నారుకదూ ?'

'అవునండి' అతను తడబడ్డాడు. 'కాని... మీ రెవరో నాకు తెలీదు. నేను మీ రనుకున్న మనిషిని కాను—మనిషిని పోలిన మనిషుంటాడు.' ఆ మాటలలో జాలి, దొంగతనం, విదియం, యస్కేపిజం, కుస్తీలు పడుతున్నాయి.

నా మానసావనికమీద గతించిన రోజులు, ఆటలు, నవ్వులు, యెన్నెన్నో దృశ్యాలుగా మహోద్ధృతితో విరిసి, కరిగి, మాయమౌతున్నాయి.

'మీరు అంజనేయస్వామిమఠంలో కూడా

హైస్కూల్లోంచి 'ఘన' పరీక్షకు చదువుకున్నారు కదూ?' అతని కుడిచెయ్యి అప్రయత్నంగా ముఖాన్ని కప్పింది. గదిలోకి జొరబడిన తటిత్కాంతి మెరుపై పోగానే మాయమైనట్టు, వెనుదిరిగి అతడు వెళ్ళిపోయేడు. అప్రస్తుతమై వున్న నా మనసింకా శూన్యంగానే వుంది. బండ్రోతు కేమీ అర్థంకాక నోరెళ్లబెట్టి 'వెంకు బాబీ పంతులు' అన్నాడు. నా దృష్టి భూపతనమైన 'పతంజలి శాస్త్రి' సంతకంమీద పడింది.

* * * *

ఉదయం ఆరుగంటల వేళ, పడమటికేసి నీడలు పొడవుగా వ్యాపింపజేస్తూన్న నీరెండలో పొగమంచు కరిగి తుషార వర్షాన్ని భ్రమింపజేస్తోంది. లెక్కలు చెయ్యడానికి చాపేసి కూచోగానే ఒక మెట్టు తేలు అంటుకొడిచింది. 'చచ్చే' అని కేక పెట్టి గెంతేను. రెండు మూడు నిమిషాలు గడిచేక మఠంలోంచి వచ్చిన ఆ వ్యక్తి ఒక మంత్రం వెయ్యగానే బాధ పటాపంచలైంది. ఆ తరువాత మా యింట్లో పెద్దవాళ్లు కనుక్కోగా తెలిసింది అతడు చదువుకోడానికి ఆ తొలినాడే వచ్చేడని—అతని పేరు పతంజలిశాస్త్రి—పద్దెనిమిదేళ్లవాడు.

ఆంజనేయస్వామి మఠం ఒక జమీందారుది. దానిలో వేద పాఠశాల వుంది. పండితులకు వైదీకం, వటువులకు బ్రాహ్మణీకం నేర్పు కావటంచేత అధ్యయనం సన్నగిల్లింది—బడి కూడిననాడు గురుశిష్యులు గుంపులు గుంపులుగా చేరి, వర్షాకాలపు కప్పలవలె నమక చమకాలు అదే పనిగా వల్లించేవారు. ఎగవేస్తే పది పదిహేను దినాల వరకూ ఫీకరుండేవారు కారు. కాని ఆ మఠం నావంటి కుఱ్ఱకారుకు చాలా ప్రయోగపడేది—మేం దాని మండపంమీద దొంగాటలాడుకుంటూ, పొగడ చెట్టెక్కి పళ్లుతింటూ—వెనకప్రక్క చెరువు నంటివున్న పెరటిలో బాదం చెట్టుమీద కోతి పిల్లిన గజ్జి ఆడుకుంటూ హాయిగా వుండేవాళ్లం. అందరికన్న పెద్ద ఆటలలో 'లీడరు' నేనే—నాకు ఆంజనేయులనే 'అసిస్టెంటు' వుండేవాడు. వాడు పేరుకు తగ్గట్టూ మహా అల్లరి చేసేవాడు. నేనూ అల్లరి చేసేవాడిని, కాని తెలివిగా మెసిలేవాడిని. ఆంజనేయుల్ని సాధారణంగా పెద్దవాళ్లు మేదర మంచం చేస్తూండేవారు.

పతంజలిశాస్త్రి వచ్చిన రెండోనాడు ఉదయం నేను మా వీధి చావిడిలో చదువుకుంటూంటే గంభీర స్వరంతో అతని గదిలోంచి వినవస్తోంది,—'కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్...' నాకా వాక్యాల కర్థం తెలియనప్పటికీ, ఆ గీతా వాక్యంలోని శక్తి, శంఖారవంవలె తీరలేని శాస్త్రి కంఠగాంభీర్యం నన్నటు ఆకర్షించేయి. మఠం మెట్లెక్కి శాస్త్రి గది వేపు వెళ్లేను. తలుపు ఓరోకలిగా వుంది. లోనికి జొరడానికి జంకు కలిగింది. కాని ఆ గీతాస్రవంతి బుడగబుడగలై, నురగలు క్రక్కుతూ, తుద కొక మహాఝర్ఝరిగా ప్రవహిస్తోంది...'దంష్ట్రాకరాలాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానల సన్నిభాని, దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ! జగన్నివాస...' తలుపు తోసేను. నీలివర్ణం పట్టుపంచ ధరించి, విభూతి త్రిపుండ్రాంకితములైన ఫాలభాగము వంపులు కలిగి, గాయత్ర్యుపాసనాలబ్ధమైన ఓజస్సుతో రెండవ సూర్యునిలా ప్రకాశిస్తున్న శాస్త్రి, పూవొత్తులు వెలిగించి శంకరుడి పటానికి తగిలిస్తున్నాడు.

'రా అబ్బాయ్' నేను లోన ప్రవేశించా. విశాల నేత్రాలు తేజఃపుంజాలు ప్రసరిస్తున్నాయి.

'నీ పేరేమిటమ్మా?'

'గోపాలం—శాస్త్రిగారూ. మీరింతదాకా చదువుతూన్న దింకా చదవండి...'

'బాగుందా... చదువుతాను... 'యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా విశన్తి నాశాయ సమృద్ధవేగాః తథైవ నాశాయ విశన్తి లోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః...' ఇది యిలా యెంత చదివినా, విన్నా బాగుంటుంది. కాని నువ్వేం చదువుకుంటున్నావు?'

'ఐదో ఫారం'

'ఇంత చిన్నవాడివిలా వున్నావే... అప్పుడే ఐదో ఫారం కొచ్చావా?'

'మరి మీరింత చిన్నవాళ్లు కదా...మీ కెన్నొచ్చాయో!' శాస్త్రి మందహాసం చేసేడు.

ఈలోగా నోటి కడ్డంగా చెయ్యి పెట్టుకుని రైలులా కూతపెడుతూ ఆంజనేయులు మఠం

మెల్లెక్కి నా కోసం అటూ యిటూ పరికించి, నన్ను గదిలో చూసి, వొక్క గంతున లోన ప్రవేశించేడు. వాడికి కొత్త లేదు—నా కంటె వొక్క యేడాదే చిన్నైనప్పటికీ మూడు క్లాసులు తక్కువ. ఒస్తూనే గది అంతా కలయ చూసేడు. శాస్త్రి వేపు చూసి 'నా కొక్క పూదోత్తి యివ్వండీ' అని అడిగేడు.

'వీడు నా స్నేహితుడు—ఆంజనేయులు', పతంజలిశాస్త్రి నవ్వేడు — 'పేరు చెప్పక్కర లేకుండానే తెలుస్తూంది.'

ఆంజనేయులు శాస్త్రి వేపు తీవ్రంగా చూసి, పళ్లికిలించి నవ్వి, రెండు కాళ్లూ యెగరేసి 'అశ్శ భాస్ శ్శభాస్ బాగా పోల్చేసేవే...లబ్కులబా, లబ్కులబా, లబ్కులబా' అని గంతులు వేసి, తిరిగి హేళనగా నవ్వుతూ పరుగుతీసేడు. శాస్త్రి వేపు నేను ఉదాసీనంగా చూసి 'పెంకె వెధవ' అన్నా వాడి తరఫున తను వేడుకుంటూన్నట్టు. శాస్త్రి 'కాదు... వాడు మంచివాడే' అని బంతి పువ్వురంగు శాలువ పైమీద కప్పుకున్నాడు. 'జాగ్రత్తగా వుండవలసిన వాడివి నువ్వే. నువ్వు బాగుపడతావు'. నేనప్రయత్నంగా అన్నా 'ఉంటారా యిక్కడ కొన్నాళ్లు?'

'ఉందామనే వచ్చా' అంటూ అతడు నా కళ్లలోకి తీవ్రంగా చూసేడు.

మఠంలో ఆరాధన తక్కువగా వుండేది. పూజార్లు ఆ ఆవరణలోనే నివసిస్తూండేవారు. పిల్లల మందరం కూడి ప్రతి సాయంత్రం 'భజన' పేరిట యేవో పాటలు పాడే వాళ్లం. ఆంజనేయులు కన్నడ పాటలు అపశృతిలో నక్షి కేకలులా పాడే వాడు. అక్కడ వొక బొక్కి హార్మోనీ కూడా వుండేది.

ఆవేళ సాయంత్రం నేను శృతిలాగుతున్నాను ఆంజనేయులు 'తిప్పాగళన్ను నే నొప్పి కొళ్లో మమ్మప్పకాయ తేకో తిమ్మప్ప నీవూ' అని భయంకరంగా అరుస్తున్నాడు. మిగిలిన కుఱ్ఱకారంతా యెవరికి తోచిన లయలో వాళ్లు చప్పట్లు చరుస్తున్నారు. అప్పుడు శాస్త్రి నెమ్మదిగా వచ్చి ఆంజనేయులు మెడమీద చెయ్యి ఆనించి కూచున్నాడు. ఆంజనేయులు చుంచులా మెడ వంచి చిరునవ్వుతో పాట సాగనిచ్చేడు.



'ఆంజనేయులూ, బాగా పాడతావే!' మెడ మీది వేళ్లు బిగించేడు.

'ఉంపంతే, కోతలూ మీరూను'

'ఏం కోతలు?'

'వంకాయలు, సమ్మిడికాయలు...యిహి హీహీ—' అంతా గొల్లున నవ్వేం...

'అలాక్కాదోయ్... చూడు... ఆ హార్మోనీ శబ్దం యెలా వుంది... అది శృతి అంటారు.'

'సెప్పక్కర్లేదు'

'ఆ శృతిలో నీగొంతు కలపాలి—మాట స్వచ్ఛంగా పలకాలి. అలా పాడితే స్వామికి ఆనందం కలుగుతుంది'

'లేకపోతే' అని కొంటె ప్రశ్న వేసేడు.

'చుట్టుప్రక్కలవాళ్లకి బాధగా వుంటుంది. చూడు... యిలా పాడాలి.'

శాస్త్రి హార్మోనీ శృతిలో గొంతు 'ఆ' అని కలిపి ఆ పాట తిరిగి మృదువుగా, హాయిగా, భక్తిగా పాడి వినిపించేడు. మాకందరికీ ఒళ్లు పులకరించింది. పూజార్ల యింట్లో పనిచేసే 'పైడి' వచ్చి మండపం క్రింద బొమ్మలా నిలబడి పాట వింటూంది. దానిలో కూడా భక్తి వికసించింది కాబోలు.

'అబ్బాయిలూ, మనం అంతా కలిసి వొక బాలభక్త సమాజంగా తయారవుదాం. నెల కొకసారి రావిచెట్టుక్రింద వున్న ధర్మ్యమంటపలివారి భజన పార్టీనికూడా పిలిచి, చక్కగా భజన చేస్తే, అంతా వచ్చి ఆనందిస్తారు. అప్పుడు మనం భజన యింకా సక్రమంగా చెయ్యొచ్చు. ఏమంటారు?'

మాకు చాలా సరదా వేసింది. అలాగే అన్నాం. కాని ఆంజనేయులే చిన్న సమస్య లేవదీసేడు. 'ఆ డబ్బు డవాలంతా చేరే వరకూ మనకేదైనా ప్రసాదాల యేర్పాటుందా లేక మన భజన మిరియాల దండుగకేనా?'

'ప్రసాదాలు కావలసినన్ని. అవన్నీ నేను చేయిస్తాను' ఆ మాట వినగానే ఆంజనేయులు ఆంజనేయస్వామిలా పొంగిపోయి, గభీమని లేచి గుండెలకు మోకాళ్లు తగిలేలా కుప్పి గంతులు వేసి 'అశ్శ భాస్ శ్శభాస్ బాగా సెప్పేవ్—లబ్బు లబా లబ్బు లబా' అని నక్షి తాండవం చేసేడు. మంగళహారతి

ముగియగానే అంతా వెడిపోయేరు—నేనూ శాస్త్రీ నడుస్తూంటే పైడిమండపం చాటుకు మెల్లగా తప్పుకుంది.

పతంజలిశాస్త్రి మీద చుట్టుప్రక్కల పెద్దలందరికీ గౌరవభావం యేర్పడింది. ఆ కారణంవల్ల అతనిమీద నాకున్న గురుభావంవల్ల నేనతనితో అనునిత్యం వుండడం మా వాళ్లు హర్షించేరు. శాస్త్రి కూడా నన్ను శిష్యవాత్సల్యంతో చూస్తూ, నన్నెప్పుడూ సక్రమ మార్గంలో నడిచేటట్లు చెయ్యడానికి ప్రయత్నించేవాడు. నేనూ వకుళం వొంటరిగా వున్న సమయాల్లో యేదో పని కలిపించి నన్నెక్కడికో పంపుతూండడంవల్ల వకుళానికి నా మీద కొంత అసహ్యం కలిగింది. వకుళం మా పొరుగింటి ప్లీడరు గారి కూతురు—చురుకైనది—మంచి నెమ్మది కలిగినది—ఆ పిల్ల నాకు ప్రాణంకంటె యెక్కువ.

వకుళం ఆంజనేయులకు దూరపు బంధువు. వాడివల్లే నాకాపిల్లతో పరిచయం కలిగింది.

ఆవేళ సాయంత్రం ఐదు దాటిన వరకూ మఠం డాబామీద శాస్త్రి నేను కూచుని యేవో కబుర్లు చెప్పుకున్నాం. తరవాత శాస్త్రి సంధ్యా వందనానికి వెడిపోయేడు. పిల్లిలా చప్పుడు చెయ్యకుండా వకుళ వచ్చి నా వెనక నుంచుంది.

'ఏమి టాలోచిస్తున్నావు?' పరధ్యానంగా వున్న నేను తుళుక్కుపడ్డాను. వెనుదిరిగి ఆమెను చూడగానే నా కాశ్చర్యం వేసింది. ఆమెలో యేదో గొప్ప మార్పుగుపించింది. అప్పటికి సుమారు వారం రోజులనుంచి వకుళం నా కంట పడలేదు. ఆంజనేయులు నడిగితే, 'వకుళ మూన్నాళ్ళపాటు యెడంగా కూచుందిరా. యేమిటో—పెద్దమనిషైందనుకుంటున్నారు' అన్నాడు. నాకేమీ అర్థం కాలేదు. పెళ్లికాకుండా పెద్దమనిషెలా అయిందిరా అంటే వాడికీ బోధపడలేదు.

'ఏం వకుళా! వారంరోజులై యెక్కడా జాడ లేదు!'

'వారం రోజులై నేను జాడలేదుగాని, నువ్వెన్నాళ్ళయి జాడలేదో గుర్తుందా? శాస్త్రి దగ్గర వైదికం నేర్చుకుంటున్నావా?'

'వైదికం నేర్చుకోడానికి మాకర్హత లేదట'

'అయితే మంత్రాలు నేర్చుకుంటున్నావా?'

నాకేం జవాబు చెప్పాలో తోచలేదు. ఆమెను చూస్తున్నకొద్దీ ఆమెలో యేదో తీవ్రమయిన మార్పు గోచరిస్తూంది. నిజంగా పెద్దమనిషయిందా? అంటే యేమిటి? నే నెప్పుడు పెద్దమనిషవుతాను? నా దండలు, హృదయభాగం చూసుకున్నా. ఇలా ఆలోచిస్తూంటే పడమటి దిక్కునుంచి అరుణారుణ కాంతుల్ని కబళిస్తూ వొక కారుమేఘం పరుగెత్తి వస్తూంది. రివటగాలి పెనుగాలిగా మారి వుధేత్తుగా టపటప చినుకులు పడసాగేయి. డాబామీద దక్షిణ దిక్కున దగ్గరగా వున్న గదిలోకి పరుగెత్తేం. వెంటనే ఆవాన పెద్దదై వుత్తరగదిలోకి మమ్మల్ని వెళ్లనివ్వలేదు. దక్షిణగది మెట్లు కూలిపోయివుండడం చేత అక్కడ మేం ఖైదయిపోయేం. ఎదురుగా కిటికీలోంచి వకుళ యిల్లగుపిస్తూంది. ఆమె కిటికీ మూసింది.

'కిటికీ మూసేవేం?'

'చలిగాలి వీస్తోంది' ఆమె మందహాసం చేసింది.

'వకుళా! నీలో యేదో మార్పు కలిగింది. అది నాకర్థం అవడంలేదు. నాకు చెప్పవూ?' ఆమె సుదీర్ఘమైన కనురెప్పలు బరువుగా వాలేయి. ఎందుకో వాటిని చుంబించాలనిపించింది. హోరని వర్షపు శబ్దాన్ని చీల్చుకుని క్రింద మండపంమీంచి ఆంజనేయులు 'లబ్బుక్కలబా' వినిపిస్తూంది. నెమ్మదిగా వకుళాన్ని సమీపించి దగ్గరకు తీసుకున్నా. తటాలున ఆ పిల్ల నా హృదయంమీద రెండు చేతులూ అదిమి వెనక్కునెట్టి, ధారాపాతంగా కురుస్తూన్న ఆ వర్షంలో, డాబాపొడుగునా పరుగెత్తి ఉత్తర గదిలోంచి అదృశ్యం అయింది. ఆమె వెడిపోయిన ఐదునిమిషాల తరవాత 'గోపాలం' అని పతంజలి శాస్త్రి పిలుపు వినబడింది.

అతడు గంటసేపు నన్ను పృచ్ఛించిపృచ్ఛించి విషయం అంతా గ్రహించేడు. అమాయికంగా నా ఆరాటం అంతా అతనికి చెప్పేను. శాస్త్రి వుగ్రరూపం ధరించేడు. భగవద్గీత చేతిలో పట్టుగుని 'దీనిమీద చెయ్యివేసి ప్రమాణం చెయ్యి మళ్లీ అలాంటి పొరబాటు చెయ్యనని' అని గసాయించేడు—బైట వర్షం పడుతూన్నట్టు నాకళ్లంట అశ్రువులు జలజల రాలేయి. ప్రమాణం చేసేను. గీత చేతిలో వుంది. అది అతని చేతిలో

కూడా వుంది. ప్రమాణవాక్యం నానోటిలో ధ్వనించింది. అతని హృదయంలోనో !

ఆ నిముషంనుంచీ కొంతకాలం నా మనసు బాధపడింది. అనుభవహీనుడిని. అజ్ఞానం నన్నలా తప్పుత్రోవలోకి నెట్టివేస్తూంది. తరవాత నాలుగైదు రోజులవరకూ వకుళంతో మాట్లాడలేకపోయేను. ఆమెకూడా నాతో మాట్లాడాలన్న అభిలాష అంతగా చూపలేదు.

ఒకనాడు సాయంత్రం మసక వెన్నెలలో నే నొంటరిగా పొగడచెట్టుక్రిందకూచుని, వర్షంనాటి సాయంత్రం జరిగిన సంఘటన నెమరువేసుకుంటున్నా. ఆంజనేయులు వెనకచాటునే వచ్చి కళ్లు మూసేడు. నేను విదిలించుకున్నా.

'ఏమాలోచిస్తున్నావురా ?'

'ఏం లేదు'

'నాకు తెలుసు'

'ఏమిటి ?'

'వకుళం—'

'ఎవరన్నారు?'

'నాకు తెలుసు. వకుళం అందంగా వుంటుందిరా. కాని నన్ను చూస్తే దానికి వెక్కిరించాలని వుంటుంది. నువ్వంటే దానికి చాలా సరదా.'

'ఎప్పుడు చెప్పింది'

'ఇందాకా—వాళ్ళనాన్నగారి కెవరో పూతరేకు లిచ్చారట—నీ కిమ్మని యిచ్చింది.' జేబులోంచి ఆకుమడత తీసేడు. దానిలో రెండు పూతరేకులున్నాయి.

'నీకిచ్చిందా ?'

'లేదు. దొంగ...కాని జాగ్రతరోయ్...వాళ్ల నాన్నకి తెలిస్తే వీపు యిస్త్రీ అయిపోతుం దిద్దరికీ'

'ఏమిటి తెలిస్తే—పూతరేకు యిచ్చిందనా?'

'నాకూ చే...యొరగవ్. కాని వొరేయ్. నాకు రోజూయేదైనా నైవేద్యంపెడితే నీకు మంచి సాయం చేస్తా.' నా మనస్సు వికసించింది. ఒక పూతరేకు వాడి కిస్తూ అన్నా 'పోనీరా—నువ్వంతా యెగతాళి చేస్తావూ. నా కలాంటి వుద్దేశమే లేదు.'

'దాని కంటేనో'

'అచ్చే'

'అలా కాదు'

'నిజం!'

'అశ్శభాస్ శ్శభాస్—యేమీ యెరగవు—లబ్కులబా, లబ్కులబా' రెండో పూతరేకు కూడా వాడి కిచ్చేను అప్రయత్నంగా. నాట్యంచేస్తూ పరుగెత్తేడు. మళ్లీ నిశ్శబ్దం—ఒంటెబాటు. వకుళం పెద్ద మనిషైంది. నే నింకా కాలేదు—అయేవరకూ వేచి వుండాలి కామోసు. ఈ అగమ్యగోచరపు లోకంలో వున్న నన్ను 'బాబూ' అన్న పిలుపు మేలుకొలిపింది. వెనుదిరిగి చూసేను. పైడి! అది నన్ను రమ్మంటోంది. ఎవరో పిలిచేరట. యంత్రంలా దానివెంట వెడుతున్నా.

చుట్టు తిరిగి మఠంవెనక వున్న చెరువుగట్టు మీంచి సుమారు మఠం పెరటివరకూ వచ్చేం. పైడి ముందు దారితీస్తూంది. చెరువు నానుకొని దిబ్బ—ఆ దిబ్బ యెక్కితే పాడైన మెట్లవరస. అక్కడి తలుపు లెప్పుడూ మూసివుంటాయి. కాని అప్పుడవి తెరచివున్నాయి. తూర్పునుంచి వుదయేందుకిరణాలు సూటిగా గదిలో పడుతున్నాయి.

ఆ మెట్లు నే నెన్నడూ యెక్కలేదు. వాటి కిరుప్రక్కలా గడ్డి మొలిచి వుంటుంది. చెరువుగట్టు మీంచి అక్కడకు చేరడానికి సరైనమార్గం లేదు. పైగా ఆ పెరటింటికెదురుగా చెరువుగట్టుగోడ నానుకొని వొక పెద్ద రావిచెట్టుంది. మఠంలో నిర్భాగ్యురాలైన వొక వితంతువు సిగ్గు భరించలేక ఆత్మహత్య చేసుకోవడంచేత దయ్యమై ఆ చెట్టును పట్టివుందని పుకారు. అంచేత ఆ వెంపు వెళ్ళేవాళ్లం కాము. మెట్లమీద పాకుడు కూడా వుంది.

మీద మెట్టెక్కి వెనక్కి తిరిగి చూసేసరికి పైడి తిరోగమిస్తూంది. కారణం ఆలోచిస్తూండగా మేడ జొక్కి గదిలోంచి ఘల్లుమని గాజులచప్పుడు వినపడింది కుడిమూలనుంచి హటాత్తుగా వొక కోమలాంగి వచ్చి, నా వేపు చూసి 'ఓహో వచ్చావా' అన్నట్టు మందహాసం చేసింది. ఆమెను చాలాసార్లు చూసేను. కాని ఆ లావణ్యంతో యెన్నడూ చూడలేదు. వెన్నెల చుంబించిన ఆమె పలువరసనుంచి ప్రసారితమైన కాంతులు నా కళ్లకు మిరుమిట్లు గొల్పేయి. ఆమె డాక్టరు అయ్యంగారి కూతురు—బాలవితంతువు—పేరు అలిమేలు.

'నీ పేరేమిటి?' నేను చెప్పేను.

'గోపాలకృష్ణుడివా?' తమాషాగా నవ్వింది. అది కొంటెగానే వుంది. కాని దానిలో వొకవిధమైన జాలి వుంది. దానిలోనే యేదో కాంక్షని సూచించే ధ్వనివుంది. అది జాలిగొలిపే యేదో విజ్ఞాపనపత్రంలో ముందు వ్రాసే విషయసూక్ష్మంలా వుంది.

బూజులు పట్టి, గోడపెళ్లలు రాలిపోయిన ఆ పాతగదిలో, వెన్నెలవెలుగులో, ఆమె యేవో ప్రశ్నలు వేస్తూంది కాని, ఆమె మాటలు నాకు వినిపించడంలేదు. నేనేవో జవాబులు చెపుతూంటే ఆమె ముసిముసి నవ్వులు నవ్వుకుంటూంది. తెలుగు పలుకులమధ్య ఆమె అరవయాస వింతైన కమ్మదనం కలిగివుంది.

'అతను—నీతో తిరుగుతూంటారు, ఎఱ్ఱగా— ఆయన పేరేమి?'

ఈ ప్రశ్నతో నాకు తెలివివచ్చింది. అప్రయత్నంగా 'పతంజలిశాస్త్రి' అన్నా. వెంటనే ఆమె మాటలు నేర్చుకుంటూన్న చిలుక క్రొత్తమాట వినగానే దానిని లోలోపలే నాలుకత్రిప్పుతూ పురశ్చరించినట్టు 'పతంజలిశాస్త్రి' అని రెండుమూడుసార్లు గొణిగింది.

'ఆయనకు యీ చీటేయిస్తావూ?'

హరేరామ్! నా గుండెలలో రైళ్లు గుద్దుకున్నాయి.

'పతంజలి శాస్త్రి అంటే యెవరనుకున్నారు? అతడొక మహాగ్నిజ్వాల!'

'ఈ చీటిలో అతడిని తిట్టుతూ వ్రాయలేదే!' ఆమె బెట్టుగా అంది—కాని నవ్వుతూనే.

'పొగుడుతూ వ్రాసినా, వ్రాసిన మిమ్మల్నీ, అందిచ్చిన నన్నూ మసి చేస్తాడు.'

'ఫరవాలేదు ఇవ్వకూడదా' చీటే అందిస్తూ జాలిగా పలికిన యీ వాక్యంలో వుక్రోషం అగుపించింది. చీటి తీసుకువెళ్లి యివ్వడానికి ధైర్యంకలగలేదుగాని, ఆమెకు ఆశాభంగం కలిగించడంలో హింసగోచరించింది. సరే యిమ్మన్నా. చీటియిచ్చినా చెయ్యి పట్టుగుని 'ఎవ్వరికీ చూపించకూ—'అంది.

చెరువుగట్టుకు దిగి వెనుతిరిగి చూసేను. ఆ మేడగది గుమ్మంముందు నుంచుని చూస్తూంది నావంపు. చందమామె ఆమె సౌందర్యాన్ని త్రాగేస్తున్నాడు. ఆ జ్యోత్స్నావికాసంలో ఆమె అరబ్బీరాత్రుల కథలలో యే దేవకన్యకో అనిపిస్తూంది.

చీటి పట్టుకెళుతున్నానన్న మాటేగాని అది అందివ్వడానికి గుండెలు లేవు. కుంటెనకారుడికుండే సాహసం నాలో మృగ్యం. సందుమలుపు దగ్గర అయ్యంగారి మేడముందు పెద్దనీడ యేర్పడింది. ఆ నీడ చేరగానే పైడి సన్నని అవరుద్ధ కంఠం వినిపించింది. 'ఏటన్నారు బాబూ.' నేను సంగతి చెప్పేను. 'నా నిచ్చేస్తాను బాబూ, తెండి' ఆ కీ నీడలో దాని మత్తిలోచనాలు మెరిసేయి. నా తల మీంచి పర్వతం దింపినట్టయింది.

నేను పిల్లిలా గుమ్మంముందు నిలబడి పైడి శాస్త్రిగదిలోకి వెళ్లడం, ఐదు నిమిషాల తరవాత తిరిగి రావడం చూశా. అది తిరిగి అయ్యంగారింటికి ప్రదక్షిణం చెయ్యడానికి గాబోలు బయల్దేరింది. నేను ఒక్కొక్కుగా దానిని సమీపించి అడిగా—

'ఏమయింది?'

'సీ టిచ్చేరు'

'నే నిస్తాతే'

'వొద్దు బాబూ. నేనే యిస్తా'

'అక్కర్లేదు—నేనే యిస్తా'

'మీ నాన్నగోరితే సెప్పనా?'

నా గొంతుక తడి ఆరిపోయింది. దాని కెందు కంత కోపం! అది దూరం అవుతూన్నకొద్దీ దాని తెల్లచీర వొక మచ్చలా మారుతూండా వెన్నెలలో. అది అయ్యంగారింటి పెరటివేపు వెళ్లడం లేదు—మలుపుదగ్గరున్న పెద్ద రావిచెట్టు నీడలో కొంచెం ఆగి తిరిగి బయల్దేరింది. నాకు అనుమానం వేసింది, అది తిన్నగా వెళిపోతూంటే. నన్ను నేను మరిచిపోయి అలా నిలబడ్డపాళంగా, ఆంజనేయులు నా కెదురుగా వచ్చేడు. వాడి నొసట విభూతిరేఖలు నడుమ సిందూరం మెరుస్తూంది.

'ఏమిగోయ్! అలా నిలబడి నిద్రపోతున్నావు!'

'అలాగేరా... ఎక్కడనుంచి వస్తున్నావు?'

'నా కోవెలనుంచి... యిందు ప్రసాదం.'

'కాని నువ్విలా వస్తూన్నప్పుడు ఆ రావిచెట్టు క్రింద ఎవరున్నారురా?'

'ఏం? మన పైడి'

'ఏం చేస్తూంది'

'ఏదో కాగితం చింపినట్టుంది'

'పద చూదాం'

వెళ్లి అక్కడ వెతికితే నాలుగు చిన్న కాగితం ముక్కలు దొరికేయి. ఎదురుగుండా వున్న కిళ్లీకొట్టు దీపంవద్ద అవి దగ్గరచేసి చూసేం. అది అలిమేలు శాస్త్రికి వ్రాసిన లేఖ. నా కత్యాశ్చర్యం కలిగింది. ఆంజనేయులు పళ్లికిలించి గంతు లారంభించేడు, 'లబ్బలబా'

ఆరాత్రి నాకు నిద్రపట్టలేదు. పతంజలిశాస్త్రి మండిపడిపోయి వుంటాడు. కొంపతీసి నా ప్రమేయం తెచ్చిందేమో పైడి. రేపు శాస్త్రిముఖం యెలా చూడడం. ఈ ఆలోచనలతో మూడుఝాములు దాటినవరకూ కునుకురాలేదు. ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు. కాని హటాత్తుగా మఠంముందు మ్రోగిన భేరీ భాంకారాలతో తెలివివచ్చింది.

ఉడిపినుంచి మధ్వస్వాములవారు శిష్యగణంతో, హాయంపటాటోపంతో వచ్చి తెల్లవారుఝామునే మఠంలో దిగేరు. ఆ నిముషంనుంచీ మఠం వచ్చీపోయే జనంతో, పూజావిధానాలతో, పండితగోష్ఠితో మారుమ్రోగింది. ముఖ్యంగా పిల్లలకు రెండు విశేషాలు ఆహ్లాదం కలిగించేయి. ఒకటి స్వాములవారి సొన్నాయిమేళం, నగారా—రెండు రూపయౌవన ఉపాసనాభూసురుడైన స్వామి—ఆ మహాపండితుడు పిల్లలమధ్య యిట్టే పసిపిల్లవాడిగా మారిపోయేవాడు.

ఈకోలాహలంలో పతంజలిశాస్త్రి దృష్టి నుండి తప్పించుకోవటం నాకు సులువైంది. అతను దూరంనుండి నావేపు చూచినప్పుడల్లా నాగుండెలు టువ్వుటువ్వుమనేవి. కాని అతని ముఖంలో నాకేమీ మార్పు అగుపించలేదు. పైడి వొకవేళ నాప్రమేయం తేలేదేమో!

సాయంత్రం ఐదుగంటలకు మఠంవెనక తూర్పు వరండామీద పిల్లలంతా చేరి గోలపెడుతున్నారు. ఎదురుగుండా అరుగుమీద వకుళ అమాయికంగా నిలబడి పిల్లల ఆట చూస్తూంది. ఒక్కొక్కప్పుడు పిల్లను లిల్లిచేసుకొని దొంగాటాడుతున్నారు. నేనూ ఆంజనేయులూ అటువేపు వెళ్ళేం. నన్ను చూడగానే వకుళం చిరునవ్వు నవ్వింది. ఆమె కనురెప్పలమీద పూర్వకోప చిహ్నాలేమైనా వున్నాయేమో అని అనుమానం వేసింది. ఆమె మందహాసంలో 'పోకిరీ వాడా' అని నన్ను తూలనాడే భువకిణాంకం మసక మసకగా గోచరించింది. ఆంజనేయులు 'వెళ్లరా' అని నన్ను పొడిచేడు. వాడికి మాయిద్దరికీ బాగా తెలుసు—వాడికి వకుళం నాన్నంటే హడలు.

కాని నేనూ వకుళం యెక్కడుంటే పిల్లలంతా అక్కడే చేరుతున్నారు. గోల చేస్తున్నారు. ఒకటి రెండుసార్లు పెరటిలోకి వెళ్లడానికి ప్రయత్నించేం.—కాని ఆ వానరమూక అంతా వెంటపడ జొచ్చింది.

ఇంతలో, ఆంజనేయులు కళ్లింతలు చేసి, చేతులు త్రిప్పుతూ—సౌంస్కృతం పోలిన యేవో నోటితడాకాలు వాగుతూ, 'నేను ముద్రధారణ స్వాములవారిని— రండి— మీ కందరికీ ముద్రలు వేస్తాను' అని వొక్కొక్కరినీ పిలిచి జబ్బగిల్లులు ప్రసాదించసాగేడు. గిల్లు తిన్నవాడు మొఱ్ఱో అంటే మిగిలినవాళ్లంతా గొల్లున నవ్వుతున్నారు. మే మిద్దరం బాదంచెట్టు పెరటిలోకి దారితీసేం.

ఎండిన బాదమాకులు మా కాళ్లకిందపడి పళపళ శబ్దిస్తున్నాయి. పడమటి సూర్యుడి రక్తకిరణాలు ప్రాగ్వాకాశంమీద పొర్లుతున్నాయి. చెరువునీరు షర్బత్ లా మెరుస్తూంది.

మేం దిబ్బయెక్కి గన్నేరుచెట్లనడుమ బోద్దుగా చేరిన యెండు పండుబాదమాకుల దిండుమీద కూచున్నాం. దూరంగా మఠంలోంచి ఆంజనేయుల ప్రతాపం వినిపిస్తూంది. మేమున్నస్థలం రహస్యంగా వుంది. చెట్టుమీద, చెరువులోను, పిట్టల అరుపులు, తొగరుపూల గమగమలు, పల దిమ్మెక్కిస్తున్నాయి.

'వకుళం! కోపం వచ్చిందా?'

'ఎందుకూ?' ఆమె నావేపు జాలిగా చూసింది.

'ఆవేళ...' ఆమె కోపం లేదన్నట్టు నవ్విన విధానం చూస్తే, ఆవేళ తడుస్తూ వర్షంలో పారి

పోవడానికి విశేషమయిన కారణంలేదని, కేవలం గాథ రాపష్టమేనని తెలుసుకోగలిగేను.

ఆపిల్ల కోలకళ్లు, బిగుసైన పెదవులు, చిక్కుడు కాయలవంటి వేళ్లు, పండు తమలపాకు లవంటి పాదాలు, నాలో సాహసాన్ని రేకత్తేయి. స్పర్శకు ఆమె వణకిపోయింది. కళ్లంట జలజల ముత్యాలు రాలిపోయేయి. నా నోటిలోంచి వెలువడ్డ నిట్టూర్పుల వేడికి తల్లడిలిపోయింది కామోసు, బాదమాకుల దిండుమీద వాలిపోయింది. పడమటికేసి అప్పుడే పొడయిం చిన వొకతార తెగి మహావేగంలో రాలి పోయింది.

వకుళం యేడుస్తూ వెడిపోబోయింది. నేనా పిల్లనిసాధ్యమైనంతవరకూ, పంకిలహృదయానికి కలిగే ఎదురుపాటువల్ల రుద్ధకంఠంతో వోదార్చడానికి ప్రయత్నించేను. కాని అది కళ్లు కాసిపోయేలా యేడిచింది. ఆ పిల్ల వెళిపోయింది. ఎంత పాపం చేసేను! అజ్ఞానంవల్ల చేసిన యీ కృత్యంలో నా జీవితాన్ని కళంకితం చేసుకుని, వకుళహృదయంలో చిచ్చు రగిల్చేను. అది నన్ను క్షమిస్తుందా? అగ్ని హోత్రం వంటి పతంజలి శాస్త్రిచేతిలో చెయ్యి వేసి చేసిన ఘోరప్రమాణాన్ని భంగపరచి, సత్యాన్ని, వ్రతాన్ని, ఆ మహనీయుడి వద్ద శిష్యరికాన్ని నవ్వులపాలుచేసేను. నేను కుమకష్టుడినా! వికల హృదయంతో మండపం యెక్కుతూంటే నా వేపు చూసి ఆంజనేయులు కొంటెగా నవ్వుతూ యెగిరి 'లబ్కులబా' నృత్యం చేసేడు. ఈ అత్యాచారానికి అవకాశం కల్పించిన వాడి పీక నులిపియ్యాలని పించింది.

ఆరాత్రి పండితగోష్ఠి జరుగుతూంది. నేనొక స్తంభంచాటున నక్కికూచున్నాను. జగన్మిథ్యా తత్వాన్ని, ఆత్మపరమాత్మల అవినాభావవాదాన్ని ఖండిస్తూ స్వామి సంస్కృతంలో ఫుపన్యసించేరు. ఎవరో పండితుడు వారి వాక్యాల్ని తెలుగులో చెప్పేరు. పతంజలిశాస్త్రి మెరుపుతీగలా రంగం లోకి దూకేడు అపరశంకరుడివలె మెరిసిపోతూన్న అతని మూర్తి ప్రభకు, ఝురీప్రతిచ్ఛన్నమైన ఆ దేవ భాషావైదగ్ధ్యానికి అంతా మంత్రముగ్ధులయేరు. కాని అతనిమీద ప్రత్యేకతగా రెండుకళ్లు నిలచిపోయి, అతడిని ఆరాధిస్తున్నట్టు కనిపెట్టేను. అవి అలి మేలువి. ఆమె అప్పుడప్పుడు నాకేసికూడా చూసి ముసిముసినవ్వులు నవ్వింది. అక్కడకు రావడాని కామెకున్న ధైర్యానికి, ఆ ధగధగ మెరిసే కుంకుమ ధరించిన సాహసానికి నే నాశ్చర్యపోయేను.

సభముగియగానే అంతా కోలాహలంగా వెడి పోతున్నారు. అలిమేలు నాప్రక్కగావచ్చి చెవిలో 'రేపుదయం పదిగంటలకు—అక్కడికే' అని వూదింది.

మర్నాడుదయం నిర్ణీతసమయాని కా శిథిల మైనగది చేరేను. కాని అలిమేలింకా రాలేదు. నా మనస్తత్వంలో వొక విధమైన పరివర్తన ఆ తొలినాటి సాయంత్రంనుండీ కలిగింది. అంచేతే కామోసు, తర వాత అలిమేలు తీగ కదలినట్టు వస్తూంటే, యిలాటి దివ్యవిగ్రహం వలచివస్తే కాదనే ప్రవరాఖ్యుడుం టాడా అనిపించింది. ఆమె వస్తూనే చిరునవ్వుతో 'చీటీయిచ్చేవా' అంది. నేను నసిగేను. ఆమె కళ్లు కొంచెం జేవురించేయి. నాకు భయమేసింది.

'ఇవ్వలేదా?'

'నే నివ్వలేదు'

'మరి అదేంచేసేవు?' ఎవరికైనా చూపేవా?'

జీవితంలో మధుర రహస్యం గుర్తెరిగినన్నామె తన (ఒక వేళవుంటే) అయిదేళ్ళ తమ్ముడిగా భావిస్తూంది.

'నేను స్వయంగా యివ్వలేకపోయేను. పైడి ద్వారా పంపేను'

'పైడిద్వారా...! చెడ్డపని చేసేవు!!' తీవ్ర రూపం ధరించింది. కాని మరునిమిషంలో ఆమె మందహాసం చేసి అంది, 'పోనీ! భయంలేదు. ఇది... యీవుత్తరం యిస్తావా?'

హరేరాం! నన్నీ కామినీపిశాచి వదిలేలా లేదు. కాని ఆమెమాటతోసి నెయ్యలేకపోయేను. ఉత్తరం అందిస్తూ ఆమె నాయెడమచేతివేళ్ళన్నీ తన రెండుచేతులతో అణిమి, 'చూడు! నేను శాస్త్రి గారిని యెంతో ప్రేమిస్తున్నాను. ఆయనకోసం నా హృదయం దహించుకుపోతూంది. నువ్వాయనతో యెప్పుడూ తిరుగుతుంటావు. అంచేత నువ్వుసహాయం చెయ్యాలి. చేస్తావుకదూ—నేను తిరిగి నీకేమీ వుప

"లక్స్ టాయిలెట్ సబ్బు
నాచర్మ
సౌందర్యమునకు
దివ్యమైనది"
అని
బి.ఎస్.సరోజా
చెప్పుచున్నది






మనోహరమైన సువాసనతోగూడిన
ఈ తెల్లటి శుద్ధ సబ్బుతో మీ చర్మమును
మనోహరముగా నుంచుకొనండి!

సినీమా తారలకు సౌందర్యము నిచ్చు సబ్బు

కారం చెయ్యలేను. కాని బ్రతికినంతకాలం నీకు మిక్కిలి కృతజ్ఞతతో వుంటాను,' అంది.

ఆమె వాక్యాలు నాలో కరుణ రసాన్ని లేరగ తెత్తేయి. చీటీ తీసుకుని బయలుదేరా. కాని వీధిలోకి రాగానే హటాత్తుగా భయం వేసింది. నేనే... శాస్త్రికి యిది యివ్వడమే... అసంభవం! తిరిగి నా మెదడు గానుగలో చెరుకుగడలె నలిగిపోజొచ్చింది.

ఎదురుగా ఆంజనేయులు వస్తున్నాడు. గబగబ చీటీ పంట్లాంజేబులో దాచేను. కాని వాడి కళ్లు డేగకళ్లు!

'ఏమిట్రా జేబులో దాచుకుంటున్నావు? పూతరేకులా వుంది!' వాడి కెప్పుడూ తిండి గోలే.

'కాదురా—ఇప్పుడో చిక్కు వచ్చింది. చాలా రహస్యంగా వుంచాలీ సంగతి—' విషయం అంతా చెప్పేను. వాడు చెవులు రిక్కించి, పళ్లిగిలించి విన్నాడు—

'అలిమేలే! నారేనా—మనశాస్త్రి నే! గోడల మీద వ్రాసేద్దాంరా వీళ్లపేర్లు?' వాడిని కొట్టిన చెంపకాయకి నా చెయ్యి కందిపోయింది. కాని వాడు తడుముకుని దులిపి వేసేడు

'నువ్విస్తావా శాస్త్రికి?'

రెండో చెంప తడుముకుని, 'ఏం—యిది ఖాళీగా వుండిపోయిందనా?' అన్నాడు.

'మరెలాగా?'

ఒక్క చిటిక వేసేడు, 'పోస్టు చేద్దాం'

'జేనాంతకుడివిరా అంజీ!'

'ఆ శ్శభాస్ శ్శభాస్, లబ్బులబా...'

'ఆగరా—ఆగరా—ఈచీటీమీద అలిమేలు తన పేరు వ్రాయలేదు. మరి శాస్త్రి ఆమెకెలా జవాబు వ్రాయగలడు, ఒకవేళ వ్రాయాలనే వుంటే?'

'ఆట్టేచిక్కే... నువ్వు వ్రాసేయరాదూ!'

'నా వ్రాత శాస్త్రి పోల్చేస్తాడురా - నువ్వు వ్రాయి'

'చితకతంతే?'

అంతపనీ జరిగింది. పతంజలిశాస్త్రి ఆ చీటీలోని ఆంజనేయులు లొటిపిట వ్రాతపోల్చేడు— వాడిని తనగదిలోకి తీసుకెళ్లి నాలుగుచెంప కాయలు లాగి, కట్టుపుచ్చుకు నేసరికి వాడు సంగతి అంతా తుచ తప్పకుండా చెప్పివేసేడు. శాస్త్రి నన్ను పిల్చి పచ్చివాట్లు వేసేడు, 'చెడిపోవడానికి యిష్టంగా వుందా? మీ వాళ్లతో చెప్పనా? తెలివైనవాడివి, బాగుపడతావని, నీ మీద యింత శ్రద్ధతీసుకుంటున్నా—నువ్విలా సంచరిస్తే, నాతో తిరుగుతూండడంచేత నాకు అపఖ్యాతి వస్తుంది. ఈ అలిమేలు మ్లేచ్చురాలు—దానివద్దకు నువ్వెందుకు వెళ్ళేవు? ఇక ఎన్నడూ వెళ్ళకద్దు—తెలిసిందా? ఓయ్ ఆంజనేయులూ, మళ్ళీ యిలాంటి సలహా యిచ్చేవా, నీ తోలు తెగగోస్తా' ఆంజనేయులు లేచి వెక్కిరిస్తూ పారిపోయేడు. నేనుమాత్రం బరువుగా కాళ్లీడ్చుకుంటూ వెళిపోయేను.

నేను వారంరోజులవరకూ ఎవరితోనూ మాట్లాడలేదు. మఠంలో కాలు పెట్టలేదు. వకుళాన్ని రెండుమూడుసార్లు దూరం నుంచే తప్పించుకొన్నా. అపిల్ల పిల్చింది కూడా. నేను లెక్క చెయ్యలేదు.

కాని ఆవేళ నేనొంటరిగా పొగడచెట్టుప్రక్క అరుగుమీద కూచున్నాను. ఎండ తీక్షణంగా వుంది. వకుళం వెనకబాటుగా వచ్చి నా మెడమీద వూదింది. నేను వెనక్కి తిరిగేను. ఆమె నవ్వింది.

నేను దిగులుగా అడిగేను 'నామీద కోపం వచ్చిందా?'

ఇది ప్రేమికుడు అను నిత్యం ఎన్నో సందర్భాలలో వేసే పక్షిప్రశ్న. లేదని జవాబు రావాలని కోరి వేసే ప్రశ్న యిదొక్కటే ప్రేమ విపణిలో. ఈప్రశ్నే నేనిదివరకామె కెన్నిసార్లో వేసేను. అప్పుడామె దానిని గ్రహించే పరిస్థితిలో లేదు—నేడో—సంగతి తారుమారైంది. ఆమె చెరచెరనడిచి మేడ మెట్లెక్కుతూ సగంలో ఆగి, పిట్టగోడ మీద గడ్డం ఆనించి, మెరిసే నేత్రాలతో, బుంగమూతితో 'రా' అంది. అది మా ద్వితీయ సమాగమం—అద్వితీయ సమాగమం.

తరవాత గాలికోసం కిటికీ తలుపులు తెరచి నేను కొంచెం వేదాంతం బోధపరిచేను.

‘క్షణికమైన యీ సౌఖ్యంకోసం పవిత్రమైన శీలాన్ని ధ్వంసం చెయ్యడం అజ్ఞానం!’

‘క్షణికమైనదైనా ఆనందం, ఆనందం కాదా? అనుభవించగూడా? ఓహో—శాస్త్రి గారి వేదాంతం కాస్త నీకు కూడా పట్టిందే’ ఆమెను చూస్తుంటే నా కాశ్చర్యం వేసింది. ‘సత్ప్రవర్తనకి చాలా వ్యవధి కావాలి దుష్ప్రవర్తన యిట్టే కలుగుతుంది’

‘అదిగో తిరిగి వేదాంతమే చెప్తున్నావు. ఈ ఆచారాలు, కట్టుబాట్లు ప్రచారం చేసే పెద్దమనుషులే చివరకు యెంతో అనాచారాలకి దిగిపోతారు.’

‘నిప్పుకు చెదపట్టొచ్చు. కాని శాస్త్రి గారు మహాగ్నిజ్వాల తెలుసా!’

అదే సమయానికి శాస్త్రి అక్కడ ప్రత్యక్షమయేడు. వకుళం గబగబ సర్దుకుని, తలవంచుకుని నడిచిపోయింది. నాకు చెంపకొట్టి నేలమీద పడవేసినట్టయింది. అతని కళ్ళలోకి చూడలేకపోయేను. అతని పాదాలమీద పడి క్షమించమని ప్రార్థిద్దామనుకున్నా. కాని పెదవులైనా కదపడానికి శక్తిలేకపోయింది. అది క్షమించే సందర్భం కాదని, నా నేరం క్షమించరానిదని నాకే తోచింది కాని నా అభిప్రాయం తప్పని వెంటనే అతడు ఋజువు చేసేడు. ‘నువ్వు వున్నతస్థితికివస్తావని, సాధారణంగా నీయీడువాళ్ళందరికన్నా శతాధికంగా తెలివిగలవాడివని, నిన్నింత కనిపెడుతున్నా. కాని దురదృష్టవశాత్తూ నువ్వే నీజీవితాన్ని ధ్వంసం చేసుకుంటున్నావు. ఉన్నతపదవి అలంకరించే రేఖలు నీ హస్తంలో ప్రకాశిస్తున్నాయి. ప్రజాబాహుళ్యాన్ని నీవెనక త్రిప్పుకొనే లక్షణాలు నీలో వున్నాయి. కాని పడిపోవడానికి దోహదంచేసే దుష్టరేఖకూడా పగనొన్న త్రాచులా బుసలుకొడుతూంది. దాని కాటునుంచి నిన్ను తప్పించడానికే నా తాపత్రయం అంతా. నువ్వు పెద్దయేకా సర్వసామాన్యజీవిగా వుండడం నేను చూడలేను. ఇప్పటికైనా తెలివి తెచ్చుకుని సన్మార్గంలోకిరా!’

అతడి వాక్స్రవంతి బీడుదేరిన నావిశాలమనోభూమిమీంచి ప్రవహించి, దానిని పవిత్రీకరించి సారవంతం చేస్తుందనిపించింది. అతనివుపదేశబీజాలు దానిమీదపడి మొలకెత్తి మహావృక్షంగా పెరిగి, రసవంతమైన ఫలాలిస్తూన్నట్టయింది. అవనత వదనంతో, సిగ్గుచేత కృంగిపోయిన మనస్సుతో—పశ్చాత్తాపంతో కుతకుతలాడుతూన్న హృదయంతో, నడిపోయేను.

సుమారు వారంరోజుల తరువాత ఒక నాడు పైడినావద్దకు వచ్చి రాత్రిపదిగంటికి ఆగది దగ్గరకు రమ్మని అలిమేలు చెప్పిందని చెప్పింది. నాకు వెళ్లాలని లేదు కాని ఆమెకే కబురూ చెప్పకపోవడం న్యాయం కాదనిపించింది. పదిగంటలకు వెళ్ళేసరికామె అక్కడేవుంది. నేను వెడుతూనే క్షమార్పణతో ఆరంభించేను. తన వుత్తరంగురించి అడిగింది. అంతా పూసగుచ్చినట్టు చెప్పేను. ఆమె నవ్వింది.

‘నువ్వింత పిరికివనుకోలేదు’

‘పిరికి నే—అతని విషయంలో యెవ్వరైనా అంతే. అతనెవరో నీకు తెలీదుకనక’—

‘పక మహర్షా?’

‘అంతే’

‘పిచ్చివాడా—నీకనుభవంలేదు—ధైర్యం లేదు—నీ జంబాలన్నీ ఒక చెంపకొడితే పాలు, ఒకచెంప కొడితే నీరు కారే వకుళం దగ్గరే! నా కాశ్చర్యం కలిగింది. ‘నీకు వకుళాన్ని తెలుసా?’

‘జానికమ్మగారి కూతురు వకుళాన్ని తెలుసు—నిన్నూ తెలుసు—బాదం చెట్టు పెరడూ తెలుసు’. నాకు సిగ్గువేసింది.

‘అలా చూడు’ నా వెనకనే వుంది కిటికీ—దాని లోంచి సూటిగా మఠం బాదం చెట్టు పెరడు కనిపిస్తూంది. గన్నేరుచెట్లు, వాటినడుమ బాదమాకుల దిబ్బలు—అంతా. నన్నామెయేవో చిక్కుప్రశ్నలు, తర్కప్రశ్నలు వేస్తూన్నట్టు, నేను వాటికి జవాబు చెప్పలేక తికమకలౌతూన్నట్టు, రెండు నిమిషాలు నాలో వూహించుకొని అతలాకుతలం అయిపోయేను.

‘క్షమించు, ఏమైనా నేనా విషయంలో వట్టి పిరికిపందనే’

‘పరవాలేదు. నీవంటి పిరికివాళ్లు చాలామంది వున్నారు. కాని, యిది—యీవుత్తరం అందజెయ్యి’ ఆమె నన్ను అయ్యవారిలా గదమాయిస్తూంది. నాచాతకానితనం వల్ల విచారం, శాస్త్రిని తల్చుకుని భయం, అలిమేలు దివ్యసౌంద

ర్యానికి పరవశం కలిగి నేను స్వప్నలోకంలో తేలిపోతూన్నాను. నాముందు ఆమె చెయ్యివొక కాలసర్పిణివలె, ఆ చేతిలో చీటి ఆసర్పిణి నాలుక వలె అగుపిస్తున్నాయి. నేను మాట్లాడలేదు కాని జాలిగా కళ్లు ఆమె వేపు త్రిప్పేను.

'నువ్వు స్వయంగా యివ్వక్కర లేదోయ్. ఆయనగదిలో దొరికేటట్లు పడేయి, చాల్ను' నేనా చీటీపట్టుకుని ఓడిపోయిన సైనికుడిలా బైటపడ్డాను. 'ఛా ఛా' అలిమేలు అంతా చూసింది. పీకదీసినపని' అనుకొంటూ ఆ చీటీచూడగానే నా గుండె గుభేలుమంది. ఆమర్నాడు రాత్రి పన్నెండు గంటలకు తనుగదికి వస్తున్నానని, అతనిపాదాలకు తన యౌవన సౌందర్యాలు అంకితం చేసేనని, ఆదరించినా కూలదన్నినా తనభాగ్యమేనని, ఎక్కడికీ వెడిపోకుండా గదిలో వుండమని ప్రార్థిస్తూ శాస్త్రికి వ్రాసింది. వేదాంతకురాలు !!

మర్నాడు అర్ధరాత్రి బైటికివచ్చా. వీధి నిర్మానుష్యంగా వుంది. గాఢాంధకారంగా వుంది. శాస్త్రిగదిలో లైటు వెలుగుతూంది. తలుపు ఓరోకలిగా వుంది. శాస్త్రి నేనే ఆచీటి పడవేశాననుకుంటాడు. రేపు నాకు పెళ్లిచేస్తాడు, అనుకుంటున్నా. ఘుమఘుమ గుబాళించింది. నల్లని ఆకారం నాకేసి చూస్తూ (నవ్వుతూకూడా కామోసు) మఠం మెట్లెక్కి కుడిప్రక్కగది వేపు వెళ్ళింది. ఓరోకలిగా వున్న తలుపుతోసుకుని లోపలికి వెళ్ళింది. తలుపు తిరిగి మూసుకుంది. చడీ చెయ్యకుండా నేనా యువతిల నిలబడి చూస్తున్నా, తలుపు కన్నంలోంచి.

అలిమేలు మొగలాయి సౌధాంతరాలలో నివసించే తార్తారు సుందరిలా గోచరించింది. తప్తకాంచనం వంటిశరీరంమీద నీలాంబరం పట్టుచీర, నెమిక్క అంచుల జంపరు, రవ్వలదుద్దులు, తళక్ తళక్ అనే బేసరి, కళ్ళుమిరుమిట్లు గొల్పుతున్నాయి. ఆసాహసురాలు చినార్ కుంకుమ బొట్టు తీర్చి దిద్దింది. దానిలోని తళుకు ముఖం కదలినప్పుడల్లా కిరణజాలాలు ప్రసరిస్తూంది.

వెళ్ళగానే ఆమె శాస్త్రికి నమస్కరించింది. అతడా నమస్కారాన్ని బాకులవంటి చూపులతో సత్కరించేడు. వారిద్దరి మధ్య జరిగిన సంభాషణలో చాలాభాగం నాకు వినపడలేదు. కాని నిముష నిముషానికి అతడు వర్ధమాన చండకిరణుడివలె వేడెక్కిపోయేడు. ఆమె నవనీతంలా కరిగిపోయింది. చివరకామె మోకరిల్లి అతని పాదాలమీద వాలి గాద్గదికతో రోదించింది. అతడు వెనక్కి జరిగి, పెదవులు బిగించి ఆమెవేపు తృణీకారంగా చూసేడు. తక్షణం వెడిపొమ్మని ఆజ్ఞాపించేడు. నేనిక అక్కడ నిలవలేకపోయేను.

మరికొన్ని నెలల తరువాత వకుళం పెళ్ళయి అత్తవారింటికి వెడిపోయింది. ఆ పిల్లకీ నాకూ మధ్య యేవిధమైన బాకీలు లేవు. అలిమేలు డాక్టరీ చదవడానికి విశాఖపట్నం వెడిపోయింది. మూడేళ్ళతరువాత నేను కాలానుసరణంగా దేశం నాలుగు మూలలా పరిభ్రమించేను. యుద్ధవిమానాల గోల చల్లారేకా నేనా కనుబొమలపై నెంబ్రేకలవంటి ప్రభుత్వోద్యోగంలో పడ్డాను.

ఆపతంజలి శాస్త్రి ఆ వేళయింటికోసం అర్జీ పట్టుకు వచ్చేడు. తరవాత కొన్నాళ్లకి వొకనాడు నా గదిలో కూచుని యేదో వ్రాసుకుంటూంటేగా— మా యింటిగలవారు పెళ్లిలో వంటనిమిత్తం వొక బ్రాహ్మడితో మాట్లాడుతున్నారు అతడు లాడూ పూసకడతానని, వుండెలు చెయ్యానని, వంటలుచేస్తానని, వడ్డించనని యేవో షరతులు చెపుతున్నాడు— నేను తలుపు కొంచెం తీసిచూసేను. ఆ పతంజలి శాస్త్రి!

మరికొన్నాళ్ళకు గాజద్దాల తలుపులుండే బండీ తోసుకుని, పకోడీ, కారపుపూసా అమ్ముకునే వొక బ్రాహ్మడిని చూసేను—ఆ పతంజలి శాస్త్రి!

ఇంకొక సందర్భంలో వొక బ్రాహ్మడిని అడిగేను, 'ఫలానా' మనిషిగురించి తెలుసా అని. అతడన్నాడు—

'వాడి పూర్వ చరిత్ర యెవ్వరికీ తెలిసినట్టు లేదు బాబూ! ఇక్కడివాళ్ళకు తెలిసినంతవరకూ వాడొక భ్రష్టుడు. ఎక్కడినుంచో వొక హీనకులజని తేవదీసుకు వచ్చేడు. పెండ్లిభార్య పిల్లలను, సుమారుగా విడిచిపెట్టినట్టే. ఆకులంలేని దానింట్లోనే వుంటాడు. దానివండేటే తింటాడు—వాహకత్వానికి చాల్నని వూరుకున్నాం మేమంతా'

'ఆ ఆడదాని పేరు తెలుసా ?'

అతడు పొడుంపీల్చబోయి, ఆగి 'ఎవరైతేనేం బాబూ, చెడిపె, అంటారు, దాని పేరు 'పైడి' అన్నాడు.

---

విజ్ఞానవిశేషాలు :

# నాళరహిత గ్రంథులు

(Ductless Glands)



శ్రీ బి. వి. వి. యస్. మూర్తి

శరీరము, పెరుగు సరిగా పని చెయ్యాలంటే వాటికి సంబంధించిన వివిధ మండలాలు ఒక దానికొకటి సరిగా అనుస్యూతమై వుండాలి. ఉదాహరణకి మానవ శరీరానికి పెరుగుదల పది, పదిహేను సంవత్సరాల వయస్సుల మధ్యనే జరుగుతుంది. ఆ తరువాత జ్ఞానేంద్రియముల అభివృద్ధితో పాటు శరీరపు పెరుగుదలకూడ తగ్గుట మొదలిడుతుంది.

ఈ పై రెండు పనులు అనగా జ్ఞానేంద్రియముల పెరుగుదల వడిగా సాగి పెరుగుదల తగ్గిపోవుట గాని లేక పెరుగుటగాని హెచ్చి జ్ఞానేంద్రియముల అభివృద్ధిని నిరోధించుటముగాని అసమానంగా జరుగకుండా మన శరీరములో నాళరహిత గ్రంథుల సమ్మేళనముతో 'ఎండో క్రైన్' మండలము తయారయినది.

మానవులు, జంతువులు టెలిఫోనులా పనిచేసే నాడీ మండలము వలననే అంత పొందికగా జీవింప గలుగుతున్నారు. అలాగే శరీరములో రక్త ప్రవాహము రెండో వార్తావాహినిలా పనిచేస్తోంది. రక్త నాళికలు పట్టణములో కాల్వల మల్లే శరీరములో మూలమూలకు ప్రవహిస్తున్నాయి. ప్రకృతి మితవ్యయి. అందుచేతనే అంత చాకచక్యముగా రెండు పనులను నిర్వర్తింపజేస్తుంది. రక్తముద్వార వార్తలను శరీర భాగాలకంపిచేస్తూ నాడీ మండలానికి సహాయకారిగా పనిచేస్తోంది. ఈ పంపబడిన వార్తలు రసాయన పదార్థములు. ఏ ఏ పనులను నియమింపబడ్డాయో ఆయా స్నాయువులపై వివిధ అంగాలమీద పనిచేసి వాని పనులను నిర్వర్తిస్తాయి. వీనినే "హార్మోన్సు" అన్నారు.

తమ స్రావములను నాళములద్వార ఓ ప్రత్యేక ఇంద్రియముల లోనికి ప్రవహింప చేయుటకు బదులు ఏకంగా రక్తములో పోయుటయే వీని విచిత్ర లక్షణము. ఈ కారణమువల్లనే వీనికి నాళరహిత గ్రంథులని పేరువచ్చినది.

వీనిలో ముఖ్యమైనవి "థైరాయిడ్" "పేరా థైరాయిడ్సు" "ఎడ్రినల్సు" "ఐలెట్సు అఫ్ లేంగ్రహాన్సు" "పిట్యుటరి" గోనాడ్సు అనునవి.

"థైరాయిడ్" అనబడు నాళరహిత గ్రంథికోడి గ్రుడ్డు ఆకారములో నుండును. దీనిబరువు ఇంచుమించు ఒక ఔన్సు కంఠమణికి ఇరువైపుల చెరొకటి వుంటాయి

"పేరా థైరాయిడ్"—ఇవి నాలుగు బఠాణీ గింజలమల్లే వుంటాయి. ఇవి థైరాయిడ్ చుట్టుపట్లా వుంటాయి.

ఎడ్రినల్స్—ఇవి మూత్రపిండములకు కొంచెము పైగా నున్న చిన్న గ్రంథులు. వీని బరువు థైరాయిడ్‌లో 1/7 వంతు వుంటుంది.

వృక్కకము చుట్టునున్న నాళరహిత గ్రంథులనే "ఐలెట్సు అఫ్ లేంగ్రహాన్సు" అంటారు.

వీనిలో ఏఒక దాని స్రావకమైన "హార్మోను" అనే పదార్థాన్ని కలిగుంటుంది. ఇంద్రియాన్ని ప్రేరేపించుటము దీనిపని.

నాళరహిత గ్రంథ మండలమును గూర్చి యిప్పుడిప్పుడే పరిశోధనా ఫలితాలు గోచరిస్తున్నాయి. అనవసర గ్రంథులను శరీరమునుండి తీసివేస్తే అనుకోని ఫలితాలేర్పడ్డాయి. పూర్తిగా గండమాలని కుదర్చడానికని థైరాయిడ్‌ని పూర్తిగా తీసేస్తే క్రమంగా ఆ వ్యక్తి బోడిగాను, మందముగాను, గేదె చర్మము గలవాడిగాను, కుండ పొట్టతోను, తయారయేడు. అయోడిన్, థైరాయిడ్ ఎక్స్‌ట్రాక్టు తనుమాత్రంగా యిచ్చినట్లయిన మళ్లీ మామూలుగా తయారయేడు. దీనినిబట్టి యీ నాళరహిత గ్రంథియొక్క ప్రాముఖ్యత తెలియుచున్నది.

'థైరాక్సిన్' మానవుని ఆరోగ్యాభివృద్ధికెంతో ముఖ్యమని తెలియుచున్నవి. న్యూజిలండ్ స్విట్జర్లండు మొదలగు దేశములలోని భూములలో 'అయోడిను' పాలు తక్కువగా ఉండుటబట్టి 'గండమాల' అనే రోగము విస్తారము. ఈ కొరతను తీర్చడానికై ఉప్పులో అయోడిను కలిపి వుపయోగిస్తున్నారు స్విట్జర్లండులో.

థైరాయిడ్ హెచ్చుగా పనిచేయుట మూలముగా పిండి పదార్థములు మండుట అతి త్వరగా జరుగును. దానివలన ఆ మనిషి యొక్క బరువు హెచ్చిపోయి ఆ గ్రంథిఅలసటచే ప్రాణహాని సంభవించును.

థైరాయిడ్ శస్త్రచికిత్స సమయములో అకస్మాత్తుగా కాని పేరా థైరాయిడ్ గ్రంథిని తీసివేయుటజరిగిస్తే, 5 లేక 6 సంవత్సరముల లోపువాత రోగికి 'Titanus' నుట్టుపు వాతమునకు గురిఅయి చనిపోతాడు. అప్పుడు—రక్తమును పరిశీలించగా 'కాల్సియము' అను పదార్థము దానిలో తక్కువయిపోవుటవలన నుట్టుపు వాతము బయలుదేరినది ఋజువైనది.

'ఎడ్రినల్' మన శరీరములో చెయ్యవలసిన విధులు చాల వున్నాయి. అందు మొదటిది రక్తపుపోటునుచక్క బెట్టుట. దీనివలన శరీరానికి 'గ్లూకోజ్' అనే పదార్థమును సరిగా అందిచ్చుట, ఆకలి కలిగించుట, జాత్య వృద్ధికి తోడ్పడుట జరుగుతాయి. 'ఎడ్రినల్' గ్రంథిలో తయారయిన హార్మోనే 'ఎడ్రినలిన్.' ఇది కేశనాళికలపై చర్యవల్ల రక్తపు పోటుని క్రమపరుస్తుంది. వానిని కుదించుకు నేటట్లు చేస్తుంది. దీనివల్ల శరీరోష్టమును క్రమ పరుస్తుందన్న మాట. ఎడ్రినలిన్ కారిజములోని 'గ్లైకోజ్' అనే పదార్థముపై చర్యలవల్ల 'గ్లైకోజన్' 'గ్లూకోజ్' క్రింద మార్చబడును. 'ఎడ్రినలిన్' ఎక్స్‌ట్రాక్టును మామూలు మనిషిలోనికి పంపిస్తే ఆకలి చనిపోతుంది.

ఇవి జాత్యభివృద్ధి కెంతవరకు తోడ్పడతాయో ఇంకా ఇప్పటిదాకా నియమింప బడలేదు. కాని అవి పిట్యూటరీ పనితో వీనికి సంబంధము ఉందని శాస్త్రజ్ఞుల ఆలోచన.

వెలేట్సు ఆఫ్ లాంగ్రహాన్సు తయారు చేసిన ఇనిస్సులీన్ అనే పదార్థాన్ని కారిజములో తయారైన గ్లూకోజన్ ఎడ్రినల్ గ్రంథుల ప్రోత్సాహముతో స్నాయువులు తీసుకొంటాయి. పరిపక్వముతో యీ 'ఇన్సులిన్' తక్కువగా వుండుంటే వారు 'గ్లూకోజ్'ని ఉపయోగించుకోలేరు. అందు మూలంగా రక్తములో 'షుగర్' భాగము ఎక్కువైపోయి అతిమూత్రవ్యాధి (*Diabeter Mellitus*) సంభవిస్తుంది. స్నాయువులు గ్లూకోజ్ లేని మూలముగా తేరుకొన లేక పోషణ తక్కువయి సరిగ్గా పని చేయవు. రోజురోజుకు రోగి బలహీనుడౌతాడు. 'ఇన్సులిన్'ని శాస్త్ర పరిశోధనలద్వారా కనిపెట్టడం మూలముగా అతిమూత్రవ్యాధిని 'ఇన్‌జెక్షన్స్' ద్వారా కుదర్చుటకు తేలికయింది.

పిట్యూటరీ రెండు భాగములు. ఒక్కొక్కటి మూడు ప్రత్యేక కార్యములను నిర్వర్తిసాయి. వెనుక భాగము మూత్రపిండములను క్రమపరచి నీర్యాశయముకు అందించేలా చేసి రక్తోగ్రతల్లో కొంచెం ప్రవహిస్తుంది. ఎదటిభాగము పెరుగుటను క్రమపరచడము, జాత్యభివృద్ధిని పోషించడము, పాల తయారీకను మాత్రంగాను ప్రోత్సాహిస్తుంది. ఈ స్రావాన్ని థైరాక్సిన్‌తో పోల్చినప్పటికిని ఇది ప్రోటీన్ లాంటి పదార్థమై యుంటుందన్నారు. పిట్యూటరీ ఎదరుభాగమును క్రమ పరచుటలో చాల సహాయము చేస్తుంది. ఇది కాని సరిగ్గా పనిచేయని యెడల మరుగుజ్జుత్వము, శిశుత్వము (*Infantilem*) (అంటే బాల్యంగాలభివృద్ధిలేనివిగా నుండుట) సంభవించును. ఎక్కువగా కనక పనిచేస్తే యవ్వనము రాత్రు సత్వములోనికి దారి తీస్తుంది.

*Case*—11 సంవత్సరముల బాలుడు 250 పౌనుల బరువు, 9 అడుగుల పొడవు ఉన్నాడు. మరుగుజ్జత్వానికి నిదర్శనంగా 9½ సం॥ ల బాలిక 35½ అం. ల పొడవు 27½ పౌ॥ ల బరువు కలిగివుంది.

ఇది హెచ్చు లేక తగ్గగా పని చేసినయెడల జాత్యభివృద్ధికి నిరోధకము కలుగుతుంది. ఈడొచ్చిన తదుపరి దీనిలోని ముందు భాగము ఎక్కువగా పని చేస్తుంది. దీన్ని *acromegaly* అంటారు. అటువంటప్పుడు అభివృద్ధి కవకాశం వున్న భాగాలు అనగా చేతులు, కాళ్ళు, ముఖం ముఖ్యంగా గడ్డము ముక్కు ఇలాంటివి ఘోరంగా పెరిగి మృదుత్వం పోయి ఓవిధమైన గరుకుతనం యేర్పడుతుంది.

పిట్యూటరి ఎదటి భాగములో '*Harmone*' కాని చాలీచాలకుండా స్రవిస్తే ఓ విధమైన అస్థూలత్వము ఏర్పడుతుంది. ఈ విషయము *Pickwick-papers*' లోని కుంభకర్ణునిద్వారా అర్థం చేసుకొన వచ్చును.

దీని మిగతా కార్యాలు థైరాయిడ్ మీద, ఎడ్రినల్ మీద, గోనాడ్స్ మీద పనిచేస్తూండడం ఇంచుమించు దీనిపని వెడల్పుగానూ సరళంగానూ వున్న సంబంధంలాంటిది; ఎండోక్రైన్ మండలంలో అతి ముఖ్యమైనది.

గోనాడ్స్ (ఓవరీస్, టెస్టిస్) ద్వితీయ లాక్షణికాల అభివృద్ధిలో సహాయపడడం దీని పని. స్త్రీలో "ఈస్ట్రిన్" అనే హార్మోన్ బుతు కార్యాన్ని ఓవ్యులేషన్ని క్రమపరుస్తుంది. పక్వమైన "ఓవమ్" fertilise అయింతర్వాత విసర్జించిన 'గ్రాఫియన్ ఫాలికల్' 'కార్పస్ ల్యూటియమ్' క్రింద పెరుగుతుంది. ఇదిప్పుడు 'ల్యూటిన్' అనే హార్మోన్ను తయారుచేసి, 'మెన్స్ట్రుయేషన్నీ' ఓవ్యులేషన్నీ అధికం కాకుండా చేస్తుంది. అంటే ముట్టు అవకుండా చేస్తుంది. పాలగ్రంథుల్ని బలపరిచి ఇవి పాల తయారీనికూడా ప్రోత్సహిస్తుంది. గర్భవతులలో అలాంటి హార్మోన్లే పిట్యూటరీ ఎడటి భాగంలో స్రవించే 'ఈస్ట్రిన్'లాంటి హార్మోన్లూ, "ఈస్ట్రిన్" యీ రెండూ స్త్రీ మూత్రంలో విసర్జింపబడతాయి. దీనినిబట్టి స్త్రీలు గర్భవతులో కాదో నిర్ణయించబడుతుంది. ఇదొక్కటే [illegible] నిశ్చయమైన పరీక్ష, మిగతావన్నీ అనుమానాలే.

ప్రాబల్యం Influence : నాళరహితగ్రంథుల హార్మోన్స్ శరీరంమీద ప్రాబల్యత కలిగినవగుటచే వ్యక్తియొక్క స్వభావం (Temperament) మీద కూడా వీని ప్రాబల్యత కనిపిస్తుంది. ఉదాహరణంగా థైరాయిడ్ కొంచెం ఎక్కువగా పనిచేస్తే చురుకుదనం, తక్కువగా పనిచేస్తే మందత్వం ప్రబలతాయి.

ఒకప్పుడు 'Vornaffs' అనే ఆయన 'గ్లాండ్స్'ని మారుస్తే ముసలితనం పోతుందన్నాడు. కాని ఈ రోజు నా పద్ధతి అనుమానాస్పదంగావుంది. శస్త్రచికిత్స తాత్కాలిక ఫలితాన్నిచ్చింది. కాని శాశ్వతఫలితాన్నియ్యలేదు. అనేక విధాలుగా అనేకమంది విషయములో పనిచేసెరు. 'Steinachs' అనే ఆయన అనేక విధాలుగా శస్త్రచికిత్స చేసి పరిశోధించగా 'వార్నఫ్స్' చికిత్స ఫలితాలే కనిపిస్తే 'ఎండోక్రైనాలజీ'లో పెద్ద జ్యోతి వెలిగించినట్లు అనుకున్నారు మానవ సృష్టిలో.

ఎండోక్రైన్ హార్మోన్ గుణాన్ని యీ క్రింది విధంగా పరిశీలించాలి.

1. ఏ గ్రంథయితే హార్మోన్ని తయారు చేస్తున్నదో దాన్ని జంతువునించి తీసేసి, గుణాల్ని పరిశీలించాలి.

2. మామూలు జంతువుకి 'హార్మోన్' యిచ్చి చూడాలి. (అప్పుడా జంతువులో యిది ఎక్కువుంటుంది)

3. అప్పుడా గ్రంథియొక్క రోగలక్షణాల్ని పరిశీలించాలి. 'థైరాయిడ్'ని యీ విధంగానే పరిశీలించేరు. తలకప్ప (Tadpole) లో 'థైరాయిడ్'ని తీసేస్తే అది పెద్ద కప్పక్రింద తయారవలేక పోయింది. మళ్లా 'థైరాయిడ్ ఎక్స్ట్రాక్ట్స్'ని కాని అది నివసించే నీటికి కలిపితే అది తిరిగి కప్పక్రింద పెరగడం ఆరంభించింది. మామూలు తలకప్పవుండే నీటికి అధికంగా కాని 'థైరాయిడ్ ఎక్స్ట్రాక్టు' కలిపితే అది చెప్పలేనంత పెద్ద కప్పగా తయారయింది. ఈ ప్రయోగాల్ని బట్టి థైరాయిడ్ యొక్క గుణగణాల్ని మానవుల్లో కూడా తెలుసుకున్నారు.

అప్పుడప్పుడు పిల్లలీ థైరాయిడ్ గ్లాండు లేకుండాగాని, పనిచేయనిదిగా కాని పుట్టుంటారు. వీళ్ళని 'Cretins' అంటారు. పిల్లలు పుట్టిన ఆరుమాసములవరకూ శరీరం ఆరోగ్యంగానే అభివృద్ధి చెందుతూన్నట్టు కనిపిస్తారు. కాని తరువాత వాళ్ళలో యీ 'క్రెటినిజమ్' వృద్ధిచెందుతుంది. ఇది అలా 6, 7 నెల్లదాక రాకపోవటానికిగల కారణం విశదంగా లేదు. ఆ పిల్లపుట్టక పూర్వము తల్లి రక్తప్రవాహంలోని థైరాయిడ్నీ, తరవాత తల్లిపాల ద్వారా తీసుకొన్నదీ ఆ పిల్లలో 6 నెలల దాకా 'క్రెటినిజమ్' రాకుండా కారణాలై యుండవచ్చు. థైరాయిడ్ కొరత సాధారణంగా పిల్లల మొదటిసంవత్సరపు కొసభాగంలో ఛాయలు చూపుతుంది అప్పుడు కాని సరైనవైద్యం లేకపోతే, ఆజీవికి శారీరకంగానూ మానసికంగానూ అభివృద్ధి చెప్పరానిదిగా అడ్డేస్తుంది. అలాంటివాడు బొద్దుగా, మందంగా, నీరసంగా తయారవుతాడు. వాని కండరముల ఎముకల్ని వాని క్రమస్థానముల్లో ఉండనీయక పోవుటచే వంగిపోయి అనాకారంగా తయారవుతాయి వాడి నాలిక వాడి నోరుకి చాలనంత అయి ముందు కొచ్చేస్తుంది. పంది ముక్కులా తయారవుతుంది. వాడి కేశాలు తక్కువై పోయి ముట్టుకుంటే పోతూన్నట్టుంటాయి. కను రెప్పలు పెద్దవిగా ఉబ్బుతాయి, భుజాలమీద ముద్ద ముద్దలా క్రొవ్వు పెరుగుతుంది. శరీరంమీద చర్మము ఎండిపోయి గరుకుగా ఉంటుంది.

ఇంగ్లండులో ప్రస్తుతం ఈ 'క్రెటినజమ్' చాలా తక్కువ. డాక్టర్లు, పిల్లలే ఏమాత్రం మానసికంగానూ, భౌతికంగానూ బలహీనంగా కనిపిస్తే 'థైరాయిడ్ Extract ఇచ్చేసి క్రెటినిజమ్' రాకుండా కాపాడుతున్నారు.

పెద్దవారిలో యీ గ్రంథి పనిచేయుట మానేస్తే 'మిక్సోడెమా' అనే వ్యాధి వస్తుంది. మందంగానూ, మానసికంగానూ వృద్ధిలేని వాడుగనూ, చర్మము వాడిపోవడం, బోడితల, భుజాలమీద ముద్ద, ముద్దలాంటివి క్రొవ్వు పెరిగి, అసహ్యంగా కళ్ళచుట్టూ ఉబ్బడం, దీని లక్షణాలు. దీన్ని థైరాయిడ్ *Extract* ఇచ్చి పోగొట్టవచ్చును అలా ఇస్తేమళ్లా మనిషి మామూలుగా తయారవుతాడు.

థైరాక్సిన్ ముఖ్యమైన హార్మోన్. ఇది మామూలుగా పెరుగుటకేకాక, మానసిక, జాతి కాభివృద్ధికి మూలవిరాట్టు. అయిడను (*Iodine*) దీనిలో విస్తారంగా వుంటుంది. కొన్నిచోట్ల భూసారంలో ఇది తక్కువై 'గండమాల' అనే రోగం వస్తుంది. హిమాలయాల్లోనూ, ఆల్ప్సుపర్వతాల్లోనూ ఇలా తక్కువై యుంటుంది. ఒక్కొక్కప్పుడు ఈ 'గ్లాండ్' పెద్దదై గుండెల దాకా వ్రేళ్లాడుతూ వుంటుంది అటువంటప్పుడు దీని పెరుగుదల కారణంగా పనిచేయుట మానివేయవచ్చును.

థైరాయిడ్ హెచ్చుగా పనిచేయడంవల్ల కలిగే ఫలితాలు వేరు. దీనివల్ల బాధపడే రోగుల కళ్లు కుతూహలంగా వుంటాయి. కారణం వాళ్ళ కనురెప్పలు ముడుచుకుపోయి కళ్ళే కనిపిస్తాయి. కోపం కొద్దిగా వచ్చినప్పటికి ధైర్యహీనంగా, చిరాకుగా *Excite* అయిపోతారు విస్తరించుకొన్న థైరాయిడ్ గ్లాండ్ వుంటే మెడమీద ఉబ్బుకాయ మొలవడం, గుండెలు వేగంగా కొట్టుకోవడం, మొదలయినవి బయలుదేరుతాయి. అలాంటప్పుడు హెచ్చుగ పనిచేసున్న ఆ థైరాయిడ్ *Extract* లో కొంతభాగం తీసేస్తే ఆ రోగాన్ని బాగుచేయొచ్చు—

పెరాథైరాయిడ్స్ కాని జంతువులోంచి తీసేస్తే దాని నాడీమండలం, కండరాలూ, హెచ్చుగా ప్రేరేపించబడి 'ఫిట్స్' వచ్చేయి. ఈ న్యూరో మస్క్యులర్ క్షోభ్యత (*Irritability*) అవస్థని *Tetany* అంటారు. పెరాథైరాయిడ్ హార్మోన్ లేకపోతే ఆ జంతువాట్టే కాలం బ్రతకదు.

వీని పని రక్తంలోని కాల్సియాన్ని బలపరచడం. పుర్రాళ్లలో ఒకొక్కప్పుడు *Tetany* రావచ్చు అప్పుడు పెరాథైరాయిడ్ గ్లాండ్ కాదు, వాళ్లలో రక్తము లేకపోవడమే కారణం. పై రెండు రోగాల్ని కాల్సియం *Inject* చేస్తే నయం చెయ్యవచ్చును.

పెరాథైరాయిడ్ హెచ్చుగా పని చేస్తే రక్తంలో కాల్సియం మామూలుకన్న ఎక్కువై ఎముకల్లో ప్రసవించి వాటిని మెత్తగా చేస్తాయి. వాళ్లకి కొంచెము దెబ్బతగిలితే ఎముకలు వంగిపోతాయ్ హెచ్చుగ పనిచేస్తున్నప్పుడు *Tumour* క్రింద వస్తాయ్. వాటినితీసివేస్తే మామూలుగా వుంటారు.

*Suprarenals* :— ఒకొక్క మూత్రపిండం మీద కుచ్చుటోపీలా వుంటాయ్. ఇవి ఒకొక్కటి రెండు భాగాలు పైభాగాన్ని కార్టెక్స్, మధ్య భాగాన్ని మెడ్యుల్లా అని అంటారు.

మెడ్యుల్లా ఎడ్రినలిన్ అనే (*Harmones*) హార్మోన్స్ తయారు చేస్తుంది. ఈ మెడ్యుల్లా (*Medulla*) నరముల్లోంచే జనించింది.

అలా కాకుండా కార్టెక్స్ *Embryonic cells* లో నుండి ఉత్పత్తి అయి *Glands* ని జనింప చేస్తుంది.

కార్టెక్స్ సంగతి ఇంకా పూర్తిగా తెలియలేదు. కాని అది ఒక జంతువునుండి తీసేస్తే ఆకలి పోవడం, శరీరపు బరువు పోవడం, నీరసించి ముడుచుకుపోవుట సంభవించింది. *cortex* ని నాశనం చేసే రోగం కాని మనిషిలో ప్రవేశిస్తే అతను పై లక్షణాలే చూపుతాడు. దీనికి సుప్రారీనల్ క్షయ కారణం. దీనినే *'Addisons disease'* అన్నారు. ఈ రోగం కుదర్చడానికి పరిశోధనలు చేసి *cortin* అనే హార్మోన్ కనిపెట్టేరు. ఇది యిస్తే రోగం కుదురుతుంది.

ద్వితీయ జాత్య ధర్మం గలిగిన ఈ *cortex* భాగం కాని పిల్లలలో హెచ్చుగా పని చేస్తే నాలుగేళ్ల కుర్రాడిలో జాత్యంగాలు వయసు మనిషిలో జాత్యాంగాలులా పెరుగుతాయ్. స్త్రీలలో హెచ్చుగా పనిచేస్తే పురుషుల్లా తయారవుతారు. మీసాలు, గెడ్డం, బొంగురు గొంతుక దీని లక్షణాలు ఈ మార్పు వాళ్ల తత్వాన్ని కూడా మార్చి పురుషుల్లా ప్రవర్తింప జేస్తుంది.

పిట్యూటరీ చాలా ముఖ్యమైనది. నాళరహిత గ్రంథుల్లో ఇది మెదడు కడుగు భాగమున దాని కొమ్మ కొకదానికి అంటుకొని చిన్న ఎముకల పెట్టెలో అమర్చబడి యుంటుంది. ఇది రెండు భాగములుగ వుండి వానిచే వేర్వేరు పనులు నిర్వర్తింప జేస్తుంది. దీన్ని గూర్చి తెలుసుకొన్న కొద్దీ దీని పనులు మన కాశ్చర్యాన్ని కలిగింప జేస్తాయ్. ఇది బటాణీ గింజ కన్నా చిన్నదైనా పెక్కు హార్మోనులను తయారు చేస్తుంది. తతిమా గ్రంథులను కంట్రోల్ చేసి అవి కొక్కల్లా సరిగా పనిచేసేటట్లు చూస్తుంది.

పిట్యూటరీని కనక శరీరంలోంచి తీసేస్తే జాత్య గ్రంథులు వృద్ధి చెందవు. మామూలు ఎలుకల్లోకి

# కలగూరగంప

## భారతీయ ప్రాచీన క్రీడలు

సంస్కృతి, సభ్యత, యీ రెండు శబ్దములు మిక్కిలి సంగ్రథితములు. ఇవి పరస్పరమును అభేద్య - అచ్ఛేద్య సంబంధము గలవి. సంస్కృతి ఆత్మ యనుచో సభ్యత శరీరము. సద్గుణములను ఆత్మలో ఆహిత మొనర్చుకొనుట సంస్కృతి. శరీరము అవయవములవలన ఆ సద్గుణములను అభివ్యక్తి జేయుటయే సభ్యత. మనముగాని మన పూర్వులుగాని *Polo, Tennis, Foot Ball, Cricket* మున్నగు క్రీడ లెరుగనే యెరుగరని కొందరి అభిప్రాయము. కాని అది సరి కాదు.

మన ప్రాచీనక్రీడలు నాల్గు విధములు. 1. ఆత్మమనోవినోదార్థమైనవి. 2. ప్రేక్షకజనుల ఆనందము కొఱకు. 3. స్వోత్కర్షప్రధానములు. 4. మిశ్రితములు.

కృత్రిమ వృషభ క్రీడ

బాలురు ఎద్దువలె బట్ట కప్పుకొని సింహమువలె చర్మము గప్పుకొని క్రీడింతురు. ఇందు పశుపక్షుల ధ్వనులుకూడా పలుకుదురు.

నిలయన క్రీడ

1. కొందరు బాలురు దాగియుందురు. కొందరు వారిని వెదకుదురు. కొందరు పిల్లలు దొంగలుగా కొందరు పోలీసులుగా ఆడెదరు.

2. బాలురు మూడు విధములుగా విభక్తులగుదురు. పశుపాలకుడు, పశుచోరుడు, మేషాయితుడు. మేష మయిన బాలకుని పశుచోరుడు ఎత్తుకొనిపోవును పశుపాలకుడు వాని నన్వేషించును. ఇది శ్రీకృష్ణుడు "వత్సహరణము"న ఆడియుండెనని భాగవతమున జెప్పబడెను.

మర్కటోత్సన క్రీడ

బాలకులు వానరులవలె చెట్లెక్కి అనేక వృక్షములపై ఎక్కుచు దూకుచు తిరుగుచు ఆడుకొనెదరు. భాగవతమున యీ ఆట కూడ పేర్కొనబడినది.

శిక్యాదిమోషణ క్రీడ

ఇందు బంతివంటి దానిని వాని కందకుండ ఇతరులవద్దకు విసరబడును. బంతి గలవాడు చూచుచు ఊరకుండును. ఆది తెలిసి తన వస్తువును కోరినప్పు డాతని కిచ్చివేయబడును.

అహమహమికాస్పర్ధ క్రీడ

దూరముగా నున్న బాలుని ఎవరు ముందుగా ముట్టుకొనెదరో యని పందెముతో ఆడుట.

భ్రామణ క్రీడ

ఒక బాలకు డింకొకని చేయి పట్టుకొని ఊపుచు లేక లేచుచు కూర్చుండు ఆట.

గర్తాదిలంఘన క్రీడ

ఎవ రెంతదూరము ఉరుకగలరో యను పరీక్ష.

బిల్వాది ప్రక్షేపణ క్రీడ

తీగ గాని బంతి గాని దారిలోనే తగిలి పుటమించునట్లు విసరుట.

అస్పృశ్యత్వ క్రీడ

ఒకని నొకడు ముట్టుకొన యత్నించగా రెండవ వాడు తప్పించుకొనుటకై ప్రయత్నించును.

నేత్రబంధ క్రీడ

1. వెనుకనుండి వచ్చి కనులు మూయగా వానిని గుర్తించుట

2. కనులు బట్టతో మూయబడినప్పుడు దాగియున్న బాలురను వెదకి పట్టుకొనుట.

3. కన్నులు బట్టతో మూయబడిన వానిని యితర బాలకులు వచ్చి స్పృశించుచుందురు. బద్ధనేత్రుడు వారలను బట్టుకొనుటకు బ్రయత్నించును.

స్యందాందోళికా క్రీడ

ఊగుచునే రెండువైపులా సుఖాన్నెక్కి ఒకరు నూగుచుపోవుచుండుట.

నృప క్రీడ

ఒకనిని రాజుగా నొకనిని మంత్రిగా చేసుకొని పను లొనర్చుట.

హరిణా క్రీడనకము

లేడివలె దుముకుచు ఒకరు రెండవవానికి ముందు పోవుటకు ప్రయత్నించుట.

వాహ్యవాహక క్రీడ

పరాజితుని భుజమెక్కి విహరించుట.

దేవ—దైత్య క్రీడ

కొందరు దేవతలై — కొందరు రాక్షసులై దుమ్ము ఎగురజిమ్ముచు నాడుదురు. శివాజీ అనుకొని వళ్లు—యవనులనగా పరాజితు లొనర్చినట్లుగా ఆడు కొందురు.

జల క్రీడ

1. చెట్లపై కెక్కి నీటిలోనికి దుముకుట ఒకరిపై నొకరు నీరు జిమ్ముట

2. కాళిదాసు, భారవి, మాఘుడు చెప్పినట్లు యీ ఆట స్త్రీ పురుషులలోగూడ గలదు.

కందుక క్రీడ

1. బంతి పైకెగురవేయగా రెండవవాడు దానిని పట్టుకొనును. అట్లు పట్టుకొనలేకపోయినచో నతడు మొదట బంతి విసరినవాని భుజమెక్కి మరల విసురును. అప్పుడు ఇతరులు బంతి క్రింద పడకుండనే పట్టుకొందురు.

2. ఈ ఆట బాలబాలిక లందరు నాడుదురు. భిత్తునిపై గాని నేలపై గాని బంతి కొట్టి అణచి పెట్టుట. ఇదే నేటి *Volley Ball* అందురు.

వనభోజన క్రీడ

అడవిలోని కేగి ఆడుట, అచ్చటనే వంటలు చేసుకొని భుజించుట. దీనినే నేడు *Picnic* అందురు.

రాసక్రీడ:—ఇసుక మైదానములలో శ్రీకృష్ణ లీలాను కరణము. ఉత్తర హిందూస్థానమున రామ లీల, ఇట్టిదే. గుజరాత్ దేశమున "గరబానృత్య" మించుమించుగ నిట్టిదే.

శాలిక్య క్రీడ:—ఇందు ఆడేవారలు మధించి పాత్రలలో వలె పాడుదురు. వాద్యములు ప్రయోగింతురు. ఇట్టి ఆట పురాణములలో గూడ వర్ణింపబడియున్నది.

నియుద్ధ క్రీడ:—గ్రుద్దులు గుద్దుచు లేక కుస్తీ దెబ్బలాడుచు ఆడుదురు. జరాసంధ భీముల మధ్య ఈ ఆటవలెనే జరిగెను.

నృత్య క్రీడ:—కొందరు నాట్యము చేయుదురు. కొందరు చప్పట్లు కొట్టుదురు. బాలబాలికలు కలిసి గాని విడివిడిగా గాని యీ ఆట ఆడుదురు.

అక్ష క్రీడ:—మహాభారత కథకు ఆధారభూతమైనది యీ ఆటయే. ఋగ్వేదములో దీనికి విశేషము చెప్పబడినది.

మృగఘాత క్రీడ:—వేట పేరుతో ముఖ్యముగ రాజులలో నిది ప్రసిద్ధమైనది.

పక్షి క్రీడ:—శ్యేనమువలె పక్షుల బట్టుట నేర్పబడెడి యాట.

మత్స్య క్రీడ:—నావలపై నెక్కి రాజ పుత్రులు చేపల బట్టుట నేర్పెడి ఆట.

చతురంగ క్రీడ:—నేటి చదరంగము జూదము వంటి ఆట.

సాలభంజికా క్రీడ:—కర్ర బొమ్మలతో లేక సుద్దలబొమ్మలతో ఆడెడి ఆట.

లతోద్వాహ క్రీడ:—చెట్టును తీగను పెంచి యీ రెండింటికి పెండ్లి చేసెడి ఆట. శకుంతల ఇట్లే చేయుచుండెడిది. తులసీబృందా వివాహము ధార్మిక కృత్యమని విశ్వాసము.

వీటా క్రీడ:—చిత్రసల్ల యను నొక ఆట. దీని వర్ణనము మహాభారతములో ఆదిపర్వమున గలదు.

కనక శృంగకోశ క్రీడ:—పిచకారీతో ఆడుట

వివాహ క్రీడ:—వరుడు వివాహమునకై వెడలిన తర్వాత స్త్రీలు—వర-వధూ వేషములలో ఆడుదురు.

హల్లీశ క్రీడ—ఒక బాలుడు ఒక బాలిక—బాలుడు బాలిక ఇట్లు కూర్చొని మండలాకారముగ తిరుగుచు ఆడెడి ఆట.

గానకూర్దన క్రీడ:—కొందరు పాడుచు కొందరు దుముకుచు నాడెదరు.

నౌకాక్రీడ:—నదీతీరనివాసులు నావలుస్వయముగ నడుపుచు నాడుదురు. ఇది కాశీపట్టణమున నిప్పటికిని జరుగుచున్నది.

జలక్రీడ:—జల మధ్యస్థులై భోజనాదులు గావించుట. దుర్యోధనుడు జలస్తంభ విద్య నేర్చియుండెనని మహాభారత పాఠకు లెరుగుదురు.

వనవిహార క్రీడ:—పూవు లేరుట, మాలలు కట్టుట, సామగ్రిలేనిచో భోజనము తయారుచేయుట. దీని రెండవ పేరు పుష్పాపచయ క్రీడ.

అమలక ముష్ట్యాది క్రీడ:—పిడికిలి బిగించి అడుగుట. చెప్పనిచో లేక తప్పు చెప్పినచో విజేత వానిని ముష్టిప్రహారముతో పరాజితునిగా జేయును.

దర్దురప్లావ క్రీడ:—మండూకమువలె దుముకుచుపోయెడి ఆట.

నాట్యక్రీడ:—నాటక మాడుట.

అలాత చక్రక్రీడ:—కొఱవి ఝళిపించి త్రిప్పుట. దానితో ఆకాశమున [illegible] అక్షరములు వ్రాయుట.

గదా క్రీడ:—కృత్రిమగదాయుద్ధముచేయుట. ఇట్లే ధనుఃక్రీడ మున్నగునవి.

అశోక పాదప్రహార క్రీడ:—ఒక చెట్టు నలంకరించి నీరు పోసి పెంచుట. నా చెప్పుదెబ్బలు తిని ఇది పెరిగెనదని చెప్పుచుందురు. దీనిని కాళిదాసు వర్ణించెను.

చిత్ర క్రీడ:—విరహావ్యవస్థలలో యక్షునివలె చిత్రములు వ్రాయుట. *Painting, Drawing.*

కావ్యవినోద క్రీడ:—ఇందు 'బిందుచ్యుతకము— మాత్రాచ్యుతకము— సమస్యాపూర్తి, ప్రహేళిక, ఖడ్గబంధము, పద్మబంధము మున్నగు కావ్యరీతులు వచ్చును. నేటి *Puzzles* కూడా ఇందు చేరును.

వాజివాహ్య క్రీడ:—అశ్వము లెక్కి బంతి యాడుట. గీతావళిలో తులసీదాసు దీనిని వర్ణించినాడు.

కరివాహ్య క్రీడ:—గజము లెక్కి బంతి యాడుట.

మృగవాహ్య క్రీడ :—లేడి-దుప్పుల రథముపై నెక్కి పరుగెత్తుచున్న వ్యక్తిని తాకుట.

గోప క్రీడ :—ఇది రాసక్రీడలోనిదే.

ఘటక్రీడ : నెత్తిపై ఎన్నో కుండలు ఉంచుకొని నడుచుట, నిప్పులపై నడచుట, గడలు తీసుకొని నడచుట. ఒక త్రాడుపై నడచుట. ఇవన్నియు ఘటక్రీడలే.

ఇవి ప్రాచీనభారతీయుల ఆటల కొందటి విధము సంక్షేపముగ చెప్పబడెను. (కళ్యాణ్)

శ్రీ తటపర్తి సూర్యనారాయణ.

---

## భారతీయాధ్యాత్మిక భావాలు పాశ్చాత్యుల నవలలు

19 వ శతాబ్దం అంతం వరకు పాశ్చాత్య ప్రపంచం భవిష్యత్తును గురించి ఉత్సాహంగా కలలుకంటూ ఉండేది. కాని ఇరవయ్యో శతాబ్ది ప్రారంభానికి పాశ్చాత్యులలో ఆ ఆశాభావం కాస్తా అనుమానంటి దారికి ప్రపంచధోరణి అంతా అయోమయంగా తయారయింది. పాశ్చాత్యుల కథా స్వరూపం తారుమారై, అనవసరమైన అత్యల్ప విషయాలకు ప్రాధాన్యం హెచ్చింది. పాశ్చాత్యాత్మలో పీటలు పాడైపోవటం వల్లనే కథలలో ఇలాంటి ఫలితాలు కలిగాయని ప్రొఫెసర్ టోయన్బీ అన్నారు.

ఇది ఇలాగ ఉండగా శాస్త్రవిజ్ఞానం అణుగర్భం భేదించి పరమాణుశక్తిని ప్రపంచం మీదికి వదిలిపెట్టింది. అయితే మానవునికి ప్రాకృతిక శక్తుల మీద వచ్చినంత అధికారం ఆత్మావగాహనలోను, ఆత్మనిగ్రహంలోను రాలేదు. యంత్రానికి వచ్చిన ప్రాధాన్యము, మానవుని అధఃపతనము, దీని మూలంగానే ప్రారంభమైనాయి. ఈ దృక్పథంలో జీవితోపకరణాల విషయంలో తీసుకున్నంత శ్రద్ధ, అభినివేశము లక్ష్యాల విషయంలో కనబడనే లేదు. ఇందుచేత స్పెంగ్లర్ అనే విజ్ఞానవేత్త చెప్పినట్లు ఈ యంత్రయుగము, ఆకాశాన్నంటే మహానగరాలు, మొదలైనవన్నీ తుత్తునియలై భస్మమై పోగలవేమో నన్న భయం కలగడానికి గట్టి అవకాశాలున్నాయి

నేటికాలపు పాశ్చాత్య వాఙ్మయంలో సందిగ్ధస్థితి, జీవితం అంతా ప్రయోజనరహితమైనదనే సమస్యాదృక్పథము బాగా ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఈ విషయాలన్నీ జేమ్స్ జాయిస్ తన రచనల్లో గొంతెత్తి ఉద్ఘోషించాడు. ఇతని రచనలలో సమాజంలో ఏర్పడిన అయోమయ పరిస్థితి, మానవాత్మాంతరాళాల్లో ప్రవేశించిన దుస్స్థితి విస్పష్టంగా ప్రతిఫలించాయి. ఇలాగే థామస్‌మాన్, మార్సెల్ ప్రౌస్ట్ అనే నవలా రచయితలు తమ రచనలలో నేటి నాగరికతలోని అధఃపతనాన్ని గురించీ, నీతినియమ రాహిత్యాన్ని గురించీ, విస్తృతంగా చిత్రించారు. ఈ ముగ్గురు నేటికాలపు పాశ్చాత్యవాఙ్మయంలో బయలుదేరిన ఉత్తమోత్తమ నవలా రచయితలు.

అపూర్వ భూతల స్వర్గాలను గురించి కలలుగనే నేటికాలపు నవలలో కొన్నింటిలో ఇలాంటి భావాలు మరీ బాగా స్పష్టంగా కనిపిస్తున్నాయి. అసలీరకపు నవలారచన ప్లేటో వ్రాసిన యుటోపియాతో ప్రారంభమైనది. ఈ రకం రచన నేటికాలంలో ఫిలిప్ ఆర్వెల్, ఆల్డస్ హక్స్లేల వరకు అవిరతంగా సాగుతూనే ఉన్నది. ఆర్వెల్ వ్రాసిన '1984' అనే వ్యంగ్య నవల చదువుతూంటే మనకు చాలా భయం వేస్తుంది. వీరిద్దరికీ మధ్య కాలంలో శక్తివంతులయిన రచయితలనేకులు ఈ జాతి రచనలెన్నో సాగించారు. సర్ థామస్ మోర్, ఫ్రాన్సిస్ బేకన్, శామ్యూయెల్ బట్లర్, విలియంమారిస్, ఎడ్వర్డ్ బెల్లామీ, హెచ్. జి. వెల్సు ప్రభృతులీ వర్గానికి చెందిన వారే. అయితే ఈ జాతి 'భూతల స్వర్గ' రచనల పరిణతి నిరూపించడం ఈ వ్యాస లక్ష్యం కాదు. ఈ జాతి రచనలలో పాతవాటికీ, కొత్తవాటికీ మధ్య బాగా తేడా కనిపిస్తున్నది. పాతవాటిలో మానవజాతి భవిష్యత్తు ఉత్సాహకరంగా ఉన్నట్లు కనిపిస్తుంది. కొత్తవాటిలో నైరాశ్యం తాండవమాడుతున్నది. ఇటీవల వ్రాసిన ఈ జాతి నవల ఒకటి చదివితే, అది భయపడిపోయిన మనిషి పెట్టిన ఒక పెద్ద గావు కేకలా ఉంది. 1887 లో వ్రాసిన బెల్లామీ నవలలో మానవజాతి విషయంలో ఇంకా కొంచెం ఆశావేశం కనిపిస్తుంది. అయితే రెండు ప్రపంచ యుద్ధాలకు మధ్య, హక్స్లే 'బ్రేవ్ న్యూ వరల్డ్' అనే నవలలో శాస్త్రవిజ్ఞానం భూతల స్వర్గం సృజించగలదనే అభిప్రాయాన్ని పట్టుకుని బాగా అవహేళన చేశాడు.

శాస్త్రవిజ్ఞానం సృజించే భూతల స్వర్గంలో కవిత్వము, సౌందర్యము క్రమక్రమంగా మాయమై పోతాయనీ, ప్రతీ విషయము ఒక యంత్రంలా భయంకరంగా సాగిపోతూ ఉంటుందనీ ఇతడీ నవలలో గట్టిగా అవ హేళన చేశాడు. ఆ తరవాత హక్స్లే వ్రాసిన 'ఏప్ అండ్ ఎసెన్స్' అనే నవల గాని, ఆర్వెల్ వ్రాసిన 1984 గాని చదివితే నైరాశ్యం ఇంకా బాగా పెచ్చు పెరిగిపోయినట్టు కనబడుతుంది. ఆర్వెల్ 1984 అనే నవలలో మనుష్యుల ఆలోచనలు కూడా పసికట్టి శిక్షించే పోలీసులుంటారనీ, పిల్లల మీద కూడా ప్రభుత్వం గూఢచారిదళం ఏర్పాటు చెయ్యగలదనీ అప్పటి ఆంగ్లదేశం ఒక పెద్ద నియంతృత్వం కిందపడి నలిగి గజగజవణికిపోతూ ఉంటుందనీ వ్రాశాడు.

ఇదంతా చూస్తే ప్రపంచంలో భవిష్యత్తు భయంకరంగా మారిపోగలదనే సూచన బాగా కని పిస్తున్నది. అయితే నీతి నియమశూన్యమయిన పరి స్థితుల్లో ప్రపంచం చాలా కాలం నిలబడలేదనీ, మాన వుడు తన భౌతిక ప్రపంచాన్వేషణలోనించి బయట పడి క్రమక్రమంగా ఆధ్యాత్మికాన్వేషణలో పడక తప్పదనీ ప్రస్తుత పరిస్థితులు ఋజువు చేస్తున్నాయి. ఆధ్యాత్మిక విజ్ఞానం ద్వారానే మానవుడు తన భౌతిక సమస్యలు సాధించవలసిన అవసరం కూడా నేడో రేపో రాక తప్పదని నేటి ప్రపంచ పరిస్థితి ఋజువు చేస్తున్నది.

ఇలాంటి పరిస్థితులలో ఈ విషమయిన భావా లపై తిరుగుబాటు బయలుదేరడం సహజమే. ప్రాచీన కాలంలో ప్రపంచం ఆధ్యాత్మిక విషయాలపై బాగా అభినివేశం కనబరిచింది. ఆటుపిమ్మట శాస్త్రీయపరిశోధన భౌతికవిషయాలవైపు బాగా ఆసక్తిచూపించడం ప్రారంభించింది. ఈ పైన మానవ మేధస్సు రెండు విషయాలు సమన్వయం చెయ్యడా నికి ప్రయత్నించవచ్చును. హెగెల్ తన తాత్త్విక దృక్పథంలో ప్రపంచ పురోగతి ఈ విధంగా ఉండ గలదని సూచించాడు. అందుచేత మానవ మేధస్సిం కొక నూతన మార్గం వైపు తన దృష్టి మరలించగలదని మనం ఊహించవచ్చును.

ఈ విషయంలో ముందుగా పేర్కొనదగిన వాడు బెర్నార్డ్ షా. ఇతడు ఒకానొక దివ్యభావ ప్రేరితమైన ప్రకృతి క్రమంగా దివ్యత్వంవైపు పురోగమిస్తున్నదని తన నాటకాల్లో వ్యంగ్యంగా సూచించాడు. ఇతని 'బాక్ టు మెథూసెలా, మేజర్ బార్బరా, మాన్ అండ్ సూపర్‌మాన్' అనే నాట కాలు దీనికి ఉదాహరణంగా ఇవ్వవచ్చును. వెల్స్ కూడా ఈ వర్గానికి చెందినవాడే. ఆధ్యాత్మికతకు ప్రాధాన్యం ఇవ్వకపోయినా క్రమక్రమంగా ప్రపంచం అభివృద్ధివైపు పురోగమిస్తున్నదని ఇతని 'ఔట్‌లైన్ ఆఫ్ హిస్టరీ' మొదలయిన గ్రంథాలనుబట్టి గ్రహింపవచ్చును. ఇతడు విజ్ఞానమే మానవవిముక్తి సాధనమని విశ్వసించే రచయిత.

ఇటు తరవాత పరిగణింప దగినవాడు ఆల్డస్ హక్స్లే. ఇతడు విశాల మానవత్వానికి వ్యతిరిక్త మయిన మానవప్రవృత్తి చివరికి మానవత్వానికే బాధాకరంగా పరిణమింపగలదని తన నవలా వ్యక్తుల ద్వారా సూచించాడు.

ఇ. ఎమ్. ఫార్‌స్టర్ తన నవలలలో మానవవ్యక్తి త్వానికి ప్రాధాన్యం ఇచ్చి గౌరవించాడు. ఈ విధంగా పాశ్చాత్య వాఙ్మయంలో క్రమక్రమంగా

ఆధ్యాత్మిక దృక్పథానికి ప్రాధాన్యం ఎక్కువైంది. అందుచేత కొంతమంది రచయితలు ప్రాచ్యాధ్యాత్మిక విజ్ఞానంపై శ్రద్ధను వృద్ధి చేసుకోవటం ప్రారంభించారు.

ఈ విధంగా ప్రాచ్యాధ్యాత్మిక విజ్ఞానంవైపు తిరిగి చూచిన ఇద్దరు పాశ్చాత్య రచయితల నిక్కడ పేర్కొంటున్నాను.

ఆల్డస్ హక్స్లే ఈ విషయంలో ప్రప్రథమంగా పేర్కొనదగిన రచయిత. ఇతనిలో ఈ కాలపు వాఙ్మయ ధోరణి స్వభావం ఎక్కువగా ప్రతిఫలిస్తున్నది. ఇతనిలో కవిహృదయము, విజ్ఞానవేత్త మేధ చక్కని సమ్మేళనం పొందాయి. ఈ యుగంలో హృదయము, మేధ రెండు పరస్పరాధిపత్యంకోసం పోట్లాడుకుంటున్నాయి. అందుచేత ఇతడీ విషయంలో సమన్వయం ప్రదర్శించడానికి అన్ని విధాలా అర్హుడైన రచయిత.

ఇతను 1921 లో మొట్టమొదటగా 'క్రోమ్ ఎల్లో' అనే నవల ప్రచురించాడు. ఆ తర్వాత 1945 లో 'టైమ్ మస్ట్ హావ్ ఎ స్టాప్.' అనే నవల ప్రచురించాడు. ఈ మధ్య కాలంలో వ్రాసిన నవలలన్నిటిలోను ఇతను అనేకమైన శాస్త్రీయ దృక్పథాలను గురించీ ఆధ్యాత్మిక దృక్పథాలను గురించీ చర్చించాడు.

ఇతని మొట్టమొదటి నవలలో కథానాయకుడు హక్స్లే వంటివాడేమో ననిపిస్తుంది. ఇతడు తోటివారందరు ప్రేమ గోలాలకై ఖుషీగా కాలక్షేపం చేస్తుండగా తాను దైవాన్ని గురించి తర్కిస్తూ కూర్చోటం తగిన పనేనా అనే భావంలో పడతాడు. హక్స్లే ఈ పుస్తకం వ్రాసిన 24 ఏళ్ల తరవాత టైమ్ మస్ట్ హావ్ ఎ స్టాప్ అనే నవలలో తన అభిప్రాయాలన్నీ స్పష్టంగా వివరించాడు. ఇందులో పరమేశ్వరునిపై శ్రద్ధ కుదిరితే తప్ప వ్యక్తి సమాజ సమస్యలు సాధింపబడజాలవని చక్కగా నిరూపించాడు.

ఈ తరవాత ఇతని రచనలలో పేర్కొనదగినవి 'ఎండ్స్ అండ్ మీన్స్' 'ఐలెస్ ఇన్ గాజా' అనే రెండు నవలలు. వీటిలో ఇతడు ప్రాచ్యమహర్షుల ఆధ్యాత్మిక భావాలు విపులంగా వివరించాడు. ఈ నవలలో కాలప్రవాహం మిథ్య అనీ, మన దైనందిన ప్రత్యేకాత్మలను ఆత్మధ్యానం ద్వారా పరమాత్మలో విలీనం చెయ్యడంవల్లనే కాల సమస్య సాధింపబడగలదనీ నిరూపించాడు. హైందవవేదాంతంలో అనాసక్తియోగం ముఖ్యమైనది. హక్స్లే రచనలలో ఈ అనాసక్తియోగాభిప్రాయాలు బాగాలు, ప్రకాశించాయి.

ఈ అనాసక్తిని గురించిన చర్చ ఇతడు వ్రాసిన 'పెరిన్నియల్ ఫిలాసఫీ' 'ఆఫ్టర్ మెనీ ఎ సమ్మర్' 'గ్రే ఎమినెన్స్' అనే గ్రంథాలలో బాగా ఎక్కువగా కనిపిస్తుంది.

ఈ సందర్భంలో సోమర్‌సెట్ మాఘమ్ కూడా ప్రధానంగా పేర్కొనదగినవాడే. ఇతడు అసంఖ్యాకంగా నవలలు నాటకాలు కథలు రచించాడు. అయితే ఇతని రచనలలో ప్రస్తుతం మనం పేర్కొనదగిన ముఖ్య రచన 'రేజర్స్ ఎడ్జ్'. ఇది 1944 లో ప్రకటింపబడినది. ఇంతకు పూర్వం 1938 లో మాఘమ్ భారతదేశం వచ్చి ఈ దేశం అంతా తిరిగాడు. ఇక్కడి యోగులను, మహాత్ములను అనేక మందిని దర్శించాడు. భారతీయాధ్యాత్మిక దృక్పథం బాగా అవగాహన చేసుకున్నాడు. ఇందులో కథానాయకుడు లారెన్స్ డారెల్. ఇతని జీవిత వృత్తాంతమే ఈ నవలలో కథావస్తువు. ఈ కథానాయకుడు ఇంతకు పూర్వం జీవిత విషయంలో తనకు కలిగిన భావాలన్నీ విసర్జించి ఒక నూతన జీవిత దృక్పథం అవలంబిస్తాడు. చివరి కతడు వేదాంత దృక్పథం అవలంబించి, అనాసక్త భావంతో దైనందిన వ్యవహారాల్లో పాల్గొంటూ ఉంటాడు.

ఈ విధంగా ఆంగ్ల సాహిత్యవేత్తలనేకులు ఆధ్యాత్మిక దృక్పథం అవలంబించనిదే జీవిత పరమార్థం గ్రహించడం దుష్కరం అని గ్రహించి తమ రచనలలో ఈ దృక్పథం కనబరుస్తున్నారు.

మళ్లీ తిరిగి ప్రాచ్యాకాశరంగంలో నూతనాధ్యాత్మిక తారక ఉదయిస్తున్నది. అనేక మంది సాహిత్యవేత్తల హృదయ దర్పణాలలో ఈ తారకా కాంతులు తళతళ మెరుస్తున్నాయి.

డాక్టరు టి. రామారావు.

('1952 జనవరి త్రివేణి నుండి')



# విమర్శనము



## రాజగోపాల విలాసము

చెంగల్వరాయ కవి ప్రణీతము; తంజావూరు. సరస్వతీ మహలు గ్రంథశాల, తంజావూరు. వెల: మూడు రూపాయలు.

ఇది క్రీస్తుశకము 1633 లో పట్టాభిషిక్తుడైన విజయరాఘవ నాయకుని కంకితమైన అయిదాశ్వాసాల పద్యకావ్యము.

పీఠికలో సూచించినట్లిది విజయ విలాసం తర్వాత కొద్ది సంవత్సరాలలో రచింపబడిన కావ్యము.

తంజాపుర ఆంధ్రకావ్యాలలో విజయవిలాసం ఉత్తమోత్తమమని విమర్శకులందరు అంగీకరిస్తారు. అయితే ప్రస్తుతం తంజావూరు సరస్వతీ మహలువారు ప్రకటించిన రాజగోపాల విలాసం విజయవిలాసంతో తులతూగజాలిన ఉత్తమ కావ్యము. కొన్ని విషయాలలో కాళకవి చేమకూర వెంకటకవికంటె మిన్న అని అనవచ్చును.

చేమకూర వెంకటకవి, తన కావ్యంలో రసోత్పత్తికి సగం గాఢంగ శ్లేషలమీద ఎక్కువగా ఆధారపడతాడు. ఇతనిలో రసదృష్టి తక్కువ. కనకనే శబ్దరత్నాకరకారులు ఈ కవిని కవులలో చతుర్థకక్ష్యలో చేర్చినట్టు కనబడుతుంది. శబ్దరత్నాకరకారుల విమర్శకదృష్టిలో కొంత అతిశయోక్తి ఉన్నదనిపిస్తుంది. ఎంత తీసివేసినా తాత్కాలిక కవిత్వ దృక్పథాన్ని బట్టి పరిశీలిస్తే విజయవిలాసం ఆ కాలపు కావ్యాలలో ఉత్తమమైనదే అని అందరు అంగీకరిస్తారు.

కాళకవి కవితా దృక్పథం, వేరు. ఇతని కవిత రసప్రధానమయినది. ఎక్కడో సకృత్తుగా గాని శ్లేషలే కనబడవు. చేమకూరకవి కవిత్వం ఎక్కువగా శబ్దంలోని శ్లేషశక్తిద్వారా మనస్సుకు ఆహ్లాదం కలిగిస్తుంది. కాళకవి కవితలో శబ్దార్థాలు రెండు అప్రధానంగా ఉండి హాయిగా సహృదయులకు రసస్ఫూర్తి కలిగిస్తాయి. నిజానికి కేవల రసదృష్టితో చూచినప్పుడు కాళకవి చేమకూర కవికంటె గట్టివాడే. శ్రీకృష్ణుని అష్ట మహిషులలో ఉపన్యసించిన అష్టవిధ నాయికాభావాలు ఈ కవి చాలా హృద్యంగా వర్ణించాడు. ఒక్క కథా ఘటనలలోనే ఇతడు చేమకూర కవికంటె కొంచెం తగ్గినట్టు అనిపిస్తాడు.

జాంబవతి విప్రలబ్ధాభావం సూచించే పద్యాలు కొన్నిమాత్రమే ఇక్కడ ఉదాహరిస్తున్నాను. ఇవి కాళకవి సామాన్య కవితాస్థాయి మాత్రమే సూచిస్తాయి. ఇవి జాంబవతి తన చెలికత్తెతో పలికిన మాటలు.

"ఇంతా సంతతి నిక్కి
చిక్కటిపయిం జేర్చి చింతింప నీ
ప్రాంతారామనికుంజపుంజముల
ఛాయన్ నిల్చి వామాక్షి! నీ
కాంతున్ దెచ్చెదనంచు చెప్పదనుకన్
గాసింబడం జేసితే!
కాంతా! యాస్తలు సేయుమాటలకు
లోఁగాకుండు వా రెవ్వరే!
తగవులు తెగువలు బిగువులు
నగవులు పైపూతవల ఘనయానాంగులున్
మగువా! ఈ వగలెల్లను
మగవానికి జెల్లుగాక మగువకు దగునే!"

"తల్లడమేల నీ వరుస
దప్పనటంచు ననేక నాయికా
వల్లభుఁ డాడుమాట
నెరవంచన యంచు దలంచవైతివో
హల్లకపాణి! యీవికచ
హల్లక జాతపరాగ జాతముల్
చల్లని మేనిపై పెకలు చల్లఁగ
నేగతి తాళ నేర్తువే?"

"ఎన్నడు సమ్మతించునిక
నెన్నడు నన్ దయమీరజూచు నిం
కెన్నడు ప్రన్నెపెల్ల ఫలియించునో!
యంచుదలంచు నాథుఁడే
నన్నిటి చాకసేసినను
నాతిరో! యేగతి నోర్వవచ్చునే!"

ఈ విధంగా ఈ కావ్యంలోని నాలుగాశ్వాసాలలోను ఈ అష్టవిధ నాయికా శృంగార భావాలు కవి ఔచిత్యయుతమైన సుకుమార శయ్యలో నడిపించుకొని పోయినారు. ఒక పంచమాశ్వాసం మాత్రమే సంగ్రహ కథాత్మకంగా ఉండిపోయింది. ఈ కథాభాగాన్ని పూర్వాశ్వాసాలకు ఏదో విధంగా ఏకసూత్రత సంఘటింపవచ్చును. కాని కవి కేవల నాయికాత్మక ప్రపంచమైన ఈ ఆశ్వాసం పూర్వాశ్వాసాలలో సన్నివేశమాత్రం సముచితంగా లేదు.

కీర్తిశేషులు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారి పీఠిక వారి నిశిత చారిత్రకదృష్టికి తార్కాణంగా ఉన్నది.

ఈ కావ్యానికి చివర శ్రీ వెంకటరావుగారు బ్రహ్మాండపురాణాంతర్గతమైన సంస్కృత చంపకారణ్య మాహాత్మ్యం కూడా చేర్చారు. ఇది పాఠకులు రాజగోపాలవిలాసంలోని పంచమాశ్వాసంలోని చంపకారణ్య మాహాత్మ్యంతో పరిశీలించి చదవడానికి బాగా సహకరిస్తున్నది.

తంజావూరాంధ్రనాయకరాజుల ప్రధాన కావ్యంగా పరిగణింపదగిన రాజగోపాలవిలాసం పీఠికాదులతో ప్రశస్తంగా ప్రకటింపించిన మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యశాఖ, పీఠికాకర్తలు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు ప్రత్యేకంగా అభినందనీయులు.

రాజగోపాల విలాసం ప్రాచీనాంధ్ర కవితాభిమానులందరు తప్పక పఠించవలసిన కావ్యము.

## అమరుక కావ్యము

కావ్యతీర్థ, కవితావతంస, శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి, సాహితీ సమితి, తెనాలి.

అమరుక కావ్యాని కింతకుపూర్వం తెనుగులో అనేకానువాదాలు వెలిశాయి. అమరుకశతం సంస్కృత వాఙ్మయంలో ఉదాత్త ముక్తక సముచ్చయమనే గౌరవంపొందిన కావ్యము. ఆనంద వర్ధనుడు ధ్వన్యాలోకంలో 'అమరుక కవే రేకః శ్లోకః ప్రబంధ శతాయతే' అని దీని ప్రాశస్త్యం ఉగ్గడించాడు. అమరుకుని ఒక్క శ్లోకము ప్రబంధశతంతో సమానమని దీని తాత్పర్యము.

గట్టి లక్ష్మీనరసింహ శాస్త్రిగారి అనువాదం సంస్కృతపద ప్రచురంగా సాగిపోతుంది. ఒక్కొక పదం మూలార్థ వివరణంకోసం అధికంగా వాడటం కూడా అక్కడక్కడ కనిపిస్తుంది. వీరి అనువాదంలో ఒక్కొక్కచోట మూలంలోని సారళ్యము, ధారాశుద్ధి కనబడకపోతే కనబడకపోవచ్చును. కాని కవితలో అంతటా ప్రౌఢపద ప్రయోగము, ఉదాత్తత అనుస్యూతంగా జాలువారుతుంటాయి.

ఈ క్రింది అమరుక శతక శ్లోకము సంస్కృతాలంకార శాస్త్రంలో చాలా వాదోపవాదాలకు గురి అయింది. జగన్నాథ పండితరాయలు ఈ శ్లోకార్థ నిర్ణయంలో అప్పయ్య దీక్షితునిపై తన విమర్శన శరపరంపరలు శృంఖలా శృంఖలాలుగా ప్రయోగించాడు. పాఠకుల పరిశీలనార్థం ఇక్కడ మూలశ్లోకం అనువాదంతో కూడా ఉదాహరిస్తున్నాను.

"నిశ్శేషచ్యుత చందనం స్తనతటం
నిర్మృష్ట రాగోఽధరో
నేత్రే దూర మనంజనే పులకితా
తన్వీ తవేయం తనుః
మిథ్యావాదిని! దూతి! బాంధవజన
స్యాజ్ఞాత పీడాగమే
వాపీం స్నాతు మితో గతాసి!
నపున స్తస్యాధమస్యాంతికమ్."

దీని అనువాదం ఇది—

"కలపం బంతయు జారిపోయె
జనులం గన్నోయి నీలాంజనం
బల, వింబోష్ఠము మృష్టరాగము;
సరోమాంచయుక్తమే; నింతయుం
తెలియంబోవు సుహృద్వ్యథాగమము
దూతీ! పల్కేలా మృషల్
లలిస్నానార్థము బావికేగితి విటుల్
కాదా! శఠుం జేరగాన్."

ఈ క్రిందిపద్యము సరళము, స్వాదువు అయిన వీరి అనువాద శైలికి తార్కాణంగా తీసుకోవచ్చును.

"ఉరమున దారహారముల
నొప్పుగ దాల్చినావు; నాతి! బం
గరు మొలనూలిగజ్జియలు
గల్లన మ్రోగెడు; నూత్న రత్ననూ
పురముఖరంబు లంఘ్రుల లీలు
మ్రోతలతో ప్రియుగూడ నేగుచుం
బర పెదవేటికే దెసలపై
జకితేక్షణముల్ వసంకుతోన్."

అమరుక కవితాభిమానులందరు ఇది తప్పక పరిశీలింపవలసిన అనువాద కావ్యము.

## మీగడ తరకలు

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి. ప్రతులకు: వి. శంకరశాస్త్రి, ముక్త్యాల, కృష్ణాజిల్లా. వెల: 2-8-0.

ఇది కీర్తిశేషులు వేటూరు ప్రభాకరశాస్త్రి గారు రచించిన వేర్వేరు వ్యాససంపుటి. వీటిలో సాతవాహనులు, శివకవులు, పండితారాధ్య చరిత్రము, ప్రాచీనాంధ్ర వచన కావ్యములు, మొదలైన సారస్వత విషయాలపై శాస్త్రిగారు చేసిన నిశిత పరిశోధన లెన్నో ఉన్నాయి. వీటిలో సాతవాహనులు ఆంధ్రులే అన్న విషయం నిరూపించడానికి శ్రీ శాస్త్రిగారు కొన్ని ప్రబల ప్రమాణాలు పేర్కొన్నారు. అయితే ఇవి సాతవాహనులు ఆంధ్ర ప్రాంతంలో కూడా తమ పరిపాలన సాగించారనే విషయం నిరూపించగలవు గాని ఈ చక్రవర్తులాంధ్రులే అని నిర్ణయించడానికివి అంతగా సహాయకారులు కాజాలవు.

ఈ వ్యాస సంపుటి చివరభాగంలో భాషలకు సంబంధించిన రెండు వ్యాసా లున్నాయి. వీటిలో 'భాషాపరిణామము' వ్యావహారిక భాషా వాదానికి సంబంధించింది. దీనిలో శాస్త్రిగారు వ్యావహారిక భాషలో చూశాడు, చూసేడు మొదలైన ప్రయోగాలు ఎవరికి తోచినట్లు వారు వ్రాసుకుపోయినప్పుడు భాషకు ఒక దారి తెన్ను లేకుండా పోవచ్చునని తమ ఆందోళన సూచించారు.

అయితే వ్యావహారిక భాషావాదం శాస్త్రి గారు తలచినంత ఒక దారి తెన్నూ లేనిది కాదు. వ్యావహారిక భాషకు వ్యాకరణాది సంస్కారా లుండాలని వ్యావహారికవాదులూ అంగీకరిస్తారు. అయితే ఈ వ్యాకరణం శిష్టజన వ్యవహారా న్ననుసరించి మార్పు చెందాలనీ, వ్యావహారిక భాష శిష్టప్రయోగాలమీద ఆధారపడి ఉండాలనీ, ఆంగ్లాది భాషల వ్యాకరణాలన్నీ ఈ సంప్రదాయంమీదనే రచించారనీ, ఆ మార్గమే మనము అనుసరించాలనీ వ్యావహారిక వాదులంటారు.

బహుశః శాస్త్రిగారు ఈ వ్యాసం వ్యావహారికవాదం ప్రారంభమైన రోజులలో వ్రాసి ఉండవచ్చును.

శాస్త్రిగారి వ్యాసాలు ఆంధ్రభాషా పరిశోధకులకు అమూల్యమయినవి. ప్రభాకర పరిశోధక మండలి వారు శాస్త్రిగారి వ్యాసాలన్నీ పుస్తకరూపంలో ప్రచురించడం అత్యంతావశ్యకమయిన విషయం. ఇల్లాగే వీరు శాస్త్రిగారు వ్రాసిన వ్యాసాలన్నీ క్రమక్రమంగా పుస్తకరూపంలో ప్రచురింపగలరని ఆశిస్తున్నాము.

ఈ గ్రంథంలో సమకూర్చిన వ్యాసాలకు చివర వ్యాసం ప్రకటించిన పత్రిక, కాలము కూడా ఉదాహరిస్తే పాఠకుల కివి ఇంకా ఉపయోగకరంగా ఉండేవి.

---

## ప్రజ్ఞా ప్రభాకరము

వేటూరి ప్రభాకరశాస్త్రి, ప్రకాశకులు: యోగ మిత్రమండలి మద్రాసు, కాపీలకు: వి. శంకర శాస్త్రి, ముక్త్యాల, కృష్ణాజిల్లా. వెల లేదు.

ఇది శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ఆత్మకథ. ప్రభాకరశాస్త్రిగారి జీవితం రెండు విధాలుగా విభజింపవచ్చును. ఒకటి వారి నిరంతర వాఙ్మయ

పరిశోధన. రెండవది సహజంగా జీవితంలో అను స్యూతంగా వస్తున్న ఆధ్యాత్మికాన్వేషణ.

శాస్త్రిగారి వాఙ్మయపరిశోధన ఆంధ్ర సార స్వతాభిమానులందరికీ బాగా తెలిసినవిషయమే.

వారి ఆధ్యాత్మిక పరిణతిని గురించి వారికి అత్యంత సన్నిహితులైనవారి కొందరికో తప్ప ఇతరుల కంతగా తెలియదు.

ప్రస్తుతం ప్రభాకర పరిశోధకమండలివారు ప్రకటించిన ఈ చిన్నపుస్తకంలో శ్రీ శాస్త్రిగారు అత్యద్భుతమైన తమ ఆధ్యాత్మికానుభావా లెన్నో విపులంగా వివరించారు.

శాస్త్రిగారు చిరకాలం గడ్డవ్యాధులతో బాధపడుతూండేవారు. వారికి సి. వి. వి. అనే మహాత్ములతో పరిచయం కలిగిన ఉత్తరక్షణంనుంచీ అనారోగ్యం పటాపంచలై అనితర సాధ్యమైన దివ్యానుభవా లెన్నో కలగడం మొదలుపెట్టాయి. అప్పటినించీ వారి జీవితదృక్పథమే మారిపోవడం మొదలుపెట్టింది. తమ శక్తులతో వారు అనుదినము రోగపీడితులై బాధపడేవారి కందరకు సహాయపడి చికిత్స చేస్తూండేవారు. చివరి క్షణాలలోకూడా వారి తీవ్రమైన పరోపకార చింతతోనే ప్రాణ త్యాగం చేసినట్టు కనబడుతుంది.

దురదృష్టవశాతు శాస్త్రిగారు తలపెట్టిన స్వీయ చరిత్ర పూర్తికాకుండా వారు పరమపదించడం జరిగింది. అసంపూర్ణమైనా ఈ స్వీయచరిత్ర మన తెలుగు వాఙ్మయంలో బయలుదేరిన స్వీయచరిత్ర లలో ఉత్తమోత్తమ కక్ష్యలో చెప్పదగిన రచన. దీనిలో శాస్త్రిగారి గ్రాంథికరచన ఉదాత్త గంభీర శైలిలో సాగిపోతూ, అడుగడుగునా ఆర్ద్రతతో జాలువారుతూ ఉంటుంది.

శాస్త్రిగారు తమ సాహిత్య పంథాతో ఎదుర్కొన్న ఒడిదుడుకులను గూర్చి ఈ ప్రజ్ఞా ప్రభాకరలో అంతగా వివరంగా వ్రాయలేదు. 'సాహిత్య జీవనము—అరకుడుపు' అనే ప్రకరణంలో మాత్రమే వారు సాహిత్య పరిశోధనలలో తమకు, వీరేశలింగ కవికీ మధ్య బయలుదేరిన వాదోపవాదాలనుగూర్చీ, వాదాల పట్టుదల ఒక్కొక్కప్పుడు యధార్థ విషయాలకు అడ్డువచ్చిన సందర్భాలను గురించీ, తమ ఉద్యోగ పరిస్థితులనుగురించీ ముక్తసరిగా వ్రాసుకుపోయారు.

శాస్త్రిగారి జీవితచరిత్ర వారు రచించిన ఈ క్రిందిపద్యంలో చాలావరకు ప్రతిఫలిస్తున్నది.

"కవితాశిల్పము సల్పగా దొలుత.
వేడ్కల్ రేగ నాకుం, గృతుల్
చివురెత్తెన్; వెసమోము మొత్తె
నిక నాచే జెల్లవే కల్ల బొ
ల్లి వినోదంబు లివే జగాముగణముల్
చీదెల్ హూతంబార్చి, పు
ష్టుపు చెట్టన్ సఫలీకరించుకొని,
యంటుల్ గట్టితిన్ మాలినై."

ఇంతటి ఉత్తమ స్వీయచరిత్ర ప్రకటించిన ప్రభాకర పరిశోధకమండలివారు ఆంధ్ర వాఙ్మయాని కొనర్చిన సేవ అనూల్యమైనది.

---

## ప్రభాకర ప్రవచనములు

యోగమిత్రమండలి, తిరుపతి. వెల లేదు.

ఇవి ప్రభాకరశాస్త్రిగారు అప్పుడు చేసిన ఇష్టగోష్ఠి ప్రసంగాలసంపుటి. వారిపై శ్రద్ధాళువు లయిన శిష్యులు, అభిమానులు కొంతమంది ఆయా సందర్భాలలో వారు చేసిన ప్రసంగాలు సేకరించి ఇప్పుడీ పుస్తకరూపంలో వెలువరించారు.

ఈ ప్రసంగాలలో కూడా చాలా చోట్ల వారు అనుదినము చేసిన చికిత్సలు మొదలైన వాటినిగూర్చిన విశేషాలున్నాయి. నేటి వైద్యవిధానాలు అనుసరించే వారికి ఈ చికిత్సావిధానం చాలా ఆశ్చర్యకరంగా కనిపిస్తుంది.

శాస్త్రిగారికి కాళిదాస కవిత కంటె భవభూతి కవిత పై ఎక్కువగా అభిమానం ఉండేది. దీనికి గల కారణాలు, వారి సాహిత్య దృక్పథము, ఆధ్యాత్మిక దృక్పథము మొదలైనవి తెలిసికోగోరే వారందరికీ ఈ పుస్తకం బాగా ఉపయోగిస్తుంది.

యోగమిత్రమండలివారు ఈ ప్రసంగాలు మొదలైనవన్నీ కలిపి శాస్త్రిగారి సమగ్ర జీవితచరిత్ర ప్రచురిస్తే, అది ఇంతకంటె ఎక్కువగా శాస్త్రిగారి సర్వతోముఖ చరిత్రావగాహనకు సహాయకారి కాగలదని భావిస్తున్నాను.

---

## బుద్ధావతారము

[నాటకము]

విద్వాన్ బండ్ల సుబ్రహ్మణ్య కవి, వేటపాలెము, ఎమ్. ఎస్. ఎమ్. వెల : 1-12-0.

## మీగడ తరకలు

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి. ప్రతులకు: వి. శంకరశాస్త్రి, ముక్త్యాల, కృష్ణాజిల్లా. వెల: 2-8-0.

ఇది కీర్తిశేషులు వేటూరు ప్రభాకరశాస్త్రి గారు రచించిన వేర్వేరు వ్యాసాలసంపుటి. వీటిలో సాతవాహనులు, శివకవులు, పండితారాధ్య చరిత్రము, ప్రాచీనాంధ్ర వచన కావ్యములు, మొదలైన సారస్వత విషయాలపై శాస్త్రిగారు చేసిన నిశిత పరిశోధన లెన్నో ఉన్నాయి. వీటిలో సాతవాహనులు ఆంధ్రులే అన్న విషయం నిరూపించడానికి శ్రీ శాస్త్రిగారు కొన్ని ప్రబల ప్రమాణాలు పేర్కొన్నారు. అయితే ఇవి సాతవాహనులు ఆంధ్ర ప్రాంతంలో కూడా తమ పరిపాలన సాగించారనే విషయం నిరూపించగలవు గాని ఈ చక్రవర్తులాంధ్రులే అని నిర్ణయించడానికివి అంతగా సహాయకారులు కాజాలవు.

ఈ వ్యాస సంపుటి చివరభాగంలో భాషలకు సంబంధించిన రెండు వ్యాసాలున్నాయి. వీటిలో 'భాషాపరిణామము' వ్యావహారిక భాషా వాదానికి సంబంధించింది. దీనిలో శాస్త్రిగారు వ్యావహారిక భాషలో చూశాడు, చూసేడు మొదలైన ప్రయోగాలు ఎవరికి తోచినట్లు వారు వ్రాసుకుపోయినప్పుడు భాషకు ఒక దారి తెన్ను లేకుండా పోవచ్చునని తమ ఆందోళన సూచించారు.

అయితే వ్యావహారిక భాషావాదం శాస్త్రిగారు తలచినంత ఒక దారి తెన్నూ లేనిది కాదు. వ్యావహారిక భాషకు వ్యాకరణాది సంస్కారాలుండాలని వ్యావహారికవాదులూ అంగీకరిస్తారు. అయితే ఈ వ్యాకరణం శిష్టజన వ్యవహారాన్ననుసరించి మార్పు చెందాలనీ, వ్యావహారిక భాష శిష్టప్రయోగాలమీద ఆధారపడి ఉండాలనీ, ఆంగ్లాది భాషల వ్యాకరణాలన్నీ ఈ సంప్రదాయంమీదనే రచించారనీ, ఆ మార్గమే మనము అనుసరించాలనీ వ్యావహారిక వాదులంటారు.

బహుశః శాస్త్రిగారు ఈ వ్యాసం వ్యావహారికవాదం ప్రారంభమైన రోజులలో వ్రాసి ఉండవచ్చును.

శాస్త్రిగారి వ్యాసాలు ఆంధ్రభాషా పరిశోధకులకు అమూల్యమయినవి. ప్రభాకర పరిశోధక మండలి వారు శాస్త్రిగారి వ్యాసాలన్నీ పుస్తకరూపంలో ప్రచురించడం అత్యంతావశ్యకమయిన విషయం. ఇల్లాగే వీరు శాస్త్రిగారు వ్రాసిన వ్యాసాలన్నీ క్రమక్రమంగా పుస్తకరూపంలో ప్రచురింపగలరని ఆశిస్తున్నాము.

ఈ గ్రంథంలో సమకూర్చిన వ్యాసాలకు చివర వ్యాసం ప్రకటించిన పత్రిక, కాలము కూడా ఉదాహరిస్తే పాఠకులకివి ఇంకా ఉపయోగకరంగా ఉండేవి.

---

## ప్రజ్ఞా ప్రభాకరము

వేటూరి ప్రభాకరశాస్త్రి, ప్రకాశకులు: యోగ మిత్రమండలి మద్రాసు, కాపీలకు: వి. శంకరశాస్త్రి, ముక్త్యాల, కృష్ణాజిల్లా. వెల లేదు.

ఇది శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ఆత్మకథ. ప్రభాకరశాస్త్రి గారి జీవితం రెండు విధాలుగా విభజింపవచ్చును. ఒకటి వారి నిరంతర వాఙ్మయ

ఇది బుద్ధుని జీవితచరిత్ర కథావస్తువుగా తీసుకొని రచించిన 7 అంకాల నాటకము.

ఈ నాటకంలో రచయిత సాంప్రదాయికంగా అలంకార శాస్త్రంలో నిర్వచించిన నాటక లక్షణాలన్నీ యథాక్రమంగా అనుసరించారు. సంస్కృత నాటకాల్లో మాదిరిగా నేనిలోకూడా పాత్రోచితమైన సంభాషణలున్నాయి. అందుచేత సంస్కృత నాటకలక్షణం సోదాహరణంగా తెలిసికోదలచిన వారి కిది బాగా సహాయపడుతుంది.

పీఠికాకర్త లీ నాటకంలో కవి నేటికాలపు సమస్యలుకూడా చొప్పించారని సోదాహరణంగా నిరూపించారు. కాని ప్రాచీన చరిత్రాత్మకమైన ఇలాంటి రూపకంలో నేటికాలపు సమస్యలు ప్రవేశపెట్టడం అనౌచిత్యానికే దారితీస్తుంది కాని రసపుష్టి కలిగించదు.

ఈ కవి రచనలో నాటక రచనాశక్తి కంటె పద్యరచనాశక్తి కొంత మిన్నగా ఉన్నది. పద్యాలు సాంప్రదాయిక ధోరణిలో సాఫీగా నడిచిపోతుంటాయి. అపశబ్దాలుగాని, క్లిష్టాన్వయాలుగాని వీరి రచనలో కనబడవు. ఈ క్రింది పద్యాలను బట్టి వీరి కవితాధోరణి గ్రహించవచ్చును.

ఇవి వివాహానికి పూర్వం యశోధర సిద్ధార్థునితో అన్నమాటలు.

'పలుకు మొకింత నీ రుచిర
భావము లీనెడు పల్కుముత్యముల్
జలజలరాల, మత్ప్రణయ
సాగరగర్భ వినూత్న రత్నముల్
కలుపుచు వానితో గలిపి
గ్రుచ్చెద దండలు రెండు చక్కగా
నలరు నవీన దంపతుల
హారములై రసబంధురమ్ములై."

---

## సౌ భా గ్య

మదరాసుప్రభుత్వ స్త్రీ జనాభ్యుదయ శాఖా ప్రచురణ. వెల ఎనిమిది అణాలు.

స్త్రీ జనాభ్యుదయ శాఖవారు ప్రచురించిన ఈ సంచిక, శ్రీ జాషువ, తుమ్మలపల్లి సీతారామమూర్తి చౌదరి, వసంతరావు వెంకటరావు, నాయని కృష్ణ కుమారి మొదలయిన ప్రముఖ రచనలతోను, దాక్షిణాత్య దేవాలయ చిత్రాలతోను, ఇంకా ఇతర చిత్రాలతోను ఆకర్షకంగా ఉన్నది.

1952 జనవరితో ఈ పత్రిక ఎనిమిదో సంపుటం ప్రారంభమైనది.

ఇది మహిళ లందరు తప్పక చదవవలసిన సంచిక.

---

## సాముద్రిక విజ్ఞానము

తేళ్ళపల్లి వెంకటాచలపతి శర్మ. మునిసిపల్ ఆఫీసు, గవర్నరుపేట, విజయవాడ 2, వెల: 3 రూపాయలు.

ఇది స్త్రీల శరీర లక్షణాలనుబట్టి వారి అదృష్టాదులు, స్వభావము తెలియజేసే గ్రంథము. దీనిలో రచయిత సామాన్య శరీర లక్షణాలేకాక, ముహూర్త భాగానికి చెందిన విషయాలుకూడా కొన్ని చేర్చారు.

ప్రాచీన సాముద్రిక శాస్త్రవిషయాలు కావలసినవారికిది ఒక పరిచయగ్రంథంగా ఉపయోగిస్తుంది.

---

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

# నేడు మీరు మెక్లీన్స్‌తో పళ్లు తోముకున్నారా?




మీటూత్ బ్రష్ మీద మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్‌పేస్టును కొంచెం వేసుకుని పళ్లుతోముకొండి — అటుపైన మీనోరు అత్యంతస్మృతింగా ఎంత పరిమళవంతంగా ఉంటుందోచూడండి. దంతక్షయానికి మూలకారణమైన నోటిలోని ప్రమాదకరమైన ఆమ్లాలను మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్‌పేస్టు వెంటనే విరిచివేసి, అసహ్యకరమైన మరకలను తొలగించి, పళ్లను శుభ్రపరచడంతోపాటు మీశ్వాసను పరిమళభరిత మొనర్చుతుంది.

నోటి ఆరోగ్యం, తెల్లని ఆకర్షణీయమైన దంతాల నిమిత్తం నిత్యం—రోజుకు రెండుసార్లు—మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్‌పేస్టును ఉపయోగించండి. దీని పరిశుభ్రతకు హామీకలదు.

## నేడే మెక్లీన్స్‌ను కొనండి!




MTY-6 TEL.

ఇప్పుడు పెద్ద సైజులోనూ, మరిన్ని అధిక లాభకరమైన భారీసైజులోనూ దొరుకుచున్నది.

వ్యాపార వివరాలకు: జె.ఎల్ మోరిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) లిమిటెడ్. పో. బా. 6527, బొంబాయి 26; పో. బా. 387. కలకత్తా. పో. బా. 1370, మదరాసు.



# అతిథి సత్కారానికి అమోఘమైనది

హేమ:—ఏమిటి పిన్నీ, నిన్న మీ ఇంటికి వచ్చిన పెద్దమనిషిని కేవలం కుశల ప్రశ్నలు వేసి పంపించావు? కాస్త కూర్చో బెట్టి కొంచెం ఫలహారం గాని పానీయం గాని ఇవ్వ లేక పోయావా?

ప్రేమ:—వస్తువుల ధరలు ఇలా మండి పోతూంటే ఏం ఫలహారాలు పెట్టగలమమ్మా? పైగా అతడు ఓ గడియ కూర్చుందుకైనా టైము లేదంటూంటే ఏం పానీయం ఇవ్వగలను?

హేమ:—అదేమిటండీ, ఓగ్లాసుడు 'టీ' తయారు చేసి ఇవ్వ వచ్చునే... మీకు తెలుసు గదా—'టీ'...అతి చవకగా అతి త్వరగా శ్రమ లేకుండా తయారు చేయవచ్చునే!

ప్రేమ:—అవును నిజమే. సమయానికి తోచలేదు. ఎంత మంద బుద్ధి నాది! అతిథి సత్కారానికి నిజంగా 'టీ' అమోఘమైనది.

మంత్ర శక్తి నిచ్చే పానీయం

"టీ" త్రాగండి



సెంట్రల్ "టీ" బోర్డువారివల్ల ప్రచురింపబడినది.

CTB 7

# భారతి

[సచిత్ర మాసపత్రిక]

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రికా ముద్రాలయము
మదరాసు.

సంపుటము 29 ఏప్రెల్, 1952 సంచిక 4

విడిప్రతి వెల ఒకరూపాయి.

# త్వరలో వచ్చుచున్నది!




ఈ కథ 1547 వ సంవత్సరంలో ఇంగ్లండులో జరిగినట్టు వ్రాయబడింది. ఆ రోజుల్లో ఇంగ్లండు దేశంలో ప్రజలు ఎలా జీవించేవారో, వారి ఆచారవ్యవహారాలు, కష్టసుఖాలు ఎలాంటివో ఈ నవలద్వారా బాగా తెలుస్తాయి.

అనువాదం:

నండూరి రామమోహనరావు

**ఆంధ్రగ్రంథమాల,**

**మద్రాసు 1.**



# విషయానుక్రమణిక

## ఏప్రిల్ - 1952



త్రివర్ణ చిత్రము—పితృహృదయం (హిమవంతుడు-గౌరి) చిత్రకారుడు: మొక్కపాటి కృష్ణమూర్తిగారు



తెల్లగా
ఉతుకబడినవి
ప్రకాశవంతముగా
ఉతుకబడినవి





పితృహృదయం (హిమవంతుడు-గౌరి)

(శ్రీ) వెంకట్రావు పాలెం కృష్ణమూర్తి.

ఆరగింతువు గాక నోరూరు రుచులతో
నోల లాడెడి రాజనాల పంట
అనుభవింతువు గాక యమృత మాధురి మించఁ
జవులూరు కామధేనువుల పాఁడి
ఆనుచుందువుగాక నానాలతాపత్ర
సుమపరీమళ ఘుమం ఘుమల హాయి
విశ్రమింతువు గాక విమల గంగానదీ
సైకతస్థలములఁ జల్లగాలిఁ

గాంచెదవుగాక కన్నుల కఱవు దీరఁ
గ్రమ్మికొని మేలుఁ గూర్చుయోగముల మహిమ
కదలు మెదురౌనదే శుభగ్రహ మయంబు
నవకళాసదనంబు, 'నందన' వనంబు

కోమలమై, ఫలసస్య
శ్యామలమై, సత్యశాంత శమదమ గుణ సం
ధామంబై, 'నందన' వన
సీమ, సమస్త ప్రజేష్టసిద్ధుల నొసఁగుఁ



# ధరల తగ్గుదల



★

శ్రీ పి. యస్. ప్రకాశరావు

ఈ నెలనాళ్లలో తలవనితలంపుగా దేశమంతటా అన్ని వస్తువులకు (కొన్ని కంట్రోలు వస్తువులకు తప్ప) ధరలు పడిపోయాయి. కొండ విరిగి పడినంత తీవ్రంగా యీ ఒడుదుడుకు సంభవించడంచేత, మోతుబరి వ్యాపారులనేకమంది హతోస్మి అన్నారు. అనేక కోట్ల రూపాయల నష్టం సంభవించింది. జట్టీ, [illegible]కు వ్యాపారం, దాదాపు స్తంభించిపోయింది. బొంబయి కలకత్తా మొదలగు చోట్ల వెండి బంగారు మార్కెట్లు మొన్న మొన్నటివరకూ మూసివేయబడే ఉన్నాయి. మాట నమ్మకంమీద అప్పుసొప్పు తెచ్చి వ్యాపారం సాగించే పెద్దవర్తకులలో కొందరు ఆ అప్పు ఎగగొట్టారు. మరికొందరు వాయిదాపై సరుకు బేరంచేసి, వ్యాపారనీతికి విరుద్ధంగా ఆ సరకు కొనడం విరమించుకోవడమో, కొన్న సరకు డబ్బుయివ్వలేకపోవడమో జరిగింది.

ఈ విపరీత పరివర్తనకు మిగతా కారణాల సంగతి యెలా ఉన్నా, స్పెక్యులేటర్లే ప్రధాన కారణమనడం నిర్వివాదం. అంతర్జాతీయ రాజకీయ వాతావరణంలో వచ్చిన మార్పుగాని, వ్యాపార రంగంలో వచ్చిన మాంద్యంగాని లెక్కచేయకుండా, కొరియాయుద్ధం నాటినుండి, లాభాలు గడించడం మరిగి ఆ అలవాటు ప్రకారమే సరకుకొని నిల్వచేశారు. ఎంతకాలం ఓపికపట్టిచూచినా తాము కొన్న ధరకంటె యెక్కువ ధరకు అమ్ముకొనే దారి కన్పించలేదు. ఒక్కసారి గుప్పుమన్నది.

కించిత్తు దూరదృష్టితో వ్యవహరించి ఉంటే ధరలు అమాంతంగా గాక, మిగతా దేశాలలో మాదిరే క్రమేపీ తగ్గడానికి అవకాశముండేది. కొరియాయుద్ధంతో పెరగడం ప్రారంభమై 1951 ఏప్రిల్, మేనెలల్లో ఆకాశాన్నంటిన ధరలు 51 జూన్ నెలాఖరులో సోవియట్ రష్యా కొరియాయుద్ధవిరమణ ప్రతిపాదించిన క్షణంనుండీ కొంచెం తగ్గుముఖం చూపాయి. ఈ ప్రతిపాదన వచ్చిన మరునాటికే, వివిధ దేశాలలో యుద్ధావసరమైన ముడిసరుకుల ధరలు ఒక మెట్టు దిగాయి.

చైనాపై దాడిచేసి ప్రపంచయుద్ధం తెచ్చిపెడతాడనుకొన్న జనరల్ మెకార్థర్ బర్తరఫ్ కావడం, ఆ తరువాత కొరియాలో యుద్ధవిరమణ జరగడం, ఫాన్‌ముంజు ఆన్ సంధిసంప్రదింపులు ఫలిస్తాయని పదేపదే అమెరికన్ నాయకులు ప్రకటిస్తూండడం వీటన్నింటివల్ల కొరియాలో తిరిగియుద్ధం రాకపోవచ్చునని, అథవా వచ్చినా మునుపటంత భారీయెత్తున జరగదని ఒకవిధమైన నమ్మకం యేర్పడింది. కొరియాయుద్ధమూ, దాంతోపాటు, అంతర్జాతీయ ఉద్రిక్తత వెనుకపట్టడంతో, యుద్ధావసరాల నిమిత్తం అయినకాడికి తెగబడి సరుకులు కొనటం అమెరికా తగ్గించింది. ఆర్థిక చిక్కులవల్ల బ్రిటన్ గూడా అమెరికాను అనుసరించింది. పైపెచ్చు యీ ఉభయ దేశాలు, లోగడ తాము కొన్న ముడిసరుకులను, వస్తువులను, తిరిగి అమ్మివేయడం గూడా సాగించాయి. ఏ సరకైనా, ఎంత ధరైనా మిగతాదేశాలకు అందకుండా కొని నిల్వచేసే అమెరికా మార్కెట్ పోటీనుండి తప్పుకొనడంతో సరకులకు గిరాకీ తగ్గటం సహజం. దీనికితోడు ముఖ్యావసరమైన ముడిసరకుల ఉత్పత్తిగూడా హెచ్చింది. 1950 – 51 కంటె 51 – 52 లో రాగి 5%, ఇనుము ఉక్కు 10%, బొగ్గు 10% తుత్తునాగం 5% సహజంగా లభించే రబ్బరు 150 వేల టన్నులు, కృత్రిమపు రబ్బరు 3 లక్షల టన్నులు అధికంగా ఉత్పత్తి అయినాయి. అటు యూరప్‌లో ఫ్రాన్సు జర్మనీలు, యిటు దూరప్రాచ్యంలో జపాను పారిశ్రామిక దేశాలుగా తిరిగి తలయెత్తుతున్నాయి. కొరియాయుద్ధం మూలంగా బలపడిన జపాను ఉత్పత్తి, యించుమించు రెండవప్రపంచ యుద్ధాత్పూర్వపుస్థాయికి వచ్చింది. ఇలా ముడిసరుకుల సప్లై, పారిశ్రామిక వస్తూత్పత్తి పెరగటంవల్ల ఏ దేశానికాదేశం ఎగుమతి వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోవడానికి దిగుమతులను తగ్గించుకోవడానికి మొదలెట్టాయి.

అమెరికా బ్రిటన్‌లు సహా అనేక దేశాలు చీప్ మనీ పాలసీలకు స్వస్తిచెప్పి, బ్యాంకు రేట్లను పెంచటంతో, మార్కెట్లో పరపతి బిగిసిపోవడం, యూరప్ దేశాలలో వ్యాపార లావాదేవీల చెల్లింపు గడ్డుసమస్యగా తయారవడం యిత్యాదులన్నీ ధరల తగ్గుదలకు దోహదంచేశాయి.

1951 ద్వితీయార్థ భాగంనాటి ధరలకు 1952 ఫిబ్రవరి నాటి ధరలకు పోల్చిచూస్తే పత్తి ధర 21%

ఉన్ని 59% రబ్బరు 53% జనపనార 60% చొప్పున బాగా తగ్గిపోయినట్లు స్పష్టమౌతుంది. ఈ తగ్గుదల క్రమేపీ సంభవించిందన్న సంగతి గమనించాలి.

కాని మనదేశంలోమటుకు యిందుకు విరుద్ధంగా ఒక్కసారి అమాంతం పడిపోయాయి. ఈ పడిపోవడానికి పైన పేర్కొన్న అంతర్జాతీయ వ్యాపార పద్ధతులేగక, మన దేశపరిస్థితులు గూడ కారణం. ఇంతవరకు మనదేశంలో చీప్‌మనీ పాలసీ అమలులో ఉంది. తక్కువ వడ్డీకి బ్యాంకులు ఎంతకావలిస్తే అంతా రిజర్వుబ్యాంకువద్ద తెచ్చి, లేక ఎప్పుడుబడితే అప్పుడు ప్రభుత్వ ఋణపత్రాలు అమ్మి వ్యాపారానికి మదుపుపెట్టాయి. బ్యాంకులు విరివిగా అప్పులివ్వడంచేత తాహతుకుమించిన స్పెక్యులేషన్ దేశంలో తలయెత్తింది. ముడిసరకులలో మొనాపొలీ ఉన్నంతవరకూ అమెరికా భారీ కొనుగోలుదారుగా మార్కెట్లో నిలబడ్డంతవరకూ, యీ స్పెక్యులేషన్ నిరాఘాటంగా సాగింది అటు అంతర్జాతీయ వ్యాపారరంగంలో అమెరికా వెనక్కుతగ్గడము, యిటు రిజర్వుబ్యాంకు వడ్డీ రేటు పెంచి పరపతిని పరిమితం చేయడం స్పెక్యులేటర్లకు కొంత చిక్కు తెచ్చిపెట్టింది.

1951 నవంబరులో రిజర్వుబ్యాంకువడ్డీరేటును 3% నుంచి $3\frac{1}{2}$ %కు పెంచింది. అనవసరంగా విరివిగా దేశంలో డబ్బు లభించకుండా చేయడమే యిందలి ఉద్దేశ్యం. అవసరమైన వ్యాపారానికి మాత్రమే అప్పులిస్తు స్పెక్యులేషన్ తగ్గేట్లు చూడవలసిందని గూడా రిజర్వుబ్యాంకు షెడ్యూల్డుబ్యాంకులను ఆదేశించింది. షెడ్యూల్డుబ్యాంకులవద్దనున్న గవర్నమెంటు సెక్యూరిటీలను, యిదివరకులా కొనటం జరగదని గూడా రిజర్వుబ్యాంకు స్పష్టం చేసింది. ఇక రిజర్వుబ్యాంకువద్ద తెచ్చి, సరకుల హామీపైనైనా, వ్యాపారస్థులకు అప్పులు పెట్టడం షెడ్యూల్డు బ్యాంకులకు కష్టమైపోయింది. రిజర్వుబ్యాంకు రేటుతోపాటు బ్యాంకులు గూడా వడ్డీరేట్లు పెంచాయి. దీనికి తోడు, అమెరికా అప్పుగా యిచ్చిన 20 లక్షలగోధుమను అమ్మడంతో, మార్కెట్లో ఛలామణినుంచి సుమారు 70 కోట్ల రూపాయలు ప్రభుత్వ ఖజానా చేరాయి. ఈవిధంగా దేశంలో డబ్బుకు కిటకిట అయింది. అటు అంతర్జాతీయ వ్యాపారంలో మాంద్యమేర్పడడంచేత మన ఎగుమతి వ్యాపారం స్తంభించిపోయింది. ఇంతవరకు మనమొనాపొలీ అనుకొన్న ముడిసరకులలో గూడా విదేశీపోటీ తలయెత్తింది. కృత్రిమపునారతో వస్తువులు తయారవడము, నారసంచులకు బదులు కాగితపుసంచులు వాడుతుండడంవల్ల నారవస్తువులకు గిరాకీ తగ్గింది. నారవస్తువుల ఎగుమతిపై ప్రభుత్వం పన్ను తీసివేసినా యీ వ్యాపారం పుంజుకోలేదు. నారవస్తువులకు గిరాకీ తగ్గుటచేత, ముడినారకు ధర పడిపోయింది. పాకిస్థాన్‌లో నిరుడు మణుగు రూ 105లు అమ్మిననార యివాళ 43 రూపాయలకు యిస్తామన్నా కొనే దిక్కులేక మురిగిపోతున్నది.

చైనా అర్జంటైనా తూర్పుఆఫ్రికాల పోటీవల్ల, నూనెల ఎగుమతులపై అమెరికా నిర్బంధాలను తొలగించడంవల్ల, నూనెగింజల వ్యాపారం దెబ్బతిన్నది. అమెరికా ఈజిప్టు టర్కీ మెక్సికో మొదలైన దేశాలలో ప్రత్తి విస్తారంగా పండడమూలంగా, ప్రత్తిధర పడిపోయి బట్టల ఎగుమతివ్యాపారం వెనుకబట్టింది. ప్రత్తి విషయంలో మరో విచిత్రమేమంటే, యీ యేడు పాకిస్థాన్ నుండి ప్రత్తి వచ్చే అవకాశం కన్పించనందున ఎక్కువధరకు అమెరికా ప్రత్తికోసం మన మిల్లులు ఆర్డరిచ్చాయి. నిరుడు అడిగినదాంట్లో 5వ వంతు మాత్రమే దిగుమతి అవడంచేత యీ యేడు కొనవలసినదానికన్నా 5 రెట్లు ఆర్డరిచ్చాయి. ఆర్డరిచ్చినంతా దిగుమతి అయింది. ఫలితం ఏ రేవులో జూచినా ప్రత్తి మురిగిపోతున్నదట. ఎగుమతి వ్యాపారానికిలా దెబ్బ తగలడంతో యీ సరకులలో స్పెక్యులేషన్‌కు అలవాటుపడి అనాయాసంగా కోటీశ్వరులం కావచ్చుననే ఆశకొద్ది, అదివరకే కొని నిల్వచేసిఉంచినవారి స్థితి యిరుకున పడింది. కొత్తబడ్జెటులో ఎగుమతి పన్నుల భారమేమైనా తగ్గుతుందేమోనని ఆశించారు. కాని ఆ ఆశ నిరాశఅయింది. ఒకవైపు వ్యాపారం పడిపోవడం, మరోవైపు అప్పులు చెల్లించమని, లేదా యింకా ఎక్కువసరుకు హామీగా ఉంచమని బ్యాంకులు చేస్తున్న వత్తిడిచేయడం, కొత్తబడ్జెట్ ఆశ నిరాశ చేయడం వీటన్నింటికీ తట్టుకోలేక, తమవద్ద నిల్వ ఉన్న యావత్తు సరకును ఒక్కసారి అమ్మకానికి విడుదలచేసి తెగనమ్మజూచారు. కాని కొనేదిక్కు లేదు. ధరలు శరవేగంతో పడిపోసాగాయి. ఈ దుస్థితి మొదటగా నూనెగింజల వ్యాపారానికి సోకి, వెండి బంగారాలుసహా వివిధవ్యాపారరంగాలకు ప్రాకింది. వెండి బంగారాలు ధరలు తగ్గడానికి కారణం, అందులోను స్పెక్యులేషన్ విపరీతంగా ఉండడం, యీ దేశంలో ధర హెచ్చుగా ఉన్నందున విదేశాలనుండి దొంగతనంగా చాలా బంగారం (1951 సం॥లో 630 ఔన్సులు దిగుమతి యైందట) దిగుమతి అవడం. బంగారం ధరతోపాటు వెండిధర తగ్గింది. ఈ రెండింటి ధరలు పడిపోవడంతో, స్టాకులు షేర్లుపడిపోయాయి. దేశమంతటా పెద్ద కలవరం బయలుదేరింది. సహజకారణాలవల్ల కొన్నింటికి ధరలు పడిపోతే, కలవరంవల్ల మిగతావాటి ధరలు పడ్డాయి. స్పెక్యులేషన్‌లో పుట్టిన కలవరం

# దేశోద్ధారక వర్ధంతి



ఈ ఏప్రియల్ 6 వ తేదీకి (చైత్రశుద్ధ ద్వాదశి ఆదివారం) విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని. నాగేశ్వరరావుగారి వర్ధంతి ఆంధ్రదేశమంతటా జరుపబడింది. కళాప్రపూర్ణుని సాహిత్యోపాసనకు ప్రత్యక్ష ఫలితము "భారతి". ఆ తండ్రి దీవనలు నిత్యము భారతిని వృద్ధిపొందించుగాక!

సర్వత్రా వ్యాపించింది. ప్రతిచోటా కొనుగోలు లేక ఎక్కడి సరుకక్కడ స్తంభించిపోయింది. కొనుగోలు లేనందున ఆహారధాన్యాల ధరలు, గూడా బాగా పడిపోయాయి.

ఈ విధంగా విదేశీవ్యాపారమాంద్యం, మితిమీరిన స్పెక్యులేషన్, బ్యాంకువడ్డీరేటు పెరిగి పరపతి బిగిసిపోవడం అరిపోతున్నామనే కలవరం- ఇటువంటి సముష్టిప్రభావమే ధరల తగ్గుదలకు కారణం: దీనికిది కారణమని విడదీసి చెప్పడం కష్టం.

ధర లిలా తగ్గిపోతుండడం చూచి కొందరు ఆర్థికమాంద్యం వస్తుందని జోస్యం చెప్పారు.

1951 సంవత్సరం ప్రథమపాదం నాటికీ, యిప్పటికీ పోల్చిచూస్తే ధరలు బాగా తగ్గినమాట వాస్తవమే గాని, ఆ తగ్గుదల కొరియాయుద్ధాపూర్వపు స్థాయికి రాలేదన్న సంగతి గమనించాలి. స్పెక్యులేషన్ వ్యాపారులు విపరీతంగా పెంచిన ధరలు మాత్రం పడ్డాయన్నమాట. అదైనా హోల్ సేల్ స్థాయి సరకులకే గాని, చిల్లర వర్తకం సరకులకు తగ్గలేదు. ఈ ఒడుదుడుకులలో యేవో కొద్దిమంది వ్యాపారులు నష్టపడడం జరిగింది. కాని జనసామాన్యానికి లాభించింది అట్టే లేదు.

అంతర్జాతీయ పరిస్థితుల్లో మళ్లీ మార్పువచ్చినా అమెరికా తిరిగి సమరసామగ్రికొనడం ప్రారంభించినా, ఉత్తర అట్లాంటిక్ రాజ్యాల సన్నాహాలు తీవ్రతరమైనా మళ్ళీ స్పెక్యులేషన్ తలయెత్తడం, ధరలు పెరగడం తథ్యం. ఇప్పుడు లభించిన యీ అవకాశాన్ని వినియోగించుకొని, కొరియా యుద్ధాపూర్వపు స్థాయిలో ధరలను స్థిరీకరించడానికి ప్రభుత్వం గట్టిగా ప్రయత్నించాలి.

ఆహారం విషయం లోటు భర్తీచేసుకోవడానికి గాని పారిశ్రామికాభివృద్ధికి కావలసిన యంత్రసామగ్రి దిగుమతి చేసుకోవడానికి గాని, అనేకకోట్ల విదేశీద్రవ్యం అవసరం. ఇందుకు ఎగుమతి వ్యాపారం సౌష్ఠవంగా ఉండి యితర దేశాలలో పోటీకి నిలవగలగాలి. ఇప్పటికే, మనం తప్ప యింకెవరూ ఉత్పత్తి చేయలేరనుకొన్న ముడిసరకులకు ప్రత్యామ్నాయంగా కృత్రిమపు ముడిసరకులు తయారుచేస్తున్నారు. వెనకను నీలిమందు వ్యాపారం యిలాగే పాడైంది. వస్త్రాలవ్యాపారంలో గూడా జపాను పోటీ తీవ్రం కావటం తథ్యం.

విదేశాలలో మన సరకులు అమ్ముడుపోకపోవడానికి ప్రభుత్వం ఎగుమతిపన్నులు విధించడం, సకాలంలో ఆయా దేశాలకు ధారాళంగా కోటాలు నిర్ణయించకపోవడమూ అని వ్యాపారస్థులు అంటున్నారు. ఇందులో కొంత సత్యం ఉండడంచేతనే, యీమధ్య ప్రభుత్వం వేరుశెనగపై ఎగుమతిపన్ను రద్దుచేసింది. ఉన్నిపై పన్ను బాగా తగ్గించింది. ఎగుమతి వ్యాపారాన్ని పోషించుకోడానికి, అవసరమైతే, మిగతా ముడిసరుకులపై గూడా ఎగుమతిపన్ను రద్దు చేయనిచో పారిశ్రామికంగా బాగా అభివృద్ధిలోకి వచ్చేంతవరకూ యీ ముడిసరకులను మనం ఉపయోగించుకోలేక యితర దేశాల కొనుగోలుపై ఆధారపడి ఉండాల్సిందే గదా.

వ్యాపారరంగంలో వస్తువుల సప్లై—వాటి గిరాకీనిబట్టి ధరలు నిర్ణయం గాకుండా మార్కెటులో యావత్తు సరకూ ఒక్కసారిగా కొని ధరలు పెంచడం, ఒక్కసారిగా విడుదలచేసి ధరలు తగ్గించడం, యీ రకం స్పెక్యులేషన్— ప్రజలకు, మామూలు వర్తకులకు గూడా నష్టదాయకం. కాబట్టి దేశీయవ్యాపారంలో గాని, విదేశీవ్యాపారంలో గాని యీ స్పెక్యులేషన్ను నిషేధించడం మంచిది.

దేశంలో డిఫ్లేషనరీపరిస్థితులు పరిశ్రమాభివృద్ధికి దోహదం కావు. నిరుద్యోగం ప్రబలుతుంది. వ్యాపారం మందగిస్తుంది. కనుక స్పెక్యులేషన్ నిమిత్తం గాక, యథార్థ వ్యాపారావసరాలున్నవాళ్లకు సులభంగా పరపతి పుట్టేట్లు చేయాలి. ప్రధాని నెహ్రూ అన్నట్లు ఈ ధరల మాంద్యం ఉత్పత్తిపై దెబ్బదీయకుండా చూడాలి. ఉత్పత్తి దెబ్బతింటే నిరుద్యోగం ప్రబలుతుంది. సరసమైన ధరలకు సమాజంలో ఉన్నవారందరికీ సమానంగా వస్తువులు లభించేటట్లు చేయగలగాలంటే సరిపోయినంతగా ఉత్పత్తిచేయడం అవసరం. ఇందుకు ధరలలో తీవ్రమైన ఒడుదుడుకులు లేకుండా, ఒక స్థాయిలో నిలకడగా ఉండడం ఎంతైనా అవసరం.

---

# ప్రపంచ కథా బహూకృతి- 
# శ్రీ పాలగుమ్మి పద్మరాజు

ప్రపంచ కథానికలపోటీలో పాలగుమ్మి పద్మరాజుగారికి ద్వితీయ బహుమానం వచ్చిందని గత మార్చి 16 వ తేదీ ఆంధ్రపత్రికలో ప్రకటించిన వార్త ఆంధ్రజాతి కంతటికీ మహదానందం కలిగించింది. టాగూరు మహాకవి నోబెల్ బహుమానం అందుకున్న తరవాత మన దేశంలో వాఙ్మయంలో ఎవరికీ ఇంతటి బహూకృతీ, గౌరవమూ లభించలేదు. బహుముఖాలుగా నిరుత్సాహంగా ఉన్న వర్తమానాంధ్రదేశ చరిత్రలో ఈ బహూకృతి ఆంధ్రులందరు గర్వించదగిన విషయం.

అసలీ ప్రపంచ కథానికలపోటీ న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక తలపెట్టి నిర్వహించింది. భారతదేశం తరఫున హిందూస్థాన్ టైమ్సు సంపాదకులీ పోటీ జరిపారు. ఆంధ్రదేశం తరఫున ఆంధ్రపత్రికా సంపాదకులీ పోటీ నిర్వహించిన విషయం తెలుగువారందరికీ తెలిసినదే. ఆంధ్రపత్రికా సంపాదకు లేర్పరిచిన నిర్ణేతలు తెలుగు కథల్లో నాలుగు ఉత్తమమైనవని నిర్ణయించి ఈ నాలుగూ మొదట భారతకథలపోటీకి పంపించారు. మొట్టమొదట ఈ కథకులకు నలుగురికీ ఆంధ్రపత్రికా సంపాదకులు నూరేసి రూపాయల బహుమతు లేర్పరచారు. పద్మరాజుగారి గాలివాన మొదట ఈ గౌరవం అందుకున్నది. ఇలాగ భారతదేశంలో అన్ని రాష్ట్రాల వారూ అఖిలభారత కథలపోటీకి నాలుగేసి కథలు పంపించారు.

హిందూస్థాన్ టైమ్సు సంపాదకు లేర్పరిచిన నిర్ణేతలు భారతదేశ కథలన్నిటిలోను రెండు కథలు ఉత్తమోత్తమమైనవని నిర్ణయించి ఈ రెండు ప్రపంచ కథానికల పోటీకి పంపించారు. అఖిలభారత నిర్ణేతలీ రెండింటిలోను 'కళ్లు' అనే కథకు మొదటి బహుమతీ ఇచ్చారు. పద్మరాజుగారి గాలివానకు రెండవ బహుమతీ వచ్చింది. రెండవసారిగా పద్మరాజుగారి కథకు మళ్ళీ వెయ్యి రూపాయల బహుమానం వచ్చింది.

న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ జరిపిన ఈ పోటీలో 23 దేశాలు పాల్గొన్నాయి. ఆయా దేశాలలోని ప్రధాన ప్రచురణసంస్థలీ పోటీ నిర్వహించాయి. మొత్తం దీనికి 59 కథలు వచ్చాయి. ఈ పోటీలో పాల్గొన్న దేశాల అధిక సంఖ్యాక నిర్ణయం ప్రకారం ప్రథమ బహుమతీ నిర్ణయించాలనీ, ఆ నిర్ణయాన్ని అనుసరించి మొదటి బహుమానం 5 వేల డాలర్లు ఇవ్వాలనీ హెరాల్డ్ ట్రిబ్యూన్ నిర్ణయించింది. అసలీ పోటీ ఏర్పరిచినది అమెరికా దేశమే కనక అమెరికా కథకులెవరు దీనిలో పాల్గొనకూడదని హెరాల్డ్ ట్రిబ్యూన్ నిర్ణయించింది. ఇదీగాక ఏ దేశము తన కథకు వోటు వేసుకోకూడదని కూడా ఒక నిర్ణయం జరిగింది.

అయితే 1951 సంవత్సరాంతంలో జరిగిన ఈ పోటీనిబట్టి ఏ ఒక్క కథకు ఉత్తమబహుమతి రాలేదు. అందుచేత రెండేసి ఓట్లు వచ్చిన నాలుగు కథలకు ఈ బహుమతీ సమానంగా పంచారు. 'ఎందుకు' అన్న కథకు ఐర్లండ్ జర్మనీలు ఓట్లు వేశాయి. ఇండియా హాలెండులు 'అయిదవరోజు' అనే కథకు ఓట్లు వేశాయి. 'ప్రేమ నా చిన్ననాటి కలలు చీల్చి వేస్తుంది' అనే కథకు స్వీడన్ డెన్మార్కుల ఓట్లు వచ్చాయి. ఇజ్రాయెల్, గ్రీసులు 'నిద్రపోయే సంచీ' అనే కథకు ఓట్లు వేశాయి. ఇందుచేత ఈ కథలు నాలుగింటికీ 1050 డాలర్ల బహుమతీలు సమానంగా పంచారు. మిగిలినవి 14 కథలు. ఈ కథ లన్నింటికీ ఒక్కొక్క ఓటు వచ్చింది. పాలగుమ్మి పద్మరాజుగారి కథకు ఆస్ట్రియా ఓటు వేసింది. ఈపైన ఈ 14 కథలలోను మళ్ళీ ఉత్తమ కథ ఏదో నిర్ణయించవలసిందని మరి ఇద్దరు నిర్ణేతలను ఏర్పాటు చేశారు. మిగిలిన కథ లన్నింటిలోను పాలగుమ్మివారి 'గాలివాన' సర్వోత్తమంగా ఉన్నదని నిర్ణయించారు. అందుచేత మొత్తం 5 వేల డాలర్ల బహుమతిలోను మిగిలిన 8 వందల డాలర్లు పద్మరాజుగారికి బహూకరించడానికి నిర్ణయించారు.

ఈ నిర్ణయాన్ని గురించి పోటీనిర్వాహకులు ఒక ప్రకటనచేస్తూ 'గాలివాన' నిజంగా తీవ్ర

పరీక్షలో నిలబడి 14 దేశాల కథలలో ఉత్తమోత్తమ కథగా నిర్ణయింపబడినదనీ, పై నాలుగు కథలకు రెండేసి ఓట్లు రావడంవల్ల పద్మరాజుగారి కథకు ప్రథమ బహుమతి పంచడానికి వీలులేకపోయిందనీ కేవలం ప్రజాస్వామ్యసూత్రాలనుబట్టి మాత్రమే ఇలాగ నిర్ణయించవలసివచ్చిందనీ అన్నారు. ఈ విధంగా పద్మరాజు 'గాలివాన' జాతీయాంతర్జాతీయాలైన గాలివానలెన్నో గడిచి ప్రపంచ కథాభిమానుల హృదయాలు మారగొన్నది.

పాలగుమ్మి పద్మరాజుగారు

పాలగుమ్మి పద్మరాజుగారు ఆంధ్రపాఠకులకు చిరపరిచితులే. వీరి వయస్సు 36 సంవత్సరాలు. ఇప్పుడు వీరు భీమవరం కళాశాలలో కెమిస్ట్రీలెక్చరరుగా పనిచేస్తున్నారు. బెనారస్‌లో ఎమ్. ఎస్. సి. చదివారు. అటుతరువాత కొంతకాలం పిఠాపురం రాజా కళాశాలలో పనిచేశారు.

చాలాకాలంనించి వీరు కథలేగాక కవిత, నాటికలు, నవలలు, విమర్శలు మొదలైన ఎన్నో రచిస్తున్నారు. వీరి ఖండకావ్యాలు కొన్ని సుప్రసిద్ధ సారస్వత పత్రికలు ప్రకటించాయి. పురిటిపాట, రాని విమానం, చీకటిమొదలైనవి వీరికవితారచనల్లో ముఖ్యమైనవి. చక్కని నిజాయితీ, విస్పష్టత, వీరి కవితలో ప్రత్యేక గుణాలు. వీరి కవితా రచనచాలా స్వతంత్రమైన పంథాలో నడిచిపోతుంది. అధునాతన కవితామార్గంలో వీరిది ప్రత్యేక వ్యక్తిత్వం ఉన్న కవిత. చాలాకాలం కిందటే వీరు అరవిందుని '*Love and Death*' అనే కావ్యం కూడా అనువదించారు.

ఇంతకుపూర్వం వీరు ఆంధ్ర వారపత్రికలో టర్జినీవ్ వ్రాసిన ఫాదర్స్ అండ్ సన్స్ అనే నవల తెలుగులోకి అనువదించారు. ఇల్లాగే ఇంకా ఒకటి రెండు చిన్ననవలలు కూడా వీరు భాషాంతరీకరించారు. ఇంతకుపూర్వం వీరురచించిన కథలన్నీ 'కూలిజనం' అనే పేరుతో ఇంతకుపూర్వమే వెలువడ్డాయి.

ఒకసారి ఆలిండియా రేడియోవారు జరిపిన రేడియో నాటికల పోటీలో కూడా వీరికి బహుమతి వచ్చింది. ఈయన రచించిన నాటికలొకటి రెండు ప్రదర్శించారని కూడా తెలుస్తున్నది.

ఇలాగ వీరి రచన ఎక్కువగా బహుముఖాలుగా సాగినా నవలా, కథారచనలో వీరికి ఎక్కువ అభినివేశం ఉన్నట్టు కనబడుతుంది. పద్మరాజుగారు రచనలో ఎక్కువగా వాస్తవిక పద్ధతి అవలంబిస్తారు. వీరి రాజకీయదృక్పథం మానవతావాదం (*Hamanism*) వైపు బాగా మొగ్గుతుంది.

గా లి వా న

దేశీయ విదేశీయ విమర్శకుల మన్ననలందుకున్న వీరి కథనుగూర్చి వేరేప్రత్యేకంగా వ్రాయవలసినపనిలేదు. ఈకథపూర్వం ఆంధ్రపత్రికలోనే గాక ఇటీవల మార్చి 19 వ తేదీ ఆంధ్ర వారపత్రికలో కూడా పడింది. అందుచేత తెలుగు పాఠకులందరికీ ఈకథ సుపరిచితమైనదే.

ఈ కథలో రావు మనస్తత్వము ముష్టిెత్తుకునే మనిషి మనస్తత్వము పాఠకులకు చాలా సునిశితంగా ధ్వనిస్తాయి. రావు ఒక సూత్రబద్ధంగా నడిచిపోయే వ్యక్తి. గాలివానలో ఇతని సూత్రాలన్నీ పటాపంచలైపోతాయి. ఇలాంటప్పుడు ఇతనిలో మానవత్వం స్ఫుటంగా వికసిస్తుంది. కథముగిసేసరికి రావుతోబాటు పాఠకులను కూడా ముష్టెత్తుకుంటూ ఏక్షణానికాక్షణం జీవించే మనిషిమీదే ఎక్కువగా సానుభూతికలుగుతుంది. గాలివానతాకిడికి మానవులు మనస్సులలో కట్టిన్న బాహిరసూత్రాలు—తెగిపోయేవిధము కథ ప్రారంభంనుంచీ మనకువ్యంగ్యంగాస్ఫురిస్తూనే ఉంటుంది. ఈ కథలో శిల్పము, సంఘటన, ప్రధానభావము ఒకేమూసలో కరిగిపోసినట్లు చక్కని సమన్వయంతో నడిచిపోతూంటాయి.

నేటి తెలుగువాఙ్మయం ఏశాఖలోను తదితర భారత వాఙ్మయాలకు తీసిపోదనీ, కొన్నింటిలో ఇదే అగ్రస్థానం వహించగలదనీ బహు భాషావేత్తలైనకొందరు విమర్శకులంటున్నారు పద్మరాజు గారి కథ భారత భాషల్లోనే గాక ప్రపంచభాషల్లో కూడా తెలుగుభాషకు గౌరవం సంపాదించింది.

దరిదరిగా అర్ధశతాబ్దంనించి తెలుగులో వెలువడిన ఉత్తమకథలు కొన్ని ఆంగ్లభాషలోకీ భారతీయ భాషల్లోకి అనుసరించడంవల్లనే నేటి తెలుగు కథాస్వరూపం విదేశీయులకు స్పష్టంగా అవగాహనకాగల అవకాశాలున్నాయి. ఈ బహుమాకృతి ఇటువంటి ప్రయత్నానికి బాగా ప్రోత్సాహం కలిగించగలదని ఆశిస్తున్నాను.

పద్మరాజుగారింకా యువకులే. క్రమంగా వీరు ఆంధ్రులకు నోబెల్ బహుమాన గౌరవంకూడా సంపాదించగలరని ఆశిస్తున్నాను.

'శాస్త్రి'

# యజ్ఞఫలము

భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

(గత సంచిక తరువాయి)

### విష్కంభము !!!

(ముగ్గురు ఋషి శిష్యులు ప్రవేశింతురు)

మొదటి :

"బ్రహ్మఋషి యైన కౌశికు క్రతువు నేడె
పూర్తియైనది కామ్యసంపూర్ణముగను;
తత్ఫలంబుగ నిర్భయత్వంబుతోడ
మనుచునుంటిమి సత్తపోవనమునందు."

రెండవ : మిత్రమా! శాలంకాయనా! ఈ యజ్ఞ ఫలము శుభప్రదమే యైనది. నీ వన్నట్లిక నిర్భయముగా మనము తిరుగగలము.

శాలం : గాలవా! ఈ తపోవనమున మారీచుడు మున్నగు రాక్షసులు విశ్వామిత్రాదులను దక్క మనవంటివారి జోలికి రాకపోయినను మనకు మిక్కిలి భయముగా నుండెడిది.

మూడవ : విశ్వామిత్రాదులనే కాని యన్యులను వారేల పీడింపరైరి?

గాలవ : తామ్యాయనా! విశ్వామిత్రుడు పూర్వము క్షత్రియుడు. తపముచే బ్రాహ్మణత్వము నందెను. అప్పటినుండియు నాతడు చేయు తపమును వారు సహింపజాలరైరి.

తామ్యా : ఐనను, రాక్షసులు తపోవిఘ్నము కలిగింప గారణమేమో?

గాల : రాక్షసరాజైన రావణుడు విశ్వామిత్రుని తపోభంగమునకు వారిని నియమించియుండెను.

తామ్యా : రావణునకు విశ్వామిత్రునిపై గోపమేల?

గాల : విశ్వామిత్రుడు బ్రహ్మతేజమున బ్రకాశించుచున్నాడని.

తామ్యా : ఐన?

గాల : ఏనాటికైన విశ్వామిత్రునకు గోపము రప్పించినచో శమప్రధానమగు నాతని బ్రహ్మర్షిత్వము పొల్లుపోగలదని.

తామ్యా : ఆయన శాపముచే నీ రాక్షసుల నివారింప లేడేమి?

గాల : కోపించిన గాని శాపము రాదుకదా!

తామ్యా : ఎందఱో ఋషులు శపించినవారు గలరు. వారి బ్రహ్మర్షిత్వమునకు లోపము రాలేదే?

గాల : పరంపరాప్రాప్త బ్రహ్మర్షిత్వమున కపుడపుడిచ్చిన శాపముల వలన లోపము కలుగదు. ఇతని దచిరప్రాప్త బ్రహ్మర్షిత్వము కావున లోపము కలుగవచ్చును. అందుచే విశ్వామిత్రుడు రాముని గొని వచ్చినాడు.

తామ్యా : ఏమో! ఇంతటివాడే క్షత్రియకుమారుని సాయ మపేక్షించినాడన నాతని తపోమహత్త్వమునకు లోపము కాదా?

శాలం : కాదు కాదు. ఏలన!

"యజ్ఞసంరక్షణంబున కనెడుమిషను
రామచంద్రుని గొని తెచ్చి ప్రేమతోడ
దివ్యమగునస్త్రముల మంత్రదీపితముగ
నతని కుపదేశమిచ్చి కామ్యంబు గాంచె"

ఇక, రాముడో :

"హరిగమనాన, బాలరవి
యందపు మోమున, వాణియౌను వా
క్సరణిని, వార్ధికీడగు ప్ర
శస్తగభీరత మన్మథుండు సుం
దరత, నలంఘ్యతన్ దుహిన
ధాత్రిధరంబు, మహాపరాక్రమ
స్ఫురణ నతండు దేవపతి
పూర్ణపరాక్రమ గర్వజేతయౌ."

"ఇతడువచ్చినదాదిగా నీతపోవ
నమునొనర్చెను సుతపోధనుల్ సుఖగాఁగ;
కాంచగంటిమి కన్నులుగలఫలంబు
నితనిపుణ్యాకృతినిగాంచి యింపుమీఱ."

గాల: రాము లోకసామాన్య బలశాలి. ఏలన, రాక్షసులు మాయారూపధరులై రాగా నాతఁ డొంటరిగా నిలిచి యజ్ఞమును రక్షించినాఁడు. రాక్షసు లాతని జూచినంతనే పాఱిపోవుటచే నాతఁడు వారి నెందఱినో జంపవలసిన పనియే లేకపోయెను. మఱియు మారీచ సుబాహులు రావణాసురుని యనుచరులలో మహాబలవంతులు. వారు నిత్యము విశ్వామిత్రుని తృణసమానునిగా జూచెడివారు. ఒక్క యస్త్రమున వారి నిద్దఱ నాతఁడు కొట్టగా నది వారిని త్రిప్పి త్రిప్పి సముద్రమున ముంచివేసెనట.

తౌమ్య: ఈతఁడు తాటకి యను రక్కసిని జంపుట నిజమా?

గాల: నిజమే.

"సదయుండై సుమసన్నిభాస్త్రమున ర
క్షస్త్రీని నోనేయగా
నదిస్వేదంబును గ్రక్కికొంచు బరమా
యాసంబునన్ రాగ ద
న్మదమున్ ద్రుంపగ రాము, డామె శర భి
న్నంబైన దేహంబుతో
విదితార్తింబడి కూలె రాక్షసులకున్
బెన్భీతి వాటిల్లగన్."

ఇట్లు:

"మృదులమును గఠినంబునౌ మదిచెలంగ
నుత్తముడు రామచంద్రుడౌ నూహచేయ;
చిత్రచరితులు తలప విశిష్టులైన
మానవోత్తము లతిగూఢమతులు వ్రతులు."

శాలం: కేవలము దయచేతను శౌర్యముచేతనే కాదు రామలక్ష్మణులు పూజనీయులగుట. ఋషిగణ విశిష్టమైన వారి శ్రుతిత్వము ప్రశంసనీయము.

తౌమ్య: రాజపుత్త్రుల నందఱును స్తుతించువారే. వారి కెప్పుడును చక్కని కమ్మని భోజనము, దాసులసేవ, తలిదండ్రుల లాలనము, వైద్యుల యుపచారములు, ప్రేమతో గొట్టక తిట్టక విద్య నేర్పు గురువులు; ఇంక వారికి జదువు వచ్చుటలో వింత యేమి? నేను రోగము వచ్చినను మానక గురుసేవ నిత్యము చేయుచుందును. భిక్షకై పోవుచు నేయుందును. దానంతట నది యెంతలభించిన నంతతోనే జీవయాత్ర గడపుదును. గురువులు నన్ను గఠినముగా శిక్షింతురు. నేలమీద నే పడక. చదువుటకే యవకాశము లేని నిత్యకృత్యములు. ఇట్టి నా దల్పవిద్య; అట్టివాని దధికవిద్య. నా విద్య నెవరును స్తుతింపరు. రాజపుత్త్రుల నందఱు స్తుతించువారే.

గాల: ఓరీ! మూర్ఖా! గురువుల నాక్షేపింప రాదు.

తౌమ్య: నిజమైనమాట చెప్పితినే కాని యాక్షేపింప లేదు.

గాలం: గురునిందాకరమైన వాక్యము సత్యమైనను బలుకరాదు. వినరాదు. గురువు లనాలోచితముగా నే పనియు జేయరు.

తౌమ్య: గురువులు స్వలాభ మపేక్షింతురే కాని గుణ మపేక్షింపరు.

శాలం: ఓరీ! మూర్ఖా! నీ మాటలు నాస్తికములు. నే నిక వినజాలను.

తౌమ్య: సత్యవచనముల నాస్తికవచనములని నిరాకరింతువా?

శాలం: అజ్ఞానచేతస్కులు హేతువు చూపినను నూరకుండరు. (చూచి) ఆహా! రామలక్ష్మణులు తన్ననుసరింప విశ్వామిత్రు లిటకే విచ్చేయుచున్నారు.

గాల: (చూచి) ఔను. విశ్వామిత్ర భగవానులే.

"రాజపుత్త్రులతోఁగూడి పూజనీయ
బ్రహ్మమునియులు విశ్వామిత్రపరమఋషులు
వచ్చుచున్నారు వేదతపఃప్రభావ
సమితి మూర్తీభవించిన సరణితోప"

(నిష్క్రమింతురు)

ఇది శుద్ధ విష్కంభము

## పంచమాంకము.

[అంత రామలక్ష్మణులతో విశ్వామిత్రుడు ప్రవేశించును.]

విశ్వా: వత్సలారా! రామలక్ష్మణులారా! విద్యాస్త్రములు మీరు నాకడ గ్రహించి యజ్ఞమును

రక్షించినారు. రాక్షసులు పాఱిపోయినారు. నామనమున కెంతయో యానందమైనది.

"ఎంత సుక్షేత్రమున నైన నిద్ధ ధాన్య
ముక్క నెలలోన సుఫలంబు లొసగ లేదు
ఇపుడొసంగిన యస్త్రమ్ము లిపుడె నాకు
నుత్తమఫలంబు నొసగె శుభోదయముగ"

రాము: మేము మీయాజ్ఞ శిరసావహించితిమి. అంతకన్న జేసినది లేదు. ఉత్సాహమును బురికొల్పుటకు గురువులు శిష్యు లెంత సామాన్యులైనను స్తుతింతురు.

విశ్వా: ఓయీ! రామా!

"ప్రజల రాక్షస ఘాతశౌర్య ప్రసిద్ధ
వీరుడవు, రావణ శ్రీ వికారహేతు
భూతుడవు, నేను జాలక పోయినట్టి
పని యొనర్చితి వాసుర భంజనమున."

రాము: దేవా! నీ తపోబలమున నే మేము రాక్షసుల నణపగన్నది. సర్వబలులలో నుత్తమ బలులను తమకడ నొరులెంత? మేము శిశువులము. పరిమితాస్త్రులము.

"అరుణకాంతులు చీకట్ల నణచు ననుచు
జనులు తలపోయుదురు దాని సత్యమరయ
సూర్యభగవాను నాత్మ తేజోలవంబు
కాంతులవి గావ; మే మట్లు కామె తమకు?"

విశ్వా: వత్సా! అది కాదు.

"సుమధురామ్ల తిక్తాదిరసముల నంది
యోషధుల గూర్చును ధరిత్రి; యొనరనవియు
నిక్షుమాధుర్యమును గాంచి యెసగు భూమి;
కటువులగు పాదపంబుల గనదు కాదె?"

అట్లే మీకు నే నస్త్రముల నిచ్చితిని. మిమ్మాశ్రయించి యవి మీ మహిమ వలన రాక్షసవినాశ సమర్థములైనవి.

రాము: నిజమునకు దమ యస్త్రములను జక్కగా నుపాసించినవాడు లక్ష్మణుడు. ఈ కీర్తి యంతయు నాతనిదే కాని నాది కాదు.

లక్ష్మ: భగవానుడా! మా యశోహేతుభూతులు మీరు కాకెవరు? నేను యుద్ధమున నల్పుడను. సర్వరాక్షస నాశనము చేసిన యార్యుడు న్నభినందించుచున్నాడు. అదివీరోచితము లెండు. ఏమైనను ఉభయులము శిశువులము. అల్పకర్ములము. మీరు ప్రేమతో ననుగ్రహించిన శౌర్యమున నే యీ మాత్రము చేయగంటిమి.

రాము: రావణ శ్రీవిరూపత, సుబాహు మరణము, మారీచ దూరనిక్షిప్తత దాని ఫలములే.

విశ్వా: వత్సలారా! వివిధాస్త్ర శస్త్ర ప్రభృతులు మాయారూపులు మహాబలులు నగు రాక్షసులు వైవస్వతక్షత్త్రశాసితమగు నింత భూమి యుండగా మా తపోవనమునే సేనానివేశము చేసికొనిరి. మారీచ సుబాహులు నాకు భయకారకులని రావణుని తలంపు.

రాము: అతడు మహాబలుడని వింటిమి.

విశ్వా: విన నాతడు మీకన్న దక్కువ బలశాలిగాడు. ఏలన:

"వీరుడైనందులకు దాంతి వలయవలయు
వలయువాడె భవాదృశ వీరవరుడు;
దాంతి లేని వీరత్వంబు కాంతిలేని
దీపముట్టులు వ్యర్థమై దీను జేయు."

రాము: వీరతకును దాంతికిని బరస్పర విరోధము కాదా?

విశ్వా:

"జలదం బూరక గర్జ చేయ నితి వ
ర్షావేళ గా కన్యథా
తలపంగా మృగరాజు కాననములో
దంతావళాధీశ్వరుల్
చలపట్టప్పుడె సింహనాదముల ను
త్సాహంబుతో జేయు; వీ
రు లనిన్ శౌర్యము, దాంతి యుక్తపుడు నా
రూఢింగనం గావలెన్."

రాము: వారికి మాకు యుద్ధము వచ్చినప్పుడెవరు గెలుతురు?

విశ్వా:

"ధర్మవైషమ్య మది తటస్థంబు గాగ
వారికిని మీకు యుద్ధంబు వచ్చు నిజము;
అందు సందేహమేల విఖ్యాతభంగి
మీకె యగు నుత్తమజయం బమేయ యశము"

రాము: ధర్మవైషమ్య మెట్లు కలుగును?

విశ్వా: రావణు డసర్మ రాక్షసాధిపుడు. నీ

ఇక్ష్వాకు వంశ వర్ణాశ్రమ ధర్మ సంరక్షకుడవు. అతడు ఋషి జనాపరాధి. నీవు ఋషిపూజాపరుడవు. అతడు బలగర్వితుడు. నీవు వినయశీలివి. అతడు స్వబల ప్రకటన ప్రాధాన్యుడు. నీవు ధర్మ ప్రాధాన్యుడవు. అతడు భ్రాతృ శత్రువు. నీవు సౌభ్రాతృడవు. ఈ వైషమ్యములచే యుద్ధము సంభవించి యాతనికి బరాజయము నీకు విజయము నగును.

రాము : దేవా!

"గురువుల యాశీర్వచనము
పురజన సంప్రీతి మంత్ర పూతాస్త్రంబుల్
మఱి లక్ష్మణ సాహాయ్యము
దొరకిన నా కింక జయము దుర్లభ మెటులౌ?

విశ్వా : నిజమే! మీ యిరువుర నెప్పుడును విజయమే వరించును. మీ యుభయులతో రణమునకు డాసగిన యముడును నిర్బలుడగును. నీకును రావణునకును యుద్ధము కొంత కాలమునకు రాగలదు. నయ వినయ జ్ఞానవంతుడవగు నీ వాతనితో నొక గొప్ప కారణముననే యుద్ధమునకు సిద్ధపడుదువు. కాలక్రమమున నాతడు తపస్వులకే కాక మృగ పక్షి వృక్ష లతలకు నైతము బాధలు కలిగింపగలడు. అదిగో! ఈ ముని బాలకులు ప్రసన్నులు నిర్భయులునై మహాబలవంతుడు తమకు రక్షకుడయ్యెగదా యని నిర్విచారముగా నాడుకొనుచున్నారు. సరోవరములు ప్రసన్న జల గంభీరములై యున్నవి. ఆహా! అందలి మీన కిశోరము లెంత మనోహరముగా సంచరించుచున్నవి! ఆ సరోవరము ప్రసన్న తరంగ హస్తములతో మనల నాహ్వానించుచున్నది. చూడుము: రామా!

"వనమున దైత్యవిఘ్నములు పాయగ;
నింద్రుడు వృష్టినీయగా,
వినుతములై సమృద్ధి కనిపింపగ
సస్యము పండగా; సరో
వన మతినిర్మలంబు సుఖవంతము
పుష్కలమై చెలంగ బెం
పను గను భూమి నీదయినభూరి
పరాక్రమరక్షణంబునన్."

రాము : అహా! ఈతపోవనరమణీయత నెంతని కొనియాడుదును? తొల్లి మా నగరాంతికముల దోచు సస్యములను వృక్షావళిని జూచినపు డెంత యానందించితినో యంతకంటె నీతపోవనభూమి కోటిరెట్లానందకరముగా నున్నది.

విశ్వా : నగరములందలి రమణీయత కృత్రిమము. సర్వభోగ్యము కాదు. కావున అసహజము. ఎట్లన :

ఆరామంబులు కేళిభూధరము
లాయావృక్ష సంతానముల్
పౌరానీకముచే ప్రయత్నమున
బెంపన్ బడ్డవై సాజమౌ
యారమ్యత్వము గాంచ; వేమృగము
లేయేపక్షులుల్ పుట్టినన్
బారంద్రోలుదు; రిందు లోటుగలదే
పత్త్రాళికిన్ బంధుకున్."

"ఇందలి కృషీవలులు దయాహృదయు లగుచు
ద్రోలరు మృగాళి భుక్తి సంతుష్టము నవి
నగరమృగముల కింతయన్నంబు పెట్టు
వారె కఱవౌట నందు దుర్బలత నవియు."

లక్ష్మ : భగవానులు సరిగా జెప్పిరి. ఏలన, నాగరికులు :

"పురిమహోన్నతసౌధాది భోగములను
ననుభవింతురు కలాప్రధానాదికముగ
దెలియరు నిసర్గశోభాప్రదీప్తమైన
విజనవనసౌఖ్యముల నెట్టివియగునన్న."

మఱి :

"పురములో కృత్రిమము సర్వ మరయ బహుళ
దుఃఖభూయిష్ఠ మెన్న నిందున దలంప
వాస్తవికమైన ప్రేమ సంభవము నిండు
ప్రకృతిశోభామహత్త్వ విరాజిత మిది."

రాము :

"విమలసరోజలంబుల ర
విప్రతిబింబము విస్ఫుటంబగున్;
సమయగ మేఘసంతతి ప్ర
శాంతముగన్ నెఱనింగి, యుత్తమో
త్తమఋషిమానసంబె విను
తంబగు దగ్ధమనోరథంబులన్
విమలత నాశ్రయించుగద
విశ్రుతి లక్ష్మి నిరంతరంబుగన్."

విశ్వా :

"ప్రతి యతిదూరదేశమున
వర్తిలి వచ్చిన గాంతమోము నా

స్నతి జెలువారు సూర్యుడు ఘ
  నప్రతిరోధము బాసినంత స్వ
చ్ఛత వికసత్సరోజముల సంగతి
  నొప్పు సరోవరంబు నీ
గతిని నిరోధ మీగిన ప్రబ
  కాశిలు గాదె సమస్తవస్తువుల్."

రాము: ఇండలి స్వచ్ఛసరోవరజలముల దోచు సూర్యబింబమువలె మానిమానసమురీతి హింసాహీనములై పక్షులు శాంతిసుఖమందును.

లక్ష్మి:
"సరసులోని యగాధంపు జలములోన
నెసగు నుత్తమమానసౌకసము లొప్పు
సకలరసపూర్ణ కవిచిత్తసద్మమందు
బరగుసుజ్జ్వల నూత్న భావముల భంగి."

రాము:
"కేకిరమణులు స్వాగతగీతి బాడి
మేఘరాజికి సంతోష మేదురతను
నృత్యములు సల్పె మున్ని; ప్డు నీరదాళి
ద్రోలి రవి వెల్గ గేకిపఙ్క్తి రాలె."

విశ్వా: వత్సలారా! ఈ శరత్కాలశోభ యింకను జూడుడు.

"ప్రబలశత్రుఘనాంధకారమున మునిగి
బెదరి చంచలదీప్తితో వెలిగి మున్ను
నిర్మలంబుగ నొప్పు నీనింగి యిపుడు
కాశతృణవీజనంబున గంతుమిగిలి."

మఱియు:
"మేఘపటలి ద్రుంచి మిన్ను చెల్వొందగా
బరనృపతుల గెల్చి వఱల రాజు
ప్రజలు జెలువునీరు బరమసంభ్రమము గాగ
బద్మవితతి నయనపర్వ మగును."

ఇట్లు మన కీతపోవనమున శరత్సుషమ సాక్షాత్కారమైనది. అది నిత్యనూతన మగుచున్నది. తపోవనాంతికమున వన్యఘోష వినవచ్చుచున్నది. నగర వ్యవహారము లిట కతిదూరములైనవి. ఈ యరణ్యమున మృగసమానవృత్తితో గ్రామ్యజను లాత్మధర్మముల నెఱుంగనివారైనను. నధర్మమునుమాత్ర మాచరింపరు. పరస్పరవైరములు స్వైరవిహారములు వీ రెఱుంగరు. గ్రామీణస్త్రీలు నిత్యమాతిథ్యపరలు. అపకారము సైతము వీ రతిశీఘ్రముగా మఱతురు. మిమ్ము వా రక్షి నందింపగలరు. చూతురుగాని.

రాము: వీరి కంటబడక మనము తప్పించుకొనలేముకదా!

లక్ష్మి: ఈవనశోభ మఱగి యీదేహము చిత్తము కూడ దూరబాధ నందకున్నవి. ఇపుడు నిసర్గము, ఆర్జవానుకృతము నగు తపస్విచరితము భగవానులన్నట్లు ప్రత్యక్షముగా జూడగందుము.

(అందలు నడతురు)

లక్ష్మి: (చూచి) ఆర్యా! చూడుము.
"సస్యభారనతంబయి స్వర్ణకాంతి
నొప్పుకలమపుటెన్నులు గదలుకొన్న
క్షేత్రభూమిని గన్గొన్నమాత్రమునను
బొందుచుంటి నపరిమితానంద మిపుడు."

విశ్వా: అనుక గూర్చుండియున్న కృషీవలుల గంటిరా? క్షేత్రములు చక్కగా దున్ని చదునుచేసి యాకుమళ్లు పెంచి దమ్ముచేసి వర్షము కురియగా నూడ్చి పిదప గలుపు తీసి రేయింబవళ్లు కనిపెట్టికొని యుండి శ్రమఫలము లగు సస్యముల గోసికొని క్షేత్రోపజీవు లింద్రభోగ మనుభవింతురు. వారి కెవ్వరీడు రారు. కష్టఫలమును గను ఘనులు, ధన్యాత్ములు నిజముగా వారే. ఈరీతి బండిన సస్యములో:

"దైవతపైతృకక్రియలు
  ధార్మికబంధుజనాళితృప్తి సౌ
ఖ్యావహ మౌట భాగముల
  నంచితరీతిని వాని బంచియున్
గోవుల మేపువారలకు గొంత
  త్యజించి యథోచితంబుగా
బావనభంగి నాత్మజుల
  భార్యల గూడి భుజింత్రు శేషమున్."

లక్ష్మి: ఈ కృషీవలుల చరిత్ర మతిశ్లాఘ్యము

విశ్వా: మఱియు, వారు:
"శ్రమ గణింపరు దైవవిశ్వాసమునను
దొరకినది తృప్తిగా దిని దోషభావ
రహితులై మిక్కిలి సుఖింత్రు రమ్యభంగి
సర్వజీవితహేతువుల్ సజ్జను లయి."

అంతేకాదు, వారికి:

"క్షేత్రమే కర్మభూమియు గృహిణి గృహము
సర్వలోకము; వారికి సౌమ్యబంధు
జాల మది గోసమూహమే; చాలినంత
అతిథిపూజయే వారి ధర్మార్జితంబు."

రాము: ఆహా!

శ్రమపడగల్గిన కష్టఫలసంగతి
స్వల్పమె యయ్యు వారలు
తృప్తు మను తృప్తితో గొని
సదా సుఖమందుచు జీవయాత్రని
ర్వాహులయి ప్రశస్తి; పెన్నడు
పరస్పరవైరము లేక దాంతులై
యనులినమానసాఢ్యు లయి
యుందురు పూజ్యులు సర్వరీతులన్.

బహుగుణవంతులయ్యు లఘుసంచారులగు వీరిని సంభావింపవలెను. నిజముగా నగరములు నాకపురములు నీ తపోవనములకు సాటిరావు.

విశ్వా: నగరముల నున్నవారికి సర్వగుణములు వినష్టములగుచుండును. వారట కృషి మాటయే మఱతురు. ఇచటి వీరు నిగర్వులు, అభ్యాగత సేవాపరాయణులు. అచటివారో దాంభికులు కుక్షింభరులు. ఇట నున్నవారికి గర్మావలంబనరీతి సహజముగనే కలుగును. అందుచే వీరు సహజగుణవంతులు. అచటివారు కర్మదూరులు, బహువాంఛా దాసులు.

రాము: భగవానులు పరిణామదర్శులు.

లక్ష్మ: భగవానుడా! గ్రామీణుల కర్మవ్యవహారము వనశోభ యింకను గనగోరుదును. కన్న గాని చక్షువులకు మనసునకు బూర్ణతృప్తి లేదు. అస్తాద్రిశిరమున నస్తపదుడైన దివాకర భగవానుడు చరమమున స్వప్రభుత్వము జూచుకొని మరల నుదయించుచున్నాడో యన్నట్లు ఉటజములకు దూరమయ్యు దేజరిల్లుచున్నాడు.

"అస్తశిఖరిపైని నస్తమించెడురవి
మందతేజుడయ్యు మహిమ గోలు
పోక వెలుగు చూడు పూర్వంబుకన్నను
నధికతరముగాక నద్భుతముగ."

విశ్వా: నగర వాసులను మీరు గ్రామ్యశోభ గోరుచునే యుందురు. అదిగో ఆ పల్లెయందు సాంధ్యకృత్యములు నిర్వర్తించుకొని గ్రామస్థుల యాతిథ్యము స్వీకరించి రాత్రి యచటనే కడపుదము.

లక్ష్మ: చిత్తము.

(అందఱు నడతురు)

రాము: ఆహా! వనమునుండి తిరిగివచ్చు గోగణముల యీ దృశ్య మెంత రమణీయముగా నున్నది! ఈ గోవులు.

"ప్రాతగతిని విపినభూముల కేగి యి
చ్ఛ నచట తుష్టితీర బూరి
మేసి వత్సలకును మిగుల నర్మిలిపాలు
గుడుప దిరిగివచ్చు గుణము కలిగి."

లక్ష్మ: ఆర్యా! బాగుగా జెప్పితివి. ఈ యావులు:

అమితోత్క్రాంతను లేగదూడల శరీ
రాంగంబులన్ బ్రీతితో
డమఱన్ నాకుచు బాలుచేపుచును రూ
ఢప్రేమ పాటింపగా
నమితోషన్ క్షణమాత్రలో బొదుగుపాల్
ధన్యంబుగా ద్రాగు వ
త్సములున్; గొల్పును నేత్రపర్వమును న
త్యంతంబు నాకిప్పుడున్."

రాము:

"తమకై తల్లులు వేగవచ్చుటలు వ
త్సల్ చూచి సంతోషపా
రమునన్ గంతులు వేయ; గోవులును జే
రన్ వచ్చి మూర్ధాళి ఘ్రా
ణముతో డన్ స్తనముల్ పయస్సులను నా
నందమ్ముతో నిచ్చు ప్రే
మను స్తుత్యంబు; ఫలాభికాంక్ష ఘను లే
మాత్రంబు బాటింతురే?"

విశ్వా: (ముందు చూచి) అదిగో! ఎవరో వృద్ధురాలగు గోపిక వేగముగా వత్సలకు బచ్చగడ్డి తెచ్చి పెట్టుచున్నది.

(వృద్ధ గోపిక ప్రవేశించును.)

విశ్వా: (చేరి) వృద్ధా! స్వస్తి.

వృద్ధ: ఋషీ! దండాలు.

విశ్వా: ఇట నందఱును క్షేమమా?

వృద్ధ : ఆం. మా బిడ్డల తండ్రి కోడలిని దీసికొని వచ్చుటకై గ్రామాంతర మేగి యున్నాడు. పుత్త్రులు క్షేత్ర సస్యములను రక్షించుచున్నారు. మనుములు ఇంటిపనులు చేయుచున్నారు. మీరు మా లోగిలికి వచ్చి పవిత్రము చేయుడు. ఈ కుమారు లెవరు? కూడవచ్చుచున్నారు.

విశ్వా : దశరథ మహారాజు పుత్త్రులు!

వృద్ధ : వీరి పేళ్లు?

విశ్వా : (చూపి) ఇతడు రాముడు. పెద్దవాడు. ఇతడు లక్ష్మణుడు.

రాము : (చేరి) వృద్ధా! రాముడు నమస్కరించుచున్నాడు. (నమస్కరించును.)

లక్ష్మ : (చేరి) వృద్ధా! రామానుజుడు నమస్కరించుచున్నాడు (నమస్కరించును)

వృద్ధ : చిరంజీవులు కండు. (చూచి) ఏమి? ఇరువురు ధనుస్సులు ధరించినారు?

విశ్వా : క్షత్త్రియులు నిత్యము ధనువులు ధరించి ధర్మరక్షణము చేయుదురు. వీరు నా యాజ్ఞచే యజ్ఞవిఘ్నకారకులగు రాక్షసుల జంపినారు.

వృద్ధ : ఈ గ్రామవనముల మృగములను మాత్రము చంపకుడు.

లక్ష్మ : ఇవి మీకు సస్యహాని కలిగింపవా?

వృద్ధ : ఐనను చంపకు. బెడ్డవేసిన నవియే పోవును.

లక్ష్మ : నీ కపకారము చేయువానిపై గూడ నీపక్షపాత మేల?

వృద్ధ : ఈ మృగములు సహవాసముచే మా చుట్టములైనవి. అవి వెవరి పరుగు లెత్తిన మాకెంతయో క్షోభ కలుగును.

విశ్వా. (రామునితో) వీరి దయార్ద్ర హృదయము గనిపెట్టితివా? అపకారులయెడనైన వీరు కోపింపరు. ఈ గుణ మెంత కొనియాడదగినది?

రాము : ఔను. వీరు నిజముగా దేవతా తుల్యులు.

విశ్వా : వృద్ధా! పోయిరమ్ము. మేము సంధ్య వార్చి మీ యింటికి వచ్చెదము.

వృద్ధ : సరే. (నిష్క్రమించును)

విశ్వా : మీ రెండుల కీ కృషీవలుల జూడగోరితిరి?

లక్ష్మ : అల్పాంశమ్ము లయ్యు నీరత్యంత రృప్తమనస్కులని.

రాము : నేను వ్యవహార జ్ఞానముగోరుకు. వీరిని జూచి వీరి తత్వము బోధపడుచుకొన్నచో వ్యవహార నిర్ణయము సుకరమగునని.

విశ్వా : బాగుగా జెప్పితివి.

రామలక్ష్మణులు : (విశ్వామిత్రునకు నమస్కరింతురు)

విశ్వా : (తనలో) వీరిని నాతో ద్రిప్పికొనుట వలన రావణ జయోద్యోగము బలపడును. వీరికి వ్యవహార జ్ఞానము తెలియును. దశరథునికి బుత్రవిరహమే. ఏమి చేయుదును ? జనకమహారాజు చేయు సాంవత్సరిక సత్త్రయాగము నభినందింప నేగవలయును. సర్వగుణ మనోహర యగు సీత యీతనికే కదా. ఆతనికడ గల శివధనుస్సును రాముడు కాక యింకెవడు సజ్యము చేయగలడు ? (ఆలోచించి) రాముడే సీతను బెండ్లాడి తీరును.

రాము : (నిరూపించి) భగవాను లేదో యాలోచించుచున్నట్లున్నారే ?

విశ్వా : నేను విదేహాధిపుని జూడ నేగుయాత్రను గూర్చి యాలోచించుచున్నాను.

రాము : అక్కడను రాక్షసబాధ లేమైన గలవా ?

విశ్వా : ఉన్నను నీవు యాత్ర నవి శాంతించును. జనకుడు సాంవత్సరిక సత్త్ర మొనరించుచున్నాడు. సత్త్రాంత మభినందింప రండని న న్నాహ్వానించినాడు.

లక్ష్మ : మేముకూడ మీతో నచటికి వత్తుము.

విశ్వా : మంచిది. అపుడు సత్త్రయాగము శుభాంతము కాగలదు.

లక్ష్మ : మరల నయోధ్య కెపుడేగుట ?

విశ్వా : ఆ రాజర్షి యజ్ఞఫల మనుభవించిన పిదప.

రాము : ఎట్లు ?

విశ్వా : అట కేగిన తరువాత స్వయముగా ననుభవింతురు లెండు.

లక్ష్మ: అట్లే, కాని:

"చలుపఁబోయిన కార్యంబుఫలము ముందు
తెలియ, నుత్సాహ మది యత్యుద్దీప్తమగును;
ఫలము తెలియనికర్తంబు జలుపుటన్న
నగును మాంద్యంబు దానిచే ననువిరాళి."

రాము: వత్సా! ఫలము తెలియనికర్మ మందు వేల? అటకేగిన తరువాత ననుభవింతురని భగవానులన్నారుకదా?

విశ్వా: ఫలస్వరూపము ఫలము లభించిన పిదపనే తెలియును.

రాము: అట్లే యగుగాక! భగవానుల యాదేశమునకు వివాద మవసరము లేదు.

లక్ష్మ: ఔను.

విశ్వా: (తనలో) రామునకు సీత లభించుటతో నా యుద్దేశ మింతవఱకు సఫలమగును. రామునకస్త్ర విద్యాప్రదాన మీవఱకే యైనదికదా!

"కంటిన్ బ్రహ్మఋషిత్వమీభువిపరః
కర్మన్ బ్రశస్తంబుగా
గొంటిన్ జృంభకసాయకంబులు జగత్
క్షోభన్ నివారింపగా
గంటిన్ శాంతి సహస్రసంతతి మహా
ర్ఘుండైన రాముండు చే
కొంటన్; గష్టఫలంబు వ్యర్థమగుటన్
గోరంతగా నెవ్వఁడున్."

(నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.—

ప్రవేశిక

(అంత ముగ్గురు భటులు ప్రవేశింతురు.)

మొదటి: ముష్టికా! తపోవనమునుండి వచ్చిన విశ్వామిత్రులవారు కూర్చుండియున్నారు. మనము వారిపాదసేవ చేయ నియోజితులముకదా!

రెండవ: ఓరీ! స్థూలాంసా! ఆయనతో నున్న సుకుమారు లిరువురు రమణీయాకృతులు. విశ్వామిత్ర సేవాపదేశమున నా కుమారుల నిరువురను జూచి దృష్టి ప్రసన్నము చేసికొందము.

మూడవ: ముష్టికా! వారు యువకులు. కుమారు లందువేల?

ముష్టి: దంష్ట్రబాహూ! వారు కుమారు లని విశ్వామిత్రుడు మహారాజుతో ననియుండెను. అందుచే నేనును సుమారు లనుచుంటిని.

స్థూలా: శీఘ్రము నను రాముని యౌవనవికాసము గమనింపదగినది.

దంష్ట్ర: అతడు మహారాజుకూతురు సీత నుద్యానమున జాలసేపు చూచినాడు.

ముష్టి: మొదట నాతడు లక్ష్మణునితో విశ్వామిత్రునికడ గూర్చుండెను. విశ్వామిత్రుడు వారికేదో యుపదేశించి పిదప రాముని నొక్కని నుద్యానవనమున విడిచినాడు.

స్థూలా: మన రాజకుమారికూడ చెట్టువెనక దాగి యాతనిని జాలసేపే చూచినది.

ముష్టి: మహారాజు ననుమతి యున్న వారికి వెంటనే పెండ్లియగును.

దీర్ఘ: అది కానివాడు వారిరువురకు బిచ్చి మొత్తును.

ముష్టి: ఇది మహారాజునకు విశ్వామిత్రునకు దెలియునా?

దీర్ఘ: తెలియును. అందుచేతనే వారి నేకతమున విడిచినారు.

స్థూలా: వారి వివాహమహోత్సవము శీఘ్రమే చూచి జన్మము తరింపజేసికొందము.

దీర్ఘ: (చూచి) ఓహో! రాముడిటే వచ్చుచున్నాడు. మన పని మనము చూచుకొందము.

(నిష్క్రమింతురు)

ఇది ప్రవేశిక

## షష్ఠాంకము

(మదనావస్థలో రాముడు ప్రవేశించును)

రాము: (పరిక్రమించి దీర్ఘనిశ్వాసము విడిచి)

స్వచ్ఛశారదశశిమనోజ్ఞంబు మొగము
అచట కుసుమాపచయవేళ నరయుటాది
సర్వమును విస్మరించితి; సంస్మరింతు
దనివిచేకూర దెంతచూచినను నామె.

ఆహా!

ఆజగన్మోహనాంగి నల్లార కుసుమ
పేశల సుగాత్రి నొనరించి విధి తలంప
గాంచి స్త్రీరూపనిర్మాణ కౌశలమున
కచ్చెరువు చెంది గర్వించి యలరె బోలు.

ఆహా ! చిత్రము !

"ఒక్కసారి కనుంగొనియున్నమాత్ర
మఱచిపోయితి సర్వమ్ము మతి కలంగ
నింక నొకమాఱు కనుగొన్న నేమియౌదు
నో ? యెఱుంగను నిజము మనోహరాంగి.

మఱియు :

పరమానందముతోడ వత్సలతతో
బాల్యంబునన్ దల్లి మ
త్పరయై స్తన్యమొసంగుటాది యెఱుగన్
ప్రాసాదమున్ వీడి; నా
కరయన్ గానపలౌల్య మెన్నఁడును లే;
దారాక్షసశ్రేణిపెం
పఱజేయన్ జలియింప; నా కిపుడు సం
ప్రాప్తించె నున్మత్తతల్.

యజ్ఞవిఘ్నకారు లగురాక్షసులను శస్త్రాస్త్రముల నాశముచేసితినికాని నాయాత్మశక్తిపై నావంతయు విశ్వాసము కోలుపోయి యెఱుంగను. ఆమెను గనుగొన్నది మొదలిది యంతయు బటాపంచలై పోయినది. ఆహా! కాము డతిబలవంతుడుకదా! ఈ కామజ్వరము నా దేహమునంతయు దపింప జేయుచున్నది. నాచే నేయకార్యము చేయించునో? ఏలన, ఇది ఋషి యాజ్ఞవలన జేయుకర్మ కాదు. ఇది యకార్యము. గురువులకు నివేదింపక చేయు నేపనియైనను గొంగపనియేకదా! మఱియు నరణ్యమున యుద్ధమున నెల్లపుడు లక్ష్మణ ద్వితీయుడనయుయే కాని యొంటరిగా నుండియుండనుగదా! నా వెనుక లక్ష్మణుడు లేడు. గురువులు లేరు. ఇది న్యాయమా యన్యాయమా యని విచారణ లేదు. అది నిఘాతమువలె మానసమును గాఢముగా వశపఱచుకొన్నది. ఇక రాముడు విషయములకు జలింపనివాడన్నమాట పొల్లువోయినదికదా! కానిమ్ము, విశ్వామిత్రులకు దూరమున నుండుట మంచిది కాదు. సమీపమున కేగెదను. అవిజ్ఞాత కులాచార స్త్రీదర్శన ప్రసంగమునుండి మనస్సును మరలించెదను. కాని :

"ఈమె జూడక యానందహీనమగును
నా మనస్సది; ఇకపైని నేమియయిన
బరమపావనమైన నా చరిత మెట్లు
విడువ శక్తుండ నగుదు నే? వేయు నేల!"

(పరిక్రమించుచు) అహా! అడుగు పడుటలేదు.

"ఒక్కయడుగైన నిడజాలకున్న వాడ
గరము దృఢతరమాయె నీచరణ యుగళి?
ఆమె జూడక యీ కన్నులౌర? యొండు
చూడజాలక యున్నవి చోద్యమౌర!
"ఆమె జూడంగ దలపూని నంతమాత్ర
నవిరళానందమందు నాయంతరంగ
మామె తనువల్లి ముఖఱింబ మరయగందు
మరల నానంద వార్నిధి మున్నడౌదు"

(ఆలోచించి) ఇది కాదు. కొంతసేపాగుదును. సందిగ్ధ ఫలవిషయమున మతిమంతుడు శ్రమపడడు. ఇట నుండు టుచితము కాదు. ఏలన, మహర్షులు బ్రహ్మచర్య నియమగసులు. వారికే కాదు. మనస్సును నిరోధించుటయే సర్వజీవులకు ప్రథమ కర్తవ్యము. మఱియు

"బ్రహ్మచర్య వ్రతంబున బరగు రాము
డరయజాలడు స్త్రీముఖ మన్నమాట
పొల్లువోరాదు మఱియు నిప్పుడు తలంప
నొంటి నుంటిని స్త్రీ గను టురవు కాదు."

(జయించుట నభినయించి) ఇటు లేగెదను. (ముందు చూచి) ఓహో! నా నేత్ర పద్మముల నానంద సరసిలో మునుకలాడించిన యా సుందరి యీ తరుమూలమున గూర్చుండి యున్నది. ఇట నేయుండి యామె దర్శన సుఖ మనుభవించెదను.

(పరిశీలించి) ఇది గాలిచే గదలు మాధవీ లత. ఛీ. ఇది నన్నింత పరిహసించుచున్న దేల? లేక ఇది నామనోవికలతయా? ఔను. కాముకులు వికలచిత్తులే.

"ఆత్మవైభవమంతయు నవలద్రోచి
దేహ మతికామ తప్తమై తెఱుగుగంటి
ధైర్యవంతులు శుద్ధచేతస్కులౌట
నా మెరూపంబు నెదనుండి యవలద్రోతు."

(ఆలోచించి) అట్లను టుచితము కాదు.

"వ్యధితమనమున మోముఱవాంచియున్న
నన్నుఁ గనుఁగొన్న డా... యున్ను మిన్న శిరదు...

మోహమవిచ్ఛిన్నని నటవాంచి పూర్ణముగను;
తలపసమోహాస్పదమైన నేబలుకనైతి."

మఱియు :

"కామముచేతనగుణ్నగా జాప్యములికగాగ
నాయెడంద లక్ష్యమ్ముగా నాలిదేసె
ప్రణయ సూచకముగ నేను బరమమూర్త
మతిని బ్రాహ్మంగ నయ్యో నా యతివ గొనను."

వెనుక జరిగినట్లే ముందును జరుగగలదు. నేను వృథా విచారశ్రమ మంద నేల? పోదును.

(తెరలో) "సఖీ! ఇటు, ఇటు."

రాము : (విని, చూచి) కాదు. నా మతి భ్రమ కాదు. సత్యము. మహానంద సయనానందస్యంది శారద పూర్ణేందుముఖి మూర్ఛితుడ నగునన్ను దన వదన శోభా సంజీవనిచే దేలుకొనజేయ సఖులతో నిటే వచ్చుచున్నది.

"నభముపై మేఘమును జూచి నాట్యమాడు
నెమలిరీతిని నీవచ్చు నిరుపమాన
సుందరీరత్న వదనారవిందము గని
మన్మనము నాట్యమొనరించు మహితభంగి.

(అంత సఖులతో సీత ప్రవేశించును)

ఒకసఖి : భర్తృదారికా! ఈ యుద్యానమున నెటగూర్చుండి మనోవినోదమును గావించుకొందము?

మఱియొకసఖి : ఆ మాధవీలత దగ్గఱ. అశోక వృక్షపు నీడ.

సీత : సఖీ! చంద్రకళా! భర్తృదారికా యని క్రొత్తగా బిలిచెదవేమే? ఇదివఱకెట్లు సఖీ యను దానవో యట్లే సఖీ యనుము.

చంద్ర : నిన్నటినుండి నీవట్లగపడుటచేత నే యట్లంటిని.

సీత : మధురికా! నీవట్లందువేమే? మీరిరువురే కదా సీతకు ప్రియసఖులు.

మధు : నీవు మఱియొకరి దానవువలె గనబడుచున్నావు. చపలవు భీతవునాదువేమి? కనులు పైకెత్తు. నీవు రాగముచే నిద్రలేని దానవువలె నున్నావు. ఏకాంతమున నీ మనసులో నేమో యనుకొనుచున్నావు.

చంద్ర : ఇచ్చటికి వేగముగా వచ్చితివి కూడ.

మధు : నీలో యౌవన వికారము కనిపించుచున్నది. ఏ యువకుడు నీ బాహులతచే గంఠము నలంకరించుకొని ధన్యుడు కాగలడు?

సీత : ఏమో తెలియదు.

రాము : ఈమె యెవరి భాగ్యరాశియో తెలియదు. ఎవరో బ్రహ్మర్షి కుమారికయో నాకు లక్షింప జాలను. అన్యవధువైన నలభ్యయే. అందుచే నీమె ముఖారవిందమును నీయెదలో దాచుకొని యుంచుట వ్యర్థమేయగునేమో (ఆలోచించి) అట్లు కాదు. ఏలన:

"పరవనిత యైన నీమె దుష్ప్రాపమైన
నామనస్సెట్లు పరుగెత్తు నీమెపైకి?
మనసె కాద! కృత్యాకృత్యమతి వివేక
మునకు నుత్తమ ప్రామాణ్య మన ధరిత్రి."

సీత : ఏ లోకో కాని నామనస్సీ యుద్యానమున వెనుకటివలె ప్రసన్నముగుట లేదు. శరీరమునకు జాల సంతాపము కలుగుచున్నది. కదలనైన గదలజాలకున్నాను.

మధు : ఆ మణి శిలాతలమున గూర్చున్నచో భర్తృదారికకు గుసుమ పరిమళముతో నుద్యాన వాయువు వీచి స్వస్థత జేకూర్పగలదు.

సీత : ఔను. కూర్చుందము. [(కూర్చుండును) దీర్ఘముగా నిశ్వసించి] సఖీ! నా శరీర సంతాప మధికమగుచున్నది.

మధు : (నళినీదళమున సీతకు విసరును.)

రాము : ఆమె శరీర సంతాపమున నేనును దపించుచున్నాను.

"ఈరమ్యోద్యానసరో
వారితరంగ ప్రభూత వాయువు సుమన
స్సౌరభము మందములయన
మీరుడు నన్నేచ దొడగె మిక్కిలి నకటా!"

కారణ మేమైయుండును? సరే. తెలిసినది.

"మానస దేహంబులలో
మానస మది ధర్మమార్గమహిమ దలిర్పన్
మానసము వీడి దేహ ము
నూనంబుగ దప్తమగుచు నుండగ బోలున్."

సీత : నాతాప మీ చల్లని గాలివలన శాంతించుట లేదు. మీరు శ్రమపడవద్దు.

మధు : (జనాంతికముగా) చంద్రకళా ! నేననుకొన్న సంతాప కారణము నిజమే. ఇది శరీర సంతాపము కాదు. మనస్సంతాపమే.

చంద్ర : రాముని మూలముననే యిది యని యామె సత్యము చెప్పదాయె.

మధు : (జనాంతికముగా) ఆర్యుడు రాముడు విశ్వామిత్ర పరవశుడై దృఢవ్రతము నవలంబించి యున్నాడు ఆతనిని లొంగదీయ సాధ్యమా?

రాము : ఈ సంతాపము వలన నామె ముఖము తెల్లబడుచున్నను మఱియొక నూతనశోభ నే యందుచున్నది. ఆశ్చర్యము!

"కాంచనకాంతిని కన్నుల కఱవు తీర
నమృతనిష్యంది యగు నీమె యాననశశి;
ఘన దాపంబు మిక్కిలి యధికమయ్యె
విధికృతంబులు బహుచిత్ర విధములౌర!"

చంద్ర : (జనాంతికముగా) మఱి యుపాయ మేమి? ప్రియసఖి భర్తృదారిక శోచనీయావస్థలో బడిపోయినది.

మధు : (జనాంతికముగా) సరే. ధర్మవిరోధము కాని ప్రణయము పరిగణింపదగినదే యని విశ్వామిత్రుల మతము. అందుచే నీమె విషయమున నాయన ప్రసన్నుడే యగును.

చంద్ర : (జనాంతికముగా) ఏదో యుపాయము చూతము.

సీత : సఖులారా! ఎండ చాల బాధించుచున్నది.

మధు : ప్రియసఖీ! సీతా! చెట్టునీడనున్నావు. ఎండయేమిటమ్మా!

సీత : (లజ్జతో) ఇది నీడయా?

రాము :

"చెట్టునీడను గూర్చుంటి చిరమునుండి
పడయుచుంటిని జలిగాలి స్పర్శమైన
నత్యధికమైన సంతాప మందుచుంటి
నేమి కానోపు కారణం బింతకిపుడు?"

"కామజంబైన తాపంబు కాంతకంటె
బురుషునకు మిన్న యౌనుగాబోలు — కాదు
స్త్రీల విషయము నాకేమి తెలియు? ఏల?
యింత గొడవ? నేనాదుగ్గా మాంత్రకుడను."

నేత్రానందదాయకుడగు నే యుత్తమునికొఱకో యీమె విరహ మనుభవించుచున్నది. వాడెంత ధన్యుడో అన్యానురక్తను గామింపకుండుట ధర్మనియమము. కాన నేనీవిషయమునుండి మనస్సును మరలింతును.

"ఉత్తమవివేకఫలము న న్నొంపవలయు
నంతియే కాని యవివేక మందరాదు
వీరతయె సుఖమిచ్చు నేవీరుడనయి
ప్రాజ్ఞతను గోలుపోవుట పాడికాదు."

మధు : (జనాంతికముగా) నేను స్పష్టముగా ప్రియసఖిని జూచినాను.

చంద్ర : (జనాంతికముగా) ఔను.

మధు : ప్రియసఖీ! నీయందా సంతాపము మదన సంతాపమువలెనే యున్నది. ఎప్పుడా రాము నీ యుద్యానవనమున నీవు చూచితివో యప్పటినుండి నీ సంతాపమారంభమైనది. ప్రతి దినము వృద్ధి పొందుచున్నది. ఇది నిజమైన దెప్పు. ఏదో యుపాయము చూతము.

రాము : (విని హర్షముతో) ఏమి? నేనే యామె తాప కారణమైతినా?

"స్మరణమున గాఢసంతాపభరము కలుగ
జంచలాక్షులు హృదిలోన నుంచుకొంద్రు;
నన్ను సంతప్త నొనరించి ఖిన్న జేయు
నామె పూర్ణేందువదనరమ్యత్వ మహహ!"

ఆహా!

"స్వార్థబుద్ధిని నన్యదుఃఖాధికంబు
నెవ డుపేక్షించువాడు మానవుడు కాడు;
దుస్సహంబైన తాపంబుతో గలంగు
నామె కోదవింతు నానంద మవిరళంబు."

సీత : నా మనో వికారమునకు గారణమేమో మీ యిరువురకు దెలియదా?

మధు : తెలియదు.

సీత : (సిగ్గుపడును)

రాము : ఛీఛీ. కష్టము. నా గంధర్వ నగరము విధ్వస్తమైనది. అలసులు దీనులు మూర్ఖులు కామ్య కర్మము లొనరింతురు. ఉత్తములు ఫలచిత్తులు కాక ధర్మార్థమే కర్మమొనర్తురు. కావున నేను ఫలమో యఫలమో యామె కలత బోగొట్టుదును.

మధు : ఏ కారణముననో తెలియని నీసంతాపమునకు నివారణోపాయమెట్లు మాతుమమ్మా నీవు చెప్పనిచో?

సీత : చెలులారా! మీరు చెప్పిన కారణము నిజమే. మీరు చెప్పనిదే మీచే నెట్లు చెప్పింపగలను?

రాము : (సంతోషముతో) సంతోషము. దైవ విహితమును కర్మకర్థము లేకపోదుకదా! ఈమె యెవరి కూతురో?

మధు : చెలీ! వెంటనే యీ వార్త మహారాజునకు విశ్వామిత్రునకు ఆర్యుడగు రామునకు దెలుపుదుము.

సీత : (దీర్ఘముగా నిట్టూర్చి) ఒక పెద్ద సంగతి మీరిరువురు మఱచిరి.

మధు : ఏమది?

చంద్ర : నాకు దెలియును. శివుని విల్లెక్కిడిన వానికే తన కూతురిచ్చెదనని మహారాజు నిశ్చయించినాడు అది దుష్కరమగుటచే రామున కది సాధ్యమా యని ప్రియసఖి జడియుచున్నది.

సీత : (దీర్ఘముగా నిశ్వసించి) ఔను.

మధు : రాముడెంత సుందరుడో యంత బలవంతుడగుట శివధనుర్భంగము గావింపగల సమర్థుడే.

సీత : కాని నాడు నేను జీవింపలేను. (మూర్ఛిల్లును.)

చంద్ర : దేవతలారా! రక్షింపుడు. సీత మూర్ఛిల్లినది.

రాము : (నవ్వుచు జేరి) భయపడకుడు. నేను ప్రియురాలి (అర్ధోక్తితో మౌనము వహించును)

మధు : ఆర్యునకు స్వాగతము. ప్రియసఖినిట్లు శోచనీయ నొనర్చుట భావ్యము కాదు.

రాము : అంతయు వింటిని. ఈ పుణ్యాత్మురాలి తండ్రి యెవరు?

చంద్ర : బ్రహ్మజ్ఞాననిధి-జనక మహారాజు.

రాము : (తనలో) ఏ కుల కన్యయో యనుకొంటిని. ఆ కులము పవిత్రుడగు జనకమహర్షిది. నాకొఱకై యీమె పరితపించుచున్నది. శోభాకృతిగా నా సుఖము కొఱకే విధి యీమెను సృష్టించియున్నాడు. (ప్రకాశముగా) ఈమె సఫల మనోరథ కాగలదు. కాని, నేనే యదృష్టశూన్యుడనని... (అర్ధోక్తితో విషాదము నటించుచు తనలో) వివేకవినయోపేతుడనని జనకుడు తలంచునేమో?

చంద్ర : (తనలో) తెలియవలసినది తెలిసినది.

మధు : మహారాజ మిగుల దుష్కరమగు పణమే యుంచినాడు.

రాము : అదియు నేను వినియే యున్నాను.

"శివుని వింటిని సజ్యంబు చేయగలుగు
మానవుని శక్తి దుష్కరమౌనటంచు
రాజు దీని పణంబు నా యోజచేసె
ననుచు దలతును విఫల సుఖాశతోడ."

మధు : నీకు ప్రియమే యగును.

"పరమ వీరుడ వీవు దుష్కరమునైన
పని గలదె నీకు నని నేను ననుకొనెదను
నీవు చూడ మహాశౌర్య నిధివి గాన
నీకశక్యంబు గలదె యీ లోకములను?"

చంద్ర : ఆర్యపుత్రా! నీకు:

"దేహమందున శౌర్యంబు దీప్తమౌను
అధిక దుష్కర కృతియైన నగును సాధ్య;
మల్ప కాయంబు గలదియే యైన సింహ
మధిక కాయము గలయేన్గు నణచుగాదె!"

(తెరలో) మహారాజా! ఇటు. ఇటు.

రాము : ఆహా! భగవానుడు:

"రాజత్వంబున సుస్థితుండు నయి
    దుర్గ్రాహ్యంబునౌ బ్రహ్మస
త్తేజం బంది వెలుంగు రాజఋషి;
    యుత్తీర్ణుండు జ్ఞానాంబుధిన్
భ్రాజిష్ణుండు నిరస్తవైవయిక
    విజ్ఞానంబుచే సంసృతిన్;
రాజైయున్నను శాంతమూర్తి
    పరమప్రాజ్ఞుండిటే వచ్చెడిన్."

నేనిచట నుండదగదు. పోయెదను. (నిష్క్రమించును.)

సీత : సఖులారా! ఇపుడేమి చేయుదము?

చంద్ర : ఇపుడు క్రొత్తగా జేయవలసినదేమి? మహారాజు వచ్చుచున్నాడు. కావున ఎదురేగుదము.

సీత : నా సంతాప వృత్తాంత మాయన వినలేదు కదా?

మధు : నీవిట్లు శంకింపకు. ఆయన విన్నచో నీ సంతాప ప్రతీకారము చేయును.

సీత : నాకష్ట సమయమున నన్ను బరిహసించుచున్నావు.

మధు : నీ దుఃఖ శాంతి యగునులే.

సీత : మరల వేళాకోళమా?

మధు : వేళాకోళముకాదు. విను. రాముడు కానరానిచో నీవెంత సంతాపపడుచున్నావో నీవు కానరానిచో నాతడు నంత సంతాపమే యందుచున్నాడు.

సీత : పోవే. ఆయన పేరెందుకు జెప్పెదవు?

మధు : ఆయన మనమిత్రుడు కనుక.

సీత : (కోపముతో) నీకెట్లు తెలియును?

మధు : (చెవిలో) ఇట్లు.

సీత : నిజమా?

మధు : నిజమే.

సీత : (లీలగా) ఏమే. అసందర్భ ప్రలాపము లాడెదవు? ఆ మాట నమ్మవచ్చునా?

(తెరలో) మహారాజా! ఇటు ఇటు.

చంద్ర : మహారాజు వచ్చినారు.

(జనకుడు చేటులతో ప్రవేశించును.)

జనకుడు :

"అనుపమ సద్గుణాళి నలరారెడు
కన్యకగాంచి పెంచి యా
మెను విబుధుండు నిర్మలుడు
మేదుర సద్గుణ శాలియైన యొ
క్కని కొసగంగ గాంచిన సుఖంబగు
గాని యయోగ్యవర్తి కొ
క్కని కొసగంగ గాంచునెడ
గష్టపరంపర చెప్పశక్యమే?"

సీత : (చేరి) నమస్కారము. (నమస్కరించును.)

జన : వత్సా! సర్వగుణనిధియగు భర్తను బడయుదువు గాక!

సఖులు : ప్రియసఖీ! తండ్రిగారిని వరరూపమును ఆశీర్వచనము నిండని కోరుకో.

సీత : (కన్నీటితో) తండ్రీ పెండ్లిచేసి నన్ను దేశాంతరము పంపి వేయుదువు.

జన : దేశాంతరమో. జన్మాంతరమో. ఏమైనను జీవికి స్వకృత్యములు తప్పవు. కన్నవారెల్ల మిన్నలగు బంధువులని తలచి యాతడు మోసపోవును. ఇట్లు మోసపోని జీవియేమున్నాడు.

ఏది యెట్లు జరుగవలసియున్నదో యట్లే జరుగును. నీవేగవలసిన చోటికే యేగెదవు. విప్రయోగ భావముచే నీవనవసరముగా హృదయమును బాధ పెట్టుకొనకుము.

"కలిగియున్న దుఃఖంబును దొలచుకొన్న
నాను మిక్కిలి యానందమట్లుకాక
సుఖమెఱుంగక దుఃఖంబు చొప్పుగన్న
నొక్క కార్యంబు కూడను జక్కబడదు."

సీత : (కన్నీటితో) తండ్రి కున్న ధైర్యము తనయకెట్లు వచ్చును?

జన : అవసరమునుబట్టి నీకును ధైర్యమదియే వచ్చును. మగని ప్రేమ మఱగితివా మమ్ము వెంటనే మఱచిపోదువు.

సీత : తండ్రీ! అట్లనకుము.

"ఎంతవఱకును సంస్మృతి యొసగు నాకు
నంతవఱకును నామనమందు దండ్రి
పరమపావన భవదీయ పాదపద్మ
యుగళి నెన్నండు మఱవంగనోప నేను."

జన : వత్సా! మంచిదే. అది సముదాచారమే. నీవు భర్తతో వెడలిన వెనుక గలుగబోవు మా ఎడబాటును గూర్చి యాలోచింపకు.

"ముందు కాలంబునందు రాబోవు దుఃఖ
మెన్నడును గూడ దలపోయనెంచరాదు
కడచిపోయిన కాలాన గన్న దుఃఖ
మెంత త్వరలోన మఱచిన నంత సుఖము."

అందుచే నీవు సఖులతో నేగి మేడముందుభాగమున గల బుద్ధివర్ధన పీఠమున గూర్చుండి మనస్సును వినోదపఱచుకొనుము. (చేటులతో) మీరు విశ్వామిత్ర భగవానులతో సంధ్యోపాసనమైన వెనుక నేను వచ్చి వారు నివేదించినదెల్ల బరిపాలించెద నంటినని చెప్పి రండు.

అందఱు : చిత్తము. (జనకుఁడు తక్క అందఱు నిష్క్రమింతురు.)

జన : ఈ వేళ ఆఱుఁగడియలకు నాకు సత్రాంత స్నానము. పిదప ఆర్షవిధానమున సీతను రామున కిచ్చెదను. ఏలన, కులమున్న:

"పరమ విఖ్యాత మా రఘువరకులంబు
రాముఁడు బుధుఁడు శుభ్రవిరాజమాన
సుగుణపుంజము సీతకు దగినవరుఁడు
ఆమె వలచిన దితని నింకేమి వలయు?"

ఇక శైవధనురారోపణ రూపమగు పణమునకు రాముఁడు నిలువఁగలవాఁడేయని విశ్వామిత్ర మహర్షి చెప్పియే యుండెను. (ఆలోచించి) రాముఁడే యిది చేయలేనినాఁడు విశ్వామిత్ర భార్గవరాములను దప్పించిన నిక నిందలకు సమర్థుఁడెవఁడు? నా పణము మోఘఫలమునుగాని నిష్ఫలమునుగాని యెన్నఁడు సేయదు. భగవానుఁడగు భార్గవరాముఁడు శాశ్వత బ్రహ్మచారి. విశ్వామిత్రుఁడు వనవాసి. నా పణము విని యెందఱో వీరులు విభ్రమముతో వచ్చి యది నిర్వహింపలేక నిందించిపోఁజొచ్చిరికదా! విశ్వామిత్రునివచనమున విశ్వాసముంచి యీ మహాభాగుని కొఱకెదురు చూచుచుంటిని. (పరిక్రమించి మరల నాలోచించి) నా పరమసఖుఁడగు దశరథ మహారాజును బిలువనంపెదను. నా కోరిక పాటించి యాతఁడు తప్పక వచ్చేయును రాణులతోఁడను వసిష్ఠభగవానులతోఁడను కుమార మంత్రి భృత్య పరివారపురస్సరముగా వచ్చేయుమని కోరుచు నిపుడే దశరథుని కడకు దూతను బంపుదును. మఱియు:

"ఏ నృపులు వచ్చిన యీ వింటి నెత్తలేక
కడు నిరాశులై పోవఁగనిరో వారి
నందఱను బిల్వనంపెద నరుగుడంచి
వార లీ యుత్సవము జూడవలయు నేఁడు."

అంతేకాక:

"ఈ పణము దుష్కరంబని యెవరు నన్ను
నింద చేసిరో వారు వారందఱరయ
గలరు రఘురామ శక్తిని; గాంచి మిగుల
సిగ్గుపడగాంత్రు తమ తమ చేవ తెలిసి."

ఇంకను:

పరముండౌ హితుఁడైన యీ దశరథున్
భార్యాత్రయిన్ బిడ్డలన్
వరసంజాతుల నా గృహంబున
మహానందంబునన్ గాంచెదన్
జిరకాలంబునకిట్టు; లాలఁడును
నిర్నిద్ర ప్రమోదంబునన్
వరపుత్త్ర ప్రకట ప్రతాపముగనున్
వహ్వా! యనన్ లోకముల్."

(నిష్క్రమించును.)

ఇది షష్ఠాంకము.

## నిర్వహణాంకము.

[అంత గూర్చుండి సదస్యులు, సభ్యులు, దశరథ మహారాజు కుమారులు, జనక మహారాజు, పరివారము, వసిష్ఠ భగవానులు, విశ్వామిత్రుఁడు, శతానందుఁడు, మంత్రులు, రాణులు, పరిజనులు, రాజులు ప్రవేశింతురు.]

జన : (లేచి)

"తమము నడఁగూడి జ్ఞానతేజమును గాంచ
బ్రహ్మమయముగ దోచు సర్వంబు ధర్మ
కర్మ మొనరించి లోక సౌఖ్యమ్ము గోఱకు
నాత్మ విజ్ఞత నెల్లరు నలరవలయు.
కర్మపరము సమస్తంబు కాన ధర్మ
విదిత శక్తుండగా నెట్టి విజ్ఞుఁడైన
ధర్మయుక్త కర్మంబు నిత్యంబు జేయు
సజ్జనుఁడు నిర్మలంబైన శాంతిబడయు.
ఒక్కఁడయ్యును సూర్యుండు పెక్కుగతుల
గాంతి పుంజము వెదజల్ల గాంచునట్లు
ఒక్కటయ్యును నాత్మతా బెక్కుగతుల
వివిధ కృత్యంబు లొనరించి వెలయుచుండు.
విధి విధించెను యజ్ఞంబు విజ్ఞులకును
యజ్ఞమున దేవతలు ప్రీతి నందుచుంద్రు
యజ్ఞమున గొల్తు రీశ్వరు నఖిల జనులు
యజ్ఞమొసగును గామ్యఫలాళి నిజము."

నా యజ్ఞము సమాప్తమైనది. ఇక ఆర్షవిధి ననుసరించి రఘుకుల దీపుఁడగు దశరథ మహారాజు జ్యేష్ఠపుత్త్రుఁడు సకల క్షత్త్రకుల మలాహస్కరుఁడు, భుజబలోత్థాపిత భగ్నానేక మహాబల వీరాలిచాలితోగ్రచాపుఁడు, భీమయాతుధాన వధనివారిత తపోవన భయసంశయుఁడు, సుకృతిజన మనః కుముద ప్రసాద

హేతు భూతుడు నగురామచంద్రునకు భూజాతయగు సీత నిచ్చుచున్నాను. అనురక్తాను రూప వరాభిలాషులు తుల్యగుణ ప్రీతిచే అపరిచ్ఛేద్యాభినందితులు నగువారికి కేవల వ్యవహారమాత్రకే వివాహము చేయవలయునని చెప్పబడినది.

కావున, రామ తుల్యగుణరూపయగు సీతను రామునకు, భరత లక్ష్మణ శత్రుఘ్నులకు క్రమముగా నాయుష్మతులగు మాండవి ఊర్మిళ శ్రుతకీర్తి తగినవారు. వధూవరులు తుల్యగుణవంతులు, తుల్య రాజవంశ సంబంధులు నగుదురు దీనికి మీ యందఱి యనుమోదము నున్నచో నంద ఱొక్కసారి స్వస్తి వాచకములు పల్కుడు.

అందఱు : స్వస్తి. స్వస్తి. స్వస్తి. (ఆకాశమున పుష్పవర్షము)

దశ : (లేచి) ఆహా! ఏమి నా యదృష్టము.

"జనకక్షితీంద్రుడు దాత గాగ
గురువుల్ సాన్నిధ్యమందుండ నీ
జనపాలేంద్రులు సంతసింప
ఋషి తేజః పుంజమైనట్టి యీ
జననాథాగ్రణి బాంధవంబునను
వంశంబెల్ల ధన్యంబుగా
దనరెన్ దుల్య వయోను రూపముగు
పుత్రశ్రేణి కల్యాణముల్."

వశి :
దశరథ పుత్రరత్నములు దాంతులు
శాంతులు శిష్యరత్నముల్
విశద వివేకు లస్త్రబహు విద్యలు
నాకడ నేర్చి యాజ్ఞకున్.
వసులయినట్టి వారిటు వివాహ
మహోత్సవ మందుచుండి స
ద్యశమును గాంచగాగ నట
ధన్యవశనైతి ముదబ్ధి దేలితిన్.

విశ్వా :
"తగిన సఖుండునౌ దశరథ
క్షితిపాలుడు శుద్ధకర్ముడీ
సుగుణి విదేహ భూపతి
విశుద్ధ మనస్కృత గొల్చునన్ను, న
త్యగణిత బుద్ధు లస్త్ర విదులైన
కుమారులు నాకు శిష్యులు; ల
ట్లగుట వివాహ మియ్యెడ
ముదంబుధి దేల్చెను నన్ను మిక్కిలిన్."

శతా :
"పరమ విశుద్ధ వంశమున
బాంధవమందిన రాజరాజులీ
కరణిని సత్తమోత్తమము
గా కెలువారగ బాంధవంబునన్
బరమసుఖంబు నా కొదవె;
పౌరజనంబుల సౌఖ్యలక్ష్మికై
యిరువురు గూడ రత్నమును
హేమము గూడినయట్టు లింపగున్."

(తెరలో) "ఏమేమి! ఇంత మహోత్సవము నాకు దెలియకుండగనే రాజులు చేయబూనిరా?"

వసి : ఓహో! పరశురామభగవానులు భ్రూభంగమున భువనభయంకరముగా నిటు వచ్చుచున్నారు.

(అందఱు లేచి నతశిరస్కులై నమస్కరింతురు.)

రాము : (లేచి) భయపడకుడు. భయపడకుడు.

"శస్త్రరూపంబునరో లేక శాపమునరో
చంప వచ్చిన యీ మహాచరితు నిపుడె
శాంతి నందగ జేసెద సత్యమైన
విప్రవరునకు దగునె యీవిగ్రహపుటలుక?

(క్రోధవంతుని వలె పరశురాముడు ప్రవేశించును.)

పర : (ఎవరిని జూడనట్లు నటించి)

"అలఘు బ్రహ్మవిఘాత దర్పిత బలా
హంకారులన్, వైదికో
క్తుల బాటింపని క్రూరభూపతులనే
గ్రుద్ధుండనై త్రుంచితిన్
బ్రళయాగ్ని త్వరనెల్లరిన్; బరశు నె
న్నండున్ దద్రసంబుద్రా
వ రతిన్ జూపెడు నేటికిన్, బరమ తృ
ప్తంబయ్యె బల్మారుమున్."

"ధర్మపరులైన విప్రుల దనుపుచుండు
రెవ్వరెవ్వరు వారు వారెవ్వరైన
నాత్మబలము నొసంగి నిరంతరంబు
బ్రోచుచుందును గరుణాప్రపూర్ణమతిని."

(తనలో) ఇచట జరిగినదెల్ల నాకిష్టమే. మఱి నాకీ కోప మనవసరము.

వసి : భగవానుడా! నమస్కారము.

పర : వసిష్ఠ భగవానుడా! ప్రతి నమస్కారము.

విశ్వా : కౌశికుడను విశ్వామిత్రుడు నమస్కరించుచున్నాడు.

పర : నీ బ్రహ్మత్వము శాశ్వతముగా విరాజిల్లుగాక!

జన : విదేహాధిపతి జనకుడు నమస్కరించుచున్నాడు.

పర :

"గురువవైతి మహాత్ములకును మహాత్మ!
దాతవు మహారథుండవై తనరినావు
నీకు వలసిన కామ్యంబు నెగడ సకల
శుభము లంది వెలుంగుము సూర్యతేజ!

దశ : సావిత్రుడను దశరథుడు నమస్కరించుచున్నాడు.

పర : నీ పుత్రులు నీకు శాశ్వత యశ మొసంగుదురుగాక!

రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు : భగవంతుడా! నమస్కారములు.

(సగోత్రనామపురస్సరముగా నమస్కరింతురు.)

పర : వత్సలారా! దీర్ఘాయుష్కులు పుణ్యయశస్కులు నౌదురుగాక!

ఇతరులు : (పరశురామునికి నమస్కరించి యాశీర్వచనము లందుదురు.)

పర : (జనకునితో)

"రామబలమున శివధను ర్భంగమయ్యె
నని విని తపంబు విడిచి నే నరుగుదెంచి
నాడ వేగంబునన్ చెల్పు నా.క చెట్లు?
కేసరినిసుంగు గిరి బెల్లగింపగనునె?"

జన : (బెదరుతో) భగవానుడా! శివధనువును సజ్యమొనరించినవానికి సీత నిచ్చెదనని నేను బణమేర్పఱిచితిని.

పర : అది నాకు దెలియును. తరువాత—

జన : ఆయుష్మంతుడగు రాముడా ధనువు నుద్ధతితో నెత్తనది భగ్నమయ్యెను.

పర : (రామునితో) ఇది నిజమా?

రాము : భగవానుడా! నా బాల్యచాపల్యము క్షమింపుము.

పర : ఏ బాల్యచాపల్యము?

రాము : ఇదే.

"చిరమున నుండియు మిథిలా
నరపాలుని యింటనుండిన ధనస్సది నే
గరమున బట్టిన యంతనె
చెరిసగమై పడిన యట్టి చిత్రము దేవా!"

పర : ఇదిగో—ఈ నా ధనస్సును గైకొనుము. (ఇచ్చును)

రాము : భగవానుని యాజ్ఞ. (గ్రహించును)

పర : ఎక్కుపెట్టుము. నీ వైష్ణవమగు రూపమును గాంచగంటిని.

(తనలో) ఆహా! నా కోరిక సిద్ధించినది.

"ఖలులై పాపులునై యధర్మగతులై
గర్వాంధులై మన్నరా
జుల నొక్కుమ్మడి దైవశాసనమునన్
శుద్ధాత్మతన్ జంపితిన్
దొలుతన్. బిమ్మట సత్తపోవ్రతుడనై
తుష్టుండనై మంటిగా
నిలలో గాని మనోవిచారమునను
బాధించు నొక్కప్పుడున్."

"అంశభూతుడు దైత్యారియైన రామ
చంద్రుడొ గద! ధర్మప్రచండు డతడు
నేనొనర్పక విడిచిన నిఖిలదైత్య
మర్దనం బొనరించి క్షేమంబుగాంచు."

(ప్రకాశముగా) వత్సా! దాశరథీ! నీవు వైకుంఠవాసియగు దేవుడవు. తపోవనముల నీవు రాక్షసుల వధించిన వృత్తాంతము విన్నప్పుడే పురుషోత్తము డీరామరూపమున జన్మించెనని గ్రహించితిని. అందుచే స్వప్రణామముగా నా ధనువు నీకర్పించితిని.

"పాపుల బరిమార్చుటకే
చేపట్టుము నీవు దీని; సిద్ధము ధర్మల్
ప్రాపించి శరణు చొచ్చిన
నేపగిదిని వారి గాంచి యొసగుము రామా!"

రాము : దేవా! అట్లే చేయుదును.

పర : ధర్మమార్గమున నేనే యే లోకముల జయించితినో యవియన్నియు నీకు వంశ పరంపరగా వచ్చునట్లిచ్చివేసి నేను దత్త్వజ్ఞుడనై తనరార నేగుచున్నాను.

వసి : భగవానుడా! పుణ్యార్జితములైన లోకముల నేల విడిచెదరు?

పర :

"కాలవశమున బుణ్యంబు క్షయముగాగ
సారహీనంబులౌ నెట్టి సంపదలును;
వానిపైనుండ దావంతయైన నాస్థ
కాన నేను త్యజింతు లోకమ్ములెల్ల."

"అగు చిదానందమయమైన యట్టి బ్రహ్మ
మరయ శాశ్వతే, మది పరాత్పరము దాని
యందు నిత్యస్థితియె మహానంద మొసగు
నందె నేను బ్రహ్మానంద మందుచుందు."

విదూ : (తనలో) ఈ ముసలి యొలుసుబంటి త్వరగా బోయిన మంచిది.

పర : నే నేగి వచ్చెదను. (శీఘ్రముగా నిష్క్రమించును)

జన : ఆహా! జామదగ్న్యు డెమితి బలశాలికదా! ఈతడెంత పరమశాంతుడే! ఇక క్షత్రియులు సుఖింతురు గాక!

రాము : పరశురాముడాదేశించిన ప్రకారమిక నేను చాపనాశన ముపేక్షింపరాదు. పాపులెల్లరిక బలాయమాన నిద్రాముద్రితులు, కంపమాన మనస్కులు నౌదురు. (నిష్క్రమించును)

దశ : పరశురామ భగవానులు సర్వతేజో నిరాకరిష్ణులై బ్రహ్మత్వమందినారు.

విదూ : (తనలో) ఈ వృద్ధ బుక్కము ఏడలి పోయినపిమ్మట వీరంద ఱాతనిని స్తుతించుచున్నారు. ఉండెగా స్తుతించుటకు భయమే.

విశ్వా : ఔనౌను. ఆతని పరాక్రమమువలన బహు క్షత్రియులు మరణించినారు. ఆతని బ్రహ్మతేజో మహత్త్వమున నిక నెవ్వరికి నాపద రాదు. మఱియు వసిష్ఠ భగవానుల బ్రహ్మత్వము మావృత్తులకు సైతము నందరానిది. దానిని దిరస్కరింప నే బలసముదాయము చాలదు.

వసి : అది యెప్పటి మాటయో.

విశ్వా : (పైకి జూచి) దివ్యాభినందన మంది సపత్నీకులై దశరథకులప్రశస్తులు కుమారుల మధ్యమున గూర్చుండియున్నారు.

వసి : ఏది?

విశ్వా : అదిగో. అందఱు పైకి జూడుడు.

అందఱు : (పైకి జూతురు.)

విశ్వా :

"నలువయును విష్ణువున్ శివుడు
నారద తుంబురు లింద్రుడున్ మహా
హాలుడయి కల్పవృక్షమును
సావలి జల్లగ మంగళాక్షతల్
సలలితరీతి పరస్తుతము
సర్వసుపర్వులు జూచుచుండ్రె ని
ష్ఠుర బహువాద్యఘోషముల
తో నిటనయ్యెను పెండ్లిముచ్చటల్."

దశరథ జనకులు : (జూచి) నిజము. నిజము.

[అంత నలువురు వధువులు నలువురు వరుల ప్రక్క నిలిచి సపరివారముగా ప్రవేశింతురు. దివ్య వాద్యఘోషములతో నాకసమునుండి పుష్పవృష్టి కురియును.]

అందఱు : స్వస్తి. స్వస్తి. స్వస్తి.

విశ్వా: సఖా! దశరథా! నీకింక నేమి ప్రియము కావలయునో కోరుకొనుము.

దశ :

"పుత్త్రులు లేని దుఃఖ మది
పోయిన దెప్పుడో మైథిలీశ స
త్పుత్త్రికలైరి నాకు బరి
పూర్ణ సుఖంబు లొసంగగా స్నుషల్,
క్షత్త్రియసంతతిన్ బరమ
శౌర్యనిధానము లన్నకీర్తితో
బుత్త్రులు నొప్పిరింక దల
పోయగ గోరిక లన్య మున్నదే?"

విశ్వా : ఐన నిట్లగు గాక! రాజసింహుడవగు నీవు పాలింప:

"వర్ణాశ్రమ ధర్మంబులు
పూర్ణంబుగ నలయ బ్రజలు పొందగ బహుసం
పూర్ణ సుఖంబులు మఱి నిఖి
లార్ణవ మధ్యస్థ భూమి యలరుత శాంతిన్."

వసి : తథాస్తు.

[అందఱు నిష్క్రమింతురు, తెరపడును.]

(సంపూర్ణము)

# సాత్త్వికభావములు



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

స్తంభము, చెమటపోయుట, గగుర్పాటు, గద్గదిక భాషణము, వణకుట, వివర్ణత్వము నందుట, కంట తడిపెట్టుట, ప్రలయము ననువానిని సాత్త్వికభావములనుచున్నారు. సాత్త్వికభావములకు, అనుభావములకు సామ్యము చాల కలదు. ఇవి స్థాయిభావములకంటె విలక్షణములు. వీటిని సంచారిభావములుగా గూడ గ్రహించరాదు.

అభ్యంతరములుగా ననుభవింపబడునవి సంచారిభావములని, బాహ్యముగా ప్రతీయమానములగునవి స్వేదరోమాంచాది సాత్త్వికభావములని శృంగారప్రకాశకారుడనినాడు. బాహ్యముగా, అనగా శారీరకముగా, ననుభవించువానిని అనుభావములు, (*Sensations*) అని యందురు. ఇవి అంతర్గతమగు భావము ననుసరించి యుండునవి.

రసానురూపములగు నాలాపములతో, నానాలంకార సంయుక్తములగు పద, వాక్య, శ్లోకములతో వాచిక రసము కల్గునని, కర్మ, రూప, వయో, జాతి, దేశ, కాలానువర్తులగు మాల్య భూషణ వస్త్రాదికముచే నేపథ్యరసము వచ్చునని, రూప, యౌవన, లావణ్య, స్థైర్య, ధైర్యాది గుణములతో స్వాభావిక రసము రాగలదని మాతృగుప్తుడనినాడు. ఇందలి వాచిక రసమును వాచిక శృంగారముగాను, నేపథ్యరసము నాంగిక శృంగారముగాను శారదాతనయుడు చిత్రించినాడు. ఇచట రస శబ్ద మనుభావములకు వర్తింప బడినది. వాఙ్నేపథ్య క్రియాత్మకముగా శృంగారము, అంగ నేపథ్య వాక్యాత్మకముగా హాస్య రౌద్రములు, త్రివిధములుగా గలవని భరతుడే చెప్పుచున్నాడు. కాని ఈ వాదములో అనుభావమును సంచారిభావముగా గ్రహించి, ఆ పై స్థాయిభావముగా తీసికొనుట గలదు. ఇట్లనుభావమును సంచారిగా స్వీకరించుట ప్రామాదికమని వెనుక వివరించితిమి.

అనుభావమనగా నేమి ? బాహ్యజగత్తులోని విషయములతో మనకు సంబంధము కలుగగా వాటిని గురించి కొంతవరకు తెలిసికొనగలుగుచున్నాము. ఈ యనుభూతిలో విషయము వేరు, మనలో కలుగు మార్పులు వేరు. సూది గుచ్చుకొనగానే మనకు కలుగు అనుభావములో బాధకలదు. సూది యను విషయముతో మనకు కలుగు సంబంధముద్వారా వచ్చు అనుభావమును సాక్షాత్తుగా, అపరోక్షముగా, బాధ యని తెలిసికొనుచున్నాము.

శరీరమున జీర్ణకోశము మొదలగు వానిలో కలుగు మార్పులు, పరిసరములలో వచ్చు సంచలనములు, మన ఇంద్రియములను సంచలింప జేయుచున్నవి. ఈ సంచలనములద్వారా మెదడులో మార్పులు రాగలవు. ఈ మార్పు లనుభావములలో ముఖ్యముగా కన్పించును. ఒక విషయమును మనము చూచినపుడు మనలో కొన్ని పరిణామములు బయలుదేరును. సాక్షాదపరోక్ష ప్రతీతిలో నంతర్లీనములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములకే పరిణామములు సంబంధించియుండును. ఇచట విషయము, మన అనుభావము అను రెండు విలక్షణవస్తువులు కలవు. ఈ యనుభావములు వ్యక్తిభేదముచే భిన్నములగుచున్నవి. ఏవ్యక్తి అనుభవము ఆ వ్యక్తిదే. కాని అనుభావములు విషయ ప్రత్యక్షమున కలుగున వగుటచే మానసిక వృత్తులు కాజాలవు. అనగా అనుభావములు స్వార్థజ్ఞాపకము లైనను వస్తుతంత్రములగుచున్నవి. జ్ఞానముచే నుపజీవ్యములగు అనుభావము లర్థవంతములుగా ప్రతీయమానములగుచున్నవి. అవిభ్రాంతత్వము, అన్యోన్యాపేక్షకత్వముగల అనుభావములు మనస్సుతోను, బాహ్య విషయములతోను సంబంధము కలిగి యుండక తప్పదు. అనగా నసమగ్రములు, పరతంత్రములునగు అనుభావము లప్రధానము లగుటచే స్థాయిభావములు కాజాలవు; చిత్తవృత్తివిశేషములు గాక పోవుటచే నివి సంచారిభావములు కూడ కాజాలవు. మన వృత్తు లుద్దీప్తములై ప్రవృత్తిపరములైనపుడు శరీరమున కన్పించు పరిణామములను అనుభావములందురు. అనుభావతుల్యములైనవి సాత్త్వికభావములు. వీటిని స్థాయిభావములుగా గాని, సంచారిభావములుగా గాని స్వీకరింపరాదు.

ఇంద్రియార్థ సంయోగవశమున స్థాయిభావము సంచారి భావముతో నన్వితమై ప్రవృత్తమగుచున్నది. సంచారిభావము నుద్దీపింప జేయగల శక్తి బాహ్యవస్తువున గలదు. ఇట్టి ఉద్దీపనము మానసికముగా జరుగుచున్నను, శారీరకముగా నభివ్యక్త

మగుచున్నది. కేవలము శరీరముగాని, కేవలము మనస్సుగాని బాహ్య వస్తువును గ్రహించుట లేదు. మనోదేహములతో గూడిన వ్యక్తియే బాహ్యవస్తువు నవగతము చేసికొనగలుగుచున్నాడు.

చేతనుడగు వ్యక్తియొక్క అనుభూతులు ప్రయోజనసహితములు. ప్రవృత్తి భేదముచే ప్రయోజన భేదము వచ్చును. మనముచేయు ప్రయత్నముయొక్క తీవ్రత్వాదికము నాధారము చేసికొని ఈ భేదము వచ్చుచున్నది. మనము కొంచె మేమరియున్నచో మన ప్రయత్నమున నీ యేమరిపాటు కన్పించగలదు. సంచారిభావ మతితీవ్రరూపమున నుద్దీపితమైన నుద్దిష్టార్థమును గూర్చిన ప్రయత్నము గూడ తీవ్రత నందగలదు. ఈ తీవ్రత యున్నపుడు అన్యకార్యాపేక్షగాని, విశ్రాంతిగాని కుదరవు. ఇట్టి తీవ్రత ప్రధానముగా మానసికమై, శారీరకముగా నభివ్యక్తమగును. సంచారిభావము నుద్దీపించిన సన్నివేశము కొనసాగునంతవరకు తీవ్రత తగ్గదు. అనగా సంచారిభావానుభూతి మనో దేహ సంవలితమైన ప్రవృత్తి. ఈ సంచారి భావములో కన్పించు శారీరకములగు మార్పులద్వారా ప్రవృత్తమగు స్థాయి భావమునకనుగుణముగా శరీరమును దిద్దగలుగుచున్నాము.

శారీరకములగు మార్పులు రెండు విధములుగా వచ్చుచున్నవి. శరీరమందలి గ్రంథుల సంచలనముల ద్వారా శరీర సంచలనములు సంభవించుట యొక విధము. వీటిని సాత్త్వికభావము లందురు. ఇవి సంచారిభావములవలన బయలుదేరు బాహ్యానుభావములు. భయముద్దీప్తమై పారిపోవుటకు యత్నము జరుగునపుడు నరములద్వారా గ్రంథులు కదలబారుచున్నవి. ఈ గ్రంథులనుండి యొకానొక ద్రవము రక్తనాళములోనికి స్రవించును. రక్తనాళముల నీ ద్రవము ప్రకోపింపజేయగా కాలేయమున చక్కెరవంటి పదార్థ ముద్భవించును. రక్త మీ పదార్థమును కండరములకు తీసికొనిపోగా కండరములు శక్తివంతములై పరుగెత్తి పోవుటకు తోడ్పడుచున్నవి. భయక్రోధము లుద్దీప్తములైనపుడు శారీరక పరిణామము లతి త్వరగా, అతి తీవ్రముగా నీరీతిగా జరుగగలవు. ఈ విధమగు శారీరక పరిణామములలో ముఖ్యమైనవి ఎనిమిది గలవు. స్తంభమున కదలిక యుండదు. భయము, వ్యాధి, అమితానందము మొదలగువానిద్వారా నిది వచ్చును. క్రోధ, భయ, హర్ష, లజ్జా, దుఃఖ, శ్రమ, రోగ, తాప, ఘాత, వ్యాయామాదులద్వారా చెమట పోయును. శీత, భయ, హర్ష, స్పర్శ, క్రోధ, రోగములవలన గగుర్పాటు కల్గును. భయ, హర్ష, క్రోధ, జరా, రోగ, మదములవలన స్వరభేదము బయలుదేరును. శీత, భయ, హర్ష, రోష, జరా, స్పర్శములవలన వణకుట కల్గును. శీత, క్రోధ, భయ, శ్రమ, రోగ, క్లమ, తాపములద్వారా వైవర్ణ్యము రాగలదు. ఆనంద, అమర్ష, ధూమ, అంజన, జృంభణ భయ, శోక, అనిమేష ప్రేక్షణ, శీత, రోగములనుండి కన్నీరుకారును. శ్రమ, మూర్ఛ, మద, నిద్ర, అభిఘాత, మోహములు ప్రలయమును తెచ్చుచున్నవి. మనోగతభావము లుద్దీప్తములైనప్పుడీ మార్పులు శరీరమున కన్పించగలవు.

సత్త్వమనగా సజీవమగు దేహము. ఈ దేహమునకు సంబంధించినవి సాత్త్విక భావములు. సాత్త్వికాద్యను భావములు సంచారిభావ జన్యములుగా కన్పించుచున్నను, జేమ్స్ (*James*), లాంగ్ (*Longe*) అను మనస్తత్త్వశాస్త్రజ్ఞులొక విపరీత వాదమును లేవదీసినారు. శారీరకమగు మార్పువలన, అనగా అనుభావమువలన, జనించునది సంచారి భావమని వీరి వాదము. మన మేడ్చుటచే శోకమను సంచారి భావము, కొట్టుటచే క్రోధమను భావము, వణకుటచే భయమను భావము వచ్చుచున్నవనుట లౌకిక ప్రతీతికి విరుద్ధముగా పల్కుటయే. కాని శారీరకములగు అనుభావములు లేనిచో సంచారి భావము లర్థరహితములు కాగలవను ఈ వాద సారాంశము పరమ ప్రామాణికమే.

ఒకానొక వేదనను (*Feeling*) తెల్పునది సంచారి భావము. వేదన బాహ్యవిషయము నాధారముగా చేసికొని వచ్చునది. ఈ బాహ్యవస్తువు కన్పించగానే సంచారి భావ ముద్దీపితమగుచున్నది. స్థాయి భావమును ప్రవృత్తి పరముగా చేయు సంచారి భావమునకు, స్థాయి భావమునకు గల భేదమును జేమ్స్ గమనించలేదు. ప్రతి సంచారిభావములోను వివిధాంశములు గలవనియు, ప్రతి అంశము భౌతికమగు దేహముద్వారా ప్రవృత్తమగుచున్నదనియు, కాగా సంచారి భావము కేవలము శారీరకమేననియు జేమ్స్ వాదము. అనగా సంచారిభావము (*Emotion*)నకు అనుభావ (*Sensation*) మను నర్థమును చెప్పవలసి యుండును. విషయ దర్శనవలన కలుగు మార్పులు ప్రవృత్తిపరమగు మనస్సుచే నియంత్రితములై గ్రహింపబడునవి. సంచారి భావమును భావరహితమైనచో అర్థరహితమే యగును. కాని అనుభావములకంటె విలక్షణమైన సంచారి భావము లేదనుట పొరబాటు. శరీరము మొద్దుబారినచో సంచారి భావము ననుభవింపజాలని మాట వాస్తవమే. కాని అనుభావములు, సంచారి భావములు అవినాభావ సంబంధము కలవని గుర్తించవలెను.

అనుపహితమగు మానసస్థ సత్త్వమందుచే. ఇట్టి మనస్సునుండి భావములు జనించుటచే భావము లన్నియు సాత్త్వికములే యగునని శృంగార ప్రకాశి కారుడనినాడు. కాని సమస్త భావములు సత్త్వమూల కము లగుటచే సాత్త్వికము లైనను, స్తంభస్వేదాదులు కేవలము సత్త్వమునుండి జనించుటచే వీటినే సాత్త్విక భావములనవలెనని సింగభూపాలుడు నిర్ణయించినాడు. మనః ప్రభావమైనది సత్త్వము. సమాహితమగు మనస్సునుండి వచ్చునది సత్త్వము. మనస్సు సమాధిలో నున్నప్పుడు సత్త్వ నిష్పత్తి జరుగును. ఈ సత్త్వము రోమాంచాది రూపమున వ్యక్తమగుచున్నది. ఒక వ్యక్తియందీ వ్యక్తీకరణమెట్లు జరుగుచున్నదో దాని నితరులనుకరించగలరే గాని, తెలిసికొన్నట్లుగా చూపలేరు. అనగా సాత్త్విక భావములు మానసిక ప్రవృత్తులవలన నుత్పన్నములై అనుభావము లగుటచేత వ్యక్తి భేదములతో భిన్నములుగా భాసించగలవు. సాత్త్విక భావానుగతమగు సంచారి భావము సుఖదుఃఖాది హేతుకమగుచు స్థాయి భావమును ప్రవృత్తిపరము చేయుచున్నది. సంచారిభావ సుద్దీపితము కాగా తదభివ్యక్తికి తోడ్పడు శారీరక పరిణామములే సాత్త్విక భావములని తాత్పర్యము.



'సంజ వేళ'

చిత్రకారుడు: శ్రీ పేరి. సుబ్బారావు, అమలాపురం.

# ఆంధ్రసంస్కృతి



శ్రీ నోరి నరసింహశాస్త్రి

ఆంధ్రరాష్ట్ర మవతరింపవలెనను ఆందోళనము ఎక్కువగుచున్న కొలదియు తరచుగా 'ఆంధ్ర సంస్కృతి' యను పదము వినబడుచున్నది. ఆంధ్రులకు ప్రత్యేకముగా నొక సంస్కృతి కలదా? ఉన్నచో నది ఏమి? దాని స్వరూప మెట్టిది? — నిష్పక్షపాతముగా విచారింప యత్నింతము.

ఒక ప్రత్యేక సంస్కృతి యన్నప్పుడది వారి శిల్పమునను చిత్రకళలోను వాఙ్మయమందు సంగీతమున, గృహవాస్తువు గ్రామనిర్మాణము పుర నిర్మాణము నౌకా నిర్మాణము, మతము, తత్త్వవిచారము, వేషము, ఆచారములు, సాంఘిక వ్యవస్థలు, ప్రకృతిసిద్ధ సంస్థానము, చరిత్ర — ఇత్యాది సమస్త విషయములందును ప్రతిబింబించును. అట్టి ప్రత్యేకత ఏమైనను ఆంధ్రులకున్నదా?

ఆంధ్ర శిల్పము ఆంధ్రుల చిత్రకళయని పలుమారులు పత్రికలలో చదువుచుందుము, ఉపన్యాస వేదికలనుండి వినుచుందుము. ఆంధ్ర శిల్పమన్న వెంటనే అమరావతి నాగార్జునకొండ ఉదహరింతురు. చిత్రకళ యనగానే అజంతా యందుము. పుర నిర్మాణ మన్నంతనే హంపీ విద్యానగరము పేరెత్తుదుము. ఇందులో నేవి నిజముగా ఆంధ్రుల కాణాచులు? వాని ప్రత్యేకత ఏమి?

మనమెంత కాదన ప్రయత్నించినను, అజంతా గుహలు తెలుగు దేశము మధ్యములో లేవు. అవి మహారాష్ట్రము కన్నడము తెలుగు మిశ్రమైన భాగములో నున్నవి. అందును తెలుగక్కడ చాల తక్కువ. అజంతా గుహలు తొలుచుటలోనను అక్కడి గండారములు మలచుటలోనను అందలి చిత్రములు వ్రాయుటలోనను ఆంధ్రదేశములోని పని వారు గూడ తప్పక పాల్గొనియే యుందురు. కాని అజంతా ప్రత్యేక మాంధ్రులదనుట బుద్ధిమంతు లంగీకరించుమాట కాదు.

అదే విధముగా విద్యానగరము! విద్యానగర సామ్రాజ్యమును తరుచుగా కర్ణాటక రాజ్యమనువారు. శ్రీ కృష్ణదేవరాయలు మృతి నొందిన పిమ్మట కలిగిన యంతఃకలహములను పురస్కరించుకొని గజపతి విద్యానగర రాజ్యములోనికి దండెత్తిరాగా, అల్లసాని పెద్దన కోపించి ఒక సీసపద్యము వ్రాసి గజపతికి పంపినట్లు చెప్పెదరు. అందులో 'కన్నడంబెట్లు చొచ్చెదు గజపతీంద్ర!' అని యున్నది. శృంగేరి విరూపాక్ష పీఠాధిపతుల సెలవ గద్యములలో గూడ వారికి 'కర్ణాటక సింహాసనాధీశ్వరులకు' నామమే కలదు. అంత మాత్రమున విద్యానగరము కేవలముగా కర్ణాటుల దన జెల్లదు. మొట్టమొదట నెట్లున్నను దాని యంత్యదశలో తెలుగు నాయకులు మంత్రులు కవులు ఆ సామ్రాజ్యములో ఎక్కువ పలుకుబడి సంపాదించుకొనిరి. ఏది ఎట్లున్నను మొత్తము మీద కన్నడులు ఆంధ్రులు తమిళులు కొంచెముగా కేరళులు కూడ యథాశక్తిగా దాని స్థాపనకును అభివృద్ధికిని తుదకు విచ్ఛిత్తికిని గూడ తోడ్పడిన మహారాజ్యమది! అందుచే హంపీలో ఆంధ్రుల ప్రత్యేక సంస్కృతి కొరకన్వేషించుట వృథాశ్రమ.

ఇక మిగిలినవి అమరావతి, నాగార్జునకొండ — కాకున్న భట్టిప్రోలు, ఘంటసాల, గుడివాడ, జగ్గయ్యపేట ఇత్యాదులును చేర్పవచ్చును. ఇవి యన్నియు నిస్సందేహముగా ఆంధ్రభూమి మధ్య భాగమున నవతరించినవే. మరియైనచో వాని శిల్పములో నొక ప్రత్యేకత యున్నదా? వానిని గూర్చి విచారణచేయు సందర్భములో నవి యన్నియును చైత్యము లన్నమాట మరువక జ్ఞప్తియం దుంచుకొనవలెను. స్తూపమనుమాట సరియైనది కాదు. అది సింహళమునుండి ఎరువు తెచ్చుకొన్న క్రొత్త పదము. చైత్యమనగా చితి సంబంధమైనది. గౌతమ బుద్ధుని యొక్కయో అర్హతులయొక్కయో దేహములను

సాహసముచేసి శేషించిన బూదిదెయో ధాతుకంచమో—దంతమో కేశమో—భద్రపరచి యా స్థానమును పూజించి ప్రదక్షిణము చేయు నిమిత్తము ప్రధానముగా నవి యవతరించినవి. ఆ ప్రదేశములను చైత్య నిర్మాణమునకు పూర్వమో పరమందుననో భరతదేశమున నానా భాగములనుండియే గాక విదేశములనుండి కూడ భక్తులను శిల్పులను ఆకర్షించి యుండినవి. మహాత్ముల దేహశేషములపై అద్భుతమైన కట్టడములు కట్టి పూజా ప్రదక్షిణము నొనరించుట ఆంధ్రుల ప్రత్యేక సంస్కృతి లక్షణ మందుమా? అట్లైనచో నట్టి సంస్కారము మనలో బహు శతాబ్దములుగా లోపించి పోయినది. అటు కానున్నను అమరావతి నాగార్జునకొండ ఇత్యాదుల చైత్య నిర్మాణమునకును విగ్రహ లక్షణములకును ఇతరాంధ్ర శిల్పములకును సాజాత్యమేమైన నున్నదా? ఉన్నచో నేమి? సాంచీ చైత్య నిర్మాణమునకు వీనికి భేదమేమి? ఉన్న స్వల్పభేదములును ఆంధ్రుల ప్రత్యేకతను ప్రదర్శించునా? అట్టిది నిరూపించిన వారిప్పటికి లేరు. ఏది యెట్లున్నను తెలుగు దేశములో ఈ చైత్య నిర్మాణ మాగిపోయి ఎన్నో శతాబ్దములైనవి. దాని శాఖ లిప్పుడేవియు గనబడవు. అందుచే వానిలో నాంధ్రత్వమున్నదని పొంగిపోవుట నిష్ప్రయోజనము.

ఇక నేటి కాలపు చిత్రకారులున్నారు. వారిలో కొందరు శ్రీ ప్రమోద కుమార ఛటర్జీ శిష్యులు. పెక్కురు శ్రీ దేవీ ప్రసాదరాయ శిష్యులు. కొలదిమంది శాంతి నికేతనము వెళ్లి యభ్యసించిన వారున్నారు. అంతకంటెను కొద్దిమంది బొంబాయిలో స్కూలు ఆఫ్ ఆర్ట్సులో ఆంగ్లేయ చిత్రకారుని యొద్ద నేర్చినవారు. చివరి తరగతిలో కథామాత్ర శేషుడైన దామెర్ల రామారావు ముఖ్యుడు. అందరును బుద్ధిమంతులే. చక్కని చిత్రములు వ్రాయుచున్నవారే! కాని వీరిలో ప్రత్యేకాంధ్రత్వమున్నదా? ఆంధ్రశైలి యనదగినది వీరు నిర్మించినారా? వారు చూపుచున్న యాంధ్రత్వము పూర్వము నుండి అనుస్యూతముగా వచ్చుచున్నదా? తద్విదులైనవారు అట్టిదున్నచో దానిని స్థూలముగానైన నిరూపింపగలరా?

ఇక సంగీతమున్నది. త్యాగరాయల వారి పేరు చెప్పుకొని మనము మురిసిపోవుచుందుము. కాని నాటితో సహా మన సంగీతవిద్వాంసులకు అభిమానమైనది 'కర్ణాటక సంగీతము' కదా! త్యాగరాయలు స్వచ్ఛముగా తమిళదేశ మధ్యమున పుట్టి పెరిగినవారు. ఆయన సంప్రదాయమును పోషించుచున్నవారిలో తమిళులే అగ్రగణ్యులు; కర్ణాటకులును ఆంధ్రులును వారి తర్వాతనే గణింపదగినవారు. త్యాగరాయలున్న ప్రాంతములో ఆ కాలమున తెలుగు రాజభాషగా నున్నందుననో మరి యే కారణముననో ఆయన తెలుగులో కృతులు చెప్పుట తటస్థించినది. ఇక వరంగ కాలక్షేపమనునది మహారాష్ట్రులు అభంగములను మన వారనుకరించుటచే వాడుకలోనికి వచ్చినట్లు తోచును. మరి మిగిలినది తాళ్లపాకవారి పదములు అధ్యాత్మ సంకీర్తనములు క్షేత్రయ్య పదములు ఇట్టివి. వీనిలోనైన విలక్షణమైన ఆంధ్ర సంగీతమున్నదనగలమా? సంగీతశాస్త్రవిమర్శకు లింకను అట్టిది విశదపరుపవలసి యున్నది.

మరి పురనిర్మాణము గ్రామ నిర్మాణము, గృహ నిర్మాణము—వీనిలో నాంధ్రుల ప్రత్యేకత యున్నదా? పూరిళ్లు దక్షిణదేశమంతటను ఒకటే తీరు. వాస్తుశాస్త్ర మనుసరించి కట్టబడుచుండిన మండువా ఇళ్లును అంతట నొకటే పద్ధతి. నేటి కాలములో పాశ్చాత్యానుకరణముతో వెలయుచున్న మందిరములు పదేళ్లకొకసారి మారిపోవుచున్న క్రొత్తక్రొత్త తీరులతో నవతరించుచున్నవి. ఇందులో నే సంస్కృతి కనిపించుటలేదు. గ్రామ నిర్మాణము పుర నిర్మాణమందును నంతే! ఆంధ్రుల ప్రత్యేకత ఏమియు వానిలో కనబడదు.

ఆంధ్రనౌకలు ఒకానొకప్పుడు తూర్పు సముద్రముననే కాక పశ్చిమ సముద్రమునను దక్షిణ సముద్రమునను పసిఫికు అట్లాంటికు మహాసముద్రములందును నిరంతర సంచారములు చేసియుండెను. నేడు చూడగా తూర్పు సముద్రతీరమందంతటను నౌకలలోను నావికులలోను సాజాత్యమున్నది. కళింగులకును తెలుగువారికిని తమిళులకును భేదమగపడదు. ఇప్పటికిని బర్మాలో తెలుగు వారిని గూడ క్లింగులనియే వ్యవహరింతురు. ఆంధ్రనౌకలలోను నావికులలోనను విశిష్టతయున్నచో విదేశీయులైన నది గమనించి యుండరా? పూర్వము మోటుపల్లినుండి ఆంధ్ర నావలు ప్రపంచ సంచారముచేసి 'సప్తద్వీప సద్వస్తు

సంహోహంబుం వనకిచ్చు నెచ్చెలి సముద్రుం ప్రీతి గావించిన దినములలో నేమైన ఆ నావలకు విశిష్టత యుండెనేమో! అదియును మనమింకను త్రవ్వి బయలు పెట్టవలసి యున్నది.

ఆంధ్రులకు ప్రత్యేకమత మొకటిలేదు. ప్రత్యేకముగా నాంధ్రాచారములును లేవు. ఒక్కొక్క కులమునకు ప్రత్యేకమైన యాచారము లున్నవి, వస్త్రాదిధారణ విధానము లున్నవి. కాని కట్టులోగాని జుట్టులోగాని బొట్టులోగాని ఇది యాంధ్రమైనదని వేరుగా నేమియు లేదు.

తత్త్వవిచారణలోగూడ ఆంధ్రులకు ప్రత్యేకత లేదు. భరత ఖండమములో వ్యాపించిన సమస్త తత్త్వ విచారణలకును ఆంధ్ర విజ్ఞానవేత్తలును యథాశక్తిగా సహాయపడినారు.

ఎంతదూర మట్లు విచారించుకొనిపోయినను సర్వతోముఖమైన ఆంధ్ర సంస్కృతి ప్రత్యేకముగా నొకటి ఉన్నట్లగపడదు. ఆంధ్రులకు ప్రత్యేకముగా నున్నది భాష యొక్కటే! అందులో నెన్ని యవాంతర భేదములున్నను ఇది యాంధ్రభాష యని చెప్ప దగినది నిర్దుష్టముగా నొకటున్నది. అందుచే నాంధ్రుల ప్రత్యేక సంస్కృతి యేమైన నున్నచో అది ఈ భాషా పరిశ్రమయందే ఉండవలెను. ఏమి టది?

ఆంధ్ర వాఙ్మయ కర్తలలో పూజ్యులగువారు మొదటినుండి ఇప్పటివరకు ఆసేతు హిమాచలభూమిని ఏకముగా సంధానము చేయుచున్న సంస్కృతభాషా ప్రభావము కలవారు. సంస్కృత భాషాపాండిత్యము లేని యాంధ్రకవి శశ విషాణమువంటివాడే. నన్నయనుండి శ్రీ విశ్వనాథ వరకు నంతే! సంస్కృత భాష నుండియే ఆంధ్రము పుట్టినదనువారి వాదము సత్యము కాకపోయిన నేమి? ఆంధ్రకవుల చేతులలో ఆంధ్రభాష సంస్కృతభాషా సంప్రదాయములలో నడచినది. ఆంధ్రకవులలో కేవలా వేశపరులు లేరు. శివమెత్తి మైమరచి ప్రలాపించు తామసులకు వారిలో పూజ్యస్థానము లేదు. వారందరు నొక పరిపూర్ణత కలవారు, ఆత్మనిగ్రహము కలవారు. వారు వాఙ్మయోపాసకులు, అక్షరరమ్యతావేదులు. అనంతమైన విశాలవిశ్వమును అందున్న ఊహాతీతమగు వైలక్షణ్యము లక్షించుచునే తమ యాత్మలోనికి, కూర్మమువలె తమ యింద్రియములను సంకోచము చేసికొనగల యోగీశ్వరులు. వారి యభిమానమునకు పాత్రమైనది భరతఖండమే. అయినను అది భరతవర్షములో నొక భాగమనియు, అది మరల జంబూద్వీపములో నొక భాగమనియు నిత్యము సంధ్యావందనముల స్మరించు నాచారము కలవారు. వారు ఏ కాలములో నున్నవారైనను కాల మనంత మని దాని ప్రభావ మెరిగినవారు. ఒక కాలములో ఒక దేశములో ఒక ఉపాధి చేకొని ఈనాడు జన్మించియున్నను, కాలాంతరమున దేశాంతరమున ఉపాధ్యంతరము చేకొని జన్మించి యుంటిమనియు, ముందు జన్మింపగలమనియు వారెరుగుదురు. శ్రేయోమార్గము వారి కెరుక అభ్యుదయము వారి కభిమానము. తెలుగు కవులు ప్రత్యేకముగా నుపాసించినది శ్రీకారము. శ్రీకారము ఆంధ్రకవుల సంస్కృతి చిహ్నము. పూర్వమాంధ్ర నౌకలు ద్వీపాంతరములకు శ్రీకారము చిత్రింపబడిన ధ్వజములు స్తంభములపై నాట్యము చేయుచుండ సప్తసముద్రములలో ప్రయాణములు చేయుచుండెడివని చరిత్రకారులు చెప్పుచున్నారు. ఆంధ్రకవులు ఆద్యులైన ఋషుల సంతతిలోని వారు. ప్రత్యేకముగా నాంధ్ర సంస్కృతి యేమైననున్నచో నది యాంధ్ర కవులు వాఙ్మయరంగములో ప్రదర్శించిన అర్షదృష్టియే!

ఆంధ్ర సంస్కృతి ఇతర రంగములలో లేక పోవుటకు ముఖ్య కారణములు రెండు. ఒకటి ప్రకృతి సిద్ధమగు సంస్థానము. రెండవది చరిత్ర.

ఆంధ్రదేశము ప్రకృతి సిద్ధమగు స్వరూపము గమనించినచో వైవిధ్య మెక్కువ కనిపించును. కొంత పర్వతమయమైన భూమి, మరికొంత తీర భూమి, కొంత మైదానము, కొంత తృణ జల సంపూర్ణము, కొంత నిర్జలము. ఇంతే కాదు. దీనికి స్వభావ సిద్ధమైన ఎల్లలు లేవు. తూర్పున మాత్రము సముద్రమున్నది. ఉత్తరమునగాని దక్షిణమునగాని పశ్చిమమునగాని దానికి నైజమగు హద్దులు లేవు. సరిహద్దులు నిర్ణయించుట యందుచేత నే మనకు కష్టతర మగుచున్నది. ఆంధ్ర వాఙ్మయ సంస్కృతి దాని స్వీయపటుత్వమువల్లనే దక్షిణమున కావేరీ తీరమును గూడ దాటి విజృంభించినది. తంజాపురమే కాక మధురకూడ దాని నిర్మాణయంత్రశాల యైనది.

# సంసారం



శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

'అహోబలరావు' ఆ కాలేజీకి క్రొత్త లెక్చరరు. అతను ఉదయం లేస్తూనే ఒక అనూయిత్యపు పనిచేశాడు. తత్పర్యవసానంగా పంచో మిత్రధి సైకిళ్లు పాతిక కార్లు పావు డజను లారీలు ఒక గ్రోసున్నర రిక్షాలు ఎక్కడి వక్కడే సడెన్ బ్రేకులు త్రొక్కుకుని స్తంభించిపోయినై.

అక్కడికి కొంతమంది కార్యశూరులు పోగయ్యారు. వాళ్లు ఉపన్యాసాలు పంచి సందేశాలు యిచ్చే రకంగాదు. ముఖ్యంగా ఆడవాళ్లకు అందులో వయసులో చిన్నవాళ్లకు ఏదన్నా ఆపద వస్తుందా మనం సేవచేద్దామా అని కాచుకూర్చుంటారు. ఈ అవకాశం ఎట్లా లభించిందంటే—

గవర్నరుపేట జంక్షనులో— రైలు కూడా అనపేక్షితమే రావటంవల్ల పెద్ద స్టేషనునుంచి వచ్చే ప్రయాణీకులు, మామూలుగా రోజువారీ పనులమీద తిరిగే జనాభా, చిన్నచిన్న సందుల్లోంచి 'కూలీ-నాలీ' కోసం ఎప్పటికప్పుడు వెతుక్కుంటూ తిరిగే బీదా సాదా, వాహనాధిపతులు అందరూ కలుస్తున్నారు అక్కడే ఆ వుదయం ఎనిమిది గంటలప్పుడు.

అటువంటి మాంచి యమరద్దీలో, పోలీసు కనిస్టేబు తెల్లబోతున్నాడో, అభయహస్తమిస్తున్నాడో తెలియని పరిస్థితిలో, ఓ కాలేజీ భామిని, ఆ గొడుగుకు—కను మూసి కను తెరిచేలోగా—రెండు వందల డెబ్భై డిగ్రీల ప్రదక్షిణాన్ని పూర్తిచేసి, అపర సత్యభామా శైలిలా త్రోలుకుపోతున్నది సైకిలును.

అహోబలరావు అప్పుడే కాఫీనిమిత్తం బయల్దేరి వస్తున్నాడు. స్థానిక, దినపత్రికా సాంస్కృతిక వారపత్రికా విలేఖరులు కూడా చూస్తున్నారు 'న్యూస్' దొరక్కదిగాలుపడి. ఆవిడ జార్జెట్ సిల్కు చీర రెపరెపలు సైకిలు పెడలుతో సరాగాలాడ్డం అహోబలరావు చూశాడు. అతని డబల్ బ్రెస్టుకోటు గుండీ 'ఫట్'మని తెగింది.

'అరె !!!' అంటూగావిస్తుబోయి రోడ్డు కష్టం బడ్డాడు.

ఇక ఆ నవీనాంధ్ర యువతి అహోబలరావు ఆశ్చర్యాక్షకానికి సందాచెదిరి, అమాంతం బెదిరి, త్రొక్కుతూ త్రొక్కుతున్న సైకిల్ని ఎదురుగుండా వస్తున్న రిక్షాకు రాసి, ప్రక్కనే రోడ్డువారగా పెరుగుతట్ట నెత్తిన పెట్టుకొని తనదారిని తాను పోతూన్న ఓ నడివయస్సు గొల్లమనిషిని అమాంతం వెనకనుంచి ఢీకొన్నది.

ఒకరు ఆ అమ్మాయిని లేవదియ్యబోయారు. 'ననుపుట్టుకు పుట్టకు మాని కురుజనంబుల లోనికి తూడిన ద్రౌపది యుం బోలె' లేచి దూరంగా నిల్చొని, ఆ చక్కటి విశాలమైన నేత్రాలలో కన్నీటి కపలికల వాసరవీర్పడగా, పిండుకోసాగింది చీరెను. మరొకడు ఆ లేడీ సైకిలు హాండిలుకు వంకర్లు సాగదీశాడు. ఇంకొకడు దూరంగా దొర్లి బురదలో పడ్డ పుస్తకాల నేరి, స్వయంగా తుడిచి, చేతి కందిచ్చాడు. వేరొకప్రాప్తకాలజ్ఞుడు 'టించర యోడిన్' కోసం పరుగెత్తాడు.

తరువాత ఆ అమ్మాయి రిక్షాలో కూర్చుంది.

ఒక పెద్ద మనిషి ఆవంకర సైకిలును ఎట్లాగో నడిపించుకుని వెనకాలే వెళ్లాడు.

ట్రాఫిక్ రూల్స్ తెలియని అహోబలరావు 'గప్ చిప్'గా కాఫీహోటల్లోకి దూరాడు.

ఏపాప మెరుగని పెరుగుతట్టలమనిషి చెల్లాచెదరైన పిడతల్నీ ముంతల్నీ యేరుకుంటూ 'సదుగుకునే గంటలకి మొగయేసాలు, ఎదవ కాల ముచ్చిపడింది.' అని గొణుక్కుంటోంది.

# 2

అహోబలరావుకా రోజు దుర్దినం. ఒకటి వెంటొకటి అపశకునాలు, పొరపాట్లు, తుడుపులు కొట్టివేతలూ. చిరాకుపడి కూర్చుండిపోయాడు హోటలు కొచ్చాక గదితలుపులు తెర్చుకుని, కూర్చున్న అతనికి అలివేలు, అలివేలు వ్రాసిన ఉత్తరాలు, తన చేత అన్ని పనులు సక్రమంగా చేయించగల ఆమెలోని చైతన్యశక్తి, అన్నీ ఒక్కటొక్కటే గుర్తుకు రాసాగినై. జేబులోంచి యిదివరకు ఆమె వ్రాసిన ఒక ఉత్తరాన్ని తీసి చదువ నారంభించినాడు.

'నాకు మిమ్మల్ని ఎట్లా కాపాడుకోవాలో ఎవ్వరూ నేర్పలేదు. కనీసం కొన్ని సూచనలన్నా చేసివుంచలేదు. మా నాన్న నాకు కొద్దిపనులే చెప్పించాడు. మా అమ్మ కుంపటి అంటించటం అంట్లు తోమటంలాంటి యింటిపనులన్నీ నేర్పింది. నేను నా స్నేహితుల్తో ఆడీ పాడీ, సంగీతపు ముగ్గులు, చింతపిక్కలు, గచ్చకాయలు, త్రాడాట, త్రొక్కుడు బిళ్ళలతోటే వ్యర్థంగా గడిపేశాను నా చిన్నతనమంతా. నాకున్న మిడిమిడి జ్ఞానంతోనే 'అది అట్లా కాదు యిట్లా— యిది యిట్లా కాదు అట్లా—' అంటూ వేధిస్తున్నాను. దాన్నే మీరు నన్ను సంస్కరిస్తున్నారనే పెద్ద ముక్క వేసి నాపరంగా వాడుతున్నారు. 'నాకేమి తెలుసును? నేను చాలా అప్రయోజకుడ్ని.' అనకండి, ఎవరికున్న ప్రయోజకత్వం వారికుంది. అంతా మీకన్నా ఎన్నో అంతస్తులు పైనవున్నట్లు మీరు గణించుకుని భావించకండి. ఎవరైనా పరిహసిస్తూ మాటలంటే, అవన్నీ మనస్సుకు పట్టించుకుని బాధపడ్డం భావ్యం కాదు.'

ఇవన్నీ ఒకటివెంటొకటి జ్ఞాపకాని కొస్తున్నై. జరిగిన విషయాలను అక్షరాల్లో పొదిగి అర్థాంగికి తెలియపర్చటాని కతని కేదో సిగ్గనిపించింది. కాని వెంటనే ఆ అమ్మాయి విన్నపం గుర్తు కొచ్చింది. 'సమర్థురాల్ని గాకపోయినా అప్పుడప్పుడు మీరు పొందే సుఖదుఃఖాల్ని యీ చరణదాసి చెవిని గూడా వేస్తూవుండండి. అందువలన ఎక్కువఫలితం వున్నట్లు కనుపించక పోయినా, ఎలుకా సింహమూ కథ గుర్తుకొచ్చి ఒక రకమైన తృప్తి కలుగుతూంటుంది. నేనుకూడా ఏదైనా చేయగల్ను అవసరంవస్తే మీకు' అని.

అతనిక వుండబట్టలేకపోయాడు. సూటుకేసులోంచి కాగితాలు కలమూ లాగి బల్లముందు కూర్చున్నాడు. బలవంతాన కళ్ళల్లో నీరు తిరుగుతున్నా ఆపుకుందుకు యత్నిస్తూ కలం తీసి వ్రాయ నారంభించాడు.

'నీకు వ్రాయకుండా యీ నా అసమర్థతవల్లా తెలివితక్కువతనంవల్లా కలిగే ఫలితాలను నేనే అనుభవిద్దామనుకున్నాను. కాని నీకు ఏ వాగ్దానమైతే యిచ్చానో దాన్ని ఉల్లంఘించే శక్తి నాకు లేదు. క్లుప్తంగా చెప్పాలంటే నువ్వనుకున్నట్లుగానే జరిగింది. మొదట్నుంచీ జాగ్రత్తగానే వున్నాను. బలహీనతలెక్కడా బయలుపడ నివ్వలేదు. కాని యీ బెజవాడ ప్లాటుఫారంమీద అడుగుపెట్టిన శుభక్షణంనుంచి అంతా మారిపోయింది. ఏ పనులు చేయవద్దన్నావో అవే చేస్తున్నాను. వేటిని గూర్చి ఆలోచించి మనస్సు పాడుచేసుకోవద్దన్నావో వాటిని గూర్చే ఆలోచిస్తున్నాను.

నేను 'గాబరా' మనిషినవటం వల్ల ప్రతీదీ ముందే విపరీతంగా వూహించుకుని పప్పులో అడుగు వేస్తూంటాను. ఈ ప్రిన్సిపాలు నన్నెరుగును. ఇదివరకు నే నీయనవద్ద చదువుకున్నాను. కాని ఫూరా సూటులో వెళ్ళగానే నాకు ఆసనమిచ్చి చాలా మర్యాదచేశారు. నా పేరుచెప్పి 'అర్జీ' చేతిలో వుంచాను. ఆయన ఆశ్చర్యపడి నోరు తెరిచాడు. కాస్సేపటికి నవ్వి కరచాలనం చేస్తూ—'మిస్టర్ అహో బలే' నువ్వు చాలా మారిపోయావే' అని నా అర్జీ అందుకుని రెండే రెండు ఖాళీలు యింగ్లీషు డిపార్ట్‌మెంట్‌లో ఏర్పడ్డాయనీ, ఒకదాంట్లో ఒక అమ్మాయి మారిందనీ, రెండవది ఖాళీగా వుందని చెప్పారు. నేను సరే అని తలూచాను. ఇక్కడో విషయం వ్రాయటం మర్చిపోతున్నాను. నే నిన్నాళ్టిఉదయం జంక్షన్లో ఓ అమ్మాయి సైకిలు మీదనుంచి పడిపోవటాన్ని చూశాను. న్యాయంగా చెప్పాలంటే ఆ పడిపోవటానికి నేనే కారణమైనానని వ్రాయటానికి నాకు చాలా సిగ్గుగా వుంది. ఆ మొదటి లెక్చరరు ఆమె కాలేజీకి సైకిలుమీద వస్తూ పోతూంటుందని విన్నాను. కాని ఆవిడను నేను చూడలేదు

అట్లా అసలా స్త్రీ ఎవరో తెలుసుకోకుండానే యీ సైకిలు మీద నుంచి పడ్డ అమ్మాయే ఆ మాతోటి లెక్చరరు అనుకున్నాను. అట్లా ఎందు కనుకున్నా నంటే నేనేమీ చెప్పలేను. అపోహపడ్డం మాత్రం జరిగింది.

నాకు రోజుకు సుమారు మూడు గంటల పని. తతిమ్మా సమయాల్లో కాంపోజిషన్ గ్రంథాలు సంస్కరించాలి. నన్ను మొదటి సంవత్సరానికెళ్లి 'గద్యం' క్లాసు తీసుగోమన్నారు. అది సులువే—నాకు బాగా వచ్చు. కాని యీ గాబరా వొకటాయె—కడుపులోంచి దేవేస్తున్నది. ఐనా నేనెన్నడూ పది మందిలో ఉపన్యాస మిచ్చిన వాణ్ణి కాదు. నాలుక పిడచ కట్టింది. రెండుసార్లు కాబోలు కాఫీ త్రాగాను. ముచ్చెమటలు పోశాయి. వణుకుతూన్న కాళ్లతో వెళ్లి కుర్చీలో కూలబడ్డాను. అనేక జతల కళ్లు నావైపు తిరిగాయి, చాలా తలకాయలు అలుముకున్నట్లు చట్టి పిడతల దొంతరలాగున అనిపించాయి. ఎట్లాగో అటెండెన్సు వేసుకున్నాను. దాని, తగలేస్తే అప్పుడే అవాంతరం రావాలా? మొదటి పాఠం తెరిచి వ్యాసకర్తను గూర్చి రెండు ముక్కలు చెబుదామని గొంతు విప్పబోతున్నాను.

ప్రొద్దున్న సైకిలు మీద నుంచి పడిన ఆ అమ్మాయి పుస్తకాలు ఒకటో అరో పుచ్చుకుని, గుమ్మందాకా వచ్చి నన్ను చూసి ఆశ్చర్యపడి అడుగు వెనక్కు వేసి నిల్చినట్లుగా, నాకు తోచింది.

నేనిక్కడే తప్పుకున్న గోతిలో పడ్డాను. అస్సలామెను పల్కరించక పోయినా బాగుండి పోయేది.

'ఇది మీ క్లాసా?' అని అడిగాను.

'అవును నా క్లాసే...' అంది మాంఛి పొగరు బోతు తనంగా. చచ్చాన్రా! ఈ అమ్మాయి లెక్చరరు—యీ క్లాసు ఆవిడదే కాబోలు. ఎరక్కపోయి చిక్కడ్డాను యిందులోనని, తెప్పుల్చుకుందామనే వుద్దేశంతో—

'సారీ! ఇది నా క్లాసనుకున్నాను. టైం టేబుల్లో అల్లానే వుంది. పొరబాట్లు జరుగుతూంటాయి. మీ క్లాసైతే మీరే తీసుగోండి.' అని క్షమాపణలతో పుస్తకం మూసి యివతలకొచ్చి నేరుగా 'ప్రిన్సిపాలు' రూములోకెళ్లాను. యీ అవకతవకల సంగతి ఏదో గట్టిగా కనుక్కుందామని.

ప్రిన్సిపాలుగారు నా అవివేకానికి విసుక్కున్నారు. 'నీలో ఏదో మార్పు వచ్చిందనుకున్నాను. నువ్వూ మునపట్లానే వున్నావే' అని. తరువాత తెలిసింది—ఆ అమ్మాయికూడా విద్యార్థినేనని. నేననుకున్నట్లు లెక్చరరు కాదని.

నాకిప్పుడిల్లు కదలటానికే సిగ్గుగా వుంది. కదలి బయటకెళ్తే అంతా పకపకా నవ్వుతున్నారు. ఆడపిల్లలు నేను నడుస్తూంటే, 'లెఫ్ట్! రైట్!' అని కదం తొక్కుతూ పాడుతున్నారు. నేనందరికీ లోకువైపోయాను. తోటి లెక్చరర్లు నన్ను వేళాకోళం పట్టిస్తున్నారు. ఈ జానెడు పొట్టను పోషించుకోవటానికి వచ్చినవాణ్ణి నేను 'దయా-జాలి' యీ కాలేజీకుర్రవాళ్లలో, కొసినా ఏ ఒక్కడికీ నామీద లేదు.

ఏం చెయ్యను అలివేలూ? అంతా నన్నూ నా బ్రతుకునీ హేళన చేసేవాళ్లే.

నీ

అహోబలరావు.

## 3

క్లబ్బునుంచి పెందరాళేవచ్చిన ప్రసాదరావు టెన్నిస్ రాకెట్ను వూపుకుంటూ మెట్లెక్కి వస్తున్నవాడల్లా ఎప్పుడూ లేని యీ యింట్లోని స్తబ్ధతకు కొద్దిగా ఆశ్చర్యపడుతూ, బయటే పేము కుర్చీని జాజిపందిరకు దగ్గరగా లాక్కుని అందులోకి ఘటాన్ని జారవేశాడు.

ఈ సమయానికి యిల్లంతా మార్మ్రోగించే రేడియో పలకటం లేదు. మనుష్యులంతా ఎక్కడా కదలటం లేదు. చివరకు యింట్లో ఎవ్వరూ లేరా అని అనుమానం వేసింది. క్షణంలో జాజిపందిరిమీదనుంచి వచ్చే సువాసనకు అతడు యీ అనుమానాలన్నీ కట్టకట్టి ఒకమూల త్రొక్కి విశ్రాంతి ననుభవిస్తూ మెడను కుర్చీమీద త్రేలాడేసి కళ్లు మూసుకున్నాడు. కళ్లుమూసుగోవట మేమిటి? ప్రసాదరావుకి పిలిస్తే నిద్రాదేవివచ్చి వొళ్లో వ్రాలుతుంది. అతనట్లానే నిద్రపోయాడు.

'చూశారా! నే ననుకున్నంతపనీ జరిగింది.' అంటూ దమయంతి కొరకొరా ప్రసాదరావువంక చూసింది.

ప్రసాదరావు రేడియో ట్యూను చేయబోతు న్నాడు. దమయంతి నెత్తీ నోరూ బాదుకుంటూ — 'మీరు యివ్వాళ ఏమి టిల్లాగ ప్రాణం పెకి పిండేస్తు న్నారు? దాని వంట్లో ఏమీ బాగులేదు. ఆ రేడి యోని కాస్సేపు వాగించకండి.'

ప్రసాదరావు ఆగి 'నేను సంస్కారంలేని మనిషినిగా. మీ చెల్లెలు యింత క్రితమే చెప్పింది.' దమయంతి 'ఆఁ' అని వెళ్ళి తువ్వాలు తెచ్చియిస్తూ 'స్నానానికి లేవండి. మీరు నేనూ భోంచేస్తే దానికి యిన్ని ఓవల్టీను నీళ్ళన్నా కలిపియిస్తాను.'

'ఓహ్హో! ఆ తరువాత మెడలో వేసుకుని చిచ్చికూడా గొట్టవద్దూ. నిద్రపుచ్చుతుంటా పట్టపుటమ్మగారికి. పోనీ ఆ పని నేను చేసిపెడతాను.'

దమయంతి కోపంగా చూసి — 'మీ దగ్గర మంచితనం లేదు. ఆ సైకిలు యిటలీనుంచి తెప్పించాను. ఈవాళ క్లబ్బులో అంతా కండొలెన్సు చెప్పారు. ఎత్తుకుని చిచ్చికొట్టు. ఇట్లాంటి మాటలాడక పోతే, ఆ సైకిలి పీనుగెవరో కనుక్కోగలిగారు? దారికడ్డంపడి సైకిలిగా నవ్వి ఆడపిల్లను బెదిర గొట్టాడూ...యిదేనా చదువు? సంస్కారంలేని మనిషి?'

వేళ్ళన్నీ చన్నీళ్ళ పాళాలుగా తోలుపు కుంటూ 'కాస్త వీపు తోము మైడియ్యర్. ఏ మన్నావు? సంస్కారం లేదనా — వాడూ నాకు తమ్ముడిలాగే వున్నాడు. క్రొత్తగొడ్డు మీ చెల్లెలి విసవిసలకు బెదిరిపోయి దారికడ్డం పడివుంటాడు.'

వీపుమీదనుంచి చేతుల్ని తీసివేస్తూ పరుషంగా

'ఐతే మీ రేమీ కలగచేసుకోరన్నమాట — ఇవ్వాళ యిట్లా జరిగింది. రేపు రెక్కపుచ్చుకు లాగు తాడు. మనమంతా చూస్తూ వూరుకోవలసిందేనా?'

'కళ్ళుమూసుకుందాం. నేను చిన్నప్పుడు నువ్వు అటూయిటూ తిరుగుతూంటే రెక్కపుచ్చుకు లాగితే ఏం చేసేదానివి? అంతే. ఏదో ప్రణయకలాపమను కుని తృప్తిచెందాలి.'

'ఛీ! ఛీ! ఛీ! ఏమి మాటా మీ నోటికి హద్దూ బద్దంలేదు' అంటూ ఆ గదిలోంచి వసారాకెళ్ళి పోయింది.

ప్రసాదరావు పట్టుపంచె చుట్టుకుని స్నానాల గదిలోకి వెళుతూ, విజయ గదిదగ్గర ఆగి 'కొంచెం తలుపు తియ్యవే అమ్మాయీ! పెద్ద అద్దం యిలాగియ్యి — నేను రేపు కొనుక్కొస్తాను — మహానుభావు రాలు దేవతర్లో...వాడిపోతేనేం, నువ్వు ఆ జపం మానుకో — వద మీనిటి? యిలాగయితే యివ్వాళే తాతయ్యకు కబురుచేసేస్తాను...'

లోపల 'విజయ' మాట్లాడకుండా ముఖాన్ని ఎర్రబర్చుకుంటోంది. ప్రసాదరావు తలుపు సందులోంచి 'ఇదుగో నువ్వు వాడికోసం బెంగ పెట్టుకోవటం ఏమీ బాగా లేదు. రేపు ఉదయం వాణ్ణి తీసు కొచ్చి నీ ఎదట పెడ్తాను. నీ యిష్టం వచ్చినట్లు చేసుకో — తెలిసిందా. యికరా. వచ్చి అన్నం తిను.'

తలుపు ధబ్లున తెర్చుకుంది. విజయ కస్సు మంటూ —

'ఏవిటి నువ్వనేది? ఆ కోతి కోసం నేను బెంగపెట్టుకుంటున్నానా...నువ్వు వాణ్ణి తెచ్చి రేపు ప్రొద్దున్న నాకప్పగిస్తావుకదూ. అప్పగించవు మరి? ఇదుగో యీ అద్దం తీసుకుపో. నన్ననవస రంగా యేడిపించకండి. నాకు అన్నమూ అక్క ర్లేదు. అర్థ్యాన్నమూ అక్కర్లేదు.' ప్రసాదరావు విజయ అలిగిందని గ్రహించాక మెల్లగా ఉపక్రమిం చాడు.

'ఇదుగో అమ్మాయ్. నువ్వనవసరంగా ఉద్రేక పడి లాభంలేదు. నన్ను పది తిట్టి నిన్ను పది తిట్టు కుని కాలేజీ మానేసి గొడవ చేస్తే జరిగి పోయింది కలిసిరాదు. నేను అన్నంత పనీ చేసి తీరుతాను — నాకా సన్యాసి ఎవరో తెలవాలి మరి. నేను వాణ్ణి ఏ ఉపాయాన్నన్నా కంటబెట్టుకు రాగలను. ఆ పైన మీ అక్క యిష్టం నీ యిష్టం — వాడికి ఏ శిక్ష వేసినా మీ యిష్టం కాదనను. సరేనా —'

విజయ ఉరుముల్లోంచి మెరుపుల్లోంచి దిగి చల్లబడి

'అతను పాపం క్రొత్త లెక్చరరు...'

ప్రసాదరావు 'చచ్చాను. నువ్వే పాపమంటే కథ అడ్డం తిరిగినట్లే. మీ మాట నమ్ముకుని ఏ సాహ

సం చెయ్యబోయినా చివరకు గాడిదలయ్యేది మగవాళ్లే. అవునా?'

విజయ అక్కణ్నుంచి చల్లగా వంటయింట్లోకి జారుకుంది. బయటివరండా చీకట్లో నిలబడి పొంచి వింటూన్న దమయంతి—

'మీ రిక్కడ ఏవిటిచేస్తున్నారు?' అంటూ కొక్కించింది. ప్రసాదరావు 'వుండు. డైలమాలో పడి కొట్టుకుంటున్నాను. వన్. టూ. త్రీ. ఈ రెండు ట్రేగ్లా పట్టుగో.'

దమయంతి ఒక వ్రేలును చప్పున పట్టుకుంది. ప్రసాదరావు చప్పున గొంతి 'డామిట్! మీచెల్లెలు నన్నే మోసం చేయాలనుకుంది.'

'ఏవిటా మోసం?' అంది ఏమీపాలుపోక.

'దీన్నే మొదటిచూపులో ప్రేమ-లవ్ ఎట్ ఫస్ట్ సైట్-అంటారు. విజయ ఆ క్రొత్తలెక్చరరుటా వాణ్ణి ప్రేమిస్తోంది.'

దమయంతి చప్పున నోరుమూస్తూ— 'మీకు మతిపోతున్నదల్లే వుంది. ఆ పాడు నవలలు చదవకుండా వుండలేరు గదా.' ప్రసాదరావు ఏమరుపాటుగా వున్న దమయంతి రెండు బుజాల్ను గిరుక్కున తనవైపుకు త్రిప్పుకుని ముఖంలో ముఖం పెట్టి—'ఈ మీ ఆడవాళ్లు యింతేగావల్ను. పైకి ద్వేషిస్తూన్నట్లే వుంటారు. లోలోపల ప్రేమ మరగకాగుతూంటుంది. ఈ రోజుల్లో కాలేజీ అమ్మాయిల ప్రేమ కాఫీహోటళ్లలో పాలు లాంటిది. దానికి మరగకాగటమే గాని పొంగి పొర్లటమంటూ వుండదు. ఎందుకంటే గంటగంటకీ చెంబెడునీళ్లు కలుపుతూనే వుంటారుగా.'

ఈమారు దమయంతి పొట్టచేత్తో పట్టుకుని నవ్వు నాపుకోలేక 'ఇంక మీరు మాట్లాడకండి చచ్చిపోతున్నాం యింట్లోవాళ్ళం. మీషర్ లాక్ హోంస్ మీరూను'. అంటూ వంటయింట్లోకి వెళ్ళింది.

ప్రసాదరావు పీటలమీద కూర్చునేసరికి రెండు కంచాలలోను పదార్థాలు వడ్డించబడివున్నై.

లోపల దమయంతి విజయ చేతిలోని గరిటను లాక్కోవాలనే యత్నంలో విఫలురాలై వచ్చి ప్రసాదరావు ప్రక్కను చతికిలబడిపోయింది. ప్రసాదరావు 'ఊఁ చూస్తావేం? కలుపు......' ఇద్దరూ అన్నాలు కలిపారు. విజయ మెదలకుండా వడ్డన చేస్తోంది. ప్రసాదరావు పెదిమ కదిపి ఒక్క అక్షరం ముక్క కూడా మాట్లాడలేదు. దమయంతి తేచాక చూస్తే వాన వెలిసిన ఎండ కాసిన సాయంత్రానికి మల్లే వుంది విజయ ముఖం.

# 4

క్రొత్త లెక్చరరు అహోబలరావుకు అన్నీ క్రొత్త సమస్యలే. ఉదయం ఏడూ ఎనిమిదీ గంటల మధ్య ముక్కూ ముఖం యేకమయ్యేలా కురవకపోతే ఎవరేమనుకొనిపోతారో అన్నట్లుగా కొట్టి కురిసింది వాన.

హోటలుకు పోయి పెందరాళే రెండు మెతుకులు నోట్లో వేసుకుని క్లాసుకు తయారవుదామంటే వీల్లేకుండా టికట్ల పుస్తకం మాయమైంది. శుభ్రమైన దుస్తు లేసుకుని నీటుగా పోదామనుకుంటే నేలంతా ఎక్కడా అడుగుదీసడుగెట్టడానికి శక్యంగాకుండా చిలపతలాడుతోంది. పిన్నా పెద్దా, ఆడా మగా, అంతా ఆ రొచ్చురొంపి దాటటంకోసం లాగుల్ని ధోవతుల్ని చీరకుచ్చెళ్ళను కొంత పైకెగబట్టుకొని ఎత్తిఎత్తి వేస్తున్నారు అంగలు.

డాబామీంచి చూస్తూంటే, పెద్ద మనుష్యులు కొంతమంది ఏ కూరలకనో మరోపనిమీదో బయలుదేరి వీధిలోకొచ్చి గొడుగుల్నెత్తి పట్టుకు నడుస్తూండగా దారిలో ఎరుగున్నవాళ్లెవరైనా ఎదురుపడ్తే 'ఆముదం' మ్రింగవలసిన వాడిలా ముఖం పెట్టి పలకరించినదాని కేవో జవాబులిచ్చి వొదుల్చుకొంటూ ముందుకు సాగుతున్నారు.

అహోబలరావుకి వానకోటు కొనాలన్న విషయం అప్పుడే తట్టింది. పర్సు తీసుకుని జేబులో వేసుకుని గబగబా మెట్లమీంచి దిగి వీధిలో కొచ్చిపడ్డాడు. ఆ తొందరలో అతను ఆకుచెప్పు లేసుగొచ్చాడు. రోడ్డుమీద నడుద్దామంటే 'బంయ్'మంటూ అట్నుంచి ఒక బస్సు యిట్నుంచి ఒక బస్సు, పోనీ పేవ్ మెంటుమీద ఎల్లాగో సర్దుకుపోదామంటే అక్కడక్కడ చెప్పులుకుట్టే వాళ్లు, గొడుగులకు ప్రాత కలాలకు టోపీలు పాళీలు అమర్చి, కళ్ళజోళ్లూ తాళంచెవులు మరమ్మతు చేసి జీవించే చిల్లర

వ్యాపారులు, వేరుశెనక్కాయ లమ్ముకునే ముసల మ్మలు, పిల్లలతో నానా అవస్థగానూ వుంది.

ఇక యీ పట్టణాల్లో బ్రతకటమే ఒక అవస్థ. ఇట్లాంటి వానల్లో ఒకరి మడమలొకరు త్రొక్కుకుంటూ పరుగెత్తున్నారు జనం. బెల్లంబజారులోని ఫ్యాన్సీ సమ్మ షాపులోకి అటు వైపునుంచి అహోబల రావు యిటువైపునుంచి ప్రసాదరావు ఒక్కసారే ప్రవేశించారు.

షాపులో జనం గొడుగుల్ని చేరవాను తున్నారు. అక్కడకూడా నేల తేమగా ఉంది. తీరావాన కోటు కొందామనుకుని వచ్చిన అహోబల రావుకు గొడుగుల్ని చూడ్డంతోనే అదీ—యిదీ ఏది కొనటమనే డైలమాలో పడిపోయాడు

ప్రసాదరావుని చూడగానే కొట్టు యజమాని 'దయచెయ్యండి సార్!' చూస్తావేరా వెధవా, పంతులుగారికి కుర్చీ వెయ్. కుర్చీ వెయ్.' అంటూ జనాన్ని వొత్తిగించుకుని 'ఏమిటి యిలా దయ చేశారు? కాఫీ పుచ్చుకుంటారా? బోయ్ టిఫిన్ ఒక కప్పు కాఫీ పట్రా. చప్పున.' అంటూ అతి మర్యాద చేశాడు.

'కాఫీ ఏమిటి? ఏమీ అక్కర్లేదు. ఇప్పుడే పుచ్చుకొచ్చాను. నన్ననవసరంగా చంపకు.' అన్నాడు ప్రసాదరావు క్రొత్తరకపు ఫ్యాన్సీకళ్ళ జోడుతీసి విలాసంగా చేత్తో పుచ్చుకుని. లెనిన్ బుష్‌కోటు వేసుకున్న ప్రసాదరావును అతడి జేబులోని పార్కరుపెన్ను, బెంటిక్స్ చైనుతో వున్న సెవెన్టెండ్ క్రొత్తమోడలు వాటర్ ప్రూఫ్ రిస్ట్ వాచీని చూచిన అహోబలరావు వుండబట్టలేక ప్రక్కవాడ్ని పొడిచి 'ఎవరీయన' అని అడిగాడు.

'ఎక్కడో పశ్చిమ గోదావరి జిల్లాలో పంచ దార ఫ్యాక్టరీ కడుతున్నారు. దానికి మేనేజింగ్ డైరక్టరు. ఇంకా మనవూళ్ళో చాలా కంపెనీల్లో ఆయనకు షేర్లున్నాయి.' ఇది విన్నాక 'పశ్చిమ గోదావరిజిల్లాలో పంచదార ఫ్యాక్టరీ పెడుతూంటే యీ మేనేజింగ్ డైరక్టరు యీ వూళ్ళో ఎందుకు వుండటం' అనుకుని పోనీలే మన కెందుకని ఆకొట్టు యజమానిని 'వాటర్‌కోట్లు' చూపించమని అడిగాడు.

అప్పటికి అహోబలరావుకు కాలేజీకి వెళ్ళటానికి గంటవ్యవధే వున్నది.

ప్రసాదరావు కాఫీ పిలుస్తూ '[illegible]. ఓవల్టీను తెచ్చా ఒకటికొచ్చా, [illegible] పోయింది అక్కడ యివ్వు!

'చిత్తం.' అని [illegible] స్వయంగా తెచ్చి అందిస్తూ 'ఏం బాబూ యింట్లో అంతా కుశాలా?' అన్నాడు కొట్టు యజమాని. ఈ ప్రశ్నకు ప్రసాద రావు సమాధానం నోటినుంచి వెగిలి బయటకురాక ముందే, సైకిలుషాపు డీలరు బంగారయ్య 'పంతులు గారూ లేడీ సైకిలు తీసుకున్నారు. ఇంకా కొరవ మిగిలిపోయింది. కొంచెం యిబ్బందిలో వున్నాను. లేకపోతే తను బోటివారి దగ్గర సొమ్ము ఖజానాలో వున్నట్టే...' అంటూ లోపలికొచ్చాడు యితడిరాక పసిగట్టి.

అవతల కొట్లో చిన్నచిన్న బేరాలన్నీ సమాస్తా చూసుకుంటున్నాడు. ప్రసాదరావు కొంచెం విచారంగా 'ఆ సైకిలు తుక్కు తుక్కు యిందోయ్. కుర్రాడ్ని పంపించు. యిచ్చేస్తాను. మళ్లీ అమ్మేసి వొచ్చినడబ్బు నాకిచ్చేద్దుగాని...' అన్నాడు కళ్లు తేల్చి పైకి చూస్తూ. బంగారయ్య 'ఏమిటి అలా అంటున్నారు...ఏం జరిగింది? అంటూ కుతూహలంగా ప్రశ్నించాడు. ప్రసాద రావు కొంచెం మయిష్టంగా 'అది కొన్నవేళా విశే షం మంచిది కాదోయ్. నిన్న మా మరదలు దాని మీంచి పడిపోయింది. ఆక్సిడెంట్ సీరియస్ కాదు గాని దెబ్బలు తగిలాయి.'

అహోబలరావు గుండె చప్పున ఆగిపోయింది. చచ్చాన్రా యిక్కడ కొచ్చిపడ్డాను. ఆ క్రొత్త లెక్చరర్ని నేనే అని తెలిస్తే యీ మేనేజింగ్ డైరక్టరు నాముఖం బోర్లేస్తాడు గావల్ను. ఎట్లా యిక్కడనుంచి తప్పించుకోవడమనే భయంతో గబ గబా బిల్లు చెల్లించి వీధిని పడ్డాడు. అతని కళ్లు చీకట్లు కమ్మాయ్. పట్టుగోండి 'పట్టుగోండి! అని ఎవరో అరుస్తూ వెంబడిస్తున్నట్లు తోచింది.

## 5

గోదావరి స్టేషన్లోకి మెయిలువచ్చి ఆగీ ఆగటం సుందరరామయ్య బోషాణంలాటి పెట్టెను కూలీల

నోట్లో వేసుకుని గింజల్ని తుపుకు తుపుకున వూస్తూ కథల పుస్తకం తీసి ముఖాని కడ్డంగా లాక్కుని కోర చూపులు చూడసాగింది.

కొవ్వూరు స్టేషనొచ్చింది. అక్కడ వో పచ్చి బాలెంతరాలు రెండునెలల గుడ్డును తీసుకుని ఆ పెట్టెకే ఎక్కింది. ఎక్కడా చోటు లేదు. ఈ దంతావళం చక్కగా భాసింపట్టు వేసుకు కూర్చొనుంది. ప్రక్కనే ఒక మనిషి కూర్చునే చోటులో పత్రికలు పుస్తకాలూ పర్చింది. ఎవరూ ఆమెను ఆ చోటు ఖాళీచెయ్యమని అనరు. ఆ పచ్చి బాలెంతరాలుకు నోరు లేదు. అట్లానే నిలబడింది. ఆ పసి బిడ్డతో ఆవిడ ఉమకష్టంగా నుంచోవటం యీ దంతావళం చూసింది. చూసినా చలించలేదు. మళ్ళీ అలివేలు కలుగచేసుకోవాల్సివచ్చింది.

'ఇదుగో ఏమండోయ్. మిమ్మల్నే...' ఆవిడ ఉలక లేదు పలక లేదు. తన్ను కానట్లు వూరుకొంది.

'ఆ పుస్తకాలు కొంచెం తియ్యండి......... అక్కడ కాస్త చోటుంది.' అంది మళ్ళీ అలివేలు. ఈసారి ఒకమాటు తనకేసి చూసి మళ్ళీ నిర్లక్ష్యంగా పుస్తకం చదువుకో నారంభించింది. అలివేలు లేచి ఆ బాలెంతరాలు చెయ్యి పుచ్చుకుని లోపలికంటా నడిపించుకొచ్చి ఆ పుస్తకాలను చేత్తో తీసింది. ఆ దంతావళం 'అవి అక్కడ పెట్టుకుందర' అంటూ గర్జించింది. అలివేలు ఆ బాలెంతరాలు చేతిలోని పసిగుడ్డు నందుకుంటూ 'నువ్విక్కడ కూర్చో' మని ఆ పిల్లతల్లిని ఆజ్ఞాపించింది 'కూర్చోటానికి వీల్లేదు.' అంటూ దంతావళం చేత్తో ఆ తల్లిని నెట్టి వేయటానికి సాహసించింది. అలివేలు కళ్ళ వెంట నిప్పులు కురిపిస్తూ 'ఇదుగో బాగా చూడండి. మీరు కనుక ఆమెను కూర్చోనియ్యక పోతే యీ చేతిలోని పుస్తకాలను కట్టగా కిటికీ లోంచి అవతలకు గిరాటు వేస్తాను.' అని చేత్తో పుస్తకాల దొంతరను ఝళిపించింది. పెట్టెలోని తతిమ్మా ఆడవాళ్ళు గొల్లుమన్నారు. ఆ ముక్కలన్న తరువాత అలివేలు అంతపనీ చేసేదాని లాగునే వుంది. ఆవిడ చప్పున నోరు తెరిచి పెట్టెలో అందరి వంకా చూస్తూ—'నేను ఎప్పుడెనగా బయల్దేరానో ఎక్కడ్నుంచి వస్తున్నానో తెలుసా?' అంది. అంతా మళ్ళీ గొల్లుమన్నారు. ఈమారు అలివేలు కూడా నవ్వింది. బాలెంతరాలు చేతిలోని పాపాయి కూడా నవ్వింది. ఈమారూ సరాజయం దంతావళానిదే. ఆ బాలెంతరాలు కూర్చుని ఓపిగ్గా చంటిపిల్లకు పాలు కుడుపుతూ 'పదికాలాలపాటు సిరీ సంపత్తీ కలిగి పసుపూ కుంకుమా పెట్టుకుని బతుకు తల్లీ!' అంటూ దీవించింది.

దంతావళం వూరుకోలేదు. నసుగుడు ఆరంభించింది. 'పారేస్తుందిట' పుస్తకాలు పారేస్తే పోలీసులకి కబురు చేసేదాన్ని.' అంది. పెట్టెలో ఒక మూలనుంచి ఒక తూర్పావిడ చుట్టనోట్లోంచి తీసి—బాలింతరాలు కూర్చోటానికి సోటిట్టమని ఆ మాతల్లి అడిగితే పెద్ద నా పరాయిలా బల్లసంగానికి తాటించికూకుని, నెగమంటే పిలుస్తాదిట పోలీసుల్ని, ఎదవపుత్తకాలు ఎన్ని సదిగితేం ఆమాతల్లి కున్న గ్యానం లేదు. శ్రీరామ శ్రీరామ కలికాలం' ఈలోగా గుడ్డిబిచ్చగాడు రైల్లోకెక్కి—

'నిజము కల్లవుతుంది. కల్ల నిజమవుతుంది.
నిజము నిలకడమీద తెలవాలి బ్రహ్మన్నో—

భజగోవింద! గోవింద!' అంటూ పాట లంకించుకున్నాడు. దంతావళానికి ఓపిక చచ్చి 'బ్రూట్సు' అనేసి ఫ్లాస్కులోని కాఫీ గిద్దెడు పోసుకుని చప్పరిస్తూ కథల పుస్తకం పేజీలు తెర్చి, బలవంతాన చదవటం నటించ సాగింది రోషంతో. తాడేపల్లిగూడెం స్టేషన్లో యీ దంతావళానికి మరొక ఐరావతం ప్రోగయింది. అలివేలు వారి సంభాషణలనుంచి తెలుసుకున్న దేమిటంటే 'యీవిడ అల్లుడుగారింటికి బెజవాడ వెళ్తోన్న దనిన్నీ—అక్కడ తన చిన్నకూతురు కాలేజీలో చదువుకొంటున్నదనీ—ఆ అల్లుడు పంచదార ఫ్యాక్టరీ మానేజింగ్ డైరక్టరుట. ఈ సంగతులు ఆవిడ చెప్పటంలో ఎంతో దర్పా, గొప్పతనం, అనుభవిస్తూ చెప్పింది.

కొంతసేపు యీ దంతావళమూ ఆ ఐరావతమూ యింగ్లీషులో అలివేలుకేసి కొరకొర చూస్తూ ఏమో మాట్లాడుకున్నారు. తరువాత బెజవాడ స్టేషనొచ్చే వరకూ అలివేలుకు యీ రెండు జంతువులే కాలక్షేపం.

బెజవాడస్టేషను వస్తున్నదనగానే పొంగిపొర్లే ఉత్సాహంతో అలివేలు ప్లాటుఫారంకేసి ముఖా

క్లాసు పరీక్షగా అనుద్దాగా సాగిపోసాగింది. చూరాన్ని రంగురంగుల లైట్లతో స్టేజనంతా దీపాల్లో జగజ్జే గీయమానంగా వుంది.

ఆ దంతావళం అలివేలు పెట్టెను కొంచెం అడ్డంగా వున్నదనే నెపంమీద 'కాస్త పక్కగా పెట్టవె!' అని కసిదీరా తిట్టింది. అలివేలు వూరుకో లేదు. 'నీవు పెట్టి నీవు పెట్టె అనబోకు. పోలీసుల్ని పిలుస్తాను' అంది. మళ్ళీ అంతా గొల్లుమని నవ్వారు. గోల ఆగింది. అహోబలరావు కిటికీదగ్గర్నుంచి అలివేలు భుజంమీద తట్టాడు. ఉలిక్కిపడి 'మీరా...' అంది. 'వచ్చావా—' అన్నాడు. కళ్లు మిలమిలా మెరుస్తూండగా యింత చేసుకున్న ముఖంతో 'వచ్చాను' అంది అలివేలు.

ఆ దంతావళంకోసం వచ్చిన విజయ, తల్లిని ముందు పలకరించకుండా 'బావా! బావా! ఆయనే మా క్రొత్త లెక్చరరు' అని ప్రసాదరావుకు అహోబలరావును చూపెట్టింది.

# 6

చేలకట్టంబడి పొలాల్లోంచి రెండెడ్లబండి క్రోసులు వెళ్లినట్లుగా దంచుతున్నాడు ఉపన్యాసం అహోబలరావు. విషయం సత్యాహింసలు – గాంధీ, గౌతమ బుద్ధుడు. పాఠం అక్కర్లేనివాళ్లు బందరు లైనుమీద బల్లిలా పాకుతూన్న గూడ్సు రైలు పెట్టెలను లెక్క పెడుతున్నారు. ఉపన్యాసం డొంక తిరుగుడుగా వుంది. అవసరమైన విషయాల్లోంచి అనవసరమైన విషయాల్లోకి దాంట్లోంచి దీంట్లోకి దీంట్లోంచి దాంట్లోకి కప్పదాట్లు కుప్పిగంతులు వేస్తున్నది. ఐనా యేదో సమర్థతతోనే చెప్పుకుపోతు న్నాడు. కొందరు కుర్రవాళ్లు కబుర్లు ప్రారంభిం చారు. కొంతమంది మెల్లమెల్లగా గోడవారల్నుంచి జారుకొంటున్నారు. ఇంకా మరికొందరు ఉండుండి 'చుట్టా బీడీ సిగరెట్'—'చా! చా! గరం చా' అని కేకలేస్తున్నారు. అహోబలరావు చప్పున నీరసించి యిట్లా గన్నాడు—'మీ కెవరికీ విషయం పట్ల ఆసక్తి వున్నట్లు కనుపట్టంలేదు. ఐనా చదువుకో టానికి వచ్చినట్లు లేరే...' అని. వెనుక బెంచీల్లోంచి 'చాలా చక్కగా గ్రహించారు.' అని – యింకొక దమూలనుం 'భాగుభాగు' అని. వేరొకచోటనుంచి 'ఈవాళ్టికి చాల్లెండి మాస్టారూ!' అని కలహాలు సంకేతాలు ఆక్షేపాలు వచ్చినై. ఆడపిల్లలు నవ్వుతున్నారు. వాళ్లు ఎందుకు నవ్వుతారో వాళ్లకే తెలియదు. అహోబలరావు మళ్ళీ పట్టువదలకొద్దీ ఉపన్యాసాని కందుకున్నాడు. తక్షణం విషయం 'ప్రపంచ శాంతి'తో ముడిపెట్టబడింది. ఆర్థికశాస్త్రానికి సంబంధించిన, రాజకీయాలకు సంబంధించిన ప్రశ్నలు లేచి తలొక్కరూ వేయసాగారు. చివరకా క్లాసు పరపరాం లైన్ సర్కస్‌గా మారింది. అహోబలరావు కుర్చీ వదిలి బెంచీల మధ్యకొచ్చి గర్జించాడు 'మీరు గొడవ మానుతారా లేదా?' అంటూ ఒకటికి రెండు సార్లు. పోలోమంటూ అంతా లేచి 'క్రొత్త మాస్టారికి జై! క్రొత్త మాస్టారికీ జై!' అంటూ యువతల కొచ్చి పడ్డారు.

ఖిన్నవదనుడై అహోబలరావు యువతలకు రాకటం మెట్ల దగ్గర బయాలజీహాల్లో జూ ఆలజీ ప్రాక్టికల్ చేస్తున్న విజయ చూసింది. చూసి ప్రక్కనున్న స్నేహితుల చెవిలో ఏమో చెప్పింది. అంతా అహోబలరావు సమీపాన్నుంచి పోతుండ టాన్ని కనిబెట్టి పకపకా నవ్వారు. హాలు హాలంతా పక పకలతో ధ్వనించింది. అహోబలరావు కోపంగా విజయకేసి చూశాడు. విజయ కటువైన మంచి హాసాన్ని విసిరింది.

'చాల్లేవే—ఏమిటా విసురుడు?' అంటూ వచ్చింది ఒకతె.

'అదికాదే—క్రొత్తవాళ్ళనంత బెదరగొడ్తా వేమే విజయా!' అంది మరొకతె. అంతా నవ్వారు.

బల్లమీది చెక్కకు నాలుగువైపులా మేకులు దిగగొట్టి నెల్లకిలా పడుండబెట్టబడిన కప్పకు రక్త ప్రసార మెట్లా జరుగుతుందో చెప్పి, గుండె చలనం గూర్చి చెబుతున్నాడు. విజయ పరధ్యాసగావుంది. సన్నటిచాకులు చిన్నచిన్న సూదులు నీళ్ళలోంచి తీసి తుడుస్తూ 'మాటే యిందిరా' అని పిలిచింది. ఇందిర నోట్సు వ్రాయటం ఆపు చేసి 'ఏమిటే అంత అర్జంటు?' అంటూ వచ్చింది.

'లేడీస్ కల్చరల్ అసోసియేషన్ ప్రారంభో త్సవం ఎప్పుడే?' అంది విజయ.

'ఆవిషయం యిప్పుడెందుకే?' అంది ఇందిర.

'ఏమందన్లే. చెప్పు. ఎప్పుడు ప్రారంభించటం?' మళ్లీ రెట్టించింది.

'ప్రిన్స్‌పాల్నడగాలే... ఇవ్వాళ మధ్యాహ్నం పోయి అడుగుదామా?'—విజయ ఆలోచించి 'శ్రక్టరీని పిలవ్వే...' అంది. శ్రక్టరీవచ్చి 'ఎందుకే విజయా... అవతల టేబిల్ దగ్గర సగం సగం ప్రాక్టికలు చేస్తూవచ్చాను. చెప్పు.'

'మన అసోసియేషన్ 'డే' ఎప్పుడు చేద్దామే..' అంది విజయ. 'ఇప్పుడెందుకే ఆ చర్చ?' అంది శ్రక్టరీ.

'ఆఫీసు బేరర్‌గా నేను క్రొత్త లెక్చరర్ను సూచిస్తాను. మీరంతా వోట్లియ్యాలి.'

'ఎందుకే—పాపం అతణ్ని యేడిపించటం?' అంది ఇందిర. శ్రక్టరీ అందుకుంది. 'పాపం అంటూ వెనకేసుకొస్తోంది. దీనికేమన్నా మేనత్తకొడుకేమోనే వాడు.'

విజయ 'అల్లానే వుంది కాకపోతే యేమిటి?' అంది హేళనగా. ఇందిర కోపంగా—'ఆ దగ్గర వరసలన్నీ ఐతే మీకవాలి? నాకేం—నేను నా వోటు వెయ్యను.'

'ముడిచిపెట్టుకో...' అంది శ్రక్టరీ. ఇందిరకు కోపమొచ్చి లేచి బల్లదగ్గరకు వెళ్లి ప్రాక్టికలు చేస్తోంది. విజయచాకులు సూదులతో బల్లమీది కప్పను పైపైన కోస్తూ శ్రక్టరీ చెవులో ఏమేమో చెప్పి నూరిపోస్తోంది. ఇద్దరూ మధ్యమధ్య నవ్వుకుంటున్నారు. విజయకు ప్రాక్టికల్ మీద దృష్టి లేదు. శ్రక్టరీ బల్లమీదకువంగి విజయ ముఖంలోకి చూస్తూ మాట్లాడుతోంది. ఈలోగా సగంసగం తెలివిలోకి వస్తూన్న కప్పపోయే ప్రాణంకోసం పెనగులాడుతూ నాలుగుకాళ్లను కుంచించి తిరుగుబాటు చేసింది. క్లోరోఫారం పట్టుతప్పి కప్ప నాలుగు మేకుల్ని ఎగరతన్ని శ్రక్టరీ ముఖానికొచ్చి గుద్దుకుంది.

'అమ్మ బాబోయ్' అని శ్రక్టరీ భయంతో కెవ్వుమని కేకేసి వెనక్కు పరుగెత్తింది. విజయ తెల్లబోయి చూస్తూ నిలబడిపోయింది. నాలుగువైపుల్నించి విద్యార్థులు అధ్యాపకులు, అటెండర్లు ఏమిటి ఏమిటి అంటూ పరుగెత్తుకొచ్చారు.

భయపడిపోయిన శ్రక్టరీ యేడుపు లంకించుకుంది. అధ్యాపకుడు అటెండర్ని కేకలేస్తే అతను 'పొరబాటు క్షమించాలి. క్లోరోఫారం సరిగా యివ్వ లేదు కాబోలు' అని నసిగాడు. విజయ శ్రక్టరీని నడిపించుకుని వైటింగురూంలోకి తీసుకెళ్ళబోతూంటే అందరూ యీ అమ్మాయి ముఖంనిండా బట్టలనిండా యీ నెత్తురేమిటి మరకలేమిటని అడిగేవాళ్ళే? అడిగి తెలుసుకున్నాక పొట్ట చెక్కలయ్యేలా నవ్వేవాళ్ళే? ఇందిర ఆవకాశంకోసం కాచుకు కూర్చున్నది. విజయ, శ్రక్టరీ, జట్కాలో ఎక్కబోతూంటేగా 'ఏమే—యినాగరేపటి 'డే' ఎల్లాగుంటేం?' అంది. శ్రక్టరీ ముఖమంతా నలుపు చేసుకుంది. విజయ 'ఇప్పుడా, యిదా వేళాకోళానికి సమయ' మన్నట్లు చూసింది.

ఇందిర మాటలో మాట కలిపింది—'జరిగిందేదో జరిగింది కాని—యింకెప్పుడూ అనవసరంగా మనకు సంబంధంలేని విషయాల్లోకి దిగి యితరుల్ని అవమానించటానికి ప్రయత్నాలు పన్నకండి.' దీంతో శ్రక్టరీ చచ్చిపోయింది. విజయ వుడుకుమోతుతనంగానే అంది—'నీకు మహా బాగా తెల్సులేవే—అందర్నీ వెనకేసుకొచ్చి మాట్లాడుతున్నావ్. ఇవాళ ఏదో ఆ వెధవ క్లోరోఫారం సరిగ్గా యివ్వనందుకు ఆ కప్పకు తెలివొచ్చి మేకుల్ని ఎగరగొట్టిందని దానికీ దీనికీ ముడిపెడ్తున్నావు. వాడెంత రోగ్గో నీకు తెల్సా—నన్ను సైకిలుమీదనుంచి పడేశాడు. నిన్న మా అమ్మ కలకత్తా నుంచి వస్తూంటే రాజమండ్రిలో ఎక్కిందట—యీయనగారి భార్యామణి. మాట్లాడేవంటే నీ మూటా ముల్లె కిటికీలోంచి గోదావరిలో పారేస్తానని బెదిరించిందట. ఇద్దరి కిద్దరే... వీడికీ వీడి పెళ్లానికి యిద్దరికీ బుద్ధి చెప్పాలి.' అని.

శ్రక్టరీ మళ్ళీ అంది—'ఒసే ఇందిరా—నీవనవసరంగా దీంట్లో జోక్యం కలుగజేసుకోకు. వాళ్లిద్దరికీ బుద్ధి చెప్పందే మేం నిద్రపోయేది లేదనుకో...'

ఇందిర మళ్ళీ కప్ప సంగతి గుర్తుకు తెచ్చుకుని పకపకా నవ్వుతూ 'నాకెందుకు జోక్యం—నేను కలగచేసుకుంటే ఆ కప్ప ఎగిరి నామీదే పడివుండేదియిందాక.' అంది. ఇంతలో సిటీబస్సు వచ్చింది. ఇందిర బస్సులోకి వెళ్లింది. 'ఇదేమిటే యింత పెడ

సరదాగా సెక్స్ సింపతీ కూడా లేకుండా మాట్లాడుతుంది' అంది సెక్రటరీ. చెన్నాకోలు 'ఛళ్'మంది. కారు హారన్ 'బంయ్' మంది.

## 7

రోజులు గడుస్తున్న కొద్దీ చిత్రవిచిత్రమైన సంఘటనలు జరుగుతూవచ్చాయ్. ప్రపంచంలోని ఒకరకపు అసందర్భపు మనుష్యుల్లో ఒకడైన అహోబలరావు 'బాహ్యజీవితం' దినదిన గండం, నూరేళ్ళాయుస్సుగా మారిపోయింది. ఉపన్యాసాలివ్వటం మొదట్లో క్రొత్త అనిపించినా క్రమంగా కొన్నాళ్ళకు మామూలై పోతుంది అందరికీ. ఇతడి విషయంలో అట్లా కాలేదు. చిన్న చిన్న అడ్డంకులు సంఘటనలు వచ్చి వ్యక్తిని నిరుత్సాహపరిచాయి. ఆడవారి క్లాసంటే భయం దిన ఎక్కువవుతూ వచ్చింది కాని తగ్గలేదు. చక్కగా కష్టపడి అవీ ఇవీ చదివి మరీ వెళ్ళేవాడు—కాని నోరు విప్ప నివ్వరే! ఖర్మ!

ఇంటి కొచ్చాక పెద్దపెట్టున రాగా లెట్టాలనిపించేది అతనికి. ఎవరితో మాట్లాడకుండా దిగాలుపడి కూర్చుండి పోయేవాడు. అర్ధరాత్రి నిద్రలోంచి ఉలిక్కిపడి లేచి 'భయం' అనేవాడు. 'నా చేయి మీమీద వేస్తాను. మీరు సుఖంగా నిద్రపోండి. మీ కెందుకు భయం.' అనేది అలివేలు.

ఒక రోజున గదిలో కూర్చుని కాంపోజీషను పుస్తకాలు సంస్కరించటానికి బదులుగా రెండు చేతుల్తో తలగట్టిగా పట్టుకుని వెక్కి వెక్కి యేడవటాని కారంభించాడు. అలివేలు వంటయింట్లో కాఫీ కాచటంలో మగ్నురాలైవుంది.

'మరో పది నిముషాలకు కాఫీ కప్పు బల్లమీద వుంచుతూ—'కళ్లు ఎర్రగావున్నా యేమండీ?' అంది చకిత వదనయై. అహోబలరావు ఉత్తరీయంతో కళ్లద్దుకుంటూ 'ఏమీ లేదు.' అని కాఫీ కప్పందుకుని రెండు గుక్కలు పీల్చి ముఖాన్ని ప్రక్కకు త్రిప్పి కిటికీలోంచి ప్రొద్దుగుంకటాన్ని తిలకించసాగాడు. పడక కుర్చీ పక్కవచ్చి నిల్చొని 'నామీద వొట్టే...ఏమీ లేదూ?' అంది రొకాయిస్తూ అలివేలు.

ప్రక్క వాటాలోవాళ్లమ్మాయి యేడ్చి మారాం చేస్తూంటే—ఉల్లుల్లా హాంబా! యేడువకు యేడువకు వెర్రి నాగన్నా! యేడిస్తే నిన్నెవరు యెత్తుకుంటారు?' అని తల్లి వోదారుస్తోంది. అలివేలు కాస్సేపు నిశ్శబ్దంగా నిల్చొని 'దీపం వెలిగించుకొస్తాను. ఆనక చెబుదురుగాని లెండి. అన్నం పడేస్తాను.' అని గిరుక్కున వంటయింట్లోకి మళ్లింది.

అహోబలరావుకు వెనుకటి సంగతులు ఎంత వద్దనుకున్నా జ్ఞాపకానికి రాసాగినై. అలివేలు తన్ను యేరికోరి వలచి చేసుకుంది. చెంపకు చేరడేసి కళ్లు—పిల్లా...అహోబలరావు కివ్వడ మేమిటి అన్నారంతా. ఆనర్సయితే చదువుకున్నాడూ గాని, ఎక్కడా ప్రాపంచికజ్ఞానం, తెలివీ తేటా, అందం, మనిషిలో నాగరీకం గాని లేవు. కాకి ముక్కుకి దొండపండు కట్టినట్లు ఏమిటిది? అంటే అలివేలు సమాధాన మిచ్చింది. 'నాకు అందం అక్కర్లేదు. ఎక్కడున్నా అందాన్ని కొరుక్కు తింటామా? అది యివ్వాళ వుంటుంది రేపు పోతుంది. ఈవాళ నలకూబరుడులాటి వాడ్ని తెచ్చి కడతారు. రేపు ప్రొద్దున్న వాడికే మశూచికమన్నా రావచ్చు. అప్పుడా అందమంతా పోతే - అటువంటి అందాన్నే చూసి పెళ్లి చేసుకున్న నా గతేం కాను?' అంది పెళ్లికూతురు.

ఇది మాటలు నేర్చిన కుక్క యిస్కా మంటే యిస్కా మంటుంది అన్నారంతా. తల్లి అడిగిందట—'ఆస్తి మాటో—లక్షణమైన బంగారపు బొమ్మలాటి పిల్లనిస్తే, తిండి బట్టా యిచ్చి సుఖపెట్టే చోటు అవునో కాదో కొస్త చూసుకో నక్కర్లేదుటే...' అని. అప్పుడు కూడా అలివేలు కొంటె మాటలు మానలేదు.

'డబ్బు కూడా అట్లాంటిదేగా అమ్మా. అది యివ్వాళ వుంటుంది. రేపు పోతుంది. రోజూ మనం ఎంతమందిని చూడ్డంలేదు. లక్షాధికారులు భిక్షాధికారులు కావటంలే—'

తల్లికి అత్తరువులో కారం వేసి రాచినట్లైంది. దాన్తో ఆవిడ చిరాకుపడింది- 'ఈ అడ్డదిడ్డం మాటలన్నీ చెబుతున్నదానివి నువ్వు నిజానికి మొగుడితోటి కాపురం చేసేదానివేనా?' అని.

అహోబలరావు అనుకున్నాడు—బుజాను బంధం వుండేచోట అన్ని ముళ్ళూ త్రెంపుకుందా

మన్నా తెగవు. లేనిచోట ఎంత అతుక్కుందామని భగీరథప్రయత్నం చేసినా అతకదు. ఆ ఆశలు గగన కుసుమాలుగానే వుంటాయి. ఎవరి చేతి మెతుకులు ఎవరికి ప్రాప్తో, ఏపెట్ట యేపెట్టతో కలిసి గూడు కట్టుంటో చెప్పటానికి నిజంగా యెవరికి తెలుసు ?

ఎలిమెంటరీ స్కూల్లో చేరినప్పట్నుంచి ఆనర్స్ క్లాసు పూర్తయేవరకూ యీ పదిపదిహేనేళ్లలోనూ ఒకే ఒక రకపు మనస్తత్వాన్ని పెంపొందించుకున్నాడు అహోబలరావు. జీవితం పొడుగునా అపహాస్యాలకు, స్నేహితుల వెక్కిరింతలకు, వేళాకోళాలకు బలిఔతూ వచ్చాడు. అంట కత్తెర నుంచి క్రాఫింగ్ వరకూ వచ్చినా డబల్ బ్రెస్టకోటు వేసినా, ట్వీడుసూటు వేసినా అతనూ అతడి నడకనూ శతయోజనాల దూరంనుంచి దుర్భిణీవేసి చెప్పవచ్చు. ఇంటర్మీడియేటువరకూ అతను హాస్టల్లో త్రికాలాలూ సంధ్యావార్చేవాడు. అక్కడికి మెస్ రెండుమైళ్ళ దూరం వుండేది. ఈ రెండుమైళ్ళూ పెద్దాపురం పట్టుపంచె ఒళ్ళగోచీపెట్టి తడిఉత్తరీయాన్ని బుజాన్నేసుకుని చేతిలోని రాగిచెంబుతో భోజనానికి శ్రీ మల్లవరపు వల్లభరాయుడుగారిలా జమద్గేరి దారివెంటబడిపోతూవుంటే, ఆ పెలక గగన సీమల్లో సంచారం చేస్తూవుంటే, క్రొత్తగా మొదటి సంవత్సరంలో చేరినవాళ్ల దగ్గర్నుంచి, ఫైనలియ్యరు వరకుఆపి—మగా అన్న విచక్షణభేదం లేకుండా అంతా నమస్కారాలు చెల్లించి భక్తితో త్రోవ యిచ్చేసేవారు. కొందరు భక్తగణంలోనివారు అతణ్ని అక్కడే నిలేసి లెక్కలూ గట్రా తెలియనివి చెప్పించుకుని మరీ వదిలేవారు.

అహోబలరావు రామానుజులవారి మతానికి హృదయాన్ని అంకితం చేశాడు. విష్ణుచిత్తీయము అతను తలక్రింద పెట్టుకు నిద్రపోయే గ్రంథం. అహోబలరావు విశిష్టాద్వైతికూడా—పరబ్రహ్మైక్య తను చచ్చినా వప్పుకోడు. చరిత్రకారులు కొంత మంది కాలేజీలో చదువుకునే రోజుల్లో అహోబలరావుకి 'ప్రవరాఖ్యుడు' నే గౌరవ నామం వున్నట్లు కూడా చెబుతారు. అతను అన్ని తరగతుల్లోను ఉత్తమశ్రేణిలోనే వచ్చాడు. కాని ఆనర్స్‌లో సెకండ్‌క్లాసు. అక్కడే వచ్చింది గట్టి చిక్కు. విశిష్టాద్వైతంకొంపతీసింది.

ఆచార్య శివశంకరరావుకు ఎవరో చెప్పారు, అహోబలరావు ఎంత సూపర్‌స్టిషన్ మనిషంటే అతను నడుస్తూన్నప్పుడు శివ శివా! అనిగాని, హర హరా! అని గాని ఎవరైనా అన్నట్లయితే చెవులు రెండూ మూసుకుని వినపడనంత దూరం పరిగెత్తేవాడని. ఆయన ఒకరోజు స్వయంగాపిలిచి 'నా పేరేమిటి చెప్పమ'ని అడిగాడు. 'హరిహరీ' నేను చెప్పనన్నాడు అహోబలరావు. ఆయనూరు కానీ నూరారు కానీ నేను శైవ నామోచ్చారణచేయనన్నాడు. అతను తిరునామాన్ని తీర్చి దిద్దితే యమ్. యస్. యం. నైలుపెట్టెమీది పట్టెవర్ధనాలకన్నా ఎక్కువ స్పష్టంగా గోచరించేవి. చివరకా విశిష్టాద్వైతమే అతడి ఫస్టుక్లాసు కత్తెర్ని దూరంచేసి మరీ వదిలింది. ఐతే యూనివర్సిటీకల్లా ఫస్టుగా రేంకులో నిల్చోవలసినవాడికి ఫస్టుక్లాసు రాకపోగా, మెడపట్టుకు గెంటితే సెకండ్‌క్లాసు గుంపులోకొచ్చి పడ్డట్లు తెలియగా ఆ తెలిసినరోజుల్లోనే అహోబలరావును గంజికావిడేసి రైల్లో కెక్కించాల్సినంత పనయింది. తరువాత కొద్దిరోజులకేగా జరిగింది కాన్వొకేషను. అప్పటికీ ఫస్టుక్లాసు రాలేదేమా అన్న విచారం మానవుణ్ని పట్టుకు వదల్లేదు. ఉద్యోగం దొరికాక యిప్పుడావిచారంమాయమైంది. దానిస్తానేలోకంలో బ్రతకటానికి జీవితయాత్రను సరిగా నెళ్లబుచ్చటానికి ఒక యూనివర్సిటీడిగ్రీలే చాలవని ఎన్నో సుళువులు మెలకువలు మాయలు మోసాలు కుతంత్రాలు నేర్చుకోవాలని లేకపోతే అధోగతి అన్నది నిశ్చయమే! అని తేలింది.

అలివేలు దీపం వెలిగించుకొచ్చి—'ఇంకా యిక్కడే కూర్చున్నారేం? షికారుకుపో లేదా—' అని ఆశ్చర్యంతో అడిగింది.

'ఇటురా కూర్చో.' అలివేలు మెల్లాపెసపుండా వచ్చి కూర్చొని, 'ఎందుకండీ అంత దిగాలుపడి పోయి కూర్చున్నారు యింట్లో......యీవాళ మీ అమ్మమ్మ యేమన్నా జ్ఞాపకానికొచ్చిందా?' అని చెంగు చాటు చేసుకుని నవ్వింది. అహోబలరావు అలివేలిని తాకుతూ—

'ఇక మనం అమ్మమ్మనే జ్ఞాపకం చేసుకుంటూ కూర్చోవాలి.'

'ఏం అలా అంటున్నారు?' అని తన చేతిలోకి అతడి చేయిని తీసుకుంటూ అంది.

అంత అందమైన కళ్ళల్లోకి చూస్తూ—'నేను చెప్పలేను. చెప్పి నీ మనసుకూడా పాడుచేయలేను' అన్నాడు సంశయంగా.

'నా మనసు మీ మనసులాటిది కాదుగా.' అంది అలివేలు.

'ఏమైనా పాడవుతుంది. ఎందుకు చెప్పటం?'

'చెప్పకపోతే దాచుకోండి. లెండి. భోంచేస్తారు.'

'నా కాకలి లేదు. నువ్వు తిను.'

'మీరు తినకుండా నే నెప్పుడైనా తిన్నానా?'

'ఇవాల్టికి తిందూ— నా మనసు బాగులేదన్నానుగా.'

'ఏమిటి. ఆ విజయ అన్న అమ్మాయి యేమన్నా చేసిందా?' అలివేలు నవ్వు నాపుకుంటకు యత్నిస్తూ ప్రక్కకు తిరిగి అంది.

'ఏమిచెయ్యాలో అదేచేసింది. ఐనా అమ్మాయి ననవలసిన పనేముంది. మన ప్రారబ్ధమే అట్లాగుంది. ఆయనేం చెప్పటం లేదనీ, ఆయన మాకు అక్కర్లేదంటూ డెప్యూటేషను వెళ్లారు. ఉద్యోగం వుంటుందో ఊడుతుందో తెలీదు. ఇటువంటప్పుడు అన్నం యెట్లాగయిస్తుంది చెప్పు?'

'వోస్—యింతేనా!' అంది అలివేలు.

'ఏం యిది చాలదా?'

'అదికాదండీ—మీ కెందుకు కోపం. ఉద్యోగం చెయ్యటం కష్టంగాని తియ్యటం అంత తేలిక కాదు.'

'ఓహ్హో—నీకు బాగా తెలుసు.'

'అబ్బ! నాకు తెలుసండీ. మీకేం ఫరవా లేదు. వచ్చి భోంచెయ్యండి.'

'నేను తన్ను చాలామాట్లు అవమానించటానకి ప్రయత్నించినట్లు ఆ అమ్మాయి రిపోర్టులో వ్రాసింది.' అన్నాడు దిగులుగా.

అలివేలు గది ప్రతిధ్వనించేట్లు నవ్వి— 'మీరా—మీరు నిజంగా అటువంటిపన్లు చేశారా?' అంది.

'నే నెప్పుడూ చెయ్యలేదు. చెయ్యను.'

'అవమానించటానికి ప్రయత్నించటం అంటే?'

'నాబొంద—నే నెప్పుడూ ఆ అమ్మాయి ముఖంలోకి చూసి నవ్వనన్నా నవ్వలేదు.'

'మీరు నిజంగా అట్లా చూసి నవ్వివుంటే కథ యింతవరకూ రాక నేపోను.'

'అలివేలూ—ఏమిటే వేళాకోళం? యిది ఎటువంటి సమయం—రేపు మనం ఎక్కడ తలదాచుకోవాలి? ఆ ఆలోచన వచ్చేసరికి బుర్ర పగిలిపోవల సందే—'

'ఏమిటండీ—బుర్ర పగిలేది? నిజంగా తన్ను అవమానించే ప్రయత్నాలు మీరు చేస్తున్నట్లు ఆ అమ్మాయి వ్రాసిన రిపోర్టు నాధారంచేసుకొని మీ మీద చర్య తీసుకుంటారనా?'

'వో తప్పకుండా'

'అప్పుడు చక్రం అడ్డుపెయ్యలేనో...'

'ఏమిటి నువ్వా...' అన్నాడు కుర్చీలోంచి లేచి అహోబలరావు.

'అవును—నేనే. ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళినా ఆడతనం చూపి గెల్చుకవస్తాను. మీ కోసం నేను ఏది చెయ్యలేను?' అహోబలరావు 'ఊ నా చేయి పట్టుకో—' అలివేలు తలుపులు తెరిచివచ్చి 'అందివ్వండి' అంది. 'ఇదుగో— అమ్మయ్య యిప్పుడు కుర్చీలోంచి లేచాను. ప్రాణం ఎంత తేలిగ్గా వుంది.' వంటయింట్లోకి నడుస్తూ 'ఉంటుంది మీకు నిజంగా ఆపిల్ల అంటే అంత భయమేమిటండీ?'

'భయం కాకపోతే—ఆ అమ్మాయిని రెండు చెవులూ నులిమెయ్యమనా, గోడకుర్చీ వేయించమనా ఏమిటి నీ అభిప్రాయం?'

'అంతకన్నా ముఖ్యమైన శిక్షే వుంది. గట్టిగా రెండు చేతుల్లోకి తీసుకుని నలిపేసి వుంటే ఆ అమ్మాయి యిట్లాటి పెంకెపన్లు ఎప్పటికీ చెయ్యకుండా వుండేది?'

పీట వాల్చుకుని కూర్చొంటూ 'ఆ పని నేనే చెయ్యాలనా—'

అలివేలు కంచం ఎత్తిపట్టుకుని 'నిజంగా మీరే ఆ పని చేసివుంటే నా కెంత గర్వంగా ఉండేదని.'

'ఊరికే పైకంటావు నేను చెయ్యనిని చెయ్య లేనని తెలుసు గనక.'

అలివేలు నవ్వి 'అందరికి మల్లే అన్యాయపడతా ననా-ఒక్క నాటికి పడను. మీ రా పని చెయ్యండి. మళ్ళీ ఆ అమ్మాయి......'

'ఛ...ఛ... నే నన్నందగ్గర్నుంచి లేచిపోతాను. నువ్విట్లా మాట్లాడావంటే.'

'మాట్లాడను లెండి. ఈ పచ్చడి కల్పుకోండి. యిది మీ కిష్టమని చేశాను.'

పచ్చడి నాలుక్కి రాసుకుని 'నీ చేయి దివ్య మైన రుచుల్ని పుట్టిస్తోంది. వుండు నా బుజంమీద చెయ్యేస్తా వేమిటి? అదుగో వాళ్లెవరో కిటికీలోంచి చూస్తున్నారు.'

'పోండి. ఎవరూ లేరు అంతా అబద్ధం. ఇవ్వాళ నేను మడికట్టుకోలేదు. తెల్సా...' చిత్తం గ్రహించా నన్నాడు అహోబలరావు. చందమామా వెన్నెలలు విరియించాడు. సన్నజాజులు నవ్వినై.

# 8

తెల్లారి లేస్తూనే 'యీవాళ నన్ను మాట్లాడించ కండి. మీ పన్లు మీరు తెవుల్చుకోండి. నా కూ పన్లు న్నాయ్. ఇంటికి తాళంవేసి మధ్యాహ్నం అలా వెళ్ళివస్తాను. కొంచెం పర్మిషను యిస్తారూ?' అంది అలివేలు.

'విషయం చెప్పు.' అన్నాడు టూత్ బ్రష్ తిరగేసి తల బరుక్కుంటూ—

'అసలు విషయం ముందు చెబితే కథ ఎప్పు డన్నా రక్తి కడ్తుందీ?' అంది కాఫీకోసం కుంప టంటిస్తూ అలివేలు.

'ఇప్పుడు నువ్వు నాకేమిటి కథ చెప్తావ్?'

'మంచికథ. అనగా అనగా ఒక అబ్బాయి వున్నాడు. ఆ అబ్బాయి ఒక మంచి నాజూకైన అమ్మాయిని సైకిలు మీంచి పడగొట్టాడు. అప్ప ట్నించి వాళ్ళ మనస్సులో రాగద్వేషాలు రాజు కొంటూనైన్న.' అహోబలరావు పౌరుషంగా—

'నేను నువ్వు చెప్పేకథ వినదల్చుకోలేదు. నీకు ఆకథలో సంబంధంలేదు.'

'సంబంధం లేదంటే మీకు ఉద్యోగం వూడు తుంది.'

'ఐతే యింతకీ నువ్వేమిటి చెయ్యదల్చు కున్నావు. ఇల్లిల్లూ వెతుక్కుంటూ వెళ్తావన్నమాట. నా అవస్థ నే నేదో పడ్తాను. కావలిస్తే క్షమాపణ పత్రం వ్రాసియిస్తాను. నువ్వెందుకు నీకు పుణ్యముం టుంది—ఎక్కడికీ వెళ్ళొద్దు.'

'అనవసరంగా మీరు ఆ అమ్మాయికి క్షమా పణపత్రం వ్రాసియిచ్చి మళ్ళా నుమీరా కాలేజీ లోనే పాఠం చెప్పదల్చుకొన్నారా? అట్లా ఒక్క నాటికి జరగటానికి వీల్లేదు. నేను వెళ్ళి మీ విజ యను కల్సుకుని మాట్లాడివస్తాను. మీ తరఫున నాకు వకాల్తీ యివ్వమని ప్రార్థిస్తున్నాను. ఎందుకు మీ రింకా ఆలోచిస్తున్నారు? యేమిటా సంశయం?'

'ఏమీలేదు. బ్రహ్మదేవుడు నన్నే భార్యను చేసి నిన్ను భర్తనుచేసి వుంటే ఎంత బాగుండి పోయేది అని.'

అలివేలుకి కోపమొచ్చి యింట్లోకి వెళ్ళి పోయింది. తరువాత వాళ్లుమాట్లాడుకోలేదు అరగంట సేపు. అలివేలే ఆ యుద్ధాన్ని రాజీలోకి తెచ్చే ఉద్దేశంతో 'ఇదుగో, మిమ్మల్నే, మన యీవా దనలో కూరల మనిషి కేక వినిపించుకోలేదు. కూర ల్లేటండి బజారుకెళ్లి. ఎట్లా తెస్తారో చూస్తాను?' అంది. అహోబలరావు సంచీపుచ్చుకు వీధిలో కొచ్చి 'ఎట్లాతెస్తారో చూస్తుందిట. నాకేమి అంత లౌకిక జ్ఞానం తక్కువా?' అంటూ మార్కెటు వరకూ సాగిపోయాడు విసా విసా. వెళ్తూ యిలా గనుకున్నాడు. ఏదన్నా హెచ్చు తగ్గులువస్తే అలివేలు తప్పకుండా చెప్పుతుంది. కూరలవాళ్లు తనది క్రొత్త మొహమని ధరలెక్కువ చెబుతారో, తప్పుడు తూకాలు తూస్తారో—అట్లాటి వేషాలు తన దగ్గిరా? హనుమంతుడిముందు ఎవరన్నా కుప్పి గంతులు వెయ్యగలరా? ఇట్లా అనుకున్నప్పుడు చొరుచుకొచ్చిన ఆవేశంతో ఎదురుగుండా కని పిస్తూన్న ఒకటి రెండుకూరల దుకాణాలప్రక్క నుంచి కాళీసంచీ నలుగురి కన్పించేలా వూపు గుంటూ ఒకసారి నడిచాడు. అమ్మకం జోరులో—వోవైపునుంచి గోనెక్రిందకు డబ్బులు, నోట్లు, వెళ్లినవి వెళ్తూండగా అటువంటి మాంచి రద్దీలో బేర గాళ్లు గంపలమీదకు యీ గల్లా ముసురుతూన్న ప్పుడు, లేచి 'రండి' అని అహోబలరావును ఎవరు

ఇష్టపడతారు? అతనువట్టి కాలేజీ లెక్చరరు. ఏ నీ
వి కాలేజీకు కనిపిస్తే బన్నా అయితే నలుగురూ పూజిస్తే
గొంతిమున్నన చేసేవాళ్ళే. తీరా తానుగా వెళ్తే
ఎవరెవరో పడాలిపోతుంటే వెళితే అనుమానం వేసిన
మాట మాత్రం నిజం. అంతలో ఒక కొట్టుదగ్గర
జనం 'జానకీ! జానకీ!' అని సంబోధిస్తూ కొండల
కోసం మొగబడ్డాన్ని చూసి యీ వేళలో గానుంచి
యిక్కడికొంటె నుంచివచ్చి లోనికి తొంగిచూశాడు.
మనిషి గొంగళి బస్తాకు చుట్టేస్తుంది. పాపోష్టి—
కాసులదండ— చుక్కల వస్త్రం—జేలిని గుసగుసలు.
కొంగుకిండా బంగారంతో కొప్పవల్లిగా
వాగ్దానాలతో ఉంది.

అహోబలరావు పొరుగోవచ్చా—ఏ మనసు
న్నాకో—ఎదురుగుండా కొట్టులోంచి వచ్చే మను
షుల్ని 'ఎల్లా గొన్నారు? సరిగ్గా తూచిందా? సిన్న
ల్గానేనా ఏమన్నా ధరలు తగ్గాయా?' అంటూ
వాకబులు ప్రారంభించాడు. జానకిని ఆ జనం మధ్య
నుంచే అహోబలరావు ఆకర్షించాడు. దాన్తో వది
లిందా—'ఆ రాళ్లు సరేనా—ఆ కాటా అల్లా వుందే?
తక్కెట్లో దారేనా ఏమన్నా వుందా?' అంటూ తన
ప్రజ్ఞను వెల్లబెట్టబోయాడు. లొటకిలా జానకి కన్ను
మని 'ఏందయ్యో—కొన్నావులే గాని ఎల్లు. ఇసు
మంటి నాటకాలాపెక. ఎప్పటాన్నా బజారు చేసిన మొహా
లేనా—' అంది దురుసుగా. అంతా గొల్లుమన్నారు.
అంతట్లోకే ఆ దారిని పోతూన్న మరోమనిషి నుద్దే
శించి 'పోలయ్యా! గంపమీద చెయ్యేసెల్లు. కొనక
పోతే మాన్లే—దెబ్బకీ పాణానకీ లంకె. నీ సెయ్యి
మంచిది బాబో!' అని ఒక గావుకేక పెట్టి, చిన్న
బుచ్చుకుని తిరిగి వెళ్లిపోతూన్న అహోబలరావు ఆమా
యిక వాదాన్ని మాసి జాలిపడినట్టై దారి కడ్డంపడి
'రా అయ్యో! కోపగించి పోతావా తమ్ముడూ! కొన
కుండాబోతే వచ్చి నీ కడుపు నుడతా' అని చెయ్యి
బుచ్చుకు తీసికెళ్లి— 'ఉప్పూ పులుసు తినే పానానికి
కోపం రావద్దూ? నీ రాళ్లు తక్కెడ తప్పంటివే?
నీ అప్పను కానా—నాను తప్పాడుముండన నేగా
నీ వూసు—'

అహోబలరావు నవ్వి— 'అప్పా! నువ్వు మంచి
దానివేలే.' అన్నాడు. 'అట్టాగను బాబూ! నీ నాటి
దొరబాబులు కోపగిస్తే జానకి సచ్చేనా—బతికేనా—'

కూరలన్నీ పూచాక డబ్బు లిస్తోంటే జానకి
అంది.

'రోజూ యిటేరా తమ్ముడూ. డబ్బులియ్యాల
గాకపోతే రేపియ్యి. నీ వగుండాలి గాని జానకి
డబ్బు కోటికి కెదురీత్తుంది.'

అహోబలరావు సర్వోత్తమని యింటికి సుఖం
వచ్చాడు. ఈ అస్వాదయోగ్యమైన అతి నిజవరకు ఎక్కడా
చవి చూసి లేదు. ప్రపంచంలోని యిన్ని సుఖాలు,
సుఖానికో మన స్తత్త్వం, గొప్పన ప్రయత్నాంటే జాన
కిని రేండ్లో సేవిస్తే బాపంచుంగా అతని కెంతివ్వకూ
తట్టలేదు.

## 9

అహోబలరావును ఉద్యోగంలో నుంచిప్రా
పెరికేయత్నంలో విజయం మరది కాబోతున్నదని
ప్రసాదరావు శంఖారావం చేసి వెళ్లాక సుఖ్యంగా
ఆనందించినది విజయ తల్లి. దమయంతి విచారంగా
'మానెండి.' ఒకరినోటికన్న అన్నాన్ని అధికార
మనే చిన్న బెడ్డతో పడగొట్టడం మహాపాపం
సుమండీ. పదిమంది కలయిల్లు ..' అని వాపోతుంటే
తల్లిబిసబిసా చేతు లాడించుకుంటూ 'హాల్లో నాకు
జరిగిన అవమానం యింతా—అంతా, పుస్తకాలూ
కాగితాలు పెట్టెలోంచి గిరవాటేస్తానంది ఆతింగ
రది. వాడో—చుక్కల పచ్చలార నిదాన్ని అని
పిల్లను నడి రోడ్డులో పడగొట్టి అవమానపరుస్తాడూ?
స్త్రీలనోలికి పోయినవాళ్లు అనుభవించాల్సిందే.
పెద్దా చిన్నా గౌరవ మర్యాదలెరక్కుండా
ప్రవర్తించినందుకు కావలిసిందేయీ ప్రాయశ్చిత్తం.'
అంటూ తన అక్కసును వెళ్లబోసింది. దమయంతి
చిన్నబుచ్చుకున్న ముఖంతో అక్కడనుంచి వెళ్లి
పోయింది. ఇంతవరకూ వచ్చాక మనం చేస్తున్నది
పాపమేమో అనే చింత విజయకు కూడా కలిగింది.
లైబ్రరీనుంచి తెచ్చిననవలను పూర్తిచేద్దామని పుటలు
తెరిచి చదవబోయే సరికి సత్యాహింసలు—ప్రపంచ
శాంతిమీద చెమటోడ్చి ఉపన్యాసమిచ్చే అహోబల
రావు దీనవదనమే మాటిమాటికి విజయకళ్లనుందు
నాట్యమాడసాగింది. పైకిచూస్తే నభోమండలానసల్లటి
కారు మబ్బులగుంపులు అక్కడక్కడ విచ్చి తెల్ల
తెలబడ్తూ కదుల్తూ గోచరించాయి. కాలేజీలకు ఆఫీ
సులకు వెళ్లేటైమయింది. అది కుర్రవాళ్లు వడివడిగా

గడ్డాలకు సబ్బురాసి స్నానాలు భోజనాదికాలు పూర్తిచేసుకునే వేళ...కొందరమ్మాయిలు లప్పుడే ముస్తాబులకు చివరితీర్పు లిచ్చే సమయం. విజయకు నుంచెల్లో గుబులొచ్చిపడింది. రేపు తనకా కాలేజీతో ఋణం తీరిపోతుందని తెలియని అహో బలరావు చివరి ఉపన్యాసంతను వినటాని కెళ్ళాలి. వెళ్ళి అక్కడ కూర్చోటానికి తనకెంత యిష్టమలాటి కఠినహృదయం కావాలి. రేపు అతను అలోలక్ష్మణా అని ఉద్యోగం పోయి యేడుస్తాడు. అతడి క్రొత్త సంసారం కాకులికీ గ్రద్దలకీ అవుతుంది. ఆ కాకులూ గ్రద్దలూ ఎవరు? విజయగుండె చప్పునఆగినట్లయింది.

కాలేజీకి వెళ్ళటంకోసం తీసిన పుస్తకాలు బల్లమీద గిరాటువేసి చేతుల్తో ముఖాన్ని కప్పుకుని కూలబడిపోయింది కుర్చీలో విజయ. కిటికీలోంచి క్రిందకు చూస్తే బయటగోడను చార్లవేసి వుంచిన నుక్కుతుక్కైన లేడీసైకిలు 'క్రోధం బహు చెడ్డ వస్తువు సుమా' అని హెచ్చరిస్తోంది. విజయ దిగాలు పడ్డ ముఖంతో అటూ యిటూ తిరుగాడుతూండ టాన్ని గమనించిన దమయంతి 'కాలేజీకి టైము కాలేదుటే—లేచి అన్నానికి రా' అని ఒకటికి రెండుమార్లు కేకేసింది. విజయ లేచి వంటయింటి గుమ్మంలోకొచ్చి 'ఈవాళ కాలేజీకి ఎళ్ళా వెళ్ళను? వెళ్ళలేనే అక్కా—' అంది కాలితో నేలను వ్రాస్తూ. సరిగ్గా యిదే సమయానికి విజయ తల్లి చిన్న కూజాబిందెను నీళ్ళతోసహా ఎత్తి కుదేసి లోనికి రొప్పుతూవచ్చి 'అదే—అదే...అది వచ్చిందే— యింట్లో ఎవరూ లేరే. ఎట్లాగే బాబూ!' అని కంగారుగా యిటూ అటూ చూసింది. దమయంతి చెరగు మీదకు లాక్కొని వీధిలోకొచ్చింది. వెనకాలే విజయ నెమ్మదిగా అడుగులో అడుగేసుకుంటూ మెడ రిక్కించి ముందుకు చూసింది.

గేటు వొత్తిగించి నవ్వుతూ అలివేలు 'క్రొత్త చుట్టాన్ని. ప్రసాదరావుగారి మరదల్ని పరిచయం చేసుకుపోదామని వచ్చాను.' అంది.

దమయంతి 'రండి.' అంటూ ఎదురుగా వెళ్ళి 'మీవారు కాలేజీలో లెక్చరరు గదూ' అని చేయి పుచ్చుకుని మెట్లమీదనుంచి నడిపించుకెళ్ళింది. విజయ తల్లి ఖంగారుగా వెనకనుంచి విజయను జబ్బ పుచ్చుకు లాగుతోంది లోనికొచ్చెయ్యమని. విజయ తల్లిని విదల్చుకొని హాలులోకి వచ్చి పచ్చటి పసిమి రంగుఛాయతో మెరుస్తూన్న అలివేలు రూపాన్ని తీర్చినట్లు కట్టిన ఆమె కెంపురంగు చీరను, ముఖాన్న శుభసంపత్కరచిహ్నంగా దివ్యమంగళకరంగా కనుపిస్తూన్న కుంకుమనూ, ఆశ్చర్యంతో చూడసాగింది.

దమయంతి 'ఈ అమ్మాయే. మీవారి శిష్యురాలు.' అంటూ పరిచయం చేయబోయింది. అలివేలు 'గట్టి శిష్యురాలే—విజయ కదూ మీ పేరు. మీరే కాలేజీలో పని చేస్తున్నా రనుకొని మావారు పొరబడి ఒక క్లాసు వదిలేసారట. నిజమేనా?' అంది నవ్వుతూ అలివేలు.

విజయ 'నిజమే..............' అనేసి దగ్గరసా వెళ్ళి ఆమెలోకి చూడసాగింది. అలివేలు దేనికోసమో వెతుకుతూన్నట్లు చూసి 'ఏరిమీ అమ్మగారేరి? వారి యెడల కొంచెందురుసుగా ప్రవర్తించాను. క్షమించమని అడగాలి.' అంటూ లేచింది.

అప్పటికి విజయతల్లి సొట్ట పోయినబిందెను మెల్లగా వంకరలు తీరుస్తోంది. అలివేలు చప్పున ఆవిడ రెండు చేతుల్నీ పట్టుకుని 'పిన్నిగారూ! చిన్నవాళ్ళను మీరు క్షమించాలి. అప్పుడు కొంచెం దురుసుగా ప్రవర్తించినమాట నిజమే. ఇప్పుడు మీ స్నేహం కోరివచ్చాను.'

విజయ తల్లి క్రిందు మీదై 'హా హా హ్హా!' అని మాత్రం అనగలిగింది. దమయంతి 'మాయిల్లు చూద్దురుగాని రండి.' అంటూ వంట యింటిలోనికి తీసుకుపోయి పీటవేసి కూర్చోబెట్టి పుట్టింటూ రేవూరో అన్నీ వాకబులు చేయనారంభించింది. తన పుట్టినిల్లు రాజమండ్రి అనీ తన తండ్రి హైస్కూల్లో మాస్టరనీ అన్నీ చెప్పాక విజయకేసి తిరిగి 'మిమ్మల్ని మాట్లాడించటం ఎట్లాగో నాకు తెలియడం లేదమ్మా. ఎందుకనంటే నాకు వచ్చినచదువు చాకలిపద్దుల వరకే—అంతే ఇవ్వాళమీరు బడికిపోలే నట్లుంది. బడేమిటి నా మొహం! కాలేజీ అనాలికా మోసు'

విజయకీమాటు నవ్వు వచ్చింది నిజంగా. 'వొంట్లో ఏమీ బాగాలేక వెళ్ళలేదండీ.' అంది.

దమయంతి కాఫీ తెచ్చియిచ్చింది. విజయ దొడ్లోనని పూలుకోసుకొచ్చి 'యిందియివి తీసుకోండి.' అంది. అలివేలు కొంచెం గంభీరంగా 'అమ్మా నేను నిజంగా నిన్నొకటి యాచించటానికి వచ్చాను. ఆతిథ్యాల్ని స్వీకరించటానికి రాలేదు. కాని మీ మంచి మనస్సులతో యిస్తే అది ఎట్లా కాదనను?' పూలుతీసుకుంది. దమయంతి 'ఎందుకండీ అట్లా అంటారు? అదిచిన్నపిల్ల దానికేం తెలుసు?' అలివేలు నవ్వి 'ఇప్పుడీమె యెంత చిన్నపిల్లో యింతకన్నా పదిరెట్ల పసిపిల్ల డొకడున్నాడు మాయింట్లో. అతని చేష్టలవల్ల మీకేమన్నా కష్టం నష్టాలు కలిగితే మన్నించమని అడగటంకోస వచ్చాను. ఆయనకేమీ తెలియదు. నాకు తెలియనిది

ఆయనకు తెలిసినట్లే అనుకోండి.' అని విజయ రెండు చేతులూ పుచ్చుకుని 'ఊఁ—చిన్న అక్క కోర్కెను మన్నించరా' అని అడిగింది.

## 10

కాలేజీనుంచి 'ఆదరా బాదరా' యింటికొచ్చేసరికి గుమ్మానికి పెద్ద తాళం వొకటి వేసివుంది. అహోబలరావుకి అటువంటి సమయంలో మొగుడనే వాడికి ఎంత కోపం వస్తుందో అంత కోపం వచ్చింది. ఐతే ఆ కోపం ఎట్లాగన్నా బహిర్గతం కావాలి! మరొక అసందర్భం ఏమిటంటే 'తను ఎక్కడికీ కదల వద్దని వార్నింగ్ యిచ్చాడామె. అప్పటికీ తన మాట కెదురుతిరిగి వెళ్ళిపోయింది. అహోబలరావుకి బాగా తెలుసు. తను అనుకున్న పని అలివేలు చేసితీరుతుం దని. ఆ వాళ్ళ కొంపకు పడిపోయినట్టుంది. వెళ్ళి ఏమని చెప్పివుంటుంది. తన భర్త వట్టి తెలివితక్కువ వెధవనీ, తనే మహా గడుసుదాన్ననీ చెప్పివుంటుంది. ఇవన్నీ చెప్పి ఆ అమ్మాయిని రిపోర్ట్‌ను ఉపసంహ రించుకోమని అడగటానికే వెళ్లివుంటుంది. ఎంత అవ మానకరమైన పని! ఈ భూప్రపంచకంలో మొగుడనే వాడి అజమాయిషీలోవున్న ఆడది చేయవలసినపను లేనా...ముష్టికి బైలుదేరింది. ఛీ! సుప్రసిద్ధ కాలేజీ లెక్చరరు అహోబలరావు పరువంతా మంటలో కలిసిపోయింది. అయిపోయింది—యింకా కాలేజీ లెక్చరరేమిటి తను? రేపో ఎల్లుండో ఊస్టింగ్ వస్తుంది. ఎందుకొచ్చిన బ్రతుకు? ఛీ! రేపు యీ వూళ్లో ఏ ఆధారాన్ని నమ్ముకుని వుండటం? అతని కళ్ల ముందు భూమి రోడ్డు రోడ్డుమీద మనుష్యులు అంతా గిరగిరా తిరుగుతున్నారు. డబ్బు లేక అగ చాట్లు పడే వేలాది అసంఖ్యాక భారతప్రజల హీన చరిత్ర పుటలు అతని మనఃఫలకాన గబగబా కదుల్తు న్నాయ్. కేవలం హైన్యమే అతని కళ్ళముందు తాండవమాడివుంటే పరవాలేకపోయేది. అటువంటి హీనస్థితి తనకు వచ్చేసినట్లే—వచ్చి ఎంతో కాలమై నట్లే ఫీలయ్యాడు. అప్పుడిక అలివేలు తన చెప్పు చేతల్లోంచి కట్టలు త్రెంచుకునే ప్రమాదకరమైన వస్తువులా అతనికి గోచరించింది. 'నిజమేరా అబ్బాయీ!' అన్నట్లు చింతచెట్లు జడలు విరబోసు కుంటున్నాయి. చీకట్లు ముసుర్తున్నాయ్. అహోబల రావు పళ్లు పటపటా కొరికాడు. వెర్రిఆవేశ మెత్తిపో తోంది. గుమ్మంలో చతికిలబడి గ్రుడ్లు పెద్దవిచేసుకుని మనస్సు అన్యాక్రాంతం చేసి చూడసాగాడు. అటు వంటివాడికిచూపు యేమి ఆన్తుంది? ఎదురుగుండా రిక్షా ఆగటం అందులోనుంచి మనుష్యులు. తన వైపుకు రావటంకూడా అతనికి తెలియదు. బాగా దగ్గరా వచ్చి తలుపుతాళం తీస్తుంటేగా తెలివొచ్చింది అహోబలరావుకి. ఆ మనిషి అలివేలులా కనుపించి వూచిపుచ్చుకు లెంపకాయ కొట్టాడు. 'అమ్మా!' అని అలివేలు గోడమీదకు వ్రాలింది. గోడనున్న మేకు కణతలకు తగిలి గాయమేర్పడింది. ఇది గమనించని అహోబలరావు 'ఎక్కడికి వెళ్లావే—రాక్షసీ ? వెళ్ళొద్దన్నానా—అని మళ్లీ చేయెత్తాడు. వెనక నుంచి అతని ఎత్తినచేతిని ఎత్తినట్టే ఒక అమృత హస్తం గట్టిగా పట్టుకుంది.

అప్పుడు అహోబలరావు ఆ అమృతహస్తాన్ని తనవైపుకు త్రిప్పుకుని కళ్లలోకి కళ్లు పెట్టిచూశాడు. వి...జ...య.గప్పున చేయివదిలేసి 'వి...జ...యా' అని వెనక్కు గెంతాడు. గుమ్మందగ్గర కూలబడ్డ అలి వేలు కుడిచేత్తో కణతపొత్తుకుంటూ—'ఇక పరిహాసం చాలించండి. మా చెల్లెల్ని రెండవమారు అవమా నించదల్చుకున్నారా? వచ్చి తలుపుతీసి దీపం వెయ్యండి.'

అహోబలరావు కిక్కురు మనకుండా తాళం తీసిలోపల ప్రవేశించి లైటు వేశాడు. అలివేలు చెంపనుండి నెత్తురు కారుతోంది. విజయకోపంగా మాస్టారికేసి చూసి 'నేను వెళ్లిపోతాను. అక్కయ్యా తలకు కట్టు కట్టుకో' అంది. అలివేలు చేయిపుచ్చు గుని 'మరోమాటు మా సంసారాన్ని మూద్దువుగాని కాని వొక్కర్తివే వెళ్లలేవు. దయచేసి మీ రామెను యింటివరకూ దిగబెట్టి రారూ ? ఏమిటి అట్లా చిన్న బుచ్చుకున్నారే నిల్చొని. నాకు దెబ్బ తగిలిం దనా—యీవాళ నా కెంత ఆనందంగా వుందని. ఈ బాధను నేనెంతో పౌరుషంగా అనుభవిస్తాను. వెళ్ళండి.' అని బ్రతిమాలింది.

అహోబలరావు విజయను వెంటబెట్టుకొని వెళ్తున్నాడు. విజయ యిక వుండబట్ట లేక యింటి దాకా వెళ్లాక 'మాస్టారూ—అవిడ మిమ్మల్నెంత యిదిగా ప్రేమిస్తోందో మీకు తెలుసా ?' అని అడిగింది. 'ఆమాటనకు విజయా ప్రేమ ఎట్లాటిదో నాకిప్పటికీ తెలీదు.' అన్నాడు. విజయ అతని ముఖానికేసి తేరి పారచూసింది. అప్పటికే అతని ముఖం చెరువయి చెంపలన్నీ తడిసిపో ఉన్నాయి.

---

నా టి క:

# నిరంతరజ్యోతి



శ్రీ వేలూరి సహజానందం

కథకుడు :

"ఈ జగంబు సర్వ మేమిటి యేమిటి? *
యేమి యీ జగం బిదెల్ల నెల్ల?
ఎవ్వరేని యిందు నెఱిగినవారున్న
జిత్తగించి నాకు జెప్పరన్న."

మనుష్యుడీ ప్రశ్నను యుగ యుగాలనుంచి అడుగుతున్నాడు. మనుష్యుడు కాలిడిన ప్రతిచోట ఈ ప్రశ్నే ప్రతిధ్వనిస్తుంది. నిబిడమైన అజ్ఞానాంధకారంలో ఈ ప్రశ్నే, ఈ సత్యాన్వేషణే నిరంతర జ్యోతి. గ్రీసులో సుమారు 2000 ఏళ్ల క్రితం...ఈ జిజ్ఞాసతో ఉత్తేజితుడైన సోక్రటీస్ సంఘాధికారుల ఆగ్రహానికి గురి అయాడు. న్యాయసభలో సోక్రటీస్‌పై అభియోగం తెచ్చారు.

ఒకరు : సోక్రటీస్...నిరీశ్వరవాది.

(పాజ్)

ఇంకొకరు : తరతరాలనుంచి వస్తున్న పద్ధతులను విమర్శించి, అవహేళన చేసి, యువకులను భ్రష్టులను చేస్తున్న సంఘ విధ్వంసకుడు.

సోక్రటీస్ : పౌరులారా...నాపై అభియోగం విన్నారు. ఇది కేవలం అయధార్థం. నేను నిరీశ్వర వాదిని కాను.

(పాజ్)

ఒకరు : బజార్లలో ప్రతివానిని నిలబెట్టి, వానికి జ్ఞానం లేదని నిరూపించటమే వృత్తి పెట్టుకున్న నిరీశ్వర వాదివి...

సోక్ర : నేను యువకులకు దుర్బోధ చేస్తున్నానని నాపై నేరం మోపారు...స్వార్థం కోసం ఆస్తిపాస్తులకోసం కాలం వృథా చేయకండి. మీ ముఖ్య కర్తవ్యం...మీ అంతరాత్మలను శుద్ధి పరచుకోటం...ఇదీ నే చేసే ప్రబోధం...ఇది దుర్బోధా.. చెప్పండి...

ఒకరు : నీవు నిరీశ్వరవాదివనే మా ఆరోపణ.

సోక్ర : పునశ్చరణవలన ఈ అవిటి ప్రశ్నకు అంగబలం కలగదు. మీ దేవతలను కాక వేరు దేవతలను పూజిస్తున్నాననా లేక నిరీశ్వరవాదాన్నే ప్రబోధిస్తున్నాననా మీ ఆరోపణ... నేను నిరీశ్వర వాదిని కాను...కాని బుద్ధిని వినియోగించమని నాబోధ (పాజ్) మీ శిక్ష నాకు విధించినా, నా జీవితాన్ని మటుకు నేను మార్చుకోను.

ఒకరు : అంతులేని అహంకారం.

సోక్ర : నా ప్రశ్నలవలన, చర్చలవలన తమ అజ్ఞానం బైటపడుతోందని నా వ్యతిరేకులు నన్ను న్యాయసభలోకి తెచ్చారు.

మరొకరు : సోక్రటీస్‌కు మరణశిక్ష విధింపబడింది. విషపానం...

(పాజ్)

సోక్ర : ఈ తీర్పు నాకు ఆశ్చర్యం కాదు. అత్యంత కష్టమైన పని మృత్యువునుంచి తప్పించుకోటం కాదు. అన్యాయానికి దూరంగా ఉండటం. నన్ను చంపినందువలన, మీ జీవితాలను విమర్శించే నా బారినుండి తప్పించుకోవచ్చునని మీరనుకోవచ్చు. కాని అది సాధ్యమూ కాదు. గౌరవ ప్రదమూ కాదు. ఇతరులకు హాని కల్గించి, వారిని నిర్వీర్యులను చేయటం కాదు సరైన మార్గం. తమను తాము బాగుపరచుకోటం సవ్యమైన మార్గం.

మిత్రులు : మళ్ళీ ఎన్ని శతాబ్దాలకో ఇలాంటి మనిషి జన్మించటం... ఏమి అంతస్సు... ఆ ముఖంలో రవ్వంతకూడా విచారం లేదు... ఈ దీప మారాక, మనం కబోదులం... కబోదులం...

సోక్ర : మిత్రుల శోకమాట. సత్పురుషునికి కీడు జీవితంలోనూ వాటిల్లదు. మృత్యువులోనూ

---

* వేలూరి శివరామశాస్త్రిగారి 'ఏకావళి' నుంచి.

వాటెల్లదు. దేవతలతన్ని విస్మరించరు. నా వ్యతిరేకుల మూలంగా నాకేమీ హాని జరిగిందని భావించకండి. నాకు మంచి చేయాలనే ఉద్దేశ్యం వారికి లేకపోయినా, వారు నాకేమీ చెడు చేయలేదు.

మిత్రులు : పిల్లలున్న తండ్రి... అమాయకురాలు భార్య. వీరిగతి ఏమికాను ?

సోక్ర : నా పుత్రులు పెరిగి పెద్దయాక, సత్యంమీదకన్న సంపత్తుమీద వా రెక్కువ మక్కువ చూపిస్తే వారిని శిక్షించండి... బాధించండి... ఈ ఉపకారం మీరు చేస్తే నాకూ, నా సంతానానికీ మంచిచేసినవా రవుతారు.

ఒకరు : విచారణ ముగిసింది... మీ రిక వెళ్ళవచ్చు !

మిత్రులు : సోక్రటీస్...

సోక్ర : మనకు వీడ్కోలు సమయం వచ్చింది. ఎవరి దారిన వారు వెళ్ళక తప్పదు. నేను మరణించటానికి... మీరు జీవించటానికి... ఏది ఉత్కృష్టమో ఈశ్వరుని కెరుక.

(పాజ్)

సోక్ర : క్రిటో...అప్పుడే వచ్చావు?

క్రిటో : అవును. ఇంకా సాంతం తెల్లవారలేదు.

సోక్ర : జైలుకాపలాదారి నిన్ను రానిచ్చాడా?

క్రిటో : అతను నన్నెరుగును.

సోక్ర : మరి నన్ను లేపకుండా కూర్చున్నావేం?

క్రిటో : ఇట్టి విషమసమయంలో కూడా నువ్వు ఇంత ప్రశాంతంగా నిద్రపోవటం నాకు ఆశ్చర్యం. అట్టి పవిత్ర నిద్రను భంగం చేయదలచుకోలేదు.

సోక్ర : ఈ వార్ధక్యంలో మృత్యువును చూసి విచారించకూడదు.

క్రిటో : నీకన్న ముదుసల్లు కూడా ఇలాంటి సమయాల్లో ఖేదం పొందకుండా ఉండలేరు.

సోక్ర : నిజమే... మరి ... నువ్వెందుకు వచ్చిందీ చెప్పలేదు.

క్రిటో : నేనిదివర కడిగిన కోరికే మళ్లీ అడుగుతున్నాను. సోక్రటీస్...జైలునుంచి నువ్వు పారిపోవాలి.

సోక్ర : క్రిటో...

క్రిటో : అవును. సోక్రటీస్...నీవు చనిపోతే సాటిలేని సావాసిని పోగొట్టుకోటమే కాక, ప్రజల ఆగ్రహానికి గురవుతాను.

సోక్ర : ప్రజల ఆగ్రహానికి...

క్రిటో : అవును. నిన్ను, నన్ను ఎరుగని ప్రజలు నన్ను నిందిస్తారు. డబ్బు ఖర్చు పెట్టటానికి ఇష్టం లేనందువలన నిన్ను రక్షించలేకపోయానని, నేను నిర్లిప్తుడుగా ఉన్నానని వారు అంటారు.

సోక్ర : క్రిటో...

క్రిటో : అంతకన్న అవమానం ఉందా? స్నేహితుని, అందులో నీలాంటి స్నేహితుని ప్రాణం కన్న నాకు ధనం ఎక్కువా? పారిపోవలసిందని నేనా నిన్ను కోరినట్లు, నీవు తిరస్కరించునట్లు వారికి తెలియదు. చెప్పినా వినరు.

సోక్ర : క్రిటో ... జనాభిప్రాయం గురించి భయపడద్దు. సత్పురుషులు ఈ సంఘటనను సరిగానే అర్థం చేసుకుంటారు. వారి మాటే ప్రమాణం.

క్రిటో : సోక్రటీస్...

సోక్ర : క్రిటో...రానున్న మృత్యువునుంచి తప్పించుకొని ఎలాగో ఎక్కడో తల దాచుకుని జీవించమని నీ కోరిక.

క్రిటో : అవును...

సోక్ర : కాని కేవలం జీవించటమే ప్రధానం కాదు. అమూల్యమైనది కేవల జీవితంకాదు. స్వచ్ఛ జీవితం... క్రిటో... అధికారులను శాసనాన్ని మోసపుచ్చటం అయుక్తమైనపని... మనం ఆ అపకార్యం చెయ్యకూడదు. అవునా.

క్రిటో : కాదని ఎలా అనగలను ?

సోక్ర : మనను బాధించినవారిని కూడా మనం బాధించకూడదు.

క్రిటో : అవును.

సోక్ర : ప్రతీకారచింతను త్రోసిపుచ్చాలి.

క్రిటో : అవును.

సోక్ర : ఈ పలాయనచింత నింతటితో విరమించు.

క్రిటో : ఇందుకు నే చెప్పగలిగిందేమీ లేదు. సోక్రటీస్...

సోక్ర : కాబట్టి... క్రిటో... దైవేచ్ఛకు నన్ను విడిచిపెట్టు... దైవం ఏదారి చూపితే, అదే నాకు పూలబాట...

జైలరు : సోక్రటీస్...

సోక్ర : జైలర్... రా... నాయనా... రా

జైలర్ : ఇక్కడకు చాలామంది వచ్చారు. కాని మీలాంటి సాధువు నింతవరకూ ఈ సంకెళ్లు తాకలేదు. నేనంటె మీకు కో...పం...

సోక్ర : నువ్వంటె నాకు కోపం ?...

జైలరు : కోపం లేదని నాకు తెలుసు. ఇక్కడ ఉండేవాళ్ళకు మామూలుగా నేనంటె చాలా కోపం... నన్ను తిట్టుతారు... శపిస్తారు...

సోక్ర : నీపై కోపం అనవసరం... నీవిధి నువ్వు నిర్వర్తిస్తావు.

జైలరు : అధికారుల ఉత్తరువుల ప్రకారం విషమిచ్చే కఠోర కర్తవ్యం నాది. ఆ దోషం నాది కాదు. ఇతరులది.

సోక్ర : అది గ్రహించకే నీమీద కోపప డటం...

జైలరు : ఈ చీకటిగుహలో చిక్కుకు పోయిన మాలాంటి వాళ్ళకు వెలుతురు చూపించటం కోసమే భగవానుడు మిమ్మల్ని ఇక్కడకు పంపించి. దొంగలను, హంతకులను, వంచకులను బంధించే సంకెళ్లే మిమ్మల్నికూడా బాధిస్తున్నయ్.

సోక్ర : ఈ కారు రాళ్ళమధ్య మీ హృదయాలుకూడా పాషాణాలు అవుతయని అంటారు. కాని... నే నా మాట నమ్మను... నే నిక్కడకు వచ్చినప్పటినుంచి చూస్తూనే ఉన్నాను... ఆ గోడచాటుగా వెళ్లి నువ్వు దుఃఖించటం...

జైలరు : అవును. సోక్రటీస్...మాలో మానవత్వం నశించటం సత్యమే. కాని మీ ముఖ ప్రసన్నత, మీ చర్చల ప్రబోధం...వ్యతిరేకులంటే మీకున్న సహనం...ఇవన్నీ నక్షత్రాలై ప్రకాశిస్తుంటే మా చీకటిగుండెల్లోనూ వెలుగు నిండుతుంది. ఓ ప్రభూ...ఇదివరకు ఎంతో మందిని మృత్యు ద్వారం వద్దకు తీసుకువెళ్లాను...కాని...వాటన్నిటికి క్షమించకపోయినా...ఈ సారికి క్షమించు...

సోక్ర : ఇందులో నీ దోషం లేదు. నీ అపరాధం లేదు.

జైలరు : ఓ అంతర్యామీ...ఆ పవిత్రమైన పెదవులు తాకినప్పుడు ఈ విషాన్ని అమృతం చెయ్యి. సోక్రటీస్...జరుగనున్నదాన్ని క్షమతో సహించాలి...మరి నాకు సెలవు.

సోక్ర : క్రిటో...విషం తయారైతే, పరిచారకుని తెమ్మను.

క్రిటో : ఎందుకంత తొందర? సోక్రటీస్.

సోక్ర : ఎవ్వరది...క్రిటో...ఆ ఏడ్పు...

క్రిటో : నీ ఇల్లాలు పిల్లలు. సోక్రటీస్...

సోక్ర : ఆఁ...ఆఁ... సహనం వహించాలి. దేవగృహంలోకి వెళ్లేటందుకు ఈ అపస్వరాలు స్వర్గంలో వినబడకూడదు.

భార్య : పాపిష్టిదానిని...ఉన్నంతకాలం మనశ్శాంతి లేకుండా రొష్టు పెట్టాను...

సోక్ర : ఎందుకా ఆవేశం.

భార్య : అవును...సంసారానికి నిష్ప్రయోజకుడవని నెత్తిన నోరు పెట్టుకుని అరిచేదాన్ని ...కాని కాని...విధి...ఏథెన...వాసి...వాసన...ధనికులు.. దరిద్రులు, యువకులు, వృద్ధులు, పాపులు, పుణ్యాత్ములు...మీకై ఘోషిస్తున్నారు.

సోక్ర : విలపించకు...విలపించకు...

భార్య : ఇంతటి విశ్వపురుషుని ఇంట్లో పెట్టుకుని, ఇన్నాళ్లూ అవమానించాను ... అందుకే ఈ ఘోర శిక్ష నాకు...విషముకన్న దాహకమైన ఈ శోకాగ్ని నన్ను...

సోక్ర : పిల్లలు చూడు ఎలా బెదురుతున్నారో...వాళ్లు భయపడుతారు...

భార్య : అవునిలాంటి తల్లిని చూసి భయపడరూ? క్షమించండి...ఈక్షోభ కడేడు పశేమనం..

సోక్ర : నేను జీవించినన్నాళ్లు, నీకు జ్ఞాన ప్రబోధం చేయలేకపోయాను. సంఘటనలూ ఊరికే రావు...నీ అంతరాత్మ మేల్కొంది.. ఈసమయంలో అంతకన్న నాకు కావలసిందిలేదు. ఈ ఒక్కక్షణం యుగాలకు సమానం... వెళ్లు పిల్లలను... తీసుకోవెళ్లు...

భార్య : ఎక్కడకు ? ఎందుకు ? నాకు నేనే విషపాత్ర...నాకు నేనే విషం... వదండి. వాయన ల్లారా పదండి... స్త్రీ లోకానికి నా ప్రార్థన... ఇంక ఈ మహాపరాధాన్ని మరెప్పుడూ మీరు చెయ్యకండి...

(పాజ్)

సోక్ర : క్రిటో... చెప్పావా పరిచారకునికి...

క్రిటో : సోక్రటీస్... సూర్యుడింకా పడమట కొండలపైనే ఉన్నాడు. చాలామంది ఆలస్యంగా విషం తాగటం నే నెరుగుదును.

సోక్ర : ఎందుకు ?

క్రిటో : అధికారులు ఆదేశించాక కూడా, విందులారగించి, తాగి, ప్రియులతో కాలక్షేపం చేయటం నే నెరుగుదును. కాబట్టి తొందరపడవద్దు. వ్యవధి ఉంది.

సోక్ర : అవును. క్రిటో... వాళ్ళలా చేయటంలో తప్పేమీ లేదు. ఆలస్యం చేసినందువలన ఏదో లాభిస్తుందని వారి ఆలోచన... వాళ్లను నే ననుసరించటం యుక్తం కాదు. ఒక క్షణం ఆలస్యంగా విషం తాగినందువల్ల ప్రయోజనం ఏమీ లేదు. కాబట్టి నే చెప్పినట్టు చెయ్యి. అదిగో... జైలరు వస్తున్నాడు.

జైలరు : సోక్రటీస్... ఇదిగో విషపాత్ర— విషం తాగాక, కాళ్లు బరువెక్కేంత వరకూ నడవాలి. తరువాత పడుకోవాలి. అప్పుడు విషం పని చేస్తుంది.

సోక్ర : సరి... ఏది... ఊం... ఇటివ్వు... ఆ విషపాత్ర...

క్రిటో ఇతర మిత్రులు : సోక్రటీస్... నీ అమృత కంఠంలో హాలాహలం...

(నిట్టూర్పులు, దుఃఖారావాలు)

సోక్ర : మిత్రులారా... ఏమిటీ నిట్టూర్పులు... దుఃఖం... ఇలా! దురపిల్లుతారనేగా ఆడవాళ్ళను ముందు పంపింది. ప్రాణి ప్రశాంతంగా చనిపోవాలి... ప్రశాంతంగా ఉండండి...

క్రిటో : అలాగే... సోక్రటీస్ మనశ్శాంతిని భగ్నం చేయవద్దు. ఆహా... అదేమిటి... తూలుతున్నాడు... సో...క్రటీస్...సోక్ర...

సోక్ర : క్రిటో... క్రిటో...

క్రిటో : ఏమిటి ? సోక్రటీస్...

సోక్ర : క్రి...టో...

క్రిటో : చెప్పు... సోక్రటీస్...

సోక్ర : క్రిటో...అస్క్లీపియన్ నాకు ఒక కోడి నిచ్చాడు. అది అతనికి తిరిగివ్వలేదు. నేను ఇంత వరకు...

క్రిటో : సరే...ఇప్పుడెందుకు ఆ సంగతి...

సోక్ర : కాదు...క్రిటో...అలా మరచిపోకూడదు...నువ్విస్తావా అతనికి కోడిని...

క్రిటో : ఇస్తాను.

సోక్ర : గుర్తుంచుకుంటావా?

క్రిటో : తప్పక సోక్రటీస్...ఇంకేమైనా... నీ అభిమతం...

(పాజ్)

* ఓ జగత్పతీ! ఎవ్వరేని జగాన నీ ఎరుక లేక శోకము నించినారె ఏటికి యశ్రువులు నీదు సృష్టి యందు.

కథకుడు : సోక్రటీస్ నుంచి జవాబు రాలేదు. ఒక జిజ్ఞాసువు అస్తమించాడు. అతడు తోటి వారికి జ్ఞానమార్గము చూపగా, వారతనికి మృత్యుద్వారం చూపించారు...కాని జ్ఞానయాత్ర మృత్యుద్వారం వద్ద ఆగదు. అది అమర యాత్ర.

* * * *

ఒకడు : అసురుల కాలమెప్పుడో అనుకున్నాం...

ఇంకొకడు : గ్రామ గ్రామం భయంతో అట్టుడికి పోతోంది. అంగుళిమాల చక్రవర్తి వస్తున్నాడంటె, యోజనాలదూరంలో భూకంపంలో లాగా ప్రజలు కంపిస్తున్నారు.

ఒకరు : ఇలాంటి కిరాతకుని బుద్ధభగవానుడు చూడబోవటం...ఈ శాంతి దేవుని ఆ రాక్షసుడేం చేస్తాడో...

ఇంకొకరు : బుద్ధభగవానుడు ఆ దురాత్ముని చూడబోవును. అయ్యయ్యో...ఆ ప్రేమస్వరూపుని అహింసాత్మకుడేం చేస్తాడో...

బుద్ధుడు : అంగుళి మాలాలంకృత చక్రవర్తీ... శుభం...

చక్రవర్తి : ఎవరది ?.., నా దర్బారున ఈ కాషాయములకు తావులేదు.

బుద్ధు : కాని నా హృదయమున ఎట్టి అఘఃపతితునకైనా తావుఉంది.

* వేలూరి చంద్రశేఖరంగారి 'గవేషణ'నుంచి

చక్ర : ఈ నటన నావద్ద వృథా... ఇట్టి మాయ నాటలతో నన్ను మోసపుచ్చ లేవు.

బుద్ధ : వంచనకు విరోధిని నేను. ప్రభూ... సత్యానికే నా ప్రణామము.

చక్ర : సత్యమని మిథ్యయని...

బుద్ధ : మీరు సత్యానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు. మీరు సల్పుతున్న హింస మీ మానవత్వానికి కళంకము.

చక్ర : ప్రతిపక్షులను హతంచేసిన వీరాధివీరునితో నువ్వు మాట్లాడుతున్నావని తెలుసుకో... వెంటనే నువ్విచటనుంచి నిష్క్రమించటం మంచిది. లేదా...

బుద్ధ : భయానికి అపరిచితుడు బుద్ధుడు.

చక్ర : ఏమి నీ అహంకారము... ఈ ఖడ్గముతో...

బుద్ధ : సంకోచ మెందుకు... నా హృదయము మీ ఖడ్గము నాహ్వానించుచున్నది.

చక్ర : ఏమిటి? నా కనుల నేవో క్రొత్త కాంతి...

బుద్ధ : మరల ఆలోచన ఎందుకు? ఇదిగో... నా శిరస్సు....

(పాజ్)

బుద్ధ : ఇదేమి ప్రభూ... ఒక సామాన్య భిక్షుకుని పాదాలపై మహాచక్రవర్తి; భటు లేమను కొనెదరు... సామ్రాట్...

చక్ర : ఇవి పాదాలు కావు... జ్యోతిర్బింబాలు...

బుద్ధుడు : నేను భిక్షుకుణ్ణి ప్రభూ!

చక్రవర్తి: కాదు...విశ్వదాతవు...నువ్వుప్రభువు నీవు! ఏది...ఆ విమలనయనాల నొకసారి చూడనిమ్ము...స్వచ్ఛదర్పణములై నా వికృత స్వరూపాన్ని నాకు చూపిస్తున్నయ్...క్షమించు నా అత్యాచారం.

బుద్ధుడు : అదిగో...అటు చూడు......పీడిత ప్రాణు లెలా ప్రవాసులై వెళ్తున్నారో...

చక్రవర్తి : వారి శతకోటి కంఠాలనుంచి వెలువడే ఆక్రందనలకన్న పెక్కు పెట్టున ప్రతిధ్వనిస్తున్నది; అంతరాత్మయొక్క దుఃఖారావము...... మెడలోని అంగుళిమాల అగ్నికణమాలలయి అణువు అణువును దహిస్తోంది......ఈ హింసోన్మాదానికి మార్గం లేదా ప్రభూ!

బుద్ధుడు : బౌద్ధజగమున తావులేని ప్రాణి లేదు. ఏ గృహవద్దనైన తిరస్కారముండదు నాకు. కాని కరుణాదేవిఇంటివద్ద ఆహ్వానము తప్ప తిరస్కారము లేదు...అహింసా పరమో ధర్మః; ఇదే జీవిత పథం......

* "ఆ లుంబిని పుణ్యారామంబున
వెలసిన యీ విమలజ్యోతికి,
నిరతము వేచెను నీ హృదయంబున
జయమని మ్రోయల ఓ జగమా!
జన్మవ్యాధి జరామృత్యువుల
బారగ ద్రోలెడు బాటను తెలిపిన
కరుణామయు శ్రీ గౌతమ దేవుని
చరణము లంటవె యో జగమా!
శ్రీ మహైత్రీమూర్తికి జేజే!
అష్టాంగిక పథవర్తికి జేజే!
ధర్మచక్రప్రవర్తక! జేజే!
కర్మచక్రనివర్తక! జేజే!"

* * *

మొదటి వ్యక్తి : ఏమిటీ కోలాహలం.

రెండవ వ్యక్తి : పరుగులెత్తుతున్న జనం...... ఎవ్వరు...

మూడవ వ్యక్తి : ఎవరా సైనికదళం...

4 వ వ్యక్తి : అహా...ఇదెక్కడి చిత్రవధ... పురిటిళ్లు దూరి పసిగుడ్డుల చంపుట...

5 వ వ్యక్తి : శిశుహత్య...ఎవ్వరి రాక్షసమూక.

6 వ వ్యక్తి : బిగ్గరగా అనకు.

3 వ వ్యక్తి : పల్లెపల్లెన శిశువుల చంపటమే వీరి సాహసకృత్యం...

4 వ వ్యక్తి : హెరోడు ప్రభువు చేసిన కఠోర ఆజ్ఞ......

3 వ వ్యక్తి : తను మరణశిక్ష విధించిన జాన్ తిరిగి జన్మిస్తాడని అతని భయం...అందుకనే కళ్లు తెఱవని పసిపాపలను సైతం చంపిస్తున్నాడు.

(సైనిక కోలాహలం... నిశ్శబ్దం పసిపిల్లవాని ఏడుపు......)

అనేకమంది: శుభం...శుభం...పరమ పవిత్ర సమయాన జనియించిన శిశువు...మహాత్ములు

* వేలూరి చంద్రశేఖరంగారి 'కాంచనమాల' నుంచి.

జన్మించే మహోన్ముహూర్తం సాక్షాత్తు ఈశ్వరుని పుత్రుడు...

మొదటివ్యక్తి—ఎవ్వరది...

2 వ వ్యక్తి : అతను...హేరోదు దురంతకుల కంటక అశ్వశాలలో జనియించిన ఈశ్వర పుత్రుడా.

3 వ వ్యక్తి : ఏమిటా ఆ ముఖ వర్చస్సు...ప్రేమ మయుడు...ఆకాశంలో ఒక చంద్రుడే...అదీ ఉన్న వాళ్లకు మరల ప్రవాసం...

4 వ వ్యక్తి : కాని ఈ యువకుని విశాలనయనాల్లో వేయి చంద్రులు చల్లని వెన్నెల కురిపిస్తవి.

5 వ వ్యక్తి : వృద్ధులు, స్త్రీలు, యువకులు అందరూ అతని దగ్గరకు వస్తారు తమ బాధలను విన్నవిస్తారు...

6 వ వ్యక్తి : ఇప్పుడు మన వాళ్లమధ్య కొట్లాటలు లేవు...

5 వ వ్యక్తి : నీపై గౌరవము చూపినవారిపై గౌరవం చూపటం లోకానికి కొత్తకాదు. కాని నీ శత్రువులనుకూడా ప్రేమించమని చెప్పుతున్న ఈ యువకుడు విశ్వగృహంలో కొత్త జ్యోతి...

* * *

ఒకరు : అదిగో...అటు...ఆమే...

ఇంకొకరు : ఎవరు ?

ఒకరు : ఏవరేమిటి ? భ్రష్టురాలు.

మరొకరు : పతిత.

ఇంకొకరు : కులట...

ఇంకొకరు : చూస్తారేం...ఆ నీతిభ్రష్టురాలు నడివీధిలో వెళ్తుంటే...

ఒకరు : రాళ్లుకొట్టండి...

ఇంకొకరు : విసరండి రాళ్లు...

ఒకరు : ఏం ఆగావేం ? విసరు...

ఇంకొకరు : అదిగో...కాస్తలో...తప్పింది గాని...లేకపోతే అతనికి తగిలేది...

ఒకరు : ఎవరు?...మన ప్రభువు...అక్కడ... ఆమెకెదురుగా నుంచున్నది మన ప్రభువు

ఇంకొకరు : మన ఛీత్కారానికి, బెదిరింపులకు లక్ష్యం చేయనిది...ఆమె...చూడు...

మరొకరు : అతని పాద ధూళిని ముద్దిడుతోంది.

ఒకరు : కళంకాచ్ఛాదితమైన ఆమె ముఖం ఇప్పుడు ఎంత వినిర్మలంగా ఉంది...

మరొకరు : అహో...వారిద్దరి చుట్టూ జ్యోతి చక్రము నృత్యం చేస్తోంది. క్షమాస్పర్శలో పాపం లుప్తమైంది.

ఒకరు : పాపం?...ఇంతకన్న పాపం ఏముంది? మనము రాళ్లతో ఆమెను హత్యచేసేవారం.

మరొకరు : ఆమె...ఆమె దోషి...మనము న్యాయమూర్తులం... కాని...మనలో దోషరహితు లెవ్వరు?

ఒకరు : ఎవరున్నారు దోషరహితులు? దోషాన్ని ముద్దిడని మనస్సు ఏది?

మరొకరు : ప్రభూ! ఆమెను కాదు నువ్వు ఉద్ధరించింది...అల్పులైన మమ్మల్ని ... లోకానికి శిక్ష విధించవలచుకున్న మాకు ఆత్మజ్ఞానం ప్రబోధించిన అమరజీవి!...క్షమతో విశ్వమంతనూ ఏక గృహంగా నిర్మిస్తాం...

కులట : ఓ జగత్ప్రభూ! ఈ సంధ్యాపుష్పాన్ని కూడా నీ పూజకు తీసుకున్నావు...

* * * *

కథకుడు : ఈ ప్రేమ మూర్తి పాదము మోపిన చోటల్లా పాపం పశ్చాత్తాపంతో పునీతమైంది... దుఃఖం కన్నీరు తుడుచుకుంది. కాని మనుష్యునికి విధికన్న బలీయమైన శత్రువు మనుష్యుడే...జీవిత మంటే ప్రేమ ద్వేషాల సంఘర్షణ...ఈ రెంటి మధ్య మోసం గూడల్లుతుంది. ద్వేషం కన్న కూడ మోసం మనుష్యుని క్షోభ కెక్కువ కారణం...

ఒకరు : జూడాస్...వాళ్లలో ఆ ఈశ్వర పుత్రుడు ఎవరో మాకెలా తెలుస్తుంది.

ఇంకొకరు : జూడాస్...ఇన్నేళ్లుగా నువ్వతని నమ్మిన బంటుల్లో ఒకడివిగదా ... ఇప్పుడీ కుట్రలో...

జూడాస్ : నేను నల్లి ముందెవరిని కౌగిలించుకొని, ముద్దిడుతానో అతనే ఈశ్వర పుత్రుడు.

ఒకరు : ముద్దుతో ప్రేమను మోసగించటం... ఇంతకన్న...

జూడాస్ : వెంటనే నిర్బంధించి, న్యాయాధికారి వద్దకు తీసుకువెళ్లాలి.

* * * *

న్యాయాధికారి : ఎవ్వరిది? ఎవరీ నేరస్థుడు..

ఒకరు : ఈశ్వరపుత్రుడనని చెప్పుకొంటున్న ద్రోహి...

న్యాయాధికారి : ఇత నేనా ఈశ్వరపుత్రుడు.

ఒకరు : పలుచోట్ల ఈతడిదే చేస్తున్న దుర్బోధన.

అందరూ : ఈ మహాపరాధానికి శిక్ష మరణమే.

ఒకరు : పైలేట్! రాజద్రోహి ఇతడు...

పైలేటు: ఎవ రీతడు? ఇతని అపరాధ మేమిటి?

అంతా : జాతిని తన బోధలతో భ్రష్టపరుస్తున్నాడు...చక్రవర్తి సీజరుకు సుంకం చెల్లించవద్దని వారిస్తున్నాడు.

ఒకడు : ఇతను తనే ఈశ్వరపుత్రునని చెప్పుకుంటున్నాడు. యూదుల చక్రవర్తినని విర్రవీగుతున్నాడు.

ఇంకొకరు: అది అన్యాయం ... అసత్యారోపణ...తాను ఈ రాజ్యానికి ప్రభువునని ఎప్పుడూ చెప్పుకోలేదతను...అతని సామ్రాజ్యము ఈ దేశాలకు చెందినది కాదు. అంతరాత్మల అనంత సామ్రాజ్యమునకు అతను ప్రభువు. ఇదీ నిజం...ఇదీ సత్యం...

పైలేటు : సత్యమంటే ఏమిటి?

(నిశ్శబ్దం)

పైలేటు : ఇతనిలో నాకు దోష మేమీ కనపడ్డంలేదు.

అందరు : ప్రజల నుద్రేకపరచి, సంచలనం తెస్తున్నాడు.

పైలేటు : అన్నట్లు ... ఇవ్వాళ ఉత్సవపు రోజు కదూ! మరి ఈనాడు ఒక నిర్బంధితుని విడుదల చెయ్యాలికదూ...ఈ యువకుడిని...

అందరూ : వద్దు, వద్దు......ఇతన్ని విడుదల చెయ్యవద్దు. బారబ్బాస్...దొంగల నాయకుడు... అతను ఎరిగున్న దొంగ...ఇతను అభూత వ్యక్తి... బారబ్బాస్‌ను విడుదల చెయ్యండి.

పైలేటు : ఇతన్నేం చేసేది?

అందరూ : సిలువమీద మరణం...అదే తగిన శిక్ష. (ఉద్రేకపు గొంతుతో)

* * *

పైలేటు : సిలువమీద మరణం... ఏం చెరుపు చేశాడని అతనికీ ఘోరశిక్ష?

అంతా : సిలువమీద మరణం...ఈశ్వర పుత్రునికి మరణశిక్ష...

ఒకరు: కృశించిన ప్రేమమూర్తి... సిలువ మోయలేక పోతున్నాడు...

ఇంకొకరు : మనందరమూ చేస్తున్న ఈ మహాపాపానికి రవ్వంత ప్రాయశ్చిత్తము. నేను మోస్తాను సిలువను.

* * *

ఒకరు : మరి రెండు సిలువలున్నవి...

ఇంకొకరు : ఇద్దరు దొంగలకు కూడా ఇవ్వాళ మరణశిక్ష.

ఒకదొంగ : ఈశ్వర పుత్రుడుకూడా మన దగ్గరకే వచ్చాడు... ఓ... ఈశ్వరపుత్రుడా; నువ్వే ఈశ్వర పుత్రుడివయితే, నిన్ను రక్షించుకుని, మమ్మల్ని కూడా రక్షించు...

రెండవదొంగ : ఛీ; సిగ్గులేదురా నీకు; మనం చేసిన పాపకృత్యాలకు ఈ శిక్షలు మనకు సహజమే. కాని ఇతను ధర్మమూర్తి... ప్రేమమయుడు... ఓ ప్రభూ; నువ్వు నీ సామ్రాజ్యంలో అడుగు పెట్టినప్పుడు ఈ పాపిని కూడా గుర్తుంచుకో! ?

కొందరు : ఈశ్వర పుత్రుడు, విమోచకుడట; అయితే ఆ ఈశ్వరుడు వచ్చి, ఈ కొడుకుని రక్షించడేం ?

ఆకాశవాణి : ఓ విశ్వేశ్వరా; వీరు... విరోధులు... కాని వారిని క్షమించు... ఇదే అతని కోర్కె. వారు అమాయకులు... వారేం చేస్తోందీ వారికి తెలియదు...

* * *

హింసా పిపాసి మనిసీ
జనహింసా పిపాసి మనిసీ!
పరహింసా పిపాసి మనిసీ!
ప్రేమమూర్తులను
హననము చేసే
ద్వేషాంధుడవో మనిసీ!
సత్యమమరము, ప్రేమ అమరము !!

కథకుడు : ఎవరు, మన విమోచకులలో వారిని హింసించటం మన సంప్రదాయం... కాని మహాత్ముల సందేశం అమరమైనది... చేతులారా

దీపాన్ని ఆర్పుకొని, మళ్లీ ప్రజలు వెలుగుకోసం నిరీక్షిస్తారు...

*ఎంతకాలమ్మునుండియో రొంచుచున్న
వెలుగుపాప తెంచి తూరుపు వీధియందు
విక్రమించి జగంబెల్ల నాక్రమింప
విశ్వపద్మంబు రేకులు వేయువిచ్చె...

ఒకరు : ఎవరిది ?

ఇంకొకరు : ఎవరది ఒంటరిగా, నిర్భయంగా కీకారణ్యంలో వస్తోంది ? చేతిలో చిరు ఆయుధం కూడా లేకుండా ?

ఒకరు : వీరికి తనపు మబ్బు లేని వినిర్మలముఖం, ఏదో బ్రహ్మ తేజస్సు ! వనమృగములకన్న హింసాత్మకమైన ప్రవృత్తులావేశించిన జనసమూహముల మధ్య ఎలా నడచి పోతున్నాడు.

ఒకరు : దూసిన కత్తుల మరల ఒరల నిడుచున్నారు—వెలిగించిన జ్వాలలను మరల చల్లార్పుతున్నారు...

ఇంకొకరు : చూడుడు చూడుడు...ఇది భ్రాంతా ? నిజమా ? కుత్తియలపై కత్తులు దూసుకున్న కఠినులు ఆ మహాత్ముని నీడలో కౌగలించుకొనుచున్నారు...

ఒకరు : ఆహా ! ఎన్నియుగాలకీ పృథ్విపై ఈ పవిత్ర పాద చిహ్నాలు...

హంతకుడు : ప్రేమయను పేరిట, జరిగిన అవమానములకు తలొగ్గమనే ఈ మహాత్ముడు దేశానికరిష్టము. ఈ వార్ధక్యంలో కూడా తన వ్యర్థ ఆదర్శాన్ని విడనాడని ఈ వృద్ధుని రంగంలోంచి తొలగించటం నా విధి.

అందరూ : మహాత్మునికి అభివందనాలు.

...జై...జై...జై...

హంతకుడు : ఒహ్; ఎంతమంది...వందలు... వేలు...లక్షలు...అశ్రువాహినులన్నీ ఇచట సముద్రమై, ఈ వృద్ధుని ముంచివేయగలవని భ్రమించాను. కాని తమ అశ్రువులతో ఆ పాదములను కడుగుతున్నారు...

స్త్రీలు : మహాత్ముని నేత్ర ద్వయమునుంచి కరుణావాహిని పొంగిపొరలుతోంది. పతిహీనులం... అవమానితులం...ఆర్తులం...మా జోహార్లు... మహాత్మునికి...

హంతకుడు : వీరి ఆక్రోశమేమైనది? వీరి భగ్న హృదయాల విషఘూత్కారమేది? ఈతడు ఐంద్రజాలికుడు...వారి మతులను వాగు విస్మరిస్తున్నారు..

అందరూ : మహాత్మునికి అంజలులు! ఇళ్లు దహనమైనవి...ఆప్తులు హతులైరి...కాని...ఓ భగవంతుడా!...ఈ పుణ్యాత్ముని మాకు దక్కనివ్వు.

హంతకుడు : ఎవరి దైన్యం, కష్టాలు నన్నీ ఘోర, అనతిక్రమ్య కృత్యానికి పురికొల్పుతున్నాయో, వారే ఏడ్పులాపి, కన్నీరు తుడుచుకొని, అతని పాదధూళి చల్లుకుంటున్నారు. ఈ లక్షల మందిలో నాకేసి ఒక్కరూ తిరగరు...

అందరూ : అదిగో మహాత్ములు.........వస్తున్నారు...ఇప్పటికే కొంచెం ఆలస్యమైంది.

కొందరు : పుండండి...నిశ్శబ్దంగా వుండండి..

హంతకుడు : అహ్...ప్రభాత సూర్యునిలా... కాదు అస్తమయ...సూర్యునిలా ఏమి తేజస్సు... కావచ్చు...దివ్య తేజస్సు... ఆహా!...నా చేతులు పట్టు సడలినవి...ఏమిది ప్రణామము...మహాత్మా... మీ రాలస్యంగా వస్తున్నారు...మీ సమయం దాటింది...

(పిస్టలు పాట్లు చప్పుడు)

అందరూ : ఆ! ఆ! ఏమిటీ ఘోరం.

కొందరు : మహాత్ముని హత్య!

ఒకరు : ఎవరు...ఎవరు ఈ హత్య చేసింది?

ఒకరు : ఎవరా దౌర్భాగ్యుడు?

హంతకుని తల్లి : బిడ్డా! ఏం చేశావు నువ్వు?

(విచారపు, ఏడుపు గొంతుకలు)

కథకుడు : హంతకుల నిరంతర భ్రమ... హత్యతో భావాన్ని చంపగలమని... ఈ దుశ్చింతకులోనై తమ జీవితాలను తాము కలుషితం చేసుకుంటారు..ఆ వెలుతురు నార్పామనుకుంటారు...కాని ఒక్క దిక్కున వెలుగుతున్న ఆ జ్యోతి యొక్క ప్రకాశము ఆకాశమంతటా నలుదిక్కులా వ్యాపిం

---

*వేలూరి శివరామ శాస్త్రిగారి 'ఏకావళి' నుంచి.

చింది...ఇదివఱకు ఈ తేజో బింబంవైపు చూడని, కళ్లు కోటానుకోట్లు ఇప్పుడీ జ్యోతి వెలుగుతో చీకట్లను పోగొట్టుకుంటాయ్...

సూర్యచంద్రాదులూ
వెలుగునందాక
ఆరిపోదీజ్యోతి,
అమర, నిర్మలజ్యోతి,
అదిగదిగో అంతరాకాశ వీథిలో
ధ్రువతారలా వెలుగు ధర్మ నిర్మల జ్యోతి...
జ్ఞాన అన్వేష నే
నిత్య, నిర్మల జ్యోతి!

* * *

విభిన్న భావుకులారా! హింస నవలంబించి, ఇంక మానవ చరిత్రను రక్తసిక్తం చెయ్యకండి... వచ్చింది, వెలుగుయుగం...తరలింది తమోయుగం... అదిగో బుద్ధవాణి!!

"అహింసా పరమో ధర్మః"

(ఆల్ ఇండియా రేడియో సౌజన్యంతో; జనవరి 30వ తేదీన మద్రాసు రేడియో నుంచి ప్రసారితమైన నాటిక.)



# ఉగాది వందనము



శ్రీ పెనుమర్తి కామేశ్వరరావు

ముందు లుండిన నేమి మురువొప్ప లావణ్యశోభతో నిచ్చె గులాబికన్నె
దంపతీ ప్రేమలో ధావళ్యమును దెల్ప విరియబూచెనుతోట విచికిలమ్ము
కోకిలానీకపు గొంతు చెఱను బాప పల్లవామృతమును బట్టె మావి
ప్రణయగీతమ్ములు పాడుచు మధుపూరసుమముల ముద్దాడి చొక్కె నళులు
త్రిభువనోద్దీపకుఁడు ప్రకృతిని వరించి కొలువు దీర్చె వసంతుఁడీ తెలుగుభూమి
సాంద్రవైభవవశులు, నిస్తంద్రయశులు-ఆంధ్రుల కుగాది కుతుకపు సంద్రమయ్యె!

మేలు సేయఁగఁబోయి కాళగళుని కంటివేడి మాడిన రతిప్రియుని సేవ
అమృతమ్ముకొఱకు క్షీరాబ్ధిని మథియించి కరకరులగు సురాసురుల తీరు
విప్రబలంబున వృద్ధిపొందిన బలిఁ బాతాళమున కంపు వటువు ప్రతిభ
బడుగు కుచేలుని యిడుములు వాపిన దీనబాంధవుని దాతృత్వమహిమ
తెలుఁగు దేశాన నెల్లెడ వెలుఁగుచుండఁ గలిగె నందన సంతోషకలితయగుచు
ఎల్ల ప్రజకు సౌఖ్యము నావహిల్లఁ జేసి తల్లియై ప్రోచు సుతుల సంఫుల్లమతిని.

జీవితమ్మున తీపియు చేదు కలిసియుండు ననుమాట జ్ఞప్తియం దుండుకొఱకు
వేపపూల పచ్చడిఁ దిని పూపవయసు బాలబాలిక లుత్సాహడోల నూఁగ!

భారత భారతీచరణపంకజముల్ భజియించు సత్కళా
ధీరులుఁ బెంచునందనల తీరున నందముఁ గ్రుమ్మరించుమా!
కూరిమినందనా! సుగుణకోమలభావుకు లాంధ్రపుత్రులన్
చేరునుగూర్చి మమ్ము గరుణించుము మంచితనమ్ము బెంచుచున్.

పోటరులైన యాంధ్రులకుఁ బొత్తు విశీర్ణము, నైస్వలాభమా
ఖేటమునై, సమిష్టికృషికిన్ వెలియై, మహాంధ్ర రాష్ట్రమున్
బాటిలలేదు స్పర్ధలకు భాజనమై, తమలోనఁ దాము గ
య్యాటము లాడుకోగలుగ అందనిమ్రాని ఫలమ్ము గాదొకో!

స్వార్థరహితులు, మహితసుకృతులు, హితులు ప్రజకెల్ల ధురంధరులై జనాళి
ప్రేమఁ బొందఁగ ఐక్యత బెంచుకొనుఁడు, రాష్ట్రము లభించు, పారతంత్ర్యమునశించు!
నందన సంవత్సరమా! వందనమును గొని మహాంధ్రవత్సలవై యా
[illegible]ంగము నొసగెడి రాష్ట్రము బొందగ దీవించు మమ్మ! భూషింత్రు జనుల్.

---

# జగన్నాథపండితరాయలు

## విద్వద్వాగ్గేయకారుడు



శ్రీ కోన వెంకటరాయశర్మ

వ్రనము సామాన్యముగ బూర్వుల గుణ దోషముల దెలిసికొని సమదృష్టితో వానిం దెలిసికొనలేక పోవుటయు, మన యిప్పటి స్థితికి సంబంధించిన కార్యకారణ సంబంధ మరసి దానిం దొలగించుటకు దగు సాధనాంతరముల నన్వేషింపకుండుటయు, —గారణములుగా బ్రసిద్ధపురుషుం డగు జగన్నాథ పండితరాయల గురించి తెలిసికోజాలకున్నారము.

ఇమ్మహాభాగుడు విరచించిన 'ప్రాణాభరణ' మను గ్రంథమునం గల—

"తైలంగాన్వయ మంగళాలయ మ
హా లక్ష్మీ దయా లాలిత,
శ్రీమ త్పేరమభట్ట సూను రని
శం విద్వల్లలాటం తపః
సంతుష్టః కమఠాధిపస్య కవి
తా మాకర్ణ్య తద్వర్ణనం,
శ్రీమ త్పండితరాజ పండిత జ
గన్నాథో వ్యధాసీ దిదమ్."

"పాషాణా దపి పీయూషం
స్యందతే యస్య లీలయా
తం వందే పేరుభట్టాఖ్యం
లక్ష్మీకాంతం మహాగురుమ్."

—అను ప్రస్తావములబట్టి పండితరాయలు లక్ష్మీదేవి—పేరుభట్టుల గర్భశుక్తి ముక్తాఫలంబని తెలియందగును. వేగినాటి బ్రాహ్మణుడు. 'ఉపద్రష్ట' గృహనామముగా గలవాడు. తూర్పుగోదావరీ మండలములోని 'ముంగండ' అగ్రహారము నివాసము. అనగా 'కోనసీమ' వాస్తవ్యుడు.

ఇతడు జ్ఞానేంద్రు నొద్ద నుత్తర మీమాంసను, ఖండదేవు నొద్ద బూర్వమీమాంసను, మహేంద్రుని దగ్గఱ న్యాయ వైశేషికములను, వీరేశ్వరుని దగ్గఱ వ్యాకరణమును—అభ్యసించి సర్వవిద్యాపారంగతుం డయినట్టు 'రసగంగాధర' మందలి—

"శ్రీమద్ జ్ఞానేంద్రభిక్షో రధిగత
సకల బ్రహ్మవిద్యాప్రపఞ్చః,
కాణాదీ రాక్షపాదీ రపి గహ
నగిరో యో మహేంద్రా దవేదీత్,
దేవా దేవా ధ్యగీష్ట స్మరహర
నగరే శాసనం జైమినీయం,
శేషాంక ప్రాప్త శేషామలభణి
తి రభూ త్సర్వవిద్యా ధనోయః."

—అను వాక్యముంబట్టి విదితము కాగలదు. ఈ విషయమున నితడు 'భామినీ విలాసము' లో—

"కుంభః పరిమిత మంభః పిబతి
పపౌ కుంభసంభవోంభోధిం,
అతిరిచ్యతే సుజన్మా కశ్చి
జ్జనకం నిజేన చరితేన."

—అని వ్రాసియుండుటవలన, బట్టినంత జలమునే కుండ త్రాగుననియు, గాని కుండయం దుద్భవించిన యగస్త్యుడు సముద్రము నంతను నాపోశనము పట్టినాడనియు నటులనే లోకములో నొకానొకడు తన నిస్తుల ప్రతిభా వ్యుత్పత్తులచే దండ్రి నధిగమించుననియు,—తెలియం దగియున్నది. ఇతని "రస గంగాధరము"న వీరత్వ, పాండిత్య, కవితా శూరత్వములు మాత్రమే గాక ధర్మశాస్త్రము, సర్వ దర్శనములు,—ఇవి యవి యన నేల అన్ని విషయములు సెలయేళ్లవలె బలుగువాఱి వచ్చి పడినవి. పాండిత్యమును బ్రస్తావించునపుడు "రస గంగాధర" మందలి

"అపివక్తి గిరాంపతిః స్వయం
యది తాసా మధిదేవతాపివా
అయ మస్మి పురో హయానన
స్మరణోల్లంఘిత వాఙ్మయాంబుధిః."

—అను వాక్యము లక్ష్యసిద్ధిగా నగపడుచున్నది. ఇక గవితా వీరత్వమును.

"ఆమూలా ద్రత్నసానోర్మలయ
వలయితా దాచకూలా త్పయోధే,
ర్యావన్తః సన్తి కావ్యప్రణయన
పటవస్తే విశంకం వదంతు,

మృద్వీకా మధ్య నిర్యన్మసృణ
రస ఝరీ మాధురీ భాగ్య భాజాం,
వాచా మాచార్యతాయాః పదమను
భవితుం కోస్తి ధన్యో మదన్యః."

—అను వాక్యము పరమప్రాప్యముగా నుటంకింపబడినది. ఇప్పండితాఖండలుడు 'ఢిల్లీ వల్లభ పాణి పల్లవ తలే నీతం నవనీలం వయః'—అని చెప్పుకొనుట వలన నూనూగు మీసాల నూత్న యౌవనమందె కవిశేఖరుండును బండితాగ్రణియు నయ్యెనని యూహింప ననువుపడుచున్నది.

ఇతడు ప్రౌఢ నిర్భర వయః పరిపాకమున భారత రాజధాని యగు 'ఢిల్లీ' నగరమునకుం జనియెను. 'ఆగ్రా' నగరము సైతము మొగల్ చక్రవర్తులకు రాజధానీ నగరముగా నుండియుండెడిది. షాజహాన్ చక్రవర్తి వైభవము పశ్చిమ దేశీయులను మిఱుమిట్లు గొల్పుచు, విభ్రమము నొందించుచు, మణి ముక్తా ప్రవాళాది వినిర్మితంబు లయిన జలజంతువులతో నిండిన సువర్ణరజిత జలప్రవాహంబులును, నదీనదంబులును, భారత రత్నాకరంబున లీన మగుచుండుటను జూచి క్షుబ్ధహృదయు లగుచుండిరి. కాగా, ఇక బండితరాయల హృదయమును గూడ నవ్వైభవ దీధితు లాకర్షించి కొన్న వనుటయం దబ్బురం బేమి?

ఇవ్విచక్షణుడు 'ఢిల్లీ'కి జేరుకొని యచట దర్బారులో సమ్మాన సత్కృతుల నందుట కయి 'అజ్మీరు' (*Ajmer*) వెడలి ఫారసీ భాష నేర్చుకొనుట యగత్యమని తలచి బద్ధ కంకణుండయి యచిరకాలముననే యా భాషయందు ప్రవీణు డయ్యెను. షాజహాన్ చక్రవర్తియొక్క కొల్వుకూటమున బండితరాయలునకు ప్రవేశము గల్గినతోడనే చక్రవర్తి ప్రేరణమున మహమ్మదీయ మత మవలంబించిన యొక్కనితో ధర్మశాస్త్రార్థ చర్చ పండితరాయల కొనగూడినది. కాగా, ఇతడు దన వాక్చాతుర్యము చేతను, దర్క కౌశలము వలనను, షాజహాన్ చక్రవర్తితో యథేష్టమైన పరిచయము గల్గించుకొనజాలెను.

"ఆసఫ్ విలాసము"లో

"అథ సకలలోక విస్తార విస్తారిత మ
హోపకార పరంపరాధీన మానసేన,
ప్రతిదిన ముద్య దనవద్య గద్య పద్యా ద్యనేక
విద్యా విద్యోతితాంతః కరణైః
కవిభి రుపాస్య మానేన, కృతయుగీ
కృత కలికాలేన, కుమతి తృణజాల సమాచ్ఛా
దిత వేదవనమార్గ విలోకనాయ సము
ద్దీపిత సుతర్క దహనజ్వాలా జాలేన,
మహాస్తిమతేన నవా బాసఫఖాన మనః
ప్రసాదేన, ద్విజకులసేవా హేవాక
క్రియా వాఙ్మనః కాయేన, మాథురకుల
సముద్రేందునా, రాయముకుందేనా
దిష్టేన, సార్వభౌమ శ్రీ షాజహాన్ ప్రసాధిగత
పండితరాజ పదవీ విరాజితేన
త్రైలింగ కులావతంసేన, పండిత జగన్నాథేన,
ఆసఫ్ విలాసాఖ్యేయ మాఖ్యాయికా
నిరమీయత. సేయ మనుగ్రహేణ సహృదయానా
నా మనుదిన ముల్లాసితా భవతాత్."—అను

పంక్తులు రాయముకుందుని ద్వారమున ముఖ్యమంత్రియగు 'ఆసఫ్‌ఖాన్' దాక బరిచయభాగ్య మొదవినట్టును, ముఖ్యమంత్రియె చక్రవర్తి దర్శనము దనకు జేయించి తత్రాపి యాస్థాన విద్వాంసునిగా జేయుటయే గాక 'పండితరాజు' అను బిరుదమును గూడ దన కిప్పించినట్టును,—దెలుపుచున్నవి. అంతియ కాక ఆసఫ్‌ఖాన్‌కు హిందీ సంస్కృతభాషలలో నధికాదర ముండి విద్వత్కవుల పెక్కురకు నాశ్రిత కల్పతరువుగా భాసిల్లెననియు, నాతని హృదయమున వైదిక ధర్మజిజ్ఞాస కలిగినదనియు గాగా, దన యాశ్రితులను విద్వాంసులచే వైదికధర్మ విషయములలో దఱుచుగా శాస్త్రార్థముల జేయించుచుండెడి వాడనియు, మాథురుడయిన రాయముకుందుని ద్వారమున 'ఆసఫ్‌ఖాన్' యొక్కయు నతనివలన 'షాజహాన్' చక్రవర్తియొక్కయు ననుగ్రహ విశేషముల సంపాదించుకొనిన జగన్నాథునకు 'పండితరా'జను బిరుదము లభించినదనియు, 'ఆసఫ్‌విలాస' మను గ్రంథ మాతని యనుగ్రహము గల్గుటకయి వ్రాయబడినదనియు,—రూఢియగుచున్నది.

'జగదాభరణము—ఆసఫ్ విలాసము' అను గ్రంథముల నొక్క పర్యాయమే చదివినయెడల షాజహాన్ చక్రవర్తి కొల్వుకూటములో హిందీ సంస్కృతముల కాదరాభిమానములు, ఉత్సాహ ప్రోత్సాహములు, గల్గుటకు 'దారాశికోహుడును ఆసఫ్ ఖానుడును' ముఖ్య కారకులని తెలియగలము. 'దారా' నూట యెన్మిది యుపనిషత్తుల బారసీకభాషయందు 'సిర్ర అకబర్'—అను పేరితో ననువదించినాడని యౌరంగజీబు చరిత్ర రచించిన 'మహమ్మద్ షాకీ' యను నతడు 'మాసిర్ ఆలంగిరీ' యను గ్రంథమున "మొదటి నుండియు నౌరంగజీబుకు దారాశికోహు నెడ మివుల గోపము. ఏలయన, దారాశికోహుని హృదయము హిందూమతము మీదను హిందూమత గ్రంథముల పైనను ప్రేమాదరములు గలదియై యుండెను. కాగా, నతడు చక్రవర్తి వ్యాధిపీడితుడై యుండగా విక్రమ

శకము 1715 కు సరియగు క్రీ. శ. 1658 దవ సంవత్సరమున స్వమత సాహాయ్యమునకై చక్రవర్తి యొద్దకు బోదలచినాఁడు." (ఔరంగజేబు నామా, 32 వ పుట) అని వ్రాసినాఁడు.

ఇట్టి స్థితిలో దారాశికోహు నభివర్ణించుచు 'జగదాభరణ' మను గ్రంథమును పండితరాయలు వ్రాసినాఁడు గదా! తత్రాపి పండితరాయలు మహాద్యాశయము నంది తన లోకోత్తర పాండిత్యమును బ్రకటించి విఖ్యాతశాలి యయ్యె ననుట సునిశ్చితము.

ఆసఫ్ ఖాన్ 'నూర్జహాన్' చక్రవర్తినికి సోదరుఁడు. పైగా, దన కొమార్తను జహాంగీరు కొమారుడైన 'ఖుర్రమ్' అను నతని కిచ్చి పెండిలి యొనర్చినాఁడు. కతిపయ దినంబులకు ఈ 'ఖుర్రమ్' అనువాఁడు 'షాజహాన్' అను పేరితో నత్యంత వైభవముగ భారతసామ్రాజ్య చక్రవర్తియై చరమదశయందు దన కొమారునిచే నిర్బంధింపబడి కృశించి కృశించి యంగలార్చి చనిపోయెను. "ఆసఫ్ ఖాన్" జహాంగీరు చక్రవర్తికి ముఖ్యమంత్రిగా వ్యవహరించుచు నతకు బ్రదికియుండగనే 'బులాకీ ఉరఫ్ దావర్ బక్ష్' అను వానిం బిలువంబనిచి జహాంగీరు చక్రవర్తి మరణింపగనే వానిం గద్దె నెక్కించెను కారణ మేమనఁ; ఆ తరుణమున షాజహాన్ దక్షిణాపథమున నుండుటవలన ఢిల్లీ నగరమునకు వైళంబ మరిగి వచ్చుటకు వలనుపడమి యటుండనిచ్చి రాజా జగత్ సింహుఁడు మొదలగు వారు రాజపుత్ర సరదారులతో నూర్జహాన్—ఆసఫ్ ఖాన్ ల నిర్బంధించుట కయి లాహోరునకుం బోవుచు 'బనారసీ' యను హిందూ హరకారాను రహస్యముగ 'ఖుర్రమ్' ను బిలచికొని రమ్మని దక్షిణమునకు బంపినాఁడు. విక్రమ శకము 1604 కార్తీక బ 14 లు నాఁడు జహాంగీరు చక్రవర్తి 'రాజౌరు' లో జరిపోగా, ఆవెనుక మూన్నాళుల నాటి యాదివారము నాఁడు 'ఆసఫ్ఖాన్' తన మేనయల్లుడైన 'శహర్యారు'నుబట్టికొని గ్రుడ్లు పీకించి మార్గశీర్ష బ 5 మీ ఆదివారము నాఁడు 'బనారసీ' యను హిందూ హరకారా 'జూనేరు' గ్రామమునకుం జని 'ఖుర్రమ్'ను గలసికొని తనకిచ్చిన యుంగరమును] జాబు జరిగినవిషయమంతయు దెలిపి, వెనువెంట నే యుత్తరాపథమునకు బయల్దేరి నర్మదానదిని దాటునప్పటికి మార్గశీర్ష 5 నాఁడు 'సేనూరు' నుండి 'శహర్యారు' ఓడిపోయివచ్చెనన్న వృత్తాంతము 'ఖుర్రమ్'కు దెలిసినది. మాఘ బ 8 గురువారము నాటికి 'అజ్మీరు' సేరిరుఁ యాదివారము నాఁడు 'ఖిదమత్ ఫరస్తఖాన్' ద్వారమున 'ఖుర్రమ్' అను నతను 'శహర్యారు' ను, 'బులాకీ' ని, వాని సోదరుని, 'దానియాల్' అనువాని కొమాళ్ళ మూవురను—జరిమార్పవలసినదని 'ఆసఫ్ఖాన్' కు లేఖ వ్రాయగా, వానిం గన్నులు కట్టికొని రాజాజ్ఞ రామాజ్ఞ యని యెంచి మంగళవారమునాటికి ఆతని కోర్కి నెరవేర్చినాఁడు. బ 12 గురువారమునాటికి 'ఖుర్రమ్' ఆగ్రానగరమునకుబోయి మరి పదిదినములకొవలవచ్చు సోమవారమునాఁడు భారతవర్ష మహాసామ్రాజ్య సింహాసనాసీనుఁడై "అబుల్ ముజఫర్ శహబుద్దీన్ మహమ్మద్ సాహెబ్ కిరానాని షాజహాన్ గాజీ"—అను బిరుదమును బ్రకటించుకొనినాఁడు.

దీనివలన జక్రవర్తి యాసఫ్ఖానునకు నతని తోడివారికి నెంత కృతజ్ఞుఁడుగ నుండెడివాఁడో పోల్చికొందురుగాక!

విక్రమశకము 1685 ఆశ్వయుజ శు 6 నాఁడు మిథిలానగరము నుండియు, 'తిరహుత్' నుండియు, నరుగుదెంచిన యిద్దఱు బ్రాహ్మణులకు దర్బారున బ్రభుసందర్శన లాభ మొదవించి, వారిని బరిచయము సేయుచు, జక్రవర్తితో "ఇవ్విప్రులు భిన్నభిన్న కవివృషభులు పదుగురు చెప్పిన పది శ్లోకముల నొక్కసారి విని వెంటనే చదువుదురు. వీ రా శ్లోకముల సెప్పుడును గని విని యెఱుంగనివియే! ఇంతియ కాదు. ఆ పదిశ్లోకములలోని యభిప్రాయమును గైకొని మఱి పదిశ్లోకముల రచించి వినిపింతురు. కావున నే వీరి 'నేకసంస్థాగ్రాహు' లనియెద" రని "యాసఫ్ఖాన్" మనవి చేయగా, విద్యావినోదరియైన చక్రవర్తి యాక్షణము నందె వారి విద్యాకౌశలముం బరీక్షించి, యచ్చెరువంది, యొక్కొక్కరికి సాలు జోడీలను వేయి రూపికలను, బహూకరించి, వారిని దృప్తుల గావించి, పంపినాఁడు.

ఇవ్విధముగ దర్బారులో నప్పుడప్పుడిట్టి విద్యావినోదములు జరగుటయు, దత్రాపి విద్వత్సత్కారములు సేయుటయు—జరగుచుండెడిది కనుక నే పండితరాయ లభిప్రాయము సూచించుచు "ప్రతిదిన ముద్యదనవద్య గద్యపద్యాద్యనేకవిద్యా విద్యోతితాంతఃకరణైః కవిభిరుపాస్యమానేన"—అని వ్రాసినాఁడు.

తన యెడ 'నాసఫ్ఖా' నగపఱచిన దృక్పథమునకు జూపిన యాదరాభిమానములకు, జేసిన సాహాయ్యమునకు—గృతజ్ఞతను దెలుపుట కయియే కాబోలు పండితరాయలు కవిసంప్రదాయమున కతి

రీతి ప్రసిద్ధ్యను ఆతని సత్కీర్తించుచు 'అసఫవిలాస' మను గ్రంథమును విరచించుటయం దబ్బురం జేమి? 'రసగంగాధరము' లోని—

“సుత్వైవ వాణీ వసుధైవ మూర్తి
హస్తాంబుజే శ్రీ సద్మనే చ కీర్తిః,
పరాధి కల్పామతి రాసఖేంద్ర
కృపోతిదేఽన్యస్య న హీతి మన్యే.”

“యుక్తం సుధాసేక ఇవ నాసఖేంద్రా
దేవాశ్రితానాం యవనాధి శ్వానాం,
ఇదం తు చిత్రం భువనావకాశే
నిరాశ్రయా భ్రాంతి తస్య కీర్తిః.”

అను శ్లోకములందు 'అసఫ్‌ఖాన్' వర్ణనము గలదు. సాజహాన్ కాశ్మీరమునుండి 'బంభరా'నకు వచ్చినాడు. కాశ్మీరసర్వస్వశ్రేణి యందు దీపట్టన మున్నది. ఈ ప్రాంతమున హిందూమహమ్మదీయు లొండొరులు సంబంధ బాంధవ్యముల జరపుకొను చుండెడివారు. హిందువులు దాము సేకొన్న మహమ్మదీయ కన్యలు సనిపోయినపుడు వారినిదహించు చుండిరి. ముసల్మానులు దాము సేకొన్న హిందూ వనితలు సనిపోయినయెడల వారిని ఖనన మొనర్చుచుండిరి. ఇవ్విషయము వినుకలిసైన సాజహాన్ చక్రవర్తి యంగీకరించక హిందువులు మహమ్మదీయ మతావలంబులు కానంతవఱకు వారి యిండ్లలో మహమ్మదీయ స్త్రీలుండగూడదని యాజ్ఞాపింపగా, నట్టి జమీన్దారు 'క్రోమా' అనునతడు సకుటుంబముగ ముసల్మానయినాడు. చక్రవర్తి యిప్పటికి సంతోషించి యతనికి 'రాజా దౌలతమందు' అని పేర్వెట్టినాడు.

అటనుండి చక్రవర్తి పాంచాలము (*Panjab*) నకు వచ్చునప్పటికి ముసల్మానులు హిందువుల పయి నేరారోపణ మొనర్చిరి. ఆ విషయమును విచారింపవలసినదని గుజరాత్ దేశస్థుడయిన 'షేకు మహమూద్' అనువానితో జెప్పగా, నతడు తగిన కారణములు దొఱకగనే డెబ్బదిమంది మహమ్మదీయ స్త్రీలను హిందువులనుండి వేర్పఱచి, మసీదు భూముల నిర్ధారణసేసి, మరల వానిం గట్టించుటకయి హిందువుల దగ్గఱ జుర్మానా వసూలుసేసి చక్రవర్తితో జెప్పినాడు. 'బంభరు' లో వలెనిచ్చటను హిందువులు దాముసేకొన్న మహమ్మదీయ స్త్రీల కయి స్వమతమును విడనాడిరి. అటుల జేయనిచో నట్టివారినుండి మహమ్మదీయ వనితలు లాగికోబడిరి. చక్రవర్తి పాలిత దేశ మందంతను ఈ యుత్తరువే చాటింపబడి పాలింపబడినది. యవనస్త్రీలు పెక్కురు హిందువుల నుండి బలాత్కరింపబడి వారికి 'నిక్కా' చేసి మహమ్మదీయులకు బెండ్లిగావింపబడిరి."—అని "ముల్లా అబ్దుల్ హమీద్" అను నతడు విక్రమశకము 1691 నాటి వృత్తాంతమును వ్రాయుచు నుల్లేఖించి యున్నాడు. దీనింబట్టి మహమ్మదీయ స్త్రీలను హిందువులు వివాహమాడుట దేశమందంతను జరుగు చుండెనని గ్రహింపనోపు.

చక్రవర్తి దాసీజనములోనొకర్తుక పేరు లవంగి. ఆమె చక్కనిచుక్క. దానిం బండితరాయలును, బండితరాయలు దానిం,—జూచినతోడనే యొండొరులు ప్రేమపాశ నిబద్ధులైరి 'కాని చక్రవర్తి యనుజ్ఞలేనిదే యొకరి నొకరు చూచుట, సంభాషించుకొనుట,—సమయ మెందుండెను. ఒకనాడు పండితరాయలును జక్రవర్తియు మహలులో జదరంగ మాడుచుండగా, రాయలు దప్పిగొని జలాభిలాష నగపఱుపగా, జక్రవర్తి సైగజేయ, లవంగియే బంగరు కలశముతో నీర్వట్టుకొని రాగా విలాసియగు చక్రవర్తి మనంబు వారుణీ ప్రభావకతంబున నప్పాటు మత్తిల్లి యనేక విధంబుల రాజసభావంబుల కుపోద్బలక మయ్యెను. లవంగి యా భావముల మఱింత ఉపోద్బలకముగ, నుద్దీప్తములుగ, జేసివైచినది. ఆ సమయముననే చక్రవర్తి లవంగి పండితరాయల హావభావ విలాస వికారములం దెలిసికొని ప్రసన్నహృదయుండయి లవంగి నున్న యటు లభివర్ణింపుమని పండితరాయలతో ననగా, నతడు తోడనే

“ఇయం సుస్తనీ మస్తకన్యస్త కుంభా,
కుసుంభారుణం చారుచేలం వసానా
సమస్తస్య లోకస్య చేతః ప్రవృత్తిం,
గృహీత్వా ఘటే న్యస్య యాతీవభాతి.”

—అని చదివినాడు. కాగా, లవంగి లజ్జచే దల వంచుకొని కనుల మూసికొనినది. చక్రవర్తి సంతోషించి పండితరాయలను నీ కోర్కె యేమి? యని యడుగగా, రాయలు చక్రవర్తి మనస్తత్త్వమును వారుణీ ప్రభావమును గనిపట్టి

“నయాచే గజాళిం నవా వాజిరాజిం
న విత్తేషు చిత్తం మదీయం కదాచిత్
ఇయం సుస్తనీ మస్తకన్యస్త హస్తా
లవంగీ కురంగీ దృగంగీ కరోతు.”

“యవనీ నవనీత కోమలాంగీ
శయనీయే యది మామకే శయానా
అవనీతల మేవ సాధు మన్యే
నవనీ మాఘవనీ సుఖస్య హేతుః.”

“యవనీ రమణీ విపద శ్శమనీ
కమనీయ తమా నవనీత సమా
ఊహి ఊహి వచోఽమృత పూర్ణముఖీ
స సుఖీ జగతీహ యదంక గతా.”

—అను మూడుశ్లోకముల జదువగా, రసజ్ఞుడు, సహజ విలాసి, యగు చక్రవర్తి యౌదార్యమును మదిరాదేవి యా సమయమున మఱింత వికసింపజేసినది. లవంగి పండితరాయలు శృంగార రసఘుని యందోలలాడుటను గనిపట్టియు, వారి హావభావ విలాస విభ్రమముల విలోకించియు, హృదయ కుహరము నుండి వెలికుద్గమించుచున్న కల్పన నణచికోజాలక చక్రవర్తి యంటనే నవనీత కోమలాంగియగు లవంగిని పండితరాయల కొసంగినాడు. కావుననే కాబోలు 'రస గాంగాధరము'న

"మాహాత్మ్యస్య పరోఽవధి ర్నిజగృహం
గంభీరతాయాః పితా,
రత్నానా మహ మేక ఏవ భువనే
కోవాఽపరో మాదృశః
ఇత్యేవం పరిచింత్య మాస్మ సహసా
గర్వాంధకారం గమో,
దుగ్ధాబ్ధే! భవతా సమో విజయతే
ఢిల్లీ ధరా వల్లభః."

—అని పండితరాయలు షాజహాన్ చక్రవర్తి గౌరవప్రపత్తిని జాటినాడు. అంతతో నూరకొనక

"భూమీనాథ! శహాబదీన! భవత
స్తుల్యో గుణానాం గణై
రేతిహ్యాత భవత్ప్రపంచ విషయే
నాస్తీతి కిం బ్రూమహే
ధాతా నూతన కౌతుకై ర్యది పున
స్సృష్టిం నవాం భావయే
న్నాన్యో దేవ తథాపి తావక తులా
దేశం దధానో నరః"

"సృష్టః సృష్టికృతా పురా కిల పరి
త్రాతుం జగన్మండలం
త్వం చండాతప! నిర్దయం దహసి య
జ్జ్వాలా జటాలైః కరైః
సంరంభారుణ లోచనో రణభువి
ప్రస్థాతు కామోఽధునా
జానీమో భవతా సహాన్త విది
తో ఢిల్లీ ధరా వల్లభః."

"సురాణా మారామా దిహ ఝడితి
ఝంఝానిల హతః
పతేయు శ్శాఖీంద్రా యది తదఖి
లో నందతి జనః
కిమే భిర్వ్యా కార్యం శివశివ! వి
వేమేన వికలై
శ్చిరంజీవ న్నాస్తా మధి ధరణి
ఢిల్లీ నరపతిః."

—అనియు గీర్తించినాడు. ఇప్పండిత శిరోమణి మనోరమా వ్యాఖ్యానముపయి 'మనోరమాకుచమర్దనమ్' అను ఖండన గ్రంథమును రచించి దాని యందము నంతను జెఱచినాడు. ఇప్పటివలనం గూడ నాకాలపు విద్వాంసు లనేకు లసూయాక్రాంతులై పండితరాయలను నిర్భాగ్యశేఖరుని గా నెంచి సంఘమునుండి బహిష్కరించినట్లు చాటించిరి. కాగా, పండితరాయలు దక్కనుచేరను, ప్రయత్నించెను, నద్భుతెప్ప యత్నించినాను గాని వృథ యయ్యెను. అంతమాత్రన సువాసీను డయినం బ్రయోజనము లేదని తలచి కాశీ నగరమున మణికర్ణికా ఘట్టమునందు గల యఱువదిరెండవ సోపానముపయిం గూర్చుండి "నేనా క్షేత్ర యవనకన్యయగు లవంగిని కౌంక్షి పరిణయమాడుటవలన బతితుడ నయితి నేని భగవతియగు గంగాభవాని నన్నుద్ధరింపకుండుగాక! లేదని నేచేసిన పని ధర్మబద్ధమై నేను పవిత్రుడనే యైనచో నిరంతరము సూచుచుండగనే గంగాభవాని యిటకు వచ్చి నన్నుద్ధరించు"నని ప్రతిజ్ఞవట్టి సుప్రసిద్ధమగు 'గంగాలహరీ' స్తోత్రమును జదివ నారంభించి యొక్కొక్క శ్లోకము చదువునప్పటికి గంగాభవాని యొక్కొక్క మెట్టెక్కి యేబదిరెండవ శ్లోకము చదువునప్పటికి పూర్తిగా పొంగిన భాగీరథీ జల ముప్పొంగి పండితరాయ దంపతుల స్పృశించి నిర్దోషు లని లోకమునకు చాటి యంతనే దిగపోయినది. బహిష్కృతుడయ్యును భాగీరథీ జల సంసర్గముచే పునీతుడయి పండితరాయలు తేజరిల్లెను.

మందాకినీ ప్రవాహమువలె మందాక్రాంత వృత్తములలో మహాకవి కాళిదాసు రచించినట్లుగనే పండితరాయలు 'గంగాలహరిని' శిఖరిణీ వృత్తములలో భాగీరథ శయ్యగా వ్రాసి విశ్వాత్మపంథను ప్రోక్షిం యధికతర ప్రసిద్ధికి మార్గదర్శకుడయ్యెను. చిదానందానుభూతి నొసగించుట కావ్యముయొక్క పరమావధి. ఇయ్యనుభూతి గలిగించిన యతడు దాని ననుభవించియుండవలయును. కావుననే కావ్యమున గవిని జూపెగల్గుచున్నారము. 'గంగాలహరి' యితివృత్తము గంగాస్తవమే!

"తవాలంబా దంబ
స్ఫురదలఘు గర్వేణ సహసా
మయా సర్వేఽవజ్ఞా
సరణి మథ నీతా స్సురగణాః;
ఇదానీ మౌదాస్యం
భజసి యది భాగీరథి, తదా
నిరాధారో హా! రో
దిమి కథయ కేషా మిహ పురః?"

—అను శ్లోకమున దల్లిబిడ్డల స్వచ్ఛందమైన బాంధవ్యమును రసపరిణతి నందించినాడు.

"అపి ప్రాజ్యం రాజ్యం
    తృణ మివ పరిత్యజ్య సహసా
విలోలద్వానీరం
    తవ జనని, తీరం శ్రితవతాం
సుధాతః స్వాదీయః
    సలిల భర మాతృప్తి పిబతాం
జనానా మానందః
    పరిహసతి నిర్వాణ పదవీమ్."

—అను శ్లోకమున 'చతురంభోధి పరీతమైన ధరణీచక్రంబు శాసించు వారెల్లరును దమ సామ్రాజ్యమును గడ్డిపోచగా నెంచి నీ యొడ్డు చేరికొనినారు. అమృతము కంటె మధురాతి మధురమైన నీ నీరముల ద్రావిన వారి యానందము నిర్వాణసిద్ధి నపహసించుచున్న' దని తన గంభీర రసానుభవమును బ్రతిబింబించు శబ్దమయమైన యాకృతి గల్గించినపుడు వర్ణనాలంకారములు పర్యవసన్నము లయినవి.

"స్మృతం సద్యః స్వాంతం
    విరచయతి శాంతం సకృదపి
ప్రగీతం య త్పాపం
    ఝడితి భవతాపం చ హరతి;
ఇదం త ద్గంగేతి
    శ్రవణ రమణీయం ఖలు పదం
మమ ప్రాణ ప్రాంతే
    వదన కమలాంత ర్విలసతు."

—అను శ్లోకమున భాగీరథీదేవిని కంఠమునెత్తి పాడికొనిన పాప పంకిలము, సంసార బాధలు, తొలగిపోగలవనియు, ఈ నీ శ్రవణరమణీయమైన నామము ప్రాణోత్క్రమణ సమయమున రసనాగ్రమున దాండవించు గాక! యనియు, దన తీవ్ర వాంఛ నుద్దీపిత మొనర్చి యున్నాడు.

"నయ త్సాధు ద్వైతై
    రపి గలితభేదై రవసితం
నయస్మిం జీవానాం
    ప్రసరతి మనో వా గవసరః
నిరాకారం నిత్యం
    నిజ మహిమ నిర్వాసిత తమో
విశుద్ధం య త్తత్త్వం
    సురతటిని త త్త్వం న విషయః."

—అను నీ శ్లోకమున వస్తువును దన భావమున కాలంబన మొనర్చి విశ్వమయము గావించి విశ్వము నారాధించినాడు.

"పురో ధావన్ ధావన్
    ద్రవిణ మదిరా ఘూర్ణిత దృశాం
మహీపానాం నానా
    తరుణతర ఖేదస్య నియతమ్
మమై వాయం మంతుః
    స్వహిత శతహంతు ర్జడధియో
వియోగ స్తే మాత
    ర్య దిహ కరుణాతః క్షణ మపి."

—ఈ శ్లోకమున దల్లి కడుంగట బిడ్డ యెంత యమాయకముగా భ్రాంతియపడినదియు జేటతెల్ల మొనర్చినాడు. అంతియకాక రాజుల రాజసికము నెంతగా సేవగించి కొనియెనో, పశ్చాత్తాప మెంత పడియెనో, విదితము కాగలదు.

"అనాథః స్నేహార్ద్రాం
    విగలిత గతిః పుణ్యగతిదాం,
పత న్విశ్వో ద్ధర్త్రీం
    గద విదలితః సిద్ధ భిషజం,
సుధాసింధుం తృష్ణా
    కులిత హృదయో మాతర మయం
శిశుః సంప్రాప్తః స్యా
    మహ మిహ విదధ్యాః సముచితం."

—అను శ్లోకమున సనాథుడు స్నేహార్ద్రరాలిని, గతిలేనివాడు పుణ్యగతిని జూపు తల్లిని, వ్యాధితుడు సిద్ధవైద్యుని దాహాతురు డమృత ప్రవాహమును,... జేరుకొన్న యట్టు బిడ్డనైన నన్ను జేరదీసి యాదరించ వలసినదని భాగరథీ తల్లి నర్థించినాడు.

"శ్వ వృత్తి వ్యాసంగో
    నియత మథ మిథ్యా ప్రలపనం
కుతర్కే ష్వభ్యాసః
    సతత పరపైశున్య మననం
అపి శ్రావం శ్రావం
    మమతు పున రేవం గుణగణాన్
ఋతే త్వత్ కో నామ
    క్షణమపి నిరీక్షేత వదనం."

అను నీ శ్లోకమున 'కుక్కవలె ప్రతిరాజు నొద్దకు దిరుగుచు' వారు పాఱవైచిన కబళమును దినుచు, వ్యర్థముగ దినముల గడపికొనుచు, ప్రలపించుచు ననగత్యపు దర్కముల సాగించుచు, నన్యుల కపటపు బలుకులనే నిరంతరము సంభావించుచు,—వ్యర్థుడ నయితిని. నీవు తప్ప నాకు దిక్కెవ్వరు తల్లీ!' యని తన యౌవనమున రాజసభలలో బాండిత్య ప్రదర్శన మొనర్చి చాటుమాటున ధనమదాంధుల చేతులలో నెన్ని యవమానముల బొందినాడో, వా రందఱ ననవసరముగ స్తుతించి యిపుడు కించ

పడుచున్నాడో, తన యాత్మగౌరవము నిలిపికొనుట కయి యెంతగా బరిదేవించినాడో,—యవగత మగు చున్నది.

"కి యంతః సంత్యేకే
నియత మిహలోకార్థ ఘటకాః,
పరే పూతాత్మానః
కతిచ పరలోక ప్రణయినః,
సుఖం శేతే మాత
స్తవ ఖలు కృపాంతః పునరయం,
జగన్నాథః శశ్వ
త్త్వయి నిహిత లోకద్వయ భరః."

అనుశ్లోకమున గొందఱీలోకమునందె యేవియో ఘనకార్యముల నిర్వహించుటకయి పాటుపడుచుందురనియు, మఱికొందఱు పవిత్రాత్ములు పరలోకముపయి స్వదృష్టి బఱపుదురనియు,—నీ దయావీక్షణమున నుభయలోకముల భారము నీయందు నిలిపి యీ జగన్నాథుడు నిశ్చింతగా సుఖముగా నిదురించుచున్నాడనియు,—'అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ' యన్నట్టు భాగీరథీదేవి యందె యితడు లీనమయినాడు. అంతతో దృష్టివడక తన్నుద్ధరింప వలసిన సమయ మాసన్నమైనది భగవతీ! యని—

"జగన్నాథస్యాయం
సురధుని! సముద్ధార సమయః."

అను శ్లోకమున వివరించియున్నాడు. అంత వైభవమును, ప్రసిద్ధిని,—గాంచిన పండితరాయలింత దీనాతిదీనముగా విలపించినాడే యని యచ్చెరువు గొల్పుచున్నది. దీనింబట్టి తెలుగువాండ్రెలో కరుణరసము వెల్లి విరియుచున్నదని తెలియంగలదు. కరుణరసమునకు ప్రష్టయనదగు భవభూతి యాంధ్రుడే గదా!

ఇప్పండితశిరోమణి విరచించిన '<u>జగదాభరణము</u>' లో 'దారాశికోహు' మహాశయుని వర్ణనము గలదు. "ప్రాణాభరణము" న గామరూప దేశాధిపతి యగు ప్రాణనారాయణుని వర్ణనము గలదు. ఈ గ్రంథమున నేబదిమూడు శ్లోకములు మాత్రమే కలవు. నెవ్వే అలంకారములతో నమ్మహారాజు వీరత్వము దాతృత్వము లోనగు గుణగణము లభివర్ణింపబడినవి. ఈ గ్రంథము ముద్రితమే! '<u>రసగంగాధరము</u>' లో నున్న—

"ద్విర్నేత్ర ఇవ వాసవః కరయుగో వివస్వానివ
ద్వితీయ ఇవ చంద్రమాశ్శ్రితవపు ర్మనోభూరివ
నరాకృతి రివాంబుధి ర్గురు రివ క్షమామాగతో
నుతో నిఖిల భూసురైర్జయతి కోఽపి భూమీపతిః

—అను శ్లోకము నాలవపాదము కొనసనున్న అక్షరములకు బదులుగా 'కామరూపేశ్వరః'.—అని మార్చి 'ప్రాణాభరణము' నందు జేర్పబడియెను. ఈ ప్రభువునకును, పండితరాయలకును, సంబంధ మెటుల గుదిరెనో తెలియకున్నది.

ఇక '<u>భామినీ విలాసము</u>' నాల్గువందల దెబ్బది యేడు సూక్తుల గ్రంథము. నవరసభరితము. తన ప్రియభామిని యగు లవంగీస్మృతి విషయమున ఈ నిరుపమాన సంగ్రహ మీతడొనర్చెనని చెప్పబడుచున్నది. ఇమ్మహామహుని చమత్కార కవితకును, భాషా సౌలభ్య సౌకుమార్య సందీప్తికిని—ఇది యొక యుత్కట ప్రదర్శన గ్రంథమని చెప్పదగును. ఈ గ్రంథము చివఱను—

"దుర్వృత్తా జారజన్మానో
హరిష్యన్తీతి శంకయా,
మదీయ పద్మరత్నానాం
మంజూషైషా మయాకృతా."

—అని వ్రాసికొని యున్నాడు.

"శాస్త్రాణ్యాకలితాని నిత్యవిధయ
స్సర్వేఽపి సంభావితా
ఢిల్లీవల్లభ పాణిపల్లవ తలే
నీతం నవీనం వయః
సంప్రత్యుజ్ఝిత మాసనం మధుపురీ
మధ్యే హరిస్సేవ్యతే
సర్వం పణ్డితరాజ రాజితిలకే
నాకారి లోకోత్తరమ్."

—అని యితడు వ్రాసికొనుటవలన బండితరాయల ధర్మపరాయణత, ప్రకృష్ట శాస్త్రాధ్యయనము, ఢిల్లీశ్వరు నాశ్రయలాభములు, మాత్రమే కాక ఆయన చిఱకాల జీవి యనియు—ముదుసలితనమున మథురా నగరములో గడపె ననియు—దెలియనగుచున్నది. ఇతని '<u>చిత్రమీమాంసా ఖండనము</u>' '<u>రసగంగాధరము</u>' నను గ్రంథములు సాహిత్యోపాసకులకు మిపుల ప్రియరత్నములు. '<u>చిత్రమీమాంస</u>' లో '<u>రసగంగాధరము</u>' పైని గావింపబడిన యధిక్షేపములకు బండితరాయలు లెస్సగా ప్రత్యుత్తరించినాడు.

"నిర్మాయ నూతన ముదాహరణానురూపం,
కావ్యం మయాత్ర నిహితం నపరస్య కించిత్,
కిం సేవ్యతే సుమనసాం మనసాపి గంధః,
కస్తూరికా జననశక్తి భృతా మృగేణ॥"

అని యితడు సేసిన ప్రతిజ్ఞ యెంత భావగర్భితమైనదియో వినుడు.

లోకేషణ శాంతించిన తర్వాత పండితరాయలు మథురా నగరమున బృందావనమునకు పోయెనే యన్న విచారము ముప్పిరిగొని విరాగియై నివసించె నని 'భామినీ విలాస' మంపలి

"అపహాయ సకల బాంధవ చిన్తా
ముద్వాస్య గురుకుల ప్రణయమ్
హా! తనయ! వినయశాలిన్! కథ
మివ పరలోక పథికోఽభూః?"

—అను శ్లోకము అవగత మొనర్చుచున్నది. ఔరంగజేబు అన్యాయ్యముగా 'దారాశికోహు' ను జయించిన తర్వాతనే విచారావృతుండయి పండితరాయలు 'ప్రాణాభరణము' ను భావకావ్యముగా విరచించినట్లు లగపడుచున్నది. మచ్చున కొకటి.

"త్వాం సుందరీ నివహ నిష్ఠుర ధైర్య గర్వ
నిర్వాసనైక రసికం సమరే నిరీక్ష్య,
కావా రిపు క్షితిభృతాం ఖత రాజలక్ష్మీః
స్వామి వ్రతత్వ మపరిస్ఖలితం బభార?"

—అనగా సుందరీ ధైర్యమును బాఱద్రోలు రసికత్వ ముండిన నిన్ను యుద్ధమున జూచి యెవరి రాజలక్ష్మి పాతివ్రత్యమును నిలిపికొనిన దని యర్థము. 'దారా' సాహిత్యవేత్త, తత్త్వవేత్త, శాంతి ప్రియుడు. 'సూఫీ' మతాభిమాని. ఛాందోగ్య మిత్రని భోగ్యము. ఇట్టి ప్రసిద్ధ పురుషునిపై పండితరాయలకును, పండితరాయలపై 'దారాశికోహు' నకును,—అభిమాన ముండుటలో నబ్బురం బేల?

ఔరంగజేబు వలన 'షాజహాన్' చక్రవర్తి పదచ్యుతు డయినందునను, దారాశికోహుడు పరలోకగతు డయినందునను,—ఆ కాలమున ఢిల్లీ ధరావల్లభుని పేరోలగంబున సంస్కృతభాషకును, హిందీ భాషకును సత్పండితులకును,—క్షీణదశ పట్టినదని చెప్పక తప్పదు.

విక్రమ శకము 1691 కార్తిక బ 9 నాడు 'షాజహాన్' చక్రవర్తి సవారీ కాశ్మీరమునుండి మరలివచ్చునప్పుడు 'బంభరము'న నిలచినది. ఆ కాలమున పండితరాయలతో పాటు సంస్కృత కవిత్వము—హిందీ కవిత్వము,—చెప్పగల మగన్నయు, సంగీతము పాడగల ప్రజ్ఞాశాలియు, కృతుల వ్రాయగల నేర్పరియు—భారతవర్షమున మఱియొకడు లేడు. అక్కాలిన చక్రవర్తి యాతని సత్కృతులచే దన్పి యుండుటచే 'లాహోరు' నుండి 'బంభరము'నకు వచ్చి చక్రవర్తిని జూడగలిగెను.

చక్రవర్తి కాశ్మీరము పోవునపుడు రాయలను గొన్ని క్రొత్త "ధ్రుపదములు" వ్రాయవలసిన దని యాజ్ఞాపించి తాను మగిడి వచ్చునందాక "లాహోరు" నందె యుండవలసిన దని చెప్పినందున వారి యాజ్ఞ నౌదలనిడికొని పండ్రెండు 'ధ్రుపదములు' క్రొంగ్రొత్త రాగములలో ఢిల్లీ ధరావల్లభు పేరను బూర్తి యొనర్చి వచ్చి చక్రవర్తి కీగా, నతడు ఆ 'ధ్రుపదముల' నన్నిటిని బహు జాగ్రత్తగా బరిశీలించి, పసందుచేసి, యుబ్బి తబ్బిబ్బయి, కౌగిటం గ్రుచ్చుకొని, ముహూర్తకాల మొడలెఱుంగకయ యుండి,—యావల తెలివి దెచ్చుకొని, దర్బారుచేసి, నిండు పేరోలగంబున పండితరాయలచే నాకృతుల బాడించి, వెండి నాణెములతో నాతని దూచి, యా ద్రవ్యము నాల్గువేల యైదు వందలను పారితోషికముగ నతనికే యొసంగి, గౌరవించినాడు.

అంతియకాక ఇయ్యది జరిగిన కొన్ని నాళులకు ననగా విక్రమశకము 1692 శ్రావణ బ 8 నాడు ఇమ్మహా విద్వద్వాగ్గేయ కారకుడు క్రొత్తగా రచించిన యొక గ్రంథమునకు గానుకగా చక్రవర్తి యొక యేనుగు నొసంగి, దాని నెక్కుటకు నీవ యర్హుడవని ప్రశంసించి గజోత్సవ మొనర్చి, మిగుల సత్కరించినాడని "ముల్లా అబ్దుల్ హమీ" యను నతడుల్లేఖించి యున్నాడు. ఇట్టి సత్కృతులు విద్వల్లోకమునకు, దత్రాపి సంగీత ప్రపంచమునకు,—జరిగినట్టులే యని తలంపనగును. కావుననే యా విద్వద్వాగ్గేయకారుని యశస్సు మిన్నంటి

"దేశే దేశే విపణిషు తథా
చత్వరే పానగోష్ఠ్యా
మున్మత్తేన భ్రమతి భవతో
వల్లభా హంత కీర్తిః."

—అనినట్టు మూలమూలల వ్యాపించినది. ఇతని పేర గాశీక్షేత్రమున నొక ఘట్ట మేర్పడినదనియు, నేటేట నొక నాడు ఆ బాలగోపాలము ఆ ఘట్టమున మూగి యీతని 'గంగాలహరి'ని పఠించుచు, నితని సత్కృతి పథమునకు దెచ్చికొని యానందించి నెడలుదు రనియు, జనశ్రుతి కలదు.

ఇప్పండితాగ్రేసరునకు విద్వద్వాగ్గేయ కారునకు నతులొనర్చి సెలవు గైకొనుచున్నాడను.

# ఎన్నిక ఉబలాటం



శ్రీ జి. యస్. సూరి

ప్రొద్దుటూ కేసరికి మా బృందం వాళ్లు అందరూ క్లబ్బు డాబామీదికి చేరుకున్నారు. తలా ఒక పేము కుర్చీలో చేరగిలబడ్డారు.

"వెధవ నల్లులు. కొత్త డి. డి. టి. అయినా వీటి ముఖాన కొట్టకూడదూ?" అన్నాడు కుర్చీని చేతి కొద్దీ చరుస్తూ మీసాలనాయుడు.

"మనకేమీ ఫరవా లేదులే; కావలసినంత కళే బరం పెంచావు," అన్నాడు చెట్టియారు.

"అతికాయులూ మహాకాయులూ ఒకరికొకరు తీసిపోరులే. ఇంతకూ పార్టీ ఎప్పుడురా ఇవ్వటం?" అన్నాడు శాస్త్రుల్లు భాయి.

"పాటిమీది గంగా నమ్మకు కూటిమీదే లోకం. ఎవడు పిలుస్తాడా, ఎవడికొంప తీతామా అని తప్ప మరో ఆలోచన లేదు గదా మనవాడికి!" అన్నాడు తొండమాన్.

"ఎవరు ఎవరికిరా పార్టీ ఇస్తున్నదీ?" అని అడిగాడు డాక్టరు టింగన్.

"ఓహో, నీవీ మధ్య ఊళ్లో లేవు గాదూ! మన కొత్త ఎం. ఎల్. ఏ గారికి చెట్టియారు విందు చేస్తాడుట," అన్నాడు మీసాలనాయుడు.

"చెప్పవేంరా చెట్టియార్? చేగోడీలు తప్పక చేయించుసుమా!" అన్నాడు డాక్టరు టింగన్.

"ఒక చేగోడీలు ఏమిటిరా! ఎన్ని అయినా చేయిస్తాడు. ఇదంతా మన వాడి వ్యాపారానికి పెట్టుబడేగా!" అన్నాడు శాస్త్రుల్లు భాయి.

"ఇంతకంటె అసలు వీడే ఎలక్షనుకు నిలబడి వుంటే భాగుండేది. ఇతరులను ఆశ్రయించకుండా లకారాలకు లకారాలు చేర్చి పారేసేవాడు," అన్నాడు మీసాలనాయుడు.

"ఇప్పటికైనా మించిపోలేదు. అప్పర్ హౌసుకు నిలబడితే సరి. మనల్నిగూడా కొంచెం ఆదుకోవచ్చు," అన్నాడు తొండమాన్.

"మనవాడికి పై అంతస్తులోనేగా ఖాళీ! తప్పకుండా నిలబడవలసిందే," అన్నాడు శాస్త్రుల్లు భాయి.

"ఏడిశావులే. అంత తెలివితేటలుంటే పట్టభద్రుల సీటుకు నిలవరాదూ ప్లేభద్రయ్యావు?" అన్నాడు చెట్టియారు.

"మా మామయ్యకూడా ఇట్లాగే అనుకుని చెలరేగాడులే" అన్నాడు డాక్టరు టింగన్.

"అవునురోయ్. అన్నట్లు నీవు ఈమధ్య క్యాంపు వేసింది అందుకే గాదూ! చెప్పరా గొడవా," అన్నాడు మీసాలనాయుడు.

మేమందరం కుర్చీలను దగ్గరకు లాక్కున్నాము. సిగరెట్టు వెలిగించి కథ ప్రారంభించాడు డాక్టరు టింగన్.

"కామయ్యపంతులు మా మేనమామ; కరణం గారి వంశోద్ధారకుడు. ఆట్టే దండయాత్రలు కొట్టకుండా చదువు పూర్తిచేసి జిల్లాకోర్టు లాయరుగా సెక్కు తగిలించాడు. మావాడు ప్రాక్టీసు పెట్టిన కొద్దికాలానికి కరణంగారు పరలోకానికి ప్రయాణం కట్టాడు. ఇరవై ఎకరాల మాగాని పొలం, గుమ్మడికాయ అంత రొఖ్ఖం మా మామయ్యకు సంక్రమించినవి. రెక్క ఆడితేనేగాని డొక్క ఆడదనే భయం లేనందువల్ల ప్లీడరీకానికి కరిణీకపు లౌక్యం జోడు చేసి ప్రాక్టీసు సాగించాడు. వారసత్వపు దావాల స్పెషలిస్టు అయినాడు. కేసుకు కావలసిన పెట్టుబడి యావత్తూ మావాడే పెట్టి, గెల్చిన ఆస్తిలో సగానికి పైగా కబళించివేసేవాడు.

ఆ వూరిలో బుడేసాహెబ్ అనే తోళ్ల వ్యాపారస్తుడు ఒకడు ఉండేవాడు. ఆయన యుద్ధపు రోజులలో ఒకసారి పెద్దఎత్తున సరుకు ఎగుమతి చేశాడు. దారిలో స్టీమరు మునిగిపోయింది. షిప్పింగ్ ఇన్సూర్యెన్సు కంపెనీమీద దావా వేయవలసి

వచ్చింది. మా మామయ్యే ఆయనకు ప్లీడరు. ఎన్నవ పేచీలన్నీ వేసి అసలుకు మించిన మొత్తానికి డిక్రీ పొంది పైసలతోసహా వసూలు చేశాడు. యుద్ధపు హడావుడిలో బ్యాంకీలో దాచటానికి సాహేబు గారు భయపడి నమ్మకంమీద ఆ డబ్బును మా మామయ్య దగ్గర నే ఉంచదున్నాడు. ఇంతలో బుడే గారికి మక్కా చూసిరావాలనే బడా కోరిక కలిగింది. మావాడు ఆయనను స్వయంగా వెంటబెట్టుకుని బొంబాయిదాకా వెళ్ళి బోటు ఎక్కించి వచ్చాడు. హాజీగారు తిరిగి వస్తూఉండగా ఏడెన్‌లో కలరాతగిలి అసలైన మక్కాయాత్రకు ఉడాయించాడు. సుప్పయివేలరూపాయిలు మా మామయ్య జోజ్జలో జీర్ణమైపోయినవి.

ఇట్లా ఉంటూఉండగా ఎన్నికల అలజడి బయలుదేరింది. మునప్పటి డబ్బు ఇంత ఉన్నది గదా ఒకచేయి చూతామని మా వాడికి దుర్బుద్ధి పుట్టింది. చాలకాలంనుంచీ ఆయనకు ఆస్థాన జ్యోతిష్కుడుగా ఉండే సిద్ధాంతిగారిని పిలిపించాడు. చక్రం చేతికి ఇచ్చి రాబోయే రెండుమూడు మాసాలలో తన భవిష్యత్తు తేల్చిచెప్పమన్నాడు.

సిద్ధాంతిగారు మాటల సంవర్సాన్ని బట్టి మా వాడి కోర్కెను కనిపెట్టాడు. ఒక కాగితంనిండా కూడికలు తీసివేతలు చేశాడు. పంచాంగం అటూ ఇటూ తిప్పాడు. క్షణం కళ్లు మూశాడు.

"పంతులుగారికి ఇప్పుడు రాజ్యాధిపతి దశలో లాభాధిపతి భుక్తినడుస్తున్నది," అన్నాడు సిద్ధాంతి.

"ఎట్లా వుంటుందంటారు?" అన్నాడు మా మామయ్య.

"చెప్పవలెనా! చాల యోగప్రదంగా ఉంటుంది."

"అంటే ఇంకా డబ్బు సంపాదిస్తానంటారా?"

"డబ్బేకాదు. పదవి. జడ్జీ కావచ్చును. లేనా..."

"ఇప్పుడు జడ్జీసంగతి ఎందుకులెండి రాజకీయంగా యోగిస్తుందేమో చూడండి. శాసనసభాప్రవేశం..."

"అదే చెప్పబోతున్నాను. వృద్ధపారాశరిలో.." అని రెండు శ్లోకాలు చదివి అన్వయించి చెప్పాడు.

"అయితే ఏదో ఉన్నదన్నమాట."

"నిస్సంశయంగా. సురువు కదలాలి"

"త్వరగా కదిలింతురూ."

"వచ్చేనెల పదిహేనో తేదీన మిత్రనవాంశలోకి వస్తాడు. ఆపైన శని షష్ఠమంలో సంచారం."

"అయితే శూలినా ఫరవాలేదంటారు."

"ఫరవా యేమిటండి. జైమినిగూడా చెప్పాడు తప్పదు."

"ఎం. ఎల్. ఏ అయినానా, కోటలో ప్రవేశించా ననుకోండి. అయితే నామినేషన్ వేయడానికి ముహూర్తం పెట్టండి."

సిద్ధాంతిగారు సుముహూర్తం నిశ్చయించారు.

ముహూర్తం అయితే సులభంగా నిశ్చయమయిందిగాని ఏ పార్టీ టిక్కెట్టుమీద నిలబడేదీ అనేది క్లిష్టసమస్యగా పరిణమించింది. పూర్వపు ఎన్నికలనుబట్టి చూస్తే పూచికపుల్లను గూడా నిలబెట్టి గెలిపించగలిగినది కాంగ్రెస్ పార్టీ అని స్పష్టంగా కనబడ్డది. అటువంటప్పుడు ఇంతలావు లాయరు పంతులును కళ్లకద్దుకొని తీసుకుంటారులే అనే ధీమా తెచ్చుకున్నాడు. ఎకాయికి హైకమాండువారిని ఆశ్రయిస్తే తంటా వస్తుందేమోనని ప్రాంతీయపు లోకమాండును ఆశ్రయించాడు.

లోగడ తాను అనేకమార్లు కాంగ్రెసు ఫండుకు బహిరంగంగానూ, ప్రచ్ఛన్నంగానూ ఎన్ని విరాళాలు ఇచ్చిందీ ఏకరువు పెట్టాడు. ఎంతమంది ఛోటా నాయకులకు రైలుటిక్కెట్లు కొనిపెట్టిందీ జ్ఞాపకం చేశాడు. పర్మిట్ వ్యాపారస్థులను కోర్టులలో ఎంతమందిని ఆదుకున్నదీ జాబితాలు చదివాడు. పార్టీ ఫండుకు పాతిక వేలదాకా ముట్టచెపుతానని విన్నవించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. "నీవు చదువుకున్నవాడివి కావటంవల్లనూ, ఈ నియోజక వర్గంలో అల్పసంఖ్యాకమైన కులానికి చెందినవాడవు కావటంవల్లనూ, పార్టీ ఎన్నికలలో హైకమాండుకు అండగా ఉంటున్న ఒక ముఠానాయకుడికి ఇదివరకే వాగ్దానం జరిగిఉన్నందువల్లనూ, నీకు సీటు మంజూరుచేయుటకు మహాత్మాగాంధీ వరప్రసాద సర్వోదయ సూత్రాలు అనుమతించవు" అని నిష్క

ర్షగా చెప్పారు. మా మామయ్యా మీసం దువ్వి "ఝెండాపై కపిరాజు...ఒక్కండేనియు నీ ఘోర ఆలకింపవు" అనే పద్యాన్ని గంభీరంగా లోలోపల చదువుకున్నాడు.

ఆ తరువాత మావాడు ప్రజాపార్టీకి అర్జీ దాఖలు చేశాడు. కాంగ్రెసుసంస్థలోని కుళ్లును బయటపెట్టటానికి బద్ధకంకణం కట్టుకున్నాను అని విన్నవించాడు. కాంగ్రెస్ మంత్రివర్గాల అవినీతిని కడిగిపోయడమే నా జీవితాశయం అన్నాడు. ఆంధ్రావనికి ఏకైకనాయకుడు కేసరి తప్ప మరొకడు లేడని ఊరూరా పల్లెపల్లెనా గర్జిస్తానన్నాడు. తన ఎలక్షను ఖర్చులు తాను పెట్టుకోవడమేగాక ఇద్దరు ముగ్గురు దాకా పార్టీ ఇతర అభ్యర్థులను ఆదుకుంటానన్నాడు. "నీవు నిజంగా మా పార్టీతరఫున నిలబడవలసినవాడివేరా. కాని నిన్ను మేము నిర్ణయిస్తే యిన్నాళ్లు మన్నల్ని ఆశ్రయించి తిరుగుతున్న ఫలానావాడు గుండెలుకిందపడి చచ్చిపోతానంటాడు. ఏమి చెయ్యమంటావు? కొంత ఓపిక పట్టు. కవున్సిల్ విషయంలో చూదాం" అన్నది హైకమాండు. "చూడండోయ్ పంతులు తడాఖా" అన్నాడు మా వాడు.

ఆపైన మా మామయ్య దృష్టి కృషీకార్ పార్టీ మీదికి మళ్ళింది. నేను కూడా ఒకే పార్టీ, ఒకే నాయకుడు, ఒకే కులం అనే సూత్రాన్ని అక్షరాలా ఆమోదిస్తున్నానని చెప్పుకున్నాడు. పార్టీ అండ ఇచ్చినట్లయితే రైతులను సమూలంగా తవ్వి తలకెత్తుతానని అభయహస్తం ఇచ్చాడు. జై రంగరంగా అని గొంతు బొంగురుపోయేదాకా ఎలుగెత్తి కేకలు పెట్టాడు. కాని లాభం లేకపోయింది. మా మామయ్య జిల్లాకు సంబంధించినంతవరకూ అన్యకులాల అభ్యర్థులకు అవకాశం లేదు. కాబట్టి పంతులుగారిని దయ చేయమన్నారు. ఇంతవాడిని పట్టుకుని ఇంత చుల్కన చేస్తారా, కాచుకోండి అన్నాడు మా వాడు.

ఇప్పటికి మా మామయ్య కొంచెం పస్తాయించి వెనుకా ముందూ ఆలోచించాడు. కాసేపు సోషలిస్టులను ప్రాధేయపడదామా అని నీరసుడైనాడు. ఇంత బ్రతుకూ బ్రతికి ఇంటివెనక పడి చావటమేమిటని మనసు నిబ్బరపరచుకున్నాడు. ఎవరికో దణ్ణం పెడితే నావలెనే వేయేళ్లు వర్ధిల్లమన్న వ్యక్తిని జ్ఞాపకం చేసుకున్నాడు. ఆ ప్రమేయమే పనికిరాదని నిశ్చయించుకున్నాడు.

ఇక మిగిలింది కమ్యూనిస్టు పార్టీ. ఆ పేరు తలుచుకునేటప్పటికి మావాడికి గుండె ఝల్లుమన్నది. నిక్షేపంలాంటి సుప్పయి యకరాల మాగాని పొలం, బస్తీలో లంక అంత మేడ, ప్రతి బ్యాంకీలో తనకు ఉన్న సొత్తూ మొదలైనవి ఒక్కసారి మనసులో సినిమా మాదిరి మెరిసిపోయినవి. అకొంపిలో కాలుపెడితే ఏమవుతానా అని ఆలోచించిచూశాడు. ఈకెలుపీకిన కోడి మాదిరి తనకు తాను కనబడ్డాడు. వ్రతం చెడ్డా ఫలం దక్కుతుందా అంటే అదీ అప్పుడు అనుమానంగానే తోచింది. తోటి లాయర్లుకూడా ఓట్లు ఇవ్వరుసరిగదా భార్య నాతిలో చూసుతుందేమోనని భయపడ్డాడు. కామయ్యపంతులు కామ్రేడ్ కావటం ఏమిటని అసహ్యించుకున్నాడు.

తానిక స్వాతంత్ర్యం ప్రకటించవలసిందేనని తేల్చుకున్నాడు. దక్షిణహస్తంతో కాంగ్రెస్‌నూ, వామహస్తంతో కిసాన్లనూ, ఎడమకాలితో సోషలిస్టులను, కుడికాలితో కమ్యూనిస్టులనూ ప్రతిఘటించటానికి దృఢనిశ్చయుడైనాడు. వెంటనే ప్రయత్నానికి పూనుకున్నాడు. తన క్లయంట్లకు రమ్మని కబురు చేశాడు. లాయర్లు, డాక్టర్లు, టీచర్లు మొదలైనవాళ్ల దగ్గర వాగ్దానాలు తీసుకున్నాడు. చీకటిబజారు మిత్రులని హెచ్చరించివచ్చాడు. మునిసిపల్ చైర్మను గారిని పట్టుకుని మునిసిపల్ ఉద్యోగులందరికీ తాఖీదులు జారీచేయించాడు. మఠంలో బావితవ్విస్తానని స్వాములవారిచేత శిష్యకోటికి ఉత్తరువులు పంపించాడు. కాజీ సాహేబును పిలిపించి రెండువాక్ఫులు మంజూరు చేయిస్తాను, ముస్లిం ఓట్లనుబందోబస్తు చేయమన్నాడు. నిమ్నజాతి సంఘనాయకులను ఆహ్వానించి గూడెగూడాన ఉన్న దేవాలయాలకు నిత్య నైవేద్య దీపారాధనలకు తగిన వసతి ఏర్పాట్లు కలుగచేస్తానన్నాడు. హాస్టళ్లకు పోయి స్కాలర్‌షిప్పులు వాగ్దానం చేశాడు. ఈవిధంగా అడిగినవారికీ అడగనివారికీ వరాలను నమోదు చేశాడు మా మామయ్య.

మల్లయ్య మా మామయ్య గుమాస్తా. గుడిసెలింగాన్ని మింగగల అసాధ్యుడు. మావాడు మల్ల

య్యని కేలిచి "ఈ ఎలక్షను తేలిపోయేవరకూ కోర్టు వస్త్రాలు మూలపెట్టి ఉంచు. అర్జంటు వ్యవహారాలన్నీ చిట్టిపంతులుకు ఒప్పగించాను. మిగతావి నాయినా చూశాను. ఇప్పటినుంచీ పూర్తి అయే దాకా అన్ని ఏర్పాట్ల భారమూ నీదే. ఖర్చు ఎక్కువాతక్కువా అని సంశయించవద్దు. తిమ్మన్ని బ్రహ్మాని చేసి నన్ను ఒడ్డున పడవేయాలి" అన్నాడు.

"మీరు తలచుకుంటే అదెంతపని పంతులుగారూ! ఈ ఎన్నిక ఒక లెఖ్ఖా? దేవుడు మేలు చేయాలిగాని రేపు ఈపాటికి కిలా మినిస్టరు అయిపోరూ!" అన్నాడు మల్లయ్య.

మా మామయ్య ఎన్నికలకు సంబంధించిన చట్టాలనూ రూల్సునూ అతిజాగ్రత్తతో పరిశీలించాడు. నామినేషన్ ఫారాలు ఒకటికి నాలుగు తెప్పించాడు. అమృతహస్తులని పేరుబడ్డ వ్యక్తులచేత వాటిమీద సంతకాలు చేయించాడు. ఓటర్లజాబితాలు విడివిగా కొని వాటినిబట్టి వార్డువార్డుకూ, వీధి వీధికీ ప్రత్యేకంగా లిస్టులు తయారు చేయించాడు.

మా మామయ్య అనేక లిమిటెడ్ కంపెనీలకు డైరెక్టరుగా ఉండేవాడు. ప్రభుత్వంతో కంట్రాక్టులు ఉన్న ఒక కంపెనీ డైరెక్టరుపదవికి రాజీనామా ఇచ్చి ఆ సంస్థతో తెగతెంపులు చేసుకున్నట్లు అధికార రీత్యా పత్రం పంపమని వ్రాసి పంపాడు. పత్రికలకు ప్రకటనలు ఇచ్చి పత్రికా విలేఖరులకు విందుచేశాడు.

ఇంతలో సిద్ధాంతిగారు పెట్టిన ముహూర్తం సమీపించింది. కాని ఇంకా తన డైరెక్టరు పదవి రద్దు అయినట్లు అధికారపత్రం రాలేదు. టెలిగ్రాములు, ట్రంకుఫోనులు మారుమోగిపోయినవి. చివరకు మల్లయ్యను స్వయంగా మద్రాసు వెళ్లి రమ్మన్నాడు. ఆరోజు ఉదయం 11 గంటలు మొదలుకుని 11-30 గంటల లోపుగా నామినేషన్ వేసితీరాలి అని దైవజ్ఞుడి హుకుం. పాపం మల్లయ్య రైలు దిగి ఆలస్యంగా రావటాన పత్రం అందేసరికి 12 గంటలయింది. కొస్తలో మించిపోయింది ఏమిటిలే అని మనసుకు తృప్తిచెప్పుకుని జన్మకు మొదటి తడవగా రామనామం జపిస్తూ 12-15 కు నామినేషన్ ఫారాన్ని అధికారికి దాఖలు చేశాడు.

అయినా ముహూర్తం కొంచెం దాటిపోయినందుకు మావాడు ఆదుర్దాపడి సిద్ధాంతిగారిని పిలిపించి కర్తవ్యం చెప్పమన్నాడు. సిద్ధాంతిగారు తల పంకించి, పెదవులు కంపించి, చేతులు ఝాడించి, నవగ్రహశాంతిచేసి స్వర్ణదానం చేయమని సలహా ఇచ్చాడు. కర్మకాండ యావత్తూ యథాతథంగా జరిపించాడు మా మామయ్య."

ఈ కథ చెపుతూఉండగా చెట్టియార్ మా అందరికీ డ్రింకులు తెప్పించి ఇచ్చాడు. డాక్టర్ టెంగన్ ఇంకొక సిగరెట్టు ముట్టించి కథను తిరిగి అందుకున్నాడు.

"ఎన్నికల తేదీ సమీపిస్తున్నకొద్దీ మా మామయ్యకు వేడి ఎక్కిపోయింది. ఫిలింకంపెనీవాళ్లు తమ మహోజ్వల చిత్రరాజాన్ని విడుదలచేసే ముందు జరిపించే హంగామామాదిరి ఎన్నికల ప్రచారం నడిపించాడు. ప్రతిగోడమీద చేటలంత అక్షరాలతో చేరవంత పోస్టర్లను అంటించారు. ఇవి చాలక తెల్లని ప్రహరీలమీద నల్లని తారు అక్షరాలను చిత్రించారు. నడిరోడ్లమీద సున్నంతో వ్రాయించారు. రోజు జీతాలమీద క్యాన్వాసర్లను నియమించారు. పాత గ్రామఫోను హారన్లు పట్టుకుని "ఓటు ఎవరికి? కామయ్యపంతులుకు," అని అరిచేందుకు కుఱ్ఱకారును ఏర్పాటుచేశారు. ఒక మోటర్ వాన్‌లో లౌడ్ స్పీకర్లను అమర్చారు. ప్రతిచౌకులోను కారును ఆపి ప్రఖ్యాతగాయకుడిచేత పాటలు పాడించారు. గుక్కతిప్పుకోకుండా మాట్లాడగల్గినవాళ్లు మా మామయ్యను పొగడుతూ గంభీరోపన్యాసాలు చేశారు. వీధినాటకాలు ఆడించారు. వీరంగం వేయించారు.

ఎల్లుండి ఎన్నిక అనగా మా మామయ్య పూర్తిగా కైపులో ఉర్రూత లూగిపోతున్నాడు. మల్లయ్య నురుగులు కక్కుతున్నాడు. గంటకొకసారి మావాడిదగ్గరకు వచ్చి తోటపాలెం ముఠా నాలుగువందల ఓట్లనూ అయిదువందల రూపాయలకు ఫైసల్ చేసేశాను అనేవాడు. అతుకు మెత్తని పేటలో ఏడువందల ఓట్లకూ వెయ్యిరూపాయిలు సెటిల్ చేసేశాను అనేవాడు. ఖర్చు అయితే అయింది ఫకడ్ బందీగా కమ్మకురా అని మా మామయ్య హెచ్చరించేవాడు.

మావాడుకూడ స్వయంగా తన కారులో రాత్రీ పగలు అనక తిరిగాడు. ఏ గూడెంలోకి వెళ్లినా, కారు ఆగగానే ఒకడు ముందుకు వచ్చి "పంతులుగారూ! ఈ వాడ అంతా మీదే అనుకోండి. అనవసరంగా మీరు రాబోకండి. వస్తే అవతలివాళ్లు వచ్చి పేచీలు వేస్తారు. అంతా మేము చూసుకుంటాము. తమరు దయచేయండి" అనేవాడు. కాఫీ ఖర్చులకు ఒక వంద వాడిచేతిలో పారేసి మా మామయ్య చిరునవ్వుతో మరొక చోటికి బయలుదేరేవాడు.

ఇక తెల్లవారితే ఎన్నిక. ఆ సాయంత్రంతో గంద్రగోళం అంతా సద్దు మణిగింది. రాత్రియావత్తూ మా మామయ్యకు కునుకుపట్టలేదు. గదిలో పచారు చేస్తూ తెల్లవార్లూ చుట్టలు తగలేస్తునే ఉన్నాడు. తెల్లవారుఝామున నాలుగు గంటలకు గుమాస్తా మల్లయ్య వచ్చాడు.

"ఏం మల్లయ్యా! సిచుయేషన్ ఎట్లా ఉన్నది?"

"ఫస్టుగా ఉన్నది పంతులుగారూ. కాజీ సాహెబ్‌గారు నాలుగువేల ముస్లిం ఓటర్లను పెద్ద మశీదులో రాత్రినుంచి హాజరు పెట్టాడు. పోలింగ్ బూతులు తెరవగానే వడగళ్లవాన మాదిరి ఓట్లను కురిపిస్తానన్నాడు. లింగడిగుంటనుంచి, సోమార్లపాలెం నుంచి, పెట్లదిమ్మె నుంచి ముఠాలు ముఠాలుగా బయలుదేరి వస్తున్నారు," అన్నాడు.

"ఇతర అరేంజిమెంట్లు ఎట్లా ఉన్నయ్యో?"

"పంతులుగారూ! మల్లయ్యమతిమరుపు మనిషి కాదండోయ్. ఊళ్లో ఉన్న బండ్లనూ, టాక్సీలను అన్నిటినీ బుక్ చేసి వార్డువార్డుకూ పంపించాను. బళ్లు దొరకక ఇతర పార్టీలవాళ్లు ముక్కున వేలువేసుకుంటున్నారు" అన్నాడు.

"జాగ్రత్త మల్లయ్యా! బళ్లు మనవని తెలిస్తే ఎలక్షన్ నేరం అవుతుంది సుమా!" అన్నాడు మామయ్య.

"నేనేమీ వ్యవహారం తెలియనివాణ్ణిటండి పంతులుగారూ?" అన్నాడు మల్లయ్య.

మల్లయ్య వెళ్లిపోగానే స్నానాదులు పూర్తి చేసి సూర్యోదయం కాకముందే ఆంజనేయస్వామి దేవాలయానికి వెళ్ళాడు. ఇంత సింధూరంబొట్టు పెట్టుకుని కారులో ప్రతి బూత్ దగ్గరా సిచుయేషన్ తెలుసుకుంటూ తిరగటం మొదలుపెట్టాడు. అన్ని స్టేషనులలోను మా వాడి ఏజంట్లు ష్యూరుగుమాస్తాలే. గెలుపు మనదేనండీ అన్నారు జంకూ గొంకూ లేక.

మధ్యాహ్నం మళ్ళేసరికి మా మామయ్యకు విపరీతంగా తలనొప్పి బయలుదేరింది. కారులో కూర్చునే ఓపిక కూడ లేకపోవటంవల్ల ఇంటికి పోయి ఆస్ప్రో వేసుకుని నిద్రపోయాడు. ఆట్టే గొడవలేమీ లేకుండా ఓటింగు ముగిసింది.

మూడవరోజు సాయంత్రానికి ఓట్లను లెక్కపెట్టటం పూర్తి అయింది. సోదిలోకి కూడా రాని కమ్యూనిస్టు అభ్యర్థి పదిహేను వేల మెజారిటీతో గెలిచాడు. మా మామయ్యకు డిపాజిట్ పోయింది.

ఆ రాత్రి భోజనాలుచేసి మా మామయ్యా, నేను, మల్లయ్యా, సిద్ధాంతిగారు వసారాలో కూర్చుని ఉన్నాము.

"ఖర్చు అంతా లెక్క చూశావా మల్లయ్యా" అన్నాడు మామయ్య.

"చిత్తమండి. ఇరవై ఏడువేల అయిదు వందల పై చిల్లర అయింది" అన్నాడు మల్లయ్య.

"ఓటుకు యాభై పైన అయినట్లుందే"అన్నాను నేను.

"అయితే ఏమిరా. నేను పట్టుబట్టి ఓడించదలచుకున్న మూడు పార్టీలు ఓడిపోయినవి. నేను గెలిస్తే నేమి; ఓడితే నేమి?" అన్నాడు మా మామయ్య.

అప్పటిదాకా మాట్లాడకుండా కూర్చున్న సిద్ధాంతిగారు గొంతు కొంచెం సవరించుకొని "ముహూర్తం మించకుండా నామినేషన్ వేసిఉంటే పర్యవసానం ఇట్లా ఉండకపోను, పంతులుగారూ," అన్నాడు.

"అంతేనంటారా సిద్ధాంతిగారూ! ఏమో లెండి చెప్పలేము. గురుడు కదిలాడు కాబట్టి ఇక జడ్జీ సంగతి చూతాం" అన్నాడు మామయ్య.

అనగానే లేచి నిలబడ్డాడు డాక్టర్ టెంగన్. మేమూ లేచాము. కొంపలకు బయలుదేరాము.

(ఇందులో వ్యక్తులు, ఘట్టాలు, కల్పితాలు ఎవరినీఉద్దేశించి వ్రాయబడినవికావు–రచయిత)

# శూన్యానికి



శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

ఇంతదాక
మా ఊహకు సరిగా అందని
ఓశూన్యం !
ఏ ఉనికీ లేని మనికి !
ఈవిశ్వం రూపుగొనకముందే
నిలిచిఉన్న ఆదిత్వం !
సర్వం నశించిపోయినా
నిలబడి ఉండే
అనశ్వరత్వం !

*　　*　　*

నీలో
ఒక అత్యల్ప ప్రభాగం
జగత్తులో సృష్టిస్తామని
తన విజ్ఞానాన్నెంతగానో వెచ్చించి
యత్నించి ప్రయత్నించీ
సాఫల్యం పొందలేదు మానవుడు—
మాటిమాటికీ నిను స్మరించినా
మనుజుని ఊహకు
నీస్థితిలో ఒక అత్యల్పపు గతిమటుకే
స్ఫురించుతుంది—
అతిబలవంతపు నీ శక్తిని మించిన
మహాశక్తిదో
పెకలించింది బృహద్విద్యుచ్ఛక్తు లేవేవో
నీ శూన్యాంసళిప్రాతం పట్టిన
పట్టును విడగొడ్తూ—
నిన్నే ఎరుగని మేమా
మహాశక్తి నూహింపగగలమా !

*　　*　　*

మానవమేధకు
తెలిసిన కొలతలతో
ఎప్పుడు జనించిందో
ఎప్పుడంతంగొంటుందో
ఊహింపగసాధ్యపడని
కాలంపుట్టుక నీ నుండే !
సృష్టినిగొన్న సమస్తానికి
సాధారణ గుణమై ఉండేదేదో
అని
నీనుండే సంజనితం !

*　　*

నీనుండి స్రవించిన
కాంతికిరణగణమే
నీ రూపపు నీడలు
మా కనులకు కనపడనీయవు.
నీ నిశ్శబ్దం నుండే
ఉదయించిన శబ్దం
తన గందరగోళంతో
నీ ప్రశాంతి భంగపరుస్తున్నది.
నీ సంతానంలో
పదార్థమన్నది
ఆకారం సాయంతో
వింతవింతగా
నాట్యం చేస్తున్నది
నీ రెక్కల నీడలలో.
స్థలం, కాంతీ, శబ్దం,
విద్యుత్తూ, ఆకర్షణ శక్తి,
పదార్థం—
ఇంకెన్నో కలిసి తయారైన
విచిత్రపు సృష్టి సమస్తం
కాలం నాయకత్వమున,
తల్లివి, నీ పైనే తిరుగుబాటు చేస్తున్నది !

*　　*　　*

సర్వానికి కాలం చేసే సాయం
వాటన్నిటినీ నీ లోనికి
తుట్టతుదకు తరుముడానికే !
నీ కొసరించిన
ఈ ద్రోహానికి ప్రతిఫలముగ
చివరకు తానూ నీలోనే
లయమైపోవాలి కాలం !

*　　*　　*

ఇంత జగంలో
వినాశానికందే అవకాశం
కనిపించని దానివి నీవే—
ఊహ్యాలకు ఆద్యంతాలగు
ఓ అనూహ్య శూన్యమా !

—(*JOHN WILMOT* చదివి)

# ఏకాంకిక



శ్రీ పిసపాటి వెంకటేశ్వర్లు

నాటకములు సమగ్రవికాసము చెందిన భారతీయ సాహిత్యరంగమునకు ఏకాంకికలు నూతన ములు గావు. సంస్కృత సాహిత్యతత్త్వవేత్తలగు ఆలంకారికులు రూపకమును రూపకము లనియు ఉప రూపకము లనియు రెండువిధముల విభజించి యుండిరి. అందు రూపకము దశవిధములుగను ఉప రూపకములు అష్టాదశవిధములుగను పునర్విభక్తము లయినవి. దశధావిభక్తము లయిన రూపకములలో నే మూడు, ఏకాంకికలయి యున్నవి.

(1) వ్యాయోగము (2) అంకము (3) వీథి.

ఇందు వ్యాయోగము వీరరసప్రధానము. స్త్రీ పాత్రల కిచట ప్రవేశము లేదు. శ్యాచిత్కముగ నున్నను అతి స్వల్పము. అంకము మాత్ర మొకటియే యుండును. నాటక మంతయు ఒక ప్రముఖముని నభి ప్రాయము ననుసరించి నడుచును. నాటకమునందలి సంఘటనయంతయు ఒక దినమునందు మాత్రమే జరిగి నదిగ నుండును. నెలలోను సంవత్సరములలోను జరి గిన సంఘటనను ఏకాంకికయందు రచింపరు. ఏకాం కిక ప్రత్యేకతలలో నిది చాల ముఖ్యమయినది.

అంకము కరుణరసప్రధానము. భామినీశోక వర్ణన మిందు ప్రధానము. ఇది గూడ నేకాంకికయే. నాటకీయవిషయము ఒక దినమునకు చెందిన ప్రముఖ ఘట్టమును మాత్రమే అనుసరించును.

శృంగారరస ప్రధానము వీథి. విషయవికా సము ఏకదినపర్యాయియగు ఘటనా చమత్కారమున వృద్ధిచెంది ముగియును.

ఈ మూడును రూపకములయందలి ఏకాంకి కలు. ఇక నుపరూపకములయందలి ఏకాంకికలను విమర్శింతము.

అష్టాదశ భేదములను జెందిన యుపరూపకముల యందు నిమ్నలిఖిత దశవిధభేదములు ఏకాంకికలయి యున్నవి. (1) గోష్ఠి (2) నాట్యరాసకము (3) ఉల్లాస్యము (4) కావ్యము (5) రాసకము (6) ప్రేంఖణము (7) శ్రీగాదితము (8) విలాసిక (9) హల్లీశము (10) భాణిక.

ప్రాచీన సంస్కృత సాహిత్యసాగరమును మథించిన అనేకములగు ఏకాంకికారత్నము లుద్ధ రిల్లును. సుప్రసిద్ధములను కొన్నిటిని మాత్ర ముదా హరించుచున్నాను.

(1) రైవత మదనిక (గోష్ఠి)
(2) విలాసవతి (నాట్యరాసకము)
(3) దేవీ మహాదేవము (ఉల్లాప్యము)
(4) మేనకాహితము (రాసకము)
(5) వాలివధము (ప్రేంఖణము)
(6) క్రీడారసాతలము (శ్రీగాదితము)
(7) బిందుమతి (విలాసిక)
(8) కేళీరైవతకము (హల్లీశము)
(9) కామదత్త (భాణిక)
(10) సౌగంధికాహరణము (వ్యాయోగము)
(11) శర్మిష్ఠాయయాతి (అంకము)

పాశ్చాత్యదేశములలో ప్రథమమున గ్రీసు దేశమునందు మాత్రమే నాటకము సంపూర్ణవికాస మును జెందియున్నది. భారతీయ నాటకములయందు కనుపించు సూక్ష్మవిశ్లేషణ యవననాటకములయందు కానరాదు. "అరిస్టాటిల్" అను నతడు తన "పోయిటిక్" అను గ్రంథములో "నాటకములు, సుఖాంతము లనియు దుఃఖాంతము లనియు రెండు విధములు" అని మాత్రము పేర్కొనియున్నాడు. యవన (గ్రీసు) దేశీయ నాటకనిర్మాణదక్షుడగు "ఎస్‌చిలస్" అను నాతడు రచించిన నాటకము లన్నియు ఏకాంకికలే. ఎస్‌చిలస్ తరువాత "సోఫో క్లీజ్" రచించిన నాటకములను గూడ ఏకాంకిక లనవచ్చును.

యవననాటక రచయితలు "సంకలన" (*Unity*) ను తమ నాటకములకు ముఖ్యలక్షణముగ నేర్పరచిరి. నాటకమంతయు (1) ఏకస్థానమునకు చెంది యుండుట (2) ఏకదినమునకు మాత్రము చెందిన సంఘటనను వర్ణించుట (3) ఒకే ముఖ్య విషయమునకు చెందియుండుట అను నీ భాగత్రయ మును "సంకలన"మునకు లక్షణముగ వ్యాఖ్యానించి యున్నారు. ఇట్లు వ్యాఖ్యానించుటకు కారణము "ఏకరాత్రమున, ఏకరంగస్థలమున, సంవత్సరముల తర బడి బహుప్రదేశముల జరిగిన బహువిధ సంఘటన

లను ప్రదర్శించుట స్వాభావికమునకు విరుద్ధ"మని వారు శంకించుటయే కారణము.

భారతీయ నాటకములయందు ప్రసిద్ధములగు ప్రవేశకము, విష్కంభము అనునవి యవననాటకముల గానరావుకనుకనే అంకవిభాగము లేకుండ సంకలనలక్షణములు మాత్రముగల నాటకము "ఏకాంకిక" యను నిర్వచనమున కర్హమగుచున్నది.

## నవ్యప్రపంచమున ఏకాంకికా వికాసము

ఏకాంకికా వ్యాప్తి మొదట ప్రారంభమయినది పాశ్చాత్యదేశములయందు. ప్రథమమున వీనికున్న పేరు కర్టెన్ రైజర్. నాడు నాటక ప్రారంభమున సమాజదృష్టి నాకర్షించుటకు ఏకాంకికా ప్రదర్శనము జరుగుచుండెడిది. తరుచుగ నిది హాస్యరస ప్రధానమయి యుండెడిది. "ఫారసీ" నాటక కంపెనీలయందు నాటకాంతమున ప్రదర్శితములయి, హాస్యరసప్రధానములగు "నకలు" అనువానితో వీనిని పోల్చవచ్చును. 1918 వ సంవత్సరము ముగిసిన ప్రపంచ మహాసంగ్రామానంతరమున పాశ్చాత్యదేశములయందు ఏకాంకికా వికాసము సంపూర్ణముగ జరిగినదని చెప్పవచ్చును. "గ్రేటు బ్రిటను"నందు 1924 నందు మిష్టర్ జె. ఏస్. మేరియట్ అనునతడు వీనిని ప్రారంభించెను. ఆయన ఈ ఏకాంకిలను "అమెచ్యూర్" నాట్య జగద్వికాసమునకు పునాదులుగ నిర్మించెను. తరువాత ఏకాంకిక రచనాప్రచారములు దినదిన ప్రవర్ధమానము లయినవి. ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామము జరుగుటకు కొంతకాలముముందు "బ్రిటిష్ డ్రామాలీగ్" ఒక నాటకస్పర్థను ఏర్పాటు చేసినది. ఈ స్పర్థయందు 600 నాటక సమాజములు పాల్గొనినవి. అధికముగ ఏకాంకికలు ప్రదర్శితము లయినవి. తరువాత చలనచిత్ర ప్రారంభమున ప్రదర్శించుట కనువుగా పాశ్చాత్యులు ఏకాంకికా మార్గమున చిన్నచిన్న చలనచిత్రముల ననేకములను నిర్మించిరి.

పాశ్చాత్యుల ఏకాంకికలను (1) "*One act play*" (2) *Sketch* (3) *Radio drama* అని త్రివిధములుగ విభజించవచ్చును, ఈ మూటియందును భేదము స్వల్పమయినను, రచనాపద్ధతిమాత్రము సామాన్యముగ ఒకటిగనే యుండును.

ఆంగ్లమానస పుత్రులమగుటవలన మనకు ప్రతి విషయమునందును పాశ్చాత్యులే ఆదర్శప్రాయులుగ నున్నారు. ప్రస్తుత మా పాశ్చాత్యుల ననుసరించియే ఏకాంకికా రచనను మహారాష్ట్రి, బంగాళి, ఘూర్జ, రాంధ్ర, హైంద్వ్యాది భాషలయందు సాగించుచున్నారు.

## ఏకాంకికా వికాసమునకు కారణములు:

దేశ విదేశములయందు ఏకాంకికానిర్మాణమునకు ప్రోత్సాహము నొసంగు కారణములు రెండు. (1) దీర్ఘనాటక దర్శనమునకు కార్యాంతర నిమగ్నులగు ప్రజల కవకాశములేకపోవుట, (2) విస్తృత ప్రచారము నందుచున్న "రేడియో"యందు కాల వ్యవధి పరిమితముగగల నాటకములను మాత్రమే వినిపించుట కవకాశ ముండుటయు నయియున్నవి.

## లేఖన శైలి

నవలకును, కథకును గల భేదమే సంపూర్ణ నాటకమునకును ఏకాంకికను గలదు.

నాటకమునందు నాట్యకలా వికాసమునకు అవరోధమయిన సంకలనము ఏకాంకికా నిర్మాణమున ప్రధానత వహించును. సంకలన లక్షణములుగ వ్యాఖ్యానింపబడిన మూడు విషయములలోను "ఏక కాలమునకు చెందియుండుట, ఏక విషయమునకు ప్రాధాన్య మొసంగుట" అను నీ రెండువిషయములు ఏకాంకికా రచనయందతి ముఖ్యములు. బృహదల్ప స్వరూపములు సమగ్రనాటకైకాంకికలయందంతరమును గల్గించుటయందు ప్రముఖసాధనము లనుకొనుట సమంజసము గాదు. ఏకాంకికలు అల్పరూపములయి యుండవలయుననెడి నియమము లేదు. అనల్పస్వరూపమును గూడ పొందియుండవచ్చును. అనల్పస్వరూపముగల ఏకాంకిక రేడియోయందుగాని లేక స్వల్పవ్యవధియందుగాని ప్రదర్శితమగుట కయోగ్యమయినను అది ఏకాంకిక అనియే చెప్పబడును. ఏకాంకికయందనేక దృశ్యము లుండవచ్చును గాని ఒక దృశ్యము ఈనాటికి చెందినదిగను, మరియొక దృశ్యము సంవత్సరమునకు తరువాత జరిగినదిగను ఉండరాదు. ఏకాంకికయందలి భిన్నదృశ్యములు ఆ కాలమునకు మాత్రమే చెందిన వివిధ ఘట్టముల ననుసరించి ఉండవలయును. "ఏక స్థలమునకు చెందియుండుట" అనునది అంత ముఖ్యము కాకపోయినను "ఏక కాలమునకు చెందియుండుట" అనునది చాల ముఖ్యము. కొన్ని ఏకాంకిలయందు కాల నియమము బాధాకరమయిన తన్నివారణకు ఉపక్రమోపసంహారములను కల్పింపవలయును. ఈ కల్పన "ఏక కాలమునకు చెందియుండుట" అను నియమమును నిల్పుటకును కాలనియమముగల స్థలమున నాటక సౌందర్యము నినుమడింప చేయుటకును పనికివచ్చును. కనుక ఉపక్రమోపసంహారకల్పన తప్పనిసరియగునని తలంపరాదు. కాలనియమముగల స్థలమున నీ కల్పన లేకపోయినను బాధలేదుగాని కాల నియమోల్లంఘన జరిగినప్పుడు మాత్రము తప్పనిసరియగును. ఉపక్రమోప సంహారోపయోగము నాటకారంభాంతములయందు మాత్రమే యుపయోగించును గనుక

మధ్యదృశ్యములయందు కాలనియమమును పాటింపవలయును. రంగస్థలమునందు ఏకాంకికాప్రదర్శన జరుగునప్పుడు అందలి ప్రముఖఘట్టములకును ఉపక్రమమునకు లేక ఉపసంహారమునకును మధ్య సంవత్సరములకొలది కాలభేద మున్నయెడల ఉపక్రమమును గాని ఉపసంహారమును గాని యవనికపై వ్రాసి ప్రదర్శింపవలయును. అనగా ఉపక్రమమునకును ప్రముఖ దృశ్యములకును మధ్య కాలభేదమున్నప్పుడు ఉపక్రమమును నాటకారంభమున ప్రదర్శించుటచే సామాజికుడు దానిని చదివి తరువాత రాబోవు విషయము భిన్నకాలమునకు చెందినదని తలచును. అట్లే నాటకాంతమున ప్రదర్శితమగు నుపసంహారవిషయమున గూడ సంభవించును. రంగస్థలమున యవనికపయి వ్రాయు పద్ధతి నవలంబించినటుల నే రేడియోయందు వాగ్రూపమగు పద్ధతి నవలంబింపవచ్చును. చలన చిత్రరూపమునందిన ఏకాంకికలు కొన్నిటియందు ఉపక్రమోపసంహారములు లిఖితపూర్వకముగ ప్రదర్శితము లగుచున్నవి. వానిని చదువుటకు మన మభ్యస్తుల మగుటచే నవి ఎబ్బెట్టుగ కనుపించుటలేదు. అట్లే రంగస్థలమునందును రేడియోయందును ఈపద్ధతి కొంత నూతనముగ నున్నను క్రమముగ మనము దాని కలవడుదుము. కాని ప్రాచ్య పాశ్చాత్య నాటక ప్రదర్శనములయం దీ పద్ధతి యమలులోనికి రాలేదు. నాటకపఠన విషయమున నీ యుపక్రమోపసంహార విషయము వివాదగ్రస్తము కాకపోయినను రంగస్థల ప్రదర్శనమున నిది వివాదాకరమయినది. పూర్వోక్త సరణి అనుసృతయగునెడ నీ వివాదము పరిష్కారమగుననుటలో సందియము లేదు. కాల సంకలనము ఏకాంకికల కత్యవసరమగుటవలన అది ఏకాంకికా వికాసమునకు విఘ్నకారి కారాదనుటకు పూర్వోక్త సరణి అవశ్యాచరణీయము.

సంకలనద్వయ నియమబద్ధమగు ఏకాంకికా రచనయందు గమనింపతగిన యన్యవిషయములు కొన్ని గలవు.

ఏకాంకికా రచన ప్రముఖవిషయము (*Idea*) నొకదాని ననుసరించియే సాగును. అనేకఘట్టములను ప్రదర్శించినగాని విషయవికాసము జరుగదు. సంపూర్ణనాటకప్రదర్శనమున అనేక భాగములను చేర్చి పలువిధములగు ఘట్టములను నిర్మించి నాటకమును జయప్రదముగ నిర్వహించుచున్నారు. కాని ఏకాంకికయందు ప్రదర్శితమగు విషయము ఏకాంశనిష్ఠమగుటచే నాటకమునం దనుసరింపబడిన పద్ధతి ఇచట నాదరణీయము కాదు. మరియు నాటకమునందు విషయవికాసమునకును సమస్యాపరిష్కారమునకును నాట్యశాస్త్రప్రసిద్ధములగు పతాక, ప్రకరి, మున్నగు నుపకథలను ప్రదర్శించుట సంప్రదాయసిద్ధమయి యున్నది. కథాంశమొకటి మాత్రమే గ్రహింపబడు ఏకాంకికారచనయందు, ప్రకరి, పతాక, మొదలగువానికి సావకాశములేదు. పాత్రనిర్మాణము లేకుండ కథ సాగదు గనుక పాత్రపోషణ కావలయును. సంపూర్ణనాటకమునందు గూడ పాత్రలు ఎంత తక్కువగనున్న అంత చక్కగ పాత్రపోషణ జరుగుట కవకాశమున్నది. అప్రధాన పాత్రపోషణ ముఖ్యపాత్రపోషణ కిచట సహాయమగును. ఏకాంకికయందు మాత్రము ముఖ్యాముఖ్య పాత్రలు రెండును చాల తక్కువగ నుండవలయును. కారణ మేమన నాటకములోని కథను లేఖకుడు స్వయముగ చెప్పుట కవకాశము లేదు. పాత్రల చేష్టలు, సంభాషణలు మాత్రమే కథాకథన సాధనములు. పూర్ణనాటకమునందు సంభాషణ కెంతటి ప్రాధాన్యముగలదో ఏకాంకియందును నంతే గలదు.

చక్కని విషయము విషయవికాసమున కనురూపములగు సంఘటనలు, సంఘటన ఫలప్రదమగుట కనురూపమగు కథ స్వల్పములగు పాత్రలు రమ్యమగు తత్పరిపోషణ, స్వాభావికములగు నభినయ సంభాషణలు మున్నగునవి ఏకాంకిక జయప్రదమగుటకు ముఖ్యసాధనములు.

రేడియో నాటకములు వ్రాయునప్పు డొక విషయమును ముఖ్యముగ గమనింపవలయును. "టెలివిజను" విశ్వవ్యాప్తమగువరకు రేడియో వినుటకు మాత్రమే యుపయోగించును. కనుక శ్రవణమాత్రముననే హృదయాహ్లాదకరముగ విషయము గ్రాహ్యము కావలయును. మిగిలిన విషయములు పూర్ణనాటకమునకును, ఏకాంకికకును సమానములు. కాని ఒక్క విషయము. "స్వాభావికత" మాత్రము అతి ముఖ్యము. అస్వాభావికత పానకములోని పుల్లవంటిది గనుక స్వల్పమయినను నది దుస్సహమగును.

సంపూర్ణనాటకమందలి స్వగతాదుల కెంత మాత్రమును ఏకాంకికయందు స్థానములేదు. పద్య, కవిత్వ, నృత్యాదు లుపయుక్తములు గారాదు. అనగా పూర్తిగ నిరాదరణీయములని యనుకొనరాదు. సఫలకవిత్వమునగల స్థాన మిచట లేదని యర్థము. స్వాభావికతకు భంగము లేకుండగ సంపూర్ణ నాటకమున నీయబడు స్థానమును ఏకాంకికలయం దీయవచ్చును. కాని, పద్య, నృత్య, గీతాదులను గ్రుచ్చి యెత్తుటకు చోటీయరాదు. ఏమయినను ఏకాంకిక స్వాభావికమగుట చాల అవసరము.

కవి హృదయము ననుసరించి ఏకాంకిక ఒకప్పుడు ఆనందదాయకమును వేరొకప్పుడు ఉపదేశదాయకమును గావచ్చును. ఇంతవరకు మనము చర్చించిన కళాసంవిధానము సమ్యక్సమన్వితమయినను కాకపోయినను మానవహృదయములను మహోన్నతాశయములకు గొనిపోవు ఏకాంకికయే సర్వశ్రేష్ఠమగును.

# ఘటిక : ఘటికాస్థానం



శ్రీ వడ్డాది శ్రీరామచంద్రమూర్తి

దక్షిణభారతంలో విద్యావ్యాప్తికి తోడ్పడి, కాలగర్భంలో యిమిడిపోయిన పురాణ సంస్థలలో ఘటిక అన్నది ఒకటి. ఆర్యులు దక్షిణాపథంలో ప్రవేశించి తమ మతము సాంప్రదాయాలు, సంస్కృతి, వ్యాప్తి చేయడానికి, వారికి దేవాలయము, మఠము, ఘటిక అన్నవి మూడూ చాలా తోడ్పడ్డాయి. వీటిలో దేవాలయములు, మఠములు నిర్వహించిన పాత్ర, నిర్వహిస్తున్న పాత్ర చాలా మందికి తెల్సిన విషయమే. అవి సజీవములై నేటికి కూడా హిందువులలో చాలామంది జీవితాలతో అవినాభావమయిన సంబంధం కల్గివున్నాయి. కాని వీటి తోబుట్టువైన ఘటిక అన్న విద్యాసంస్థ మాత్రం కాలగర్భంలో యిమిడి పోవడంచేత, దానిని గురించి పాత శాసనాల బూజు దులిపే రేమ కొద్దిరుందో తప్ప జన బాహుళ్యానికి దీనిని గురించి తెలియదు.

ప్రాచీన ఆంధ్ర శాసనాలలోనూ, కన్నడ శాసనాలలోనూ, "ఘటిక," "ఘటికాస్థానము," "ఘడియారము" "ఘడిశాసి" అన్న పదములూ వాటి పర్యాయపదములైన ఘటికాశాల, ఘడెశాసి, ఘడిశాసి, ఘడియశాసి మొదలయినవి తరుచు కానవనును. ఘటిక అన్న ఈ విద్యాసంస్థ ముఖ్యంగా దక్షిణ భారతంలో మాత్రమే వ్యాప్తి చెందింది.

ఈ పదముయొక్క అర్థముగురించి పండితులు వివిధమైన అర్థములు ఇచ్చియున్నారు.

పురాతత్వ వేత్తలలో ప్రసిద్ధి పొందిన *Mr. Louis Rice*, ఘటిక అన్నది "గోష్ఠి," లేక "బ్రాహ్మణుల సభ" అనీ, 1 పాథక్ పండితుడు "పుణ్యక్షేత్రమనీ," 2 *Dr. Kielhorn* "బ్రహ్మపురి"3 వంటిదనీ వివిధమైన అభిప్రాయాలు వెలిబుచ్చారు. *Dr. Buhler* "ఒక గడియారవిశేషమనీ," 4 *Dr. Barnett* సమావేశమునకు వీలగు భవనమనీ, 5 దీనిని నిర్వచించారు. శ్రీ భావరాజు వెంకట కృష్ణరావు గారు, 'ఘటిక' అన్న శబ్దము 'ఘటక' అన్న శబ్దమునకు పర్యాయ పదమనీ, అది కటక, కటక అన్న పదములకు సంబంధించినదనీ వ్రాసియున్నారు. 6 *Dr. Hultzsch* మాత్రము దీనికి సరిగా 'కళాశాల' 7 అను అర్థము నిచ్చిరి.

ఘటిక అన్న ఈ పదమున కర్థము సంస్కృత నిఘంటువులలో దేనిలోనూ కూడా కానరాదు. ఆప్టే మాత్రము, ఒక రకపు ఆలయవిశేషమని అర్థము నిచ్చియున్నాడు. శబ్దరత్నాకరములో గాని, కిట్టెల్సు కన్నడ నిఘంటువులో గాని, దీని ప్రశంస కానరాదు. ఈ మధ్యనే ప్రచురితమైన సూర్యరాయాంధ్ర నిఘంటుకర్తలు మాత్రము, లోగడ ప్రకటితమైన చారిత్రక పరిశోధ నాంశాలు పరిశీలించి, ఘట శబ్దమునకు 'గోష్ఠి,' 'సభ' అను అర్థమునిచ్చి, ఘటశాసి శబ్దముగురించి వ్రాయుచూ ఘటికా అను విద్యాసంస్థ ఒకటి వుండెడిదని పేర్కొన్నారు.

ఇట్లు చరిత్రకారులను, పండితులను మభ్యపెట్టిన ఈ సంస్థ గురించిన కొన్ని వివరాలు ప్రకటించడమే యీ వ్యాస లక్ష్యము.

ఘటిక అన్న ఈ పదము, మొదటిసారిగా మనకు కదంబవంశ రాజన్యుడయిన కాకుత్సవర్మ తలగుండ శాసనములో 8 కనిపిస్తున్నది. తలగుండ అన్న ఈ గ్రామము మైసూరుసంస్థానంలోని షిమోగా జిల్లాలోని షికార్‌పూర్ తాలూకాలో వున్నది. దీనిలో ఘటికాస్థానంగురించి చేసిన ప్రస్తావన వలన, తలగుండ శాసనదాత కదంబ కాకుత్సవర్మ పూర్వీకుడైన మయూరశర్మ, కాంచీపురంలో వున్న ఘటికాస్థానానికి, విద్యాభ్యాసము కోసమో, లేదా అక్కడవారిని జయించడంకోసమో, వెళ్లినట్లు తెలుస్తోంది. తలగుండశాసనం, లిపిస్వరూపాన్ని అనుసరించి *Mr. Louis Rice* క్రీ. శ. 5 వ శతాబ్దము

1. *Mysore and Coorg by Louis Rice P 210.*
2. *Do ;*
3. *Do ;*
4. *Ep. Ind. I, 276, 284.*
5. *Ep. Ind. XIII. 327,*
6. *Early Dynastics of Andhra Desa P. 208.*
7. *Ep. Ind. XVIII, 57.*
8. *Ep. Ind. P. 34.*

నాటిదనీ [9] Buhler, 5 వ శతాబ్దము[10] నాటిదనీ, Kielhorn 6 వ శతాబ్దము నాటిదనీ,[11] అభిప్రాయపడ్డారు. Kielhorn సూచించిన ఆరవశతాబ్దము అన్న వాదన అంగీకరించినా కాకుత్స్థవర్మకీ, ఆ కదంబవంశ స్థాపకుడైన మయూరశర్మకీ, రెండు మూడు తరముల వ్యత్యాసం ఉంది. "కదంబకులం" అన్న పుస్తక గ్రంథకర్త *Moreas*, మయూరశర్మ క్రీ. శ|. 345—70 సంవత్సరాల మధ్య పాలించినట్లు నిర్ణయించాడు. అందుచేత ఎటు చూసినా, ఈ ఘటిక అన్న విద్యాసంస్థ క్రీ. శ. మూడు నాల్గు శతాబ్దములకి పూర్వమే, స్థాపించబడి పేరు ప్రతిష్ఠలు సంపాదించడం నిర్వివాదాంశం. మయూరశర్మవంటి రాజులు విద్యాభ్యాసంకోసం అక్కడికి వెళ్లాలని కోరారంటే, అట్టి సంస్థ కనీసమొకటి రెండు శతాబ్దములకి పూర్వమే స్థాపించబడి వుండాలి.

పల్లవ రాజధాని కాంచీపురంలోని ఘటికాస్థానములో విద్య నభ్యసించడానికో, 'వాక్చండిమఘట శాసుల చర్చ గెలుచుటకో, కదంబ మయూరశర్మ, అక్కడికి వెళ్ళినట్లు తెలుస్తోంది. కాని శాసనములో 'తార్కుకః' అని ఉందనీ, హేమచంద్రుని అభిధాన చింతామణిలో తార్కుక శబ్దానికి యాచకుడని అర్థం ఉందనీ, అందుచేత మయూరశర్మ కాంచీపురానికి విద్య నభ్యసించడానికి మాత్రమే వెళ్లాడని కొందరి అభిప్రాయం.[12] కాంచీపురం ఆనాటికి, విద్యాసంస్థలకి పేరుపొందింది. ఆ పేరు ప్రఖ్యాతులకి కారణం అక్కడి ఘటికాస్థానములే! అనేక యితర శాసనాలలో కూడా ఈ ఘటికా ప్రస్తావన వుంది: ఆ తర్వాత, 'ఘటిక' అన్న పదం మూడవ విజయనందవర్మ 'వేలూరి పాలియం' శాసనములో ఉదాహృతమయింది. దీనిలో 'స్కందశిష్యుడు' సత్యసేనుని వద్దనుంచి, ఒక ఘటికను సాధించినట్లు, రెండవ నరసింహవర్మ బ్రాహ్మణుల ఘటికను పునరుద్ధరించినట్లు వుంది.[13] మూడవ శతాబ్దానికి చెందిన విష్ణుకుండి మాధవవర్మ పులింబూరు శాసనంలో మాధవవర్మ తాను 'యథావిధి వినిర్వాపిత ఘటికా వ్యాప్తపుణ్య సంచయు' డనని వర్ణించుకున్నాడు. తూర్పు చాళుక్యవంశ స్థాపకుడగు కుబ్జ విష్ణువర్ధనుని కుమారుడు ప్రథమ జయసింహ వల్లభుని నిడుప్రోలు శాసనంలో కూడా ఈ ఘటికాస్థాన ప్రస్తావనవుంది. ఈ శాసనం 'అసనపురవాసక'మునుండి దానము చేయబడింది. అనేక శతాబ్దాలపాటు ఆంధ్రదేశంలో ఇచ్చట ఘటికాస్థానాలు విద్యావ్యాప్తికి తోడ్పడ్డాయి. ఈ శాసనంలో ప్రథమ జయసింహ వల్లభుడు, రెండు వేదాలలో నిధి అని పేరుగాంచి వేద వేదాంగాలలో, శిక్షపొందిన కేతశర్మకి నిడుబజ్జు అను గ్రామాన్ని దానం చేసినట్లుఉంది. ఈ కేతశర్మ తాత మందశర్మ అసనపురస్థానవాసి. 'ఘటికాసామాన్యుడు'; రాష్ట్రకూట చక్రవర్తి నాల్గవ గోవిందుని క్రీ. శ. 929 నాటి ఒక శాసనంలో కూడా కడియూరను చోట ఒక దేవాలయము, 'ఘటిక' స్థాపించినట్లు వ్రాసికొన్నాడు:[14] సర్వవర శాసనంలో శక వర్షము 1326 లో తారణ 13 సంవత్సర శ్రావణ శుద్ధ పంచమినాడు సర్వవరంలో "శ్రీ భావనారాయణ పెరుమాళకు గోలి సోమారెడ్డింగారు ఘటికాసారం' ఒకటి స్థాపించిరి![15] ఇక నాదెండ్ల శాసనంలో 'శ్రీమన్ మహా మండలేశ్వర చోడరాజు శకవర్షంబులు 1064 నాటి ఉత్తరాయణ సంక్రాంతినాడిచ్చిన దానగ్రహీతలలో 'బెబ్బన ఘడియశాసులు' ఒకరు: దక్షిణభారత శాసన సంపుటిలో ఒక శాసనములో "కాండవశాఖ తైత్తిరీయ శాఖలు చదివించ్చేటి ఘడిశాసులైన బ్రాహ్మణుల కిద్దరికి మూడు నిబన్ధాలు దానం యిచ్చినట్లు వుంది.[16] కన్నడదేశంలో కూడ ఈ సంస్థ వ్యాప్తిలో వున్నట్లు చాలా నిదర్శనాలున్నాయి: హరిగిరిపట్టణంలో ఒక పేరు పొందిన ఘటికాస్థాన ముండేది; ఆ ప్రాంతంలో నాలుగు ఘటికలుండేవి. చెంగలిపట్టుజిల్లాలోని పొన్నేరి తాలూకాలో ఆనాటి వాణిజ్య మండలి అరవయినాలుగు ఘటికా స్థానాలు స్థాపించినట్లు ఆధారాలు ఉన్నాయి:

ఈ శాసన ఆధారాలుగాక ఆంధ్రవాఙ్మయంలో కూడా, ఘటశాసి, ఘడెశాసి ప్రయోగములు అనేక చోట్ల కనిపిస్తున్నాయి: పాల్కురికి సోమనాథ కృత బసవ పురాణంలో

"శ్రీకరభట్టిల్లు సిచ్చున గలసె
మాధవప్పన యిల్లు మంటపాలయ్యె
గ్రుడ్డి గోవిందుని గుడిసెయు గమరె
దొడ్డ భాస్కరు నిల్లు దొడివొడి గాలె
కొమ్మన ఘటశాసి కొంపయు గమలె"

పండితారాధ్య చరిత్రంలో 'కేశవు ఘడెశాసి ప్రస్తావన వుంది. వినికొండ వల్లభామాత్యుని క్రీడాభిరామంలో "మనుమావతీదేవి వెల్వాడి కట్టాయితంబైన ఘటశాసి పుంగవుని" వర్ణించాడు. కేతన కవి ఇంటి పేరు మూలఘటికవారు: స్థలాభావంచేత చాలా

9. *Ep. Car. VII, P. 8.*

10. *Ep. Ind, Art XXV P. 27*, 11. *Ep. Ind. VII, P. 31.*

12 *Administration and Social life Under the Pallavas.*

13 *S. I. I. Vol II*

14 *Ep. Ind XIII P. 326.*

15 *S. I. I., V No 10*; 16 *S. I. I. Vol VI No 904.*

ఉదాహరణలు వదలివేయవల్సి వచ్చింది. ఆముక్త మాల్యదలోని ఈ క్రింది ఉదాహరణ మాత్రం చూడండి: ఏడవ ఆశ్వాసం, మూడవ పద్యం:

"ఉండుదు జోళభూమి నొక యూరగఁ జాల్

పదునాల్గు నేర్చి వా

ర్చుండును జర్చ గెల్తు ఘటశాసుల క్రొత్తుల

దప్పు పట్టుదుఁ........"

ఈ విధంగా ప్రాచీన ఆంధ్ర శాసనములలోనూ, ఆంధ్ర వాఙ్మయములోనూ, విరివిగా నుదాహృతమైన ఈ సంస్థ ప్రసక్తి ఉత్తర భారత శాసనములు వేటిలోనూ కన్పించదు: శుభాకరుని శాసన మొకదానిలో మాత్రం 'ఘటిగ్రామిన్' అన్న ప్రయోగం కనిపిస్తోంది. ఓఢ్రదేశం బహుశః ఈ ఆంధ్రసంస్థని అనుకరించి వుండవోపు.

కాని దక్షిణ భారతంలో ఈ విద్యాసంస్థ క్రీ. శ. మూడు నాల్గు శతాబ్దాలనుండి 11, 12 శతాబ్దాల వరకు ప్రబలిన విద్యాసంస్థ అని విశదమవుతోంది. ఇది ఎలా పనిచేసేదో నిజస్వరూపం తెల్సుకోడానికి హైదరాబాదు పురాతత్వశాఖ ప్రకటించిన నాగయ్ శాసనం,[17] మనకి బాగా తోడ్పడుతోంది: దీనిలో కర్ణాటసేనాని మాధవపరస నాలుగు వందల మంది బ్రాహ్మణుల కొక అగ్రహారం దానంచేసి, త్రైపురుషదేవ, మధుసూదన, రామేశ్వర దేవరలకు ఆలయప్రతిష్ఠ చేసి, ఒక ఘటికాస్థానమును స్థాపించెను. దీనిలో మొత్తం, 257 గురు విద్యార్థుల విద్యాభ్యాసానికి ఏర్పాట్లు చేసి, మాధవపరస, దానికి కావల్సిన భూమి దానం చేశాడు: వేదాభ్యాసం చేసే విద్యార్థులు రెండువందల మందికీ, శాస్త్రాభ్యాసం చేసే విద్యార్థులకి 52కీ ఉచిత భోజన వసతి సౌకర్యాలు ఉండేవి. ఇందలి శాస్త్రశాఖకి, ముగ్గురు అధ్యాపకులు, భట్టవర్శనన్యాసం, ప్రభాకర శాఖలలో నిష్ణాతులైన ముగ్గురు పండితులనీ మాధవపరస నియమించాడు. ఆర్గురు సరస్వతీ భాండాగారికులు ఉండేవారు. 35 మాత్రల భూమి ఘటికా ప్రహారికి దానమివ్వబడింది.

మొత్తంమీద ఆంధ్రదేశంలో 'ఘటిక' లిదే పద్ధతిలో పనిచేసి ఉండేడివని ఊహించవచ్చును. వివరాలలోనూ, పాఠ్యపద్ధతులలోనూ కొన్ని భేదము లుండిన ఉండవచ్చు.

ఇక, ఘటికలకీ మఠములకీ గల వ్యత్యాసములు కొంత విచారించుట అవసరం. మఠం మతప్రచారానికి ఉద్దేశించిన సంస్థ. దైవతా ద్వైత విశిష్టా ద్వైతముల ప్రచారమున కవి ఉద్దేశింపబడినవి. ఘటికాస్థాన మట్టిది కాదు. వైదిక లౌకిక వాఙ్మయాలలో విద్యాభ్యాసానికి ఉపకరించినది ఘటిక. నాస్తిక సిద్ధాంతాలను, శూన్యవాదులను, ఎదుర్కొని, వైదిక సిద్ధాంత రక్షణకి తోడ్పడిన వీ ఘటికలు.

ఇవి సాధారణముగా ఆలయములకు చేర్చివుండెడివి: ఆలయప్రాంగణములలోనూ మండపములలోనూ విద్యాభ్యాసం జరుగుచుండేడి. దానధర్మాలు, ఆలయములకూ, ఈ విద్యాసంస్థలకీ కలిపి చేసేవారు.

ఈ ఘటికాస్థానములలో విద్యాబోధకులని 'ఘటశాసి' 'ఘటశాసులు' అనేవారు. వారందరూ అఖండమైన ప్రజ్ఞావంతులు అవటంచేత ఆ శబ్దమునకు పెద్దపండితుడన్న అర్థం కల్గింది. దీనికి శబ్దరత్నాకరములోనూ, మహామహోపాధ్యాయ శ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారు రచియించిన అముక్తమాల్యద వ్యాఖ్యానములోనూ, 'తార్కికుడు' అని అర్థము చెప్పిరి. స్వర్గీయులు 'ఆంధ్ర వాఙ్మయమును తరచి తరచి, అందలి నిగ్గులు తెల్సగా తేల్చినవారు' అయిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ క్రీడాభిరామ పీఠికలో శాస్త్రివర్యుడు అని అర్థం చెప్పారు. కాని ఘటశాసి అనగా ఘటికాస్థానమున ప్రధాన అధ్యాపకుడు అనుకొనుట సమంజసంగా తోస్తుంది.

ఘటశబ్దమునకు గోష్ఠి, సభ అను అర్థమున్నదని, బ్రాయకముగ ఘటిక, ఘటశబ్దముతకు సంబంధముండవచ్చునని మొదట వ్రాసివున్నాను. ఘటములనెడి ఈ సభలు పూర్వకాలంలో, పండుగులలో జరుగుచుండెడివనీ, వాటికి దేశదేశాలనుంచి పండితులు వచ్చి వాదోపవాదాలు జరిపేవారనీ, వాత్స్యాయనుని కామసూత్రములు స్పష్టంచేస్తున్నాయి. ఇతర క్రీడలతోపాటు ఈ ఘటము లెట్లు పనిచేయుచుండినదీ కామసూత్రములలో వర్ణించాడు. దీని వ్యాఖ్య అయిన జయమంగళవ్యాఖ్యలో ఘటమనునది భగవత్పరంగా జరిపెడి ఉత్సవమని యశోధరుడు వివరించాడు ఇట్టి వుత్సవాలలో 'సరస్వతీఘట'ము చాలా పేరుపొందింది. దీనికి అనేకమంది కవులు, నాటకకర్తలు, విద్వాంసులు వచ్చి, చర్చలు సాగించి, తమ తమ నాటకముల ప్రదర్శించి, మెప్పుగాంచుచుండిరి. కాలప్రియనాథుని వార్షికోత్సవసందర్భంలో, మొదటిసారిగా భవభూతి తన మాలతీ మాధవ నాటకమునూ, పూరీలోని జగన్నాథుని ఉత్సవంలో మురారి తన అనర్ఘరాఘవాన్ని ప్రదర్శించెనని ప్రతీతి.

ఇట్లు కొన్ని శతాబ్దాలపాటు దక్షిణాపథంలో విద్యావ్యాప్తికి తోడ్పడిన సంస్థ ఘటిక; దీనినే ఘటికాస్థానము, శాల, ఘడియారము అని అనెడివారు. ఇక ఘటశాసికి, ఘడెశాసి, ఘడిశాసి, ఘడియశాసి, అన్నవి పర్యాయపదములు. ఆంధ్రదేశాన వైదికవిద్యావ్యాప్తికి తోడ్పడిన ఈ సంస్థ గురించి తగినంత పరిశోధన జరగలేదని సూచించడమే ఈ వ్యాసపు ప్రధాన లక్ష్యం.

17. *Hyderabad Arch. Series No 8P 22-23*

# ప్రయోజకత్వం



శ్రీ బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

గోపాలం పెళ్లానికికూడా లోకువయిపోయాడు. లోకులకు మరీ లోకువయిపోయాడు. తను బి. ఏ. పాసయి, పన్నెండేళ్ళయి వుద్యోగం చేస్తున్నాడు. కాని గొర్రెతోకలా ఆ వుద్యోగానికి ఎదుగూ బొదుగూ లేదు. అంటే తనకి లేదన్నమాట. ఎనిమిదేళ్ళ కూతురు బడికి వెళుతూన్న పిల్లకదా! ఇంట్లో పడివుండే పెళ్లానికి చీర కొనలేకపోయినా, పిల్లకి రెండు పరికిణీలయినా మంచివి కొనాలా మరి. అయితే ఈ రోజుల్లో బట్టలు కొనడమంటే మాటలా? ధరలు మండిపోతున్నాయి. "మొన్న కుట్టించిన చుక్కల పరికిణీ వుండాలిగా. అదేమయింది?" అన్నాడు గోపాలం చిరాగ్గా.

"మొన్నేమిటి మొన్న, ఆర్నెల్లయింది. ఇంకా కూచుంటుందా?" అన్నాది భార్య సావిత్రి. ఆరోజు సావిత్రి మనసు చాల చిరాకుగావుంది. పొద్దుటే పాలమనిషి పాతబాకీ తెమ్మని దెబ్బలాడి వెళ్ళింది. ఉట్టిమీద పెరుగు పిల్లి తిరగదోసింది. పెద్దపిల్లడికి జ్వరం తగిలింది. చేతివాడు, వెధవకి రెండేళ్ళైనా లేవు. కాని మహ పెంకి. మరుగుతూన్న కాఫీనీళ్లు కాళ్ళమీద పోసుకుని కాల్చుకున్నాడు. పెద్దపిల్ల కొత్తపరికిణీ కావాలని ఏడిచి నానా అల్లరిపెట్టి బడికి వెళ్ళడం మానేసింది.

"ఆర్నెల్లకే చిరిగిపోయిందా పరికిణీ?" అన్నాడు గోపాలం ఏం మాట్లాడాలో తెలీక.

"పరికిణీ అన్నది మరి చిరగదేమిటి? అదేం రాయా రప్పా?"

అవును మరి. రాధ బడిలో పలకమీద వుమ్మి తడిచేసి, చేత్తో రాసి పరికిణీతో తుడుస్తుంది. మట్టిలో చేతులు పెట్టి పరికిణీకి తుడుస్తుంది. దీనన్నిటినీ భరిస్తూ ఎంతకాలముంటుంది పరికిణీ అన్నది. అదేం రాయా రప్పా? గోపాలానికి కూతురిమీద కోపమొచ్చింది.

"వెధవముండ, బడి ఎగ్గొట్టడానికి ఏదో సాకు చూసుకుంటుంది. ఆ చిరిగిన పరికిణీ వేసుకువెళ్లి ఇవాళకి. ఫరవాలేదు." అంటూ కూతురిమీద కళ్లెర్రజేశాడు. రాధ మళ్ళీ ఏడుపుకి లంకించుకుంది.

"చిన్నముండ, దానిమీద ఎందుకా కోపం. బడిలో నలుగురూ నవ్వుతారని దాని ఏడుపు," అంది సావిత్రి.

గోపాలానికేమీ తోచలేదు. పిల్లల్ని కోప్పడితే ఇలా అంటుంది. ముద్దులాడితే, ఇలా ముద్దు చేసే వాళ్ళని పాడుచేస్తున్నారంటుంది. ఏమిటి దారి? ఏమిటి మాట్లాడాలో తెలీక "సరేలే, సాయంత్రం బజారుకువెళ్ళి కుట్టించుకుందాం. ఏడవకు మరి" అన్నాడు రాధ చెయ్యి పట్టుకుని. "మహా కుట్టించారు లెండి! మీ చొక్కా కోటూ సంగతేదో మీరు చూసుకుందురూ చాలు! దాని సంగతీ, నాసంగతీ నే చూసుకుంటాను. లే, అమ్మా లే, ఏడవకు రేపు మామయ్యకు కబురుపెట్టి నాలుగు పరికిణీలు కుట్టిస్తాలే" అంటూ కూతుర్ని చేరదీసింది సావిత్రి.

"నా చొక్కా కోటూ విషయంతప్ప తక్కిన సంసారమంతా నీ తమ్ముడే భరిస్తున్నట్టు మాటాడతావేమిటి?"

"భరించినా వాడు భరించగలడు. వాడికేం మహరాజు, నాలుగొందలు జీతం" అంది సావిత్రి.

వాళ్ల తమ్ముడికి కలకత్తాలో ఏదో కంపెనీలో వుద్యోగం. రెండువందలిస్తారు. సావిత్రి తన దగ్గిరకూడా నాలుగువందలని కోతలు కోస్తుంది. ఏదో, భోజరాజు మొహం చూస్తే కవిత్వం పుట్టేదిట, తన మొహం చూస్తే కోతలు పుడతాయి కాబోలు! రామ! రామ! ఏమన్యాయం! అనుకున్నాడు గోపాలం.

"నేను రేపు మా అక్కయ్యగారింటికి వెళ్లి ఒక నెలరోజులుండి వస్తాను." అంటూ కూతురి రెక్కపట్టుకుని వంటింట్లోకి వెళ్లింది సావిత్రి. గోపాలానికి ఏమిటి మాట్లాడాలో తెలీక రెండు నిముషాలు ఆలోచించేడు. ఏం మాట్లాడితే ఏం ప్రమాదమోనని భయం.

సావిత్రి వంటింట్లోంచి తనకి వినబడేలాగ, "నిజంగా వాళ్ళ సంసారంచూస్తే ముచ్చటేస్తుంది. మా బావ హాయిగా నెలకు నాలుగైదువందలు తెచ్చి యింట్లో పోస్తాడు. మనకంటె ఎవరేనా నయమే యీ లోకంలో" అంది.

గోపాలానికి భార్యమీద కోపమొచ్చింది. "అయితే నువ్వుకూడా మీ బావదగ్గరకే వెళ్ళివుండవలేకపోయావ్." అందా మనుకున్నాడు. కాని అంతమాట అనలేదు. సావిత్రి ప్రతిరోజూ ఏదో విధంగా తన అసమర్థతను జ్ఞాపకం చేస్తూవుంటుంది.

సావిత్రిపుట్టింటివారు ఒకప్పుడు భాగ్యవంతులు. ఆవిడ తండ్రి ప్లీడరీ చేసి బాగా డబ్బు ఆర్జించి మరీ చచ్చిపోయాడు. కాని ఆ ఆస్తి చాలవరకు పోయింది. అయినప్పటికీ తన తండ్రి ప్లీడరీ చేశాడనీ, తన అన్నదమ్ములు, బంధువులు మంచి వుద్యోగాలు చేస్తున్నారనీ ఆవిడ గర్వం. తన భర్త తన కుటుంబహోదాకు తగినవాడు కాడని ఆవిడ అభిప్రాయం కాబోలు.

పెళ్లయిన మొదటిరోజుల్లో భర్తంటే సావిత్రికి మంచి గౌరవముండేది. చదువుకున్నవాడనీ, పెద్ద వుద్యోగం చెయ్యగలడనీ కలలుకంది. కాని రానురాను ఆతనిలో నమ్మకం పోయింది. అతను బి. ఏ. పాసయాడన్న విషయం మరచిపోయింది "అవును మరి, డబ్బు సంపాదించలేని తరువాత ఎందుకొచ్చిన చదువు, దిక్కుమాలిన చదువు" అన్నాడు గోపాలం. తను వొట్టి అప్రయోజకుడు. తన ప్రయోజకత్వమంతా పిల్లల్ని కనడం తప్ప యింకేముంది? గోపాలానికి తనమీద తనకే జాలేసింది.

గోపాలం వీధిలో అరుగుమీద కూర్చుని తీవ్రంగా ఆలోచించేడు. తన స్థితి కళ్ళకు కట్టినట్టుంది. లోకంలో డబ్బు ఆర్జించలేనివాడు వొట్టి అప్రయోజకుడు; చెల్లనిరూపాయి. అయితే తనకీ సంగతి తెలియకకాదు. తను బి. ఏ. పాసయిన తరువాత పెద్దవుద్యోగం చెయ్యాలనీ దర్జాగా, హాయిగా బతకాలనీ ఎన్నో కలలు కన్నాడు. అయితే ఆ పెద్ద వుద్యోగం సంపాదించడ మెలాగో, డబ్బు ఆర్జించడ మెలాగో తెలియలేదు. తనకంటె తక్కువ చదువుకున్నవాళ్లు పెద్ద వుద్యోగాలు, ప్రమోషన్లు, ఎలా సంపాదిస్తున్నారు? డబ్బు ఎలా గడిస్తున్నారు? వాళ్లకి సిఫారుసులుండి వుంటాయి; లంచాలు కట్టివుంటారు; అధికారుల యిళ్ళకు వెళ్లి సేవచేస్తారు; హాయిగా లంచాలు పుచ్చుకుంటారు. తానెందుకు చెయ్యకూడదు? ఛీ! ఇవన్నీ వెధవపనులు! అయితే ఏం? వాళ్లీ వెధవపనులుచేసి బాగుపడ్డారు. తను మడిగట్టుకు కూర్చుని ఏమిటి సాధించేడు? పెళ్లాం చేత చివాట్లు తప్ప!

తనతోబాటు చదువుకున్న విశ్వనాథం తాశిల్దారైనాడు. రంగనాథం వ్యాపారంచేసి కారు కొన్నాడు. తన తోడల్లుడు రామారావు గుమాస్తా పనిచేస్తూ అప్పుడే ఇల్లు కట్టించేడు. భూములు కొన్నాడు. పబ్లిక్‌గా లంచాలు పుచ్చుకుంటాడు. కాని ఆశ్చర్యం! వాడికి ప్రజల్లో ఎంత గౌరవం! వీళ్లంతా డబ్బు ఎలా సంపాదిస్తున్నారు? ఈ చివరంజ రహస్య మేమిటో తను కూడా తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు గోపాలం.

డబ్బు సంపాదించడానికిగల మార్గా లేమిటని ఆలోచించేడు. ముందు అధికారిమంచి సంపాదించాలి. వారింటికెళ్ళి సేవచెయ్యాలి. లంచమివ్వాలి. లంచమివ్వడానికి తనదగ్గర డబ్బులేదు. అసలు రూలుప్రకారం తను యితరుల దగ్గర డబ్బు లంచాలు పుచ్చుకొని అందులో కొంతభాగం మీద వాళ్ళ కివ్వాలి. తను ప్రస్తుతం పనిచేస్తున్న సీట్లో లంచాలు తీసుకోడానకి చాల అవకాశా లున్నాయి. పన్నెండేళ్లు అనుభవమున్న గ్రేడ్యుయేటు కదా అని దొరగారు తనకి మంచిసీటే యిచ్చేరు. ఇన్నాళ్ళూ ఇటువంటి అవకాశాన్ని సద్వినియోగం చేసుకోలేకపోయినందుకు విచారించారించేడు గోపాలం. కాబట్టి ఒక వేపు అధికారిని మంచిచేసుకుంటూ, యింకో వేపు లంచాలు పుచ్చుకుంటూ, అందులో కొంతభాగం అధికారికిస్తూ ప్రమోషన్ సంపాదించి, అప్పుడు యింకా ఎక్కువ లంచాలు సంపాదించి అలా మెల్లిగా అంతా నిర్మించుకురావాలి! భేష్! ప్లాను మహ చక్కగా కుదిరింది అనుకున్నాడు గోపాలం. గౌతమబుద్ధుడికి జ్ఞానోదయం కలిగినట్లు గోపాలానికి యీ మహోపథకం స్ఫురించింది. ఉత్సాహంతో కుర్చీ దిగి అరుగుమీంచి రోడ్డుమీదకి ఒక దూకు దూకి వీధిలోంచి నడిచి వెళ్ళేడు.

ఇప్పుడు కోర్టుకు సెలవలు కాబట్టి మునసబుగారు ఇంటిదగ్గరే వుంటారు. మునసబుగారు చాల మంచివారు. ఇన్నాళ్ళూ ఆయనతో వ్యక్తిగతంగా సంబంధం పెట్టుకోకపోవడం పెద్ద పొరపాటు. మంచికైనా చెడ్డకైనా ఆయన దన్నుండాలి. అయితే యిన్నాళ్ళకి మొదటిసారిగా వారింటికి వెళుతున్నప్పుడు వొట్టి చేతులతో వెళ్ళకూడదు. ఒక డజను మామిడిపళ్లు కొని పట్టుకెళితే బావుంటుంది. బహుశా తను వెళ్ళేసరికి ఆయన స్నానం చేస్తూనో, భోజనం చేస్తూనో వుంటారు. అప్పుడీపళ్లు మునసబుగారి కుమార్తె రమణమ్మ చేతికే ఇచ్చివచ్చును. రమణమ్మ చాల అందమైంది. ఇంటరు చదువుతోంది. ముందు ముందు తను రమణమ్మతో చనువుగా మాట్లాడాలి. వాళ్లింట్లోవాడిలాగే చనువుగా తిరగాలి. వాళ్ళకి చిన్నచిన్న పనులు చేసిపెట్టాలి. ఇవన్నీ తను కట్టబోయే సౌధానికి సోపానాలు. కొంపతీసి చనువుకొద్దీ రమణమ్మ తన్ను ప్రేమిస్తే! వివాహం చేసుకోమంటే! ఒక భార్య వుండగా మళ్ళీ ఎలా చేసుకో

గలడు? తన భార్య చనిపోతే బాగుండు ననిపించింది గోపాలానికి. ఛీ! భార్య చావు కోరడ మేమిటి? అందులోనూ సావిత్రిని సుఖపెట్టడానికే కదా యీ అవస్థ అంతాను. ఇంతకీ రవణమ్మ కర్మంకాలి తన్నెందుకు వరిస్తుంది? అసలా సమస్య రానేరాదు. ఇంతకీ ఏది ఎలా జరుగుతుందో ఎవరు చెప్పగలరు? ఆలోచనలతో గోపాలం బుర్ర కాకెక్కిపోయింది.

ప్రక్కనేవున్న మంగలిషాపులోకి వెళ్లి గెడ్డాం గీయించుకుని, మొహం కడుక్కుని తల దువ్వుకుని, అద్దంలో చూసుకున్నాడు గోపాలం. తలమీద ఒకటి రెండు వెంట్రుకలు నెరిసేయి. కాని యవ్వనం సడలిపోలేదు.

పళ్ల దుకాణందగ్గర ఒక డజను మామిడిపళ్లు కొని సరాసరి మునసబుగారింటికి వెళ్లేడు గోపాలం. వీధి గుమ్మంలో నిలుచున్నాడు. లోపలినుండి రవణమ్మ వచ్చి "ఎవరు?" అంది.

"మునసబుగారు లేరాఅండి?"

"పూజలో వున్నారు అలా కూర్చోండి" అని వెళ్ళిపోయింది. రవణమ్మకు యీ పళ్లు ఎలా యివ్వడమో గోపాలానికి బోధపడలేదు. మళ్ళీ పిలిస్తే బాగుండదు! అస లేమని పిలవాలి?

ఇంతలో లోపలినుండి బంట్రోతు వీరయ్య వచ్చాడు. గోపాలానికి చక్కటి ఆలోచన తట్టింది. "చూడు వీరయ్యా: యీ మామిడిపళ్లు తీసికెళ్ళి ఇంట్లో అమ్మగారి కిచ్చేసిరా" అని సంచీ అందించేడు వీరయ్యకి. తన చిక్కుసమస్య ఒక త్రుటిలో పరిష్కారమైంది.

మరో అయిదు నిముషాలకి రవణమ్మ వీధిలోకి వచ్చింది. రవణమ్మ నిజంగా చాల అందమైంది. రొమ్ములమీద బరువుగా, నల్లగా తాచుపాములా జారుతున్న జడకు రిబ్బను ముడివేసుకుంటోంది. తల వొంచుకున్నప్పుడు తెల్లటి మెడమీద నీలిరక్తనాళాలు అందంగా కనిపిస్తున్నాయి. గోపాలం గాభరాగా లేచి నిలుచున్నాడు. మామిడిపళ్ళు యీమె చేతికందించే భాగ్యం తనకు దక్కనందుకు విచారించేడు.

అతని గాభరా రవణమ్మ కనిపెట్టింది. "కూచోండి. నాన్నగారిపూజ అయింది. వస్తారు గోపాలంగారంటే మీరేనా?" అంది నవ్వుతూ.

"అవునండి."

"మామిడిపళ్లు చాల బాగున్నాయి. ఎక్కడివి? కొన్నారా?"

ఏమని జవాబివ్వాలో గోపాలానికి తోచలేదు. ఇటువంటి ప్రశ్న వస్తుందనిగాని, వస్తే ఎలా జవాబివ్వాలనిగాని ఇంతకు ముందు ఆలోచించుకొని రాలేదు. కొన్నానని చెప్తే లంచమిస్తున్నాడనుకుంటుంది. లేకపోతే ఎలా వచ్చాయంటుంది. ఏమిటి దారి? హఠాత్తుగా ఒక ఆలోచన తట్టింది.

"అబ్బే లేదండీ, మా తోటలో కాసినవి. ఈ రకం సువర్ణరేఖలు అసలు బజారులో కనబడవండీ!" అన్నాడు. తన సమయస్ఫూర్తికి సంతోషించేడు.

అంతలో మునసబుగారు లోపలినుండి వచ్చారు. గోపాలం లేచి నిలబడి వినయంగా నమస్కారం చేశాడు. మునసబుగారు చొక్కా తొడుక్కుంటూ, "ఏమిటోయ్—గోపాలం, ఏమిటి విశేషం?" అని ప్రశ్నించేరు.

"అబ్బే. ఏమీ లేదండీ, ఓసారి మీ దర్శనం చేసుకు వెళదామని వచ్చాను" అన్నాడు గోపాలం.

"నాన్నా, గోపాలంగారు వాళ్ల తోటలో కాసిన మామిడిపళ్లు తెచ్చిఇచ్చేరు. చాల బావున్నాయి" అంది రవణమ్మ.

"అలాగటోయ్, చెప్పేవు కావు. ఏమాత్రం తోటుంది! పెద్దదేనా?"

"అబ్బే లేదండీ, ఏదో మా నాన్నగారు వేయించారు" అన్నాడు తడబడుతూ గోపాలం. తోట పరిమాణం ఎలా చెప్పాలో తెలియలేదు.

"ఏదో బాగానే వుంది. తోటా దొడ్డీ యీ రోజుల్లో సంపాదించడమంటే బహుకష్టం" అన్నారు మునసబుగారు.

గోపాలం ఉక్కిరిబిక్కిరైనాడు. అసలు వ్యవహారం ఇలా తిరుగుతుందని అనుకోలేదు. మునసబుగారితో తను డబ్బున్నవాడని చెప్పుకోవాలో, ఎలా చెప్పుకుంటే తన భావికార్యక్రమానికి మంచిదో ముందుగా ఆలోచించుకుని రాలేదు. ఏదైనప్పటికీ ఆయనముందు తనీవిధంగా అబద్ధమాడడం తన కిష్టంలేదు. అసలు వ్యవహారమంతా గందరగోళమైంది. ఛీ! దీనంతటికీ రవణమ్మే కారణం. తన పాలిట బాగా దాపరించింది, శనిలాగ! అనుకుని మునసబుగారి దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు గోపాలం.

* * *

మన్నాటినుంచీ గోపాలం లంచాలు పుచ్చుకోవడం ప్రారంభించేడు. మొదట్లో కష్టంగా వున్నా తరవాత క్రమంగా అలవాటైంది. మనుషుల తరహాలనుబట్టీ కేసులనుబట్టీ ఎలా మాట్లాడాలో, లౌక్యం, నటన, కపటం, మోసం అన్నీ చక్కగా అలవర్చుకున్నాడు. కాని ఇవన్నీ అతనికి సమంగా వొంట

బట్టలేను. లౌక్యం లౌక్యంగానూ, నటన నటనగానూ బయట పడేవి.

ఇప్పుడు గోపాలానికి స్నేహితులు ఎక్కువయారు. వారంతా గోపాలాన్ని స్తుతించడం ప్రారంభించేరు. ఊళ్లో ఎవరింట్లో ఏ శుభకార్యం జరిగినా అతనికి ఆహ్వానం మొచ్చేది. గోపాలం ఘనత బంధుకోటిలోకూడా వ్యాపించింది. బావమరుదులు, తోడల్లుళ్ళూ తరుచు వస్తూ పోతున్నారు.

ఊళ్ళో ఎప్పుడేనా గోపాలం విషయమొస్తే "గోపాలం దేనికైనా సమర్థుడు. అంచేతే భగవంతుడు అతనికి ఐశ్వర్యం, ధర్మచింత, ఉత్తమ గుణాలు అన్నీ ప్రసాదించేడు" అనేవారు పెద్దలు. సంఘంలో తన హోదా, తన ప్రయోజకత్వం ఎంతలో పెరిగిందో సుళువుగా గ్రహించేడు గోపాలం. కాని అతని కిదేం నచ్చలేదు. ఇప్పుడు బంధువులు, స్నేహితులూ మాటాడేమాటల్లో పెద్ద మార్పు కనిపించింది. "ఫలానాభూమి చవగ్గా అమ్మేస్తున్నారు కొంటారా" అని ప్రశ్నిస్తాడు ఒకడు. "ఈ అద్దెఇంట్లో ఎన్నాళ్ళీపాట్లు, ఒక చిన్న కొంప నిలేసుకుంటే మంచిద"ని యింకొకరు సలహా యిస్తారు. "మా సంఘానికి విరాళ మివ్వండి" అని యింకొకరు అర్థిస్తారు. "మీకేమండీ, అదృష్టవంతులు. బి. ఏ. పాసయేరు. చదువుకున్న చదువు వొట్టినే పోతుందా, అంచేతే యీనాడు నాలుగు రాళ్లు సంపాదిస్తున్నారు" అని ఒకరిద్దరు తనముందే అన్నారు. అప్పుడు గోపాలానికి చాల చిరాకేసేది. "బోలెడు డబ్బుపోసి, శ్రమపడి బి. ఏ. చదవడం చాల పొరపాటుచేశాను. నా బి. ఏ. వల్ల నాలుగు రాళ్లు సంపాదించడం లేదు. నా సంపాదనవల్ల నాకూ, నా బి. ఏ కీ గౌరవమొచ్చింది" అని జవాబు చెబుదామనుకున్నాడు. లంచాలు పుచ్చుకునేవాడికి విలువలు ఆపాదించే యీ అనాగరికులను చూసి గోపాలం అసహ్యించుకునేవాడు. కాని ఏమీ మాట్లాడకుండా వచ్చేసేవాడు.

ఇప్పుడు సావిత్రిలో కూడా గొప్పమార్పు గమనించేడు గోపాలం. సావిత్రిలో యిప్పుడు చిరాకు, కోపం మాయమయినాయి. పిల్లల్ని కొట్టదు. తను రోజూ చక్కగా అలంకరించుకుని, పిల్లలని మంచి సంరక్షణ చేస్తుంది. తనతో నెమ్మదిగా భయభక్తులతో, ప్రేమతో మాట్లాడుతుంది. ప్రతి విషయం లోనూ తన సలహా తీసుకుంటుంది. తన అనుమతి లేనిదే ఏ పనీ చెయ్యదు. ఇంతకుముందులా అక్కయ్య దగ్గరికి, అన్నగారి దగ్గరికీ వెళిపోతానని బెదిరించదు. తన అనుమతి కోరుతుంది. తను మాటాడితే ఎదురుచెప్పదు. తనపట్ల ఆమెకున్న అనరాగం విషయంలో తన కెప్పుడూ, ఎటువంటి సంశయమూ లేదు. కాని ఆమె కూడా అందరి భార్యల్లాంటిదే. పాపం, అమాయకురాలు అనుకున్నాడు గోపాలం.

సావిత్రి తన్ను సంతోషపెట్టడానికి ప్రయత్నిస్తూంది. ఆమె మళ్లీ తనవీణ బయటికి తీసింది. సావిత్రికి సంగీతం బాగా వచ్చును. వీణ వాయించగలదు. పాడ గలదు. శ్రావ్యమైన కంఠం. పెళ్లయిన తొలిరోజుల్లో భార్య పాట విని పరవశం చెందేవాడు తను. ఆనాడు సావిత్రి పాట అవ్యక్త మధుర భావాల్లా, పూచిన సంపెంగ పువ్వు వాసనలా తరంగాలుగా వచ్చి తన హృదయాన్ని తాకేది. ఆ రోజులు స్వప్నంలా గడిచేయి. ఆనాటి కీనాడు మళ్లీ పాట వింటున్నాడు.

కాని యీ పాట విన్నప్పుడు గోపాలానికి ఆనాటి అనుభూతి కలగడం లేదు. మీదు మిక్కిలి అతని మనసు ఎంతో బాధపడేది. ఇదంతా చాలా కృత్రిమంగా కనిపించేది.

ఒకనాడు సాయంత్రం కచేరీనుంచి వచ్చేసరికి సావిత్రి తల దువ్వుకుని, సిగలో గులాబీలు ముడుచుకుని అతని రాకకు ఎదురుచూస్తూంది. గోపాలం కాఫీ తాగి గదిలో కుర్చీమీద కూర్చుని దినపత్రిక చూస్తున్నాడు. సావిత్రి తమలపాకులకు సున్నం రాసి అందించింది.

"ఏమండీ, మా అమ్మ వుత్తరం వ్రాసింది" అంది మెల్లిగా.

"ఊహూ..."

"వచ్చేవారం మా చెల్లెలి పెళ్లట"

"మంచిదే"

"మనల్ని పిలవడానికి మా తమ్ముడు వస్తాడట. మీరొక వారం పదిరోజులు సెలవు పెడితే..."

"అబ్బే, లాభం లేదు. ఇప్పుడు కచేరీలో పని ఎక్కువగా వుంది. సెలవ దొరకదు. నువ్వెళ్లు నేను రాను."

"బావుందండీ, మీరు రాకుండా నేను వెళ్లను సుమండీ."

గోపాలానికి చిరాకేసింది. ఇంతకు ముందు తనొక్కర్తే వాళ్ళవాళ్ళింటికి ఎన్నిసార్లు వెళ్ళలేదు? ఇప్పుడు ప్రయోజకుడైన భర్తతోవెళ్లి నలుగురిచేత మర్యాదలు పొందుదామని ఆశపడుతూంది అనుకున్నాడు గోపాలం.

ఆవేళ అసలు గోపాలంమనసు బాగులేదు. ఒకప్పుడు తనొక బీదస్త్రీదగ్గర లంచం తీసుకున్నాడు. అప్పటికే ఆమె ఇదరు పిల్లలతల్లి. భర్త చనిపోయాడు. ఆమెకు తానెట్టి సహాయం చెయ్య

లేనని తెలిసి కూడా లంచం తీసుకున్నాడు. ఆమె మీద దావా వేసిన మార్వాడీవాడు కేసుగెలుచుకుని ఆమె సామానులు జప్తుచేసుకున్నాడు. ఆ స్త్రీ ఇవాళ తనకి రోడ్డుమీద బిచ్చమెత్తుకుంటూ కనబడింది. తన మనసు ఎందుకో చాల బాధపడింది. తను చేస్తున్న పని చాల హేయమయింది. తన్ను క్షమించమని ఆమెను తన మనసులోనే కోరేడు. ఇవాళతో ఏమైనాసరే ఒక దమ్మిడీ లంచం తీసుకోకూడదని నిశ్చయించుకున్నాడు. ఈ కృత్రిమసౌఖ్యమే తనకెంతో బాధ కలిగిస్తూంది.

"మీరు రాకపోతే నేను వెళ్ళను" అంది సావిత్రి.

"అయితే ఏడువు. నేనుమాత్రం చస్తే రాను." గోపాలానికి చాల కోప మొచ్చింది. "నావుద్యోగం పోతే మీవాళ్లు నాకేమేనా వుద్యోగమిస్తారా? వాళ్ళ కసలు కనికారమేనా కలగదు. వీడొట్టి చవట వెధవని వెక్కిరించి సంతోషపడతారు" అన్నాడు చిరాకుగా. సావిత్రి మాటాడలేదు. గోపాలానికి వెంటనే విచారమేసింది. తను అర్థంలేకుండా కోపం తెచ్చుకున్నాడు.

సావిత్రి మాటాడకుండా, బుర్ర వొంచుకుని, చీరకొంగుతో కళ్ళనీళ్లు తుడుచుకుంది. ప్రయోజకుడైన భర్తముందు భార్య అంతకన్న చెయ్యగలిగినదేముంది? ఏం, తన కోపం అర్థంలేనిదని చెప్పకూడదూ? అసలు పెళ్లామనేది మొగుడికింతలా లోకువయిపోవడం గోపాలానికి నచ్చలేదు.

కాని సావిత్రి కళ్ళనీళ్లు చూసేసరికి అతని మనసు కరిగింది. "ఎంత అమాయకురాలివే. ప్రతి చిన్నవిషయానికీ యిలా అయితే ఎలా చెప్పు? నాకు సెలవు దొరకదు. నువ్వు మీ తమ్ముడితో వెళ్లు. సెలవు దొరికితే నేనూ వస్తాను" అని మెల్లిగా నచ్చచెప్పేడు.

సావిత్రికి ధైర్యమొచ్చింది. పెళ్ళిలో చదివించడానికి చీర, పంచల చాపు కొనాలంది.

"సరే, నువ్వు బజారుకెళ్లి కొనుక్కురా, నాకు తీరికలేదు" అన్నాడు గోపాలం.

"మీరొచ్చి మంచివి ఎంచండి"

"నాకు చీరల గొడవ ఏమీ తెలీదు"

"బావుందండీ, తెలియకపోవడమేమిటి?" అంది సావిత్రి.

గోపాలానికి ఆశ్చర్యమేసింది. ఈ లోకంలో డబ్బు సంపాదించగలిగినవాడు సర్వజ్ఞుడని, వాడికి తెలియని విషయమంటూ వుండదని కాబోలు ఆమె వుద్దేశం. అయినా, ఆమె వెళ్లి కొనుక్కోకూడదూ? భార్య భర్తమీద యింతగా ఆధారపడడంలో అర్థం లేదనిపించింది గోపాలానికి.

చీర విషయమై గోపాలం పాతిక రూపాయలు మంజూరు చేశాడు. సావిత్రి అతి అయిష్టంగా వొప్పుకుంది. ప్రస్తుతానికి ఆమె, పిల్లలూ వెళ్ళడానికి నిర్ణయమైంది. కాని ఎలాగైనా సెలవుకోసం ప్రయత్నించమని సావిత్రి మరీ మరీ చెప్పింది.

గోపాలం ఆలోచనలో పడ్డాడు. లంచగొండితనం తనకు ప్రసాదించిన హోదా, ప్రయోజకత్వాలను చూస్తే తనకే అసహ్యమేస్తూంది. జ్ఞానం మానవత్వం అనేవి డబ్బుకంటె విలువైనవనీ, అవే జీవితానికి ఆనందాన్నీ, పూర్ణత్వాన్నీ చేకూర్చగలవనీ తన మనసు హెచ్చరిస్తూంది. సంఘం కొలిచే కొలబద్దలతో తన ప్రయోజకత్వాన్ని కొలవడం తన విద్యకీ, విజ్ఞానానికీ ఎంతో అవమానకరంగా స్ఫురించింది. తనకీ గౌరవం అక్కరలేదు. తనలో వచ్చిన బ్రహ్మాండమైన మార్పును గమనించి ఆశ్చర్యపోయాడు గోపాలం. ఇక మీదట ఒక దమ్మిడీకూడా లంచం పుచ్చుకోకూడదని నిశ్చయించుకున్నాడు.

రెండురోజులు గడిచేయి. ఈ రెండు రోజుల్లోనూ గోపాలం ఒక కానీ లంచం పుచ్చుకోలేదు. ఈ సంగతి అప్పుడే కచేరిఅంతా వ్యాపించింది. అందరూ తలోకరీతి వ్యాఖ్యానించేరు. మూడోనాడు గోపాలం ఆఫీసుకు వెళ్లేక, మునసబుగారు పిలిస్తే ఆయనగదిలోకి వెళ్లేడు.

మునసబుగారు ఏదో వ్రాసుకుంటూ తలెత్తి కూర్చొమన్నట్లు సంజ్ఞచేశారు. కాని గోపాలం కూర్చొలేదు.

"రామకోటయ్యకు చార్జి అప్పగించు, నీమీద పై నుండి పెద్ద చార్జిషీటువచ్చింది. కచేరీకాగితాల్లో నువ్వు చెయ్యరాని తప్పులు చేశావు. కొన్ని కాగితాలమీద తేదీలుకూడా మార్చబడివున్నాయి. నీ మీద ఎంక్వయిరీ జరిగి కేసు ఏదో తేలేవరకూ నిన్ను ప్రస్తుతం సస్పెండు చెయ్యవలసి వచ్చింది." అన్నారు మునసబుగారు గుక్క తిప్పుకోకుండా.

గోపాలం నిలువునా కృంగిపోయాడు. ఏం చెయ్యాలో తెలియక అలాగే నిలుచున్నాడు. మునసబుగారు మళ్లీ తలెత్తి, "నీ సంగతి నాకు బాగా అర్థమయింది. సరే ముందు ఆచార్జిషీటుకు సంజాయిషీ వ్రాసి దాఖలు చెయ్యి, తరవాత ఆలోచిద్దాం" అన్నారు. మునసబుగారు నిజంగా సహృదయులు.

గోపాలం మాట్లాడకుండా వచ్చి రామకోటయ్యకు చార్జి అప్పగించేడు. పాపం పిల్లలవాడు అని తక్కిన గుమాస్తాలు సానుభూతి చూపించేరు.

హెడ్డు సుమాస్తామాత్రం జెకిలినవ్వు నవ్వేడు. "లంచాలు పుచ్చుకోగానే సరా? అబ్బే, దాని కెంత సమర్థత కావాలి!" అన్నాడు అనుభవజ్ఞుడైన హెడ్డు సుమాస్తా. లంచాలు పుచ్చుకోవటంవల్ల వుద్యోగం పోవటంలో వున్న చిన్నతనం కంటె, లంచాలు పుచ్చుకోవటంలో అసమర్థుడు కావటంలో ఎక్కువ చిన్నతనముందని కాబోలు అతని అభిప్రాయం. గోపాలానికి హెడ్డుసుమాస్తాను చూస్తే వొళ్లుమండింది. కాని మాట్లాడకుండా చార్జిషీటు పుచ్చుకుని యింటికి వచ్చేశాడు.

సరాసరి గదిలోకి వెళ్లి మంచంమీద పడుకున్నాడు. సావిత్రి తన చెల్లెలు పెళ్లికి వెళ్లడానికి సన్నాహమై వచ్చింది.

"ఏమండీ సెలవు దొరకలేదా?" అన్నాది మెల్లిగా. గోపాలం మంచంమీద లేచి కూర్చున్నాడు. "సావిత్రీ, ఇవాళ నా వుద్యోగం పోయింది. మళ్ళీ ఏదేనా దొరికేవరకూ అంతా సెలవే. పద నేను కూడా వస్తాను మీవాళ్లింటికి." అన్నాడు.

సావిత్రి మొదట్లో నమ్మలేకపోయింది. కాని గోపాలం మళ్లీ చెప్పేడు. ఆమెకు నోట మాట రాలేదు. ఎవరో తలమీద కర్రతో కొట్టినట్లనిపించింది. జబ్బులేక బాధపడిన కష్టదినాలు మళ్లీ జ్ఞాపకమొచ్చేయి. భగవంతుడు తనకీ, తన పిల్లలకీ యీ శిక్ష ఎందుకు విధిస్తున్నాడో ఆమెకు అర్థం కాలేదు. తలగడలో మొహంపెట్టి చేతులతో కప్పుకుంది. "లే, విచారించకు. ఒక వుద్యోగం పోతే మరొకటి దొరుకుతుంది. పద సామాను కట్టు, నేనూ వస్తాను వెళదాం" అన్నాడు గోపాలం.

"నేను వెళ్లను, నాకొద్దు" అని వెక్కి వెక్కి ఏడిచింది సావిత్రి. ఆమె ఎందుకు వెళ్లనంటూందో గోపాలానికి అర్థమయింది. సావిత్రిమీద అతనికి జాలి కలిగింది.

---

# పక్షిరాజు!



శ్రీ కందుకూరి రామభద్రరావు

సంజ చెంగావి చెంగులు జాఱనడవ
మిసిమి బంగరు టంచులు మెఱసిపోవు
పశ్చిమాకాశ మండలి నిశ్చలముగ
వలయములు చుట్టి యెగసెదు పక్షిరాజ!

లాత్రి యండజ పంక్తి కులాయములకు
జట్టుపల నార్చి పాటెడు సందడులకు
విముఖత వహించి, వెలుగు విన్వీథినుండి
కాంచుచుంటివె సంధ్యావికాసప్రకృతి?

ఎన్ని యేళ్ల పొంగులిముడ్చుకొన్న చాన,
వృద్ధగాత్రమి! సాయం ప్రవృద్ధరాగ
సంపదలస్నాతవై, నిర్చిప్రశాంతసరణి
దర్శనమ్మునఁనొసగు చైతన్యమేదొ!

సంజకెంజాయ చాలు అపరంజినించు
తటమహోద్యాన నిత్యసౌందర్యలక్ష్మి
మధురహాసోపశోభిత మానభావ
సేదదేర్చును కలగిన జీవనముల

కవివె నీవును? ఆకాశ గమనమబ్బె
పుట్టుతోడనె! రసపరిపుష్టప్రకృతి
దన్మయత జెంది యేవొ గీతములు నించి
పాడుకొందువు లోలోన నీడజంబ!

కలచు జీవితక్లిష్టసంఘటన స్మృతికి
మఱపు తలుపుబిగించి నెమ్మదిని, సుంత
కూరుచుంటి నొంటిగ నదీకూలమంటు
హరిత తృణదళ రంజితాస్తరణభూమి.

ఈమనోహర ప్రకృతిలో నెగయు నిన్ను
గన్న సాజాత్యసంబంధకలన యేదొ
వలసలో నాస్తదర్శనభాగ్యమటుల
నామొడంద నలర్చి యానందమొసగు.

ఓయి ఖగరాజ! రాగదే యుల్లసమున
అనుదినంబును నిట్లుసాయాహ్ననమయ
సుందరాకాశపథమున, డెందమలర
బాడుకొందము ప్రకృతిసంపదలు నించి.

# కలగూరగంప

## అధునాతన భారతీయ చిత్రకళ

మాటిస్సీ, పికాసోల ప్రభావం బాగా వెలుస్తున్న ఈ రోజుల్లో ప్రత్యేకంగా ఇది భారతీయ చిత్రకళ అని గాని, లేక ఇది ఆంగ్ల చిత్రకళ అని గాని, లేక ఇది వేరే ఒక దేశం చిత్రకళ అని గాని ప్రత్యేకంగా వేరుపరిచి మాట్లాడ్డానికి వీలున్నదా అని ఒక సందేహం కలగవచ్చును. దీనికి కొంతవరకు అవుననీ కాదనీ కూడా సమాధానం చెప్పవచ్చును. శైలినిబట్టి చూస్తే ఈనాడు ప్రాక్పశ్చిమ దేశాలన్నీ ఒకే పంథాలో నడిచిపోతున్నవి. కాని ఆయా దేశాలు తమతమ సాంప్రదాయిక సౌందర్య దృక్పథంలో ప్రత్యేకంగా విభిన్నమైన వ్యక్తిత్వం నిలబెట్టుకుంటూ ప్రపంచకళా సంపత్తి బాగా అభివృద్ధి పరుస్తున్నవి. మాటిస్సీ ధోరణిలో శైలేష్ ముఖర్జీ చిత్రించిన చిత్రంలో భారతీయత సుస్పష్టంగా ప్రతిఫలించింది.

నేటి కాలపు భారతీయ చిత్రకళలో ముఖ్యంగా మూడు విధాలైన ప్రభావాలు (*Influences*) కనిపిస్తున్నాయి. వీనిలో మొదటిది వంగ సంప్రదాయము, రెండవది నేటి కాలపు ఫ్రెంచి చిత్రకళా సంప్రదాయము, మూడవది భారత జానపద సంప్రదాయము. వీటిలో వంగసంప్రదాయం తగినంత నూతనోత్సాహం లేక క్రమక్రమంగా శుష్కించిపోతున్నది. రెండవది పోస్ట్ ఇంప్రెషనిజమ్ (*Post Inpressionism*) ధోరణిలో కొంతమంది భారతీయ చిత్రకారులకు నూతనావేశం కలిగిస్తున్నది. ఈ ఆవేశం అమృత షేర్ గిల్, జామినీరాయ్, శీలా ఆడెన్ మొదలయిన వారిలో చూడవచ్చును. నిజానికి అమృతషేర్ గిల్ తోనే సరియయిన భారతీయ కళా పునర్వికాసం ప్రారంభమైనదని చెప్పాలి. ఆ తరవాత జామినీరాయ్ ఈ ఆవేశంలో పడి అత్యుత్తమ చిత్రాలు చిత్రించారు. నేటి కాలంలో శీలా ఆడెన్ అమృతషేర్ గిల్ తరవాత అత్యుత్తమ చిత్రకారిణి అని చెప్పవచ్చును.

### వంగ సంప్రదాయము

నిజానికి వంగ సంప్రదాయం ఒక్క వంగ దేశానికే సంబంధించినదని చెప్పడానికి వీలులేదు. భారతదేశంలో అంతటా ఈ సంప్రదాయ ధోరణిలో చిత్రరచన జరిగింది. ఇంతేకాక ఈ చిత్రకారులందరు, ఫ్రెస్కో, టెంపెరా, తైలవర్ణాది పద్ధతులన్నిటిలోను చిత్రరచన సాగించారు. వంగ సంప్రదాయోద్యమప్రారంభంలో నిజంగా జరిగిన దిది:

ఇ. బి. హావెల్, డాక్టర్ అవనీంద్రనాథుల ప్రోత్సాహంతో కొంతమంది యువక చిత్రకారులు నాటురకపు పాశ్చాత్య సంప్రదాయాలలో విసిగి, ప్రాచీన భారతీయ చిత్రకళాసంప్రదాయం పునరుజ్జీవింపజెయ్యాలని ప్రయత్నించారు. ఈ ప్రయత్నంలో వీరు పాశ్చాత్యకళా సంప్రదాయంలోని పైపై తళుకులను అనుకరించడం మానివేసి, ఉత్తమోత్తములైన ప్రాచీన భారతీయ చిత్రకారుల సంప్రదాయాలు లక్ష్యంగా పెట్టుకొని కొత్తతరహా చిత్రరచన కుపక్రమించారు. ఆనంద కుమారస్వామి ఈ కొత్తపోకడ ప్రిరాఫెలైట్ ఉద్యమంవంటిదని అన్నారు. వంగసంప్రదాయం అంటే అసలు అర్థం ఇదే. ఈ ఉద్యమం ప్రారంభించినవారిలో కొంత మంది ఇంకా తమ చిత్రరచన సాగిస్తూనే ఉన్నారు. ఆధ్యాత్మిక దృక్పథము, చక్కని పనితనము వీరి లక్ష్యాలు. అయితే వీరి తరవాత వచ్చిన వంగ సంప్రదాయచిత్రాలలో ఈ రెండు లోపించిపోయాయి.

మరీ అసమర్థులైనవారందరు వంగసంప్రదాయం అనుకరించడం మొదలుపెట్టేసరికి వీరి చేతుల్లో ఈ ఉద్యమం బాగా దెబ్బతిన్నది. ప్రాచీన చిత్రకారుల పై పైమెరుగులు అనుకరించిన మాత్రాన ప్రాచీన భారతీయ సంప్రదాయపునరుజ్జీవనం సాధించడం కష్టము. ఈ రోజుల్లో వంగసంప్రదాయం అనుకరించేవారందరు చేస్తూన్నపని ఇదే. వీరికి ఈ సంప్రదాయం విషయంలో లోలోపల గట్టినమ్మకం ఉన్నట్టు కనబడదు. అందుచేత ఇటీవల వచ్చే వంగ సంప్రదాయ చిత్రాలలో ప్రాణం ఎగిరిపోయి, వట్టి చచ్చుచిత్రాలు బయలుదేరాయి. అయితే ఈపద్ధతిలో

కొందరు అసాధారణ వ్యక్తులు లేకపోలేదు. వీరిలో బినోద్ బెహారీముఖర్జీ, బి. సి. గుప్త, డి. బద్రి, బి. యస్. జిజ్ఞా. ధీరేంద్రనాథ్, బ్రహ్మ, ప్రథమ గణ్యులు. వీరి చిత్రాలలో ఉత్తమ వంగసంప్రదాయంలోని ఉదాత్తత, సౌకుమార్యము మొదలైన లక్షణాలు కనిపిస్తాయి.

అయితే మొత్తంమీద వంగసంప్రదాయంలో జవసత్త్వాలుడిగిపోయినట్టే కనిపిస్తాయి దీనికి ప్రాచీన సంప్రదాయంలో ఉన్న కేవల ప్రాచీనత్వమే పట్టుకు వేళ్ళాడటం మొదటి కారణం. మహిళాకృతి సర్వత్ర లలితలలితంగానే ఉండేటట్లు చిత్రించటం రెండవది. ఈ సంప్రదాయంలో పురుషాకృతుల్లో కూడా స్త్రీత్వధోరణి కనిపిస్తుంది. కళలో పునరుజ్జీవనం రావాలంటే కేవలం ప్రాచీన సంప్రదాయంలో చిత్రిస్తే ప్రయోజనం లేదు. ప్రాచీన దృక్పథం అవగాహన చేసుకుని నూతన పద్ధతిలో చిత్రించినప్పుడే కళలలో పునరుజ్జీవనం సంభవిస్తుంది.

## ఫ్రెంచి సంప్రదాయం

అమృతషేర్ గిల్ చిత్రకళలో ప్రాచ్య పాశ్చాత్య పద్ధతుల కొక చక్కని సమన్వయం కనబడుతుంది. ఆమె గొప్పదనంఅంతా ఇందులోనే ఉంది. అయితే ఆమె కళామహత్త్వం ఆమె కాలం ఎవరికీ బోధపడలేదు. 1941 లో ఆమె మరణించింది. 1940 లో ఆమె ఇలాగ వ్రాసింది. "బొమ్మలు చూసి ఆదరించేవాళ్లు లేకపోవటంవల్ల బొత్తిగా ఉత్సాహం పోయింది. రోజులు గడచిన కొద్దీ బొత్తిగా నా బొమ్మలకేసి చూసేవాళ్ళే కనబడటం లేదు"

మనం వంగసంప్రదాయంలో పుట్టి పెరిగాము. కాని ఆమెవంగసంప్రదాయం అంటే బొత్తిగా పట్టించుకోలేదు. అందుచేత మన కెవ్వరికీ ఆమె చిత్రాలు బోధపడలేదు. 'అజంతా ధోరణి నావల్ల కాదు' అని ఆమె అంటూ ఉండేది. తన చుట్టూ కనబడే దైనందిన భారతీయ జీవనం చిత్రించటమే ఆమె లక్ష్యం. "ఉలుక్కుండా పలుక్కుండా, ఏదో విచారంతో బక్కచిక్కిపోయి, నీడల్లా కదిలే భారతీయుల చిత్రాలు చిత్రించటమే నా లక్ష్యం" అని ఆమె వ్రాసింది.

ఆమె కొంత జవసత్త్వాలుగల ధోరణిలో చిత్రించాలని అనుకున్నది. అందుచేత సహజంగా ఆమె దృష్టి పోస్ట్ ఇంప్రెషనిజమ్‌వైపు తిరిగింది. ఈ పోస్ట్ ఇంప్రెషనిజమ్, ఆదిమవాసుల కళాప్రభావంలో బయలుదేరిన ఒక నవీన పద్ధతి. ఈ విధంగా పోస్ట్ ఇంప్రెషనిజం సిద్ధాంతాలు భారతజాతీయ సంప్రదాయాల్లో మలచాలని ఆమె ప్రయత్నించింది. ఇంతకుపూర్వం గగనేంద్రనాథ టాగూర్ ఇంప్రెషనిజమ్‌తోను — క్యూబిజంతోను కలిసిన చిత్రాలు చిత్రించాలని ప్రయత్నించాడు. గ్రీక్, రోమన్ సంప్రదాయాలు బైజాంటైన్ చిత్రకారుల చేతుల్లో ఆధ్యాత్మిక స్వరూపం ధరించాయి. అల్లాగే ఫ్లోరెన్సుచిత్రకారులు బైజాంటైను ధోరణిని మళ్ళీ బాగా భూతలంమీదికి తీసుకువచ్చారు. ఇల్లాగే అమృతషేర్ గిల్ పారిస్ ధోరణికి కొంత ఆదర్శవాద (*Romantic*) వేషం వేసింది. ఈమెలో గాంగ్విన్, మాడిగ్లియానీలచ్ఛాయలు కొంతవరకు కనిపించవచ్చునుగాని మొత్తంమీద ఈమెచిత్రాల్లో—కాంగ్రా, బసోలీ చిత్రాల్లోలాగే భారత జాతీయత మూర్తీభవించింది.

శైలేష్ ముఖర్జీ, జార్జికెంట్, కృష్ణకుమార్ హెబ్బర్ కూడా పారిస్ సంప్రదాయం బాగా అవగాహన చేసుకున్నవారే. అయితే వీరిలో వీరు బాగా ప్రత్యేక వ్యక్తిత్వం గల చిత్రకారులు. శైలేష్‌కు సుమారు 43 సంవత్సరా లుంటాయి. ఈయన అప్పుడే భారత ప్రఖ్యాత చిత్రకారులన్న కీర్తి సంపాదించారు. తైలవర్ణాలలో ఈయనకు సాటి రాగలవారు చాలా తక్కువ. తెల్లని ప్రాగ్భాగం మీద ఈయన చిత్రించిన శ్వేతాశ్వ చిత్రం చాలా గొప్పది.

చక్కని సాంప్రదాయిక దృక్పథంలో ఎన్నెన్నో కొత్త దారులు తొక్కిన తరవాతనే శైలేష్ ముఖర్జీకి పరిణతి వచ్చింది. ఇంచుమించుగా ఈ విధంగా 20 ఏళ్లనించి పరిశ్రమ సాగించాడు. ఈ కాలంలో అనేకమైన ప్రాచ్య పాశ్చాత్యచ్ఛాయ లీయనలో కనబడి ఉండవచ్చును. అన్నిటికన్నా మాటిస్సీ పద్ధతు లీయనలో ఎక్కువగా కనిపిస్తాయి. 1930 తరవాత పాశ్చాత్యకళా సంప్రదాయాలు అవగాహన చేసుకోవడానికి యూరపుఅంతా తిరిగాడు. అప్పుడీయన మాటిస్సీని కూడా కలుసుకున్నాడు. కాంగ్రా సంప్రదాయము, జానపదసంప్రదాయము కూడా బాగా అవగాహన చేసుకున్నాడు. ఈ సంప్రదాయాల సానుభూతివల్ల ఈయన కళకు, నిశితత్వము, స్పష్టత, చక్కని మధురభావన అలవడ్డాయి. సరే, కొంతసేపు మన మీ మాటిస్సీ గొడవ, సంప్రదాయంగొడవా అలాగ వదిలి ముఖర్జీబొమ్మలు పరిశీలిద్దాము. సూర్యకాంతిలో మెరసిపోయే ప్రకృతి, పసిపాపలు, జంతువులు మొదలైన వాటితో అచ్చంగా ఈయన చిత్రాలన్నీ భారతీయ చిత్రాల్లాగే కనిపిస్తాయి. తన దేశంమీద, ప్రజలమీద ఈయన కున్నంత ఆప్యాయత పిచ్చి పిచ్చి కళాసిద్ధాంతాలమీద లేనే లేదు.

జార్జి కెంటు ఎక్కువగా పికాసోధోరణిలో చిత్రరచన చేసినట్టు కనబడుతుంది. కాని కెంట్‌లో మార్దవము, స్నిగ్ధత కనిపిస్తాయి. పికాసోబొమ్మలు అంగ వికారంగాను, భీభత్సంగాను కనిపిస్తాయి. కెంట్ పికాసోదగ్గరనించి ఈ క్రిందివిషయాలు నేర్చుకున్నట్టు కనపడుతుంది. (1) ఒక చిత్రకారుడు పరిశోధనలు సాగించేముందు తన శైలిలో మంచి సత్తా సంపాదించుకొని ఉండాలి. (2) సాంప్రదాయికత, సమకాలీనత రెండు ఎప్పటికప్పుడు జాగ్రత్తగా చూచుకుంటూ ఉండాలి. (3) వేసినపద్ధతిలోనే బొమ్మలు వేస్తూ కూర్చోకూడదు. (4) తాను చేసే దానిలో గట్టినమ్మకం కలిగిఉండాలి. (5) నిత్యంతన రచనలలో మగ్నుడై పోవాలి. ఇతని చిత్రాలలో ప్రాచీన నవీన భారతీయ జీవనం అంతా ప్రతిఫలిస్తూంటుంది. గోపికలు, కృష్ణుడు, రాగరాగిణులు, నాయికలు మొదలైన విషయాలన్నీ 18 శతాబ్ది పహారీ రాజస్థానీ చిత్రకారులు చిత్రించినవే. అయినా ఈయన చిత్రాలలో ఇవన్నీ ఒక సరికొత్తస్వరూపంతో అవతరిస్తాయి. దేవతాచిత్రాలలో ఈయన సత్తాబాగా ఎక్కువగా కనిపిస్తుంది. ఈయన శృంగారరస చిత్రణం సహజమైన ధోరణిలో నడిచిపోతుంది. ఇందులో ఈయన సాహసధోరణి చూసి తలలూపనివా రుండరు. కెంట్ సింహళదేశీయుడు. అయినా పికాసో ఫ్రెంచి సంప్రదాయంవైపు మొగ్గినట్లే ఈయన కూడా భారతీయ సంప్రదాయంవైపు ఎక్కువగా మొగ్గుతాడు. చిత్రరచనావిధానంలోను, సర్వాంగ పరిపుష్టత ప్రదర్శించడంలోను చాలా గట్టివాడు. ఈయన పారిస్‌లో చిత్రాలు ప్రదర్శించినప్పుడాదేశ విమర్శకులీయిన చిత్రాలెంతో మెచ్చుకున్నారు. ఈయన ప్రాచీనభారతీయ రచనాసంప్రదాయం బాగా అవగాహన చేసుకున్నవాడని చిత్రకళకు సంబంధించిన ఒక ప్రసిద్ధ పత్రిక వ్రాసింది. ఫ్రెంచి అధునాతన చిత్రప్రదర్శనశాలకోసం ఈయన రచించిన చిత్రం కూడా ఒకటికొన్నారు.

ఈయన ఇంకా అమృతషేర్‌గిల్‌ను అనుసరిస్తున్నాడని అంటారు కాని అది సరికాదు. ఈయన రేఖలలో గిల్‌రేఖలలో లేని సున్నితమైన విలాసం కనిపిస్తుంది. ఏమైనా మొత్తం ఇద్దరు భారత సంప్రదాయము, గాంగ్విక్ సంప్రదాయము బాగా అవగాహన చేసుకున్నవారే.

ఎక్స్‌ప్రెషనిజమ్ సంప్రదాయానికి చెందిన షివోషావ్‌దా చిత్రించిన (*Last Supper*) 'లాస్ట్ సప్పర్' అనే చిత్రం రోమ్‌లో ప్రదర్శించారు. రంగులలోను రచనలోను ఈయన అద్వితీయుడు; తన పరిసరజీవితం హాస్యపూరితమైన ఆర్ద్రతతో చిత్రిస్తాడు.

బాగా చిన్నతరంవారిలో బీరేన్‌దే అత్యద్భుత ప్రతిభాశాలి. రూపచిత్రాలలో ఈయన చాలా సమర్థుడు. ఢిల్లీ విశ్వవిద్యాలయంలో వ్రాసిన చిత్రాలలో శాస్త్రానికీ కళకు చక్కని వినూతనపంథాలో సమన్వయం చూపించాడు.

## జానపద సంప్రదాయము

జామినీరాయ్ వంగ జానపద చిత్రకళాచ్ఛాయలు తన బొమ్మల్లో ప్రవేశపెట్టేసరికి దేశంలో అందరి దృష్టీ ఈ పంథామీద పడింది. జానపదులు తయారుచేసే ఆటబొమ్మలు మొదలైన వాటిలో జనానికి ఒకరకమైన కొత్త అభినివేశం పుట్టుకొచ్చింది.

చాలామందికిమల్లేనే జామినీరాయ్ కూడా వంగ సంప్రదాయము, ఇంకా మిగిలిన ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయాలు మొదలైనవన్నీ అనుసరించాడు. కాని చివరికి చిన్నపిల్లల మనఃప్రవృత్తికి దగ్గిరిగా వచ్చే ధోరణిలో స్థిరపడ్డాడు. ఈతని కొత్త ఫణితి హఠాత్తుగా హృదయానికి హత్తుకుంటుంది. ఇతని ఆకృతులలో అత్యంత సరళత ఒక విశేషం. ఇల్లాగే చిన్నపిల్లల మనః ప్రవృత్తికి అనుకూలంగా చిత్రించే ఇంకొక చిత్రకారిణి ఉన్నది. ఈమెపేరు శీలా ఆడెన్. ఈమెలో సహజముగ్ధత, చిత్రమైన సహజత్వము కనిపిస్తాయి. ఈమె లక్ష్మి చిత్రం చాలా మనోహరమైనది. శీలాఆడెన్, టిబెట్ చైనాదేశాలకు సంబంధించిన విషయాలు కూడా చాలా బాగా చిత్రించింది. ఈమెలో వంగ జానపదసంప్రదాయం సహజసౌందర్యంతో తొణికిసలాడుతూంటుంది.

ఇలాగ జానపదసంప్రదాయానికి సమీపం వెళ్ళే ముఖ్య చిత్రకారులు మరికొంద రున్నారు. వీరు పి. యల్. నరసింహమూర్తి, కె. శ్రీనివాసులు గార్లు. వీరిద్దరు మద్రాసులో ఉంటున్నారు. అబనీసెన్ మూడవవాడు. ఈయన నివాసం ఢిల్లీ. మొదటివారిద్దరు ఆంధ్ర జానపద కళాసంప్రదాయంలో చిత్రాలు రచిస్తున్నారు. ఆంధ్రులకు ఉజ్జ్వలమైన జానపద సంప్రదాయం ఒకటి అనుస్యూతంగా వస్తున్నది.

## శిల్పము

ప్రపంచంలో అత్యుత్తమ శిల్పమంతా ఇండియా, ఈజిప్టులలో తయారయినదే. అయితే ఇది పాతకాలపుమాట. నేటికాలంలో తయారయ్యే శిల్పం అంత లెక్కపెట్టదగినదికాదు. ఉన్న వారిలో

దేవీ ప్రసాదరాయ చౌదరిగారొక్కరే ఉత్తమోత్తమ శిల్పి. ఈయన శిల్పాలు మంచి సత్తాతో కొత్తకొత్తపంథాలలో నడిచిపోతూంటాయి. యువక శిల్పులనేకులీయన తొక్కిన దారిలో నడిచిపోయారు. వీరిలో ప్రదోష్ దాస్ గుప్తా, రామకింకర్, ధనరాజ భగత్, భావేష్ సన్యాల్ ప్రముఖులు, వీరిలో అంతటా భారతీయత ఉట్టిపడుతూంటుంది. ధనరాజ్ భగత్ ఎక్కువగా దారుశిల్పాలే చెక్కుతూంటాడు. సత్యేన్ ఘోషాల్ మొదలైనవారు కొంతమంది ఇంకా కొత్త కొత్త మార్గాలలో శిల్పరచన సాగిస్తున్నారు. వీరిలో కొందరిలో పారిస్ శిల్పపద్ధతులు కనిపిస్తాయి. వీరి శిల్పాలు జాగ్రత్తగా పరిశీలించినవారికి, ప్రాచ్య పాశ్చాత్య ధోరణుల సమ్మేళనం ఎంతవరకున్నదో స్పష్టంగా తెలిసిపోతుంది. చక్కగా శిల్పరచన చేస్తే—పద్ధతి ఏదైనా అది అంతగా లెక్కలోకి రాదు.

భారతదేశంలో శిల్పులందరు అనేక విధాలుగా ఇబ్బందులుపడుతున్నారు. ఇవి (1) సరియైన జాతీయ వస్తు ప్రదర్శనశాలలు లేకపోవడం (2) ప్రభుత్వము ప్రజ తగినంత ఆధారం చూపించకపోవడం. (3) బొత్తిగా పాతపద్ధతులు పట్టుకుని వేలాడుతున్న శిల్ప విద్యాలయాలు, (4) పైపై ఆవేశాలు, సంస్కృతిని, గురించి ఘాటుగా ఉపన్యాసాలివ్వడము, బొత్తిగా పని కనబడకపోవడము మొదలైనవి. చిత్రకళాభిమానులందరు ఈ లోపాలు గమనించి ఈ కళకు తగినంత ప్రోత్సాహం ఇవ్వాలి.

ఏ. వి. రామన్.

'స్వాదెహెరా' నుండి

---

# ప్రాచీన భారతము

## రాజదూత వ్యవస్థ

భారత చారిత్రకాంశములను యథోచితముగ, నిష్పక్షపాతముగ పరిశీలించి చూచిన, అతి ప్రాచీన యుగములందు సహితము భారతీయుల జీవితము కూపస్థమండూకముగాక నతికర్మిష్ఠిగ నుండినటుల స్పష్టమగుచుండును. ఆకాలమునందనేక భారతీయులు విదేశముల కేగి, రాజకీయదృష్ట్యా, స్వదేశముతో ప్రగాఢమైత్రి సంబంధములను, నాగరకతా సంస్కృతి ప్రచారపునీత కార్యములను, ధనిష్ఠకార్యముల నభివృద్ధిపరచిన సజీవనిదర్శనము లనేకములు గలవు.

అంతర్జాతీయ ప్రాంగణమునందు ప్రాచీన భారతీయులు తమ విశిష్టతను సుస్థాపిత మొనరించి యమరజీవులైరి. దూరస్థరాజ్యములతో రాజకీయ సంబంధముల నేర్పరచి యనన్యమైత్రిని ధృఢపరచిరి. ఈ యనన్య సంబంధము లనేక శతాబ్దముల కత్యుగ్రముగా నుండినటుల నిటీవలి పరిశోధనలు విదితపరచినవి.

ఇంతేగాక క్రీస్తుపూర్వ మనేకసహస్రాబ్దముల నాడు భారతీయులు దజ్లా, ఫరహోత్ సస్యశ్యామల ప్రాంతములం దతిస్పృహణీయులుగా వినుతిగాంచిన నిదర్శనము లిటీవలనే హస్తగతమైనవి. ఆ కాలమునందు నార్థికముగ భారతదేశము సమస్త భూమండలమునకు ధనధాన్య భాండాగారముగ విలసిల్లె ననుట నిర్వివాదాంశము.

రామాయణ, మహాభారతాది కావ్య రాజములందు రాజదూతల వ్యవస్థవర్ణన లనేకములు గానవచ్చును. పాండవులపక్షమునుండి శ్రీకృష్ణుడు రాజదూతగ కౌరవుల రాజసభ నలంకరించెను. సంధి, యుద్ధము మొదలగు ముఖ్యకార్యములు నెరవేర్చు సంపూర్ణాధికారము శ్రీకృష్ణుని కేర్పడియుండెను.

ఆ కాలములో రాజదూతలు మూడువర్గములలో విభక్తమై ఉండుచుండిరి :

1. జాతి, దేశాభ్యుదయాదర్శములతో సంధి, యుద్ధము మొదలగు ముఖ్యనిర్ణయములు రాజులతో పునరాలోచించక స్వయముగ సర్వాధికారము బడసియుండు రాజదూతలు ప్రథమశ్రేణిలో పరిగణింపబడుచుండిరి.

2. రాజ సంబంధీకుల యంగీకారానంతరము పరరాజ్యములతో వార్తాలాపముల, వ్యవహారముల నెరవేర్చు నధికారము కలిగిన రాజదూతలు రెండవ తరగతివారుగ నుండిరి.

3. కేవలము రాజుల సందేశములను మాత్రమే యన్యరాజుల కందించుట కేర్పడు రాజదూతలు మూడవ తరగతిలో చేర్చబడుచుండిరి.

ఈ ఆధారముపై పరిశీలించిన శ్రీకృష్ణుడు మొదటి శ్రేణికి, అంగదుడు - రావణుని దర్బారులోని శ్రీరామచంద్రుని రాజదూత—రెండవ తరగతికి, జగజ్జననియైన సీతా మహాదేవి క్షేమసమాచారము తెలుసుకొనుట కేర్పడిన పవనపుత్రుడు—హనుమంతుడు—మూడవ దర్జాకు చేరుచుండును.

ఈనాటి వైజ్ఞానిక యుగమునందు మాదిరి, ప్రతి యుగమునందు కూడ రాజదూత లేక రాజ్యప్రతినిధి యవధ్యుడుగ లెక్కింపబడుచుండెను. రాజదూత నవమానించుట, అగౌరవ పరచుట, తిరస్కరించుట

రాజ్యాంగరీత్యా మహా ద్రోహకరముగ నిర్ణీతమై యుండెను. అది యవాంఛనీయముగ అసహనముగ నుండెడిది. అటుల సంఘటించిన నది సమరాహ్వానముగ గణింపబడుచుండెను.

ఈనాడు సహిత మీ పరంపరాచారము గౌరవార్హముగ గలదు. ప్రతి రాజ్యమునందు రాజదూత గౌరవాదరణలలో చూడబడుచుండును. క్రీ. పూ. మూడవ శతాబ్దమునందు భారత చక్రవర్తియైన చంద్రగుప్తుడు యవనుల పరాజితులజేసి భారత గౌరవమును గాపాడెను. యవన ప్రభువంశీయుడైన సెల్యూకస్ రాజదూతయగు మెగస్తనీసును చంద్రగుప్త చక్రవర్తి తన రాజసభయందు పాల్గొనుట కనుమతించెను.

ఈతడు చక్రవర్తి రాజసభయందు పాల్గొనుచు భారతీయుల సాంఘిక, రాజకీయపరిస్థితుల నధ్యయన మొనరించి, నొక యమూల్య గ్రంథరాజమును రచించి ఋణవిమోచనుడయ్యెను. భారత ప్రాచీన సాంఘిక వ్యవస్థవిస్పష్టీకరణమున కీ గ్రంథరాజము బలవత్తర ప్రమాణమనుట నిర్వివాదాంశము.

చంద్రగుప్తుని కుమారుడైన బిందుసారుడు యవన రాజదూతయగు డిమేకసుని ఘనముగ సత్కరించెను. అపరధర్మరా జనబడిన అశోకచక్రవర్తి యత్యుత్కృష్టమైన రాజదూత వ్యవస్థను పునర్నిర్మాణ మొనరించి ప్రపంచమున నొక యమూల్య సంపత్తిని నందించెను. అశోకుని శిలాశాసనములవలన విదేశీయులతో నేర్పడిన సంబంధ బాంధవ్యములు విదితమగుచున్నవి.

1. మఖ్దూనియా అంతిగ్న గుణావతంసుడు
2. ఉత్తర ఆఫ్రికా మగసుడు
3. ఇపీరియా అలక్షేంద్రుడు
4. ఈజిప్టు టోల్మ్రి
5. సీరియా అంతియోక

ప్రియదార్శనికుడైన అశోకుడు తన స్వసంతానమైన సంధిమిత్రుని, మహేంద్రుని భారతీయ సంస్కృత్యభివృద్ధికొరకు సింహళమునకు—లంక—బంపిన నిదర్శనములు శిలాశాసనములందు కానవగును. తక్షశిలావాసియగు హిలివోడోర్ యను నాతనిని భగభద్రుడను భారతీయ రాజన్యుడు స్వాగతపరచిన వివరములు విదిశా—భిల్సాస్టేషన్ ప్రదేశము 2 మైళ్ళ దూరమునందుండు — నగరమందలి లోహస్తంభ శాసనమునందు గలవు. ఈ యవనరాజదూత తనను భాగవతి సాంప్రదాయకునిగ శుద్ధి చేయించుకొని, విదిశా నగరమునందు వాసుదేవుని పరమభక్తుడై గరుడ ధ్వజమును స్థాపించెను. ఈ సంఘటన మాకొలపు యవన సామ్రాజ్యస్థైన అంతిలికిత్ పరిపాలన సమయమునందు సంఘటించెను. హిలివోడోర్ ఆతని రాజదూత.

ఈ రెండు—భారతదేశము, గ్రీసుదేశము—దేశములమధ్య క్రీస్తు పుట్టుట కనేక శతాబ్దములకు పూర్వమే నిష్ఠ సంబంధ బాంధవ్యము లేర్పడి యుండెను. భారతీయ సాంస్కృతిక ప్రచారకులు, పండిత ప్రకాండులు, కళాకోవిదు లనేకులు చీనాదేశ మేగి భారతీయతను విశదపరచిరి. పరస్పర సాంస్కృతిక సంబంధ కార్యములను సంపూర్తి చేసిరి.

క్రీ. శ. 89–105 మధ్య చీనాచక్రవర్తియగు హో—తి దర్బారులో ప్రథమ రాజదూత స్వాగతి మహోత్స మతివైభవముగజరిగెను. ఆతర్వాత క్రీ—కౌ చక్రవర్తికోరికపై మగధ సామ్రాట్టు పండితచక్రవర్తియైన పరమార్థిని రాజకీయ ప్రతినిధివర్గము—పొలిటికల్ డెలిగేషన్—నకు నాయకునిగ నేర్పరచి చీనాయందుంచెను.

నీ వంశస్థుడైన యుకచక్రవర్తి క్రీ. శ. 517 లో సంగయూన్ యను నాతనిని భారతదేశమునకు రాజదూతగ బంపెను. ఈతడు నిర్ణీతకాలానంతరము స్వదేశమేగుచు భారతదేశమునుండి 180 బౌద్ధ గ్రంథములను తీసుకువెళ్లెను.

క్రీస్తు 7 వ శతాబ్దమునందు కనోజు చక్రవర్తియగు హర్షవర్ధనుడు, గుప్త యుగాచారానుసారము, రాజదూతవ్యవస్థను చక్కగ నిర్వహించెను. చీనారాజదూతయైన వాంగ్—హ్యూ మూడుమారులు భారతదేశమునకు రాజదూతగ వచ్చు సౌభాగ్యము గడించెను. ఈతడేగాక ఇత్సింగ్ హ్యూయన్ సాంగ్, ఫాయి యాన్ మొదలగు వారి యాగమనము నిరాటంకముగ సాగెను.

ఓఢ్రచక్రవర్తియైన ప్రభాకరదేవుడు క్రీ. శ. 715 సం. న తన రాజకీయ గ్రంథాలయమునుండి ప్రఖ్యాత భారతగ్రంథమగు 'గంధవ్యూహము'ను నిచ్చి నొక రాజదూతను చీనాయందేర్పరచెను.

క్రీ. పూ. మూడవశతాబ్దములో రోము చక్రవర్తియైన సీజర్ ఆగస్టస్ నలుగురు భారతీయ రాజదూతలను గౌరవించెను. రాజదూతలతోపాటు శ్రవణాచార్యుడను గొప్పదార్శనికుడు సహితము రోము సామ్రాజ్యమును సందర్శించెను. కారణాంతరములచే నీతడు యేథెన్సునగరమునందుండిన కాలముననచటనే విగత జీవుడయ్యెను.

ఆనాటి ప్రఖ్యాతచరిత్రకారుడగు నికోలస్ అభిమతానుసారము భారతీయ రాజదూతలు నాలుగు

సంవత్సరముల ప్రయాణానంతరము రోము నగరము చేరుచుండిరి. భారతీయ రాజదూతల గౌరవించిన రోము చక్రవర్తులలో క్రిందివారు ముఖ్యులు:—

| | | | |
|---|---|---|---|
| 1. | ట్రైజన్ | క్రీ. శ. | 98–117 |
| 2. | హడ్రియన్ | ,, | 117–138 |
| 3. | ఎంటోనియస్ పాయస్. | ,, | 138–161 |
| 4. | హెలియో గాబిజ్ | ,, | 218–222 |
| 5. | ఒరివోలోవోన్ | ,, | 270–275 |
| 6. | కొన్స్టన్టయిన్ | ,, | 323–325 |
| 7. | జూలియన్ | ,, | 361-363 |

భారతదేశమున కౌ సామ్రాజ్యముతో కేవలము రాజకీయసంబంధము మాత్రమే గాక వాణిజ్య వ్యాపార సంబంధము సహితము స్థిరముగ నేర్పడి యుండెను. పుదుచెరి—పాండిచరి—సమీపమందలి ఇరికమెడ్ ఖనిజవ్యవహార మీ విషయమునకు ప్రబలాధారము.

నైజాం రాజ్యమందలి సయాద్రి, పర్వత పఙ్క్తిలోని అజంతాగుహల యపూర్వసౌందర్య చిత్రములు, కళావశేషములు సహితము ప్రాచీన భారతీయాంతర్జాతీయ విశిష్టతను వేనోళ్ళ చాటుచున్నవి. చాళుక్యచక్రవర్తియైన పులికేశుని, పర్షియా పాదుషా యగు ఖుసుగో రాజదూతను ఘనముగ స్వాగతపరచుచున్న రమ్యదృశ్యము దీనియందు కళారూపమున చక్కగా చూపబడియున్నది.

పర్షియాదర్బారులో భారతీయ రాజదూతల పూర్వగౌరవముతో సత్కరింపబడినటుల విఖ్యాత అరబు చరిత్రకారుడైన బారీనుల్లేఖన మీనాడు సహి కొనవగును.

సుమిత్ర, జావా. బోర్నియోద్వీపము లానాడు భారతదేశభాగములైయుండెను. ఆయా ద్వీపవాసులు తమ సర్వస్వాన్ని వదలుకొని, భారతీయ సంస్కృతిని యవిచ్ఛేదాంశముగ తమదిగ జేసికొనియుండిరి. ఆ దేశముల అర్వాచీనభవనములు భవ్యస్మారక చిహ్నములై, భారతీయారాధకులుగ శేషించియుండుట గర్వింపదగినయంశము.

మగధచక్రవర్తి యగు దేవపాలదేవుడు సుమిత్రాధిపతియైన బలపుత్రదేవుని రాజదూతను తన రాజసభయందు సత్కరించెను. ఆ విదేశ రాజదూత నలంద విశ్వవిద్యాలయమునకు 5 గ్రామములను దాన పూర్వకముగ నొసగి ధన్యజీవి యయ్యెను.

ఈనాటి స్వతంత్రభారతము సహితము ప్రాచీన సాంప్రదాయముల పాటించుటయత్యవసరము. భారత జాతి, భారతదేశ గౌరవాదరణ లన్నియు రాజదూతల పై నాధారపడి యున్నవి. వారి జాతీయాభిమానము, వారి దేశ సేవాసక్తి, వారి కార్యదక్షత, వారి ధైర్య స్థైర్యము, వారి వ్యవహార కౌశలము, వారి యాదర్శ మయమైన ప్రవర్తన, వారియందలి కార్యశీలత భారత భాగ్యోదయమునకు విలంబనము గాజాలదు.

ఈ రహస్యావగాహనమునకు ప్రాచీన భారతీయ రాజదూత వ్యవస్థ, ఆ పరిపాటి దీపస్తంభ రూపమున మార్గదర్శి, సహకారి యగుట నిర్వివాదాంశము.

శ్రీ బి.యన్. శర్మ.



# గ్రంథవిమర్శనము

## మేఘసందేశము

(అనువాద కావ్యము)

కృతికర్తలు : తాడూరి లక్ష్మీనరసింహారావు, తాడూరి రామచంద్రరావు. బి. యే. ప్రకాశకులు : తాడూరి రామచంద్రరావు. అడ్వొకేట్, బి. యే. ఇన్నీసుపేట, రాజమహేంద్రవరము. వెల : రూపాయి.

ఈ గ్రంథంలో పూర్వభాగం లక్ష్మీనరసింహారావుగారు, ఉత్తరభాగం రామచంద్రరావుగారు భాషాంతరీకరించారు. తండ్రిగారు పూర్తి చెయ్యకుండా విడిచిన భాగం తానువదించి పూర్తిచేశామని రామచంద్రరావుగారు పీఠికలో వ్రాస్తున్నారు.

తాడూరి రామచంద్రరావుగారు పీఠికలో మేఘుడు పోయి యక్షుని ప్రియురాలికి సందేశం స్వయంగా వినిపించినట్లు వర్ణించే శ్లోకాలు ప్రక్షిప్తాలు కావనీ, 'ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతః క్వ మేఘః' అన్న శ్లోకమే ప్రక్షిప్తమనీ సమర్థించారు. ఇందుచేతనే వీరి చివరి శ్లోకాలు కూడా తెలుగులోకి అనువదించారు.

కాని వీరి వాదం సరియైనది కాదు. నిజానికి చివరివే ప్రక్షిప్త శ్లోకాలు. కాళిదాసీ కావ్యంలో కథావిషయ మేమీ ప్రస్తావించనే లేదు. అసలిది ఒక కథగా ఆ కవి ఉద్దేశించినట్లే కనబడదు. కనకనే కథానాయకుడైన యక్షుని పేరైనా చెప్పకుండా ఒకానొకడు అని అర్థం ఇచ్చే 'కశ్చిత్' అనే మాటతో విడిచిపెట్టివేశాడు. మేఘం వట్టి అచేతన వస్తువనీ ఇది సందేశం తీసుకుపోలేదనీ కవి మొట్టమొదటే పాఠకుల మనస్సులో బయలుదేరే సందేహం ఎగరగొట్టివేశాడు. కాని యక్షుడు కామార్తుడు; కనక అతనీ గోడంతా ఈ విధంగా మేఘంతో మొరపెట్టుకొన్నాడని కూడా కాళిదాసీ కావ్యంలో అంతటా స్ఫురిస్తూనే ఉన్నాడు. లేకపోతే యక్షునికీ, మేఘునికీ మధ్యన జరిగిన సంభాషణాదికం కూడా కవి యీ కావ్యంలో ప్రవేశపెట్టి ఉండును.

ఈ కావ్యం అంతా యక్షుని ఉక్తిగా ధ్వనింపగానే కవి ఉద్దేశించి వ్రాశాడు అనడానికి, చివర యక్షుడు మేఘుని ఆశీర్వదించడం కూడా ఒక తార్కాణం. ఇంతేగాక మల్లినాథాది ప్రాచీన వ్యాఖ్యాతలు చివరి శ్లోకాలు ప్రక్షిప్తాలనే భావంతో వాటికి వ్యాఖ్యానం వ్రాయడం మానివేశారు. నిజానికి కావ్యం ఇలాగ ముగిసినప్పుడే దీనిలోని గూఢ వ్యంగ్యం మరింత రమణీయంగా పాఠకులకు స్ఫురిస్తుంది.

ఇక అనువాద విషయం — ఇంతకు పూర్వం వచ్చిన ఉత్తమోత్తమ మేఘసందేశాలు కూడా మూల మాధుర్యం ఏమాత్రమైనా పాఠకులకు స్ఫురింపజెయ్యలేకపోతున్నాయి. కాళిదాస కవితలో పద పదార్థాలకు రెంటింటికీ ప్రాధాన్యం సమానంగా ఉంటుంది. ఇంతకుపూర్వం వచ్చిన అనువాదకులందరు చాలావరకు మూలశ్లోకభావాలు మాత్రమే యథాతథంగా తెలుగులోకి తీసుకురాగలిగారు. కాళిదాసుని మందాక్రాంతా వృత్తాల సొగసుగాని, అపూర్వమైన కాళిదాసీయ పదఘటనాలాలిత్యం గాని ఏ అనువాదంలోకీ రాలేదు. దీనితో అనువాదాల్లో కాళిదాస కవిత సగానికి సగం అదృశ్యమైపోయింది. ఇక తెలుగు పాఠకులకు దొరికిన వల్లా సంస్కృత రచనలోని భావచ్ఛాయలు మాత్రమే.

ప్రస్తుతానువాదానికి కూడా ఈ లోపమే వచ్చింది. మూలశ్లోకంలో పదలాలిత్యము, మాధుర్యము సంస్కృతం తెలియనివారికి కూడా సులభంగా హృదయానికి హత్తుకుంటాయి. దీనికి తార్కాణంగా మూల శ్లోకము, అనువాదము కూడా ఇక్కడ ఉదహరిస్తున్నాను.

"ప్రత్యాసన్నే నభసిదయితా
    జీవితాలంబనార్థీ
జీమూతేన స్వకుశలమయీం
    హారయిష్యన్ ప్రవృత్తిం
స ప్రత్యగ్రైః కుటజకుసుమైః
    కల్పితార్ఘాయతస్మై

ప్రీతః ప్రీతిప్రముఖవచనం
స్వాగతం వ్యాజహార"
"నభముసమీప మాటయు
మనః ప్రియ ప్రాణము నిల్పమేఘుచే
శుభనిజసౌఖ్యవార్త మది
జొప్పడ బంపగ నిచ్చజేసి వా
డభినవ శైలమల్లికల
నర్చనజేసి ప్రహర్షమంది దు
ర్లభ ఘనయంచు బిల్చి కుశలం
బడిగెన్ ప్రియమైన పల్కులన్"

దీనిలో 'దుర్లభఘన' అనేసంబోధనం ప్రాస కోసం మూలంలో లేకపోయినా తెలుగులోకి తెచ్చి పెట్టుకున్నట్లు కనబడుతుంది. ఇది ఇలాగ ఉండగా కేవలం మూలానువాద రచనల పోకడలు పరిశీలించినా రెండిటి తారతమ్యము పాఠకులకు స్ఫురింపగలదను కుంటాను.

ఆంధ్రానువాదకు లిద్దరి రచనలలోను నిశితమైన సంస్కృతాంధ్రభాషా పాండిత్యం స్ఫురిస్తూంటుంది. పూర్వభాగం రచనకంటె ఉత్తరభాగ రచనలోని కవనంలో జీవము, జిగి ఎక్కువ. ఈ క్రింది ఉదాహరణాన్నిబట్టి ఈ భాగం కవితా స్వభావం గ్రహించవచ్చును.

మేలిబంగరు చాయ మేనుదీగల బొల్చు
లలనలు నీమించు లతలకుద్ది
పలువన్నె చిత్రంబు లలరారు పటముల
బంతినీయింద్ర చాపములకుద్ది
సంగీతసహితమై శ్రావ్యమౌ మార్దంగ
రావంబు నీదు గర్జలకు మద్ది
మణికూర్పుగల కుట్టిమంబుల నిగనిగల్
నీలోని మెరుగారు నీటికుద్ది
యనుపమనలరారు నివి యెల్ల నమరుచుండ
నున్నతుడవైన నినుబోలె మిన్నుముట్టి
యలకలోనున్న ప్రాసాదములు దలంప
సర్వవిధముల సరిపోగ జాలు నీకు.

---

## దివోదాసు

[పురాణనాటకం]

శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి. వలయువారు: సావిత్రీ గ్రంథ మండలి. ఓంకారమందిరము, బెల్లం కొండ పోస్టు, గుంటూరు జిల్లా. వెల రెండు రూపాయలు.

ఇది పూర్వమీమాంసోత్తరమీమాంసలవాదోప వాదాలకు సంబంధించిన నాటకము. పూర్వమీమాంసకులు కర్మమాత్రమే సర్వకారణమని నిర్వచిస్తారు. అంతేగాని ఈశ్వరుణ్ణి అంగీకరించరు.

ఉత్తరమీమాంసకులు సేశ్వరవాదులు. ఈ రెండిటికీగల వైరుద్ధ్యము, ఉత్తర మీమాంసాధిక్యాన్ని సూచించేదీ దివోదాసుని కథ. కాశీఖండాంతర్గతమైన ఈ కథ తీసుకుని రచయిత దీనిని పదిఅంకాల నాటకంగా రచించారు.

ఈనాటకం గద్యపద్యాత్మకంగా సాంప్రదాయిక ధోరణిలోనే నడిచిపోతుందిగాని, దీనిలో సాంప్రదాయిక నాటక లక్షణాలు కనబడవు.

ఈ నాటకం మొత్తంమీద కథా కథన ధోరణిలోనే నడిచిపోతుంది. అందుచేత దీన్ని నాటకం అనడంకంటె నాటకాకారంలో ఉన్న కథాకావ్యమని అనడమే న్యాయ్యము.

ఈ నాటకంలో గద్యరచనకంటె పద్యరచన మిన్నగా ఉన్నది. ఈ క్రింది వృత్తాలనుబట్టి రచయిత పద్యరచనానైపుణి గ్రహించవచ్చును.

"ఒక వారాణసిగాదు భూతలముగా
దున్నట్టి లోకాల కే
లిక విశ్వేశ్వరుడే సమస్తమును దే
లించన్ సుఖశీల, నీ
సకలంబున్ దన రూపుగా దనరు, నా
సర్వాత్మకన్నన్న లం
దక గావింపరు దివ్యులవ్విధి రమా
నాథాదు లే కార్యముల్."
—ప్రథమాంకము.

"చేసినయట్టి సత్తపము,
చెందిన యయ్యణిమాది సిద్ధులన్
పీసర వోవకుండ బృథివీవర
వర్యుడ వైతి వీదివో
దాసనునామ మూని, సుర
ధామమునం బలె ధాత్రి నీ ప్రజల్
వాసిగెలంగ సంపదలు, వర్ధిలు
మిద్ధయశస్సమృద్ధితోన్."

---

## కులంలేని పిల్ల

[సాంఘిక నాటకం]

పినిసెట్టి శ్రీరామమూర్తి. ఆదర్శ నాట్యమండలి, పాలకొల్లు. వెల : రూపాయి పావలా.

ఇది వర్ణవిభేదాలు కూడదని నిరూపించే వచన నాటకం. రచయిత అక్కడక్కడ పాటలు కూడా ప్రవేశపెట్టారు. పాపన్న పంతులనే చాందసు డుంటాడు. అతని కుమారుడు సుదర్శనం సుశీల అనే కులంలేని పిల్లను పెళ్ళిచేసుకుంటానని పట్టు పడ తాడు. తండ్రి వల్లకాదంటాడు. చివరికి కొడుకు తండ్రికి ఎదురుతిరిగి సంఘోద్ధరణాదర్శంతో తాను వలచిన పిల్లనే పెళ్లిచేసుకుంటాడు

ఇది ఇలా ఉండగా సుదర్శనం చెల్లెలు విమల సుదర్శనం బావమరిది వీరేశుని పెళ్లిచేసుకోవాలని అనుకుంటుంది.

పాపన్న పంతులు కొడుకు చేసినది అంగీకరించి నట్లు నటించి, ఒకనాడు హఠాత్తుగా కొత్తగా పుట్టిన శిశువును హత్యచెయ్యబోతాడు. కాని సుశీల అడ్డు కుంటుంది. చివరికి కత్తిపోటువల్ల సుశీల చచ్చిపో తుంది. ఇది జరిగిన తరవాత పాపన్న పంతులుకు పశ్చాత్తాపం వస్తుంది. చివరికి విమలా వీరేశుల పెళ్లితో నాటకం ముగిసిపోతుంది.

కథఅల్లికనుబట్టిచూస్తే నాటకం చివర ఇల్లాటి అఘాయిత్యం అక్కరలేకుండానే పంతులులో పరివర్తన తీసుకురావచ్చును. మొత్తంమీద ఇల్లాంటి లోపాలు నాటకకథలో అంతటా కనిపిస్తాయి.

పాత్రస్వభావాలను గురించిగాని లేక ఈ నాటకంలోని పాటలను గురించిగాని అంతగా వ్రాయవలసిందేమీ లేదు.

ఈనాటకంలో ఒక్క సంభాషణలు మాత్రం కొంచెం చురుగ్గా చలాకీగా సాగిపోతూంటాయి. ఈ వీటివల్లనే ఫాఠకులీ నాటకం కొసదాకా చదువుకుపోవడానికి వీలవుతుంది.

---

## ప్రగతి

[నాటికల సంపుటం]

ఆచార్య ఆత్రేయ, ఉదయసాహితి, గవర్నర్ పేట, గుంటూరు. వెలముప్పావలా.

ఇది రెండు నాటికలసంపుటి. దీనిలో మొదటిది '*Progress*' అనే ఆంగ్లనాటిక మొదటి పది పేజీలు, చివరిపేజీ చదివినతరవాత వ్రాసినదని ఆచార్య ఆత్రేయ పీఠికలో తెలియజేశారు. రెండవది కాపలావానిదీపం. ఇది హరీంద్రనాథ చట్టోపాధ్యాయ వ్రాసిన నాటికకు అనువాదం.

ఒక శాస్త్రపరిశోధకుడు గట్టిపరిశోధన చేసి ప్రపంచం అంతా భస్మీపటలంచేసే మారణాయుధంకనిపెడతాడు. అవిధంగా ప్రపంచంలో యుద్ధాలు లేకుండా చేయ్యావచ్చునని అతననుకుంటాడు. కాని అతని సోదరి శాంతి ఆ చేసేదిరాక్షస కృత్యమని నిందిస్తూ ఆపరిశోధనాగారంలోని వస్తువులన్నీ విరజిమ్మి పారేస్తుంది. ఇదీ ప్రగతిలోని కథ.

ఈనాటిక చాలా మంచి నాటిక. కాని అనువాదకులు యథాతథంగా అనువదించక పోవడంవల్ల తెలుగు నాటిక చప్పగా తేలిపోతుంది. వీరికి పూర్వమో తరవాతో తెలియదుగాని శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారు దీన్ని అనువదించిప్రదర్శించారు. ప్రదర్శనలోకూడా ఆనాటిక బాగా రక్తికట్టింది. ఇల్లాంటి ఉత్తమనాటికలు అనువదించేటప్పుడు అనువాదకులు తగినంత శ్రద్ధతీసుకోకపోతే—చివరికి మూల రచయితకే అన్యాయం జరుగుతుంది.

ఇక రెండోనాటికలో అనువాదం చురుకైన సంభాషణలతో సాఫీగా చక్కగా నడిచిపోయింది.

---

## శైవసర్వస్వము

పండిత ముదిగొండ కోటయ్యశాస్త్రి అయ్యవారు. ఈమని. వయా దుగ్గిరాల, గుంటూరుజిల్లా వెల : 2-8-0.

ఇది శైవుల ఆచారవ్యవహారాలు, ధర్మాధర్మాలు, శైవవేదాంతము మొదలయిన విషయాలను గురించిన గ్రంథము. రచయిత ప్రమాణపరిచ్ఛేదము అనేవిభాగంలో శాంభవదీక్ష స్వీకరించే విధానము, సప్రమాణంగా వివరించారు.

దీనిలో రెండోవిభాగం ఆవరణాచారదీపిక. దీనిలో రచయిత భస్మధారణాది విధానాలన్నీ విపులంగా వివరించాడు.

అటుపిమ్మట శాంభవీయ ధర్మసూత్రావళీ విభాగంలో శైవధర్మసూత్ర గ్రంథాలనుండి సేకరించిన ప్రామాణిక సూక్తులతో శైవధర్మాలనుగూర్చి చేసిన కూలంకష చర్చ కనిపిస్తుంది. నాలుగవది చారిత్రికమైన శైవజ్యోతి అనే అధ్యాయము. రచయిత దీనిలో సంగ్రహంగా శైవమతచరిత్ర వ్రాశారు.

అయితే ఇది మొట్టమొదటే చేర్చిఉంటే పాఠకులకు ఈ గ్రంథం ఇంకా సులభసాధ్యంగా ఉండేది. మన్యమన్య సంస్కృతశ్లోకాలు మొదలైనవి

ఎక్కువగా ఉదాహరించడంవల్ల కూడా సామాన్య పాఠకులకీ పుస్తకం చదవడం దుష్కరం అవుతుంది.

అయితే శైవసంప్రదాయాన్ని గురించి సంగ్రహంగా తెలుసుకోవడానికి మాత్రం ఈ పుస్తకం బాగా ఉపయోగిస్తుంది. పుస్తక ముద్రణాదికం చక్కగా ఉన్నది.

---

## Journal of Andhra Historical Reserch Society

### Vol. XIX July 1948 to 1949 April.

ఇది శ్రీ రాళ్లబండి సుబ్బారావుగారి షష్ట్యబ్దపూర్తి సందర్భంలో ప్రకటించిన సంచిక.

దీనిలో శ్రీ వేపా రామేశం, శ్రీ టి. యన్. రామచంద్రన్, శ్రీ దినేశ్ చంద్రసర్కార్, డాక్టర్ వి. యస్. అగ్రవాల్, ప్రొఫెసర్ ఆర్. సుబ్బారావు, శ్రీమతి వి యశోదాదేవి మొదలయిన ప్రముఖ చరిత్ర పరిశోధకుల వ్యాసాలున్నాయి. వీటిలో ఒక 6 వ్యాసాలు టి. యన్. రామచంద్రన్ గారు వ్రాసినవే. మిగిలినవాటిలో మరి నాలుగు వ్యాసాలు శ్రీ వేపా రామేశంగారు రచించినవి మిగిలినవాటిలో రెండు శ్రీ దినేశ్ చంద్ర సర్కార్ వ్రాసినవి.

ఈ రచయితల వ్యాసాలన్నీ చరిత్ర పరిశోధకులకు, తత్రాపి-భారతీయ చరిత్ర పరిశోధకులకు బాగా ఉపయోగించేవే. అయితే విషయవైవిధ్యంతోబాటు రచయితృవైవిధ్యం కూడా ఉంటే ఈ సంచిక ఇంకా ఆకర్షకంగా ఉండేది.

11వ శతాబ్ది మొదలుకొని 15 శతాబ్ది అంతింవరకు పరిపాలించిన కొన్ని ఆంధ్రదేశీయ రాజవంశాలను గూర్చి శ్రీమతి యశోదాదేవిగారు రచించిన వ్యాసం ఆంధ్రదేశ చరిత్రాభిమానులకు, అందులోను సంగ్రహంగా ఆకాలపు చరిత్ర తెలుసుకోగోరే పాఠకులకు బాగా ఉపయోగిస్తుంది.

ఈ పత్రిక చిరకాలంనించీ ఆంధ్రదేశ చరిత్ర పరిశోధకుల కెంతో సహాయకారిగా ఉంటున్నది. ఇలాంటి పత్రిక ఒక సంవత్సరంలో రావలసిన 4 సంచికలకు బదులు ఒక్కటే సంచిక ప్రకటించడం చాలా విచారకరమైన విషయం. తగినంత ధన సహాయం లేకపోవడము, మొదలైనవి దీనికి కారణాలయితే కావచ్చును. ఇది ఇటీవల భారతదేశంలోనే కాక విదేశీయుల మన్ననలు కూడా అందుకుంటూన్నదని తెలుస్తున్నది.

సంపాదకులు, పాఠకులు ఈ పత్రిక అభివృద్ధికి ఇంకా ఎక్కువగా సహకరించగలరనీ, అవిఘ్నంగా ఆంధ్రదేశీయ చరిత్రపరిశోధనకు చేయూత ఇవ్వగలరనీ ఆశిస్తున్నాను.

---

## ర మ ణ స్మ ర ణ

రామచంద్ర కౌండిన్య. ప్రాప్తిస్థానము. కాళహస్తి రామనాథముగారు, ట్రంకురోడ్డు, నెల్లూరు వెల: 5 అణాలు.

ఇది రమణమహర్షిపై రామచంద్ర కౌండిన్య రచించిన కొన్ని చిన్న గీతికల సంపుటి. ఇందులో రచయిత రమణమహర్షి వ్రాసిన కొన్ని తమిళరచనలకు తాము చేసిన అనువాదాలు కూడా చేర్చారు.

ఈ రచనలలో కవిత్వశక్తి అంతగా కనబడక పోవచ్చునుగాని, పదాలమాటు నుండి రచయిత నిజాయితీ స్పష్టంగా కనిపిస్తుంది.

'పరిదేవన' అనే శీర్షికలోని ఈ క్రింది పద్యం వీరి కవితాధోరణికి తార్కాణంగా తీసుకోవచ్చును.

"నీ కనుగోనలందు పావణించెడి
మాడ్కి వెలుంగులో సుధో
త్సేకము, పావకోద్గమము
తెల్లము సేయగదయ్య! మామకా
స్తోకరుజానిబర్హణకో,
ద్యోత్కృప దీర్ఘనో, శోణశైవ హే
వాక మహిష్ఠతేజ! పరిభావిత
భావజ! మానితల్లజా!

---

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad

# భారతి

[సచిత్ర మాసపత్రిక]

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



ఆంధ్రపత్రికా ముద్రాలయము
మదరాసు.

సంపుటము 29 మే, 1952 సంచిక 5

విడిప్రతి వెల ఒకరూపాయి.





# విషయానుక్రమణిక

## మే. 1952


బాల సుధ
శ్రీ పాదకృష్ణమూర్తిశాస్త్రి అండ్ సన్స్
రాజమండ్రి.



భారత రిపబ్లిక్ ఉపాధ్యక్షులుగ
ఏకగ్రీవముగ అన్ని పక్షముల వారిచే ఎన్నుకోబడిన
శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు




నందన
వైశాఖము

# భారతి

సంపుటము 29
సంచిక 5


# అవతరణము

[మహాబలిపుర శిలా శిల్పము]




శ్రీ అప్పలవీర వెంకటజోగయ్యశాస్త్రి


రాలకుఁ బ్రాణమూది, యవిరామముగాఁ దమ శిల్పసృష్టిచే
వేల శతాబ్దు లిట్లు పృథి విన్నవగీర్ణ కలాప పల్లవ
శ్రీలఁ జెలంగఁ జేసిన ప్రసిద్ధ లసత్సుకళా రసైక జీ
వాలకు వాసమై భరత వర్షము వెల్గిన దాదినుండియున్

* * *

ఏకశిలారథాలఁ బుర మేగెనుబోలు పురాణ భూభుజా
నీకము - లేకయున్న ధర ణిస్థలిరథ్యల బీటవారి పెన్
వాకకు జోకమై యొదిగి వచ్చిన దేల ? - హాయాఘుమీ కృతా
నేకపయూథమే మొ? - శయ నించిన దల్లదె యశ్మరూపమై.

తగ దేవాసుర సంగరాంతరసము ద్ధామక్రియా కేళి మున్
రగడల్ దేరి యలంకరించినవి యీ స్వర్గమున్, గాని చోఁ
దెగ నేలా పృథులాంగముల్ దునియలై దేహంబులట్లే యొగుం
గగ నేలా శిలలట్లు లుర్విపయినీ కాలింగ సందోహముల్.

గ్రావము రంగరించి కరు గం గరువందునఁ బోత పోయుటల్
గావలెఁ గాక నీశకటు కారుఁ డొ కేశిల డొల్చి, చక్రికా
భావ మకుంఠిత ప్రతిభ వర్తిలఁ జేయుట లన్న మర్త్య పుం
భావ విపర్యయంబ, యను మానము లే దణుమాత్ర మేనియున్.

ఇంతకు నేవిధాన గ్రహి యించిరొ వీరలు చిన్ని కొండలం
తంత మహోపలాల? శ్రమ యంచుఁ దలంపక వీని నెల్ల ది
గ్దంతుల కీడువచ్చు బల దర్పితు లెందరు మోసినారొ? - దు
ర్దాంత తృషోపలబ్ధులకు లబ్ధము కానివటంచు నున్న వే?

వారిచిత్రాలు సరసకా వ్యాలు గాగ
పండె భావాలఁ బ్రకృతిలావణ్యరాశి
శాణ, తాడఘు, తూలికా సముదయంబు
వారి రసస్పృష్టికిని దివ్య పరికరాలు.

* * *

తూలికతోడ విశ్వమును దూచి రచించినయట్టి మూఁగ శి
ల్పాలవి కన్నులుండి కనువారలకున్ వెలలేని దివ్య కా
వ్యాలయి, విజ్ఞులన్ రసవ దర్ణవ భూరితరంగ మాలికా
జాలములన్ దిగంత పరి సర్పితులన్ బొనరించు లీలగా

* * *

ఆ కనుపించు చున్నదొక యద్భుత శిల్పకళావిలాస పుం
జొకడలోని నిగ్గు ; తని వోయి భగీరథ హఠాత్తమాచు భూ
లోక విహారస క్తి నవ లోడమొనర్చు పవిత్రమూర్తి మిన్
వాక; యదే స్రవించి దిగి వచ్చిన దృశ్యమెఱుంగఁ జేసెడిన్.

కపిల సంయమి రూక్ష వీక్షణ మహార్చి
మండి నుసియైన తన పితా మహుల యాత్మ
శాంతికై దెచ్చుచున్నాఁడు జాహ్నవి నిటు
ఘోరతపమాచరించి భ గీరథుండు.

కుస్తరించిన కొప్పు కొనవీడి రేగిపైఁ బడు కేశరాజిశై వలము గాగ,
పుచ్చడీకతనాన పొడమెడి యవకుధారికలు బుద్బుదపుమాలికలు గాగ,
ఆరజంబుల కాల యం బైన పొక్కిలి గంభీర కలహొండకంబు గాగ,
మించు దీపెలకాంతి నొంచించు తనమేని ఛాయిమం బెల్లని ర్ఝరము గాగ,

కటక నూపుర ఝుళఝుళో త్కటనినాద
భాగధేయాను కర్షిత బహుకృపీట
జీవతతియాచు నిర్జన సీమనుండి
యవతరించెను జహ్నుక న్యాలలామ!

ఆ కను చూపులన్ దెరలి యాడు దయారస నగ్నమూర్తితోఁ
గేకిసలాడు నట్టి కిలి కించిత గాంగ దరస్మిత ప్రభల్
తాకినవా నిదాఘ పరి తప్త చరాచర జీవమానవా
నీక హృదంత రాళముల నిస్తుల మేఘసుమ ప్రవృష్టులై.

జలదేవాంగన లందు నందు నిరుపా ర్ద్వావలన్ దివ్యపోద్యతాం
జలి విన్యస్త లతాంత గుచ్ఛ వినరాసారంబుఁ గల్పించి, మో
ములు మందస్మిత దివ్య దీధితుల సం పూర్తిన్ ప్రవర్తిల్ల, ని
ర్మల భాగీరథి నాభిదఘ్న సలిలా ల న్నిల్తు రున్మేషులై.

ఇరు కెలంకుల మిన్నేటి, దరుల నిల్చి
జీవనాభావ హేతువి శీర్ణయగుచు
వాడి వత్తైన యావన ప్రకృతి కాంత
లీలకేల్మోడ్చు పేదబా లిక విధాన!

అనిశతపో వినిష్ఠ హృద యమ్మున నెమ్మలు బైలువడ్డ, త
త్తనువున దివ్యతేజ ముది తంబయి దిఙ్నిచయాలఁ బ్రాక, కన్
గొనల నుదంతిశాభ యవ కుంఠితమై రహి జాలువార, త్యా
గనిధి భగీరథుండు కర కంజములన్ ముకుళించు నల్లదే!

ఒక్కచోఁ గన్నులరమోడ్చి ముక్కుమూసి
కుటిల తాపసవృత్తి గై కొంచు దవుల
కడుపు కక్కుర్తి నల మూపి కాలకొంకు
దారిఁ గాచిన దొక్క "రుద్రాక్షపిల్లి."

పీడిత జాతికై పరిత పించి, సుఖాలఁ ద్యజించి, శోణితం
బోడుచు త్యాగశీలుర స ముద్యతి యొక్కెడ వెల్గ, వారి క్రీ
నీడల దారి కాచి, యవినీతి నమాయిక కోటి ప్రాణముల్
దోడెడి స్వార్థజీవు లొక తోడఁ జెలంగుట సాజమే కదా!

* * *

ప్రకృతి గర్భిత జీవత త్వంబుఁ దరచి,
నిఖిల హృద్గత భావముల్ నెమరు వేసి,
స్వానుభవమెల్ల శిల్పి తా సంగ్రహించి,
రచన సాగించె నీశిలా గ్రంథమునకు.

మైనపు ముద్దకంటె సుకుమారముగా మన శిల్పి చేతులన్
బూనిన రాలు మెత్తబడి పోయి తమం తన లోఁగి వచ్చె, సుం
తేనియు కర్కశత్వము వహింపక రూపము జెందుదాక, కా
దేని రవంత గంటు పడ దే యులి మోపున నెచ్చటేనియున్ ?

* * *

అతని హృదయాన జీర్ణమై, నట్టి ప్రకృతి
ప్రతిఫలించిన దల కారురాలమీఁద ;
అమృతమయమైన యతని హస్తముల మొలిచి,
శిల్పవల్లరి కిసలయిం చినది దిశల!

* * *



# రేడియో నాటికలు



'అమరేంద్ర'

నాటకం అనే సరికి తెరలూ, వేషాలూ, రంగులూ వెలుగుజిలుగులూ, రంగస్థలమూ తప్పనిసరిగా స్ఫురిస్తయ్. కాని ఈ హంగులేవీ లేకుండా వినే వాళ్ళ మనస్సులనే తమ విశాల రంగస్థలాలుగా చేసుకుని రస తరంగాలలో హృదయాలని ఊయెల లూపగల శక్తి శ్రవ్యనాటకాల కున్నది. నటీనటులు వేషాలు వేసుకోకుండా రంగులు పూసుకోకుండా ధరించే పాత్రల వ్యక్తిత్వాన్ని కంఠస్వరంలో పరికిస్తూ శ్రోతలని రంజింపజేస్తారు. రంగుల తెరల మూలంగానూ, కళ్ళను జిగేలు మనిపించే అలంకారాలవల్లనూ ఎటువంటి సహకారమూ అపేక్షించకుండా శ్రవ్యనాటకరచయిత కేవలం తను వాడే శబ్దాలవల్లనే కావలసిన వాతావరణాన్ని, పాత్రలనీ సృష్టించి శ్రోతల మనోవీథిలో నాటకాన్ని నడిపిస్తాడు. తెరలు వాల నవసరం లేదు. దీపాలు ఆరనక్కర్లేదు. క్షణకాలంలో ఒక దేశంనుంచి ఇంకో దేశానికి, ఒక శతాబ్దంలోంచి ఇంకో శతాబ్దానికి దూకుతూ శ్రవ్యనాటకం దేశకాలాల సంకెళ్ళని విదిలించుకుంటూ అద్భుతమైన రసప్రపంచంలోకి జిలుగురెక్కలమీద వినేవాళ్ళని తేల్చుకుపోతుంది. రంగస్థలపు హంగామా లేకపోయినా సమర్థుడైన రచయిత చేతుల్లో శ్రవ్యరూపకం నాటకానికి దీటుగా రాణించే అవకాశం వుంది.

ఇటువంటి శ్రవ్య నాటకాల ఆధునిక రూపమే రేడియోనాటిక. ఊరూరా రేడియోలు వెలిసి వేల మంది శ్రోతలని ఆకర్షించటం, విజయవాడ, మద్రాసు, హైదరాబాదు కేంద్రాలు విరివిగా రేడియో రూపకాలని వినిపించటం జరుగుతున్న ఈ కాలంలో రేడియో రూపకానికి విస్తారమైన ప్రచారమూ, విశిష్టమైన స్థానమూ లభిస్తున్నది. ఈ రూపకాలు ఎందరు శ్రోతలనో రంజింపజేసి మన్ననలు పొందుతున్నయ్.

ఆధునిక సాహిత్య ప్రక్రియలలో రేడియో రూపకం అతి కొత్తదైనప్పటికీ ప్రతిభావంతులైన కవులనీ, పండితులనీ, రచయితలనీ ఎంతో బలంగా ఆకర్షిస్తున్నది. విశ్వనాథ, దేవులపల్లి, పిలకా గణపతి శాస్త్రి, కాటూరి, శ్రీ. శ్రీ ఆరుద్రలవంటి ప్రఖ్యాత కవులు తమ విశిష్ట శక్తులని వెల్లడించే రూపకాలెన్నో రచించారు. బుచ్చిబాబు, కొడవటిగంటి, గోరా శాస్త్రి, గోపీచంద్, పద్మరాజులవంటి ప్రముఖ రచయితలూ, మల్లంపల్లి, శివశంకర శాస్త్రిలవంటి పండితులూ చక్కని రేడియో రూపకాలని శ్రోతలకి అందించారు. వింజమూరి శివరామారావుగారు కవుల జీవిత ఘట్టాలనీ, ఇతిహాసాలలోని రసవంతమైన సన్నివేశాలనీ ఆధారం చేసుకుని రచించిన రూపకాలని విజయవాడనుంచి విరివిగా వినిపిస్తున్నారు. సుమధురమైన సంగీతరూపకాలని రజనీకాంతరావుగారు మద్రాసునించి వినిపిస్తున్నారు.

రేడియో రూపకాలలో రచననిబట్టీ వస్తువుని బట్టీ చూస్తే కొన్ని తరగతులు కనిపిస్తయ్. పౌరాణిక గాథలని ఆధారం చేసుకుని రాసిన రూపకాలు అసంఖ్యాకులైన శ్రోతలని అలరించగలవు. పాండవోద్యోగ విజయాలు, చిత్రనళీయం, గయోపాఖ్యానం మాదిరి పేరు మోగిన నాటకాలు రేడియో రూపకాలుగా ప్రసారమైనప్పుడు శ్రోతలెంతో ఆనందించారు. మల్లంపల్లి, వింజమూరి రచించిన చరిత్రాత్మక రూపకాలుకూడా చాలామంది శ్రోతలని ఆకర్షించినయ్. సాంఘిక ఇతివృత్తంతో రాసిన కొడవటిగంటి, గోపీచంద్, పద్మరాజుల రూపకాలు కొంచెం చదువుకున్న శ్రోతలనిబాగా, కదిలించినయ్. బుచ్చిబాబు గారి "రాజమార్గం" కౌండిన్యగారి "నీడలేని మనిషి" శ్రీ. శ్రీ గారి "అనంతరయాత్ర" ఆరుద్రగారి "అడిగింది ఒకతల్లి" వంటి ఊహాచిత్రాలు అద్భుతమైన భావనాశక్తితో, అభిరుచివున్న శ్రోతలకి వీనులవిందు చేసినయ్. అన్ని రేడియో రూపకాలూ అందరికీ నచ్చకపోయినా, అన్ని రకాల శ్రోతల అభిరుచులకీ అనుగుణమైన వైవిధ్యం రేడియోరూపకాలలో కనిపిస్తున్నది. రమణీయమైన కావ్యాలలాగా తీర్చి దిద్దిన రూపకాలని కృష్ణశాస్త్రి, గణపతిశాస్త్రి, శివశంకర శాస్త్రి ప్రభృతులు శ్రోతలకి అందించారు. ముని

మాణిక్యంగారు హాస్య రూపకాలతో గిలిగింతలు పెట్టారు.

కాని కొత్తగా కలం పట్టుకుని రేడియోనాటిక రాయాలని పూనుకునే రచయితకి దారీ తెన్నూ దొరకదు. అన్ని సాహిత్య రూపకాలకీ వున్నట్టే రేడియో రూపకానిక్కూడా కొన్ని నియమాలూ, కొన్ని నిబంధనలూ కనిపిస్తయ్. వాటిని స్పష్టంగా గ్రహిస్తే కాని మంచి రూపకాన్ని రచించటం సాధ్యం కాదు. రేడియో నాటకలక్షణాలని స్పష్టంగా నిర్దేశించే సాహిత్యం ఎక్కువ కనిపించదు.

ఆంగ్లసాహిత్యంలో రేడియో నాటక రచయితగా విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకున్న ఆధునిక కవి లూయీ మెక్నీస్. ఆయన ప్రసారం చేసిన రసవంతమైన రూపకాలని "క్రిస్టఫర్ కొలంబస్" "ది డార్క్ టవర్" అనే సంపుటాలల్లో ప్రచురించాడు. ఆ గ్రంథాలకి పీఠికల రూపంలో మెక్నీస్ రేడియో రూపకాల స్వరూప స్వభావాలని గురించీ, వాటి నిర్వహణలోని సాధక బాధకాలని గురించీ కొన్ని అమూల్యమైన అభిప్రాయాలు వెల్లడించాడు. కొత్త రచయితలకి దారి చూపగల సూచనలెన్నో ఈ పీఠికల్లో కనిపిస్తయ్. రేడియో నాటకరచయితలందరూ పరిశీలించి, గుర్తించి, అనుసరించదగిన అంశాలు మెక్నీస్ పీఠికలో ఎన్నో వున్నయ్.

రేడియో నాటక రచయిత ముందుగా గుర్తించవలసిన విషయం—శబ్దమే రూపకానికి ప్రాణం. కొందరు కొన్ని మాటలు పలకటం వాటిని మరి కొందరు వినటం అనే విషయాల మీదనే రేడియో రూపకం ఆధారపడుతుంది. శబ్దమే రచయిత చేతులో వున్న ముఖ్య పరికరం. ఈ విషయాన్ని వివరిస్తూ మెక్నీస్ రేడియో రచయితల అనాదికవుల మనస్తత్వానికి దగ్గిరగా వెళ్లాలంటాడు. రాసేపరికరాలూ, అచ్చు యంత్రాలూ అమలులోకి రాకపూర్వం సాహిత్యమంతా చెవిమీదనే ఆధారపడేది. వినటం ద్వారా సాహిత్యం హృదయాన్ని తాకేది. హోమరు కావ్యాలు పదాలుగా కొందరు పాడటం, అవి మరి కొందరు విని నేర్చుకోవటం వాళ్లదగ్గరినించి ఇంకొందరు నేర్చుకోవటం—ఈవిధంగా సాహిత్యం భద్రంగా జీవించటం జరిగింది. ఒక పళంలో కవిత్వం సాహిత్యం అన్నీ చెవిని ఆశ్రయించి వినికిడి మీదనే ఆధారపడి వుండేవి. ప్రతి శబ్దానికీ అది మోసే అర్థాన్ని బట్టి ఒక విలువ వుంటుంది. అది చేసేధ్వనికి మరొక విలువ వుంటుంది. అనాది కవులు శబ్దానికున్న ఈ రెండు విలువలను పూర్తిగా గుర్తించేవారు. వాళ్ల మాదిరిగానే రేడియో రూపక రచయిత శబ్దానికున్న రెండు విలువలనీ గుర్తించాలి. శబ్దాలని ఏరుకోటంలో శ్రద్ధా, నేర్పూ కనబరచాలి రేడియో నాటక రచయిత శబ్దానికున్న ధ్వని విలువని విస్మరించ కూడదంటాడు మెక్నీస్. రచయిత జయపరాజయాలకి అతను ఏరుకునే శబ్దాలే కారణాలని మెక్నీస్ అభిప్రాయం.

కనక రేడియోరూపకంలో వాడే మాటలు వినగానే మనస్సులో నాటేవిగా వుండాలి. వింటుంటేనే వాటి అర్థం సులువుగా వినేవాళ్లకి అందాలి. జటిలమైన పదగుంఫనలకీ, క్లిష్టమైన సమాసాలకీ, కష్టమైన ప్రయోగాలకీ రేడియోరూపకాల్లలో తావు లేదు. మాటలు తేటగా, తీయగా, హాయిగా వుండాలని శైలి సులువుగా అందరికీ అందుబాటులోవుండాలని మెక్నీస్ సూచన.

సులువుగా వుండాలి కాని శైలి చౌకపా వుండకూడదంటాడు మెక్నీస్. రేడియో నాటికలో పాత్రలు చౌకగా మాట్లాడకూడదు. రూపకంలో పాత్రలు నిత్య జీవితంలో అవి మాట్లాడలేని విధంగా ఒక్కొక్కప్పుడు మాట్లాడవలసి వస్తుంది. నిత్యజీవితంలో వినిపించని గాంభీర్యం పాత్రలమాటల్లో కనబడాలి. సంభాషణలు సహజంగా, సరళంగా, ఉదాత్తంగా వుండాలి. రూపకం ప్రసారానికి దొరికే సమయం చాలా తక్కువ కనక చెప్పిందే చెప్పటం, పడికట్టురాళ్లు దొర్లించటం, ఓటిమాటలు విసరటం రచయితలు పూర్తిగా మానివేసి ప్రతిక్షణమూ అమూల్యమనే సంగతి గుర్తించాలి. వాడే ప్రతి శబ్దమూ వాతావరణానికీ, పాత్రచిత్రణానికీ, కథపరుగుకీ సాయపడాలి. విషయాన్ని సూటిగా, క్లుప్తంగా, సులువుగా వివరించగల శక్తి ప్రతి రేడియో నాటక రచయితకీ ఎంతో అవసరం. వినేవాళ్లకి కొరుకుడు పడక తికమకలు పెట్టే విషయాలని రూపకంలో జొరబడనివ్వద్దని మెక్నీస్ సలహా. రూపకం శ్రోతకి క్షణంసేపు చికాకు కలిగిం

చినా లాభంలేదు. చదువరికుండే ఓపిక శ్రోతకి వుండదు. మరుక్షణంలో స్విచ్ నొక్కటమో, శ్రోత ఇంకో కేంద్రానికి పరిగెత్తటమో జరుగుతుంది. కనక రేడియో రచయిత తను కొన్ని అవధుల మధ్య కట్టబడి వున్నానని తెలుసుకుని జాగర్తగా మెలగాలి. తన కావ్యంలో స్వేచ్ఛగా ఎగిరె కవిలాగా రేడియో రూపకకర్త విశృంఖలవిహారానికి పూనుకోరాదని మెక్నీస్ హెచ్చరించాడు.

రేడియో రూపకరచయిత తన పరికరాలు చాలా కొద్దివన్న సంగతి మరిచిపోరాదు. ప్రసారం చేసే స్టూడియోని ఎప్పుడూ మనస్సులో వుంచుకో వాలి. కొన్ని గ్రామఫోనురికార్డులూ, కొన్ని వాద్యాలూ స్టూడియోలో వుంటయ్. పరిమితమైన పరికరాల సాయంతో తన శబ్దజాలంమీదనే ఎక్కువగా ఆధారపడి రచయిత రూపకాన్ని సృష్టించాలి. అసాధారణమైన విషయాలని రూపకంలో ప్రవేశపెడితే వాటిని స్టూడియోలో సృష్టించి వినిపించటం అసాధ్యమౌతుంది. కనక స్టూడియో సాధక బాధకాలని గుర్తెరిగి రచన సాగించటం చాలా ముఖ్యమని మెక్నీస్ ఉద్దేశం. నిర్వహణ బాగుండకపోయినా మంచి రచన శ్రోతలకి ఆనందదాయకంగా వుండగలదంటాడు మెక్నీస్. కాని మంచిరూపకం రాయటానికి స్టూడియోని గుర్తులో వుంచుకోవటం చాలా ముఖ్యం అంటాడు.

రచన బాగుంటే దానికి నిర్వహణలో శబ్దసహకారంవల్లా, సంగీత సహకారంవల్లా మెరుగులు దిద్దవచ్చును. కాని ఈ *Sound-Effcets* మీద రచయిత పూర్తిగా ఆధారపడి వాటివల్లనే రక్తి కట్టించగలనని ఆశ పడకూడదని మెక్నీస్ అభిప్రాయం. అనివార్యమైనప్పుడే *Effects* మీద రచయిత ఆధారపడాలి. అప్పుడైనా ఆ *Effects* వల్ల తన రచనకి బలం చేకూరుతుందను కుంటేనే వాటిని కోరాలి. అదీ కాక తను కోరే శబ్ద సహకారం స్టూడియోలో లభిస్తుందని తెలిస్తేనే కోరాలి. అంతేకాని అనవసరమైన శబ్దాల గడబిడ రూపకానికి హాని కలిగిస్తుంది. ఈ *Effects* రెండు రకాలు! స్టూడియోలో అప్పటికప్పుడు వినిపించేవి. చిత్రనళీయం నాటకంలో నలుడు అడవిలో నిద్ర పోతున్న దమయంతిచీర చింపుకుని కట్టుకునే టప్పుడు చీరని చింపే చప్పుడు అప్పటి కప్పుడు వినిపించవచ్చు. ఉద్యానవనంలో పక్షుల పాటలు, రైలుమోతా మొదలైనవి రికార్డుచేసి అవసరమైన సందర్భాల్లో ఆ రికార్డు వినిపించటం రెండోపద్ధతి. ఈ రెండురకాల *Effects* నీ ఎంత తక్కువగా, ఎంత నేర్పుగా వాడుకుంటే రచన అంత రాణిస్తుందంటాడు మెక్నీస్.

రేడియోరూపకానికి సంగీతసహకారం చాలా శోభనిస్తుంది. మనోహరమైన దృశ్యాలు లేని వెలితిని మధురమైన సంగీతం కొంతవరకూ తీరుస్తుంది. పద్మరాజుగారి "ఆత్మహననం" అనే రూపకంలో ఊర్వశి అవతరించే ఘట్టంలో వినిపించిన లలితమైన సంగీతం ఒక అద్భుత దృశ్యాన్ని శ్రోతల మనస్సుల మీద రమణీయంగా చిత్రించింది. ఇళ్లు తగలబడిపోవటం మొదలైన భయానకదృశ్యాలని సంగీతం ద్వారా స్ఫురింపచేయవచ్చు. అంతేకాకుండా మాటలు చెయ్యలేనంత త్వరగా సంగీతం దేశకాలాల మార్పుని సూచించగలదు. క్షణంలో భీషణ యుద్ధరంగాన్ని, మరుక్షణంలో ప్రశాంతమైన ఉద్యానవనాన్ని సంగీతంతో చిత్రించవచ్చును. ఒక భావంలో ఉచ్ఛస్థాయికి సంగీతం ఇట్టే తీసుకుపోతుంది. కాని సంగీతం మోతాదు మించకూడదని మెక్నీస్ సిద్ధాంతం. కొందరు సంభాషణల వెనకాల రూపకమంతటా సంగీతం వినిపిస్తూవుండాలంటారు. ఇల్లా చేస్తే శ్రోతల మనస్సు సంభాషణల మీద నిలవలేక తికమక పడుతుందంటాడు మెక్నీస్. కనక సంభాషణల మధ్య విరామంలోనూ, ప్రత్యేక వాతావరణాన్ని చిత్రించవలసినప్పుడూ తప్ప ఇతరసమయాల్లో సంగీతం అతిగావాడి శ్రోతమనస్సుని చెదరకొట్టకూడదని మెక్నీస్ వాదం. రూపకంలో సంగీతం ఒక ఉపాంగంగా వుండాలి కాని ప్రముఖస్థానాన్ని ఆక్రమించ కూడదంటాడు. ఈ నియమం సంగీత రూపకాలకి వర్తించదు.

రేడియోరూపకశిల్పాన్ని గురించి ప్రస్తావిస్తూ లూయీ మెక్నీస్ మంచి రూపకానికి రెండు ముఖ్యలక్షణాలుండాలన్నాడు. నిర్దుష్టమైన నిర్మాణం వస్తువులో ఐక్యత. రూపకంలోని సన్నివేశాలన్నిటినీ ఏకం చేసే సూత్రం వుండాలి. ఒక కేంద్రాన్ని ఏర్పరుచుకుని దానిచుట్టూ సంఘటనలు నిర్మించాలి.

రూపకానికి ఒక స్పష్టమైన లక్ష్యముండాలి. అందులో ప్రతి అంశమూ ఈ లక్ష్యం సాధించటంలో కవికి తోడ్పడాలి. దృశ్య నాటక రచయితకంటె ఎక్కువ శ్రద్ధతో, పొదుపరితనంతో అప్రస్తుతమైన అంశాలని విడిచేసి ముఖ్యమైన విషయాలనీ ఏరుకోవాలి. శ్రోతని చికాకు పరిచే క్లిష్టమైనఅంశం ఒక్కటికూడా వుండకూడదు. పాత్రలనీ, సన్నివేశాలనీ స్పష్టంగా చిత్రించాలి. ఒడుదుడుకులేకుండా సాఫీగా కథ నడవాలి. రూపకానికి స్థూలమైన సుందర స్వరూపం ఏర్పరచటానికి రచయితకి ప్రతిభ కావాలి. సున్నితమైన, సూక్ష్మమైన, ఒదుగులూ, మెరుగులూ దిద్దటానికి నేర్పు కావాలి. రూపకం ఒక అందమైన భవనం. ప్రతిశబ్దమూ, ప్రతి సన్నివేశమూ ఆ భవనపు అందాన్ని నిర్మించే ఇటుకల మాదిరివి. ఈ శిల్పసౌష్టవం రూపకానికి ఎంతో అవసరం.

ప్రతి రూపకానికీ ఒక ముఖ్యమైన అంశం కేంద్రంగా వుండాలి. మిగతావన్నీ దాన్ని పోషిస్తూ సాయపడాలి. అన్ని అంశాలనీ రూపకంలో మేళవించాలి. అతుకులు కనిపించకూడదు. వినేవారికి లేశంకూడా విసుగు కలిగించకుండా రచయిత జాగ్రత్త పడాలి. మొదటినించి చివరిక్షణం దాకా తరగని కుతూహలంతో శ్రోతని విన్నేట్లు చెయ్యాలి. ఇదే రచయిత ముఖ్యంగా సాధించవలసిన విషయం అంటాడు మెక్నీస్.

రూపకం ఆరంభించటంలోనే శ్రోతని ఆకట్టి వెయ్యాలి. ఆరంభించటంలో అద్భుతమైన నేర్పు మెక్నీస్ రూపకాల్లో కనిపిస్తుంది. ప్రకటన చేసే *announcer* ని కూడా రూపకంలో పాత్రగా ప్రయోగించి ఆరంభంలోనూ, అంతంలోనూ చక్కటి చమత్కారాలు శిల్పవిన్యాసాలూ మెక్నీస్ ప్రదర్శించాడు కొన్ని రూపకాల్లో.

ఇక వస్తువు విషయంలో ఏదైనా తీసుకుని రూపకం రాయవచ్చు. పౌరాణికం, చారిత్రికం, సాంఘికం, కల్పితం — ఏదైనా తగిన శిల్పం వుంటే మంచి రూపకానికి వస్తువే అవుతుంది. తనని సరించిన వస్తువుకంటె ఇతరులని నిర్లిప్తంగా (*objective there*) చిత్రించే పరాశ్రయమైన ఇతివృత్తాలు రూపకానికి ఎక్కువ అనుకూలంగా, రసవంతంగా వుంటయ్యని మెక్నీస్ అభిప్రాయం.

రేడియో రూపకరచయిత వాస్తవాన్ని వర్ణించే విలేఖరికంటె ఆదర్శంతో వాస్తవాన్ని మేళవించే కవికే దగ్గరివాడని మెక్నీస్ ఉద్దేశం. జీవితాన్ని ఉన్నదున్నట్లుగా కాక, వాస్తవ విషయాలని విశాలంగానూ, సరళంగానూ చిత్రించినప్పుడే రేడియో రూపకం ఉత్తమశ్రేణిని అందుకుంటుందంటాడు. కనక రూపకంలో జీవిత-చిత్రణం ఉదాత్తంగా వుండాలి.

మంచి నవలలూ, గొప్ప నాటకాలూ రేడియో రూపకాలుగా రాణించకపోవచ్చును. షేక్స్పియర్ మహాకవి నాటకాలని ఆధారంగా చేసుకుని రాసిన రూపకాలు బి. బి. సి. కేంద్రం ప్రసారం చేసినప్పుడు అంతగా రక్తికట్టలేదు. శరత్ చంద్ర ఛటర్జీ రాసిన అద్భుతమైన నవలలు రేడియో రూపకాలుగా వెలువడినప్పుడు చదివినంత రసవంతంగా వింటుంటే కనిపించలేదు. ఒక రూపాన్ని ఇంకో రూపంలోకి దించటానికి ప్రయత్నించటం రెంటికీ అపాయకరమనీ, రేడియో రూపకానికి కొన్ని ప్రత్యేక లక్షణాలున్నవనీ మెక్నీస్ అంటాడు.

కనక రేడియోరూపకానికున్న విశిష్టతనీ, స్వరూప స్వభావాలనీ, గుర్తించి మన రచయితలు శ్రవ్యనాటికలు నిర్మిస్తే ముందుముందు ఇంకా రసభరితమైన రూపకాలని శ్రోతలకి అందించ గలుగుతారు. నవ్యాంధ్ర సాహిత్యశాఖల్లో రేడియో రూపకానికి ఉజ్జ్వలమైన భవిష్యత్తు వుండితీరుతుంది.

# యజ్ఞఫలము - భాసుని ప్రతిభా విశేషములు



శ్రీ బులుసు వెంకటేశ్వరులు

భాసమహాకవి ఇరువది మూడు నాటకములకు తక్కువ కాకుండ వ్రాసియుండవలయు ననియు, 'కిరణావళి' 'ముకుటతాడితకము' 'ఉదాత్త రాఘవము' మున్నగు నామములు గల భాసనాటకము లింకను మనకు లభింపవలసియున్నవనియు శ్రీ ఆర్. వి. కృష్ణమాచారిగారు తమ ప్రియదర్శికా భూమికలో వ్రాసియున్నారు. * ఇట్లే భాసుడు ముప్పది నాటకములవఱకు వ్రాసియుండవలయు నని మఱి యిద్దఱు విమర్శకులు పేర్కొనియుండిరి. ఏది యెట్లున్నను, అలంకార గ్రంథములలో నుదాహృతములైన శ్లోకములు కొన్ని ప్రస్తుతము మనము భాస నాటకములుగా బరిగణించు పదుమూడు నాటకముల లోను గానరాకపోవుటవలన భాసు డింకను గొన్ని నాటకములు వ్రాసియుండవలయు ననియు గాలగర్భమున నవి లీనమై యుండుననియు ననుకొనుటకు వీలు చిక్కుచున్నది. ఈ యవకాశమును బురస్కరించుకొని యిటీవల వెలువడిన 'యజ్ఞఫల' మను సంస్కృత నాటకము భాస మహాకవి రచించియుండిన నాటకములలో నొకటి యని తెలియుచున్నది.

## యజ్ఞఫలము : గ్రంథస్వరూపము

ఈ నడుమనే కథియవాడు రాష్ట్రమునకు జెందిన గోండలు నగరమునుండి రాజవైద్య జీవరామ కాళిదాసశాస్త్రి గారు 'యజ్ఞఫల' మను నాటకమునకు సుమారు మూడు వందల సంవత్సరములకు వెనుకటివైన రెండు ప్రాచీనపు వ్రాతప్రతులను సంపాదించిరి. వాని ననుసరించి 'యజ్ఞఫలము'ను బ్రకటించి తమ యుపోద్ఘాతములో "అతి ప్రాచీన సంస్కృతభాష ననుసరించియు, వస్తుకల్పనమునగల శ్రేష్ఠతను బట్టియు, రసభావాలంకార నాట్యాంగ మనోహరత్వమును బురస్కరించుకొనియు, భాస నాటక సామాన్యలక్షణము లని బాణాదులు చెప్పిన యనేక విషయముల కీ నాటకము నిధానమగుట బట్టియు, నిది తప్పక భాసనాటకములలో నొకటి యని నా దృఢవిశ్వాసము" అని వారు పేర్కొనియున్నారు. ఆ పిమ్మట, వెనుకటి పదుమూడు నాటకములు భాసునివి 'కా' వని కొందఱు 'ఔ' నని కొందఱు వాదించుచు వచ్చుచున్నట్లే 'యజ్ఞఫలము' కూడ భాసునిదే యని కొందఱు కాదని కొందఱు పత్రికలలో తర్జనభర్జనలు కావించియున్నారు.†

ఈ పరిస్థితిలో బొంబాయి భారతీయ విద్యాభవన స్తంభములలో నొకరనదగిన డాక్టరు ఏ. డి. పుసల్కరు ఎం. ఏ; పి. హెచ్. డి; బెంగుళూరు సంస్కృత సారస్వతసమితికి ప్రాణమనదగిన శ్రీ ప్రొఫెసరు యస్. యన్. సింహా ఎం. ఏ, మున్నగు వారు సునిశితవిమర్శన మొనరించి యుక్తియుక్తముగా 'యజ్ఞఫలము' భాసకృతమే యనుటకు సంశయింప బనిలేదని తమ గ్రంథములలో దెలిపియున్నారు.‡ వారు చూపిన హేతువాదమును బరిశీలించుటకు బూర్వము స్థాలీపులాకన్యాయమున యజ్ఞఫల నామౌచిత్యము, నాటకకథా విధానము దెలిసికొనుట యత్యావశ్యకము. వీనివలననే కొంతకు గొంతయైనను ఈ నాటకము భాసమహాకవి కృతమే యని తెలియక మానదు.

## నామౌచిత్యము

ఈనాటకమున 'యజ్ఞఫల' మనుమాట ఐదాఱు పర్యాయములు వచ్చుటయే కాక దశరథుని యజ్ఞ ఫలముగా శ్రీ రామావతారము విశ్వామిత్రుని యజ్ఞ ఫలముగా శ్రీ రామాస్త్రపరిగ్రహణము జనకుని యజ్ఞ ఫలముగా శ్రీ సీతారామకల్యాణము ఈ నాటకమున

---

* ప్రియదర్శికా భూమిక. పుట. xxxiii. వి. వి. ప్రెస్సు. శ్రీరంగము. 1909 సంవత్సరమున ముద్రితమైన ప్రతి.

† శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యాసంస్థ పత్రిక సంపుటము 11 సంచిక 2 జూలై డిసెంబరు 1941. పుట. 473. *Quarterly Journal of the Mythic Society.* సం. xxxii. సంచిక 4. పుట 441. *Hindu Literary Supplement* 15–2–1942.

‡ 1. *Bhasa. by Dr. A. D. Pusalker* పుట *135 - 142*

2. *Pancharatna. Edited and published by S. N. Simha. M. A. Bagnalore.*

వస్తువులగుట ఈ నాటకమున కీ నామము చాల ఉచితముగా నున్నది. సుగ్రీవ విభీషణ రామపట్టాభిషేకములు కథావస్తువులుగా గల నాటకమునకు 'అభిషేక నాటక'మని పేరిడిన భాసుడే 'యజ్ఞఫలము' అను నామ మీ నాటకమున కిడియుండుట చాల సమంజసమని తోపకమానదు.

## కథావస్తువు

### (ప్రథమాంకము)

ఇందు దశరథుని యజ్ఞఫలముగా రాముడు లవతరించుటయు, వారిబాల్యము కడచుచుండుటయు, వారి జన్మదినోత్సవము దశరథమహారాజు జరపుచుండుటయు, దశరథుని హృదయమెఱిగి సుమంత్రుడు రాజ్యమున గల సర్వప్రజలను వాంఛితార్థములచే సంతోష పెట్టుటయు, అటుపిమ్మట కారాగృహబద్ధుల నెల్లరవిడిచి పుచ్చుమనియు సర్వజనులను సర్వదాన సత్కారములచే సంతోష పెట్టుమనియు రాజాజ్ఞయగుట కంచుకి తెలుప సుమంత్రు డప్పటి కప్పుడే యాపని యొనరించియుంటినని తెలుపుట, రాజు తనపై బడ్డ గురుతరబాధ్యతలకు, పుత్త్రులనెట్లు శస్త్రాస్త్ర సర్వవిద్యాపారంగతుల గావింప గలుగుదునో యని బెంగపెట్టుకొనుట, వసిష్ఠ మహర్షికి విద్యార్థులనుగా వారి నొప్పగించుట, రాజు సుమంత్రునితో దన గురుతర బాధ్యతలను గూర్చియు రామపట్టాభిషేక ప్రతిబంధకమగు కైక వరమును గూర్చియు ముచ్చటించుట, ఇంతలో రాణులు ముగ్వురు నెవరికివారే ముందు తమకుదర్శనమిప్పింపుమని రాజునకు విన్నపము లంపుకొనుట, రాజు ముగ్వురను సమముగా గౌరవింతునని ప్రతివచనమిచ్చి గ్రీష్మోద్యానమునకు రమ్మని వార్తలంపుట, ఇంతలో సూర్యాస్తమయమగుట రాజు విదూషకునితో వెడలుటయు జరుగును. ఈ అంకము మొదటనే విదూషక కాంచుకేయ సంభాషణము భాసుని హాస్యరస చమత్కృతులకు నిదర్శనముగా వెలయుచున్నది.

## ద్వితీయాంకము

ఇందు రాజు పరివారముతో గ్రీష్మోద్యానమున ప్రవేశించుట, సుమంత్రుని బిలిచి రాముని యౌవరాజ్యాభిషేకమున కనుకూలముగా సర్వజనులను రామ మానసులనుగను భరతుని రామభక్తునిగను జేయుచుండుమనుట, ఇంతలో రాణులు రాగా సుమంత్రుడు వెడలిపోవుట, రాజు రాణులతోడి సంభాషణమున అభిషేకప్రశంస తెచ్చుట, దాయభాగవిచారము, సుమిత్ర రామభక్తి, కైకేయి సౌశీల్యముతో రామునికే రాజ్యమీ దగుననుట, కౌసల్యా రామానురక్తి, సుమిత్రా కైకేయీ సౌశీల్యప్రదర్శనవ దశరథు డమితానందమందుట, రాణుల నిష్క్రమణము, దశరథుడు సుమంత్రుని బిలిచి వసిష్ఠాదేశప్రకారము తనపుత్రులను రాజనీతి శాసనవిధాతలజేసి యనుగ్రహింపుడని విన్నపమంపుట, ఇంతలో రామకీర్తి విని రావణు డయోధ్యానగరమున అనిష్టమాచరింప దిరోహితుడై తిరుగుచుండె నన్నవార్త విని రాజు ప్రతీకారచర్యల గైకొన నేగుట జరుగును.

## తృతీయాంకము

ఈ యంకమున విష్కంభములో నింద్రుడిరువుర గంధర్వులను రావణునివలన రామునకే యపాయము కలుగకుండునట్లు చూచుటకు బంపుట దెలియనగును. తరువాత రావణ విశ్వామిత్రులు మాయారూపులై తిరోహితులుగ వచ్చుట, వారొకరినొకరు కనుగొనగలిగియు నితరుల కగపడకుండుటయు, రావణుడు రాము నెత్తుకొని పోవుటకు, విశ్వామిత్రు డాతనిని శిష్యునిగా గైకొని దివ్యాస్త్రముల నుపదేశింప గైకొనిపోవుటకు, వచ్చినట్లు తెలియును. ఇంతలో రాజకుమారులతో వసిష్ఠు డరుదెంచి నా డనాధ్యాయమగుట రాజకుమారులను వారి వారి ధనుర్విద్యాకౌశలము బరీక్షించుకొన ననుమతించి వెడలిపోవుట, కొంత దవ్వేగి రాజకుమారులలో భరత లక్ష్మణ శత్రుఘ్నులు తమ తమ ధనుర్విద్యానిపుణత జూపుట, వారు రాముని విద్యానిపుణత జూప బలవంతపెట్టుట, రాముడు రెండుసారులు బాణములు విడుచుట వానిని దారిలో మాయాశరీరులైయున్న రావణ విశ్వామిత్రులు త్రుంచివేయుట, రాముడు కోపించి యాగ్నేయాస్త్రము ననుసంధించుట, రావణు డది చూచి భీతుడై పాఱిపోవుట, ఆత డే యకర్మమును జేయకుండునట్లు చూచుటకు విశ్వామిత్రు డాతని ననుసరించి పోవుట, ఇంతలో రాణుల చెలికత్తెలు దూరమున గనబడ వారికి దగులునను భీతిచే రాముడు బాణము విడువకుండుట, రావణుని రథపు గుర్తులు గాంచి చెలికత్తెలు భీతావహలై పాఱిపోవుట, రాముడు బాణము విడువజూచుచుండ వసిష్ఠమహర్షియే తెంచి వారికి రావణ విశ్వామిత్రుల యాగమన విశేషములం జెప్పి మఱునాడు విశ్వామిత్రు డటకురానున్నాడనియు వచ్చినపుడు నమస్కారపురస్సరముగా గౌరవింపుడనియు జెప్పి వెడలుట, రాజకుమారు లింటికేగుట, మంథర దుర్మంత్రణము, సుమంత్రుడువచ్చి రావణ విశ్వామిత్రాగమనవార్త విని కావలివారలను హెచ్చరింప నేగుట జరుగును.

## చతుర్థాంకము

ఈ యంకమునకు దొలుత నలువురు కావలివారి హాస్యసంభాషణము, విదూషకుని థాకతో

నది యధికమగుట, విశ్వామిత్రునిగుఱించి వారు వికటముగా జెప్పుకొనుట జరుగును. పిదప విశ్వామిత్రుడు దశరథుని కొలువుకూటమున కేతెంచి గౌరవింపబడి రాజకుమారులను వసిష్ఠు ననుమతి బరీక్షించుట, పరీక్షాసమయమున రాజకుమారులకు జృంభకాస్త్ర బ్రహ్మాస్త్రములు తెలియవని తెలిసికొని రాక్షసవధనిమిత్తము రాముని దనతో బంపుమని దశరధు నడుగుట, దశరథుని సంకోచము, వసిష్ఠుననుమతిని దశరథుడు తన పుత్రులు త్వరలో దివ్యాస్త్రాన్వితులై తిరిగి తన కడకు వచ్చెదరని విశ్వామిత్రుడు మాట నొసగ నాతనితో దన పుత్రులను బంప నిచ్చగించుట, విశ్వామిత్రుడు రామలక్ష్మణులను మఱునాడుదయము తన యాశ్రమమునకు దీసికొనిపో నిర్ణయించుకొని విశ్రమించుట జరుగును.

## పంచమాంకము

ఇందలి విష్కంభము వలన రామలక్ష్మణ సాహాయ్యమున విశ్వామిత్రుని యజ్ఞముపూర్తియగుట, మారీచసుబాహుల పతనమువలన అరణ్యజనులు సుఖించుటయు దెలియును. అంత రామలక్ష్మణులతో విశ్వామిత్రు డరుదెంచి రాముని గొనియాడుట, రామలక్ష్మణుల వినయప్రదర్శనము, రామ రావణ భవిష్యద్యుద్ధమున రామ విజయము విశ్వామిత్రుడు సూచించుట, రామలక్ష్మణు లారణ్యప్రకృతి రామణీయకమునకు సమ్మోహితులగుట, విశ్వామిత్రుడు వారికి గ్రామజీవన సౌభాగ్యము జూపుట, రామలక్ష్మణులు వృద్ధగోపాల స్త్రీతో భాషించి గ్రామజీవనకృతిమత, గ్రామజనపవిత్రత దెలిసికొనుట, విశ్వామిత్రాదేశమున జనకుని యజ్ఞమునకు విశ్వామిత్రునితో రామలక్ష్మణు లేగుట కంగీకరించుట యుందుగలవు.

## షష్ఠాంకము

విష్కంభమున విశ్వామిత్ర పరిచర్యకు నియుక్తులైన సుగ్గరుభటులు తమ సంభాషణలో రామలక్ష్మణుల సౌందర్యవర్ణనము, రాము నుద్యానమున వొంటరిగాజూచిన సీత యాతని బ్రేమించుటయు, రాముడు సీతపై మక్కువగొనుటయు మనకు దెలుపుదురు. పిదప, ప్రేమావేశచిత్తుడగు రాముడు ప్రవేశించి సీతాసక్తమగు మనస్సును నిగ్రహించుకొన యత్నించుట, ఇంతలో సీత చెలికత్తెలతో మరల గాననగుట, సీత చెలికత్తెల సంభాషణమున సీత రామపరవశయై యున్నదని రాముడు గ్రహించి సంతసించుట, సీత మూర్ఛవోగా రాముడు సమీపించుట, చెలికత్తెలానందించి సీతను దేర్చుట, సీతను బెండ్లాడగోరువాడు శివధనుర్భంగము గావింపవలెనన్న జనకుని శపథము విషయము, రాముడందులకు సమర్థుడే యని చెలికత్తె లెఱుంగుట, ఇంతలో జనకమహారాజేతెంచుట యెఱిగి రాముడు నిష్క్రమించుట, నిర్లిప్తుడగు జనకమహర్షి సీతతో మాటాడుట, ఆమెకు జరుగబోవు వివాహము సంగతి దెల్పి విశ్వామిత్రుని గౌరవింప నేగుట యిందుగలవు.

## నిర్వహణాంకము

నిర్వహణాంకమను పేరుగల యేడవయంకమున జనకచక్రవర్తి సత్రాంతమగుటయు, జనకు డిదివఱకే దశరథాదుల భార్యాసహితుల రప్పించుట, కర్మధర్మములను గుఱించిన జనకుని మనోహర సంభాషణము, శివధనుర్భంగమును గావించిన రామునికి సీత నిచ్చెద ననియు దాని కేకగ్రీవముగా నందఱంగీకరించినది లేనిది తెల్పు డనుటయు, సర్వప్రజలు నేకగ్రీవామోదమును దెలుపుటయు, వసిష్ఠ విశ్వామిత్ర శతానంద మహర్షులు సీతారామకల్యాణమునకు దమ యానందమును వెల్లడించుటయు, ఇంతలో గ్రుద్ధుడగు పరశురాము డేతెంచుట, రామాదులు దశరథ జనకాదులు నాతనికి నమస్కరింప నాతడు శాంతించి శిష్టరక్షణార్థము, దుష్టశిక్షణార్థము తన ధను వాతని కిచ్చి యాశీర్వదించి తాను దపోజీవనమున బ్రహ్మస్వరూపుడగుట కేగుట, దేవతలు పుష్పవృష్టితో వధూవరులగు సీతారాములను, ఊర్మిళాలక్ష్మణులను, మాండవీ భరతులను, శ్రుతకీర్తి శత్రుఘ్నులను ఆశీర్వదించుట, రాజసింహుడగు రాజు పాలింప వర్ణాశ్రమ ధర్మరక్షణము సర్వశుభములు కలుగుగాక యను భరతవాక్యము గలవు.

## యజ్ఞఫలము భాసనాటకమే

ఈ నాటకము భాసునిదే యనుటకు శ్రీ పుసల్కరు మున్నగువారు తెలిపిన హేతువాద మిట జెర్కొందును. ఈ కథావస్తువు భాసుని యితర నాటకములతోడి సాజాత్యము నందియున్నది. ఇందలి నాందీ శ్లోకము :

"శ్లో. రామః కృపాయా భరతో మనుజ్ఞః
పాయా త్సచాప శ్శుభలక్ష్మణశ్చ
శత్రుఘ్న వీరో మునిమన్యు రక్షీ
సదా రసోత్సాహవపుః ప్రసన్నః."*

*"శ్రీరాముండు కృపాలుతా భరత
సుశ్రీమంజు లాకారుడుక్
చారుశ్రీ శుభ లక్ష్మణ ప్రథితుడున్
శత్రుఘ్ను వీరుండు వి
స్తారి ప్రాభవ మానిచంద్ర కృత
యజ్ఞత్రాత కోదండ హ
స్తారూఢుండు ప్రసన్నమూర్తి
నిరతోత్సాహుండు మిమ్మోమతన్."

ఇది ఇతర భాసనాటకములందలి నాందీ శ్లోకముల వలెనే ముద్రాలంకార సంయుతము. ఇందు ముఖ్య నాటక పాత్రములు చక్కగా సూచింపబడుటే కాక రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు ప్రసన్నులై మిమ్ము రక్షింతురు గాక యనియు కృపాభరతుడు, శుభ లక్ష్మణుడు, శత్రుఘ్నవీరుడు నగు రాముడు మిమ్ము రక్షించుగాక యనియు చక్కని శ్లేషార్థము లిందు పొందుపఱుపబడినవి. ఇట్లే పాత్రల నన్నిటిని సూచించు పంచరాత్ర నాందితో నిది సాజాత్యము నందియున్నది.

"శ్లో. ద్రోణఃపృథివ్యర్జున భీమదూతో
యః కర్ణధారః శకునీశ్వరస్య
దుర్యోధనో భీష్మ యుధిష్ఠిరస్స
పాయా ద్విరా డుత్తరగోభిమన్యుః."

యజ్ఞఫలమునందలి స్థాపన భాసుని యితర నాటకములందలి స్థాపనలవలెనే సంక్షేపముగా నున్నది. అంతేకాక భాసునికి ప్రియతమ మగు ప్రయోగాతిశయపద్ధతియే యీ ప్రస్తావనమున గాననగుచున్నది.

ఇంతేకాక, 'నిష్క్రమ్య ప్రవిశ్య' మున్నగు శీఘ్రనిష్క్రమణ శీఘ్రప్రవేశములను సూచించు పదములు భాసనాటకము లన్నిట గలయట్లే యిందును గలవు. '(కర్ణే) ఏవమివ' మున్నగుమాటలు స్వప్నవాసవదత్తమునను యజ్ఞఫలమునను గలవు. ప్రతిజ్ఞాయౌగంధరాయణ చారుదత్తములలో ఈరీతిప్రయోగము లధికముగా గలవు. 'ఏవ మవిజ్ఞాతాని దైవతాన్యభిభూయంతే' అని యజ్ఞఫలమున గలదు. స్వప్నవాసవదత్తమునను నిట్లే కలదు. రాజ్యము భారవహమని అవిమారకమునను రాజు 'సత్కృతిభారవాహీ' అని ప్రతిమానాటకమునను గలదు. ఈభావమే యజ్ఞఫలమునను గలదు. ఇవి కాక ద్విపకేసరులతోడి యుపమానములు, వైదికధర్మగౌరవము, వయోశౌర్యములకు సంబంధము లేదన్నభావము, భాసుని యితర నాటకములలో నున్నట్లే యజ్ఞఫలమునను గలవు.

యజ్ఞఫలమునఁ బేర్కొనఁబడిన ఆశ్రమ వర్ణనము, సాయంకాల వర్ణనము, గ్రామజీవన వర్ణనము మున్నగున వెల్ల భాసుని స్వప్నవాసవదత్తమునను పంచరాత్రమునను అవిమారక బాల చరితములలోను ఆయాయీ వర్ణనములతోడి మిక్కిలి సాదృశ్యమును గలిగి యున్నవి. యజ్ఞఫలమున గల రాముని మదనావస్థ సరిగా నట్లే అవిమారకమున ద్వితీయాంకము నందు గాననగుచున్నది.

మఱియు, భాసుడు తఱచు శ్లోకము రెండు పాదము లొకరిచేతను మిగిలిన రెండు పాదము లింకొకరిచేతను జెప్పించును. ఈ విషయమునకు యజ్ఞఫలమున బెక్కు ఉదాహరణములు కలవు. (ii. 24; iii. 21, 23, 24; iv. 29) ప్రతీహారిపేరు విజయ యనియే భాసనాటకము లన్నిట గలదు. ఇట్లే యజ్ఞఫలమునను గలదు. సాధారణముగా భాసుడు విష్కంభమును ఇరువురు, ముగ్గురు లేక నలుగురు వ్యక్తులతో నడపును. ఇట్లే యజ్ఞఫలమున ఇరువురు గంధర్వులు, ముగ్గురు భటులు, నలుగురు కావలివారు ఆయా విష్కంభములలో పాల్గొందురు. బాణుడు భాసుని గుఱించి చెప్పిన:

"సూత్రధార కృతారంభైః
నాటకై ర్బహు భూమికైః
సపతాకైర్యశో లేభే
భాసో దేవకులైరివ."

అను భావమునకు దగినట్లు యజ్ఞఫలమున నెన్నియో నిదర్శనములు గలవు. యజ్ఞఫలము సూత్రధారకృతారంభము కలదే. ఇందు బహు పాత్రములే కలవు. ఆ పాత్రములు వేఱు వేఱు జీవిత దృక్పథములకే చెందినవి. ఇందు బహు పతాకాస్థానములు నున్నవి. దశరథ మహారాజు రాణులతో జరపిన సమావేశము, రావణుడు రామాస్త్రములను దిరోహితుడై నడుమనే ఖండించుట, విశ్వామిత్రుని యజ్ఞము మున్నగున విందుల కుదాహరణములు.

ఇది కాక, "భాసోహాసః" అన్న జయదేవ మహాకవి వాక్యము యజ్ఞఫలమున విదూషకముఖమునను కావలి వారల సంభాషణ మూలమునను సత్యమని ఋజువగు చున్నది. 'యజ్ఞఫల' మతిపురాతన నాటకమని యందు దాహరింపబడిన ప్రాచీన శాస్త్ర గ్రంథములను బట్టియు ఇందు నాణెములకు సువర్ణములను నామ ముండియుండుట బట్టియు మనకు తేటతెల్ల మగుచున్నది.

మఱియు 'యజ్ఞఫల' మున గల సలలితమైన భాషయు, స్వచ్ఛములైన యుపమానములును, సరళమైన పదములును నిది భాసకృతమే యనుటకు సాక్ష్యములు, భాసుడన్న బరమ గౌరవము గల కాళిదాసు భాసుని భావముల నెన్నిటినో కైకొన్నటులు దృష్టాంతము లున్నవి. అట్లే యజ్ఞఫలము నుండియు బెక్కులు చూపవచ్చును. వీనిని ద్రిప్పి కొందఱు విమర్శకులు కాళిదాసు ననుసరించిన యొకకవి యెవడో యీ నాటకము వ్రాసియుండవచ్చు ననుచున్నారు. వైతండికుడు హేతువాదమున కొప్పుకొననని యజ్ఞఫలమున భాసుడు చెప్పినమాట అసత్యము కాదు కదా!

భాసనాటకములనుబట్టి భాసుని ప్రధాన గుణములని యేవి నిర్ణయింపబడినవో అవి యజ్ఞఫలమున గలవని పై విమర్శకు లిట్లు ఋజువపఱిచిరి. అందుచే యజ్ఞఫలమునకు గ్రొత్తవ్రాతప్రతు లేమైన లభించి

యందు నాటకకర్త నామాదికము స్పష్టముగా గోచరించి యీ యజ్ఞఫల మన్యకర్తృక మని నిరూపించు వఱకు నిది భాసకృతముగనే యెన్నవగును.

## యజ్ఞఫలము : భాసుని ప్రతిభాదికము

భాసుని యితరనాటకములందువలెనే యజ్ఞఫలమునను అతని ప్రతిభావిశేషములు లెక్కకు మిక్కిలిగా గానవచ్చుచున్నవి. ఇందు ముఖ్యముగా భాసుని పాత్రపోషణవైశిష్ట్యము నిరుపమానమైనది. అతని పద్యప్రియత్వమున కీ నాటకమును నిదర్శనమే యగును. అలంకార సంపద, సుభాషితావళి, ఆయా పాత్రల సంభాషణాచాతుర్యము, హాస్యరస పోషణము, శృంగారరసవిశిష్ట పరిపోషణము, కరుణరస పోషణ, శాంతరసపుష్టి, వీరభయానక బీభత్సరసముల కొసగిన స్థానము, అద్భుతరస నిర్వహణము—ముఖ్యములగు నీ పట్టులలో భాసుని నిరుపమ ప్రతిభావిశేషములు చక్కగా బొడకట్టుచున్నవి.

## పాత్రపోషణ వైశిష్ట్యము

దశరథ శ్రీరామ పరశురామ వసిష్ఠ విశ్వామిత్రాది ప్రధాన పాత్రల పోషణము నెంత యద్భుతముగా భాసు డిందు జూపినాడో అంత యద్భుతముగానే సామాన్యపాత్రలగు సుమంత్రుడు మంథర మున్నగు పాత్రముల విషయమునను గడుంగడు జాగరూకత జూపినాడు. సుమంత్రుడు మహారాజు హృదయము నెఱింగి యాత డాజ్ఞాపించుటకు బూర్వమే సర్వజనములను సద్వసత్కార పరంపరలచే సంతోషపెట్టిన సన్మంత్రిసత్తముడు. ఈతడు :

"జనపతి యాంతరహృదయం
బు నెఱింగి యమాత్య పుంగవుండు శుభంబుల్
పొనరింత ధర్మసంగతి
గను నపవర్గంబు పరమకల్యాణంబున్."

అన్న ప్రశంసకు బాత్రుడైనవాడు. ఈతడు వ్యర్థప్రసంగములలో గాని అతిప్రసంగమున గాని పాల్గొననొల్లని యథోచిత కార్యప్రవర్తకుడు. "వైతండికుడు హేతువాదమున కొప్పుకొనడు. ఈతనితో మనకు బని యేమి" యని యొక్క మాటలో విదూషకుని వదలించుకొనిపోయి నిజకార్య తత్పరుడయిన యాదర్శ మంత్రిసత్తము డితడు.

ఇట్టి యోగ్యుడగు మంత్రికతనమున నే దశరథ మహారాజు చక్కగా రాజ్యపాలనము జేయుటయు నా రాజ్యమున :

"దొంగలు లేరు రాజ్యమున
దుష్టులు వేదము లమ్మవార ల
న్యాయంగన గోరువారు మను
వానెడు వారును ద్యూతకారు లె
న్నం గనరారు మందునకు......"

ఇంతే కాదు, దశరథుని పాత్రపోషణ మెంత శ్లాఘాపాత్రముగా భాసు డిందు నిర్వహించినాడో చూడుడు. దశరథుడు :

"సవనశతంబు లొక్కరెయిపు జల్పును;
జూచునుక్ సర్వకార్యముల్
వివిధము లొక్క వంక; నరి వీరుల
నుక్కడగించు నొక్కటన్;
మివులగ దన్పు నొక్కెడల మిత్రుల;
నొక్కట వేటకేగు ని
ట్లవిరళ కార్యభారమున నందకు
దుఃఖ మొకింతయేనియున్.
"తరుణవయస్కునట్లు సతతంబు
నొనర్చును స్వీయధర్మముల్ ;
పరిణతి నందినన్ వయసు పాయదు
తేజము రాజచంద్రునిన్;
నరవరచంద్రు పేరు వినినన్ గనినన్
జనముల్ రవంతయేన్
దురితమువంక బోరు విడుతు ర్నక
లాఘము లొక్క వ్రేల్మిడిన్."

దశరథుడు రాజ్యము చేయుచుండగా :

"కాలవర్షంబు గురియు మేఘంబు లెపుడు
ఈతిబాధలు లేక సస్యేందిర కృషి
ఫల మనంత మొసంగును; అలఘు పుణ్య
కవిత దైవానుకూల్యంబు కలుగబట్టి."

ఆ మహారాజునకు గల సంతృప్తికి గారణ మిది :

"కంటిని ఆత్మసౌఖ్యమున కంటె
ప్రజాసుఖ ముత్తమంబుగన్......'

అతడు రాజ్యము చేయుచుండగా

"రిపుభయమింతయేనియు ధరిత్రిని
లేదు; సమస్తమానవుల్
విపులనయార్థ సంపదల విశ్రుతి
గాంచిరి; అనవస్థుదు
శ్చపలత గాంచువారును రుజా
భరులై విలపించువారలుక్;
గపటము జాపువారలు నకాల
మృతిక్ గనువారు లేరిటక్."

సర్వలోకములకు సర్వకాలములకు నాదర్శప్రాయమైన రామరాజ్యమునకు బ్రాతిబదిక వేసిన మహారాజు దశరథుడు. ఈతని రాజ్యపాలనమే యిట్లున్నదన్న నిక రామరాజ్య మెట్లుండునో యూహించుకొనుడని చమత్కారముగా భాసుడు సూచించినాడు.

సందర్భానుసారముగా నిట్లు పాత్రముల శీల చిత్రణము చేయుటలో భాసుడెంత వేసిన చేయి. రాజునోట రాణుల శీలముల నెట్లు చక్కగా భాసుడు వ్యక్తము చేసినాడో కనుడు.

కౌసల్య :

"ఉత్తమవంశప్రభవయు
నుత్తమపత్నియును నా మదుపలాలిత య
ప్యుత్తమసుందరి..."
"మూసిన ముత్తియంబు వలెను
ముండటవచ్చిన లక్ష్మి, దివ్య శో
భాసముపేతకోటి సుమభవ్య
లలితాంగి నాయెడందలో
భాసిలుమానినీయ పతిభక్త....."

సుమిత్ర :

"సర్వంసహా క్షమలోనన
గర్వించి మనిమ్రతిపూ సకలసంగతులన్
సర్వవశంవద..."
"వ్రతనియమావళీపరమ వంద్య
కృశాంగి, ముఖాంబుజప్రభా
వితతశుభాంగి, ఉత్తమవివేకవతీ
మణి, నోటగట్టిగా
నతివ యెటింగియున్ బలుకదర్ధ
నిమీలిత నేత్ర శాంతదే
వతబహుసౌఖ్యదాయక శుభప్రద
యామె నుతింప శైల్లదే ?"

ఇంతేకాదు :

దురభిమానరోషములు మంచునకు గొనదు
సర్వమిత్రసుమిత్రయా సత్యముగను
ఆత్మకామానుసారిణి అహరహంబు
నాయెడంద జయించిన నాతి యామె."

ఇక రామపట్టాభిషేకవిఘ్న కారిణి యని జగముచే నేటికిని నిందింపబడుచునే యున్న కైకేయి శీలము పరమ నిర్దుష్టముగా నితడు చిత్రించినాడు. ఆమె స్వభావము నెంత చక్కగా దశరథుని నోట గవి చెప్పుచున్నాడో కనుడు :

"ఏకార్యంబు నెఱుంగని
యాకాంతకు ముక్కనందె రొసగును గోపం
బేకాని విక్రమాన్విత
నాకష్టము బాపి యుసురు నాకుంగాచెన్."

"ఈమెరోషము పరిగణియింపరాని
దసును శౌర్య ప్రణయ శీలయగుటచేత
తలపఛందోనుబద్ధ వృత్తంబురీతి
శీఘ్రమున నేప్రసాద సంసిద్ధి గు ర్చు."

ఈ మహానుభావురాలగు కైకేయి దాయభాగ విభాగ ప్రసంగసమయమున రాజుతో సవతులయెదుట నెంత పవిత్రముగ మాటాడుచున్నదో చూడుడు :

"అగుణవంతునికంటె మేలగును సుగుణి
గుణులగుణవత్తరుడు మేలు కోటిరెట్లు
భాస్వరము రాత్రి వెలుగుదీపంబుపగిది
గాని యదియెంత మధ్యాహ్నభానుముందు.

"భరతుడుగుణి యగు గుణవ
త్తరుడగు రాముండు కాన దగునతడే రా
జ్యరమం గైకొన సుగుణా
భరణుండతడతనికన్న బరముడు కలడే ?"

ఇట్లే ప్రతి పాత్రము విషయమునను గడుజాగరూకతతో దూచినట్లు మాటలు వేయుచు ముక్తసరిగ వలసిన విషయము లన్నియు వచ్చునట్లు శీల చిత్రణమును జేసిన శిల్పిరత్నము భాసమహాకవి. జనకరాజర్షినిగూర్చి

"రాజత్వంబున సుస్థితుండయిన
దుర్గ్రాహంబు నొబ్రహ్మస
త్తేజంబంది వెలుంగురాజ
ఋషి; యుత్తీర్ణుండు జ్ఞానాంబుధిన్,
భ్రాజిష్ణుండు నిరస్తవైషయిక
విజ్ఞానంబుచే; సంసృతిన్
రాజైయున్నను శాంత
మూర్తిపరమప్రాజ్ఞుండు..."

అన్న మాటలును, ఆ మహామహుని నోట బలికించిన

"కలిగినట్టి దుఃఖంబును దొలచుకొన్న
నాను మిక్కిలి యానంద మట్లుకాక
సుఖ మెఱుంగక దుఃఖంబు చొప్పుగన్న
నొక్క కార్యము కూడను జక్కబడదు."

"కడచిపోయిన కాలాన గన్నదుఃఖ
మెంత త్వరలోన మఱచిన నంత సుఖము."

"కర్మపరము సమస్తంబు గాన గర్మ
విడువ శక్తుండుగా డెట్టి విజ్ఞుడైన
ధర్మయుక్తకర్మంబు నిత్యంబుజేయ
సజ్జనుడు నిర్మలంబైన శాంతి బడయు."

మున్నగు వాక్యరత్నములును భాసుని పాత్రపోషణా నిపుణతకు నాతని పాత్రోచిత భాషాప్రయోగ కళా విశిష్టతకు నిదర్శనములు.

ఇట్లే భాసు డిందు పోషించిన పరశురాముని శీలము నిరుపమానమైనది. భవభూతి యంతటి మహాకవి కూడ యవతార పురుషుడగు పరశురాముని దశరథ జనకరాజర్షులు రాముదులు నోటికి వచ్చిన మాటలని

యుద్ధమునకు సిద్ధపడినట్లు తన మహావీర చరిత్రమున గల్పించినాడు. అసలీ రామద్వయ సమాగమ ప్రధానోద్దేశ మేమన భృగురాము డవతారమును జాలించుచు దన తేజమును రామతేజములో నైక్య మొనరించి తన ధను వాతని కొసగి దుష్టశిక్షణ శిష్టరక్షణ కార్యకలాప మాతనిపై విడుచుటయే. ఈ యాంతర రహస్యమును జక్కగా గ్రహించి ఆ సమాగమసమయమున నన్ని పాత్రముల శీలముల నత్యద్భుతముగా నిర్వహించిన దొక్క భాసుడే. అదియు నీ యజ్ఞఫలమున నే. క్రుద్ధుడై వచ్చిన పరశురాముని దశరథ జనకాదులు రామలక్ష్మణాదులు వసిష్ఠ విశ్వామిత్ర శతానందులు నమస్కారనతశిరస్కులచే శాంతి పఱచిరి. ఆ మహాత్ముడు:

అది యెఱిగినవాడే యనుట రాము నాశీర్వదించి తన కోదండము నొసంగి :

"పాపుల బరిమార్చుటకై
చేపట్టుము నీవు దీని; సిద్ధులు ధర్మల్
ప్రాపించి శరణుచొచ్చిన
నే పగిదిని వారి గాచి యేసగుము రామా!"

అది శాసించి తాను శాంతుండై నిష్క్రమించును. ఇంతకు నాతడు చేసిన పను లెల్ల ధర్మరక్షణార్థము, ఖల శిక్షణార్థము నని భాసుడు పరశురాముని నోట నే పలికించి యాతనిశీల మత్యున్నతముగ బోషించినాడు.

"అలఘు బ్రహ్మవిఘాత దర్పిత మహా
హంకారులై వైదికో
క్తుల బాటింపని క్రూర భూపతుల
నే క్రుద్ధుండనై చంపితిన్
బ్రశయాగ్ని త్వర నెల్లరన్ ........."

వైదికోక్తుల బాటింపని క్రూర భూపతుల జంపుటకే యవతరించి ఆ పని యైనవెనుక నవతారము చాలించె నని భాసుడు చక్కగా సూచించినాడు.

## అలంకార సంపద : సుభాషితములు

స్పష్టమై స్వచ్ఛమైన భాసుని యలంకారములు శ్రితకాంతాబాధ్యములై తీరుదీయములు గలిగిన సుభాషితములు, నీ నాటకమున లెక్కకు మిక్కిలిగా నున్నవి.

"సరసులోని యగాధంపు జలములోన
నెసగు సత్తమ మాన సౌకసము లనను
సకల రసపూర్ణ కవిచిత్త సద్మ మందు
బరగు నుజ్జ్వలనూత్న భావంబు లనగ"
"పర వనితయైన నీమె దుష్ప్రాపయైన
నామనస్సెట్లు పరుగెత్తు నీమెపైకి
మనసె కాద కృత్యాకృత్య మతి వివేక
మునకు నుత్తమ ప్రామాణ్య మన సచ్చరిత్రి"
"అల్పకాయము గలదియే యైనసింహ
మధిక కాయముగల యేన్గు నణచు గాదె!"
"కేసరినిసుంగు తరుః బెల్లగింప గనునె?"
"కాలవశమున బుణ్యంబు క్షయము నొందు
సారహీనము సౌనెట్టి సంపదలును."

ఇట్లెన్నియైన జూపవచ్చును.

## నవరస పోషణము శృంగారము

ఈ నాటకమున నవరసపోషణము ఆయా తావుల జక్కగా నిర్వహింప బడినను, ఇందు ప్రధాన రసము శృంగారము. ఇది మిథిలోద్యానమున సీతారాముల పరస్పర వీక్షణములతో నారంభమై రామానురక్తయై మూర్ఛిల్లిన సీతను రాముడు సమీపించుటతో వృద్ధియై సీతాకల్యాణమున శుభపర్యవసానము నందినది. ఇందలి శృంగారము పరమ పవిత్రమైనది. నాయకుడగు రాముని ప్రణయము అస్థానమునగాక స్వస్థానమున నగుట యొక విశేషము. మఱి యిది పేలవములగు కచకుచాది వర్ణనములతోగాక కేవలము స్త్రీ సౌందర్య ద్యోతకములగు ముఖకాంతి సౌందర్యములకే సంబంధించినది.

"స్వచ్ఛశారదశశిమనోజ్ఞంబు మొగము"
"ఆజగనోమ్మహనాంగి" "కుసుమపేశలసుగాత్ర"
"ఆ మెపూర్ణేందువదన రమ్యత్వమహహ"
"సుందరీరత్న వదనారవిందముగని
మన్మనము నాట్యముంజల్పు మహితభంగి."
మున్నగు మాటలతోడను;
"ఆ మెజూడకయాకన్ను లౌర యొండు
మోహజాలక యున్నవి..."
"కాంచగంటిని గన్నులకవుదీఱ
నమృతనిష్యందియౌ నీమె యాననశశి"

మున్నగు మనోహరభావములతోడనే కాని నీచ శృంగారమునకుగాని గతానుగతికమగు నవయవ వర్ణనములకుగాని పోక భాసు డిందలి సీతారామ శృంగారమును బవిత్రతర మొనరించినాడు.

## హాస్యరస పోషణము

భాసుని హాస్యరస పోషణమునకు దొలుతటి యంకమునందలి విదూషక కాంచుకీయ సంభాషణము చక్కని యుదాహరణము. ఇదికాక, నాల్గవ యంకమునకు బూర్వమునగల ప్రవేశికలో జనకరాజ ప్రాసాదమున మాళవకుడు, భషకుడు, దంతిలుడు, గోపిలుడు అను నలుగురు వైతాళికులు జరిపిన సంభాషణము, విదూషకుడు వచ్చిన

పిమ్మట అతడు విశ్వామిత్రుడు ఉభయతో ముఖుడని వికృతముగా వర్ణించిన వర్ణనములు మున్నగునవి అబాధకములైన భాసుని హాస్యసంభాషణములకు సాక్ష్యములు.

## కరుణరసము

విశ్వామిత్రుని వెంట నరుగు రామలక్ష్మణులు గ్రామసీమల గనుచు వృద్ధగోపికతో జేసిన సంభాషణము, తమ కపకారము చేయుచున్న మృగములనైనను జంపవలదనియు నవి యొక్కనాడు కొనరానిచో విచారించెదమని యామె చెప్పిన పట్టులను గరుణరసము లలితముగా జూపబడినది.

## వీరభయానక బీభత్సరసములు

రాముడు తాను విడిచిన రెండు బాణములు వ్యర్థములైనపుడు వీరగర్జన మొనరించి భయంకరముగా :

"అమితంబైన ప్రకాశముం గలుగు
నీయాగ్నేయ దివ్యాస్త్రము
త్తనుభంగిన్ దగుసంతతిన్
క్షణములో దగ్ధంబు గాజేయుతన్
విమలాస్త్రంబటు చేయలేనియెడ
లన్ నన్వెంటనే నాదు దే
హముభస్మం బొనరించినైచుత !
అమోఘాస్త్రంబు సార్థంబుగన్."

అన్నపుడు వీరభయానక రసములు, పిప్పల వృక్షము నాకులు చిల్లులు పడియుండుటయు, రథము గుఱ్ఱములు కొనరాకుండ వాని యానవాళ్లు గనిపించుటచే గలిగి పాఱిపోయిన సైనిక త్రైలస్థితి గనుగొన్నపుడు బీభత్సరసము పోషింపబడినవి.

## శాంతరసపోషణము.

జనకరాజర్షిశీలపోషణముపట్ల శాంతరసము చక్కగా నిరూపిత మగుచున్నది. "జేశాంతరమో జన్మాంతరమో, ఏమైనను జీవి స్వకృత్యములలో నిబద్ధమై ఎదుటివారెల్లరు తన బంధువులని భ్రమపడును. ఏది యెట్లు జరుగవలయునో యట్లే జరుగును. నీ వెటకేగవలయునో యటకే పోగలుదువు" మున్నగు జనకుని వాక్యములు శాంతరస ప్రతిపాదకములు.

"ఒక్కడయ్యును సూర్యుండు పెక్కుగతుల
గాంతిపుంజము వెదచల్ల గాంచునటులు
ఒక్కటయ్యును నాత్మ తా బెక్కుగతుల
వివిధకృత్యంబులొనరించి వెలయుచుండు"

అన్న జనకుని విజ్ఞాన విశేషమున శాంతరసము పారముగన్నది.

## అద్భుతరసము

భరతలక్ష్మణ శత్రుఘ్నుల ధనుర్విద్యా ప్రదర్శనమునను, శ్రీరాముడు శివధనుర్భంగ మొనరించిన పట్టునను, శ్రీరామ లక్ష్మణులు రాక్షసులను బెక్కువిధముల బాణవ్రాలి మారీచ సుబాహుల నుక్కణచు పట్టునను అద్భుతరసము పోషింపబడినది. అదికాక :

"నలువయు విష్ణువున్ శివుడు
నారదతుంబురు లింద్రుడున్; సుహా
హాలులయి కల్పవృక్షకుసుమా
వళి బెల్లుగ మంగళార్థమై
'సలలితరీతి జిమ్మదును సర్వ
సుపర్వులు; మోచుమంత్రి ని
స్తుల బహు వాద్యఘోషములతో నిట
నయ్యెడు పెండ్లి ముచ్చటల్."

అను పట్టునను అద్భుతరస పోషణము గలదు.

## ఉపసంహారము

ఈ విధముగా 'యజ్ఞఫల'* మను నూతన భాస నాటకము నవరస సంపదలకు మనోహరాలంకార సుభాషితములకు భాసుని ప్రతిభా విశేషములకు నాలవాలమైన దనుటలో నత్యుక్తిలేదు. కాలగర్భమున లీనమైయున్న ఆ మహా కవీశ్వరుని యితర నాటకములు నితర గ్రంథములు బయలువడి సంస్కృత వాఙ్మయాకాశమున ధ్రువతారలై వెల్గొందు సుముహూర్తము త్వరలో విచ్చేయుగాక !

---

* "యజ్ఞఫల" నాటకాంధ్రీకృతికి ౧౯౫౨ ఫిబ్రవరి, మార్చి, ఏప్రిలు 'భారతి' సంచికలు చూచునది.

# ఆత్మపరీక్ష



## 1

శ్రీ పన్యాల రంగనాథరావు

"నేనెందుకు పనికొస్తాను?" అనుకున్నాడు శ్రీనివాసరావు. తన ప్రశ్నకు వెంటనే తనే సమాధానం చెప్పుకున్నాడు.

"ఎందుకూ పనికి రాను!" అని!

ఈ విధంగా సమాధానం చెప్పుకోవటం, కేవలం చేతకాని పని అంటూ తోచిన మరుక్షణమే శ్రీనివాసరావు అభిప్రాయం మారింది.

"అదేం మాట? ఎందుకూ పనికిరాకపోవట మేమిటి? ఎవరు మాత్రం ఎందుకు పనికొస్తున్నారు? ఎవడికి తోచినట్టు వాడు ఎందుకో ఒకందుకు పనికొస్తున్నట్టే, నేనూ పనికొస్తున్నాను. నా ప్రయోజకత్వం నాదీ!" అనుకున్నాడు తను.

ఒక ఏడాదిపాటు పట్నంలో గడిపాక, మళ్లా స్వస్థలానికి వచ్చి, ఇరవై నాలుగు గంటలయిందేమో! అందరికళ్లూ తనమీదే ఉన్నట్టున్నాయి. అంతా తన్ను వింతగా అనుమానంగా చూస్తున్నట్టనిపించింది.

పట్నం వొదిలేసి, ఇప్పుడిట్లా రావటం ఎంతవరకూ సమర్థించుకోవచ్చును?

తను చేసే ఒక పనికీ కూడా ఒక నిర్ణయమంటూ ఎన్నడూ ఉండడం లేదు. చేసేపనులు ఎట్లానూ చేస్తున్నాడు. పరిణామాలు చూస్తే మరొక విధంగా ఉంటున్నాయి. తను చేసేపని ఎంతవరకూ సమంజసమనే ఆలోచనవస్తే, అది కేవలం సమంజసమే అని, అప్పటిమట్టుకు తోస్తున్నది. తీరా ఒక పని చేశాక, ఆపని ఎందుకు చేశానా అని, ఆ తరువాత పశ్చాత్తాపం చెందవలసివస్తున్నది. దీనంతటికీ కారణం ఏదీ కనిపించదు. ఆత్మపరీక్ష చేసుకొనే టప్పుడల్లా, అడుగడుగునా ఇటువంటి పశ్చాత్తాపాలు పడుతున్నాడు తను. ఆత్మపరీక్ష చేసుకోకుండా ఉండడం చేతకావటం లేదు తనకు.

ఈ ఆత్మపరీక్ష చేసుకోవటానికే, ఇంత సేపటికి తనకు, వ్యవధి అంటూ చిక్కింది.

ఇంటికి మైలుదూరంలో ప్రవహిస్తున్న శారదా నది అంటే శ్రీనివాసరావుకి ఎంతో ఇష్టం. నది వొడ్డున, ఎన్నడో తను చూసుకున్న ఏకాంతస్థలం, ఇప్పటికీ కూడా నిర్జనంగానే ఉంది. ఆ చోటు తన కెంతో నచ్చింది. తన ఆత్మపరీక్షలలోచాలాభాగం ఇక్కడే జరిగినై! ఇటూ అటూ, దాదాపు వంద గజాల దూరంలో, ఎవరో తెచ్చి పడేసినట్టు, రెండు పెద్ద బండరాళ్లు. రెండింటి మధ్యనుంచీ, నదిలో కొంత నీరు, చిన్నపాయగా, పోయేచోట, మరో చిన్నరాయి. సుమారు ఒక ఫర్లాంగుదూరంలోనే రైలు వంతెన. ఇరవై నాలుగుగంటల క్రిందట, సరిగ్గా ఇదే సమయానికి, మెయిలులో వస్తున్నప్పుడు ఈ వంతెన దాటాడు!

చిన్నరాతిమీద కూర్చొని, వెనకటి రోజులలో పద్యాలు రాసేవాడు శ్రీనివాసరావు. అక్కడే కూర్చొని, తను రాసిన రెండుమూడు నాటకాలు రేడియోవాళ్ళు ప్రసారం చేశారు! తను పత్రికలలో ప్రచురించిన అనేక కథలకు కూడా, తనకు 'ఇన్‌స్పిరేషన్' ఇచ్చింది, ఆ చోటే!

తన స్వభావం ఎటువంటిదో శ్రీనివాసరావుకి, బొత్తిగా తెలీదనలేం. దీనికి తన ఆత్మపరీక్షే బాగా దోహదంచేసింది. ఎందువల్లనంటే, తనవంటి స్వభావం కలవాడు, పద్యాలు అల్లటానికీ, కథలు రాయటానికీ పూనుకోవడం సాహస మనిపించింది. అయినప్పటికీ ఎదుర్కొకుండా ఉండటమూ లేదు. రాయటంమాననూ లేదు. తను రాసినవాటిలో యథార్థ జీవితం ఎంతవరకూ ప్రతిబింబిస్తున్నదన్న ఆలోచన వచ్చినప్పుడల్లా, అది తనకు చేతకాని పని అనిపించింది. వెంటనే మళ్ళా, చేతకాకపోవట మేమిటి? అనే అహంకారం బయల్దేరేది. దేశంలో ఈనాటి పరిస్థితులూ, ఆర్థికదుస్థితీ, ఎక్కువ తక్కువలూ, వర్గభేదాలూ, వర్ణభేదాలూ, వ్యత్యాసాలూ, రాజకీయాలూ, సాంఘిక దురన్యాయాలూ, ఇటువంటి వాటిలో ఇమిడిఉండే సమస్యలను ఆధారంగా చేసుకొని కథలు రాసేవాడు. అయితే కథ రాయకముందూ, అచ్చుకాకముందూ ఉండే ఉత్సాహం ఆతర్వాత ఉండేదికాదు. తను

రాసినదంతా యథార్థానికి మారమనే అనుమానం తోచేది.

అయితే, ఇన్నాళ్ళ తరువాత, తను మళ్ళీ, ఈనాటికి, ఇదే చోటికి, కథ రాయటానికిగానీ, పద్యమల్లటానికి గానీ, రాలేదు. నిజానికి అందుకు అవసరమైన ఉద్రేకం కూడా కలగటం లేదు.

తన దృష్టిలో ఎంతో ఆదర్శప్రాయంగానూ ఏకాంతంగానూ ఉన్న ఈ చోటికి, వీటన్నింటి కన్నా మరో ప్రత్యేకత ఉన్న విషయం, శ్రీనివాసరావు ఇంత త్వరలో మరిచిపోలేడు. దాదాపు రెండేళ్ల కిందట, తన జీవితంలో ఎంతో మార్పు తీసుకొచ్చిన సంఘటన, సరిగ్గా ఇక్కడే జరిగింది. ఈ రెండేళ్లలోనూ తను పొందిన అనుభవాలకి అది నాంది అయింది. సరోజినిని, తను మొదటిసారి కలుసుకున్న సంఘటన అది!

ఎంత విచిత్రమైన వ్యక్తి - సరోజిని!

## 2

శ్రీనివాసరావుకి, ఆ రోజులన్నీ ఇప్పుడు మళ్లీ జ్ఞాపకం వచ్చి, కలవరపెట్టసాగినై. నిజానికి, ఈ రెండేళ్ల జీవితాన్ని ఆత్మపరీక్ష చేసుకోటానికే, తను మళ్ళీ ఈ చోటికి వచ్చాడు.

సరోజిని, తన జీవితంలో అడుగు పెట్టడానికి పూర్వమే, అప్పటికి, అయినకాటికి చదువుకి స్వస్తి చెప్పి, సంవత్సరమై జీవితాన్ని ఎదుర్కోవడం నేర్చుకునే ప్రయత్నంలో ఉన్నాడు తను. తండ్రి పెద్ద అస్తు లేవీ విడిచిపెట్టిపోలేదు. అతను ఒక దర్జా బతుకు బతికి హటాత్తుగా గుటుక్కుమన్నాడు. తండ్రి, ఆనందంగా అన్నీ అనుభవించాకనే పోవడం, తను పూర్తిగా ఆమోదించాడు. అయితే తండ్రి పోయినప్పట్నుంచీ, తనూ తల్లీ, మామయ్యా పోషణలో ఉండవలసివచ్చింది. ఇట్లా ఎంతకాలం సాగుతుంది? ఇక తన బతుకేదో తనే చూసుకోవాలి.

ఇది, శ్రీనివాసరావు జీవితసమస్య. తండ్రి పోయి సంవత్సరం కావస్తున్నది. తనకు కేవలం పాతికేళ్ళే నిండినా, ముప్ఫయి అయిదేళ్లు నిండినట్టుంటున్నది. ఎందుకూ పనికి రాకుండానే, పెద్దవాణ్ణి అయిపోతున్నానేమో అనిపించేది. తన జీవితంలో అప్పుడే మొదటిసారి ప్రశ్నించుకున్నాడు కూడానూ—"నేనెందుకు పనికొస్తాను?" అని.

తన మనస్తత్వాన్ని ఆత్మపరీక్ష చేసుకోవటంతో, తనగురించి, తనకే భయం వేయసాగింది. తను చేయగలిగేది ఏమిటో స్పష్టంగా తెలీటం లేదు.

తను ఉద్యోగమనేది చేయగలడా? ఎటువంటి ఉద్యోగం చేయాలి? ఉద్యోగం అనేది ఎవరిస్తారు? తనకోసం ఏ ఉద్యోగం సిద్ధంగా ఉందనీ? అసలింతకీ, ఉద్యోగం అంటే ఏమిటి? ఇటువంటి ఉద్యోగప్రశ్నలన్నీ శ్రీనివాసరావుని బాధించసాగినై.

ఎమ్మేలు పాసవుతున్నవాళ్ళకు దిక్కులేకుండా ఉంటున్నది. తన్ను చూసేదెవరూ? తనకున్న చదువుకి ఏపాటి ఉద్యోగం వస్తుంది? పట్నంపోయి, ఏ పత్రికలవాళ్ళనైనా ఆశ్రయిస్తే, ఇంత దొరక్కపోదేమో! తన రచనలతో పరిచయమున్న పత్రికలవాళ్ళలో ఒక్కరేనా కనీసం, తనకాపాటి ఆసరా కలిగించకపోరేమో!

ఈ ప్రయత్నం చేస్తే బాగానే ఉంటుందనిపించింది శ్రీనివాసరావుకి. తనవంటివాడికి ఇంతకన్నా వేరే ఆలోచనకూడా తట్టదనిపించింది. తను పట్నంపోయి ఉద్యోగం చూసుకొని వచ్చేవరకూ, తల్లి, మామయ్యదగ్గరే ఉంటుంది. మామయ్యే కాదంటాడా?

ఆలోచించినకొద్దీ, ఈ పద్ధతే చాలా బాగా ఉందనిపించింది శ్రీనివాసరావుకి. ఉద్యోగం దొరికినా దొరక్కపోయినా, కొన్నాళ్లపాటు తిరిగి రావచ్చును. అదివరకు పట్నం ఎన్నడూ పోలేదు. ఇది ఒక మార్పుగా కూడా ఉంటుంది.

ఏదో ఒక పత్రికలో చేరవచ్చుననే ఆలోచన బాగానే ఉంది. కాని, ఏ పత్రికలో చేరాలి? ఎవరితో ఏం మాట్లాడితే, ఏం సమాధానం ఇస్తారో!

'ఉద్యోగమా?' అని ఎవరన్నా చిన్ననవ్వు విసిరితే తను ఏం చేయాలి? 'నువు ఉద్యోగం చేయటానికి కూడా పనికొస్తావా?' అనే అర్థం ఆ మాటలలో తనకు వెంటనే స్ఫురించకపోదు. తను ఎందుకు పనికొచ్చేటట్టు? ఈ ప్రశ్న మళ్లీ ఎదురైంది. చూస్తే,

, ఇది, తన జీవితాంతం వెంటతరిమే ప్రశ్నలాగా కనిపిస్తున్నది. దీనికి సమాధానం ఏమిటి?

ఆట్టే మంది, తెలీనిచోట ఉద్యోగం దొరికేటంత సులభంగా, తెలిసినచోట దొరకదు. ఈ ముక్క తనకు చాలాకాలం కిందటే, ఒక మిత్రుడు చెప్పి పట్నం పోయినాడు. ఆ మిత్రుడు ఇప్పుడెక్కడుంటున్నాడో! వాడు—వాడిపేరు రామచంద్రం. ఏ సమస్యనైనా ఇట్టే ఎదుర్కొంటాడు. ప్రతీ చిన్న విషయానికీ, తనలాగ ఆటే మథనపడడు: తనకన్నా ఏ రెండుమూడేళ్ళో పెద్ద. అంతే. వాడు, చదువు మధ్యలోనే తెగ్గొట్టుకొనిపోయినాడు. ఆడవాళ్లను వల్లో వేసుకొనటంలో కనపరిచే నేర్పు, వాడు చదువులో కనపరచలేదు. అయితేనేం? స్నేహితుడుగా మంచివాడే. పట్నం పోగానే వాడికోసం వెదకాలి. వాడి ఎడ్రసేనా తెలిసిఉంటే తను ఉత్తరం రాసేవాడే!

అ స్తిమితంగా ఉంటున్న తన ఆలోచనలకు, ఈ రామచంద్రం ఇట్లా జ్ఞాపకం రావటం, ఏదో గొప్ప సమస్య ఇట్టే విడిపోయినట్టనిపించింది శ్రీనివాసరావుకి.

## 3

శ్రీనివాసరావు 'పథకం' అడ్డం తిరిగింది! తన పథకానికి విరుద్ధంగా, మామయ్య మరో పథకం ఏనాడో వేసుకొన్నట్టు కనిపించాడు.

"ఈ మాత్రానికి పట్నందాకా పోవాలిట్రా? చాల్లే, మన బతుక్కి ఇక్కడే ఏదో ఒకటి చూసుకోవచ్చు. నేను మాత్రం చూడటం లేదనుకున్నావా ఏమిటి?" అన్నాడు మామయ్య.

చూసిపెట్టాడు కూడానూ! సరిగ్గా తను చేస్తున్నటువంటి ఉద్యోగమే—మామయ్య, తనకు తెలిసిన ఒక ప్లీడరు దగ్గిర గుమస్తాగిరీ కుదిర్చాడు. ఇటువంటి ఉద్యోగం చేయటం చాలా అన్యాయమనిపించింది.

మామయ్యకు, తన అభ్యంతరం ఎందుకు తెలియచేయలేక పోయినాడో, శ్రీనివాసరావుకి అప్పట్లో తట్టలేదు. మామయ్యదగ్గర తనకు భయమని కాదు. మామయ్యపోషణలో ఉంటున్న తనకు, అభ్యంతరం చెప్పేటంత, ధైర్యం లేకపోయి ఉండొచ్చును. మామయ్య, సంవత్సరంపాటు, తిన్నా తన తల్లినీ పోషించటానికీ, తను పట్నం వెళ్ళకుండా చేయటానికీ, ప్లీడరు గుమస్తాపనిలో ప్రవేశపెట్టించటానికీ కారణం కూడా లేకపోలేదు!

తనకూతురు అరుంధతికోసం, తనను మొగుణ్ణి, మామయ్య, తన పథకంతో బంధించి వేసినట్టు స్పష్టమవుతూనే ఉంది. అరుంధతిని తనకే కట్టిపెట్టాలని, మామయ్య మొదట్నుంచీ ఆలోచిస్తున్న విషయం కొత్తకాదు.

అరుంధతిమీద తన మనసు పోయిందీ లేనిదీ స్పష్టంగా తెలీలేదు. ఆ పిల్ల, చూపులకి ఫరవాలేదు. అయితేనేం? చాకలిపద్దు రాయటానికి కావలసిన అక్షరజ్ఞానం కూడా లేదు. ఇంట్లో ఆ పిల్ల, బండచాకిరీ చేస్తూఉండటం తను నిత్యం చూస్తున్నటువంటిదే. తన మామయ్య 'పథకం' ప్రకారం, ఇక మిగిలింది, అరుంధతిని, తన కిచ్చి పెళ్లిచేయటమే!

సరిగ్గా, ఇటువంటి పరిస్థితిలోనే శ్రీనివాసరావు జీవితంలో సరోజిని అడుగుపెట్టడం తటస్థించింది.

తన ఇష్టాయిష్టాల ప్రసక్తి లేకుండా మామయ్య ఇష్టానుసారం నడుస్తున్న తనకు వ్యక్తిత్వం ఎక్కడుంది? తనమట్టుకు తనే నిర్ణయించుకుని, ఆప్రకారం చేసుకోగలిగే శక్తి ఎక్కడుంది?

ఇంతకీ తను ఎందుకు పనికొస్తున్నట్టు?

ఈ ఆలోచనలతోనే, ఒకనాడు తను తన ఏకాంతస్థలానికి పోగా, తను కూర్చునే రాతిమీదనే సరోజిని కూర్చునిఉంది!

అంతకు ముందు సరోజిని ఎవరో తనకు తెలీదు. రెండుమూడు రోజులక్రిందటే సరోజిని అక్కడికి వచ్చింది.

"మీకోసమే నేను వెతుక్కుంటూ వచ్చాను" అని, సరోజిని, మాటల సందర్భంలో అంటే, తను నమ్మలేదు. సరోజినిమీద అనుమానంకూడా వేసింది తనకు.

సరోజినికి పాతికేళ్లుంటై. చూసిననాడే, తన కళ్లు చెదిరినై. స్త్రీలో ఎటువంటిఅంద ముంటుందో తనకు అర్థమయినట్టయింది.

సరోజిని, తన్ను వెతుక్కుంటూ వచ్చానన్న మాటలో, దాపరిక మేమీ కనపరచలేదు. కుండ పగలేసినట్టుగా, ఎబ్బెట్టుగా ఉంటాయి ఆవిడమాటలు.

"నాలాగ మాట్లాడే స్త్రీకి పిచ్చెక్కింద నుకుంటారు. అవునా?" అన్నది సరోజినే ఒకనాడు.

"నీలాగ మాట్లాడగలిగే స్త్రీకోసమే నే నెదురు చూస్తున్నాను. అసలు, ఇటువంటి స్త్రీ ఉంటుందా? అని చాలాకాలం ఆలోచించాను. నువు కనిపించావు." అన్నాడు తను.

"నావంటి స్త్రీని తీసుకొని, మరొక కథ రాయండి. చదవాలని ఉంది. నా కథే రాస్తే బాగుంటుందేమో!" అన్నది సరోజిని!

# 4

సరోజిని కథ యావత్తూ తెలుసుకోటానికి శ్రీనివాసరావుకి ఆట్టే కాలం పట్టలేదు. ఒక వారం రోజులలో సరోజినే తనకంతా చెప్పింది.

బియ్యేలో ప్రవేశిద్దా మనుకుంటూ ఉండగానే, సరోజిని చదువు మానెయ్యాలిసివచ్చింది. తల్లీ తండ్రీ అన్నయ్యా కలిసి బలవంతాన పెళ్లి చేశారు. ఆపెళ్ళికి తన ఇష్టాయిష్టాలతో ఆట్టే పనిలేకపోయింది. భర్త బాగా డబ్బున్నవాడు. వ్యాపారి. సరోజినికి అప్పట్లో పెళ్ళిపట్లా, భర్త పట్లా, ఎటువంటి గాఢమైన అభ్యంతరాలూ కనిపించలేదు. పెళ్లి అయినాకనే, భర్త తన్ను ద్రోహం చేసినట్టూ, తన వాళ్లను మోసంచేసినట్టూ తెలుసుకున్నది. మోసాన్ని తనవాళ్ళు సులభంగా క్షమించి మరిచిపోయినారు గాని, తనకు జరిగిన, ద్రోహం మాత్రం సరోజిని క్షమించ వలచలేదు. తన భర్తకూ, బొంబాయిలో ఉంటున్న ఒక పార్సీయువతికీ సంబంధం ఉన్నట్టు కాపరానికి వెళ్లినప్పుడే తెలిసింది. తన కున్న విద్యాసంస్కారంతో భర్తకు తన అసమ్మతి తెలియచేస్తే, ఆయన కొట్టొచ్చాడు.

పార్సీదాన్ని వొదిలేస్తే, కాపరం చేయటానికి తన కాట్టే అభ్యంతరం లేదనికూడా భర్తకు చెప్పిచూసింది.

'నా సొంతవ్యవహారంలో నీకు జోక్యం అనవసరం' అన్నాడు భర్త.

'అయితే నీతో నేను కాపరం చేయలేను' అన్నది సరోజిని.

పొమ్మన్నాడు భర్త. సరోజిని ఇంటికి వచ్చేసింది.

భర్త, పార్సీదాన్ని పెళ్ళిచేసుకోవడాని పోతూపోతూ, సరోజిని ఎవడితోనో లేచిపోయినట్టు పుకారు లేవదీసి మరీ పోయినాడు. తన తల్లిదండ్రుల్లాంటివాళ్ళూ, అన్నయ్యల్లాంటివాళ్ళూ ఆపుకారుని పూర్తిగా నమ్మారు. ఎందుకు నమ్మారో సరోజినికి అర్థంకాలేదు.

సరోజిని ఇంటికి విచ్చేస్తే, జరగవలసిన ఆదరణ జరగలేదు. సరోజినికి ఒక చెల్లెలుంది. ఆ చెల్లెలికీ, తనకూ మాటలు లేకుండాకూడా చేశారు.

తను ఎలాగూ లేచిపోయినట్టు అంతా నమ్మినప్పుడు, తనకు నచ్చినవాడితో నిజంగానే లేచిపోవడంలో తప్పేమీ లేదనే నిర్ణయానికి వచ్చింది సరోజిని.

సరోజిని, ఈ విషయం చెపుతున్నప్పుడు, ఆమె తననే వెతుక్కుని వచ్చిందని నమ్మాడు శ్రీనివాసరావు.

'దిక్కులేని పిల్ల' అనే పేరుతో తను రాసిన ఒక కథ సరోజినికి బాగా నచ్చటానికి, సరోజిని పొందిన అనుభవాలే కారణమయ్యాయంటూ కూడా సరోజిని చెప్పింది.

ఆ కథ చదివాకనే, పత్రికవారికి ఉత్తరం రాసి, శ్రీనివాసరావు ఎడ్రసు కనుక్కొని, సరోజిని మరి ముందూవెనకా ఆలోచించకుండా లేచివచ్చినట్టు కూడా చెప్పింది.

ఇక్కడే ఆడపిల్లల స్కూలులో టీచరుగా ఉంటున్న ఒక స్నేహితురాలి ఇంట్లో సరోజిని బస చేసింది.

తన్ను సరోజిని, ఎట్లా కనుక్కొని కలుసుకోగలిగిందో విన్నప్పుడు, శ్రీనివాసరావుకి నవ్వుకూడా వచ్చింది.

"ఇక్కడికొచ్చాక, మొన్న బుక్‌స్టాలులో ఏదో పుస్తకం తిరగేస్తూ ఉండగా, అక్కడ మిమ్మల్ని ఇంకెవరితోనో చూశాను. మీ సంభాషణ విన్నతరువాత, మీరే ఫలానా అని తేల్చుకు

న్నాను. నిన్న, నేనూ నా స్నేహితురాలూ ఈవైపు వచ్చాం. మిమ్మల్ని, ఈ రాతిమీద దూరంనుంచే చూసి పోల్చుకున్నాను. నా స్నేహితురాల్ని అడిగాను కూడాను. తను అప్పుడప్పుడు మిమ్మల్ని ఇక్కడ చూస్తూ ఉంటుందిట. మీ రెవరో మాత్రం తెలీదన్నది. ఇక మిమ్మల్ని కలుసుకోవటం ఏమంత కష్టమైన పనీ!" అన్నది సరోజిని.

స్త్రీలో తను ఇటువంటి విభిన్నమైన స్వభావం కోసం ఎదురుచూసిన మాట నిజం. అది సరిగ్గా ఈనాటికి, ప్రత్యక్షం కాగానే అదే తన్ను ఆకర్షిస్తున్న అనుమానం వేసింది శ్రీనివాసరావుకి.

ఇప్పుడీ సరోజిని బతుకేం గాను? తనగురించి ఆలోచనలన్నీ పోయి శ్రీనివాసరావుకి, సరోజిని గొడవ పట్టుకుంది. ఆలోచించినకొద్దీ, తను పరస్త్రీ వ్యామోహంలో పడుతున్న అనుమానం బాధించసాగింది.

నెల్లాళ్లు గడిచినై...రెండు నెలలు గడిచినై. మూడో నెల కూడా కావస్తున్నది.

ప్లీడరు గుమాస్తా చాకిరీమూలాన, తను సాయంకాలాలపూట, తన ఏకాంతస్థలానికి వెళ్లటం ఆలస్యమవుతున్నది. ఒక్కొక్కనాడు అసలు వెళ్లటం పడేది కాదు.

సరోజిని మట్టుకు రోజూ పనిపెట్టుకువచ్చేది. తను వచ్చేదాకా ఎదురుచూసేది. ఒక్కొక్కనాడు, 'నిన్న మీరు రానేలేదే!' అనేది. తను వచ్చాక, ఇద్దరూ ఎన్ని విషయాలు మాట్లాడేవారో, ఎన్ని వర్ణించేవారో అంతు ఉండేది కాదు. ఈ ప్రపంచమంతా వారి చర్చలో గిర్రున తిరిగిపోయేది.

ఒకనాడు తను సరోజినిని అడిగాడు.

"నువేం చేయదల్చుకున్నావు?" అని.

"ఉద్యోగం చేస్తాను!" అన్నది సరోజిని.

"అంటే?" అన్నాడు తను.

"ప్రైవేటుగా బియ్యేకీ, ఆ తర్వాత బియిడికీ కట్టాలనుకుంటున్నాను."

"నువు ఉద్యోగం చేయటం నాకు ఇష్టం లేదు సుమా, నన్నడిగితే!" అన్నాడు తను.

"నాకు మరి తిండెవరు పెడ్తారు? నా స్నేహితురాలు ఎంతకాలం భరిస్తుందనీ?"

"నీకు తిండి పెట్టేవాళ్లుంటే, మానేస్తావా?" అన్నాడు తను.

"అప్పుడాలోచిస్తాను. ఇప్పుడేం తొందర?"

సరోజినితో తనకు లభించింది సాహచర్యమా, సాన్నిహిత్యమా అనే సందేహం ఒకటి, కొత్తగా కలిగింది శ్రీనివాసరావుకి. ఏమయినా, ఇప్పుడు, అరుంధతిఅంటే విముఖత్వం పుట్టుకొస్తున్నది. కొద్దికాలంలోనే అరుంధతిని తనకిచ్చి పెళ్ళిచేయటానికి మామయ్య స్థిరసంకల్పంతో ఉన్నాడు. ఇది తప్పించుకోవట మెట్లా? తప్పించుకోవాలన్న అభిప్రాయం ఎందుక్కలిగింది? సరోజినిమీద తనమనసు పోతున్నదా? సరోజినికూడా ఇటువంటి ఉద్దేశంతోనే ఉన్న దనుకోవాలా? ఉండకుంటే, 'తనకోసం' వచ్చి, ఇక్కడ ఎందుకు మఠం వేస్తుందీ?

మొగుడొదిలేసిన ఆడదానిమీదనా తన మనసు పోవటం?

ఇంతకీ, తనకున్న విశ్వాసాలేమిటి?

ఇంత సంస్కారంగల సరోజినిని వదిలేసిన ఆ మొగుణ్ణి ఏమనాలి? ఇప్పుడు తను సరోజినిని ఉద్ధరించటానికి ఎందుకు పూనుకోరాదూ? అయితే, ఈ ఉద్ధరింపు సరోజినికి ఇష్టమవుతుందా?

అరుంధతిని తను పెళ్లిచేసుకోకపోతే, తన బాబులాంటివాణ్ణి మరొకణ్ణి, మామయ్య గేలం వేయకపోడు.

కాని, సరోజిని చరిత్ర తెలిసినవాళ్ళు, ఎవరు మళ్ళీ సరోజినిని ఆదరిస్తారు? ఆ పని తనే చేయాలని రాసిపెట్టినట్టుంది.

ఈలోపునే మరో బెడద వచ్చిపడింది. తనకు ఎవతెతోనో సంబంధం ఉన్నట్టు, ఊళ్లో ఒక పుకారు లేవటమేకాక, ఆ సంగతి మామయ్యకూ, అమ్మకూ కూడా తెలిసినట్టు అనుమానం కలిగింది. అందరూ తన్ను వింతగా, కొత్తగా చూస్తారేగాని, 'నువు ఇటువంటి పని చేస్తున్నట్టు మాకు తెలిసింది. అది మా కెవరికీ ఇష్టంలేదు' అని స్పష్టంచేయరు. ఎవరికీ ఇష్టం లేనట్లే ఉన్నప్పటికీ!

ఈమధ్య తల్లి మొహం చూడాలంటే బొత్తిగా సిగ్గవుతున్నది. అంటే, తను చేస్తున్నపని, చెడ్డపనికిందే, తనుకూడా జమకట్టుకొని, అందుకు తను

పశ్చాత్తాపపడుతున్నానా అనుకున్నాడు శ్రీనివాస రావు.

"పశ్చాత్తాపం ఎందుకూ? నేను చేస్తున్నదే నాకు మంచిదిగా తోస్తున్నది" అనుకున్నాడు మళ్లీ.

## 5

"ఏంరా? నువు సరిగా పనిచేయటం లేదుట?" అన్నాడు మామయ్య ఒకనాడు.

"ఎవరు చెప్పారూ?" అన్నాడు తను.

"ఎవరు చెప్తారేమిటి? ఆ ప్లీడరుగారే చెప్పారు. నువేమో ఒకటి రాయబోయి ఒకటి రాస్తావుట. సాయంకాలం అయిదు కొడితే మరి కనపడవుట."

"ఆ ముక్క నా ముఖంముందే ఎందుకు ఏడవ లేకపోయినాడూ?" అన్నాడు తను!

"ఇది మరీ బాగుంది! పెద్దమనిషిగా ఉంత కక్కర్లే? అతనికి నిన్ను వొప్పగించినవాణ్ణి నేనూ!"

"అక్కర్లేకుంటే, ఉత్తరక్షణంలో మానెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను". అన్నాడు తను.

"ఏం? ఉద్యోగాలు పాచిపోతున్నాయనా మనవంటి వాళ్లకి?"

"ప్రపంచంలో ఈ ఒక్క ఉద్యోగా లే ఉన్నటు మాట్లాడతా వేమిటి మామయ్యా? రేప ట్నుంచి, మానేస్తున్నానని చెప్పెయ్యి" అన్నాడు తను. ఇట్లా అనటానికి తనకు ధైర్యం ఎలా వచ్చిందా అని ఆశ్చర్యపడుతూ నే.

"నువు మానటానికి వీలులేదు. నీ సంగతి నాకు జొత్తిగా తెలీదనుకుంటున్నా వేమో!" అన్నాడు మామయ్య, హెచ్చరిస్తున్నట్టుగా.

మామయ్యతో తను ఆడే చర్చించవలచుకో లేదు.

ఆ సాయంకాలం, తను సరోజినిని కలుసుకొన్నప్పుడు, తను వేసిన మొదటి ప్రశ్న: "మనది సాన్నిహిత్యమా? సాహచర్యమా?"

"అంటే?" అన్నది సరోజిని.

"నీకర్థం కాలేదంటే నమ్మలేకుండాఉన్నాను సరోజినీ!" అన్నాడు తను.

సరోజినీ కాస్సేపు ఆలోచించి,

"అయితే, రెండూనూ!" అన్నది.

ఆ సమాధానంతో, తన అనుమానాలన్నీ పటాపంచలయినట్టయింది శ్రీనివాసరావుకి. ఇన్నాళ్ళూ, ఈ సరోజినిని కలుస్తున్నప్పటికీ తాకితే తంతుం దేమో అన్నంత అనుమానం పీడిస్తూ ఉండేది తనకు. ఈ అనుమానానికి కారణం కూడా సరోజిని ధోరణే. కొన్నాళ్లు చంచలమైన మనసు కలదనుకొన్నాడు. ఈ పిల్ల, ఎవరితోనూ కూడా కాపరం చేయలే దనుకున్నాడు. ఇల్లు వదిలిపెట్టి వీధినిపడ్డ స్త్రీ అనుకున్నాడు. ఎన్ని అనుకున్నా, తన మనసుమాత్రం వేధిస్తూనే ఉండేది. సరోజినిని కలుసకోకపోతే ఉండలేననిపించేది. సరోజినిని చూసినప్పుడల్లా, గుండె కొట్టుకొనేది.

నీటిలో మునుగుతూ తేలుతూ, చివరికి ఏదో ఒక ఆధారంగా పైకొచ్చి, మింగిన నీరంతా కక్కినవాడిలాగా ఉన్నది ఇప్పుడు శ్రీనివాసరావుకి.

సరోజినికి దగ్గరగాపోయి వణకుతున్న చేతులతో, ఆమె చేతులు పట్టుకున్నాడు తను. సరోజిని అభ్యంతరం చెప్పలేదు.

తన కంతకంతకూ ధైర్యం ఎక్కువవుతున్నట్టు భావించసాగాడు.

"నేను చాలా తప్పపని చేస్తున్నానేమో!" అనుకున్నాడు. ఆ మాటలు తనకు తెలీకుండానే పైకివచ్చినయ్.

"మీ రేంచేశారు తప్పు?" అన్నది సరోజిని.

శ్రీనివాసరావు సమాధానం ఇవ్వలేదు.

"మనం ఇట్లా ఉండటం మీకు తప్పగాతోస్తే, నా మానాన నేను పోతాను. మీరు మరేమీ అనుకోకండి. ఇంతకు మునిగిందేముందీ?"

"నువట్లా అనుకుంటున్నావా సరోజినీ?" అన్నాడు తను.

"మీకు తెలీలేదంటే, ఇప్పుడు నేను నమ్మలేకుండా ఉన్నాను!" అన్నది సరోజిని నవ్వుతూ. అప్పుడు తను కూడా నవ్వాడు.

పదినిమిషాలు గడిచినై.

"నేను రేపు పట్నం పోవాలనుకుంటున్నాను" అన్నాడు తను.

"ఎందుకూ?"

"ఉద్యోగానికి!" అన్నాడు తను.

ఉద్యోగంకోసం ఎందుకు పట్నం వెళ్ళాలని నిశ్చయించుకున్నదీ చెప్పాడు తను.

"నువిక్కడేం చేస్తావు?" అన్నాడు మళ్ళీ.

ఈ మాట లంటున్నప్పుడు, తన గుండె మరో సారి తీవ్రంగా కొట్టుకోడం ప్రారంభించింది.

"చెప్పాగా!" అన్నది సరోజిని.

"నాకు తోచిన ముక్క చెప్పమన్నావా?" అన్నాడు తను. గుండె దడ ఎక్కువయింది.

"చెప్పండి .."

"నువేమీ అనుకోకపోతే—చెప్పటానికి—ఇన్నాళ్ళ కిప్పుడు సాహసిస్తున్నాను" అన్నాడు తను. గుండె దడ ఇంకా ఎక్కువయింది.

సరోజిని నవ్వింది.

"నువు కూడా పట్నం వచ్చేయరాదూ?" అనేశాడు తను. అమిత వేగంగా కొట్టుకుంటున్న గుండె, చప్పున ఆగిపోతుం దనిపించింది.

సరోజిని ఆలోచిస్తున్నది.

"నాతో వొచ్చేయటానికి, నీకు అభ్యంతరం లేదుకద!" అన్నాడు తను.

"లేదు" అన్నది సరోజిని.

రెండో కంటికి తెలీకుండా, మర్నాడు తను, సరోజినితోపాటు ఎట్లా మెయి లెక్కాడో తనకే తెలీలేదు!

## 6

సరోజినితోపాటు, శ్రీనివాసరావు పట్నం చేరుకొని నెల్లాళ్లయింది. ఈనెల రోజులలోనూ ఒక బసకుదుర్చుకున్నాడు. పదిహేనురోజులపాటు పట్నమంతా గాలించగా, ఒక వారపత్రికలో ఉద్యోగం కుదిరింది. దాన్ని సంపాదకత్వం అనటానికి వీలు పడదు. పత్రిక అచ్చయి బయటపడి, చదువరి చేతులకూ అందటానికి ఎన్నిపనులు చేయాలో, అన్నీ దాదాపు తనే చేయాలి. పత్రికాధిపతి 'కనిపెట్టిన' ఒకానొక 'సర్వరోగ నివారిణి'కి ప్రచారం చేసుకురావటమే ఆ పత్రిక పరమార్థం. పత్రికాధిపతి, తనకు నెలకు మొదట్లో నూరు రూపాయలు ఇస్తానన్నాడు. పత్రికకున్న అయిదువేల కాపీల ప్రచారమూ పాతికవేలకు పెరిగినపుడు మరో యాభై ఎక్కువ చేస్తానని మాటిచ్చాడు.

సరోజిని, తను కూడా ఏదైనా చిన్న పనిలో ప్రవేశిస్తా నన్నది.

"చూతాం లెద్దూ" అన్నాడు తను.

హోటలునుంచి ప్రస్తుతం క్యారియర్ తెప్పించుకుంటే, ఇద్దరికీ ధారాళంగా సరిపోతున్నది.

ఒకనాడు తనకు, మామయ్య దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది.

"...నువిట్లా మా అందరి కళ్ళూ కప్పి పారిపోవటం చాలా ఘోరం. నువు పట్నంలో ఉన్నావనీ ఏదో పత్రికలో పనిచేస్తున్నావనీ తెలిసింది. నీకు ఉద్యోగం దొరికినందుకు మేమెవ్వరమూ సంతోషించటం లేదనుకోవద్దు. కాని, నువు ఎవతెనో లేవతీసుకుపోయినట్టు ఊరంతా గుప్పుమున్నది. నువు చేసిన పనివల్ల నేను తలెత్తలేక పోతున్నాను. ఇది నువు తెలీకుండా చేశావంటే నమ్మలేను. మీ అమ్మ నీకోసం బెంగపెట్టుకున్నది. నువు పట్నం పోతా నన్నప్పుడు నిన్ను పంపించని తప్పు నాది. ఇప్పుడు నువు చేసిన పనికి నాకేమీ కోపం లేదు. వెంటనే వచ్చి పెళ్లి చేసుకుంటే సంతోషిస్తాను..."

వారం రోజులు పోయినాక దీనికి సమాధానం రాశాడు తను.

"...నువు నామీద ఏమైనా ఆశపెట్టుకుంటే అది విడిచిపెట్టుకోవటమే మంచిది. ఇప్పట్లో నేను రాలేను. వీలున్నప్పుడు మాత్రం రాకపోను. బెంగ పెట్టుకోనవసరం లేదని అమ్మకు చెప్పు. అమ్మకోసం డబ్బు పంపిస్తున్నాను..."

ఉత్తరంతోపాటు, పాతిక రూపాయలు ఎడ్వాన్సు తీసుకొని, మనియార్డరు చేశాడు శ్రీనివాసరావు.

సరోజినీ, తనూ దాదాపు భార్యాభర్తగానే చెలామణీ అయిపోతున్నారు. దీనికి కొంత నిజాయితీ కల్పిద్దామనే ఆశ తనకు లేకపోలేదు. అందుకే ఒకనాడు తను,

"మనం పెళ్లి చేసుకుందామా?" అన్నాడు.

"మీకు పెళ్లిలో అంత నమ్మకముందా? నాకు

ఒక పెళ్లితో కలిగిన అనుభవంతో అసలు నమ్మకం లేకుండాపోయింది!" అన్నది సరోజిని.

"మనల్ని మానీ అంతా భార్యాభర్తల మనుకుంటున్నార్లే!" అన్నాడు తను,

"అనుకోనీయండి. మంచిదేగా! ప్రజలట్లా అనుకోనటానికేగా పెళ్లి! మన గురించి అంతా అనుకోవలసిందే అనుకొంటున్నప్పుడు, వేరే తంతు కూడా జరగాలా ఏమిటి?...మీకిలా ఉండటం బాగా లేదా?"

"నాకింకా ఒక పెళ్లేనా కాలేదు మరి!" అన్నాడు తను!

"అయినా వాళ్ల అనుభవాలతో మీరు మీ దృక్పథం మార్చుకుంటారనుకున్నాను!"

"నీకు నాలో నమ్మకం లేదన్న మాట." అన్నాడు తను.

"పెళ్లిచేసుకోక పోయినంత మాత్రాన ఒకరి మీద ఒకరికి నమ్మకం ఉండదా?

ఉంటుందని మనం ఎందుకు ఋజువుచేయకూడదూ? నేను చేయదలచుకున్నాను."

శ్రీనివాసరావు, సరోజినితో అనవసరంగా వాదన పెంచుకోదలచలేదు. ఇంతవరకూ తను చవి చూడని స్వర్గసుఖం ఇప్పుడు సరోజిని ఇస్తున్న దన టంలో తన కెటువంటి సందేహమూ లేదు. ఈ స్వర్గసుఖాన్ని చేతులారా పాడుచేసుకోవటం మతి లేని పని! అయితే, పెళ్లిఅనేది జరిగిపోయిన పక్షంలో, తన వాళ్ళకి తెలీకుండా చేస్తున్నా ననుకుంటున్న 'తప్పు' కాస్తా 'ఒప్పు'గా మారి, తన బాధ కొంత తీరుతుందని మాత్రం ఆశించాడు శ్రీనివాసరావు. పెళ్ళి అనవసరంలేదని సరోజిని ఖచ్చితంగానే చెప్పినట్టు భావించిన తనకు, కొద్దిగా ఆశాభంగం కలగకపోలేదు.

ఒకనాడు తను ఇంటికి వస్తూఉండగా హటాత్తుగా బస్సులో రామచంద్రం కనిపించాడు.

"ఏమోయ్! నువుకూడా చేరుకున్నావూ పట్నం! ఎక్కడేమిటి ఉద్యోగం?" అన్నాడు రామచంద్రం తన్ను చూడగానే.

"నువిక్కడే ఉన్నావన్నమాట! ఏం చేసున్నావు!" అన్నాడు తను.

రామచంద్రం తన పక్కనే ఖాళీగా ఉన్న సీటులో కూర్చున్నాడు.

"ఇక్కడికొచ్చాక ఇది నాలుగో ఉద్యోగం మనకి. ఈ జీవితం ఇంతే! ఒకటే మనకి స్థిరంగా ఉండేటా! ప్రస్తుతం ఒక ఇన్స్యూరెన్సు కంపెనీలో ఆర్గనైజర్‌గా ఉంటున్నాను. బాగానే ఉంది. మరో ఆరు నెలల్లో మా వాళ్లు ఢిల్లీలో బ్రాంచి పెడ్తున్నారు. అక్కడికి బ్రాంచి మేనేజరుగా పంపుతామని మాట ఇచ్చారు." అన్నాడు రామచంద్రం.

"నీ పనే బాగుందిలే. మీ ఇల్లెక్కడ?" అన్నాడు తను.

"అడయారులో, ఇల్లు తీసుకున్నాన్లే ఒక్కణ్ణే! రాకూడదా నాతో? అన్నట్టు నువెక్కడున్నావు?"

"నేను మైలాపూరులోనే వుంటున్నాను. దిగు. ముందు మా యింటికి రా. తరువాత నీ యింటికి పోదాంలే" అన్నాడు తను.

"సంసారంతో సహా వచ్చావా యేమిటి?" అన్నాడు రామచంద్రం బస్సు దిగుతూ.

ఈ ప్రశ్నకు తను కొద్దిగా నవ్వాడు.

"ఎందుకు నవ్వుతావు?"

"ఏం చెప్పాలో తెలీక!" అన్నాడు తను.

"అంటే?"

"పెళ్లిచేసుకోబోతాంలే!"

"ఓహో! ఏదో పిట్టనుపట్టి తెచ్చావన్న మాట!" అనేశాడు రామచంద్రం తనవీపు చరుస్తూ.

తనకీమాట కొద్దిపాటి కష్టంగా తోచకపోలేదు కాని, తనేమీ సమాధానం ఇవ్వలేదు. మొదట్లో, తను అట్లా అనేసినందుకు మాత్రం శ్రీనివాసరావు నాలిక కొరుక్కున్నాడు. తనకు తెలీకుండా కొన్ని కొన్ని పనులు చేస్తూఉండటం, కొన్ని కొన్ని మాటలు అనేస్తూ ఉండటం జరుగుతూనే ఉంది. ఆత్మపరీక్ష చేసుకుంటే, వీటికి స్పష్టమైన కారణం కనపడదు. ఇక కొన్ని సమయాల్లో ముప్పు తెచ్చిపెట్టగలవని కూడా ఆ క్షణంలో తోచదు.

ఇల్లు చేరుకోగానే, తను సరోజినికి రామచంద్రాన్ని పరిచయంచేశాడు.

సరోజిని, ఇద్దరికీ కాఫీ తెచ్చిఇచ్చింది. తనూ ఒక కప్పు పుచ్చుకోని, వారితోపాటే కూర్చున్నది.

"ఇంతకీ నీ ఉద్యోగ మేమిటో చెప్పావు కావు!" అన్నాడు రామచంద్రం.

తన ఉద్యోగం గురించీ, నెలసరిజీతంగురించీ అన్నీ చెప్పాడు తను.

"ఈ రోజులలో ఏం సరిపోతుందీ?" మా కంపెనీలో చేరతావా?" అన్నాడు రామచంద్రం.

"ధన్యోస్మి! నేనాపని చేయలేను" అన్నాడు తను నవ్వుతూ.

"పోనీ, నేను పనికొస్తానా?" అన్నది-సరోజిని. సరోజిని అట్లా ఆ ఘడియలో ప్రటిక్కన అనేస్తుందని తను ఊహించలేదు.

"మీరా!...మీరా!......" అన్నాడు రామచంద్రం. అతను అట్లా ఆశ్చర్యపడుతున్నప్పుడు, సరోజిని కళ్లలోకి చూస్తూఉండటం తను గమనించాడు.

"నాకు ఉద్యోగమంటూ చెయ్యాలని ఉంది చాలాకాలంబట్టి. ఇంట్లో ఇట్లా గడపటం కష్టం..." అన్నది సరోజిని.

"మీరు కోరితే, ఉద్యోగం ఇవ్వనివాళ్లెవరుంటారూ? ఆలోచిస్తాను." అన్నాడు రామచంద్రం.

"నేను బియ్యేలూ గియ్యేలూ పాసుకాలేదు సుమండీ!" అన్నది సరోజిని నవ్వుతూ.

"నేను పాసయ్యానా యేమిటి! బియ్యేలు పాసుకావసరం లేకుండా దొరికే ఉద్యోగాలు కూడా లక్ష ఉన్నాయి!" అన్నాడు రామచంద్రం.

సరోజిని తనకేసి చూసింది. 'ఆయన నాకు ఉద్యోగం ఇప్పిస్తే, నేను చేయటం, మీకు ఇష్టమే అనుకుంటాను!' అన్నట్టుగా. ఆ చూపు తనకు అర్థమయింది. కాని, సరోజిని ఉద్యోగం చేయటం తనకు ఇష్టం లేదని ఎట్లా చెప్పాలో తెలీలేదు.

ఆ రాత్రి పడుకోబోయేముందు, శ్రీనివాసరావు ఆత్మపరీక్ష మళ్ళీ ప్రారంభమైంది. సరోజిని ఉద్యోగం చేయటం తనకు ఎందుకు ఇష్టం లేదు? ఆలోచించినకొద్దీ, ఇందులో తన స్వార్థం కొంత కనిపిస్తున్న మాట నిజం. కాని తనలో ఉన్న ఈ స్వార్థం, మగవాడన్నవాడికి, ఎవడికేనా కొద్దోగొప్పో ఉండకపోదు. ఆ స్వార్థం ఒక్కొక్కరిలో ఒక్కొక్క విధంగా ఉంటుంది. సరోజినిని పెళ్ళి చేసుకోని, తన సొంతం చేసుకోవాలన్న స్వార్థమే, సరోజిని ఉద్యోగం చేయటానికి ఒప్పుకోలేదు.

తన అభిప్రాయాలకు సరోజిని ఎదురుతిరుగుతున్నట్టు కనిపించసాగింది. మొన్న మొన్న కలసిన ఈ పొత్తుకి, ఇంత త్వరలోనే అడ్డంకులా!

సరోజిని, తన పోషణలోనే ఉండాలన్న భావంకన్నా, సరోజిని, కేవలం తనదే అయిపోవాలన్నభావం ఎక్కువగా ఉన్న తనకు, సరోజిని, అప్పుడే దూరమవుతున్న చిహ్నాలు పొడగట్టసాగినై.

ఎంతమంది భార్యలు ఉద్యోగాలు చేయటం లేదూ? నాళ్ళంతా హాయిగా బతకటం లేదూ? పోతే, సరోజిని, కనీసం తన భార్యన్నా కాదు. ఉద్యోగం చేస్తున్నప్పటికీ తనకు దూరమైపోదనుకోటానికి, ఇప్పుడు, నీ ఉద్యోగప్రయత్నం మానెయ్యి అనటానికి భార్యమీద ఉండే అధికారం తనకు సరోజినిమీద లేదు. భార్యకాదు గనక!

అసలు, ఇంతకీ, తనదే బుద్ధిపొరపాటేమో! ఆ రామచంద్రంగాణ్ణి, ఇంటికి తీసుకురావటం, ఇంత కొచ్చింది. వాడు వచ్చినట్టే వచ్చి, మెల్లగా పుల్ల పెట్టిపోయినాడు. వాడి సంగతి తనకేం తెలీదు గనక?

## 7

శ్రీనివాసరావు భావించినట్టే, ఆరాత్రి తనకూ సరోజినికీ కొంత ఘర్షణ జరిగింది.

"అయితే, నువు ఉద్యోగం చేయాలనే సంకల్పించావన్నమాట!" అన్నాడు తను.

"అందుకు మీరు ఇష్టపడితే నా కెంత ఆనందంగా ఉంటుంది!" అన్నది సరోజిని.

"నా కొచ్చేదాంతో, మనం కేవలం ముష్టిబతుకు బతకటం లేదుగా? నువు కూడా సంపాదన ప్రారంభించవలసినంత అవసరంలేదని నాతాత్పర్యం" అన్నాడు తను.

"కాస్తో కూస్తో చదువుకున్నాను గనక ఇంట్లో ఎట్లా గడపగలను చెప్పండీ! తలవొంపులకు సరి అయ్యే ఉద్యోగం కాదుగా! ఇంతకన్నా ఎక్కువ రాబడిఉంటే కాదంటామా మరి!"

"రామచంద్రం సంగతి నీకు తెలీక అట్లా మాట్లాడుతున్నావు సరోజనీ! వాడు ఎంతకేనా తగిన వాడు!" అనేశాడు తను మళ్లా! తనలో గూడుకట్టుకొన్న స్వార్థం తనకు తెలీకుండా, తన చేత ఇటువంటి మాటలు అనిపిస్తున్న విషయం శ్రీనివాసరావుకి చాలా కాలానికిగాని తెలిసిరాలేదు.

"పోనీ మీరు ఇంకెక్కడైనా, నాకోసం ప్రయత్నించి పెట్టండి. కాదన్నానా?" అన్నది సరోజిని.

"నా కిష్టం లేదు సరోజనీ!" అన్నాడు తను.

"మనం ఈ విషయంలోకూడా ఒక అభిప్రాయానికి రాలేకపోతున్నందుకు, నాకు విచారంగా ఉంది. చెప్పొద్దూ! పెళ్ళివిషయంలోకూడా మన అభిప్రాయాలు వేరైనై. పెళ్ళి అనే ఒక విధమైన ముడిలేకుండా బతకలేమా అనే నా పట్టుదల. స్వతంత్రంగా గణించుకోలేమా అనే నా విశ్వాసం. నా విశ్వాసాలమీద మీకు గౌరవం లేకపోవచ్చు. ఆడదానికి ఇటువంటి అభిప్రాయాలు కలగడం మీకు వింతగా తోస్తున్నదనుకుంటాను. నే నేం చేసేదీ!"

"అబ్బే! నీవంటిదానికి కలగవలసిన అభిప్రాయాలే కలుగుతున్నాయిలే, ఆశ్చర్యం దేనికీ?" అన్నాడు తను ఊరుకోకుండా.

శ్రీనివాసరావు తను ఊహించి, ఆమోదించిన స్వతంత్రానికీ, సరోజిని స్వతంత్రానికీ ఎక్కడా సంబంధం లేదు. తను అనుకున్న స్వతంత్రానికి పరిమితులూ సరిహద్దులూ కనిపిస్తున్నాయి. సరోజినిది సరిహద్దులులేని స్వాతంత్ర్య దృక్పథం అని తన కిప్పుడు తెలుస్తున్నది.

ఆ రాత్రికి, వారి సంభాషణ ఆటే సాగలేదు. శ్రీనివాసరావు మాత్రం, 'నే నేం చేయగలను? నే నెందుకు పనికొస్తాను?' అనే తన మామూలు ప్రశ్నలకు సమాధానాలు వెతుక్కొంటూ నిద్రపోయినాడు.

ఒక వారంరోజులు, ఉభయులూ, ఏమీ జరగనట్టే ఎట్లా ప్రవర్తించారో, తలుచుకుంటే, ఇప్పుడు తనకే ఆశ్చర్యం వేస్తున్నది.

ఈ మధ్య మామయ్య మళ్ళీ ఉత్తరం రాశాడు. "ఈ ఉత్తరం అందినవెంటనే నువు రాకుంటే, నేనే బయల్దేరి వస్తున్నాను, నీ తల్లిని ఎందుకంత దుఃఖ పెడ్తావు చెప్పు?"

శ్రీనివాసరావుకి, పెద్ద ద్రోహం చేస్తున్నట్టు తోచసాగింది. సరోజినితో లేచివచ్చి, తను దాదాపు కాపరం పలిగించటం గొప్ప నేరంగా తోచింది. అప్పుడే కొన్ని నెలలయింది తను ఈ కాపరంలో పడి!

ఆ వేళ పత్రికలన్నీ పోస్టుచేయవలసిన రోజు కావటంవల్ల, శ్రీనివాసరావు కొంచెం ఆలస్యంగా ఇల్లు చేరుకున్నాడు. దానికితోడు తలనొప్పి కూడా పట్టుకున్నది.

ఇల్లు చేరుకునేసరికి, ఇంటి తలుపు తాళంవేసి ఉంది.

సరోజిని, ఇట్లా, తనకు తెలీకుండా ఎన్నడూ ఇంతవరకూ, బయటకు వెళ్లలేదు.

ఇవేళ సరోజిని చేసిన ఈ పని తన గుండెలో పెద్ద గాయం చేసింది.

ఎక్కడికి వెళ్ళిఉంటుంది? ఆ రామచంద్రం గాడు వచ్చి తీసుకుపోలేదు కద!

తను ఊహించినంతా అయింది. చేసేదిలేక, తను వీధిలో ఎదురుచూస్తూ నిలబడ్డాడు. ఇంకో పది నిమిషాలకే సరోజిని వచ్చింది.

"వెధవది. బస్సు సరిగా దొరకలేదు. అడయారు వెళ్లివచ్చేను." అన్నది సరోజిని తాళంతీస్తూ,

"రామచంద్రం దగ్గిరకా?" అన్నాడు తను. పొంగివస్తున్న కోపం బలవంతాన అణుచుకుంటూ.

"ఆయనే సాయంకాలం వచ్చి, నాకు ఉద్యోగం దొరికిందన్నారు. ఆర్డరుమీద సంతకం చేయటానికి, కంపెనీకి రమ్మన్నారు. ఇంతలో పోయిందేముందని వెళ్లాను. అక్కడనుంచి, వాళ్లింటికి వెళ్ళాం." అన్నది సరోజిని ఏ మాత్రమూ తడుముకోకుండా.

"ఏమిటా ఉద్యోగం?" అన్నాడు తను ఇంకా కోపంతోనే.

"ఆ ఉద్యోగానికి, ఒక పేరంటూ లేదు. ఉత్తరాలు రాయడం, మొదలైన చిన్న పనులన్నీ చేయాలి. అంతే. నూరు రూపాయ లిస్తారు." అన్నది సరోజిని గదిలోకి పోతూ.

ఆమె వెంట తనూ గదిలోకి వెళ్లాడు.

"మీకు చాలా కోపం వచ్చినట్లుంది. ఇంతలో ఏం ప్రమాదం జరిగిందనీ?" అన్నది సరోజిని, తన వేపు తిరిగి.

"ఉద్యోగంలో, నీ యిష్టం ప్రకారం చేరావు. నువు స్వతంత్రురాలివి. నిన్ను నేనేమనగలను? ఏమన టానికీ నాకు హక్కు లేదు. నీలో నేను చూశానను కున్న స్వతంత్రం, ఈ విధంగా పరిణమిస్తుందని మాత్రం, నే ననుకోలేదు. ఉన్నమాట చెప్తాను" అన్నాడు తను కొంత కసితీర్చుకుంటూ.

"మీ రట్లా భావిస్తే, నేను మాత్రం ఏం చెప్పేదీ? ఈమాత్రం దానికి, ఆయన నన్ను ఎత్తుకు పోవటం లేదుకద!" అన్నది సరోజిని.

"దానికే ఇది నాంది" అన్నాడు తను తనకు తెలీకుండా చప్పున.

## 8

రామచంద్రం పూర్తిగా తన్ను మోసం చేశాడనాలి. నాకు సరోజినిని కొస్తా తన్నుకుపోవాలనే చూస్తున్నాడన్నది స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది. ఉద్యోగ మిప్పించినట్టు సుఖ్యపెట్టినవాడు ఇంకా ఏదన్నా చేయగలడు. కాని, తనేం చేయాలి? ఎందుకు పనికొస్తున్నట్టు? సరోజినిని తను ఇంత గాఢంగా ప్రేమిస్తున్న విషయం సరోజినికి తెలీదా? ఆమె, తన్ను ఇన్నాళ్లూ ప్రేమించటంలేదా? బతుకు తెరువు చూసుకోటానికి సాగించిన నటనేనా?

ఈ క్షణంలో, రామచంద్రంతో పోట్లాడ గలిగేశక్తి తన కున్నదా? ఒక ఆడదానికోసం ఇద్దరు కుమ్ములాడుకోవటం ఎంత నీచం? తన జీవితంలో ఈ ఘట్టం ఏదో ఒక మామూలు సినీమా కథలాగా పరిణమించటం ఎంత దురదృష్టం!

ఇక, సరోజిని, తనకు తీరికగా ఉన్నప్పుడల్లా కనిపించక పోవచ్చు. ఈ ఆలోచన కూడా స్వార్థంగానే ఉంది. సరోజినికి మట్టుకు స్వార్థంలేదనా! స్వార్థరహితంగా ఎవడు మాత్రం ఏపనిచేస్తాడు? స్వార్థరహితంగా ఉండాలనుకొనటం కూడా ఎవరో అన్నట్టు, స్వార్థమే కాకుంటే మరేమిటి?

నెలరోజులు గడిచిపై. రోజులన్నీ మామూలుగానే గడుస్తున్నాయి. అయితే, తనకుమట్టుకు, ఈ నెలరోజులూ చాలా దుర్దినాలుగానే తోచిపై.

మామయ్య ఉత్తరానికి, తను ఏ సమాధానమూ ఇంతవరకూ ఇయ్యలేదు, మామయ్య ఎప్పుడు వచ్చి పడ్తాడో అనే బెంగ ఒకటి తనకు పట్టుకుంది.

సరోజిని రోజూ 'ఆఫీసు'కి వెడుతున్నది. ఒక్కొక్కరోజు ఆలస్యమయితే, రామచంద్రమే దిగబెడతాడు. ఇది చూస్తూ ఊరుకోవటం తప్ప, తను చేయగలిగే దేదీ కనిపించటం లేదు—రామచంద్రం పలకరిస్తే, తను పలకటంతప్ప!

ఒక్కొక్కనాడు సినీమా రాత్రి ఆట చూసి వచ్చేది సరోజిని—రామచంద్రంతోపాటు. తన కిది మరీ కంటకంగా తోచేది. సరోజిని పెళ్లి ఎందుకు అక్కర్లేదన్నదో, తన కిప్పుడు పూర్తిగా అర్థమవుతున్నట్టున్నది.

దినదినానికీ ఎక్కువవుతున్న ఈ మనోవ్యథతో, ఇటువంటి జీవితం ఎన్నాళ్లు గడపటం? తన కొక ఇల్లూ, సంసారం ఉండాలనే కోరిక ఎంత దెబ్బతిన్నదో ఇప్పుడు తెలుస్తున్నది. సరోజినిని గడ్డిగా లేవదీసుకువచ్చిన ఫలితం అనుభవిస్తున్నట్టు తోచసాగింది.

సరోజినిలో కూడా కలిగిన మార్పు తను కని పెట్టకపోలేదు. ఆమె ఇప్పుడు మునపట్లో మాట్లాడటం లేదు, ఏదన్నా మాట్లాడితే, తన ఆఫీసు వ్యవహారాలు చెప్తుంది. రామచంద్రం గొప్ప హృదయంగలవాడంటుంది. మొదట్లో తనుకూడా అట్లా అనే ఉబ్బేసింది!

సరోజినిని అర్థం చేసుకొనటంలో గొప్ప పొరపాటు పడ్డట్టనిపించింది. అసలు సరోజిని మనస్తత్వం ఏమిటో తనకు సరిగా అంతుపట్టలేదు. తన్ను భర్త విడిచిపెట్టాడని చెప్పినప్పుడు, ఆ విషయం ఆనాడు తను పూర్తిగా విశ్వసించటంలోనే పప్పులో కాలు వేశాననుకున్నాడు. భర్తను విడిచిపెట్టి, తన్ను మరిగినట్టే, ఇప్పుడు తన్ను విడిచి, రామచంద్రంగాణ్ణి

మరగబోతున్నది. ఈ సరోజిని ఏ పురుషునితోనూ స్థిరంగా కాపరం చేయలేదన్నమాట. ఏ ఇంగ్లండు లోనో, అమెరికాలోనో పుట్టవలసింది, తప్పిజారి ఈ దేశంలో పడింది! సరోజిని మొట్టమొదట తన్ను కలుసుకొన్నప్పుడు సరోజినిలో ఈ గుణం తను చూడలేకపోవటం, తన అజ్ఞానం, అనుభవశూన్యత, కాకుంటే మరేమిటి?

అసలు, తనూ సరోజినీ ప్రేమించుకొంటున్నట్టా లేనట్టా?

ప్రేమేమిటి ప్రేమ! అసలు ఎక్కడుందీ ప్రేమ? అంతా మట్టిగడ్డ! తనకూ సరోజినికీ మధ్య ఉంటున్నది ప్రేమ అనుకోడానికి వీలులేదు. తనూహించిన ప్రేమ అనేక విశ్వాసాలతోనూ, త్యాగాలతోనూ కూడుకున్నది.

ఇక్కడికి 'ఎప్వాంచరు'కి స్వస్తి చెప్పి, శలవు మీద చక్కగా ఇంటికి పోయి ఆ అరుంధతి నే పెళ్ళి చేసుకుంటే మంచిదిగా తోచింది శ్రీనివాసరావుకి.

ఏదో ఒకనాటి పొరపాటువల్ల తన కాలు జారిందని ఒప్పుకొని, ఈ బురదలోంచి, ఇప్పటి కేనా కాలు తీసి కడుక్కోవటం బుద్ధిమంతుని లక్షణం!

"నే నొకసారి ఊరికి పోయివస్తాను" అన్నాడు తను.

"అమ్మను తీసుకొస్తారా?" అన్నది సరోజిని.

"ఎందుకూ? ఎక్కడుంటుంది తెస్తే?"

"ఏం? మనతోపాటు ఉండదూ?"

"బాగా చెప్పావు! మా అమ్మ మన వ్యవహారం వింటే, ఉరిపోసేసుకుంటుంది!" అన్నాడు తను కాస్త ఎత్తిపొడుపుగా.

"ఏం! మనం మామూలు భార్యాభర్తలల్లే ఉంటున్నామన్న నమ్మకం మీకు లేదా? నా కా నమ్మకముంది. చిల్లరమల్లర అభిప్రాయభేదాలు ఎంత వాళ్లకన్నా వస్తాయి. వాటినే మనసులో పెట్టుకొని, తోచినకాటికి నిర్ణయాలు చేసుకుంటూ ఉంటారా?"

మాటలలో ఎంత నేర్పు! ఈ నేర్పరితనానికే తను ఇదివరకు మభ్యపడిపోయి దాసుడైనాడు కద! మళ్ళీనా! తను పనికొచ్చే గెట్లానో బుజువు చేసుకో వలసిన సమయం వచ్చిందనుకున్నాడు తను.

"ఉహూ! మనం - నువ్వూ నేనూ, మామూలు భార్యాభర్తలల్లే నే ఉంటున్నాం. సందేహ మేమిటీ? మామూలు భర్తలు అంతా కూడా తమ భార్యల్ని ఇతరులతో సినీమాలకు వెళ్లనిస్తారు. ఇష్టం వచ్చిన ఉద్యోగాలు చేసుకోనిస్తారు. ఒక్కొక్క రాత్రి భార్యలు ఇంటికి రాకున్నా దిగులుపడరు" అన్నాడు తను గుండెలో మంటంతా వెళ్ళగక్కుతూ.

"నామీద మీకు ఉన్నట్టుండి ఇంత అనుమానం ఎందుకు పుట్టిందో అర్థం కావటం లేదు. అసలు మొగాడి బుద్ధే ఇంతేనేమో!"

"ఆడదాని బుద్ధికన్నా నా?"

"కనీసం నావంటి ఆడది, తనకు న్యాయమైన దని తోచింది చేస్తుంది."

"నిజమే. ఆ చేస్తున్నపనివల్ల, తనతో సంబంధంగలవారికి ఏం నష్టం వస్తుందనిగానీ, ఏ బాధ కలుగుతుందనిగానీ కూడా నీ వంటిది ఆలోచించదు."

"మానండీ! మన వాదనకి అంతంటూ ఉండదు. మీరు మిమ్మల్నీ, నే నేమో నన్నూ సమర్థించుకోటానికే ప్రయత్నిస్తాం. ఎవరి విశ్వాసాలు వాళ్ళవి. నేను మిమ్మల్ని ఏవిధంగానూ అన్యాయం చేయలేదని నా అంతఃకరణే చెప్తున్నది. అసలు నేను ఎవరికన్నా కప్పే స్వభావం కలదాన్నికాను! నా మీద మీకున్న అనుమానాలకి ఆధారం లేదు కూడాను. ఈమాట నేను చెప్తే మీరు నమ్మకపోవచ్చును. నమ్మించటానికి నేను ఎక్కువ శ్రమకూడా పడను. అటువంటి పనిలో నాకు విశ్వాసం లేదు. మిమ్మల్ని నమ్మి నేను మీతో ఎట్లా ఉండగలుగుతున్నానో, అదేవిధంగా నన్ను మీరునమ్మి, నాతో ఉండగల రనే విశ్వసించాను. ఈ విశ్వాసంలో అర్థంలేదని మాత్రం బుజువుచేయకండి" అన్నది సరోజిని.

మళ్లా ఎంత పసందైనమాటలు! ఎక్కడో నేర్చుకున్నట్టే మాట్లాడి ఇట్లే బంధించటానికి ప్రయత్నిస్తుంది సరోజిని! ఒకసారి మోసపోయి, ఇంతకు వచ్చింది!

సరిగ్గా ఆ వేళ రాత్రే సరోజిని రామచంద్రంతో కలిసి, రాత్రిఆటసినీమా చూసి ఏ ఒంటిగంటకో

ఇల్లు చేరింది. సినీమానుంచి వస్తున్నానని చెప్పింది గాని, సినీమాకే పోయిందో, రామచంద్రం ఇంటి నుంచే వస్తున్నదో పరమాత్ముడనేవాడు ఉంటే, వాడికే తెలియాలి. ఈ వ్యవహారం ఇంక తను భరించ రానిది. ఎంత త్వరలోపోయి పెళ్ళి చేసుకొనివచ్చి వేరే యిల్లు చూసుకుంటే అంత మంచిది. ఇక ఈ సరోజిని తన దెలాగూ కాదు. తనకు భార్యగా ఒక స్త్రీ ఉండవలసిన అవసరం ఎంతేనా ఉన్నట్టు తోస్తున్నది. అరుంధతే తనకు రాసిపెట్టి ఉంది అదెలా తప్పుతుందీ?

మర్నాడు శ్రీనివాసరావు ఊరికి బయల్దేరే ముందు తను వస్తున్నట్టు మామయ్యకు టెలిగ్రా మిచ్చాడు.

## 9

దాదాపు ఏడాదిపాటు పట్నంలో గడిపి వచ్చాక, మళ్ళీ తల్లిని చూడగానే శ్రీనివాసరావు కళ్ళు చెమ్మగిల్లినై.

తను చాలా కాలానికి తల్లిని, చూడగలిగానని కాదు. తల్లి కళ్లుకప్పి, ఘోరమైన అపచారం చేశా ననే పశ్చాత్తాపంవల్లనే తన కళ్ళు చెమ్మగిల్లినట్టు తెలుసుకున్నాడు.

స్టేషనులో అడుగు పెడ్తూనే, అందరికళ్లూ తన మీదనే ఉన్నట్టు అనుమానం వేసింది. అంతా తన్ను వింతగా మృగాన్ని చూస్తున్నట్టు చూస్తున్నా రనిపించింది. శరీరంమీద తేళ్ళూ, జెర్రులూ పాకు తున్నట్టనిపించింది.

తన్ను చాలా సహజంగా చూసింది ఒక్క మామయ్యే! ఎంతకేనా కూతుర్నికన్న మామయ్య!

"ఎప్పుడో ఒకప్పుడు నువిట్లా తిరిగివస్తావని నాకు తెలిసినదే! ఎన్నాళ్లు శెలవు పెట్టావు?" అన్నాడు మామయ్య! ఆ మాటలకు తనకెంతో సిగ్గ వేసింది!

"ఆటే లేదు. వారం రోజులే, మళ్లీ వెంటనే వెళ్ళకుంటే, పత్రిక దెబ్బతింటుంది" అన్నాడు తను. అసలు పెళ్ళి సన్నాహాలు ఆ యింట్లో, కొంత కాలంబట్టి జరుగుతున్నట్టుగానే ఉంది! తను రావ టమే తడవుగా చేశారు!!

అరుంధతి తన్ను తప్పుకు తిరుగుతున్నది. ఇటీ వల ఆ పిల్ల వాళ్లు చేసింది! ఇదివరకు కనిపించని అందం ఇప్పుడు ఆ పిల్లలో తనకు కనిపిస్తున్నది! తనంటే అరుంధతి అసహ్యపడుతున్నదా? లేక పెళ్లి సిగ్గా! కనీసం, అరుంధతైనా తన్ను ప్రేమించ గలదా? తను ఆపని చేయగలడా?

ఈ ఆలోచనలతోనే, ఆనాటి సాయంకాలం, తన ఏకాంత ప్రదేశానికి వెళ్ళాడు శ్రీనివాసరావు.

రెండు బండలమధ్య, చిన్న రాతిమీద కూర్చొని, 'నే నెందుకు పనికొస్తాను?' అను కున్నాడు.

ఈ పెళ్ళి చేసుకొని, సరోజిని భరతంపట్టాలి. సరోజిని గుండెలో మంటలు రేకెత్తించాలి. అప్ప టికిగాని తనకు శాంతి అంటూ ఉండదు.

పెళ్లి సవ్యంగానే జరిగిపోయింది.

ఆమర్నాడే తను బయల్దేరాలి. కాని వెంటనే వెళ్ళటానికి కొన్ని ఆటంకాలు ఏర్పడినై. ఇంకొక వారం రోజులు శెలవు పొడిగించవలసివచ్చింది. పత్రి కాధిపతికి పెద్ద ఉత్తరం రాశాడు శ్రీనివాసరావు - ఈ వారం గడిచాక, తప్పక వస్తున్నానని.

రెండు రోజులు గడిచాక, హటాత్తుగా తనకు, సరోజిని రాసిన ఉత్తరం అందింది. ఇటువంటి దెన్నడూ జరగదనుకొన్న తనకు, ఈ ఉత్తరం మళ్ళీ మనోవ్యథ తెచ్చిపెట్టింది.

సరోజిని, చాలా టూకీగా రాసింది.

"మీ రెప్పు డొస్తున్నారు? ఇన్ని రోజులు ఎందు కుండిపోయినారు? మీకోసం ఎదురుచూస్తూ న్నాను. నాదే పొరపాటేమో! మీ రొచ్చినవెంటనే పెళ్లి..." ఆతర్వాత మరి చదవలేకపోయినాడు తను.

తనలో కూడా కొంత పొరపాటున్నట్టు తోచింది. సరోజిని రాసిన ఆ ముక్కలు తన్ను తీవ్రంగా బాధపెట్టసాగాయి. సరోజిని అటువంటి నిర్ణయానికి రాగలదని కూడా తను ఊహించలేకపోయి నాడు. తన్ను ఎంత నమ్మకొని ఉండకపోతే సరో జిని అట్లా రాస్తుంది! సరోజినిని ఎంత ద్వేషిం చాడు! తన అనుమానం అంతా అబద్ధమేనా?

. ఈ పెళ్లి చేసుకోవటంలో, మళ్ళీ పెద్ద పొర

పాటయిపోయింది. ఇప్పు డీ 'భార్య'ను ఏం చేయటం? ఎట్లా తీసుకువెళ్లటం? ఏం చేయాలి? ఏం చేయగలను? ఎందుకు పనికొస్తాను? తన్ను వెంటాడే ప్రశ్నలు మళ్ళీ ప్రత్యక్షం!

ఇప్పుడు సరోజినికి సమాధానం రాయవలసిన బాధ్యత ఒకటి ఉంది. ఏమని సమాధానం రాయటం? ఉన్నదున్నట్టు రాసేస్తే?

పెళ్లి మూడోనాటి రాత్రి, అరుంధతిని గదిలో కలుసుకొన్నప్పుడు, శ్రీనివాసరావు,

"అరుంధతీ! నువు నన్ను క్షమించవలసి ఉంటుంది!" అన్నాడు.

అరుంధతి బిత్తరపోయింది!

భార్యను పక్కను కూర్చోపెట్టుకొని, తను చేసిన పొరపాటేమిటో పూసగుచ్చినట్టు చెప్పేశాడు శ్రీనివాసరావు.

"నన్నేం చేయమంటావు చెప్పు! నా ప్రారబ్దం. నీ జీవితంలో నీకు సుఖంలేకుండా చేస్తున్నాను మాస్తూమాస్తూ" అన్నాడు.

"మీ రెక్కడుంటే అక్కడే నేనూనూ మీతోపాటే తీసుకొనిపోండి" అన్నది అరుంధతి.

పతివ్రతల కథలు బొత్తిగా అబద్ధాలు కావని పించింది తనకు.

మర్నాడు శ్రీనివాసరావు సరోజినికి ఉత్తరం రాశాడు.

"సరోజినీ! నువు నన్ను క్షమిస్తావనే నమ్మకంతో నీకీ సంగతి చెప్పటానికి సాహసించాను. నీ ఉత్తరం అందింది. నిన్ను అనవసరంగా అనుమానించిన పాపం నన్ను చుట్టుకుంటుందిలే. ఆ పాప ఫలం అనుభవించవలసింది నేనే. నీమీద అనుమానంతో ఆ బాధ భరించలేక నేను పెళ్లిచేసేసుకున్నాను. అందుకే వొచ్చాను కూడాను. నువు క్షమించి మా ఇద్దర్నీ స్వీకరించగలవనే నమ్మకంతోనే, మరో నాలుగురోజులలో వస్తున్నాం. అమ్మ కొన్నాళ్లిక్కడే ఉంటుంది."

## 10

శ్రీనివాసరావు భార్యాసమేతుడై పట్నం చేరుకునేసరికి ఇంటి తలుపులు తాళాలు వేసి ఉన్నై.

కారణం ఊహించుకునే లోపుగానే పక్కింటి వాళ్ళు తాళాల చెవి తెచ్చి ఇచ్చారు.

"అమ్మగారు ఏదో ఊరికిపోయినారండి" అని సమాధానం కూడా వచ్చింది.

సరోజిని, ఏ ఊరికి వెళ్ళిఉంటుంది. అనుకుంటూనే తాళంతీసి లోనికి ప్రవేశించాడు శ్రీనివాసరావు. అరుంధతి కూడా లోనికి వెళ్లింది. బండీ వాడు సామాను తెచ్చి పడేశాడు.

ఎదురుగా గదిలో మంచంమీద కనిపిస్తూనే ఒక కవరు ఉంది. అది సరోజిని రాసిపెట్టిన ఉత్తరం.

వణకుతున్న వేళ్ళతో ఆ ఉత్తరంతీసి శ్రీనివాసరావు చదువుకున్నాడు.

"శ్రీనివాసరావుగారు! మిమ్మల్ని ఇట్లానే పేరుపెట్టి పిలవాలనిపిస్తున్నది మీ రింత ద్రోహానికి తలపడతా రనుకోలేదంటే నమ్మండి. మీ ఉత్తరం అందకముందే మీ పత్రికా ఆఫీసులో కనుక్కొంటే చెప్పారు. మీ పెళ్ళి శుభలేఖ చూశాను అక్కడ. నాకూడా ఒక శుభలేఖ పంపటానికి మీకు ముఖం ఎట్లా చెల్లుతుంది మరీ? నేను తెలిసి, మీకు ఎటువంటి అన్యాయమూ చేయలేదు. అందుకు నా అంతఃకరణే సాక్షి అని రెండో సారి చెప్తున్నాను. నాకూ రామచంద్రంగారికీ ఏదో సంబంధం ఉన్నట్టు మీరు ఊహించి, పాపం చాలా బాధపడ్డారు. మిమ్మల్ని నేను నమ్మించలేక పోయినాను. కసి తీర్చుకోడానికి వెళ్ళి, నాతో చెప్పకుండా పెళ్ళిచేసుకున్నారు. ఇక మీకూ నాకూ పొసగదనే మాటేగా!

"మీరు వెళ్ళిపోయాక మీకోసం నేనెంత బాధపడ్డానో, ఆ బాధలోనే, నా విశ్వాసాలను కూడా లక్ష్యంచేయక, మనం పెళ్లిచేసుకుందామని, ఎట్లా రాశానో, తలుచుకుంటే నాకే ఆశ్చర్యం వేస్తుంది! పైగా మీరు క్షమించమన్నారు! నేనిటువంటివి క్షమించలేను! కొన్నాళ్లపాటు, ఒక 'గొప్ప కథకుడి' స్నేహం, సాహచర్యం, పొందగలిగానని నా జీవితాంతం జ్ఞాపకం ఉంచుకుంటాను లెండి.

"రామచంద్రంగార్ని మీరు అంత అనుమా-

నించవలసిన కాలం పోయింది. మీమీద నాకు ఉండిన నమ్మకంతో, అనేకసార్లు ఆయన గుండె గాయపరిచాను కూడాను. ఆయనకు హఠాత్తుగా ఢిల్లీ బదిలీ అయింది. నన్ను తమకు పర్సనల్ అసిస్టెంటుగా రమ్మన్నారు. మూడువంద లిస్తారుట. ఇక ఇక్కడ నాకేముంది? వారివెంట పోతున్నాను.

"సాధ్యమైనంత త్వరలో నన్ను మరిచిపోతే, మీరు ముందుకొస్తారు. ఇక నా కథకూడా పూర్తి అయినట్టే! మీరు కథకులు గనక, మీ పత్రికలో చక్కని 'సీరియల్' రాయండి, నాకో కాపీ పంపుతూ ఉండండి. ఇదే నా కోరిక.

"మీ భార్య అరుంధతికి నా దీవనలు చెప్పండి. ఇట్లు——సరోజిని——"

శ్రీనివాసరావు కాళ్లు తేలిపోవటం ప్రారంభించినై.

అతను మంచంమీద, ఉన్నపళంగా కూలబడ్డాడు.

"ఏమండీ! ఏం జరిగింది?" అన్నది అరుంధతి ఏదీ అర్థంకాక.

"అరుంధతీ!" అన్నాడు తను ఆమెను దగ్గరగా తీసుకొని.

శ్రీనివాసరావు కళ్లలో, నీళ్లు ఎందుకు తిరుగుతున్నాయో అర్థంకాని అరుంధతి - తన పైట కొంగుతో, అతని కళ్లు తుడిచింది.

కాసేపు పోయాక,

"అరుంధతీ! నిన్ను అన్యాయం చేశానా?" అన్నాడు శ్రీనివాసరావు.

ఈ ప్రశ్న తన ఆత్మపరీక్షలోంచి వచ్చినదే అని మాత్రం, ఆ క్షణంలో శ్రీనివాసరావుకి తట్టలేదు.



# కృష్ణమాచార్య వచనములు*



శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

క్రీస్తుశకం పదునేడవశతాబ్ది అంతిమభాగంలో తిరుపతికి సమీప ప్రాంతాలలో ఒక పెద్ద విప్లవం జరిగింది. దుండగీండ్రైన మహమ్మదీయులు కొందఱు చెలరేగి ఆ ప్రాంతాల్లో అనేక అత్యాచారాలు చేశారు. గ్రామాలు దోచుకున్నారు. దేవాలయాలు పడగొట్టారు. వారి దోపిడీలు సాగించారు. ఇంకా ఎన్నో ఎన్నో చేశారు. అప్పుడు తన చుట్టుపట్టుల్లో వుండే ప్రజకి సంరక్షణం యివ్వక తన కేమీ కొంబట్టనట్టుగా రాయికిమల్లే కదలకండా మెదలకండా వుండే శ్రీ వెంకటేశ్వరస్వామిని ఆ ప్రాంతాల్లో ఆ విప్లవకాలంలో వుండిన ఒక అజ్ఞాత కవి కడుపుమండి కోపం పట్టలేక బాగా ఘాటుగానే దుయ్యబట్టుతూ ఒక్క శతకం రాశాడు. దానికి † 'శత్రుసంహార శతకం' అని పేరు. అందులోనిది యీ పద్యం చూడండి—

"కటకేంద్రు కూతురి కౌగిటిలో జిక్కి
    జెల్లపిల్లస్వామి చేతగాదు
కృష్ణమాచార్య సంకీర్తనంబుల జొక్కి
    సింహాద్రి యప్పయ చేతగాదు
కవ్వంపుగొండ సంఘర్షణోద్ధతి దక్కి
    శ్రీ కూర్మనాథుని చేతగాదు
సాంఖ్యతొండని జాలజడి కెంతయును స్రుక్కి
    జెన్నమల్లేశుని చేతగాదు
పవన జవన నిరాఘాట యవనఘోట
హరణ జయధాటి మీ చేత నౌనె మేటి
వౌదు ఒకసన్న జూసు మేలా పరాకు
శత్రు సంహార! వెంకటాచల విహార!

ఈ పద్యంలో కృష్ణమాచార్యు లనే ఒక భక్తుడు సంకీర్తనలు పాడి సింహాద్రి నరసింహస్వామిని చొక్కింపజేసేవా డనే విషయం ఒకటి పేర్కొనబడింది.

ఇంతకి యింకా పూర్వంలో పదునాఱవ శతాబ్ది వాడైన తాళ్ళపాక చిన్నన్నకూడా యీ కృష్ణమాచార్యులను రెండు మూడు స్థలాల్లో పేర్కొన్నాడు. తాళ్ళపాక అన్నమయ్య 'శృంగార మంజరి' అనే గ్రంథం రచించి శ్రీ వేంకటేశ్వరస్వామివారికి సమర్పించగా ఆయన అన్నమయ్యతో యిలా అన్నాడట!

"అడుచు బతికమా కన్నులజోల
పాడగ నా డెల్ల బసిబిడ్డ నైతి
నా కృష్ణమాచార్యు నధ్యాత్మవినుతి
రాక గొన్నాళ్లు విరక్తుండ నైతి
జగతి నీశృంగార సంకీర్తనముల
కగపడి మంచిప్రాయపు వాడ నైతి"

అన్నమాచార్య చరిత్రము

కృష్ణమాచార్యులు పాడిన అధ్యాత్మసంకీర్తనములను విని వెంకటేశ్వరస్వామంతవాడు విరక్తుడయినాడట! కృష్ణమాచార్యుల సంకీర్తనల యోగ్యత అలాంటిది!

చిన్నన్న తన పరమయోగి విలాసంలో—

'వేదంబు తెనుగు గావించి సంసార
ఖేదంబు మాన్పిన కృష్ణమాచార్యు'

నని యీకృష్ణమాచార్యులను ప్రశంసించినాడు. ఇతడి సంకీర్తనల సంచయం తెలుగు వేదం! ఆ వేదం చదువుతే సంసారఖేదం తొలగుతుంది!

ఇలాంటి ప్రశస్తిని గడించిన కృష్ణమాచార్యులనుగురించీ, అతడు రచించిన సంకీర్తనములనుగురించీ

---

* 'తాళపత్ర గ్రంథాలు' అను శీర్షికను మదరాసు రేడియోకేంద్రమునుండి ప్రసారము చేసిన ప్రసంగమును పెంచి వ్రాసినది.

† శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలమువారు ప్రకటించిన 'శ్రీ వెంకటేశ్వర లఘుకృతులు' అను గ్రంథమున ముద్రితము.

తెలుసుకోవాలని యెవరికి వుత్సాహం పుట్టదు ? ఉత్సాహం అంటూ కలిగినా తర వాత పరిశ్రమ యెప్పుడూ వట్టినే పోదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో 'కృష్ణమాచార్యవచనములు' అనే పేరుతో ఒక గ్రంథం వుంది. ఆ ఒక్క గ్రంథానికే ఆ భాండాగారంలో మూడుప్రతులు లభిస్తున్నాయి. అందులో రెండుప్రతులు ఒకటి మాతృక, మరొకటి దానికి ప్రతిక! ఇందాక పేర్కొన్న కృష్ణమాచార్యులు రచించిన సంకీర్తనల సంకలన గ్రంథమే అది. మదరాసులో మాత్రమే కాక యీ గ్రంథమే తంజావూరు సరస్వతీమహలు లైబ్రరీలో కూడా వున్నది. అయితే ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు ప్రకటించిన అక్కడిగ్రంథముల కేటలాగులో దీని పేరు 'విష్ణునామసంకీర్తనము' అని వున్నది. పేరయితే వేరుగావుంది గాని అందులోని విషయమంతా యిదే. కేటలాగును తయారు చేసినవారు గ్రంథాన్ని సరిగా గుర్తింపకపోవడంవల్ల యేర్పడిన ప్రమాదం అది! ఎలా అయితేనేం ప్రస్తుతం యీ గ్రంథానికి నాలుగుప్రతులు లభిస్తున్నవని చెప్పవచ్చు :

ఆంధ్ర వాఙ్మయంలో అపూర్వమయిన యీ గ్రంథానికి వున్న విలువ యెలాంటిదో నిర్ణయించే ముందు యీ గ్రంథానికి కర్త అయిన కృష్ణమాచార్యులకాలం గూర్చి తెలుసుకోవడం అవసరం. ఏగ్రంథంయొక్క యోగ్యతైనా ఆగ్రంథం వెలసిన కాలంమీద కూడా కొంతవరకూ ఆధారపడి వుంటుందని చెప్పడం తప్పు కాదు.

ఏకశిలా నగరవృత్తాంతం అని ప్రాచ్య లిఖిత పుస్తకశాలలోనే మరొకగ్రంథం వుంది. అందులో కృష్ణమాచార్యులను గురించి ఒక వింతకథ వుంది. కృష్ణమాచార్యుల మహిమాదికొన్ని మాత్రమే కాక ఆ కథ అతడికాలాన్ని కూడా కొంత అస్పష్టంగానే అయినా తెలుపుతూ వుంది. ఆకథ యిది!

"మరియొక్కనాడు సంతూరను గ్రామంబున కృష్ణమాచార్యుల తమ్ముండు అనంతాచార్యులు రజక స్త్రీతో కూడంగా ఆరజకుడు యిద్దరిని పొడిచితె మృతంబైరి. అప్పుడవిప్రులుయీశూద్రపీనిగెతో కూడా సమసిరిగన్క యీ విప్రులు మోయకుండిరి. అది విని కృష్ణమాచార్యులు తన మదినివిచారించివాసుదేవమూర్తినికీర్తించిన ఆ శవంబు తనకుతానే కాష్ఠంబునకు నడచుటయు యిదిగని సకలజనంబులు విప్రులు యేతెంచి కృష్ణమాచార్యుల పాదంబులకుం బ్రణమిల్లి మా యపరాధంబులు క్షమియింపు మనుటయు ఆయయ్య నాకు రాగద్వేషంబులు లేవు. మీరు వెరవవద్దనుటయు యీ వార్త ప్రతాపరుద్రుండు చారులవలన నెరింగి కృష్ణమాచార్యుల రావించి పూజించి ఏకశిలానగరి సీమలు నాల్గోభాగంబున యాబది గ్రామంబులకు అధికారంబు, రొక్కపూరు అగ్రహారంబు,గా వొసంగి అనుపుటయు కృష్ణమాచార్యులు సంతూరు ప్రవేశించి కల్లతనంబు పుట్టుటంజేసి కల్లూరను గ్రామంబు గట్టి కోట పుట్టుటయు మూడు వరుషంబులు అధికారంబు చేసిన గ్రామంబుల గల్గు పదార్థంబు నెచ్చించి తామ్ర పత్రికలు సేయించి యీ పత్రికమీద తా రచియించిన చాతుర్లక్ష గ్రంథంబు లిఖియించి అది శకటంబుపై పన్నుకొని శ్రీరంగంబునకు కొనిపోవ నుద్యోగించిన కొందరు ధూర్తులు గూడి యీ రాజు సన్ముఖంబుకుం బోయి కృష్ణమాచార్యులకు మీరు అధికారంబు యిచ్చిన గ్రామంబుల పదార్థంబు నెచ్చించి తామ్ర పత్రికలు జేయించి శ్రీరంగంబునకుం గొనిపోవుచున్నాడు అని యెరిగించిన ప్రతాపరుద్రుండు విని యతండు మహాత్ముండు. యతనికి యేది యిష్టమో నాకు అదియె యిష్టంబు. అని పూరకుండుటయు ఆ వార్త యిష్టజనులచే కృష్ణమాచార్యులు విని పూరికె పోయిన మూర్ఖత్వంబని రాజసముఖంబునకు యేతెంచి యీపై గ్రామంబుల వరుసత్రయంబునకు లెక్క వినిపించి, అప్పుడు మూడులక్షల వరహాలు అయ ననిన, కృష్ణమాచార్యులు తన మనంబున వాసుదేవు నారాధించి వక్క వచనంబు రచియించిన మెచ్చి యేకశిలానగరంబున కనకవృష్టి కురువుటయు యిది గని ప్రతాపరుద్రుండును, ఆ పరిజనంబులున్ను కృష్ణమాచార్యుల పూజించిన వారిచే వీడ్కొని కృష్ణమాచార్యులు శ్రీరంగంబున కరుగుటయు"

## ఏకశిలానగర వృత్తాంతము

'ఏకశిలానగర వృత్తాంతం'లోని యీ విషయం వల్ల కృష్ణమాచార్యులు కాకతీయ చక్రవర్తి అయిన రెండవ ప్రతాపరుద్రుడి కాలంలో వుండినట్లు మనకు తెలియవస్తున్నది. కృష్ణమాచార్యులు పదమూడో

శతాబ్దంలో ఓరుగల్లు ప్రాంతంలో వుండిన ఒక మహా భక్తుడని దీనివల్ల మనకు తెలుస్తున్నది.

* 'ఆచార్యసూక్తి ముక్తావళి' అనే గ్రంథంలో కృష్ణమాచార్యులనుగూర్చి ఒక చక్కని కథ వుంది. కృష్ణమాచార్యులు సింహాద్రినరసింహస్వామిభక్తుడు. సింహాద్రిమీద వుండి ప్రతిదినం స్వామివారిపై యితను సంకీర్తనలను రచించి పాడుతుండేవాడు. ఆయన సంకీర్తనలు పాడుతుండినపుడు నరసింహస్వామి సంతోషముతో ఆడుతూ వుండేవాడు. రామానుజులవారు దిగ్విజయయాత్ర పోతూ మార్గంలో సింహాద్రిమీద శిష్యులతో కూడా విడిసి స్వామివారి దర్శనంచేసి ఆ గుడిలో యీశాన్యభాగంలో కొంతకాలం గోష్ఠిచేసి తిరిగివస్తూ ఆస్థానమంటపంలో రాజసంతో కూర్చునే వుండిన కృష్ణమాచార్యుల దగ్గరకు పోయి 'అయ్యా! యీ రాత్రి మీరు పాటపాడినప్పుడు స్వామి ప్రత్యక్షమయితే యెంబెరుమానారు అనే ఒక సన్యాసి యిక్కడకు వచ్చివున్నాడు. అతడికి మోక్షం కలుగుతుందా' అని అడుగు. అతడేం చెబుతాడో రేపు నాకు తెలుపు' అని చెప్పి వెళ్లిపోయాడు. కృష్ణమాచార్యులు అతడెవరో ఒక సామాన్యసన్యాసి అని, యేదో వుపకారం చేద్దాం పోనీ అని ఆ రాత్రి తాళము, వీణె ధరించి స్వామివారిని కీర్తించినాడు. అప్పుడు స్వామి ప్రత్యక్షం కాగా యితడు రామానుజుల విషయం ప్రస్తావించినాడు. అప్పుడు స్వామి 'అతడికీ, అతడిప్పించే వాళ్లకీ గూడా మోక్షం వుంది' అని సెలవిచ్చినాడు. మరునాడు కృష్ణమాచార్యులు రామానుజులు గుడికి వచ్చివుండినపుడు రాత్రివిషయం తెలిపాడు. రామానుజులవారంతటితో విడువలేదు.' ఈరోజు రాత్రి నీకు పరమపదం వుందేమో అడిగి తెలుసుకుని నాకు చెప్పు' అన్నాడు. కృష్ణమాచార్యులు నాకు పరమపదం లేకపోవడ మేమిటి? అయినా అడుగుతానని ఆరాత్రి సంకీర్తనలు పాడి స్వామిని తనవిషయం అడిగాడు. కాని స్వామి యేమీ బదులు చెప్పకుండా వూరికే వుండిపోయాడు. అప్పుడు కృష్ణమాచార్యులు 'యిలా మీరు బదులు చెప్పకుండా వుండడం వుచితమేనా?' అని అడిగితే అప్పుడు స్వామి 'మోక్షం నా సొమ్మని వేదాలు చెప్పుతున్నవి. అయితే అది యిప్పుడు పరాయత్తం. శ్రీరంగం నాకుదక్షిణపిల్లు. ఎంబెరుమానారు నన్నడిగితే వుభయవిభూతులూ నేను అతడికి యిచ్చేశాను. అందువల్ల యెవడికైనా మోక్షం కావలసివుంటే అతడికి శరణాగతుడు కావాలి. నీకు మోక్షం వుందో లేదో చెప్పడానికి అతడే కర్త. అందువల్ల యీ విషయం అతణ్ణే అడుగు. మోక్షం నీకు యివ్వతగునని తోస్తే యిస్తాడు. లేకపోతే లేదంటాడు" అని సెలవిచ్చాడు. కృష్ణమాచార్యులకి కోపం వచ్చింది. స్వామీ! ఒక్క సన్యాసికోసం నన్నిలా వంచించడం నీకు ధర్మం కాదు. బాల్యంమొదలుకొని నిన్ను నమ్ముకొని నీమీద కీర్తనలు పాడి కవిత చెప్పినాను. లోకంలో గొప్ప భక్తుడనని పేరుపొందాను. ఆ సన్యాసి ఏదో నీకు మందుపెట్టాడు' అని స్వామిని నిందించాడు. అప్పుడు స్వామి 'నీ గర్వమే నిన్నింతగా చేసింది. రామానుజులు వచ్చినప్పుడు లేచి నిలుచుని నమస్కరించకుండా రాజసంతో వుండినావు. అదే నీ కిప్పుడు తంటాఅయింది. స్వామిమీద పాటలు పాడుతున్నానుగదా అని నువ్వు గర్వపడ్డావు దాని ఫలితమే యిది. నీ భక్తికి సంతోషించి నీకు ప్రత్యక్షమయ్యాను. నువ్వు పాడితే ఆడాను. అంతే! మోక్షం విషయం అది నా అధీనంలోలేదు. నన్నేం చేయమంటావు? అని 'నీ కవిత్వం అగ్రవర్ణులకుగాక నిత్యులపాలై నశించునుగాక' అని శపించాడు. కృష్ణమాచార్యులు! నీ విమానం నేలకూలునుగాక! ఏడు దినములు ఒక్కరీతిగా కాలికూడా నీ దేవాలయం చెక్కు చెదరకుండా వుండునుగాక! తిరిగి నీకు విమాన మమరునుగాక!' అని ప్రతిశాపమిచ్చాడు.

ఆ తరవాత కొద్దిరోజులకి తురుష్కులు దేవాలయ విమానాన్ని పడగొట్టి గుడి కాల్చేశారు. కాని గుడి చెక్కుచెదరకుండా నిలిచివుండినది. కృష్ణమాచార్యుల కీర్తనలు నిత్యభోగ్యము లయినవి. పశ్చాత్తాపంతో కృష్ణమాచార్యులు తిరిగి స్వామిని ఆశ్రయించాడు. 'సంకోచం వీడి రామానుజుల నాశ్రయింప'మని స్వామి అతనికి సలహా యిచ్చాడు. కృష్ణమాచార్యులు రామానుజుల విడిది దగ్గరకు పోయి కృష్ణమాచార్యులు వచ్చియున్నాడని కబురు పంపి

* నంబూరి కేశవాచార్య విరచితము.

నాడు. 'ఆ బ్రాహ్మణుడితో నా కేమి పని' అని రామానుజు లన్నారు. ఈ విషయం రాత్రి స్వామితో చెప్పేసరికి 'ఆచార్యశబ్దం ఒక్క రామానుజులకి తప్ప తక్కినవాళ్ళ కెవళ్ళకీ విహితం కాదు. అందువల్ల వట్టి పేరుమాత్రం చెప్పు' అన్నాడు స్వామి. మరునాడు అలాగే చేశాడు. రామానుజులు ఏమీ చెప్పక వూరకే వుండినాడు. నిరుత్సాహంతో, నిరాశతో ఆ విషయం ఆరాత్రి స్వామితో చెప్పేసరికి 'కృష్ణదాసుడు వచ్చియున్నాడని విన్నవించుకో. అప్పుడు నీకు దర్శనం లభిస్తుంది' అన్నాడు. కృష్ణమాచార్యులు అలాగే చేసి రామానుజులను దర్శించినాడు. రామానుజులు అతణ్ణి ఆదరించి 'నీవు యిక్కడే మాకు ప్రతినిధిగా వుండి విశిష్టాద్వైత మతప్రచారం చేయవలసింది' అని వుపదేశించి దిగ్విజయయాత్రకు శిష్యులతోకూడా బయలుదేరి పోయారు'—

ఇదీ కథ. మనోహరమయిన యీ కథనంవల్ల కృష్ణమాచార్యులు రామానుజులకు సమకాలికులని తెలుస్తున్నది. అయితే యిది యథార్థంగా తోచదు. ఆంధ్రదేశంలో గొప్ప గాయకుడనీ, మహాభక్తుడనీ పేరుపొందిన కృష్ణమాచార్యులను — రామానుజుల వారికి దాసుణ్ణిగా చేర్చుకొని రామానుజుల ప్రభావాదికమును గొప్పగా చెప్పుకోవడానికి తగినట్టుగా యీ కథ రామానుజ మతానుయాయులచే కల్పింపబడినట్టుగా తోస్తున్నది. ఈ కథే నిజమయితే కృష్ణమాచార్యు లింతకంటె మునుపటివాడు కావలసి వచ్చును. ఏకశిలానగర వృత్తాంతం అనే గ్రంథాన్ని బట్టి యితడు కాకతీయ చక్రవర్తి అయిన రెండవ ప్రతాపరుద్రుని కాలంలోవాడుగ నిశ్చయించుకోన వలసి వున్నది.

ఆంధ్రవాఙ్మయంలో యీ కృష్ణమాచార్య వచనములకు ఒక విశిష్టమయిన యోగ్యతా, స్థానమూ వున్నవి. తెలుగువాఙ్మయం యించుమించు సంస్కృత వాఙ్మయాన్ని బట్టి పుట్టినదే అయినప్పటికీ తెలుగులో తొలికాలంలో గద్యపద్య సమ్మిళితమైన చంపూ కావ్యాలే వెలసినవి. యింకా నిర్వచనంగా కావ్యాలు రాయడం ఒక ఘనతకింద ఆకాలంలో పరిగణింపబడింది. సంస్కృతంలో కాదంబరి, దశకుమార చరిత్రవంటి గద్య కావ్యాలు వున్నా తెలుగులో ఆ దశకుమారచరిత్ర కూడా పద్యకావ్యంగా అనువదింపబడింది. 'గద్యం కవీనాం నికషం వదంతి' అనే నానుడిని తెలుగుకవులు పాటించలేదేమో అనిపిస్తుంది. ఎంచేతనంటే విపులములయిన రాజవంశవర్ణనలలోనో, పెద్దకథలని అల్లంతలో సంగ్రహించవలసి వచ్చినప్పుడో, పద్యానికి పద్యానికి, కథకి అతుకు అతకవలసివచ్చినపుడో యెప్పుడో సకృత్తుగా తెలుగుకావ్యాల్లో వచనాన్ని ఒకసాధనంగా మాత్రమే తెలుగుకవులు వుపయోగించుకొన్నారు తప్ప తెలుగులో వచనరచనకూడా కవిత్వమే అని వారు భావించలేదు. గద్యంమీద మనకవులకి అటువంటిభావం వుండబట్టే యించుమించు పదునేడవ శతాబ్దిదాకా తెలుగులో నికరమయిన వచన కావ్యాలు అవతరించలేదు. అలాంటి దశలో యీ 'కృష్ణమాచార్యవచనములు' పదమూడవ శతాబ్దంలో రచింపబడిన తొలి వచనగ్రంథం కావడం ఒక విశేషం కాదా మరి! ఆనుపూర్వితో నొకకథావస్తువు లేకపోయినా వచనకావ్యాల కుండవలసిన లక్షణాలన్నీ యిందులో వుండక పోయినా, అతి ప్రాచీనకాలంలో అంటే పదునేడవ శతాబ్దికి పూర్వం తెలుగులో ప్రత్యేకమయిన వచన కావ్యాలే లేవని అనుకునే దశలో అంత కింకా నాలుగువందల యేండ్లనాడు వెలసిన తొలి తెలుగు వచనరచన యిది కావడం దీని కొక విశిష్టత!

*వృత్తగంధి, తాళగంధి, చూర్ణిక అనేవచన విభేదాల్లో యిది చూర్ణిక అనే వచనవిభేదానికి చెందినరచన. తాళ్లపాక తిరువేంగళనాథుడు 'సంకీర్తనలక్షణం' అనే గ్రంథంలో—

"ధర గృష్ణాచార్యాదిక
పరికల్పితపదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం
బరగు ననిర్యుక్త నామభాసిత మగుచున్"

కృష్ణమాచార్యులు 'చాతుర్లక్ష సంకీర్తనములు' రచించినట్టుగానూ వాటినంతా తాళ్లపాకవారి పదములు చెక్కింప బడినట్టుగానే రాగిరేకులపై చెక్కించినట్టుగానూ పాత వ్రాతలవల్ల మనకు తెలియవస్తూ వున్నా ఆ రచనలన్నీ మనకు యిప్పుడు దొరకడం

*వచన విభేదములను గూర్చిన వివరములకు శ్రీవేంకటేశ్వర వచనముల పీఠిక చూచునది.

లేదు. భిన్నములయిన ప్రతులలోని అన్ని వచనాలూ కలిపితే అంతా కొన్నిపదుల లెక్క కంటే మించవు. ఈ వచనాలకు 'సింహాగిరి నరహరివచనము' లనే పేరుకూడా వ్యవహారంలో వుంది. ఇందులోని ఒక్కొక్క వచనం కడపట 'సింహాగిరి నరహరి' సంబోధనం వుండడంవల్ల దీని కాపేరు కలిగిందన వచ్చు. మచ్చుకి ఒక్క వచనం—

"దేవా! పదికోట్ల యజ్ఞాదిక్రతువులు నడపంగా నేమి, తొమ్మిదికోట్ల తులాభారంబులు తూగంగా నేమి, యెనిమిదికోట్ల సువర్ణదానంబులు సేయంగా నేమి, యేడుకోట్ల గోదానంబులు సేయంగా నేమి, ఆఱుకోట్ల భూదానంబులు సేయంగా నేమి, అయిదుకోట్ల కన్యాదానంబులు సేయంగా నేమి, నాలుగుకోట్ల వస్త్రదానంబులు సేయంగా నేమి, మూడుకోట్ల సత్యాదివ్రతంబులు సేయంగా నేమి, రెండుకోట్ల అన్నదానంబులు సేయంగా నేమి, కోటి స్నానంబులు సేయంగా నేమి, దేవా! మీ నామో చ్చారణంబు సేయక పదికోట్ల యజ్ఞాదిక్రతువులు నడపిన దేవేంద్రుండు నిలువల్లా నోనులయ్యెను. దేవా మీ నామోచ్చారణంబు సేయక తొమ్మిది కోట్ల తులాభారంబులు తూగిన దుర్యోధనుండు యమపురి కేగెను. ఎనిమిదికోట్ల సువర్ణదానంబులు సేసిన కర్ణుండు పసిడికొండమీఁది యన్నంబుల కపేక్షించెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక యేడుకోట్ల గోదానంబులు సేసిన కార్తవీర్యుండు గోహత్య బ్రహ్మహత్యపాలకంబుల బొందెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక యాఱుకోట్ల భూదానంబులు సేసిన బలి విష్ణుపాదంబున పాతాళంబున కేగెను. దేవా! మీ నామోచ్చారణంబుసేయక అయిదుకోట్ల కన్యాదానంబులు సేసిన బ్రహ్మ్ముండు కాశీక్షేత్రంబున బండ్రెండు వేలయేండ్లు భిక్షం బెత్తెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక నాలుగుకోట్ల వస్త్రదానంబు సేసిన మార్కండేయుండు మతిహీనుం డయ్యెను. దేవా! మీ నామో చ్చారణంబు సేయక మూడుకోట్ల సత్యాదివ్రతంబులు నడపించిన హరిశ్చంద్రుండు కులహీనుని యింట గాడు కాచెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక రెండుకోట్ల యన్నదానంబులు సేసిన ధర్మజుండు యమపురి తొంగిచూచెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక కోటి స్నానంబులు సేసిన కుమారస్వామి కోరిక సిద్ధించ దాయెను. దేవా! మీ నామోచ్చారణంబు సేసిన ప్రహ్లాద, నారద, పుండరీక, వ్యాస, శుక, శౌనక, భీష్మ, దాల్భ్య, రుక్మాంగద, అర్జున, బలి, విభీషణ, భృగు, గాంగేయ, అక్రూర, విదురాదులగు పరమ భాగవతోత్తములు నారాయణ స్మరణవలన కృతార్థులైరి గావున యతిరామానుజముని పరందాతారు అనాథపతియైన సింహగిరి నరహరి నమోనమో దయానిధీ."

మదరాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోనూ, తంజావూరు సరస్వతీమహలు లైబ్రరీలోనూ, వున్న యీ వచనముల నొక క్రమంలో సేకరించి ప్రకటనమునకై సంస్కరించి వుంచినాను. తెలుగు వాఙ్మయంలో వెలసిన తొలివచనరచనము కావడమే దీనికున్న విశిష్టయోగ్యత! అలాటి తొలి తెలుగు వచన రచన ప్రకటింపబడాలనే కుతూహలమే నా పరిశ్రమకి కారణం. విషయదృష్టితో రచనాదృష్టితో దీనికున్న విలువయెలాంటిదైనా తొలివచనకావ్యంగా దీనికున్న విలువని యెవరూ కాదనలేరు. ఈవచనములకు కర్తఅయిన కృష్ణమాచార్యులను గురించి ఆ ప్రతులలో యింకా రెండుకథలున్నాయి. అవి రుచియయిన వ్యావహారిక భాషలో వ్రాయబడివున్నవి. కృష్ణమాచార్యుల మహిమాదికము నివి వేర్కొంటున్నవి. ఆ ప్రతులలోని కథలను రెంటిని దిగువ ప్రకటిస్తున్నాను;

* "దేవా! శ్రీకృష్ణమాచార్యులు తిరుమణి తిరుచూర్ణంబులు ధరియించి యజ్ఞోపవీతంబులు దండెయు తాళంబులు వైభనాథులు(?)ధరియించి యుదరమందు శ్రీతులసి వనమాలికలు ధరియించి తులదూగంగాను యేకశిలానగరంబునకు వీధివెంట (విధేయంట?) సంకీర్తనలు పాడుచున్న రాగాను, యొక కంసాల భర్తృండు ముక్తిం బొందిన యతని కైనసతి అతనివెంట సహగమనంబు శేయంబోవుచు కృష్ణమాచార్యుల బొడగని విమానంబు దిగివచ్చి తనకు పుణ్యలోకంబులు గలిగెనని గురుతు యెరింగి సాష్టాంగ దండములు సమ

* ఈ కథ మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున $R$ 206 అను సంఖ్యతో నున్న ప్రతిలోనిది.

ర్పించినను ఆ కాంతను కృష్ణమాచార్యులు జూడగని యేమనుచున్నాడు దేవా! ఆ కాంతకు పసుపుచీర, పసుపు రవిక, వొడిబియ్యం, శాసకొప్పున పువ్వుల మాలికచుట్టి, యొకచేత పువ్వులబంతి, యొకచేత నిమ్మపండు పట్టుకొనియున్న కాంతను జూచి యీ కాంత సమర్త పెండ్లికూతురని భావించి దీర్ఘాయుష్మంతురాలవు గావె. చాల ముత్తైదువతనము చేసి చల్లని కడుపున వర్ధిల్లవే పిన్నపాపా యని దీవించినను ఆ కాంత కిలకిల నవ్వుచు దేవా! తన కెక్కడి దీర్ఘాయుష్యంబు. తన కెక్కడి ముత్తైదువతనంబు. తన పెనిమిటి యిప్పుడు ముక్తింబొందినాడు. నిండు ప్రాణంబులు తన పెనిమిటికి అర్పించబోవుచున్నదాన. దేవ! నా కెక్కడి వరం బొసంగితిరి. మీ వాక్యములు కల్లలు గావచ్చును. దేవా! మీరు పదునొకండవ యవతారుండవు గనుక అంటేను అప్పుడు కృష్ణమాచార్యులు పరమ దయార్ద్రచిత్తుండై 'అయ్యో పురే సింహాద్రప్పలు! మీ దాసుని వాక్యంబులు కల్లలు అయితేను యీ శివభక్తులు హాస్యంబులు చేసెదరు. అదె నీకు భోగ్యంబు. దేవా! చాతుర్లక్షగ్రంథ సంకీర్తనలు శేయ డేమిటికి? నీవు నా కేమిటికి? నేను నీ కేమిటికి?' యీ ప్రాణంబులు నా కేమిటికి? అయినా వీరవైష్ణవుండెగాన ఆ శవముకడకుం బోయి ఓరీ! యీ శవము యిక్కడ దించుండనిన ఓరి వెఱ్ఱిదాసరివాడా! సదాశివుని కొలువుకుం బోయిన ప్రాణములు బ్రహ్మాదులవశమా తిరుగా పంపుమనేటందుకు? అన్నంతలో ఓరీ! నే నెటువలె వెఱ్ఱిదాసరివాడను. ఈశ్వరుని పేరిటి లింగమున్ను, శ్రీమన్నారాయణుని పేరిటి సాలిగ్రామమున్ను రెండున్ను యొక్క సమముగా పూజింప నేరక యీశ్వరుండు చల్లగా యుండగాను యీశ్వరుని పేరిటి లింగమును బొందిలో పెట్టుడి. పంచమహాపాతకులు మీరు గాన యోరి మీ కా సందు. ఈ శవము ప్రాణములు రప్పించెద ననిన యితండు కంచిలోపలను బొందులు మొండెంబులకు తలలు పుట్టం బాడిన మహాత్ముండు గాడా యని ఆశవమును భూమిపైదించి వారు కడకుం దొలంగిరి. అప్పుడు తన శ్రీపాదతీర్థంబు అతనిపై చిలికించి నుదుట తిరుమణి శ్రీచూర్ణంబులు ధరియించి చాతుర్లక్షగ్రంథ సంకీర్తనంబు యేకచిత్తంబున పరధ్యానము లేక సంకీర్తనలు శేయంగాను అక్కడ

బ్రహ్మాదులకున్ను, చిత్రగుప్తాదులకున్ను కళ్లోరంబులై తాకంగాను వారు విన (వ) రచి (?) హరుని కడకుంబోయి ఆ సదాశివునికి యేమని వందనంబు సేయుచున్నారు. దేవా! ఓ శ్రీ జగద్భరితా! లోకరక్షక ఓ సద్య...దయాపర, ఓ అఖిలాండకోటి బ్రహ్మాండనాయక! యో పార్వతీ మనోహర! ఓ రాజపరమేశ్వరా! కలియుగంబులను యేకశిలానగరం బని యొడి యొక పట్టణంబులోపలను యొక కంసాలభక్తుండు ముక్తిం బొందిన అతని కైన కాంతాంగన అతనివెంట సహగమనంబు సేయంబోవుచున్న యెడ కృష్ణమాచార్యులవారి గని ఆ కాంత విమానంబు దిగి వచ్చిన తనకు పుణ్యలోకంబు గలిగెననగా గరుతు యెరింగి......కృష్ణమాచార్యులు ఆ కాంత......ని యేమనుచున్నాడు. దేవ! ఆ కాంతకు పసపుచీర, పసపు రవిక, వొడిబియ్యం, తాసకొప్పు శిరస్సున పువ్వుల వనమాలికచుట్టి యొకచేత పువ్వులబంతి, యొక చేతను నిమ్మపండు, పట్టుకొనియున్న కాంతను జూచి యీ కాంత సమర్త పెండ్లికూతురని భావించి దీర్ఘాయుష్మంతురాలవు గావె చాల ముత్తైదువతనము చేసి చల్లనికడుపు గలదానవుగాను వర్ధిల్లవె పిన్నపాపా యని దీవించి తన దీవనలు తప్పరావని చాతుర్లక్ష గ్రంథసంకీర్తనలు పాడుతున్నాడు. అతనికి కాలమరణంబె కాని యకాలమరణంబుగాదు. అతని యాయుష్య పరిప్రాప్తియె కాని...యుష్య దుర్మరణంబును బొందినవాడు గాడు. మీ చిత్త మతని భాగ్యమని బ్రహ్మాదులున్ను, చిత్రగుప్తాదులున్ను కడకు దొలంగిరి. ఆ సదాశివుండు కంసాల భక్తునిం జూచి యేమనుచున్నాడు. దేవా! ఓయీ! కంసాలభక్తుండా! నీవు నాకు నిజభక్తుండవు. అతడు శ్రీమన్నారాయణునికి నిజదాసుండు ఇచ్చిన యీవులు స్థిరములు. తాను యిచ్చిన యీవు లెట్లా అస్థిరము లవుతున్నది. అతండు వుండుమంటేను భూలోకంబున స్థిరగాలము యుండుము. అతడు పొమ్మంటేను శీఘ్రం బె వత్తువు గాని పొమ్మని యీన తిచ్చినను ఆ సదాశివుని మాటకు ఆ కంసాలభక్తుండు యేమనుచున్నాడు. దేవా! ఓ శ్రీ జగద్వరదా! ఓ లోకరక్షకా! ఓ సర్వజీవ దయాపర! ఓ అఖిలాండకోటి బ్రహ్మాండనాయక! ఓ పార్వతీ మనోహర! ఓ రాజ పరమేశ్వరా! నీవు దైవశిఖామణివి.

నిన్ను గొలిచినందుకు ఆ దాసరిమాటలకు తిరుగా బొమ్మనిదె వుచితమా నీకు, ఆతండు కురుకుమారులను కురుక్షేత్రమందు పోట్లదించిన దోషంబు వాయు కొఱకు కృష్ణమాచార్యుడై తిరు అవతరించినాడు. అతడు యేతన్మాత్రుండు. అతండు వుండు మంటేను భూలోకంబున స్థిరగాలంబు వుండుమీ, అతండు పొమ్మనిన శీఘ్రుంబె వత్తువు గాని పొమ్మని యానతిచ్చినను ఆ కంసాలిజీవుండు బొందిలో ప్రవేశించెను. దేవ! అప్పుడు కంసాల భక్తుండు లేచి కూర్చుండి కరములు ముకుళించి కృష్ణమాచార్యులకు సాష్టాంగదండములు సమర్పించి యేమని విన్నపము సేయుచున్నాడు దేవా! ఓయి శ్రీకృష్ణమాచార్యులు నీవు ఆ నారాయణుండవు కొని కృష్ణమాచార్యులై తిరు అవతరించినాడవు. నీవు యేతన్మాత్రుడవు. అతండు వుండుమంటేను భూలోకంబున స్థిరగాలంబు యుండుము. అతడు పొమ్మని యానతిచ్చినను...తనకు సకాలమరణమె కాని అకాలమరణంబు గాదు. తనకు ఆయుష్యపరిపూర్ణమె కాని యాయుష్యదుర్మరణంబు బొందివవాడగాను. నన్ను మన్నించి పంపవే మహాత్మ యనిన ఆ కంసాలభక్తుని మాటలకు కృష్ణమాచార్యులు యేమనుచున్నాడు. దేవా! ఓయి కంసాలభక్తుండా! నివు యీశ్వ'రునికి నిజభక్తుండవు. నేను శ్రీమన్నారాయణుని నిజదాసుండను. ఈశ్వరుండు నీప్రాణంబులు నాకు ధారాపూర్వకముగాను సమర్పించినాడు. నిన్ను నేను కైలాసంబునకు పోనియ్యను. నీవు నమ్మకుంటె నాకు యిచ్చిన వైకుంఠంబు యిచ్చెదననిన ఆ యీశ్వరునికొలువు యే రీతి వుండును. అది నాకు యెఱిగింపు మనిన తనజీవుని కైలాసంబునకు తోడుకపొయ్యేటప్పుడు యిద్దరు శివమాతలు యేతెంచి బంగారు విమానముమీద కూర్చుండబెట్టి మహరదా ద్రవిహాత్వం (?) బనియెడి యాపర్వతంబుకడకు తోడుకపోయినను ఆపర్వతంబు యెనిమిది లక్షలయోజనంబుల పొడవు యెక్కిపోతిని. దేవా! దానిమీద కోటియోజనంబుల విస్తారంబుగల్గి అటువంటి కైలాసగిరికి నూటయొక్కకోట గలదు. ఒక్కొక్కకోటకు నూటొక్కవాకిళులు గలవు. ఒకొక్కక్క వాకిటికి నూటొక్క ద్వారపాలకులుం గలరు. ఒక్కొక్క ద్వారపాలకునికి మిన్నేరు, జడలున్ను, యెక్కువ కన్ను, కుత్తికనలుపున్ను, క్రొన్నెలపువ్వు, చతుర్భుజంబుల త్రిశూలడమరుగంబులును పట్టుకయున్న ద్వారపాలకులకు వందనంబులుచేసి ఆ మీదను ధర్మమడుగు గలదు. ఆ ధర్మమడుగునను తన్ను స్నానమాడించిరి. అంతలోనే తనకు మిన్నేరుజడలు పుట్టెను. ఎక్కువకన్ను కలిగెను. క్రొన్నెలపువ్వును, చతుర్భుజంబుల త్రిశూలడమరుగంబుల బట్ట నిచ్చిరి. దేవా! తన్ను యీశ్వరుని కొలువుకు తోడుకపొయ్యేటప్పుడు ఆ కొలువున ఛత్రచామరంబులు పట్టుకయున్న కోటికన్యకలు సేవకావృత్తి దిరుగుచున్నారు. ఉభయపార్శ్వంబుల సేవసేయుచున్నారు. రంభ, యూర్వశి, మేనకాదికన్యలు నాట్యంబు లాడుచున్నారు. భృంగీశ్వరుండు తాండవ మాడుచున్నాడు. నందీశ్వరుండుయుండెడు వకమంటపము ముప్పదిలక్షలయోజనంబుల వెడల్పు నిడుపుంగల దానిమీదను పదిహేనుజనంబులపొడవు, వక హేమంపు మణిక, దానిమీద యేడు యోజనంబుల వజ్రసింహాసనము, వజ్రసింహాసనము మీదను యీశ్వరుండు పార్వతిగాని మరి యెవ్వరున్ను కూర్చుండరాదు గనుక అటువంటి కైలాసగిరి ముప్పదిలక్షల సోమసూర్య వీథులు, మూడులక్షల శివాలయంబులు, రెండువేల దేవస్థానంబులు, అత్యంతవైభవభోగంబులు, షోడశోపచారపూజలు సేయుచున్నారు. పురుషుండైన వాడు పదహారు వర్షంబులవాడును, స్త్రీలు పండ్రెండేండ్ల బాలకాంతలై వర్థిల్లుచుండుదురు. అటువంటి కైలాసగిరి తనకు వుండవసతైయున్నది. నన్ను మన్నించి పంపవే మహాత్మకా యనిన పరమపదంబులో నిదిమాత్రంబు లేదు. నీవు నమ్మకుంటేను నాకు యిచ్చిన వైకుంఠంబు యిత్తును. ఆ బ్రహ్మదేమునిని, ఆ సదాశివుని, తన సింహాద్రప్పలును ఆనతిగం బాడుదును. దిగం బాడెనని చూచి అప్పుడు సింహాద్రప్పలు కోటి సూర్యప్రకాశంబైన దివ్యకిరీటంబు ధరియించి శంఖచక్రగదాఖడ్గంబులు ధరియించిన సింహాద్రప్పలు గనుంగొని కృష్ణమాచార్యులు వందనంబుచేసి ఓ మహాత్మకా! యీకంసాల భక్తుండు నన్ను నమ్మకయున్నాడనిన అంతలోనె బ్రహ్మదేవుండును, సదాశివుండును యేమనుచున్నారు దేవా! పరబ్రహ్మాదులకు లేని వైకుంఠంబు

నీకు గలిగె. పడుసము సోకిన లోహము కాంచనమైనట్లు కృష్ణమాచార్యులు నిన్ను చేపట్టగానె కృతార్థుండవైతి వనిన సింహాద్రప్పలు యేమనుచున్నాడు. దేవ ! కృష్ణమాచార్యులకు యిచ్చిన వైకుంఠంబు నీకు యిద్దరికిన్ని యిచ్చితి గానయని వైకుంఠంబు అభయ మిచ్చెనె దా యీ సంకీర్తన శివభక్తు లాయె నేమి, విష్ణుదాసు లాయె నేమి యెవ్వరు చదివిన యెవ్వరు భక్తితో విన్న, యెవ్వరు వ్రాసిన పాపపరిహారంబవును. అటుమీదట కామంత్య మంగున వైకుంఠం బిత్తును. నీయాన. నీ చరణంబు లాన. మా తిరుమణి తిరుమార్గంబులాన. మా గురువు లాన. మా శ్రీకృష్ణకుమారస్వామి సింహగిరి నరహరి నమోనమో దయానిధీ !"

*    *    *    *

*"దేవా ! కృష్ణమాచార్యులు వోరుగంటిలో పతివ్రతాగృహంబున కేగిన ఆ యింటి బ్రాహ్మణుండు దండ ప్రణామంబు జేసి 'స్వామీ! మీరు విజయంజేసుట నా గృహంబు పావనంబాయను. మేము కృతార్థుల మైతిమి మా యింట ఆరగించి మమ్ముల రక్షించుమని విన్నపంబుజేసిన కృష్ణమాచార్యులు యేమనుచున్నారు. 'నీవు ఏకపత్నీ వ్రతుండవు. నిత్యాను సంధాన సంపన్నుండవు సకల గుణసంపదలు గలుగు ధన్యుండవు. బృందావనమునకు విజయంజేసిన పిమ్మట మీ యింట నారగించెదననిన బ్రాహ్మణుండు తులసీమాహాత్మ్యం చెప్పు మనిన ఆ బ్రాహ్మణునకు తులసీమహాత్యంబు యిట్లు చెప్పందొడంగె. నిశిసమయమందు తులసీ దర్శనంజేసినవారికి శిశుహత్యా, గోహత్యా, స్త్రీహత్యా, మొదలైన పాతకంబులుపోవును. తులసికంపఅయినా కట్టి సంరక్షణ జేసినవారికి వేయిసంవత్సరంబులు సాయుజ్యపదంబులుగలుగును. తులసికి కోటవేయించి కొమ్మలు దీర్చిన పుణ్యాత్ములకు అశ్వమేధ ఫలంబు గలుగును. తులసికి దీపం యిచ్చినవారికి సూర్యచంద్రలోకంబులు గలుగును. తులసికి రాగి, వెండి, బంగారంబుల ప్రాకారంబులు దీర్చిన పుణ్యాత్ములకు శాశ్వతంబుగా విష్ణులోకంబు గలుగును. తులసికి నీరాజనంబు సమర్పించినవారికి బ్రహ్మలోకంబు గలుగును. తులసికోటకు గోమయంబులు దీర్చి అలికినవారికి శత సంవత్సరంబులు స్వర్గంబు గలుగును. తులసికి నమస్కారంబు జేసినవారికి నాలుగులోకంబులు గలుగును. తులసికి నైవేద్యంబులు సమర్పించినవారికి కామ్యంబు గలుగును. నీళ్లుపోసి పెంచినవారికి జలబిందువు లెన్ని కలుగునో అన్ని సంవత్సరములు పుణ్యలోకంబులనుండి విష్ణుసాయుజ్యంబు పొందుదురు. నిత్యకృత్య నమస్కారంబుజేసి పూజలు జేసినవారికి వైకుంఠంబు గల్గును. తులసికి మంత్ర పుష్పమున్ను యజ్ఞోపవీతమున్ను సమర్పించినవారికి బ్రహ్మలోకంబు గలుగును. తులసికి వస్త్రములున్ను, మణులున్ను సమర్పించినవారికి స్వర్గలోకంబుగల్గును. తులసియొద్ద ముగ్గు లుంచినవారికి అగ్నిష్టోమఫలంబు గల్గును. తులసికి మొదట అరుగు వేసినవారికి అష్టైశ్వర్యంబులు గలుగును. తులసి మొదట మృత్తిక ధరియించినవారికి లలాటలోచనుని దర్శనంబు గలుగును. తులసిపూజలు అష్టాక్షరి ద్వాదశాక్షరీజపంబు జేసిన పుణ్యాత్ములకు అష్టపుత్రులు గలుగును. ద్వాదశి దినంబున వైకుంఠంబు గాంతురు. తులసీదళంబుల శేషశాయి పూజజేసినవారికి శంకరలోకంబు గలుగును. తులసిదళాన తీర్థపానం జేసినవారికి సకల తీర్థంబులయందు గాంగాది నదులయందు స్నానంబు జేసిన ఫలంబు గలుగును. దేవా ! తులసీదళంబు శిరస్సున ధరించినవారు త్రిలోకాలకు అధిపతులై జన్మింతురు. ద్వాదశీ దినంబున తులసీవ్రతంబు జేసిన వారు ద్వారకానగరంబున అధిపతులై జన్మింతురు. తులసీబృందావనంబు అలికి ముగ్గుపెట్టి స్నానం సంధ్య జపములు దీర్చుకుని మంత్రపుష్పాంజలులు, ధూపదీప నైవేద్యంబులు సమర్పించినవారికి యింట నిత్యోత్సవ పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవ సంవత్సరాదులయందును సకలమైన భోగభాగ్యాదులు సంపదలు గలిగి శుభశోభనంబులు గలిగియుందురు. తులసి బృందావనానకు నారికేళ కదళి ఖర్జూరఫలంబులు సమర్పించినవారికి కైలాస సన్నిధానంబు గలుగును. తులసి బృందావనానకు దంపతి సమేతంగాను నూరు ప్రదక్షిణంబులు జేసి సాష్టాంగ దండప్రణామంబు లాచరించినవారికి అనేక కాలాల్ల

---

* ఈకథ మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున R 447 అనుసంఖ్యతో నున్న ప్రతిలోనిది—

యందున్ను సకలమైన సంపదలు గలిగి జన్మ జన్మాల యందు ఉత్తమకులంబులయందు జన్మింతురు. తులసి బృందావనమునకు భక్తిపూర్వకంబుగా యథాశక్తి తాంబూల నైవేద్యంబులు జేసినవారికి భూలోకంబు శిష్యపాలనంబు చేసి విష్ణు సన్నిధానంబు నొందుదురు. సాయంకాల సమయంబులయందు తులసికి దీపంయిచ్చిన స్త్రీలకు కోరినకోరిక గలుగును. తులసి బృందావనంబునకు అలికి ముగ్గు దీర్చి ఆ సాయం కాలమందు ఆరతి యిచ్చినస్త్రీలకు శాశ్వతంబుగా అయిదవతనంబు గలుగును. సంతానపూజ గలిగి సంతోషంబున నుందురు. దేవా! అంత్యమందు తులసిదళోదకం యిస్తే దేహం పవిత్రంబై సద్గతి గలుగును. దేవా! తులసీ మహాత్మ్యం పఠియించిన వారికి కొన్ని జన్మాదులు గడచిపోగాను శాశ్వతంబుగా కైలాససన్నిధానంబు గలుగును. తులసివనమందు వున్నదళంబెచ్చి శిరస్సున ధరించినవారికి త్వరితంబుగా ఆదిత్యపురంబు గలుగును. ప్రొద్దున నే లేచి తులసి దర్శనంబు జేసిన వారికి పాపంబులు పోలగును. ఈ కథ కృష్ణమాచార్యులు సంకీర్తన వ్రాయగా వకయింట నలువురుకోడళ్లు నీళ్ల కడవలు తీసుకువస్తూ వుండేనవేళ ఆయింటి పెద్ద కోడలు యీ సంకీర్తన విందా మనెను. రెండో కోడలు పూర్ణకడవలు దించుకొని విందామనెను. కడమ యిద్దరుకోడళ్లు యీ సంకీర్తన కేమి యీవూటలకేమి పోదాము రమ్మనిరి. గనుక యీ సంకీర్తన విందా మన్న కోడలు భూమండల మేలే రాజు కొడుకై జన్మించెను. పూర్ణకుంభములు దించి విందా మన్నకోడలు చక్రవర్తియై జన్మించెను. కడమ యిద్దరు యిక్కడ సంకీర్తన వినక పోదాము రమ్మన్న కోడళ్లు అనామికులయింట నూరు జన్మంబులు పందులై జన్మించిరి. గనుక యీదివ్య నామస్మరణ యెవరు వ్రాశినా, యెవరు చదివినా, యెవరు పఠించినా, యెవరు విన్నా గోసహస్రదానంబులు చేసిన ఫలంబు గలుగును. పితృపితామహులు విష్ణుసాయుజ్యంబు గాంతురు. సకల దోషములున్ను సర్వత్రా తా జేసినపాపములున్ను నివారణమై ఆపదలు దొలగును. ఆయురారోగ్య ఐశ్వర్యంబులు గలుగును. పుత్రపౌత్రాభివృద్ధి గలుగును."

* * * *

"ఏనూరి రజకునియింట మృతానుజా
నడపించె బిత్ర కాననంబుదనుక
నా బ్రహ్మరుద్రుల కైన గన్పడనట్టి
నృహరి నాడించెను నిచ్చ నెవ్వ
డెవనిశాపమున సర్వోన్నత సుజ్ఞియైన
నేమహాగులు కాలె నేకరీతి"

అలాంటి కృష్ణమాచార్యులు రచించిన యీ 'తెలుగువేదం' త్వరలో ప్రకటింపబడితే అది తెలుగు వాఙ్మయాని కొక విశిష్టాలంకారం అవుతుంది!



# సంగంవారి వీధి



శ్రీ ఇవటూరి కామేశ్వరరావు

ఆ వూళ్లో చెంగల్రావ్ హోటలుకు వచ్చే జనం ముచ్చటించని సంగతంటూ లేదు. దైనందిన వ్యవహారాలనుంచి, కాంగ్రెసు ఎలక్షనులు బ్లాకు మార్కెట్టు, సమ్మెలు—అబ్బో ఒకటేమిటి సమస్త సంగతుల గురించి ప్రస్తావించడం పరిపాటి. వూళ్లో ఏదైనా చావు సంభవిస్తే ఆ ప్రస్తావం అక్కడే.

పెళ్లిళ్లు, పేరంటాలు జరిగితే వాటి వార్తలు అక్కడకు వెంటనే చేరుకుంటాయి కదా. కోర్టులో ఏదైనా మంచి కేసు విచారణకు వస్తే దాని ఫలితాలను గురించి యిక్కడ చర్చ జరిగితీరుతుందిగదా. బళ్లో మేష్టారుగారు ఎవరినైనా గుంచో బెట్టారంటే ఆ విషయం అక్కడ చర్చించుకోవలసిందే గదా. ఆ రోజు సంతలో మిరపకాయ ధర హెచ్చిందంటే దానిని గురించి అక్కడ ప్రస్తావన జరగవలసిందే. ఇలాగా చిత్రవిచిత్రంగా సాగిపోతుంటాయి సంభాషణలు. చెంగల్రావు కూడా ఏతత్సంభాషణల మధ్య తనకు తోచినట్టు ఒక్కొక్క విసురు విసురుతూండడం పరిపాటి.

చెంగల్రావు కొట్టుకు అనుదినమూ హాజరు వేసుకునే వాళ్లలో — ఆ ప్రక్క ఫ్యాక్టరీ ఫోర్మను ఒకడూ, అగ్రహారంలో వుండే శాస్త్రులవారొకరూ, గవర్నమెంటు గ్రాంటు యిచ్చిన ఎయిడెడ్ స్కూలు అయ్యవారు, అయ్యవారమ్మనూ. ఒక యిన్స్యూరెన్సు ఏజంటు ఒకాయన. వీళ్లు హాజరు కావలసిందే. అలా వర్షం కురవనీయండి—ఈలా ఎండలు సుదిర్రి ఘాడ్పులు వేయనీయండి—ఏదో ఒక సమయంలో హాజరు వేసుకొని పిచ్చాపాటి మాట్లాడుకొని పోతుంటారు.

తరుచు సుబ్బన్న కూడా ఆ దుకాణంకు రావడం కద్దు. మోతుబరి సుబ్బన్నంటే ఆ వూళ్లో చాల మందికి తెలుసు. ఘరానా మనిషి. నిత్యమూ ఇతని కూడా ఇద్దరో ముగ్గురో తోకల్లా తిరుగుతూనే వుంటారు. తన మాటకు అడ్డంవస్తే సహించే ఘటం కాదు. వాడితో పాటే వాడి అనుచరులు కూడా ఒకే మాట. అతనితో ఘర్షణ పడితే ఏం విపత్తు సంభవిస్తుందోనని సౌమ్యంగా పోతుంటాడు చెంగల్రావు. ఎందుకంటే వెనుక ఒకటి రెండుసార్లు అక్కడ కొట్లాటలు కూడా జరిగి తలలు పగులగొట్టుకునేంత పని జరిగింది. అందులో మోతుబరి సుబ్బన్నతో చేయి చేసుకుంటే ఆ రోజు నెత్తురు చూశారన్నమాటే.

యథావిధిగా ఫ్యాక్టరీ ఫోర్మను పోతూపోతూ తమ మామూలుగా కూర్చొనే బల్లమీద కూర్చొని యింత కారప్పూస తింటున్నాడు పెట్టించుకొని. గ్రాంటుస్కూలు బడిపంతులు, అయ్యవారమ్మ బడి తలుపు బిగించుకొని రవంత ఏమైనా తినిపోదామని చెంగల్రావు దుకాణానికి చక్కా వచ్చి ఫ్యాక్టరీ ఫోర్మను ఎదురుగుండా ఉన్న బల్లమీద కూర్చొని చెరొక ప్లేటు బూంది తినసాగారు.

ఫ్యాక్టరీ ఫోర్మను యుద్ధంనుంచి తిరిగివచ్చిన వ్యక్తి. లావుగా పొట్టిగా ఉంటాడు. పిల్లికళ్లు. జుట్టు ఎప్పుడూ ముందరకు నుదిటిమీదకు వస్తుంటే పదేపదే వెనక్కు తీసుకుంటూంటాడు. ఇన్స్యూరెన్సు కంపెనీ ఏజంటు బక్కపలచగా పొడుగ్గా ఉంటాడు. ఇతగాడు 24 ఘంటలూ సైకిలుమీదే తిరుగుతూంటాడు. ఓ పది నిమిషాలు తీరిక చిక్కిందంటే చెంగల్రావు కొట్టులో ఉండి తీరవలసిందే. ఇక పోతే అయ్యవారూ, అయ్యవారమ్మది బలే అదృష్టం. వీళ్లది అసలు దానవాయిపేటలో మకాం. మాలవాడంతా వీళ్ళంటే విపరీతమైన గురి. ఇద్దరూ గూడా ట్రైనింగ్ అయినారేమో చెరో 50 రూపాయలు సంపాదించుకుంటున్నారు. యిప్పుడంటే వుద్యోగాలు సంపాదించారుగాని, వెనుక వీళ్ళ తాత ముత్తాతలు పురపాలక సంఘంలో వీధులు ఊడ్చి తమ పొట్టలను వెళ్ళబోసుకునేవారు. కాని నేటి గాంధియుగంలో 'మాల' అనే పదంపోయి దాని స్థానే హరిజన అనే పేరు రావడంతోటే పరిస్థితులన్నీ తారుమారై పోయాయి.

ఇంతకీ విషయ మేమిటంటే ప్రక్కన రెండు ఫర్లాంగుల దూరంలోఉన్న దూపాటివారి వీధిలో బ్రాహ్మణ దొడ్డమ్మగారు ఆ క్రితం రోజు పోయారట. 60 ఏండ్లుంటాయట.

ఫోర్మన్: పాపం చాలా ధర్మాత్మురాలట. అనేక ధర్మాలు కూడా చేసిందట.

ఏజంటు : ఆమె ఎవరినో పెంచుకుందట, అతను తాలూకాఫీసులో పని చేస్తున్నాడట. ఆ లోగిలీ 4 ఎకరాల భూమి అతగాడికి వ్రాసి యిచ్చేసిందిట.

అయ్యవారమ్మ : ఏం జబ్బుటండీ. పాపం హఠాత్తుగా పోయిందట ?

ఫో : గుండెజబ్బుట. అందులో ఈ గుండె జబ్బు చాలా విపరీతమైనటువంటిది. మాట్లాడుతూనే ప్రాణం పోవడం, పడుకుని తెల్లవారేసరికల్లా హంస లేచిపోవడం, స్నానం చేస్తూనే హరీ అంటూండడం' ఈలాగా కర్ణకఠోరంగా వుంటూంటాయి; ఈ గుండె జబ్బు కేసులు.

అయ్యవారు : ఏ వీధిలోనండీ ఆమె నివసిస్తున్నది?

ఇ. ఏ: ఏ వీధేమిటి — (యిక్కడే దగ్గర లోనే) దూపాటివారి వీధి—అంటే...

ఫో : అంటే ఆ పెద్ద రావిచెట్టుఉన్నది అదా-

ఏ : అది కాదయ్యా. అది సగంవారి వీధి. ఎక్కడో చర్చిదగ్గర ఉన్నదాన్ని తీసుకువచ్చి యిక్కడ యిరికిస్తావేమిటి?

ఫోర్మను : సంగం వారి వీధిలోనూ రావిచెట్టు లేదనుకున్నారా?

ఏ : ఉంది. నేనన్నది పెద్ద రావిచెట్టు. సంగం వారి వీధిలో ఉన్నది దీనికంటె చిన్నది.

అయ్య : యింతకీ సంగంవారి వీధి ఎక్కడుంది నీకు తెలుసా?

అయ్యవారమ్మ : సంగంవారి వీధే తెలియదట. నే బళ్లో చదువుకునే రోజుల్లో మా అమ్మ నిత్యమూ ఈ వీధిలో కమ్మవారింటికి ఏదో పనిమీద వస్తూం డేది.

అ : అచ్చు ఆఫీసు వుందే దాని ప్రక్క వీధే. 'ఇంతకీ' ఫ్యాక్టరీ ఫోర్మను కళ్లు చిట్లించుకొంటూ గొంతుక సవరించుకొంటూ 'సంగంవారి వీధినే అష్ట వంకర్లవీధి అంటారు. అసలు కోణంగిపేటలోంచి వచ్చేవీధి సంగంవారి వీధిలో కలుస్తుంది.'

అయ్య : అబ్బే. ఎక్కడ కోణంగిపేట ఎక్కడ సంగంవారి వీధి? సంగంవారి వీధి మన పాత సినిమా ఉంది దాని వెనకాల వీధి. దాని ఉత్తరం వైపుని చర్చికూడా ఉంది. అంతేకాని ఈ ఫోర్మను గారికి అసలు—

ఫోర్మను : అందుకని—నాకు తెలుసండీ. అబ్బ. సంగంవారి వీధి ఎక్కడుందో నాకు తెలిసి నట్లు మరెవ్వరికీ తెలియదు.

ఇ.ఏ. : అబ్బే. బ్రాహ్మణపేటకు ఐమూలగా రైలుగేటుకు యివతల ఉందండీ. ఏమిటో నాకు తెలీయనట్లు మీరు వాదిస్తారు...

అయ్యవారమ్మ : (చేతులు కడుక్కుంటూ) అబ్బ ఏమిటీ గొడవ. ఇంతకీ సంగంవారి వీధి ఎక్కడుందంటారు.

ఇంతలో చెంగల్రావు లోపల నుంచి వచ్చి — సంగంవారి వీధిని గురించేనా మీరు అనుకొనేది. నా చిన్నతనంలో మా ముసలమ్మవాళ్ళు ఆవీధిలోనే కాపరం ఉండేవాళ్లట. మా తండ్రికి ఋణం ఉండడంచేత ఆ యిల్లూ వాకిలీ వాళ్ల పరమైపోయింది. లేకపోతే నాకే అద్దె కొంపే మిచ్చే. అది అచ్చాఫీసుకు తూర్పువైపున ఉంది.'

అగ్రహారంలోని ముసలాయన ఎప్పుడు వచ్చాడో వచ్చి, తాను మామూలుగా కూర్చునే చోటునుంచి ఈ సంభాషణ వింటున్నాడు. అయినా సంగంవారివీధి ఎక్కడుంటే తనకేం గావాలి, ముందు తన పొట్ట నిండాలి గాని — యీ విధంగా సంగంవారివీధి ఉత్తరంవైపున ఉందని ఒకరూ, చెర్చికి వెనుకభాగంలో ఉందని మరొకరూ, అచ్చు ఆఫీసు వెనకాల ఉందని వేరొకరూ యిలాగా వాండ్లు అనేక విధాలుగా తర్కించుకొంటూ ఇంకా నిర్ధారణకు వచ్చేలోపున సుబ్బన్నా మరోయిద్దరు వ్యక్తులు లోపలికి వచ్చి వీరందరికి కుడివైపున కూర్చొని యిన్ని వేడిపకోడీలు ఆర్డరిచ్చారు.

ఇన్నూ రెన్నూ ఏజంటు సుబ్బన్నను చూచి 'యిదుగో పాతకాపు సుబ్బన్న వచ్చాడు. యితనికి

తెలియం దేనుంది గనుక. యేమోయ్ సుబ్బన్నా సంగంవారివీధి ఎక్కడుందో చెప్పు.'

సు : సంగంవారి వీధే తెలియదూ పిచ్చోడా? నాకు బాగా తెలుసు. ఎందుకంటే మా అత్తగారు వెనక జబ్బుచేసి ఆ వీధిలోనే పోయింది. కొలనుకు దక్షిణంగా ఉంది. ఆ వీధిలోనుంచే రైలుగేటు కూడా కనిపిస్తుంటుంది.

యింతవరకూ ఆ ప్రసంగంలో జోక్యం కల్పించుకోని ముసలాయన లేచి

అబ్బే మీరంతా చెప్పినది అసలే తప్పు. క్రైస్తవుల దేవాలయానికి ఆనుకుని ఉన్న వీధే సంగంవారి వీధి.

సుబ్బన్న : మహా చెప్పొచ్చావులేవయ్యా, పొడుగాటి ముక్కు నువ్వూను. నే నెక్కడుందో చెప్పానుగా. మళ్లీ నువ్వు అది కాదంటూ వేటయ్యా. అయినా ముసిలోడవ్ నీ కెందుకు ఈ గొడవ. నీవు నీ పొడుం కాయేమిట్లో నీ వేమిట్లో అంతేకాని——

ఫోర్మను : అయితే నే చెప్పింది తప్పంటారా. బలే వాళ్లు! అసలు సంగంవారి వీధికే అష్టవంకర్లవీధి అని పేరు. కోణంగిపేటలోంచి అచ్చు ఆఫీసువద్ద కలిసేదే అంటే మీకు నమ్మకం.

మో. సు : నీవు చెప్పిందల్లా నమ్మాలి అని ఉందా ఏమిటి? సంగమోరివీధినిగురించి నీకేం తెలుసు. నిన్నగాక మొన్నటివరకూ యుద్ధంలో ఏడుస్తూ——

ఫో : ఫలానాచోటున ఉందని తెలపడానికి నాకు స్వాతంత్ర్యంఉంది. మధ్య నువ్వేమిటి? ఏడుపూ గీడుపూ రానీయకు. మాటలు సరిగా రానియ్యి ఏమనుకున్నావో.

సు : ప్రతీదీ నీకు తెలుసునని వాదిస్తావేమిటి? మహా తెలిసినట్టు. ఏంజేస్తా వేమిటి? ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసుకుని మరీ మాట్లాడు. అట్టే మాట్లాడితే...

ఫో : అట్లే మాట్లాడితే ఏం జేస్తావేమిటి? ఫోర్మను ఒక్కడే అనుకుంటున్నావేమో. మీద చెయ్యిపడితే ఊరుకునేది లేదు. జాగ్రత్త. అన్నాడు.

అసలు దెబ్బలాట ఆగిపోను గాని యింతలోకి

అయ్యావారమ్మ : ప్రతీదీ 'వీళ్ళకు' తెలుసుననుకుంటారు. ఈ సుబ్బన్న మరీని. అబ్బ! యింతటి మొండివాణ్ణి ఎక్కడా చూడలేదు.

సుబ్బన్న వళ్లు వేడెక్కి ఫోర్మనూ సుబ్బన్నా కొట్టుకోవడం ప్రారంభించారు గ్లాసులు విసిరేసుకున్నారు. ప్రక్కనే ముసిలాయన కర్ర పెట్టుకుంటే అది ఊడబెరుక్కుని వీపుమీద వేశేడు సుబ్బన్న. ఫోర్మను కుర్చీ పైకెత్తి విసిరాడు, దెబ్బ తప్పించుకుని. ఇటునైపుకు వచ్చి ఒక తాపు తన్నాడు సుబ్బన్న. ఆ దెబ్బతో ఫోర్మను వెనక్కువెళ్ళి గుమ్మం నుదుటికి తగిలి రక్తం ప్రవహించసాగింది. సుబ్బన్నతో ఉన్న తతిమ్మా యిద్దరూ అయ్యావారినీ, అయ్యావారమ్మనీ కర్రతో నాలుగుతికి ఒక్కతోపు తోశారు. అయ్యావారమ్మకు దెబ్బతగిలి పడిపోయింది. ఆ పడడంలో గ్లాసుమీద పడిందేమో బద్దలయిన గ్లాసు అంచు తగిలి మోచెయ్యి గీసుకుపోయింది.

తన లొంగుబాటులోకి ఆసుకురాలేక చంగల్రావ్ వీధిలోకి పోయి వారినీ వీరినీ కేకలు పెట్టడం ప్రారంభించాడు. ఈ కొట్లాట త్రుటికాలంలో జరిగిపోయింది. ఆ గలాభా ఈ కేకలు విని బీటు తిరుగుతున్న పోలీసు కనిస్టేబిలొకడు అక్కడకు వచ్చాడు. కాని ఈలోగా సుబ్బన్నా——వాడి అనుచరులు అక్కడినుండి దాటుకున్నారు. దెబ్బలుతిన్న వాండ్లకు నెత్తురు కారుతుంటె ఖంగారెత్తి చూడలేక మ్యునిసిపలు ఆసుపత్రికి తీసుకొనిపోయి వాండ్లకు కట్టు కట్టించడం నిమిత్తం చంగల్రావు ప్రక్కనే ఉన్న బండిని పిలవడానికి వెళ్లాడు. యింతలో యీ కొట్లాట విషయం పొక్కి జనం గుమిగూడి చివరికి సబ్ ఇనస్పెక్టరూ సిబ్బందీ తయారైనారు. జరిగిన సంగతంతా చంగల్రావు వద్దనుంచి సంజాయిషీ తీసుకున్నారు. అక్కడ వున్న అందరిస్టేటుమెంట్లు పుచ్చుకొన్నారు. వాండ్లను ఆస్పత్రికి తగిన చికిత్సకై పంపించారు.

మూడు రోజులపాటు ఈ వీధేమిటి——ఆ వీధేమిటి ఊరూవాడా గాలించేశారు సుబ్బన్నకోసం. ఈ సందట్లో ఆ రాత్రి మరి ఎలా అంటుకుందో ప్రక్కనే ఉన్న హార్మోనీకొట్టు అంటుకుని కొన్ని వందల రూపాయల నష్టమైపోయింది. కొట్టులో హార్మోనీలు, ఒకటి రెండు మంచి వీణలు, యితర సామా

నులు అన్నీ భస్మమైపోయాయట. వాకబు చేయగా తెలిసిందేమిటంటే అది శోర్మను స్వంత అన్నగారి కొట్టు అనీ, శోర్మనుపై కోపంచేత సుబ్బన్న ఆ రాత్రే అంకినమటుక్కి డబ్బు తీసుకొని ఆ కొట్టుకు నిప్పంటించి తగలబెట్టాడని చెబుతారు.

## 2

దొమ్మీ కేసు కోర్టుకు ఎక్కి మేజస్ట్రీటు సదాశివరావుగారి ఎదుట విచారణకు వచ్చింది. దొమ్మీ కేసును గురించీ, అందుకు సంబంధించిన వ్యక్తుల వాఙ్మూలాలను గురించి యితర పరిశీలనలను గురించి కొంతసేపు చర్చ జరిగింది. పిమ్మట దొమ్మీ జరిగిన రోజున కాఫీహోటలులో మొట్టమొదట ఈ దొమ్మీ ఏ విధంగా ఆరంభించినదీ దాని విచారణ జరుగుతోంది.

లా చదివిన శర్మారావు ఆదివరకే కోర్టుల్లో మాంచి పేరు సంపాదించుకున్నాడు. క్రాస్ ఎగ్జామినేషన్లో అతడి కతడే సాటి. అతని విచారణలో చాలా కేసులు చిక్కు విడి తీర్పుకు వచ్చాయి.

శర్మ: సంఘటన జరిగిన సాయంత్రం నీవు అయ్యవారూ, ఆ ఫ్యాక్టరీ శోర్మనూ హోటలు యజమాని చంద్రగలావు—ఇంకా ఎవరో ముసలాయన టిఫిను పుచ్చుకుంటూ అక్కడ వున్నారట నిజమేనా?

అయ్యవారమ్మ: నిజమేనండి.

శర్మ: మీరు ఆ రోజున దేనినిగురించి మాట్లాడుకుంటున్నారో మేజస్ట్రీటుగారితో చెప్పతారా?

అయ్య: రోగాలనుగురించి మాట్లాడుకుంటున్నామండి.

శర్మ: సంభాషణలో ఎవరికైనా భేదాభిప్రాయాలు వచ్చాయా?

అ. అమ్మ: సంగంవారివీధి ఎక్కడవున్నదీ అనే విషయాన్ని గురించి మేము తర్కించుకోవడంలో.

మేజ: సదాశివరావుగారు తల ఊటంకించి, కళ్ళజోడు బల్లమీదనుంచి తీసి అద్దాలు తుడిచి కొంతు సవరించి,

'దేనిని గురించీ' అన్నారు న్యాయమూర్తి.

సాక్షి: అది సంగంవారి వీధి ఎక్కడ వున్నదనే విషయాన్ని గురించి తర్కించుకుంటున్నారు.

మేజ: సంగంవారి వీధా?

'చిత్తం సార్'

'అయితే ఏదీ ఆ సన్నటిసందు ఉన్నదే—అదేనా—ఆ సినీమా థియేటరు ప్రక్కగుండా వెళ్ళే సందేనా?

శర్మారావుకు ఒక విధమైన నవ్వు వచ్చింది. మేజస్ట్రీటుగారు చెప్పిన అంశం కొద్దిగా సత్యదూరంగా వున్నది.

శ: 'చిత్తం తమరు నుడివిన వీధిని గురించే సాక్షి చెపుతున్నది. తమరు అనుమతిస్తే ఆ వీధి పరిసరాలను గురించి తెలుపడానికి అవకాశమిస్తారని మనవి.

మే: 'ఏమిటా పరిసరాలు' అన్నారు మేజస్ట్రీటు.

స: 'చిత్తం మీరు చెప్పినదానికంటె ఆ వీధి మరో ఫర్లాంగు ఎగువన వున్నది. రైల్వే గేటుకు దగ్గరగా ఉంది. ఇంత బాగా జ్ఞాపకం ఉండడానికి కారణం నా చిన్నప్పుడు మా బాబయ్యగారు తరుచు రైల్వే గేటువద్దకు నన్ను తీసుకు వస్తూండేవారు.

మేజస్ట్రేటుగారు శర్మారావు మాటలను ఖండిస్తూ,

నేను నీ యీడులో ప్రతిరోజూ ఆ వీధిలో నడుస్తూండేవాణ్ణి. నే చెప్పిన విషయాన్ని ఖండించడం నీకు అనవసరమనుకుంటాను' అన్నారు కొంచెం కఠినంగా.

లాయరు తల వంచుకొని నమ్రత చూపాడు.

న్యాయాధికారితో తగవులాట పెట్టుకోవడం ఎందుకు. అయినా అప్రస్తుతమైనట్టి విషయంమీద ఎందుకు విపరీతమైన తర్కం.

ఇంతలో కోర్టులో మరో ముసలి లాయరుగారొకాయన లేచి

'మీ అనుమతితో రెండు మాటలు సార్, నేను కూడా చాలాభాగం ఆ వీధంబడే పోతూండేవాణ్ణి—ఈ వీధిని గురించి నేను చాలా పరిశోధన చేయగా—నాకు తేలిందేమంటే ఈ సంగంవారి వీధి అచ్చు ఆఫీసుకు కుడివైపున ప్రారంభమై సినిమా వెనుకతట్టు చివర అంతమౌతుంది.

'అద్బే సరికాదు' అన్నాడు శర్మాస్త్రరావు.

మేజస్ట్రేటు సదాశివరావుగారు అసలు ఈ విష యానికీ కేసుకు ప్రస్తుతం ఏమీ సందర్భం లేదనీ, దాన్నిగురించి యిక తర్కించ నవసరం లేదనీ అన్నారు. ఈ దొమ్మికేసు విచారణ ఫలితం ఏమైం దనే విషయం మనకు అప్రస్తుతం. ఫోర్మనూ, ఇన్స్పెక్టరూ, ఏజంటూ, అయ్యవారూ, అయ్యవారమ్మ తమతమ గాయాలు మానడంవల్ల సుబ్బన్న మీద కఠిన చర్య తీసుకొని తీరాలని పట్టుపట్టనూ లేదు. అయినా సుబ్బన్న విషయం వారి కెందుకు.

దుష్టులను వెతికి పట్టుకుని దండించడం పోలీసు వారి విధి. కేసు విచారించి న్యాయాన్యాయాలు తేల్చడం కోర్టువారి విధి. ఈ లావాదేవీలలో తమ కెందుకు అని యధారీతిగా వారు వెనక్కి తగ్గుకు న్నారు.

మేజస్ట్రేటుగారి బావమరిది చంద్రశేఖరంగారు ఆ క్రితంరోజే పెళ్లివ్యవహారాలు మాట్లాడుకు నేందుకు చెల్లెలుగారింటికి వచ్చాడు. చంద్రశేఖరం కొడుకు రామచంద్రమూర్తి ఈ మధ్యనే బి. ఏ. ప్యాసు అయాడు. ఇతను చూడడానికైతే బాగానే వుంటాడు కాని మనిషి కొంచెం నలుపు. పొడుగ్గా, నవనవలాడే నవయవ్వనంలో ఉన్నాడు. చంద్ర శేఖరం తన కొడుక్కి చెల్లెలు కూతురు శారదను వివాహం చేయాలని కుతూహలపడుతున్నాడు.

కాని, అసలు ఈ పెండ్లివిషయం ఇదివరకు ఒకటి రెండుసార్లు మేజస్ట్రేటుగారి ప్రత్యక్షంలో నయితేనేమి, పరోక్షంలోనయితేనేమి నలిగిన విష యమే. కాని చంద్రశేఖరానికి గ్రామంలో పని తొందరవల్ల ఈవిషయం ఆలోచించేందుకు రవ్వంత కూడా వ్యవధి లేకపోయింది. పైగా ఇప్పుడు తన కొడుకు చదువు కూడా పూర్తిఅయింది గనుక, పెళ్లి గూడా అయితే ఆ బరువు తీరిపోతుందని.—వివాహం స్థిరపర్చుకుని—తాంబూలాలు పుచ్చుకుని తరువాత జరుగవలసిన తతంగంకోసం ప్రయత్నం చేసుకోవా లని కుతూహల పడుతున్నాడు.

ఇంతకీ రామచంద్రమూర్తి వెనుకే కొంచెం నలుపైనా తీసిపారేసే అంత సులువుకాదు. చిన్న ప్పటినుంచీ గొప్పవాళ్ల రచనలన్నా వారి ఉపన్యా సాలన్నా, వారి గ్రంథాలన్నా అతగాడికి ఆసక్తి మెండు. విశ్వవిద్యాలయంలో పట్టం పుచ్చుకున్న తరువాత ఇటీవల నవ్యసాహిత్యకారుల రచనలను చదివి బాగా అవగాహన చేసుకున్నాడేమో ఇక తానుకూడా ఒక రచయితఅయి ఒకకవియై, ఒక పత్రి కాధిపతియై దేశసేవచేయాలని గాలిలో మేడలు కట్టుకుంటున్నాడు.

ఆ పిల్లమీద తన మనసు కూడా పోయిందేమో ఆమెనే పెండ్లి చేసుకోవాలని అతగాడికి మనసులో నాటుకుపోయింది. తనకు కాదని మ రెవరకు కట్ట పెడుతారు ఆ పిల్లని ?

సుమారు 8 ఘం. కావచ్చింది. సాధారణంగా కొంచె మించుమించు ఈ సమయానికే భోజనాలు అయే అలవాటు. పెళ్లిలో ఇచ్చిపుచ్చుకోవలసిన లాంఛనాల విషయంలో భావమరదులకు తేలక ఆ రోజు భోజనాలు కూడా ఆలస్యమయినాయి. పెళ్లి సంగతే వరండాలో కూర్చుని మాట్లాడుకుంటు న్నారు.

మే. భార్య : భోజనాలకు వేళయింది. లేవండి యిహ. తరువాత కూర్చుందాం.

చంద్రశేఖరం : బావగారూ—మీరు ఊఁ అన డమే తరువాయి. ముందు తాంబూలాలు పుచ్చు కుంటే, మిగతా పనంతా మేము చూచుకుంటాం.

మే. భా : లేవండీ. చేసినవన్నీ చప్పగా చల్లారిపోతాయి. భోజనాలయిన తరువాత...

చంద్ర : ఇదుగో లేస్తాం. బావగారు లేస్తే నేనూ లేస్తాను.

మేజ : ఇందులో నాదేముందోయ్. అంతా మీ చెల్లెల్ను అడుగు. ఆమె యిష్టానుసారమే కాని, నా ప్రమేయం ఏమీలేదు.

చంద్ర : అదేమ్మాట. నా ప్రమేయం లేదంటా రేమిటి ? యిది మరీ బాగుంది! మీ రనేది. మీరు పెద్దలు. 'ఆ మాట' మీరు లాంఛనప్రాయంగానైనా అనకపోతే ఎట్లా ?

మేజ : అనడాని కేముంది. ఇంతకీ మా శారద ఏమంటుంది. ఏమే మాట్లాడవేమే ? ఆ పుస్తకాలు అక్కడ పారేద్దూ బాబు కాస్సేపు. మీ బావను...

శార: అబ్బ పోదురూ. ఒకటే గొడవ. చదువుకోనివ్వరుగదా. యీ కథ చాలా ఇంట రెస్టింగ్‌గా ఉండే సమయంలో...

మే. భా: అమ్మాయీ, ఏమిటా విస్సాటం. మీ నాన్నగారు ఏదో అంటుంటే బదులుచెప్పక?

శార: నన్నడగ నక్కర్లేదు. అంటూ అక్కడ నుంచి లేచిపోతుంది.

మే. భా: ఏమీ పలకరు ఉలకరు. ఉద్దేశ మేమిటో చెప్పకూడదూ?

మేజ: నా వుద్దేశాని కేముందే? మీ అమ్మాయి నడుగు. అమ్మాయి నడగక నన్నడుగుతా వేమిటి?

మే. భా: అమ్మాయినీ అడిగారు, అబ్బాయినీ అడిగారు. యిహ మీ కే తరవాయి.

మేజ: ఏమో. వచ్చేఏడు చేయాలని వున్నది. పెళ్లంటే మాటలేవిటి? ఈ రోజుల్లో అబ్బో అబ్బో బోలెడుఖర్చులు. కొస్తా కూస్తా నేమిటి?

మే. భా: యింకా ఖర్చులేమిటండీ? ఖర్చు లంటారు. ఉభయఖర్చులు మీ భావగారే పెట్టుకుం టారట. అమ్మాయికి 10 కాసుల బంగారం గొలు సులు, వజ్రాల కంఠమాల, లేడీస్ రిస్ట్‌వాచ్, పట్టు చీరలు, ఇండికంచం, మరచెంబు—యిహ కావలసిం దేముంది గనక. తాంబూలాలు పుచ్చుకుంటే సరి.

మేజ: ఈమధ్యనే—చూడు మన లాయరు ధర్మారావు పెళ్లివిషయంలో అతని బావమరది కన పడి యీ ప్రస్తావనే తెచ్చాడు.

బావ: అంటే మీ కోర్టులో ప్రాక్టీసు...

మేజ: అవును ఆయనే.

బావ: చూడండి. ఆపెద్ద రావిచెట్టు వుంది— ఆ దూపాటివారి వీధిలోవున్న ఆయనేనా?

మే. భా: భోజనాలకు లేవకూడదుటండీ యిహ. ఆలస్యం అవుతోంది.

మేజ: అబ్బే. అది దూపాటివారి వీధి కాదు. ఎక్కడో సంగంవారి వీధిని తీసుకువచ్చి దూపాటి వారి వీధి అంటావేమిటోయ్. బలేవాడవ్.

బావ: కాదండీ, దూపాటివారి వీధిలో రావి చెట్టు లేదంటారేమిటి? ఆ వీధి మొదట్లోనే ఉండి తీరాలి.

మేజ: ఉండొచ్చు. ధూపాటివారి వీధిలో ఉన్నది పెద్దది. సంగంవారి వీధిలో ఉన్నది చిన్న చెట్టు. ఇంతకీ నే చెప్పిన వీధి సంగంవారి వీధి.

బావ: ఏమో మరి. ఇంతకీ సంగంవారి వీధి ఎక్కడుందంటారు?

మే: ఇప్పుడు పాతసినీమా థియేటర్ వున్నదే దాని ప్రక్కగుండా వెళ్లే సందు. రైల్వేగేటుకు దగ్గ రగా ఉన్నది.

బావ: అదికాదండీ. చూశారూ, అచ్చాఫీసు వుంది—దాని ప్రక్క వీధే సంగంవారి వీధి. ఈ మాత్రం నాకు తెలియదూ?

మే. భా: రామాయణంలో పిడకలవేట. సంగం వారి వీధి ఎక్కడుంటే ఏం? మంగలివారి వీధి ఎక్కడుంటే యేం?

మేజ: అఁ.. నేను పాతసినిమాథియేటరు ప్రక్కగుండా వెళ్లే సందే సంగంవారి వీధి అంటున్నా. మీ అన్నగారు అది కాదంటున్నారు.

మే. భా: మా అన్నయ్య చెప్పిందే రైటు. అచ్చాఫీసు ప్రక్కవీధే అని మా ముత్తవతల్లి చెపు తుంటే విన్నాను.

మేజ: ఆవిడకేం తెలుసు. అయినా తెలిసీ తెలియని వాదన లెందుకు నీకు?

మే. భా: బాగుందండి మీ రనేది. ఇక మీ కొక్కరికే గాబోలు ఊరుసంగతి తెలిసినది.

మేజ: నా చిన్నతనమంతా, చదువుసైతం యీ వూళ్లో పూర్తిఅయింది. ఏమిటో నాకు తెలియ నట్లు, మీకు మహా తెలిసినట్లు మాట్లాడతా రేమిటి?

మే. భా: ఆయన మాటలకేంగాని—

మేజ: నీవు మహా చెప్పొచ్చావులెద్దూ. లోప లికి పో. అయినా ఊళ్ళోకి నెలకోసారి, ఏడాది కోసారి వస్తూ—వూరు సంగతి ఏం తెలుసు మీకు. ఎక్కడో సంగంవారి వీధిని తీసుకువెళ్ళి దూపాటి వారి వీధి అంటే ఎవరైనా నమ్మాలా అక్కర్లేదా?

బావ: మా తండ్రిగారి హయాంలో ఏవో పుస్త కాలు అచ్చువేసే సందర్భంలో ఆచ్చాఫీసుకు పంపే వారు. అచ్చుఆఫీసుకు ప్రక్కనుంచే సంగంవారి వీధి తెలుస్తుండేది. నాకు బాగా గుర్తు. లేదంటారేమి టండీ.

శారద: ఏమిటండీ—యీ గొడవ. నన్ను పుస్తకం పూర్తిచెయ్యనియ్యరా ఏమిటి?

మేజ: అమ్మాయ్—నీవు చెప్పు సంగంవారి వీధి ఎక్కడుందో?

శారద: ఓస్ దీన్ని గురించా. సంగంవారి వీధి పాతసినీమా థియేటరు ఉండే దాని ప్రక్కగుండా వెళ్ళే సందే సంగంవారి వీధి.

మేజ: బాగా కరెక్టుగా చెప్పావ్. అది కాదంటాడు మీ మావయ్య.

శారద: ఆ వూళ్లో ధాన్య మేమిటో, పంట ఏమిటో అంతేకాని, మావయ్యకు ఏమీ తెలియదండీ నాన్నా. మా కాన్వెంటు స్కూలుకు వెళుతుంటే ప్రతి రోజూ మా బండి ఆ వీధి ప్రక్కనుంచే వెడుతుంది. సుబ్బన్న గారి అమ్మాయి ఆ వీధిలోనుంచే వస్తుండేది.

మే. భా: నీకు మహా తెలుసు. పసిపిల్లవు నీ వూరుకుండూ.

శారద: బాగుందే అమ్మా. ఏం నాకు మాత్రం తెలియదూ.

మేజ: దాన్ని ఊరుకోమంటా వేమిటే. ఏం దానికిమాత్రం తెలియదా?

బావ: బావగారూ, మీరు బాగా ఆలోచించండి. సంగంవారి వీధినే అసలు అష్టవంకర్ల వీధి అంటారు. కోణంగి పేటలోంచి అచ్చుఆఫీసువద్ద కలిసే వీధే సంగంవారి వీధి.

మేజ: ఆలోచించే దేమిటండీ. ఆలోచనా పాలోచనాను. మీ రన్నది తప్పండీ. సినీమా థియేటరుకు ప్రక్కగుండా వెళ్లే సందే సంగంవారి వీధి. ఇంత విడదీసి చెప్పినా మీరు కాదంటే ఏమి చేయాలి.

బావ: యిహ మీతోటి వాదించి ఏం ప్రయోజనం.

మేజ: అయితే నే చెప్పింది కాదంటారా?

బావ: నే చెప్పింది మాత్రం తప్ప నెక్కడుంది.

మే. భా: మన కెందుకు వచ్చిన గొడవ ఇది. సంగంవారి వీధి ఎక్కడుంటే ఎవరి క్కావాలి. ముందు అమ్మాయి పెళ్లిసంగతి ఆలోచించండి.

మే: అయితే నీకు నే దేమిటి?

మే. భా: తాంబూలాలు పుచ్చుకోమని.

మేజ: పుచ్చుకోవచ్చులే...యిప్పుడు వచ్చిన తొందర ఏమీ లేదు.

మే. భా: మీ యిష్టం బాబూ. ప్రాణం విసిగి పోతూంది మీతోటి. ఇప్పుడు గాకపోతే మరి ఎప్పుడో. అయినా అమ్మాయిని యివ్వకపోతే వాడికి పెళ్లి జరగదా. వాడు దీన్ని పెళ్లి చేసుకోకపోతే దీనికి పెళ్ళవదా?

బావ: అమ్మాయి నీ వూరుకో. అయితే బావగారు తాంబూలాలు పుచ్చుకోవడం దాకా వచ్చి మళ్లీ ఇట్లా మాట్లాడుతున్నారె.

మేజ: దాని పెళ్లి కిప్పుడేం తొందర లేదండీ. తరువాత చూచుకోవచ్చు.

మే. భా: పెళ్ళి లేదు—ఏమీ లేదు. కూర్చోబెట్టండి యింకా ఎన్ని రోజులు పెళ్ళి చేయకుండా కూర్చోబెట్టా లనుందో.

బావ: నే వస్తానే అమ్మాయి. ఇప్పుడు బండి వుంది. రాత్రి రైలుకే పోతున్నా.

మే. భా: అయ్యో భోజనంఅయినా కాలేదు. భోంచేసి వెళ్లు నా మాట విను.

చంద్ర: భోజనానికేం లేవే. భోంచేస్తే రైలు దాటిపోతుంది. నే వెళ్లొస్తా. అంటూ వచ్చినదారినే చక్కాపోయాడు చంద్రశేఖరం.

# 4

మరికొన్ని రోజులకు తరుచు మేజస్ట్రేటుగారింటికి వచ్చే సూరిశాస్త్రి గారు ఆ రోజు మధ్యాహ్నం ఏదో పనుండి వచ్చారు. వరండాలో కూర్చొని తాంబూలం వేసుకోసాగారు. పోకలు నములుతూ శాస్త్రిలవారు...

'నా మనస్సుకు ఈ విషయం పట్టినట్లు మరేదీ పట్టలేదు. నాకు అర్థమయినట్లు మరెవరికీగూడా అర్థమవనే అయిఉండదు' ధర్మారావును ఉద్దేశిస్తూ గాబోలు—'అయినా ఆ వృత్తిలో సతతమూ తిరిగే వాళ్ళకూ, ఆ ధారాశుద్ధి, ఆ వాక్శుద్ధి వుండదూమరి. చెడ్డఅలవాటు ఏమంటే కావలసిన సాక్ష్యమూ, పరిశోధనా రుజువూ లేకుండా వితండవాదం చేసినందువల్ల ప్రయోజనం ఏముంటుంది. పాపం దీన్ని గురించి వెనక కొన్ని ప్రాణాలు పోయాయి.'

శాస్త్రిలవారు మరో రెండు తములపాకులు తీసుకుని నములుతూ—

'యింతకీ సంగంవారి వీధినిగురించి జ్ఞాపకం ఉన్నదా?'

మేజ: లేదే.

శాస్త్రి: అదెక్కడ వుందంటారు?

మేజస్ట్రీటు గారు పెన్సిలు తీసుకుని టేబిలు అట్టమీద వివరంగా గీచి చూపుతూ, 'అక్కడనుంచి మొదలు ఇంతవరకూ ఉన్నదే సంగంవారి వీధి.'

శాస్త్రిలవారు బాగా పరీక్షించి తదేక దీక్షతో ఆ మ్యాపును చూచి గొంతు సవరించుకుని,

'మీరు శ్రమపడి మ్యాపు గీయడమైతే గీశారు గాని—అసలు ఈ వీధి ఎక్కడుందన్న విషయంలో మీ అభిప్రాయం కూడా తప్పే—ఆ రోజు లాయరు గర్నాదరావు చెప్పింది కూడాగా సరిపోయింది', అన్నారు కొద్దిగా నవ్వుతూ.

'ఔను అల్లాగ'—అంటూ అంతవరకూ ఖులాసాగా సంతోషంతో కబుర్లుచెప్పిన మెజస్ట్రీటు సదాశివరావుగారు ఛీదరించుకుంటూ ఛర్రుమని కుర్చీలోంచి సభాలున అక్కడనుంచి లేచ్చక్కా పోయారు.

'ఇదేమిరా బాబు—ఎన్నడూ లేనిది నేను ఈయనకు కోపం తెప్పించానే' అనుకుంటూ మెల్లిగా ఇంటికి జారారు శాస్త్రిలవారు.

కోపం శాంతించిన తరువాత మేజస్ట్రీటుగారు వాకబుచేయగా తేలినవిషయ మేమంటే ఈ సంగంవారి వీధిలో సంగం బాపన్న అనే అతను ఉండేవాడనీ, పిమ్మట అతను చనిపోగా అతని కొడుకు సంగం చలమయ్య క్రైస్తవమతం పుచ్చుకుని తనకు అక్కడ ఉన్న స్థలం, ఆపాటికొన్ని అన్నీ పురపాలక సంఘంవారికి అమ్మేసి మరో వూరు లేచిపోయాడనీ, యిప్పుడు ఆ స్థలంలో పురపాలక సంఘంవారు ఎలిమెంటరీ పాఠశాలను యివలనే నిర్మించారనీ, కాగా యిప్పటి పురపాలకసంఘ ప్లానులో అసలు సంగంవారి వీధి లేనేలేదనీ తేలింది.



# రాయలవారి ఋతువర్ణనలు



★

శ్రీ దివాకర్ల వేంకటావధాని

ప్రబంధములు వర్ణన ప్రధానములైన కావ్యములు. పెద్దనార్యుని నాటినుండియు ప్రబంధ కవు లేదో యొక యవకాశము కల్పించుకొని తమ కావ్యములలో నష్టాదశవర్ణనములను గావించుచునే యున్నారు. ఈ పదునెనిమిది వర్ణనలయభావము ప్రబంధమున నొక లోపముగా భావింపబడుటచే కొందఱు కవులు ప్రసక్తి లేకపోయినను నియమానుసరణమునకై యనావశ్యకములైన వర్ణనలు కావించుటయు గలదు. వర్ణ్యములైన యీ యష్టాదశ విషయములలో ఋతువులు కూడ జేరి యున్నవి. అందుచే ప్రబంధకవులు కథా సందర్భమునుబట్టి యేవో కొన్ని ఋతువులనైన వర్ణింపకుండరు. శ్రీ కృష్ణదేవ రాయలవారు తమ యాముక్తమాల్యదలో నాలుగు ఋతువులను గూలంకషముగా సూక్ష్మాతిసూక్ష్మ వివరములతో వర్ణించియున్నారు. ఆ వర్ణనలలో నాయన యనన్యకవి సాధారణమైన ప్రతిభాచాతుర్యములను బ్రదర్శించి యుండుట యాముక్త మాల్యద పఠించిన వారి కెల్లరకును విదితమే. ఆ ప్రతిభాచాతుర్యముల నీ వ్యాసమున యథాశక్తిగా నిరూపింప యత్నించెదను

గోదా శ్రీరంగేశ్వరుల ప్రణయమే యాముక్త మాల్యదయందలి ప్రధానవృత్తము. అది యందలి చివరి రెండాశ్వాసములలో జక్కగా వర్ణింపబడి యున్నది. మొదటి నాలుగాశ్వాసములలో నీ కథతో నంతగా సంబంధము లేకపోయినను వైష్ణవమతాభిమాను లగుటచే రాయలవారు విష్ణుపారమ్యమును సూచించు విష్ణుచిత్తయామునాచార్యుల వృత్తాంతములను విశదీకరించి యున్నారు. విష్ణుచిత్తు డితర మతస్థుల నోడించి పాండ్యరాజునకు వైష్ణవమత సారము నుపన్యసించు సందర్భమున ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానమును, యామునాచార్యుడు శ్రీరామ మిశ్రునిచే నుద్బోధితుడై కుమారునికి రాజ్య మొప్పగించు సందర్భమున దీర్ఘమైన రాజనీతి వర్ణనమును గలవు. చివరి యాశ్వాసమున మాలదాసరి వృత్తాంత ముపకథగా నున్నది. ఈ యుపకథోపాఖ్యాన రాజనీతి వర్ణనలకు దోడు మధ్యమధ్య గ్రీష్మవర్ష శరద్వసంతముల విపులవర్ణనము లున్నవి. ఇవన్నియు గలిసి యాముక్తమాల్యద యందలి ప్రధానకథను మఱుగు పుచ్చి దాని నొక చిన్న విష్ణుపురాణముగా నొనర్చి వైచినవి. వస్త్వైక్యమునకు భంగము చేకూర్చు నప్రసక్త విషయ విస్తరణ మాముక్తమాల్యద పఠించు వారి కించుక కించ కలిగించినను అందలి ప్రకృతి పరిశీలన భావ గాంభీర్యాదుల హుందమైన యానందమును జేకూర్పక మానవు.

తొల్లింటికవులు తమ తమ కావ్యములలో వసంతాది ఋతువులను వర్ణించి యుండకపోలేదు. కాని యావర్ణనలెవ్వియు రాయల వారివర్ణనములంత దీర్ఘములుగా గాని కూలంకషము లుగా గాని కానరావు. ఆంధ్రవాఙ్మయముననే కాదు సంస్కృత వాఙ్మయమునగూడ ఋతువర్ణనైక వస్తుకములగు ఋతుసంహారాదుల వక్క నితర కావ్యములలో నింత దీర్ఘమధురమైన ఋతు వర్ణనము కానబడదు. ఇటీవల గవి సమ్రాడ్విరుదాంచితులైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తెలుగు ఋతువులను పేర నొక ఋతువర్ణన ప్రధానమైన కావ్యమును బ్రకటించియుండిరి. అందలి వర్ణనములు సైతము భావగంభీరములై కవిగారి ప్రకృతి పరిశీలన నైశిత్యము ననేక విధముల వెల్లడించుచున్నవి. చిన్నదయ్యు మనోహరమైన యీ కావ్యమునే యొకవిధముగా రాయలవారి ఋతువర్ణనలకు సాటిగా బోటిగా జేర్కొనవచ్చును. మిగిలినవానిలో ఋతువుల వర్ణనములున్నను ఇన్ని ఋతువుల వర్ణనములేదు; ఉన్న ఋతువుల వర్ణనమైనను ఇంత సమగ్రమైనది కాదు.

స్థూలముగా బరిశీలించినచో నాముక్తమాల్యదలో ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యాన రాజనీతి వర్ణనాదులవలెనే యతిదీర్ఘములైన యీ ఋతువర్ణనములును గథాగమనము నడ్డగించి కావ్యమునందలి వస్త్వైక్యమునకు భంగము కలిగించియుండుట యథా

ర్థమే యనిపించును. కాని సూక్ష్మముగా జూచి నప్పుడు వానికి గథాంశములతో గవి కల్పించిన సంబంధము స్పష్టము కాకపోదు. ద్వితీయాశ్వాసము నందలి కథకు వేశ్యాగృహమున కరుగుపాండ్యరాజు పరదేశివిప్రుడు పఠించిన సుభాషితశ్లోకము నాలించి, హఠాత్తుగా విరక్తుడై సౌధమునకు మరలివచ్చి మోక్ష ప్రదమైన దేవు డెవ్వడో నిర్ణయింపుడని పండితుల గోరిన ఘట్టము కేంద్రభూతమైనది. సుభాషితము చదివిన విప్రుడచ్చటి కప్పుడు వచ్చుటకు "దక్షి కట వృషగిరి హరికి విభవము విప్పగా" జరుగు తెప్పతిరునాళ్లజూచు కోరికయే కారణము. అళఘిరియందుండు సుందరబాహుస్వామికి దెప్ప తిరునాళ్లు వేసవిలో జరుగును. ఆ యుత్సవ ములు గన్నులార భక్తితన్మయుడై చూచి పోవుచు బరదేశి బ్రాహ్మణుడు మధురానగర దిదృక్ష ప్రేరేప నచ్చటి కరిగి, రాజపురోహితునింట గ్రీష్మ కాలోచితమైన మృష్టభోజనము కావించి, తోడి విప్రులతో మార్గవేదికపై బరుండి యుబుసుపోకకై వారిలో నొక్కడార్యలును వేఱొక్కడు గీతలను బఠింప దాను సుభాషితము జదివెను. ఆతడు మార్గ వేదిపై బరుండుటకు హేతువు "పెను వేసవి." అత డచ్చటికి వచ్చుటకు హేతు వా వేసవిలో వృషగిరి హరికి జరుగు తెప్పతిరునాళ్లు. వేసవిలో దప్ప మఱొ కప్పుడా యుత్సవము జరుగను జరుగదు; పరదేశి బ్రాహ్మణు డచ్చటికి రాను రాడు. వచ్చినను మార్గ వేదిపై బరుండడు. మార్గవేదిపై గాక యే గృహాంత ర్భాగముననో శయనించి యాతడు సుభాషితముల జదివినను వీథిలో బోవువారి కవి వినబడవు. పాండ్యు డా సుభాషితమును వినకుండినచో గథాసంవిధాన మీ తీరున సాగియేయుండదు. ఇన్నిటికిని హేతువగుట చేతనే రాయ లిచ్చట నా వేసవిని వర్ణింపబూని నాడు.

చతుర్థాశ్వాసమున వర్షశరదృతువులు వర్ణింప బడినవి. ఈ వర్ణనలు యామునాచార్యుడు తనతో వాదము చేయవచ్చినవారి నెల్లర నోడించి విష్ణు దేవుడే పరతత్త్వమనియు విశిష్టాద్వైతమే మత మనియు బ్రతిష్ఠించిన పిమ్మట జేయబడినవి. పాండ్య రాజు యామునాచార్యుని మాహాత్మ్యమునకు సంతో షించి, సాష్టాంగ మెఱగి, యాతనికి దన కడగొట్టు చెలియలి నిచ్చి పెండ్లిచేసి, "యరణంబుగ నమ్మహా త్మునకు ధారాపూర్వకముగా నర్ధరాజ్య మిచ్చి" యువరాజుగా నొనరించెను. పిమ్మట నాతని కఖర్వ శిరస్సభ్యస్త మగుటయు నందు దివ్యాస్త్రమంత్రంబు లుండుటయు నెఱింగి దుస్సాధంబగు విరోధి యానంబు సాధింపుమని దండయాత్రకు బంప యామునాచార్యు డందుకు సన్నద్ధు డగుచుండెను. అప్పటికి సరిగా గ్రీష్మము ముగిసి వర్షాగమ మారం భము కానుండెను. పురోహిత ప్రధానమంత్రి వర్గంబు యామునాచార్యు దిగ్విజయ యాత్రా సన్నాహ మెఱింగి "సన్నిహితంబులగు నివార్షిక దినంబులు గడపి శరత్సమయంబున విద్విషత్సంహా రంబునకు విజయము సేయు"మని బోధించిరి. యువ రాజు వారి మాటలు పాటించి, యెత్తైఱంగు రాజున కెఱింగించి తత్సమ్మతి నప్పటికి నిలిచెను.

ఋతువు లాఱింటిలో శరదృతువు వీరరస ప్రధానమగు దిగ్విజయయాత్ర కనువైనట్టిది. సాధార ణముగా బూర్వపు రాజులు దండయాత్ర వెడలుట యా ఋతువునందే. ఈ యాచారమును బురస్కరించుకొనియే సంస్కృతాంధ్రకవులు పలువురు దిగ్విజయయాత్రలను వర్ణించుటకుముందు శరత్తును వర్ణించి యుండిరి. కాళిదాసు రఘువంశమున రఘుమహారాజు దిగ్వి జయ యాత్రకుముందు శరదృతువును వర్ణించి యుండుట యెల్ల రెఱింగినట్టిదే. సంస్కృత నాటకముల ప్రస్తావనలలో వీరరసము ప్రధానరస మైనప్పుడు శరదృతువు వర్ణింపబడవలెనని లాక్షణి కులు నియమము కావించుట యారసమునకును ఋతు వునకును గల యన్యోన్యానుకూలతను బురస్క రించుకొనియే యైయుండును. ఈ సంప్రదాయము ననుసరించియే రాయ లిచ్చట యామునాచార్యుని దిగ్విజయమునకు నాందిగా శరదృతువును వర్ణింప దలచినాడు.

ఈ శరదృతువర్ణనమునకుముందు మిక్కిలి దీర్ఘ మైన వర్షర్తు వర్ణనము కలదు. దీని కిచ్చట నంతగా బ్రసక్తి లేదు. కాని పాండ్యరాజు తన చెల్లెలిని యామునాచార్యున కొసంగి, యాతని యువరాజుగా నొనరించి, దిగ్విజయయాత్రకు బ్రోత్సహించినది గ్రీష్మర్త్వంతమునందు. వార్షికదినంబు లప్పటి కతి సన్నిహితములై యుండెను. వర్షర్తువు గడచిన

పిమ్మటగాని యామునుడు జైత్రయాత్రకు బయలు దేఱరాదని వృద్ధపురోహితాదుల యభిప్రాయము. ఈ వర్షకాలము రాకపోకలను సూచించు తలంపుతో రాయలు శరత్తునకు బూర్వము దానిని వర్ణించి యుండెను. ఆయన కితర ఋతువులయందు గంటె వర్షర్తువునం దభిమాన మెక్కువ. ఆయన యీ యభిమానము వర్షర్తువర్ణనమునం దెల్లెడ స్పష్టముగా గోచరించును. ఈ వర్షర్తువురాక నాయన యంతకుముందే "గ్రీష్మసమయ నిరుత్సాహకేకిరమణి, నవఘనధ్వని కలరు చంచమున నలరి" పాండ్యరాజు భార్య యాతనిలో యామునాచార్యునుదంతము నెఱింగించెనను సందర్భమున నతి రమణీయముగా సూచించియున్నాఁడు. ఈ సూచనయు దరువాత సాగిన వర్ణనయు మిక్కిలి మనోహరములుగా నున్నను ఇంత దీర్ఘముగా నా ఋతువు నిచ్చట వర్ణించుట కొంత యప్రసక్తముగా నేయున్నదని చెప్పవలయును.

పంచమాశ్వాసమునందలి కథ కలంకారమైనది గోదా విరహఘట్టము. ఈ విరహ మాంధ్రవాఙ్మయమున కపూర్వమైనది. హార్దమైన యనురాగము నింత లెస్సగా సూచించు విరహమును వర్ణించిన కవి యాంధ్రవాఙ్మయమున నింకొక్కఁడు లేఁడు. విరహమున కుద్దీపనమైనది వసంతము. అందుచేత నే రాయ లిచ్చట నీ వసంతర్తువును సమగ్రముగా వర్ణింప బూనినాఁడు.

మొదల నాముక్తమాల్యద మదనతాప
తరణి పెనువెట్ట వేగిన దక్షిణాశ
మత్కృతోష్మకు దుదముట్ట మాఁడు ననుచు
దొలగె నన నుత్తరాశకు దొలగె దరణి.

గోదాదేవి ధనుర్మాసమున విష్ణుసేవావ్రతమును బూని ముప్పదిదినములు ముప్పదిపాటలుగా దిరుప్పావై పాడెనని ప్రతీతి. దీని కనుగుణముగా రాయలు పై పద్యమున సూర్యుఁడు దక్షిణాశ వీడి యప్పుడుత్తరాశకు దొలగెనని వర్ణించియున్నాఁడు.

ఈ విధముగా నీ ఋతుచతుష్టయవర్ణనమును మిక్కిలి దీర్ఘమైనను గథ కేదో విధముగా నించుక సంబంధించియే యున్నదని తెలియవచ్చుచున్న . ఈ ఋతువర్ణనమును బట్టియే కాక రాయలు కావించిన రాజనీత్యాదులవర్ణనములను బట్టి కూడ జూచినచో నాత డతివర్ణనాభిలాషి యని పొడగట్టును. ఏదైన విషములను వర్ణింపదలచినప్పుడు దానిని సర్వాంగసుందరముగను సమగ్రముగను వర్ణించినగాని యాతనికి దృప్తికలుగదు. అసలాకాలముతీరే యట్టిది కాఁబోలును. కార్యనిర్వహణమునగాని భోగానుభవమునగాని సమగ్రతయే యప్పటివారి లక్ష్యముగా నుండెను. కార్యమును సాఁగసాఁగా జేసి యూరకుండుటకాని, భోగవిలాసముల నించించుక యనుభవించి విరమించుటకాని వా రెఱుగని పద్ధతులు. ఆ చిత్తవృత్తియే యీవర్ణనలందును గోచరించుచున్నది : ఈ నాలుగువర్ణనములును సూక్ష్మాతిసూక్ష్మవివరములతో గూడి సర్వ సమగ్రములుగా నున్నవి. ఈ సామగ్ర్యమే వాని కనితరకావ్యసాధారణమైన గాంభీర్యమును దెచ్చిపెట్టినది.

కాలమెప్పుడు నొక్కమాదిరిగా నుండదు. అది ప్రతిక్షణమును బరివర్తన మొందుచుండును. ఆ పరివర్తనప్రకారము దినములు గడచినప్పుడు కాక ఋతువులు మాఱినప్పుడు మిక్కిలి స్పష్టముగా గానిపించును. ఒక్కొక్క ఋతువున కొక్కొక్క వాతావరణ ముండును. పంచభూతాత్మకమైన ప్రకృతిలో గలుగు మార్పే యీ వాతావరణమునందలి మార్పునకును గారణమైయుండును. ఈ మార్పు మానవులందరికిని గోచరించినను గవులదృష్టికి మఱింత స్పష్టముగా నిశితముగా గోచరించును. దానిని వారు నిపుణముగా బరిశీలించి యక్షరరూపమైన యాకారముతో నచ్చుకొట్టుదురు. ఆయా ఋతువులకు సంబంధించిన భిన్నభిన్న వాతావరణముల సుందరముగా జిత్రించి వానిని బఠితలముందు సాక్షాత్కరింప జేయుటలో రాయలు కడుంగడు నేర్పరి. ఆముక్తమాల్యదలో నాతడు గ్రీష్మవర్ష శరద్వసంతములకు సంబంధించిన వాతావరణ పరిస్థితులను బ్రకృతి సౌందర్యవిశేషమును జిత్రమునందట్లు మిక్కిలి స్పష్టముగా వర్ణించినాఁడు. ఆతఁడు వర్ణించిన మరుమరీచికలు, శాల్మలీఫలము లెండకు బగులగా గాలిలో నెగిరియాడు తూలశకములు, బొండుమల్లియలు, ప్రపలు, సుడిగాలులు గ్రీష్మముమూర్తిని మన కట్టెదుట సాక్షాత్కరింపజేయుచున్నవి. వర్షకాలము రాగానే యీ పరిస్థితులన్నియు మాఱిపోయినవి. అప్పు డాకసమున నెచ్చట జూచినను జంచలా

సహితములైన ఘనాఘనములు, ఇంద్రగోపములు, "శక్రకార్ముకపు బలు వన్నెకట్ల జెట్టిదైన నడచెడు కాళ్ళసంపనగా" నడచు వానకాళ్లు కానబడును. తొలివానజల్లుతో గరకానికాయములు పడసాగును. భూమిపై నెల్లయెడల ఛత్రాకపంక్తు లుప్పతిల్లును. చెఱువులలోనేకాక చిన్నచిన్న పడియలలో గూడ వృత్తభేదానుకృతితో భేకధ్వను లెసలారును. కోకిలల పంచమ స్వరములకు బదులు కేకుల షడ్జస్వరములు వినిపించును. మఱియు సప్తతాలాశోకకమల కువలయామ్రమాలికి మాఱుగా గదంబకుటజ నీపకకుభయూథికలను క్రొత్తసాయకములతో దన తూణీరమును నింపుకొనును. "ఆమని వేళ బచ్చ చాంపేయకముల నమ్మి కడపళ్ళ దమ్మ్రపైచి" నాడు మసపె నాసపడువారిని జూచి నవ్వినట్లు కేతకి గహనతతులు వికసించును. ఈ పరిస్థితులన్నియు వర్షాదేవత వింతమూర్తిని మన కనులయెదుట నిల్పుననుటలో నాశ్చర్య మేమి? శరత్తు రాగానే మరల నీ దృశ్యమంతయు నదృశ్యమగును. అప్పుడు తెల్లని మేఘములు, కాశస్తంభములు, శాలిమంజరులు, గజముల తిర్యగ్దంత ప్రహారములు, మరాళ మాలికల యొయ్యారపు నడకలు కనులకు బంధువు చేకూర్చును. హేమంత శిశిరర్తువులలో మరల నీ దృశ్యములు, వస్తువులు మృగ్యములైపోవును. వసంతము రాకతో మలయమారుతప్రసారములు, చిగురాకుల సోయగములు, క్రొన్ననల పరిమళములు, అళిఝుంకారములు. కోయిలల పంచమస్వరములు ప్రకృతికొక వింతరామణీయకము నాపాదించును. సహకార వృక్షములు పుష్పించి పుష్పబాణున కక్షయ తూణీరత్వము కలిగించును. ఇట్లే ఋతువుల యాకృతిలో గల వైలక్షణ్యమును సుస్పష్టరేఖలతో దీర్చిదిద్దుటకు నిశితమైన ప్రకృతిపరిశీలనము కావలయును. అది రాయలవారియందు సర్వతోముఖముగా గోచరించును. అందుచేతనే యాయన ఋతువర్ణనముల పఠించునపుడు భావగతమైన యానందము చెలరేగుటయేకాక యాకాలసంజనితములైన యాయా ఋతువు లనుభవమునకు వచ్చుట కూడ బొడగట్టును.

ఆయాకాలములందలి ప్రకృతిపరిస్థితులు సూక్ష్మాతిసూక్ష్మ వివరములతో బ్రత్యక్షమగుట రాయల వర్ణనములందలి యొక ప్రత్యేకలక్షణము. సాధారణముగా మనము చూడని, చూచినను అంతగా బరిగణింపని విషయముల నెన్నింటినో యాయన చక్కగా వర్ణించి యచ్చటి వర్ణన కెంతో సహజత్వము చేకూర్చును. చరాచరప్రపంచమంతయు నాయన దృష్టియెదుట సుస్పష్టరేఖలతో వచ్చి నిలుచును. వస్తువుల న్యూనాధిక్యములతో నాయనకు బనిలేదు. బకోటకులము బొమ్మిడాయ డాక్కూటకులంబుల భక్షించుటయు భూపాలురంతఃపురముల భోగముల ననుభవించుటయు నాయన సమానాదరముతోనే వర్ణించును. వేసవిలో జట్రాల ప్రాచిపెన్చీట లెగయుటయు, దమరస ద్రవ్యంబు పంకేజ బాంధవభానుప్రతతులు హరింప బ్రహ్మదేవునితో మొఱవెట్టుకొనుటకై పోవుచున్న శూన్యోరుకూపవితానములా యను భ్రాంతి గొల్పు సుడిగాలులు విసరుటయు, ప్రావృషమున వానకు జడిసి వృక్షముల క్రింది కేగు జనుల జల్లు తలపడక మున్నే తరులు వంపుళ్ళ దడుపుటయు, శరత్తున నర్కమండలి కభ్ర మడ్డమైనంతనే లేకు లెఱమాని మోము బిట్టెత్తి చూచుటయు, వసంతమున బిసరుహాక్షులు మృగమదాలేపములను అగరుకలపలనుమాని పన్నుగవ మీదికి బన్నీసరము లొప్పుటయు మున్నుగాగల విషయము లేవియు నాయన దృక్పథమును దాటిపోలేదు. వేసవిలో జానుదఘ్నములైన చెఱువులందు నిల్చి బకపంక్తులు చలను, జిలుగుపిల్లలను నములుచు నెండ్రికాలి కిటికిన నెగసి, యొక్కించుక తొలగి శతత్రోటి దూటితినుట నాయన చూచుచున్నట్లు వర్ణించును. వర్షమున బక్షులు జడత్వముచే దుదఱెప్పల గన్ను విప్పి, నీరుముంగరలవలె ముక్కున గూడ, నోట గొంతొడియుచు గూటికట్టి సగ మొత్తుచు జానువులు వక్షము చేర ఱెక్క విదిర్పు మున్నుగా వడకుటయే తప్ప మిగిలిన చేష్ట లన్నియు నుడుగుటయు, భానుమండలమును శ్రీపరివేషము చుట్టుటయు నాయన పఠితలకు సాక్షాత్కరింప జేయును. శరత్తున "బ్రభగ్న శాల్యవని శీతాలాభము" గలుగుట నాయన యెఱుంగును. వసంతమున గామినులు భోగానంతరము ఘర్మశంకచే వ్యోమ తెరలుప్పన వెత్తుటయు నాష్ట్రములు దెప్పరమగుటచే లోహశకటి ప్రకటీకరణంబు తక్కుటయు నాయన కనుభవసిద్ధములైన కృత్యవిశేషములు కాబోలును. ఋతువుల నన్నింటి నాయన చక్కగానే వర్ణించినను వర్ష

కాలవర్ణనమున మఱింతచాకచక్యమును ప్రకటించెను. అప్పుడు వంటవండు నిల్లాండ్రు పడుక్లేశమును వర్ణించు నీ పద్యమాయన సూక్ష్మపరిశీలనకు బరమావధి.

ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బు శిఖి, యబ్బె
  నే నింటిలో బూరియిడి విసరక
రాజదు, రాజిన రవులుకొల్పావసలె
  కాని కల్గదు కూడు, దాన గలిగె
నేని కూరసుటుమం, దైన బెన్పొగసుఖ
  భుక్తి సేకూరదాభుక్తి కిడిన,
బ్రాగ్భోక్తలజె తీరు బహుజనాన్నము దీర
  నారులకొదవు బునః ప్రయత్న

మాజ్యపటుముఖ్యలయ మెన్నరు... ఈపద్యమును జదువునప్పుడు సామాన్యజనసహజమైన యీ క్లేశము నాయన యెప్పుడు చూచెనాయని యాశ్చర్యమును, ఆయన సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలన కానందమును గలుగక మానదు.

సాధారణముగా గవులందఱును వర్ణనసందర్భములందు గవిసమయముల నూతగా గొని వింత వింత భావముల వ్యక్తము చేయుచుందురు. ఈ కవిసమయములు యథార్థములగునా కాదాయనునది వేఱు మాట. కాని యవి సర్వకవిసంప్రయుక్తము లగుటచే మనకు వింతగా నుండకపోవుటయేకాక వర్ణ్యవిషయమును మఱింత స్పష్టము కావించును. ఋతువులన్నిటికి సంబంధించిన కవిసమయము లిట్టి వెన్నో కలవు. రాయలం దొక్కదానిని గూడ విడువకుండ వర్ణించుటలో గృతహస్తుడు. ఈయన వర్ణనలలో నీ సమయ పరిజ్ఞానము సర్వతోముఖముగా గోచరించును. ఒక్కొక్కసమయమును బురస్కరించుకొని యాయన యొక్కొక్క రమ్యమైన భావమును సృష్టించుచుండును. గ్రీష్మమున దివసములు దీర్ఘములగుట కవిసమయమునందే కాక శాస్త్రమునందు గూడ సిద్ధమైన విషయము. అప్పుడు బెట్టిదంపు వెట్టచే హస్తము చెమర్చిలస్తకము దుసికిలం జేయుటచే సవరింప వశముకాక మదనుడు చెఱకువి ల్పుడమి బడ వైచెనట. అది చెఱకుపండెడుకాలమగుట యీ భావము పుట్టుటకు హేతువయ్యెను. చాతకములు మూగి యొక చినుకైన నుర్వికి డిగ్గనీకుండుట, ఘనుడు సకలమును నిద్రబుచ్చు కేశవుని నిద్రపుచ్చుట హంస లుఱుము విని యలకకై దివి కెఱబఱచుట వర్షకాలమునకు సంబంధించిన సమయములు. తనయలు చొచ్చిన యింటనే యుండి కన్నునకు బుట్టినిల్లేరుట రాయలనాడే కాక యిప్పటికిని మాఱని సంప్రదాయము. దీనిని బురస్కరించుకొని యాతడు వనభోగమనుచే సగర్భములైన యర్కకిరణములు ప్రసూతికై మరల నాతని ధామము చేరెనని చక్కగా వర్ణించెను. "ద్వాదశ నారణ్యక ధ్వని విసగజేసి గర్భము సుఖద్యుతము చేయ నిండుటయు నిట్టి సంప్రదాయమే. వర్షకాలమున బ్రాయ్యి రాజమిచే బోనము ప్రజకు జక్కలబోనమగుట యెవ్వ రెఱుంగని విషయము? ఈ సమయ సంప్రదాయముల నెఱుంగుట యొకటి, వాని నూతగా జేసికొని దివ్యములైన భావముల సృజించుట వేఱొకటి. రాయ లిట్టివానిని బ్రత్యేకాభిమానముతో వర్ణించునా యనిపించును. శరదృతువు రాగనే రాజమరాళములు క్రౌంచగిరి రంధ్రముద్వారా దశార్ణదేశములకు దిరిగివచ్చును. ప్రజలు శరద్వ్యాజపేయము లొనరింప గడగుదురు. విష్ణువు నిద్రనుండి మేల్కాంచును. కలశీసూను డుదయించి కలుషితాంభస్సులకు బ్రసన్నత చేకూర్చును. ఈ సమయములు గంభీరములైన భావములకు బ్రభవములై రాయలవర్ణనములకు మహత్తరమైన యౌదార్యము చేకూర్చును. సంతతికి దంతములు చూపట్టగనే వనితలు పురుషసాంగత్యము నభిలషింతురను సంప్రదాయమును వనలక్ష్మి మాధవులయం దారోపించి రాయలు మనోహరమైన భావమును వెలిబుచ్చెను. ఇంక వసంతకాలము రాగానే లతావృక్షాదుల బుష్పింపజేయుటకై యవలంబింపబడు దోహదములలో నాయన వర్ణింపనిది లేదు. వసంతవర్ణనలో నించుక తక్కువగా సగ మీ దోహదముల కోలాహలమే. ఆయన దోహదపరిజ్ఞానము కూలంకషమైనది. ఈ దోహదముల యాథార్థ్యము పరిశీలించుటకు బరిశోధనలు చేయించినచో బ్రభుత్వమువారిప్పుడు తలపెట్టిన వనమహోత్సవమున కెంతో వన్నె చేకూరును.

కాలము మార్పునకు గ్రహచలనము హేతువు. ఏకాలమున నే గ్రహము లెచ్చెచ్చట నుండునో జ్యోతిశ్శాస్త్రము వివరించును. ఈ శాస్త్రమున జాతకభాగము మాట యెట్లున్నను సిద్ధాంతభాగము మాత్రము సిద్ధాంతమైనట్టిదే. రాయలవారి జ్యోతి

శాస్త్రపాండిత్యము గాఢమైనదే కాక యథామాన సంపాదితమైనది కూడ ననుటకు కావ్యమున ననేక దృష్టాంతము లున్నవి. ఆయన కాలమునూర్పును గ్రహచారవివరములతో సూచించును. జ్యోతిశ్శాస్త్రమునందలి యొక్కొక్క యంశముపై నాయన యొక్కొక్క వింత భావము నుత్పాదించుచుండును. వర్షకాలారంభము నాయన సూర్యుడు కర్కాటకమున ప్రవేశించుటతో నారంభించెను. అంతతో నూరకుండక మూడవ యెడకు చేరు తరణి ధరణి ప్రమోదసంధాయియౌట సోదాహరణముగా నిరూపించెను. ఒక పద్యమున నాతడు పుష్యాంగారకయోగ ప్రశంస తెచ్చియింద్రగోపములను రమణీయముగా వర్ణించెను. వసంతకాలావిర్భావము నాతడు తరణి యుత్తరాశకు బోవుటతో సూచించెను. "కినిసి వలరేడు దండెత్త నేతువనుట మీనమిలదో చుటుచితంబ, మేష మేమిపని యనగ నేల" యని మీన మేష సంక్రాంతుల నిరూపించెను. ఈ ఋతువర్ణనలలో రాయలజ్యోతిశ్శాస్త్రపాండిత్యము గంభీర భావసృష్టికి మూలమగుటయేకాక వాని కెపెనెపె నొకానొక శాస్త్రీయ గంభీరిమ నొడగూర్చెను.

రాయలు సార్వభౌముడైనను సామాన్య మానవుల యాచార వ్యవహారములను, మనోభావములను, సుఖదుఃఖములను పెక్కుచోట్ల నెంతో స్పష్టముగా వర్ణించియుండెను. ఆయన ధనికుల మహాభోగము లందును సామాన్యుల స్వల్పసౌఖ్యములందును సమానాదరము ప్రదర్శించెను. వేసవిలో జాతిఫల శకలములతో గలపి పొగిచిన చేపముక్కలు తిన్న కనరుపోవుటకై సంధ్యావేళల భోగులు "కేళికాంతారాభ్యంతరనాలికాస్థితి హిమాంతర్నారికేళాంబువుల సేవించుటవలెనే యాతడు వర్షమున గురుసంజెంచలి ముసుగాగల యాకుకూరలతో గూడిన భోజనము చేసి, కోమల్ పొలమువో గ్రేపుల్ మెయుల్ నాక" రెల్లు మేకెరువుల నుంపటి మంచ మెక్కుటయు వివరించినాడు. ధన్యులు తెలిపి వెన్నెల బయళ్లకు ననుభవించు భోగములతోపాటు కాపుసబ్బెతల పెనుబ్బలును పునాసలును హాలికులకు ఓసికిల్లిం బిసికిల్లు కల్పించుటయు విడువక వర్ణించెను. ఆతని దృష్టి యతినిశితమైనది; భావము సర్వసమత్వముతో గూడినది; ఊహ గంభీరసుందరమైనది.

ఋతువు ప్రవేశించినప్పటినుండియు క్రమముగా దల్లక్షణములు పెంపొందుచుండును. చివరికాలక్షణములన్నియు నొకదాని వెంట నొక్కటి యదృశ్యమై యాగామి ఋతుచిహ్నములకు దావొసంగుచుండును. ఈపరిణామమును రాయలు తన వర్ణనలలో గడుంగడు నిపుణముగా నిరూపించుచుండును. "కృతపయఃపానములైన మేఘపృథుకములకు వడగండ్లె పాలపండ్లు రాలి బలాకాద్విజాళి సంప్రాప్తించి క్రమక్రమముగా బెరుగ ధ్వనియు గంభీరమయ్యెనట! ఇది బలాకామాలికాసేవితములైన కాదంబినుల సాక్షాత్కరింప జేయుటయేకాక వర్షర్తువు క్రమముగా నెట్లు విజృంభించెనో తెలుపుచున్నది. ఎలగోలుజల్లుతో నారంభించి క్రమముగా మిన్నుమన్నేకముగా గురిసిన వృష్టిపరిణామ మీ పద్యమున నెంత సహజముగా వర్ణింపబడినదో చూడుడు.

ఎలగోలుజల్లు మున్పెళపెళ నేటవా
లువడి గాలినట్టిండ్ల దడిపె చనగ
నట్టెతో వడగండ్లకట్టావులు దుమార
మావులు రేచి రెంపెవదియు జన
మతివూడవది నిల్చి మెఱసి బిట్టుఱిమికి
కరవారిసృష్టి జీకటిగనలము
నుయ్యేలచేరుల యోజబైపై నెండి
జల్లుపై జల్లు పెల్లల్లు కొనగ
భూభిదాపాది దుర్భరాంభోభరంపు
కడిమరుజ్ఝంఝ పెరలక కడవ వంచి
నట్లుహోరని ధారౌఘ యైక్యమొంది
మిన్నుమన్నును నొకటిగా వృష్టిబలసె.

అతి సూక్ష్మప్రకృతి పరిశీలనమున్న గాని యిట్టి వర్ణనము కావించు సామర్థ్యము కుదురదు. ఇట్టి సామర్థ్యము రాయలవారన్ని ఋతువుల వర్ణించు సందర్భమునను బుష్కలముగా బ్రదర్శించినారు.

రాయలవారి రచన సర్వత్ర, ముఖ్యముగా వర్ణన సందర్భములం దాలంకారికమై యుండును. మొత్తము ఋతువులవర్ణనకై వినియోగింపబడిన రెండువందలపద్యములలో నేదో యలంకారములేని పద్యమే యుండెదు అందును నుపమోత్ప్రేక్షల సంఖ్యహెచ్చు. ఊహాబల మెంత విస్తారముగా నున్నను త్ప్రేక్ష యంత రమణీయముగా నుండును. రాయలవారి యూహావిన్యాసము నిదమిత్థమని వర్ణింప నలవి కాదు. ఆ యూహాబలముచే నాయన స్వర్గమర్త్యములకు సంబంధము కల్పించుచుండును. దినముల నెండబడి మున్నున్నుమున్నీటిలో గ్రోలిన నీటిలో చేరిన లవణఘట్టములనిరమ్మ్ర ద దావములు తమలోనిపెటిలించ నార్భటులేమో యనగా సాంద్రఘనాఘన గర్భగోళములు తటిద్భయంకర స్తనితములను సృజించెనట! వరజునెంబడిని రొంపిని ద్రొక్కుచుండ హాలికుల చరణముల బెనగినపసిడి చాయ కడుపులనీరుకట్టెలు దుక్కియందు వారి కిడిన బిరుదులేమోయన నొప్పారెనట! సర్వసాధారణము కాకపోయినను గల్పన యెంత సహజమనోహరముగా నున్నది! కవిశ్రేష్ఠులకేకాక హాలికశ్రేష్ఠులకును గండపెండేరముల నిడకుండ నుండలేకపోయెను

గాబోలు నాకవిసార్వభౌముడు. గ్రీష్మమున పెనము మీద బిండిపోయగా జుట్టుసెగసిన కట్టావివలె నాడిది యెగయ భూమండలమును పెనమున మాపటి పండువెన్నెల చకోరపోత వితతికి జాపట్టు పోసిన విధముగా నొప్పారెను. "గ్రామ గ్రామంబున నొక సామంతుని కిడిన చలువచప్పరములు తిగ్చె మేదిని సంపటిలో దామరలవలె నట్టితఱి" నొప్పారెను. ఇచ్చటి యుపమాన మెంత స్వతంత్రసుందరముగా నున్నది! శరత్తున శాలిమంజరులు పండి ముదురై వాడి ముంగ్లతో గూడియుండెను. అవి విష్ణువు నిద్రమేల్కొని భూదేవిపై నఱగిడగా నామె మేన బొడమిన పులకలవలె నొప్పారెనట! ఇట్టి భావనా సౌందర్యము లేని పద్యమొకటియు నీ ఋతువర్ణనలందు లేదు. ప్రతి పద్యమునందు నేదో యొక విశిష్టమైన భావవిశేషము గోచరింపకుండ నుండదు. ఇందు సహజమైన భావనకంటె నసహజములు సమయబద్ధములు నైన యూహ లతిశయించినచోట్లును గొన్ని గలవు. కాని యుదాత్తమైన గాంభీర్యము మాత్ర మెచ్చటను గొఱతపడి యుండలేదు.

రాయ లింత గంభీరముగా నీ వర్ణనల సాగించుచునే యెడనెడ శృంగారమిశ్రితమైన చక్కని హాస్యరసోక్తుల నెల్లడించినపట్లును గొన్ని గలవు. గంభీరముగా మొదలిడిన వర్ణన సాగి సాగి చివరికి దరహాసము కలిగించు సరసోక్తితో ముగియుట యిట్టి పద్యములలో గానబడు పరిపాటి. వర్షకాలమున రవిజూచి కుకుచువారలకును గృకలాసములకును దృష్టిమిన్నులనె నిలుచుట మున్నగు విషయముల వర్ణించుచు జివరిగీతము నాయన యెట్లు ముగించెనో చూతము.

అతిథిసంఘంబునకు నీనినట్టి యెనుప
కదుపులే గలగమికి వాగట్టు లెసగె
మంటిమిద్దెలవారికి మరుపనులకు
నెలత వాసినవారికి నిదుర చెడియె.

పైయారంభమున కిట్టి యుపసంహృతి కలుగునని మనము భావింపము. ఇల్లే వంటవండు నిల్లాండ్ర క్లేశము వర్ణించి వర్ణించి యాతడా సీసమును,—

ఆజ్యపటుమఖ్యులయ మెన్నరాల యాండు
దారులయ మెన్న రంతిక కౌరజనిక
వచన నాంధో గృహిణిరామి బడకమరుడు
వెడవెడనె యార్వ నొగిలి రజ్జడిని గృహులు.

అని ముగించును. వేసవిలో బాంథు డొనరించు వికార చేష్టలు చూడుడు. దప్పికచే బ్రపజేరి యమ్మయక్క యని తూలుచు దోయి లొగ్గి ప్రపాప్రపాలిక లొసంగిన పానీయముచే వడ తేర ముందటి వాక్యము లెన్నిక యాతడు "మోముసుబ్బులున్ గడకొను కక్షదీధితు లెగాదిగ జూడ"నారంభించునట! అట్టి పాంథుల జూచి పానీయము పోయు పాత్రముల మొగములపై విసరక సరసురాంత్రైన యాప్రస్త్రీలు సన్నలచే నవ్వుచుండురట. వారు నవ్వుట మాట యెట్లున్నను నీపద్యము చదువునప్పుడు సహితము మ త్రేము నవ్వు రాకతప్పదు.

ఈవిధముగా రాయలవారి ఋతువర్ణనలు భావగాంభీర్యమునకును, ప్రకృతి పరిశీలన నైపుణికిని, సరస వాక్చాతురికిని నాలవాలములై యితర కావ్యములలోని వానికంటె నొకవిధమైన వైలక్షణ్యము కలిగియున్నవి. అసలు రాయలవారి రచనమే ప్రౌఢమైనది. ఈ వర్ణనలు మఱింత ప్రౌఢములుగా నున్నవి. ఒక్కొక్క ఋతువునుగూర్చి యింత భావసామగ్రి యాయన యెట్లు సమకూర్చినాయని చదువరుల కచ్చటచ్చట విస్మయము కలుగుచుండును. కొన్నిచోట్ల నాతడొక వస్తువును వర్ణించి మఱికొంత దూరమేగిన తరువాత మరల నావస్తువునే వర్ణించుట కందుకొనుచుండును. ఒకే వస్తువునకు సంబంధించిన భావములన్నియు నొకచోట నుండుట సహజము. అట్లుకాక యవి యందందు చెదరియుండుట కొంత వింత కలిగించును. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిలవారి ఋతువర్ణనలలో నితర కవుల పద్యములు కూడ కొన్ని చొచ్చియుండవచ్చునని యొక సందర్భమున జెప్పియుండిరి. ఇందలి భావవైచిత్రిని, వస్తుగ్రహణమందలి పునరుక్తిని దిలకించినచో నీయభిప్రాయము సమంజసమే యని తోపక పోదు. వర్షకాలవర్ణనమున వడగండ్లయు నింద్రగోపములయు వర్ణనములు రెండుమూడు చోట్ల గానవచ్చును. శరత్తున దెల్లని మొయిళ్ళవర్ణనము పునరుక్తమైయున్నది. వసంతమునందలి దోహదక్రియల వర్ణన మనేకకర్తృకమై యుండుట కవకాశమున్నది. కవులతో బ్రసంగించు సందర్భమున నాయావస్తువులగూర్చి వారిచే బద్యములు చెప్పించి యందు దనకు రమణీయములని తోచినవానిని రాయలు తన కావ్యమున జొప్పించెనేమో యనిపించును. కేవలవర్ణనలేకావున నట్లు చొప్పించినను గథాభాగమున విషయవిపర్యయము వాటిల్లదు. అదియే యీ వర్ణన లింత దీర్ఘతరములుగా నుండుటకుగూడ హేతువేమో! కాని పద్యరచన మాత్రమంతటను నొక్కమాదిరిగా నున్నది. ఆ ప్రౌఢత, కూర్పు, పదప్రయోగము అన్నిపద్యములందును సమానమే. అది పై యభిప్రాయమున కించుక బాధకము. ఈ వర్ణన లెట్లైవరిచే వ్రాయబడి యిందు జొచ్చినను రమణీయములును, అసాధారణములును, నుదాత్తములునై యున్నవనుటలో మాత్రము సందేహము లేదు.

# కోయిలమ్మ



శ్రీ కాసూరి హనుమంతరావు

ఈ తొలిసంజవేళ నెవ
రేయెల్ల కోయని నిద్రపోవునా
లేతమనస్సునున్ నిదుర
లేపెదువారలు?- ప్రాసఛందముల్
కైతలటంచు నెంచుకొని
కమ్మని తెన్గను బాడు సేయుచూ
జాతిని నిద్రనుండి గుర
జాడ కవీంద్రుడు లేపినట్లుగా.

తొలిగాలుల కౌగిలులో
కిలకిల నగి, యుదయభాను కిరణమ్ములలో
మిలమిల మెరసెడి చిగురా
కులమాటున బాటపాడు కోయిలగంటిన్.

నన్నపార్య్వసమానముకన్న, కీట్సు
'ఊహ'కన్న రవీంద్రుని 'ఉపమ'కన్న
నామనోహరి మోవిపై నవ్వుకన్న
తీయగా, హాయిగా పాడె కోయిలమ్మ.

"పలుకులందెల్ల మెత్తన తెలుగుపలుకు
తెనుగుకైతల మధురమ్మ తేటగీతి,
తేటగీతికకన్న నీ పాట యింపు,
ఆపకే ఆపకే నీదు అమరగీతి."

కర్కశ కఠోర శిలలెల్ల గరగిపోవ
నవని పులకింప మోడులే చివురులెత్త
కవుల హృదయాలు మారు మ్రోగంగ
నిపుడు
జగతి నింపవె నీదు స్వచ్ఛందగీతి.

ఈ యుషోదయసౌందర్య మినుమడించె
సంధ్య నీగాన పారవశ్యతను దోగె

కోయిలా కోయిలా యెందుకే యివేళ
నీదుగానమ్ములోన విషాదగతులు?

పొంగి హృదయమ్ములోనుండి పొరలిపోవు
నీవిషాద మాకసమంత నిండిపోయె
దాచుకోనేల నీవిషాదమ్ము నేడు
వింటివింటిని లే నీదు కంటినీరు.

చావు బ్రతుకుల మధ్య తేల్పంగ లేక
మిగుల వేదనబడెడి హేమ్లెట్‌ను వలచి
ప్రేమమరణమ్ము పొందు ఒఫీలియాయు
నీవలెనె పక్షిగాబోలు...

పాడవే పాడవే హృది పగిలిపోవ
మధురమధురాతి మధురమౌ విధురగీతి;
జగతి మధురకావ్యములు విషాదభావ
పూరితములై, నిట్టూరుపుల్ పుచ్చు
నవియె.

క్షణముక్షణమును మారు నీ జగతియందు
రెండుమాత్రము మారకే యుండిపోవు—
కళ కళకొరకే యనెడు నీగాన ఫణితి,
ఆపగారాని నాదు కళాపిపాస.

నందగోపాలు వేణుగానమ్ములోన
లీనమౌ రాధికాసతి లీల నేను
గాన పారవశ్యతను లోకమ్ము మరచి
యెంతసేపుంటినో యేమొ యెవ్వడెరుగు?

మొయిలుసందులలోనుండి పయికివచ్చు
కిరణమటుభావ మొక్కటి మెరసె హృదిని
కలుగుగాక పునర్జన్మ, కలుగుగాక
అమరమౌధన్యమౌ కోయిలమ్మ బ్రతుకు.

# సర్వసుందరి 

శ్రీ అనుముల వెంకటశేషకవి

## 1

యౌవనమదం ఉన్మాదాన్ని కలిగిస్తుందంటారు. కాని, రాజకుటుంబాల్లో తుపానులే చెలరేగిస్తుంది. ఆ తుపాను దెబ్బ కెందరి ప్రాణాలు హతాహతమౌతాయో, ఎవరు లెక్కించగలరు? సుందరీ సుందరు లెంతమంది కేవలానందానికి గాక—రాజ్యాధికార వ్యామోహంతో—సూక్ష్మాతిసూక్ష్మంగా కళానైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ సదమదమౌతారో, చరిత్ర వెల్లడించదూ?

అనార్కలీ సైతం అలాంటి స్వప్నాలనుభవిస్తూ షాహజాదాసలీమును కన్నుగీటి, అక్బరు నిగాలో అణగారిపోయింది. పాపం! ఆ సజీవ ప్రతిమ ఏ తత్పరిణామంగా శిలాస్తంభంలో పాతిపెట్టబడింది. నిప్పుతో చెర్లాటమాడితే చేతులు కాలవూ?

సలీముకు మాత్రం ఎలాంటి శిక్ష విధింపబడిందో యెవ్వరూ చెప్పిన పాపాన పోలేదు. మొగలు సామ్రాజ్యభవిష్యచ్చక్రవర్తి యెన్నాళ్ళవరకూ యితర సుగంధి కుసుమాలను వాసన చూడలేదో?—ఈ సంగతి కూడా అగమ్య గోచరంగానే ఉండిపోయింది.

ఇతిహాసంలో మనకు తెలియవచ్చే దేమిటంటే—షాహజాదాసలీము హృదయంలో కంటకం మోస్తరుగా ఒక నవీనసుందరి మెహరున్నీసా పేరుతో గ్రుచ్చుకొనిపోయింది. ఆ కంటకాన్ని సహా అక్బరుచక్రవర్తి తన నిగాలోకి తెచ్చుకున్నాడు. వెంటనే బర్ద్వాన్ వీరశాసకుడైన షేరాఫ్గన్ పాలిటి పంచామృతప్రాయంగా దాన్ని ప్రసాదించి ఊరుకున్నాడు.

ఒకటేవిధమైన దోషానికి రెండురకాల శిక్షలా? ఎందుకిలా ప్రవర్తించినాడో అక్బరు?—ఈ సంగతి కూడా చరిత్రకారులు విమర్శించలేదు. మొదటి నేరస్థురాలికి మృత్యుదండనమూ, రెండవదానికి వివాహోత్సవమూ, ఇదే కాబోలు పాదుషా న్యాయం?—ఐతే, అడగడానికి గుండెలున్నవాళ్లెరి?

ఆలోచిస్తే స్ఫురించే దేమిటంటే—అనార్కలీ స్వయంగా సలీమును ప్రేమించి అనర్థానికి హేతుభూతురాలయింది. మెహరున్నీసాయో? సలీముచేత ప్రేమించబడిందే కాని, స్వయంగా పూనుకోలేదు. కావచ్చుగదా?—అందుచేత శిక్షల్లో యీ అంతరం ఏర్పడి ఉంటుంది.

అక్బరు యీ కంటకాన్ని యీవిధంగా తొలగించి సంతృప్తిపడగల్గినాడు. వీరాధివీరుడైన షేర్ అఫ్గను చేతుల్లో ఆమె సురక్షితంగా ఉంటుందనీ, ఆ వంకకు సలీము తేరిచూడనైనా సాహసించడనీ అనుకున్నారు. కాని, ఆ ఊహ పొరబాటని రూఢిగా యితిహాసం నిరూపించింది.

అనార్కలీని సలీము పూర్తిగా మఱచినాడు. కారణం—ఆమె యీ ప్రపంచంలో చేతికందని పదార్థం కావడమే కావచ్చు. కాని, మెహరున్నీసా కంటకప్రాయంగానే హృదయంలో గుచ్చుకొని ఉండసాగింది. ఆమె అన్యాంతఃపురంలో బ్రదికే ఉందిగా?...

మెహరున్నీసా అందచందాలూ, ఆమె కీర్తీ—ఆమెకంటే ముందుగానే బరద్వాన్‌లో ప్రవేశించినాయి. ఆ నగరంలోని స్త్రీలూ, శిశువులూ, వృద్ధులూ, ఆ లావణ్యవతి దర్శనార్థం తటపటాయించిపోతున్నారు.

మెహరున్నీసాకు స్వయంగా తాను అద్వితీయ సౌందర్యవతిననే గర్వం ఒకటి ఉండేది. తన తళుకు బెళుకులవల్లనే ధరణీశ్వరులనంతా పరిపాలించగలననే విశ్వాసం పూర్తిగా ఆమెలో పాదుకొనిపోయింది. అందువల్ల నగరానికి నగరమే తన్ను చూడడానికి రావడంలో ఆశ్చర్యమేమీ లేదనుకొని, సంతోషపడసాగింది. అందఱూ చూడడానికి అనువుగా ఒకసారి జనమధ్యంలో ప్రవేశించి, ప్రత్యేక సింహాసనాన్ని అలంకరించి, మౌనంగా ఊరుకుంది. ఇతరులతో ప్రసంగించడం తన దర్జాకు లోటు!—ఐతే, వారంతా తన్ను గుఱించి యేమనుకుంటారో వినాలనిమాత్రం లోపల ఆశ. అందుకోసం వీనులు మాత్రం హెచ్చరికగానే నిక్కబొడుచుకున్నాయి. వృద్ధస్త్రీలు మామూలుగా ఆమెను కండ్లకద్దుకున్నారు. యువతులు, "వహవ్వా, వహవ్వా!" లతో ప్రశం

నిస్తున్నారు. ఒకమూలలోమాత్రం కొంతమంది కన్యకలు గుసగుసలాడసాగినారు.

మెహరున్నీసా వీనులు జాగ్రత్తగా ఆవంకకు పనిపట్టినాయి. మాటలు స్పష్టంగా వినిపించసాగినాయి. "అమ్మో! నా అందమా? ఏముందే యిందులు చూడటానికి? వట్టిబడాయి తప్ప! నాకేమీ కౌన రావడంలేదు. మన ఊళ్ళో సేటు చతురసేను పెళ్ళాం, ఎన్నో రెట్లు చక్కదనాల చుక్క కాదూ? ఆయిల్లాలి కాలిగోటికైనా యీమె బలాదూరుసుమా!"—అంటూ ఒకతె ఆక్షేపించింది.

"నీకేమో మృత్యువు దాపురించినట్టుందే?"—అని వేరొకతె దబాయించింది.

"ముంజేతి కంకణాని కద్దమెందుకే?"—అంటూ మొదటివ్యక్తి తన వాదాన్ని సమర్థించుకుంది.

మెహరున్నీసా యీ సంగతిని కొంగున మూటగట్టినట్టు భద్రపఱచుకుంది. క్రమంగా చూడవచ్చిన జనమంతా సన్నగిలి పోయింది.

అంతఃపుర ప్రవేశం కాగానే, దాసీలంతా బారులు తీరి నిలుచున్నారు. సుగంధతైలాలూ, సుందరవస్త్రాలూ తయారుపెట్టినారు. కాని, ఒక్కరినైనా సమీపానికి రానీయక మెహరున్నీసా నిరోధించింది. "వంగదేశం సౌందర్యానికి గొడ్డుపోయినట్టుందే? అప్సరసల వంటి అందగత్తెలుంటారనుకున్నాను. నా ప్రారబ్ధానికి మీరాదాపురించారు? ఛీ! దూరంగా వెళ్ళిపొండి!"—

అవమానపడి, అవనతవదనలై, అంతా అక్కడే నిలుచున్నారు. అంతలో షేరాఫ్గన్ అంతఃపురంలో ప్రవేశించి నిప్పులొలికే నేత్రాలతో నిరుత్సాహంగా కనబడుతూన్న బేగంసాహెబా వంక చూచినాడు. "ఇంకా నీవు..."

"ఇలాగే కూర్చున్నావు. దుస్తులైనా మార్చక—" అని కదా మీరు హెచ్చరిస్తూన్నారు? కొంచెమైనా కళాదృష్టి లేని యీ పరిచారికలతో నాకు సాధ్యంకాదు. మన్నించరూ?—

షేరాఫ్గన్ : గుల్నార్! ఇలారా!—(అనగానే ఒకదాసీ ముందుకు వచ్చి నిలిచింది.)

మెహరున్నీసా : దూరంగా నిలు! అందచందాలకు శరీరచ్ఛాయమాత్రమే ప్రధానంకాదు. ఆమోటు చేతులూ, స్థూలశరీరమూ—అబ్బా! అసహ్యమొస్తున్నావు. పో, పో!—అని యీసడించింది.

షేరాఫ్గన్ : గుల్షబ్బా! ముందుకురా!—

మెహరున్నీసా : వహవ్వా, గుల్షబ్బా! నీకు పేరుపెద్దా, ఊరుదిబ్బా అనే సామెత సరిపోతుంది. నీలమేఘచ్ఛాయకదనే? హాయ్, హాయ్!—

షేరాఫ్గన్ : నజీబా! ఎక్కడున్నావు? ..

మెహరున్నీసా : దురదృష్టమంతా నీమొఖాన్నే తాండవిస్తుంది. చాలు! సమీపించడానికి సాహసించకు...

షేరాఫ్గన్ : గోషత్ జహాం!—బేగంసాహెబాకు నీవే తగినదానవనిపించుకో!—

మెహరున్నీసా : బొగ్గుకు దివ్వెపేరు పెట్టినట్టుంది. ఆగు!—

షేరాఫ్గన్ : హసీనా! నీవురా!—

మెహరున్నీ : ఏమి హసీనావే? కాటుకకొండా రమ్యంటే బాగుండేదేమో?

"ఇంతమందిలో ఒకరూ నీకు నచ్చలేదా?"—అంటూ షేరాఫ్గను విస్తుపోయినాడు.

"లేదు; ఇందులో నాదోషం?"—అని మెహరున్నీసా పలికింది.

"పోన్నాళ్ళు ఓర్చుకో!—రేపే కొంతమందిని ఆగ్రానుంచి పిలిపిస్తాను."—

"ఎందుకూ? అంత మాత్రం వాళ్ళెవరూ బర్ద్వాన్‌లో లేకనా?"—అని మెహరున్నీసా ప్రశ్నించింది.

"సింహాలవేటలోనే నా నైపుణ్యం కాని, సింహమధ్యలను అన్వేషించడంలో కాదు"—అన్నాడు షేరాఫ్గను.

"ఆ సంగతి నాకు బాగా తెలుసు; మీరువట్టి అమాయకులని—వచ్చీ రావడంతోనే పత్తా తీసనందుకైనా, నాకు బహుమాన మేమిస్తారుమరి? చెప్తా, వినండి! ఈ నగరంలో సేటు చతురసేను యిల్లాలొక్కతే చక్కని చుక్క; ఆమెను నాదగ్గఱకు పిలిపించండి!"—అని పర్యవసానం. బయటపెట్టింది మెహరున్నీసా.

"ఏమన్నావు? సేటు చతురసేనే?—అతడీ నగరానికంతా ముఖ్యుడైన వర్తకుడు. నాకంటే అన్నివిధాలా ధనవంతుడు. షాహజాదా అక్బరుకు తెలిస్తే నాయున్నబ్బారీకి గండం తప్పదు. చేతులు కాలేపనికి నన్ను పురికొల్పకు!—" అన్నాడు షేరాఫ్గను.

"ఈ మాత్రపు మొదటి ముద్దైనా చెల్లించ డానికి మీకు సామర్థ్యంలేదా ? జ్ఞాపకముంచు కోండి! సింహాలనేకాని, సింహమన్యలను వేటాడడం మీ స్వభావం కాదని యిప్పుడే ఒప్పుకున్నారు. ఇది మాత్రం తప్పదు. ఈనాడే యిక్కడికి చతుర సేనుని స్త్రీ వచ్చితీరాలి. లేకపోయిందా, యీ వజ్రాన్ని నూరి త్రాగి పడుకుంటాను. అప్పుడు తెలు స్తుందిగా ? శహంషహా అక్బరు మీ మున్సబ్దారీ హెచ్చిస్తాడో తగ్గిస్తాడో? నేను మాత్రం మీకు దక్క," నంటూ మెహరున్నీసా పట్టుపట్టింది.

షేరాఘను నమ్రుడైనాడు—"నీ హుకుము పాలించబడుతుంది. విచారించకు!"—అన్నాడు. వెంటనే సేటు చతురసేనుకు ఒక లేఖ వ్రాసిపంపి నాడు. "బేగం సాహెబా తమ బీబీసాహెబాను చూడగోరింది. వెంటనే ఆమెను పంపండి! గుఱ్ఱపు బగ్గీ అందుకోసం పంపుతున్నాము—" అని.

చతురసేనుడా లేఖ పఠించి, చకితుడైనాడు. తన వృద్ధజనకునికీ, యిల్లాలికీ చదివి వినిపించినాడు.

సర్వసుందరి సలహాతో చతురసేను జవా బిచ్చినాడు; "నూతన దంపతులైన తమ రిద్దఱికీ మా కుటీరంలో విందు చేస్తున్నాము. వచ్చే టేదీ—వేళా— ముందుగా తెలిపి దయచేస్తే, సర్వసుందరి బేగం సాహెబా అనుగ్రహంతో తన అదృష్టాన్ని హెచ్చించుకోడానికి ప్రయత్నిస్తుంది. తమ హుకుము నిరీక్షిస్తున్నా" మంటూ.

తిరుగు జవాబు రానేవచ్చింది. మొదటి హుకుమునే పరిపాలింపక తప్పదని. కొందఱు సిపా యిలు కూడా వచ్చి సర్వసుందరీదేవిని మహలులో హాజరు పఱచమని హెచ్చరించినారు. ఇంతటి అవ మానాన్ని తాను సహించలేననీ, వెంటనే గౌరవం నిలబెట్టడానికి ప్రయత్నించమనీ, యింకొకసారి చతురసేను ప్రార్థించినాడు.

ఈసారి షేరాఘను స్వయంగా విచ్చేసినాడు. చతురసేనుని కుటుంబమంతా—అతని ముసలితండ్రీ, భార్యా, కూతురూ—పరుగెత్తి పోవడానికి ప్రయ త్నించినారు. కాని, అంతకుముందుగానే ఇంటి చుట్టూ పారాతయారయింది. చతురసేను ఖడ్గమాత్ర సహాయంతో పోరాడిపోరాడి తుదకు హతుడైనాడు. సర్వసుందరి నిర్బంధింపబడి మహలులో మెహ రున్నీసా యెదుట హాజరు పెట్టబడింది. చతురసేనుని తండ్రీ, కూతురూ, మతిభ్రష్టులు కావింపబడి, విడువ బడ్డారు.

అంతఃపురంలో సుందరీమణు లిద్దఱూ, ఒకరి వంక కొకరు చూచుకున్నారు. మెహరున్నీసా విజయగర్వాన్ని సూచించే నేత్ర విక్షేపంతో, "దేఖోజీ! నేటినుంచీ నీవు నా అంగరక్షకు రాలవు. ఈ నా అంతఃపురంలో ఉన్న దాసీలకు రాణివి. నీకు నే బెట్టుకున్న ముద్దుపేరు జులేఖా. తెలి సిందా ?—" అని హెచ్చరించింది.

"నా ప్రాణాలు కూడా తీయించి ఆ కాస్త పుణ్యం కట్టుకుంటే బాగుండేదిగా ?" అనింది సర్వ సుందరి, విషాదంతో వెక్కి వెక్కి యేడుస్తూ.

"కంగారుపడకు ! గతజల సేతుబంధన మెందుకూ ? నా ప్రాణానికి ప్రాణంగా నిన్ను చూచుకుంటాను. ఏమాత్రం నీకు లోపం రానీయ" నంటూ బేగంసాహెబా బుజ్జగించింది.

"నా యిల్లు పాడుచేసినావు, నాలలాటరేఖ మార్చినావు; నా సిందూర తిలకాన్ని తుడిచి వేయించి, నా కుమార్తెను నాకు దూరంచేయించి, బ్రదికించడం మంచిదికాదేమో ? ఆలోచించుకో ! నన్నుగూడా హతమార్చితే,లోకంలో ఒకతే సుందరి మిగిలిఉంటుంది. ఆమె మెహరున్నీసా మాత్రమేనని ప్రపంచం ప్రశంసిస్తుంది"...అని సర్వసుందరి నిర్భ యంగా పలికింది.

"దే ఖోజీ! ఈ పురుషజాతి గుణమే యింత!— నీ భర్తమూర్ఖుడై నిన్ను పంపడానికి నిరాకరిస్తే, నాభర్త అంతకంటే మూర్ఖుడై అతన్ని వధించి నాడు. ఇక నీవా సంగతి మఱచిపో ! నీవు కోరితే యీ క్షణంలో నీ బిడ్డను పిలిపిస్తాను. ఇక్కడ నీకేమీ యిబ్బంది ఉండదుసుమా !" అని మెహ రున్నీసా యెంతో దయతో మాటలాడింది.

"ఇంకా యిబ్బందులేమిటి ? నాశరీరం దహించుకోపోతూంది. నన్ను మిగిలిస్తే ఎన్నటికైనా మిమ్ముగూడా దహిస్తానేమో ? ఆలోచించండి!"— అని సర్వసుందరి తన మనోవ్యథను ప్రకటించింది.

"నీవు సామాన్యురాలవు కావనే సంగతి గ్రహించినాను. నాభర్తను లొంగదీసుకో గలవనే అనుమానం నాకు లేకపోలేదు. కాని, నేను తగినంత జాగ్రత్తలో ఉంటాను. పరపురుషులమాపు నీపై పడ బోదని గ్రహించు !"—అని మెహరున్నీసా హేళ నగా పలికింది.

"ఈనాడు నన్ను నీ వొకరీతిగా అర్థంచేసు కున్నందుకు విచారిస్తున్నాను. నేను హిందూ కాంతను. ద్వితీయవివాహానికి పూర్తిగా విముఖు రాలను సుమా !"—అనింది సర్వసుందరి యేడుస్తూ.

"సరే! మంచిమాట. ఇంతటితో నీ జిద్దు వదలి పెట్టు ! ఇంకా నీ హృదయంలో విషాదం మాని

పోలేదు. తిన్నగావెళ్ళి విశ్రాంతి తీసుకో! నీ కుమార్తెను పిలిపిస్తాను. నిన్ను నాప్రాణపదంగా చూచుకుంటాను. నన్ను విశ్వసించవూ?" అని మెహరున్నీసా ఆమె నోదార్చింది.

మఱునాడు విచారించగా సర్వసుందరి కుమార్తెతో ఆమె ముసలిమామగారు మాయమైనట్టు వార్త వచ్చింది. ఎంత వెదకించినా పత్తా దొరకలేదు.

లాలీతల్లి, సర్వసుందరి, మెహరున్నీసాకు చెలికత్తె కాక తప్పలేదు. ఆమె మరణించగలదు; కాని కసితీర్చుకోక చావడానికి హృదయం సమ్మతించడంలేదు.

దినమంతా సేవచేయడం—రాత్రి కసి తీర్చుకునేందుకు ఉపాయాలు వెదకడం—ఈవిధంగా ఆమెజీవితం గడుస్తూ పోయింది. అప్పుడప్పుడూ తనకుమార్తెను చూడడానికి సుఖస్వప్నాలు కనడం కూడా అలవాటయింది.

సర్వసుందరిని మెహరున్నీసా చాలా ఆదరించింది. ఆమె కేవలం పరిచారికమాత్రమే కాదు; ప్రాణసఖి; సలహాలిచ్చే మంత్రికూడా.

సర్వసుందరి తలచుకుంటే విషమైనా యిచ్చి మెహరున్నీసా అంతాన్ని చూడగలదు. చాలాసార్లు ఆవిధంగా కడతేర్చడానికి సమయాలు నిరీక్షించింది. కాని, ఒక్కటే సుఖ నిద్రపోనిచ్చినందువల్ల, లాభం లేదు. "ఆమె హృదయాన్ని చేతనైనంత దుఃఖపెట్టిగాని చంపగూడదు; అప్పుడే తన కసితీరడానికి అవకాశం దొరికినట్టు. అసలు చావులో ఏముందీ? జీవితాంతం ఏడ్పిస్తే చాలు! అందుకుఉపాయం?"—అనుకుంటూ కాలం జరిపింది.

కొన్నిసార్లు, షేరాఫ్గనుకే విషమిచ్చి చంపితేనో?"—అనే ఊహకూడా ఆమెలో పొటమరించింది. మేహరు—అనాధగా మాఱిపోయి తన వలెనే యేడుస్తూ..."అబ్బె! అందులోనూ లాభం లేదు. మేహరు హిందూ సుందరికాదుగా? ముసల్మానుసుందరి; తప్పక రెండో పెండ్లిచేసుకుంటుంది. ఆమె సౌందర్యం చిరకాలవైధవ్యాన్ని రూపుమాపడానికి సహాయపడితీరుతుంది. అప్పుడో?—ఈ విధంగా తర్కవితర్కాలుమితిమీఱినాయి. ఇంతకూ ఏవిధంగా నూ కసి తీర్చుకోలేక సర్వసుందరినిత్యనూతనోపాయాలు అన్వేషిస్తూంది. సంవత్సరం మీద సంవత్సరం గడచిపోసాగింది.

## 2

అక్బరుపాదుషా అనంతరం సలీము సింహాసనమెక్కినాడు. జహంగీరు బిరుదుకూడా ధరించినాడు. అతనిహృదయంలో అప్పటిగ్గూడా మెహరున్నీసా రూపం కంటక ప్రాయంగానే గ్రుచ్చుకొని ఉండిపోయింది. అతడామెనే మాత్రం మఱచిపోలేదు.

బర్ద్వాన్‌లో గడబిడ బయలుదేఱింది. సింహాలను వేటాడే వీరశాసకుడు షేరాఫ్గను 1607 మార్చి 30 తేదీన హతుడైనాడు. ఈ హత్యలో జహంగీరు చేయి ఉందో, లేదో ఈశ్వరుడికే తెలుసు. ఐతిహాసికుల్లో ఈ విషయాన్నిగుఱించి అనేకమైన మతభేదాలున్నాయి.

చచ్చేవాడు చచ్చినాడు. కాని, బ్రతికేవాళ్లకు బ్రదుకుదెరువునుగుఱించిన భయం పట్టుకుంది. చరిత్ర మనకు విశదీకరించే విషయ మేమంటే—మెహరున్నీసా మొగలాయి రాజమహాలులో ప్రవేశింపక తప్పలేదు. ఆమెతో గూడా జులేఖా సైతం అక్కడే చేరింది.

అంతఃపురంలో రాజమాత సన్నిధిలో (అంటే అక్బరు పట్టపురాణి దగ్గఱ) మెహరున్నీసా మెదలసాగింది.

పూర్వచరిత్ర సమాంతం మార్చడానికి జహంగీరెన్నోపాట్లు పడినాడు. కాని, మెహరున్నీసా గతించిన భర్తను తలచుకుంటూ, జహంగీరు సంబంధాన్ని తృణీకరిస్తూ, కాలక్షేపం చేయడానికి ప్రారంభించింది.

పాపం! జహంగీరు హృదయంలోనో? ఆనాటికానాటికి, ఆమెమీది వ్యామోహం పెరిగిపోసాగింది. దినదినానికి మేహరు తృణీకారం కూడా అదే అంతస్థులో ఉండిపోయింది.

అన్నివిధాలా ప్రయత్నాలు నిష్ఫలాలుకాగా, జహంగీరు తుదకు జులేఖా పాదాలమీద తన శిరస్సుపెట్టి యీ విధంగా ప్రార్థించినాడు. "నీవు మెహరున్నీసాకు ఛాయవనే సంగతి తెలుసుకున్నాను. ఆశ్చర్య మేమిటంటే?—ఛాయైనా ఒక్కొకసారి మనిషిని వదలి దూరమౌతుంది; కాని, నీవో? ఆవిడనెప్పుడూ విడిచిపెట్టవు. నేడు భారతసామ్రాట్టు నీ పాదాలు పట్టుకున్నాడు; మెహరున్నీసాకు నిఖా కట్టించే భారం నీవు వహించాలి సుమా!—"

ఆనాటివఱకూ జులేఖా మనసులో, మెహరున్నీసాను విధవగానే ఉంచి తమాషా చూడవలెననే భావం ఉండేది. కాని, యిప్పుడో? భారత చక్రవర్తి తన పాదాలపై బడి ప్రేమభిక్ష పెట్టించమని ప్రార్థిస్తున్నాడు. ఆమె హృదయం కరగిపోయింది. వెంటనే సాధ్యమైన సహాయం చెయ్యడానికి జులేఖా చక్రవర్తికి వాగ్దానమిచ్చింది.

ఇంతవఱకూ జహంగీరును సహించి మెహరున్నీసా హృదయంలో విషం నింపసాగిన జులేఖా, యిప్పటి నుంచీ ఆ విషాన్ని విరుగడచేయడానికి ప్రయత్నించింది. స్త్రీప్రకృతి మిక్కిలి విచిత్రమైంది కదా? జీవితాంతమూ వైధవ్యంతో కుమిలించి కుమిలించి మెహరున్నీసా మీద కసిదీర్చుకో దలచిన జులేఖా—ఆమె నిప్పుడు భారతసామ్రాజ్ఞిని చేయడానికి ప్రయత్నాలు సాగించింది. ఇందుకు జహంగీరుపై గల కృతజ్ఞతయే హేతువేమో? తన భర్తను వధించిన షేరాఫ్గనును వధించిన వాడు జహంగీరు కాక వేఱెవరు?

ఆడించినట్టంతా ఆడసాగిన మెహరున్నీసాకు జులేఖాలో కలిగిన యీ మార్పు మాత్రం అర్థం కాలేదనే చెప్పవలసివస్తుంది. ఏ తత్పరిణామంగా చరిత్రలో నూతనాధ్యాయం వెలసింది. షేరాఫ్గను గతించిన నాలుగు సంవత్సరాలా మూడు నెలల నాటికి మెహరున్నీసా జహంగీరును వివాహ మాడడానికి సమ్మతించింది. నూర్మహలు పేరుతో ఆమె జహంగీరు సింహాసనంలో పాలుపంచుకుంది.

చరిత్రలోగూడా విశదీకరించబడిన సంగతే కదా?—క్రమంగా నూర్మహలు చేతుల్లో జహంగీరు కీలుబొమ్మగా మారినాడు. నూర్మహలు సామ్రాజ్య చక్రాన్ని స్వేచ్ఛగా త్రిప్పసాగింది. అందులో ముఖ్యాతిక ముఖ్యసం జులేఖాసామర్థ్యమే నేమో? నూర్మహలు కనతికాలంలోనే నూర్జహాను బిరుదు సార్థకమైపోయింది.

## 3

జహంగీరు పుత్రులు నలుగురూ;—ఖుస్రూ, ఫర్వేజ్, ఖుర్రం, షహర్యార్. ఈ నలుగురూ సామ్రాజ్యాపేక్షతో ఉబ్బితబ్బిబ్బౌతున్నవాళ్ళే. అందఱిలో ఖుర్రం, సమర్థుడూ, వీరుడూ అని పేరొందినాడు. ఖుర్రం తల్లి రాజపుత్ర స్త్రీ. కాబట్టి యితనినే సింహాసన మెక్కించడానికి రాజపుత్రులుద్యుక్తులైనారు.

ఖుస్రూ బుద్ధి తీవ్రమయింది కాదు. జహంగీరుకు గానీ, నూర్జహానుకు గానీ, అతడంటే అ యిష్టం. పై పెచ్చు సహాయం మెవ్వరూ లేరు. ఐనా, సామ్రాజ్యాభిలాషతో అతడు తన భాగానికి ప్రయత్నించి, కారాగారంలో బంధితుడైనాడు. నూర్జహాను మాట మాత్రంతో అతన్ని కడతేర్చ గలిగింది కూడా. మహబత్ఖాన్ మొదలైన ముఖ్యులంతా నూర్జహాను పన్నిన షడ్యంత్రాలు తప్పించుకొని ఖుర్రము నాశ్రయించినారు.

షహర్యార్ అనే కడపటి యువరాజును దగ్గఱతీసి, మెహరున్నీసా తనకు షేరాఫ్గనువల్ల కలిగిన కుమార్తెనిచ్చి వివాహంచేసింది. ఏ విధంచేతనైనా అల్లుణ్ణి సామ్రాజ్యపీఠ మెక్కించడానికి జరిగే ప్రయత్నాల్లో నిద్రాహారాలు విసర్జించింది. తన ముద్దులబిడ్డ సామ్రాజ్ఞి కావడానికి, కోటి దేవతలకు మ్రొక్కింది.

ఇటువంటి సమయంలో జులేఖా కంకణం తాల్చింది కదా, తన దుర్విధికంతా మూలకారకుడైన షేరాఫ్గను తనూజ నధః పాతాళానికి దిగద్రొక్కుతానని. ఆమె సామ్రాజ్యాధికారిణి కాకుండా ఉంచడానికే కార్యమైనా చేస్తానని ప్రతిజ్ఞ చేసుకుందికూడా.

షహర్యార్ మార్గంలో యింకా రెండుకంటకాలుండిపోయినాయి. ఖుర్రము తగిన బలాన్ని చేకూర్చుకుంటూ జహంగీరునూ, నూర్జహానునూ లొంగదీయడానికి సమయం నిరీక్షిస్తున్నాడు. రెండోవాడు ఫర్వేజ్—అంటే జహంగీరు స్వయంగా తన తదనంతరం సింహాసనాన్ని సమర్పింపదలచుకొన్న ప్రియపుత్రుడు. అతడు మద్యపానంలో నిమగ్నుడౌతూ, నాట్యగానాలకు ప్రాణాలర్పిస్తూ, రసికచక్రవర్తిగా ప్రసిద్ధుడైనాడు. అతని దౌర్బల్యం కూడా అందఱికూ తెలిసిపోయింది.

జహంగీరు వయసు హెచ్చేకొద్దీ, యువరాజుల ప్రయత్నాలూ, షాహజాదా షడ్యంత్రాలూ పెచ్చుపెఱిగినాయి. నూర్జహాను మనసులో ఖేదోపాయంవల్ల ఫర్వేజుకూ—ఖుర్రానికీ యుద్ధాలు కల్పించి, యిద్దఱినీ క్రుంగదీయవలెననే కోరిక కలిగింది. జహంగీరిందుకు విముఖుడైనాడు. తాను జీవించి ఉండగానే యింట్లో రక్తపాతం కలగడాన్ని చూడదలచుకోలేదు.

ఈ పరిస్థితుల్లోనే జులేఖాసైతం షహర్యార్ను సింహాసన మెక్కనీయరాదని నిశ్చయించుకుంది.

## 4

హఠాత్తుగా ఒకనాడొక స్త్రీ వచ్చి, జులేఖాకొక పత్రాన్ని సమర్పించింది. అందిట్లు వ్రాయబడింది—

"ప్రియజననీ,

నీ ప్రియపుత్రిక లాలీ—బ్రదికే ఉన్నాను. తాతగారు నా కోసం నగరాలెన్నో తిరిగి తిరిగి చాలా యిబ్బందుల పాలైనారు. నన్ను నీ దగ్గఱకు పంపడానికి నిరాకరించేవారు. నీవు ముసల్మానుల యింట ప్రవేశించి ధర్మభ్రష్టవైనావని చెబుతూండేవారు. సహగమనం చేయకపోవడం నీ దోషమని కూడా అంటూండేవారు.

"ఇప్పుడు తాతగారు స్వర్గవాసులైనారు. ముసల్మానుల యింట్లో ఉన్నప్పటికీ నీవు హిందూ స్త్రీవనే ప్రశంసించేవారు. నీ హృదయ మెన్నటికీ ముసల్మాను మతాన్ని కోరదని ఘంటాపథంగా చాటేవారు.

"మరణకాలంలో తాతగారు నన్నొక హిందూ గృహంలో ఉంచినారు. అమ్మా! నే నిప్పుడు ఫతేపూరు సిక్రీలో నివసిస్తున్నాను. ఎప్పుడైనా వచ్చి నన్ను చూచిపోవూ? నీ ప్రేమవల్ల సర్వదుఃఖాలూ మఱచిపోగలనని భావిస్తాను. ఎప్పుడు రాగలవు?

నీ కుమార్తె,

లాలీ"—

జులేఖా, సాంతమాలేఖ పఠించి, ఆ వచ్చిన కాంతతో, నిజంగా నా లాలీ బ్రతికేఉందా?"—అని అడిగింది.

ఆ గంతుకురాలు సంజ్ఞాపూర్వకంగా, "ఔ" నని జవా బిచ్చింది. కూతురు బ్రదికే ఉందనే సంతోషంలో జులేఖా పరవశురాలయింది. తా నేమి చేస్తున్నదీ మఱచిపోయింది.

"ఇప్పుడే మలికాకు చెప్పి నాలాలీని పిలిపించుకుంటాను"—అని బిగ్గఱగా పలికింది.

ఆగంతుకి—"నీకేమైనా మతి భ్రమకలిగిందా? నీ కూతురి కాశ్రయ మిచ్చిన వ్యక్తి మలికాకు బద్ధశత్రువుసుమా!—అంతేకాక, ఆమె నిక్కడకు పిలిపించుకోడం మంచిదికాదేమో?"—అనింది.

"ఎవరైనా కానీ! నా లాలీని పిలిపించుకోగలను. రక్తపాతమైతే కానీ. జంకను. మలికాకు నేనెంతో సేవచేసినాను. ఆమె నా బిడ్డకోసం ఎంతైనా సహాయపడుతుంది. అవసరమైతే ఫౌజు నా వెంట పంపుతుంది. చక్రవర్తిని ఫౌజు నెదిర్చి బ్రదుకగలవా డెవడు?"—అని జులేఖా తొందరపడింది.

వెంటనే ఆగంతుకి యిటూ అటూ చూచి, యింకోలేఖ జులేఖా కిచ్చింది. "దీన్నికూడా పఠించి, నీ యిష్టప్రకారం సంచరించు!"—అనింది. ఆ లేఖ యీవిధంగా లిఖింపబడింది.

"సోదరీ!

షేరాఘను నీకు చేసిన దురాగతమంతా నాకు తెలుసు. ఆ కార్యమంతా నూర్జహాను ప్రసన్నురాలు కావడానికేనని కూడా నాకు విదితమే. నీ మామగారు చనిపోతూపోతూ నీ కుమార్తెను నా అధీనంలో ఉంచినారు. ఈ అనాధబాలిక యెన్నెన్ని కష్టాలు పడిందో, యెక్కడెక్కడ తలదాచుకుందో తెలిస్తే మనుష్యహృదయం తహతహలాడి తీరుతుంది. నీభర్త నిర్దోషికదా? అటువంటి భర్త అన్యాయంగా హత్యచేయబడినాడు. కాబట్టి అతని రక్త మెప్పుడూ కసి తీర్చుకోడానికి ప్రయత్నించి తీరుతుంది. షేరాఘను మగణించినాడు. నిజమే. కాని, ఈ హత్యకంతా కారకురాలైన మలికా జీవించే ఉంది. ఆమె మీద కసితీర్చుకోవలసిన బాధ్యత నీకులేదూ? నీ భర్త పవిత్రాత్మకు నీవు శాంతి చేకూర్చవూ? అన్నివిధాలా యీ ఉద్యమంలో నీకు సహాయపడడానికి సిద్ధంగా ఉన్నాను.

నీ సోదరుడు,

భీమసేనుడు."—

ఈలేఖ చదువుకోగానే జులేఖా హృదయంలో నిద్రాణమైఉన్న క్రోధాగ్ని—ప్రతీకారకాంక్ష—ప్రజ్వలించింది. వెంటనే ఆమె, సందేశహారురాలితో—"నీ పేరేమి? నీవు నన్ను సోదరుడైన భీమసేనుని దగ్గఱకు గొంపోగలవా?"—అని ఆత్రంతో ప్రశ్నించింది.

"నేను భీమసేనజీ గుప్తచారిణిని—'అంబరబాయి'—అంటారు. నన్ను అనుసరించే పక్షంలో నీ కుమార్తెనూ, సోదరునీ చూడగలుగుతావు"—అంటూ ఆగంతుకి జవా బిచ్చింది.

"ఇప్పుడే వస్తాను. ఇక్కడేఉండు!"—అని జులేఖా వెంటనే నూర్జహాను దగ్గఱకువెళ్ళి, "కొన్నాళ్ళునాకు సెలవిప్పించవలెనని ప్రార్థన. ఫతేపూరు సిక్రీలోని ఒకానొక పీరుకు మ్రొక్కుబడి చెల్లించబోతున్నాను. అనుగ్రహించవూ?" అని వేడుకుంది. నూర్జహాను సెలవియ్యడానికి అంగీకరిస్తూ—"తగినంత సిబ్బందినిగూడా పంపుతాను. వెళ్ళిరా!"—అంది.

జులేఖా అందుకు—"వద్దు; వద్దు; పీరుదగ్గఱకు భిక్షుకివలెపోవలెనని గదా పెద్దలంటారు? నేనుకాలినడకను వెళ్ళదలచుకున్నా," నంటూ సమర్థించింది.

"మంచిది; వెళ్ళిర,"మ్మని నూర్జహాను ఆనతిచ్చింది. ఆనాడే అంబరబాయితో కలిసి జులేఖా ఫతేపూరు సిక్రీకి ప్రయాణమైంది.

తల్లీ కూతుండ్ర సమావేశ మొక మహాద్భుతమైన ఘట్టం. వారిద్దఱూ పరస్పరబాహుబంధాల్లో పరవశులై ఉండిపోయినారు. కన్నీటి కాల్వలతో చెంపలుతడిసినాయి. హృదయస్పందనాలు తీవ్రమైనాయి. కొంతసేపటికిగాని జులేఖా తనకూతురి సౌందర్యం చూచుకొని మురిసిపోవడం జరుగలేదు. మొగలాయీ సామ్రాట్టుల అంతఃపురంలో ఉండి తానెంతో మంచి

హిందూస్త్రీల సౌందర్యాన్ని కనులపండువుగా తిలకించింది. కాని, లాలీ అందాని కెవ్వరూ సాటి రారు. జగద్విఖ్యాత సౌందర్యవతి నూర్జహానుకూడా లాలీ కాలిగోటికి సరితూగదేమో ననిపించింది. హఠాత్తుగా ఆమె తన కుమార్తెను, "అమ్మాయీ! నీ వివాహమయిందా? కాలేదా? చెప్పు!" అని అడిగింది.

లాలీ తలవంచుకొని ఊరకుంది.

అంబరబాయి వెంటనే, "ఈమె వివాహమిప్పుడొక విషమ సమస్యగా పరిణమించింది. హిందూ వీరుడెవడూ యీమెను వరించడానికి సాహసించడం లేదు. ఇంతలో తాతగారు స్వర్గస్థులైనారు. ఇంక నీవే యీభారం వహించవలసి ఉంటుంది—"అని వివరించింది.

సర్వసుందరి విస్ఫారిత లోచన యుగళి సజలమయింది. అంతలో ఏదో స్ఫురించినట్లై ఆమెలో ఆనందం తాండవించింది. "సోదరుడు భీమసేనుడెక్కడ?"—అని ఆమె ప్రశ్నించింది.

అంబరబాయి భీమసేనుని పిలుచుకొని వచ్చింది. సర్వసుందరి అతని చేతికి రక్షకట్టింది. భీమసేనుడు—"సోదరీ! నీకోసం నే నెంతైనా త్యాగానికి సిద్ధంగా ఉన్నా" నంటూ ప్రతిజ్ఞ చేసినాడు.

"అన్నా! నేను నీ కెంతో కృతజ్ఞురాలను. జన్మజన్మాంతరాలకైనా నీ ఋణం నేను తీర్చుకోలేను. నా కుమార్తె కాశ్రయమిచ్చి నీవు నన్ను దాసిని చేసుకున్నావు—" అనింది ఆమె.

"చెల్లెలా! అన్న కెప్పుడైనా ఋణపడిపోవడం లోకంలో కద్దా? చెల్లెలి బిడ్డను సంరక్షించడంలో నేను చేసిన ఉపకార మేమీ లేదు. ఇది నా కర్తవ్యమే సుమా! ఏ రోజున నా చెల్లెలిపై జరిగిన అత్యాచారానికి నేను కసి తీర్చుకుంటానో, ఆ రోజునగాని నా ఆత్మకు శాంతి చేకూరదనుకో!"—అని భీమసేనుడు పలికినాడు.

"నీవు వీర శేఖరుడవు; నేనో, అబలను; నిజానికి నా హృదయంలో ద్వేషాగ్ని రగులుతూనే ఉంది. ఏనాడు నా ప్రాణప్రదమైన భర్త అన్యాయంగా హత్యచేయబడినాడో, ఆనాటినుంచి నేటిదాకా నా హృదయంలో సంతోష మనేది లేదు. ఐనా, నా కనులవెంట అశ్రువులు మాత్రం ఎవ్వరూ చూచి ఉండరు. అంగిట అమృతమూ, ఆత్మలో విషంగా నేను జీవితాన్ని గడుపుతున్నాను. దుఃఖాన్ని ప్రకటించిన పాపాన నేను పోలేదు. ఇప్పటికి నా హృదయం ప్రసన్నమయింది. కాబట్టి కనులు బాష్పపూరితా లయినాయి. లాలీ సందర్శనం నన్ను వివశురాలిని చేసింది. అమ్మాయి వివాహమూ, హత్యకు ప్రతీకారమూ—ఈ రెండూ జరిగితే గాని నా హృదయాగ్ని శాంతించదేమో? ప్రతీకారం కోసమే నే నింకా జీవించినా ననుకో!—

'కపట జీవిత మర్మ మీదా?
కననివారికి నేనె చాలును!
అంతరంగ రహస్య మొక్కటి;
వింతనాలుక విజయ మొక్కటి—

"ఐనప్పటికీ—అన్నా!—ఏ విధంగా తీర్చుకోగలనో తోచటం లేదు. మార్గదర్శివి కావూ!—" అని సర్వసుందరి తన హృదయం విప్పి భీమసేనుడి యెదుట పెట్టింది.

"అమ్మాయీ! నీకు తెలిసే ఉంటుంది; నూర్జహాను తన కుమార్తెను సింహాసన మెక్కించడానికనేక విధాల ప్రయత్నాలు సాగిస్తూందని—ఆమె యిష్టాన్ని వ్యర్థం చేయడమే మన కర్తవ్యంగా భావించు. ఇందుకోసం నీవూ, నేనూ, యువరాజైన ఖుర్రము పక్షంలో చేరకతప్పదు. ఖుర్రమే సింహాసనారూఢుడైతే నూర్జహాను వీక్షిస్తూ చావలేక జీవించకపోదని దృఢంగా నమ్ము! అంతకంటే కావలసిందేమి?"—అని భీమసేనుడు బోధించినాడు.

"నావంటి అబలవల్ల కాగల సహాయమైనా ఏముంటుందో తెలిపినావు కావు;" అని సర్వసుందరి ప్రశ్నార్థకంగా చూచింది.

"నీవల్లనే కార్య సాఫల్యం కాగలదంటూ నేను విశ్వసిస్తున్నాను."

"ఏవిధంగా?"—

"నూర్జహాను మిక్కిలి చతురురాలని వినికిడి. నీవెందులోనూ ఆమెకు తీసిపోవనికూడా నా నమ్మకం. ఆమెమీద నీవు కసితీర్చుకోడానికి సిద్ధంగా ఉన్నావుగా?"

"నిజమే; ఐతే?"—

"ఆ మాత్రం చాలు!—ఇంతవఱకూ చక్రవర్తిని రహస్యాలు మాకు తెలుపగల గూఢచారిణి లేదే, అని ఖుర్రం విచారిస్తున్నాడు. అక్కడ జరిగే రహస్యాలన్నీ నీవు అంబరబాయిద్వారా మాకు తెలుపుతూవస్తే, అన్ని విధాలా సహాయపడినదానవౌతావు."

"మఱి నాకు బహుమానం?"—

"ఏమడుగుతావో, అడుగు!"—

"అన్నవైన నీకు నేనే ఋణపడి ఉన్నాను. కాబట్టి, షాహజాదా ఖుర్రం యీవరప్రదానానికి పూనుకోవాలి."

"షాహజాదాఖుర్రం తప్పే యిక్కడకు రాగలడు. అతని చేతనే వాగ్దానం చేయిస్తాను."

మఱునాడు ఖుర్రంరానేవచ్చినాడు. రాగానే సర్వసుందరి దర్శనానికి వచ్చి, నమస్కరించినాడు. ఆమె అడిగింది

"షాహజాదా ఖుర్రం! నేను మీకు సహాయ పడితే నాకు మీరిచ్చే బహుమానం ?—

ఖుర్రము వినమ్రుడై, "అమ్మా! తామే మకు గురువో, అడగండి! తలతో చేస్తాము," అంటూ మాట యిచ్చినాడు.

"ఖడ్గ హస్తులై ప్రమాణంచేయండి!"—

ఖుర్రము అదేవిధంగా ప్రమాణంచేసినాడు.

మఱునాడే సర్వసుందరి తన తనూజాతనువదలి ఢిల్లీకి బయలుదేఱబోతూ, 'అన్నా! కోడలి సంరక్షణలో జాగరూకుడవై ఉండు! నాకు సెలవా?" అనింది.

"సోదరీ! నిశ్చింతగా వెళ్ళిరా! ఇక్కడి జ్యోతిష్కుల వచన ప్రభావంవల్ల నాకోడలు భారతవర్ష సామ్రాజ్ఞి కాబోతుందని నమ్ముతాను. సరేనా?" అని భీమసేనుడు నవ్వినాడు.

# 5

కొన్నాళ్లపిదప అంబరబాయి, మహలునుంచీ భీమసేనున కొక ఉత్తరం తెచ్చింది.

"అన్నా,

రహస్యాతి రహస్యమైన మీ పన్నాగమంతా నూర్జహానుకు తెలిసిపోయింది. షాహజాదా ఫర్వేజ్, సామ్రాజ్య సేనలతో వెంటనే బయలుదేఱి మీ మీదికి రాబోతున్నాడనే సంగతి నాకు తెలియ వచ్చింది. మొదట మిమ్ములను మోసగించే నిమిత్తం కొద్దిసేనమాత్రమే వచ్చి యుద్ధాని కాహ్వానిస్తుంది. మీరు పోరాడే సమయంలో హఠాత్తుగా మఱొక పెద్దసేన ఖుర్రమును ముట్టడించి హతమార్చడానికి సిద్ధమౌతుంది. ఖుర్రం శిరస్సుకు నూర్జహాను కట్టిన విలువ రెండులక్షల మొహరీలు మాత్రమే. ఈ సేన లేవి రాకముందు, నీ దగ్గఱ కొక దూతవస్తాడు. అతడు నిన్ను మోసపుచ్చి, అరణ్యంలోకి తీసుకోపోవడానికి ప్రయత్నిస్తాడు. అక్కడ నిన్ను హతమార్చడానికి పన్నాగం పన్నబడింది.

ఫర్వేజ్, నాట్యగానాలంటే ప్రాణా లిస్తాడు. కాబట్టి, యుద్ధప్రయత్నానికిముందే అతని నే నాట్యకత్తె చేతనో హతమార్పించడానికి సన్నాహపడు! నా ప్రతిమాటా జ్ఞాపక ముంచుకో! ఏమాత్రం ఏమరినా సరే, అనుకున్న కార్యం విష మించితీరుతుంది సుమా!

ఖాలీని కలుసుకోడానికి హృదయం తత్తరి స్తూంది. ఐతే, యీ సమయంలో మహలు వదలడం మంచిది కాదు.

నీ సోదరి,

—సర్వసుందరి."

జాబు చదువుకుంటూనే భీమసేనుడు, మహబత్ఖాను ఖుర్రములకు సమస్తమూ తెలిపి, తగిన సూచన లిచ్చినాడు.

అదే సమయాని కొక దూత రోజుకుంటూ, రొప్పుకుంటూ రానేవచ్చినాడు. ఆ దూత భీమసేనునితో, "షాహజాదా ఖుర్రం, అరణ్యంలో పులులను వేటాడుతూ, కూలిపడిపోయినాడు. తమ రాక అగత్యమని భావిస్తున్నాడు—" అన్నాడు.

తక్షణం భీమసేనుడా దూతను పట్టి బంధించమని అనుచరుల నాజ్ఞాపించినాడు. అనంతరం తగిన సిబ్బందితో అరణ్యానికి వెళ్ళి చూచినాడు. అక్కడ ఖుర్రం పత్తా లేడు. సరికదా? నలుగురు సిపాయీలు తన్ను చంపడానికి సిద్ధంగా ఎదురు చూస్తున్నారు. ఆ నలుగురూ వెంటనే స్వప్రాణంగా పాతిపెట్ట బడ్డారు.

అంబరబాయి నాట్యకత్తెవేషంతో బయలుదేఱి షాహజాదా ఫర్వేజు డేరాలో హాజరయింది. నాట్యగానాలకు అనుమతించమని ప్రార్థించింది.

ఫర్వేజు వెంటనే అంగీకరించినాడు. అంబరబాయి నాట్యగానాలతో అతనికి మత్తెక్కించి, సిపాయీలను మోసగించి, మంచి అవసరం చూచుకొని, కటారికి శత్రువును బలియిచ్చింది. అందఱూ కండ్లు తెఱచేలోపల తప్పించుకొని పారిపోయింది కూడా.

ఫర్వేజు మరణంతో నూర్జహాను—జహాంగీరుల పన్నాగమంతా మొహం మొత్తింది.

సర్వసుందరికి ధన్యవాదా లర్పిస్తూ ఖుర్రం స్వయంగా ఒక లేఖ వ్రాసినాడు.

ఫర్వేజునుగురించి జహాంగీరు దుఃఖసముద్రంలో మునిగిపోయినాడు. నూర్జహాను దుఃఖంలో ప్రసన్నత కూడా తొంగిచూచింది. ఒక కంటకం తొలగినా

తొలగినట్లేకదా ?—అనుకుంది. ఇంక ఖుర్రం మొక్కడే మిగిలినాడు!—కాని,......కాని,.....

జహాంగీరు దీర్ఘాలోచనలో పడినాడు. తమ రహస్యమంతా భీమసేనాదులకు ఏవిధంగా తెలిసిందో? మహలులో ఖుర్రం పక్షాన గూఢచారు లెవరో కనిపెట్టమని అత డాజ్ఞాపించినాడు.

రెండే రోజుల్లో ఖుర్రం వ్రాసిన ధన్యవాదాల లేఖ, చక్రవర్తి సన్నిధానంలో ఉంచబడింది. ఖుర్రం హస్తాక్షరాలు గుర్తించిన తర్వాత చక్రవర్తి ఆ లేఖను నూర్జహానుకు పంపి ఊరకున్నాడు. నూర్జహాను ఆ పత్రాన్ని చదివి అగ్గి లేకుండా మండిపడింది. జులేఖాను వెంటనే తన గదిలోకి రప్పించింది.

జులేఖా నూర్జహాను ముఖావలోకనంలోనే, ఏదో విషమించి ఉంటుందని గ్రహింపగల్గింది. నూర్జహాను పండ్లు పటపట గీటుతూ, "ఏమే, విష నాగమా!—ఇంతవఱకూ నీ విషం దిగలేదూ?—" అని గర్జించింది.

జులేఖా భయంతో గడగడలాడుతూ, "ఈ సేవకురాలి తప్పేమిటమ్మా? మలికా సాహెబా కింతటి దురాగ్రహ మెందుకోసమో?" అంటూ సవాలు చేసింది.

"నిన్ను నమ్మి నా రహస్యాలన్నీ నీతో ఆలోచించడ మిందుకే ననుకున్నావా? నీవు నా మీదనే కత్తి కట్టడానికి పూనుకున్న సంగతి చూస్తే—ఆశ్చర్యంగా ఉంది"— అని అంగలార్చింది నూర్జహాన్.

జులేఖా ఆమె పాదాలు కండ్ల కద్దుకుంటూ, "ఎవరు నామీద చాడీలు చెప్పి, మలికా అనుగ్రహానికి దూరస్థురాలిని చేయదలచినారో?" అనింది.

"నీవు సహచారిణి రూపంతో ఉన్న కాల సర్పానివి."

"నాదోషం?"

"మహలులోనివార్త శత్రువులకు తెలిసిపోయింది. షాహజాదా ఫర్వేజును హత్యచేయించినావు; ఖుర్రమును బ్రదికించినావు. నా సామ్రాజ్యానికి అడ్డుగోడవైనావు. ఇందుకు శిక్షకూడా నీకు తెలిసే ఉందిగా?"

"తప్పుఘోరమయిందే. అపరాధికి మరణదండన తప్పదుగా? కాని, నా యౌవనమంతా నీసేవలో ధారపోసినాను వృద్ధాప్యంలో ఋజువు లేని దోషానికి నన్ను బలిచేయిస్తారా?"

"ఋజువు కోరుతున్నావా? ఇదుగో! చూడ, మంటూ ఆలేఖను ముఖాన విసరికొట్టింది, నూర్జహాను.

జులేఖా ఆపత్రాన్ని చదువుకుంది ఆమె. రంగు అమాంతం మాఱిపోసాగింది. ముఖంలో నెత్తురు చుక్క లేదు. ఐనా ధైర్యం తెచ్చుకుంటూ, "ఈలేఖ శత్రువుల పన్నాగం. అంతమాత్రం కనుక్కోలేవా? మలికా సాహెబా!—"అంటూ ప్రారంభించింది.

"నేనేమి పసిబిడ్డ ననుకున్నావటే? నోరు మాట్లాడితే నొసలు వెక్కిరిస్తుంది. జాగ్రత్త! నీకు మృత్యువుమాత్రం తప్పదు. కాని, యిన్నాళ్ళు నీవు చేసిన సేవకు బహుమానంగా—ఏదైనా నీ అంతిమ వాంఛ తీర్చడానికి సిద్ధంగా ఉన్నాను. అడుగు!"— అనింది నూర్జహాను గర్జిస్తూ.

"ఈసేవకురాలు మరణానికి భీతిల్లదు. మలికా అనుగ్రహం తప్పినతర్వాత బ్రదికిమాత్రం నేను సాధించేదేమిటి? ఫతేపూరు సిక్రీలో నా ప్రాణసఖి అంబరుబాయిఉంది. నాశవాన్ని ఆమెదగ్గఱ చేర్చడానికి అనుమతించండి! హిందూధర్మాన్ని అనుసరించి నేను దహనమై పోవడానికి వాంఛిస్తాను. కాబట్టి బ్రాహ్మణులే నాశవాన్ని మోసుకోపొయ్యే యేర్పాట్లు చేయించండి! ఇదుగో! నేనే స్వయంగా విషం త్రాగి మరణిస్తున్నా," నంటూ జులేఖా ఒక విధమైన పొడిని నోట్లో వేసుకొని నీళ్ళు త్రాగింది. అరగంటసేపటిలో ఆమె స్పృహ తప్పి క్రిందబడిపోయింది.

నూర్జహాను ఆజ్ఞానుసారం సర్వసుందరి దేహం బ్రాహ్మణుల స్వాధీనం చేయబడి, ఫతేపూరు సిక్రీలోని అంబరబాయికి చేర్చబడింది. అక్కడ హిందూ ధర్మప్రకారం దహసంస్కారాలు జరిపించవలసిందని సందేశంకూడా పంప బడింది.

## 6

ఇతిహాసాల్లో లిఖింపబడ్డ రీతిగా మహబత్ఖాను జహాంగీరును పట్టుకొని, బలవంతంగా సామ్రాజ్యాధికారం ఖుర్రంపరం చేయబడ్డట్టు వ్రాయించుకోడమూ నూర్జహాను భర్తను మళ్ళీ విడిపించుకొని, షహర్యార్ కోసం కడపటిసారి ప్రయత్నించడమూ జరిగినాయి. ఈ సమయాల్లో జహాంగీరు విశేషంగా మదిరాపానం చేసేవాడనీ, అతని ఆరోగ్యమంతకంతకూ క్షీణమౌతూ పోసాగిందనీ, చరిత్రలే తెలుపుతున్నాయి. ప్రజలు కూడా చిరకాలం జహాంగీరు బ్రతుకబోడనే సంగతి తెలుసుకున్నారు. గాలిమార్చడానికి కాశ్మీరు ప్రయాణం నిశ్చయించబడి, అంతా తయారయ్యే సమయంలో నూర్జహాను కీవిధంగా లిఖింపబడిన పత్రమొకటి అందింది.

"ఓ పాషాణ హృదయా,

నీకూ నాకూ సంబంధ మీనాటితో తెగిపోయింది. నీవు నీ సౌందర్యగర్వంలో నిర్దోషుడైన నా భర్తను హత్యచేయించి, నన్ను దాసిగా యేలినావు. నా యౌవన భోగా లన్నిటినీ నాశనం చేసినావు. తల్లికి బిడ్డా బిడ్డకుతల్లీ లేకుండా వేఱుపఱచినావు. నన్ను కనాకష్టంగా పోషిస్తూ రొట్టెముక్కతో సంరక్షించడమే మహోపకారంగా భావించినావు. అధికారం హస్తగతమైనదనే పొగరుతో, యిష్టానుసారం చలాయించ సాగినావు. ఇంతైనా నే నోర్చుకున్నాను ఎందుకో తెలుసా? నీమీద కసితీర్చుకోడానికే. ఎవతె నా యౌవనాన్ని సర్వనాశనం చేసిందో, ఆ పాతకురాలి వృద్ధాప్యాన్నైనా నాశనంచేయక నేను వదలగలనా? అందుకై మహలులో నిప్పుపెట్టించి, రాజడానికి తోడ్పడసాగినాను. ఆ మంటల్లో నీ విప్పుడు దహించుకోపోతున్నావుగా? నీవు నన్నపరాధినిగా నిర్ణయించి మరణదండన విధించినావు. మూర్ఖురాలా! నేను విషపానం చెయ్యలేదు. పండ్రెండు గంటలసేపుమాత్రమే స్పృహ లేకుండా చేయగలఔషధాన్ని సేవించి, నీ బంధాన్ని తప్పించుకున్నాను. నే నుదహనం కాలేదు. ఇక్కడి నా బంధువులు నన్ను రక్షించినారు. స్పృహవచ్చి కండ్లు తెఱచేవేళకు నేను సరిగ్గా నా సహోదరుడైన భీమసేనుని సమక్షంలో ఉన్నాను.

కిరాతకురాలా! నీమీద పగ సాధించడానికే నే నిన్నాళ్ళనుంచీ జీవించగలిగినాను. ఇప్పుడు నిన్ను నే నడుగుతున్నాను. ఏమిటి నీకు శిక్ష? నీవు మరణమే కోరినా, నేను కాదంటాను. నిన్ను సజీవంగా కాల్చి కాల్చి నేను కనులారా చూడదలచుకున్నాను. అప్పటికే గాని నా హృదయం శాంతించదు.

ఇంకో మాటమాత్రం విను! షాహజాదాఖుర్రం నా సహాయమర్థించి, నే నడిగిన బహుమానాన్ని నా కివ్వడానికి ప్రమాణం చేసినాడు. అతనికి సహాయపడడంలో నేను నీవల్ల నేమీ కోరలేదు. అతని అభీష్టమేమో తెలుసా? నా కూతుర్ని మలికా చేయడమే. నే నందుకు సమ్మతించి, నా ముద్దులకుమార్తెనతని కిచ్చి వివాహం చేసినాను. ఆమె 'ముంతాజమహలు' పేరుతో సామ్రాజ్యపీఠాన్ని అలంకరిస్తుంది. అప్పుడు నీ కూతురో? అంధకార మందిరాల్లో విడిగా ఖైదు చేయబడుతుంది. నీ అల్లుడు సహా ఖైదులో ఉండి, నీ జీవానికి ఏడుస్తూ కాలం గడుపుతాడు. నీవు జీవించిఉండి యీ దృశ్యాలన్నీ చూస్తూ విచారపడగలవు. జహంగీరు ఆయువు తీరినట్టేగా? ఈ కలాపమంతా జరగడాని కెంతో కాలం పట్టదు.

భావిభారత సామ్రాజ్ఞి మాత,
—సర్వసుందరి."

కాశ్మీరు యాత్రానంతరం జహంగీరు వ్యాధిపీడితుడై మరణించడం చరిత్రప్రసిద్ధమే. నూర్జహాను ఆ సంగతి పొక్కనీయకుండా అతని శరీరాన్ని ఏనుగుమీద ఉంచి, ఊరేగింపుతో కొనివచ్చింది. కాని, సత్యం దాగుతుందా? మహబత్ఖాను ఖుర్రమును పిలిపించి, వెంటనే సింహాసన మెక్కించినాడు. సామ్రాజ్యాపేక్షగల మొగలు కుటుంబీకులందఱూ కడతేర్చబడినారు. షహర్యారూ, నూర్జహానూ తుదకు జయించలేకపోయినారు. సర్వసుందరి ఆజ్ఞానుసారం షహర్యార్ అంధుడై బందిఖానాలో ఉంచబడినాడు. అతని బీబీ వేఱే గదిలో బంధించబడింది. నూర్జహాను మహలులోనే నిర్బంధితురాలయింది. అనుకున్నట్టుగానే లాలీ, సామ్రాజ్ఞిపదాన్ని అందగలిగింది.

సర్వసుందరి కడపటిసారి నూర్జహానును దర్శించి సలాముపెట్టి నిలుచుంది. "ఏమే, ద్రోహీ! ఇదంతా చూడడానికే గదా నీవు జీవించింది? ఇప్పటికి నీ కన్నీరు చూచి, నా హృదయం శాంతి వహిస్తూంది. రూపగర్వంతో నీవు చేసుకున్నదాని ఫలితమంతా అనుభవించు! ఛీ! నీ ముఖం చూస్తేనే పాపం లభిస్తుంది"—

నూర్జహాను తలవంచుకుంది. కన్నీరుమాత్రం కాల్వలుగట్ట నారంభించింది. తర్వాత సర్వసుందరి నెవ్వరూ చూడలేదు. ఆమె బర్ద్వాన్‌కువెళ్లి, తనభర్త షేరాఫ్గన్ చేత వధింపబడ్డచోటనే చితి పేర్పించుకొని, భస్మమైపోయింది.



# ఉదయగిరి నవాబు దానపత్రిక



శ్రీ పొంగూరు సూర్యనారాయణ శర్మ

శ్రీ మనుమసిద్ధి మహారాజ పాలితమై, కవి బ్రహ్మ కవితా కలితమై, ఖడ్గతిక్కన భుజబల రక్షితమై పావన పినాకినీ స్రవంతీజల పూతమైన నెల్లూరు మండలమున ఉదయగిరి దుర్గము చరిత్ర ప్రసిద్ధిగాంచినది. ఇయ్యది నెల్లూరునకు పశ్చిమోత్తర దిగ్భాగమున ఏబదిమైళ్లకు 'లోపుగ నున్నది. ఈ దుర్గము పర్వతాగ్రమున శత్రుజన దుర్భేద్యముగ నిర్మింపబడినది. కొంతకాలము దీనిని గజపతు లాక్రమించి పాలించిరి. క్రీ. శ 16 వ శతాబ్దమున శ్రీ కృష్ణదేవరాయలు ఉత్తర దిగ్విజయమునకై తిమ్మరుసుచే పురికొల్పబడి యపార సైన్యసమేతుడై ప్రప్రథమమున నీ దుర్గమును ముట్టడించెను. దీని ముట్టడి సుమారు పదునెనిమిది నెలలు సాగెను. శత్రువు లెంతకాలమునకు లొంగనందున రాయలు, కొండ మరుసయ్యయను సేనాని అతి శ్రమలకోర్చి కొండను పగులగొట్టి మార్గమేర్పఱచి దుర్గమును స్వాధీనము చేసికొనిరి; కొండమరుసయ్యను దుర్గాధ్యక్షునిగజేసి రాయలు కొండవీటి విజయయాత్రకేగెనను విషయము చారిత్రకు లెఱింగినదే. రాయలనే సంవత్సరమునకు పైగా ముప్పుతిప్పల బెట్టిన దీ దుర్గమని వేరుగ చెప్పవలెనా ?

17 వ శతాబ్దారంభముననే హిందూ ధర్మ సంరక్షకమైన విజయనగర సామ్రాజ్యము ఛిన్న భిన్నముకాగా వారి పాలనలో నుండిన దుర్గములు మహమ్మదీయుల పాలయ్యెను. ఉదయగిరికూడ అట్లే నవాబుల పాలనలోనికి వచ్చెను. నేడిది ఉదయగిరి తాలూకాగా ఎన్నబడుచున్నది. ఈ ప్రాంతమున కంతయు పూర్వము ముల్కనాడను పేరుండినటుల ప్రాచీన పత్రములవలన తెలుచున్నది. దీనికి ముల్కనాడను పేరెట్లు వచ్చెనను నది విచారణీయమైన అంశము. దానిని చారిత్రకులకే వదలివేయుచున్నాను. ఈనాటిలోనుండిన బ్రాహ్మణులు ముల్కనాడు (ములికినాడు) వారని ప్రసిద్ధినందిరి. వీరు క్రమముగ కడప మండలమునకు మఱి యితర మండలముల కేగిరి. సంగీత లోకమున భక్తలోకమున చిరకీర్తి గాంచిన కాకర్ల త్యాగరాజు తాత గిరి రాజకవి నాయక రాజుల కాలమున తంజావూరున కేగెను. అట్లే అనేక కుటుంబములు మధురాది దాక్షిణాత్య మండలముల కేగి నివాసముల నేర్పఱచుకొనిరి. నేటికిని వారు ముల్కినాటి వారమని చెప్పికొనుచున్నారు. వీరందఱు నూటికి నూరుపాళ్లు ఆంధ్రులు. ఉదయగిరి మండలమున (ముల్కనాటి.) నివసించిన విప్రులు విశేషముగ వేదశాస్త్రాది విద్యలలో పరినిష్ఠిత పాండిత్యముగలవారై యుండినందుననే దేశాంతరములకేగి అచటి ప్రభువుల మెప్పించి భృతిని గడించిరను విషయము నిస్సందేహము.

ముల్ ముల్క అను పాదుషా పాలనలోనుండినందున నీ దేశమునకు ముల్కనాడను పేరు వచ్చెనను చున్నారు. ఈ నిష్పత్తి పూర్వోత్తర విరుద్ధముగ నున్నది. రాయలనాటికే యిచటి విప్రులు ఈ పేరుతో బ్రసిద్ధి వహించి యుండినటుల తేలుచున్నది. తత్పూర్వమీ దుర్గమును ముల్ ముల్క పాలించెనా ? ఆధారములు లేవు. ఈ ముల్ ముల్క ఎవడు ? ఏది యెట్లున్నను ఆంగ్లేయు లీదుర్గము నాక్రమించువఱకు నిది మహమ్మదీయుల పాలనలో నుండినది. వారు మహమ్మదీయుల నోడించి, అచటి రాజవంశీయులకు భరణమిచ్చి స్వాధీనము గావించికొనిరి. ఇప్పటికి నాయూర మహమ్మదీయులే అధిక సంఖ్యాకులై యున్నారు.

ఇచట పాలించిన నవాబులు హిందువులయెడ వైరము చూపక యచటి పండిత బ్రాహ్మణుల పోషించి కాపాడి వారికనేక మడి మాన్యముల నొసంగిరి. ఉదయగిరికి పశ్చిమమున పొంగూరు అను గ్రామమున శ్రౌతస్మార్త నిత్యకర్మ నిష్ఠాగరిష్ఠమై, యజ్ఞయాగాది కర్మ పరతంత్రమై, నిత్యాగ్నిహోత్ర

ఘామపవిత్రమై వన్నెకెక్కిన విప్రకుటుంబ మొకటి యుండెను. అయ్యది హైందూ సాంప్రదాయము నను సరించిన సంయుక్త కుటుంబము. అందు కనుమళ్ళ వారు, పేరుభొట్లువారును గలిసియుండిరి. ఇందు కనుమళ్ళ ఎల్లు భొట్లు యజుర్వేదము నభ్యసించి, సాహిత్యమునందు ప్రవీణుడై శిష్యబృందమునకు విద్యల నేర్పుచు జీవించెనట. అతడు క్రీ. శ. 17 శతాబ్దిలో నుండినవాడు. అప్పుడా ప్రాంతమున వర్షములేక పాడిపంటలు శూన్యమై జనుల జీవనము దుర్భరముగ నుండెను. వీరికి నానాటికి జీవనము దుర్భరము కాగా, బియ్యము లేనందున నింట జొన్నసంకటియే శరణ్యమయ్యెను. ఎల్లు భొట్లు భార్య ఓబుళమ్మ విస్తరిలో జొన్నసంకటిముద్ద వడ్డింప నాతడు తినలేక అట్లే దీనవదనముతో భార్య మోము చూచెనట. ఆమెయు వెంటనే "ఏమి చేయమందురు. పిల్లలు ఏడ్చి ఏడ్చి మ్రింగలేకున్నారు. మీరేమో వేదపారాయణం పాఠాలతో కాలం గడుపుతూ యిల్లు వదలకుంటే బియ్యం ఎక్కణ్ణుంచి వస్తాయి, ఏ రాజునో ఆశ్రయించి యింత వరిమడి సంపాయించక పోతిరి. దాహమైనపుడు బావిలేక పోయెనే అనుకుంటే యెలా? తినండి" అన్నదట. అతడున్న పాళమున నే లేచిపోయి ఆనాడెట్లో గడిపెను. మరునాడు కాలకృత్యముల నిర్వహించుకుని తాతలనాటి శాల్వ భుజమున ధరించి హుటాహుటిని ఉదయగిరికి ప్రయాణమయ్యెను. భార్యా చూచుచు ఎచటికి? అని యడుగుట దుశ్శకునమని యూరకుండ ఎల్లు భొట్లు మధ్యాహ్న మగుసరికి ఉదయగిరి దుర్గమును చేరి హజారముకడ నున్న భటులను చూచి "నవాబు దర్శనం కావలెను" అనగ నేవారు "క్రొత్త బిచ్చగాడు ప్రొద్దెలుగడట" అని గేలి చేసి నవ్విరట. ఎల్లు భొట్లు ఉడుదుడుకు పిండముగావున వారిని త్రోసి రాజనసాగవారు ఈతెలను హజారమున కద్దుపెట్టిరట. ఈతడు రాజరాజేశ్వరీ యుపాసకుడు. సిద్ధినందిన వాడుగాన వారి యీాటి లొండొకటి అనుకుకొను లాగున చేసి యూరక నిలువబడెనట. భటు లీతెలు రాక బ్రాహ్మణుడేమో చేసెనని గోలచేయసాగిరి. జనులు గుంపులుగ జేరిరి. అప్పటి యుదయగిరి పాలకుడు "హజరతుఖానే ఆలం హుశేను కురువర్ది ఖాను సాహెబు." అతడీ హజారములోని సంగతి నెఱింగి వెంటనే వచ్చి యెల్లు భొట్లను లోనికి గొంపోయి యుచితాసన మొసంగెనట. అంత నీతడు మంత్రాక్షతల నొసంగి,

"దుర్గ మేద్యోదయగిరౌ, ఖానుర్భానురివోదితః.
తస్య ప్రకాశనవశా, ద్భాతి నః కమలంమనః"

అని పల్కి రాజును మెప్పించెనట. దుర్గాధిపతి యీతని మహిమ ముందే యెఱింగిన వాడగుటచే "తమ కేమి కావలె? ఏలవచ్చితిరి? అని యడుగ" మా గ్రామం చుట్టుపట్ల ఎక్కడా వర్షాలు లేవు. గుంటలు చెరువులు వట్టిపోయి ఒక గింజైనా వస్తు పండుట లేదు. మేము శ్రౌతకర్మలు చేసేవారము. బియ్యము లేకున్న జరుగదు. పిల్లా జెల్లా మాడిపోవుచున్నారు. తమరు దయచూపి వరిమడి పెన్న ప్రాంతంలో ఇప్పించండి" అని యడుగ నవాబు వెంటనే దివానుతో నాలోచించి అల్లూరులో (ప్రస్తుతం కోవూరు తాలూకా) మీకు భూమి యిచ్చేలాగున ఆజ్ఞలిచ్చాము మీరు సుఖంగా జీవించండి" అని గౌరవించి పంపగా ఎల్లుభొట్లు అల్లూరు గ్రామమునకు సకుటుంబముగా బయలుదేరి చేరెను. అప్పటికే కాపు కరణాలకు నవాబు ఆజ్ఞలు చేరియుండెను గనుక వారు వీరిని గౌరవించి యీ క్రింది దానపత్రికను వ్రాయించి యిచ్చిరని మా కుటుంబపు పెద్దలవలన వినినగాథ నిందుపొందు పఱిచితిని.

దానపత్రిక (హద్దు పత్రిక అని పేర్కొనబడి యున్నది) కాలము శాలివాహన శకవర్షము 16 18. నేటి అనగా 1952 క్రీ. శ. సమానమైన శాలివాహన శకవర్షము 1875లో త్రోసివేయ నీపత్రిక కాలము నేటికి 257 సంవత్సరములగు చున్నది. అనగా క్రీ. శ 1695 అగుచున్నది. ఇట్టి పత్రికలో నుదహరింపబడిన ఏదుం విత్తనాల పట్టు వరిమడి మాన్యముగా నీయబడి నేటివఱకు మాన్యముగా నెన్నబడుచున్నది. ఈ పత్రిక మాయింట 257 సం. నుండి శిథిలముగాక దాచబడియున్నది.

ఈ పత్రిక చేతితో చేయబడిన కాగితముపై చక్కని ముత్తెములవంటి తెలుగులిపితో వ్రాయబడి చెక్కుచెదరక యున్నది. రెండున్నర శతాబ్దికి పూర్వ మాంధ్రభాష, లిపి, ఆనాటి తురుష్కుల మత సామరస్యమునకు, విద్యాప్రీతికి నియ్యది

దృష్టాంతమునుటచే చారిత్రక విమర్శకుల వినోదార్థ మీ క్రిందదానిని పొందుపఱచు చున్నాను—

## ప త్రి క కు న క లు

### శ్రీరాములు—

"స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబ్బులు ౧౬౧౮ అను నేటి బహు ధాన్యనామ సంవత్సరమార్గ శిర శు ౧౫ లు శ్రీ మద్యజనాది షట్కర్మ నిరతులయ్ని కనుమళ్ళ యల్లుభొట్లు గారికి అల్లూరుకాపు కరణాలు వ్రాయించ్చి యిచ్చిన హాద్దు పత్రికె హాజరతుఖానె ఆలం హుశైను కురు వర్ద్ధి ఖానుసాహెబులవారు కసుబా అల్లూరులో పొలంలోశింగ్గాంబ ౦౧౦ యేదుంవిత్తనాలు పట్టువరి మడి రెంణ్డు వరహాలుకు బెగ్గెమాన్యం మీకు యివ్వ మని శెలవు యిచ్చినారు గనుక అదే ప్రకారం సదరు గ్రామపొలంలో శింగ్గాంబ ౦౧౦ యేద్దుం విత్తనాలు పట్టునూ బక్క పోలయచేను రెంణ్డు వరహాల్కు బెగ్గి మాన్యంగ్గా నిష్కర్ష చేశి యిచ్చినందుకు హాద్దువయ్ను౦.

పడమరకు నాగరాజు యాదచేనికి పారే కాల్వ. దక్షిణానకు సదరు కాలవ తూర్పునకు నాగరాజు చేను పడమరగని మెయినక పరియపరుజు. వుత్తరానుకు పల్లావుతీగెలు కాలవ. యీ హద్దులలోగా వుండ్డె భూమి మీ పుత్రపౌత్ర పారంపర్యయాం ఆచంద్రార్క స్థాయిగా మాన్యంకింద్ద అనుభవించుకొని యీ రెంణ్డు వరహాలు బెగ్గిదివాణానుకు చెల్లించ్చి సుఖానవుండుకు నేది. దానపాలనయోర్మధ్యే। దానా చ్ఛ్రేయోనుపాలనం। దానాత్స్వర్గమవాప్నోతి। పాలనాదచ్యుతం పదం...

అక్కరాజుపెరుమా
ళ్లు వ్రాతకరణీకం
వ్రాలు—

ముత్తరాజునారా
యణప్ప వ్రాలు-
అన్నదాత నారా
యణ వ్రాలు.
అన్నదాత భాస్కర
య్య వ్రాలు.
అన్నదాత బాలిరాజు
వ్రాలు-
యరబోలు బుగ్గా
రెడ్డి వ్రాలు-"

నేటి వ్రాత పద్ధతికి ఆనాటి పద్ధతికి గల వ్యత్యాసములు :...వర్ష, మార్గ శిర, కురు వర్ద్ధి. తూర్పు. ఇవి నేను వర్ష, మార్గశిర, కురువర్ద్ధి, తూర్పు అని రేఫక్రింద హల్లులను వ్రాయుచున్నాము. ఆనాటి వ్రాతలో రేఫ హల్సం యోగములుగా కరకారపొల్లు (పొల్లుగేఫ) యే వాడబడినట్లు తెలియుచున్నది. అరబీ సంపర్కముచే "పత్రికె" అనుచోట పత్రిక అనుటకు మారు ఎకార విశిష్టముగ వ్రాయుట. పారంపర్యం అనుటకు మాఱు పారంపర్యయాం అని యద్వయమేల వాడబడెనో చింత్యము. కింద్ద, చెల్లించ్చి, రెంణ్డు అని కింద, చెల్లించి, రెండు అనుటకు మాఱుగా వ్రాయబడి యుండుటచే, పద్యాంత్య హల్లులు ద్విత్వ విశిష్టముగా వ్రాయునల వాడుకల ఎట్లు వచ్చెనో పరిశోధింపనగు.

ఇట్టి ప్రాతప్రతులు అచటనచట శతాబ్దముల తరబడివి యుండియుండ వచ్చును. అట్టివి గలవారు ప్రకటించిన అనేక విశేషములు కన్పించి భాషా శాస్త్రజ్ఞుల కెంతయో తోడ్పడును.



# కడపటి వివేకం



శ్రీ పేకుమళ్ల కామేశ్వరరావు

చింతా సాగరానికి ఆర్థిక బాధలు లేవు. తాత తండ్రులు ఇచ్చి పోయిన ఆస్తే బోలెడంత ఉంది. కుటుంబమైనా కనీసపు మెట్టు దాటిపోలేదు. అతను, భార్య, ఒకే ఒక బిడ్డగు. తనకి సొంతంగా బాధలు లేకపోడమే కాకుండా కొందరిలాగు ఇతరుల బాధలను నెత్తిమీద వేసుకొనే గుణంకూడా అతని దగ్గర లేదు. "పాపం! అదంతా సంఘసంస్కర్తల పని!" అని తెగ నవ్వుతాడు.

చింతాసాగరానికి స్నేహితులైనా మితంగానే ఉన్నారు. అతనితో చర్చించడమంటే వాళ్ళకి సరదా! వాళ్లతో వాదించడమంటే అతనికీ సరదాయే.! దీనివల్ల ఒక రకమైన ప్రయోజనం లేకపోలేదు. స్నేహితులకి కాలక్షేపం! అతనుమాత్రం తన అపూర్వాభిప్రాయాలను లోకంలో వెదజల్లుతున్నానని ఆనందిస్తూంటాడు.

ఆరోజున వచ్చిన స్నేహితుడు చర్చకి కూర్చున్నాడు. "అయితే లోకంలో పరస్పరలాభంకంటె మరొక సూత్రమే లేదంటావు నువ్వు! చిత్రంగానే ఉందే!" అన్నాడు మిత్రుడు.

"ఇదిగో! దీనికి మొదటి ఉదాహరణమాడు. నువ్వు ఇంటికి రాగానే నీకు కాఫీ కప్పు అందించేనా లేదా? నాతోమాత్రమే పనుండిన వ్యక్తి ఒకడు ఇందాక వచ్చిపోయేడు."

"ఏమిపని?"

"గోరక్షణశాలకి చందాలట!'

"ఏమి, చందా వేసేవా ఏమిటి?"

"వాడు మృతమయేది చందా ఇస్తానా! నా అసలు అంశమేమిటంటే, వాడికి కాఫీ నీళ్లు నేనెందుకు ఇయ్యలేదు అన్న ప్రశ్నకి నా సమాధానం చెప్పుతున్నా. వాడికి నాతోనే అవసరం కాని నాకు వాడితో అవసరం లేదు."

"ఆ మాట నిజమేలే!"

"ఇందువల్లే ఇచ్చి పుచ్చుకోడాలు; ఇదిగో మీ ఆవుకి గడ్డి అంటే, ఇదిగో మీ అబ్బాయికి పాలు; 'మీరు రైలెక్కుండంటే, తమరు ముందెక్కండని మర్యాదలు; ఇదిగో మీ అమ్మాయికి పెళ్లికి రవికెల గుడ్డ చదివించండి అంటే, ఇదిగో, మీ ఇంటిలో అన్న ప్రాశనకు వెండి చంచా అని బయలుదేరేయి. ఈ లోకంలో పరస్పరప్రయోజనం కంటె మరొకసుగుణ మున్నట్టు నాకంటికి కనబడ లేదు సుమా!"

"అయినా పోనిద్దూ! అంత ప్రయోజనవాదిగా ఉండకూడదు" అన్నాడు మిత్రుడు.

"ఇదిగో ఇటాగు చూడు. మనం ఆవులిని ఎందుకు పెంచుతాం? పాలు ఇస్తాయి కనక. వట్టి గొడ్డుకి గుప్పెడు గడ్డి వెయ్యమను చూతాం! కుక్కని ఎందుకు పెంచుతాం? ఇల్లు కాస్తుందని, కొత్తవాళ్లెవళ్లేనావస్తే అరవనికుక్కకి ఒక్కకబళం వెయ్యమను చెప్తాను! మనం తోటలో ఎటువంటి మొక్కలిని పెంచుతాం? తిరిగి మనకి ప్రయోజనముండేవాటిని మాత్రమే! కలుపుమొక్కలికి పుడిసెడు నీళ్లు పొయ్యమను! అట్లాగే తండ్రి కొడుకునెందుకు సాకుతాడు? ముందెప్పుడో తనని ఉద్ధరిస్తాడని. కాబట్టి పరస్పర లాభంకంటె మరొక సూత్రమే లేదంటే నమ్ము."

"అయితే ధనికుడైన తండ్రికి తిరిగి బిడ్డలవల్ల ఏమి లాభముంటుంది?" అని మిత్రుడు ప్రశ్నించేడు.

"లాభంలేదు, గీభంలేదు" అని చేతులు వెల్లికిల పెట్టేడు సాగరం.

"మాతృప్రేమ, పుత్రప్రేమ అంటారు మరి అవేమిటి?"

"అవన్నీ తెలియనివాళ్లు చెప్పే అర్థంలేని ముక్కలు! ఉన్నదున్నట్టు చెప్పడానికి చిన్నతనం వేసి వాటికి పెద్దపేరులు పెడతారు పాపం! ఉల్లిపాయలు అనడానికి సిగ్గుపడి సాలిగ్రామాలని, చేపలు అనడానికి నామోషీపడి జలపుష్పాలని అనడం లేదుటోయ్!

"బాగా చెప్పేవులే!"

అతనితో మిత్రుడు మరికొంతసేపు వాదించి వెళిపోయేడు.

మనుష్యుడు మనస్ఫూర్తిగా ఒక సిద్ధాంతాన్ని నమ్మకుండానే ఉండాలి కాని నమ్మితే మట్టుకు యథాశక్తిగా ఆచరిస్తాడు. చింతాసాగరం తన సిద్ధాంతాన్ని అనుసరించి ఎప్పుడూ కాకికేనా చెయ్యివిధిపి ఎరగడు.

అతను ఇవతలిగట్టయితే, అతని భార్య అవతలిగట్టు! ఆమె అతనితో తనకి చేతనయినంతవరకు వాదించింది. కాని ఒప్పించలేకపోయింది. అంతేకాదు, అతనితో సమానంగా వాదించలేకపోయింది ఆ ఆడకూతురు. కాని ఆమె అతని సిద్ధాంతాన్ని ఎప్పుడూ నమ్మలేదు; తనకి నచ్చిన మార్గాన్ని ఎన్నడూ విడిచిపెట్టలేదు.

అతన్ని కొడుకు గజపతి పిత్రార్జితానికి హక్కుదారుడు. బి. ఏ. పాసయేడు. పెళ్లీడు వచ్చింది. కొడుక్కి పెళ్లిచెయ్యక తప్పదు అన్నాడు తండ్రి. పెళ్లికోసం పిల్లలిని వెతుకుతున్నారు. సాగరం తన ఇల్లాలితో "పెళ్లిఅయిన మర్నాటినుంచే కొడుకు, కోడలి కాపరం వేరు, మన కాపరం వేరు"అన్నాడు.

ఆతని స్వభావం బాగా ఎరిగినది కాబట్టి ఆమె ఏమీ ఆశ్చర్యపోలేదు.

"అత్త కోడలి తగవులాటలు మనకి వద్దు. మనకి పోరువద్దు, పొందువద్దు" అన్నాడు భర్త.

ఆమె ఇదివరకు దేనికేనా ఒప్పుకొంటేకదా ఇప్పుడు దీనికి ఒప్పుకోడానికి! "మనం మనమలను, మనమరాళ్ళను ఎత్తవద్దూ?" అని అడిగింది.

"దూరంనుంచి చూడడానికి ఎవ్వరికీ అభ్యంతర ముండదు!"

"ఇంటిలోఉంటే ముద్దుముచ్చట తీరుతుంది కాని చుట్టాలలాగు చూసిరావడానికా!"

"అదంతా వ్యర్థమైన ఆలోచన!"

అతనితో వాదించి లాభం లేదని ఆమె ఊరుకొంది.

కొడుకు పూర్తిగా తండ్రిపద్ధతులలో పెరిగేడు. మంచి కట్నంతో కూడ పిల్ల రాగా, సాగరం కొడుక్కి పెళ్ళిచేసేడు. మూడు ముళ్లు పడ్డ రాత్రే చుట్టాలు, స్నేహితులు ఎవరి ఇంటికి వారు పోయేరు. ఆ రోజు మర్నాటినుంచే సాగరం శాస్త్రంప్రకారం కొడుకుకోడలి కాపరం వేరు, తను కాపరం వేరు కొడుకు ఆ సాయంత్రానికి గాని మరొక ఇంటికి మారలేదు. గజపతి కొత్త ఇంటిలో ఇంకా చేరడో లేదో, చేతి కొక జాబు అందింది. "నీవు పొద్దుటినుంచి సాయంత్రం దాక మా ఇంటిలో మకాం చేసినందుకు అయిన చార్జి అయిదుంపావల. ఇది దాని తాలూకు బిల్లు" అని రాసి ఉంది. తండ్రి పద్ధతులలో ఆరితేరినవాడు కాబట్టి గజపతి ఆశ్చర్యపోలేదు. తండ్రికి డబ్బు చెల్లించి నగదు రసీదు అందుకొన్నాడు.

సాయంత్రమయింది. చింతాసాగరం కుర్చీమీద కూర్చున్నాడు. ఇల్లంతా బావురు మంటూన్నట్లుగా తోచింది. గోడలు కళావిహీనంగా కనబడ్డాయి.

చీకటి పడింది. మామ్మూలుగా కూర్చున్నట్లే దీపం లేకుండా కూర్చున్నాడు. ఏమిటో గాబరా అనిపించింది. "దీపం వెయ్యకపోడంవల్ల అయుంటుంది!" అని ఎలెక్ట్రిక్ దీపం వేశాడు. దీపం మునపటిలాగు గాక మసక మసకగా ఉన్నట్లు తోచింది. "అంతా మునపటలాగు లేదేమి?" అతని కడుపులో ఖాళీ ప్రవేశించింది. "ఏమిటా!" అని భయాశ్చర్యాలు పడుతున్నాడు. "ఏమేనా పిశాచం ఆవేశించిందా?" అని ప్రశ్నించుకొన్నాడు.

భార్య ఒక మూల చాప వేసుకు పడుకొంది. ఆమె మనస్సు మనస్సులో లేదు.

సాగరం తన అవస్థను ఆమెకు వర్ణించి చెప్పదలుచుకొన్నాడు. కాని మాటల కేమీ అందేటట్లా కనబడ లేదు. తెల్లవారేక తన స్నేహితులకి చెప్పాలనుకున్నాడు. కాని వాళ్లు పకపక నవ్వుకొంటారేమో అని సిగ్గుపడ్డాడు.

తన నెక్కడికో అగాధంలోకి ఈడ్చుకుపోతూన్నట్లుగానూ, రెక్కలు లేని తనను ఆకాశంలోంచి తలకిందులుగా విసిరివేసినట్లుగాను తోచింది. ఏమిటి దీని వైనం? దీనిని వర్ణించేవారెవరేనా ఉన్నారా? అదంతా రహస్యంగా చెప్పుకొందామంటే ఏమని వర్ణించగలడు! తాను వర్ణించలేని బాధకి, ఫలానా స్థలంలోనని చెప్పలేని బాధకి వైద్యుడు మాత్రం ఏమి చెయ్యగలడు. 'అగ్గే పోతుందిలే!' అని ఊరుకొందామంటే తోచడంలేదు. కళ్లు మూసుకొని పడుకొందామంటే ఆందోళన జాస్తి అవుతూంది కాని తగ్గడంలేదు. "నేను దీనికి నా మనస్సులో చోటియ్యను!" అని భీష్మించుకొన్నాడు.

అది హృదయంలోంచి పొంగివస్తూన్నట్లుగా కనబడింది. అంతా గందరగోళంగా ఉంది. అది కూర్చోనియ్యదు, నిల్చోనియ్యదు, పడుకోనియ్యదు, నిద్రపోనియ్యదు. "ఇంతకీ దీనికి పేరేమిటి?" తటాలున అతనికి స్ఫురించింది. "బెంగ! బెంగ అంటారు! ఇదే కాబోలు! ఆఁ ఆఁ! ఇదే! తప్పకుండా ఇదే అయుండాలి. దాని స్వరూపం ఇలాగే ఉండవచ్చు!" అని తలచేడు.

"నేను కొడుకుని ఇదివరకెన్నడు విడిచిపెట్టి ఎరగను. విడిచిపెట్టక పోడమే నేను చేసిన ఘోరమైన తప్పిదం కాబోలు!" అని భావించేడు.

ఇంటిఎదుట గుమ్మందగ్గిర పిల్లలు చీకటిలోనే ఎంతో స్వేచ్ఛగా, స్వైరంగా గంతులు వేస్తున్నారు. వారి ఆనందంలో తాను కూడ పాల్గొంటేనో! తనకి కూడ భాగం పంచిపెట్టమని అడిగితేనో?" చింతా సాగరానికి నవ్వువచ్చింది. అది పసిపిల్లల ఆలోచన లాగు తోచింది. "కాని ఇది నవ్వడానికి సమయం కాదు. గట్టిగా ఏడవడానికి వీలులేకుండా వచ్చిపడింది. దారేమేనా ఉందా? లేక నోరు మూసుకొని భరించడ మొక్కటేనా మార్గం?"

"అసలు ఈ రాత్రి గడిచే దెట్లాగు? తెల్లవారేక ఏదో మందో మాకో చూసుకోవచ్చు. మొదట ఈ రాత్రి గడవాలి కదా!"

సాగరానికి వెనకటి సంగతొకటి జ్ఞాపకానికి వచ్చింది. ఇంటిలో ఆవుదూడ చచ్చిపోయింది. ఆ రోజు లగాయతు ఆ ఆవు గడ్డిముట్టలేదు సరికదా కస్నెతో కట్టనియ్యలేదు. రాత్రుళ్లు ఇంటిపట్టున ఉండలేదు. సాయంత్రమయేటప్పటికి అంబా అంబా అని అరుస్తూ తెల్లవారేవరకు ఊరంట తిరిగి తిరిగి వేకువ వేళకి ఇంటికి వచ్చేది. శివ! శివ! ఎంత బాధ పడిందో! అదంతా బెంగ అన్నమాట! ఆ సంగతి అప్పటిలో నాకు తెలియలేదు! ఎంత అజ్ఞానిని!"

సాగరం పెంపుడు కుక్కని దగ్గరికి పిల్చేడు. అది వచ్చి చేతులు నాకుతూండగా అతనికి కడుపులోంచి బాధ దేవుకు వచ్చింది. దానిని దూరంగా తరిమివేశాడు. ఆ కుక్క గజపతి కొని తెచ్చిందే!

అతనికి రాత్రిభయంకరంగా తోచించి, అంతు లేని బాధా సాగరంలాగు కనబడింది.

ఆ మర్నాడు కొంచెం సుఖంగా ఉంటుందని అతను భావించేడు. కాని ఎంతమాత్రము తగ్గకపోగా, బాధ వృద్ధిచెందింది. తన స్థితినిగురించి స్నేహితులకి చెప్పగా "వాళ్లు ఇది మనోవ్యాధి. మనస్సు తిప్పుకోవాలి కాని మరొక మార్గంలేదు" అన్నారు. తనేబాధ అనుభవిస్తూండగా భార్య, భర్తకి ధైర్యం చెప్పలేకపోయింది. సాగరానికి ఒక్క రోజులోనే ముసలితనం వచ్చినట్లుగా కనబడింది. డాక్టరువచ్చి చెయ్యిచూసి మందు ఇచ్చేడు.

రోజులు గడిచేకొద్దీ సర్దుకొంటుందని అతను, స్నేహితులు కూడ భావించారు. కావి కాలం గడిచిన కొద్దీ గుండెలలో బరువు జాస్తి అయింది.

స్నేహితులు అతన్ని చూసి జాలిపడ్డారు. దీనికి తరణోపాయం ఆలోచించేరు. కొడుక్కి కబురు పంపించవలసిందని సలహా ఇచ్చేరు. చింతాసాగరం మండిపడ్డాడు. "చిన్నప్పటినుంచీ నేను ఆచరిస్తూన్న సిద్ధాంతాన్ని ఇప్పుడు వదిలిపెడతానా? మీ సలహా ఎంత బాగుంది! నేను అటువంటి నిర్భాగ్యుణనే మీరు భావించేరా?" అని చిందులు తొక్కేడు. చేసేదిలేక వాళ్ళు ఊరుకొన్నారు.

సాగరం కొడుకుని తలచుకొన్నప్పుడెల్లా తనను ఏదో కుంగతీస్తూందని అనుకొన్నాడు. 'గజపతీ! గజపతీ!' అని మూలిగేవాడు. జీవితం భారమౌతూన్నట్లుగా కనబడింది. ముసలితనం మీరుతూన్నట్లుగాను, ఇది తన అంత దశగాను తట్టింది.

సాగరం ఏళ్ళతరబడి ఖాయిలాపడ్డ వాడిలాగు కనబడ్డాడు. నున్నటి బుగ్గలమీద, నుదుటిమీద లోతు గీతలు పడ్డాయి. భార్య అతని మనోవ్యాధికి మందు లేదని భావించింది. అయినా మరొకమారు అతని స్నేహితులచేత చెప్పించి చూదామని తలపోసింది. ఆమె ప్రార్థనను తీసివెయ్యలేక వారు అతనికి చెప్పేరు. సాగరం ఈ మాటు లొంగిపోయేడు. "ఒకవేళ వీరు చెప్పేమాటే ఒప్పేమో!" అని, కొడుకుని సకుటుంబంగా వచ్చి మకాం చెయ్యవలసిందని కబురు పంపించేడు. అందుకు కొడుకు వచ్చిన వాళ్ళతో "మీరు ఆయన మాటలు నమ్మకండి! మానాన్నకి ముసలితనం వచ్చి మతిపోయినట్లుగా ఉంది. ఒకవేళ ఆయనకి వివేకంలేకపోతే

నాగతీ అంతేనా? తప్పు తప్పు! మీరు ఆలాగు చెప్పకూడదు. నేను ఆలాగు చెయ్యకూడదు.” అన్నాడు. మిత్రులు హతాశులై దయచేశారు.

అంతకి ముందు ఎప్పుడేనా చుట్టం చూపులకి వచ్చే గజపతి ఆనాటినుంచి ఆ రాకపోకలు కూడ కట్టిపెట్టివేశాడు. “ఊరుకొన్నవాడిని ఊరుకోక, కొరివితో తలగోకుకొన్నాను” అని సాగరం మరింత దుఃఖించేడు.

రోజులు గడిచిన కొద్దీ సాగరం స్థితి విషమిస్తూంది. అతనికి పరిస్థితులను ఎదుర్కొనే చేవ ఉడిగింది. “జీవితమే అటువంటిది. ఈ బతుకే ఒక బాధ. దీనికంటె మరణం సుఖదాయకం” అని నిర్ధారించేడు. అతని స్నేహితులు అతనికి అంత్యదశ సమీపించిందని వాపోయేరు.

సాగరం తన సిద్ధాంతానికి ఎంతో పశ్చాత్తాప పడ్డాడు. అది తనతో తుదముట్టితే బాగుండునని తాపత్రయపడ్డాడు. వీలులో “నీవు నీబిడ్డలకి పెళ్లి చేసేటప్పుడు నాలాగువారికుటుంబాలను వేరుగాపెట్టి అవస్థలపాలు కావద్దు” అని ఆఖరిమాటలను చేర్చేడు.

# కవితాంజలి



శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

వన్నెలు చిన్నెలున్ వయసువాసియు చక్కదనాల ప్రోవుగా
క్రొన్నన చెల్వులుల్లసిల కోమల హాస విలాసరేఖతో
చిన్ని మెలుంగుతో సొగసు చిందిన తీయని రేగు నూహగా
సన్నగ భావవీథికల సాగినయుగ్మలి కంజలించెదన్!
వడల హొరంగు చూపుల నణంగు బెడంగు తుళుంగలించదా
కడు విరబూసి సోయగముకాయు తురాయి పసందు కొమ్మనా
తడబడు నిల్పుతో వయసుదార్కొను మవ్వపు గువ్వగొంతుతో
చిడిముడి పాటుతో కదలు చిన్నది నామది చెంగలించెడున్!
అంచిత రాగరేఖ వికచాబ్జ పథమ్ముల సాగి వచ్చురా
యంచ విధాన నబ్రపు టొయారములొల్క సొబంగు కోర్కెక
వ్వించి యెడందలో చిలుకరించిన జవ్వని చాయదేలి భా
వించు కళాపథాల చివురించి సుమింపవొ కావ్యవల్లరుల్!
ఆలలితాంగి మోవి చివురాకు మెఱుంగు తురాయి బాటలన్
ర్గాలు వసంతు శ్రీరథ రథాంగము లల్లన గాడివెట్టిగా
కేల మదీయ శైశిర వికీర్ణ హృదంతర వాటికాంతరం
బాలతు లుల్లసిల్ల మణిహారముగా చివురింప వచ్చుటల్.
ఆ కలకంఠి కోమల కరాగ్ర రణన్నవకంకణ స్ఫురత్
శ్రీకమనీయ కాంతి తరళీకృత మాధు పికాంగనారవ
ప్రాకట రాగవైభవ విరాజిత భాగ్యవిసూత్న భాసురా
లోక నవప్రవాళ రుచులో యెదలో చివురుల్ రగిల్చెడున్
ఆ వరవర్ణినీ చలదపాంగ విలోల విలోకన ప్రభా
భావ పరీతరాగ పరిపాలిత మామక కావ్య మాలికల్
భావుక భావ్యమాన పరభాగ సముజ్జ్వలకాంతి వీచికా
రావ విశేష శేష మధురాధర లాలిత రక్తి నేలు బో!

# ఆంధ్ర వాఙ్మయమున శృంగారము



శ్రీ యస్. వి. జోగారావు

ప్రాణికోటిలో మానవుడు, మానవజన్మ చరితార్థము కావలెనన్న తత్సాధనసామగ్రిలో వాఙ్మయము, వాఙ్మయప్రక్రియలలో కావ్యము, కావ్యాంగములలో రసము, రసభేదములలో శృంగారము గుణాధికములు.

ఉపనిషదర్థనిష్పన్నమైన రస నిర్వచనము జగత్ప్రదానసారభూతము, మౌనిమానస రుచ్యమానము, విగళిత వేద్యాంతరమునగు బ్రహ్మానందము. ఆలంకారికరసార్థము బ్రహ్మానంద సబ్రహ్మచారియైన పదార్థము. అది విభావానుభావ వ్యభిచారిభావములచే నానీయమానమగు స్వాదుత గలస్థాయిభావమేయని భరతవాక్యము.

అసలు రసము లెన్ని రకములున్నను అగ్రసరము శృంగారము. శృంగారసస్థాయిభావము రతి. అది సమస్తజంతుసంతాన హృదయగోచరమగు సహజవాసన. వాసనయే రసానుభవ భవన ప్రాకారము. రతీతరములైన రసస్థాయులకు శృంగారమున కున్నంత చురుకుగాని శుద్ధిగాని లేవు. అందుచేతనే శృంగారమునకు ఉజ్జ్వల, శుచి అను నామాంతరములు కలిగినవి. తక్కిన రసములు చరమావస్థయందే మనోహరములగుచుండగా శృంగార మాద్యంత మధురమగుచున్నది. అన్యరస విషయమున కావ్యగతమైన గుణగణనీయత లోకమున నుండదు. ఉద్ధత రసములైన వీరరౌద్రభయానక భీభత్సాద్భుతము లసాధారణములు. ఆనందజనకతకు సద్యశ్శక్యములు గావు. శృంగారహాస్య శాంత కరుణములు మధురములు. లోకములో చాల సహజములు, సంస్కృతికి ప్రకృతికి అత్యంత సన్నిహితములు, సున్నితము, ఉన్నతమునగు ఆనందప్రవాయానములు. అందు తరతరముల దేశదేశముల సారస్వతోపాసకుల హృదయముల నుఱ్ఱూతలూగించినదీ శృంగారము. సృష్టిరహస్యమంతయు నిముడ్చుకొన్నది శృంగారము. ఆచార్యభోజదేవుని 'శృంగార ఏవ ఏకో రసః' అను రసరాద్ధాంతము సుధావాదమనుకొన్నను యాథార్థముగా మధురరసమకుటము, రసరాజము శృంగారమే—

ఈ శృంగారమే ఆంధ్రకవులను ఐంద్రజాలికుల పాలిటి కర్ణపిశాచియైనది. అది చాలమట్టుకు సంస్కృతాలంకారికసమయములకు 'చూచివ్రాత'

ఆంధ్రమున కాదికావ్యము మహాభారతము. అది ప్రారంభముననే ప్రమద్వర, ఉపరిచరవసువు, యయాతి, శకుంతలాదుష్యంతులు, గంగాశంతనులు మొదలగువారి శృంగార మూరించు రసవదుపాఖ్యానములు గలదైనను, తాను నానారుచిరార్థసూక్తినిధియైనను నన్నయ ఉపరిసమాఖ్య నుత్తమపురుషలో చెప్పికొనకపోవుటచే కాబోలు ఆ శృంగార సురుచిరత్వము నంతగా రుచి చూపించలేకపోయెను. అతని ఆదర్శము 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, అధ్యాత్మవిదులు వేదాంతమనియు' నిట్లు తన కృతిని కొనియాడుట, అతని ప్రతిజ్ఞ ప్రసన్నకథాకలితార్థయుక్తి. అట్టిచో కేవలము ఆర్యసంప్రదాయ విధేయము, కథాకథనప్రవణమునైన అతని చూపు శృంగారముపై బడకుండు టొక వింతగాదు.

తిక్కనగారి రసమార్గమొక తిన్నని రాజమార్గము. ఎక్కడను ఎత్తుపల్లములు, ఒడుదొడుకులు నుండవు. ఔచిత్యము గీటు దాటదు. అతని ఇరుకృతులందును అడుగులోనే హంసపాదన్నట్లు ఆభాసముతోడనే శృంగార మవతరించును. అవి నిర్వచనోత్తరరామాయణమున వేదవతీ రావణులకును రంభారావణులకును, భారతమున సైరంధ్రీ కీచకులకును తటస్థించిన సమావేశములు.

అందు రంభారావణుల ఘట్టమున:—

"అప్పు డొకర్తు (పేరు చెప్పడు మొదట) కొంచెమగు నాభరణంబులు సన్నపూతయుం గొప్పిడి త్రిప్పిలో జెరివికొన్న నడంగిన పూవులుం బయిం గప్పిన చెలకొంగు నునుగప్పును మెల్పున నేగు వెట్టిలేజప్పుడు చెన్ను జేయుగతిచందము వింతగ" నిట్లు ప్రతి విశేషణము సాభిప్రాయముగా జ్యోత్స్నాభిసారికయై పోవుచున్నదట. రావణుడామె నడకాయించి "ఎవ్వతెవు నీ వత్యంత కౌతూహలంబున నెచ్చోటికి బోయెదు" అని యడుగును. ఆమె 'ఏను రంభ నా పతి నలకూబరుం డతని పాలికి బోయెద నన్యుల్ తరియై యతివ సనంగ నెందు నిటు లడ్డము వత్తురె నాదు పేరుబోవు తలపు వింతై పోయె నగవుం దగుమాత్రయె కాక యెప్పున్నే" అని ముక్త

సరిగా జబాబిచ్చును; తదుపరి వావివరుసలు కలియవని తెలిపి కూడదని వాదించును. రావణుడంత 'నీవును కులభామవోలె దగవున్ ఘటియించెదు వైశికంబునన్' అని దెప్పరమాడును. 'నావుడు నమ్మృగేక్షణ మనంబున రోయుచు నేను లంజియంగావుడు వానితోడి తమకంబది లంజయగా' దని వాదించును. ఈ సంవాద సందర్భము అసురగారించి విడిచిన యమ్మృగాక్షి చందము, ఘట్టమున ఆద్యంతము రావణుని చూచిన రంభ భయచంచల దృగంచలయై యున్నదను వర్ణస్ఫూర్తికిగాను మృగాక్షి, హరిణేక్షణ యను పదములే పలుమాఱు స్త్రీ వాచకములుగా వాడుట మున్నగు విషయములు తిక్కన కావ్యశిల్పములోని రసవిశిష్టతకు దృష్టాంతములు. రసపోషణకన్న రసాభాసపోషణ మసిధారావ్రతము. అయినను కవిబ్రహ్మ కావ్యకల్యాణి నెల్లారి నెఱజాణ అనిపించుకొన్నది.

ఎఱ్ఱన శృంగారము సత్త్వశుద్ధి గలది. కామసంసర్గము లేని మధురప్రణయతత్త్వమును చిత్రించుటలో అతనికి నైపుణము మెండు. అతని హరివంశమందలి ఉషానిరుద్ధుల ఘట్టము సోమయాజుల ఉత్తరాభిమన్యుల నూత్న దాంపత్య ప్రణయకోమలత్వమును జ్ఞప్తి కెలయించును. ప్రెగడయ్య ప్రబంధపరమేశ్వర బిరుద సార్థక్యమునకు నిదర్శనప్రాయమగు నృసింహపురాణమందలి అప్సరసల వనవిహారవర్ణనము శృంగారరసప్రధానమైన అర్వాచీన ప్రబంధసరళి కొక యుజ్జబంతియైనది. ఇట్లె ముగ్గురి కవిత్వపు నిగ్గును వడగట్టినచో వారి కావ్యశృంగార పరమార్థము కామపురుషార్థమున కతీతమైన పవిత్రప్రణయతత్త్వమని తేలుచున్నది.

నన్నెచోడుడు రాజకవి యగుటచేతను గాబోలాతని కుమారసంభవ మహాకావ్యము పురాణదంపతుల ప్రణయగాథయైనను రాజస ముట్టిపడునట్లు శృంగారము నభివర్ణించెను. కరుణరసప్రధానమైన రతి విలాప ఘట్టమునగూడ విప్రలంభ శృంగారమును మిళాయించెను. హరగిరిజావివాహసందర్భమున హైమవతీ వయస్యల వనకేళి, జలకేళి, విటీవిట మర్మసంగములు, నర్మప్రసంగములు తన నాటి నాగరక శృంగార క్రీడాప్రకారములను 'ఉజ్జీ' అన్నట్లు వర్ణించెను.

శివకవుల యితివృత్తము లన్నియు వీరశైవ గాథలు. అందును శృంగారమున కవకాశము లేకపోలేదుగాని వారి దృష్టి మడిగట్టుకొన్న మతాభినివిష్టము.

నాచనసోమన నాగరిక శృంగార సంగతి సందర్భములందు నన్నెచోడునికంటె నాలుగాకు లెక్కువ చదువుకొన్నవాడు. ఎఱ్ఱనవలె హరివంశ కథాభాగమునే కావ్యవస్తువుగా గ్రహించెను. కాని యెఱ్ఱన సత్త్వైకాలఘు శృంగారము ప్రణయబీజకము. అయితే సోమనశృంగారము కామబీజకము. కావుననే ఉషారుక్మిణీపరిణయఘట్టములందు ముగ్ధనాయికావర్ణనము చేయవలసియున్నను కామేంగిత నాయికా వర్ణనమే చేసినాడు. అతనికి కామ ప్రేమార్థభేదమే తెలియదా యనిపించును. తిక్కనగారి కృతులందువలెనే ఇతని కృత్యారంభమునందును రసాభాసములతోడనే శృంగారమురంగు బయటపడును. తిక్కనగారి రంభలో కొంత మార్దవమున్నది. రావణుడు తొందరపడి చెయిపట్టు సరసమునకు దొరకొని అరసికుడనిపించుకొన్నాడు. కాని నవీనగుణసనాథుడైన నాచనసోమనాథుడింకొక త్రోవ ద్రొక్కెను. అది ఊర్వశీ నరకాసురుల సంవాదఘట్టము, ఊర్వశి నొక ప్రగల్భగను, నరకాసురు నొక మంచి సరసునిగను చిత్రించెను. ఊర్వశి రాగానే నరకుడు 'నీ కనుదోయి వెన్నెలలు నిండక కోర్కులు నాకు నిండునే' అని భావకవిత్వముతో పలుకరించును. నా మాటమన్నించినచో 'నిన్నింతదాని చేతు నంతదాని చేతు' నని ఆశచూపును. కాని తాతకు దగ్గులు, సానికి టక్కులు నొకరు మప్పవలెనా? రంభ రావణుని రవ్వబెట్టినట్లు కాక, తన లోపలి 'స్వయంపాకము' పైకి తెపనీయక మహాప్రేమ ఉన్నట్లుగానే "ఇప్పుడంటే స్వర్గానికి వచ్చినావు కాబట్టి కబురంపినావుగాని యింతకుముందెప్పుడైన ముచ్చట కొక్కసారి పిలిపించినావా బావా?' యన్నట్లు మాటలతోనే మభ్యపెట్టి, రసికులు రసభంగముసంగతి లోన మెచ్చరనుటకు తన చిత్తములేని రిత్తయొడలికి చిలుక లేని పంజరము సామ్యముచెప్పి, 'నవ్వుల మాటలో, నిజమొ! నాకములోన ననేక కన్యకల్ మవ్వపుదీగెలం దెగడు మానినులుండగ నంతనెన్నడో జవ్వన మమ్ముకొన్న గడసాని ననుం గవయందలంచితే' అని యొక సొద్దు వెట్టును. నరకు డంతటితో ఊరకొనునా? వాడు దేవాంతకుడు! "ఎంత దఱిగిన మిరియాలుం జొన్నల సరిపోవే' అని తన పట్టు మఱింత బిగించును. గత్యంతరము గానక ఊర్వశి ఒప్పుకొన్నదానివలె నొక గడుసెత్తు వేయును. నరకునితో 'నీవు దేవతలను గెలిచితివి కాని వారి యాగభాగములను పొందలేక పోయితివి. అవి గెలిచి అప్సరసతోడి భావజ సౌఖ్య భాగ్యము వీరభోగ్య మనుమాట మనయెడలను యథార్థపరతువుగాక' అని యొక కట్టడి చేసి సరసుడగు నరకాసురు నోడంబఱచినది. తత్సమయ పరిపాలనా ప్రయత్నమే నరకునకు నరకముగా పరిణమించునని యామెకు తెలియును. ఈయొక్క ఘట్టము చాలును

నాచన సోమనాథుడు తన సాహిత్యరసపోషణ చక్రవర్తి బిరుద మన్వర్థసంజ్ఞగా, చేపట్టియ ఖిలపురాణమునకు ప్రబంధపు సొంపు సంపాదించె ననుటకు—

శ్రీనాథుని పేరు స్మరించునంత శృంగార శబ్దము స్ఫురించును. ఆంధ్రప్రబంధ వాఙ్మయ సౌధ నిర్మాణమునకు శృంగారశంకుస్థాపన అతని చేతి మీదుగనే అయినది. ఇతడు శైవుడే కాని శివకవుల వంటివాడు కాడు. చిరము శివునిమీద భక్తి శృంగారముమీదను ఇతనికి. అతని శృంగార ప్రియత్వమే అనేక శైవగాథలను శృంగారరసమూసలలో పోతబోసెను; పురాణములకు ప్రబంధాకృతులు కల్పించెను. అతని శృంగారప్రియత్వమే శృంగార రసరథమునకు సిగమెత్తిన హర్షనైషధము నాంధ్రీకరించి ప్రప్రథమముగా మన వాఙ్మయమును కావ్యసంపన్నము గావించెను. అతని శృంగారప్రియత్వమే స్త్రీపుంసయోగోద్భవమైన సృష్టినంతటి నొక క్రీడామాత్రముగా పరిగణించి ప్రేమాభిరామమునకు పేరుమార్చి, క్రీడాభిరామ కావ్యావిర్భూతికి దారితీసెను. అతని శృంగారప్రియత్వమే గుణనిధి సుకుమారుల వంటి సజీవపాత్రలను సృష్టించి ధూర్తవిట శృంగారమున నిగమశర్మ, నిరంకుశమువంటి తరువాతి కావ్యపాత్రల జాతకములకు ప్రాతిపదికలు వేసినది. రస విషయమున కథా సందర్భమునుబట్టి కొన్ని కటువైన మాటలనవలసివచ్చును ఉదా॥ హరవిలాసమున మహేశ్వరుని దారుకావనవిహారవర్ణనము, నైషధమున కలిప్రభృతుల ప్రలాపములు—శ్రీనాథుడు క్రీడాభిరామమున నానాజాతి కాంతలను నఖశిఖ పర్యంతము వర్ణించుటలో అనుభవశాలి ననిపించుకొన్నాడు. తాను పుట్టిపెరిగిన గడ్డలో, తన చుట్టుప్రక్కలనున్న తన జాతిజనుల జీవిత సాధకబాధకములలో పాలుపంచుకొన్న సానుభూతిపరుడు, గతి రసికుడు అయిన మహాకవి అట్టి శృంగారమును వర్ణించుటలో ఆక్షేపణ యుండరాదు. కాని 'లేజవరాలు చెక్కుగీటిన డెందమునం గలగంగ నేర్వని వసవల్చు బాలకుల'వంటి అర్వాచీనకవులు కొందఱు శ్రీనాథునాధారముగా శృంగారము శ్రుతిమించిన క్షుద్రప్రబంధము లనేకము రచించి ఆంధ్రవాఙ్మయమునకే అప్రతిష్ఠ తెచ్చిపెట్టిరి. అది ఔచిత్యవిచారమును ప్రయోగోపసంహారములందు సిద్ధహస్తుడైన శ్రీనాథునివంటి శృంగారశూరుని చేతిలోనే ఉండవలసిన మహాస్త్రము. దానిని సమయానుకూలముగా సూటిగా గుండె లోరసిపోవునట్లు ప్రయోగించు గురికాడతడు. రాజమహేంద్రవర తార్కికుల కిచ్చిన సమాధాన మొక తార్కాణ—సుగంధద్రవ్య వ్యామోహము, స్త్రీలింగమునకు చెందిన ప్రతిజీవికిని రమణీయార్థప్రతిపాదక శబ్దములనే వాచకములుగా వాడుట, కుచప్రసక్తి వచ్చునపుడెల్ల వలుదలను విశేషణము ప్రయోగించుట, తన అనుభవములను అభిరుచులను కావ్యవాణితో కలగలపుట మున్నగు విషయము లెన్నియో నానావిధ శృంగార కళాజ్ఞానసనాథుడగు శ్రీనాథుని ప్రత్యేకతకు కొన్ని విశేషములు—

ఆంధ్రమహాకవులలో శృంగారమును భగవత్పరము చేసినవారిలో పోతనయే ప్రథముడు. శ్రీ చైతన్యస్వామి ప్రతిపాదించిన రాధాకృష్ణుల ప్రణయతత్త్వ మంతకుముందే పోతన కనుగొన్నాడు: చైతన్యుని దర్శనము రాధాప్రియుడగు కృష్ణుడు మాత్రమే. పోతనదర్శనము నవరసమూర్తియగు కృష్ణస్వరూపము. ఆ కృష్ణుడే అతని కృతినాయకుడు. భాగవతకృష్ణుడు భారతకృష్ణునివలె మీసాల కృష్ణుడు గాడు. వ్రజముగ్ధాస్నిగ్ధకపోలపాలికల ముద్దులాడు నూగుమీసలనున్నని మోముగాడు. వయసునకు మించిన వాలకములు వేసి గొల్లపడుచుల సిగ్గులు కొల్లగొన్నవాడు. అట్టి రసికులజగజెట్టియగు భగవంతుని శృంగారమును వర్ణించి అఖిలాంధ్రుల నౌదల లూపించిన పోతన శతధా శ్లాఘనీయుడు.

నాసికేతూపాఖ్యానకర్త - దగ్గుబల్లి దుగ్గన శృంగారము సంసారపక్షముగా నుండును. గ్రంథములో ఆలంబనవిభావ భాగస్వాములాశ్రమవాసులు. ఉద్దీపన విభావము తదుచితమై, ప్రశాంతము, పవిత్రమునై ప్రాబంధికమగు అపప్రథకు దూరమగుచున్నది—జక్కన విక్రమార్కచరిత్రయందు ధూర్తత్రిగర్తాప్రవర్తనపరమై శృంగార మూసరవెల్లిగా భాసించును. ఉజ్జ్వలరసమున కూతకట్టైన స్త్రీవర్ణన మాపాదమస్తకము నూదముట్టుగా చేసిన తొలితెలుగు కవి ఇతడే. పిల్లలమఱ్ఱివారి పిన్నవాని చేతిలో అభిజ్ఞానశాకుంతలము శృంగారశాకుంతలమైనది. అందు కొంత సొంతపైత్యము చేరి కొన్నిపట్ల శృంగార మౌచిత్యదూరమైనది.

పెద్దనగారితో ప్రబంధశృంగారవ్యవస్థకు పట్టాభిషేకమహోత్సవమైనది. రానురా నది యొక వేలువత్తిగా, దాసరిపాటగా పరిణమించినది. కాని పెద్దనాది మహాకవులచేతిలో శృంగారగౌరవము చెక్కుచెదరలేదు. ప్రబంధసుందరు లందఱను పోతవిగ్రహము లందురుగాని వరూధినీ సత్యభామాది మహాప్రబంధనాయికలు తలచుకొన్నమాత్రి అతిలోకమోహన సౌందర్యముతోడనే మనకు సాక్షాత్కరింతురు. అది పెద్దన తిమ్మన మహాకవుల ప్రత్యేకత—మనుచరిత్రమున ఏకత్రైవానురాగము కారణముగా శృంగారమున కాభాసము శాంతముతోడి సంఘ

ర్షణయు తటస్థించెను నాయిక కామశాస్త్రోపాధ్యాయినివలె ప్రియు నొడంబఱచుట కుపన్యసించిన ప్రగల్భయైనను, ప్రియనిరాకృతయైన పిదప వాపోవు నప్పుడు ముగ్ధయైపోయినది. మన వాఙ్మయమున వనిత తనంతతా వలచివచ్చుట మొట్టమొదట మనుచరిత్రలోనే కనిపించును.

పారిజాతాపహరణమున ప్రప్రథమముగా ఖండితనాయికా చిత్రణము కనిపించును. అదే తరువాతి రాధికాసాంత్వన సత్యభామాసాంత్వనములకు మార్గదర్శక మాయెను. ఇందు శ్రీకృష్ణుని దక్షిణనాయకత్వము చక్కగా ఋజువుచేయబడినది ముక్కుతిమ్మనగారి పలుకే కాక అతని నాయిక విడుపు కూడ ముద్దుగానే యుండును.

ధూర్జటి అనుభవసిద్ధుడైన రసికశిఖామణి. అతనికి శివభక్తి యెంతయో స్త్రీరక్తియు నంతే. వేశ్యకన్యాకథయందు నాడు తాను చక్కబెట్టిన సానుల యింటిగుట్టులు, వేశ్యమాతల చాతుర్యములు చాకచక్యముతో చెప్పి కొన్ని ప్రబంధములకు వారకాంతాశృంగార ప్రదర్శనమున చేయూత నిచ్చెను.

కందుకూరు రుద్రయ కామపురుషార్థమును మోక్షోపలబ్ధికి కారణము కాగలదను నొక నూతన సిద్ధాంతమును నిరంకుశోపాఖ్యానముద్వారా నిరూపించెను.

సంకుసాల నృసింహకవి "కవికర్ణరసాయనమని ప్రౌఢముగా పేరుపెట్టి 'యతి విటుడు గాకపోవుటెట్లు సహృదీయ కావ్యశృంగారవర్ణనాకర్ణమున' అని ప్రతిజ్ఞచేసి గ్రంథము ప్రారంభించెను.

పెదనచేతిలో శాంతరసముతో పేచీపడిన శృంగారము రాయలచేతిలో పరాజయము స్వీకరించినది. రాయలు శృంగారమునకు రసస్థితి తేలేకపోయెనుగాని కొన్ని సన్నివేశములు, వర్ణనలు మాత్రము చేసెను. ద్రవిడాంగనా వేశ్యాజనశాలి పాలికల విలాసాదులు, పుష్పలావికల నర్మప్రసంగములు, గ్రీష్మర్తువునందు ప్రపల నుపవిష్టులై పథిశ్రమ నపనయించుకొను పాంథులచటి విలాసవతులను చూచి వికారము లందుట మున్నగునవి స్వభావోక్తి సుందరములు. చెఱకు తోటలలోని తిమలపాకు తీగెలు పోకమ్రాకులను పెనవైచుకొనుట నొక చిత్రమైన శృంగారసన్నివేశముగా జేసెను. శృంగారసందర్భములందును వైష్ణవమతాభిప్రేతమైన తన వ్యక్తిత్వమును ప్రదర్శించుచుండును. ప్రత్యూషపవనాంకురములవలన నగు వనమాలి విమానపతాకల మువ్వలసవ్వడి ప్రణయ కలహభాజనులై శయ్యల ఊరక పరుండిన దంపతులకు మెలుకొలుపుతోపాటు హెచ్చరికయట! గోదాదేవి ప్రత్యంగవర్ణనము, విష్ణుచిత్తుని విజయానంతరము దేవదాసీజన మాతని కెదురుకో లేగుటయు అంత సందర్భోచితముగ లేవు.

రామరాజభూషణు డాలంకారికుడైన కవి. శృంగార మాతడు పిలిచిన పలుకును. కాని అతనికి తదాలంబనవిభావముపైకంటె ఉద్దీపన విభావముపై చూపెక్కువ. వసుచరిత్రమున నెంత వర్ణింపబడినను గిరిక వరూథినివలె పఠితకు ప్రత్యక్షము కాదు. కథాశరీరము తక్కువ. పోషకముకంటె అనుపాన మెక్కువై పోయినది. కాని నాయికానాయకుల సమావేశము నాటకోచితముగ నున్నది. ఒక వస్తువుయొక్క ప్రధ్వంసాభావమునందే తద్వస్తువును గూర్చిన భావనాశక్తి విజృంభించునను సిద్ధాంతమును, సంభోగసందర్భమునకంటె విప్రలంభము నందే రసభావనను పరాకాష్ఠ నంటించి రూఢిచేసిన యింతటి ప్రౌఢకవి మఱి లేడు. ఇతడు నిజముగా శృంగారదేవతచే సంగీతము పాడించెనని చెప్పవచ్చును.

పింగళిసూరనగారి శృంగారములో కొంత ప్రత్యేకత కలదు. అతడు తన మానవమనస్తత్త్వ పరిజ్ఞానముతోడను, కావ్యశిల్పజ్ఞతతోడను శృంగారమును నడిపించును—కళాపూర్ణోదయమున మణికంధరుని వలచినట్లగపడిన కలభాషిణి నలకూబరుని పొందాశించుటకు హేతువు కామ్యవస్తుస్వభావము నందు తదాభాసమేనియు కొంత ఆత్మశాంతి నిచ్చును కాముకధర్మము; సుగాత్రీ శాలీనుల స్వభావమున సహజసౌందర్యమునకును, నిరాడంబరచితవృత్తికిని బింబప్రతిబింబభావము గల్పించి యొక సరళమైన శృంగారమార్గమును చూపించెను. మణిస్తంభుని 'అంగనల కంగజ సంగరకేళికావిశేషదశలయందు నెక్కుడట సౌఖ్యగతుల్మగవారికంటె' అను విశ్వాసములతోడి మహాకాముకత్వము, శల్యాసురుని గాఢానురాగ మూఢమైన రాక్షసప్రేమ మొదలగు రకరకములగు ప్రేమలతో, ప్రేమమూర్తులు ప్రజ్ఞామూర్తులునగు స్త్రీపాత్రలతో అద్భుతశృంగార సృష్టి గావించినాడు సూరన. అతని చేతిలో శృంగారము రసమాత్రముగా కాక కళగా పరిఢవిల్లినది.

రాయలచే రాధామాధవకవి యని బిరుదందిన చింతలపూడి యెల్లనార్యుడు రాధాకృష్ణుల ప్రణయతత్త్వమును కావ్యధోరణిలో వర్ణించుటలో పోతనగారి నతిశయించును. అతడే వెలిదిండ్ల వెంకటపతి ప్రభృతులకు వస్తుభిక్ష పెట్టిన మహాభాగుడు.

ఇక దక్షిణాంధ్రయుగ వాఙ్మయమును పరామర్శించినచో ప్రబంధములే కాదు ప్రతి గ్రంథమును శృంగారభూయిష్ఠమే. రఘునాథరాయ లంతటి

రాజకవి, విశిష్టాద్వైతి సావిత్ర్యుపాఖ్యానమువంటి శాంతరసయోగ్యమగు కథను శృంగారప్రధానము గావించెనన్న తక్కిన కవులమాట చెప్పనేల? అతని కంటె ఘను డాచంట మల్లన్న యనిపించుకొన్నా డతని కొడుకు విజయరాఘవుడు. అతని కాలమున శృంగార మింకను వెఱ్ఱితలలు వేసినది. శృంగార పదపూర్వకములగు శృంగారప్రబంధము లెన్నియో బయలుదేఱినవి. కొందఱు గ్రంథకర్తలు ఇతిహాస జీవులగు మహామహుల చరిత్రల మాటుమూలలందు రంధ్రాన్వేషణ చేసిచేసి తమ శృంగార పిపాసను కొంత శాంతింపజేసికొనిరి. అట్టివారిలో అహల్యా సంక్రందనము, శశాంకవిజయము, పార్వతీపరిణయము మొదలగు గ్రంథములు రచించిన కవులు ముఖ్యులు. మఱియు బహుగ్రంథములందు బ్రాహ్మణశృంగారము నీచాతినీచముగా వర్ణింపబడినది. రఘునాథ కృతుల మూడింటను ఈ విషయము గలదు. దీని కోసము ప్రత్యేకముగా తంజాపురాన్నదానసత్రమను యక్షగాన మొకటి రచింపబడినది. దానినిబట్టి నాడు తంజావూరు సోమరిపోతుల సత్రములో తడియవేయు చుండిన బాపనయ్యలు రూపాజీవులగు వేశ్యలకు రూకలిచ్చుకొనలేక తమ కంచిగరుడసేవాది పుణ్యములను ధారవోసెదమని వారివెంటపడుచుండెడివారని తెలియును—ఈ యుగమున రాజులతో రంకుపోయిన కవయిత్రులుండుట ఇంకొక విశేషము. స్త్రీ సహజమైన సిగ్గునుగూడ విడనాడి గ్రంథములు రచించినారు. కాని స్త్రీకృతములగుటచే శృంగారము నెడ స్త్రీప్రకృతి చాలమట్టుకు తేటతెల్లము కాగలదు. ఈ యుగమున చెప్పఁదగిన శృంగార కవు లిరువురు. క్షేత్రయ, చేమకూర. క్షేత్రయ మువ్వగోపాలముద్ర భానుదత్తుని రసమంజరికి లక్ష్యకోశము. చేమకూర దొక అపూర్వప్రబంధము. ఇందు మువ్విధములైన నాయికాశృంగారము: ఉలూచి—వరూథినిని తలపింపజేయు ప్రగల్భ, కామేంగిత. చిత్రాంగదముగ్ధ, ఆమెది తొలిచూపువలపు. సుభద్రసంగతి పూర్వరాగప్రేరితము. రసధ్వని, రసోచితమైన ఆలంకారిక రీతియు నీతని విజయవిలాసకావ్య శృంగారగౌరవమునకు దోహదములు.

క్షీణయుగప్రబంధములన్నియు పూర్వకావ్యముల కనుకరణములే. వానిలో శృంగారమునుగూర్చి ప్రత్యేకము చెప్పఁదగిన గొప్ప యేమియు లేదు. ద్వ్యర్థికావ్యములందు కవికి శ్లేషకోసము శబ్దము లేరుకొనుటతో సరిపోవును. శతకములు, స్థలపురాణములు ప్రాయికముగా భక్తిప్రధానములు. రావిపాటి త్రిపురాంతకుని అంబికాశతకము, రామలింగని పాండురంగమాహాత్మ్యములో పరకీయశృంగారముగల నిగమశర్మోపాఖ్యానము మున్నగు రెండు మూడిందుల కపవాదములు. యక్షగానాదులందు ప్రక్రియ, రచనాప్రణాళికయు వేఱుగాని తక్కిన దంతయు ప్రాతప్రబంధధోరణియే.

ఇక ఆధునిక యుగమునకు దిగినంతనే కవియే నాయకుడు. నాయిక ఊహాప్రేయసి. లేదా ఏ పొరుగింటి తాయారో అయితే అన్యాపదేశముతో మర్మకవిత్వ మవతరించును. మఱికొందఱు బ్రదికి యున్నన్నాళ్లు భార్యను నానాబాధలు పెట్టి, ఆమె చచ్చిపోతే సానుభూతితో శతక మొకటి వ్రాయుటయు ఆచారమై యున్నది. ఇట్లే నవయుగభావకవిత్వమున శృంగారము ముభావముగా నుండిపోయినది. అసలా శృంగారము రసపర్యవసాయి కానే కాదు.

పై చరిత్రనుబట్టి చూచినచో శృంగార మాంధ్రవాఙ్మయరంగమున ప్రధానభూమిక నిర్వహించినట్లు తెలియగలదు. ఏ వాఙ్మయమునను ఇంత శృంగారవ్యామోహము కవుల కున్నట్లు కనిపించదు. కవిత్రయమువారినుండి నేటిదాక దాని పరిణామక్రమము సతతోన్ముఖముగుచునే వచ్చినది. చివరికి కూచిమంచి జగ్గనినోటిలో బూతుకూతల స్థితికి వచ్చిన దాంధ్రశృంగారము. రసికులను విసుగెత్తించినది. అందుచే కవు లిప్పుడిప్పుడు తదితర రసముల కెగబ్రాకుచున్నారు.

---

# కష్టజీవులు 

శ్రీ వీరుభొట్టు సూర్యనారాయణ

పర్వతముల జంటవలె నున్నవీ యెడ్లు
నడచుచుండి తూలిపడుచునుండె,
నెండుటాకులోని యీనెలవలె లోని
యెమ్ములెల్ల జూచి యెంచవచ్చు.

సంచివోలెనుండె చర్మంబు, ముడుతలై
గాజుబిళ్లలట్లు గండ్లు మెఱయు,
చావలేదుగాని శల్యావశిష్టమై
యూర్చుచుండె! బాధ కోర్చుచుండె!

మూపుపైన కాదు మోకాలిపై కూడ
కాయ కాచియున్న కష్టజీవు,
లెన్ని పుట్ల భూములివ్వి పండించెనో!
పట్టిపోయె నాటి బలసమృద్ధి!

బడియ చేతబూని, యెడనెడ బాదుచు,
తోకవిఱిచి, యెడ్లదోలుచుండె!
కఱకు టెఱుకవోలి కన్పట్టుచున్నాడు!
ఎచటి కివ్వి? వీనినేమిసేయు?

కొమ్ములుండికూడ గుమ్మగా నోపవు
బుస్సుమనవు, యూర్పు వోసికొనుచు,
శాంతమేమి! వీనిసౌజన్యమేమిరా!
యిట్టిచిత్తవృత్తి యెట్టులబ్బె!

లాంగలములు గట్టి, లాగించిబండ్లను,
వీని కష్టఫలము విసువ మెసవి—
క్రియ మొనర్చె దుదకు రెండుపుంజీలకు
పర్వతములవోలు వానియెడ్లు

బలము దఱిగియున్న పశువుల రక్షింప
శాసనంబులేవి? శాలలేవి?

ద్రవ్యమునకు నేడు దాసులైపోయిరి
రైతులార! ప్రేమ రహితులగుచు

పచ్చనీళ్ల కొఱకు బాధింపగాలేదు
పెట్టుగాక నీవు గొట్టుగాక
కండరములు నీదు కలిమికై వెచ్చించి
అసువులొండెయున్న పశువు లివ్వి.

అడవులెల్ల దోటలయ్యె, నాదోటలు
పంటభూములయ్యె, బయళ్లు లేవి?
తిరుగ జోటు లేదు తిన మేతయూ లేదు
పసరములకు నెద్ది బ్రతుకు తెఱవు.

వేరుశనగ, చెఱకు పైరులు మెండయ్యె
ఆ పొగాకుతోట, లంతులేదు-
గింజపైరు కాదు కిట్టింపు—పశులకు
మేత లేదు-మనకు మెతుకు లేదు!

పశుల మేతకసవు ప్రత్యేకముగ బెంచి
మేటివేయు కట్టుబాటు లేదు
పట్టిగడ్డి యెంత బలమైన మేతరా!
అదియునైన జాలినంత యేది?

పంజరములనుంచి పండ్లు గింజలు వెట్టి
పెంచుచుంటి వీవు పిట్టకదుపు
కష్టములకు నోర్చి కనిపెట్టుకొనియున్న
జీవులన్న నేల శీతకన్ను-

పౌరహక్కులనుచు బడిచచ్చుచున్నాడు
మానవుండు బుద్ధిమంతు డౌట!
కరుణ చూపలేడు, ఘనకార్యమా యేమి?
ఈ కనీసధర్మ మెఱుగవలదొ!

# అమరు కాంధ్రీకరణము



శ్రీ నిడుదవోలు వెంకటరావు

అమరుక మమర భాషయందలి శృంగారరసోత్తర గ్రంథము. శృంగారరసగుళిక యని శృంగార రసపేటికయని, శృంగార కంఠాభరణమని రసజ్ఞులు దీనిని గొనియాడెదరు. ఇది కావ్యవిద్యాస్నాతకులకు క్రమభూషణము. సంస్కృత హృదయులకు సంతతాహ్లాదకరము. దీనిని శతకమని సంప్రదాయజ్ఞులు, లఘుకావ్యమని సారస్వత విమర్శకులు—ఖండకావ్యమని నవీనభావుకులు వ్యవహరింతురు.

అమరుక మాదిశంకరులు రచియించిరని యైతిహ్యము. అమరుకవి రచించియుండునని యాంతరంగిక ప్రమాణము. కవి యెవ్వరైన నమరుకమాకృతికర్త కమరత్వము సిద్ధింపజేసినది. సుప్రసిద్ధ సంస్కృతాలంకారికులు, ఆనందవర్ధనుడు వామనుడు, నమరుకము నుదాహరించిరి. కవితాప్రపంచమున నొకప్పుడు కాళిదాసుకన్న ఘనయశస్సు గాంచిన మయూరుడు తన సూర్యశతకమున నమరు శ్లోకచ్ఛాయల ననుసరించె ననుటచేత నమరుక కావ్యప్రఖ్యాతి విశదీకృతమగుచున్నది. దాక్షిణాత్య సంస్కృతకవి స్తుతికెక్కిన 'అమరుకవి' క్రీ. శ. 6 వ శతాబ్దికి ముందువాడనుట నిస్సంశయమే.

అమరుకమందలి శృంగారము వర్ణనాప్రధానము గాదు ధ్వనిప్రధానము. రచన మేకభావసూత్రగ్రథితము గాక, బహు భావసమన్వితము కేవలాలంకారికకవి సమయముల ననుసరించి, కావ్యసృష్టిసేయక, నాయికానాయిక రసభావసందర్భములను సన్నివేశములను రసోల్లసితమగురీతి జీవకళాభాసురములుగా నొనర్చి, యమరుకవి శృంగార రసపోషణము కావించినాడు.

ఇందలి శృంగారము, మేఘసందేశ కావ్యాదులయందలి శృంగారమువలె నేక భావగ్రథితము గాక, భాణములయందలి శృంగారమువలె, నసభ్యము గాక కుచశతకాదులయందలి శృంగారమువలె నున్మాదరూపము వహింపక రసనిష్యందంబై రసికజనాంతఃకరణ సంతతద్రవీకరణ కారణభూతమై వెలయుచున్నది.

సంస్కృత భాషావాఙ్మయమున నమరుక మెట్టిదో ప్రాకృతభాషావాఙ్మయమున హాలుని గాథాసప్తశతి యట్టిది. రెండును శృంగారరసప్రాధాన్యములే. రెండును, కేవల శృంగారరసముచే కావ్యరచన సాధ్యమని దారిచూపినవియే. అయిన రసనిరూపణమున భిన్నపథకములైనవి. దానియందలి శృంగారము, ప్రాకృతముగావున యమాయికపు బల్లెటూరి పడుచువంటిది. రెండవది సంస్కృతము గావున నాగరకతయందాఱితేరి, పలుపోకడ లెఱింగిన సెబిజాణవంటిది. ఒకటి ముగ్ధశృంగారము. వేఱొకటి ప్రౌఢశృంగారము నిరూపించినవి.

## సంస్కృత వ్యాఖ్యలు

సంస్కృతమున నమరుకవ్యాఖ్య లిరువది మనకు లభ్యములగుచున్నవి. 1

(1) రసికసంజీవని - అర్జునవర్మ
(2) అర్జునవర్మ — రసిక సంజీవిని
(3) కవిచంద్రుడు
(4) శోకసంభవుడు
(5) గోష్ఠపురీంద్రసూరి
(6) చంద్రఖంకాలాధరుడు
(7) దేవశంకరుడు
(8) నందలాలుడు - భావబోధిని
(9) నందికేశ్వరుడు

1. *New Catalogus Catalogoram. by Dr V. Raghavan. Published by the University of Madras 1951. Page 251 to 253.*

(10) కామద - జ్ఞానానంద కళాధర రవిచంద్రుడు. ఇది శృంగార వైరాగ్యపరముగా రచితమైనది.

(11) చతుర్భుజమిశ్రుడు - భావచింతామణి
(12) శేషరామకృష్ణుడు
(13) రామరుద్రుడు
(14) రామానందనాథ పండితుడు
(15) విదగ్ధ చూడామణి
(16) విద్యాకరమిశ్ర
(17) వేమభూపాల శృంగారదీపిక
(18) వీరవల్లి శ్రీనివాసాచార్యులు
(19) సూర్యదాసు శృంగార తరంగిణి
(20) హరిహరభట్టు

ఇవి కాక, తంజావూరి రఘునాథరాయల కాలమున (1614 - 1634) శృంగారసంజీవని యను సంస్కృతవ్యాఖ్య యున్నట్లును, నది రఘునాథరాయల కంకితము చేయబడినట్లును నైషధ పారిజాతీయము (అముద్రితము)న నీ క్రింది విధముగ జెప్పియున్నాడు.

"అమరుకాలంకార హారిభంగికల శృంగార
సంజీవనీ కాముకుండు."

పై వానిలో విద్వన్మహాకవి శ్రీనాథుని కాశ్రయదాత యగు పెదకోమటి వేమభూపాలుని వ్యాఖ్య శృంగారదీపిక మిగుల వ్యాప్తిలో నున్నది. ఇది తెలుగు లిపిలో మాత్రమే ప్రకటితమైనది. దేవనాగరి లిపితో నింగ్లీషుభాషా వివరణముతో ప్రకటితమైన యీ వ్యాఖ్యానస్వారస్యమును రాష్ట్రేతర విద్వాంసులు గ్రహింపగలరు.

## తెనుగు టీకలు

అమరుకమునకు తొలుత తెలుగు టీక తాత్పర్యము వ్రాసి ప్రకటించినవారు కీ. శే. చదలువాడ సీతారామశాస్త్రులవారు. వారు దీనిని క్రీ. శ. 1865 సంవత్సరమున రచించి ప్రకటించిరి. ఆ వెనుక చాల కాలమునకు కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారు సంస్కృతాంధ్రవ్యాఖ్యతో ప్రకటించియున్నారు.

## * కానుకొలను అన్నమరాజు

ఆంధ్రవాఙ్మయమున మనకు లభ్యములైన యమరుకాంధ్రీకరణములలో కానుకొలను అన్నమరాజుదే మొదటి కృతియని, చెప్పనొప్పును. ఇది పూర్తిగ లభింపలేదు. కాని యిందుండి ప్రబంధరత్నావళిలో నీక్రిందిపద్య ముదాహృతమై, యాంధ్రీకరణమున్నదని తెలుపుట కాధారమైనది.

"చులుకన జాపముం దిగుచు చో
గటకాముఖ పాళిమీద బె
ల్లాలయునఖాంశులం గదిసి
యొప్పెడు కెంజిగురాకు గుత్తిచే
నలవడి కర్ణపూరమున నంటిన
తుమ్మెదవోని పార్వతీ
లలనకటాక్షదృష్టి మనలం
జరితార్థుల జేయు గావుతన్.

(ఇది యమరుక ప్రారంభశ్లోకమగు "జ్యాకృష్టిబద్ధ కటకాముఖ పాణి పృష్ఠ ప్రేంఖన్నఖాంశుచయసంవలితో మృడాన్యాః, త్వాం పాతు మంజరిత పల్లవ కర్ణపూర లోభ భ్రమత్ భ్రమరవిభ్రమ భృత్కటాక్షః," అనుదాని తెలుగుచేత)

ఈయన్నమరాజు క్రీ. శ. 1494 లో నున్నట్లీ క్రింది శాసనమువలన దెలియవచ్చుచున్నది.

* ప్రబంధరత్నావళి. బ్రహ్మశ్రీ యుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సంపాదితము పుట. 2. ఇందలి పద్యములు ప్రాచీనాంధ్రకృతులనుండి, యిరువురు సంధానకర్తలు (1918) కూర్చిన సంకలన గ్రంథములందలివి. ఒకటి పెదపాటి జగ్గన ప్రబంధ రత్నాకరము. ఇది యముద్రితము—మూడాశ్వాసములవఱకు తంజావూరి పుస్తకాగారమున సంఖ్య (189) గా లభ్యమగుచున్నవి. రెండవది 'ఆంధ్ర సాహిత్యపరిషత్తు'న నుదాహరణగ్రంథమని పేర్కొనబడిన సంకలనము. దీని కర్త పేరు తెలియలేదు. ఇది యు నముద్రితమే. ఈ రెండింటియందలి యపూర్వములైన, కృతులను పద్యములను సంపుటీకరించి, విలువగల పీఠికతో సలంకరించి, గ్రంథరూపమున వెలువరించిన కీ. శే. ప్రభాకరశాస్త్రిపాదులకు నాంధ్రవిద్వల్లోక మెంతయేని కృతజ్ఞత చూపదగియున్నది. నేను కొంత సంస్కారముబడసి పునర్ముద్రితము కాదగియున్నది.

శ్రీగణాధిపతయే నమః శ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1416 అగునేంటి ఆనందసంవత్సర శ్రావణ బ 10 రోహిణీన నక్షత్ర శు(లాల)గ్నమందు యజనయాజనాధ్యయన, యధ్యాపకదాన ప్రతిగ్రహ షట్కర్మనిరతులయిన యజుఃశాఖ, ఆంగీరస బార్హస్పత్య, భారద్వా(జ)సగోత్రులైన కాముంగోలని సూ ర ప రా జు అన్నయ్యకొడుకు అన్నయ్య(ను) శ్రీ తుంగభద్రాతీరం భాస్కర క్షేత్ర మందుల శ్రీపంపా విరూపాక్ష దేవండు ఆయు రారోగ్యైశ్వర్యాభివృద్ధి అగునట్లుగాను ఆ చంద్రార్కస్థాతం రక్షిం(చు)ను. మంగళయ్యన్ శ్రీ శ్రీ జేయున్.

ఈశాసనము హంపీమహాక్షేత్రమున జైన బస్తియాలయమున కెదురుగనున్న రాతిపైనున్నది. ‡ ఇందు పేర్కొనబడిన అన్నయ్యయే, అన్నమరాజు కాదగును. ఈతని తాత సూరపరాజా నామవిూ విషయము తెలుపుచున్నది. మఱియు ఇతడు ఆపస్తంబసూత్రుడనియు భారద్వాజసగోత్రుడనియు, హంపిక్షేత్రవాసియనియు, దెలియుచున్నది. కాముంగోలనే, 'కానుకొలను' అయినది.

ఈ యన్నమయ్య కృతినుండి వేఱొకసీసపద్యము కూడ ప్రబంధరత్నావళిలో నుదాహృతమైనది. అది త్రిపురాంతక దేవునిగూర్చిన దైవస్తుతి. ఆ పద్యము నిందుదహరించుచున్నాడను.

"తివిరి రాశికి నెక్కి తిరుగు చక్రంబులు
మెట్టుల బదిలమై మెఱయు తేరు
బహు ముఖంబుల నేర్పుపచరించు సారథి
వ్రాసిచూపగ రానివారువములు
గట్టియై వీకనక్కఱదీర్చు విలుగమ్మ
ప్రణిహితంబుగ మ్రోతచూపు నారి
విజయానుకూలమై విలసిల్లు బాణంబు
సరిలేనికోట్లుల సంఖ్యబలము
తనకు నబ్బుటయును బురత్రయము గెలిచి
పృథులవిఖ్యాతి గైకొన్న రధికవరుడు
జయము తేజంబు భూతియు ప్రియమెలర్ప
మనల గరుణావిధేయుడై మనుచుగాత."

## 2. తాళ్ల పాక తిరువేంగళప్ప

అన్నమరాజు కృతి తరువాత పేర్కొనదగినది తాళ్ళపాక తిరువేంగళప్ప యాంధ్రీకరణము. ఈ యాంధ్రీకరణ మముద్రితము. గ్రంథము చివర నిట్లు చెప్పుకొనియున్నాడు.

"ఇల దాళ్ళపాక సత్కుల
తిలకుడు, శ్రీ వేంకటేశ దీక్షిత సుతు డు
జ్జ్వల కవితానిధి తిరువేం
గళప్ప యమరుకము తెలుగుగా రచియించెన్."

తిరుపతి క్షేత్రమున సంకీర్తనాచార్యులై ప్రఖ్యాతిజెందిన తాళ్ళపాకవారి వంశీయుడగు నీ తిరువేంగళప్ప క్రీ. శ. 1600 ప్రాంతమున నున్నవాడు. తన గ్రంథమును తిరుపతి వేంకటేశ్వరునికే కృతి నొసగియున్నాడు. ఈ యమరు కాంధ్రీకరణము సంపూర్ణముగ నున్నది. చాలవఱకు చంపకములు, ఉత్పలములు వాడుకయైనవి. లెక్కకుగా మత్తేభ శార్దూలములు, కందములు వాడబడినవి. కేవల శృంగారరస ప్రధానమగు నిట్టి కావ్యమున, వీరరసానుగుణ్యములగు మత్తేభ శార్దూల వృత్తముల వాడిక సరసముగా నుండదను తలంపున నీతడు వానిని వీడియుండవచ్చును. అముద్రితముగాన దీనినుండి కొన్ని పద్యముల నుదాహరింతును. మూలమున ప్రతి పద్యమునకు ముందు వ్యావహారిక భాషలో చిన్న వివరణము వచన రూపమున నున్నది.

"శ్రీరుచిరాంగనాశ్రమవిచిత్ర
విభూషణసూన చందనో
దార విలాసదీపితమునై, యసి
తోత్పల కాంతి మించి, శృం
గారరసంబు శోభనన గన్నుల
పండువులైన మేని యొ
య్యారముజూపు వేంకటనగాధిపు
డీవుత మాకు గోరికల్."

"వచనము— శృంగారరసప్రధాన మమరుక కావ్యము. శృంగారము :- సంభోగము, విప్రలంభము అని రెండు విధములు. అందులో సంభోగ శృంగారం

‡ దక్షిణ హిందూదేశ శాసన సంపుటములు. 4 సంపుటము. నెం. 271 రు. 60 పుట హంపీక్షేత్ర శాసనములు.

మొదలుగా నుపయోగించి శృంగార రసానకు ఆలంబన విభావమైన నాయికాస్వరూపమునే దేవతగా భావించి, తృతీయ పురుషార్థమును గూర్చి, ఆశీర్వచిస్తూన్నాడు."

"చెదరి చలించు ముంగురులు,
స్వేదకణంబుల నింతజాలు బొ
ట్టొదవు రతాంత కాంతిమెయి
నొయ్యన సోలెడు కన్నుదామరల్
కదలెడు కుండలంబులును
గల్గిన పౌరుషభాసమానయా
ముదిత ముఖారవింద మతి
మోదము మీకు నొసంగు గావుతన్."

(ఇది 'ఆలోలామలకావళిం' అను శ్లోకమునకు తెలుగుచేత. మూల శ్లోకములోని చివర పాదమున 'వత్వాం పాతు చిరాయ కిం హరిహర బ్రహ్మాదిభి ర్దైవతైః' అను భావము పై పద్యములో ననువదింపబడ లేదు.)

"చెలువుడు వచ్చువేళ సరసీరుహ
లోచన, మంగళార్థమై
కలువల గాదు తోరణము గట్టుట;
వాలిక చూపుదండనే;
యలరుల గాదు మించు టుపహారము;
నవ్వుల గాని, యర్ఘ్యముల్
కలశగతాంబుపూరమున గాదు
చెమర్చును రోజపాళిచేన్."

"మ్రొక్కగ వచ్చు నాత డటమున్
గని యంఘ్రులు మూయు కోకచే
పక్కన నవ్వు దానొక నెపంబున
గప్పు; ప్రియోక్తులాడు నా
దిక్కటు చూడకే చెలుల దిక్కయి
ముచ్చటలాడుచుండు నీ
చక్కరబొమ్మ ప్రేమ కడుచక్కన
పోబోలయల్క నెచ్చెలీ!"

"యావరసార్ద్రిమున్ కిసలయారుణ
కోమలమున్ వినూత్న
రత్నావళీ నూపురంబును,
మదాలసభారము నొపదంబుచే
నేవరపూరుషుండు ప్రణయేర్ష్య
బరాంగనచేత తాడితుం
డైవిలసిల్లు వాడు కుసుమాయుధ
దేవునకుం బ్రియుండగున్."

ఇది "సాలక్తకేన నవపల్లవ కోమలేన" అను శ్లోకమునకు తెలుగు.

గ్రంథసూచి.

1. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార నివేదిక-(1911-12-13) R 107-K-4-25.

2. శతకకవులచరిత్ర. పుట 134-135...1924 (వంగూరు సుబ్బారావు)

3. తిరుపతి దేవస్థానమువారి యార్షశాఖా నివేదిక. 300 పుట.

4. ప్రాచీనాంధ్ర కవులు. తాళ్లపాకవారు. భారతి; ధాత-మార్గశిరము.

5. శిష్టు సర్వశాస్త్రి యమరుక కావ్యపీఠిక. పుటలు—3-4 (1937) 841-842 పుట.

తాళ్లపాక తిరువేంగళప్ప కృతి వెనుకనధునా తన వాఙ్మయమున నమరు కాంధ్రీకరణములు విశేషముగ గన్పట్టుచున్నవి. వీనిలో తొలికృతి యాంధ్రీ కర్త.

## 1. శిష్టు సర్వశాస్త్రి (1830-1860)

శిష్టు సర్వశాస్త్రి, మహోద్దండకవి పండితుడు, సంగీత సాహిత్య విద్యానిధి శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి కొమారుడు. క్రీ. శ. 1860 సంవత్సరమున నమరుకమును దెలిగించి, తన కాశ్రయుడును శ్రీకాళహస్తి ప్రభువును నగు దామెర వేంకటపతి రాయనింగారికి కృతినిచ్చెను. ఈతడు విద్వత్ప్రభువు. సుప్రసిద్ధ పండితకవి మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులవారికి 'విద్వత్కవీశ్వర'బిరుదమునిచ్చి సత్కరించిన దీ ప్రభువే—ఈతడు క్రీ.శ. 1819—1881 మధ్య జీవించియుండెను. కృతికర్త సర్వశాస్త్రి యమరుక మేకాక, జ్ఞానప్రసూనాంబికా శతకము, లలితాంబాస్తుతి, అచ్చిగాని తారావళి, చాటువులు మున్నగునవి రచించి కొంతకాలము రాయవేలూరున దొరతనమువారు స్థాపించిన హూణ పాఠశాలలోను సంస్కృతోపాధ్యాయుడై తరువాత

కాళహస్తి సంస్థానకవియై కీర్తిశేషుడయ్యెను. ఈతని యమరుకము - 1937 లో ముద్రితమై ప్రకటితమైనది. ఇది సంపూర్ణానువాదము. గ్రంథసూచి :

1. వీరేశలింగముగారి యాంధ్రకవులచరిత్ర— తృతీయభాగము పుట 199. శిష్టు కృష్ణమూర్తికవి జీవితము.

2. జ్ఞానప్రసూనాంబికాశతక పీఠిక—జ. రామయ్య—ఆంధ్ర సాహిత్యపరిషత్ప్రచురణము—1916.

3. ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార సూచిక—(1917—18) పుట సం. 299.

## 2. మండపాక పార్వతీశ్వరశాస్త్రి (1833 - 1897)

అభినవాంధ్రకవితా పితామహు డనియు, అనర్గళకవనధారాపారీణు డనియు వాసిగన్న పార్వతీశ్వరశాస్త్రిగారు దీనిని క్రీ. శ. 1863 లో నాంధ్రీకరించి 1893 లో ముద్రించిరి. ఇది రెండు మూడు తడవలు ముద్రణభాగ్యము నందినది. ఇందలి పద్యములు వెంకటగిరి సంస్థానమువారు ప్రకటించిన శృంగార పద్యావళి యను సంకలనగ్రంథమున నుదాహృతములైనవి. మఱియు, కీ. శే. వెల్లాల సదాశివశాస్త్రి, శేషశాస్త్రిగారును క్రీ. శ. 1901 లో ప్రకటించిన నరసభూపాలీయ రసప్రకరణ నాయికానాయికప్రకరణవ్యాఖ్యయం దిందలి పద్యములు లక్ష్యములుగా గైకొనబడినవి. దీనినిబట్టి యీ యాంధ్రీకరణమున కెంత వ్యాప్తియున్నదో తెలియగలదు. ఇందలి

"శ్రీ కటకాముఖం బనెడుచేత
  గొనంబు గొనం బయిం బయిం
బ్రాకు నఖప్రభంగలయ బర్వుచు,
  మంజరిత ప్రవాళపుం
జాకృతి కర్ణభూషణ సమాదర
  చంచల చంచరీక లీ
లాకరమై తనర్చు జగదంబ
  కటాక్షము మిమ్ము బ్రోచుతన్."

"గృహకీరంబు నిశిన్ వధూవర
  రతిక్రీడోక్తులాలించి తా
నహరాదిన్ గురుసన్నిధిన్
  జదువగా నత్యంతలజ్జార్తయై
మహిళారత్నము కర్ణపూరవిల
  సన్మాణిక్యమున్ దాడిమీ
కుహనన్ చంచుపుటంబున న్ని
  లిపి గైకోచేసె వాక్స్తంభమున్."

మొదలగు పద్యములు ప్రాచీన పండితులకు పరిచితములే. దీనినిగూర్చి "కళ్యాణి సంక్రాంతి సంచిక" (1934) లో వారి మనుమలు కీ. శే. మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు (1883 - 1940) వ్రాసిన వ్యాసము చదువదగినది.

## 3. వారణాసి అచ్యుతరామకవి (క్రీ. శ. 1820 - 1890)

కలియుగ దానకర్ణు డని ప్రఖ్యాతి గాంచిన జయంతి కామేశము పంతులుగారి (1841 - 1884) యాజ్ఞ ననుసరించి, వారి యాస్థానకవి అచ్యుతరామకవి యమరుకమును క్రీ. శ. 1870 ప్రాంతమున తెనిగించెను. ఇందన్నియు సీసపద్యములే. వీనిలో నెనుబది యెనిమిది పద్యములు చెన్నపురి ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున గలవు. అందలి నివేదికలో యత్కర్తృకమో తెలుపబడియుండలేదు. అచ్యుతరామకవి కామేశము పంతులుగారి కృతి నొసగిన 'శ్రీకృష్ణకథాసుధారసము' అను ప్రబంధమున, తానీ యమరుకమును సీసపద్యములలో రచించినట్లు తెలిపినాడు (చూడుడు. శ్రీకృష్ణకథాసుధారసము - అవతారిక) ఈ ప్రబంధము ముద్రితమైనది.

## 4. సాధుపల్లి చంద్రశేఖరశాస్త్రి 1890 ప్రాంతము

ఈతడు బెంగుళూరి వాస్తవ్యుడు. సంస్కృత కర్ణాటాంధ్ర భాషలలో గవి. శ్రీ సచ్చిదానంద నృసింహ భారతీస్వామిశిష్యుడు దేవ్యుపాసకుడు. మనుచరిత్రమును కన్నడమున వ్రాసినాడు. ఈతని యాంధ్రీకరణమున చంపకోత్పల శార్దూల మత్తేభ వృత్తము లొక్కొక్కదాని కైదారు పాదములు గలవు. ఈ యాంధ్రీకరణము 1898 లో వేమభూపాల సంస్కృతవ్యాఖ్యతో గూడ బెంగుళూరిలో ముద్రితమైనది.

### 5. జయంతి రామయ్య. (1861-1941)ం

గ్రాంథికవాదాగ్రేసరులు, రామయపంతులు గారు, అమరుకమును క్రీ. శ. 1902 ప్రాంతముల నాంధ్రీకరించి, అప్పటికి రాజకీయోద్యోగ నిర్బంధముచే ముద్రింపక, క్రీ. శ. 1932 లో పలువురు విద్వత్ప్రభువులు ప్రోత్సహింప ముద్రించిరి. ఇది మూలముతోగూడ, సరసమైన యాంధ్రీకరణముతో ముద్రితమైనది.

### 6. వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రి

ఈతడు తిరుపతి సంస్కృత కళాశాలయందు సాహిత్యాచార్యుడు. ఇటీవల కీర్తిశేషుడు. ఈతని యమరుకమున పద్యములు భారతిలో ప్రకటితము లైనవి.

### 7. చెలుకూరి కాళహస్తీశ్వర శర్మ

సులభశైలితో రచితమైన యీ యమరుకాంధ్రీకరణము 1931 లో 'సమదర్శిని' సంవత్సరాది సంచికలో ప్రకటితమైనది.

### 8. మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి

విశాఖమండలమున పాలకొండ వాస్తవ్యుడగు మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రియను కవి దీనిని చక్కగ భాషాంతరీకరించియున్నాడు. ఇది ముద్రితమయ్యు ప్రకటితము కాలేదు.

### 9. గుఱ్ఱము సుబ్రహ్మణ్యము ఎమ్. ఏ. బి. యల్

వీరి యమరుకాంధ్రీకరణము క్రీ. శ. 1938 లో ప్రకటితమైనది. శ్రీయుత కొటూరి వేంకటేశ్వరరావుగారి పీఠికతోగూడ వెలయుచున్నది. తెనిగింపు సమీచీనముగ నున్నది.

### 10. వింజమూరి శివరామారాయకవి

### 11. పెనుమర్తి వేంకటేశ్వరశాస్త్రి

### 12. ఘట్టిలక్ష్మీ నరసింహశాస్త్రి

వీరు మువ్వురు నీ తరువాత నమరుకము నాంధ్రీకరించిరి. ఈ యాంధ్రీకరణముపై విమర్శకాభిప్రాయ మిది. 1 శివరామంగారి రచన ద్రాక్షాపాకము.

2. పెనుమర్తివారి రచన కదళీపాకము.

3. ఘట్టివారి రచన నారికేళపాకము.

(భారతి. 20 సం. 7 సం 98 పుట 1943 జూలై) ఘట్టివారు నేడు తమ రచనమును పునర్ముద్రణము చేసి యున్నారు. అది భారతిలో విమర్శింపబడినది.

వీరుగాక శ్రీ నండూరి శివరావుగారును, కీ. శే. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారును దీనిని తెనిగించిరట. ఇంకను నా గవేషణకందని యనువాదములుండవచ్చును. నాకు దెలిపిన చేర్చెదను.

సంస్కృత గ్రంథానువాదముల చరిత్ర తెలుసుకొనుటకేమి, ఏక కథావృత్తము గ్రహించిన కవులను గూర్చి సమగ్రముగను, సప్రమాణముగను పరిశ్రమ చేయుటకేమి, ఆయా గ్రంథసూచికలు ముద్రితాముద్రిత వివరణముతో గూడ నేడత్యంతావశ్యకమైయున్నది. అట్టి యాంధ్రగ్రంథ సూచికా సర్వస్వ రచనకు ప్రోత్సహించుటకీ వ్యాసముద్దేశింపబడినది.



# వియోగాగ్ని



'మధుశ్రీ'

ఊహాకతీతమైనది; మహోన్నతమైనది ; దిక్యశక్తి సం
దోహముతోడఁ గూడినది ; దుఃఖములేనిది ; భీతిగాని, సం
దేహముగాని చేరనిది ; తృప్తికరమ్మయి సర్వలోక స
మ్మోహనమైన యట్టిదియుపో ! ప్రణయ—మ్మది యెంత గొప్పదో!

చెలి ! నీనా ప్రణయామృతాంబునిధి వీచీమాలికా డోలికా
వళి నిన్నున్ మఱి నన్ను నేదోయొక స్వప్నభ్రాంతిగా మేఘ వీ
థులపై దేవవధూ రహస్స్థలులయందున్, ద్రిప్పి, నానాఁటి వే
ళల యందెప్డోయొకప్డు—స్వర్ణసుమముల్ వ్రాలెన్ శిరోఽగ్రమ్ములన్.

అంతియ ! దానితోసరి! మహావిష దంష్ట్రిలఁ బోలు తత్ స్మృతుల్
స్వాంతమునందునన్ నిలిచి శాశ్వతదైన్య విషాద వహ్ని సం
క్రాంతిగఁ జేయుచున్నవి—సుఖమ్మెటువంటిదో యేనెఱుంగఁ గ
ర్ణాంత విలోచనా! కనికరమ్మును జూపెడివారె లేరుపో !

నీవొక దేవకన్యకవు ! నేనొక రాక్షసమూర్తినేమొ ? దే
వీ ! వరమిచ్చి మెచ్చితివి, విభ్రమచిత్తుఁడనై ప్రమోదరే
ఖావధి దాఁటులోపలనె కన్నులు విప్పితిఁగాని నిన్ను బా
ష్పావృత దృష్టియుక్త నయనాంచలసీమలయందుఁ గంటినా ?

ఒకఁడెవఁడో మహోజ్జ్వల మహోన్నత సత్కవిరాజు వానినా
టకమున సృష్టిచేసిన రటన్నటివౌదువు నీవు, కాని—మా
యను వశమైన లోకములయందెటనైనను నిన్నుఁబోలు నా
యకి జనియించెనా ? హృదయమందలి భ్రాంతులు వాల్చెఁ గ్రాంతులై !

ఇది వియోగాగ్ని !—దీని నీవే యొసంగి
నావు—నీ బహూకృతి శిరసా వహింతుఁ ;
గాని, వన్నెల విసనకఱ్ఱా ! ననున్ మ
ఱెంతకాల మహార్నిశ లేద్వ మనెదు?

# కలగూరగంప

## శృంగార రసమంజరి

విక్రుతి భాద్రపద శుద్ధములో ఆంధ్రగానకళా పరిషత్తు (రాజమహేంద్రవరము) వారిచే ప్రచురింపబడిన క్షేత్రయ్య పదములను గ్రంథములో అనుబంధముగా 'శృంగార రసమంజరి' ప్రకటింపబడినది. నా సంపాదకత్వమున వ్రాయబడిన "తొలిపలుకులో (పుటలు 52 - 58) 'క్షేత్రయ్య పదములు - అలంకార శాస్త్రము' అను శీర్షిక క్రింద నాటికి నాకు లభ్యమైన విషయము ననుసరించి ఇట్లు వ్రాసితిని. "ఈ వివరణకు 'శృంగార రసమంజరి' యని పేరు. దీని కర్త యవరో తెలియదు......ఆంధ్రసారస్వతములో క్షేత్రయ్యపదముల స్థానమును, విలువను నిర్ణయించుచు ఈ గ్రంథకర్త చేసిన సేవ చిరస్మరణీయము." ఈ వివరణయంతకు కర్త యొక్కరే యను యుద్దేశముతో అట్లు వ్రాసితిని. కాని సుమారు నెల రోజుల క్రిందట ఈ వివరణయొక్క కర్త లిద్దరని స్పష్టమైనది. ఈ విషయమును క్లుప్తపరచుచున్నాను.

నెలదినముల క్రిందట విజయనగరము వెళ్ళియుంటిని. అచ్చటి మహారాజావారి సంగీత కళాశాలలోని శ్రీ దువ్వూరి జగన్నాథశర్మగారిని—నాట్యాచార్యులను— కలసితిని. ప్రసంగసందర్భములో వారు, శృంగార రసమంజరీ కర్త, గుడిపాటి కోదండపతి యని, వారి గ్రంథము 1901 లో అచ్చైన దని, అది వారివద్ద కలదని చెప్పి నా కది దయతో ఇచ్చిరి. ఈ విషయము శ్రీ వీరేశలింగము పంతులు గారు వారి ఆంధ్రకవుల చరిత్రలో మూడవ భాగములో వ్రాసియున్నారనికూడ వారు సెలవిచ్చిరి. ఈ విషయము వారు నాకు తెలియజెప్పినందుల కెంతయు కృతజ్ఞుడను.

అందుపైని రాజమహేంద్రవరములోని శ్రీ గౌతమీ గ్రంథాలయమునకు జని అచ్చట యా విషయమై కనుగొనగా, 1901 లో అచ్చైన శృంగార రసమంజరియే గాక, 1872 లో అచ్చైన 'సంస్కృతాంధ్ర రసమంజరి'కూడ లభ్యమైనది. ఇది వింజమూరి కృష్ణమాచార్యులవారి చేతను బ. సీతారామాచార్యులవారిచేతను పరిష్కరింపబడి, వింజమూరి కృష్ణమాచార్యులవారిచే రచింపబడిన మకరంద మనెడి వ్యాఖ్యానముతోడ, ఊ. పుష్పరథ సెట్టిగారిచే చెన్నపురిలోని స్వకీయ కళారత్నాకర ముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రకటింపబడియెను. ఇందు భానుదత్త కవికృత సంస్కృత రసమంజరి మూలములోని ఒక్కొక్క శ్లోకమునకు ప్రతిపదార్థము వ్యాఖ్యానము (మకరందనామవ్యాఖ్యానము)తరువాత గుడిపాటికోదండపతికవిచే ఆంధ్రీకరింపబడిన వచనము, పద్యము వరుసగా ఇయ్యబడినవి. ఇందలి ఆంధ్రభాగము మాత్రమే 1901 లో అచ్చువేసిరి. దాని వివరణ మిట్లు "సురతాని కోదండపతి కవివరప్రణీతంబైన శృంగారరసమంజరి— ఇయ్యది పండితులచే బరిష్కరింపబడి వంకాయల కృష్ణస్వామిశెట్టివారి స్వకీయ శ్రీరంగవిలాస ముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రచురింపబడియె. చెన్నపట్టణం—1901 సీనివెల అ ౨" ఈ తెలుగు రసమంజరికిని పైన చెప్పిన 1872 లో ముద్రితమైన దానిలోని తెలుగు అనువాదమునకును అచ్చటచ్చట కొద్దిపాటి భేదములు కలవు. కాని సముదాయముమీద ఒకటే గ్రంథము. 1872 లో అచ్చైనదే శుద్ధముగా యున్నదని చెప్పవలసియున్నది. ఇదివరలో నాకు లభ్యమైన భానుదత్తుని సంస్కృత రసమంజరి, నాగర లిపిలో ముద్రితమైనది. అందు అనంతభట్టుచే రచించబడిన వ్యంగ్యార్థ కౌముదియను వ్యాఖ్యానము కలదు. తెలుగులిపిలో ముద్రించిన ఈ సంస్కృతాంధ్ర రసమంజరిలో అనంతభట్టు వ్యాఖ్యానములేదు.

గుడిపాటి కోదండపతి నందవరీకనియోగి బ్రాహ్మణుడు, ఆశ్వలాయన సూత్రుడు, భారద్వాజ

గో త్రుడు, సురతాని బిరుదాంకితుడగు వేంగళమంత్రి పౌత్రుడు, రంగయామాత్యునకు వీరమాంబకును బుత్రుడు. ఇతడు మూడుగుచ్ఛములుగా తెనిగించిన శృంగార రసమంజరిలోని తృతీయగుచ్ఛము చివరను గల గద్య ఇట్లున్నది.

"ఇది శ్రీమత్కోదండరామ వరప్రసాదలబ్ధ చతుర్విధ కవితాధురీణ భారద్వాజగోత్ర పవిత్ర, వేంగళమంత్రిపౌత్ర, రం గ యా మా త్య పుత్ర, సత్కవిజనమిత్ర, సకవిలతాలవిత్ర, గుడిపాటి వంశ పయః పారావార రాకాసుధాకర, సురతాణికోదండ పతి ప్రణీతంబైన శృంగారరసమంజరియందు, చత్వారింశ త్పద్యదళంబులుం చతుర్దళవచనకేసరంబులుం గలకుసుమపంచకంబు చే నొప్పారు తృతీయగుచ్ఛము"

మరియు నీ గ్రంథాంతమున నివ్వబడిన రెండు పద్యముల నుదహరించుచున్నాను.

"శ్రీరంగనాయకీ నవ
నీరజమృదుపాదములను నే బూజింతున్
శ్రీరంజిలు రసమంజరి
సూరిస్తుత పారిజాత సుమమంజరిగన్."

"శ్రీకరనందవరీ కాగ్రగణ్యుండు వహిమీటు
గుడిపాటి వంశభవుడు
బిరుదుగా నవఖండ సురతాణి పేరంది
మహితుడౌ వేంగళమంత్రి.పౌత్రు
డతులితుడౌ రంగయామాత్య తనయుండు
వీరమాంబానంద వృద్ధికరుడు
సింగన్న వెంగళ శ్రీనిధులనుజులై
భాసిల్లు కోదండపతి ఘనుండు
సరస కవితా చమత్కార సార్వభౌము
డవని శ్రీరంగధామ దయాశ్రయుండు
నెలమి రసమంజరిని రచియించెనందు
సరవిగా దృతీయగుచ్ఛంబు దనరు.

ఇతడు 'శ్రీరంగనాథ దయాశ్రయుండ' నని 'శ్రీరంగేశ్వరి రంగనాయకిని నేజింతింతు నెల్లప్పు' డని కృత్యాదియందు శ్రీరంగనాథుని శ్రీరంగనాయకిని స్తుతించుచు పద్యములు వ్రాయుటచేతను శ్రీరంగ ప్రాంతములయం దిత డుండెనేమో యని చెప్ప వచ్చును. కృత్యాది పద్యములలో ఇవి కొన్ని.

"శ్రీరంగనాయికా కుచ
సారంగమదార్ద్ర పత్రజయశాసన, లే
ఖారుచిరభుజాంతరుడగు
శ్రీరంగేశ్వరు డభీష్టసిద్ధు లొసంగున్."

"నందవరవంశ జలధిపూర్ణేందులీల
రసికుడగునట్టి సురతానిరంగ ఘనుని
సుతుడు కోదండపతికృతి ప్రతిమొనర్చు
మంజులరసపుంజ శృంగారమంజరిగను."

"మధుర మాధ్వీక ఫణితిగా మధువితీర్ణ
వాసనావాక్య సౌరభ్యవాసరసిక
మధుకరా నందకర రసమంజరియును
దనరు కవిరాజకర్ణావతంస మగుచు."

ఇత డే కాలమువాడో తెలియదు. "ఇన్నూలు సంవత్సరముల క్రిందట నుండియుండు నేమో" యని శ్రీ వీరేశలింగము పంతులుగా రభిప్రాయపడియున్నారు.

క్షేత్రయ్య పదములతో అచ్చువేసిన శృంగార రసమంజరికిని దీనికిని కొన్ని ముఖ్యములగు భేదములు కలవు. క్షేత్రయ్య పదములతో అచ్చువేసిన దానిలో రెండు భాగము లున్నవి పుటలు 219 - 237 లలోని వచనములో నియ్యబడిన నాయికాది లక్షణమంతయు కోదండపతి శృంగార రసమంజరిలోని వచనభాగమే. తరువాతి 238 - 258 పుటలలోని "(క్షేత్రయ్య పదములనుండి లక్ష్యములు - సమన్వయము)" అను శీర్షిక క్రింద అచ్చైనదంతయు చాలవరకు కోదండపతి కృతిలోనిదే యని చెప్పవలెను. మొదటి రెండు పుటలలోని మూడు పద్యములు లా కవి వ్రాసినవే. భాను దత్తుని రసమంజరిలో లక్షణము - వచనము, శ్లోకముల తోను లక్ష్యము శ్లోకరూపమునను ఇవ్వబడినవి. కోదండపతి, శృంగార రసమంజరియందు లక్షణమును వచనమున తెలుగులో వ్రాసి, లక్ష్యములను పద్యములలో వ్రాసెను. క్షేత్రయ్య పదములతో ముద్రితమైన శృంగార రసమంజరిని రెండు భాగములుగా నెవరో క్రమ తీసికొని, వ్రాసిరి. నాయికాది లక్షణములకు లక్ష్యములుగా వ్రాయబడిన పద్యములను వదలి ఎక్కువగా క్షేత్రయ్య పదములనుండి లక్ష్యములను జూపియున్నారు. సురతాని కోదండపతి క్షేత్రయ్య పదములగురించి ఏమియును వ్రాయలేదు. అందుచేత

ఈ విధముగా శృంగార రసమంజరిని విడదీసి వచన భాగమును—(లక్షణముల నిచ్చిన భాగమును)— మాత్రము మొదట వ్రాసి లక్ష్యములక్రింద సుప్రసిద్ధ పదకర్తల పదములను చేర్చి రెండవ భాగముగా విడదీసిన వారెవరో ఇంకను స్పష్టపడలేదు.

మరియు రెండవ భాగమున నీ యజ్ఞాత సంపాదకుడు, లక్షణములను దెలుపు కోదండపతికృత వచనమును వ్రాసి, తరువాత "ఇందు కుదాహరణము 'నన్నేటికి బొమ్మనేళే' వానివద్దకి. ౧." అనునట్టి స్వంత రచనలను చేర్చినాడు. ఈ వచన భాగమంతయు శృంగార రసమంజరి కర్త వ్రాసినదే. దీనినే క్లుప్తపరచి మొదటి భాగముగా (219—37 పేజీలలో అచ్చువేసినది) ఈ సంపాదకుడు వేరే వ్రాసియున్నాడు. అందుచేత నే వాక్యములలో కొంత భేదమున్నది. (పట్టికలు ప్రక్క పుటలో)

ఈ మూడు పట్టికలను*, శృంగారరసమంజరీ భాగమున క్షేత్రయ్య పదములతో, గ్రంథ విస్తర భీతిచే ముద్రించలేదు. విషయమంతయు లక్ష్య వివరణయం దివ్వబడినదేగదా యని ఈ విభాగములు గల పట్టికలను అచ్చువేయుట మానుటయైనది. కాని ఇప్పుడు ఈ శృంగార రసమంజరి కర్త యెవరను నిరూపణ విషయము వ్రాయుచుంటిని గాన కర్త లిద్దరు కలరని, మొదటివారు కోదండపతికవి యని, రెండవవారు మువ్వగోపాల పదములను, ఇతర పదములను శోధించి వాటికి లక్షణములను నిర్ణయించి వివిధరీతుల విషయవిభాగ మొనర్చినవారని చెప్పవలసి వచ్చినది గాన, ఈ యజ్ఞాత పురుషునిగురించి వివరముగా వ్రాయుటకై ఈ పట్టికలను కొంత ఉదహరించియున్నాను.

ఈతడు కోదండపతికవికంటె బాగా తరువాతి ఆధునికుడైయుండును. ఏమనగా, మొదటి పట్టికలోని అచ్చు గ్రంథములలోని రెండవదానిలో గల అంకెలనుబట్టి పదములను సరిచూడగా క్షేత్రయ్య పదములకు వ్రాసిన తొలిపలుకులోని 35 పుటలో ఉదహరించిన 1862లో ముద్రితమైన గ్రంథములోని పద సంఖ్యగా కనిపించుచున్నది. అందుచేత ఈతడు 1860 ప్రాంతమునకు తరువాతనే వ్రాసియున్నట్లు చెప్పవలెనేమో. 1862 నకు పూర్వమచ్చైన గ్రంథమేదైన యొకటియుండి అందును ఇదేరీతి పదసంఖ్య యుండినచో 1862కు పూర్వుడని చెప్పవచ్చును. ఈతని పేరు, ఊరు, కాలము ఇప్పటికి నాకు తెలిసినంతవరకు నిర్ధారణ కాలేదు.

వికృతి మాఘమాస 'భారతి'లో 162 పుటలో శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు సభాపతయ్య పదములగురించి వ్రాసిన వ్యాసములో ఇట్లు ఫుట్‌నోటులో వ్రాసియున్నారు. "...క్షేత్రయ్య పదములతో చేర్చి ముద్రించిన 'శృంగారరసమంజరి'ని రచించినదియు, క్షేత్రయ పదములలో గొన్నిటికి నాయికా, నాయక రసభావాది నిర్ణయము గావించినదియు, నీ పదములకు (సభాపతయ్య పదములకు) వివరణాదికములు వ్రాసి ప్రకటించిన శ్రీ నీ. మా. తిరువెంకటాచార్యులవారే యని తలపదగియున్నది. వేఱువిధమయిన ప్రామాణికాధారము లభించునంతవఱకు నీ యూహ సరియయినదే యనుటకు బయి ప్రకటనములోని వాక్యముయొక్క సాక్ష్యము చాలునను కొందును"

పైన నేను వివరించినదానిబట్టి 'శృంగార రస మంజరి' కర్త గుడిపాటి కోదండపతి యని సప్రమాణముగా చెప్పవలసియున్నది. రెండవవా రెవరను విషయములో విషయసామ్యమునుబట్టి శ్రీ తిరువెంకటాచార్యులవా రయిన కావచ్చును. కాని, సభాపతయ్యగారి పదములను*1884 మార్చి నెలలో చెన్నపట్టణములోని శ్రీవాణీనిలయ ముద్రాక్షరశాలయందు ముద్రించడమైనది. అందీ పదములకు 'శ్రీ తిరువెంకటాచార్యులవారు సంగ్రహించిన యాంధ్ర వాక్యరూపమయిన నాయికా నాయకాది లక్షణములును, రస మంజరి యుదాహరణ శ్లోకములును నొసగబడియున్నవి'. పరిష్కర్తలచే 'గ్రంథమునకు దొలుత గావించబడిన ప్రకటనము'లో ఇట్లున్నదని తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారి వ్యాసములో గలదు.

"........భావజ్ఞేతరులకు సయితము విశదపడునట్లు ముందు ఉపోద్ఘాతమును, ఆవతల రాగము, తాళము, పదము, నాయకి, నాయకుడు, రసము, సంచారీభావము, అలంకారమును, ఒకటి వెంబడి నొకటి క్రమముగాను — కడపట రసమంజరీ శ్లోకోదాహరణములను జేర్చి—అతిప్రయాసమునకు వెనుదీయక

పట్టికలు *

*I* మరియు, నీ సంపాదకుడు, ఇంక నెంతో శ్రమదీసికొని లక్షణములకు లక్ష్యములుగా తా నిచ్చిన పదములను అకారాదిగా ఒక పట్టీలో నిచ్చినాడు. అందులోని క్షేత్రయ్యపదములకు తాను సంపాదించిన రెండు అచ్చుప్రతులలోను, రెండు వ్రాత ప్రతులలోను నివ్వబడిన పదసంఖ్య నిచ్చి నాయికా భేదములను కూడ ఇచ్చియున్నాడు. ఉదాహరణమునకై కొన్ని పంక్తులను వ్రాయుచున్నాను.

*II* ఈ విషయమునే మరియొక రీతిని విభాగించి పట్టికగా వ్రాసియున్నాడు. లక్షణములలో చెప్పోన్న వరుసలోగల వివిధనాయికాదులకు వరుసగా తెలుపుచు లక్షణమునకు ఎదురుగా లక్ష్యముయొక్క ప్రారంభము నిచ్చినాడు.

*III* మరియు ఈ విషయమునే ఇంకొకరీతిని పట్టికగా ఇచ్చియున్నాడు.

| (1) లక్ష్యము | అచ్చు | | వ్రాత | | లక్షణము |
|---|---|---|---|---|---|
| అందగాడనౌదు వేర ఆదివరాహ | ౧౪ | ౧ | ౪౭ | ౧౫౫ | సామాన్య, ఖండిత |
| ... ... ... ... ... | ... | ... | ... | ... | ... ... ... ... ... |
| అనుకోప నేమున్నది–యక్కర | ౭ | ౧౧ | ౨౫ | ౬౩ | స్వీ. ప్రౌఢ. దివ్య |
| ... ... ... ... ... | ... | ... | ... | ... | ... ... ... ... ... |
| పరదేశమున జేసిన పనులింటు | ౧౨౬ | ౧౫౩ | ౩౧ | ౭౦ | స్వీ. ప్రౌఢ. ప్రేమగర్విత |
| ... ... ... ... ... | ... | ... | ... | ... | ... ... ... ... ... |
| మంచిదానవే చెలియ మాటలకు | ... | ... | ౬౧ | ౨౨౦ | ప. పరోఢ. ఉపపతి శఠుడు పరిహాసం |
| ... ... ... ... ... | ... | ... | ... | ... | ... ... ... ... ... |

| (2) లక్ష్యము | నాయికా భేదము |
|---|---|
| నన్నేటికి బొమ్మనేరే, వాని వద్దికి | స్వీయ ; ముగ్ధలో, నవోఢ |
| ... ... ... ... ... | ... ... ... ... |
| ఈ మేను జీవునకు యింత ప్రియమాయెన్ | స్వీయ ; ప్రౌఢ–విప్రలబ్ధ |
| ... ... ... ... ... | ... ... ... ... |
| అలుకదీరెనా నేడైన మీ | స్వీయ ; సఖిప్రౌఢ–పరిహాస లక్షణము |
| ... ... ... ... ... | ... ... ... ... |
| ఇటువంటివాడని నే దెలియ | ప, పరోఢ–గురుమాన |
| ... ... ... ... ... | ... ... ... ... |
| దినము లిటువలె వచ్చె | సా ; మధ్యమ |
| ... ... ... ... ... | ... ... ... ... |
| ఇంత దయగలవాని | సా ; దూతీసంఘటన. |

మువ్వగోపాలపద నాయికా పట్టీ

| (3) | స్వీయ | పరకీయ | సామాన్య |
|---|---|---|---|
| ... ... ... | ... ... ... ... | ... ... ... ... | ... ... ... ... |
| ప్రౌఢ–తృప్త | నేటిదే కలయికరా | ఇప్పటికీలాగున నున్నా | మనసు నిన్నెడబాయ |
| ప్రౌఢ–అతృప్త | నన్ను నీవు దలచేది న్యాయ | ముద్దుబెట్టలేవుగా | ఒకసారికే ఈలాగైతే |
| ... ... ... | ... ... ... ... | ... ... ... ... | ... ... ... ... |
| సౌందర్య గర్వితా | తొయ్యలి నావిభుడెవ్వ | తెలియనైతి నమ్మ | గడియ గడియకు |
| ... ... ... | ... ... ... ... | ... ... ... ... | ... ... ... ... |
| ముగ్ధ–స్వాధీనపతిక | ఇన్నాళ్లు మల్లాడిన దిందు | అక్కరోఓర్వనివారు | సామికి సరియెవ్వరే |
| ... ... ... | ... ... ... ... | ... ... ... ... | ... ... ... ... |
| ముగ్ధ–విప్రలబ్ధ | కొంచెకత్తెలా మీరు | ఎక్కడి నేస్తము లెక్కడి నెనరు | ఒక్కటైన కాని నాయక్షువ |
| ... ... ... | ... ... ... ... | ... ... ... ... | ... ... ... ... |
| సఖీ–ఉపాలంబన | మగవాని కట్టబెట్ట మనవశమా | నెలతా అతడు అలిగేదే | ఏలవచ్చితివే సామినెడబాసి |
| ... ... ... | ... ... ... ... | ... ... ... ... | ... ... ... ... |

# గ్రంథవిమర్శనము

## గాంధీ—మార్క్స్

శ్రీ కిశోరీలాల్ మష్రువాలా—అనువాదకులు వేమూరి ఆంజనేయశర్మ. ప్రకాశకులు. సర్వోదయ సాహిత్య ప్రకాశన సమితి హైద్రాబాదు. దక్కను. వెల: రూపాయిన్నర.

ఈ రోజుల్లో కమ్యూనిజాన్ని గురించి విరివిగా చర్చలు సాగుతున్నాయి. అల్లాగే గాంధీతత్త్వాన్ని గురించి వేర్వేరుగా చర్చించిన పుస్తకాలనేకం ఉన్నాయి. ఈ రెంటినీ గురించి సమగ్రపరిశీలన చేసి తారతమ్యం చూపించిన గ్రంథాలు తెలుగులో లేనే లేవని చెప్పవచ్చును. ఇందుచేత ఈ పుస్తకం తెలుగు పాఠకుల కెంతైనా ఉపయోగపడగలదు.

కిశోరిలాల్ మష్రువాలా ఈ పుస్తకంలో గాంధీవాదాన్ని గురించి, కమ్యూనిజాన్ని గురించి తారతమ్యపరీక్ష చేసి ఈ రెండింటినీ గురించి సమగ్రంగా చర్చించారు.

గాంధీవాదానికీ, కమ్యూనిజానికీ లక్ష్యాలు ఒకటే కావచ్చును. కాని ఆచరణలో రెండిటికీ ఉత్తరదక్షిణ ధ్రువాలకున్నంత తేడా ఉంది. గాంధీ ఆధ్యాత్మికవాది. అందుచేత ఈయన దృక్పథంలో ఈశ్వరవిశ్వాసము, అహింస మొదలయినవాటికి ప్రాధాన్యం ఏర్పడుతుంది.

మార్క్స్ గతితార్కిక భౌతికవాది కావడం వల్ల ఇతని వాదంలో పై విషయాలగోడే కనబడదు. కాని, ధనస్వామ్యసమాజం తనలో సహజంగా అంతర్గతములై ఉన్న విరుద్ధశక్తులద్వారా, వర్గకలహం ద్వారా వర్గరహిత వ్యవస్థవైపు ములుమాపుతున్నదనీ, ఈవిధమైన అవగాహనద్వారా వర్గరహిత సమాజంస్థాపనకోసం ప్రయత్నించడమే విప్లవపంథా అవుతుందనీ మార్క్స్ అభిప్రాయము. ఇతని అభిప్రాయంప్రకారం ఈవిధమైన సమాజస్థాపనకు సాయపడని కార్యక్రమం అంతా విప్లవ వ్యతిరేక పంథాయే అవుతుంది.

గాంధీమార్క్సుల ఇద్దరి దృక్పథాలలోను ఒక ప్రధానమైన విభేదం కనబడుతుంది. సాధన గతమైన గుణదోషాలు సాధ్యంలో కూడా సంక్రమించి తీరతాయని గాంధీ సిద్ధాంతము, అందుచేత ఒక లక్ష్యసిద్ధి కోసం అవలంబించే సాధనం కూడా పునీతంగానే ఉండాలని గాంధీజీ అంటాడు. మార్క్స్ దృక్పథంలో ఒక లక్ష్యం సమాజ శ్రేయస్కరమైనప్పుడు దానికోసం అవలంబించే కార్యాచరణ ఎల్లాంటిదైనా దానివిషయంలో ఆక్షేపణ ఏమీ ఉండదు.

మార్క్స్ దృక్పథం జీవితానికంతటికీ సంబంధించినది. గాంధీజీ సిద్ధాంతం ఒక్క రాజకీయ స్వాతంత్ర్యసంపాదనకోసమే ఉపయోగపడిందని అనుకోకూడదు. ఇదికూడా జీవితంలోని ప్రతిసమస్యకు ఒకనిర్దిష్టమైన దృక్పథంఏర్పరుస్తుంది. అయితే మార్క్సిష్టు సూత్రాలప్రకారం అన్ని జీవితరంగాలలోను ఏర్పడే దృక్పథాలను గురించి సమగ్ర చర్చజరిగిఉండడంవల్ల అవి సులభంగా తెలుసుకోడానికి వీలేర్పడుతున్నది.

మష్రూవాలా ఆవిధంగా కళాది వివిధరంగాలలో ఏర్పడే గాంధీదృక్పథాలను గురించి ఈ పుస్తకంలో వివరంగా చర్చించి ఉండలేదు—పైగా ఈ పుస్తకంలో మార్క్సిజం ఒకే సుస్థిరమైన దృక్పథంతో వివరించినట్టుకూడా కనబడుతుంది.

ఈ పుస్తకం చదువుతూంటే చాలా చోట్ల తెలుగు హిందీ అనువాదంలా కనబడిపోతూంటుంది. అనువాదకులీ లోటు ముందు సంస్కరణలోనైనా సవరించుకోగలరని ఆశిస్తున్నాను.

## జాతిరత్నాలు

[కథలసంపుటి]

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. సుశీలవాడి, హుమాయత్ నగర్, హైదరాబాద్, (దక్కన్) వెల : రూపాయిన్నర.

ఆంధ్రదేశంలో సుప్రసిద్ధమయిన స్త్రీలపాటలలోని కొన్ని ఇతివృత్తాలు తీసుకుని శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు సరళగ్రాంథికభాషలో అయిదుకథలు వ్రాశారు. ఈ ఆ అయిదు కథల సముచ్చయమే ఈ 'జాతిరత్నాలు.'

ఆంధ్రదేశీయమైన ప్రాచీన జానపద మహిళా సారస్వతంలో చక్కని జాతిరత్నాలున్నా, అవి ఇంతవరకు అచ్చుతప్పుల తడకలుగా నిలిచిన గుజిలీ పుస్తకాలలోనే నామమాత్రంగా మిగిలి ఉన్నాయి వీటినిగురించిన పరిశోధన చాలా స్వల్పంగా జరిగింది. చింతాదీక్షితులుగారు మొదలైనవారెవరో ఇద్దరు ముగ్గురు మాత్రమే వీటినిగురించి కూలంకషమైన పరిశ్రమచేసి వ్యాసాలు ప్రచురించారు.

శ్రీ సరస్వతీదేవిగారు పాతపాటలలోనించి ఎన్నుకొన్న ఈ అయిదు ఇతివృత్తాలలోను చక్కని

ఆంధ్రదేశీయమైన సంప్రదాయం తొణికిసలాడు తున్నది. వీరు స్వీకరించిన, ఊర్మిళాదేవినిద్ర, లక్ష్మణదేవరనవ్వు, శరాంగదచరిత్ర, ధర్మరాజు జూదము, సత్యభామ సరసము, సుప్రసిద్ధమైనవి.

శ్రీమతి సరస్వతీదేవిగారీ కథలన్నీ గ్రాంధికంలోనే వ్రాసినా—కథలలో చాలాచోట్ల ఆయా పాటలలోని ఘట్టాలెన్నో ఉదాహరించారు. ఈ ఉదాహరణవల్ల, సహజమైన కథ చాతుర్యంవల్ల ఇవి చదువుతూంటే—ఆ పాత పాటలు చదువుతూన్నట్లే ఉంటుంది. ఈ పాటల సారళ్యము, కథాకథనశైఖరి కొన్ని కొన్ని చోట్ల ఉత్తమ కవితాస్థాయి స్ఫురింపజేస్తాయి. లక్ష్మణదేవర నవ్వులో నిద్రాదేవి తన్నుగురించి చెప్పేమాటలు దీనికి ఉదాహరణగా తీసుకోవచ్చును.

"అష్టదిగ్గజములను – ఆది మహాఋషుల
వైకుంఠనాథులను వసియింతు నేను
సప్తసాగరముల చవుటి పడియలను
పారేటినదులను భ్రమియింతు నేను
పక్షుల జాతులను పర్వతమ్ములను
వృక్షాలపైనుండి విహరింతు నేను
నరుల నెవ్వారును నను గెల్వలేరు"

ఈ కథలు చదువుతూంటే సహజంగా పాఠకులకు వీటికి సంబంధించిన పాతపాటలు చదవాలనే కుతూహలం కూడా కలుగుతూంటుంది.

ఇల్లింవల సరస్వతీదేవిగారి 'జాతిరత్నాలు' ఆధునిక కథాభిమానులేగాక ప్రాచీన జానపద మహిళా వాఙ్మయాభిమానులు కూడా తప్పక చదవవలసిన పుస్తకం. ఈ రచయిత్రి క్రమంగా ఉత్తమమైన ప్రాచీన స్త్రీసారస్వతంకూడా ప్రకటింపగలరనీ, ఆ విధంగా మరుగున పడిపోతున్న ప్రాచీన మహిళా వాఙ్మయమాధుర్యం తెలుగువారికి అందించగలరనీ ఆశిస్తున్నాను—

ఈ గ్రంథానికి శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాసిన పీఠిక వారి నిశిత పాండిత్యానికి నికషోపలంగా ఉన్నది.

---

## వి జ య ద శ మి

[పదికథల సంపుటి]

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి. ప్రతులకు: రౌతుబుక్ డిపో, రాజమండ్రి. వెల రూపాయిపావలా. దీనిలో విజయదశమి, వలుగునీడలు, మానసుందరి మొదలైన పది కథలున్నాయి. ఇవి అన్నీ ఇదివరకు సుప్రసిద్ధపత్రికలలో ప్రకటింపబడినవే అని పీఠికారచయితలు శ్రీదేవరపల్లి కేశవరావుగారు వ్రాసున్నారు.

వీటిలో ఎక్కువగా కూలినాలి చేసుకొని జీవించే బీదజనం, మధ్యతరగతి ప్రజ, పాత్రలుగా వస్తారు

ఈ రచయితలో చక్కని కథనశక్తి ఉన్నది. జాతీయము, సుసంస్కృతము అయిన చురుకైన వ్యావహారిక భాషకూడా వీరి కథనశక్తికి తోడై కథలన్నీ ఒక గుక్కలో చదివించివేస్తుంది.

అయితే చాలావరకీ కథలన్నిటిలోను రచయిత వ్యక్తిత్వం మాటి మాటికీ పాఠకులకు అడ్డు తగులుతూ ఉంటుంది. ఒక్కొక్కప్పుడు పాత్ర సంభాషణలు మొదలైనవన్నీ రచయితముఖతః బయలుదేరుతున్నట్లే వినిపిస్తాయి. మరీఅడుగున పడిపోయిన వ్యక్తులవర్ణనలో రచయిత వారి జీవితాలనుగూర్చి ఊహించి చిత్రిస్తున్నట్టు కనిపిస్తుంది.

ఈకథలన్నిటిలోను 'వెలుగునీడలు' 'బస్సులో' అనేవి రెండు చాలా మంచికథలు. పుస్తక ముద్రణాదికం ప్రశస్తంగా ఉన్నది.

---

## శ్రీమద్రామాయణోత్తరకాండ

[కవిత]

దేవళ్ల కృష్ణరాయచౌదరి. తాటిపాక, రాజోలు తాలూకా, వెల 3 రూపాయలు.

ఈ రచయిత పొలం దున్నతూండగా ఒక నిక్షేపం దొరికినదట! ఆ నిక్షేపంలో ఒక సంస్కృత తాళపత్రగ్రంథం మాత్రమే కనిపించినది. ఆ గ్రంథంలోని కథ ఆధారంగా తీసుకుని రచయిత ఈ పద్యకావ్యం రచించారు. దీనిలోని కథకు ఉత్తరకాండ కథకు అక్కడక్కడ కొన్ని తేడాలున్నాయి.

ఈ రచయిత కావ్యం సాంప్రదాయక కవితామార్గంలో నడిచిపోతుంది. పద్యాలలోని సంస్కృతాంధ్ర పదప్రయోగాల శిష్టత ప్రత్యేకంగా ప్రశంసింపదగినది. కవిత అంతా కథాకథన ధోరణిలో సాధారణస్థాయిలోనే నడిచిపోతుంది గాని రసవత్తర ఘట్టాలలో తత్తదనుగుణమైన కవితాగాంభీర్యం గాని కవితలో ప్రత్యేకత గాని కనబడవు.

ఈ క్రింది పద్యాలు వీరిశైలికి ఉత్తమోదాహరణలుగా తీసుకోవచ్చును. ఇది తృణబింద్వాశ్రమవర్ణన ఘట్టము.

"కెవ్వన కేక వేయుదురు;
కీరమరాళ మయూర శారికల్
ఔవ్వన రేగిపాఱు, జెలరేగియు
దేనియలాను చుందు రా

జవ్వాను లెల్ల బర్వులిడి
జంటలు జంటలు సంపు గూడియున్
గ్రొవ్విరులున్ ఫలమ్ములూగి
గోసియు తేసి విలాసినుల్ మొగిన్."
పున్నాగ పుష్పముల్ ప్రణికి నేసలుజల్లి
సరసమ్ములాడెడు సకియ యొక తె
సన్న జాజులు కోసి సరులు సక్కగజేసి
ముదితకొప్పున గూర్చు ముగుద యొక తె
మందార దామమీ మగువకు నగు
ననివైచినగు జగా వనిత యొక తె
బింబోష్ఠి కవతి నీదు బిగిగుబ్బలకు బోని
గజనిమ్మపండ్లని కవియు నొక తె
చివురు జొంపమ్ములం దున్న చెల్వయోర్తు
పొదరులం డాగి తలయెత్తు పొలతి యోర్తు
డాగుమూతల యాటాడి డయ్యునోర్తు
రమణు లీట్లు క్రీడించి రారామమందు."

---

## భి క్షా వ తి

[కవిత]

వజ్ఝల కాళిదాసు. ప్రతులకు జంషెడ్ పూర్ — బీహార్. వల: రూపాయి న్నర. ఇది పద్యాత్మకమైన చిన్న ఖండకావ్యం. భిక్షావతి అనే పేరు బిచ్చగత్తె అన్న పదానికి సంస్కృతానువాదంలా కనిపిస్తుంది. బిచ్చగత్తె అన్న పదానికి తెలుగులో బిచ్చమెత్తుకొని జీవించే స్త్రీ అని అర్థం చెప్పవచ్చును. కాని సంస్కృతంలో దీనికి ఈ అర్థంచెప్పడానికి వీలులేదు. ఒకవేళ ఏదో ఒక అర్థం చెప్పవలసివస్తే 'భిక్షుముకలది' అనేఅర్థమేచెప్పాలి. ఈ ఖండకావ్యంలో ఒక బిచ్చగత్తెదౌర్భాగ్య జీవితమె కథా వస్తువు. ఎంతఅడిగినా అన్నంపెట్టేవాళ్లు లేక ఈబిచ్చగత్తె చచ్చిపోతుంది. దీనికి పూర్వం ఆమె శిశువుకూడా చనిపోతుంది. ఇందుచేత ఈపేరు కావ్యానికి సార్థకంగా కనిపించదు. సంస్కృత వ్యాకరణంప్రకారం 'బిచ్చము కలిగినది' అనే అర్థంతో ఈపదం ఎల్లాగో అల్లాగ సాధించవచ్చునుగాని, ఆ భాషలో ఇది జాతీయమయిన ప్రయోగం కాజాలదు.

బిచ్చగత్తె జీవితం వర్ణ్యమయినపుడు పాఠకులకు సహజంగా కరుణరసస్ఫూర్తి కలగాలి కాని ఈ కావ్యం చదువుతూంటే జిలిబిలి పదాలమాటున కరుణరసంఅడుగంటిపోతూన్నట్టనిపిస్తుంది.

అయితే రచయిత కవనంలో అక్కడక్కడ చిన్నచిన్న దృశ్యఘట్టాలు హృద్యంగా కళ్లకుకట్టే శక్తికనిపిస్తుంది. కావ్యంలో నాలుగేళ్లు నిండని పసిబాలిక తనచేతనున్న పళ్లు బిచ్చగత్తెకు ఇవ్వడంకోసం ఆమె దగ్గరకు వస్తుంది. ఆ పసిబాలికను వర్ణించే ఈక్రింది సీసంలో రచయిత వర్ణనశక్తి పరిశీలించవచ్చును.

చివురుపాదములపై చిన్నారి వెండిమువ్వలు ముద్దుగా ఘల్లుఘల్లుమనగ
మొలత్రాడునన్ వ్రేలు మురిపెంపుబంగారు
ఓళ్లక్రొంబసుపువే వెలుగులీన
శ్రీకారములబోలు చెవులకు నీలాల
లోలకుల్ క్రొత్త యందాల నీయ,
నర్ధచంద్రాకృతి నలరారునుదుటిపై
నందారుబొట్టు విన్యాసమమర,
నుంగరాలకురులదాల్చి యున్నపూలు
రంగురంగులక్రొత్త సౌరభములీన,
నాలుగేండ్లు నిండని పసిబాలయొకతె
వారికడనిల్చె కరుణావతారమనగ.

---

## పునస్సంధానము

[పద్యకావ్యము]

పి. హనుమయ్య బి. ఏ. (ఆనర్సు). ప్రతులకు: ఆంధ్రా బుక్ హౌస్, జాలయ్య మార్కెట్, గుంటూరు. వెల: లేదు.

ఇది సలీము నూర్జహానుల ప్రణయపరిణామం వర్ణించే కావ్యము. సలీము నూర్జహాను భర్తను చంపించి ఆమెను వివాహమాడిన కథ చరిత్ర ప్రసిద్ధమే:

అయితే ఈ కావ్యంలో నూర్జహానుభర్తను వధించిన సలీమును అనేక విధాలుగా దుర్భాషలాడి నిందిస్తుంది. తరవాత సలీము తా నామెను చిన్నప్పటినించీ ప్రేమించిన విషయం తెలియజేస్తాడు.— అయినా ఆమె అతని మాటలు చెవినిపెట్టదు. కాని అతడు ఆత్మహత్య చేసుకోబోయేసరికి ఆమె మెత్తబడుతుంది.

చరిత్రమాట ఎల్లాగఉన్నా కావ్యంలో వర్ణించిన తీరుమాత్రం వీరి కిద్దరికీ సముచితంగా లేదు. నూర్జహాను చివరికి సలీమును వివాహం చేసుకున్నది. తరవాత నూర్జహానే భారత సామ్రాజ్యభారం నిర్వహించినదని కూడా చరిత్ర చెబుతున్నది. చరిత్ర ప్రసిద్ధమైన ఈ ఇతివృత్తానికి అనుగుణంగా నూర్జ

హాసు సఖీగుల ప్రేమ పరిణతి చిత్రిస్తే ఈ గాథ ఇంకా స్వభావోచితంగా ఉండేది.

పద్యరచనలో అక్కడక్కడ ప్రథమ ప్రయత్న సూచనలు కనిపిస్తున్నాయి. ఈ క్రింద ఉదహరించిన పద్యంవంటి రచనలు ఈ కావ్యంలో చాలా సకృత్తుగా కనిపిస్తున్నాయి. ఇది నూర్జహాను సఖీమను నిందించే ఘట్టంలోనిది.

"బ్రదుకును సాంతమున్ విడచి
స్వామిపదంబుల కంకితమ్ముగా
వదలిన త్యాగమూర్తి కనివార్య
గభీర పరాక్రమాబ్ధికిన్
బదనులు పుక్కిలించు నొక
బల్లెపుపోటును గుండెకాయపై
నదిమి బహూకరించితివి
అంతియ చాలును లే! మహాప్రభూ!"

---

## ప్రకృతి సౌభాగ్యము - లేక చీకటి వెలుగులు

[కవిత]

కర్రా సుందరరామశాస్త్రి, బోర్డు హైస్కూల్, పేరూరు. తూర్పు గోదావరిజిల్లా, వెల 1. ఒకరూపాయి.

ఇది ప్రత్యేక విశిష్టతగల ఖండకావ్య సంపుటి. రచయిత అనేక విషయాలను గురించి ఖండకావ్యాలు వ్రాశారు కాని, అవి సామాన్యంగా నేటి ఖండ కావ్యాలలో ఎక్కడా కనబడవు. టార్చిలైటు, కిరోసిన్ ఆయిలు, రైలు, అగ్గిపెట్టె, సబ్‌మెరైన్ మొదలైన ఆధునిక జీవితావసర వస్తువులే వీరు తమ కావ్యాల్లో వర్ణించారు. ఈ రకమైన వర్ణనకు నేటి కవితామార్గంలో వీరొక కొత్తదారి వేశారనవచ్చును.

ఈ రకమయిన విషయాలమీద ఆధునిక పాశ్చాత్యకవు లనేకులు ఉత్తమమైన ఖండకావ్యాలు రచించారు. జీవితంలో నిత్యము ఉపయోగపడే వస్తువులుకూడా ఉత్తమ కవితారచనకు ప్రోద్బలం కలిగించవచ్చునని వీరు సోదాహరణంగా నిరూపించారు.

కర్రా సుందరరామశాస్త్రిగారు తమ ఖండకావ్యాలన్నీ ఒక తరహా ఖులాసాధోరణిలో వ్రాసుకుపోయారు — అందుచేత ఈ కావ్యాలన్నీ ప్రాస్తావిక ఖండకావ్యాలుగానే మనం చదువుకోవాలిగాని వీటిలో సామాన్యంగా కవితలో కనబడే ఉదాత్తత లేదనుకోవడం న్యాయం కాదు.

ఆంగ్లకవితలో (*Light verse*) ఖులాసా కవిత చాలా ఎక్కువగా ఉన్నది. పెద్దకవు లనేకులు ఈ విధమైన రచనలు చేశారు. మన ప్రాస్తావిక పద్యాలు, సమస్యలు, అష్టావధానశతావధాన కవిత్వాలు, ఇంచుమించుగా ఈ వర్గంలోకే వస్తాయి.

ఈ కవి బాల్యసహజమైనఒకవిధమైన అమాయిక దృక్పథంతో ఆయా వస్తువుల వర్ణనలు చేశారు. అక్కడక్కడ మాత్రం అంతర్గర్భితంగా హాస్యం మెరుస్తూంటుంది. మోటార్ కారునుగురించి వీరు వ్రాసిన కొన్ని పద్యాలలో ఈ విషయం పరిశీలించవచ్చును—

"చోదకుడు ప్రక్కనుండగ
మోదముతో శ్రీవియొప్ప ముందర చక్రం
బాదుకొని కారునడుపం
గాదగు వారెంత పుణ్యగరిమ గలారో!

ఘూటుబూటుల డాక్టరు చోద్యమునను
మేఘరంజీల మీద నమేయలాఘ
వంబునను కారునడుపుచు వచ్చుచుండ
నరుడో! నారాయణుండో నా బరగుగాడె!

కారుండెడి నా పుట్టువొ
ధారుణి బుట్టువను యోగ్యతాసాంద్రుడతం
డేరికి నోయది గలుగం
గారా దిల ప్రాప్సుకృతముగా దలలేకన్."

'స్టవ్' అనే శీర్షికలో వీరు వ్రాసిన ఈ కందంకూడా వీరి ధోరణికి తార్కాణంగా తీసుకోవచ్చును.

"స్టవ్వు వెలిగించి వదలిన చప్పుడేక
తానతం గూర్చి ప్రణవ నాదంబునందు
నురక వేయు చానందంపు దరగలుబ్బ
స్వాంత మున్ముఖమూను వేదాంతమునకు!"

---

## భారతి

[సంస్కృత మాసపత్రిక]

సంపాదకులు—సుజనదాసస్వామి, ఏమ్. ఏ. భారతీభవన్, గోపాల్‌జీకా రాస్తా, జయపూర్, రాజస్థాన్. సంవత్సర చందా, మూడు రూపాయలు. విడిప్రతిక 6 అణాలు.

ఇది సంస్కృతం నేర్చుకునే విద్యార్థులకేగాక పండితులకు గూడా ఉపయోగపడే సంస్కృత మాసపత్రిక. దీనిలో సిరియా—లెబనాన్ దేశాల పరిచయం మొదలుకొని ప్రాణాయామరహస్యము, శ్రీరామనవమి మొదలైన విషయాలమీదకూడా చక్కని వ్యాసాలున్నాయి.

మాఘకవిని గురించీ, ఏకనాథుని గురించీ రచించినవి సమగ్రమైన విమర్శక వ్యాసాలు. ఈ సంచికలోని నాటిక, సంస్కృతకవిత సామాన్యమైన సాంప్రదాయక ధోరణిలోనే నడిచిపోతున్నాయి.

సంస్కృతంలో రచనాపాటవం అలవరుచుకోగోరేవారందరికీ ఈ పత్రిక బాగా ఉపయోగిస్తుంది.

---

# కాంచనద్వీపం

రాబర్ట్ లూయీస్టీవెన్సన్



అనువాదం:

నండూరి రామమోహనరావు

**వెల రూ. 1-8-0**

పోస్టు ఖర్చులు ప్రత్యేకం

వివరాలకు

## ఆంధ్ర గ్రంథమాల

మద్రాసు 1.

# భారతి

[సచిత్ర మాసపత్రిక]

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఆంధ్రపత్రికా ముద్రాలయము
మదరాసు.

సంపుటము 29 జూన్, 1952 సంచిక 6

విడిప్రతి వెల ఒకరూపాయి.







బాధకుండగనే బట్టలను తెల్లగాను ప్రకాశవంతముగాను ఉతుకును!

S. 183-50 TL



# విషయానుక్రమణిక

## జూన్- 1952



త్రివర్ణ చిత్రము—'విశ్రాంతి' సి. యస్. యన్: పట్నాయక్‌గారు

పక్షిరాజా వారి

# కాంచనా

తెలుగు

లలిత ...... పద్మిని
కె. ఆర్. రామస్వామి
దొరైరాజ్
రుష్యేంద్రమణి
రామ శర్మ
కుమారి
దొరైస్వామి నటించినది..



మాటలు, పాటలు
తోలేటి
డైరెక్షన్
S.M. శ్రీరాములు నాయుడు

జూన్ 12 వ తేదీన ఆంధ్రదేశములో ముఖ్య కేంద్రాలలో విడుదల

# భారతి, ఇరువది తొమ్మిదవ సంపుటము

(1952 : జనవరి - జూన్)

—(★)—

# అకారాది విషయసూచిక

జూన్ 6 న **విడుదల!**





యువావారి

# టింగ్ రంగా

డైరెక్టర్... B.A. సుబ్బారావు

ప్రొడ్యూసర్. P.S. శేషాచలం

రచన...... తాపీ

పూర్ణా రిలీజు

స్టుడియో: **వాహిని**




Gudur



నందన
జ్యేష్ఠము

# భారతి

సంపుటము 29
సంచిక 6

# మస్తిష్కంలో లేబొరేటరీ

శ్రీ దాశరథి



మొహంజొదారో శిథిలాల లోతుల లోకి—
శతాబ్దాల మట్టి పొరల క్రింద బొగ్గైపోయిన పురాతన
నాగరికతా గర్భంలోకి—
సూర్యుడు అస్తమించిన జాడల్లోకి వొకదారి;
మరోదారి
మస్తిష్కంలోని మాయింటికి.

మా యింటి వెనుకగా—
తాజమహల్ అందాల్లో మెరిసిన షాజహాన్ కీర్తి;
అ ఇ ఉణ్ణులతో
బులుక్కులతో కట్టిన వైయాకరణి సమాధి;
లోకాన్ని అడక్కుండా ఏవడో దుష్ట నృపతి రచియించిన
కఠిన శాసనాల రాసులు—
మరి మాయింటి ముందుగా—లేబొరేటరీ
బేడాకు దొరికే నా పెన్సిల్ ముక్కలో—

జగత్తుకు ప్రాణం ప్రసాదించిన కార్బన్ పరమాణువు;
అందులో సెంట్రల్ న్యూక్లియస్ చుట్టూ చాంద్రాయణం చేసే
ఆరు ఎలెక్ట్రాన్లు—
సూర్య తేజోరాశిచుట్టూ శనీ గురువూ మరోడు మరోడు
వాళ్ళవెంట భూమి తల్లీ ప్రదక్షిణం చేసినట్లు.

మరి ఆనాటి పాతగంటం కంటిలో—
రాక్షసీ వికటాట్ట హాసం,
రంభోర్వశీ నాకవాసం,
రాజుల పాదాల క్రిందుగా పరచిన
రైతుల రతనాల బ్రతుకుల తివాసీలు
పాతకాలం పసిడి రంగుల బరువు లోర్చిన
పట్న వాసపు మ్యూజియంలో—
పసందైన శ్యామాకమలాల మెత్తదనం వొత్తుకున్న చిత్తరువులు
శిలా విగ్రహాల సీత్కారం
అలం కారాల బలాత్కారం.

మరి నాలో లోపలి చిత్రశాలలో
చిత్రించరాని
శిల్పంకూర్చలేని వేదన
చితికిన ఆటం వంటి బతుకులో ప్రణయం కదాచిత్!
శిశిరంలో గుడ్డలూడిన,
రహస్యాలు లేని, దెయ్యాల ఆడబిడ్డలవంటి
పెద్ద పెద్ద మోదుగు వృక్షాలకు
నిప్పు బట్ట కట్టించిన రీతిని—

నా వేదనలో జన్మించిన ఊహింపులు
తొడగడానికి వ్యాకరణ సూత్రపు రెడీమేడ్ దుస్తులు లేక
దిసమొలల్తో ఉరుకుతున్నాయి లోకాన పడి;
దండించనా,
రండి రండని పిలిచి నా కవిత్వపు
పండు కెరుపు చేలా లందించనా!

కటికరాతిగోడలతో కట్టిన కారాగేహంలో
గత కాలపు శాసనాల
కట్టుబడిన ఖైదీవలె

భయం భయంగా, ఆవున్న అవున్నగా
గాలి పీల్చుకుంటూ వేం భాయీ !
ఊపిరితిత్తుల్ని కొలిమి తిత్తులుగా
నొక్కినొక్కి ఊది ఊది మండించవోయ్ మానవతా జ్వాలావళి.
కదల్లేని వృక్షం వలె
కాలం అక్కడక్కడే పెరగ్గలదా !
'నయాగరా' జలపాతం వలె
నడుం విరిగేట్టు దూకంది తప్పదు గదా !
తిరగనీ కాలాన్ని సుళ్లు సుళ్లుగా ;
పడనీ బ్రతుకు నిండా చిక్కులు ముళ్లు ముళ్లుగా.

డొక్కకు బాగా ఆకలిరుచి దొరకనీ—
చలి వీణలు నరాలలో చొరబడి
చక్కని పాటనొకటి వాయించనీ—
ప్రశ్నలు గొలుసులు గొలుసులుగా
బంధింపనీ మన మేధను—
దూకి దూకి ఈ జలపాతం
ప్రాకించనీ పైకిపైకి విద్యుద్వల్లీ మతల్లి కలను—
సన్నని ఇసుక కణం పరీక్షించి
జగజ్జాతకం వ్రాయనీ శాస్త్రజ్ఞులను—
పడి గ్రీలో వేడి నిలిస్తే
ఏరకం ప్రాణికోటి పుడుతుందో—
పడి గ్రీకి వేడి జారితే
ఈ విశ్వ మహాగోళం మృత్యుజలధి అంతస్సున
తన్ను కులాడి నశిస్తుందో—
ఏ ఖిల్లా గోడనీడ
ఏ మహారాజ వంశాన్ని ఎంతకాలం కాపాడిందో ;
ఏ రకం ఎత్తుగడల్లో పెత్తనం
ఎవడెవడి చేతిలో ఎన్నెన్ని నాళ్లుంటుందో
పరిశోధించు ఈ లేబొరేటరీలో.

అజంతాలోను హాలంత భాషలోను
శిలా సుందరికి లేని
క్షుద్బాధా సంచలనం
పల్లెపడుచు కున్నాదని గమనించుకో భాయీ !

నిశ్శబ్దంగా నిదరోయే
నిరపరాధి పరమాణువు
డొక్క చించి డోలుకట్టి
ప్రమాదాలు తేబోకు.
మస్కెట్లనుండి రైఫిళ్లదాకా నడచిన దేశం
కొడవళ్ల నుండి* కోత యంత్రం దాకా సాగలేదు

చల్లని పాలుతాగే పిల్లులవంటి
రసిక శిఖామణుల నాల్కలు
వేడి వేడి కవిత్వం చురుకుదనం సహించేదాకా రాలేదు.
ఇంకా అక్కడక్కడా ఎత్తైన గడీ గోడ నీడలు
చిన్ని చిన్ని గుడిసెల్ని పెరగ నీయడం లేదు——
ఇంకా భయంతో తలవంచుకుని
తన నీడనే తాను చూసుకుంటో
బరువుగా బరువుగా నడుస్తున్నాడు బానిసీడు.

ఇంకిపోయిన పెద్ద పెద్ద సముద్రాల వలె
జీవం చచ్చిన పాత జాతుల నోళ్లలో
ఒకపెద్ద ప్రళయ జలధరాన్ని పట్టుకువచ్చి
కట్టివేసి ఉరిమించి ఉల్కలు కురిపించి కరగించి
జీవనం ప్రసాదించే శుభిక్షకాలం ఇంకా రాలేదు.

ఇన్ని శతాబ్దాలు ప్రయాణం చేసినా
ఇక్కడేవున్నాం ఊర్పూరి పొలిమేర పక్కన
డార్విన్ బయాలజీలో పరిణామాల పట్టిక
పది యోజనాలంత వున్నా
మానవుడు మానవుడయ్యే కాలాన్ని
నిర్దేశించగల ప్రదేశం కానరాదు!

గతంలోంచి కొంత నేర్చుకోబోయి
గతానికి తాకట్టు పడుతున్నారు కవులు
ఈ లేబొరేటరీలో కూచుని
లోకంనిండా విరివిగా శాంతి పండే రీతిని
కొత్తరకం విత్తనాల్ని
కనిపెట్టే వీలున్నది.

---

* *Harvestor.*

ఈ లేబొరేటరీలో కూచుని
కలం పాళీ కొసలోంచి
ఎంత బలంగల కవిత్వం సృష్టించ వచ్చో—
పేదాడి స్వేదం లోంచి ఎంతగా
దేశానికి జీవం ప్రసాదించ వచ్చో---
నిరాశతో ఏడ్చే దరిద్రాంగన
కన్నీటి చుక్కలకు
ఎంత దూరాన నవ్వు పువ్వులున్నాయో—
హృదయంలో ఏ పొరలో దయ
ఏ తెరలో నిర్దయ
ఏ దిక్కున త్యాగం
ఏ దిక్కున రాగం దాక్కుని సెల వేస్తాయో-
కనిపెట్టే అవకాశం
ప్రసాదించి నా నిదిగో!
పని సాగించుము భాయీ!
బ్రతుకు నాగజముడు కూడ
పూలు పూయనీవయ్యా!
మెతుకులలో ప్రోటీనులు
మిక్కిలిగా రానీవయ్యా!
బక్కపడిన దేహానికి
పొందు పొందు మాంసానికి
ఎంత తిండి కావాలో
ఎంత హాయి కావాలో
అవి అన్నీ కల్పించే
అమృత ఘుటికకోసరమై
నిరీక్షించు మానవునికి
త్వరగా ఫల మందించే
మార్గా న్నన్వేషించు!
మస్తిష్కంలో వెలిగే
మా యింటికి ముందుండిన
లేబొరేటరీ తెరచి వుంది.
మథనపడే మేధావుల
శిథిలాశలు చివురించే
రసరాజ్యం, లేబొరేటరీ!

---

# ఇవాన్ ఇలియిచ్ మృతి

మూలం :  అనువాదం :

లియో టాల్‌స్టాయ్ — శ్రీ పి. గణపతిశాస్త్రి

టాల్‌స్టాయి 'ఇవాన్ ఇలియిచ్ మృతి' (The Death of Ivan Ilych) అనే ఈ చిన్ననవల 1886లో రచించాడు. ఈనవలారచన బహుశః 1882 లోనే ప్రారంభమై ఉండవచ్చునని విమర్శకు లూహిస్తున్నారు. అంటే ఇది ముగించేసరికి ఇంచుమించుగా నాలుగు సంవత్సరాలు పట్టిందన్నమాట.

ఈ చిన్ననవల ముగించేసరికి టాల్‌స్టాయికి 58 ఏళ్లు నిండాయి. అప్పటి కప్పుడే ఇతడు 'ఎన్నా కెరనినా' మొదలైన గొప్ప గొప్ప నవలలు రచించి ప్రపంచవిఖ్యాతుడైనాడు. ఈ కాలంలో టాల్‌స్టాయి రచించిన రచనలన్నిటిలోను ఇది ఉత్తమోత్తమమైనదని విమర్శకులందరు ప్రశంసించారు. ప్రకటించిన కొద్దిరోజుల్లోనే ఇది రష్యాలోను, మిగిలిన యూరపులోను ఒక పెద్ద సంచలనం కలిగించింది. రోమాఁ రోలాఁ వంటి విఖ్యాతనవలారచయిత ఫ్రాన్సులో అంతటా ఇది పాఠకుల మన్ననలందుకొన్నదనీ, పాశ్చాత్యధనికవర్గాల జీవితాని కిది ప్రతిబింబమనీ ప్రశంసించాడు.

టాల్‌స్టాయి, సునిశితమైన నైతికదృక్పథంలో వాఙ్మయసృష్టి చేసిన మహాశిల్పి. 'ఇవాన్ ఇలియిచ్ మృతి'లో ఈదృక్పథం ఒక పరమావధికి వెళ్లినట్టుకనిపిస్తుంది. ఇంచుమించుగా ఇది టాల్‌స్టాయ్ స్వీయచరిత్రవంటిదే అని ఒక ప్రసిద్ధవిమర్శకుడు వ్రాశాడు.

## 1

వెల్‌విన్‌స్కీ కేసు విచారణ కొంతవరకు నడిచినతరవాత పబ్లిక్ ప్రాసిక్యూటరు, మిగిలిన న్యాయాధిపతులు అంతా కలిసి విశ్రాంతి సమయంలో ఎగరోవిచ్ గదిలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. క్రమంగా వారందరు క్రసో విస్కీ కేసునుగురించి మాట్లాడుకోవడం మొదలుపెట్టారు. అది చాలా గొప్పకేసు. ఆకోర్టుకు ఆకేసు విచారణచేసే అధికారంలేదని వాసిలోవిచ్ గట్టిగా వాదిస్తూంటే ఆ అధికారం ఉండితీరినదని ఇగరోవిచ్ నొక్కిచెప్పాడు.

ఈ వాదోపవాదాలు ఇలాగ సాగుతున్నా మొదటినించీ ఉలక్కుండా పలక్కుండా ఒకచోట కూర్చున్న పీటర్ ఇవానోవిచ్ అప్పుడే వచ్చిన గెజెట్ పేజీలు తిరగవేస్తూ "ఇవాన్ ఇలియిచ్ చచ్చిపోయాడు" అన్నాడు.

"నిజంగా!"

"ఇదిగో! మీరే చదవండి" అని ఇవానోవిచ్ వాసిలీవిచ్‌కి ఆ గెజెట్ అందించాడు. అది అప్పుడే అచ్చుపడింది. అందుచేత ఇంకా తడితడిగానే

ఉంది. చుట్టూరా అచ్చువేసిన నల్లని అంచుల మధ్యన ఆ గెజెట్ ప్రకటన ఇలాగ ఉన్నది. "కోర్టులో న్యాయాధిపతిగా ఉండిన తన భర్త, ఇవాన్ ఇలియిచ్ 1882 ఫిబ్రవరి 4 వ తేదీని మరణించినారని బంధుమిత్రులకు తెలుపుడు చెయ్యడానికి ప్రెస్కోవ్యా ఫెడరోవ్నా మిక్కిలి విచారిస్తున్నది. శుక్రవారం నాడు మధ్యాహ్నం ఒంటిగంటకు అంత్యక్రియలు జరుగుతాయి."

అక్కడ ఉన్నవారి అందరితో బాటే ఇవాన్ ఇలియిచ్ కూడా ఆ కోర్టులో న్యాయాధిపతిగా ఉంటేవాడు. అందరూ అతన్ని ఎంతో ఆప్యాయంగా చూసేవారు. కొన్ని వారాలనించీ అతనొక వ్యాధితో బాధపడుతూండేవాడు. అంతా అది గడ్డువ్యాధి అని అనుకునేవారు. జబ్బుతో ఉన్నన్నాళ్ళూ అతని పదవి అల్లాగే ఖాళీగా ఉంచారు. కాని అతను చనిపోవడం జరిగితే అలెక్సీవ్‌ను ఆ ఖాళీలో వేస్తారనీ, అలెక్సీవ్ ఖాళీలో విన్నికోవ్‌ను గాని, స్టాబెల్‌ని గాని వెయ్యవచ్చుననీ ఊహాగానాలు బయలుదేరాయి. అయితే ఇలియిచ్ మరణవార్త వినగానే అక్కడ ఉన్నవారందరికీ, అతని మృతివల్ల తమకు, తమ బంధుమిత్రులకు ఆయా ఉద్యోగాల్లో రాబోయే మార్పులు, అధికారాలుమాత్రమే మొట్టమొదటగా స్ఫురించాయి.

స్టాబెల్ పదవిగాని, విన్నికోవ్ ఉద్యోగం గాని తప్పకుండా తనకు దొరికి తీరుతుందనీ, ఆ ఉద్యోగం తనకిస్తామని అధికారులు చాలకాలం క్రితమే వాగ్దానం చేశారనీ, దానివల్ల అలవెన్సులు అవ్వీకాక సంవత్సరానికి ఇంకా ఎనిమిదివందల దాకా తన ఆదాయం పెరుగుతుందనీ వాసిలీవిచ్ అనుకున్నాడు.

పీటర్ ఇవానోవిచ్ ఇలాగ అనుకున్నాడు. "నేనిప్పుడు మా బావమరిదిని కలుగానించి బదిలీ చేయించే ప్రయత్నంలో పడాలి. ఇది జరిగితే మా ఆవిడ ఎగిరిగంతులేస్తుంది. ఇక నామీద తనవాళ్లకు నేనేమీ సహాయంచెయ్యడం లేదనే నింద వెయ్యడం మానివేస్తుంది"

"ఇక ఇలియచ్ లేచితిరుగుతాడని నేననుకోనే లేదు. పాపం ఎంతపని జరిగింది!" అని పీటర్ ఇవానోవిచ్ గట్టిగా అన్నాడు.

"అయితే ఇంతకీ ఆ వ్యాధేమిటో తెలిసిందా?"

"డాక్టర్లెవరికీ ఏమీ అంతు దొరకలేదు. చివరికి ఏవో పేరుపెట్టారుగాని, అందరిదీ తలో దారీ అయింది. కడపట నేనతన్ని చూసినపుడు కొంచెం నయంగానే ఉందనుకున్నాను."

"సెలవు లిచ్చినప్పటినించీ, నేనతన్ని చూడనే లేదు. ఎప్పటికప్పుడు ఒకసారి వెళ్ళిచూడాలని అనుకుంటూ ఉంటేవాణ్ణి."

"ఇలియిచ్‌కి ఏమన్నా ఆస్తి ఉందా?"
"అతని భార్యకేదో కొంత ఉన్నదని అనుకుంటాను. కాని అంతగా చెప్పదగ్గ ఆస్తి కాదు."

"మనమంతా ఒకసారి ఆవిణ్ణి చూసిరావాలి. కాని ఆ ఇల్లు చాలాదూరం!"

"అంటే మీ యింటికి వాళ్ళిల్లు చాలా దూరం అన్నమాట! ఆ మాటకొస్తే మీయింటికి అన్నీ దూరమే."

షెబెక్ అన్న ఈ మాట విని ఇవానోవిచ్ ఒక చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు. "నేను ఏటికవతల ఎక్కడో ఉన్నానని ఇవాన్ ఇలియిచ్ ఎప్పుడూ నామీద ఒక నింద వేస్తూండేవాడు."

ఆపైన వారందరు ఆ పట్టణంలో ఒక చోటికీ, మరొకచోటికీ ఉన్న దూరభారాలను గురించి కబుర్లు చెప్పుకుంటూ తిన్నగా కోర్టులోకి వెళ్లిపోయారు.

ఇవాన్ ఇలియిచ్ మృతివల్ల ఇంచుమించుగా ఏర్పడే ఖాళీలను గురించీ బదలాయింపులనుగూర్చీ, రాబోయే పెద్ద పదవులనుగురించీ తట్టిన ఆలోచనలతో బాటు సామాన్యంగా అందరి మల్లేనే వారికిగూడా "అమ్మయ్యా! ఆ చచ్చిపోయింది అతనేగాని నేను మాత్రం కాదు." అనే ఆలోచనకూడా కలిగింది.

ప్రతీవాడు తన మనస్సులో "సరే! ఇలియిచ్ చచ్చిపోయాడుగాని నేనుమాత్రం బతికేఉన్నాను బాబూ!" అనుకున్నాడు. అయితే ఇవాన్ ఇలియిచ్ దగ్గిరబంధువులు, అతని స్నేహితులనబడే వాళ్ళు, అంత్యక్రియలు జరిగే సమయానికి నానా అవస్థలుపడి అక్కడికి చేరుకోవాలనీ, ఇలియిచ్ భార్యని ఒకసారి పరామర్శించవలసిన పెద్ద బరువు తమమీద విరుచుకు పడిందనీ బాధపడ్డారు.

వాసిలోవిచ్చి, ఇవానోవిచ్చి ఇవాన్ ఇలియిచ్‌కి చాలా దగ్గిర పరిచితులు. ఇవానోవిచ్చి, ఇలియిచ్చి న్యాయకళాశాలలో కలిసి చదువుకున్నారు. అందుచేత ఇవానోవిచ్ ఇలియిచ్‌కీ, తనకు బాగా సన్నిహితత్వ మున్నదని భావించుకున్నాడు. ఇవానోవిచ్ ఇంటికి రాగానే భోజనాలవేళ భార్యతో ఇలియిచ్ చనిపోయినవిషయం చెప్పాడు. ఆపైన తన బావమరిదిని తమకు దగ్గిరగా బదిలీ చేయించుకునే అవకాశా లున్నాయని కూడా భరవసా ఇచ్చాడు. ఆ పిమ్మట సామాన్యంగా మధ్యాహ్నంవేళ అనుభవించే నిద్రా స్వార్థత్యాగంచేసి, సాయంకాలం దుస్తులు వేసుకుని, గుర్రపు బగ్గీమీద ఇవాన్ ఇలియిచ్ భవనానికి బయలుదేరాడు.

ఆ భవనానికి ముందుగా ఒక గుర్రపు బగ్గీ, ఇంకా మరిరెండు ఇతర బగ్గీలు నిలబడిఉన్నాయి. లోపలికి పోగానే కిందిహాలులో గోడకుదగ్గిరగా సరిగంచు పట్టువస్త్రాలతో కప్పిన శవపేటిక కనబడింది. అప్పుడే మెరుగుపెట్టిన ఆ పెట్టెమీది బంగారు బందులు, మేకులు తళతళా మెరుస్తున్నాయి. అక్కడ నిలబడిఉన్న స్త్రీలిద్దరు తమ ఉన్నికోటులు విప్పివేస్తున్నారు. వారిలో ఒక స్త్రీ ఇవానోవిచ్‌కి పరిచితురాలే. ఆమె ఇవాన్‌ఇలియిచ్ చెల్లెలు. కాని రెండవ స్త్రీ ఎవరో ఇవానోవిచ్‌కి తెలియలేదు. ఇవానోవిచ్ సహన్యాయాధిపతి ష్వారెజ్ అప్పుడే మేడదిగి కిందిహాల్లోకి వస్తున్నాడు. ఇవానోవిచ్‌ని చూడగానే అతడు ఒక్కసారిగా నిలబడిపోయి అతనికేసి చూసి కన్నుగీటాడు. "మాశావా! ఇలియిచ్ తనవ్యవహారాలన్నీ అర్ధాన్నపు అడివిలో విడిచిపెట్టి పోయాడు! నేనుగాని నువ్వుగాని అయితే ఇలాగ జరగనిస్తామా!" అన్నభావం ఆ కన్నుగీటులో మెరిసింది.

ఆ బుగ్గమీసాలు, సన్నాకులాఉన్న అతని శరీరము, ఆ సాయంకాలం దుస్తులు చూస్తే ష్వారెజ్ హుందాగా మూతిబిగించుకున్నట్టున్నాడు. కాని అతను చాలా సరదాగా సంచరించే వ్యక్తి. అందుచేత అత నిప్పుడు ఇక్కడ నిలబడడం ప్రత్యేకంగా ఈ పరిస్థితుల్లో ఎబ్బెట్టుగానే ఉంది. లేకపోతే, ఇవానోవిచ్‌కైనా అలాగ అనిపించిందని చెప్పాలి.

ఆ స్త్రీలిద్దరు బయలుదేగిన తరవాత ఇవానోవిచ్ కూడా వారివెంట నడిచి, మేడమీదికి వెళ్లాడు. ష్వారెజ్ కిందికి దిగకుండా అలాగే ఆ ఉన్నచోటే నిలబడిపోయాడు. అతను ఆ సాయంకాలంవేళ బ్రిడ్జి ఆడుకోవడానికి చెయ్యవలసిన కంజాయిం పంతా చేస్తున్నాడని ఇవానోవిచ్‌కి తెలిసిపోయింది. ఆ స్త్రీలిద్దరు ఆ మేడమీద ఇలియిచ్ భార్యఉన్న గదిలో ప్రవేశించారు. ష్వారెజ్ ఒక్కసారి మూతిబిగించి, కనుబొమ్మలు కుంచించి, ఆ స్త్రీలిద్దరికీ ఇలియిచ్ మృతశరీరం ఉన్నగది చూపించాడు. అయినా అతని కళ్ళలో ఆ ఖులాసా భావం అల్లాగే మెరుస్తున్నది.

అందరికిమల్లేనే ఆ సమయంలో ఏంచెయ్యాలో తోచక ఇవానోవిచ్ మెల్లిమెల్లిగా లోపలికి వెళ్లాడు. అల్లాంటి సమయాల్లో సిలువమోస్తరుగా చేతులు కట్టుకోవడం మంచిదన్న సంగతి ఒక్కటే అతనికి తెలిసిన విషయం. అయితే ఆ పని నమస్కారపూర్వకంగా చెయ్యాలనే విషయంలో అతనికి కొంత సందేహం కలిగింది. కనక అతనీ విషయంలో మధ్యేమార్గం అవలంబించాడు. ఆ గదిలోకి ప్రవేశించగానే శిలువమోస్తరుగా చేతులుకట్టి, నమస్కారధోరణిలో కొంచెం ముందుకు వంగి నడిచాడు. ఆ వంగిన సమయంలోనే వీలైనంతవరకు ఆ గది అంతా నాలుగువైపులా పరిశీలించాడు. ఇద్దరు యువకులు సిలువమోస్తరుగా చేతులు కట్టుకుని ఆ గదిలోనించి ఇవతలికి వచ్చేస్తున్నారు. ధోరణినిబట్టి చూస్తే ఇద్దరూ ఇలియిచ్ మేనల్లుళ్ళయి ఉండాలి. వారిలో ఒక యువకుడు హైస్కూలులో చదువుకుంటున్నాడు. అక్కడ ఒక వృద్ధస్త్రీ స్తబ్దంగా నిలబడి ఉన్నది. చిత్రంగా వంగిన కనుబొమ్మలుగల మరిఒక స్త్రీ అతిరహస్యంగా ఆ ముసలావిడ చెవిలో ఏదో ఊదుతున్నది. జమాజెట్టిలా నిటాగ్గా నిలబడ్డ క్రైస్తవ మతగురువొకడు ఆ దగ్గిరగా నిలబడి ఏదో గట్టిగా చదివి వినిపిస్తున్నాడు. అతని ధోరణినిబట్టి ఆ చదివే విషయానికిక తిరుగుండడానికి వీల్లేదన్నట్లుంది. వంటమనిషి దగ్గిర పనిచేసే జిరాసిమ్ ఇవానోవిచ్‌కి ఎదురుగా నిలబడి నేలమీద ఏదో పొడి చల్లుతున్నాడు. అది చూడగానే ఇవానోవిచ్‌కి ఆ మృతశరీరం కొద్దికొద్దిగా వాసనకొట్టడం మొదలుపెట్టింది.

వెనక ఒకసారి చూడడానికి వచ్చినప్పుడు ఇవానోవిచ్ అక్కడ జిరాసిమ్‌ను చూశాడు. ఇవాన్ ఇలీయిచ్‌కి అతనంటే ఎంతో ఇష్టం. జిరాసిమ్ అతనికి సకలోపచారాలు చేస్తూ ఒక నర్సులా మసులుకుంటూ ఉండేవాడు. ఆ శవపేటికకు, క్రైస్తవ విగ్రహాలకు, క్రైస్తవమతగురువుకు మధ్యగా నిలబడిన ఇవానోవిచ్ అప్పుడప్పుడు సిలువ మాదిరిగా చేతులు ముడుచుకుని చాపుతూనే ఉన్నాడు; మధ్యమధ్యన తల కొంచెం వంచుతూనే ఉన్నాడు. కాని చేతులు పొడుగుగా చాపడము, ముడుచుకోవడము కొంచెం ఇబ్బందికావడంతో అవ్వన్నీ మానివేసి అమృతశరీరం పరిశీలించడం ప్రారంభించాడు.

అన్ని శవాల మాదిరిగానే ఇలీయిచ్ శవం కూడా శవపేటికలోపరిచిన పరుపుమీద బరువుగా కూలబడినట్లుంది. ఆ శిరస్సు నమస్కారం చేస్తూన్నట్టు అల్లాగే తలగడాలో కూరుకుపోయింది.

ఇలీయిచ్ కళ్లు లోలోపలికి దించుకుపోయాయి వాటిమీది కనుబొమ్మలు పచ్చని మైనంముద్దల్లా మారిపోయాయి. వాటిమధ్యమధ్యన కనువెంట్రుక లూడిపోయిన ప్రదేశాలు మచ్చల్లా కనబడుతున్నాయి. మరణించినవారికందరికీ సామాన్యం జరిగినట్లుగానే అతని కనుబొమ్మలు కూడా బాగా ముందుకు చొచ్చుకుపోయాయి. ముక్కు పెదవులమీదిమీదికి పోతున్నట్లు బాగా ముందుకు వంగిపోయింది. ఇవానోవిచ్ వెనక చూసినప్పటికంటె ఇప్పుడా శరీరంలో ఎక్కువ మార్పులు కనబడుతున్నాయి. ఇలీయిచ్ ఇప్పుడు బాగా చిక్కిపోయాడు. అయితే మరణించినవారందరిలాగే అతని ముఖం పూర్వంకన్న బాగా అందంగా కనిపించింది. అతని ముఖంలో బ్రతికి ఉన్నప్పటికంటె ఇప్పుడే ఎక్కువ హుందాతనం కనబడుతున్నది. ముఖకవళికనిబట్టి చూస్తే సాధించవలసినవన్నీ అనుకున్నట్లుగాసాధించడం జరిగిపోయిందనే భావం గోచరిస్తున్నది. ఇదిగాక, బ్రతికిఉన్న వారందరికీ అతని ముఖంలో ఒకరకం హెచ్చరిక, మందలింపు కూడా కనిపిస్తున్నాయి. ఇవానోవిచ్‌కి ఈ హెచ్చరిక కేమీ అర్థంలేదని అనిపించింది. ఒకవేళ ఉన్నా అది తనకు సంబంధించినది కాదని అనుకున్నాడు. అక్కడ ఉన్నంతసేపు అతనికి ఊపిరాడనట్టనిపించింది. మళ్ళీ వెంటనే ఒకసారి సిలువ మోస్తరుగా చేతులు కట్టుకుని, తనమట్టుకు తనకే అమర్యాద అనిపించినా, అదేమీ లక్ష్యపెట్టకుండా ఒక్క అంగలో ఆ గది దాటి ఇవతల పడ్డాడు.

ష్వారెజ్ కాళ్లు బాగా బారజాపుకొని రెండు చేతులతోను టోపీ ఎగరవేస్తూ ఆ పక్క గదిలో అతని కోసం కనిపెట్టుకుని కూర్చున్నాడు. మాంచి హుషారుగా వేషం వేసుకుని ఖుషాసాగా కూర్చున్న ష్వారెజ్‌ను చూడగానే ఇవానోవిచ్‌కి అయిదుప్రాణాలు లేచివచ్చాయి. ఇల్లాంటి విషాద సంఘటనల విషయం ష్వారెజ్ ఎంతమాత్రము పట్టించుకోడనీ, ఒక విషాద నిశ్వాసమైనా తనకు సోకకుండా జాగ్రత్తపడే వ్యక్తి అనీ ఇవానోవిచ్ గ్రహించివేశాడు. ష్వారెజ్ ధోరణిచూస్తే ఇలీయిచ్‌కోసం జరగబోయే ప్రార్థనలు మొదలైన వేవీ అతను తలపెట్టిన ఖులాసాకార్యక్రమానికి ఎంతమాత్రము అడ్డుపడలేవని తేలిపోయింది. అతనావేళ సాయంత్రం ఒక కొత్తపేక కొని నలుగురు స్నేహితులతోను హాయిగా కాలక్షేపం చెయ్యాలని నిశ్చయించాడు. నిజానికీ ప్రార్థనాదికం అతని కార్యక్రమం అడ్డగలదనడానికి ఆస్కారమే కనబడలేదు. ఇవానోవిచ్‌తో అతనీవిషయం అప్పుడే రహస్యంగా ప్రస్తావించి, స్నేహితులందరు వాసిలోవిచ్ ఇంటిదగ్గర చతుర్ముఖపురాణం వేసుకోవాలని చెప్పివేశాడు. అయితే ఇవానోవిచ్‌కీ అదృష్టం పట్టేటట్టు కనబడలేదు. ఇంతలో ప్రెస్కొవ్యా ఫెడరోవ్నా నఖశిఖపర్యంతము నల్లని దుస్తులు ధరించి, తన గదిలోనించి ఇవతలికి వచ్చి అక్కడ నిలబడిఉన్న స్త్రీలందరినీ శవం ఉంచిన గదిదగ్గరకు తీసుకువెళ్లి "ప్రార్థన ఇప్పుడే జరుగుతుంది. దయచేసి లోపలికి వెళ్ళండి" అన్నది.

ఫెడరోవ్నా పొట్టిగా లావుగా ఉంటుంది. ఎంత ప్రయత్నించినా ఆమె స్థౌల్యం తగ్గలేదు, సరికదా భుజాలకు దిగువభాగం అంతా క్రమక్రమంగా విస్తరించడం మితిమీరిపోయింది. వెనక పేర్కొన్న స్త్రీ కనుబొమ్మలలాగే ఆమె కనుబొమ్మలు గూడా ధనురాకారంలో కిందికి వంగిపోయాయి. ఫెడరోవ్నా శిరస్సుమీద లేసుల మేలిముసుగు కప్పుగున్నది.

ష్వారెజ్ అంటీ అంటనట్టుగా ఆమెకు నమస్కారం చేసి, ఆమె ఆహ్వానం అంగీకరించడమా? మానడమా? అన్న ఆందోళనలో అల్లాగే నిలబడిపో

యాడు. ఫెడరోవ్నా ఇవానోవిచ్‌ని చూసి, వెంటనే గుర్తించి ఒక నిట్టూర్పు విడిచిపెట్టింది. అటుపిమ్మట అతనికి దగ్గరగా వెళ్లి, చెయ్యి పట్టుకుని "మీరు ఇవాన్ ఇలియిచ్‌కి చాలా ఆత్మీయులు. నాకా సంగతి తెలుసును......" అని అతని ప్రత్యుత్తరం కోసం ఎదురుచూస్తూ నిలబడింది. వెనక ఇలియిచ్ ఉన్న గదిలో సిలువ ఆకారంలో చేతులు చాచి ముడుచుకున్నట్లే, ఇక్కడ గూడా యాథాలాభంగా ఏవో ఓదార్పు మాటలు అనాలన్న విషయం ఇవానోవిచ్‌కి తెలుసును. అందుచేత అతనామె చేయి అదిమిపట్టి, ఒక నిట్టూర్పు విడిచిపెట్టి "ఎంత మాట!" అన్నాడు. అతడనుకున్నట్టే జరిగింది. ఇద్దరికీ కళ్లు చెమ్మగిల్లినట్లైంది. అటుపిమ్మట ఆమె "ఒకసారి ఇలాగ రండి! ప్రార్థన మొదలుపెట్టే ముందు మీతో ఒక విషయం మాట్లాడాలని అనుకుంటున్నాను. మీ చెయ్యి ఇలాగ అందివ్వండి." అన్నది. ఇవానోవిచ్ ఆమెకు చెయ్యి అందిచ్చాడు. వారిద్దరు లోపలి గదిలోకి వెడుతూంటే దోవలో ష్వారెజ్ కనబడి ఇవానోవిచ్ కేసి కన్ను గీటి, అతిజాలిగా అతనికేసి చూశాడు.

ఇవానోవిచ్ దిక్కులేనిమనిషిలాగ మరింత జాలిగా నిట్టూర్చాడు. ఫెడరోవ్నా కృతజ్ఞతా సూచనతో మళ్ళీ అతని చెయ్యి అదిమిపట్టుకుని, మెల్లిగా లోపలికి నడిచివెళ్లింది. వారిద్దరు ఒక చిన్న హాలులో ప్రవేశించారు. అక్కడి దీపాలన్నీ కొంచెం మందకొడిగా వెలుగుతున్నాయి. ఆ గదినిండా రకరకాల సోఫాలు, వాటిమీద రంగురంగులదిండ్లు అమర్చబడిఉన్నాయి. ఆమె ఒక బల్లకుపక్కగా అమర్చిన సోఫామీద కూర్చుంది. అతనాపక్కనే పట్టుదిండు అమర్చిన మరొక కుర్చీమీద కూర్చున్నాడు. అతడు కూర్చోగానే ఆ దిండు తటాలున లోపలికి దిగబడిపోయింది. అంతకు పూర్వమే ఇంకొక కుర్చీలో కూర్చోమని ఆమె అతనితో చెప్పాలని అనుకొన్నదిగాని తన ప్రస్తుతపరిస్థితులనుబట్టి ఆవిధంగా అనడం బాగుండదని మాట్లాడకూరుకుంది. ఆ కుర్చీమీద కూర్చోగానే ఇవానోవిచ్‌కి ఇలియిచ్ ఆ గదిలో ప్రత్యేకంగా చేసిన ఏర్పాట్లు, ఆపట్టుదిండ్లలతల అల్లికలవిషయంలో తనతో చేసిన సంప్రతింపులు మొదలైనవన్నీ జ్ఞాపకంవచ్చాయి. ఆ గది అంతటా సోఫాలు కుర్చీలు అమర్చబడి ఉన్నాయి. సోఫామీద కూర్చోడానికి పూర్వం, ఫెడరోవ్నా కప్పుగున్న నల్లని శాలువా అంచు లేసులు ఒక కుర్చీ కొసకు తగులుకుని చిక్కులు పడ్డాయి. ఇవానోవిచ్ ఆ చిక్కులు విడదీయాలని లేచాడు. తాను కూర్చున్న కుర్చీదిండ్లలో అమర్చిన స్ప్రింగు లొక్కసారిగా అతన్ని పైకి నెట్టివేశాయి. ఇంతలోనే ఫెడరోవ్నా లేచి స్వయంగా ఆ లేసు చిక్కులు విడదీసుకోవడం మొదలుపెట్టింది. అందుచేత ఇవానోవిచ్ మళ్ళీ కుర్చీలో కూలబడి ఆ ఊపులో స్ప్రింగులన్నింటినీ కిందికి అదిమివేశాడు. కాని ఫెడరోవ్నా ఎంత ప్రయత్నించినా ఆ లేసులచిక్కు విప్పలేకపోయింది. అటుపిమ్మట ఇవానోవిచ్ మళ్ళీ లేచి నిలుచున్నాడు. తిరిగీ స్ప్రింగులన్నీ ఉవ్వెత్తుగా పైకిలేస్తూ గట్టిగా చప్పుడు చేశాయి. ఎల్లాగో ఆ చిక్కులన్నీ తొలగించివేసినతరవాత ఫెడరోవ్నా ఒక తెల్లని చేతిరుమాలుతో మొహం తుడుచుకుంటూ సన్నగా ఏడవడం ప్రారంభించింది. ఆశాలువా లేసుల చిక్కుల గొడవవల్ల ఇవానోవిచ్ లోలోపల కొంచెం స్తిమితపడి, దిగాలుపడిన మొహంతో అల్లాగే కూర్చుండిపోయాడు.

సోకోలోవ్ అక్కడికి రావడంవల్ల ఈ దుర్భరపరిస్థితికి కొంత విఘాతం కలిగింది. అతడు ఇలియిచ్‌దగ్గిర పనిచేసే వంటవాడు. సోకోలోవ్ అక్కడికి వస్తూనే ఇలియిచ్ శరీరం సమాధి చెయ్యడానికి ఏర్పాటుచేసిన స్థలం ఖరీదు రెండువందలవుతుందని చెప్పాడు. దానితో ఫెడరోవ్నా బాగా తమాయించి, అంత ఖరీదుపెట్టి ఆ స్థలం కొనడం తన తలదాటిపోయిన వ్యవహారమని బాగా బాధపడుతున్న వ్యక్తిలాగ, ఫ్రెంచిభాషలో ఇవానోవిచ్‌తో ఆ విషయం ప్రస్తావించింది. ఇవానోవిచ్ అదంతా జాగ్రత్తగా విని, అందులో అనుమానమేమీ లేదన్నట్టు తల పంకించాడు.

అపిమ్మట ఆమె ఎంతో ఠీవిగా "ఇదిగో! ఈ సిగరెట్టు ముట్టించండి!" అని చెప్పింది. కాని ఆ కంఠస్వరం బాగా దిగులుపడినట్లు వినబడింది. వెంటనే సోకోలోవ్‌తో శ్మశానంలో సమాధికి అనువైన ప్రదేశాన్ని గురించి చర్చించడం ప్రారంభించింది.

ఇవానోవిచ్ సిగరెట్టు వెలిగించి ఆ యిద్దరికీ మధ్య నడిచే సంభాషణ అంతా వింటూ కూర్చున్నాడు. ఆమె ఆ సమాధిచేసే ప్రదేశానికి సమీపంలో ఉన్న చెక్కుల ధరవరలన్నీ అడిగి, చివరికి ఏదో ఒకటి నిశ్చయించాలని అనుకుంటున్నది. ఆ తరవాత చర్చిలో జరిగే ప్రార్థనకు కావలసిన సరంజాం అంతా ఏర్పాటుచేసింది. వెంటనే సోకోలోవ్ అక్కడినించి వెళ్ళిపోయాడు.

పిమ్మట ఫెడరోవ్నా అక్కడ పడివున్న ఫొటోలన్నీ కదిలిస్తూ "ఈ ఏర్పాటులన్నీ నే

"స్వయంగానే చేసుకుంటున్నాను" అన్నది. తరవాత ఇవానోవిచ్ కాల్చే సిగరెట్టుబూడిద బల్లమీదపడి బల్లంతా పాడవుతూన్నదని గ్రహించి, అతని కొక ట్రే అందిస్తూ మెల్లిగా ఇలా అన్నది. "పుట్టెడు దుఃఖంలో మునిగి ఉన్నానని అంటూ, ఇల్లాంటి చిన్న చిన్న విషయాలు గమనించక పోవడం—నా కొక నటనలా కనబడుతుంది. ఆయన వస్తువులన్నీ జాగ్రత్తపెట్టడంమూలాన—నా కేదో ఓదార్పు కలుగుతుందని చెప్పలేనుగాని,—కొంత కాలక్షేపం మాత్రం జరుగుతుంది." ఇంతలో మళ్ళీ ఆమె ఒక సారి చేతి రుమాలుతో కళ్లు ఒత్తుకుంటూ విచారించడం మొదలుపెట్టిందిగాని, హఠాత్తుగా తనంతట తానే దుఃఖోపశమనం చేసుకుని, ఎంతమాత్రము తొణకకుండా, "అయితే నే నిప్పుడు మీతో ఒక వ్యవహారం మాట్లాడా లనుకుంటున్నాను." అంది.

ఇవానోవిచ్ కుర్చీ దిండు కదలకుండా అదిమి పట్టి అతివినయంగా కూర్చున్నాడుగాని స్ప్రింగులు మళ్లీ కొంచెం గందరగోళం చేశాయి.

"చివరిరోజుల్లో ఆయన ఆ జబ్బుతో తీసుకుంటూ చాలా బాధపడ్డారు."

"నిజంగా!" అన్నాడు ఇవానోవిచ్.

"అమ్మోయ్! ఇంతా అంతానా! గంటలతరబడి చాలా బీభత్సంగా గావుకేకలు పెట్టేవారు! నేనా కేకలుకూడా వినలేకపోయేదాన్ని. అదంతా తలుచుకుంటే ఆ బాధలన్నీ ఎలాగ భరించానా! అనిపిస్తూంది. ఆయన అరుపులు వీధిలోకి కూడా వినబడేవి. అబ్బా! ఎంత యాతన అనుభవించాను!"

"అయితే, అలాగ అరుస్తున్నంతసేపు అతనికి ఒంటిమీద స్మారకం ఉందా? అని నా అనుమానం."

"లేకేం! చివరి క్షణందాకా స్మారకం తప్పిపోలేదు" అని ఆమె మెల్లిగా సమాధానం మొదలు పెట్టింది. "ఒక పావుగంటకి ప్రాణంపోతుందనగా ఆయన మా అందరిదగ్గిర సెలవు తీసుకున్నారు. చివరికి చిన్నపిల్లవాణ్ణి దూరంగా తీసుకుపొమ్మని గూడా చెప్పారు."

ఇవానోవిచ్ చిన్నప్పటినించీ ఇలియిచ్‌తో కలిసిమెలిసి తిరిగినవాడే. అందుచేత చిన్నతనంలో ఆడుకుంటూన్న ఆ ఇలియిచ్‌మూర్తి మొట్టమొదటగా అతని కళ్ళకు కనబడింది. ఆ తరవాత ఇలియిచ్ బళ్ళో చదువుకుంటున్నట్టు, పెద్దవాడై ఉద్యోగం చేస్తూన్నట్టు కనిపించాడు. ఫెడరోవ్నా, తను కలిసి లేనిదుఃఖం ఎంత తెచ్చిపెటుగున్నా, ఇలియిచ్ బాధ మాట వినేసరికి ఇవానోవిచ్‌కి గుండె ఆగిపోయినంత భయంవేసింది. మళ్ళీ అతనికి ఆ ఇలియిచ్ శవము, ఆ కనుబొమ్మలు, ఆ పెదవులమీదికి దిగబారిన ముక్కు జ్ఞాపకం వచ్చి నఖశిఖపర్యంతం ముచ్చెమటలు పోశాయి.

"మూడురోజులపాటు యమయాతన అనుభవించి చచ్చిపోయాడు! ఏం? అల్లాంటిది ఎప్పుడో అప్పుడు నాకు రావచ్చును" అని అనుకుని ఇవానోవిచ్ లోలోపల గజగజ వణికిపోయాడు. అయితే మళ్లీ అందరికీ సామాన్యంగాతట్టే ఆ ఆలోచన హఠాత్తుగా తన కెల్లాగ తట్టిందో అతనికే తెలియదు. మళ్ళీ ఆ చచ్చిపోయింది ఇలియిచ్చే గాని తానుమాత్రం కాదనీ, అల్లాంటి దురవస్థ ఎన్నడూ తనకు పట్టడానికి వీల్లేదనీ అనుకున్నాడు. ఆపైన అల్లాంటి విషాదచ్ఛాయలు లోలోపల రానివ్వకుండా తరిమివెయ్యాలనీ, దానికి ష్వారెజే దాఖలా అనీ స్థిరపరుకున్నాడు. ఈ ఆలోచనలన్నీ లోలోపల తిరిగిన తరవాత ఇవానోవిచ్‌కి మళ్ళీ కొంచెం ఊతం వచ్చింది. అటు పిమ్మట ఇలియిచ్ చచ్చిపోవడం అతిసహజంగా జరిగిపోవలసిన వ్యవహారమనీ, తనకుమాత్రం అటువంటి దుర్గతి పట్టవలసిన అవకాశం ఏమాత్రమూ కనబడదనీ నిశ్చయించుకుని, ఇలియిచ్‌మృతికి సంబంధించిన వివరాలన్నీ ఇంకా గుచ్చిగుచ్చి అడిగి తెలుసుకున్నాడు.

ఇలియిచ్ ఆవిషంగా దుర్భరయాతనలన్నీ అనుభవించిన వివరాలన్నీ చెప్పినతరవాత, ఫెడరోవ్నా మళ్లీ యథాప్రకారంగా తన స్వంతవ్యవహారం ప్రస్తావన తెచ్చేటట్లు కనబడింది. అసలు ఆ ఇలియిచ్ బాధలన్నీ ఫెడరోవ్నా ఎలాగ భరించిందో తెలుసుకోడానికే ఇవానోవిచ్ ఈ వివరాలన్నీ తెలుసుకున్నాడు.

ఫెడరోవ్నా మళ్ళీ "ఇవానోవిచ్! నేను ఎన్నెన్ని అవస్థలు పడ్డాను. అంతటి యమయాతన ఎన్నడూ ఎరగను." అని చెప్పి, తిరిగీ ఏడవడం ప్రారంభించింది. ఇవానోవిచ్ ఒక నిట్టూర్పు విడిచిపెట్టి, ఆమె మొహం తుడుచుకునేదాకా ఆగి, ఆ పని జరిగిన తరవాత "ఔనౌను! ఏం జేస్తాం" అన్నాడు. మళ్ళీ ఫెడరోవ్నా మాట్లాడటం మొదలుపెట్టి అసలు తను ప్రస్తావించదలుచుకున్న అతిముఖ్యమైన వ్యవహారంలోకి దిగింది. తన భర్త చనిపోవడంవల్ల ప్రభుత్వందగ్గిరనించి గ్రాంటు సంపాదించడం ఎల్లాగా అన్నదే ఆమె ప్రస్తావించదలుచుకున్న అతిముఖ్య వ్యవహారం. ఆమె తనకు రాబోయే

పింఛను సంగతి అడగబోతున్నట్టు కనబడింది. కాని ఆ విషయాలన్నీ తనకంటె పదిరెట్లు బాగా క్షుణ్ణంగా ఆమె కింతకు పూర్వమే తెలుసునని ఇవానోవిచ్ గ్రహించుకున్నాడు. తన భర్త మరణానంతరం తనకు ముట్టవలసిన పింఛను విషయం అంతా ఆమె కింతకు పూర్వమే గళగ్రాహిగా ఉన్నది గాని 'ప్రభుత్వం దగ్గిరనించి ఏమైనా ఇంకా ఎక్కువగా పిండడానికి వీలుంటుందా?' అనే ఆమె అతనిని ఈ విషయం కదిలించింది. ఇవానోవిచ్ ఎక్కువగా డబ్బురాబట్టే ఉపాయాలు కొన్ని చెప్పాడు గాని మళ్ళీ కొంతసేపు పస్తాయించి, కేవలం మర్యాద కోసం ప్రభుత్వవర్గాల లోభిత్వం బాగా దుయ్యబట్టి, ఇక అంతకంటె రాబట్టడం కష్టమని చెప్పివేశాడు. అటుపిమ్మట ఆమె ఒక నిట్టూర్పు విడిచిపెట్టి అతన్ని వెంటనే సాగనంపడానికి తగిన ఉపాయాలు వెదకడం మొదలుపెట్టింది. ఇవానోవిచ్ వెంటనే ఈసంగతి గ్రహించి సిగరెట్ ముట్టించి, మళ్ళీ సాదరంగా కరచాలనంచేసి, నెమ్మదిగా పక్కగదిలోకి తప్పుకున్నాడు.

ఆ భవనం భోజనాలగది గోడమీద ఒక గడియారం కనబడుతుంది. ఆగడియారం అంటే ఇలియిచ్ కెంతో ఇష్టం. అతనది ఒక ప్రాచీనవస్తువుల దుకాణంలో కొని ఆ గోడకు తగిలించాడు. ఇవానోవిచ్ కిక్కడ ఒక మతగురువు, కొంతమంది పరిచితులు కనిపించారు. వారందరు ప్రార్థనకోసం అక్కడికి చేరుకున్నారు. అతనికి వారిలో ఇలియిచ్‌కుమార్తె కూడా కనబడింది. ఆమె చక్కని చుక్క. సన్నగా సళాయిగా ఉన్న ఆమెశరీరం నల్లని దుస్తులవల్ల మరింత నాజూకుగా మారింది. ఆమె బాగా దిగులుగా ఉంది. ఎవరిమీదనో కోపగిస్తున్నట్టు, ఏదో ఒక పని చెయ్యాలని నిశ్చయించినట్లు కనబడింది. ఇవానోవిచ్‌ని చూడగానే అతనే తన తండ్రి మృత్యువుకు కారణం అన్నట్లామె విసురుగా అతని వైపు తిరిగి నమస్కరించింది.

ఆమెవెనకాల ఇంచుమించుగా ఇల్లాంటిధోరణిలోనే, ఉన్న మరి ఒక యువకుడు కనిపించాడు. అతను బాగా ధనవంతుడు. ప్రస్తుతం మేజస్ట్రేటుఉద్యోగం చేస్తున్నాడు. ఇవానోవిచ్‌కి అతడు పరిచితుడే. ఇలియిచ్ కుమార్తెకు, అతనికీ వివాహం స్థిరపడింది. ఇవానోవిచ్ విచారంగా వారిద్దరికీ నమస్కరించి, ఇలియిచ్ శరీరం ఉంచిన గదిలోకి వెళ్లబోతూంటే మళ్ళీ ఇంకొక పిల్లవాడు కనిపించాడు. అతడు ఇలియిచ్ కుమారుడు. స్కూల్లో చదువుకుంటున్నాడు. ఆకుర్రవాడు మూమూర్తులా ఇలియిచ్‌ని పోలిఉన్నాడు. అతనికేసి చూస్తూంటే మళ్లీ ఇలియిచ్చే చిన్నపిల్లవాడై తిరుగుతున్నాడా అనిపించింది. తన చిన్నతనంలో ఇలియిచ్ అచ్చం అలాగే ఉండేవాడని ఇవానోవిచ్ అనుకున్నాడు. పదిపదమూడు ఏళ్లు వచ్చేసరికే పిల్లల కళ్లలో ఒక విషమైన అపవిత్రత కనిపిస్తుంది. కన్నీళ్లు చారికలుగట్టిన ఇలియిచ్ కుమారుని కళ్లలో కూడా అలాంటికవళికే కనిపించింది. ఇవానోవిచ్‌ని చూడగానే ఆకుర్రవాడు మూతి బిగించుకొని మొహం తిప్పివేసున్నాడు. ఇవానోవిచ్ అతన్ని పలకరించినట్లుగా తలపంకించి మృతశరీరం ఉంచిన గదిలోకి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళివెళ్లడంతోనే ప్రార్థన ప్రారంభంఅయింది. ఆ గదిలో కొన్ని కొవ్వొత్తిదీపాలు వెలుగుతున్నాయి. సాంబ్రాణిపొగ గది నాలుగుమూలలా వ్యాపిస్తున్నది. ప్రార్థనల మధ్యన మూలుగులు, బుడిబుడిదీర్ఘాలు, ఏడుపులు, వినిపిస్తున్నాయి. దిగులుగా తన పాదాలకేసి చూస్తూ ఇవానోవిచ్ అల్లాగే నిలబడిపోయాడు. అంతేగాని మళ్ళీ ఇలియిచ్ శరీరంవైపు చూడలేదు; తరవాత చీకు, చింతా మనస్సులో ప్రవేశించకుండా నిబ్బరంగా ఉండి, అందరికంటె ముందుగానే ఆ గదిలోనించి ఇవతలికి వచ్చేశాడు. ఆ పక్కగదిలో ఎవ్వరు లేరు. కాని జిరాసిమ్ ఆ ఇలియిచ్‌శరీరం ఉంచిన గదిలోనుంచి వెంటనే ఇవతలికి వచ్చి, తన మోటుచేతులతో అక్కడ తగిలించిన ఉన్నికోటులన్నీ తడిమిచూసి, అందులో ఇవానోవిచ్‌కోటు పట్టుకుని, అతనా కోటు తొడుక్కుంటూంటె వెనక నిలబడి సాయంచేశాడు.

ఏదో ఒక మాట అనాలిగదా అని ఇవానోవిచ్ అతనితో ఇలాగ అన్నాడు. "నేస్తం! చూశావా! పాపం! ఎంత ఆపత్తు వచ్చిందో!"

జిరాసిమ్ "అది అంతా బగమంతుడి దయ బాబూ! ఈయాలో రేపో మనమంతా అక్కడికి కెళ్ళాలి గందా బాబూ!" అన్నాడు. జిరాసిమ్ ఆ మాట లంటూంటే అతని తెల్లని పళ్ళవరస బైట పడింది. అది ఆరోగ్యంగా జీవించే రైతు పళ్లవరస. ఈ మాట లన్నతరవాత జిరాసిమ్ ఊపిరాడని పనితో కొట్టుకుంటూన్నవాడిలాగ ఆఎదురుగా నిలబడిన స్లెడ్జి బండితలుపులు తెరిచి, ఇవానోవిచ్‌ని అందులో ప్రవేశపెట్టి, ఏదో ఇంకొక తొందరపనికోసం వెళ్లేమనిషిలాగ గుమ్మందాటి లోపలికి ఒక్క గంతు వేశాడు.

ఆ సాంబ్రాణిపొగ, ఆ శవం, ఆ వాసన, మొదలైన వాటినించి తప్పించుకుని ఇవతలపడ్డ తర

వాత వీధిగాలి సోకగానే ఇవానోవిచ్‌కి పంచ ప్రాణాలు లేచివచ్చాయి.

బండివాడు "ఎక్కడికి తోలమన్నారు బాబూ!" అని అడిగాడు.

ఇవానోవిచ్ "ఇప్పుడైతే నేం! మించిపోయిందేమీ లేదులే! ఫెడర్ వాసిలోవిచ్ ఇంటికై పు పట్టించు" అన్నాడు.

బండి అక్కడికి వెళ్లి ఆగింది. ఇవానోవిచ్ లోపల ప్రవేశించేసరికి బ్రిడ్జిఆట ఒక ఘట్టం అయింది. వెంటనే ఇవానోవిచ్ ఒక ఆసామిని జబ్బ పట్టుకుని లేవదీసి ఆ ఆటలో పడ్డాడు.

## 2

ఇవాన్ ఇలియిచ్ బ్రతుకంతా చాలా సంసార పక్షంగాను, సరళంగాను గడిచిపోయింది. కనక నే అది అత్యంత భయంకరమైన జీవితం.

అతడు కోర్టులో జడ్జీగా పనిచేసేవాడు; 45వ ఏట చనిపోయాడు. అతని తండ్రి ఒక పెద్దఉద్యోగంలో ఉండేవాడు. పీటర్స్‌బర్గ్‌లో అనేకమైన ప్రభుత్వశాఖల్లో చాలాకాలం పనిచేసిన తరవాత అతనికొక పెద్ద హోదావచ్చింది. సామాన్యంగా చాలాకాలం ఉద్యోగాలుచేసి గొప్ప హోదాల్లోకి వచ్చిన మనుష్షుల్ని - ఇలాంటి పదవులు నిర్వహించడానికి వీ రెంత అసమర్థులయినా—చటుక్కున బర్తరఫ్ చెయ్యాటం చాలా కష్టం. అందుచేత ఇలాంటి జనాభాకోసం కొత్తగా కొన్ని ఉద్యోగాలు సృష్టిస్తారు. వీటికి అయిదారు వేలదాకా జీతాలుంటాయి. ఈ ఉద్యోగాలు కేవలం ఆ సామాషీ ఉద్యోగాలే కావచ్చునుగాని, ఈ ఉద్యోగులు స్వీకరించే, జీతాలుమాత్రం చాలా గట్టివి. ఇలాంటి జీతాలు జేబులో వేసుకుంటూ వీరంతా చిరకాలంపాటు జీవిస్తారు.

ఇలాంటి పెద్దపెద్ద ఆషామాషీ ఉద్యోగాలెన్నో చేసిచేసి, చివరికి ప్రీవీకౌన్సిలరైన ఇల్యా ఎపిమోవిచ్ గోల్విన్.జీవితగాథ అంతటిది!

అతనికి ముగ్గురు కుమారులు. వీరిలో ఇవాన్ ఇలియిచ్ రెండవవాడు. పెద్దవాడు ఇంకొక ప్రభుత్వ శాఖలో కేవలం తండ్రి అడుగుజాడల్లోనే నడిచిపోతున్నాడు; అప్పుడే అతను కూడా తండ్రి మోస్తరుగానే పనీపాటాలేని పెద్దఉద్యోగం ఒకటి అందుకోబోతున్నాడు. మూడోకుమారుడికి ఎక్కడికి వెళ్లినా పెద్దమేళ్ళ ప్రత్యక్షమయింది. ఎన్నో పెద్ద ఉద్యోగాలు చేశాడుగాని చివరికి అన్నింటిలోను వట్టిచేతగానివా డనిపించుకున్నాడు; ప్రస్తుతం రైల్వేలోపని చేస్తున్నాడు. అతని తండ్రి, సోదరులు వారి భార్యలు—అతన్ని చూస్తూనే దూరదూరంగా తప్పుకుపోవడమేకాక, ఏదో అత్యంతావసరంవస్తే తప్ప అతడు బతికిఉన్నాడన్నమాటే మరిచిపోయేవారు. అతని సోదరి బారన్‌గ్రెఫ్ అనే పీటర్స్‌బర్గ్ ఉద్యోగిని వివాహంచేసుకున్నది. ఇతడు కూడా ఈమె తండ్రితో సమానమైన హోదాలో ఉన్న ఉద్యోగస్థుడే. ఇక మన ఇవాన్ఇలియిచ్ కుటుంబానికి పరువుప్రతిష్ఠలు తీసుకువస్తాడని అందరు అంటూండేవారు. ఇతడు అన్నగారిలాగ అందరికీ దూరదూరంగాను ఉండలేదు; తమ్ముడిలాగ అయినవాళ్ళతోను, కానివాళ్లతోను కలిసి తిరగనులేదు. కాని ఇద్దరికీ మధ్యమార్గంలో మసులుకుంటూ ఉండేవాడు. తమ్ముడితో కలిసి న్యాయకళాశాలలో లా చదివాడు. తమ్ముడు చదువు పూర్తిచెయ్యలేకపోయాడు. 5వ సంవత్సరంలో కళాశాలాధికారు లతన్ని బర్తరఫ్ చేసి బయటికి పంపించి వేశారు. ఇలియిచ్ బాగా చదివి, పరీక్షలన్నీ గడిచి గట్టెక్కాడు. ఆ తరవాత ఆజన్మాంతము కనబడిన ఆ ధోరణి అంతా అతనికి ఆ చదువుకునే రోజుల్లోనే అలవాటయింది. ఇలియిచ్ సమర్థుడు. అందరితో కలిసి మెలిసి తిరుగుతూ మంచి ఉత్సాహంగా ఉండేవాడు. తన ఉద్యోగవ్యవహారాలన్నీ బాగా నిక్కచ్చిగా నడిపేస్తూ ముక్కుకు సూటిగా వెళ్లిపోతూండేవాడు. తన విధులన్నీ సక్రమంగా నిర్వహించేవాడు; అయితే పై అధికారులంతా ఇది న్యాయం అనుకుంటే ఇతను కూడా గిరిగీసినట్టుగా అల్లాగే నడిచిపోయేవాడు. చిన్నతనంలో గాని, పెద్దతనంలో గాని అతనికి ఇచ్చకాలు మాట్లాడే అలవాటు ఉండేదికాదుగాని, దీపంచుట్టూ పురుగులు జేరినట్లు పెద్దపెద్ద ఉద్యోగస్థులంటే బాగా ఆప్యాయత కనబరుస్తూండేవాడు. వారి జీవిత దృక్పథాలు, ఆచారవ్యవహారాలు మొదలైనవన్నీ బాగా ఆకళించుకుంటూ వారితో స్నేహంచేస్తూండేవాడు. చిన్నతనంలోను ఆ తరవాత వయస్సులోను ఉండే ఆదర్శాలు, ఉత్సాహాలు మొదలైనవన్నీ ఆనవాలైనా లేకుండా హరించిపోయాయి. క్రమంగా స్త్రీ వ్యసనానికీ, డాబుదర్పాలకు దాసుడై పోయాడు. బాగా పెద్దఉద్యోగస్థులతో కలిసి తిరిగేటప్పుడు ఏది పడితే అది చేయవచ్చుననే సువిశాల దృక్పథంతో మాట్లాడుతూండేవాడు. కాని సహజంగా తన హృదయానికి న్యాయమని స్ఫురించిన పరిమితుల్లోనే వ్యవహరిస్తూ, ఎప్పుడూ జాగ్రత్తగా మసులుకుంటూండేవాడు.

చదువుకొనే రోజుల్లో తాను చేసిన పనులు తలుచుకుంటే ఆ రోజుల్లో అతని కవన్నీ చాలా తప్పుడు పనులని పశ్చాత్తాపం కలిగేది. కాని, తరవాత పెద్దపదవుల్లో ఉండేవారే అల్లాంటి పనులు చెయ్యడమూ, అవి తప్పుడు పనులుకాదని అందరు అనుకోవడమూ చూసిన తరవాత ఇలియిచ్ తాను చేసినవి మంచివనుకోవడమే కాక, ఇంక సుతరామూ వాటిని గురించి ఆలోచించడమే మానివేశాడు. కొంతకాలానికిక వాటి గోడే మరిచిపోయాడు.

లా డిగ్రీ సంపాదించిన తరవాత సివిల్ సర్వీస్‌లో ఒక చిన్న ఉద్యోగానికి తగిన అర్హత సంపాదించుకున్నాడు. ఆ సందర్భంలో తండ్రి అతనికి కావలసినంత డబ్బు కూడా పంపించాడు. వెంటనే ఒక పెద్ద తరహా దర్జీ దగ్గరికి వెళ్ళి కావలసినన్ని దుస్తులు కుట్టించుకున్నాడు. ఆ పైని తన ప్రొఫెసర్ దగ్గరికీ, తన స్కూలుకు పోషకుడుగా ఉంటున్న జమీందారు దగ్గరికీ వెళ్ళి, ఎంతో మర్యాదగా సెలవు పుచ్చుకున్నాడు. ఒక పెద్ద హోటలులోకి వెళ్ళి ఆర్భాటంగా తన స్నేహితులందరికీ విందుభోజనం ఏర్పాటుచేసి వారిదగ్గర కూడా సెలవు తీసుకున్నాడు. తన ప్రయాణానికి అవసరమైన సామానులన్నీ పెద్ద పెద్ద షాపుల్లో ఖరీదు చేసి, వాటితో ఇంకొక రాష్ట్రానికి తరలి వెళ్ళిపోయాడు. అక్కడ తన తండ్రికి ఉన్న పలుకుబడివల్ల అక్కడి గవర్నరుదగ్గర ఒక ప్రత్యేకోద్యోగిగా కుదురుకున్నాడు.

ఇలియిచ్ అక్కడ కూడా, స్కూల్లో మోస్తరుగానే మసులుకున్నాడు. క్రమంగా సుఖంగా సాగిపోయే ఒక మంచి ఉద్యోగం సంపాదించి అందులో కుదురుకున్నాడు. తన ఉద్యోగవిధులన్నీ సక్రమంగా నిర్వర్తించుకుంటూ, కొంతకాలానికి ఇంకొక పెద్ద పదవిలో ప్రవేశించాడు. ఇల్లాగ పైపైకి వస్తూన్నా, ఖులాసాగాను, సుఖంగాను కూడా కాలక్షేపం చేస్తూ మంచి హుందాగా ఉండేవాడు.

అప్పుడప్పుడు పల్లెటూళ్ళలో కూడా మకాములు చేస్తూ పై ఉద్యోగస్థులన్నా, కింది ఉద్యోగస్థులన్నా ఎంతో మర్యాదగా వ్యవహరిస్తూ, కులకక్షలకు సంబంధించిన లావాదేవీలన్నీ తూచా తప్పని నిబ్బరమైన నిజాయితీతో పరిష్కరిస్తూ, గొప్ప గౌరవం సంపాదించాడు. ఆతరవాత ఈవిషయాలన్నీ తలుచుకొన్నప్పుడల్లా అతనులోలోపల మురిసిపోతూండేవాడు.

బాగా వయస్సులో ఉండడంవల్ల సరదాగా తిరగాలని ఇష్టం ఉన్నా, ఉద్యోగ వ్యవహారాలలో మాత్రం బాగా ముభావం కనబరుస్తూ, ప్రతీ చిన్న విషయము పరిశీలిస్తూ ఉండేవాడు. అప్పుడప్పుడు కఠినంగా వ్యవహరిస్తూ ఉండేవాడు. కాని నలుగురిలోకి వచ్చినప్పుడు మాత్రం చాలా సరదాగా కబుర్లు చెబుతూ, నలుగురితోను వేళాకోళాలాడుతూ, మర్యాదగా ఉండి, పెద్దమనిషిలా కాలం వెళ్ళబుచ్చాడు. గవర్నరు దంపతులిద్దరు అతన్ని తమ కుటుంబంలోని వ్యక్తిగా పరిగణిస్తూ, ఇలియిచ్ అంటే ఎంతో మర్యాదగాను, ఆప్యాయంగాను మాట్లాడుతూండేవారు.

ఇలియిచ్ పల్లెపట్టుల్లో మకాం వేసి ఉన్నప్పుడు ఒకావిడ ఇతని ఆర్భాటము అదీ చూసి, కొంతకాలం పాటు జోస్తీ కలిపింది. ఆ తరవాత టోపీలుకుట్టే మరి ఒక స్త్రీ తటస్థపడింది. అటుపిమ్మట మరి ఒక వ్యక్తితో మరి కొంతపరిచయం ముదిరింది. క్రమక్రమంగా అతను మర్యాదస్థులు వెళ్ళకూడని సందుగొందుల్లోకి కూడా వెడుతూండేవాడు. ఒకప్పుడు అధికారులదగ్గిర తలవంచుకోవలసిన పరిస్థితి కూడా వచ్చింది అయితే అదంతా కొంత గప్‌చిప్‌గాను, దర్జాగాను సాగిపోవడంవల్ల అంతగా చెడ్డ పేరేమీ రాలేదు. ఒక ఫ్రెంచి సామెత ధోరణిలో అదంతా 'పడుచుదనం' కింద జమ అయిపోయింది. అతనిరంగేళీ వ్యవహారాలన్నీ పెద్దకుటుంబాలతోను, ఆకుటుంబాల అర్ధాంగి కారాలతోను, అతి మర్యాదగాను, చల్ల చల్లగాను సాగిపోయాయి.

ఈవిధంగా అయిదేళ్లు గడిచినతరవాత ఇలియిచ్ ఉద్యోగంలో ఒక మార్పువచ్చింది. న్యాయశాఖలో కొత్తమార్పులు కొన్ని చేశారు; అందుచేత కొత్త మనుషులు కావలిసివచ్చారు. అలాగ కావలసి వచ్చిన వ్యక్తులలో ఇలియిచ్ ఒకడు. ఇతనికి మేజస్ట్రీటుపదవి ఇచ్చారు. దీనివల్ల తన పాత వ్యవహారాలన్నిటికీ నీళ్లువదులుకుని మళ్ళీ కొత్తదారి తొక్కవలసిన అవసరం ఏర్పడినా, ఉన్నచోటు వదిలి మరొకచోటికి బదిలీ కావలిసివచ్చినా లెక్కపెట్టక ఇలియిచ్ ఈ ఉద్యోగానికి సిద్ధపడ్డాడు. ఈ సంగతి తెలిసి స్నేహితులంతా అతనికి వీడ్కోలిచ్చారు. వారందరితోను కలిసి అతనొకఫోటో తీయించుకున్నాడు. ఆసందర్భంలో స్నేహితులంతా కలిసి అతనికొక వెండి సిగరెట్ కేసు బహుమతీ చేశారు.

మేజస్ట్రీటుగా ఉన్నప్పుడు కూడా ఇలియిచ్ పూర్వం మాదిరిగానే ఉంటూ అతిమర్యాదగా అందరి మన్ననలు అందుకుంటూ ఉద్యోగవ్యవహారాలలోను, స్వంతవ్యవహారాలలోను, ప్రత్యేకంగా తన హోదా

నిలబెట్టుకుంటూ జాగ్రత్తగా కాలక్షేపం చేసేవాడు. ఇలియిచ్‌కి వెనక ఉద్యోగంకన్న ఈ ఉద్యోగమే బాగా నచ్చింది. వెనకటి ఉద్యోగంలో పెద్ద పెద్ద దర్జీలు కుట్టిన విలువైన దుస్తులు వేసుకుని గవర్నరు దర్శనార్థం వేచి ఉన్న వందలకొలది అర్జీదారుల మధ్యనించి నడిచిపోతూండడం చాలా దర్జాగా ఉండేది. ఠీవిగా నడిచిపోతూ మధ్య మధ్య గవర్నరులతో కలిసి సిగరెట్లు, టీ సేవిస్తూ ఖులాసాగా కబుర్లు చెబుతూ అధికారం చెలాయించే అతన్ని చూసి అర్జీదారులందరు అసూయపడుతూ ఉండేవారు. అయితే ఎవరో పోలీసు ఉద్యోగులకు, కులక్షుల వివాదాలు తీర్చే మరికొంతమందికీ మాత్రమే అతని ఆసరా కావలిసివచ్చేది. ఇలియిచ్ వారినందరినీ చాలా మర్యాదగానే ఆదరిస్తూ ఉండేవాడు. తలుచుకుంటే కాలికింద పెట్టి మట్టి చెయ్యగల శక్తిసామర్థ్యాలున్నా 'మిమ్మల్ని అందరినీ ఎంతో మర్యాదగా గౌరవిస్తున్నాను సుమా!' అన్నట్లుగా అతను నౌకర్దారులందరితోను వ్యవహరిస్తూ ఉండేవాడు. అయితే ఎంత చూసినా అలాంటి మనుష్యులా రోజుల్లో చాలా తక్కువగానే ఉండేవారు. కాని మేజస్ట్రేటు గిరీ వచ్చిన తరవాత కొమ్ములు తిరిగిన పెద్ద పెద్ద అధికారులంతా అతనికి గుప్పిట్లో ఉన్నట్టుండేది. ఒక కాగితంమీద నాలుగు గీతలు గీసేసరికి ఎంతంతటి అధికారులైనా కుర్చాయీలలో, సాక్షులో అయి, చేతులు కట్టుకుని అతని ఎదురుగా హాజరు కావలసిందే. అలా హాజరై, అతను కూర్చోమనే దాకా అలా నిలబడి ఉండి, అతను అడిగిన ప్రశ్నలకు సమాధానాలివ్వవలసిందే. అయితే ఇలియిచ్ మాత్రం తన అధికారం దుర్వినియోగపరచలేదు. పైపెచ్చు చాలా చల్లగానే కబుర్లు చెబుతూ ఉండేవాడు. అందుచేత అతని కచేరీ అంటే అందరు అదొకవింతగా చెప్పుకునేవారు. కేసులు విచారణ చేసే సందర్భాలలో కూడా అనవసరమయిన బాదరబందీ అంతా తీసివేసి, తన ఇష్టానిష్టాలొకపక్కకు నెట్టి, కేవలం లా ప్రకారం ముక్కుకు సూటిగా వెళ్ళిపోతూ ఉండేవాడు. 1864 లో కొత్తగా నూతన న్యాయసూత్రాలమలులోకి వచ్చాయి. ఆ పనిఅంతా కొత్తగా ఉన్నా, ఇలియిచ్ అవన్నీ అమలులో పెట్టి నడిపించుకుపోయాడు.

ఇలా మేజస్ట్రేటు గిరీ చెలాయిస్తుండగా అతన్ని ఇంకొక పట్టణానికి బదిలీ చేశారు. అక్కడ అతను కొత్తకొత్తవారితో పరిచయాలేర్పరుచుకుని, కొత్త బంధుత్వాలు కలుపుకున్నాడు. ఇప్పుడు ఒకరకం కొత్తఠీవి అవలంబించి, పూర్వపు ధోరణిఅంతా చాలావరకు తగ్గించివేశాడు. ఆ ప్రాంతంలో అధికార వర్గానికి కొంతవరకు దూరదూరంగా ఉంటూ, వారందరియెడల ఒకరకమైన దర్జా కనబరుస్తూ ఉండేవాడు. పెద్దపెద్ద న్యాయవాదులతోను, డబ్బున్న వారితోను జోస్తీగా కలిసిమెలిసి తిరుగుతూ, అప్పుడప్పుడు ప్రభుత్వం వ్యవహారాలు సరియైన దారిలో నడవడం లేదని విమర్శించేవాడు. ప్రజలకు పౌరస్వాతంత్ర్యాలు, హక్కులు ఇంకా కొంచెం ఎక్కువచెయ్యాలని అంటూండేవాడు. ఇది ఇలాగ సాగుతున్నా తన వేషభాషలేమీ చెక్కు చెదరనీయలేదు; కొంచెం హుషారుకోసమని గడ్డం కూడా సోగగా పెరగనిచ్చాడు.

ఇలియిచ్ ఈ కొత్తపట్టణానికి వచ్చిన తరవాత కొంతకాలానికి సుఖంగా తన ఉద్యోగంలో కుదురుకున్నాడు. ఆ పట్టణంలో పెద్దపెద్ద ఉద్యోగస్థులందరికీ అక్కడి గవర్నరంటే అంతగా పడేది కాదు; అందుచేత వారందరు ఇతనంటే ఎంతో ఆప్యాయత కనబరచేవారు. ఆ పైన జీతం కూడా పెద్దదయింది. ఈ రోజుల్లో ఇలియిచ్ ఒక కొత్తరకం బ్రిడ్జి ఆట ఆడుతూండేవాడు. దీనితో అతనికి మరీ సుఖంగా కాలక్షేపం అయిపోతూఉండేది. పైకి ఖులాసాగా ఆడుతున్నట్టున్నా, ప్రత్యేకశక్తిసామర్థ్యాలుండడంవల్ల క్షణకాలంలో జాగ్రత్తగా లెక్కలుకట్టి సామాన్యంగా ఆ ఆటలన్నీ తనే గెలుచుకుపోతూ ఉండేవాడు.

ఈ పట్టణంలో రెండు సంవత్సరాలున్న తరవాత ఇవాన్ ఇలియిచ్‌కి మున్ముందు వివాహం ఆడబోయే యువతితో పరిచయం కలిగింది. ఆమె పూర్తిపేరు ప్రెస్కొవ్యా ఫెడరోవ్నా మిఖేల్. అతనికి పరిచయం అయిన అమ్మాయిలందరిలోను ఆమె చాలా అందగత్తె. మంచి తెలివితేటలున్నాయి; చురుకైనపిల్ల. తీరికసమయాల్లో ఆమెతో జోస్తీగా తిరుగుతూండడం—ఇప్పుడతనికి ఇతరవ్యావృత్తులతో బాటొక వ్యావృత్తిగా తయారయింది. పూర్వం గవర్నరు దగ్గర ప్రత్యేకోద్యోగిగా పనిచేసేటప్పుడతనికి అడపాతడపా నృత్యం చేసే అలవాటుండేది. ఇప్పుడయితే ఏదో ప్రత్యేకసమయంలో తప్ప అది జరగడం లేదు. అధికార పద్ధతుల్లో సరికొత్తమార్పులు వచ్చినా, పెద్దపెద్ద అధికారాల్లో అయిదో అంతస్థులో ఉన్నా, అవసరంవస్తే అందరికన్నా తానే బాగా నృత్యం చెయ్యగలనని అనిపించుకోవడం కోసమే, అతడిప్పుడీ నృత్యవినోదాల్లో పాల్గొనేవాడు. అందుచేతనే అప్పుడప్పుడు నృత్యాది వినోదాల చివరక్షణాల్లో ప్రెస్కొవ్యా ఫెడరోవ్నాతో కలిసి నృత్యం చేస్తూండేవాడు. ఈ సందర్భంలోనే ఫెడరోవ్నా కళ్లు అతనిమీద పడ్డాయి. ఆమె అతన్ని

ప్రేమించింది. మొదట్లో ఇవాన్ ఇలియిచ్ ఈ విషయంలో గట్టిగా ఏమీ అనుకోలేదు గాని, ఫెడరోవ్నా ప్రేమించిన తరవాత తనలో తాను "ఏం? ఎందుకు పెళ్ళి చేసుకోకూడదు?" అనుకున్నాడు.

ప్రెస్కోవ్యా ఫెడరోవ్నా పరువు మర్యాదలున్న కుటుంబంలోంచి వచ్చిన పిల్ల; అనాకారి కాదు; కొద్దో గొప్పో ఆస్తికూడా ఉంది. ఇలియిచ్‌కి ఇంతకన్నా మంచి సంబంధం వస్తే రావచ్చును గాని, ఈ సంబంధమైనా మంచిదే. సరే, అతని జీతం ఉండనే ఉందిగదా! ఆమె ఆస్తి కూడా దీనితో సరిసమానమైనదే. ఫెడరోవ్నా బంధువులంతా పెద్ద పెద్ద ఉద్యోగాల్లో ఉన్నారు. ఆపైన ఆమె చక్కని చుక్క. మంచి ఒద్దికఉన్న పిల్ల. బంధువులంతా తలలూచారని గాని, లేక పరస్పరము ప్రేమించుకోవడం జరిగిందని గాని అతడీ వివాహం స్థిరపరచలేదు. మొత్తంమీద ఈ రెండు విషయాలు ఈ వివాహం స్థిరపరచడానికి కారణాలే. అన్ని విధాలా అతనికీ సంబంధం నచ్చింది. ఇంకా పెద్ద పెద్ద పదవుల్లో ఉన్న బంధువులంతా ఇది మంచి సంబంధమే అన్నారు.

కనకనే ఇవాన్ ఇలియిచ్ వెంటనే వివాహం చేసుకున్నాడు. పెళ్ళి ప్రయత్నాలు, కొత్తకాపరం రోజుల్లో ఉండే సరదాలు, కొత్త బట్టలు, గుసగుసలు, సారె సామానులు, బహుమతులు మొదలైన వాటితో ఇలియిచ్ వైవాహిక జీవితం అంతా—ఫెడరోవ్నా గర్భవతి అయ్యే పర్యంతము—హాయిగా సాగిపోయింది. తన సరదాలకు, మర్యాదలకు, కులాసా కాలక్షేపాలకు ఈ వివాహం అడ్డు తగులుతుందని అంతవరకెప్పుడు అతనూహించనేలేదు. తన పాతధోరణి అంతా సహజమేనని అనుకుంటూ ఉండేవాడు. దీనికి సంఘంకూడా ఔనౌనని తల ఊపింది. అందుచేత ఈ వివాహం మూలాన మరింత హాయిగా కాలక్షేపం చెయ్యవచ్చునని ఇలియిచ్ ఆశించాడు. అయితే ఫెడరోవ్నా గర్భవతి అయిన కొద్ది నెలలకే కుటుంబంలో తగాదాలు, చిరాకులు, ఎడమొహం పెడమొహం పెట్టుకోవడాలు మొదలయినవన్నీ ప్రారంభమైనాయి. ఇక ఈ ఇబ్బందులలోనించి ఇవతలపడే మార్గమే కనబడలేదు. ఇది ఇల్లా పరిణమిస్తుందని అతడు కలలోనైనా ఊహించి ఉండలేదు.

ఫెడరోవ్నా ఊరికే ఉత్తపుణ్యానికి కుటుంబ మర్యాద, సౌఖ్యము మంటగలిపి వేస్తున్నదని ఇలియిచ్ అనుకున్నాడు. ఆమె అకారణంగా అనుమానపడుతూండేది: పొద్దస్తమానము తనతోనే కబుర్లు చెబుతూ కూర్చోవాలని పట్టుపట్టేది. అయినదానికీ, కానిదానికీ చీటికీమాటికీ అతన్ని సాధిస్తూండేది—పరువు, మర్యాద లేకుండా ఏదో ఒక రభస తెచ్చిపెట్టి ఇల్లంతా నానాహంగామా చేస్తూండేది. ఇలియిచ్ ఇంతకు పూర్వం ఖులాసాగా కాలక్షేపం చేస్తూ, పై పై మర్యాదలకేమీ లోటురాకుండా జాగ్రత్తపడేవాడు. అందుచేత ఇప్పుడుకూడా అవిఘ్నంగా కాలం గడుపుకుపోవచ్చునని మొదట అనుకున్నాడు. ఆమె చిరాకుగా మాట్లాడితే వినీవిననట్లు మాట్లాడకూరకుని, తనకు అలవాటయిన ధోరణిలో పడిపోతూండేవాడు. ఒక్కొక్కప్పుడు పేకాటకోసమని తన స్నేహితుల్ని ఇంటికి పిలిచేవాడు. లేకపోతే సాయంత్రం వేళ క్లబ్బులోనే స్నేహితులతో పేకాడుతూ కూర్చునేవాడు. ఇల్లా ఉండగా ఫెడరోవ్నా ఒకనాడు ఇల్లెగిరిపోయేటట్లు కేకలు పెడుతూ, అనరానిమాటలని, తిట్టడం మొదలుపెట్టింది. ఆతరవాత తన ఇష్టం వచ్చినట్టు నడవనప్పుడల్లా అల్లాగే హంగామా చేస్తూ, తిట్లు తిడుతూ, నానాశాపనార్థాలు పెడుతూండేది. ఆమీద ఇలియిచ్ ఇంకా లొంగి వచ్చేదాకా—అంటే పొద్దస్తమానమూ ఇంట్లో కూర్చుని ప్రాణం విసిగేదాకా తనతో కబుర్లు చెప్పక పోతే—ఆధోరణి మానేటట్లే కనబడలేదు. దీనితో ఇలియిచ్ హడలెత్తిపోయాడు. పరిస్థితులీవిధంగా మారిపోయేసరికి—అసలు వివాహ బంధనంవల్ల—తత్రాపి ఫెడరోవ్నావంటి భార్యతో ఏర్పడిన బంధనంవల్ల—జీవితంలో సామాన్యంగా సౌఖ్యము, ఆనందము అనేవి అందుకోవడం క్లిష్టమైపోతుందనీ, పైగా ఇల్లాంటి నిగళబంధనంవల్ల జీవితంలో మర్యాద, మనశ్శాంతీ పూర్తిగా మటుమాయమైపోతాయనీ, నిశ్చయించి అప్పటినించీ తనసౌఖ్యం విషయంలో బాగా జాగ్రత్తపడ్డాడు. దీనికోసం ఇలియిచ్ కొన్ని కొన్ని కొత్తఉపాయాలు పన్నుతూండేవాడు. ఫెడరోవ్నా అస్తమానము ఆఫీసును పట్టుకుని కూర్చుంటారని సాధిస్తూండేది. ఇలియిచ్ సర్వకాలాల్లోను, ఆ ఆఫీసులోనే ఉండి కాలక్షేపం చేస్తూ తన స్వాతంత్ర్యం నిలబెట్టుకునేవాడు.

ఇంతలో కొంతకాలానికి ఇలియిచ్‌కి సంతానం కలిగింది. ఆపిల్లకు పాలుపొయ్యడానికని ఫెడరోవ్నా ప్రతిరోజు ఒక పెద్దగందరగోళం లేవదీస్తూండేది. ఆపైన తనకు పిల్లకు, ఉన్నవి లేనివి కొన్ని జబ్బులు ఏకరువుపెట్టి అతని ఆప్యాయత ఆకర్షించుకోవాలని ప్రయత్నించేది. అయితే ఇలియిచ్‌కి ఆ రోగాల గోడే తెలిసేదికాదు. ఆ గొడవలవల్ల అతనా యింటిలోనించి పారిపోయి ఎక్కడైనా తలదాచుకోవలసిన గట్టిఅవసరం ఏర్పడ్డది. భార్య రుసరుసలెక్కువైనకొద్దీ అతనా ఇంటిముఖం చూడడమే

మానివేసి ఆ ఆఫీసునే అంటిపెట్టుకుని ఉండిపోయేవాడు. ఆవిధంగా ఆఫీసుపని అంటేనే అతనికి ప్రాణాలు లేచివచ్చేవి. అందుచేత ఆపని అంటే చెవికోసుకుంటూ, అందులోనే గాలిమేడలు కట్టుకుంటూ ఉండేవాడు.

కొద్దిరోజు లీవిధంగా గడిచిపోయేసరికి, వివాహజీవితంలో కొన్ని స్వల్పసౌఖ్యాలున్నా, ఈ విధంగా సంసారం ఈదడం చాలా ప్రయాసతో కూడుకున్న పని అనీ, నలుగురిలోను మర్యాదగా కాలక్షేపంచేసూ సంసారం సాగించాలంటే ఆఫీసు వ్యవహారాల్లోలాగే ఇంటి వ్యవహారాలలో కూడా ఒక ప్రత్యేక దృక్పథం అలవరుచుకోవాలనీ అతనొక నిశ్చయానికి వచ్చేశాడు.

ఆవిధమైన దృక్పథానికి అలవాటుపడ్డాక ఇప్పుడతని కింటిదగ్గర కావలసినవి కొన్ని సామాన్య సౌకర్యాలు మాత్రమే. మధ్యాహ్నం వేళ సుఖంగా ఇంటిపట్టున భోజనము, ఇంటికివచ్చేసరికి ఏ సౌఖ్యానికీ లోటురాకుండా అనుక్షణము కనిపెట్టుకుని ఉండే ఇల్లాలు—ఇవ్వే అతనికి కావలసినవి. ఆపైన నలుగురిలోను గౌరవమర్యాదలకు లోటు లేకుండా జీవితం చల్లగా సాగిపోతూండాలిగదా! ఇలియిచ్‌కి ఈ సంసారసౌఖ్యాలన్నీ అమరుతూనే ఉన్నాయి. అతనింక మిగిలిన అన్ని విషయాలలోను మర్యాదాలోపం లేకుండా ఖులాసాగా కాలక్షేపం చేస్తూ, నవ్వుతూ పేలుతూ ఉండేవాడు. దీనికి ఇంటిలో కూడా తగినంత ఆసరా ఉంటే సరేసరి. లేక రుసరుసలు, సాధింపులు ప్రారంభంఅయినట్టు కనబడితే ఆఫీసుపని అనే ఒక ప్రత్యేక ప్రపంచంలో ప్రవేశించి, తలుపులు బిగించుకొని కూర్చుని సుఖంగా కాలం గడిపేవాడు.

ఇవాన్ ఇలియిచ్ ఆ ప్రాంతంలో అంతటా చాలా మంచివాడనే పేరు సంపాదించాడు. ఇల్లాగ మూడేళ్లు గడిచిన తరవాత ఇలియిచ్ అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటర్ అయ్యాడు. దీనితో ఆఫీసులో పని ఎక్కువయింది; హోదా కూడా బాగా పెరిగింది. ఇప్పుడు ఎలాంటి అధికారులనైనా తన ఎదట నిలబడేటట్లు చెయ్యగల అధికారం అతనికి హస్తగతం అయింది. ఇలియిచ్ ఇప్పుడే విషయాన్ని గురించి మాట్లాడినా వెంటనే అది పెద్ద పెద్ద అక్షరాలతో పేపర్లలో అచ్చుపడుతూంది. అతనిపేరు ప్రఖ్యాతులు బాగా వ్యాపించాయి. ఇలా జరుగుతున్నకొద్దీ అతనికా ఆఫీసువ్యవహారాలమీద మరింత బాగా మోజు పెరిగేది.

ఈలోగా ఇంకా కొంతమంది పిల్లలు బయలుదేరారు. దీనితోబాటు భార్య రుసరుసలు, సాధింపులు కూడా శ్రుతిమించిపోయాయి. ఇంటి వ్యవహారాల విషయంలో అతడవలంబించిన నైఖరివల్ల ఆమె సాధింపులు అవ్వీ అతని చెవిని పడడమే మానివేశాయి.

ఇలాగ ఏడేళ్ళు పబ్లిక్ ప్రాసిక్యూటరుపని చేసిన తరవాత అతన్ని ఇంకొకచోటికి బదిలీచేశారు. కుటుంబం అంతా కొత్తచోటికి వెళ్లారుగాని ఆ రోజుల్లో ఇలియిచ్‌కి బాగా డబ్బునిక్కచ్చి పట్టుకుంది. అదీ గాక ఫెడరోవ్నాకి కొత్తచోటికి బదిలీ కావడం సుతరాము ఇష్టంలేదు. జీతం పెరిగినా సంసారం ఖర్చులు గూడా అంతకంటె పదిరెట్లు పెరిగిపోయాయి. ఇవి ఇల్లాగ ఉండగా ఇక్కడికి వచ్చిన తరవాత ఇంకొక ఇద్దరు పిల్లలుకూడా పోయారు. దానాదీనా ఇలియిచ్‌కి సంసారం మరీ దుర్భరం అయిపోయింది.

ఇక్కడ కొత్తఇంటికి మారినతరువాత ఫెడరోవ్నా ప్రతి చిన్న ఇబ్బందికీ ఇలియిచ్చే కారణమని అతన్ని దులిపివేస్తూండేది. భార్యాభర్తలు ఏదైనా సంభాషణ ప్రారంభించేసరికి క్రమంగా అది పిల్లలచదువులోకి దిగుతూండేది. ఆ ప్రస్తావనలో వారి పూర్వపు తగాదాల విషయాలుకూడా దొర్లుతూండేవి. ఇంక ఆ తగాదాలమాట ఎత్తితే ఎక్కడో అక్కడ హఠాత్తుగా ఆ ఇద్దరిమధ్యా అంటుకోవడం తప్పదన్నమాటే! ఇక పడకగదిలో ప్రవేశించిన తరవాతమాత్రం ఇద్దరూ ఆప్యాయంగా మాట్లాడుకొనేవారుగాని, ఆ సమయాలైనా ఆట్టే కాలం ఉండేవి కావు. అడపా తడపా ఒక ద్వీపంమీద ఉన్నట్టు ప్రశాంతంగా ఉండి, మళ్లీ మరుక్షణంలోనే వారిద్దరు ఆ భయంకర జీవితసాగరయాత్ర సాగిస్తూ నిత్యము ఎడమొహము పెడమొహము పెట్టుకుంటూ ఉండేవారు. ఇల్లాగ ఉండడం తప్పుఅని తోస్తే ఇలియిచ్ బాగా బాధపడి ఉండేవాడే. కాని అతడిది సహజమే అనుకున్నాడు. మరికొంతకాలానికి సంసారం ఇల్లాగే నడిపించాలని కూడా నిశ్చయించుకున్నాడు. క్రమంగా తానా సంసారపు గొడవలకు దూరంగా ఉండాలనీ, పైపై మర్యాదలకు భంగం రాకుండా ఉంటే చాలుననీ సరిపెట్టుకున్నాడు. అందుచేత ఇలియిచ్ తన కాలం అంతా చాలావరకు ఆఫీసులోనే గడిపివేస్తూండేవాడు. ఇక ఇంటికి రావడం తప్పనిసరి అయినప్పుడు ఎవరినైనా వెంటబెట్టుకొని వచ్చి, వాళ్ళు ఇంటిలో ఉండడంవల్ల తన పరువు మర్యాదలకు భంగం రాకుండా కాపాడుకునేవాడు. ఏదైనా ఎంతసేపూ అతని దృష్టి ఆ ఆఫీసు వ్యవహారాల

మీదే ఉండేది. చివరికి అతనికి ఆ ఆఫీసే లోకమయిపోయింది. రాత్రింబగళ్లా ఆఫీసుపనిలో మునుగుతూ తేలుతూ ఉండడమే అతనికి సుఖం అనిపించింది. ఇప్పుడతనికి తానొక గొప్ప అధికారిననే భావం బాగా పాతుకుపోయింది. ఎలాంటి వ్యక్తినైనా ఇలియిచ్ ఇప్పుడు ఒక్క క్షణంలో అథఃపాతాళానికి తొక్కెయ్యగలడు. కోర్టులో ప్రవేశించేటప్పుడు అతనికిచ్చే పారా హుషారులు, ప్రత్యేక మర్యాదలు, తన కంటె తక్కువతరహా ఉద్యోగస్థులతో మాట్లాడేటప్పుడు వారు చూపించేవినయ విధేయతలు, పెద్ద అధికారులు, పిన్న అధికారులు తాను చెప్పినదానికల్లా తలలూపుతూండడము, కేసులు పరిష్కరించడంలో కనపరిచే శక్తి సామర్థ్యాలు, తోటివారితో బాతాఖానీలు, విందులు, పేకాటలు మొదలైన సమస్త విషయాలతోను ఆతనికాజీవితం అంతా హాయిగా గడిచిపోతున్నట్లనిపించేది. మొత్తంమీద ఇలియిచ్ కోరుకున్నట్లుగా జీవితం అంతా అలాగే సరదాగాను, మర్యాదగాను గడిచిపోతూండేది.

ఈ మోస్తరుగా ఇలియిచ్ జీవితం ఏడు సంవత్సరాలకాలం సాగిపోయింది. అతని పెద్దకుమార్తెకప్పుడే 16వ ఏడు వచ్చింది. ఈలోపుగా ఇంకొక కుర్రవాడు జారిపోయాడు. ఇక మిగిలిన వాడొక్కడే. ఇతని విషయంలో భార్యాభర్తలిద్దరి మాట కలవలేదు. ఇలియిచ్ ఈ కుర్రవాణ్ణి లాస్కూల్లో జేర్చాలని అనుకున్నాడు కాని, ఫెడరోవ్నా కేవలం అతని మాట కాదనడానికని వాణ్ణి హైస్కూల్లో జేర్పించింది. ఆడపిల్లకి ఇంటిదగ్గరే చదువు చెప్పించారు. ఆ పిల్ల చదువు బాగానే సాగింది. మొత్తం మీద ఆ పిల్లవాడి చదువు కూడా బాగానే సాగిందని చెప్పవచ్చును.

## 3

వివాహానంతరం 17 ఏళ్ళవరకు ఇవాన్ ఇలియిచ్ జీవితం అంతా ఈవిధంగా గడిచిపోయింది. అతడప్పుడే చాలాకాలంనించి పబ్లిక్ ప్రాసిక్యూటరుగా పనిచేస్తున్నాడు. అధికార్లతన్ని అనేకసార్లు బదిలీ చేస్తామన్నారుగాని ఉన్నదానికంటె మరొక మంచిఉద్యోగం రాగలదనే ఆశతో ఇలియిచ్ దానికి ఇష్టపడలేదు. ఇంతలో ఒక కష్టంవచ్చి, హాయిగా గడిచిపోయే అతని జీవితంఅంతా తారుమారు చేసివేసింది. విశ్వవిద్యాలయం ఉన్న ఒక పట్టణంలో ప్రధానన్యాయాధికారి ఉద్యోగం తనకిస్తారని ఇలియిచ్ చాలాచాలా ఉర్రూతలూగేవాడుగాని, చివరికి హాప్ అనే వ్యక్తి ముందుకు తోసుకువచ్చి, ఆ ఉద్యోగంకాస్తా తన్నుకు చక్కాపోయాడు. దీనితో ఇలియిచ్ బాగా చిరాకుపడి, హాప్‌నీ, తన పైఅధికార్లనీ నానామాటలుఅని, వారితో దెబ్బలాట పెట్టుకున్నాడు. దానితో ఆ అధికారులతన్ని ఒక మూలకు నెట్టివేశారు. ఇల్లాంటిదే ఇంకొక ఖాళీ వచ్చిందిగాని ఆ అధికారులదికూడా ఇంకొకరికి ఇచ్చివేశారు.

ఇది 1880 లో జరిగింది. ఇలియిచ్ జీవితంలో ఇలాంటి పాడుసంవత్సరం ఎన్నడూ రాలేదు. తనకిచ్చేజీతం చాలదేవన్న విషయం ఆ ఏడంతా అతనికి మాటి మాటికీ స్ఫురిస్తూనే ఉండేది. ఆపైన అధికారులు తనమాటే, మరిచిపోయారన్నది కూడా స్పష్టపడిపోయింది. ఇంతే గాదు; తనజీవితం అంతటిలోను ఇంతటి ఘోరమైన అన్యాయం జరగలేదని అతను బాధపడుతూంటే, మిగిలినవారందరు అది సర్వసామాన్యంగా జరిగేవిషయమేనని ఆ గోడే పట్టించుకోవడం మాని వేశారు. ఆఖరికి తండ్రికూడా అతనికి సహాయం చెయ్యాలనే తలపెట్టలేదు. ఇవాన్ ఇలియిచ్ ఇక తన మాటంటే ఎవ్వరు చెవిని పెట్టడమే మానుకున్నారని అనుకున్నాడు. ఇది ఇలాగ ఉండగా నెలకు మూడువేల అయిదు వందలిస్తూంటే చాలదా? అనీ, నిజంగా ఇలియిచ్ అదృష్టవంతుడేననీ అందరు అంటూండేవారు. తనకు ఘోరమైన అన్యాయం జరిగిందని ఇలియిచ్ ఎప్పుడు లోలోపల కుములుతూండేవాడు; ఆపైన ప్రతి రోజు భార్య సాధించిపోస్తూనే ఉంది; దానిమీద ఇలియిచ్‌కూడా తలకు మించిన అప్పులుచేస్తూ దుబారాగా ఖర్చుచేస్తూండేవాడు; వీటిఅన్నిటివల్ల అనుభవించేయాతన ఇలియిచ్‌కి తప్ప ఇంకెవరికి తెలుస్తుంది?

ఎలాగైనా కొంత డబ్బు ఆదాచెయ్యాలనే ఉద్దేశంతో ఇలియిచ్ ఆ సంవత్సరం వేసవిలో సెలవుపెట్టి, భార్యతోసహా బావమరది ఇంటికి వెళ్లాడు. అక్కడికి వెళ్ళిన తరవాత జీవితంలో మొట్టమొదటగా అతనికి నిస్త్రాణ, విసుగుదల అంటే ఏమిటో తెలిశాయి. ఇంతేగాదు; ఇంకా కొన్నిరోజులయ్యేసరికి అతనికి దిగులు, బెంగ కూడా పట్టుకున్నాయి. ఆ తరవాత ఇంక ఈవిధంగా జీవితం సాగించడం సాధ్యపడదనీ, దీని విషయంలో గట్టిగా పనిచెయ్యాలనీ అతను నిశ్చయించుకున్నాడు.

ఇలియిచ్ ఒకనాడు రాత్రిఅంతా మేలుకుని వరండాలో అటూఇటూ పచారుచేస్తూ, ఒకసారి పీటర్స్‌బర్గ్ వెళ్ళి తాను చేసినపని గుర్తించలేని పై ఉద్యోగస్థులందరికీ శాస్తిచెయ్యాలనీ, ఎలాగైనా మరి ఒక ప్రభుత్వశాఖలోని బదిలీ చేయించుకోవాలనీ స్థిరపరుచుకున్నాడు.

ఇలియిచ్ ఆ మర్నాడు పొద్దున్నే లేచి బావమరిది, భార్య వద్దని ఎంత పోరినా వినిపించుకోకుండా, ఎల్లాగో అల్లాగ ఏదో ఒక ప్రభుత్వశాఖలో నెలకు అయిదు వేలు వచ్చే ఉద్యోగం సంపాదించే ప్రయత్నంమీద పీటర్స్‌బర్గ్‌కు ప్రయాణమైనాడు. అతని కిప్పుడు ఉద్యోగం ఎటువంటిదీ? అన్న ప్రమేయం ఏమీ లేదు. అది ఏ ప్రభుత్వశాఖ అయినా సరే. రైల్వేలో గాని, బాంకులో గాని, చివరికి హార్బరులో గాని, ఎక్కడయినా సరే అతనికి కావలసిందల్లా అయిదు వేల ఉద్యోగమే. తన శాఖలో పైఅధికారులు తాను చేసినపని గుర్తించలేకపోయారు కనక ఆ ఉద్యోగం మాత్రం మరొక మంత్రివర్గంలో దొరికితే చాలు! అతనికి కావలసినది అంతా అంతే.

తలవని తలంపుగా ఈ ప్రయత్నంలో అతను పట్టిందల్లా బంగారం అయింది.

కుర్స్క్ స్టేషన్‌లో ఇలియిచ్ స్నేహితుడొకడు తటస్థపడ్డాడు. ఇతడు ఇలియిచ్ కూర్చున్న ఫస్టు క్లాసులోకి వచ్చి కూర్చున్నాడు. అతని పేరు ఇలీయిన్. ఇద్దరు సంభాషణ ప్రారంభించిన తరువాత ఇలియిన్ “ఇప్పుడిప్పుడే మంత్రివర్గంలో మార్పులను గురించి కుర్స్క్ గవర్నరుకొక టెలిగ్రాం వచ్చిం”దని చెప్పాడు. ఈ టెలిగ్రాంవల్ల ఇవానోవిచ్చిని తీసివేసి అతని స్థానంలో సెమీనోవిచ్‌ని వేస్తారని తెలిసింది.

దీనివల్ల రష్యా అదృష్టం ఏదారిపట్టినా, ఇలియిచ్‌కి మాత్రం బాగా లాభించింది. దీనితో పీటర్ పెట్రోవిచ్చి, జఖార్ ఇవానోవిచ్చి బాగా పెద్ద పదవుల్లోకి వెళ్లారు. వీరిద్దరిలోను జఖార్ ఇవానోవిచ్ ఇలియిచ్‌కి చాలా దగ్గర స్నేహితుడు; ఇంతకు పూర్వం ఇద్దరు ఒకే కోర్టులో కలిసి పనిచేశారు.

మాస్కో వెళ్ళినతరవాత పై విషయాలన్నీ నిజమేనని ఋజువయింది. పీటర్స్‌బర్గ్ వెళ్ళగానే ఇలియిచ్ జఖార్ ఇవానోవిచ్‌ని కలుసుకున్నాడు. అతడు ఇలియిచ్ పనిచేస్తూన్న న్యాయశాఖలోనే అల్లాంటి ఉద్యోగం ఇస్తానని గట్టిగా హామీ ఇచ్చాడు.

ఒకవారం గడిచిన తరువాత ఇలియిచ్ భార్యకొక టెలిగ్రాం ఇస్తూ దానిలో ‘జఖార్‌కి పెద్ద ఉద్యోగం అయింది. ఒకవారం రోజుల్లో నాకు ఆర్డరు వస్తుంది.’ అని వ్రాశాడు.

ఈవిధంగా తలవని తలంపుగా మంత్రివర్గంలో మార్పులు రావడంవల్ల ఇలియిచ్‌కి తాను పనిచేసే న్యాయశాఖలోనే ఒక పెద్ద ఉద్యోగం అయింది. ఈ ఉద్యోగంలో అయిదు వేలజీతమే కాక, బదిలీ ఖర్చులకింద ఇంకొక మూడువేలుకూడా పుట్టాయి; ఇలియిచ్ ఇప్పుడు తనతోటి ఉద్యోగస్థులందరికన్నా రెండంతస్థులు పైకి వెళ్ళాడు. ఇంతకు పూర్వం తన డిపార్టుమెంటన్నా, ఆ అధికారులన్నా అతనికి మంటగా ఉండేదిగాని, ఇప్పుడది అంతా మాయమైపోయింది. ఇలియిచ్ యిప్పుడు అన్ని విధాలా హాయిగా ఉన్నాడు.

ఇదంతా జరిగిన తరవాత అతను మళ్ళీ స్వస్థానానికి చేరుకున్నాడు. ఇలియిచ్ ఇప్పుడు చవిచూచినంత హాయి, సౌఖ్యము ఇదివరకెప్పుడు రుచిచూచి ఎరగడు. ఈ కొత్త ఉద్యోగం వచ్చిన తరవాత ఫెడరోవ్నా ధోరణి కూడా బాగా మారిపోయింది. దంపతులిద్దరిమధ్యా కొంతవరకు సయోధ్య కుదిరింది. పీటర్స్‌బర్గ్‌లో ఇప్పుడందరు ఇలియిచ్‌కి విందులు చేసేవారే. అతని శత్రువులందరికీ శృంగభంగం జరిగింది. వారందరు ఇప్పుడతని చుట్టూ తిరగడం ప్రారంభించారు. కొత్త ఉద్యోగం వచ్చిన తరవాత అందరు అతన్నిప్పుడు ‘ఓహో ఓహో’ అని గౌరవిస్తూ, “అదృష్టం అంటే అలాగ ఉండాలి” అని అంటూ లోలోపల అతనికింత ఉద్యోగం అయిందని అసూయపడుతున్నారు. ఇలియిచ్ అంటే ఇప్పుడు పీటర్స్‌బర్గ్‌లో ఉన్న వారందరికీ బాగా అప్యాయత కలిగింది. ఇలియిచ్ ఈవిధంగా వచ్చిన మార్పులన్నిటిని గురించీ అప్పుడప్పుడు తన స్నేహితులతో ప్రస్తావిస్తూండేవాడు.

ఫెడరోవ్నా ఈ మాటలన్నీ వింటూ అవన్నీ నిజమేనని నమ్మినట్టు కనబడేది. ఏమీ అడ్డుమాటలు చెప్పకుండా తమ ప్రయాణం సరంజాం చేస్తూ ఉండేది. ఇలియిచ్ ఇదంతా చూసి ఇన్నాళ్ళకు తన ప్రయత్నాలన్నీ దారిలో పడ్డాయనీ, భార్యకూడా ఇప్పుడు తనతో ఏకీభవిస్తున్నదనీ, కొంతకాలంనించి ఇబ్బందులు పడుతున్నా ప్రస్తుతం అవన్నీ సర్దుకుపోతున్నాయనీ, ఇప్పుడిక తనజీవితం మర్యాదగాను, ఖులాసాగాను సాగిపోగలదనీ సంతోషపడ్డాడు.

సెప్టెంబరు పదో తేదీనాటికి ఇవాన్ ఇలియిచ్ కొత్తఉద్యోగంలో చేరుకోవాలి. అందుచేత ఒక పదిరోజులపాటుండిపోవచ్చుననే ఉద్దేశ్యంతో స్వస్థలానికి వచ్చాడు. అదీగాక క్రొత్తచోటికి కావలసిన హంగులన్నీ ఏర్పాటుచేసుకోవాలి; కుటుంబంఅంతా ప్రయాణం కావడానికి తగిన సరంజాంకూడా చెయ్యాలి.

ఇప్పుడు ఫెడరోవ్నా కూడా అతని తలలో నాలికలాగ మసులుతూంది. భార్యాభర్తలిద్దరు ఒక్క మాటమీద నడిచిపోతున్నారు.

అదృష్టవశాత్తు తలపెట్టిన పనులు నిర్విఘ్నంగా సాగిపోతూండడంవల్ల భార్యాభర్తలిద్దరు బాగా అన్యోన్యంగా ఉంటున్నారు. వివాహం అయినతరువాత ఎప్పుడూ వారింత ఆప్యాయంగా మసులుకోలేదు. ఇలియిచ్ వెంటనే తన కుటుంబం అక్కడనించి కదిపివెయ్యాలని అనుకున్నాడు గాని బావమరిదీ, అతని భార్య, కాదు కూడదని పట్టుపట్టడంవల్ల మరి కొన్నాళ్ళపాటు అక్కడే ఉండిపోయాడు. వారి కుటుంబాని కిప్పుడీ కుటుంబంమీద వల్లమాలిన మమకారం ఏర్పడ్డది. చివరికి వారి బలవంతం మూలాన కుటుంబం అంతా బావమరిదిదగ్గరే అట్టేపెట్టి, ఆ కొత్తచోటికి అతనొక్కడే బయలుదేరి వెళ్ళాడు.

పట్టినదంతా బంగారం కావడంవల్ల ఇలియిచ్ స్వతః చాలా ఉత్సాహంగా ఉన్నాడు. దానిమీద భార్యానుకూల్యం మరింత భరవసా ఇచ్చింది. దానాదీనా అతను లోలోపల ఉప్పొంగిపోతూ కొత్త ఉద్యోగంలో కుదురుకున్నాడు. అక్కడ అతనికి ఒక చక్కని భవంతి దొరికింది. భార్యాభర్తలిద్దరు చాలాకాలంనించి సరిగ్గా అలాంటి భవంతిలోనే ఉండాలని ఉవ్విళ్ళూరుతూఉండేవారు. అది బాగా విశాలమైన భవంతి. పెద్దమనుషులు కూర్చునే గదులు బాగా విశాలంగాను ఎత్తుగాను ఉన్నాయి. అదీగాక అవి పూర్వపద్ధతిలో కట్టిన గదులుకూడాను. ఆ భవంతిలో ఇలియిచ్ చదువుకోడానికి అన్ని విధాలా ఉపయోగమైన వేరే ప్రత్యేకమైన గది కూడా ఉన్నది. ఇదిగాక భార్యకు, కుమార్తెకు వేరే వేరే గదులు, కొడుకు చదువుకునే గది, చక్కగా అమర్చినట్లున్నాయి. కొడుకుగది ప్రత్యేకం అతని కోసం కట్టించినట్లే ఉంది. ఇలియిచ్ స్వయంగా దగ్గిరఉండి, అక్కడ చెయ్యవలసిన ఏర్పాట్లన్నీ చేయించాడు. సోఫాలు మొదలైనవన్నీ ప్రాచీన పద్ధతుల్లో తయారుచేయించి తగినచోట్ల పెట్టించాడు. ప్రతీదీ సరిగా అతను తలపెట్టిన ఆదర్శపద్ధతిలోనే సాగిపోతున్నది. సగంసగం తయారైనవికూడా అనుకున్నదానికంటె ఇంకా ఎక్కువ బాగా ఉన్నట్లే కనిపించాయి. 'అవ్వన్నీ పూర్తిఅయితే వీసమంతైనా మోటుదనం లేకుండా ఎంత సొగసుగా ఉంటాయి!' అని అనుకుంటూ ఇలియిచ్ లోలోపల మురిసిపోతూండేవాడు. పడుకున్నతరవాత, ఒకసారి భవంతిలో నలుగురూ కూర్చునే గది ఎంత సొగసుగా తయారవుతూందో ఊహించుకొని ఇలియిచ్ ఉవ్వెత్తుగా ఉప్పొంగిపోయాడు. తరవాత ఆ గది అలంకరించే వస్తువులన్నీ అక్కడ ఉన్నట్లు భావించుకుని మరీమరీ ఆనందించాడు. తరవాత, తన భార్యకు కుమార్తెకు అవ్వన్నీ అచ్చంగా వారు కోరుకున్నట్లే ఉంటాయనీ, వారు కూడా పరమానందభరితులౌతారనీ అనుకుని ఎంతో సంతోషపడ్డాడు. కాని వారిద్దరూ కూడా ఆ గది అంత బ్రహ్మాండంగా ఉంటుందని అనుకొని ఉండరు. ఇలియిచ్ పురాతన వస్తువు లమ్మేచోటికి వెళ్ళి మంచి ఖరీదైన వస్తువులన్నీ చవకబారుగా కొన్నాడు. అవి అలంకరించడం వల్లనే ఆభవంతికంతటికీ ఒక పెద్ద జమీందారీఫాయా వచ్చింది.

అయినా ఇంటికి వ్రాసిన ఉత్తరాలలో అతడా విషయం వ్రాయనేలేదు. హఠాత్తుగా అవ్వన్నీ చూసి వారిద్దరూ ఆశ్చర్యపోవాలనీ, అందుచేత ముందుగా ఈ విషయం తెలియనివ్వకూడదనీ అతననుకున్నాడు. రాత్రింబవళ్ళీవిధంగా కాలం గడిచిపోయింది. ఆఫీసుపనీ అంటే అతనికి ఇష్టమున్నా, ఇప్పుడీ పని ముందది అంత ఉత్సాహంగా కనబడలేదు. ఒక్కొక్కప్పుడు కోర్టులో పని చేసేటప్పుడు కూడా తన గదిలో అమర్చే తెరలనుగురించి పరధ్యానంగా ఆలోచిస్తూ కూర్చునేవాడు. ఈ ధోరణి ఎంతవరకు వెళ్ళిందంటే—ఒక్కొక్కప్పుడు ఇలియిచ్చే స్వయంగా అక్కడ కుర్చీ లిక్కడ, ఇక్కడ కుర్చీ లక్కడ సర్దుతూండేవాడు. ఒకసారి పనివాడొకడు గోడ పైభాగం మీద అలంకరిస్తున్నాడు. ఇలియిచ్ చెప్పిందతనికి బోధపడలేదు. అందుచేత నిచ్చెనపైకి కొన్ని మెట్లెక్కి వెళ్ళి, ఆ పనివాడికా విషయం తెలిసేటట్లు చెప్పాలనుకున్నాడు. కాని నిచ్చెన ఎక్కుతూంటే కాలు జారింది. అయితే మంచి సత్తా ఉన్న మనిషి కనక ఆ నిచ్చెన పట్టుకు వేళ్ళాడాడు. కాని అతని పార్శ్వం ఆ పక్కనున్న కిటికీ గడియకు గట్టిగా డీక్కొంది. మొట్టమొదట అది గీచుకుపోయినచోట బాగా బాధ పెట్టింది. కాని కాస్సేపటికా బాధ తగ్గిపోయింది. దానిమీద అతనికి మరింత ఉత్సాహం వచ్చింది. అటుపిమ్మట ఒక ఉత్తరంలో "నాకు మళ్ళీ 15 ఏళ్ళ వెనక ఉన్నంత ఉత్సాహం వచ్చింది" అని వ్రాశాడు. ఇలియిచ్ ఆ భవంతి ఏర్పాట్లన్నీ సెప్టెంబరు నాటికి పూర్తి అయిపోతాయని అనుకున్నాడు గాని, చివరికి అవ్వన్నీ అక్టోబరు మధ్యదాకా జరిగాయి. అయితే పనులన్నీ పూర్తి అయ్యాక అతనే గాక చూసినవారందరు అవి చాలా బాగున్నాయని మెచ్చుకున్నారు.

నిజానికి ఇలియిచ్ చేసిన ఈ ఏర్పాట్లన్నీ సామాన్యసంసారులు తమకంటె కొంచెం ఉన్నవారిని అనుకరిస్తూ చేసే ఏర్పాట్లలాగే ఉన్నాయిగాని అంతకంటె ఏమీ విశేషంగా లేవు. ఈసామాన్యసంసారులైనా ఇంచుమించుగా తమవంటివారినే

అనుకరించగలరుగాని అంతకంటె మించిపోలేరు గదా! ఇలియిచ్ సంపాదించిన ఆకంచు విగ్రహాలు, ఆరస్గులు, ఆపూలకుండీలు సరీగ్గా అలాగే ఉన్నాయి. ఇంతచేసినా అతని యిల్లు సామాన్యంగా అల్లాంటి తరహా మనుష్యుల ఇంటిలాగే ఉన్నదిగాని, అతనికి మాత్రంఅదంతా ఒక పెద్ద బ్రహ్మాండమైన భవంతి లాకనబడింది. ఆ వేళ భార్య, పిల్లలు బయలుదేరి స్టేషనుకు వస్తున్నారని తెలియగానే ఎంతో సంతోషపడి, ఇలియిచ్ వారిని కలుసుకోవడానికి అక్కడికి వెళ్ళాడు. వారాయింటికి వచ్చేసరికి ఇల్లంతా పూలకుండీలతోను, కొత్తదీపాలతోను కలకలలాడుతూంది. నలుగురు కూర్చునేగది, చదువుకునే గది మొదలైనవన్నీ చూసి కుటుంబం అంతా బ్రహ్మానంద భరితులైనారు. ఇలియిచ్ వారికందరికీ తానా భవంతిలో ప్రత్యేకంగా చేసిన ప్రతీ ఏర్పాటు చూపించాడు; వారవన్నీ భట్రాజుల్లా పొగడుతూంటే ఎంతో ఆప్యాయంగా విని, పట్టరాని ఆనందం అనుభవించాడు. సాయంత్రం వేళ అందరు కూర్చుని టీ పుచ్చుకునేటప్పుడు ఫెడరోవ్నా అతనికి తగిలిన దెబ్బని గురించి అడిగింది కాని, ఇలియిచ్ అదంత పెద్దదెబ్బ కాదని నవ్వేసి, తానెంత చరచరా నిచ్చెన ఎక్కి వెళ్ళిందీ ప్రత్యక్షంగా వారికి చూపించాడు. అటుతరవాత "నేను కొద్దో గొప్పో వస్తాదును కనక, ఆట్టే దెబ్బతగలకుండా తప్పించుకున్నాను. కాని మరొకరయితే ఆ దెబ్బతో ప్రాణాలు పోవలిసిందే. ఏదో కొంచెం గీసుకుపోవడంతో సరిపోయింది. ఇదిగో! ఇక్కడే కొంచెం దెబ్బతగిలింది. ఇక్కడ ముట్టుకుంటే కొంచెం నెప్పిగా ఉంది. అప్పుడే చాలావరకంతా తగ్గిపోయింది. ఏదో కొంచెం బొప్పికట్టింది. అంతే!" అన్నాడు.

వారందరు ఆ యింట్లో సర్దుకోవడం మొదలు పెట్టేసరికి సామాన్యంగా జరిగేటట్లు, మొత్తంమీద ఇంకొక చిన్నగదిఉంటే బాగా సరిపోయిఉండునని అనిపించింది. అయితే ఇప్పుడు అనుకున్నదానికంటె ఇంకొక అయిదువందలు ఎక్కువ వస్తున్నాయి. ఈ మొత్తం ఎంత చిన్నదయినా ఇల్లాంటి మొత్తాలు చేతిలో పడ్డప్పుడు కలిగే ఆనందం చాలా గొప్పది.

ఆభవంతిలో అక్కడక్కడ చిన్న మార్పులు- అంటే ఆసోఫా ఇక్కడికీ ఈ కుర్చీ అక్కడికీ జరపడంలాంటివి—ఇంకా జరుగుతూనే ఉండడం వల్ల, అన్నీ సజావుగా వెళ్ళిపోయాయి. భార్యాభర్తలిద్దరికీ ఆ భవంతి అన్నివిధాలా నచ్చింది. అదీగాక వారిద్దరు ప్రత్యేకంగా సర్దుబాటుచేసుకోవలసినవింకా అనేకం ఉన్నాయి.

అందుచేత ఆ యిద్దరికి కొన్నికొన్ని విషయాలలో మాటపట్టింపులు వచ్చినా—పెద్దగొడవలు ఏమీ రాకుండా చివరికి అవ్వన్నీ సర్దుకుపోయాయి. ఇంట్లో చేయవలసిన ఏర్పాట్లన్నీ పూర్తి అయిపోయిన తరువాత ఇంక చెయ్యవలసినవి ఏమి లేకపోవడంవల్ల మొదట్లో కొంత నిరుత్సాహంగా ఉందిగాని, కొత్తవారితో పరిచయాలు, కొత్తచోట్లకు షికారులు మొదలైనవాటివల్ల మొత్తంమీద అక్కడి జీవితం చాలా సౌఖ్యంగా గడిచిపోతున్నది.

ఇలియిచ్ పొద్దున్నే కోర్టుకువెళ్ళి మధ్యాహ్నం భోజనానికి ఇంటికి వస్తూండేవాడు. సామాన్యంగా ఇంటిదగ్గర ఉన్నంతసేపు ఖులాసాగానే ఉండేవాడు గాని ఒక్కొక్కప్పుడతనా యింటి గొడవలవల్ల బాగా చిరాకు పడుతూండేవాడు. బల్లమీద పరిచిన తెల్లని బట్టమీద కాస్త మరకపడినా, కిటికీ తెర గొలుసేమైనా కొంచెం వంకరపోయినా, అతని చిరచిరలకిక అంతూదరీ ఉండేదికాదు. అయితే మొత్తంమీద జీవితం అంతా అతను కోరుకున్నట్లే ఆట్టే శషభిషలు లేకుండా హాయిగాను, మర్యాదగాను గడిచిపోతూ ఉండేది.

ఇలియిచ్ ప్రొద్దున్నే తొమ్మిదింటికి లేచి, కాఫీ పుచ్చుకుని పేపరు చదివి, ఆఫీసుదుస్తులు ధరించి కోర్టుకు హాజరవుతూండేవాడు. అక్కడ ఆఫీసు ధోరణిఅంతా అప్పుడే ఒకదారిని పట్టిపోతూఉండేది. ఇలియిచ్ కూడా దానికేమీ అడ్డుతగలకుండా అదంతా అల్లాగే నడిపించుకుపోతూ ఉండేవాడు. అర్జీదారులు, విచారణలు, కోర్టుపరిపాలన, ఆఫీసు వ్యవహారాలు, మొదలైన విషయా లన్నిటిలోను, ఏదైనా నిజాయితీగాని, కొత్తపద్ధతి గాని ప్రవేశపెడితే చాలా గందరగోళం బయలుదేరుతుంది. అందుచేత ఇలియిచ్ జనం అందరితోను కేవలం అధికారపద్ధతిలోనే వ్యవహరిస్తూ, ఉద్యోగి హోదా నిలబెట్టుకుంటూ ఉండేవాడు. ఎవరైనా ఒక ఆసామి ఒక విషయం తెలుసుకోడానికి వచ్చాడనుకుందాము. ఆ విషయం ఇలియిచ్‌కి సంబంధించింది కాకపోతే అసలతనా వ్యక్తిని దరిమానానికే రానిచ్చేవాడు కాదు. ఒకవేళ ఉద్యోగధర్మంలో ఎవరైనా తన దగ్గరికి వస్తే అధికారిగా తాను చెయ్యవలసిందంతా చేస్తూండేవాడు; అల్లాంటప్పుడు ఆ వ్యక్తితో పైపై మర్యాదల కేమీ లోటు రానీయకుండా మాట్లాడి, వెంటవెంటనే పంపించివేస్తూండేవాడు. ఆ ఆఫీసుపని అయిపోయిందంటే ఆ వ్యక్తికి సంబంధించినదంతా ఆ క్షణంతో

ఆఖరన్నమాటే! ఆఫీసు వ్యవహారాలు, వ్యక్తివ్యవహారాలు, ఎప్పటికప్పటికి వేరువేరుగా చూసుకుంటూ, రెండు కలగా పులగం కాకుండా కాచుకోవడంలో ఇలియిచ్ చాలా గట్టివాడు. అలాగ కొంతకాలానికి ఈ రెండు ఒక కొసదాకా తీసుకుపోయాడు. దీనిలో బాగా అందెవేసిన చెయ్యి కాబట్టి, ఒక్కొక్కప్పుడు ఉద్యోగవ్యవహారాలలో వ్యక్తి సంబంధాలు కూడా కలిసిపోనిచ్చేవాడు. అవసరం అయితే ఏ క్షణంలోనైనా ఈ వ్యక్తిసంబంధాలు జారవిడిచివెయ్యగల శక్తిసామర్థ్యాలున్నాయనే ధీమావల్లనే అతడీ విధంగా చేస్తూ ఉండేవాడు. ఇలా వ్యక్తిబంధవ్యాలు వదులుకోవలిసినప్పుడు ఎవరికీ నొప్పి కలగకుండా అతి చాకచక్యంతో అన్నీ ఇట్టే జారవిడిచివేస్తూండేవాడు. కోర్టుపని కొంత జరిగిన తరవాత,మధ్యాహ్నం వేళ విశ్రాంతిసమయంలో టీతాగి, సిగరెట్టుముట్టించి, రాజకీయాలు, పేకాట, మొదలైన వాటిని గురించి బాతాఖానీ వేస్తూండేవాడు. అయితే మొత్తంమీద, అది అంతా చాలావరకు ఉద్యోగాలు, బదలాయింపులు మొదలైనవాటి మీదే నడిచిపోతూ ఉండేది. కాని, కోర్టు వ్యవహారాలన్నీ అత్యంత చాకచక్యంతో నిర్వహించి, ఇంటికి జేరుకున్నతరవాత బాగా అలిసిపోయి ఉండేవాడు. ఇంటికివచ్చేసరికి భార్య, కుమార్తె సామాన్యంగా ఆ ఇరుగుపొరుగువారెవరి ఇంటికైనా వెళ్లేవారు. లేకపోతే ఇరుగుపొరుగు వారెవరైనా వారింటికి వచ్చేవారు. కొడుకు స్కూలుకు వెళ్లి ప్రైవేటుమాష్టరు దగ్గిరపాఠాలు చదివి, హైస్కూలులో చెప్పిన వేవో చదువుకుంటూ ఉండేవాడు. ప్రతీదీ అనుకున్నట్టుగా జరిగిపోతూ ఉండేది. భోజనాలయిన తరవాత, చూడడానికి వచ్చినవారెవరు లేకపోతే ఇలియిచ్ సామాన్యంగా ఆరోజుల్లో వాదోపవాదాలు లేవదీసిన పుస్తకాలు చదువుతూండేవాడు. సాయంకాలం కాగానే ఆఫీసు కాగితాలు చదివేవాడు. సాక్షులు చెప్పినవన్నీ జాగ్రత్తగా పరిశీలించి, లా ప్రకారం వాటి మంచిచెడ్డలు నిర్ణయించేవాడు. ఈ పని అతనికి నచ్చేదనిగాని, నచ్చలేదనిగాని చెప్పడం కష్టం. అది బ్రిడ్జి ఆడుకునే సమయమయితే ఆ పని అంతా నిరుత్సాహంగా ఉండేది. పేకాట వేళ కాకపోతే భార్యతో బాతాఖానీ వెయ్యడం కంటె బాగానే ఉండేది. ఇలియిచ్ విందు భోజనాలంటే చెవి కోసుకునేవాడు. పెద్దపెద్ద ఉద్యోగస్థులందరినీ సకుటుంబంగా ఈ విందుల కాహ్వానిస్తూ ఉండేవాడు. అతని భవంతిలో హాలు లాగే ఆ విందులు కూడా సర్వసాధారణంగానే ఉండేవి.

ఇవాన్ఇలియిచ్ ఇంట్లో ఒకసారి నృత్యం జరిగింది. ఆ నృత్యం చూసి ఇలియిచ్ చాలా సంతోషించాడు. ప్రతీదీ బాగానే జరిగిపోయింది గాని ఆ విందులో వాడిన మిఠాయిల గురించి, భార్యాభర్తల లిద్దరి మధ్యా గట్టిగా అంటుకుంది. ప్రస్కొవ్యా ఫెడరోవ్నా ఈ విందంతా ఒకవిధంగా జరిపించాలని అనుకున్నదిగాని, ఇలియిచ్ ఆ విందుకు కావలసిన తీపి సరుకంతా ఒక పెద్ద హోటలునించి తెప్పించాలని పట్టుపట్టి, వెనకాముందు చూసుకోకుండా బాగా దుబారాగా ఖర్చుపెట్టాడు. అలా తెప్పించిన సరుకులో చాలాభాగం మిగిలిపోయింది. అందుచేత హోటలుబిల్లంతా కలిసి తడిసి మోపెడైంది. చివరికి భార్యాభర్తల లిద్దరిమధ్యా బయలుదేరిన ఆ తగాదా చిలికిచిలికి గాలివాన అయింది. ఫెడరోవ్నా అతన్ని "చేతావాతా కాని తెలివితక్కువదద్దమ్మ"ని కసిరింది. దానిమీద ఇలియచ్ రెండుచేతులతోను తల గట్టిగా నొక్కిపట్టుకుని, ఒళ్లు తెలియని కోపంలో విడాకులదాకా వెళ్ళిపోయాడు.

అయితే ఆ నృత్యం అంతా చాలా బాగా జరిగిపోయింది. దానికి ప్రత్యేకంగా పెద్దపెద్దవాళ్ళంతా హాజరైనారు. ఇలియిచ్ ఆనా డొక జమీందారు చెల్లెలితో కలిసి నృత్యంచేశాడు. ఆ జమీందారొక పెద్దసంస్థ స్థాపించిన వ్యక్తి.

పై పదవులమీద ఉండే వ్యామోహం మూలాన ఇలియిచ్‌కి ఆఫీసుపని అంటే, మంచి ఉత్సాహంగా ఉండేది. ఇక విందు వినోదాలవల్ల అతనికి నేనింతటివాణ్ని అనే అహంభావం బాగా బలిసేది. అయితే బ్రిడ్జిఆటఅంటే అతనీ రెండిటికన్నా ఎక్కువగా చెవికోసుకుంటూ ఉండేవాడు. జీవితంలో ఎలాంటి ఇబ్బందివచ్చినా బ్రిడ్జిఆట ఉంటే అది అంతా మరిచిపోయి ఎంతైనా ఖులాసాగా ఉండగలననీ, ఆ ఆట తన జీవితానికొక చల్లని వెన్నెలవంటిదనీ అతడంటూండేవాడు. అయితే ఆ ఆటగాళ్లు కాస్త సత్తా గలవారై ఉండాలి; చీటికిమాటికి చిలిపి తగాదాలు తెచ్చిపెట్టకూడదు; అయిదుగురు కూర్చుని ఆడడంకంటె నలుగురుంటే ఆట మరీ మజాగాఉంటుంది. అయిదుగురుంటే—పైకి ఆడుతూన్నట్టు నటించినా—ఎవరో ఒకరు ఆట మానివేసి ఊరికే కూర్చోవాలి. అందుచేత నలుగురూ కూర్చుని, అతిచాకచక్యంతో ఆడుకుంటూంటే, కొంచెం మంచి ముక్కలుకూడా కలిశాయా—అతని కావేళ పండుగే! అది అయినతర

వాత ఇలియిచ్ భోజనం చేసి, కొంచెం మద్యం సేవించేవాడు. ఇలియిచ్‌కి, ఈ ఆటల్లో ఎక్కువగా గెలవడం ఇష్టం ఉండేది కాదు. అయితే కొద్దో గొప్పో గెలిచిననాడు మాత్రం సుఖంగా సుద్రు పట్టి నిద్రపోయేవాడు.

ఈవిధంగా వారి కుటుంబ జీవితం గడిచి పోతూండేది. గొప్ప గొప్ప హోదాల్లో ఉన్న పెద్దలు, పిన్నలు అంతా వాళ్లింటికి వస్తూ పోతూండే వారు. ఆ వచ్చినవారిని గురించి భార్య, భర్త, కుమార్తె, ఒకే ధోరణిలో మాట్లాడేవారు. కొంతమంది ఆ కుటుంబంతో దోస్తీగా ఉండాలనే ఉబలాటంతో పిలిచినా పిలవకపోయినా చీటికీ మాటికీ వస్తూ పోతూ మహా ఆప్యాయంగా ఉన్నట్లు నటిస్తూ ఉండేవారు. అయితే ఆ కుటుంబంలో వారందరు అల్లాటి బంధుమిత్రులందరినీ, అతిచాకచక్యంతో దూరదూరంగానే నిలబెడుతూండేవారు. మరికొందర్ని మంచిమాటలతో సాగనంపి, మళ్ళీ గుమ్మం తొక్కకుండా జాగ్రత్తపడేవారు. ఈవిధంగా బంధుమిత్రుల్ని దూర్వారబట్టిన తరవాత బాగా సన్నిహితులైనవారు ఇంటికి రాకపోకలుసాగించేవారు. యువకులు కొంతమంది ఇలియిచ్ కుమార్తెమీద కళ్ళువేశారు గాని, పెట్రీషెవ్ కొంతవరకూ ప్రయత్నంలో కృతకృత్యుడయ్యాడు. తండ్రికి అతనొక్కడే కొడుకు. ఇవాన్ ఇలియిచ్ ఈ వివాహ విషయం అప్పుడే భార్యతో ప్రస్తావించి, నిశ్చయించే సందర్భంలో ఒక విందు చేస్తే బాగుంటుందని అన్నాడు.

ఈవిధంగా ఆ కుటుంబం జీవితం అంతా హాయిగా సాగిపోతూ ఉండేది.

(ఇంకా ఉంది.)




## పాత్రలు

చెంగమలదాసు, దాది, కోమటిసెట్టి
రాయసం వెంకన్న, ఏకోజి, ఖాను,
పేషువాయి, సయిదుసాహెబు,
భటుడు, ఆశ్వికుడు.

*　　*　　*　　*

## దృశ్యం—1

[స్థలం—తంజావూరు రాజభవనంలో. దాది గృహం. సమయం—రాత్రి రెండవజాము.]

(ఏబదియేళ్ళ వయస్సుగల దాది, లోపల పరుండి ఉంటుంది. మహారాజు చెంగమలదాసు వచ్చి, మెల్లగా తలుపుతట్టుతాడు.)

దాది : (లోపలనుండి) ఎవరు ?

(మరల తలుపు చప్పుడు)

దాది : (కొంచెం బిగ్గరగా) ఎవరు ?

చెంగ : నేనే, చెంగమలదాసును.

దాది : మా మహారాజు చెంగమలదాసా !

చెంగ : అవునమ్మా !

దాది : (త్వరగా తలుపు తెఱచి) రా బాబూ; లోపలికిరా ! (చేయిపట్టుకొని లోనికి తీసికొని వెళ్ళి) కూర్చో. ఇలా మంచముపై కూర్చో. (చెంగమలదాసును మంచముపై కూర్చుండబెట్టి, తానుకూడా ప్రక్కన కూర్చుండి) ఏం బాబూ; ఇంతరాత్రి వేళ ఇలావచ్చేవు ?

చెంగ : చాలా అవసరమైనపని ఉండి వచ్చేనమ్మా !

దాది : ఏమిటది ? ఎవరితో ?

చెంగ : అత్యవసరమైన రాచకార్యం. నీతో ఆలోచన చేయటానికి వచ్చేనమ్మా !

దాది : నాతోనా ? రాచకార్యమా ?

చెంగ : అవునమ్మా ! నీతోనే.

దాది : సాక్షాత్తు విజయ రాఘవనాయని వారి కుమారుడవు, దారుణ రణరంగములో శత్రువులను ఓడించి, మరల తంజాపుర రాజ్యలక్ష్మిని చేపట్టిన వీరశిఖామణివి, పట్టాభిషిక్తుడవు కాకున్న నవ వీరుడవు, చెంగమలదాసువు, నీవు, సామాన్యపు ఆడుదానిని, బానిసను, నీదాదిని, నాతోనా రాచకార్యపు ఆలోచన ?

చెంగ॥: అవునమ్మా! నీతో కాక మ రెవరితో ఆలోచించగలను? పూర్వం, మధుర చొక్కనాథ నాయనివారి వెంకటకృష్ణప్ప నాయనితోడి యుద్ధంలో, మా తండ్రిగారు వీరస్వర్గము నలంకరించి నప్పుడు, నాలుగేండ్ల పసిపాపడను నన్ను మోచి కొని, శత్రువులకంట బడకుండ ఎట్లో నాగపట్నం చేరి, కానిచోట్ల, కానిపాట్లుపడి, పెంచి, నన్నింత వానిని చేసినావు. నీ చేతిపాలతో, ఆహారముతో, పెరిగి, నీ ఆశీర్వాదబలమున ఈనాడు మరల తంజా పుర రాజ్యమును పొందగలిగేను. నా తల్లిదండ్రులను నే నెఱుగను. నా సర్వస్వము నీవే. నీవు నాపాలిటి దాదివి కావు; దేవతవు.

దాది: (చెంగమలదాసును ఆనొమ్మున హత్తు కొని) అవును బిడ్డా! పెంచేను. ఆ రోజులలో, ఆ శత్రువుల అలజడులలో, ఆ అజ్ఞాతవాసంలో ఉండి, మనం అనుభవించిన బాధలు ఇంతింతలు గావు. వద్దు. అవి తలచవద్దు. ఒక్కమాఱుగా గుండె పగిలిపో తుంది. అయినా, మీ ఉప్పుకారముతో బ్రదికిన దానిని, దాదిని. ఆనొమ్మున గట్టుకొని మిమ్ము పెంచ వలసిన బాధ్యత నాది. నా ధర్మమును నేను నెర వేర్చుకొన్నాను.

చెంగ: కాదు తల్లీ! విజయరాఘవనాయని వారి వంశాంకురమును, చేతులమీదుగా పెంచి, పెంపొందించినావు.

దాది: కాని, బిడ్డా! ఒక్కటే విచారము. ఆ దుర్దినములు అట్లు వచ్చినవి. విజయరాఘవనాయని వారి రతనాల మేడలో, నిన్ను బంగారు తొట్టెలతో ఊగించుభాగ్యము నాకు లేకపోయినది!

చెంగ: నీ ఒడికన్న, నా కా బంగారుతొట్టె గొప్పా తల్లీ! అందువల్లనే, ఈనాడు నేను నీతో రాచకార్యములను ఆలోచింపవలసి వచ్చినది.

దాది: పోనీ, నిన్ను కాదన నేల? అట్లే ఆలో చింతము. అంత ఆలోచింపవలసిన ఆ రాచకార్యం?

చెంగ: రేపు నాకు సామ్రాజ్య పట్టాభిషేకము కదా?

దాది: అవును. ఆ మహోత్సవము నిరంత రాయముగా జరుగునుగాక!

చెంగ: పూర్వపు మన సరదారులు, క్రొత్త వారు, పాచ్చాలు, ముఖ్యముగా మన విజయమునకు కారణభూతుడైన ఏకోజిరాజు మొదలైన ప్రభువులు, పలువురు వత్తురుగదా?

దాది: వారి అందఱి సమక్షమున, దేవేంద్ర వైభవముతో, నీవు పట్టము కట్టుకోవాలి.

చెంగ: వారివారి గౌరవములకు తగినట్లు, మనము నానావిధ వస్త్రభూషణ వస్తువాహన మణి కనకాదులతో గౌరవించవలెను గదా?

దాది: అవును. అందుకు ఎంతో ధనం కావ లెననియేనా నీ ఆలోచన?

చెంగ: అవును. రాజమర్యాదలను, పూర్వపు పేరు ప్రతిష్ఠలను నిలుపుకోవలెనుగదా? మనకు ధన మేది? క్రొత్తగా కోట స్వాధీన పరచుకొంటిమి. శత్రువులు కొల్లగొట్టగా మిగిలిన కొద్దిపాటి ధనము మాత్రమే కోటలో మనకు లభించినది. ఉత్సవపు ఖర్చులకే అది సరిపోవునట్లు లేదు.

దాది: అదా నీ ఆలోచన? మరేమీ భయ పడకు. దైవంచల్లగా చూడవలెగాని, నీవంటి మహా రాజుకు ధనం తక్కువా చెంగమలదాసూ?

చెంగ: ఈపాడుపడిన కోటలో నాకు ధనం ఎలా లభిస్తుంది?

దాది: అలాగే! రా. ఇలా రా. ధనం లభించే దారి చూపుతాను. (అని మంచముపైనుండి లేచి, చెంగమలదాసును వెంటబెట్టుకొని వరుసగా కొన్ని గదులుదాటి, ఒక చీకటి గదిలోకి తీసికొనిపోయి) ఒక్కక్షణం ఉండు. దీపం వెలిగించుతాను. (అని దీపం వెలిగించి, తనచేతితో పట్టుకొని త్రోవ చూపుతూ) పద. ఆ చీకటి గదిలోకి పద. భయం లేదు. పద. (అని లోపలికి తీసికొనిపోయి) ఇదిగో, ఈ సొరంగపు తలుపుతీయి. ఇదిగో తాళపుచెవి.

చెంగ: అలాగే. ఏది? (అని తాళపుచెవి అందుకొని తలుపు తెరుస్తాడు)

దాది: అవిగో, చూచావా? బంగారు ధనపు బిందెలు. పైన మూతలువేసి, సీలువేసి బిగించి, నాగ పడగల కాపుదలలతో భద్రము చేయబడి ఉన్నవి. చూచావా? నిన్ను చూచిన ఆనందముతో కాబోలు, అవి దీపపు కాంతిలో తళతళ మెఱసి పోతున్నవి. ఆ బిందెలనిండ, వరహాలు, సాణారకాసులు, కోట్ల కొలది ఉన్నవి. వానిలోని సువర్ణభూషణములకు అంతులేదు. అదిగో, ఆ బిందెలక్రింది సొరంగము లోని గదిలో, నానా విధ రత్నములు, కుబేరుని యింటిలో వలె, నిధులెత్తి ఉన్నవి. ఇవి. అవి, అన్నియు నీవే.

చెంగ: (నివ్వెఱపోతూ) ఇదంతయు నాధ నమే?

దాది : అవును. నీ ధనమే. నీతాత తండ్రుల ధనము. నీవంశ పరంపరహక్కు. నీకై ఇచట నిక్షిప్తమై ఉన్నది. ఆనాడు యుద్ధములో నీ తండ్రిగారు విజయ రాఘవనాయనిగారు, ఇక ఓడిపోక తప్పదని నిశ్చయమైన వెంటనే, పట్టణములోని, జనానాలోని, స్త్రీలందరు, అంతఃపురములో అగ్నిలోపడి ఆహుతి అయినారు. ఆనాటి ఆ చితాగ్ని ధూమముతో నల్లబాఱి, పెటిలిపోయిన గోడలతో పొక్కిపోతూ ఈనాటికి నిలిచిఉన్న సరస్వతీ మహలులోని కొట్లను చూచితివిగదా ?

చెంగ : హా! దుర్భరం!

దాది : ఆ సమయమున, నాలుగేండ్ల పసిపాపడవు, నిన్ను కాపాడి, మరల తంజాపురాధిపతినిజేసి, నీకు సంక్రమింప జేయవలెనను నూహతో, ఈ ధనము నిచ్చట దాచిఉంచినాము. ఇప్పుడు బ్రదికిఉన్న వారిలో నాకును, రాయసం వెంకన్న నియోగిగారికి తప్ప, మఱెవ్వరికీ ఈ రహస్యం తెలియదు. నీకడుపు చల్లగా, ఈనాడు మా కోరికలు సఫలమైనవి.

చెంగ : అమ్మా! నిజంగా నీవు నాపాలిటి దేవతవు. కృతజ్ఞుడను.

దాది : పాఱలతో త్రవ్వి గోతాల కెత్తించి, రత్నరాసులు తీసికో. బంగారు బిందెలు రెండు నైపుల పెట్టించుకో. రేపు నిండుకొలువులో పట్టాభిషిక్తుడవై, ఈ దీర్ఘబాహువులతో, ఈ పెద్ద దోసిళ్ళతో, నీ యిష్టము వచ్చినట్లు బహూకరించు. ఎంత ఖర్చుపెట్టగలవో, నీవి ఎంత పెద్ద చేతులో చూతాము.

చెంగ : అలాగే పూర్వం కట్టడచేసికొన్న ప్రకారం, ఏకోజీరాజుకు లక్షవరహాల నగలు, వస్త్రములు, నాలుగు ఏనుగులు, వెండి బంగారు ముస్తీదులు చేసిన గుఱ్ఱాలు ఎనిమిది, కాక, ఆయన సొంతానికి ఇనాముగా పదిహేనులక్షల నాణేలు ఇస్తాను. వారివెంబడి కార్యస్థులకు లక్షవరహాలు నగలు; దివాన్ పేషువాయికి రెండులక్షల నాణేలు; ఖానుడికి లక్ష నాణేలు; సయిదుసాహేబుకు లక్ష రూపాయలు; తక్కిన సరదార్లకు పదేసి వేల నాణేలు; కాక, అదనంగా నాకు తోచినన్ని ఇచ్చివేస్తాను. యుద్ధములో వారు మనకు చేసిన సహాయం ఎన్నడూ మఱువరానిది. ముఖ్యంగా మన రాయసం వెంకన్న నియోగిగారికి అంతులేని ధనం ఇవ్వడమేకాక, ఆయనకు అంబారీ ఉత్సవం చేయిస్తాను. ఆయన బుద్ధిబలంవల్లనే కదా, ఏకోజీ సహాయం మనకు లభించి, మనం ఇంతవారమయింది? అమ్మా! నీ ఆశీర్వాద బలం. ఇక నాకేవిచారము లేదు.

దాది : అలాగే నిర్విచారంగా, తాతముత్తాలల పేరు నిలుపుతూ, రాజ్యమేలు. అభిషిక్తమైన మూర్ధముతో, రత్నకిరీటముతో, నా కన్నులకు పండువు చేయి...సరే. ఇక ఆ కొట్టుతలుపు వేసివేయి. ఆవలికి పోదాం. (అని గదిలోనుండి వెలుపలికి సాగుతుంది.)

చెంగ : (కొట్టు తలుపులు వేసి, దాదిని అనుసరిస్తాడు.)

దాది : (త్రోవలో వెనుదిరిగి చెంగమలదాసుమ చూచి) మఱి, క్రొత్త ఉద్యోగాల నియామకాలన్నీ పూర్తి అయినవా ?

చెంగ : ఈరోజు సభలోనే అవన్నీ పూర్తి ఐనవి. కాని...

దాది : ఆఁ కాని ?

చెంగ : ఒక్కనియామకం మాత్రం మిగిలిపోయింది.

దాది : ఏమిటది ?

చెంగ : రాయసం విషయం.

దాది : ఎందువల్ల ?

చెంగ : రాయసం ప్రధాని నియామకం విషయంలో పలువురు పలు అభిప్రాయాలు సూచించినారు.

దాది : నిర్ణయానికే రాలేదా ?

చెంగ : లేదు. తరతరాలనుండి ఆ పదవిలో ఉంటున్నవారినే, ఈనాడుకూడ నియమించటం మంచిదని కొందఱు; క్రొత్త ప్రభుత్వం కాబట్టి, సమర్థులైన క్రొత్తవారిని నియమించవచ్చునని కొందఱు; వాదోపవాదాలు లేవదీసినారు.

దాది : తరతరాలవారు అంటే, రాయసం వెంకన్న నియోగిగారే కదా ?

చెంగ : అవును.

దాది : మఱి నీ ఊహ ?

చెంగ : నాకు కూడ అదే సమంజసముగా తోచినది. వెంకన్న గారు, మన విజయ రాఘవనాయనిగారికి మిక్కిలి విశ్వాసపాత్రులే కాక, రాజ్య సుప్రతిష్ఠకు తమ యావచ్ఛక్తిని ధారపోసిన వారని అందరినోట అవ్యాహతంగా వినవస్తున్నది. అంతే గాక, ఈనాడు ఈ యుద్ధములో, వారు మనకు చేసిన సహాయము అమేయము. అందుకు మనము వారికి కృతజ్ఞులము కావలెను గదా ?

దాది : తప్పక.

చెంగ : కాని, సభలోని వాదోపవాదాలతో నాకేటూ పాలుపోక, నీతో ఆలోచించిన మీదట కార్యముఖమునకు రావచ్చునని, ఆ చర్చ వాయిదా వేసినాను. ఆ విషయమే, ఇప్పుడు నీతో ముఖ్యముగా ఆలోచింపవలసినది.

దాది : సరి సరి. ఇట్టి గడ్డు సమస్యలలో, ఆడుదాని ఆలోచన ? ఇక ప్రళయం ఆట్టే దూరంలో ఉండదు.

చెంగ : నీవు నా తలపులో అంగటి ఆడువారి వంటిదానవు కావు. ఇప్పుడు నీ ఆలోచన నాకు తప్పక కావాలి.

దాది : అత్యంతము బాధ్యతగల ఇట్టి నియామకములు, దూరాలోచనతో చేయవలసిన పనులు.

చెంగ : అవును.

దాది : రాయసం నియోగి వెంకన్న గారిని పూర్తిగా నీ వెఱుగవు. ఆయన రెండవ యుగంధరుడు.

చెంగ : అయిన, ఆయన అసాధారణప్రజ్ఞ మనకు క్షేమమే కదా ?

దాది : క్షేమము కావచ్చును; మఱొకటి కావచ్చును. అది ఆయన నిగ్రహానుగ్రహములను బట్టి ఉంటుంది.

చెంగ : ఒకప్పుడు మనపై నిగ్రహింపవలసిన అవసరం ఆయన కేముంటుంది ?

దాది : పగపట్టి కాటు వేయటానికి, త్రాచు పాముకు, మన మేమి అపాయం కలిగించాలి ? అది దాని స్వభావం.

చెంగ : అంటే ?

దాది : నియోగి వెంకన్న గారు అంతే.

చెంగ : ఆఁ ?

దాది : సందేహమా ? పూర్వము, మధుర నాయకులతోడి పగలు మున్నగువానిలో, వెంకన్న గారి ఎత్తు పైయెత్తులు అలా ఉండనీ. మొన్న మొన్నటి అళగరన్న పోరులో ఆయన చేసినకుట్ర ?

చెంగ : అప్పుడు వెంకన్న గారు కుట్ర చేసినాడా ?

దాది : అవును. పచ్చికుట్ర. మొట్టమొదట మీ తండ్రి విజయరాఘవనాయనివారు యుద్ధంలో ఓడిపోగానే, తంజావూరులో చొక్కనాథ నాయనిచే అళగరన్న, తమ ప్రతినిధిగా నియమితుడైనాడు. వారిరువురిలో మిత్రభేదం పుట్టించి, వెంకన్న గారు, మహాయుద్ధం తెచ్చిపెట్టినారు. ఆ తరువాత, ఏకోజి రాజుతో చేరి, ఆయనను అళగరిపైకి దండెత్తించినాడు. తత్ఫలితముగా ఈనాడు నీకీ తంజావూరు రాజ్యం లభించింది.

చెంగ : మనకోసమే గదా ఆయన ఇంత చేసినది ?

దాది : కుట్రదారుల కుట్రలు పైకి అలాగే ఉంటవి. ఇది మనమీది అనుగ్రహం కాదు. ఏ నిమిషాన ఎట్టి విపత్తునైనా, వెంకన్న గారు, నిర్దాక్షిణ్యముగా తెచ్చిపెట్టగలడు. తడిగుడ్డలతో గొంతులు కోయగలడు. వట్టి స్వార్థపరుడు. క్షణములో ఒకరిని దింపి, ఒకరిని నిలబెట్టి, ఆయన రాజకీయములను తలక్రిందులు చేసివేయగలడు. ఆయన స్వార్థమునకు అంతులేదు.

చెంగ : అందుకు నిదర్శనం ?

దాది : రాయసం నియామకములో ఆయన మూకీభావమే. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగా ఉండి, నిన్ను, తన హస్త నిర్దేశములపై నడిపింపవలెనని ఆయన తలంపు. అది నీ వెఱుగవు. ఆయతో మా తలలు బొప్పులు కట్టినవి.

చెంగ : అమ్మో ! ఇదంతా నిజమా ?

దాది : నిజంకాక మఱొకటా బాబూ ? ముమ్మాటికి నిజం. ఇప్పటికి నీకు పదునాలుగేండ్లు తిన్నగా నిండలేదు. అమాయికుడవు. ఇట్టి పన్నాగములు నీవు తెలిసికోలేవు.

చెంగ : అయిన, నన్నిపుడేమి చేయుమని నీ సలహా ?

దాది : అదే ఆలోచిస్తున్నాను. (కొంచెం ఆలోచించి) నీ వన్నట్లు ఆపదలో ఆదుకొన్న వారికి మనం జన్మ జన్మేపి కృతజ్ఞులమై ఉండాలికదా ?

చెంగ : తప్పక.

దాది : అట్టివారిలో, మనకు ఈ నియోగి వెంకన్నగారి కంటె ఇంకొ చాలా ముఖ్యులు ఉన్నారు.

చెంగ : ఎవరువారు ? అమ్మా ! నేనా మహనీయులను స్మరించక, వట్టి కృతఘ్నుడ నవుతున్నానా ?

దాది : నీ కెవరూ జ్ఞప్తికి రాలేదా ?

చెంగ : రాలేదమ్మా ! రాలేదు. ఎవరో చెప్పు.

దాది : తనయింటిలో మన కాశ్రయమిచ్చి, అన్నవస్త్రాదులతో పోషించినవాడు.

చెంగ : అవునవును. నాగపట్నములో ఆ కోమటిసెట్టి.

దాది : దుర్మార్గులైన శత్రురాజవర్గములవారి వలన రాగల కష్టనష్టములను కూడ లెక్కింపక, తన యింటి పసిగ్రుడ్డును నిన్ను, నన్ను, దాచిపదేండ్లు, తాను కంట నిదురలేక, కంటి రెప్పవలె కాపాడినాడు.

చెంగ : అవును. ఆతనికి మనము సర్వదా కృతజ్ఞులము.

దాది : అంతేకాదు. ఎంతో ధనం వెచ్చించి, నీకు రహస్యముగా అన్ని విద్యలు నేర్పించి, ఇంతటి వైభవమునకు కారణమైనాడు. ఆ కోమటిసెట్టికి, ఏమి ఇచ్చి, ఎన్ని జన్మములలో ఋణము తీర్చుకోగలము ?

చెంగ : లేదు. ముమ్మాటికీ వాని ఋణం తీఱదు.

దాది : బిడ్డా ! ధనరాసులు అప్పగించి, నీవాగ్దానములను నీవు చెల్లించుకొనుటకు అవకాశము కల్పించినాను గదా ? నాకు కూడ ఒక వాగ్దానమున్నది. అది నీవు చెల్లించవలె.

చెంగ : అట్లే చెల్లింతును. ఏమిటది ?

దాది : పెంచినతల్లినిగా నిన్ను అర్థిస్తున్నాను. నీవు నా వాగ్దానమును తప్పక చెల్లించాలి.

చెంగ : త్రికరణశుద్ధిగా చెల్లించగలను. అమ్మా! ఏమిటది ? త్వరగా చెప్పు.

దాది : నా తను మనః ప్రాణములతో నిన్ను కాపాడుకొనుటే నాపరమలక్ష్యము. అందులకే, నాగపట్నము చేరగానే నేనా కోమటిసెట్టిని మంచిచేసికొని, ఆతనితో ఒక ఒప్పందమునకు వచ్చినాను.

చెంగ : ఏమని ?

దాది : ఎన్నికష్టములకైన, ఎంత వ్యయమునకైన, ఓర్చి, మాపసిరాజును, పోషించినచో, ఆయన తిరిగి తంజావూరు రాజ్యమును పొందిన పిమ్మట, ఆయన రాచరికములో, నీకు దళకర్త ప్రధానికం ఇప్పించగలనని, నేనా కోమటిసెట్టికి వాగ్దానం చేసిఉన్నాను. దైవకృపతో నీవు తిరిగి తంజాపుర మహారాజు వైనావు. ఈనా కోరిక చెల్లించి, నన్ను అసత్య దోషమునుండి రక్షించుబిడ్డా !

చెంగ : వట్టి పిరికి కోమటిసెట్టికి దళకర్త ప్రధానికమా ?

దాది : ఎందుకు కాగూడదు ? అందఱు సెట్లవలె ఆతడు పిరికివాడు కాదు.

చెంగ : అంతమాత్రమున ఆతడు దళకర్త ప్రధానికమును నిర్వహింపగలడా ?

దాది : తప్పక నిర్వహింపగలడు. ఆతడు మిక్కిలి సమర్థుడు. అన్ని రాజ్యతంత్రములు ఆతనికి తెలుసును. అంతియగాక, ఆతనికి అపారమైన ధనబలము, బుద్ధిబలము, ఉన్నవి. పడవలపై పెద్దపెద్ద వర్తకములుచేసి, దేశదేశముల పేరుకెక్కినవాడు. అవసరమైనచో నదులపై, సముద్రములపై, ఓడలతో సేనలను నడిపి, రేవులను పట్టుకోగలవాడు.

చెంగ : పోనీ ఆ సెట్టి అంతటి ఘటికుడే అనుకొందాము. మన మీ పదవిని ఆతని కిచ్చిన, మన కొలువువారు సమ్మతిస్తారా ?

దాది : సర్వాధికారియైన మహారాజుకు, ఇతరుల సమ్మతితో పనియేమి ?

చెంగ : పోనిమ్మా. నీవన్నట్లు దళకర్త ప్రధా

నికమునకు ఆసించుకొని ఉన్న వెంకన్నగారికి, ఇది పరాభవము, కోపకారణము, కాదా ?

దాది : అయిన, అనుగాక. ఆయన కోపంవల్ల మనకు నష్టం ?

చెంగ : ఆయన యుగంధరుడని నీవే చెప్పితివి గదా ?

దాది : ధనబలము, బుద్ధిబలము, అధికారబలము, ఉన్నవారిముందు, ఇట్టివారు ఒక లెక్కా ? జమా ? ఆయనవల్ల నీకు వచ్చిన భయమేమీ లేదు.

చెంగ : ఒకవేళ వెంకన్నగారే, సభలో, ఆ పదవి నాకే కావలెనని పట్టుపట్టిన ?

దాది : నీవు నిర్భయముగా దరకర్త ప్రధానికము సెట్టికిచ్చి, కావలెనన్నచో వెంకన్నగారికి, ఆ సెట్టిక్రింద పేష్కారిగాని, సీమ అమలుగాని, ఇయ్యవచ్చును. అంతేగాని, పదిసన్నెండేండ్లు మనలను కాపాడిన ఆ సెట్టిని వదలి, ఈ పదవిని, ఈ ముసలిబాపడికి ఈయ వీలులేదు.

చెంగ : అమ్మా! ముమ్మాటికీ ఇదే నీ యిష్టమైనచో, అలాగే చేస్తాను. కాని, నియోగి వెంకన్నగారు, తన కిది పరాభవముగా పరిగణించి, మన కొలువు విడిచి పోగలడేమో అని నాకు తోస్తున్నది.

దాది : పోతే నేమి ?

చెంగ : వెనుకటివలెనే, ఏకోజీతో కలిసి కుట్రలుపన్ని, మనపై పగతీర్చుకోగలడని నా నమ్మకం.

దాది : అంత యెత్తు వచ్చినప్పుడు చూచుకోవచ్చును. మన సిబ్బందిలో మాత్రము అంత చేతులు వచ్చినవా రెవరు ? అన్నిటికిని సెట్టియేగలడు. భయపడకుము.

చెంగ : సరే, నీ యిష్టం ప్రకారమే నడుస్తాను. రాత్రి చాలా ప్రొద్దుపోయింది. ఇక పోయి వస్తాను.

దాది : చిరంజీవ !

చెంగ : (వెళ్ళిపోతాడు.)

---

## దృశ్యం—2

[స్థలం—కుంభకోణంలో ఏకోజీ కొలువు. సమయం—ఉదయం]

(ఏకోజీ కొలువుదీరి ఉంటాడు. షేషువాయి ఖాను, సయిదు సాహెబు, రాయసం వెంకన్నగారు, పరివేష్టించి ఉంటారు.)

ఏకోజి : వెంకన్నగారూ ! మీరు మా ఆస్థానానికి వచ్చిన ఇంతకాలంనుండి, మాకు చాలా ఉత్సాహంగా ఉంటున్నది.

వెంకన్న : ఏకోజీ మహారాజుల అవ్యాజానుగ్రహమునకు కృతజ్ఞుడను.

ఏకో : మరి, తంజావూరు విశేషము లేమీ చెప్పక పోతిరి ?

వెంక : చెప్పుట కేమున్నది మహారాజా ! ఈనాడు తంజావూరు వెనుకటి తంజావూరుగా లేదు.

ఏకో : అనగా ? సుభిక్షమేనా ? మన చెంగమలదాసు......

వెంక : సుభిక్షమే. చెంగమలదాసు దేవేంద్ర భోగములను అనుభవిస్తున్నాడు.

ఏకో—సంతోషం. మన చేతులతో రాజ్యములో నిలిపిన ఆ పసిపాపడు, అంతవాడు కావడం, మాకు చాలా సంతోషం.

వెంక : ఏకోజీ మహారాజుల అనుగ్రహం అటువంటిది. తంజావూరు వారిప్పుడు బహుముఖముల రాజ్యమును పెంపొందించినారు. క్రొత్త క్రొత్త కట్టడములు, క్రొత్త క్రొత్త మందిరములు, కట్టించినారు. క్రొత్త క్రొత్త పేటలను కట్టించి, ఎన్నో ఆగారములను, ఆయుధశాలలను, నిర్మించినారు. అన్నింటికన్న బృహదీశ్వరాలయమును అనేక విధముల పెంపొందించినారు. ఎందుకో, అందు అనేక రహస్య ప్రదేశములనుకూడ ఏర్పరచినారు.

ఏకో — ఎందుకేమున్నది ? రాజ్యమును విస్తరింపజేయుట, కావలసిన క్రొత్తవాని నిర్మాణము, జీర్ణోద్ధారము, మున్నగునవి, రాజధర్మములే కదా ?

వెంక : కావేరిలోనుండి క్రొత్తక్రొత్త కాలువలు, వానిపై క్రొత్త వంతెనలు, బ్రహ్మాండముగా నిర్మించినారు. కావేరి నీటితో తంజాపుర మీనాడు బంగారము పండుతున్నది. ఎన్నో గజశాలలు, గుఱ్ఱాల చావడులు, ఏర్పరచినారు. అందుగల రహస్యాయుధాగారములకు లెక్కలేదు.

ఏకో : అట్లాగా ? అయిన, ఈనాటి తంజా పుర వైభవమును ఒక్కమాఱు చూచిరావలసినదే !

వెంక : చూచిరావడ మేమిటి ? మహారాజుల వారు తలచినచో, అందే నిలువవచ్చును.

ఏకో : అదేమిటి వెంకన్నగారూ ? అది మన రాజ్యము కాదుగదా ?

వెంక : మన రాజ్యముకాక, వారి దెట్లగును ? కష్టపడి మహారాజులు సంపాదించి యిచ్చినదే కదా ?

ఏకో : తోడిరాజునకు, మీ కోరికవల్ల సహాయం చేసినాము. అంతే. అయినా, ఇప్పుడు తంజావూరులో వచ్చిన విపరీత మేమిటి ? చెంగమలదాసు మనకు మిత్రుడే గదా ?

వెంక : అవును. మహారాజు లన్నట్లు, చెంగమలదాసు మనకు మిత్రుడే ! కలిసిన మిత్రునియింట మిత్రులు కొంతకాలం నిలువగూడదా ?

ఏకో : ఓహో ! అదా మీ అభిప్రాయము ? అయిన సంతోషమే.

వెంక : తంజావూరు ప్రభుత్వవిధానము కూడ కొంత మాఱినది. అసలు, వారి అభిప్రాయములే మాఱినట్లున్నవి.

ఏకో : ఎందువలన ?

వెంక : రాజ్యములో అన్నిశాఖలను పెంచుటయే గాక, వారు ముఖ్యముగా కోటలను బందోబస్తు చేసి, సైనికశాఖపై దృష్టి కేంద్రీకరిస్తున్నారు. ఇప్పటికిప్పుడే, సేనాబలము అపారముగా సమకూర్చినారు. క్రొత్తక్రొత్త దళవాయులను నియామకంచేసి, అచ్చటచ్చట నిలిపినారు. చూడగా, వారి ఉద్దేశములో, ఏహో దండయాత్రలో, మఱేవో, ఉన్నట్లున్నవి.

ఏకో : వా రెవరు ? ఈ యేర్పాటులలో మీరు లేరా ?

వెంక : లేను.

ఏకో : కారణం ?

వెంక : ఈనాడు చెంగమలదాసుకు నేను పనికిరాను.

ఏకో : మఱి, మీ రాయసపు పదవి ?

వెంక : నాకు లేదు. నేనిపుడు తంజావూరు పౌరుడనుకూడా కాను.

ఏకో : మఱి, యిప్పుడు తంజావూరు దళకర్త ప్రధానికం ?

వెంక : ఒక కోమటిసెట్టికి.

ఏకో : అత డెవడు ?

వెంక : నాగపట్నపువాడు. చిన్నతనమున చెంగమలదాసును, వాడిని, తన యింటనుంచుకొని అతడు పోషించినాడు. అందువలన అతని కీనాడు ఆ పదవి లభించినది.

ఏకో : వీరికి కోమటిసెట్టి దళకర్త ప్రధాని ! అహ్హహ్హా! (విఱుగబడి నవ్వుతాడు.)

(సభలోని వారందఱు పెద్దగా నవ్వుతారు.)

శేషువాయి : (నవ్వుతూ) వెంకన్నగారూ ! మీ రాజునకు ఏమైనా మతిపోయిందా?

వెంక : మతే కాదు......

ఖాను : ఈ అధికారం, మీకు గాకపోతే, మఱొక బ్రాహ్మణుడికి గాని, వెలమ మొదలికి గాని, మఱొక సమర్థుడికి ఈయవచ్చును గదా? ఈ కోమటి సెట్టి యేమిటి?

వెంక : బాలరాజు చిత్తం అలా పనిచేసింది.

సయిదు : ఇది రాజుచిత్తం కాదు. తెరచాటు భాగవతపువారి చిత్తం అయిఉంటుంది.

ఏకో : సరిసరి. ఆ నియామకం జరుగునప్పుడు మీరు కొలువులో లేరా?

వెంక : ఉన్నాను. మొట్టమొదట దళకర్త ప్రధానిగా నన్నే నియోగింపదలచి, నాకై తెప్పించిన అలంకారములతో సెట్టిని అలంకరించి, అతని చేతికి అధికారి ఉంగరం వేయించి, చెంగమలదాసు, ఆ కోమటి సెట్టిని ఏనుగు హౌదాలో కూర్చుండబెట్టి పట్నం ప్రవేశం చేయించినాడు.

ఖాను : పరాభవం! పట్టి కృతఘ్నుడు.

శేషు : తంజాపుర రాజ్యానికి మీరు మీ సర్వశక్తులు ధారపోసినారు!

సయిదు : ఏకోజీ మహారాజుల సహాయమును కూడా, చెంగమలదాసు, ఈనాడు తలపోసినట్లులేదు.

వెంక : పట్నం ఊరేగివచ్చి, ఏనుగు దిగి, ప్రభువు పాదాలపై బంగారుపూలు చల్లి, నిలబడగానే, చెంగమలదా సాతనిని కౌగిలించుకొని, బిగ్గ

రగా కొలువులో ఇట్లు ప్రకటించినాడు—నేటి నుండి ఈ కోమటిసెట్టి మన దళకర్త ప్రధాని. ఈ రోజు మొదలు మీరందఱు ఈ సెట్టి వరిని ప్రకారం నడుచుకోవాలి—

ఏకో : అందుకు కొలువు వారందఱూ సమ్మతించారా?

వెంక : ప్రభు చిత్తమునకు అభ్యంతరమా మహారాజా? అలా చెప్పి, చెంగమలదాసు, మరల ఇలా శాసించినాడు—గౌరవ చిహ్నముగా మీరందఱు, మన దళకర్త ప్రధాని సెట్టిగారితో, వారి విడిదిదాకా పోయి, సెలవు గొనిరావాలి—రాజాజ్ఞ ప్రకారం అందఱు అట్లే కావించినారు.

పేషు : మీరు?

వెంక : నాకుమాత్రం అది దుర్భరం అయింది. ఇక ఈనాటితో తంజావూరుకు, నాకు ఋణం తీరింది. ఇంత పరాభవంతో ఇక్కడ ఉండేకన్న, ఎచ్చటికైనా పోయి, భగవద్ధ్యానంతో ఈ వృద్ధాప్యంలో కాలం గడుపుకొనవచ్చునని, వెంటనే ఇల్లువదలి, దేశాంతరములకు బయలుదేరినాను.

ఖాను : అప్పటికీ చెంగమలదాసు, మీ విషయం ఆలోచించనే లేదు ?

వెంక : అతనికి అంత తీరిక, అవకాశము, ఎక్కడివి ? కొలువులో అట్టి విపరీతశక్తులు ప్రవేశించినవి. ప్రభువు స్వయంగా అమాయకుడు, బాలుడు.

ఏకో : ఆ తరువాత ?

వెంక : దేశాంతరములకుపోతూ, త్రోవలో, మహారాజువారి దర్శనం చేసికొని, కొలదిదినములు ఇచ్చట నిలువవచ్చునుగదా అని, ఇచ్చటికి వచ్చినాను.

ఏకో : ఇంత వృద్ధాప్యంలో మీ కిట్టి అగౌరవం మాకు సహించరానిదిగానే ఉన్నది. మీరిచ్చటికి రాక, మాకు అపరిమితానందం కలిగించింది. ఇక మీరెక్కడికీ వెళ్ళ నక్కరలేదు. హాయిగా మాదివాణములో, శాశ్వతముగా నిలిచి పోవచ్చును.

వెంక : మహారాజుల అనుగ్రహమునకు కృతజ్ఞుడను.

(సభికులందఱు నవ్వుముఖాలతో తమ ఆనందం, సమ్మతి వెలిబుచ్చుతారు.)

ఏకో : (ఇంచుక ఆలోచనతో) వెంకన్నగారూ ! ఇంతకు, ఈ విషయంలో, తంజావూరు దొరల అభిప్రాయం ?

వెంక : ఏముంటుంది ? ఇక తంజావుర రాజ్య పతనానికి ఆట్టే దూరంలేదు. అందువల్లనే, వారు ఆ కోమటిసెట్టిని ఆ పదవిలో నియోగించుకొన్నారు.

ఏకో : అందుకు ప్రబలమైన కారణం ?

వెంక : చెంగమలదాసును పెంచినవాడికి, ఆకోమటిసెట్టి వలపుమగడు.

ఏకో : ఓహో ! అర్థమయింది. బాల నాయకత్వము ! స్త్రీ బుద్ధి !

వెంక : చిత్తం మహారాజా ! మీచే పునః ప్రతిష్ఠితమైన తంజావుర సింహాసనము, నేడో, రేపో, మనకళ్లముందే, పరాయి దొరలవశం కానున్నది. అదే నాకు పట్టిన హృదయవేదన.

ఏకో : పాపం ! వట్టి అదృష్టవిహీనులు !

వెంక : అని పెదవి విఱచి, ఈ సమయంలో మనం ఊరుకోనరాదు మహారాజా !

ఏకో : ఊరుకొనక ?

వెంక : ప్రభువులే ఆ సమస్యను చక్క బరచవలె.

ఏకో : ఎట్లు ?

వెంక : తాము సంపాదించిన తంజావుర సింహాసనమును తామే నిరభ్యంతరంగా లోబరచుకొనవచ్చును.

ఏకో : వెంకన్నగారూ ! వేసిన విస్తరి తీసివేసి, పాపం కట్టుకోమంటారా ?

వెంక : పతనోన్ముఖమైన రాజ్యమును ఉద్ధరించుట పాపమా మహారాజా !

పేషు : (ఏకోజీతో) ఒకప్పుడు మన మేకదా, చెంగమలదాసుకు సహాయం చేసినది ?

ఖాను : మరల మన జోక్యముతోనే, ఆదొంగబిడ్డడు బాగుపడాలి.

సయిదు : అవశ్యం.

[redacted]క : అంతేగాక, మహారాజా! కావేరీ మధురజలంతో బంగారుపంటలు పండి, భూలోక స్వర్గంగా ఉండే ఈ దేశమును వదలి, మీరేల, మీ కొండల ప్రదేశమునకు తిరిగి పోసంకల్పించినారో, తెలియవచ్చుటలేదు.

ఏకో : మా కింకేమి పనియున్నది? రాజ్యమా? గీజ్యమా? ఏదో, పాటిరాజుకు సహాయమునకై వచ్చితిమి. అంతేకదా?

వెంక : రాజ్యమునకేమి కొదువ? మహారాజుల చిత్తము సమ్మతించినచో, రాజ్యము సంసిద్ధముగానే ఉన్నది.

ఏకో : ఈ తరుణమున మీ ఊహ సరికాదని నే ననను. మీ వ్యూహములను భేదింపగలవారు ఎవరూ లేరని కూడా నాకు తెలుసు. అయినా, తంజాపుర సింహాసనము నభిలషించినచో, మన మిపుడు వారిపై దండెత్తిపోవలసినదే కదా?

వెంక : పోవలెను.

ఏకో : అందుకుతగిన సన్నాహము మన కెక్కడిది? అందుకు తోడు, తంజావూరువా రిప్పుడు, కోటలను బలపరిచి, సేనాబలమును పెంపొందించి, మిక్కిలి బలవంతులై యున్నారుకదా?

వెంక : ఎంత బలవంతులైన నేమి? పిరికి కోమటిసెట్టి యాజమాన్యమే కదా?

ఏకో : అదియునుగాక, మే మీ దేశమునకు క్రొత్తవారము. త్రోవలు, గుట్టుమట్లు మాకు తెలియవు. అంతేగాక, తూర్పుసీమవా రంతా పగలు కట్టి, ఈ దేశముపై బడుటకు సిద్ధంగా ఉన్నారు. పడమరనాడువారు కొల్లగొట్టటానికి అవకాశంకోసం వేచిఉన్నారు. ఈ మహారాష్ట్రంలో మాత్రం మేము విడిదిచేసి, గుఱ్ఱపుఫౌజు పెట్టిఉన్నందువల్ల, ఏదో ఒకవిధంగా అణగిఉన్నది. ఇట్టి సందర్భంలో, తంజావూరును వశపరచుకోవడం మాకు అంత సులభం కాదు.

వెంక : మహారాజులు అందుకేమీ భయపడ నక్కరలేదు. ఏపాటి యుద్ధమూ, ఆయాసము లేకుండా; మహారాజులు, తంజావూరుకోటలో ప్రవేశం అయ్యేటట్లు నేను చేయగలను. ఆ గుట్టుమట్లన్నీ నాకు తెలుసు. ఆ భారము నాది. తంజావూరు రాజ్యము, చెంగమలదాసుకు ఉండవలె; లేదా, ఏకోజీ మహారాజులకు ఉండవలె. అంతియే గాని, మఱొకని చేతిలో అది పడిపోవుటను, నా కన్నులతో నేను చూడలేను; నా చెవులతో నేను వినలేను. అందువల్లనే, ఇంతగా వేడుకొనుచున్నాను. మహారాజా! ఇక మనము ఉపేక్ష చేయరాదు. సమ్మతి సెలవీయండి!

ఏకో : మీరు చెప్పినది సమంజసముగానే ఉన్నది. కాని, మన మిదివరకు శత్రువులనుజయించి, చెంగమలదాసుకు పట్టము గట్టిఉంటిమి కదా? మనమే ఇప్పుడు వానిపై దండెత్తిపోయిన, లోకం మనలను ఒప్పుతుందా? వట్టి స్వార్థపరులు అని తిట్టిపోయదు? పోనీ అపకీర్తికిలోబడి, దండెత్తితిమే అనుకో. తమ పూర్వవైరాలు మానుకొని, తిరుచినాపల్లెవారు, తంజావూరువారు, ఏకముఖంగా, తమ దండుతో మనపై పడినయెడల, వారికి మనం ఆటి నిలువగలమా?

వెంక : అంత దూరమేరాకుండ నేను చేయగలను. నేను చెప్పినప్పుడు, నామమాత్రముగా మీరు తంజావూరుపైకి దండు నడిపించిన చాలును. సర్వము మనకు వశం కాగలదు. ఒక్క పురుగైనా చావక, ఒక్క దమ్మిడీ ఖర్చుగాక, నే నీ విజయమును సమకూర్చగలను.

ఏకో : మీకు అంత గట్టినమ్మకం ఉంటే, అట్లే కానీయండి. నాకూ సమ్మతమే.

వెంక : మహానుగ్రహము.

ఖాను: సెభాష్! వెంకన్నగారూ! సెభాష్!

షేషు : ఆహా! వెంకన్నగారి మాటకు తిరుగు లేదు. ఇక ఒక క్షణంలో, తంజావూరు రాజ్యం...

సయిదు : మన ఏకోజీ మహారాజుల వశమైనట్లే. (కొలువువారు అందరు) ఏకోజీ మహారాజులకు జయమగుగాక! జయమగుగాక!

## దృశ్యం-3

[స్థలం—చెంగమలదాసు రాజభవనం. సమయం—దినాంతము.]

(రాజభవనంలో, చెంగమలదాసు, కోమటిసెట్టి మంత్రాలోచన చేస్తూఉంటారు.)

(రాజభవనం వెలుపల, మాగధులు పలికిన జయవాక్యాలు ఇలా వినవస్తవి.)

చెంగ : ఈ విషయంలో, మా దాదిఅమ్మ అభిప్రాయం ఎలా ఉంటుందో ?

సెట్టి : ఆఁ! ఆమె అభిప్రాయం తప్పక తెలిసికోవలసినదే.

(దాది ప్రవేశం)

సెట్టి : అదిగో, మాటలోనే ఆమె కూడా వచ్చింది. సంఘటన అంటే, అలా ఉండాలి.

దాది : ఏమిటి విషయం?

చెంగ : అమ్మా! ఈనాడు, రాయసం వెంకన్న నియోగి గారు, మా కొలువుకు ఒక వర్తమానం పంపేరు.

దాది : వెంకన్నగారా? ఇప్పుడు వారెక్కడ ఉన్నారు?

చెంగ : అయ్యంపేటలో.

దాది : ఏం చేస్తున్నారు ?

చెంగ : వృద్ధాప్యంలో విశ్రాంతిగా కాలం గడపుకొంటున్నారట.

దాది : వారి వర్తమానం అయ్యంపేటనుంచే పంపేరా?

చెంగ : అవును.

దాది : ఏమని ?

చెంగ : సెట్టిగారూ! ఏదీ? ఆ కమ్మ చదివి వినిపించండి.

సెట్టి : (కమ్మ విప్పి ఇలా చదువుతాడు.)

"శ్రీ శ్రీ చెంగమలదాసు మహారాజులుంగారి పాదసన్నిధికి, తమ ఆశ్రితుడు రాయసం వెంకన్న, అనేక దణ్ణములు పెట్టి, పంపుకొన్న విన్నపములు.

ఏ కారణంచేతనో, కొద్ది రోజులనుండి, ఏకోజీ మహారాజు, మీపై మిక్కిలి కోపంతో ఉన్నాడు. ఎంత ఆలోచించినా, కోపకారణం తెలియవచ్చుట లేదు. తంజాపురముమీద దండు నడపుటకు కూడా, ఏకోజీరాజు, ఆలోచన చేస్తున్నట్టు, నాకు తెలియవస్తున్నది. తమ ఆశ్రితుడను, క్షేమము కోరినవాడను, గనుక, నేనీ వర్తమానమును ముందుగా, రహస్యముగా, ప్రభువులకు తెలియబరచుకొంటున్నాను.

ఇట్లు
తమ ఉప్పుకారములతో పెరిగిన
రాయసం వెంకన్న.
అయ్యంపేట.

దాది : ఏదీ? మఱొక్కమారు చదవండి!

సెట్టి : (మరల తాపీగా చదివి వినిపింతును.)

దాది : మోసం. పచ్చిమోసం.

సెట్టి : మోసమా ?

దాది : అవును. తంజావూరును మాచి, కన్నుగట్టి, ఆ జిత్తులమారి పన్నిన పన్నాగమే ఇది.

సెట్టి : అంత అవసరం?

దాది : రాయసం దళకర్త ప్రధానిగా తన్ను నియామకం చేయలేదని, తంజావూరునుండి లేచిపోయి, ఏకోజీతో కలిసి, మరల కుట్రలు సాగించినాడు ఈ దుష్టుడు. వట్టి తుట్టెపురుగు.

సెట్టి : రాజు కొలువులో ఉద్యోగం శాశ్వతంగా తనకే ఉంటుందనీ, తనకే ఉండాలనీ, ఏ బుద్ధిమంతుడూ అనుకోడు.

దాది : అది బుద్ధిమంతుని విషయం.

సెట్టి : ఆ మాయల మరాటీవాళ్లనుకూడా, ఆయన, తన వలలో వేసికొన్నాడంటావా?

దాది : మరాటీల నేమిటి ? ఆయన, యముడినైనా తన వలలో వేసికోగలడు.

సెట్టి: దొంగమరాటీ దండువాళ్ళకు, ఈ చదువులు ఒకరుచెప్ప నక్కరలేదు.

దాది : ఏమైనా కానీయండి. ఇది ఆ నియోగి వెంకన్నగారి కుట్రగాని, మఱొకటిగాదు. కుట్రతోనే ఆయన, మన చిట్టిబాబును సింహాసనమెక్కించినాడు; ఈనాడు మరల కుట్రతోనే, మఱొకవిధం చేయ సంకల్పించినాడు. ఆయన చేతులలో తంజావూరు సింహాసనం, బంతివలె, చాలా చేతులు మాఱింది.

సెట్టి : పోనీ, వెంకన్నగారి కుట్రయే అగుగాక. మరాటీవాళ్లు మనమీద కోపగించే ఉంటారు కదా ?

దాది : నిస్సందేహంగా. అంత కోపం ఆయన తప్పక కలిగించి ఉంటాడు.

సెట్టి : గారెల చిప్పయితేనేమి, బూరెల చిప్పయితేనేమి, కొంప ముట్టుకొనడానికి? మరాటీ వాళ్ళకు మనమీద బాగా కోపంవచ్చింది. ఇక మన కర్తవ్యం?

దాది : మన రక్షణ మనం చేసికోవటమే.

సెట్టి : ఎలాగు ?

దాది : సేనాబలంతో.

సెట్టి : అమ్మో! ఆ మరాటీవాళ్లతో యుద్ధమే?

దాది : అవసరమైతే.

సెట్టి : బాబో; అది మనవల్లకాదు. ఆ కొంప దొంగల గుంపుముందు మనం నిలువలేము. మనం గెలువము.

దాది : అలా అధైర్యపడకండి సెట్టిగారూ !

సెట్టి : అధైర్యమేమిటి? గుండె లలిసిపోతుంటేను. మన మెంత? మన మట్టెంత? మరాటీ వాళ్ళతో తలపడటమా? చాలుచాలు. ఇక నీ ఆడ ఆలోచన కట్టిపెట్టు.

(భటుడు ప్రవేశం.)

భటుడు : శ్రీ శ్రీ మహారాజులకు జోహారు. ఎవరో ఒక అశ్వికుడు వచ్చి, ప్రభువుల దర్శనంకోసం, వాకిట వేచిఉన్నాడు.

చెంగ : లోనికి ప్రవేశపెట్టు.

భటు : రాజాజ్ఞ.

(చరచర వెళ్ళి, అశ్వికుని లోనికి తీసికొనివస్తాడు.)

అశ్వి : మహారాజులకు జోహారు.

చెంగ : (అశ్వికునితో) ఎవరు నీవు ?

అశ్వి : రాయసం వెంకన్నగారు, ఒక వర్తమానం వ్రాసి, అతి రహస్యంగా, నిముషాలమీద, ప్రభువులకు అందజేయమని ఇచ్చినారు. అదే ఇది. (జాబు చూపి ఇవ్వబోతాడు.)

చెంగ : సెట్టిగారికి ఇవ్వు.

అశ్వి : (జాబు సెట్టిగారికి ఇస్తాడు.)

చెంగ : (అశ్వికునితో) ఇక నీవు పోవచ్చును.

అశ్వి : చిత్తం. రాజాజ్ఞ (నమస్కరించి వెళ్ళిపోతాడు.)

భటు : (అశ్వికుని వెంటనే వెళ్ళుతాడు).

చెంగ : సెట్టిగారూ ! ఆ వర్తమానం విప్పిచదవండి !

సెట్టి : (జాబువిప్పి చదువుతాడు.)

"శ్రీ శ్రీ చెంగమలదాసు మహారాజులుంగారి పాదసన్నిధికి, తమ ఆశ్రితుడు రాయసం వెంకన్న, అనేక నమస్కారములుచేసి, అత్యవసరముగా వ్రాసి విన్నవించుకొను విన్నపములు.

ఏకోజీరాజు, తంజావూరిపైకి దండు సాగించనే సాగించినాడు. ఆయన ప్రయత్నం, పెద్ద యెత్తున ఉన్నది. ఏమికారణమో, తంజావూరు పేరుచెప్పితే, ఆయన, మండిపడుతున్నాడు. ఈ రాత్రికే, ఆయన, దండుతో తంజావూరు చేరగలడు. ఈతరుణములో మీరు ఆయనయెదుట పడినయెడల, పెద్దమోసము జరుగగలదు. కావున, మీరు, ఈవేళకుమాత్రం తప్పి, తొలగిఉండండి. సింహద్వారం తెరచిఉంచి, అందరూ ఆయనకు కోటలోనికి స్వాగతం ఇచ్చేటట్లు హుకుంజారీచేయండి. నిమ్మళం మీద, నేను, ఏకోజీ మనసు దిద్ది, సమాధానపరిచి, మీ కోట, మీ రాజ్యము, మీకు మరల వశముచేసేటట్లు చేయగలను. మీవాడను, మీ ఉప్పుకారముతో బ్రదికినవాడను, గనుక, నా బుద్ధికి తోచినట్లు, నా ఆదుర్దాకొలది, వ్రాసి విన్నవించుకొన్నాను.

ఇట్లు

నమ్మినబంటు

రాయసం వెంకన్న,

అయ్యంపేట.

సెట్టి : (అని చదివి, భయంతో వణకిపోతూ) అమ్మయ్యో ! ఇంకేముంది ? కొంపమునిగింది ! ఆ మరాటిదండువచ్చి పడనే పడింది.

దాది : (గుండెలు బాదుకొంటూ) అయ్యో ! అయ్యో ! ఎంతమోసం ? ఎంతమోసం ?

సెట్టి : నేను చెప్పితే, విన్నారు ? ఆ మాయల మరాటీ వాళ్ళని నమ్మవద్దని.

దాది : (వణకుతో) ఇప్పుడు ఏంచేద్దాం?

సెట్టి : ఏంచేద్దామా ? వెనుక చేసిందే: ప్రాణాలుంటే, ఎక్కడైనా బలుసాకు దిని బ్రదుకవచ్చు. లేవండి ! లేవండి !

దాది : ఎటుపోదాం ?

సెట్టి : ఏటేమిటి ? ముక్కుకు సూటిగా. ఈ రాజ్యమువద్దు. ఈ యుద్ధాలువద్దు. (బిగ్గరగా) ఎవ రక్కడ ?

చెంగ : సెట్టిగారూ!

సెట్టి : సెట్టి లేదు. జెట్టి లేదు. నీవు వట్టి పసి పాపడవు చెంగమలదాసూ! ఏమీ ఎఱుగవు, ఉండు. మా తిప్పలు మేము పడతాము.

చెంగ : అది గాదు సెట్టిగారూ !

సెట్టి : నీకేమీ తెలియదు. అలా ఉండమంటే! మరాటీవాళ్ళ చేతుల్లో పడి మాడిపోతామా ? (మరల బిగ్గరగా) ఎవరక్కడ ?

భటు : (పరుగున ప్రవేశించి) చిత్తం. ఏమి సెలవు ?

సెట్టి : రొక్కం, బంగారు నగలు, రత్నాలు, సంచుల కెత్తుకొని, గుఱ్ఱాలతో వేయిమంది జనాన్ని, మూడు పల్లకీలను, తెరలు వేసి, సౌధం వాకిట సిద్ధంగా ఉంచు. పో త్వరగా పో.

భటు : (చిత్తం. వెళ్లిపోతాడు.)

దాది : సెట్టిగారూ! మన మెటు పోవాలి?

సెట్టి : (ఆలోచించి) ఆఁ! ఆఁ! తిరుచినాపల్లె వైపుగా.

దాది : అమ్మయ్యో! అది మనకు శత్రుస్థానం కదా ?

సెట్టి : ఫరవాలేదు. తిరుచినాపల్లెను ఆనిఉన్న పాళియపట్టులో, ఆ ఊరి దొర, రంగప్ప మళవ రాయుడు, నాకు మోమోటస్థుడు. ఆయన ఆశ్రయంలో మనం ఉండవచ్చును.

దాది : అది మనకు క్షేమమే నంటారా ?

సెట్టి : ఫరవాలేదు. వెనుకటి వ్యాపారంలో ఆతనికి నాకూ చాలా లావాదేవీ లున్నవి. మన కేమీ మోసం జరగదు.

భటు : (ప్రవేశించి) సర్వమూ సిద్ధమైనవి.

సెట్టి : సరే, నీవు త్వరగా పోయి,—కోట వాకిలి, రాజప్రాసాదంలో అన్ని వాకిళ్ళూ, తెఱచి ఉంచమనీ, నగరులో ఎవరూ కత్తి పట్టవద్దనీ, ఏకోజీ రాజును ఘనంగా స్వాగతం ఇమ్మనీ,—రాజాజ్ఞగా మహామంత్రులకు విన్నవించు.

భటు : చిత్తం. (అని, చరచర వెళ్లిపోతాడు.)

దూరాన తుపాకులు కాల్చిన చప్పుళ్లూ, సేనా కలకలం వినవస్తవి.)

సెట్టి : (విని వడవడ వణకుతూ) అవిగో, తుపాకుల చప్పుళ్లు. మరాటీవాళ్లు వచ్చి పడనే పడి నారు. లేవండి! త్వరగా లేవండి !

(చెంగమలదాసును, దాదిని, చేయి పట్టుకొని, త్వరగా కుర్చీలలోనుండి లేవదీస్తాడు.)

(ముగ్గురు ఒక్కపరుగున రాజసౌధం వెలికొచ్చి, పల్లకీలలో ఎక్కి వెళ్లిపోతారు.)

(వేయిమంది అశ్వికులు వారిని అనుసరిస్తారు.)

## దృశ్యం—4

[స్థలం—తంజావూరు రాజదర్బారు మహలు. సమయం—ఉదయం]

(మంగళవాద్యాలు, నగారా నౌబత్తుఖానా వగైరా, మ్రోగుతూ ఉంటవి. ఏకోజీరాజు సామంత సచివాదులతో కొలువుకు వస్తాడు. రాయసం వెంకన్న, ఖాను, పేష్వాయి, సయ్యదుసాహెబు, ఆయన ప్రక్కనే క్రొత్తదుస్తులతో ముస్తాబయి, వస్తారు. రాజోద్యోగు లందఱు బరాబరులు చేస్తూ ఉంటారు.)

(పార్శ్వాన వేయిదీప్తాలు, పగలువత్తులు, మత్తాబులు, చంద్రజ్యోతులు, ప్రకాశిస్తూ ఉంటవి. శుభసూచకముగా కోటవాకిట ఫిరంగులు మ్రోగుతూ ఉంటవి.)

(వందిమాగధులు ఇలా పలుకుతారు)

వందిమాగధులు : శ్రీ శ్రీ శివావతార శ్రీ శివాజీ మహారాజ సహోదరా ! మహారాష్ట్రాన్వయ పయః పారావార రాకాసుధాకరా ! నిస్తుల బాహా బల నిర్జితారాతిమండలా ! నిజవైభవాజితాఖండలా! సాంద్ర కరుణారస తరంగ తరంగిత నిజహృదయాంతరంగా ! శ్రితజనార్తిభంగా! జీర్ణ కర్ణాట రాజ్యపునః ప్రతిష్ఠాపన మహాదీక్షాదక్షా ! తంజాపురరాజ్య లక్ష్మీ దృఢ స్వయంగ్రహమహోత్సాహ విలాసవిలసిత విపుల నిజవక్షా ! రాజాధిరాజశ్రీ ఏకోజీమహారాజకుల సార్వభౌమా ! జయ ! విజయీభవ ! విజయీభవ !

ఏకోజి : (సింహాసనమును సమీపించి, ఒక్కమాఱు అందఱినీ కలయజూచి, ఆసీనుడౌతాడు.)

మంత్రి సామంతాదులు అందఱు : (నిలు

చుండి ఉండి) రాజాధిరాజ రాజశ్రీ ఏకోజీమహారాజ కుల సార్వభౌమా! జయ! విజయీభవ! విజయీభవ!

(అని పలికి, రాజు కరసంజ్ఞతో తమ తమ ఆసనములలో ఆసీనులౌతారు)

పురోహితులు: (ఒక్క స్వరముతో) స్వారాజ్యం వైరాజ్యం మహారాజ్యమాధిపత్యం, పృథివీసముద్రపర్యంతాయా వసంతాయా ఏకరాడితి. శతమానంభవతి శతాయుః పురుషః శతేంద్రియ ఆయుష్యేంద్రియే ప్రతితిష్ఠతి.

(అని ఆశీర్వాదములు పలుకుతారు)

(నృత్తగీత వినోదాదికములన్నీ పూర్తిఅవుతవి)

ఏకోజి: ఈనాడు పర్వదినం. మీ అందటి ఉత్సాహబలముమీద, మేమీ తంజాపుర రాజ్యమును చేపట్టి, సర్వ ప్రజారంజకముగా పరిపాలన సాగించ దలచుకొన్నాము. ఈనాటితో తంజావూరురాజ్యములోని చిక్కులన్నీ తీఱిపోయినవి.

కొలువువారు అందఱు—జయ! విజయీభవ!

ఏకోజి: ఈ మావైభవమునకు కారణభూతులైన మీ అందఱిని నేను అభినందిస్తున్నాను. ఘన స్వాగతముతో, నన్ను సింహాసనమునకు ఆహ్వానించిన తంజాపుర రాజకార్యముల వారిని, మిక్కిలి అభినందిస్తున్నాను.

మంత్రులు: మహారాజుల మహానుగ్రహం.

ఏకోజి: అనాయాసముగా మా కిట్టి విజయమును సమకూర్చిన శ్రీరాయసం వెంకన్న నియోగిగారికి, ముఖ్యముగా మా సంతోషమును తెలుపుకొంటున్నాము.

వెంక: ధర్మ సంస్థాపనమునకు కంకణము కట్టుకొని అవతరించిన అపరశివావతారము శ్రీ శివాజీ మహారాజుల సహోదరులు శ్రీ ఏకోజీ మహారాజులు మారాజులు కావటం మా అదృష్టం.

ఏకో: వెంకన్నగారివంటి మహామేధావులు, ప్రజ్ఞాధురంధరులు, మాకు సహాయం కావటము, మా అదృష్టవిశేషం.

వెంక: శ్రీ శ్రీ ఏకోజీ మహారాజుల నిండు కొలువుతో, ఈనాడు, ఈ ఇందిరామందిరము, సాక్షాత్తు ఇందిరామందిరముగా ప్రకాశించుతున్నది.

ఏకో: నేటినుండి తంజాపురరాజ్యము, మా మహారాష్ట్ర పరిపాలనము క్రిందికి వచ్చినది. అయినప్పటికీ, ఇది మేము అపహరించవలెనని కానీ, కావలెనని కోరుకొన్నదికానీ, కాదు. కాబట్టి, రాచకార్యములలో, మునుపు ఉన్నవారినే, ఆయా పదవులలో, అట్లే ఉండ నియోగించుతున్నాము.

కొలువువారందఱు—మహారాజుల మహానుగ్రహమునకు కృతజ్ఞులము.

ఏకో: తమ తమ ఆచారములలో, మాన మర్యాదలలో, మేమెన్నడు ఎట్టి అభ్యంతరము కలిగించబోమని, తంజావూరు ప్రజలకు, మేము, ప్రతిజ్ఞాపూర్వకముగా అభయమిచ్చుచున్నాము. ఎవరి అగ్రహారములకును, ఆస్తిపాస్తులకును, దేవాదాయములకును అడ్డురాము.

కొలువు వారందఱు—మహారాజులకు జయము గాక!

ఏకో: పూర్వపురాజుల వరవడులలో నడచి మేముకూడ తెలుగుభాషను, తెలుగుకవులనుపోషించి, వారిచే క్రొత్తప్రబంధములను నిర్మింపించగలము. పూర్వ ప్రబంధములను, ఆదరించి, ప్రకటనలోనికి తీసికొనిరాగలము. మా రాజ్యముకదా అని, మా మహారాష్ట్రభాషను తంజాపుర ప్రజలపై రుద్దము.

కొలువు వారందఱు: ధర్మప్రభువులకు జయము గాక!

ఏకో: తెఱచి ఉంచబడి, సుస్వాగత పూర్వకముగా, మాకు అఖండ విజయమును సమకూర్చిన తంజావూరు కోటవాకిలికి, మా సంతోష చిహ్నముగా, "ఫతే దర్వాజా" అని సార్థకముగా నామకరణము చేయుచున్నాము. ఈనాటినుండి అది అట్లు వ్యవహరింపబడును గాక!

సభలో: (హర్షధ్వానాలు)

ఏకో: తమ రాజు చెంగమలదాసు బాలుడైన కారణమున, ఆయనను లెక్కచేయక, కానుకలు, కరదలు, మానివేసి, తల యెగకట్టిన చుట్టుపట్ల సీమలలోని పేష్కారీల నందఱినీ, నయభయములమీద వశపరచుకొని, పాలెగాండ్లను క్రొత్త కవుల్లలోనికి గొనివచ్చి, సీమ అంతా స్వస్థతకు తీసికొనివచ్చుటకు

సమర్థులైన వారిని నియమించి, ఆ పనులు రెండు మూడు రోజులలో పూర్తిచేయవలసినదిగా మంత్రులకు ఆజ్ఞాపిస్తున్నాము.

మంత్రులు : మహారాజుల ఆజ్ఞ.

ఏకో : ముఖ్యముగా మీ అందఱు సమక్షమున మేమిప్పు డొకటి చేయవలసిఉన్నది.

సభికులు అందఱు : (అది యేమా అని ఆతురతతో ఏకోజీ ముఖంవంక చూస్తూ ఉంటారు.)

ఏకో : మా ఈ వైభవమున కంతటికీ ముఖ్యకారకులు ఎవరో మీకు తెలిసియే ఉంటుంది.

షేషు : అవును. రాయసం వెంకన్న నియోగి గారు.

ఏకో : ఆయన మాకు చేసిన సహాయం, మఱువరానిది. ఆయనకు మేమెంతో ఋణపడియున్నాము.

ఖాను : నిజంగా.

వెంక : మహారాజుల అనుగ్రహం.

ఏకో : ఏమి బహూకరించి, వారి ఋణం తీర్చుకోగలమో, మాకు తోచుబడి కావటం లేదు.

వెంక : మహారాజుల అనుగ్రహం చాలును.

(సభఅంతా క్షణంసేపు నిశ్శబ్దంగా ఉంటుంది.)

షేషు : చెంగమలదాసు రాచరికంలోని దళకర్త ప్రధాని కోమటిసెట్టి, పరారీ అయినాడుగదా?

ఖాను : భలే ఊహ. వెంకన్నగారిని ఆ హోదాలో ఉంచటం, మాకు చాలా ఖుషీమతుగా ఉంటుంది.

ఏకో : అందుకు వెంకన్నగారు అంగీకరిస్తారా?

వెంక : మహారాజుల ఆజ్ఞాపాలనమే నావిధి.

ఏకో : (కొంచెం ఆగి) అందుకు వెంకన్నగారు సమ్మతించినా, ఈ పాటి స్వల్పఉద్యోగం వారికి ఇవ్వటానికి, నా మనస్సు ఒప్పటంలేదు. (కొలచెం ఆలోచించి) వెంకన్నగారు, అసమాన ప్రజ్ఞా ధురీణులు. వారి ఆలోచనలు, యుక్తులు, అర్థం చేసికోగలవారు ఎవ్వరూ లేరు. ఎంతట్టి అసాధ్యమైన పనిసైనా, ఆయనయుగంధర ప్రజ్ఞతో, ఇతరులు నొచ్చుకుండా, సాధించగలడు.

ఖాను : నిజం నిజం.

ఏకో : ఈ వెంకన్నగారు, ముందు చెంగమలదాసును వెంటతీసికొని పాచ్ఛాదగ్గరకువచ్చి, మా కుమ్మకు మీద ఎదిరిని జయించి, అతనికి పట్టంకట్టించినాడు. తిరిగి యిప్పుడు తనకు, చెంగమలదాసుకు, సరిపడకపోవుటచేత, తంజావూరునుండి లేచివచ్చి, మమ్ములను ఎసకొలిపి, దండు వెడలించి, కుయుక్తితో, చెంగమలదాసు పట్నం విడిచి పారిపోయేటట్లు చేసినాడు. పాపం! అ అమాయకపు బాలరాజు, ఆ పిరికి కోమటిసెట్టికి, ఆ ముసలిదాదికి, వశమై, స్వారాలోచనలేక, ఇంత దుర్గతిపాలైనాడు!

సభికులు : (నివ్వెఱతో, విషాదంతో, తారుమారవుతూ ఉంటారు.)

వెంక : (అదరుగుండెతో కళవళ పోతూ ఉంటాడు.)

ఏకో : ఈ వెంకన్నగారు సామాన్యుడు కాడు. బహు కుయుక్తిపరుడు. ఇతడు నిలబడిన చోట, ఉన్న గడ్డిమాడిపోయి, ఇక మళ్ళీ మొలకెత్తదు. సందు దొరికిందో, ఇక ఆయన మనలను తోలుబొమ్మలనువలె ఆడిస్తాడు. అతడు చెప్పినట్లు మనం నడుచుకోవాలి. లేదా, తంజావూరువారిగతే, మనకు పట్టుతుంది. కనుక, ఆయన విషయంలో, అతి జాగ్రతగా ఉండవలెనుగాని, ఏమఱచి ఉండరాదు.

షేషు—నిజం నిజం. వెంటనే, ఆయనపై తగిన చర్య తీసికోవాలి.

ఏకో : ఒక్కక్షణమైనా, ఆయనను స్వతంత్రునిగా ఉండనీరాదు. ఎంతైనా, ఏమైనా, చేయగలడు.

వెంక : (భయసంభ్రమాలతో) మహారాజా! మహారాజా!

ఏకో : వెంకన్నగారూ! ఇంకా మీ నక్కవినయాలు, ఈ ఏకోజీముందు సాగవు...(ఖానును, షేషువాయినిచూచి) వెంకన్నగారిని వెంటనేపట్టి, యావజ్జీవం కారాగారంలో...

సభికులు అందఱు—(భయోద్వేగాలతో ఉలికిపడి, విప్పిన కళ్ళతో, ఏకోజీవంక చూస్తూ ఉంటారు.)

పేష్వ, ఖాను : (తమ కుర్చీలలోనుంచి లేచి వెంకన్నగారివైపుకు సాగుతారు.)

వెంక : (అడలుతో) మహారాజా! మహారాజా!

ఏకో : ఆc! క్షమించాను. ఖాక్! అలా కాదు. ఆయనను పట్టి, బికారిని చేసి, మన తంజావూరుసీమ దాటించి, తిరుచినాపల్లె పొలిమేరకు తరిమివేయండి. తిరుచినాపల్లెవారికి, తంజావూరువారికీ, తీరని పగలు తెచ్చిపెట్టి, వెంకన్నగారు, ఆ రెండు రాజ్యాలవారిని నేటివరకు నిద్రపోనీయకుండా చేసినాడు. ఆయన అతి తెలివికి, అత్యాశకు, కుట్రలకు, మాయలకు, తగిన ప్రతిఫలమును, తిరుచినాపల్లెవారే కలిగించుతారు.

వెంక : (అడలుతో వడకిపోతూ) మహారాజా! మహారాజా!

ఏకో : ఇంక నీ ముఖం నాకు కనపడరాదు. నీ మాట నాకు వినపడరాదు. పేష్వాయ్! ఖాక్! ఆc! పట్టి బంధించండి.

ఖాను, పేష్వ : (వెంకన్నగారిని పట్టి బంధించి, తీసికొనిపోతారు.)

ఏకో : (సింహాసనమునుంచి లేస్తాడు.)

కొలువు వారందఱు : శ్రీఏకోజీ మహారాజులుంగారికి జయము గాక! మహారాష్ట్ర సామ్రాజ్యము వర్ధిల్లును గాక!

ఏకో : (కొలువు విడిచి, సౌధంలోకి వెళ్ళిపోతాడు.)

కొలువు వారందఱు : (తమ తమ స్థానాలకు వెళ్ళిపోతారు.)

(తెర)

---

# కొండవాగు 

శ్రీ మూరcపూడి భాస్కరరావు

కొండవాగు కొన్నాళ్లై పుడోనా
గుండెలోన గలగల మందీ!
'నిండి వెండి చుక్కల గమితో నీ
రెండలోన తళ తళ మందీ!

మొగ్గ కడుపులో తేనెలూరు లే
ప్రొద్దువోలె మన బ్రతుకులలో
ఇరువదేండ్ల నూనూగు జవ్వనము
పరువ మొసగు తీయని కాలం!

సన్న సన్నపాటల మధు ధారలు
జాలువారు ఆ గడియలలో
కొండవాగు కవిగీతికలా నా
గుండెలోన గలగల మందీ!
నిండి వెండి చుక్కల గమితో నీ
రెండలోన తళ తళ మందీ!

కాని నేటి వేసగి యెడారిలో—
నిలుపలేక, వెనుకడలి నీరముల
కలియలేక, అర్ధాయుష్కుని వలె—
కొండవాగు జీవన విహీనమై
యెండి ఇసుకపొర దాగినదీ!

---

# 'ఊర్వశి - ప్రవాసము'



శ్రీ పొట్లపల్లి సీతారామారావు

పాశ్చాత్య వాఙ్మయమున కావ్యములు కథా ప్రధానములు. మన కావ్యములకు రసము ప్రధానము. *Unity of Action - Unity of Time - Unity of Place* - వీనికున్నంత స్థానము *Sentiment* నకు వారిలో లేదు. అందుచే *Romanticism* అనునది వచ్చి *Sentiment* ను కొంతవఱకు సాధించినది. షెల్లీ, వర్డ్స్వర్త్ మొదలైనవారందఱు నా మార్గమున నారితేరినవారు. మన వాఙ్మయము పుట్టుకతోడనే రసప్రధానముగా నున్నది. అందుచేత *Sentiment* కొఱత దీనికి లేదు. ఒకే రామాయణకథను పలువురు కావ్యములుగా మలచుకొనుట కిదియే హేతువు. ఆ కథలో రసమును పోషించుటకున్నంత యాస్కారము వేఱొక కథలో లేదు. అట్లుగాక కథాప్రధానముగా మన వాఙ్మయము పుట్టియున్నచో నందఱు నన్ని రామాయణములు వ్రాయువారే కాదు.

5, 6 దశాబ్దులనుండి పాశ్చాత్య సంస్కృతి మన దేశమును ముంచివైచినది. దానివలన మనకు లాభములు జరిగినవి. కాని నష్టము లెక్కువగా జరిగినవి. అది మన భాషకు పుష్టినిచ్చిన దానికంటె సహజత్వమును నాశనముజేసిన భాగ మెక్కువ. 'తద్భాషా' కోవిదులైన మన దేశీయులు గొప్ప యధికారములు సంపాదించి భాషాసహజత్వము నూచముట్టుగ పెల్లగించిరి. సహజమైన భాషకు మారుగ కృత్రిమమైన భాష బయలుదేరినది. ఆ వాఙ్మయమును చదివిన పెద్దలు దేశీయకవిత్వమును సంస్కరింపవలె నను కొనిరి. ఆ ప్రభావము తెలుగుదేశముమీద కూడ సోకినది. షెల్లీ, కీట్సు, వర్డ్స్వర్తుల ప్రభావము లన్నియు మన భాషలో ప్రతిబింబింపసాగినవి. ఇటాలియన్ కవి 'శాఫో' మధురములైన భావములు గూర్చి నేర్పరి. ఆ కవిచేత *Inspire* అయిన కవు లిద్ద ఱున్నారు. ఒకాయన బసవరాజు అప్పారావు, రెండవయాయన దేవులపల్లి కృష్ణశాస్త్రి. ఈ రెండవ యాయన ప్రస్తుతము పలువురలో ప్రతిష్ఠగల్గిన కవి. పలువురకు మార్గదర్శియైన కవి. కొందఱకు మహాకవి. ఈయన వ్రాసిన ఖండకావ్యములు — ఊర్వశి — ప్రవాసము — అనునవి విమర్శనీయములు.

కాళిదాసుని విక్రమోర్వశీయ నాటకములోని చతుర్థాంకము కవికి ఛాయామాత్రముగనైన నీ కావ్యములు వ్రాయునపుడు మనసులో నున్నది. అక్కడ యూర్వశి శాపవశమున చేత లతయైనది. ఆ లతి విక్రముని స్పర్శచేత మరల యూర్వశిగా మారును. అందుచే కవి వనము, కోకిలలు మొదలైన ప్రకృతిజాలముచే లతారూపమున నున్న యూర్వశి కనుగుణముగ నుద్దీపింపజేసినాడు. ఇక్కడ అంత ప్రయోజనముకొఱకు వాడకపోయినను లోకసామాన్యమయిన చమత్కార మున్నది. ఊర్వశి—ప్రవాసములలోని యితివృత్తమంతయు నాయకుడు నాయికకొఱకు పడు విరహమయమే. అలంకారశాస్త్రము లన్నియు నీ పద్ధతులే ననుసరించినవి. శృంగార రసమున కివి ప్రాణములని చెప్పవచ్చును. ఈ కావ్యములందలి భావము లన్నియు మాధుర్యగుణముచే కావ్యమున ద్యోతమానములగుచున్నవి. శృంగార భావముల నీ మాధుర్య గుణమే వ్యక్తముజేయగలదు. భావముకంటె గుణమే యిందు ప్రస్ఫుటమగుచుండును.

> "నింగినీడల మెట్లుగా, నీలిమొయిలు
> జిలుగు విరుపులుగా, పులుగులుగ, నలరు
> లుగ, నలలుగా, కలలుగాగ, సొగయబోని"

ఇందు భావముకంటె పదముల విరుపులే రమణీయములు. ఇదంతయు మాధుర్యగుణములోని మాహాత్మ్యము. కృష్ణశాస్త్రి కవిత్వమంతయు మాధుర్యగుణమయమై హాయిహాయి అనుపించును. భాషలో నున్న కృతకత్వమును పొక్కిరానీయని యీ గుణ మీ కవిత్వమునకు ప్రాణమగుచున్నది. ఈ కవి కవితాశక్తి కలవాడని నిరూపించుట కీ గుణము చాలును. కవితాశక్తిగల కవులందఱకు పద్యము నడక సొగసులే ప్రధానములు. ఇట్టి గుణప్రధానమయిన రచనను కొంద ఱాలంకారికు లీసడించిరి. క్షేమేంద్రుడు—

> "అలంకారస్త్వలంకారా గుణా ఏవ గుణాః సదా
> ఔచిత్యమ్ రససిద్ధస్య స్థిరం కావ్యస్యజీవితమ్."

అన్నాడు. అందఱు రసమార్గము నొప్పుకొన్నవారే. ఔచిత్యమనిన, రసమనిన, ధ్వనియనిన నొక్కటియని నిష్కర్ష.

ఈ కవి కొన్ని మధురమైన కల్పనలు చేయును.

ఆ కల్పన సంప్రదాయసిద్ధము, సుప్రసిద్ధ సాంకేతి తము గాకున్నను మధురమనియే చెప్పవలెను.

"కార్మొయిలు పెదవుల ఖండఖండములుగ
జిదికిపోయిన కౌముదీ మృదులకళిక"

ఈ భావచ్ఛాయను పూర్వకవు లెవ్వరూ వాడలేదు. ఇది ఆంగ్లమును చదువుకొని జీర్ణించుకొనిన కవి ప్రతిభాసంభవమే. ఇట్టి మాధుర్యమును వ్యక్తము జేయు కల్పన లనేకము లున్నవి.

చెలియ కురులు నీలమేఘనిశ్వాసముల ట్లున్న వట. ఈ యుపమలోని పలుకుబడి ప్రతిభ గలవారి యందే గోచరించును. ఇట్టి పలుకుబడులు భావము నకు పరమ వ్యంజకములుగ నుండును. లోకములో జమత్కారము—ఉక్తివైచిత్ర్యము నాశ్రయించిన పలుకుబడికంటె వ్యంజనాశక్తి నాశ్రయించుకొని తొణికిన పలుకుబడి గొప్పది. ఈ పలుకుబడి ఈ కవికి కుదురుట ఆశ్చర్యముగ నున్నది.

"చల్లగా జాలిజాలిగా శాంతమధురముగ సుమః కాలకౌముది సొగసుదైతివి" "నీపశాఖికాగ్ర కుటిల పత్రములలో నిరుల గుసగుసల్ వినిపించును" ఇవి మధురాతి మధురములు. "నాటి యమవస కన్నీటి పాట నేనె యేడ్చినది" "గృహ నేత్ర వాతాయనములు" ఇట్టి తీయని కల్పనలు కొన్ని యీయన కవిత్వములో ప్రాణమున కంటుకొనియున్నవి. మహాకవి రసము నంగిగా నిక్షేపించి దానిని సునిశితముగా పరామర్శించుచు నిట్టి మధురములైన కల్పనలు గల పలుకుబడులచే కావ్యము నాకాశమున కెత్తును. ఈ కవి దీనియందు జూపిన శ్రద్ధ, దానియందు జూప లేదు.

"మొగిలు లల్లతల్లనసై భరంబులైన నిట్టూర్పు దొంతరలయినవి" "బ్రతుకొక్కటి యేడుపైన గాలి... సుప్తపత్రాళి నొదిగి పొంచిచూచుచు చలియించి పోయినాడు" ఇట్టి చిత్రనిర్మాణశక్తి యంతంత మాత్రమైన కవిలో నుండవు. ఈ కవికవిత్వమే యింతకు మించి లేదు. శబ్దాలంకారములు, శ్లేషలు కవి వాడిన ట్లగుపించదు. కొన్ని అంత్యానుప్రాసలు వాడినాడేమో కాని యంతకంటె నెక్కువ బిగింపులు లేవు. శ్లేష చమత్కార మొకచో కనుపించుచున్నది. "నా అమృతగళరవంబున కపుడె పక్షులు చెలియ" గళరవ మనగా పావురాయి. ఇక్కడ తన స్వరమును పావురాయితో గలిపి శ్లేషించినాడు. ఆ శ్లేష కూడ మెత్తగా నున్నది.

మనభాషలోని యలంకారము లన్నియు పలుకుబడులే. భావము నొక్కొక్క పద్ధతిలో జెప్పుట కొక్కొక్క యలంకారము పుట్టినది. మరల నా యలంకారము నొక ప్రయోజనముకొఱకే వాడుట మన సంప్రదాయము. భావమునో—రసమునో—కనీస మే వస్తువునో యుద్దీపింపజేయని యలంకారమే మన కవులు వాడలేదు. రావణుడు రంభను చూచుటతోడనే ఇట్లు భావించినాడు.

"మించి దృష్టికి మిఱుమిట్లు గొల్పెడి నిది
తెలియ గారు మెఱుంగు తీగయేమొ
కార్మొఱుంగున కిట్టి కళకలదే యిది
సొగసైన వెన్నెల సోగయేమొ
వెన్నెలసోగకీ చిన్నెలున్నవె ? యిది
మరునిరాచిల్క సాంబ్రాణియేమొ
చిలుక సాంబ్రాణికీ చెలువంపు నడలుండు
నా ? యిది కలికిరాయంచ యేమొ
కలికి రాయంచ కీ సోయగంబు కలదె
యెమ్మె గలదిది జాళువాబొమ్మయేమొ
జాళువాబొమ్మ కీ విలాసములు గలవె
మెచ్చనగు నచ్చరవెలంది మిన్నయేమొ."

ఇందులోగల సందేహాలంకారము వస్తువు నెంతైన దీప్తిలోనికి దెచ్చుచున్నది. ఇది కంకంటి పాపరాజు గారి ఉత్తర రామాయణము లోనిది. ఆంగ్లభాషలో *Similie, Metaphor* ల వంటివే కొన్ని మాత్రమో పలుకుబడులున్నవి. అందులో వారి నవీన కవులందఱు *Metaphorc Expressions* యెక్కువగా వాడుదురు. అది వారు సామాన్యముగ వాడు *Expression.* అసలు ప్రతిభయుండవలెగాని మన భాషలో *Expression* చేయుట కనేక మార్గము లున్నవి. పై పద్యములో మైదీగెయనిగాని తీగెవంటి శరీరమనిగాని రావణునిచే కవి యనుపించినచో నింత రమ్యముగా నుండదు. ఇందు రావణుని వాంఛాన వధికత్వము స్ఫురించినంతగా మైదీవెయన్నచో స్ఫురింపదు. అందుచే పాత్ర—రసము—మానసిక పరవర్తన మొదలైనవాని నాశ్రయించుకొని యలంకారము మారుచుండును. *Sentiment* ను *Raise* చేయుటకై భాషలో *Metaphor* వారికి యొరవడియైనది. దానిని తీసికొని కృష్ణశాస్త్రి తన కావ్యమంతయు గ్రుక్క త్రిప్పికొనకుండ గ్రుక్కినాడు. ఆ రూపకము కృత్రిమముగా నుండును. దానివలననే చమత్కారము జరుగదు. ఎక్కడికక్కడ ఏదో *Image* ఏర్పడుట కుపయోగించును. భావము నుద్దీప్తికి దీసికొని రాకపోగా దానిలోని యచ్ఛత్వమును జెడగొట్టును.

*Mysticism* అను కవిత్వపుఛాయ ఈకవి మనస్సులో నున్నది. అది యీ రూపకమునకు దోహద మిచ్చినది. ఆ కవు లందఱు రూపకములో రూపక

ములు జొనిపి తమ కావ్యములు దీర్చికొనిరి. ఆ పద్ధతిగా తన కావ్యము నిర్మించవలెనని ఈ కవి యూహ. అందుచే కవిత్వమంతయు నర్థముకాదు. అన్వయ క్లిష్టత యనేక సందర్భములలో గోచరించుచుండును. ప్రవాసములోని ఈ క్రింది పాదములు జూడుడు—

"అంతమే లేని నా యాత్రాపథాన నా
పదచిహ్నములు వోలె పడియున్న వెన్నెన్నొ
అడుగుజాడలు మదీయార్ద్రి హృదయమ్ములో
నిశికడుపులో తారలై నిశ్శబ్ద
వాటిలో చిరుపాటలై!"

సాగిపోవుభావన ఈ రూపకములతో నెంత క్లిష్టమగుచున్నది? "గర్భకుహరమ్ము విదళించు కారుచిచ్చు ఉరుపుమంట మూలుంగు—" ఈ రూపక మే ప్రయోజనముకొఱకు వాడబడినది? ఎఱుపుమంట మూల్గినదన్న పదములోని ప్రతిబింబమే కాని గర్భకుహరమును విదళించు కార్చిచ్చుయొక్క భయంకరత్వమున కెంతవఱకు దోహదము జేసినది?

"ఏ నొక వియోగశాలినీ హృదయరాగ
వేదనారేఖ, నాకలి వేసు, నామె
యంగుళీకిసలయ చంచలాంచలముల
విడివడి యనంత విశ్వాన బడితినాడు."

తన్ను వియోగగీతికగా రూపించుకొన్న కొంతవఱకు నయమే. అంగుళీకిసలయము లాకలితో వేగుతున్నవని వేఱొకరూపకము జేసినాడు. దీని వలన పద్య మిక్కిరి బిక్కిరిగా గిజిబిజిగా జేలి పోవుచున్నది. ఈయన కవిత్వము చదువుచున్నంత వఱకు నెక్కడి కక్కడికి చిత్రము లేర్పడును. కాని యసలు భావమేమో యర్థముకాదు. పూర్వకవులలో భావమచ్ఛముగా సాగిపోయెడిది. వా రెంతవఱకు భావమును సాగదీయుచు చమత్కారములు సేయుదురు కాని భావమునాపి పట్టెపదములతో సాము చేయరు.

ఈ గ్రంథములో ప్రతీక లేకపోవుటచే మరింత బాధకరముగ నున్నది. విడివిడి భావములు చెప్పిన పుడు ముందు ప్రతీకలు వ్రాయుట మన కవుల యాచారము. గ్రంథమంత జదివిన తరువాత నేదో చచ్చి చెడిచేయంగల విన్నపములుగా నొక భావము నూహించుకొనుటయే గాని యెక్కడికక్కడ వివిక్తముగా భావము తెలియదు. ఆ చిక్కు ఊర్వశికంటె ప్రవాసములో నెక్కువ.

"ఏను తొలుతనే గూడేనిలేని పులుగు
రాయడ, వహించినాడ నా బ్రతుకుబాట
నాట నవయని రెక్క యుయ్యాలకొనల
తెరువె లేని, తీరమె లేని దివ్యసీమ!
అంత నే మారిపోతి సంధ్యామనోజ్ఞ
చిత్ర సింధూరరేఖగా; చేయిజేయిగ
మెయిమెయిగ, హాయిహాయిగా మెలగినాను
పైడివన్నియతో నీలినీడతోడ!"

ఈ పద్యము హాయిహాయిగ నున్నది. కాని విస్పష్టమయిన భావము జెప్పుట కష్టము.

"కంట గురిసిన కార్చిచ్చుమంట యేళ్ళ
కాలి నుశియై నశించె వాంఛాలవాలె."

ఈ రూపకము లెంత ప్రయోజనరహితములో జూడుడు. అది క్రొత్తదన మనుకొని భ్రమించి యూరకే యలంకారము వాడును. ఆ వ్యామోహము లేనిచో పరమ మధురమైన కవిత్వము ప్రవహించెడిది. ఈ క్రింది పాదములు జూడుడు:

"ఉభయ సంధ్యాంచలముల నెదో వెలుంగు
కలుగ కలవరపోవు ఘూకంబువోలె."

ఘూక ముదయ సంధ్యాకాంతిని జూచి కలవర పోవచ్చును. కాని సాయంసంధ్యాకాంతిని జూచి కలవరపోదు.

ఎంత చూచినను కవి విరహముచే కృశీభూతుడై ప్రకృతిలోని కొన్ని వస్తువులను దీసికొని వాని సామ్యమును తనకు కల్పించుకొని విలపించుటయే ఈ రెండు కావ్యములలోని కథాంశము. ప్రేయసీ విరహిత జీవితము వ్యర్థమనుకొని యీ కవి మూర్ఛ ప్రళయోన్మాదావస్థలు కూడ వర్ణించినాడు.

"నా మరణశయ్య పరచుకొన్నాను నేనె."

"ఇదియె నా చితిపేర్చితి"

వీనికి ప్రాణములు తరుగుకొనిపోవును. తాను భావించిన క్రొత్తదనము జొన్పనంతవఱకు నీ ఘట్టము పరమ రమణీయముగా హృదయస్పందనము జేయును. ఆ కవి బాధలో మనము లీనమైపోదుము. అలంకారములు పొదుగుట మొదలుపెట్టినాడో మనలో గలిగిన యా కొంచెము స్పందనము జారిపోవును. ఈ కవి సహజముగా మధురమైన కవిత్వము వ్రాయగలవాడు. కాని తాను కొన్ని మార్గములు మనసులో నుంచుకొని కొంత కవిత్వమును కృతకము జేసినాడు. ఇవన్నియు ప్రసిద్ధమైన సాంప్రదాయమున జేసినవి కాకపోవచ్చును. అచ్చముగానైనను వ్రాసినాడుకాదు. అట్లు వ్రాసినచో నీ కవి కవిత్వము కొలికి పూసవంటిదైయుండును.

ఇక నీకవి వాడినభాష పరమ కృతకము. అసలు జాతిలక్షణమంతయు భాషలోనుండును. ఆచారములు

సంప్రదాయములు భాషాసముపోషకములు. ఏజాతి భాష జూచినను ఆ భాషలో సంప్రదాయములు లక్షణములు కన్నులకు గట్టినట్లగుపించును. కవి మొదట చూచుకొనవలసినది భాషాపాటవము. భాషా పాటవ మనగా శబ్దప్రపంచము దెలిసికొనుటయే కాదు. ఏ శబ్దముచేత జాతిలక్షణము వ్యక్తమగునో ఆ శబ్దమును బట్టుకొని యాయా భావముల కచ్చుగట్టినట్లు సరిపుచ్చవలెను. ప్రసిద్ధకవులను జదువుట యనగా వారు వాడిన శబ్దముల కర్థము దెలిసికొనుట మాత్రమే కాదు. శబ్దార్థము తెలిసినను నా శబ్దము నుచితమైన చోటు వాడలేము. ఏ భావమును జెప్పుట కే శబ్ద మే విధ శక్త్యంతముగ వాడబడినది యని యూహించి చూచినగాని యా మెలకువలు దెలియవు. శబ్దమున కర్థము దెలిసికొనుటకంటె శక్తిని దెలిసికొనుటకు సహృదయుడు ప్రయత్నించును. కవిత్వమంతయు నా శక్తిమీదనే యున్నది. శబ్దమును ప్రాణములలో కన్నులు పెట్టుకొని పొదుగవలెను. పింగళి సూరన

"పొనగ ముత్తెపుసరుల్ పోహళించినలీల
తమలోన దొరయు శబ్దములు గూర్చి."

అని యుల్లేఖించినాడు. ఎంత జాగ్రత్తగా శబ్దముల నేరి గూర్చవలెనో యిందు సూచితమైనది. ఇందులోనే యొక చమత్కారమున్నది. ముత్యముల హారములు గ్రుచ్చునపుడు నల్లని బట్టపై ముత్యములు పోసి కూర్చుదురు. హారము రాను రాను క్రమక్రమముగ స్తనాదిక భాగమును గప్పు భాగము పైపునకు స్థూలముగా జేలును. ముత్యమునకు ముత్యమునకు గలిగిన యా సూక్ష్మభేదమును గ్రహించి కూర్చవలెను. ఏ ముత్యము తరువాత నే ముత్యమిమచ్ఛేదముతో తులదూగునోయన్న సునిశిత సూక్ష్మపరిశీలనాదక్షత యే కొందఱికో యుండును. ఇట్లు గ్రుచ్చుటకే పోహళించుట యని పేరు. పోహళింపు శబ్దము నీ సందర్భమునందే వాడవలెను. రత్నములు మొదలైన పెద్దపెద్దమణులహారము గ్రుచ్చునపుడు పోహళించుశబ్దమును వాడిన కవికి శబ్దౌచిత్యము తెలియదన్నమాట. కృష్ణశాస్త్రి వాడిన యే శబ్దము శక్తిమంతమైనది కాదు. కొన్నికొన్ని శబ్దములు భావముతో గలియక *Vague* గా నుండును.

"ఇపుడు వత్తువా నీ కొర
కెదురు చూచు నీవియోగి
యెడద మంచుజడులు కురియును
మూపేమో, రేపటకో
పవలి చునునో, నిదుర మునుగునో!"

పదములు భావములో గలియక పొడిపొడిగా విడిపోవుచున్నవి.

భాషాపరంపరలో మూడుపద్ధతులు ముఖ్యముగా కనిపించుచున్నవి. ఆచారములు—సంప్రదాయములు మొదలైనవానిని దీసికొనివచ్చి భాష నుద్దీపింపజేయుట. ఈ మార్గము మహాకవు లందఱిలో నున్నది.

"అయమా గృహీతకమనీయ కంకణ స్తవ మూర్తిమానివ మహోత్సవః కరః"

అన్నాడు భవభూతి. చిత్రపటదర్శనములో సీతావివాహము జ్ఞప్తికి వచ్చి యిట్లు చెప్పినాడు. గాజులతో నింపిన కరమును పట్టుకొనుట వివాహశోభనంతయు వ్యక్తముజేయుచున్నది. అంతో యింతో యీ మార్గము తెలవనిదే మన పూర్వకవిత్వమే లేదు. మహాకవులలో నిది యెక్కువగా కనిపించును. ఇక రెండవది రసమార్గము ఆ చేయి స్పర్శతగిలినది—పులకలు వచ్చినవి యని చెప్పుట. భవభూతి

"తవస్పర్శే స్పర్శే మమహి పరిమూఢేంద్రియగణో
వికారశ్చైతన్యం భ్రమయతి సమున్మీలయతిచ."

అన్నాడు. సీత స్పర్శతగిలిన కొలదిగా రాముని పరిమూఢములైన యింద్రియగణములు వికారము పొందుచున్నవట. ఇక కాళిదాసులో నీ మార్గములు లెక్కలేనన్ని యున్నవి. ఇక మూడవది. ఆమె స్పర్శ తగిలినది—ఆకాశములో నున్నానని చెప్పుట. ఇది *Lyric* మార్గము. హేతువునకు ఫలితమునకు మధ్య నున్న వికార మిందు తెలియదు. ఏ గుణమో—ఏ యలంకారమో—గ్రమ్ముకొని యీ రచన సాగును. కృష్ణశాస్త్రి కవిత్వములో నాత్మప్రాయమైన భాగ మీ మూడవ మార్గము. పై రెండు మార్గములు చాల స్వల్పముగ నున్నవి.

'మఘవ మస్తక మకుట మాణిక్యరాజి' యని యూర్వశిని సంబోధించుటలో కొంచెముగా మొదటి మార్గము గోచరించుచున్నది. ఆ మార్గములు కనిపించినంతమేర ఈ కవిత్వము రమణీయముగనే యున్నది. కాని ఆ మార్గములేని భాగమే యెక్కువ. ఆ మూడవ మార్గము ప్రసిద్ధప్రస్థాన వ్యతిరేకమయినది. దానినీ కవి యవలంబించినాడు. ఈ భావ యనువాదమునకు సులభముగు నేకాని భాషయొక్క చేవను ప్రకటించదు.

ఈయన భావ మొక పరిమితిని చుట్టిపెట్టుకొని తిరుగుచుండును. అది దాటి కొంచెమైనను జరుగదు. హృదయమునుండి వచ్చు బాధ మలగి భాషను పోసికొని బయటకు వచ్చినట్లనుపించదు. కొన్ని మధురములైన శబ్దములు భావమును బలవంతముగా లాగుచున్నట్లు కనిపించును. దీనికి వేఱే యుదాహరణ లవసరము లేదు. ఈయన కవిత్వములో దేనినైన నుదాహరింపవచ్చును. ఏ భావమైనను—ఒక్కటే పోత—ఒక్కటే నిర్వహణ. ఆమె స్వప్నాలు కనును,—

జలదాలు, హస్తాలు,—ఇట్లు ము వర్ణము లోపించిన బహువచనము లనేకము జేయును. ఇవన్నియు మాధుర్యమును పోషించుటకు కవి చేయు ప్రయత్నములు.

కవిత్వములో నాత్మాశ్రయ కవిత్వ మనియు, పరాశ్రయ కవిత్వ మనియు రెండు భేదము లిటీవల వెలసినవి. ఇవి *Subjective Poetry*, *Objective Poetry* అనువానికి ననువాదములు. ఈ విభేదము రసాశ్రయమైన మన కవిత్వములో లేదు. రసమున కంతకు ప్రథమపరిగణనీయములు విభావములు. కావున వీని విషయమై మన పూర్వులు శ్రద్ధవహించిరి. నాయక నాయికాది భేదములు దీనిని దృష్టిలో నుంచికొనియే వెలసినవి. అదిగాక ఆత్మాశ్రయ కవిత్వములో నాయకుడు కవి యగుటచేత తగినంత విభావసృష్టి యేర్పడక రసము స్ఫురింపదు. రసము స్ఫురింపవలెనన్న విభావానుభావాదుల సృష్టియుండవలెను. అందుకే అభినవ గుప్తుడు లోచనములో రసమును గూర్చి "శబ్దసమర్ప్యమాణ హృదయ సంవాద సుందర విభావానుభావ సముదిత ప్రాఙ్నివిష్ట రత్యాది వాసనానురాగ సుకుమార స్వసంవిదానంద చర్వణ వ్యాపార రసనీయ రూపో రసః" అని చెప్పినాడు. ఎక్కడైతే కవి స్వోక్తిచే భావమును వ్యక్తము చేయునో, అక్కడ ధ్వని రసాదు లప్రధానములై పోవును. అందుచే శతకముల స్తోత్రములలో రసములేదు. కేవలము భావము మాత్రమే యుండును. ఈ భయముచేతనే మేఘసందేశములో గూడ కాళిదాసునకు విభావమును గూర్చికొనక తప్పినదికాదు. కృష్ణశాస్త్రి కవిత్వమంతయు నాత్మాశ్రయమైనది. అందుచే రసముండదు. ఏ భావముచేత షెల్లీ మొదలైన కవులు క్రొత్తరచన సాగించిరో ఆ ప్రయత్నములో పరాకాష్ఠ పొందిన రసమార్గము మన కున్నది. కృష్ణశాస్త్రి దీనిని గ్రహించలేదు. తాను క్రొత్తమార్గమనుకొని కొంతవఱకు సాధించినది ఏ సంచారిభావమునో ధ్వనింపజేయుట మాత్రమే. అది రసమార్గములో నంతర్భవించును. అందుచే మనదేశమున కిది క్రొత్తగా లేదు.

ఈ కవిత్వములో స్ఫురణ లెక్కువగా లేవు. సంఘటన నాశ్రయించిన మెత్తదనము తప్ప చమత్కారమేమియు స్ఫురింపదు. ఇది గుణప్రధానమైన కవిత్వము మాత్రమే యని ముందే చెప్పితిని గదా. ఇందు రసమే లేదు. కాని, అక్కడక్కడ కవిభావోద్వేగము మాత్రము కొంతవఱకు స్ఫురించుచున్నది.

"ఊర్వశి ఊర్వశి !! నాతో
ఊహో పర్ణాంచలముల
వెర పెరుగని కనుమూయుము."

ఈ మాటలన్నీ కవిలోని భావోద్వేగమును స్ఫురింపజేయును. అసలు ఊర్వశి ఊర్వశియను పిలుపులోనే కవి తహతహ స్ఫురించును. అలంకారములు వదలిపెట్టి భావములోనికి చూచినచో కవిభావ సువ్యక్తముగా కనిపించును. ఈ కవిలో నచ్చమైన కవిత్వము గావలెనన్న అలంకారము లన్నియు లేవనుకొని చూడవలెను. అప్పు డీయన యెంత భావుకుడో యూహించగలము. ఆ దృష్టితోనే కవిత్వమున కుపక్రమించిన ఈయన కవిత్వము సృష్టిలో పట్టకుండెడిది. ఎందుకో యీ కవి యితరమైనదానికి వ్యామోహము పొందినాడు.

ఈ యూహలు పరిశీలించుడు. "సడిలేని నడిరేయి పడిపోయినట్టి నీ కడియాల రవళులే చిరుగాజు మ్రోతలే వ్రేలెత్తి చూపు జీవితపథమ్ములు నాకు" ఇట్లు ఊహలను సహజముగా సాగిపోనిచ్చినచో ప్రాణము హాయిగా నుండును. ఈ కావ్యములోని ఊర్వశిని స్వర్గములోని యూర్వశినిగానే కల్పనలతో చమత్కరించిన రమ్యముగా నుండెడిది. ఈ కవి అట్లుగాక కొన్నిచోట్ల ఊర్వశిని మానవ సామాన్యగా వర్ణించును. అందుచే నా భాగమంతయు హృదయము నంతగా స్పృశించదు. స్వర్గములోని యూర్వశిని భావించినపుడు మాత్రమే హృదయస్పందనము జరుగును. అది సంప్రదాయము తెలిసిన రచన.

"మఘవ మస్తక మకుట మాణిక్యరాజ్ఞీ ! నీ
వెలుగు చూపాకరేయి వికసించి వాసించి
మిలమిలా తళతళా మెఱసినది కురిసినది
పాతాళ భువనాంత పరిసర తమస్సులకు"

ఈ యూహ రమ్యముగాదని సాహసించువారెవరుందురు.

"ఓరగా నోరగా నొరుగు నింద్రుని శిరసు
విడిపోయి దిగిపోయి పడినావు నా మ్రోల"

ఇంద్రుని శిరసు ఓరగా వంగినపు డీమె జారి పడినదట.

"వైకుంఠ మృదుకంఠ నై జయంతీమాల
తెగనేమొ దిగజారు జగములన్నీ దాటి !
సురభి సౌదామనిగ తరళ మధుధారగా
ఈశ్వరాలోకమే యిటు నెడలెనో నేడు !"

ఇటువంటి కవిత్వమే ఈ కవి యెందుకు వ్రాయడో అర్థముగాదు. ఇందులోగల కల్పనలు పరమమధురమైనవి. ఆ మాధుర్యమును సంప్రదాయము నాశ్రయించి భాసించినది. ఈ కవి మంచి యూహాశాలి. ఏ చిన్నివిషయమునైన నూహించి మధురముగా గల్పించును.

"నునుమబ్బు లేదున్క కొనలపై సోన లా
నెలవంక చిఱునవ్వు చలువపోట,"

తొలి ప్రొద్దుపొడుపురేకుల పైడిదారుల
 ఏఱులో మంచు కన్నీరుపాట,
పావురా యుయ్యాల పక్షుల యంచుల
 జాలులో గాలి నీలాలపాట.
విరజాజి కన్నె నిద్దుర కన్ను తెప్పల
 కాల్వలో నెత్తావి కలలపాట,
కలిసి నీ గొంతు త్రోవల సెలలుకట్టి
అలల సుప్పొంగి నా హృదయాంచలముల
దాటి దాహాన చీటలువారి యెండు
ఈ బ్రదుకునిండ నిండిపోయినవి చెలియ!"

ఇట్లూహించుట సులభమైన పనిగాదు, మనస్సు ఎంత ఆర్ద్రమైనదైన నట్లూహించ గలుగును! ఎంత శబ్దశక్తికైనను సొగసునంతయు సంపూర్తిగా జెప్ప సామర్థ్యముండదు. ఎప్పుడు గొంత సొగసు మనస్సుచే నాస్వాదించవలసినదే. ఈ పద్య మట్లాస్వాదింపదగినది.

అందరి కున్నట్లే యీ కవికి శబ్ద దోషము లున్నవి. వానిని పురస్కరించుకొని కవిని అసమర్థుడనుట కొందరు విమర్శకుల కాచారము. దోషములలో ప్రతిభాదోషమే పెద్దది. మిగిలిన వన్నియు పరిగణింపదగినవి కావు. అట్లని గాలిలో దీపముపెట్టి వాయువారిని ప్రతివారిని శ్లాఘించుమని నా యభిప్రాయము గాదు. విమర్శకుడు ప్రతిభాదోషము బయటపెట్టిన జాలును. మిగిలిన వెవరైనను రూపింప గలుగుదురు. అయినను విమర్శనా సౌష్ఠవము కొఱకు కొన్ని శబ్దదోషము లుల్లేఖింతును.

"అంతలో నా హృదయమందు సంజియ కావి"

"సంజియ" శబ్దమునకు సంధ్యారాగ మను నర్థము రాదు. "సంజ" యనవలెను. 'సంజె' యను రూపమున్నచో గాని 'సంజియ' యను రూప మగుట కాస్కారము లేదు.

"కారుమాపు చొఱఁగ చీలి
కాలి కుములు ఈ చీకటితో"

'కారు' శబ్దమున కగ్ని యను నర్థ మెట్లు పొసగును?

"ఊహాపర్ణాంచలముల—" కాదు. ఊహపర్ణాంచలము లనవలెను.

"పాషాణ జడభరమ్మగ నెనా"
జడభరత్వ మనవలెను.

"కంఠరవము స్థాణువయ్యెనో" ఇందు ధర్మమునకు పదార్థమునకు సామ్యము.

"తారలే కనువిచ్చి తెమ్మలే శ్రుతి విచ్చి"

కను విచ్చుట సరే. శ్రుతి విచ్చుట యేమిటి? ఇది యపూర్వము.

"నీ హృదంతికములో—" హృదంతికమున అనుట సంప్రదాయము.

"నిరుపమానాఖాతరత్నాకరము" అఖాత మనగా త్రవ్వబడని దని యర్థము. ఇక్కడ అఖాత రత్నాకరములు రెండును సముద్ర పర్యాయవాచకములే. అఖాతమనగా కవి యూహాలో లోతైన దనియేమో. అయినచో 'నగాధ' యని యుండవలయును.

"ఈ యశ్రు ఝురులతో, ఇరులతో, రొదలతో,
సొదలతో, ఈ హాసమృదుల వాసనలతో,
విసముతో, నిస్గతో, కొసరు తేనియలతో,—"

దీని భావమేమి తిరుమలేశ! పదములు మాత్ర మున్నవి. వాని కర్థములు గూర్చుకొను సామర్థ్యము లేదు. నవ్వునకు సువాసనాది ధర్మములున్నవా?

ఆంగ్లభాషలోని నుడికారమీ కవిలోనెంతేని ఉన్నది. మన కర్థముకాని భాగమంతయు నా పలుకుబడిచే నాచ్ఛాదితమైనదే. ఇక ఛందస్సులో గూడ చెప్పికోదగినంత చమత్కారము గనుపించదు. ఈయన కవితా పద్ధతికి గీతపద్యమే తగదు. గీత పద్యమెంతవరకు హృదయములోని బాధను పొక్కినట్లు పైకి వ్యక్తము చేయుటకే పనికివచ్చును. మధుర మధురములైన కల్పనా చిత్రముల నది తనలో నొదిగించుకొన లేదు. భావమునకు భాషకు నెట్లు సంబంధములేదో యట్లే ఛందస్సునకు భావమునకు బొత్తు కుదురుట లేదు. ఈ యన శబ్దములన్నియు వృత్తములలో నున్నచో గొంతవరకు సర్దుకొనిపోయి యుండెడిది. వృత్తములు, గేయములు—వీనిలో నీయన శబ్దము మెఱసినట్లుగా గీతపద్యములో మెఱయదు. 'ప్రవాసము'లో నొక చోట మాత్రము ఛందస్సు చమత్కారముగా కుదిరినది. లోక సామాన్యమైన మనః ప్రకృతిని ఛందస్సుగా విరిచినాడు. లోకములో విచారము వచ్చినపుడు తలచి కొని తలచికొని దుఃఖించి, చిట్టచివరకు దుఃఖ ముత్కటము కాగా డగ్గుత్తికపడుట సహజము. ఆ పద్ధతిగా నీయన చేసినాడు.

"ప్రేయసీ ప్రేయసీ ఓ యమావాస్యాత
మస్వినీ! గగన సీమంతినీ! నా సఖీ!
నీ దీర్ఘ ధమ్మిల్ల నీలవల్లీచ్ఛాయ
పొడిచికొని నిదుర చెఱవిడిచి పూవులు నేడు
మఱుగు హృదయాల నాకొఱకు తళతళ పాడు;
... ... ... ... ...
... ... ... ... ..."

నా సఖీ నా సఖీ! నేనెపగా లేను
ఓ నితాంత వియోగినీ ఓ నిశీథి
నీ కఠోర ప్రణయశాలినీ! క్షమింపు!
చాలు, నాసఖీ! నీ ప్రేమ శాప, మీయ
పూర్వనారక యాతనాఖర్వతాపము!"

పైనంతయు గేయముగ జెప్పి చెప్పి హఠాత్తుగా గీతిక నందుకొన్నాడు. దీనివలన పైని సూచించిన స్థితి వ్యక్తమగును. ఇది యొక చమత్కారమని యొప్పికొని తీరవలసినదే.

క్రొత్తదనము కవిప్రతిభనుబట్టి యేర్పడును. ఆ యితర భాషలలోని సిద్ధాంతములు తీసికొనివచ్చి మనదానికి జత గల్పినంతమాత్రమున రాదు. అది క్రొత్తదనమను భ్రమ మాత్రము మొదట గలుగును. కాని అది యెక్కువకాలము నిలువదు. ప్రతిభానంత్యము వలన కవి వాణికి నవక మేర్పడునని ధ్వన్యాలోక కారుడు చెప్పియేయున్నాడు.

లోకములో క్రొత్తమార్గము వెలువడినచో దాని నొరవడిగా బెట్టుకొను కవు లుందురు. ప్రతి కవికి అనుకరణ సహజము. వా రనుకరించిన కవులు సర్వశిల్పనిర్మాణచణు లైనచో నందులో కొంతివరకైన వీరు నెగ్గి కవు లగుదురు. నన్నయ తిక్కనలదారులలో నడచి, వారి నొరవడిగా బెట్టుకొని పేరుపొందిన కవు లనేకు లున్నారు. కొందఱు వారి వారి ప్రతిభానంత్యముల వలన వారి ననుకరించి నవకమును సంపాదించుకొన్నారు. శ్రీనాథుడు, సోమన, పెద్దన—వీరందఱు నిట్టి వారే. అనుకరణ ఎప్పుడును తప్పదు. ఎవరినో యొకరి నొరవడి పెట్టుకొననిదే రచనయే సాగదు. సహజ కవుల విషయము చెప్పలేముగాని యెక్కువ మంది కవు లితరులను జదివి భావోద్వేగము నందియే వ్రాసిరి. అయితే ఆ యనుకార్యమైన కావ్యము లోకోత్తరమైనదై యుండవలెను.

కృష్ణశాస్త్రి కావ్యమును పలువు రనుకరించినారు. వా రందఱకు కృష్ణశాస్త్రిలోని మంచిగుణములు పట్టుబడకపోయినను మిగిలినవి పట్టుబడినవి. ఆ వాతావరణము రెండుమూడు దశాబ్దులు తెలుగుదేశమును ముంచివైచినది. ఏ కావ్యమున జూచినను రోదన ధ్వనించిపోయినది. అవన్నియు సంవత్సరము తిరుగకపూర్వమే నశించినవి. కొంతవరకైన నిలువ ద్రొక్కుకొనగలిగినది కృష్ణశాస్త్రి రచనయే. మాధుర్యగుణము, కొన్ని కల్పనలు—ఈ కావ్యమును నిల్పినవి.

ఊర్వశికావ్యము చివర కవి శివునిగురించి వ్రాసినాడు. అది పరము రమణీయముగ నున్నది.

"అవధరింతువు ప్రతి దివసాంతమందు
నిత్యనూతన తాండవ నృత్యకేళి
ఓయి నటరాజ! తలనైన నూపలేక
భువనములు దుర్భరానందమున నడంగ."

ఈ పద్యములో నన్వయ క్లిష్టతయే లేదు. భావము చరచర సాగిపోయినది. ఈ శ్రేణిలో వ్రాసినవి మరికొన్ని గలవు. కవి భక్తిభావనలో తన్మయత్వమును పొంది వ్రాసినాడేమో యనిపించును. ఇంకొక విషయముతో నీ వ్యాసమును ముగింతును. ఆధునిక కవిత్వమును గూర్చి క్రొత్త క్రొత్త విమర్శనలు బయలుదేరినవి. ఆ విమర్శలకు తలయు తోకయు నుండదు. పూర్వకవు లందరు కచకుచాది వర్ణనలు చేసిరి. ఆ వర్ణన లసహ్యము లగుటచే నవీనులు దానిని విరమించి క్రొత్తమార్గము ద్రొక్కిరట. అందుచే ఆధునిక కవిత్వములో నాయికాపోషణ యుదాత్తమైనదట. ఇది వారి వాదము. ఈ వాదమున కర్థము లేదు.

పూర్వకావ్యములలో వర్ణనలకు మూల మేమి? ఇది ప్రధానముగా చర్చింపవలసిన విషయము. పూర్వకవులలో వర్ణన కవిసమయము కాకపోయినను కవిసమయమువంటిది. కేవలము నాయికా నాయకుల మూర్తులు గట్టుటకు మాత్రమే పూర్వకవులు వర్ణనలు పెట్టలేదు. ఆమె ముఖము గుండ్రముగా నున్నది. శరీరము మెత్తగా నున్నది—అన్నచో మూర్తి గట్టినట్లుగా ముఖము పద్మమువలె నున్నది. శరీరము తీగెవలె నున్నది యనుటతో మూర్తిగట్టదు. ఈ యుపమానము లన్నియు నామెలో నొక విశిష్ట లక్షణమును వ్యంగ్యము చేయును. కామశాస్త్రములో చెప్పబడిన పద్మినీజాతిలక్షణ మిందు వ్యంగ్యమగును. కావ్యములో నాయకుడు ధీరోదాత్తుడుగా నుండవలెను. అందుచే అవికత్థనాదులు నాయకునికి చెప్పవలెను. అట్లే నాయికకు పద్మినీజాతిత్వ లక్షణ మారోపించవలయును. ఈ శాస్త్రసిద్ధాంతముల నుపస్కరించుకొని వర్ణనలు పుట్టినవి. ముఖము తామరపూవువలె నున్నదని కవి వర్ణించినచో కామశాస్త్రములో ప్రోక్తమైన పద్మినీజాతి స్త్రీ లక్షణము కవిచే చెప్పబడుచున్నదన్నమాట. ప్రసిద్ధములైన కావ్యప్రబంధములలోని స్త్రీ వర్ణనలన్నియు నీ ప్రయోజనముకొఱకే పుట్టినవి. అప్రసిద్ధులు పిచ్చిగా అప్రసక్తముగా, కామప్రేరితముగా వర్ణించిన వర్ణించవచ్చును. వారప్రసిద్ధులు గనుకనే అట్లు చేసిరి. అంతే కాని, పూర్వకావ్యములలోని స్త్రీవర్ణన మూర్తిగట్టుటయే ప్రధానముగా వ్రాయబడినది కాదు. కాళిదాసు మేఘసందేశములో—

"తన్వీశ్యామా శిఖరిదశనా పక్వబింబాధరోష్ఠీ
మధ్యేక్షామా చకిత హరిణీ ప్రేక్షణానిమ్ననాభిః,
శ్రోణీభారా దలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యాతత్రస్యా ద్యువతివిషయేసృష్టిరాద్యేవధాతుః"

అని చెప్పినాడు. ఈ శ్లోకములో మూర్తి యేర్పడిన నేర్పడవచ్చును. కాని, అంతకంటె ప్రధానముగా పద్మినీజాతి లక్షణమే ఆ స్త్రీయందు ధ్వనించుచున్నది. మన కావ్యములన్నియు శాస్త్ర దృష్ట్యా ఏర్పడినవి. ఈ మార్గమే జుగుప్సావహ మన్నచో కాళిదాసాదులే మన యాధునిక కవులతో సరిపోలక పోయిరనవలెను. ధీరోదాత్తాది గుణములు నాయకునియందును, పద్మినీజాతి లక్షణము నాయికయందును ధ్వనించకపోయినచో శృంగార రసమునకు నుదాత్తత యుండదు. వర్ణన లిందుకొరకు పుట్టినవి. కృష్ణశాస్త్రి మొదలైన యాధునిక కవులు క్రొత్తదన మనుభావము చెప్పిన ప్రజలకు స్ఫురింపజేయుట కట్లు మార్చిరి గాని, పూర్వవర్ణనలలో ననౌచిత్య ముండుటవలన గాదు. పూర్వకవుల వర్ణనలు బాహిరములైన యవయవ వర్ణనములు గాన, యువకులైన పాఠకులను రెచ్చగొట్టునని కొందరందురు. వీరికి కావ్యానంద మలౌకికమని తెలియదు. విగళిత వేద్యాంతరమైన యానందము గదా రసమనని యాలంకారికులు నుడివిరి. కావ్యము చదువుచున్నంతసేపు పాఠకునికి లౌకికభావనయే యుండదు. అతడు సద్యః పరనిర్వృతిని బొందును. ఈ వర్ణనలు పాఠకుని రెచ్చగొట్టునను వాదంపరికి నీ సిద్ధాంతములు తెలియవు. అది వారి దురదృష్టమను కొనుటకంటె ప్రస్తుతమునకు మన దురదృష్టమను కొనుట మేలు. మన సాహిత్యవిమర్శయంతయు నలంకార శాస్త్రములో నున్నది. వారు వీని నన్నిటిని వివరించియే చెప్పిపోయినారు. కావ్య ప్రయోజనమునుగురించి మమ్మటు డెట్లు చెప్పినాడో చూడుడు :

"కావ్యం యశసే అర్థకృతే వ్యవహారవిదే
శివేతరక్షతయే సద్యః పర నిర్వృతయే
కాంతా సమ్మితయా తయోపదేశ యుజే"

పూర్వకవు లందరు నవకమును సాధించుటకు ప్రయత్నించినవారే. పలువురు సంప్రదాయమును విడువక దానిపైన తమ ప్రతిభాబలముచే నవత్వమును ప్రతిపాదించుకొనిరి. ఆ ప్రతిభచాలని వారి గ్రంథములన్నియు క్షీణించియే పోయినవి. సంప్రదాయమును జీర్ణించుకొని ప్రతిభానంత్యముచే నిలువ ద్రొక్కుకొనగలిగిన కావ్యములే ప్రసిద్ధములైనవి. కావ్యము నవీనతపొందుట అనగా నట్టిది. ఇతర భాషా మార్గములు మన భాషలో ప్రవేశపెట్టుటతో క్రొత్తదనమేమియు నేర్పడదు. అది మీదు మిక్కిలి కృతకముగా గనిపించును. కృష్ణశాస్త్రి కృష్ణపక్షములోని కొన్ని గీతికలు, పల్లకీ మొదలైన కొన్ని గీతిఖండములు చదివి తన్మయత్వమందినవారిలో నేనొకడను. ఈయన మనోహరమైనకవి. మంచి యూహశాలి. అంతకంటె కావ్యమును కీర్తించుట ఈయనకవిత్వమును శంకించుట యని నా యభిప్రాయము.



# శుభ గ్రహం



★

శ్రీ సింగరాజు లింగమూర్తి

సీతాపతి ఇంట్లో అడుగుపెట్టిన వ్యవధానం లేదు. వంటింటిలోంచి రుసరుసలతో, విసవిసలతో భార్య ప్రత్యక్షమైంది. ఒకసారి ఆమె భర్త మొహం లోకి చూసి, మూతిముడుచుకొని తిరిగి వంటింటిలోకి వెళ్లింది. ఓ క్షణం అలాగే నిలబడిపోయాడు సీతాపతి. తరువాత నెమ్మదిగా గదిలోకివెళ్లి కోటువిప్పి ఒంకికి తగిలించాడు. వంటింటిలోంచి భార్య చెంబులు, గిన్నెలు ఎత్తివేయడం, ఏదో విసుక్కోవడం వినవచ్చింది. కుక్కి మంచంమీద కూలబడ్డాడు, వంటింటికీ గదికీ మధ్యవున్న గోడవంక చూస్తూ-

'సుందరికి కోపం ఎందుకు వచ్చిందో ?... తాను పల్లెత్తుమాట కూడా అనలేదే... ప్రొద్దుట తాను ఆఫీసుకు వెళ్లేముందు కూడా నవ్వుతూనే మెసిలింది... ఇంతలో ఏం ఫుట్టి మునిగిపోయిందని ఈ ధుమధుమలు ?... ఒకవేళ పిల్లలు ఏమైనా విసిగించారేమో ?' అనుకున్నాడు సీతాపతి. కాని ఆ సమాధానం అతణ్ణి అంతగా తృప్తిపరచలేదు. కారణం ఏమైవుంటుందా అని పరిపరివిధాల ఆలోచించసాగాడు. కారణం బోధపడకపోగా పైగా అదొక బెడదగా మారింది అతనికి.

'ఎంత సంపాదించినా గోచిపాతకు సతుకోవడమే... పిల్లల ముద్దూముచ్చట్లు తీర్చడానికి నోచుకోలేదు నా బ్రతుకు' అంటూ వంటింటిలోంచి వినవస్తున్న సుందరమ్మ సణుగుడు అతని హృదయాన్ని గాయపరిచింది.

'నిజమే... ఎంత సంపాదించినా గోచిపాతకే చాలదు' అనుకున్నాడు సీతాపతి. అప్రయత్నంగా అతని దృష్టి ఒంకికి తగిలించిన కోటుమీద పడింది. కోటు మోచేతులకు వేసిన మాసికలు, చేతుల చివరి నుంచి వ్రేలాడుతున్న దారపుపోగులూ, బోసిపోతున్న గుండీలస్థానాలూ సుందరమ్మ అన్న మాటలను వ్యక్తీకరిస్తున్నాయి. రంగు మాసిపోయి వెలతెలపోతూ శిథిలావస్థలోవున్న ఈ కోటు తన గౌరవాన్ని కొంత కాపాడుతున్నదనుకున్నాడు సీతాపతి. చిరిగిన చొక్కాలపైన ఆ కోటును ఎంతో ఘరానాగా వేసుకుంటున్నాడు. క్రమంగా సీతాపతిదృష్టి కోటుమీదినుంచి క్రిందపడివున్న చెప్పుల మీదకు పోయింది. గదిలోకివచ్చి చెప్పులు విడవడంలో ఒకటి బోర్లగిలపడింది. ఒక తెగినవారు తొంగిచూస్తున్నది. అక్కడక్కడా మిగిలివున్న అట్టముక్కలకు మట్టి, పేడ అతుక్కుపోయి వున్నాయి. 'ఇన్నాళ్లనుంచీ నీ కాళ్లకింద నలిగిపోయాం... మాలో శక్తి నశించింది. ఇహనైనా మాకు ముక్తిలేదా' అంటున్నట్టుగా వుంది ఉంగరాలు తెగిన రెండవ చెప్పు.

'రూపాయి పావలాకుకాని మరమ్మతు చేయనన్నాడు చెప్పులవాడు... ఎక్కడినుంచి తేనూ?' అనుకుంటూ సీతాపతి మంచంమీద నడుం వాల్చబోయాడు. నవారు పుటుక్కున తెగింది. ఇంట్లోని ప్రతివస్తువూ, ప్రతివ్యక్తీ తన అసమర్థతను దుయ్యబట్టుకుంటున్నట్టుగా బాధపడ్డాడు సీతాపతి. 'నిజంగా ఇది తాతలకాలంనాటి నవారు.. ఇంకెన్నాళ్లని బలంగా వుంటుందీ' అనుకున్నాడు. వంటింటిలో సుందరిచేస్తున్న ఆర్భాటం కొంత తగ్గింది. 'అవును..... తగ్గకేంచేస్తుంది..... కల్పించుకొనేవాళ్లు లేకపోతే' అనుకున్నాడతను. ఈ సత్యం, సుందరమ్మ కాపురానికి వచ్చిన మరుసంవత్సరంలోనే గ్రహించాడు సీతాపతి. లేకపోతే సీతాపతి కల్పించుకుంటే ఈపాటికి ఎంత రభసఅయ్యేదో ?

'ఇవ్వాళ కాఫీప్రాప్తి లేదేమో' అనుకుంటూ

సీతాపతి మంచంమీదనుంచి లేచాడు. ఇంతలో, 'రేపు ఫీజు కట్టాలి నాన్నా...లేకపోతే పేరు కొట్టేస్తారు' అంటూ ప్రసాదు గదిలోకి వచ్చాడు. ఏమనాలో తోచక సీతాపతి కొంచెంసేపు బుర్ర తడుముకున్నాడు. తండ్రి వినిపించుకోలేదేమోనని ప్రసాదు మళ్ళీ ఒకసారి పునశ్చరణ చేశాడు. 'సరే...చూద్దాం లేవోయ్' విసుగ్గా అన్నాడు సీతాపతి. ప్రసాదు గదిలోంచి వెళ్ళిపోయాడు. ఇంట్లో నిలవడం సీతాపతికి ఎంతో కష్టమైపోయింది. సుందరి కాఫీ త్వరగా తెచ్చిస్తుందేమో తాగి బైటపడదా మనుకున్నాడు. ఇంతలో చటుక్కున జ్ఞాపకం వచ్చింది. రాత్రి తానే చెప్పాడు, ఖర్చులు ఎక్కువ అవుతున్నాయనే ఉద్దేశంతో 'సాయంత్రంపూట కాఫీలు మానెయ్య'మని ఇహ వేచివుండడం అనవసరమని సీతాపతి ఆ శిథిలావస్థలో వున్న చెప్పులనే తొడుక్కొని ఇంట్లోంచి బైటపడ్డాడు.

బజారులవెంట నడుస్తున్నాడే కానీ సీతాపతి మనస్సంతా భీభత్సంగానే వుంది. ఎడతెరిపిలేకుండా ఏవేవో ఆలోచనలు వస్తున్నాయి, పోతున్నాయి. 'ఎన్నాళ్ళని ఈ బాధామయజీవితం గడపడం?' అని ఎన్నోసార్లు ప్రశ్నించుకున్నాడు. దానికి ఓ స్థాయి అంటూ ఏమీ చిక్కకపోవడంవల్ల ఆలోచనలు ఏ ఏ విషయాలమీద దొర్లినా తిరిగి అదే ప్రశ్న ఎదురౌతున్నది. 'నమస్కారమండీ' అన్న గొంతు విని పక్కకు తిరిగిచూశాడు. ఆ వ్యక్తి అప్పుడే సీతాపతిని దాటిపోయాడు. తన పరాకుకు ఆశ్చర్యపోయాడు సీతాపతి. ఎదురుగుండా వున్న దుకాణం గోడమీద 'అధికాహారోత్పత్తి చేయండి' అనే వాల్ పోస్టర్ మీద అతని దృష్టి పడింది. ఒకసారి నవ్వుకున్నాడు. 'వేల ఖర్చులో వాల్ పోస్టర్లు అచ్చు వేయించి పట్టణాలలో గోడలకు అంటించినంత మాత్రాన అధికాహారోత్పత్తి ఇట్టే అయికూర్చుంటుంది కాబోలు' అనుకున్నాడు. నాలుగురోడ్ల కూడలి వచ్చింది. 'ఎటు పోదామా' అని ఆలోచించాడు. 'అలా గార్డెనుకు వెడితే రేడియో అయినా వినవచ్చుగా' అనుకుంటూ గార్డెను వైపుకు నడకసాగించాడు. దారిలో ప్రభుత్వ కచ్చేరీ ఒకటి కనిపించింది. ఆ ఆవరణలో వరుసాగ్గా దూర దూరంగా నాటబడిన మొక్కలమీద సీతాపతి దృష్టి పడింది. ఆ మొక్కలకు ఏ జంతువువల్లా హాని కలుగకుండా మాత్రం దడులు కట్టివున్నాయి. మొక్కలు ఎండిపోయి ఆకారమాత్రంగా నిలిచి వున్నాయి. 'ఇవేగా మొన్న జరిగిన వనమహోత్సవ సందర్భంలో నాటిన మొక్కలు......ఈ ఉత్సవం పేరుతో వేల కొలది డబ్బు ఖర్చు పెట్టారు...ఇలా ఎన్ని మొక్కలు ఎండిపోతున్నాయో పోషణలేక.........దీని కెవరు బాధ్యులు?...ఇలాంటి పరిస్థితిలో ఉద్యమం ఆశయాలు ఏవిధంగా ఫలిస్తాయో?' అనుకుంటూ నడుస్తున్నాడు సీతాపతి. ఈలోగా గార్డెనులో ప్రవేశించి ఒకమూల పచ్చికబైలుమీద కూర్చున్నాడు. రేడియోలో అధికాహారోత్పత్తిని గూర్చి ప్రసంగం సాగుతున్నది. 'అధికాహారోత్పత్తి అని మొత్తుకుంటారే కానీ, అవుతున్న ఉత్పత్తిని సక్రమంగా వినిమయం అయ్యేట్టు చూడరేం ఎవ్వరూ?' అని ప్రశ్నించుకున్నాడు సీతాపతి.

క్రమంగా గార్డెనులో దీపాలు వెలిగాయి. మరికొంతసేపు రేడియో వింటూ అలాగే కూర్చున్నాడు సీతాపతి. ఆకలి వేస్తున్నట్టు అనిపించింది. 'మానవులకు ఆకలిదప్పులు లేకుండా చేయలేకపోయాడేం మనిషిని సృష్టించగలిగిన బ్రహ్మ' అనుకుంటూ సీతాపతి లేచి నెమ్మదిగా ఇంటిముఖం పట్టాడు.

రాత్రి భోజనాలముందరకూడా సీతాపతి మౌనంగానే కూర్చున్నాడు. సుందరమ్మమాత్రం ఏదో సణుగుతూనేవుంది. భర్తమీద సూటిపోటి మాటలు విసురుతూనేవుంది. సీతాపతికి పొలమారింది. మంచినీళ్లు తాగి, "అబ్బ...ఇందులో ఇంత కారం తగిలేశావేం...కాస్త నెయ్యి వెయ్యి' అన్నాడు.

'నెయ్యి వెయ్యడానికి అక్కడ వుందేమిటి?. మీరు తెచ్చిన అర్ధశేరు నెయ్యి అప్పుడే అయిపోయింది...అడుగున కాస్తవుంటే మీకూ అబ్బాయికీ రాల్చాను.' అంది సుందరమ్మ.

'నిజమే...ఎన్నాళ్లు వస్తుంది అర్ధశేరు నెయ్యి...అక్కడికీ సుందరి నిక్కచ్చి మనిషి కాబట్టి పది రోజులు వాడింది' అనుకుంటూ సీతాపతి మారు మాటాడకుండా భోజనం చేస్తున్నాడు.

'సాయంత్రం నీవు వెళ్ళాక డాక్టరుగారు మనిషిని పంపారునాన్నా...బిల్లుకోసం' అన్నాడు. పక్కనే కూర్చుని భోజనం చేస్తున్న ప్రసాదు.

'ఊ' అన్నాడు సీతాపతి మంచినీళ్లగ్లాసు క్రిందపెడుతూ.

'సాయంత్రం పసిదానికి మళ్ళీ ఒళ్ళు వెచ్చ పడింది...రేపు డాక్టరు దగ్గరికి తీసుకు వెళ్ళండి.'

'చీటికిమాటికి డాక్టరుదగ్గరికి వెడితే ఇహ చెప్పక్కరలా సంసారంసంగతి...ఇప్పటికే ఆయనకు బోలెడంత బిల్లు చెల్లించాలి.'

'అయినా ఇవ్వాల్సింది ఇవ్వకుండా మళ్ళీ మందుకెడితే ఏంబాగుంటుందమ్మా!' అన్నాడు ప్రసాదు.

'తండ్రీకొడుకులు పిసనారితనంతో అక్కడ కూడపెట్టిందేం కనబడదు.' సాధింపుగా అంది సుందరమ్మ. ఇహ తాను మౌనంవహిస్తేనే తప్పలేకపోతే నాదన పెరుగుతుందనే ఉద్దేశంతో సీతాపతి త్వరత్వరగా భోజనంముగించి గదిలోకి వెళ్లాడు.

మంచంమీదనుంచి పక్కబట్టలుతీసి, తెగిన నవారును ముడిపెట్టడానికి పట్టీలు బిగించసాగాడు. కొంతసేపు శ్రమపడి ఆ తెగినచోట ముడిపెట్టి పక్క పరుచుకొని నడుంవాల్చాడు. ఇంతలో సుందరమ్మ మరచెంబుతోవచ్చి చెంబు మంచంక్రిందపెట్టి సీతాపతి కాళ్లవైపు కూర్చుంది. సీతాపతి ఆమె మొహంలోకి ఒకసారిచూశాడు. కోపం చాలామటుకు చల్లారినట్టే గ్రహించాడు.

'ఏమండీ...పండక్కి అమ్మాయినీ అల్లుణ్ణీ తీసుకురానన్నారుటగా' అంటూ సుందరమ్మ సూటిగా ప్రశ్నించింది. అప్పటికి అర్థమైంది సీతాపతికి భార్యచేసిన ఆర్భాటానికి కారణం.

'మాట్లాడరేమండీ...రాత్రి మన పక్కింటి విశ్వనాథంగారితో అన్నారుటగా' అని సుందరమ్మ తిరిగి ప్రశ్నించింది.

'ఏం...ముంచుకుపోయినట్టు ఆయన భార్య అప్పుడేవచ్చి చెప్పింది నీతో?'

'బాగా నేవుంది వరుస...మీరుఅనడం బాగానే వుందికానీ ఆమెవచ్చి చెప్పడం కష్టమైందా మీకు? ...పైగా ఆయన్నుకూడా తీసుకు రావద్దన్నారుటగా?'

'తేలిపోయింది పైగా ఇదొకటా... ఆయనే అన్నాడు, ఈ ఏడు తీసుకురానని.'

'వాళ్ళగొడవ మనకెందుకుగానీ మీ సంగతి చెప్పండి. అమ్మాయి కాపురానికి వెళ్ళింది ఈ ఏడేగా...తొలిపండుగయ్యె తీసుకురాకపోతే ఏం బాగుంటుందండీ? ... ఆపిల్లయ్యే ఊనూరు మనదూ?...విశ్వనాథంగారంటే ఏటేటా కూతుర్నీ, అల్లుణ్ణీ తెస్తున్నారుకాబట్టి ఈ సంవత్సరం మానుకున్నా పరవాలేదు. వారితోపాటు మీరూ తేనంటే ఎట్లా?...ఇరుగుపొరుగువారంతా అడుగుతున్నారు. ఇంకా అమ్మాయిని తీసుకురాలేదేమని...పట్టుమని పదిరోజులులేదు పండుగ' అంటూ సుందరమ్మ ఎడతెరిపిలేకుండా మాట్లాడింది.

'నీవు చెప్పింది నిజమే నే...కాని కాస్త ఆలోచించు—వాళ్ళను తీసుకు రావాలంటే మాటలా? ఇద్దరికీ బట్టాపాతా పెట్టాలామరి...బోలెడంత ఖర్చు...ఎక్కడి నుంచితేనూ?'

'మన ఇబ్బందులు ఎప్పుడూ వుండేవే... ఒకనాటితో పోయేవిగనుకనా?' ..ఏదో విసంగా చేయాలిమరి తప్పుతుందా?'

'తప్పుతుందాఅంటే ఎట్లా, చేతకానప్పుడు తప్పించుకోవాలి—దాని పెళ్లికి చేసిన అప్పులో నాలుగవభాగమైనా తీరనేలేదు. అదీగాక ఇంకా బోలెడన్ని అప్పులు ఏడ్చాయి...రేపు ఫీజుకట్టకపోతే అబ్బాయిపేరు కొట్టేస్తారుట...పైగా బిల్లు కోసం డాక్టరు మనిషిని పంపడయ్యె...ఎట్లా చెప్పు?'

'మీరు అన్నిటికీ అన్నీ చెబుతారు...... ఎప్పుడూ చాలదన్న గొడవే...మీకేం...నలుగురూ నన్నే అంటారు...పెండ్లయిన ఏడుకదా, పండుగకు అల్లుణ్ణీ కూతుర్నీ తీసుకు వెళ్లలేదని వియ్యాలవారు మనల్ని లేమిడీచేస్తారు.'

'ఒకరు అంటారనీ, లేవిడీ చేస్తారనీ మనం భయపడితే ఇహ సంసారం జరిగినట్టే...రేపు మనం

కష్టంలోవుంటే వీరంతా మనల్ని ఆదుకుంటూరా?'

'అలా మొండిగా సమాధానం చెబితే ఎలా గండీ?...మీకుమటుకు నామర్దాకాదూ నలుగురిలో?'

ఇహ ఎంత నచ్చచెప్పినా లాభంలేదని సీతాపతికి తెలుసు. అనవసరంగా వాదన పెరగడం, ఆమె కంట తడిపెట్టడం మొదటినుంచి అనుభవంలో తెలుసుకున్నాడు సీతాపతి. 'సరే...చూద్దాంలే' అన్నాడు, అప్పటికి ఆమెను సమాధానపరచడానికి. సుందరమ్మ ఆమాటలతో కొంత తృప్తిపడింది. ఇహ నేమీ మాట్లాడకుండా లేచివెళ్లింది తన పక్కమీదికి.

సీతాపతికి మాత్రం ఆరాత్రి సరిగా నిద్దర పట్టలేదు. సమాజంలో తిరుగుతున్న తనబోటి మధ్య తరగతి జనం అభిమానం చంపుకోలేక ఎంతమంది బాధపడుతున్నారోనని సీతాపతి విచారించాడు. ఆర్థికవ్యవస మారితేనేగాని సమాజం బాగుపడదనీ, సమాజం బాగుపడిందాకా మధ్య తరగతి జనం ఇలా బాధపడాల్సిందేనని అనుకున్నాడు.

సీతాపతి మరునాడు ఆఫీసులో పనిచేస్తుండగా పోస్టుమన్ వచ్చి కవరు అందించి పోయాడు. చేస్తున్నపనిని ఆపి సీతాపతి కవరు ఎక్కడినుంచి వచ్చిందా అని ఎగాదిగాచూసి, కూతురు వ్రాసిందని తెలుసుకొని కవరు చించి ఉత్తరంచదివి తెల్ల మొహం వేశాడు.

తోటిగుమాస్తా సీతాపతి ముఖ కవళికలనుబట్టి, 'ఎక్కడినుంచి ఉత్తరం...అంతా క్షేమమేనా?' అని ప్రశ్నించాడు. 'ఆ' అన్నాడు సీతాపతి ముక్తసరిగా. 'మరెందుకూ అలా వున్నారూ?' తోటిగుమాస్తా తిరిగి ప్రశ్నించాడు.

'అబ్బే.....ఏమీలేదండీ......మా అమ్మాయి పండక్కి వస్తానని వ్రాసింది.'

'అయితే ఇంకేం...సంతోషమే గదండీ!' అన్నాడు తోటిగుమాస్తా. తన విచారం ఏమిటో అతనికేం తెలుసు అనుకున్నాడు సీతాపతి.

రాత్రి కూతుర్ని తీసుకురావడం విషయంలో మాటవరుసకి 'సరే...చూద్దాంలే' అని భార్యతో అన్నా అసలు తీసుకురావద్దనే అనుకున్నాడు సీతాపతి. కాని ఇప్పుడు తప్పించుకొనేట్టులేదు. కూతురు వ్రాయడం కూడా చమత్కారంగానే వ్రాసింది. 'పండక్కి నాన్నగారువచ్చి మమ్మల్ని తీసుకుపోతారనుకుంటున్నాము' అని. విషమసమస్యలో పడ్డాడు సీతాపతి. 'తీసుకురాకపోతే భార్య అన్నట్టు వియ్యాలవారు నిజంగానే తనను ఆడిపోసుకుంటారు. తెస్తే వందరూపాయలకు తక్కువ ఖర్చు కాదు' ఎంత ఆలోచించినా ఏమీ పాలుపోదు సీతాపతికి. అల్లుడి హోదాకు తగినట్టు బట్టలు పెట్టాలి. పెళ్లిలో కూతురికి ఒకచీర తక్కువపెట్టామని, ఉగాదికి మంచి పట్టుచీర కొనిపెడతానని మాటివ్వటం కూడా స్ఫురణకు వచ్చింది. ఎంత ఆలోచించినా అల్లుణ్ణీ కూతురినీ తీసుకురాక తప్పేట్టు కనపడలేదు ఆయనకు. 'ఒకవేళ తీసుకురాదలచుకుంటే ఇరవై రూపాయలు ఖర్చుపెట్టుకొని తాను వెళ్లడం దేనికీ రమ్మనివ్రాస్తే చాలదూ' అనుకున్నాడు సీతాపతి. ఇంతకూ తనకు అప్పిచ్చే దాతయేడీ?...మొన్న తోటిగుమాస్తా రంగనాథం, డబ్బు అత్యవసరమై, ఒకరిదగ్గర రూపాయికి రెండణాల వడ్డీచొప్పున తీసుకున్నానని చెప్పాడు. తనుకూడా తీసుకుంటే... అమ్మో...ఇంకేమైనా వుందా కొంపసుణ్ణమే... ఎలాగా' అని తర్కించుకోసాగాడు సీతాపతి. పరాగ్గా కూర్చోవడంవల్ల సీతాపతి చెయ్యి సిరా బుడ్డికి తగిలి, సిరా ఫైలుమీద పడింది. 'అరరే' అనుకుంటూ బంట్రోతును పిలిచి అది తుడిపించి పనిలోపడ్డాడు.

* * * *

తెల్లవారితే ఉగాది అనగా సుశీలా ఆమె భర్త శ్యాములరావూ దిగారు. సీతాపతి ప్రసాదును వెంటబెట్టుకొని వాళ్ళను ఇంటికి తీసుకు రావడానికి స్టేషనుకు వెళ్లారు. సీతాపతి ఎంతో సంతోషంగానే అల్లుణ్ణి కౌగలించుకున్నాడు. కాని ఆయన మొహంలో ఏమూలనుంచో తొంగిచూస్తున్న విషాద రేఖను శ్యాములరావు కనిపెట్టకపోలేదు. కారణం మాత్రం ఊహించలేకపోయాడు. కూతురూ అల్లుడూ వచ్చినందుకు సుందరమ్మ మురిసిపోయింది. సుశీల చిన్నతమ్ముణ్ణి ఎత్తుకొని ముద్దులాడింది. తల్లితో తన

అత్తవారింటి సంగతులు చెబుతూ ఎంతో ఉత్సాహంతో తల్లి చేసే పనుల్లో ఆమె కూడా పాలు పంచుకుంది. 'మొదట మీ అల్లుడుగారు రానన్నారమ్మా... ఎంతో బలవంతంచేస్తే వచ్చారు' అంటూ సుశీల భర్త విషయం చెబుతూ అంది. ఆ రాత్రి సుశీల తల్లిదగ్గర కొంచెంసేపు పడుకొని తాను అత్తవారింటికి వెళ్ళాక నేర్చుకున్న క్రొత్తపాటలను పాడి వినిపించింది.

సీతాపతి పైకి ఎంతో సంతోషంగా వున్నట్టున్నా, లోపలపడుతున్న ఆవేదనను కప్పిపుచ్చడానికి ఎంత ప్రయత్నించినా శ్యామలరావు అందరితో మాట్లాడుతూనే మామగారి విచారాన్ని కనిపెడుతూనే వున్నాడు.

* * * *

తెల్లవారింది. తలంట్లు, చేదు తినడము అన్నీ ఒకదాని వెంబడి ఒకటి సక్రమంగానే జరుగుతున్నాయి. మామగారూ, అత్తగారూ, బావమరుదులు తనకు జరుపుతున్న మర్యాదలకు సిగ్గుపడ్డాడు శ్యామలరావు. 'అల్లుడంటే వీరికింత హడలెందుకో?...తమ కుటుంబంలో అల్లుడుకూడా ఒకడని భావించకుండా, ఒక అధికారికి జేసినట్టు మర్యాదలు చేయడం, దోచిపెట్టడం దేనికో?' అనుకున్నాడు శ్యామలరావు. 'తమ కూతుర్ని సుఖంగా ఏలటానికనా, ఈ మర్యాదలూ, కానుకలూ' అనికూడా అనుకున్నాడు. పరంపరానుగతంగా వస్తున్న ఈ ఆచారానికి ఎన్ని కుటుంబాలు ఋణాల పాలవుతున్నాయో నని శ్యామలరావు తలచాడు. రాత్రి గదిలోకి మామగారు తనకూ సుశీలకూ తెచ్చిన బట్టలను చూపెంచింది సుశీల. 'పాపం ఆయన వీటికోసం ఏ వంద రూపాయలో ఖర్చు పెట్టివుంటాడు. మిగతా పిల్లలకు కూడా ఏమీ బట్టలు లేనట్టువుం' దని సులభంగానే గ్రహించాడు శ్యామలరావు. మొదట శ్యామలరావు పండక్కి అత్తవారింటికి రానన్నదికూడా ఇదే కారణం. చివరకు సుశీల కన్నీళ్లు పెట్టుకొని తనుకూడా వెళ్ళనని బ్రతిమాలితే తప్పనిసరిగా బయలుదేరి వచ్చాడు.

తలంటిపోసుకున్నాక, శ్యామలరావు 'ఊళ్లోకి వెళ్ళివస్తా' నని సుశీలతో చెప్పి వెళ్లాడు. సీతాపతి అర్జంటు పనులున్నాయని ఆఫీసుకు వెళ్లాడు. పిల్లలు కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నారు. సుందరమ్మ ముడికట్టుకొని వంటచేస్తూ, 'అమ్మాయ్......కాస్త వచ్చి కూర తరిగి పెట్టమ్మా' అంటూ సుశీలను కేక వేసింది.

'ఏమే అమ్మా... రాత్రికి సినిమాకు వెడదామే అంతా కలసి.' అంది కూర తరుగుతున్న సుశీల.

'ఏమో తల్లీ...మీ నాన్నగారు ఏమంటారో. అంతా వెళ్ళాలంటే మాటలా?...బోలెడంత అవుతుంది.'

'అంతగా అయితే మీ అల్లుడిగారిచేత ఖర్చు పెట్టిస్తాలేవే అమ్మా.'

'బాగానే వుంది...అతగాడిచేత ఖర్చుపెట్టిస్తే ఏం బాగుంటుంది?...మీ నాన్నగారిచేతిలో డబ్బు లేదు...ఇప్పటికే బోలెడంత అప్పయింది తల్లీ... అంతగా అయితే, మొన్న మీ పెద్దమామయ్య వచ్చినప్పుడు పది రూపాయలు ఇచ్చిపోయాడు నాకు... అవి మీ నాన్నకు తెలియకుండా దాచాను. అవి పెట్టుకు వెడదాములే.'

ఇంతలో శ్యామలరావు రావడంవల్ల వాళ్ల సంభాషణ ఆగిపోయింది. శ్యామలరావు గదిలోకి వెళ్లిపోయాడు. సుశీలకూడా అతని వెనుకనే గదిలోకి వెళ్ళింది.

'ఏమిటి సుశీ...మీ అమ్మ దాచుకున్న పది రూపాయలతో సినిమాకు వెడదామనే?'

'అబ్బే...లేదండీ...మా అమ్మ అంటున్నది కానీ ఇంతలో వెడతానుటండీ?...ఇదేమిటి...... పొట్లం?...అయ్యో...ఇవన్నీ ఏమిటండీ...ఎందుకు తెచ్చారూ?'

'ఎందుకేముందీ...నీ తమ్ముళ్ళూ చెల్లాయిలకు మాత్రం పండుగ కాదూ?...వాళ్ళుమటుకు క్రొత్త బట్టలు కట్టుకోవద్దూ?'

'బాగానే వుంది...ఎంత తగలేశా రేమిటి?... వాళ్ళకు మనం పెట్టడం ఏమిటండీ?'

'ఏం...వాళ్లు పెట్టినవి మనం కట్టుకొని కులకవచ్చుగానీ మనం వాళ్ళకి పెట్టకూడదేం?' అన్నాడు శ్యామలరావు కటువుగా. సుశీల ఇహ నేమీ మాట్లాడలేకపోయింది పొట్లం తీసుకొని 'ఇదిగో

నమ్మా...మీ అల్లుడుగారు బట్టలు తెచ్చారు' అంటూ వంటింట్లోకి వెళ్ళింది.

*          *          *          *

భోజనాలు అయినాయి. అంతా క్రొత్తబట్టలు కట్టుకున్నారు సీతాపతీ సుందరమ్మలు తప్ప. సీతాపతి తన గదిలో కుక్కిమంచంలో కూర్చొని అయిన ఖర్చునుగూర్చీ, మొన్నటివరకూ కూతురినీ, అల్లుణ్ణీ తేననిచెప్పిన విశ్వనాథం తనకంటే ముందే వాళ్ళను పిలిపించడాన్ని గూర్చీ ఆలోచిస్తున్నాడు చుట్టతాగుతూ. ఇంతలో సుసీలా శ్యామలరావులు క్రొత్త బట్టలు కట్టుకొని వచ్చారు.

"కాళ్ళు చాపునాన్నా... దణ్ణం పెడతాం." అంది సుశీల.

"ఎందుకు లేతల్లీ"...అంటూనే కాళ్ళు జాపాడు సీతాపతి. సుసీలా శ్యామలరావులు ఒంగి ఆయన పాదాలకు నమస్కరించి లేచారు. తల్లి పిలవడంతో సుశీల గదిలోంచి వెళ్ళింది ఆమెతోపాటే శ్యామలరావు గదిగుమ్మంవరకూ వెళ్ళాడు. సీతాపతి దృష్టి అప్రయత్నంగా ఒంకికి తగిలించివున్న కోటు మీదా, క్రిందపడివున్న చెప్పులమీదా పడింది. మాసికలు వేసిన కోటూ, శిథిలమైన చెప్పులూ తనను వెక్కిరిస్తున్నట్టుగా వున్నాయి. "మామగారూ" అంటూ, శ్యామలరావు గది గుమ్మందగ్గరినుంచి వచ్చి పిలిచేప్పటికి సీతాపతి ఉలిక్కిపడి "ఏమిటి నాయనా?" అన్నాడు.

"నాన్నగారు మీకీ నూరు రూపాయలు ఇమ్మన్నారు బట్టలకింద... మమ్మల్ని తీసుకురావడానికి మీరూ అత్తగారూ వస్తారేమో అక్కడే బట్టలు పెడదామనుకున్నారు. మీరు రాకపోవడంవల్ల డబ్బు పంపించారు."

సీతాపతి ఆశ్చర్యపోయాడు. తను ఎరుగున్నంతవరకూ అటువంటి అచారమేమీ లేదని ఆయనకు తెలుసు. 'ఈవిషయం సుసీలకు తెలిసివున్నట్లయితే మాట వరసకైనా మా మామగారు ఇలా డబ్బు పంపించారని చెప్పేదే...ఒకవేళ శ్యామలరావే తన పరిస్థితిని అర్థంచేసుకొని ఇస్తున్నాడేమో...ఏమైనప్పటికీ తాను తీసుకోవడం భావ్యంకాదు" అనుకుంటూ సీతాపతి "ఎందుకు లేబాబూ అనవసరంగా" అన్నాడు.

"అనవసరమేంకాదు ... తీసుకోండి...మీరు వేరువిధంగా అనుకోవద్దు...ఊఁ...తీసుకోండి...మళ్ళీ సుశీల వస్తుంది" అంటూ శ్యామలరావు నూరురూపాయలనోటు సీతాపతికి అందించబోయాడు.

సీతాపతికి ఏమిచేయాలో తోచలేదు. మనసు రెపరెప కొట్టుకున్నట్లయింది. ఒణుకుతున్న చేతిని జాపాడు. తన దగ్గిరనుంచి డబ్బు తీసుకుంటానికి మామగారు పడుతున్న అవస్థను చూసి శ్యామలరావు జాలిపడ్డాడు. మానసికంగా తాను ఆయనకు కష్టం కలిగించానేమోనని కూడా అనుకున్నాడు. ఇంతలో "అక్కయ్య పిలుస్తున్నదిబావా" అంటూ సుశీల చెల్లెలు వచ్చింది. శ్యామలరావు మరపలితో గదిలోంచి వెళ్ళిపోయాడు. సీతాపతి నూరురూపాయల నోటును చేతిలో పుచ్చుకొని దానివంక చూస్తూ అలాగే ఒక అరనిముషం నిలబడిపోయాడు. "తీసుకోకుండా ఉండవలసింది...పోనీ తిరిగి ఇచ్చివేస్తే... అతనేమనుకుంటాడో!...కష్టసుఖాలు తెలుసుకున్న అల్లుడు దొరకడం తన అదృష్టమే" అనుకున్నాడు సీతాపతి. అతనికళ్ళు చెమ్మగిలినాయి. "మీరుకూడా లేచిరండి ఫలహారానికి" అని వంటింటినుంచి భార్య పిలుపు వినవచ్చింది. నోటు జేబులో పెట్టుకొని నీరసంగా అడుగులువేస్తూ గదిలోంచి వంటింట్లోకి వెళ్ళాడు సీతాపతి.



# దళవాయి రామప్పయ్య



శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

'ఒక మెట్టు తరణి డిగ్గిన
నొక మెట్టు శశాంకు డెక్కు; నుర్వీస్థలిలో
నొక రాజు సన్నగిల్లిన
నొక రా జంతంతకును మహోన్నతి గనడే?'

అని చేమకూర వేంకటకవి నుడివినట్లుగా ఒక రాజు సన్నగిల్లిన మఱొక రాజు మహోన్నతికి వచ్చుట నైజము. ఈ పద్యమును చదివినప్పుడెల్ల విజయనగరసామ్రాజ్య చరిత్ర స్ఫురణకు వచ్చుచుండును.

ఆంధ్రభోజు డని అఖండ యశస్సు సముపార్జించిన శ్రీకృష్ణదేవరాయలవారి నిర్యాణానంతరము, విజయనగరము తన శోభను కోల్పోవ దొడగినది. దురదృష్టవశాత్తు విజయనగర రాజకుటుంబమున ఏర్పడిన కలహములను పురస్కరించుకొని సమ్రాట్టులకు సామంతులుగానో లేక ప్రతినిధులుగానో వ్యవహరించుచుండిన పరిపాలనాధికారులు తమ తమ రాజ్యములను సుస్థిరము చేసికొనుచు స్వాతంత్ర్యము ప్రకటింప సన్నద్ధులయిరి. లాభము మాత్రము లభ్యము కాలేదు కాని, విజయనగరాధీశ్వరుల పక్షము చేరి శత్రువర్గముతో పోరాడిన స్వామిభక్తులును లేక పోలేదు.

విజయనగర సామ్రాట్టుల నెదిరించి స్వాతంత్ర్యము ప్రకటించినవారిలో పేర్కొనదగినవాడు మధురను క్రీ. శ. 1623 నుండి 59 వఱకు పరిపాలించిన తిరుమలశౌరి నాయకుడు. ఇతడు భాషాపోషకుడనియు, కళారాధకుడనియు జగత్ప్రసిద్ధి పొందెను. తొలుత తాంబూలకరండ వాహకుడుగ కృష్ణదేవరాయలవారి కొలువుకూటములో చేరి పిమ్మట మధురలో నాయకరాజ్య స్థాపనాచార్యుడుగా విశేషవిఖ్యాతి నార్జించిన కోట్యము విశ్వనాధనాయకుని వంశమునకు చెందిన ముద్దుకృష్ణప్ప నాయకుని రెండవ కుమారుడు తిరుమలశౌరి నాయకుడు. ఇతడు క్రీ. శ. 1584 లో జన్మించి, 39 వ ఏట సింహాపీఠి నలంకరించి 36 సంవత్సరములు రాజ్యపాలనము చేసి చిర యశస్సు గడించెను. ఇతని మరణమును గూర్చి వింతగొలుపు కథలు గలవు. వానియందలి సత్యాసత్యము లెంతవరకో తెలియదుగాని కళాపోషకుడుగాను, యుద్ధవీరుడుగాను తిరుమలశౌరి నాయకుడు చరిత్ర వినువీధిలో ధ్రువతారయై వెలుగొందుచున్నాడు.

తిరుమల శౌరినాయకుడు కేవలము భాషాపోషకుడును, కళారాధకుడు నేగాక, యుద్ధవీరుడును. ఇతని భుజబలమును సువ్యక్త మొనర్చు శాసనములు గూడ గలవు. ఇతడు మైసూరివారితోను, రామనాధపురము నేలు సేతుపతితోను సమరములు సాగించి విజయలక్ష్మిని వరించెను. ఈ విజయముల ఫలితముగా తిరుమలనాయకుని పరిపాలనాధికారము విస్తృతమయినది. వీని కన్నిటికి కారణము, తిరుమల శౌరినాయకుని దళవాయి (సైన్యాధిపతి) యగు రామప్పయ్య సహకార సానుభూతులని నుడువవగును.

రామప్పయ్య తిరుమలనాయకుని కాలమున దళవాయి ప్రధానీకమును నిర్వహించుచుండెను. అనగా, సైన్యాధ్యక్షుడుగాను, ప్రధానమంత్రిగాను నుండెనన్నమాట. ఇట్టి బాధ్యతాయుతములగు రెండు పదవులను ప్రతిభావంతముగ నిర్వహించిన రామప్పయ్య బుద్ధిబలమునందే కాక బాహుబలమునందును అందెవేసిన చేయి యని వ్యక్తమగుచున్నది. ఇతడు మైసూరువారితో జరిగిన యుద్ధమునందు పాల్గొని మైసూరు దళవాయి యగు నంజరాజును జయించి, తిరుమలశౌరి నాయకుని యాదరాభిమానములకు పాత్రుడయ్యెను. రామప్పయ్యకు తోడుగా మైసూరు యుద్ధములో దిండుగల్లు పాళెగారగు రంగన్న నాయకుడు కూడ విశేషముగ సాహాయ్యము చేసినట్లు చరిత్ర సాక్ష్య మొసగుచున్నది. యుద్ధానంతరము — ఈ వీరద్వయమును తిరుమలుడు సమ్మానించెనట! పిమ్మట రామనాధపురము నేలు మఱవ వంశస్థుడగు రెండవ జడైక దేవ సేతుపతితో జరిగిన సంగ్రామములో గూడ దళవాయి రామప్పయ్య పాల్గొని విజయము సంపాదించెను. ఇటుల రామప్పయ్య జైత్రయాత్రలు సలుపుచు తిరుమలశౌరినాయని వారికి చేదోడు వాదోడుగ సాయము చేసి తగిన మంత్రి అనిపించుకొనెను.

దళవాయి రామప్పయ్య తెలుగు బ్రాహ్మణుడు; మధురకు ఏడుమైళ్ల దూరమునన్న 'చతుర్వేద

మంగలం' అను గ్రామములో జన్మించెను. నేటికిని ఆ గ్రామమునం దతడు నిర్మించిన శివాలయములో అతని విగ్రహము గలదట. ఇతని కిద్దరు సోదరులు. వైద్యనాథయ్య, కృష్ణప్పయ్య అనువారు. వీరిలో వైద్యనాథయ్య అగ్రజుడు. ఇతడనిన రామప్పయ్యకు అంతులేని అభిమానము. ఇతని ఆశీస్సులను గ్రహించిన పిమ్మటనే రామప్పయ్య రణరంగమునకు వెళ్లెడివాడు. రామప్పయ్య జామాతలను శివరామయ్య, కొండప్పయ్యలుకూడ ఘటికులని విశదమగుచున్నది. సేతుపతితో జరిగిన యుద్ధములో శివరామయ్యకూడ పాల్గొని విఖ్యాతి నార్జించెను.

రామప్పయ్య జీవితచరిత్రను, అతని జైత్రయాత్రావిశేషములను తెలిసికొనుటకు చారిత్రకాధారములు కొన్ని కలవు. కాని ఆశ్చర్య మేమనగా, రామప్పయ్య తెలుగుబిడ్డ డైనప్పటికిని నితని గూర్చి ప్రత్యేక పుస్తకములు తెలుగులో లేకపోవుటయే. నాకు తెలిసినంతవఱకు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోనున్న 'రామనాథ పురంవారి వంశావళి'లో రామప్పయ్యను గూర్చిన ప్రసక్తి—అనగా అతడు సేతుపతితో గావించిన యుద్ధమునకు సంబంధించిన విశేషాదికము—కలదు. కాని తమిళమున నితనిని గురించి 'ఇరామయ్యన్ అమ్మానై' అను ప్రత్యేక పుస్తకమేగాక 'తిరుచ్చెంగోట్టు తిరుప్పణిమాలై'లో గూడ వివరములు కొన్ని కలవు. తంజావూరు పుస్తకశాలలో, 'ఇరామప్పయ్యన్ అమ్మానై' అను తాళదళ గ్రంథమును, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో 'ఇ రామయ్యన్ అమ్మానై' అను పుస్తకమును రామప్పయ్య గుణగణములను చిత్రించుచున్నవి. ఈ రెండు పుస్తకములను నొకచోట చేర్చి 'ఇ రామయ్యన్ అమ్మానై' అను పేరితో తంజావూరు సరస్వతీ మహల్ ప్రచురణగా మదరాసు ప్రభుత్వమువారు 1950 సం॥న ప్రకటించియున్నారు. ఇందులకు ప్రభుత్వమువారు చిరస్మరణీయులు.

'అమ్మానై' అనునది దేశి కవిత్వశాఖకు చెందిన మధురరచనము. దేసింగురాజుకథ, బొబ్బిలికథ, లక్ష్మమ్మకథ — మొదలగు గ్రంథములవలె ఈ అమ్మానై ప్రజాభాషలోనే వ్రాయబడియుండును. [1]అచ్చన గాయలాడు సందర్భమున అమ్మానై పాడుచు ఆటాడుట తమిళ నెలతలకు పరిపాటి. కనుక తమిళనాడులో—ముఖ్యముగా పల్లెపట్టులందు—యీ రామప్పయ్య గాథకు విశేషప్రచారము కలదనుట అత్యుక్తి కాదు. తమిళుల నోళ్ళలో పడిన రామప్పయ్యకు వింతవింత పేర్లు కలిగినవి. ఇరామయ్యర్, ఇరామయ్యన్, ఇరామప్పయ్యన్—అని నేటికిని వ్యవహరించుట ముదావహము. తెలుగువాడగు రామప్పయ్య గాథను సజీవముగ నుంచినందులకు తమిళులకు కృతజ్ఞత తెలుపుటతోపాటు తమిళవాఙ్మయమున గల మంచినిగూడ గ్రహించి జీర్ణించుకొనుట తెలుగుల కర్తవ్యము !

ఇరామయ్యన్ అమ్మానై సాహిత్యదృష్ట్యా గణనీయము గాకపోయినను, చారిత్రకముగా వెలలేని రత్నమని నుడువుట లెస్స. రామప్పయ్య జీవితమునకు సంబంధించిన వివరములు, తిరుమల శౌరినాయకుని గుణగణములు, సేతుపతితో జరిగిన యుద్ధములో రామప్పయ్యకు సహాయముగా వచ్చి పోరాడిన డెబ్బది రెండు పాళెగార్లు, ఆనాటి సాంఘిక, రాజకీయాది విషయములు, సేతుపతుల వృత్తాంతము, జడైక దేవ సేతుపతియొక్క ధైర్యసాహసములు—మున్నగు ముఖ్యాంశము లెన్నో యీ చారిత్రక గ్రంథమున వివరింపబడియుండుట గమనార్హము. దళవాయి రామప్పయ్యతో పోరాడిన రెండవ జడైకదేవ సేతుపతి కూడ పేర్వడసిన యుద్ధవీరు డనుటలో సందేహములేదు. ఇతడు కుట్టాన్ సేతుపతికి మొదటి కుమారుడు. కుట్టాన్ సేతుపతి మరణానంతరము, అనగా 1635 సంవత్సరమున జడైకదేవుడు సింహాసనమునకు వచ్చెను. ఇతనికి దళవాయి సేతుపతి యను బిరుదము గూడ గలదు. రామప్పయ్య, సేతుపతులకు జరిగిన యుద్ధమును నభివర్ణించు గ్రంథము రామప్పయ్యన్ అమ్మానై.

ఈ గ్రంథమునుండి రామప్పయ్యను గుఱించి మనకు తెలియవచ్చు కొన్ని ముఖ్యాంశములు: ఇతడు మహా స్వాభిమాని. స్వామిభక్తుడు. తిరుమల నాయనివారికి కుడి భుజము. ఇతని ఆంధ్రాభిమానము నిరుపమానము. అమ్మానైలో పలుచోట్ల 'నేను తెలుగువాడను. జడైకదేవుడు తెలుగువారిని నిరసన భావముతో జూచుచున్నాడు. కనుక అతనిని వధించినగాని నాకు మనశ్శాంతి లభింపదు—' అని రాఘు

1 ఈ అచ్చనగాయలకు అచ్చన గుండ్లు, అచ్చనలు, అచ్చనగండ్లు—మున్నగు ప్రఖ్యాతనామములు గలవని తెలియుచున్నది. పింగళి సూరనవంటి మహాకవి యీ ఆటకు చిరంజీవిత్వము కలిగించినాడు

దినముల్ కొన్ని చనంగనంత గడునర్థిన్ బొమ్మ
పెండ్లిండ్లు, గుజ్జనగూం, డచ్చనగండ్లు, పింపిళులు,
కుచ్చిళ్లో, గీరనగింజ, లోమనగుంటల్, కనుమూసి
గంతె, నలుగంబాలాట, లోనైన ఖేలనముల్ మీఱగ
బోట్లతోనలరె బాలారత్న మెల్లప్పుడున్.
(కళాపూర్ణోదయము. 6 ఆ).

ప్పయ్య యనుటకు ద్యోతకమగును. పెద్దలనిన ఆదరము. ముఖ్యముగా, అన్నయగు వైద్యనాథయ్యపై విశేష గౌరవము. దైవభక్తి కూడ విశేషముగా నున్నట్లు తెలియుచున్నది. కాని కొన్ని సందర్భములయందు రామప్పయ్య కఠినాత్ముడుగా నున్నట్టు కనబడుచున్నాడు. దీనిని బలపఱచునట్టి యొక కథ 'కొంగు మండలశతకం' అను తమిళపుస్తకమున గలదు.

సక్రమముగా కప్పము చెల్లింపని హేతువుచే, రామప్పయ్య కొందరు పాళెగార్లను కారాగృహమున బంధించెనట. వారిలో ఆణూర్ 'సంబంద చర్క్కరై' అను పాళెగా రొకడు కలడు. అతడు తమిళ భాషా పోషకుడుగా ప్రసిద్ధికెక్కెను. ఒకనాడొక కవి బంధితుడై యున్న 'సంబంధ చర్క్కరై'ను సందర్శించి యతనిచే సమ్మానితుడగుటకు యత్నించెను. అప్పుడు తనయొద్ద ఏమియు లేకుండుటచేత సంబంద చర్క్కరై తన భార్యను దర్శింపుమని కవిని కోరెను. ఆమెతో కవి యీవిషయమును నడివిన వెంటనే, తన మంగళసూత్రమును కవికి సమ్మానించెనట ఆ మహాయిల్లాలు! ఈ అద్భుతవిషయమును దళవాయి రామప్పయ్యకు తెలియజేసినవెంటనే పశ్చాత్తప్తహృదయుడై దళవాయి సంబంద చర్క్కరై సచ్చరిత్రమును కొనియాడుచు అతనిని బంధవిముక్తునిగ జేసెను. ఇటులనే యుద్ధసమయములందు రామప్పయ్య బంధితులను బాధించెనని అమ్మానై నుడువుచున్నది.

ఇక, రామప్పయ్య మరణమును గుఱించి విచారింతము. తిరుమలశౌరి నాయకుని మరణమునకు సంబంధించిన కథలవలెనే, రామప్పయ్య మరణమును గూర్చికూడ కథలు పెక్కులున్నవి. సేతుపతితో యుద్ధ మొనరించుటకుగాను రామప్పయ్య పాంబన్ కాలువపై ఆనకట్ట కట్టి, జడైక దేవునితో యుద్ధము చేయుచు వీరస్వర్గము నలంకరించెనని కొందరు చరిత్రకారులు విశ్వసించుచున్నారు. జడైకదేవుడు గావించిన 'చేతబడి' ఫలితముగా రామప్పయ్య మరణించెనని కొందరు నుడువుదురు. విషప్రయోగము వలన మరణించెనని మరికొందరి నమ్మకము. ఇటుల రామప్పయ్య మరణమును గుఱించి భిన్నాభిప్రాయము లున్నను, ఇతడు క్రీ. శ. 1653 ప్రాంతమున మరణించి యుండెనో పునని నుడువవచ్చును. ఏలయన, యుద్ధమున మరణించిన రామప్పయ్యకు పిమ్మట, అతని అల్లుడగు శివరామయ్య తిరుమలశౌరి నాయకునిచే దళవాయిగ నియమింపబడెను. శివరామయ్యకును, సేతుపతికిని జరిగిన యుద్ధములో సేతుపతికి పరాజయము కలిగినది. కొన్నాళ్ళు జడైక దేవ—సేతుపతి మధురలో కారాగృహమునందుండి, తిరుమలశౌరి నాయనివారి అనుగ్రహము నెట్లో సంపాదించుకొని మరల రామనాథపురమును పరిపాలించి, 1645 సంవత్సరమున జడైకదేవ సేతుపతి తన తమ్ముడగు 'తంబి'చే హత్యగావింపబడినట్లు రామయ్యన్ అమ్మానై నుడువుచున్నది. కనుక, రణరంగమునందే రామప్పయ్య మరణించెనని నుడువుట సమంజసముగ కన్పించుచున్నది.

పయి నుదాహరించిన విషయము లన్నియు రామయ్యన్ అమ్మానైలో పేర్కొనబడినవి. ఒక్కొకచోట రామప్పయ్య 'పులిరామయ్య' అనియు 'శత్రులను సంహరించిన రాము'డంతటి వాడనియు ప్రస్తుతింపబడినాడు. రామప్పయ్య, సేతుపతులకు జరిగిన యుద్ధము మనోజ్ఞముగ చిత్రింపబడినది. ఇటుల రామయన్ అమ్మానై రామప్పయ్య జీవితవిశేషములనే గాక, ఆనాటి సాంఘికరాజకీయాది పరిస్థితులనుగూడ కండ్లకు గట్టినట్లు తెలివిడి సేయుచున్నది. కాన, రామయ్యన్ అమ్మానై చారిత్రక దృష్ట్యా అమూల్యమగు గ్రంథమనుట నిర్వివాదాంశము: ఈ గ్రంథమున నభివర్ణితమయిన రామప్పయ్య గాథ కూడ తలమానికము వంటిదని నుడువుట అత్యుక్తి కానేరదు. ప్రతిభావంతుడయిన దళవాయి రామప్పయ్య జీవితచరిత్రము తెలుగువారికి మాత్రమే గాక దాక్షిణాత్యులకెల్లరకు చిరస్మరణీయము!

# విరహి ★

శ్రీ కోడూరి ఉమామహేశ్వరం

నామనమెల్ల నందనవనస్థిత కోమల పారిజాత మా
లామధురాత్మకంబయి నిరామయభావ నిలీన గోపికా
కామనమై కృశించెడినికంపిత ఖండిత నాయికా మృణా
ళీమృదుశయ్యమై పరిమళించెడి గంధపు పచ్చిముద్దమై

సన్నని యేటివంకల పిసల్లు పిసల్లు తురాయిపూలు పూ
యన్నజమైన తెక్కతుదియంచుల సోలిన పాలపిట్ట తే
వన్నెలమైన నాయెడద భావుకతా మధురోహ లెన్నియో
చిన్నెలు గ్రుమ్మరించుచును చేడ్పడిపోయె రసాపకర్షముల్

సుమధుర సాంధ్యరాగముల శోభలు చిమ్మిన యాకసంబుపై
గుమురుకవచ్చు రక్తిమను గూర్చి పసిండివలెన్ భ్రమించితిన్
విమలినమైన జీవితము వెక్కసమై తటితీపులారి మై
కము విడివడ్డ నాకునయి క్రమ్ముకువచ్చె విషాద మేఘముల్.

సలలిత పుష్పకోమల వసంత సదృక్షము యౌవనంబు ; నా
వలపుల పంట పీవనెడి భావన జేయుచు నున్ననాకు ని
ర్మల మధురోహ సమ్మిళిత రాగపికీమృదునాద సంస్వరం
బులు విన గోర్కెపుట్టెడినిపో-యెడలేక నహర్నిశంబులున్.

కమ్మని పండువెన్నెలలు గాయు దినమ్ములు పోయి కృష్ణ ప
క్షమ్మిక దాపురించునని సారెకు సారెకు నాయెడందలో
గ్రమ్మ విషాద మేఘపటలమ్ముల నిండిన చిమ్మ చీకటిన్
వమ్మయినట్టి నా ప్రణయవాంఛలకై తపియింతు నో సఖీ !!

ముదరని ప్రేయసీ ప్రణయ ముగ్ధ మనోహర ప్రేమగాథ నా
మది నదలించుచున్నది సుమా వినుమా యనుమాన మేలనో
మదవతి ! నాటి నీమధుర మంజుల ప్రేమరసార్ద్రమూర్తి యొ
ప్పిదమయి నేటికిన్ మధురవీక్షల నన్ను గృతార్థు జేసెడిన్.

భావజుని చిత్తవృత్తి భావముల నెఱిగి
యుత్తమ గృహస్థ ధర్మంపు వృత్తమెఱిగి
మదన సామ్రాజ్య వైభవాస్పదుల మగుచు
నాకసంబున విహరింప నభిలషింతు.

---

# తమస్సులో తపస్సులు



శ్రీ మునిపల్లె రాజు

మా స్వగ్రామం అటు జిల్లా ముఖ్యపట్టణానికి యిటు తాలూకా ముఖ్యపట్టణానికీ దగ్గర్లో, గ్రాండ్ ట్రంకురోడ్డు బస్సుమార్గంలో వుంటంలో మా గ్రామీణ నాగరికతలో చాలా పెద్ద మార్పు వచ్చింది. శ్రమ అనుకోకుండా మీరు మావూరికి ఒక్కసారి దయచేస్తే, యీ నాగరికతను బరోమీటర్ మీద కొలిచినట్లు కొలిచి చూడవచ్చని మనవి చేస్తాను. మచ్చుకు ఒకటి రెండు వుదాహరణలిచ్చినా మీరు సహించగలరని నమ్ముతాను. వెనక మా గ్రామానికి గ్రంథాలయోద్యమాధ్యక్షులు వచ్చి వుపన్యాసాలు దంచినప్పుడు వచ్చిన వుద్రేకంతో పదిమందిమీ కూడ బలుక్కొని ఏ స్థలంలో పెంకుటింటి గ్రంథాలయం స్థాపించాలనుకున్నామో, ఆ పవిత్ర స్థలంలో నేడు భూషయ్యగారి చిన్న కాఫీ హోటలు వెలిసింది. మా ప్రెసిడెంటుగారు (వీరికి సంతకంవరకూ వచ్చు) సహకారసంఘ షేర్లు పోగు చేసి, వారి స్వంత చిత్తాలో జమకట్టక పూర్వం, మేము కట్టించదలచుకొన్న డాబాయిల్లు గ్రామ సహకార సంఘస్థలంలో మొన్నీ మధ్యనే టేరా సినిమాహాలు వచ్చింది. ఇంకా కావలిస్తే, మా గ్రామంలోగూడా రోజుకు యాభైకి పైగా సిజరు సిగరెట్టు పెట్టెలూ, వారానికి డజనుకుపైగా కొత్త చీట్లపేక పెట్టెలూ నలిగిపోతూంటాయంటే నమ్మండి. అంతేకాదు, గత చరిత్రలో మా వూర్లోని రెండు పార్టీలవారు ఏ విషయంలోనూ ఏకీభవించి వున్నట్లు ఎనభైఏళ్ళ వృద్ధులకు గూడా జ్ఞాపకం లేదు. కాని మొన్నీ మధ్యనుండీ, అంటే గ్రంథాలయం కట్టడపు పునాదులు పైకి లేవకుండా చేసేందుకు పెట్టిన అర్జీల్లోనూ, ప్రజల షేర్ల ధనాన్ని కూతురు పెళ్లిలో కట్నంగా అడ్డం పెట్టుకొన్న ప్రెసిడెంటుగారి అరెస్టు తప్పించటంలోనూ, మా ప్రాథమిక పాఠశాల ప్రాథమికోన్నత పాఠశాలగా మారకుండా అందరూ ఐకమత్యంగా తీసుకొన్న జాగ్రతలోనూ—తరతరాలనుండీ వస్తూన్న ముఠా కక్షలు యిట్టే మాయమై పోయాయని నేను గర్వంగా చెప్పగలను.

ఇటువంటి మా స్వగ్రామాన్ని మీరు పల్లెటూరని గాని, బస్తీ అనిగాని అన్నలేరు. ఈ బస్తీ, పల్లె రెండూ కాని మావూళ్లోగూడా ధర్మదేవత ఒక పాదంమీదయినా నడుస్తున్నదని నేను విన్నవిస్తే మీరు ఆశ్చర్యమెందుకు పడాలి? మా పడమటి బజారు పురాతన నాగరికతకు శ్రీరామ మంటపం ఆటపట్టు.

ఇక్కడ మీకు ఒక చిన్నవిషయం మనవిచేయాలి. మీకు సంవత్సరంలో ఋతువులెట్లా మారుతుంటాయో, మా శ్రీరామ మంటపంమీద సీజన్లు గూడా అట్లా మారుతూవుంటాయ్. మొన్ననే గడిచింది. పులీ మేక జూదం సీజను. అంతకు ముందు సీజను చీట్లపేక సీజను. ప్రస్తుతం జరుగుతోన్నది—పురాణ కాలక్షేప సీజను, వర్తమానమైన ఈ పురాణ కాలక్షేప సీజను పుణ్యమహత్యంతోనే మన కథగూడా ప్రారంభం అయింది. ఈసిజన్ ప్రారంభంలోనే మా ఆచార్యులవారు "ఒరే, మనవూళ్లో ధర్మం నాలుగు కాళ్ళమీద సంచరించటం లేదని ఎవర్రా అనేది?" అని నావంటి సంస్కరణ వాదుల్ని సవాల్ చేసి, మందలిస్తూంటం కద్దు.

* * * *

ఆరోజున శ్రీరామ మంటపం అరుగులమీద స్థల పురాణ కాలక్షేపం నిరాఘాటంగా సాగిపోతున్నది. తీర్థులవారు మంచి పండితులే గాకుండా, కొంచెం సంగీత విద్యలోగూడా ప్రవేశం గలిగినవారు కావటంలో వారి శిష్యవర్గంలో ఆ బాల గోపాలమూ వున్నారు.

తీర్థులవారి కెదురుగా మాపిల్ల బస్తీ వితంతు వర్గం ఆసీనమైవుంది. వారికి ఎడమవేపుగా స్థితిమం

తులైన రైతువర్గం కూర్చొనివుంది. వారికి కుడి పక్కగా బీదా బిక్కీ భక్తులూ, యీ దీనభక్త శ్రేణికి వెనకగా, పైన చెప్పబడిన బాలబృందమూ, వున్నవి. అందరికన్నా వెనక శ్రేణిలో, మట్టి రోడ్డుకు అందుబాటులో కూర్చొనటంలో మా బాల భక్తులు తమ వర్గ యోగక్షేమాల్ని ఎంతటి పురాణ శ్రవణకాలంలోనైనా ఏమరి పాటుగా విస్మరించే వాళ్లు కాదని మీరు గ్రహించ వచ్చు.

తీర్థులవారు చదువుతోన్న శ్లోకాన్ని సంపూర్తి చేసి, దాని అర్థ తాత్పర్యాలు పలకకుండానే ఆవులించి, తెరిచిన నోటిలోకి దగ్గరలోనే వేచి వున్న దోమలదండు ప్రవేశించకుండా చిటికె వేసి, ఒక్క తాత్కాలిక క్షణం శిష్యకోటివంక తమ కరుణారస వీక్షణాలు ప్రసరింప జేశారు. అప్పటికే ప్రథమ శ్రేణిలోని వితంతు కోటిలో—తిరుపతి కొండ స్థల మహాత్యకథ ప్రభ సన్నగిల్లి కోడళ్ళ మంకురుతనాన్ని వదిలించే వివిధోపాయాల అన్వేషణకు ప్రాధాన్యత హెచ్చింది. ఆ వర్గంలోనే అక్కడక్కడ చిలకరించినట్లుగా వున్న నలుగురైదుగురు కోడళ్ళలో కొత్తంగా వచ్చిన తెలుగుసినిమా చిత్రంలోని తారయొక్క వర్ణనలో అభిప్రాయ భేదాలు వచ్చినాయ్ బసవయ్య చౌదరిగారూ, వారి చెట్టు కింది ప్లీడరు అబ్బాయి నాయుడూ, బట్టతలతో సాక్ష్యాల సీతారామయ్య—వారి తరువాతి కోర్టు లిటిగేషన్ గురించి మాష్టర్ ప్లాన్ వేస్తున్నారు. తీర్థులవారికి అపారమైన లోకానుభవంవుంది. వారికి లౌక్యం వంశపారం పర్యపు సంపదగా వస్తోంది.

వారు శిష్యకోటిలో అధిక సంఖ్యాకుల తక్షణాభి రుచుల్ని గమనించినవారై, మరుక్షణమే, రొంటినున్న వెండి పొడుంబుర్రను పదిమంది ముందూ ప్రదర్శించి, అందులోని "షన్ముగానంద ఆఫీసర్ల మద్రాసు నశ్యాన్ని" కొంచెం అసామాన్యమైన పెద్ద పట్టులో దట్టించి, తత్ఫలితంగా వచ్చిన బ్రహ్మానందంలో ఒకక్షణం లీనమై, తెలివి తెచ్చుకొని, స్థలపురాణ గ్రంథాన్ని మూసి, తమ శిష్య సంతానాన్ని లౌకిక సము పార్జనలో ప్రవేశపెట్ట దలంచినవారై—

"విన్నారా? శాయమ్మగారూ! కోమటి గురవయ్యకు బఱువుగా వుందట" అన్నారు. (ఆరోజు భిక్ష, ప్రసాదం వంతు శాయమ్మగారిది)

గురవయ్య పేరు వినగానే మొగవాళ్ళ సెక్షన్‌లో "బెల్లం" "బెల్లం" అని అస్పష్టపు గుసగుసలు వినిపించినై. చావుబతుకుల్లో వున్న గురవయ్యకూ బెల్లానికీ అవినా భావ సంబంధం వున్నా ఈ గుసగుసలు తీర్థుల వారికేమీ నచ్చలేదు.

"గతం గతః అన్నాడు గదండీ శాస్త్రకారుడు? చనిపోయేవాడి సుగుణాలు మాత్రమే లోకం చెప్పుకోవాలనటం ధర్మమేగదా?" అని లౌక్యంగా వారు శిష్యకోటిని మందలించారు. తీర్థులవారి మనస్సులోవున్న విషయం పెద్ద రహస్యమేమీ గాదు. మా గ్రామంలో శ్రేష్టమైన బెల్లం పుట్లకు పుట్లు పండుతుంది. కాని నిరుటి సంవత్సరం మూడు నెలల పాటు, కఱువంటే ఏమిటో ఎరగని మావూరికి గూడా బెల్లం క్షామం వచ్చింది. చివరకు పెద్ద స్కూలు మాష్టరుగారు గూడా తులం బెల్లంకోసం గడప గడపా తరగవలసి వచ్చింది. "గురవయ్య కొట్లల్లో మురిగిపోతున్నదని" కొందరూ, "వెంకమనీడు చౌదరీ, గురవయ్యా కలిసి దొంగతనంగా అమ్ముతున్నారని" కొందరూ విసుక్కొన్నారు. ఏమైతేనేం కరువు కరువుగానే వెళ్లిపోయింది.

ఇంతలోనే సర్వాంతర్యామి అయిన నరసమ్మగారు "బరువేమిటి స్వామీ? పొద్దునే కిందబెట్టారుగా" అన్నది.

"మహాందాత కాదండీ—పుణ్యాత్ముడు. ఏ జన్మలోనో యింత చేసుకు పుట్టాడు. శివాలయానికి ధ్వజస్థంభం దానం చేయించాడు కదండీ" అని తీర్థుల వారు మరోసారి ఆవులించారు.

ఈ సందర్భంలో తీర్థులవారు ఒక విషయం మరిచిపోయారు. గురవయ్య వేయించిన ధ్వజస్థంభం కలప చౌక బారుదనీ, గాలికి నిలవదనీ ఓంకారం వాస్తు శాస్త్రజ్ఞుడు చెప్పినట్లే, అది మొన్నటి కార్తీకంలో తిరిగి కూలిపోయింది. ఈ మాటలు అప్పటిదాకా వింటూ బెల్లంకొట్టిన రాయివలె కూర్చున్న గురవయ్యగారి జ్ఞాతి హనుమయ్య సంతోషం లోపల దాచుకొని "పొద్దు తిరక్కముందే ప్రాణం పోయిదండీ" అని చల్లగా జారవిడిచాడు.

సభికులందరూ "నారాయణ" "నారాయణ" అని సకల పాపహారుడి నామోచ్చారణ చేశారు.

ఇక సంభాషణంతా మృత్యువుమీదా, పుణ్యం చేసుకొన్న వాళ్ళకు పరలోకంలో దొరికే పరిస్థితుల మీద నడిచింది. చాలామంది సభికులు ప్రశ్నలడుగుతున్నప్పటికీ తీర్థులవారి సమాధానాలన్నీ వారి ప్రధాన శిష్యకోటి నుద్దేశించే చెప్పబడుతున్నవి.

ఇంతలోనే బజారులో మేళం వినవచ్చింది. అది రానురాను రామమంటపం సమీపంలోనే వినవచ్చి, మంటపాన్ని గూడా దాటిపోతున్నది. పుణ్యం చేసుకొని చచ్చిపోయిన గురవయ్యగారి శవాన్ని ఆయన నలుగురు కొడుకులూ, పాడె నాలుగు కొమ్ములు పట్టుకొని శోకం మేళం వెనకనే నడుస్తున్నారు. ఆ వెనక గురవయ్యగారి బావమరిది పుల్లయ్యశెట్టి నడుస్తున్నాడు. పుల్లయ్యశెట్టి చేతిలో ఒక పూలపళ్లెం వున్నది. ఆ పళ్లెంలోని పూలలో కానులూ, పైసలూ కలిసివున్నై. పరలోకయాత్రకేగిన ముసిలాయన రహదారిలో వైతరణీ నదిలాంటి అడ్డంకులు రాకుండా, ఆయన వ్యాపారంలో భాగం పంచుకొన్న పుల్లయశెట్టి పూలతోపాటు కానులూ, పైసలూ దానం చేస్తున్నాడు. శవంమీది పసుపుగుడ్డ మీదపడి పైసలు కిందకు దొర్లిపడుతున్నై. ఆ తర్వాత గురవయ్య మనుమలూ, బంధువులూ నడుస్తున్నారు. చావు వూరేగింపు అది.

బెల్లంతో అత్యంత అవినాభావ సంబంధమున్న గురవయ్యగారి భౌతిక దేహపు అంతిమయాత్రను, శ్రీరామ మంటపంమీది సభికులందరూ మెడలు తిప్పి చూచేరు. కొందరు "ప్చ్ ప్చ్ ప్చ్ చ్చా" అని తమ సానుభూతిని తెలుపుకొంటున్నారు. ముసలమ్మలకు కొందరికి తమ సొంత కేసుల్ని గురవయ్య గతితో పోల్చుకొనగానే కళ్ళనీళ్లు వచ్చి, కొత్తదిగులుతో యింటిదారి కనిపించింది. ఇన్నాళ్లూ గురవయ్య పోటీదారు హనుమయ్య తన పీడా వదిలిందని మొదట్లో అనుకొని వెంటనే పాపభీతితో నరకలోకంలోని కాగుతూన్న నూనె పాత్రస్మృతికి వచ్చి, రెండు చెంపలూ ఎవరూ చూడకుండా వాయించుకొని, తీర్థులవారు చూచేటట్లుగా విచారపూరితమైన ముఖం పెట్టాడు. దొంగసాక్ష్యాల సీతారామయ్యకు తను యీమధ్యనే గురవయ్యనుంచి తీసుకొన్న చేబదులు సంగతి, చచ్చిపోతూ చచ్చిపోతూ తన "వీలునామా" లో వుదాహరించలేదుగదా అని భయపడుతున్నాడు.

కాని బసవయ్య చాదరికి శ్మశానవైరాగ్యం అంకురించి "స్వామీ, యీ దేహం గతేమిగాను?" అని అర్థం లేకండా ప్రశ్నించాడు.

"దేహం మట్టిలోమట్టి, పంచభూతాల్లో పంచభూతాలు. ఇక ఆత్మ ఎగిరిపోయి అనంతాత్మలో కలిస్తే యీ దేహాల లెఖ్ఖేవిటి, కాదరిగానూ?"

కేవలం స్వలాభం మాత్రమే ఆలోచించి, యీ ఐహిక, ఆముష్మిక వేదాంతమూ, శ్మశాన వైరాగ్యమూ యీ షణ్మాత్రంగూడా పట్టించుకోని పిల్లలందరూ, శ్రీరామ మంటపాన్ని వదిలి గురవయ్య అంతిమ యాత్రకు ప్రేక్షకులుగా చేరారు. అందులో పన్నెండేళ్ళ బక్క యాదవులు ఒకడు. ఆస్థిలేని రామదాసు కొడుకు, బక్క యాదవులు.

యాదవులు కళ్ళన్నీ పుల్లయ్యశెట్టిమీదనే వున్నై. ముంత కజ్జాయాన్ని పిసికినట్లు పుల్లయ్యశెట్టి పూలను పిసకటం, శనగల్లో గులకరాళ్లు కలిపినట్లు ఆ పూలలో పైసలు కలపటం—యాదవులు ఆశ్చర్యంతో గమనించాడు. గురవయ్య శవం వెనక యిప్పుడు దాదాపు వందమంది దాకా నడుస్తున్నారు. బంధువులే గాకుండా, చచ్చిపోయిన జీవికి బాకీవున్న సన్నకారు జనమంతా, గురవయ్య వారసులు గంద్రగత్తెర్లు లేకుండా, నిశ్శబ్దంగా, గుంపులు గుంపులుగా నడుస్తున్నారు.

యాదవులు పెద్దెరిగిన తర్వాత యిట్లాంటి వుత్సవం చూడటానికిదే ప్రథమం. బజార్లో యీ వూరేగింపు వుత్తరాది ప్రయాణం చేస్తూండగా, యిళ్లల్లోని ఆడవాళ్ళందరూ ఎవరిపనులు వాళ్లు వదిలిపెట్టి వీధి గుమ్మాల్లోకి వచ్చి శవాన్ని వింతగా, శబ్దమేమీ చేయకుండా చూస్తుండటం గూడా—యాదవులి మనస్సులోని 'ఆ'ను రేకెత్తించింది. చేబ్రోలు కోరుకొండ తిరణాలతో యీ వుత్సవాన్ని పోల్చుకొంటూ, తక్కిన పిల్లల్తో పైసలకోసం పోటీలు పడ్తూ యాదవులు, తనకు ఎన్నడూ నాలుగు గింజల శనగలు గూడా కొసరుపెట్టని, గురవయ్య ప్రాణం లేని దేహం వెనక పోసాగాడు.

బక్క యాదవులు తక్కిన పిల్లల్తో పోల్చిచూస్తే పక్కాసి సింద్రీ. ఫుల్లయ్యశెట్టి మురుసుల చెయ్యి బరువుగా, బావగారి పుణ్యంకోసం పైకి లేవగానే, ఒక్క మూకులో ముందుకుపోయి, గద్ద కళ్ళతో పూల నుండి పైసల్ని సుర్తుపట్టి, ఏరుకొని బొడ్డుదగ్గర చిన్న సంచీలో దాచుకొని, తక్కిన కక్షిదారుల జెలసీకి అందకుండా పోట్లాడుతూ, యానాది ముల్లిగాడికి మాటకు మాటబెడుతూ, ఎకిలసింగడిని మోచేతి పసును ఎముకల్తో పొడుస్తూ, జబర్దస్తీగా, ముందు ఆలోచన చేస్తూ నడిచాడు. బక్క యాదవులి నైపుణ్యంతో ఆరోజున ఒక్క యానాది ముల్లిగాడికి తప్పితే, యింకో పిల్లవాడి కెవరికీ దమ్మిడీ దొరక లేదు. వాళ్ళందరూ ఏడుపు ముఖాల్తోనే యాదవుల్ని దబాయించారు. లాభంలేక పోయింది బ్రతిమిలాడారు. ఫలితం కలగలేదు. చివరకు యాదవులి బలహీపు పాయింటు—దయ్యాల భయం సృష్టించారు. యాదవులు బొడ్లోనుంచి పైసా పైకిరాలేదు. యాదవులిప్పుడు బొంబాయిలో డబ్బు వడ్డీకిచ్చి సినిమాలు తీయించే గుజరాతీసేఠ్, బీద కథకుణ్ని తరిమివేసే టప్పుడు పెట్టే—ముఖమైఖరి పెట్టి అందర్నీ, గదమాయించాడు. ఆ గ్యాంగునుండి క్షణంలో తప్పించుకొని, గమళ్ళ యెంకమ్మ యింటి ముందు పొద్దుట్నించీ యీగలు ముసుర్తున్న జంతికలూ, నిన్నటి చద్ది పకోడీలు, సుదురుముంజలూ కొనుక్కుతిన్నాడు. అందులోగూడా తోటివాళ్ళకు భాగం పెట్టలేదు.

యాదవులి కడుపులో "టిఫిన్" సగం జీర్ణమై పోయినా గ్యాంగు అతన్ని వదిలి పెట్టలేదు.

"అరే సస్తావురా!" అని కాపుల పిల్లాడు సిన కన్నయ్య కోపం వెళ్ళగక్కాడు.

"ఆ పైసలమీన దెయ్యంవుందిలే" అని సింగడు ఖచ్చితంగా జెప్పాడు.

వంకాయల మాణిక్యం కొడుకు యల్లమంద యింకో మెట్టు ముందుకుబోయి "సచ్చినోడిమీది పైచల్తోదింటే దేవుడి శాస్తేగందరా! తూరుబ్బజారు బుక్కా పిలుపుగాడు జచ్చింది దేనికిరా? ఆడుచ్చ చానంలో పైచలు దొరికితే చాంబయ్యకొట్లో గుగ్గిళ్ళుతింటే గాదంటరా? నాకు దెల్చులే, నువ్వుగూడా తొమ్మిదోనాటికి బుడింగిమంటావులే."

ఉలకలేదు యాదవులు. పలకలేదు యాదవులు. ఒక్కక్షణంవుండి ఒళ్లంతా దులుపుకొని, మావూరి ధర్మకర్త లుండగానే పాడుబడ్డ "చివాలయం" మొగదలకెళ్లి, వినాయకుడి పాదాలముందు కూర్చున్నాడు చీకట్లో.

నిజానికి యాదవులు ఏదో భయంతోనే అక్కడకు వచ్చాడు. వాడి ఆత్మ నిశ్శబ్దాన్నీ, శాంతినీ కోరియీ ఏకాంత ప్రదేశానికి తీసుకువచ్చింది. వాడికి చీకట్లో వంకాయల మాణిక్యం కొడుకు మాటలే తిరిగి తిరిగి స్మృతికి రాసాగినై నిజమేనా? అనుకొన్నాడు. బుక్కా పిలుపుగాడు చచ్చింది అందుకేనా? యల్లమందగాడు గప్పాలుకొట్టే బాపతు కాదే? ఛా! యచవకు ఒక్క జంతికిస్తే ఏంబో యేది? నిజమా? బుకాయింపా?

యాదవులు చీకట్లో చీకటైపోయాడు. వాడికి కళ్ళవెంట నీళ్లు వచ్చినై. తల తిరిగిపోయింది. భయం వేసి పెద్దగా అరుద్దా మనుకొన్నాడు. ఎదురుగా వున్న నంది విగ్రహం కదిలినట్లయింది. కాని గొంతు పెగల్లేదు. కాళ్లు చేతులు చచ్చుబడి దేహం కదలలేదు. వాడి వ్యక్త మనస్సుకు శరీరంమీద అధికారం తగ్గిపోయి అవ్యక్త మనస్సుకు పూర్తి కంట్రోలు వచ్చేసింది. ఇంతలోనే నిద్ర సోలుతూ తూలుతూ వచ్చింది. మనస్సూ, దేహమూ అలిసిపోయి, ప్రమథ గణ నాయకుడైన విఘ్నేశ్వరుడి పాదాలముందు సుషుప్త్యావస్థలో యాదవులు పడిపోయాడు. నిద్రలో వాడికి కలవచ్చింది. అది ఆలోచనల కల.

"చావటమంటే ఎంతదర్జా? తనుగ్గూడా చస్తేనో? నాయనట్లా గురవయ్య బావమరిది ఫుల్లయ్యశెట్టిలాగా పూలూ, పైసలూ తనమీద చల్లుతుంటే? ఊళ్లో జనమంతా పను లాపుకొని తన వెంటనే అట్లా వస్తారు కాబోలు! యీ "సేతగాని యెదవనాగన్నలు"—చింగన్నా, ముల్లిగాడూ, యల్లమందాయ్—అంతా రావాల్సిందేగా? ఎవడికోసం??"

ఆలోచనల కల నిజమైన కలలోకి మారింది. ఈసారి బుక్కా పిలుపుగాడు కనిపించాడు. వాడికి కండలు లేవు. ఒట్టి ఎముకలపోగు.

"ఏరా - పిలుపుగా ? నువ్వు చచ్చిపోయా వంట నిజమేనా ?" అని తను అడిగాడు.

వాడు నవ్వి—"అవును.—అబద్ధమేముంది ? నేను గనబట్టల్లా ?" అన్నాడు.

"అరేయ్, ఎందుకు జచ్చావురా !"

"సచ్చినోళ్ళమీది పైచలేరుకుంటే !"

ఈమాటతో యాదవులికి జాగ్రద వస్థవచ్చింది. మళ్ళీ దెయ్యాలలోకంనుండి భూమ్మీదకు దూకినట్ల యింది. భయంతో అర్థంలేని అరుపులు అరవసాగాడు. ఈ భయంకర శబ్దానికి గుళ్లో ధర్మకర్తల ఏకొంట్లయిన గబ్బిలాలు లేచి చెదిరి అటూ యిటూ ఎగరసాగి నాయ్. యాదవులు వినాయకుణ్ని కౌగిలించు కొన్నాడు. కాని గబ్బిలాలు తలమీదనే రెపరెప కొట్టుకొంటున్నాయ్. శిథిల దేవాలయపు మొండి గోడలు చీకట్లో ఆకాశ మెత్తుగా పెరిగి పోతు న్నట్లు యాదవులికి కనిపించింది. గుడివెనక చింత చెట్లనుండిగూడా ఏవో శబ్దాలు వినిపించినై. నిజాని కది వానశబ్దం.

వినాయకుడి రక్షణ వదిలి యాదవులు బయటకు పరుగు లంకించుకున్నాడు ప్రాణభయంతో. "అమ్మో, ఓరిబాబో ! నాయినో ! బాబో !" అని అరుచుకుంటూ. బయట ఎదురుదెబ్బ తగిలి బొక్క బోర్లా పడి లేవబోతూంవగా, తండ్రి వానలో గొంగళి కప్పుకొని తనను వెతుక్కుంటూ వచ్చాడు.

రామదాసు బక్క యాదవుల్ని పట్టుకొని—

"ఏరా ! ఒళ్లు కాగిపోతున్నది. జొరం వచ్చిందా ?" అని అడిగాడు.

* * * *

యాదవులు జ్వరం మరునాడుగూడా తగ్గలేదు. రామదాసు మంగలి వైద్యుణ్ని పసరు అడిగేందుకు వెళ్లాడు. యాదవులికి రాత్రి అనుభవం కలో నిజమో అర్థం కాలేదు. అర్థంకాక—"అమ్మా, బుక్కా పిలుపుగాణ్ని సూశానే ?" అన్నాడు తల్లితో.

లచ్చుమ్మ కొంచెం ఆశ్చర్యంగా కొడుకువంక జూసి—"నీకేమి రా పిచ్చి ? పిలుపుగాడు జచ్చి ఆరునెల్లయితే" అని సమాధానం యిచ్చింది.

"కాదే ! నిజవేఁ !" అని యాదవులు అనబో యాడు గాని మత్తువచ్చి మాట్లాడలేదు. ఆ మగతలో మళ్లీ బుక్కా పిలుపుగాడు కనిపించాడు.

ఆ మత్తు మత్తు రాత్రికిగాని తెలియలేదు యాదవులికి. జ్వరం పేలిపోతున్నది. వాడి ఒంటి మీద ఏ గుడ్డా నిలవటంలేదు. ఈ ఒక్కరోజు జ్వరానికే చిక్కి శల్యమైపోయాడు. రామదాసు ఒకటికి రొండుసార్లు మంగలి వైద్యుడిచుట్టూ తిరి గాడు. తండ్రి జావ యిస్తూంటగా యాదవులు జాలిగా చూశాడు.

"ఈత గొట్టావా. తూర్పు కాలవలో ?" అని రామదాసు అడిగాడు.

"లే...లే...! ఊ...హూ...!"

"మరి జ్వరం జేనికిరా ?"

యాదవులు సమాధానం చెప్పక, కళ్లు మూసుకు న్నాడు. కొంచెం సేపటికి కళ్లు తెరిచి—

"అ...య్యా...!" అని తండ్రిని పిలిచాడు.

"అయ్యా...సచ్చినోళ్ళమీది పైసలేరుకుంటే తిరిగి బతికునోళ్లు సస్తారా ?"

"నువ్వేరుకున్నావా ?"

"అహ ! బుక్కా పిలుపుగాడు."

"పిలుపుగాడికి చన్నిపాత జొరంవచ్చి జచ్చిండు"

యాదవులికి యీ సమాధానం ఏమీ నచ్చలేదు. నచ్చక తండ్రి బయటకు పోవటంమాని తల్లిని పిలిచి అదేప్రశ్న వేశాడు. పిచ్చిలచ్చుమ్మ "నిజమే" నన్నది.

నాలుగురోజులు గడిచినా జ్వరం తగ్గుముఖం చూపలేదు. రోజురోజుకూ రోగి చిక్కిపోతూ న్నాడు. రామదాసు, కొడుకు కుక్కిమంచపు కాళ్ల గట్టున గూర్చొని కళ్ళనీళ్ళు పెట్టుకొన్నాడు. అది చూచి యాదవులు—"అ...య్యా..." అని పిలి చాడు. కాని ఏవో అవ్యక్తంగా, హస్తాల్తో గుర్తులు చూపాడు.

"అయ్యా...కో...ప...మా...?"

"ఊ...హూ" అని తలూపాడు రామదాసు కేమీ అర్థంగాక.

"నేనేరేనే ?"

"ఏవిఁటి ?"

"కోమటి గురవయ్యమీది పైచలు"

"అరి పిచ్చిదవకౌనా, ఏమయితే?"

"కా...దు..."

"మ...రి..."

"బుక్కా...పిలుపుగాడు"

రోగి పెద్దగా అరిచాడు. మూలిగి మగతలో తిరిగి పడిపోయాడు.

* * * *

ఎనిమిదిరోజుల జ్వరానికి అంతులేదు. ఎనిమిదోరోజున యాదవులు తన స్నేహితులు సింగణ్ని, మాణిక్కెం కొడుకు యల్లమందను, యానాది ముల్లిగాడిని, కాపుల పిల్లాడు సినకన్నయ్యనూ పిలిపించుకొన్నాడు.

"అ...రే...య్... యల్లమందా ... నువ్వ చె...ప్పింది...నిజంరా!"

"ఏంది???"

"బుక్కా పిలుపుగాడి మాట"

యల్లమంద నవ్వి "అబద్దం. అబద్దం. నిన్ను బయాలు బెట్టేందుకు జెప్పాన్రా."

యాదవులు జీవంలేని గొంతుతోనే, భావి అడుగునుండి మాట్లాడాడు.

"నిజంరా...ఆ..డు.. నాగ్గనబడిచెప్పిం..డు.."

పిల్లలందరూ దిగాలుపడి చూశారు. అందరికీ కళ్లనీళ్ళు వచ్చినై. వంకాయల మాణిక్కెంకొడుకు యల్లమంద పెద్దగా ఏడ్చాడు.

మళ్ళీ యాదవులు మాట్లాడాడు.

"అ...రే...యాడో... వొద్దురా ... నేను బుక్కా పిలుపుగాడిదగ్గిరి కెళ్తాన్రా! మా బాబుకు జెప్పి, నేను జచ్చినాక పైసలు జల్లిపిస్తాను. యల్లా! నువ్వేరుకో; సింగడికియ్యి...సినకనకయ్యకు...ముల్లి...గాడికి చెరిసగంగా యియ్యరా."

యాదవులికి మళ్ళీ తెలివి అర్ధరాత్రికి వచ్చింది. రామదాసు కొడుకుమంచం వదల్లేదు.

"అ...య్యా... నేను జస్తే...గురవయ్యకు జల్లి...నట్లు...పైసలు...జల్లుతావు...గా..."

ఈమాటు రామదాసు బావురుమని ఏడ్చాడు. ఆరాత్రి భళ్ళున తెల్లవారింది. రాత్రంతా యాదవులు కలవరిస్తూనే వున్నాడు. జ్వరం గంటగంటకూ ముదిరిపోయింది. మంగలి వైద్యుడు గరళం పోసే ఏర్పాట్లుజేసి, పన్నెండేళ్ళ యాదవులి మాడుగీచి పట్టువేస్తున్నాడు. కాని వంకాయల మాణిక్కెం కొడుకు యల్లమంద భవిష్యత్ చెప్పినట్లు తొమ్మిదో నాటికల్లా యాదవులు యిహలోకయాత్ర చాలించాడు.

* * * *

ఆరాత్రే గ్రామస్థులు రామదాసును, చచ్చిపోయిన గురవయచెట్టి కొట్టుకు కన్నంవేస్తూండగా పట్టుకొన్నారు.

దొరలందరూ దొంగను అడిగారు—

"ఎందుకుచేశావ్ దొంగతనం?"

రామదాసు అన్నాడు సమాధానంగా—

"నాకొడుకు శెవ్వంమీద పైసలకి"





# సత్యాగ్రహం



శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

పూర్వం
ఉండేది మనుష్యుల్లో సత్యాగ్రహమొకటి.
అది దేవికరాల్లో
ఒక కరవాలంగా నిలబడి
ఆమె నడచుదారుల్లో పొంచిఉన్న దౌర్జన్యాన్ని
సమూలం చెండాడ్తూ
ఆ దొంగతనపు దాగుడులో
మోసపునీడల చెల్లాచెద రొనరించుటలో
ఉపయోగపడేదప్పుడు.

అసిపిడిపై పిడికిలి దేవి బిగించిందా
ఆ నారకలోక దురాశారాశులు
తమకుటి దట్టపుచీకటి ఛటలను
వదలి కదలిరా భయపడి నక్కే వొకమూల.

కానీ
ఈరోజుల్లో దుష్టశిక్షణార్థం
దేవిదాడి సలిపే అవసరమున్నప్పుడు
చూశారా ఆ ఆయుధమెవరన్నా ?
ఊరక నిలబడి చూస్తున్నది
దేవి నేడు అన్యాయాన్ని !

కళ్ళు జిగ్గుమనిపించే అమరకాంతిపుంజం
ఆముఖసీమను
వెల్లువలై ప్రవహించకపోవడం వల్లను—
దౌర్జన్యపుధిక్కారం అణగారించి
దాన్ని నిలువనీడ లేకుండా
దిగంతాలదాక తరుమగలుగు
శాతఖడ్గ ప్రళయరుద్ర వర్తనం
ఆ శిష్టజనావన హస్తాల్లో
నిలువకుండడం వల్లను
ఈ పాతాళ పిశాచుల వికృతాననాలు
సిగ్గింతే లేకుండా
ప్రతిద్వంది మొగంచూసి
పరిహసింప సాహసించు !

ఆ మునుపటిరోజుల్లో తొడిగిన ధర్మకవచమే
ఆనాటి శిరస్త్రాణమె
ఈనాడూ అంగాన ధరించి
సదాసిద్ధంగా ఉన్నదిదేవి.
కాని నిర్దాక్షిణ్యంగా
కాపట్యం మొదలంటా పెల్లగింప
ఆమె అసలశక్తురాలు—
సత్యాగ్రహం లేదుజగతి...
లేదు దేవిచేతకత్తి.

## 2

ఓ దివ్యకృపాణం !
మరొక్కసారి మాదేవి కరాలకు రావా ?
పరమాత్మనిబంధమై ఆమె మరల
మా భూముల్లో ఏపుగ పెరిగిన పాపపుపంటను
మొదలంటగ తెగగోయగ ?
ఓ అమరశక్తి సంకలితాగ్రహమా !
సత్యరౌద్ర జనితాసీ !
సృష్టిసమస్తం
తృష్ణాపూర్ణమై ఉన్న విధంగా
నానాగందరగోళంగా ఉన్నప్పుడు
దుర్భరమా ప్రాథమిక యుగాల్లో
ఆనందానికి వ్యతిరిక్తంగా ఉన్న ప్రతీదాన్నీ

సమూలముగ నాశనంచేసితొలి
భగవానుడు స్వర్గాలు సృజించిన సమయంలో.
క్రమవిహీనమగు విలయ ప్రకృతిపయి
దాడివెడలి పోసలిపి
ఆ మధ్యంనుండి
అనేక సవితృమండలాల్నూ
సితతారా తరళపాళీ
సృష్టించావు గదమ్మా!
మూసిన విశస్త్రాగారంలో బందీవిప్పావు?
నీ సిత నిశిత కనద్ధారలు త్రుప్పెక్కినవా?
ఓ సత్యరౌద్ర జనితాసీ!
అమరశక్తి సంకలితాగ్రహమూ!
ఆ క్రూరపిశాచుల వక్రపతాకల ఔద్ధత్యం
ఎదిరింపగలిగేవాడి, సత్యాగ్రహశక్తివేడి,
సున్నాలై పోవడాన్ని
దుష్టశిక్షు కాయుధమేదీ లేకుండా
ఇన్నాళ్ళై అసహాయగ నిలబడి ఉన్నదిదేవి:
ఆమె కేలి కదలాడ్తూ
మాపాలాల పరిసంభ్రం చేయగరావా?
మహారౌద్ర భారంతో తన దోర్దండాలూగులాడ,
తనచుట్టూ విసిరే గాలినింప
వేడిపొగల సెగలెగయగ,
మరల మెదలనీ మహోత్సాహం
ఆమె మనస్సీమలో!
పరమప్రభు క్రోధాలు, బృహద్వ్యూహ్నులు,
మరల పొదలనీ గరాతలంలో!
ఓ సత్య రౌద్రజనితాసీ!
అమరశక్తి సంకలితాగ్రహమా;

## 3

ఆరోజుల్లో
మానవుని మనస్థలం
పవిత్రసీమగా ఉండేది.
తేరిచూడరాని తెల్లదనంతో
వెలిగే పెద్దమంటతో
విసురుగ కదలుతు, సుళ్లుతిరుగుతూవచ్చే
ప్రళయానిల సంఘాతాల
భయంకర దండయాత్రలంటే
సుండెల్లో బెదురగుటను
దుష్ట నరకశక్తులు
ఆ పవిత్రమందిరం గడపే త్రొక్కుదలుస్తే
అతి జాగ్రత్తగ నడిచేవి.
కానీ ఇపుడిప్పుడు
సత్యాగ్రహశక్తి అసలు
యుద్ధానికి సంసిద్ధంగా లేకుండుటవల్లను
ఆ రాక్షసశక్తులు
పట్టపగలె పాలిస్తున్నాయ్ సరనంతా.
విచ్చలవిడిగా విఱ్ఱవీగుతూ
మనుజుని హృదయాన్నాక్రమించుకొంటున్నాయ్

ఆ పదాల కదలికలను
దొంగచాటు దనం లేదు.

రకరకాల వికృతశకటాల చక్రాల్తో
మట్టేసిన బురదమట్టిలా
నేడా అసహాయ మనస్థలమంతా
తమ ఉన్మత్త పదాల అర్థహీన ప్రచలనాల
ఎడత్రొక్కుడి పెడత్రొక్కుడి చేస్తూ
ఆ మార్దవమంతా మాపేస్తున్నాయ్!
అమర కాంతులేవో
నిరంతరం నడయాడే దారులతో,
చలువలనొలికే గాలులతో,
భగవన్మందిరమే అనుభ్రమకలిగించే పవళ్లతో,
అమరుల అమృతపు విందులతో కలకలలాడే
రాత్రులతో,
అతి సుందరమౌ మానవు మేధా వాతావరణం
చూసిసహింపగజాలక పోయిందా నారకపాతక
బృందం.

కాపట్యపుటస్నలను రగుల్కొల్పి,
కెంజాయలతో భయంకరంగాఉండే సంజల్లో
పొగమారిన అసభత్వంనిలబెట్టి,
కాళమేఘపటలాంధతమంతో
సర్వాన్నీ ఆవరించి,
పగటివెలుగు మాయజేసి
తమ కనుకూలంగా ఉండే వాతావరణం
సృష్టింపగ మొదలిడిందా ఆసురశక్తిగణం.
మనుజుమనసు మిన్నుమీద
ఇసుకతుపానులు మబ్బులు
దిగువగ వేలాడజేసి

తుదనుగెలుపు పొందాయవి !
నరుని అవేలపుటాలోచనాతిరస్కారిణులపై
ప్రళయపునల్లని నీడల జాడలెవో కనరావా ?

## 4

తానిదివరకంత మహోల్లాసంతో పాటలుపాడ్తూ
మాలీపనిచేసిన ఈ మానవజీవిత వనమాలాంగన
పాడవటంచూసి దేవి ఎన్నాళ్ళుసహిస్తుంది ?
హద్దులేని అహంకారంతో మిన్నూమన్నూ గనబోకుండా
తిరిగే రక్కసిమూకలు నారక పాశ్వికసైనికులు
కరకుపనపు టడుగులతో పైశాచిక నృత్యంతో
మెత్తని విరిరేకులు నిండినదారులు చెడద్రొక్కుతు
చీడపుర్వుగుంపుల్లా తోటంతా ఆక్రమించి
నాశనం వెదజల్లడాన్ని దేవింకెన్నాళ్ళోర్వుస్తుంది?
ఓర్వకేమి చేయగలదు ?
మూర్ఖపు పేరాసా,
స్వార్థం.
మౌఢ్యం,
గోడలైన
నీచపు బండెలవొడ్డిని, ఊపిరి తిరుగని స్థలాన
దేవి నేడు
ఖైదీగద !
మానవతన్నది బలవంతంగా వికృతిచేసే
మన ఆసురదౌర్జన్యం—
మొరటుపనంతో వ్యసనలుజగంలో
వెదజల్లుతు మనంహింసారతిలోపొందేసంతృప్తి—
కార్ఖానాలూ కొలుములూ
బిగియగట్టి ఉంచిన మన ఈ నాగరికసంఘం—
కని ఆమె అదే మనునో అని
నీచపు బండెలదొడ్డిని
ఊపిరి తిరుగని మడ్డిని
దేవినిలా
నేడు మనం బందీగా జేశాం !
మనం చేసే ఘోరాలకు మందలించలేదు దేవి !
న్యాయం పేర మనం
లోతుగగాయం చేసినగుండెలు—
సాలెపురుగు గూటిలోన కీటకాలలా
మన వ్యాపారపుటినుపపిడికిళులలో చిక్కుకు
తప్పించుకునే దారిలేక
గిజగిజ కొట్టుకుపోయే మృదుగాత్రలు—
అబ్బా !
అది తలపుకు వస్తేనే
ఒడలంతా కంపిస్తున్నది !
బురదలోన పొరలాడే పందుల
బ్రదుకులకన్నా నికృష్టంగా బ్రదుకులలోన
మానవతన్నది దిగజారగ,
పైశాచిక కృత్యాలకు నిలయాలగు
ఖండాలపు సందులలో, గొందులలో,
పలికివచ్చు మెట్లులేని
పాపపు కూపంలో
దిగబడి
ఎలాటి నైచ్యానికిగూడా
పాల్పడడానికి సందేహించని
పశుప్రవృత్తిని పొందుతున్నవే
ఎన్నెన్నో జీవాలు !
వాటికి పేదరికాన్నిచ్చి,
మనంచేసిన నేరానికి
అవి జైళ్ళల్లో కఠినశిక్ష లనుభవించాలి !
జాలిఅన్నదే లేకుండా
ఈపూలను నేలను రాలిచి
ఆ రేకుల కాలను రాచే,
మనకర్కశకార్యానికి
మనలను మందలింపగల
మానసముండియు
లేచివచ్చు శక్తిని గనలేదుదేవి,
తన కేలను నిల్వమి వాడికత్తి !
పందులు, కోళ్లూ
పడిఉండే చోటులకన్నా
హీనమైన స్థలములలో నిద్రా,
తిండికాని తిండీ,
ఇంతేనా ప్రతిఫలం ?
ఆఫీసుల్లో
ఫ్యాక్టరీలలో
నడి సంద్రాల్లో
పొలాలలో
ఖర్చయిపోయే బ్రదుకులకు
మనమిచ్చే విలువ ఇదేనా ?

వెలఎంతో తెలియని
జీవితాలిలా
దుర్వ్యయమైపోవడ మంతం కాదా ?
శవాల్ని పీక్కుని తిని బ్రదికే
రాబందుల్లా
మనమమానుషంగా
కోట్లకొలది తోడివార్నిలా
కడుపు తరుక్కునిపోయే పేదరికంలో
అణగార్చడమేనా ?
చిలుకల పీకలునొరికే పిల్లులమై
పసిపాపలసునసుల వికసింపగనీయక
నమిలేస్తామా ఈలాగున ?
తిండిలేక మాడడానికో—
లోహచక్ర పైశాచికవిజ్ఞానం
మానవ వివేచనాశక్తిని
భయంకరంగా ఆకర్షిస్తూ,
అంతులేని రహాశ్చార్యంతో
తమ ఉన్మత్తావర్తుల భ్రమణ
హృదయ విదారణ దారుణ
భీషణ ఘోషణలతో
కార్మికుల హృదంతరాలు
దొంగిలించివేయగా
చివరకచట
మానవులే నిర్జీవ పదార్థాలుగ
యంత్రాల్లో భాగాలే జీవంగలవస్తువులుగ
మారే యమసదనాల్లో
రేబవళ్లు శ్రమించడానికో—
రాక్షసత్వమునతోడివార్నిలా పేదరికంలో
అణగార్చడమేనా ?
మన కార్యకలాపాల్లో
ఒకసారైనా
సౌందర్యమనే మాటను
తలపెట్టగబోమాఇక ?
చేయడాని కింకేంలేదా
దైవానికి మొరలిడుకోడం మినహా ?
ఛీ, ఛీ, ఇంత అశక్తులమా ?
పాశవిక శక్తులమా !

* * * *

ఒకనాడీ మానవసంఘంలో
కదలాడిన సత్యాగ్రహశక్తి
మరి ఒకమారీ కుళ్లు ప్రపంచంలో
కదలే సుదినం రాదా !
అపుడు దేవి దుఃఖభరంతో
కనుకొలకుల జార్చదసలు
దుర్బలయై అశ్రుధార !
ఒక్కఉదుట లేస్తుంది !
క్రోధపూర్ణ తీక్ష్ణవహ్ని
కదలాడే పిడిగల అసిఒక్క
ఆపరమాత్మని దివ్యరౌద్రశ
తనకేల చలిస్తుంటే
ఆమె మనస్సంతా
ఉత్సాహంతో
పొంగి పొరలుతుంది !
నరకంలో
ప్రళయపు 'క్వారీ' గుట్టలలో
రాయిరప్ప సంతరించి
తన్ను కొలుపెట్టనీక
మానవజీవిక చుట్టూ
దుష్టశక్తులలాకట్టి
నిలబెట్టిన గోడలు
పునాదుల్తో దేవి
నేలబడ గొడ్తుంది !
కృతక తారతమ్యాల్ని
అన్యాయపు వ్యాపారాన్ని
పేరాసలయాజమాన్యమునకు దోహదమగుపద్ధతుల్ని
ఒకదెబ్బకు తెగగొట్టుంది
దీక్షాపరతంత్ర, దేవి,
సత్యాగ్రహ తరళలసితసిత నిశితాసి ధారతో !
ముక్కముక్కలై, పొగలై,
ఈ దౌర్జన్యాలన్నీ
మచ్చునకన్నా కనబడకుండా
మాయమైపోతాయి ప్రపంచంలో !
అన్యాయం మనస్సులో
మరణభీతినింపే స్వరకల్పనతో
విలయగీతికలు పాడ్తుంటప్పుడు దేవి !
తిరిగి
తనవిశాల రాజ్యవీథుల్లో
ఊరేగుతుంది

సత్యాగ్రహ ఖడ్గం
దక్షిణహస్తంతో బిగబట్టి ఆమె!
మరల ధరణి నారంభిస్తాయి
కనులకు పండువుచేసే పైడిదాడి వేడుకలు!
ఆఖడ్గం వాడిఅంచు
చురుకువెలుగు లోర్వలేక
మనిషిమనసు కాపురాన్ని
మాని వికృతభూతరాశి
పఠిస్తుంది పలాయనమంత్రం
ఏజాడా దొరకరాని నీడలకోసం!
బృహజ్జ్వలత్సత్యాగ్రహ వర్తుల చాలనాలలో
దృఢదీక్షాశాతోత్సాహ శ్రీ పాలనాలలో
తెగులుకొన్నదై
గాలికెగుర గొట్టబడుతు పోతుంది
బ్రదుకుల కాధారంగా
మనం కట్టుకొన్న ఈ చీకటికుటి
ఈ అధమాధమమౌ ఆర్థికగృహం!
కత్తి అంచుటుతుకు లోర్వలేక
ఈ అతుకులబొంతలు—
మనవ్యాపారం, పేరాసా, పాతకాలు,
మన పైశాచికలోకం అభివృద్ధీ,
సమూలంగా ఆ విసురులలో
పరమాణువులై చెల్లాచెదరైపోతాయి!
మనిషిమనసు నింగిదాక
నాశనమున దిగగొట్టిన
ఇనుపమేకు లీపన్నులుగల ఒకువసుపత్రాలు
సడలిపోయి,
ఈలోహపు శ్రేమతెర దిగజారిపోయి,
వెలికి వస్తుంది
ఆలోచనాశక్తి!
దేవలోక రాజ్ఞివోలె
ప్రణవాభాప్లావిత సురభిళుల్లో
విహరిస్తుంది!

* * * *

మరొకసారి మాదేవి కరాలకురావా
సత్యకేంద్ర జనితాసీ,
అమరశక్తి సంకలితాగ్రహమా,
పరమాత్మని బంకై
మా భూముల్లో ఏపుగ పెరిగిన పాపులపంటను
ఆమెమరల మొదలంటగ తెగగోయగ?
ఓ సత్యాగ్రహమా!

(లాంసిలెన్ ఎబర్క్రోంబీ వ్రాసిన "ఇండిగ్నేషన్ : ఎన్ ఓడ్" ఆధారంగా రచన)



# చంద్రేణైకపుత్రః

శ్రీ శ్రీనివాస శిరోమణి

"అక్కయ్యా, బావ ఏంచేస్తున్నాడు" అంటూ పొద్దునే కరణము రామయ్య వచ్చి సుబ్బమ్మను అడిగినాడు.

"కూర్చోండి పంతులూ; నిన్న ఉదయము పాలెంపోయినారు. ఇంతవరకూ రాలేదు. రాత్రికే వస్తాము అన్నారు" అన్నది సుబ్బమ్మ.

"ఎందుకు పోయినాడు ?"

"అక్కడ వారి తాలూకు ఎవడో పిల్లగాడు ఉన్నాడుట. వాణ్ని పెంచుకోవలసింది అని వారి వారు అందరూ పట్టుపట్టినారు. ఆ పిల్లవాణ్ని చూడటానికి పోయినారు"

"అదేమిటి అక్కయ్యా, బావకు మతిపోతే పోయింది; నీకుకూడా మతిపోయిందేమిటి ?—ఏ ఒక్క చోటనైనా పెంపుడు కొడుకు అతకడము కానీ పెంచుకొన్న తల్లిదండ్రులకు ఉపయోగపడటము కానీ చూచినామా ! లేనిపోని తద్దినం. పెంపుడు అంటే తగాదా కొనుక్కోడము అన్నమాట. ఈ కాస్త విషయము నీకెట్లా తోచలేదు" అన్నాడు రామయ్య.

"పంతులూ, మీ బావగారి సంగతి నీకు తెలియనిదేముంది ? అనుకొన్నట్టు చేసి తీరవలసిందే"

"కాదు లేవమ్మా, నీకు తోచి ఉండదు. లేకపోతే నీవు చెపితే బావ వినకపోవటము ఏమిటి ?—

"అయితే నా ఇష్టముతోనే మీ బావగారు ఈ ప్రయత్నము అంతా చేస్తున్నారు అంటావా ?"

"సుతరామూనూ."

సుబ్బమ్మ ఒక్కనవ్వు నవ్వింది. "సరే ఆయనగారు రానియ్యి. చూదాము" అన్నది.

"అయితే అక్కయ్యా, నీకు పిల్లలు కనే వయస్సు మళ్లింది అంటావా ?"

"ఇంకేమి పిల్లలు. నేను కిందటి గాలివాన ఇంకా అయిదు సంవత్సరాలకు కొడుతుంది అనగా కాపురానికి వచ్చినాను. గాలివాన కొట్టి ఎన్నేళ్లు అయిందో లెక్క చెప్పు"

"గాలివాన కొట్టి ఇప్పటికి పాతికేళ్లు అయింది. ఏమోలే—నీ కడుపున ఒక కాయ కాయ కూడదూ" అన్నాడు రామయ్య.

"చాలులే—నీ చమత్కారము. నలభైఅయిదు దాటిపోయినవి. ఇంకా పిల్లలు ఏమిటి"

"పోనీలే—నీవు పిల్లలను కనలేక పోయినా మా బావకు పిల్లలు పుట్టే వయస్సుమాత్రము మళ్ళలేదు."

సుబ్బమ్మ నవ్వింది. కాని ఆమె ఊహలు ఎక్కడెక్కడికో పోయినవి. ఒక్కసారి రామయ్యను తేరి పారచూచి "నిజమే పంతులూ, నీవు అన్నట్టు నా పిల్లవాడు కాకపోయినా ఆయనగారి పిల్లవాడు అయినా కొంత నయమే" అన్నది.

"అదేనమ్మా నేనూ చెపుతూఉంది" అని రామయ్య అంటూ ఉండగా కిర్రుచెప్పులతో గ్రామ మున్సబు నారయ్య వచ్చినాడు. రామయ్యను చూస్తూ "పంతులూ ప్రొద్దునే వచ్చినావు. ఏమిటి తహశీల్దారు మన ఊరు వస్తున్నాను అని తాకీదు ఏమైనా పంపించినాడా" అన్నాడు.

"అదేమీలేదు. ఒక జ్యోషి మన ఊరువచ్చినాడు. ఆయన పాండిత్యము మీరు పరీక్షించవలెను"

"ఇంతకూ నీకు ఆయన ఏమి జోస్యము చెప్పినాడు" అంటూ నారయ్య కుర్చీలో చేరగిల బడినాడు.

"ఇప్పుడు ఉన్నవాండ్లు చాలనట్టు యింకా నల్గురు ఆడపిల్లలు పుట్టుతారు అన్నాడు"

"శబాష్ మొత్తము పదిమంది అవుతారు అన్న మాట. ఆడది అంటే మా చెల్లెలుకే తగిపోయింది. నూడు మీ అక్కను..."

"సరేలే సరాగము" అంటూ సుబ్బమ్మ "ఎప్పుడో ఎందుకు పంతులూ—ఆ జోస్యులను ఇప్పుడే పిలిపించు. మీ బావగారు పోయివచ్చిన పని పండో కాయో తేలుతుంది. చూతాము" అన్నది.

"పంతులూ—ఇప్పుడే పిలిపించవయ్యా—మధ్యాహ్నమునుంచీ నేను మళ్లీ ప్రయాణము అయిపోతాను. మోతావాడు లేడు. ఎవరిని పంపిస్తావు" అన్నాడు నారయ్య. "గురవణ్ని పంపిస్తానులే" అంటూ సుబ్బమ్మ లోపలికిపోయి పాలూ పెరుగూ నెయ్యి మొదలు అయిన మోయాను సామగ్రులు అన్నీ ఇచ్చి అవన్నీ కరణముగారి ఇంట్లో ఒప్పచెప్పి అక్కడ ఉన్న జోస్యులవారిని వెంటనే పిలుచుకొని రమ్మన్నది. రామయ్య గురవణ్ని చూస్తూ "వీడు ఎవడుబావా, గుండు అల్లె ఉన్నాడు. వీడు ఏ దేశమునుంచి ఇక్కడికి దిగినాడు" అన్నాడు.

"మీఅక్క వంటచేసుకోలేక చిత్తూరుజిల్లా నుంచి అల్లా వీణ్ని రావించిందయ్యా" అన్నాడు నారయ్య.

"వీడు ఆశ్టే తినలేడు అనుకొంటాను"

"చాలు లెస్తురుమీ వేళాకోళాలు. ఆజోస్యులు వచ్చేసరికి మీరు కాస్త మంచిమాట చేసుకోండి" అంది సుబ్బమ్మ, నారయ్య లేచి ఇంట్లోకిపోయినాడు.



నారయ్య మామూలు గ్రామ మున్నబుల మాదిరిగా కరణాల దస్త్రాల కావలివాడు కాడు. అతడు శ్రీమంతుడు. ప్రతిభావంతుడు, చిన్నప్పుడు అయితే చదువుకోలేదు; కాని వయస్సు వచ్చిన తరువాత ఒక భట్టురాజుగారిని ఇంట్లో ఉంచుకొని తెలుగు ప్రబంధాలు అన్నీ చదివించుకొని తెలుసుకొన్నాడు. వ్యవహార జ్ఞానముకోసము ఒక ఇంగ్లీషు అయ్యవారిని పెట్టుకొని ఇంగ్లీషు నేర్చుకొన్నాడు. ధారాళముగా ఇంగ్లీషు మాట్లాడుతాడు. [illegible] మాట్లాడినా ఇంగ్లీషు ఇట్టే తెలుసుకొని ఇంగ్లీషులోనే జవాబులు చెప్పుతాడు.

పితృ పితామహార్జితము ఒక వెయ్యియకరాల మాగాణిభూమి, ఒక నూరు యకరాల మెట్టభూమి ఉంది. తాత ముత్తాతలు "వద్దు కుమ్మ్యాకెమ్రగా శిస్తులు కట్టలేము" అన్నప్పటికీ లెహాసీల్‌దార్లు శిస్తులు పెంచడానికి మంజూర్లు చేసిన ఇసుక పర్రలు వందలకొద్దీ యకరాలు నారయ్య హయాములో సరుకు వనాలు అయిపోయినవి. అందువల్ల టోకు బేరముచేసే సరుకు కర్రల అడితీ ఒకటీ... రైసుమిల్లు ఒకటే ఉన్నవి. ఆయన ఆ గ్రామపంచాయతీబోర్డు ప్రెసిడెంటు కూడాను. ఇంకా ఇట్లాంటి గౌరవోద్యోగాలు ఎన్నో ఉన్నవి. వదిలేచోట ధారాళముగా వదలటమూ—పట్టవలసినచోట మంచి గాపుపట్టు పట్టటమూ ఆయనకు బాగా తెలుసును. దానమూ ధర్మమూ పేరూ ప్రతిష్ఠా కలవాడు.

వ్యాపారమూ వ్యవహారాలూ నారయ్యవంతు. వ్యవసాయమూ గొడ్డూ గోదా ఇల్లూ వాకిలీ మొదలు అయినవి అన్నీ సుబ్బమ్మవి. నారయ్య చెప్పినమాట ఆఊళ్లో ఎప్పుడు అయినా చలామణీ కాకపోతే కాకపోవచ్చును, కాని సుబ్బమ్మ మాట ఆఊళ్లో సుగ్రీవాజ్ఞ. ఇకను ఆ దంపతులకు తీర్పరీ కూర్పరీ కరణము రామయ్యపంతులు. రామయ్య నారయ్యకన్నా పదిఏళ్లు చిన్నవాడు.

రామయ్యమాట నారయ్య ఎన్నడూ తీసివేసేవాడు కాడు. నారయ్య చెప్పింది చేయకుండా రామయ్య ఎన్నడూ తలాయించిందీ లేదు. ఇద్దరూ ఒక్కమాటమీద. పో— వాండ్లు. అందువల్లనే

గ్రామములో పోట్లాటలు వచ్చి పార్టీలు పడి గడ్డి వాములు తగులపెట్టుకోవడము కానీ వారి గొడ్లకు వారూ వీరూ వీరిగొడ్లకు వారూ మందులుపెట్టి చంపి వేయడాలు గానీ లేవు. ఇన్ని మాటలెందుకు— అది బస్తీసక్కగాను ఉన్న పల్లెటూరు. అయినప్పటికిన్నీ ఒక సివిల్ వ్యవహారము కానీ ఒక క్రిమినల్ వ్యవహారము కానీ ఊరువాటి కోర్టుకు పోయింది లేదు.

నారయ్య కానీ అంత కుంకుమబొట్టు పెట్టుకొని లోపలినుంచి బయటకు వచ్చినాడు. అప్పుడే జ్యోస్యులున్నూ వచ్చినాడు. జ్యోస్యము వినడానికి సుబ్బమ్మకూడా వచ్చి తలుపుచాటున నిలుచున్నది. నారయ్య జ్యోషీని ఎగాదిగా చూచి "బాలజ్యోతిషం వృద్ధవైద్యం" అన్నారు. బాగుంది. జోస్యులూ జాతకము ఇవ్వగానే ముందుగా ఏమి ఆలోచిస్తావు?" అని ప్రశ్న వేసినాడు.

"ఆయుర్దాయాన్ని గురించి ఆలోచిస్తాను"

"అయితే ఈ జాతకానికి ఆయుర్దాయము చెప్పు" అంటూ జాతకచక్రము ఉన్న కాగితము నారయ్య జోస్యులకు ఇచ్చినాడు. రామయ్య "జోస్యులు బాబూ లగ్నము ఏమిటి—నక్షత్రము ఏమిటి" అన్నాడు.

"మేషలగ్నము—మఘానక్షత్రము" అంటూ "జాతకుడికి దీర్ఘాయుర్దాయము పట్టింది. జాతకము మహాదొడ్డది. ఒక్క పంచమ భావానికి తప్ప మరి ఏ ఇతర భావానికీ ఏదోషమూ లేదు. పంచమాధిపతికిన్నీ పంచమ స్థానానికిన్నీ పాపార్గళం పట్టింది పుత్రకారకుడు అయిన..."

"ఇదుగో జోస్యులూ మాకు నీశాస్త్రము గోల అంతా అక్కరలేదు. ఫలము చెప్పండి" అన్నాడు నారయ్య.

"ఇప్పటికి సంతానము లేదు" అన్నాడు జ్యోషి.

"సరే. ఇకముందు సంగతి?" అన్నాడు రామయ్య.

"అయితే కర్మస్థానాధిపతి అయిన."

"దత్తుచేసు కొంటాడేమో చెప్పవయ్యా" అన్నాడు నారయ్య.

"దత్త పుత్రయోగము లేదు."

"దత్తు చేసుకొంటే"

"దత్తత చేసుకోటము ఉండదు. అథవా దత్తత చేసుకో తలచుకొన్నా కొనసాగదు. విఫలము అయి పోతుంది"

"అంటే"

దత్తుడు ఇంటికి రాగానే చస్తాడు"

"అమ్మనాయనో—పుత్రశోకముకన్నా దత్త పుత్రశోకము పట్ట శక్యముకాదు అన్నారు పెద్దలు" అన్నాడు రామయ్య. నారయ్య ముఖము వెలా వెలా పోయింది.

"అయ్యా ఈ జాతకములో ఉపపదానికి చంద్రశుక్ర సంబంధము పట్టింది. కాబట్టి జీవకళత్రము ఉంటుంది. కర్మస్థానము బాగాఉంది. కర్మకారకుడూ కర్మాధిపతీ బాగా ఉన్నారు. "శుభదృగ్యోగాత్సుందరీ" అని సూత్రము. మంచి అందకత్తెను జాతకుడు కొద్ది రోజులలో పెండ్లి చేసుకొంటాడు. "స్వకులే గుప్తాచ" "చంద్రే హైకపుత్రః" అనే సూత్రాలున్నూ జాతకానికి అన్వర్తిస్తవి. ఆ అందకత్తెకు ఒక పిల్లవాడు పుట్టుతాడు. వాడు ఈ జాతకుడికి కర్మాధికారి అవుతాడు. తప్పదు"

నారయ్య పకపకా నవ్వినాడు. సుబ్బమ్మ తీవ్రముగా ఆలోచించడము మొదలు పెట్టింది. రామయ్య "శాస్త్రులవారూ, సంతానము ఇంకా ఎంత కాలానికి కలుగుతుంది" అని ప్రశ్నించినాడు.

"ఎబ్బే ఎంతో కాలానికా—ఇప్పుడు కర్మాధిపతి అయిన శనిదశలో కుటుంబాధిపతి అయిన శుక్రభుక్తి నడుస్తూఉంది. కొద్దిరోజులలో జీవకళత్రమూ ఆ తరువాత—నేటికి పదహారు మాసాలలో జాతకుడికి కర్మచేసే పిల్లవాడు పుట్టుతాడు."

"అట్లా నిజముగా పదహారు మాసాలలో పిల్లవాడు పుట్టేటట్లయితే మీకు నూటపదహార్లు బహుమానము ఇప్పిస్తాను" అన్నాడు రామయ్య.

"తప్పకుండా నూటపదహార్లూ బహుమానము పుచ్చుకొంటాను" అన్నాడు జ్యోషి. నారయ్య పది రూపాయలు తాంబూలములో పెట్టి జ్యోషీని సన్మానించినాడు. రామయ్యతో జ్యోషి వెళ్లిపోయినాడు.

నారయ్య పెండ్లాన్ని చూస్తూ" నేను దత్తుచేసుకొం

టాను అని మాట ఇచ్చినాను. ఏమి అవుతుందో చూడవలెను" అన్నాడు.

"ఏమి అవుతుంది. జోస్యుల నోటివాక్యాన.."

"అయితే నేను దత్తు చేసుకోడము నీకు ఇష్టము లేదు అన్నమాట"

"నేను అనేకమార్లు చెప్పినాను. మీరు విన్నారు కారు. ఏమి చేసేది? మొగుడికిపుట్టిన పిల్లవాడు అయినా పెండ్లానికి పుట్టిన పిల్లవాడు అయినా ఉపయోగపడుతాడు కాని ఏ అయ్యకో ఏ అమ్మకో పుట్టినవాడు ఎప్పుడూ అక్కరకురాడు" అంది సుబ్బమ్మ.

"ఎట్లాగూ—" అని నవ్వినాడు నారయ్య.

* * *

జ్యోష్యీ చెప్పిపోయినట్టుగానే నారయ్య దత్తు చేసుకో తలచుకొన్న పిల్లవాడికి నాల్గురోజులు జ్వరము కాసి చనిపోయినాడు. వంశము నిలవడానికి ఇంకొక పిల్లను పెండ్లి చేసుకోవలసిందేను అని సుబ్బమ్మ పట్టుపట్టింది. రామయ్య అందుకు తోడు చేసినాడు. నారయ్యకు ఇష్టముఅయినా కాకపోయినా గ్రహాల ప్రభావమో ఏమో మళ్ళీ పెండ్లి చేసుకోటానికి ఒప్పుకొన్నాడు. సవతిని సంపాదించటానికి సుబ్బమ్మే పూనుకొన్నది. బహు సంతానము చాలు ఉన్న కుటుంబాలలో పిల్లను తీసుకొని రావలెను అనుకొన్నది. విచారించింది. స్వయముగా బయలుదేరింది. దూపాటి సీమలో ఒక పేదకుటుంబాన్ని చూచింది. ఆ ఇల్లాలు తొమ్మిదిమంది పిల్లలను కన్నది. పెద్దపిల్లకు ఇరవై సంవత్సరాలు. దారిద్ర్యమువల్ల పెండ్లి కాలేదు. తల్లికి మాదిరిగానే రెబట అల్లే ఉంది. తల్లి చాలు పిల్లగా సుబ్బమ్మకు ఆ అమ్మాయి తోచింది. ఆ పిల్ల తల్లితండ్రులనూ తక్కిన సంతానాన్ని పోషించే భారము తమదేను అన్నది. పెనిమిటికి పిల్లను కుదిర్చింది. దైవానుకూలముగా ఉండేటందుకు ఏడుకొండలవాడి ఎదట పెండ్లి జరుగవలెను అని నిర్ణయించింది.

శుభ ముహూర్తాన తిరుమల క్షేత్రములో పెనిమిటి నారయ్యకూ సవతి మంగమ్మకూ మూడుముళ్లూ వేయించింది. అంతటతో ఆమెకు తనివి తీరలేదు. ప్రత్యేకముగా మొగుణ్ణీ సవతినీ అలమేలు మంగాపురము తీసుకొని పోయి అక్కడ దేవాలయంలో ఉన్న సంతాన గోపాలకృష్ణుడికి మొక్కించింది. పుట్టెడు పటికిబెల్లము నైవేద్యము పెట్టించి నూతన వధూవరులచేత పసిపిల్లలకు పండారము చేయించింది.

తిరుపతినుంచి ఇంటికి తిరిగి రాగానే వ్యవసాయపు పనులు అన్నీ మంగమ్మ తండ్రికిన్నీ గొడ్డూ గోదా వ్యవహారాలు అన్నీ మంగమ్మ తల్లికీ సుబ్బమ్మ ఒప్పగించి వంట ఇంటి పెత్తనము మాత్రము తనమీద వేసుకొంది. నారయ్యకూడా సుబ్బమ్మకు ఏమాత్రమూ తీసిపోలేదు. తమ డాబామీద శీతవాత వర్షాతపాలకు లొంగిపోకుండా ఉండేటట్లుగా రెల్లు గడ్డితో చలువపందిరి వేయించినాడు. ప్రాచీనార్వాచీన పద్ధతులను వేటినీ వదిలి పెట్టకుండా పడకగది సరంజామా అంతా కేటలాగులు అన్నీ చూచి మద్రాసునుంచి తెప్పించి ఆ చలువ పందిరిలో అమర్చేట్లు చేసినాడు. అది నూతన వధూవరుల కుశయ్యా గృహము అయింది.

నారయ్య అంతటితో పోనీయలేదు. తన మున్సబుగిరీకి గుమాస్తాను ఏర్పాటు చేసినట్టుగానే రామయ్య పంతులు కరణీకానికిన్నీ ఒక గుమాస్తాను ఏర్పాటుచేసి తన రైసుమిల్లు—కట్టెల అడితి వ్యాపారము ఆయనకు ఒప్పగించి ఇల్లు కదలకుండా ఉండిపోయినాడు. భోజన మజ్జనాదులకు తప్ప డాబా దిగడము మానివేసినాడు. ఇక మంగమ్మ సంగతి చెప్పవలసిన అవసరమే లేదు.

బక్క చిక్కిన ఎద్దుల జతను సంతలో చౌకగా కొనుక్కొని తెచ్చి ఇంత మడ్డికూడూ దాణా తెలకపిండీ పెట్టి మేపితే వారము రోజులలో తేరుకొని బుసలుకొట్టుతూ చక్కగా పొలము పనిచేస్తవి. కుక్కకు ఒక్కపూట ఇంత అన్నము వేసి అంత బెల్లము పెట్టితే అది తెల్లవారేసరికి పుంజుకొని ఘాఘామంటూ ప్రతివాణ్ణీ కరవబోతుంది. అయితే మానవుల ఎదుగు బొదుగులు తిండిమీద ఆధారపడవు అని ఇంగ్లీషు వైద్యులు అంటారు. ఇది నిజమో బేనిజమో తెలియదు కాని మంగమ్మ మండలము రోజులలో గుర్తుపట్టడానికి వీలులేకుండా మారిపోయింది. బంగారు శలాక మాదిరిగా తయారు అయింది. షోడశకలా ప్రపూర్ణము అయిన చంద్రబింబము మాదిరిగా ఆమె ముఖము కనుపించసాగింది.

రోజులు గబగబా పరుగెత్తసాగినవి. మంగమ్మకు నిన్ననో మొన్ననో ఆ ఇంటికివచ్చినట్టుగా

ఉంది. కాని అప్పుడే రెండునెలలు గిర్రున తిరిగి పోయినవి. సుబ్బమ్మ తాతగారికి జబ్బుగా ఉందిఅనీ ఒక్కసారి పుట్టినింటికివచ్చి పొమ్మనీ వర్తమానాలు వస్తూ ఉన్నవి. ఆమె కాపురానికి వచ్చిన ఈపాతిక సంవత్సరాలలోనూ ఎప్పుడు పుట్టినింటికి పోయినా సాయంత్రానికి స్వగృహానికి చేరేది. ఉన్న గొడ్ల పాలు సుబ్బమ్మ తప్ప మరి ఎవరూ తీయడానికి వీలు లేదు. ఒకవేళ ఎవరు అయినా తీయపోయినా ఆ గొడ్లు ఆమెకు పాలుఇచ్చినట్లు ఇతరులకు ఇవ్వవు, తాతగారిని పోయి చూడవలెను అని సుబ్బమ్మకు ఎంతో అభిలాషగా ఉంది. గొడ్ల పాలుతీయడము ఎవరికి ఒప్పచెప్పడము అనే చిక్కులో పడ్డది. మంగమ్మ తల్లి తనకూతురు గొడ్లపాలు తీయడములో నేర్పరి అని చెప్పింది. సుబ్బమ్మ మంగమ్మను పరీక్షకు పెట్టింది. పోట్లఆవులుకూడా మంగమ్మ చెంబు తీసుకొని కూర్చుంటే శేర్లకు శేర్లుపాలు కార్చడము మొదలు పెట్టినవి. సుబ్బమ్మ నిజముగా ఆశ్చర్యపడి పోయింది. "పది సంవత్సరాల ఈమధ్య ఈ గొడ్లు నాకు ఇన్ని పాలుఇచ్చి ఎరగవు. చెల్లెలా నీ సుతారము నాకు కూడా నేర్పు" అంది సుబ్బమ్మ. మూడు రోజులు అయ్యే సరికి గొడ్లు అన్నీ మంగమ్మకు మాలిమి అయిపోయినవి. పాలు సమృద్ధముగా ఇవ్వడము మొదలు పెట్టినవి. సుబ్బమ్మ ఎంతో సంతోషపడ్డది. "చెల్లెలా, నా ప్రాణము తెరపినపడ్డది. ఇంత కాలమూ ఏ ఊరు అయినా పోయి నాల్గురోజులు ఉండి రావడానికి ఈ గొడ్లమూలాన వీలు కాకుండా పోయింది. అబ్బ ఇంతకాలానికి నీవు దేవతవు మల్లె వచ్చినావే చెల్లెలా!" అంటూ సుబ్బమ్మ మెచ్చుకొన్నది.

ఇంతలో సుబ్బమ్మగారి పుట్టింటినుంచిజట్కా బండి వచ్చింది. ఆమె తాతగారు ఏక్షణమో దేహము చాలించేట్లు ఉన్నారు అనీ ఆమెను ఆయన చూడవలెను అనుకొని బండి పంపించినారు అనీ బండివాడు చెప్పినాడు. ఆమెకన్నుల వెంట నీరు కారుస్తూ ఉంటే "ఎందుకు అక్కా ఆలోచిస్తావు, ఏమీ భయములేదు. పోయిరా. నేను అంతా జాగ్రత్తగా చూసుకొంటాను" అన్నది మంగమ్మ.

"చెల్లెలా ఈ రోజు పగలు ఎట్లాగో గడుపు, నావెంట మీ అమ్మనుకూడా తీసుకొనిపోతాను. మా ఊరు ఇక్కడికి మూడుమైళ్లే ఉంది. వస్తే ఇద్దరమూ సాయంత్రానికి వస్తాము. లేకపోతే మీ అమ్మను పంపించివేస్తాను," అని మంగమ్మతో చెప్పినారయ్యనుకూడా తనవెంటరమ్మన్నది సుబ్బమ్మ. ఆయన అయితే బయలుదేరలేదు. కాని సుబ్బమ్మా ఆమెకు తోడుగా మంగమ్మతల్లీ జట్కా బండిలో ప్రయాణము అయిపోయినారు.

సుబ్బమ్మ పుట్టింటికి వెళ్లిన రెండురోజులకు నారయ జిల్లాబోర్డు మీటింగుకు వెళ్లవలసి వచ్చింది. అతడు ఆమరునాడే రావలెను అనుకొన్నాడు. కాని సాధ్యముకాలేదు. వారము రోజులు అయినా సుబ్బమ్మ కానీ నారయ్యకానీ తిరిగి రాలేదు. అంత ఇంటికీ మంగమ్మే సర్వాధికారి అయిపోయింది.

అది కార్తీకమాసము. మధ్యాహ్నము మూడు గంటలు అయింది. హఠాత్తుగా మబ్బులుపట్టినవి. కాస్సేపటిలో చీకటిపడ్డట్టు అయిపోయింది. బీటిలోకిపోయినగొడ్లు అన్నీ ఇంటికి వచ్చినవి. జీతగాండ్లు అందరూ ఇండ్లకు పోయినారు. రాత్రి పడుకోడానికి వచ్చే జీతగాండ్లు అన్నాలు తిని వస్తాము అని చెప్పి వెళ్లిపోయినారు. చీకట్లు బాగా కమ్ముకొన్నందువల్ల ఇంకా ఎంతపొద్దుఉందీ తెలియలేదు. ఎప్పుడో ఎందుకు అనుకొని సురవడా వంట చకాచకా చేసివేసినాడు. కొద్ది కొద్దిగా చినుకులు పడుతూ ఉన్నవి. గాలిమాత్రము జోరుగా ఉంది. మంగమ్మ పొంతకుండలో వేడినీళ్లు స్నానము చేసింది. శీతాకాలాన్ని మించిన చలివేస్తూ ఉంది. ఉత్తరమునుంచి విపరీతము గాలితోలుతూ ఉంది. ఆచలికి మంగమ్మా రోజూకన్నా మరికాస్తఅన్నము తిన్నది. పయికిపోయి పడుకోడము ఆగాలీ వానలో సాధ్యము అయ్యేట్లు ఆమెకు కనిపించలేదు. కిందనే పడుకొంది. చీకటిపడే వేళకు చినుకులున్నూ జోరు చేసినవి. మంగమ్మ శాలువ ముసుగుపెట్టుకొని పడుకొంది. ఇట్టే నిద్రపట్టింది.

రాత్రి తొమ్మిదిగంటలు అయింది. మంగమ్మ ఉలిక్కిపడ్డట్టుగా లేచింది. గాలి ఈలలు వేస్తూ ఉంది. వాన ఎడాపెడా కొడుతూ ఉంది. దీపాలు ఎప్పుడో ఆరిపోయినవి. దీపము వెలిగించడానికి నిప్పుపుల్ల గీస్తే నిలవలేదు; ఆరిపోయింది.

అంతా అంధకార బంధురముగా ఉంది. తలుపు ఏ వైపున ఉంది కిటికీలు ఏ వైపున ఉన్నవి చటుక్కున తోచలేదు. వసారా పెంకులు లేచిపోతూ టపీల్ టపీల్‌మంటూ చప్పుడు చేస్తూ ఉన్నవి. ఆమెకు భయము వేసింది. "గురవా—గురవా" అని కేక వేసింది. జవాబు లేదు. ఆ చీకటికి కన్నులు అలవాటు పడ్డవి. కిటికీలూ తలుపూ లీలగా కనిపించినవి. ఎట్లాగో ధైర్యము చిక్కబట్టింది. తలుపు తెరిచింది. దీపము లేదు. లాంతర్లు కూడా నిలవడము లేదు. మధ్యమధ్య మెరుపులు పట్టపగలు అంతా వెలుతురు వేస్తూ ఉన్నవి. నాల్గు జతల ఎద్దులనూ హాలులో వదిలిపెట్టి గురవడు బయటికి వెళ్ళుతున్నాడు.

తళుక్కున మెరుపు మెరిసింది. గొడ్లకొట్టము మీద పెంకులు గాలికి ఎగిరిపోతూ ఉన్నవి. చిమ్మిరి గొట్టములోనుంచి నీళ్లు కొట్టుతూ ఉన్నట్టుగా వాన దంచుతూ ఉంది. బిత్తరపోయి చూస్తూ నిలుచుంది. చూడి గేదెలనూ పాడి ఆవులనూ గురవడు ఇంటిలోకి తోలి తక్కిన గొడ్లను బయటకు పోవడానికి మెడ తాళ్లు వదిలివేసినాడు.

"అమ్మగారూ కొమ్ముల బఱ్ఱె ఈనేట్టు ఉంది. బ్యాటరి దీపము వెతకండి" అన్నాడు గురవడు. అదృష్టవశాత్తూ బ్యాటరి దీపము పెద్దదే మంగమ్మకు దొరికింది. దీపము వేసి చూసింది. పెంకులు అన్నీపోయిన ఆ కొట్టములోనే బఱ్ఱె ఈనుతూ కనిపించింది. దూడను గురవడు ఎత్తుకొన్నాడు. తల్లి గేదెను ఇంట్లోకి తీసుకొని రావడానికి మంగమ్మ దాని మెడతాడు ఒక చేతిలో పట్టుకొంది. రెండో చేతిలో బ్యాటరి దీపము పట్టుకొని నడిపిస్తూ ఉంది. ఉత్తరపు గాలి పడమరకు తిరిగిపోయింది. గేదె నడువలేక నడువలేక నడుస్తూ ఉంది. గాలి ఒక్క విసురు విసిరింది. మంగమ్మ కాళ్లు నిలపలేకపోయింది. వెల్లకిలా పడ్డది. గురవడు పరుగెత్తుకొనివచ్చి పసిపిల్లను రెండు చేతులలో ఎత్తుకొన్నట్టుగా మంగమ్మను ఎత్తుకొనివచ్చి మంచమ్మీద పడుకోబెట్టి "అమ్మగారూ నడుములు నొప్పిపట్టినవా?" అన్నాడు.

"లేదురా—కాళ్లు నిలవలేదు" అన్నది.

"అమ్మగారూ—గేదెనూ దూడనూ నేను చూసుకొంటాను. తాము తడిసిపోయినారు. ఒళ్లు తుడుచుకొని స్వస్థముగా పడుకోండి" అని చెప్పి గురవడు అవతలకు వెళ్లినాడు:

* * *

డాబాగది అయినప్పటికిన్నీ కిటికీలు మూసి వేసి ఉన్నప్పటికిన్నీ గాలి రంయ్‌మని వస్తూ ఉంది. గోడపక్కను నేలమీద పెట్టిన లాంతరులో దీపము గంతులు వేయడము మొదలు పెట్టింది. మంగమ్మ ఒళ్లు కొంగరపోతూ ఉంది. తలగబాగబా తుడుచుకొని చీరె రవిక తీసివేసి ఒళ్లు తుడుచుకొని పెట్టెలో చీరె కట్టుకొంటూ ఇటు చూచింది. గురవడు వాకిలిపక్కను నిలుచుని ఉన్నాడు. వాడు తనను చూచినాడా అనే సందేహము వచ్చింది. చీరె కట్టుకొంటూనే "గురవా ఏమి చేస్తున్నావు" అని అడిగింది.

"చలికి వణుకుతూ ఉన్నాను" అన్నాడు.

బ్యాటరీదీపము వేసి వాణ్ణి చూచింది. గుండు వంటి గురవడు వణుకుతూ ఉంటే వాడి దేహమూ—పాము పొట్టవంటి వాడి పొట్ట—కండలతో మెలుపులు తిరిగిన వాడి జబ్బలూ మంగమ్మకు గమ్మత్తుగా తోచినవి.

"ఒరేయ్ చలికి ఎంతసేపు అట్లా వణుకుతావు" అంటూ పెట్టెలోనుంచి తువాలూ పంచే తీసి "ఈ తువాలుతో తుడుచుకొని ఈ పంచె కట్టుకో" అన్నది మంగమ్మ.

"పంచే తువాలూ దొరగారివి" అంటూ అనుమానించినాడు. మంగమ్మ ఒక్క నవ్వు నవ్వి "ఇప్పుడు నీవే దొరవు" అని వాడిముఖము వంక చూచింది. వాడికి సిగ్గువచ్చి తల వంచుకొన్నాడు. ఆమె చేతులో ఉన్న బ్యాటరిదీపములో బ్యాటరి అయిపోయింది. గంతులు వేస్తూ ఉన్న దీపము ఎన్నడో ఆరిపోయింది. అంతా చీకటి గుయ్యారముగా ఉంది. గాలీవానా మరింత జోరు అయింది. మంగమ్మ పడుకొంది. ఆమె ఒళ్లు అంతా తిమ్మిరి తిమ్మిరిగా ఉంది.

"గురవా" అని పిలిచింది.

"ఆఁ" అని పలికినాడు.

"ఒరేయ్ నాకు భయము వేస్తూ ఉంది. నీవు ఇక్కడకు రా" అన్నది. వాడు ఆ చీకటిగదిలోకి వచ్చినాడు.

* * * *

గాలివాననాడు రాత్రి ఇంటి కాపలావాడూ గురవడూ తప్ప ఏ జీతగాడూ ఇంట్లో లేనందుకు నారయ్యకు పుట్టెడు కోపము వచ్చింది. కాని ఎవరినీ ఏమీ అనలేదు. గొడ్లకొట్టము కొట్టుకొని పోవడము తప్ప ఏ నష్టమూ లేకుండా పోయినందుకు మనస్సులో సంతోషించినాడు. గొడ్లకొట్టము పెంచి జీతగాండ్లు అందరూ ఉండడానికి బందోబస్తు అయిన భవంతి వేయించడము మొదలుపెట్టినాడు.

సుబ్బమ్మ తాతగారు చనిపోయినాడు. దినవారాలు అయిన తరువాత ఎంతో దుఃఖముతో ఇంటికి తిరిగివచ్చింది. గాలివానకు ఏ నష్టమూ రానందుకు ఆమె సంతోషపడ్డది. గొడ్లకొట్టము పెంచి జీతగాండ్లు కూడా తమ ఆవరణములోనే కాపురాలు ఉండే ఏర్పాట్లు నారయ్య చేస్తూఉన్నందుకు ఆమెకు మరింత సంతోషము వేసింది.

అంతవరకూ మందకొడిగా అయోమయముగా ఉంటూవచ్చిన గురవడు మహా హుషారుగా పనులు చేస్తూఉండడము చూచి ఆశ్చర్యపోయింది. అందులో పలుకరించినా మాట్లాడనివాడు ఎవరు ఏమి అడిగినా తడుముకోకుండా గురవడు సమాధానాలు చెపుతూ ఉంటే సుబ్బమ్మకు మరింత ఆశ్చర్యము వేసింది.

మంగమ్మకు నెల తప్పిపోయింది. సుబ్బమ్మ సంతోషానికి మేరలేకుండా పోయింది. మూడు నెలలు గడిచినవి. మంగమ్మకు కడుపువచ్చినట్లు రూఢి అయిపోయింది. ఆమె కొడుకును .కంటుందో కూతురును కంటుందోనని అందరూ ఆలోచించసాగినారు. ఆ ఇంట్లో ప్రతిరోజూ అచ్చట్లూ ముచ్చట్లుగా ఉండి. ప్రతిక్షణమూ పండుగగానే ఉంది. ఊళ్లోవాళ్లు, అందరూ పండ్లు పసుపు కుంకమూ పట్టు రవికెగుడ్డలు; 'పట్టుచీరెలు తెచ్చి ఇవ్వసాగినారు. ఆ ఊళ్ళోవున్న బ్రాహ్మణఇండ్ల ఆడవాండ్లు కూడా యథాశక్తిన పసుపూ కుంకమూ తెచ్చి ఇచ్చినారు. మంగమ్మకు కొడుకు పుట్టవలెను అనే అందరూ కోరుకొన్నారు. వేళాకోళానికి సుబ్బమ్మ కూడా ఇక బిడ్డలను కంటుంది అని అన్నారు.

ఇల్లు అంతా ఎంత గబగబలుగా ఉన్నా ఎంత కోలాహలముగా ఉన్నా సుబ్బమ్మ వెయ్యికళ్ళతో గురవణ్ణి కనిపెడుతూఉంది. నారయ్య ఏదో వ్యవహారమువిూద మళ్లీ ఊరికి పోయినాడు. రాత్రిభోజనాలు అయినవి. సవతులు ఇద్దరూ కబుర్లు చెప్పకొంటూ తాంబూలాలు వేసుకొంటున్నారు. గురవడు యథాప్రకారము డాబామీదికి మంచినీళ్ళు వగయిరాలు తీసుకొనిపోతూ మంగమ్మ వంక చూడడమూ ఆమె వాడితో నేత్రావధానము చేయడమూ కనిపెట్టింది. ఏమి తెలియనట్టుగా అమాయికముగా "చెల్లెలా— వారు ఊళ్ళో లేరాయెను పయిన పడుకోడము ఎందుకు నీకు డోకువచ్చినా ఒళ్లు తిప్పినా పైనుంచి నీవు కేకలు పెట్టితే మేము లేస్తామో— లేవకపోతాము కాబట్టి కిందనే పడుకో"మంటూ సుబ్బమ్మ మంగమ్మ ముఖము తేరిపార చూచింది.

"అక్కా నాకు ఆమంచముమీద పడుకొన్నట్టుగా ఏమంచముమీద పడుకొన్నా ఉండదు"

"అయితే ఆ మంచమే ఇక్కడికి తెప్పించేది."

"నాకు ఆ మరలుతీయడము చేతకాదు"

"చేతనయినా వాండ్లే తెస్తారు" అంది. ఆ మంచాన్ని అప్పటికి అప్పుడు కిందికి తెప్పించింది. మంగమ్మ తీవ్రముగా ఆలోచించింది. ఆమెకు భయము వేసింది. ఉత్తరక్షణమే ధైర్యము తెచ్చుకొన్నది. సుబ్బమ్మ తనవిూద ఆ పేక్ష చేతనే అట్లా చెప్పి ఉంటుంది. అని నిర్ణయించుకొన్నది. కాని ఆమె బుర్ర పరిపరివిధాలపోతూ ఉంది.

"చెల్లెలా—నిద్ర పోతున్నావా" అంటూ సుబ్బమ్మవచ్చింది.

"లేదు" అన్నది మంగమ్మ.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"ఎబ్బే ఏమీ లేదు."

"ఇక రేపటినుంచి నేనే గొడ్డూ గోదా చూచుకొంటాను. మీ అమ్మకు వంట ఇల్లు ఒప్ప చెప్పతాను. గురవణ్ణి వంటపనిలోనుంచి తగ్గించి వేయవలెను అనుకొంటున్నాను"అన్నది సుబ్బమ్మ.

"మంగమ్మ చూస్తూ ఊరుకుంది.

"చెల్లెలా ఎందుకు అట్లా చూస్తావు...వాణ్ణి అసలే పంపించి వేదామా అని కూడా అనుకొంటున్నాను"

"మీ ఇష్టము"

"నీవు తెలివిఅయినదానివే చెల్లెలా—అవును లే—అంతే," అంటూ సవతిపక్కలో కూర్చుని సంతోషముతో ఆమెను కొంచెముసేపు చేతితో నిమిరి "హాయిగా నిద్రపో" అని చెప్పి వెళ్ళిపోయింది.

సుబ్బమ్మ యథాప్రకారము సావిట్లో పడుకొంది. సంతోషాతిశయమువల్ల కాబోలు ఎన్నడూ లేని పద్ధతిన సొమ్మసిల్లి నిద్రపోయింది. తెల్లవారుఝామున మూడుగంటలు కావస్తూఉంది. సుబ్బమ్మకు హఠాత్తుగా నిద్రమెలకువ వచ్చింది. పక్కగదిలో మనిషి అలికిడి అయింది. క్షణలేశము ఆలకించింది. చడీ చప్పుడూ లేకుండా బయటికి నడిచింది. గొడ్లకొట్టములో గురవడి గదిదగ్గరకు పోయింది. తలుపు బయట తాళము వేసిఉంది. మారుతాళము చెవితో తాళము తీసింది. లోపలికి పోయింది. పెట్టెతీసి చూచింది. ఏభైరూపాయలు కనిపించినవి. పట్టరాని కోపము వచ్చింది. తన మెడలోఉన్న కాసులదండ అమాంతమూ తెంచింది. ఆ తెంచడములో కొన్ని కాసులు చిందపడ్డవి. మిగతా కాసులు ఆ పెట్టెలో పెట్టి మూతవేసింది. యథాప్రకారము తలుపుకు తాళంవేసింది. రెండోకంటికి తెలియకుండా వచ్చి పడుకొంది.

పడమటిఇంట్లో గురవడు పొయ్యిలో నిప్పు రాజేస్తున్నాడు.

హఠాత్తుగా సుబ్బమ్మ "ఆఁ ఆఁ" అంటూ "నా మెడలో కాసులదండ ఎవరు తెంచుతున్నారు" అంటూ కేకలు పెట్టుతూ లేచింది.

* * *

కరణము రామయ్య ఆశ్చర్యముతో "అది ఏమిటి అక్కయ్యా—తెల్లవారుతూ ఉండగా నీ మెళ్ళో కాసులపేరు తెంపుకొనిపోవడము ఏమిటి?" అన్నాడు.

"అదే—పంతులూ—ఆశ్చర్యము. పోలీసులను పిలిపించు" అంది సుబ్బమ్మ.

రామయ్య ఆలోచిస్తూ "ఎవళ్లో ఏమిటో మనము ముందుగా..." అంటున్నాడు. సుబ్బమ్మ ఉగ్రమూర్తి అయి "పంతులూ యావన్మందినీ బయటకు లాగించి తాళాలు వేయించడమే కాదు." చూడు నా ఇంటికికూడా తాళము పెట్టించినాను. నా పరివరణలో ఎవరు తప్పుపనిచేసినా నేనుమన్నించేది లేదు. ఎందుకు అనుమానిస్తావు? నీవు పోలీసులను పిలిపిస్తావా లేకపోతే నేనే పోయి పోలీసులను పిలుచుకొని వచ్చేదా" అంది.

పంతులు నిబ్బరముగా "బావమున్నబు గిరీశ వచ్చింది మొదలు ఈ రోజు వరకూ ఒక్క క్రిమినల్ కేసు పొలిమేర దాటిపోలేదు. బావ ఏమంటాడో నని ఆలోచిస్తున్నాను" అన్నాడు.

"పంతులూ బావగారు ఏమీ నిన్ను అనకుండా ఉండేభారము నాది"

"అయితే పోలీసులను రప్పించడము ఎంతమహాభాగ్యము. అక్కా ఇల్లు సోదా చేయించవలసి వస్తుంది సుమా"

"అదే నేను కోరుతూ ఉంది"

"సరే" నన్నాడు పంతులు,

* * * *

గురవడిమీద క్రిమినల్ కేసు విచారణకు వచ్చింది. మేజస్ట్రీటు ఉగ్రుడు అయిపోయినాడు. సంవత్సరము కఠినశిక్ష విధించినాడు.

* * * *

తొమ్మిదోమాసము వెళుతూ ఉండగా మంగమ్మ సుఖముగా ప్రసవించింది. దుంపముక్కవంటి మొగపిల్లవాడు పుట్టినాడు.

బ్రహ్మాండముగా బారసాలఉత్సవము జరిగింది. నూటపదార్లు తీసుకోడానికి జ్యోతిషికూడా హాజరు అయినాడు. ఊరివారి అందరికీ మృష్టాన్నదానము చేసినారు.

సుబ్బమ్మ సాయంత్రము అప్పుడు సంతోషముగా శిశువును పెనిమిటిదగ్గిరకు తీసుకొనివచ్చి "చూడండి. ఎంతచక్కనివాడో చూడండి, అచ్చము మీ పోలికేను. ఆ గడ్డమూ — ఆ ముక్కూ ఆ కళ్ళూ అంతా మీరేను" అంటూ నవ్వింది.

నారయ్య శిశువునూ ఆ శిశువునుకన్న మంగమ్మనూ చూస్తూ బ్రహ్మానందపడిపోయినాడు.

---

# వసంతగీతము



శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

పొడి పొడిమై, తలల్ విరియ బూసిన వేపయిపుళ్ల జొంపముల్,
గడుసరి పిల్ల గాలులకు గాదిలి నీలి మొయిళ్ల లీలగా,
సుడివడి నాయెడంద, చిరుసోనలు వాఱి, మరంద మోదముల్
గడలు కొనెన్ త్రపా మధుర కాంక్షలు రేగి తరంగ లెత్తగా !

ఇది మధుమాస వేళ-వికసించిన పూబడువల్ సువిస్ఫుర
న్మృదుకలగీతికావిహృతిదేలి, తెరల్ దళుకొత్తగా రసా
భ్యుదయ కలా ప్రవేణికల నూయెల లూగుచు సాగిపోవు ; నా
యెద గదలున్ విచిత్రముగ నీ చివు రెత్తిన బావుటాలెవో !

కడు నలయించు పీడకలగా దరలన్ గతకాల మెల్లదో
చెడు వికృతమ్ముగా, చినిగి చీవరమై, బ్రతుకంత మ్రోడుగా
జడిసి, హిమావృతమ్మయిన చాయలలోబడి నిల్చి నిల్చి యీ
యెడ మధురోహలూదుకొననీ నవశాద్వల భాసురస్థలిన్

ఒక చిరుసోనగా మృధురసోత్కటనే ప్రవహిల్లి పోదునో !
ఒక విరబూయు మావి నయి, యొయ్యన నిల్తునో రాగమూర్తినై
ఒక పికగీతిగా, నళివహోదిత ఝూంకృతిగా మలంగి నే
నిక మెరయింతునో ! గిరుల యింగము లబ్ధినిజాశయమ్ములున్

నిన్నటిదాక మూగవడి నెవ్వల బ్రుంగిన కోటిగొంతులీ
యన్నన విచ్చి మ్రోసినటులయ్యె ; హోంకారపు వేగురేకలో
క్రన్నన శృంఖలల్ దెమలి గగ్గల లాడుచు నేలరాలి యీ
మిన్నుల త్రోవలెల్ల మిసిమించె ప్రభాత పతంగ గీతులన్ !

తెలిరేకలు దిరి బంగరు
కలలగు జలజాతమాలికల దీపితమై
వలగొను పలుకుం జెలికై
శ్యలహరి మునుకాడు తలపు లామనిరక్తిన్ !

---

# సాధన విధానాలు



శ్రీ వేలూరి సహజానందం

శాస్త్రాల ప్రాముఖ్యత క్రమేపీ తగ్గి, సాధన విధానాల ప్రాముఖ్యం హెచ్చుతున్న యుగం. అంటే ఇదివరలో ఎప్పుడు ఈ ప్రస్తావన చరిత్రలో కనుపించలేదని కాదు. కాకపోతే ఇంత స్పష్టంగా, ప్రపంచమంతకు సంబంధించిన ప్రధాన సమస్యగా ఇదివరలో ప్రాముఖ్యత చెందలేదు.

బహుశ మానవజీవితం యొక్క ఉత్కృష్టత, విశిష్టత-ఈ సమస్య, సాధన విధానాల సమస్య మీదే ఆధారపడి ఉండవచ్చు.

చరిత్రకు మనుష్యుడు బద్ధుడు అనే వాదాన్ని విశ్వాసాన్ని త్రోసిపుచ్చి, చరిత్ర మనుష్యునికి బద్ధురాలు అని నిరూపించవలసిన యుగసంధి ఇది. ఇదివరకు హింసకన్న వేరే సాధ్యవిధానం మనుష్యుని అందుబాటులో లేదన్నవారే ఈనాడు హింసతో విసిగి వేసారి, వేరే ఇంకే సాధనమైనా ఉందేమో అని తర్కిస్తున్నారు. చర్చిస్తున్నారు. ఇదివరకే నడిచిన సంఘటనల నిప్పుడు భక్తి శ్రద్ధలతో పరిశీలిస్తున్నారు.

పశువుకన్న మనుష్యుని ఉత్కృష్టత కేవలం విద్వత్తు, బలం వీటిలోనే కాదు స్థిరపడవలసింది. నిజానికి, తన ఆశయాలను నెరవేర్చుకోటంలో అవలంబించే మనుష్య విధానాలకు పశువిధానాలకు ఉన్న వ్యత్యాసమే, మానవ సంస్కృతియొక్క విశిష్టతకు కొలబద్ద.

ఆలోచనా శక్తిలో, సంఘటనా శక్తిలో, రక్షణ విషయంలో, మనుష్యుడు పశువును కాలదన్నాడు. మదించిన సివంగి సైతం ఈతనిచూసి, కంపిస్తుంది. కాని తన ఆశయాలను నెరవేర్చుకోటానికి అతను ఉపయోగించే విధానాలుమటుకు ఆ వనమృగాల వారసత్వమే. అంటే పశు విధానాలనే ఆచరిస్తున్నాడు.

అసాధారణ, వీరపురుషులను గజములతోనూ, సింహములతోనూ పోల్చే సంప్రదాయం ఇందుకు నిదర్శనం. పౌరుషం (అంటె తనను రక్షించుకొనే విషయంలోనే కాదు, ఇంకొకరికి బుద్ధిపూర్వకంగా హానికల్గించే విషయంలోకూడా) అనాది నుంచి కవితా వస్తువుగా ఉంటోంది. ఉపమానాలు వనమృగాలు. కాబట్టి మిగతా రంగాల్లో ఎంత కొత్త పద్ధతులమీద మనుష్యుడు ప్రవర్తించినా, ఇంకొక మనిషితోమటుకు ఆ పశు విధానానికి బద్ధుడయే ప్రవర్తిస్తున్నాడు.

పశువిధానంలోని ముఖ్యాంశం, రెండవ జీవి యొక్క ఉనికిని, వ్యక్తిత్వాన్ని ఏమాత్రం పరిగణించక పోవటం. ఈ తత్త్వం తల్లిదండ్రులకు పిల్లలకు మధ్య, భార్యాభర్తలకు మధ్య, ద్వేషానికి ప్రేమకు మధ్య సింహాసనం వేసుకొని, శాసిస్తూనే ఉంది. ఎంతో ధర్మరాజుగా పేరుపొందే సంసారికూడా కొంచెంలోతు తరచి చూసుకుంటే, తనింకా ధర్మానికి ఎంత దూరంలో ఉన్నాడో గ్రహించుకో గలుగుతాడు.

వేలమందిని హతం చెయ్యటమే మనుష్యుని ఉత్కృష్టతకు గుర్తుగా పరిగణింపబడటం ఆచారమైంది. ముఖ్యంగా యుద్ధాలు జరుగుతున్న సమయంలో, శత్రువులెంత ఎక్కువమంది చంపబడుతుంటే, అంత సంతోషం మిన్నుముట్టుతుంది. ఇది ఆచారం అవటంతో, కొంచెం వ్యక్తిత్వం ఉన్న మనిషి అల్లా ఈ పంథానే, ఈ శ్మశాన పంథానే తొక్కాడు.

నిజానికి ఒక్కప్పుడు అత్యంతం అసాధారణమైన విషయం అనుకున్న ఈ శక్తి, ఈ హతం చేసే శక్తి ఇప్పుడు చాలా సులభమైంది. దీనికొక కారణం ఆయుధాల తయారీలో వచ్చిన మార్పులు. మరొకటి, చంపటం పౌరుషానికి లక్షణంగా గౌరవింపబడటం,

మొదటి కారణానికే మామూలుగా ఎక్కువ ప్రాధాన్యత చూపబడుతుంది. కాని నిజానికి, ఈ రెండవ కారణం అతి ముఖ్యమైనది. మానవ జీవితానికి, పశు జీవితానికీ ఉన్న ముఖ్య వ్యత్యాసమే ఇందుకు మూలం. పశువు బాహ్య పరిస్థితులను, ప్రకృతిని తన అభీష్టానుసారంగా మార్చలేదు. అంటే అది బాహ్యానికి బానిస. మనుష్యుడు పూర్తిగా బానిసా కాడు: పూర్తిగా స్వతంత్రుడూ కాదు. మనుష్యుడు తన ఆలోచనాశక్తితో మార్పు తెస్తాడు. హింసవైపు అతని ఆలోచన మొగ్గి ఉండటంవల్లనే, ఆయుధాలను మరింత బలీయమైనవిగా తయారుచేయటం. ఆత్మరక్షణకోసమే మనుష్యుడు ఆయుధాలను వినియోగించలేదు. వినియోగించటం లేదు. కాబట్టి హింసనుంచి ఆలోచనను మరల్చటం చాలా అవసరం—ప్రస్తుత సాధన విధానాల్లో మార్పు తేవడానికి.

హింస ఇంత ఎక్కువగా మనుష్యునికి ఆరాధ్యదేవత. కావటానికి కారణం, హింసకు అనుబంధమైన త్యాగం. తన ప్రాణానికి వెరవనివాడు ఆదర్శ పురుషుడు. వీరుడు. స్వార్థరహితుడు. ఇదీ మామూలుగా కనపడే దృష్టి. కాని ఇతరుల ప్రాణాలను తీయటానికి వెరవని వాడని, దుష్టుడని, పరార్థ వ్యతిరేకి యని తట్టదు.

ఇటువంటి సందర్భాల్లో ఒకమాట అంటారు. స్వ—సంరక్షణకు హింస వినా ఏమిటి మార్గం అని. వేరేమార్గం ఏమిటి అనే ప్రశ్న అటుంచుదాం. నిజానికి హింసను అంచనా వేస్తే, యుద్ధకాలాల్లో జరిగే హింస, శాంతి కాలంలో జరిగే హింసకన్న చాలా తక్కువ.

ఒకపక్కన శాంతి అంటూ హింస ఎక్కువ అవటమేమిటి, అని వింతగా తోచవచ్చు. కాని నిజం. అయితే హింస అంటే కేవలం ఆయుధప్రయోగం, ఇళ్లు తగలబెట్టటం, పంటలను నాశనం చెయ్యటమే కాదు. ఇంకొక వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని అణచివేయటమే హింస. ఇది సాధ్యం కానప్పుడే మనుష్యుడుగాని, జాతులుగాని, దేశాలుగాని ఆయుధాల ప్రయోగానికి పూనుకుంటయ్. అంచేత ప్రయోగించ నవసరం లేకుండానే తమ ఆశయం నెరవేరితే సరే. లేకపోతే ఎలాగో తప్పదు. కాబట్టి హింస ఆయుధాల సంఘర్షణలో అమాంతంగా పుట్టుకువచ్చింది కాదు. అంతకు ముందే స్థిరనివాసం ఏర్పరచుకున్నది.

నిజానికి శాంతికాలంలో హిమాలయ శిఖరంలా పెరిగే ప్రచ్ఛన్న హింసే అగ్నిపర్వతంగా బద్దలై, యుద్ధకవచాన్ని ధరిస్తుంది. అంటే యుద్ధానికి బీజం శాంతికాలంలోనే ఉంది. హింస శాంతికాలంలోనే ఒరలోకి దూరి ఉంటుంది. యుద్ధాన్ని, హింసను మాన్పాలంటే, శాంతి కాలంలోని లోపాలను సవరించాలి. అంటే మనుష్యుడు చూపవలసిన త్యాగం, పౌరుషం వగైరా శాంతికాలంలో చూపిస్తే, హింసకు తావు ఉండదు.

శాంతిగా కనబడే వాతావరణం చటుక్కున హింసాపూరిత వాతావరణంగా ఎలా మారుతోంది? అంటే అంతవరకు ఒకరినొకరు—పెద్ద ప్రేమగా చూసుకోకపోయినా—హింసించుకోని వారు, తటాలున ఎలా ఒకరిపై కొకరు కత్తులు దూసుకుంటున్నారు?

దీనికి కారణం శాంతి సమయంలో—శాంతి సమయం అనటంకన్న యుద్ధానికిముందు సమయం అనటం మంచిది—మనుష్యునికి మనుష్యునికి ఉండే సంబంధంలోంచే పుట్టుకొనివస్తోంది . ఈ యుద్ధము, హింస. ఈ సంబంధాల్లో ప్రచ్ఛన్నంగా ఉన్న హింస కొంతకాలానికి తీవ్రస్థాయిని పొంది, బహిరంగంగా తలెత్తక తప్పదు. ఒకప్పుడు, ఒకచోట పది సంవత్సరాలు, ఇరవై సంవత్సరాలు, ఇంకెక్కువ కాలం పట్టవచ్చు. కాని పరిణామం మటుకు నిస్సంశయం—హింస.

మనుష్యునికి మనుష్యునికి సంబంధం ముఖ్యంగా జీవనోపాధిసందర్భంలో వస్తుంది. దీనికి పెద్దగా చారిత్రకపరిశీలన అవసరంలేదు. నువ్వెంత ఎవరితోనూ సంబంధం లేకుండా ఉండాలన్నా, సంబంధం ఉండక తప్పదు. జీవనోపాధికి మూలమైన ప్రకృతి సంపదను సంఘటన పఱచే విధానంబట్టి ఈ సంబంధ బాంధవ్యాలు ఏర్పడుతవి.

మనుష్యుల సంఖ్య అత్యల్పంగా ఉండి, ప్రకృతి సంపద విశేషంగా ఉండిఉన్న రోజుల్లో, బహుశ ఇప్పటి ఈ ఉచ్చులాంటి సంబంధం ఉండి ఉండకపోవచ్చు. ఏదైనా అది మనకు అప్రస్తుతం.

ప్రస్తుతం ఒకవ్యక్తి కేవలం జీవనోపాధి విషయంగురించి పలువురితో సంబంధం పెట్టుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. ఈ సంబంధాల స్వభావంమీదే ఆధారపడి ఉంటుంది హింస. అంటె ఈ సంబంధాల్లో అవలంబించే విధానాలు హింసావిధానాలైతే, పరిణామం హింస తప్పదు. ఇంకొక వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని అణచివేయటం హింసలో మొదటి మెట్టు. దీనికి గురైనవాడిని చూసు, ఆయుధాల కన్న హింసాత్మకమైన వేవో తన్ను చిత్రవధ చేస్తున్నట్టు వ్యథ చెందుతాడు. ఆయుధాలే హింసకాదు. అవి బహుశ హింసలో చివరిమెట్టు. ఇతర ఆయుధాలు పనిచేయనప్పుడు, ఈ కత్తి, తుపాకి, విషవాయువు, ఉపయోగిస్తాడు.

ఈ ఇతర ఆయుధాలేమిటి ?

హింసా చింత తలెత్తగానే లేక వేరుపోసుకోగానే ఒరలోంచి కత్తి దూయరు. మనిషి మరణించటంలో లాభంలేదు, తృప్తిలేదు—తన ప్రాణానికి ఆ మనిషి ప్రమాదంగా ఉంటే తప్ప. లేకపోతే ఆ మనిషి తనకు లోబడి జీవించి ఉండటమే తనకు లాభం, తనకు విజయం.

ఆయుధాలను ప్రయోగించటం ఎందుకు ?

వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని, శారీరక వ్యక్తిత్వాన్ని నిర్మూలించటానికి. ఇందుకు చివరి సాధనా విధానం ఆయుధం. ముందు ఉపయోగింపబడే ఆయుధాలు, మోసం, ద్వేషం, బెదిరింపు, అన్యాయం. ఇవి పని చేయనప్పుడే, కత్తి, కఠార్లు అవసరమయేది. అంటె, అవతల వ్యక్తి జీవించిఉండగా తనకు లోబడడని నిశ్చయించుకున్నప్పుడే, ఆయుధాల జోలికి పోవటం. కాబట్టి ఆయుధాలను సాధన విధానాలుగా విసర్జించాలంటే, అందుకు దారితీసే దృక్పథం, ఇంకొక వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని అణచి వేయాలనుకునే దృక్పథాన్నే విసర్జించాలి.

ఇంకొక వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని అణచి వేయాలనే కోర్కె కేవలం విలాసంగా, క్రూర విక్రీడగా ఆరంభంకాదు. నీ జీవితానికి ను వ్వేర్పరచుకున్న లక్ష్యంబట్టే, ఈ కోరిక తలెత్తుతుంది. పరశ్రేయస్సును త్రోసిపుచ్చి, స్వార్థలాభమే లక్ష్యమైతే, అందుకు పరవ్యక్తుల నన్యాయంచేయటం, హింసించటం తప్పదు. నిన్నొకరు అన్యాయం చేయటం, మోసగించటం, హింసించటం నువ్వెలా కోరవో, సహించదలచవో, అలాగే ఇతరులూ నీవు చేసే అన్యాయాన్ని, మోసాన్ని, హింసను కోరరు. కాని అంగబలం, బుద్ధిబలం, చిత్తసుద్ధిబట్టి, లొంగుతారు, లేదా ఎదురు తిరుగుతారు.

కాబట్టి హింసకు మూలం జీవితలక్ష్యం. సాధన విధానాల నిర్ణయంకూడా జీవితలక్ష్యంయొక్క నిర్ణయంమీదే ఆధారపడిఉంటుంది. సంపాదించి అన్యాయంచేసి, పైకి రావాలనుకున్న వ్యక్తి, ఇక్కడొక సత్రం, అక్కడొక అన్నదానం చేసినందువల్ల ధర్మాత్ముడు కాజాలడు. గుడి గోడలకు, బుద్ధ చిత్రాలను వేలాడదీసినందువలన అహింసాత్మకుడు కావడు. అతను హింసావిధానాలనే అవలంబించినవాడవుతాడు.

ఇంకెవరో హింస నవలంబిస్తున్నారని మామూలుగా ప్రతి ఒక్కరి అభియోగం. సామాన్యంగా, ఎక్కడో అరుదుగా తప్ప, హింస చాలామటుకు ప్రతిహింస. ఒకడు మోసమనే ఆయుధాన్ని ప్రయోగిస్తే, ఆ వంచితుడు హత్యాయుధాన్ని ప్రయోగించవచ్చు. మొదటిది హింసకాదని, రెండవది అవునని అనటం యథార్థంకాదు. రెండవది మొదటిదాని ఫలితం. రెండు హింసకు చెందినవే. హింసను హింసతో ప్రతిఘటించ కూడదనే సంగతి సరే. కాని మోసం, పీడన, అన్యాయం, ఇవి హింస కావనుకోటం భ్రమ. కావనటం అసత్యం.

(మోసం, అన్యాయం జరిపిన, జరుపబడిన వ్యక్తుల కుటుంబాలు హత్యలతో, ఒకరి ఆస్తుల నొకరు నాశనం చేయటంతో కసి తీర్చుకోటం అలవాటైంది. ఇప్పుడీ వ్యక్తిప్రవృత్తి వర్గప్రవృత్తిగా పరిగణించింది.

అంటె వ్యక్తులతోపాటు, వర్గ ప్రవృత్తికూడా మారాలి. వ్యక్తిప్రవృత్తి మారితే వర్గ ప్రవృత్తీ మారుతుందికదా అనవచ్చు. కాని వ్యక్తిప్రవృత్తి కన్న వర్గప్రవృత్తి మరింత దుర్గమమైనది. ఇతర మనుష్యులకన్న ఉత్కృష్టమైన ఒక ఉన్నత వర్గానికి తాను చెందినట్లు మనిషి గర్విస్తాడు. ఇతరులు కింది అంతస్తు, తను పై అంతస్తులో ఉన్నట్టు ఊహా

గానం చేస్తాడు. అంటె ఇతరులను కేవలం తన రెండుకళ్ళతో చూడటమేకాక, వర్గంయొక్క కళ్ళ లోంచి చూస్తాడు. తన ఎదురుగా ఉన్న మనిషిని సూటిగా చూడడు. తనేదో పెద్ద శిఖరాగ్రాన ఉన్నట్టు, ఏదో హిమాలయ శిఖరంపైకి మానసికంగా ఎగిరి అక్కడనుంచి చూస్తాడు. అచ్చు తనలాగే నే ఉన్న అవతల మనిషి ఇప్పుడు కనబడనే కనబడడు. కనబడినా ఏదో నలుసులా కనబడతాడు. ఈ వర్గ ప్రవృత్తి పూరాలి.

వర్గానికి కారణం వ్యక్తే. ఇతరుల వ్యక్తిత్వాన్ని ఆదరించక, వారి వ్యక్తిత్వాన్ని అణచివేయటమే లక్ష్యమైనప్పుడు, ఆ వ్యక్తి 'విశిష్ట' అవక తప్పదు. ఐక్యత కూలి, భేదం ఇనపద్వారాలు తెఱచి ఆహ్వానిస్తుంది. ఇదే లక్ష్యమైన పలువురు ఒక వర్గం అవుతారు. కాబట్టి వర్గనిర్మూలన వ్యక్తియొక్క జీవితలక్ష్యంమీద ఆధారపడి ఉంటుంది.

కాబట్టి అన్నిటికీ జీవితలక్ష్యం మూలం ?

ఆయుధాల నరికట్టటం తక్షణ ఉపమనశం. అంతే. కేవలం నిరాయుధ పరిస్థితి శాంతికి దోహదం కాజాలదు. ఈ పర్యవసానానికి ప్రాముఖ్యత చూపినందువలన ప్రయోజనం లేదు. మామూలుగా ఇది మనుష్య స్వభావం.

యుద్ధజ్వాలలు భగ్గుమన్నప్పుడే ప్రజలందరూ తమ దేశ విషయాల్లో శ్రద్ధాసక్తులు చూపుతారు. అంతకుముందు దేశం తమకు సంబంధించినది కాద న్నట్లు తమ జీవితాలకు దేశ పరిణామానికి సంబంధం లేదన్నట్లు నిర్లిప్తులుగా ఉంటారు. యుద్ధకాలంలో మేల్కొని, ఇల్లు (దేశం) నలుమూలలా కాపలా కాసుకున్నట్టు శాంతికాలంలో కాపలా కాసుకోరు.

కాబట్టి ఆయుధవృద్ధి నరికట్టటాని కొక పక్కన ప్రయత్నిస్తూ, మరొక పక్కన ఈ ఆయుధాలకు పదును పెట్టుతున్న మూలసమస్య జీవిత లక్ష్యంగురించి తీవ్రంగా విచారించాలి.

మన జీవితలక్ష్యంలోని మహాదోషమే వైయక్తిక దుఃఖానికి, సాంఘికదైన్యానికి, హత్యలకు, విప్లవాలకు, యుద్ధాలకు మూలకారణం. ఆటంబాంబు యొక్క బడబానలానికి మొదటినిప్పురవ్వ ఈ దోషమే

ఇరవయ్యవ శతాబ్దానికి, మన విప్లవ వీరులకు, ప్రజాస్వామ్య ప్రవక్తలకు, ఐక్య ప్రజ్ఞులకు, మేధావంతులకు జీవితలక్ష్యాన్ని సరిదిద్దటమే సవాలు. ఏయుగాని కాయుగం ఎన్నో ధర్మప్రశ్నలు చదివి, చివరకు స్వార్థానికీ, పరపీడనకీ హారతి పట్టింది. కాని ఈ శతాబ్దంలో మనుష్యుడు తన లక్ష్యాన్ని సరిదిద్దుకోగలిగిన శౌర్యం, బలం, త్యాగం అలవర్చుకోగలడా ?

శారీరకంగా, మానసికంగా పరపీడనను విసర్జించటం మీదే ఆధారపడి ఉన్నది సాధనవిధానాల నిర్ణయం. పరపీడన లక్ష్యంగా ఉన్నంతవరకు హింస సాధనంగా ఉండక తప్పదు. ఈ అనాది సాధనాన్ని హింసా సాధనాన్ని విసర్జించాలంటె, శాంతి పత్రాలపై సంతకం చెయ్యటం కాదు, బలవత్తరమైన ఆయుధాలకు పదును పెట్టటం కాదు, కావలసింది; పరులను పీడించి, జీవించాలనే పురాతనప్రవృత్తిని నిర్మూలించాలి. అప్పుడే మనుష్యుడు మనుష్యాకార పశువుగాకాక, మనుష్యుడుగా ప్రకాశిస్తాడు.



# విష్టికేళ్ళ



'వన శ్రీ'

'తెల్లార్తే సమచ్చరాది పండగంట! అబ్బో! అబ్బో! అమ్మగారు ఏమేమి అప్పచ్చులొండు ద్దోమరి! సకిన్నాలు, గారెలు, పూర్ణాలు, తునకలు— ఉష్! అదేంది! ఆటన్నిటిమీద బావుంటయ్ బెల్లపు బూరెలు. సజ్జబూరెలయితే మరీ బావుంటయ్. అమ్మగారు తప్పకుండా వొండుద్ది. మద్దేన్నం గొడ్లకాడికి పోయేటప్పుడు చరాయి జేబులో రెండు — మూడు — కాదు నాలుగు సజ్జబూరె లేసుకొనిపోవచ్చు. గొడ్లను చెర్లో దోలి, వొడ్డున కూకోని వొక్కొక్కటే తిన్నాక చెర్లోని ఎర్రనీళ్ళు తాగితే ఎంత బాగుంటుంది?'

అసలా రాత్రి రామిగాడికి నిద్దరే పట్టలా. ఎప్పుడెప్పుడు తెల్లవార్తుందా, ఎప్పుడు లేద్దామా అన్న ఆలోచనా, ఆ ఆలోచన తాలుకు సజ్జబూరెలూ ఆ రాత్రంతా వాడికి చక్కిలిగింతలు పెట్టినై.

పదకొండేళ్ళ రామిగాడు నిరుటి ఏరువాక పౌర్ణమినుంచీ రెండు సలకలగింజలకు జీతానికి కుదురుకొన్నాడు చౌదరయ్యగారింట్లో. రామిగాడ్ని చౌదరయ్యగారి కాళ్ళదగ్గర, అన్నపూర్ణమ్మగారి చేతుల్లోను అప్పగించేసి, వాడి అయ్యా, అమ్మా నలుగురు పిల్లల్తో బస్తీకి చేరారు రిక్షా లాక్కుని బతకటానికని.

పండగనాడు బలే వుషారుగా వున్నాడు రామిగాడు. తెల్లవారుఝామున నాలుగు గంటలకే లేచి, ఆ లంకంత యింటినీ, దొడ్డినీ వొక్క బిర్రున వూడ్చి ఎత్తిపోశాడు.

అన్నపూర్ణమ్మగారు దంచమన్న అడ్డెడు సజ్జల్ని వొక్క బిగువున కుమ్మిపేశాడు. అలా దంచుతూన్నంతసేపూ వాడికి నూనెలో వుడుకుతూన్న సజ్జబూరెలు కళ్లలో కన్పించివుంటయ్! అంతపెద్ద రోకల్తో అడ్డెడు సజ్జలూ ఆమాంతంగా అరగంటలో పిండికొట్టిన రామిగాడ్ని చూస్తే దేనికీ ఆశ్చర్యం కలగని అన్నపూర్ణమ్మగారికే ఆశ్చర్యం వేసింది.

తను తినబోయే తియ్యటి సజ్జబూరెలను తలుచుకుని వుప్పొంగిపోతూన్న వాడి మనసుకు అరిచేతుల్లో పొంగివుబ్బిన బొబ్బలు పట్టలేదు.

అంత చెలాకీగా పనిచేస్తూన్న జీతగాడ్ని చూసి—

"ఓరి నీ జిమ్మబడ! రోజూ యింత కుశాలుగా చెయ్యవేరా?" అంది మురిపెంగా అన్నపూర్ణమ్మగారు.

"ఏందమ్మగారూ! అట్టంటారూ. ఇయ్యాల పండగ్గావంటమ్మగారూ." అని అన్నప్పుడు



సున్నటి, సుందరటి సజ్జబూరెలు రామిగాడి హృదయాన్ని తాకి చక్కలిగింతలు పెట్టివుంటయ్. ముసి ముసినవ్వులు నవ్వుతూ అమ్మగారికేసి అదోరూదిరిగా చూసి, క్రింది పెదవిని నాలుకతో తడుపుకొన్నాడు. ఆ నవ్వులోని అంతరార్థాన్ని అర్థం చేసుకోలేనంత ప్రఘటం కాదు అన్నపూర్ణమ్మగారు. ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగల ఆమెగారికి పదకొండేళ్ల జీతగాడి మనసును అర్థం చేసుకోగలగడం వొక లెక్కలోది గాదు.

ఇంట్లో పని కాగానే రామిగాడు వెచ్చాలు తీసుకురావటానికి చౌదరయ్యగారితో బజారుకు వెళ్లాడు.

చిల్లరకొట్టు షావుకారు బంగారయ్యశెట్టి మంచిబెల్లం అచ్చులకు అచ్చులు పగలగొట్టూంటే రామిగాడికి దవడల కింద నీళ్లు వూరినై.

చౌదరయ్యగారు చూడకుండా రామిగాడు శెట్టిని చూసి చెయ్యిచాపి ఆశగా చూశాడు. శెట్టి అడుగూ బొడుగూ యింత రామిగాడి చేతిలో విదలించేడు. ఆ పెట్టెంతంతా అమాంతం నోట్లో బొక్కకొని, చప్పరించి, అందులోని బెల్లంతాలూకు సారమంతా కరిగి లోపలికి పోగా మిగిలిన యీతాకు ముక్కల్ని, జీలకర్రపొలుసుల్ని బయటికి వూసేశాడు. షావుకారు తూస్తున్న కొత్త బెల్లం అచ్చు వాడి హృదయంలో దేన్నో కదిలించివేసింది. ఎదురుగా సుక్క కొచ్చుకుంటూ, గజ్జిపొక్కులు గిల్లుకొంటూ కూర్చున్న బంగారయ్యశెట్టి కొడుకు బుల్లోడ్ని చూడగానే రామిగాడికి అదోలా అనిపించింది.

తనే ఆ బుల్లోడయితే ఆ బెల్లం అచ్చుకు అచ్చు అమాంతంగా ఎగరేసికొని ఎత్తుకెళ్లి ఎలా తినేవాడ్నిరా బాబూ అనుకున్నాడు.

ఇతర సామానులతోసహా వో కట్టెడు కొత్త బెల్లం అదీ కొని మూటకట్టి చౌదరయ్యగారు—

“ఒరేయ్! రామిగా, మోస్తావ్రా?” అనీ అనకముందే “ఓ” అంటూ రామిగాడు మూటను ఎగరేసి నెత్తికెత్తుకున్నాడు.

ఉత్సాహంకొద్దీ ఎత్తుకొన్నాడే కాని, పైనున్న బరువుకు రామిగాడికి మెడజీవాలు పీక్కపోతూన్నాయ్. ఎర్రటిబెల్లం అచ్చుమూడుకు వొరుచుకుంటుంటే, అంత తీపులోనూ వాడికి వళ్లు పులకరించిపోతూంది. మూటకున్న చినుగులోగుండా సందు చేసుకుపోయిరామిగాడిమూపుడువేలు బెల్లం అచ్చును గోముగా గీరుతూంటే వాడినాలుక పళ్ళసందున దేన్నో వెతుకుతూంది.

మధ్యాహ్నపు భోజనాలు కాగానే అన్నపూర్ణమ్మగారు పిండివంటలు వండే కార్యక్రమంలో మునిగిపోయింది. బువ్వతాగి, గిన్నె కడిగి బోర్లించి సావిట్లో పచ్చగడ్డి మోపుమీద తాపీగా కూర్చున్న రామిగాడు వంటింట్లోనుంచి అమ్మగారి కేక వినపడగానే పరుగెత్తాడు.

అన్నపూర్ణమ్మగారు బెల్లం రోట్లో వేసి పోటు వెయ్యమంది. పోటు వేస్తూంటే ముక్కలు ముక్కలుగా విడిపోతూ గుజ్జుగుజ్జుగా బెల్లం రోకలికి అతుక్కుంటూవుంటే రామిగాడు మనసు ‘ఇది–ఇది’గా అయిపోతూంది. అన్నపూర్ణమ్మగారి ముగ్గురు పిల్లలూ రోటిచుట్టూ చేరి మారం చేస్తున్నారు. వాళ్లమ్మ పెట్టిన బెల్లపు ముక్కల్ని చీకుతూపిల్లలు గెంతుతూంటే రామిగాడు వాళ్లను వుషారు చేస్తున్నాడు—

అబ్బాయిగారి ముక్కకంటే అమ్మాయిగారిదే పెద్దదని, బుల్లెబ్బాయిగారు అప్పుడే తినేశారనీ అంటూ తినాలనే తనకోర్కెను తింటూన్న వాళ్ళ ద్వారా పాపం రామిగాడు తీర్చుకుంటూంటే— “ఒరేయ్! తిన్నగా పోటువేయరా?” అని జీతగాణ్ని హెచ్చరించింది అన్నపూర్ణమ్మగారు.

బెల్లపు పాకం కాగుతూంటే, రామిగాడి హృదయం కుతకుతలాడిపోయింది. సజ్జ పిండివేసి కలిపిన పాకం జావలుసాగుతూంటే రామిగాడిజిహ్వ వూటలు వూరించి. అన్నపూర్ణమ్మగారు, ఆత్రంగా ఎగబడ్డ పిల్లలచేతుల్లో అపచ్చిపిండే తలాకాస్త వేసి బయటికి పంపించివేసింది.

రామిగాణ్ని పిలిచి “ఓరేయ్! రామిగా; నీ గుడ్డలు నీవూ మంచె! ముంజుకంపు కొడ్తూన్నాయిరా. పండగపూటన్నా సుబ్రంగా వుండరా. సావిట్లో దండెంమీద చిన్నబ్బాయి చొక్కా వొకటివేశాను. అది తొడుక్కోరా.” అంది అరివాణికున్న మసి కడుగుతూ.

అమ్మగారు అన్న ఆమాటలకు రామిగాడికళ్ళు అంతపెద్దవిగా అయినై. వొక్కగంతులో నీళ్ళ గాబుదగ్గరకు పోయాడు. ఎండకు కాగివున్న నీళ్లను గభగభా నాలుగుచెంబులు వంటిమీద కుమ్మరించుకొన్నాడు. రామిగాడి తల్లీ తండ్రీ నెత్తాయిచ్చిపోయినలాగూ, అన్నపూర్ణమ్మగారిచ్చిన, గూళ్ళు చినిగిపోయిన చొక్కా వేసుకొని సంవత్సరాది పండక్కు ముస్తాబయినాడు.

బాగా అంటకత్తిరించినవాడి జుట్టూ, పెద్ద నొసలూ, ప్రత్యేకంగా వుంటయ్. చామనచాయ అయినా వాడి మొఖం కళకళ లాడ్తూవుంటుంది.

ఆ మెరకకళ్ళూ, కోటేరువేసినట్టుగా ముక్కూ, చిన్ననోరూ, సుంద్రని పెదవులూ తీర్చి దిద్దినట్టుగా వుంటయ్. విశాలమైన ఆ కళ్ళూ; నిశితమైన చూపులూ ఎవరినైనా యిట్టె ఆకర్షిస్తాయ్. చక్కటి సుంద్రని విశాలమైన వాడికళ్ళల్లో ఏవో తళుకులు కదుల్తావుంటయ్. కొత్త చొక్కా ఎగాదిగా చూసుకుంటూ, చొక్కా చినుగును దాచుకుంటూ, జారిపోతూన్న లాగును పైకి లాక్కుంటూ, కారుతూన్న ముక్కును పైకి చీదుకుంటూ రామిగాడు ఆరోజంతా ఎంతో వుత్సాహంగా వున్నాడు.

అన్నపూర్ణమ్మగారు పొయ్యిమీద నేతిగిన్నె ఎక్కించి సజ్జబూరెలు వండుతూంది ఎదురుగా రామిగాడు చుట్టూ పిల్లల్ని చేర్చుకొని కబుర్లు చెప్తాన్నాడు. కాని వాడిమనసు తినబోయే తియ్యటి సజ్జబూరెలమీద, కళ్లు మూకెలో పొంగుతూన్న వాటి మీదనే వున్నయ్.

మొదట వేసిన తునకలు రెండూ సరిగా రాక పోయేసరికి అన్నపూర్ణమ్మగారు చిర్రుబుర్రుమంటూ జీతగాడిమీద విరుచుకుపడింది.

"ఒరే! నీ దెవసంగానూ; ఎదురుగా కూర్చుని నీ పాడేం బిగించుకొన్నావురా? నీ చూపూ నీవూ మండిపోనూ. అట్లా సావిట్లోకి చావరాదురా? అన్నట్టు యీపూట గేదెకు కుడితి పోశావురా?" ఎలాగైనా వాణ్ణి అక్కడ్నుంచి పంపాలనే ప్రయత్నంలో అంది.

అన్నపూర్ణమ్మగారు దేన్ని వుద్దేశించి అంటుందో పూర్తిగా అర్థం కాకపోయినా రామిగాడికి అక్కడ్నుంచి వెళ్లాలనేది మాత్రం తెలిసింది. గేదెకు కుడితిపోయటానికి లేచివెళ్లాడు.

జీతగాడు వెళ్లాక ఆమెగారు—"అరె! వీడి దిష్టికళ్లు మండిపోను! ఆ చూపు పడితే యింకా తునకలు రావటమే?" అనుకొని మెటికలు విరుచుకొంది. పెద్దమ్మాయిని పిలిచి చీపురు తెప్పించి పొయ్యి చుట్టూ ముమ్మాటు తిప్పి దూరంగా పారేసి; తుపుకు తుపుకునా పొయ్యిలో వూసి, పెటికి పెటికీ మెటికలు విరిచింది. ఈలోగా నూనె బాగా కాగడంచేత నేమో వండినవన్నీ సవ్యంగానే వచ్చాయి.

ఇంతలోనే, పచ్చిపిండి అతిగా మింగిన చిన్నోడు "అమ్మా కడుపులో నెప్పే" అంటూ వచ్చాడు.

"ఇంకేం? వాడి పాపిష్టికళ్లు ఆ పిండి మీద కూడా పడినై! మానాయనే!" అంటూ కొడుకుని దగ్గరకు తీసుకుని, వాడి చుట్టూ చీపురు మూడుసార్లు తిప్పి, ఇంత వుప్పూ, మిరపకాయలూ పొయ్యిలో వేసింది.

సావిట్లో కూర్చుని వంటింట్లో వుడుకుతూన్న పిండివంటల వాసన్ని పీలుస్తూ ఆనందిస్తూన్న రామిగాడి దగ్గరకు పెద్దమ్మాయి చిట్టి, నోరు తెరవకుండా తింటూ, కుడిచేతిలోవున్న అప్పచ్చిని పరికిణీచాటున దాచుకొని వచ్చింది.

చిట్టి పరికిణీలో దాచుకున్న దాన్ని పసిగట్టి ఎట్లాగైనా చిట్టిని బుట్టలో వేసుకోవాలనే ప్రయత్నంలో పడ్డాడు రామిగాడు.

చిట్టి వెనకాలే చిన్నోడు సజ్జబూరెను నోటికి కరుచుకొని వచ్చాడు. అది చూసి చిట్టి చిన్నోణ్ణి మందలించింది. రహస్యంగా చిన్నోడి చెవుల్లో వూదింది—చొక్కా చాటున పెట్టుకోమని.

"అమ్మాయిగారూ! మీ చేతిలో వున్న తాయం కనుక్కోమంటారా?" తినాలనే కోర్కె వాడి హృదయాన్ని వేధించింది. "కాకమ్మ పెట్టుందో; పిచ్చికమ్మ పెట్టుందో?" అంటూ కళ్లు మూసుకుని చెయ్యి చాపేడు.

"ఒరేయ్! నీకళ్ళు దిష్టికళ్లురా! నీకు చూపించకుండా తినమని మా అమ్మ చెప్పింది." అనూయకంగా అనేసింది ఆరేళ్ళచిట్టి.

అది విన్న రామిగాడు తన కళ్ళనోసారి నలుపుకున్నాడు. తన కళ్ళేమైనా మారిపోయిన వేమోనని తడివిచూసుకున్నాడు. దిష్టికళ్ళంటే ఏమిటో చెప్పమని వాడి మనసును హృదయం వేధించింది. అందుకే కౌమాలు అమ్మగారు తనని అక్కడ్నుంచీ అంత విసరుగా వెళ్లిపొమ్మంది. వండేటప్పుడు తను చూస్తే సజ్జబూరెలు చెడిపోతాయా? మాయమౌతాయా? అవి తినేప్పుడు తనుచూస్తే తియ్యటిసజ్జబూరెలు చేదయిపోతాయా? ఆప్రశ్నల్తో వాడి చిన్నిబుర్ర సతమతమయి పోయింది.

అయితే పోయిన వుగాదిపండక్కు అమ్మ సజ్జబూరెలేకదూ వండింది. వండుతూంటే తను దగ్గిరే కూర్చున్నాడుగా మరి. అమ్మ ఎప్పుడూ చెప్పలేదేం తనవి దిష్టికళ్ళని. ఎక్కడో వందలమైళ్ళ దూరంలోవున్న అమ్మా, అయ్యా, అక్కా, చిన్నతమ్ముడూ, చిట్టిచెల్లాయి వాడి కళ్లల్లో కదిలారు. ఆత్మీయులతాలూకూ మధురస్మృతులు వాడి లేతహృదయంపైన పరుచుకొన్నై.

చిన్నోడు మంచినీళ్లు తాగి వచ్చేసరికి మంచం మీద పెట్టివెళ్లిన అప్పచ్చి కాస్తా మాయమైంది. వాడు ఏడుస్తూ వెళ్లి అమ్మకు చెప్పుకొన్నాడు. కసు

గుసుంటూ వచ్చింది అన్నపూర్ణమ్మగారు. జీతగాణ్ణి నిలదీసి అడిగింది. దొంగవెధవా! అట్లాంటి పనులు చేస్తే చేతులు విరగ్గొడతా నంది. ఆ చూపూ అదీ అంతా దొంగచూపే నంది.

"అమ్మగారూ! నే నసలు చూడలేదండి! దాన్ని నే తీయలేదండి. అమ్మతోడండీ" అంటూ నెత్తిన చేయి పెట్టుకొని వొట్టేసుకున్నాడు అమాయకంగా పదకొండు సంవత్సరాల రామిగాడు.

"ఛా! వెధవా! పైగా అబద్ధాలూ, వొట్లూను; ఎవ్వరూ తీయకపోతే సజ్జబూరెకు రెక్క లొచ్చి ఎగిరిపోయిందా ఏం!" రుసరుస లాడ్తూ అన్నపూర్ణమ్మగా రంటూవుంటే—అరుగు పక్కన నల్లకుక్క కసకసా దేన్నో నములుతూంది! నిస్సహాయతతో నిండిన రామిగాడి కళ్లల్లో గిర్రున నీళ్లుతిరిగినై.

* * *

"ఒరేయ్! రామిగా యిక్కడున్నట్లుగా రావాలి. రాగానే నీకు అప్పచ్చులు పెట్తాను. పాపం! పొద్దుట్నుంచీ కనిపెట్టుకొని వున్నావ్." సజ్జబూరెల మూటను రామిగాడి చేతి కిస్తూ అంది అన్నపూర్ణమ్మగారు. ఉత్తరప్పొలాని మామిడితోపు దగ్గరవున్న వంగమళ్ళకు నీరు కట్టిస్తూన్న చౌదరయ్యకు ధర్మపత్ని అన్నపూర్ణమ్మ జీతగాడిచేతికిచ్చి పింకివంటకాలు మూటకట్టి పంపించింది.

దొరసానమ్మగారు సజ్జబూరెలు పెట్తుందని కొండంత ఆశతో ఎదురుచూస్తున్న రామిగాడికి మళ్లీ పని తగిలింది. ఆ పెట్టే దేదో యిప్పుడే పెడ్తే, తింటూ ఎంతో చక్కగా పొలం పోయేవాణ్ణిగదా అనుకున్నాడు. అయినా, రాగానే పెట్తానందిగదూ! అయితే తొందరగా వెళ్లిరావాలి. ఎంత తొందర్లో తిరిగొస్తే అంత తొందర్లో బూరెలు తినొచ్చు! పొలం పోయి వచ్చినందుకు యింకా రెండెక్కువే అమ్మగారు యివ్వొచ్చు! యిప్పుడే అడిగితే తక్కువే యివ్వొచ్చు! అలా ఆలోచనలో పడి పరుగెత్తుతున్న మనసుతో వాడి కాళ్లు పందెం వేసినై. అన్నపూర్ణమ్మగా రిచ్చిన మూట భుజాన వేసుకొని పరుగుకు లంకించుకొన్నాడు. వీధి దాటి మలుపు తిరిగి రోడ్డెక్కాడు. పెద్దకాలవవంతెన దాటి, కట్ట ఎక్కగానే వాడి మెదడులో వొక వూహ మెరుపులా మెరిసింది. మూట దించి మెల్లగా విప్పాడు. అసలే పెద్దవైన వాడికళ్ళు మరీ పెద్దవైనయ్. హృదయం ఆనందంతో నిండిపోయింది. నోరు వూరుతూంది! పెదాలు తడుపుకొన్నాడు. బాగా వుబ్బి పొంగివున్నయ్ బూరెలు—ఒకటి—రెండు...మొత్తం వొకటి తక్కువగా పది!

అందులో వొకటి తింటే ఆయనగారు కనుక్కో వచ్చారుగా యేం! ఇంటికొచ్చాక అమ్మగారు జీతగాడు ఎన్నితీసుకొచ్చాడని అడిగితేనో? అమ్మో! యింకేమన్నా వుందీ?

ఆ ఆలోచనకే రామిగాడిగుండెలు దడదడలాడిపోయినై. రెండుచేతులనిండా సజ్జ బూరెలు తీసుకొని పెదాలకానించుకొన్నాడు. వాడికి తెలీకుండానే వాడి నాలుక వాటిని తడిమిచూసింది. అమ్మో! ఎంగిలి చేస్తే పాపంకాదూ! కళ్ళుపోవూ? ఆ భావన రాగానే అస్తమిస్తూన్న సూర్యభగవానుని చూసి చంపలు వేసుకొన్నాడు. మళ్ళీ భద్రంగా మూటకట్టి బుజానవేసుకొని చౌదరయ్యగారి వంగతోట కేసి దారితీశాడు. చౌదరయ్యగారికి బూరెల మూటయిచ్చి యింటిముఖం పట్టాడు రామిగాడు.

రోడ్డునే వెళ్ళితే ఆలస్యం అవుతుందని, అడ్డదారినవున్న కాలవకట్టనే వెళ్ళాలని చేలకు అడ్డంపడి చకచకా నడుస్తూన్నాడు. నెర్రెలు విచ్చిన గతుకులూ, గండ్లుకొట్టినగట్లూ చెంగు చెంగున దాటిపోతూన్నాడు. తినబోయే సజ్జబూరెలు తాలూకూ వాడి ఆశలు చెలరేగుతున్నయ్. సంధ్యచీకట్లు తెరలు తెరలుగా అలుముకుంటూన్నయ్. కొట్టివేసిన గడ్డి కడియాములూ, కోసివేసిన జనపగూళ్ళూ, విరగ కాచిన మామిడితోటా, ఏపుగా పెరిగిన వంగమళ్ళూ, సజ్జబూరెలుతింటూ కూలీలను అదమాయించుతున్న చౌదరయ్యా ఆ చీకట్లో మసక మసగ్గా మాయమయి పోతూన్నారు.

దూరంగా చీకట్లో మునిగిపోతూన్న వూరూ, చౌదరయ్యగారింటికేసి దీక్షగా చూస్తూ చరచరానడుస్తూన్నాడు; పదకొండేళ్ల రామిగాడి చిట్టిబుర్రలో తినబోయే తియ్యటి సజ్జబూరెలు తాలూకూ మధుర స్మృతులు వువ్వెత్తుగా లేచి పడ్తూన్నయ్. ఆనందంతో పరవశత్వం చెందుతూన్న వాడి హృదయానికి కాళ్ళకు గుచ్చుకుంటూన్న జనప మోళ్ళూ, చిల్లిగవ్వలూ బాధకలిగించడం లేదు.

మెల్లగా దిగి పంట కాలవదాటి మళ్లీకట్ట ఎక్కి రామిగాడు తక్కున ఆగిపోయాడు. వాడిగుండెల్లో ఏదో పట్టుకున్నట్టయింది. ఎదురుగా చీకట్లో నుంచున్న రెండు తాటిచెట్లూ, వాటి మధ్యగా పెరిగిన నిలువెత్తు పుట్టా వాడి కళ్లల్లో కదిలి వాడి లేతమనసును కలవరపెట్టింది. కళ్లు వోసారి గట్టిగా నులుముకున్నాడు. సజ్జబూరెలతో నిండిన అన్నపూర్ణమ్మగారి చేతులు వాణ్ని ఆప్యాయంగా ఆహ్వానించినై. అంతే, మళ్లీ పరుగు లంకించుకొన్నాడు రామిగాడు—

రెండు పోతు తాటిచెట్లమధ్య పుట్టపైన పడగ విప్పి నాట్యంచేస్తున్న నాగుపాము వాడి దిష్టికళ్లకు కన్పించలేదు! నాలుకలు చాచుతున్న నాగేంద్రుడు వాడి పాపిష్టికళ్లకు కన్పించలేదు! కోరలు చాచిన త్రాచుపాము వాడి దొంగచూపులకు కన్పించలేదు! విషం కక్కుతున్న కాలసర్పం వాడి దిష్టికళ్లకు కనిపించలేదు! చేతులు చాచిన పాపిష్టి మృత్యువు వాడి దిష్టికళ్ళకు కన్పించలేదు!

పదకొండు సంవత్సరాల జీతగాడి భౌతిక దేహం, కటికిచీకట్లో ఆ నిలువెత్తు పుట్టపక్కన వాలిపోయింది.

తీర్చిదిద్దిన రామిగాడి విశాల నేత్రాలకు మరి ప్రపంచం కన్పించలేదు.

ఎక్కడో కొన్ని వందలమైళ్లదూరంలో ఏదో పట్టణంలో వుగాదిపండుగనాడు కూలిలేక కూడులేక కునికిపాట్లు పడ్తూన్న వో రిక్షావాడి గుండెలు కలుక్కుమన్నయ్.

సంవత్సరాది పండుగనాడు అన్నపూర్ణమ్మగారి వంటింట్లో వుట్టిమీద వున్న బుట్టలో రెండు సజ్జ బూరెలు మిగిలిపోయినై.

---

# కలగూరగంప

## వర్ణచిత్రరచన - ప్రాచీన సంప్రదాయములు

రసాస్వాదనకు ఉపకరించే విజ్ఞానమే సంస్కృతి వికాసమునకు దోహదమిస్తుంది. ఒక జాతి సృష్టించుకొన్న కళా సంప్రదాయములలోనే ఆ జాతి యొక్క సంస్కృతి సంపద వ్యక్తమగును. లలిత కళలో వర్ణచిత్రణమున కొక ప్రత్యేక ఆకర్షణగలదు. ఆ కృతులకు అనుగుణమైన రంగుల చిత్రణమునందే సహజమైన ఆకర్షణగలిగి ప్రజాను రంజకములగు చున్నవి. కుడ్యములు, వస్త్రములు, దారు విగ్రహములు, గృహోపకరణములు మున్నగున వెన్నో వర్ణ చిత్రణమునకు స్థానములు. కాగితములు, గృహపరిశ్రమగా తయారుచేయబడి, ఉపయోగములోనికి వచ్చిన నాటినుండియు అవి చిత్తరువులు వ్రాయుట కుపయోగపడుచున్నవి. చారిత్రకముగా మన దేశములో కళలకు మతద్యమాలవల్ల కలిగినంత ప్రోత్సాహము అన్యమార్గముల లభింపలేదు. పురాణ, బౌద్ధయుగములలో ఈ వర్ణ చిత్రకళ అత్యున్నతి స్థితిలోనుండెనని నిరూపించుటకు అజంతా, ఎల్లోరా, భువనేశ్వరము, తిరువాన్కూరు, తంజాపురములందలి కుడ్యచిత్రములే ప్రబల నిదర్శనములు. మగధేశ్వరులను జయించి స్వతంత్రరాజ్య స్థాపకులైన ఆంధ్రరాజన్య చూడామణుల ఆదర ప్రోత్సాహములతో వెల్లి విరిసిన ఆంధ్రుల హస్తకౌశలమే అజంతా కళాలయములుగా రూపొందినది. అక్బరు పాదుషా కాలములో హైందవ పారశీక సంప్రదాయముల సమ్మేళనముతో చిత్రరచన యందొక నూతన శకము దయించినది. మన దేశమున ఆంగ్లేయుల ప్రాభవము వచ్చిననాటి నుండియు హైందవకళలకు ప్రోత్సాహము తగ్గినది. దేశీయ సాంప్రదాయములు ఇటీవలి రెండు శతాబ్దులలో విచ్ఛిన్నమైనంతగా నెన్నడును గాలేదు. అయినప్పటికి హిందూమత వాహినివలెనే, అన్య సంస్కృతుల తాకుడులెన్ని తగిలినను వాటిని తనలో లీనము గావించుకొని నిజతత్వమునకు భంగము వాటిల్లకుండ నేటికిని హైందవకళా సంప్రదాయములు ప్రజానీకములో స్వీయప్రభావమును గోల్పోవక నిలిచియుండుటయే వాటి ఘనతకు నిదర్శనము.

కళానుభూతి :— ఇంద్రియానుభూతిద్వారా అతీంద్రియ విషయములను గ్రహించుట కళయొక్క పరమావధి. రూపముద్వారా దాని కతీతమగు విషయాన్ని వ్యక్తపరచుట చిత్రరచనయొక్క లక్ష్యము. సంగీతమును విని ఆనందించుటకు రాగజ్ఞానము తాళజ్ఞానము, ఉపకరించినట్లే చిత్రకళను ఆనందించుటకు వర్ణ పరిజ్ఞానము రేఖా పరిజ్ఞానము సాయపడును. ఏదైన చిత్రాన్ని చూచినప్పుడు చిత్రరచనకు కారణభూతమైన వస్తువు, వర్ణవిన్యాసము, రేఖారచన ముఖ్యముగా గమనించదగినవి. జంత్ర గాత్రముల సమ్మేళనమువలన శ్రవణేంద్రియముద్వారా కలిగే ఆనందమువలెనే రూపము, వర్ణము, రేఖల, కలయికవల్ల చక్షురింద్రియముద్వారా చిత్రకారుడు దర్శకుని ఆనందపరచుచున్నాడు. ఇది సార్వజనీనమైన విషయము. ఒకానొక సంగీత విద్వాంసుడు నాదానుసంధానముచేసి శ్రోతలను తన్మయులను గావించగలిగినట్లే ప్రజ్ఞావంతుడైన చిత్రకారుడు కేవలము వర్ణ సంవిధానమువలనగాని రేఖారచనవలనగాని ద్రష్ట సమ్మోహితుని గావింపగలడు. ఇట్టి ఫలసిద్ధికి ద్రష్టకు, చిత్రకారులకు, గూడ తగినశిక్షణము అనుభవమున్నగాని కుదురదు. హైందవకళలలో ఆధ్యాత్మికానుభూతి జీవమువంటిదని చెప్పదగును. దేవమనుష్య భేదముల ననుసరించి, నాయికా భేదముల ననుసరించి, ఆయారూపముల యొక్క ఆంగిక భంగిమలలోను హస్తవిన్యాసములలోను శాస్త్ర సమ్మతమగు సాంకేతిక రహస్యములుండును. వాటి పరిజ్ఞానము లేనిదే అందలి సొగసు అర్థముగాదు. ప్రబంధములందు ఆయా పాత్రల సౌందర్యాతిశయముల వర్ణించుటలో కవులిచ్చిన ఉపమానములందలి భావములను ముందుగా నవగాహన మొనర్చుకొనవలసియున్నది. ముఖమునకు చంద్రబింబము, కన్నులకు కలువరేకులు. గళమునకు శంఖము, చెక్కులకు అద్దములు, ఇత్యాదిగా చెప్పిన ఉపమానములు ఆయా అంగముల సౌందర్య గరిమకు సూచనా మాత్రములే. లక్ష్మి, సరస్వతి,

దుర్గ మున్నగు దేవతల యొక్కయు, రామ, కృష్ణ, బుద్ధా ద్యవతారముల యొక్కయు రూపవిలాసములను వర్ణించుటలో ఆధ్యాత్మిక విద్యారసికులైన ఋషుల భావావేశమునకు ఎల్లలు గోచరించవు అవాఙ్మానస గోచరము, వర్ణనాతీతమునగు భగవత్స్వరూప నిరూపణలో వారు కోటి సూర్యప్రభలు, విద్యుల్లతికలు, తారాకాంతులు మున్నగు యుపమానములతో ఆ చిచ్ఛక్తికి రూపులు కట్ట ప్రయత్నించిరి. అట్టి అలౌకిక స్వరూప నిరూపణలో చిత్రకారుని తూలిక వాస్తవిక శాస్త్ర సూత్రములకు కట్టుబడినంత మాత్రమున జాలదు, అట్టి యుదాత్త భావస్ఫురణకనుకూలించు వర్ణ సంవిధానము, తూలికా విన్యాసములున్న గాని చిత్రము రంజకము గాజాలదు. ఇట్టి చిత్రరచనకు చిత్రకారునిలో తగినంత సంస్కృతి, అనుభవము అత్యంత వాంఛనీయములు. లేనినాడు కీ॥ శే॥ తలిశెట్టి రామారావుగారు ముఖమునకు చంద్రుడు, నాసికకు నువ్వు పువ్వు, కన్నులకు రెండు చేపలు, చేతులకు రెండు కలువ కాడలు, కంఠమునకు శంఖము, చెవులకు శ్రీ కారములు మున్నగు వాటిని కూర్చి వ్యంగ్యముగా చిత్రించిన ప్రబంధకన్యక తయారగును అందుచేత నే భారతీయ కళలో వాస్తవిక దృక్పథముకన్న ఆదర్శ స్ఫురణకు ప్రాధాన్యత గలదు.

వర్ణ సంవిధానము: అజంతా మున్నగుచోట్ల అప్రతిమానమగు కళాసృష్టి గావించిన చిత్రకారులెవరో వారి జీవితము లెట్టివో తెలియకుండ కాలగర్భమున విలీనమై పోయినవి. వారికి కళారాధనపట్ల గల ఏకాగ్రతలో స్వీయచరిత్రలను వెల్లడించుకొను తలంపు లేదు. చిత్రకారుల చరిత్రతోబాటు ఆనాటి వర్ణలేప విధానములుగూడ తెలియరాకున్నవి. ఉపలభ్యమైనంతవరకు అజంతా గుహల గోడలకు మట్టి, గోమయము, యిసుక, ఊక మున్నగు ద్రవ్యములను గలిపి దళముగా పూతపెట్టి గుహాకుడ్యముల ఉపరితలమును చదునుపరచెడి వారని, దానిపైన సున్నము, శుద్ధ పొడుములతో మలి పూతపెట్టి వర్ణచిత్రణమున కనువుగా ఫలకములను సిద్ధపరచెడి వారని తెలియుచున్నది. కొన్ని ఖనిజసంబంధమైన శిలాధాతువుల నుండి రంగులను సమకూర్చుకొనెడి వారు. హరిదళము నుండి పసుపురంగు, లోహ మిశ్రణములనుండి ఎరుపు, గోధుమవన్నెలను, హరిత వర్ణపు శిలలనుండి ఆకుపచ్చని రంగును, నీలపు రాళ్లనుండి నీలవర్ణమును, తయారుచేసెడి వారట. ఆంధ్రదేశమున వర్ణ

చిత్రణము, దారుశిల్పము, కులవృత్తిగాగల కళాకారులలో కొండపల్లి చిత్రకారులు ముఖ్యులు. వీరు చిరకాలమునుండి హిందూ సంస్థానములలోను, మహమ్మదీయ సంస్థానములలోను ఆస్థాన చిత్రకారులుగ నుండి వారిచ్చిన మడిమాన్యముల ననుభవించుచు చిత్రరచనలు చేయుచుండెడివారు. దేవాలయములలో వాహనములు నిర్మించుట, రంగులతో పురాణ కథలను వ్రాయుట, అలంకరణములు చేయుట వారి ముఖ్య విధులు. ఇంతేగాక కొండపల్లి బొమ్మలని ప్రసిద్ధికెక్కిన చిన్న కొయ్యబొమ్మలలో జానపద జీవితమును ప్రతిబింబించు శిల్పము లతిసున్నితముగా తయారు చేయుదురు. అవి అనేక జాతీయ అంతర్జాతీయ ప్రదర్శనములలో ప్రఖ్యాతి పొందినవి.

### రూపచిత్రములు, తస్వీరులు :

రూపచిత్రములు, తస్వీరులు వ్రాయుటలోను దశావతారీ పేకలను తయారు చేయుటలోను వీరికి ప్రత్యేక ప్రవీణతగలదు. ఇవి రాజపుత్ర 'మినియేచర్సు,' కు ఎందును తీసిపోవు. వీరిలో కొందరు 16వ శతాబ్దముననే విజయనగరము నేలిన నాయక ప్రతినిధులతో వలసబోయి తంజాపూరు ప్రాంతములలో స్థిరనివాసము లేర్పరుచుకొన్నట్లు తంజాపూరు మాన్యుల్సునందు గలదు. లేపాక్షి వీరభద్రేశ్వరాలయ కుడ్య చిత్రములలోను కుంభకోణము రామస్వామి ఆలయమునందు గల చిత్రములందును వీరి కళానైపుణ్యము గాంచనగును. పిఠాపురము, పెద్దాపురము, సంస్థానీకుల పోషణలో నుండిన చిత్రకారుల రచనలు నేటికిని అచ్చటచ్చట కానవచ్చుచున్నవి. మూర్తి కల్పనయందు గల ప్రావీణ్యమెంత గొప్పదో వర్ణ సంవిధానమందును రేఖారచనయందును వీరికి గల లాఘవమంత నిశితమైనది. వీరి చిత్రములలో రేఖలకు జీవముట్టి పడుచుండును. వీరి సంప్రదాయములలోని వర్ణ సంవిధానముల సొగసు, రేఖా రచనయందలి వారి ప్రావీణ్యము రూపమునందలి సౌందర్యము ఇందు గాంచనగును. ఇటీవల ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆర్ట్ ఇన్ యిండస్ట్రీస్ (*Indian Insti twtute Arts In Industries*) తరపున పర్యటించిన వారును, ప్రసిద్ధకళా విమర్శకులునగు సుధాంశు కుమార రాయ్‌గారు కొండపల్లి కళా సంప్రదాయముల గురించి వ్రాయుచు వారి వర్ణ సంవిధాన పద్ధతి పర్శియ మెరుగడని స్వతంత్రమైనదని నుడివియున్నారు. ఇంగిలీకము, జేగురురాయి, నీలిమందు, జంగాళీ పచ్చ, అరదళము, సుద్దమున్నగు ఖనిజ పదార్థములనుండి రంగులను స్వయముగా చేసుకొందురు. మేక, ఉడుత వెంట్రుకలతో కుంచెలను స్వయముగా కట్టుకొనెదరు. రంగులు వేయుటకు ముందుగా గుడ్డకుగాని గోడలకుగాని బొమ్మలకుగాని సుద్దతో పూత పూయుదురు. ఆపైన సఫేద (*Zincoxide*)తో మలిపూతపూసిన మంచి భావశ్య మేర్పడును. ఈ సఫేదులో కొద్దిగా నీలిమందు కలిపి ఏనుగుల రంగును, అంతకన్న తక్కువగా నీలిమందు కలిపి ఆకాశపురంగు తయారుచేయుదురు. ఇట్లే ఒక భాగము ఇంగిలీకమునకు 2 భాగములు సీమసుద్ద కలిపి నూరిన మంచి ఎఱ్ఱరంగు తయారగును. ఇందులో శ్వేత వర్ణములకు సుద్దకు బదులు సఫేద్ కలిపిన రంగు మాడిపోవును. రేఖా రచనమున కుపయోగపడు నల్లరంగు ఆముదము, కిరసనాయిలు దీపములనుండి వచ్చిన మసితో తుమ్మజిగురునీళ్లు కలిపి తయారు చేయుదురు. ప్రతిమలకు, తస్వీరులకు అలంకరణకై ఉపయోగించు బంగారు వర్ణము కుందనపు రేకుతో వేయుదురు. ఈ కుందనపు రేకు వీరిలో కొందరు స్వయముగా గృహ పరిశ్రమగా తయారుచేసి కొందరు. ఈ కుందనపు రేకుతో పటములకు బొమ్మలకు అలంకరణములను చిత్రించుటలో వీరికి ప్రత్యేక ప్రావీణ్యముగలదు. వీరి చిత్రములలో రంగులు, కుందనపుఛాయ, కాంతి చెడక ఎంత కాలమైనను క్రొత్తవిగా నుండును. ఇట్టి ప్రక్రియ లెన్నో మూల బడినవి.

కాలక్రమమున కవిత్వము, సంగీతము, మున్నగు ఇతర కళలలో వలెనే చిత్రరచనలోగూడ జాతీయత నశించి అన్యదేశీయ సంప్రదాయముల అంధానుకరణము మాత్రము చూచుచున్నాము. ఉత్తమ చిత్రములు చూచి ఆనందించుటకు దగిన సంస్కృతిగూడ పూర్తిగా మృగ్యమగుచున్నది. జాతీయ సంప్రదాయములను భద్రపరచుకొనుటకు నేటి సినీమా యుగమందలి కృత్రిమ ఆకర్షణలపై కొంత మోజు తగ్గించి యథార్థ కళారాధనకు పూనుకొందురుగాక.

శ్రీ కాముఋషి సత్యనారాయణవర్మ.

---

# నైజాములో కొన్ని ఆంధ్ర సామంతరాజ్యములు

ప్రస్తుత నైజాము రాజ్యములో అర్ధభాగము పైగా ఆంధ్రదేశములోని దగుట, చిరకాలము నుండియు ఆంధ్రదేశచరిత్ర యభిన్నముగనే యున్నది. నైజాములో నుద్భవిల్లిన రాజ్యములు సర్కారులు, దత్తమండలములలోనికి, ఆంధ్రమున వెలసిన రాజ్యములు నైజాములోనికి వ్యాపించి ప్రసిద్ధిగన్నవి. మధ్యయుగము (క్రీ. శ 1500—1800) లో వేంగీ

చాళుక్యుల తదనంతరము, దాదాపు మూడు శతాబ్దములు ఆంధ్రదేశమును నిరాఘాటముగ, పాలించిన కాకతీయుల ముఖ్యరాష్ట్రము నైజామే; రాజధాని వరంగల్ యనబడు ఓరుగల్లు—ఏకశిలానగరము. కాకతీయుల పిదప రాచకొండ, దేవరకొండ ముఖ్యపట్నములుగ నేలిన వెలమరాజులు సర్కారులలో కొండవీడు, రాజమహేంద్రవరము, కోరుకొండ రాజధానులుగ పాలించిన రెడ్డి సామ్రాట్టులకు సమకాలికులు. వీరు రెడ్డి రాజ్యముపై తరచుగ దండయాత్రలు సల్పుచుండిరి.

కాకతీయ, వెలమ, రెడ్డిరాజ్యములలో చిన్న సామంతరాజ్యము లనేకము లుండెను. ఇవి స్థానిక విషయము లన్నిటియందును స్వతంత్రములే. గోన హైహయులు (క్రీ. శ. 1190—1294) కాకతీయ సామంతులై వర్ధమాన పురము (వడ్డమాని) రాజధానిగ పాలించిరి. వీరి నామములు రెడ్డి, నాయని శబ్దములతో అంతమైనవి. [1]వీరు తమవలెనే కాకతీయ సామంతులైన మల్యాల వంశీయులతో సంబంధ బాంధవ్యముల నెరపిరి. గోనగన్నారెడ్డి రుద్రమ సేనాపతియై దేవగిరి యాదవులనుండి అనేక దుర్గముల గూరగొనెను. గోన బుద్ధారెడ్డి కాచ, విఠల ప్రభువులు సంపూర్ణ రామాయణమును—రంగనాథ రామాయణము—పూర్వ, ఉత్తర భాగములు—రచించిరి. గోన విఠలుడు రాయచూరులో ప్రజారక్షణార్థమై కోట గట్టించెను. [2]గోనకుప్పమ బూదపూరులో సుందేశ్వరాలయము నిర్మించెను.

చాగిరాజులు 12, 13, 14, 15 శతాబ్దములలో నతవాటి, విజయవాటి విషయముల బాలించిరి. వీరి రాజధానులు గుడిమెట్ట, విజయవాడ, వినుకొండ. చాగి రాజులు కాకతీయులతో వియ్యమందిరి. చాగి పోతరాజు 3 (క్రీ. శ. 161—90) నలగామరాజు పక్షమున పల్నాటి యుద్ధములో (క్రీ. శ. 1178—) పాల్గొనెను. [3]దోరరాజు *II* (1190—99) నతవాటి విషయాధీశ్వర, త్యాగరాజ బిరుదాంకితుడు. పోతరాజు *II* (1199—1230) నరసింహవర్ధన బిరుదు వహించెను. మన్మ పోతరాజు, మనుమ గణపతి 1259—1268 (క్రీ. శ.) కలిసి రాజ్యపాలన

*1. V. Yasoda De wi : The hisfory of Andhra country-J. A. H. RS vol XIX p 23.* 1186)

*2 Kakatiya Sanchika. API. no 33.*

*3 J. A. A. R. SXIX p 40. 4. 309 of 5 283 of 1924.*

చేసిరి. మన్మ గణపతి బహుశః రెండవ పోతరాజు మనుమడైయుండును. ఇతని శాసనములు వేపాద్రి (1259 క్రీ. శ.) 4అను ముంచి పల్లెలలో గలవు. అనుముంచిపల్లి (1260) 5శాసనములో రాజు మనుమచాగి గణపతి అని పేర్కొనబడియున్నాడు. ఇతని మరొక శాసనము 6మధిరసమీపమున చెందుకూరులో ఆంజనేయస్వామి ఆలయములో యిటీవల త్రవ్వితీయబడిన $4\frac{1}{2}$ అడుగుల యెత్తుగల ముఖమంటప శిలపైగలదు. ఇది కాకోలను కేశవదేవరకు శ్రీమన్మహామండలేశ్వర మన్మచాగి గణపయ రాజుల దానమును జెప్పుచున్నది. కాకోలని కేశవాలయ మేచటిదో? చెందుకూరులోనిదైన, నా కాలమున చెందుకూరునకు కాకోలను అను నామాంతరముండి యుండవలెను.

చెందుకూరులో దొరికిన విగ్రహములు సీతారామ లక్ష్మణులు, గరుడాళ్వారు, పన్నిద్దరు ఆళ్వారులు, యిద్దరు ద్వారపాలకులవి.

చాగిరాజులు వైష్ణవోపాసకులు. నరసింహ వర్ధన బిరుదాంకితులు. కాన యీ విగ్రహములన్నియు, వారి కాలమునాటి యొక యాలయము—బహుశ కేశవాలయము—లోనివై యుండును. ఇచటనే పూర్వము రెండు శివలింగములు, పానవట్టములు, వినాయక, దేవి విగ్రహములు దొరకినవి. రెడ్డి రాజుల పాలన నైజాము ఈ ప్రాంతములవరకు వ్యాపింపనందున, యీ విగ్రహములన్నియు కడపటి రెడ్డినాటి వనుట సమంజసముకాదు. అందువలన యీ విగ్రహములందు కాకతీయ శిల్పఛాయ లుండును కాని తర్వాతికాలపు విజయనగరశిల్ప విశిష్టత యుండుట అసంభవముగదా!

పరిచ్ఛేది రాజులు షట్సహస్ర, కొల్లిపాక 700 రాష్ట్రములను, కొల్లిపాక, విజయవాడ రాజధానులుగ పాలించిరి. 12 వ శ॥ అంతమున పరిచ్ఛేది రాజ్యము కాకతీయ ప్రతాపరుద్రుని రాజ్యములో గలిసి పోయెను.7

నతవాటి రాజులు (క్రీ. శ. 1104—1269) మండపల్లి రాజధానిగ నతవాటి విషయమును పాలించిరి.మడపల్లి మధిరకు సమీపమున గలదు. నతవాటి రాజులు ప్రారంభమున కళ్యాణి చాళుక్యులకు, తర్వాత కాకతీయులకు సామంతులైయుండిరి.

యాదవరాజులు కాకతీయుల సామంతులై పానుగల్లు రాజధానిగ పాలించిరి. వీరు విష్ణు వంశోద్భవ, యాదవకుల తిలక, ద్వారవతీపురవరాధీశ్వర బిరుదముల దాల్చిరి. శార్ఙ్గపాణి దేవుడు దేవగిరి యాదవ చక్రవర్తి సింగమదేవుని (క్రీ. శ. 1210—1247) పుత్రుడును బహుశః జైతుగి యొక్క కనిష్ఠ సోదరుడై, దేవగిరి వీడి, కాకతీయ సామంతుడై యుండును. ఇతని ప్రశస్తి సమస్త భువనాశ్రయ పృథ్వీవల్లభ మహారాజాధిరాజపరమేశ్వర పరమ భట్టారక—తో ప్రారంభమగును శార్ఙ్గపాణి సాద్రము దేవి రాజప్రతినిధిగ నుండెను. ఇతను శాసనములో 8చేసిన విజయములన్నియు తండ్రి సింగమదేవునివే. గాన తండ్రి విజయములలో నితడు పాల్గొనియుండి, తనవిగా జెప్పుకొని యుండును

శార్ఙ్గదేవుని రాజధానియైన పానుగల్లులోని ఛాయా సోమేశ్వరాలయము కొన్ని శిల్పవిచిత్రముల జూపుచున్నది. సంగీత రత్నాకర గ్రంథకర్త శార్ఙ్గదేవుడు, పానగల్లు సారంగుని సమకాలికుడై యాదవ సింగమదేవుని యాస్థానమందుండెను. 9 150 సం॥ లకు పూర్వము చెందుకూరు సారంగ పట్టణమని జనులనుడి. అచట ప్రసిద్ధశైవ, వైష్ణవాలయము లుండెడివట 10 ఈ సారంగపట్టణమను పేరు పానగల్లు యాదవరాజు శార్ఙ్గపాణి పేరునుబట్టి వచ్చియుండును. అతని పేరనా పట్నము నిర్మింపబడి యుండును.

శ్రీ వారణాసి యశోదాదేవి.

*4. 309 of 1924*

*5 Bharati. March 1952.*

*6 Bharati March 1952 :*

*7 V. Yasodadevi : The history of Andhra country.*

*8. Telingana inscription I Kakatiya-his-no 33 : Hyd. Arch. Seris no 13 II no 34*

*9. Sarangadeva : Sargi for at nakara (1943) I Text p 10 ;*

*10. Bharati. March (1952):*

# గ్రంథ విమర్శనము

## రానున్న సంక్షోభం

ఫ్రిట్జు స్టెరన్ బర్గ్, అనువాదం విద్వాన్ విశ్వం. ప్రతులకు: ఇంటింటి విజ్ఞానమాల, 16 జోన్సు వీధి, మదరాసు. వెల అరురూపాయలు.

ఇది ప్రపంచార్థిక మాంద్యస్వరూపాలు, కారణాలు నివారణోపాయాలు, మొదలైనవాటిని గురించి కూలంకషంగా, సునిశితంగాను చర్చించే గ్రంథము.

ప్రపంచార్థికమాంద్యాలకు కమ్యూనిస్టులు కొన్ని ప్రధాన కారణాలు, నివారణోపాయాలు నిర్వచిస్తారు వీటినిగురించి మార్క్సిష్టులు చేసినంత సూక్ష్మపరిశోధన లే ఆర్థిక వేత్తలు చెయ్యలేదు. మొట్టమొదట మార్క్సు వీటినిగురించి సమగ్రపరిశీలన చేసినతరవాతనే చాలామంది ప్రపంచార్థిక వేత్త లీతనిపంథా అవలంబించి ప్రపంచ సంక్షోభాలు కలిగించే ఈ ఆర్థికసమస్యలనుగురించి తీవ్ర పరిశోధనలు సాగించారు.

ఫ్రిట్జ్ స్టెరన్ బర్గ్ ప్రపంచ విఖ్యాతిసాధించిన రాజకీయార్థిక వేత్త. ఇతడీ గ్రంథంలో 1929 లో సంభవించిన ఆర్థికమాంద్యాన్ని గురించీ, తన్మూలంగా ప్రపంచంలో ఏర్పడిన రాజకీయార్థికసంక్షోభాలనుగురించీ, సోదాహరణంగా వివరించాడు.

అంతేగాక ప్రస్తుతంరాబోయే ఆర్థిక సంక్షోభం సరిగా పాతమార్గాన్నే కాక కొన్ని కొత్త దారులు తొక్కగలదని కూడా సూచించాడు. దీనికోసం ఇతడు పేర్కొన్న సంఘటనలు, చూపించిన ప్రమాణాలు సామాన్యపాఠకులకు కూడా సులభంగా అవగాహన అవుతాయి.

అయితే ఫ్రిట్జ్ స్టెరన్ బర్గ్ కేవలం కమ్యూనిష్టు పంథా ఒక్కటే ఇక ప్రపంచానికి శరణ్యమనే ధోరణి అవలంబించడు. అయితే ప్రపంచార్థిక సమస్యల అవగాహనలో మాత్రం చాలావరకితడు మార్క్సుమార్గమే అవలంబిస్తాడు.

కాని ఈ సమస్యానివారణంకోసం ఇతడు సూచించే నివారణోపాయాలు చాలావరకు సోషలిస్టు పంథాలో నడుస్తాయి. ఇలాంటి ఆర్థిక సమస్య ఉదయించినప్పుడు ప్రభుత్వమే బాగా కలగజేసుకుని, ఉత్పత్తి, పంపకము మొదలైన విషయాలలో సమాజంలో సర్వులకు న్యాయం జరిగేటట్టు చూడాలని సూచిస్తాడు. ప్రజాస్వామ్యాది సౌమ్యపద్ధతులద్వారానే ఇది జరగాలని ఇతడీ గ్రంథంలో ప్రతిపాదిస్తాడు.

మనదేశంలో అప్పుడే కొంచెం కొంచెం ఆర్థికమాంద్యసూచనలు కనిపిస్తున్నాయి. ఈ గ్రంథం ఈ ఆర్థికమాంద్యానికి సంబంధించిన సమస్యలన్నీ అర్థం చేసుకోదలిచినవారి కిది అవశ్యపఠనీయమైన గ్రంథము.

శ్రీ విద్వాన్ విశ్వంగారి అనువాదం సులభమైన జాతీయ వ్యావహారికంలో నడిచిపోతూ పుస్తకం అంతా హాయిగా చదివించివేస్తుంది. జటిలమైన ఆర్థికాదిసాంకేతికపదాలకు కొత్తగా కొన్నో నూతన పదాలు సమకూర్చారు. చివర చేర్చిన ఈపదాల వివరణ, అనుబంధము పాఠకులకు బాగా సహాయకారిగా ఉన్నాయి.

పుస్తకముద్రణము, ముఖపత్రము మొదలైనవి ప్రసిద్ధాంగ్ల గ్రంథాలతో తులతూగుతున్నాయి.

ఇలాంటి ఉత్తమగ్రంథం ప్రచురించిన ఇంటింటి విజ్ఞానమాలవారు ప్రత్యేకంగా అభినందనీయులు. విజ్ఞానప్రదములైన ఇలాంటి ఉత్తమ గ్రంథాలింకా ఈ గ్రంథమాలవారు ప్రకటించగలరని ఆశిస్తున్నాము.

---

## తెలంగాణా తిరుతెన్నులు

'భవదీయుడు'

జనపద ప్రచురణలు, ఏ. 9 349. నారాయణగూడ. హైదరాబాద్ దక్కన్. వెల: రూపాయి.

రచయిత ఇటీవల తెలంగాణాలో ఏర్పడిన పరిస్థితులన్నీ నిష్పాక్షిక దృష్టితో విచారించారు. ఇంతేకాక లేఖా రూపంలో ఈ గ్రంథం రచించి, ఈవిధమైన రచనలో తెలుగుభాష కొక కొత్తతెన్ను చూపించారు.

ఈ రచయిత ప్రజాస్వామ్యాభిమానులైనా ప్రతిపక్షుల అభిప్రాయాలు కూడా విశాలదృష్టితో పరిశీలించినట్లు కనిపిస్తుంది. ఇది తెలంగాణా సమస్య బోధపరుచుకోడానికి చాలావరకు సహాకరిస్తుంది.

---

## శ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవ సన్మానసంపుటము.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు.

దీనిలో, శ్రీ కోరాడ రామకృష్ణయ్య, మానేపల్లి రామచంద్రశాస్త్రికవి, నిడుదవోలు వెంకటరావు, స్వామి శివశంకరశాస్త్రి మొదలైన ప్రముఖులు వ్రాసిన శాస్త్రీయ సారస్వతవ్యాసాలు, శ్రీ వెంక

శేశ్వరశాస్త్రిగారి షష్టిపూర్తిసందర్భంలో ఆయా ప్రముఖులు చేసిన ప్రసంగాలు ఉన్నాయి. ఇది సారస్వత పరిశోధకులందరు పరిశీలించవలసిన సంచిక. ముద్రణాదికం చక్కగా ఉన్నది.

---

## గ్రంథ స్వీకృతి:

### ఆంధ్రలక్షణ సారము

చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు. పండితులు, పి. ఆర్. కాలేజీ, కాకినాడ. వెల: రూపాయిన్నర.

ఇది ఇంటర్మీడియెట్‌లో ప్రత్యేకంగా తెలుగు తీసుకున్న విద్యార్థుల కుపయోగించే తెలుగు వ్యాకరణ పుస్తకము. తెలుగువ్యాకరణం ప్రత్యేకంగా అభ్యసించే విద్యార్థులకిది బాగా ఉపయోగిస్తుంది.

### కోరాడ వంశప్రశస్తి

కోరాడవంశీయులు. ఇది కోరాడవంశోత్పత్తి, అభివృద్ధి వివరించే పుస్తకము. తెలుగునాటకశాఖల చరిత్ర కిది కొంత సహాయకారి కాగలదు. వెలలేదు.

### సాన్నిధ్యము

జక్కారి శ్రీనివాసమూర్తి. బోర్డు ఉన్నతపాఠశాల. కదిరి, అనంతపురము.

దీనిలో ఈకవి వ్రాసిన కొన్ని ప్రథమరచనలు, ప్రాస్తావికపద్యాలు, ఖండకృతులు ఉన్నాయి.

### అవధాన రత్నావళి

శ్రీ సోమపల్లి సంపత్ కృష్ణమూర్తి. కదిరి, అనంతపురంజిల్లా.

ఇది ఈకవి ఆయా అవధానసందర్భాలలో రచించిన పద్యసంపుటము. అవధాన కవితాసంప్రదాయాలు తెలిసికోగోరేవారికిది ఉపయోగిస్తుంది.

### తొలి మొగ్గ

ముదునూరి రామభద్రరాజు, ఆత్రేయపురము. తూర్పు గోదావరిజిల్లా. వెల: నాలుగు అణాలు.

ఇది సాంప్రదాయికమైన వృత్తాలలో రచించిన ఖండకావ్య సంపుటి. రచయిత స్కూలు ఫైనలు విద్యార్థి అని ప్రకాశికలో సూచించారు. ఈ దృష్టితో పరిశీలించినపుడీ ఖండకావ్యరచన ప్రశంసనీయంగా ఉన్నదని చెప్పవచ్చును.

### రూపాంతర కౌముది, 1 వ భాగము

కె. సాంబశివరావు, ప్రతులకు: కో గంటి అన్నపూర్ణమ్మ, పామర్రు, కృష్ణాజిల్లా. వెల: 0-4-0

ఇది అచ్చతెలుగుపదాలకు, కొన్ని సంస్కృతపదాలకుగల వేరు వేరురూపాలు ఏర్పికూర్చిన పుస్తకము. విద్యార్థుల కుపయుక్తమైనది.

### శ్రీ నరసింహశతకము

దండా నృసింహకవి, చిన్నబజారు. బరంపురం, గంజాంజిల్లా. వెల: నాలుగు అణాలు.

దీనిలో నృసింహస్వామిని గూర్చి సాంప్రదాయికధోరణిలో వ్రాసిన నూరుకందపద్యాలున్నాయి.

### లింగసన్నాల

కర్రా త్రిమూర్తి కవి, నరసన్నపేట, విశాఖపటణంజిల్లా, ఇది ఈశ్వరునిపై భక్తిభావంతో రచించిన నూరు సీసమాలికలశతకము.



Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.